# అన్నమాచార్య శృంగార కీర్తనలు

**(సంపుటి - 19)**

**సంచాలకులు**

**శ్రీమాన్ ఆకెళ్ళ విభీషణ శర్మ**

**వ్యాఖ్యానం:**

**డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య**




తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# అన్నమయ్య వాగ్గేయకారత్వం

అనన్య ప్రతిభామూర్తిగా వాసికెక్కిన వాగ్గేయకారుడు అన్నమాచార్యుడు. రాగనిర్దేశ సహితమై, అనుపల్లవి రహితమై, పల్లవి చరణాలతో విలసిల్లే వీరి అనుపమ సంకీర్తనా సారస్వతం స్వయం సంపూర్ణతనొంది, సంగీత సాహిత్య నృత్య పంథాలలో పయనించే పాంథులకు పాంథేయమై పరిఢవిల్లింది. లోక ధర్మం, నీతి న్యాయం, భగవత్తత్త్వం, మాహాత్మ్యం ప్రధానాంశాలుగా తీసుకొని దీర్ఘ శరణాగతి గాఢ ప్రపత్తి జీవనాడిగా సంకీర్తనలు రచించాడు. వీరి శృంగార సంకీర్తనలు మధుర భక్తి పూరితాలై జీవ నాయికల అపూర్వానుభావాలను, ప్రగాఢ భక్తిని చాటుతాయి.

"భజసేవాయాం" అన్న ధాత్వర్థాన్ని ద్వారా "భక్తి" అన్నది "భజ్" అనే ధాతువునుండి నిష్పన్నమైనది. పరమేశ్వర తత్త్వాన్ని శరణాగత బుద్ధితో సర్వస్వార్పణంచేసి మనో వాక్కాయ కర్మలా సేవించడం భక్తి. నారద భక్తి సూత్రాలు "త్రి సత్యస్య భక్తిరేవ గరీయసి" అంటే కాయిక, వాచిక, మానసిక సత్యాలలో భక్తి బలీయమని చెప్తున్నాయి. "మోక్ష సాధన సామాగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అని ఆదిశంకరుడంటే, "సా పరానురక్తిరీశ్వరే" – ఈశ్వరుని పట్ల పరాంకోటికెక్కిన అనురక్తి భక్తి అని శాండిల్య మహర్షి నిర్ణయం. ఈ భక్తి వ్యక్తీకరణకే గేయం ఆధారమయింది. గానం చేయబడేది గేయం. అదే సామాన్య పరిభాషలో "పాట" అన్నమాట. వైదిక భాషలో గాథ అంటే పాట అని అర్థం. ఇది వేదాలలో ఛందోభేదంగానూ, ఇతిహాసాలలో పద్యభేదంగానూ, ఇటీవలి కాలంలో పల్లవి చరణాలు కలిగి సంగీత ప్రక్రియగా మారింది. "గాథిక" అంటే ఐతిహాసిక గీతమని అర్థం. ఇవన్నీ గానం చేయు అన్న అర్థం కల ధాతునిష్పన్నాలు.

అత్యంత భక్తి భావంతో గానం చేసిన సంకీర్తనాచార్యుడు అన్నమయ్య. ఈయన సారస్వతమంతా పదాల మయం. తమిళుల సారస్వతంలో శాస్త్రీయత, సంగీత గుణాలతో పాటు వైరాగ్య భక్తి విశిష్టంగా కనిపిస్తుంది. కన్నడిగుల గాన కాలక్షేపాలలో ఆధ్యాత్మిక పరమైన నీతిబోధ ముఖ్య గుణం. మరాఠీ గానంలో పరాంకోటికెక్కిన భక్తి ప్రధానం. తెలుగు వాళ్ళ భావన భాష కూడా సంగీతానికి, సాహిత్యానికి, శాస్త్ర సంప్రదాయానికి, దేశీయ రీతులకు, చతుర్విధాభినయాలకీ సామరస్యం గల సమన్వయ సమాహార రూపం. దీనిని సాహిత్యం ద్వారా సహస్రధా నిరూపణ చేసినవాడు తాళ్ళపాక అన్నమయ్య. అన్నమాచార్యుని సారస్వత సంపదా స్వరూపం పరిశీలించడమంటే పద సాహిత్య స్వరూపాన్ని, సంకీర్తనా లక్షణాలని విశ్లేషించడమే. వారి సంకీర్తనలు వ్యాఖ్యానించడమంటే నవవిధ భక్తి మార్గాలను, మధుర భక్తి స్వరూపాన్ని, సంపూర్ణంగా సాక్షాత్కారం గావించడమే!

అన్నమయ్య రచనాకాలం 1424–1509 ప్రాంతం కావడం వల్ల సంకీర్తన లక్షణంలో తనకు పూర్వ గ్రంథాలైన భరతుని నాట్యశాస్త్రం, శారంగదేవుని సంగీత రత్నాకరం, మాధవభట్టు సంగీత చంద్రిక, చిన ప్రతాపుని సంగీత చూడామణి, హరిపాలదేవుని సంగీత సుధారకరాలను పేర్కొన్నాడు. ఆ నాటికి వెంకటగిరి, కాళహస్తి, కార్వేటి నగరం, నూజివీడు, చల్లపల్లి, ముక్త్యాల, పిఠాపురం, పెద్దాపురం, విజయనగరం, గద్వాల, వనపర్తి, ఆత్మకూరు మొదలైన రాజాస్థానాలలో సంగీత సభలు విరివిగా జరిగేవని తెలుస్తున్నది.

తాళ్ళపాక కవులు గొప్ప సంగీతజ్ఞులు. వీరి విలక్షణ సాహిత్య రచనతో వైష్ణవమతానికే గాక సంగీత సాహిత్యాలకి, నాట్యకళకి ఎంతో ఉత్తేజాన్ని కలిగించారు. భరతముని కాలం నుండి సోమనాథాదులవంటి శివ కవుల వరకూ వచ్చిన లక్షణ గ్రంథాలలోని లక్షణాది లక్ష్యాలను మనోజ్ఞంగా చూపించారు. వీరి ఒరవడితో తరువాతి తరాలు నడిచాయి. దానికి నిదర్శనం క్షేత్రయ్య, సారంగపాణి, రామదాసాది వాగ్గేయకారులు. అన్నమాచార్యుని పదరచనా సాంప్రదాయము భజన, నాట్య, సంగీత పద్ధతులకు దారితీసి నేడు సాహిత్య లోకంలో మూడు ప్రత్యేక శాఖలుగా విలసిల్లి అభివృద్ధిని పొందుతున్నాయి.

అన్నమయ్య సంకీర్తనలు ఇంతవరకు మనకు లభ్యమైనవి 14 వేలు. వానిలో దాదాపు 12 వేల సంకీర్తనలు 29 సంపుటాలుగా ప్రచురణ పొందాయి. అన్నమయ్య రచించిన సంకీర్తనల ధాతురూపం సమగ్రంగా సంపూర్ణ స్థితిలో లభ్యం కాలేదు. తెలుగు సంకీర్తులున్న రాగిరేకులమీద రేకు సంఖ్య, సంకీర్తన సంఖ్య, రాగం పేరు మాత్రమే ఉన్నాయి. కీర్తనలకు రాగ నిర్దేశమైతే ఉంది కానీ తాళ నిర్దేశం లేదు. రాగం తాళాలలో తాళం అత్యంత ప్రాధాన్యమైనది, అనివార్యమైనది. సాహిత్య నిర్మాణానికి, పదగుంభనకు, భావసిద్ధికి, దండలోని దారం వంటిది తాళం. తాళగతి ఛందస్సులే పదరచనకైనా ఆధారం. తాళం లయ అన్నవి గేయఫణితులలో అనివార్య అంశాలు. గాయకుడు తనకున్న సంగీత పరిజ్ఞ సిద్ధిని బట్టి రాగం వరుస మార్చి పాడవచ్చు. రాగం విషయంలో స్వాతంత్ర్యం ఉంటుంది. తాళం అన్న అంశం అటువంటిది కాదు. భాషా నిర్మాణంలో ప్రధానాంశం ఇది. రాగం మార్చినంత సులభంగా తాళం మార్చడం సాధ్యం కాదు. స్వరూపం మార్చి, భావం విరిచి, కవి నిర్దేశించిన ఉద్దేశ్యం ఛిన్నం చేసే అధికారం గాయకునికి లేదు. ఇటువంటి పరిస్థితులలో అన్నమయ్య రాగం మాత్రమే పేర్కొని తాళం పేర్కొనకపోవడానికి కారణం శోధించవలసి ఉన్నది.

అన్నమాచార్యుని కీర్తనలలో పెక్కు సంస్కృత సంకీర్తనలకు మాత్రం రాగ నిర్దేశంతో బాటూ తాళ నిర్దేశం కూడా ఉండడం విశేషం. స్వర సహితంగా ధాతువుల కూర్పుతో నున్న ప్రబంధ ధాతు స్వరూపాలను కొన్నింటిని వేరుచేసి శిలాశాశనాలలో చెక్కించిన వైనం కానవస్తుందని వేటూరి ఆనందమూర్తిగారు అన్నారు. ఆనాటికి ప్రచారంలో ఉన్న కొండ మలహరి, పళపంజరము, భల్లాటి, సామవరాళి, బౌళిరామక్రియ, హెజ్జిజి వంటి రాగాలు 16 వ శతాబ్దికి అంటే త్యాగరాజు వంటివారికి తెలిసినా వారు ఆరాగాల్లో కీర్తనలు వ్రాసినట్లు ఆధారాలు లేవు. అంటే ఆ రాగాలు నశించి ఉండాలి. లేదా రంజకత్వం, సంగీత రసం లేని రాగాలన్నా అయి ఉండవచ్చు. లేదా అవే కొద్ది పాటి భేదంతో క్రొత్త రాగాల పేర్లను సంతరించుకొని యుండవచ్చు. ఇలా ఎన్నో సంశయాలైనా చివరకు మిగిలేది సందిగ్ధతే! దేశాక్షి, సామంతం వంటి రాగాలు ప్రజల్లో బ్రతికి ఉన్నా వాగ్గేయకారులు వాటికి ద్వితీయ స్థానమే ఇవ్వడం గమనించదగ్గది. అన్నమయ్య దాదాపు 11వేల పాటలకు వాడిన రాగాలు 32 కాగా, 750 సంకీర్తనలకు 63 రాగాలను వాడాడు అంటే దాదాపు 13 వేల కీర్తనలకు వాడిన రాగాలు 95 మాత్రమే అని తేలుతున్నది. 13 రాగాల్లో వ్రాసిన 6,116 కీర్తనలలో 3 రూపు మాసిన రాగాలు, 3 అప్రసిద్ధ రాగాలు కాగా 7 మాత్రమే ఈనాటికి ప్రసిద్ధ రాగాలుగా నిలిచి ఉన్నాయి.

సంగీతంలో మేళకర్తల విషయం కాస్తా పరిశీలనగా చూస్తే, 1320-1380 ప్రాంతం వాడయిన విద్యారణ్యుని నాటి సంగీతంలో 15 మేళకర్తలుగాను, 1550-1600 ప్రాంతం వాడయిన రామాదిత్యుని కాలంలో 20 మేళకర్తలుగాను, 1577-1614 ప్రాంతం వాడయిన గోవింద దీక్షితులు, 1620 ప్రాంతంలో వేంకటమఖి ఏర్పరిచిన 72 మేళ కర్తల విధానం ఈనాటి శాస్త్రీయ సంగీత విలసనానికి ఆధారం. ఈ దృష్టితో చూస్తే అన్నమయ్య కాలం నాటికి కేవలం 20 మేళకర్తలే ఉండి ఉండాలనిపిస్తున్నది. అందులో అన్నమయ్య మాళవగౌళ, తోడి, శంకరాభరణం, తోడి అనే మూడు మేళకర్తలే వాడడం వల్ల ఆనాటికి అవే జనరంజక మేళకర్తలుగా భావించాల్సి ఉంది. అందులోనూ శంకరాభరణ జన్యరాగాలైన వర్జ్య, వక్ర, ఉపాంగ, భాషాంగ రాగాలు. వర్జ్యరాగాలనుండి ఔడవ, షాడవ, సంపూర్ణ రాగాలను ఉపయోగించాడని మనకు తెలుస్తున్నది.

ఇంచుమించు సమకాలికుడు, వయసులో చిన్నవాడైన పురందరదాసు 4.75 లక్షల దేవరనామాలు రచించడమే కాకుండా కర్ణాటక సంగీత అభ్యాసానికి, శిక్షణకు వీలుగా స్వరావళి జంట, అలంకార, పిళ్ళారిగీత, ఘనరాగ, ఉపరాగ సాధారణ గీతాలని శాస్త్రీయ పద్ధతిలో స్వరం పాడి సాహిత్యం పాడే విధానాన్ని ఏర్పరచినట్లు తెలుస్తున్నది. దీనిని బట్టి చూస్తే, అన్నమయ్య కాలానికి ఉన్న సంగీత స్వరూపం, తర్వాతి కాలంలో అనేక మార్పులకు చేర్పులకు గురైనట్లు తోస్తున్నది. రామామత్యుడు 1550 ప్రాంతంలో "స్వరమేళ కళానిధి" 19 మేళాలుగా పెంచి మాయా మాళవ రాగ ప్రాచుర్యాన్ని, ప్రశస్తిని పెంచగా, 1577 నాటి గోవింద దీక్షితులు ప్రవేశపెట్టిన 72 మేళ కర్తల విభజనని 1620 నాటికి వేంకటమఖి "రాగలక్షణము" అనే గ్రంథం ద్వారా 72 మేళాల సంపూర్ణ రాగ స్వరూపాలు, జన్య జనక రాగ నిర్దేశం, మూర్ఛనా కారకత్వం, ద్వాదశ చక్ర విధానం తెలియజేశాడు. మనకీనాడు లభిస్తున్న కర్ణాటక సంగీతం 15 వ శతాబ్ది నుండి ఎన్నో మార్పులకులోనై ఒక స్థిర రూపం పొందింది. దీనికి కారణభూతుడైన వారు మాత్రం తాళ్ళపాక కవులే అని చెప్పక తప్పదు.

**అన్నమాచార్య పాదాంఘ్రి రేణువు**

**టేకుమళ్ళ వెంకటప్పయ్య**

ఓమ్

శ్రీవేంకటేశ్వర పరబ్రహ్మణే నమః

తాళ్ళపాక పదసాహిత్యం సంపుటము -19

# 1

**అవతారిక:** శృంగార నాయకుడైన శ్రీనివాసుని సోయగాలను వీక్షించాలన్న కోరికతో ఉన్న అలమేలుమంగమ్మ, స్వామిని దగ్గరగా రమ్మని, దాపరికాలు లేకుండా త్వరితగతిన దర్శనమిమ్మని శ్రీవేంకటేశ్వరుని బహుధా ఉల్లేఖిస్తున్నది.

## దేసాళం

ప. అందకు రావయ్యా అన్నియుఁ దెలిసెను
నిండి నొసలి లత్తుక నీరువలె నున్నది ||పల్లవి||

1. ముసుఁగు వెట్టుకొని మూల నేమి సేసేవు
సుసరానఁ బెదవులు చూపవయ్యా
యెసఁగి రెప్పలమీఁది కేలవచ్చెఁ దమ్ములము
కొసరితేను చెక్కిట గోరువలె నున్నది ||అంద||

2. కాయమెల్లా గప్పుకొని కదులోన నున్నాఁడవు
సోయగపు నీవురము చూపవయ్యా
చాయలకెంపు లెడవిసరీ బాహుమూలముల
నీయందుఁ గళలు నేఁడు నెలకొన్నట్లున్నవి ||అంద||

3. తెరవేసు కేలితి వొద్దిక నలమేల్మంగను
సొరిది నీనెమ్మొగము చూపవయ్యా
ఇరవై నన్ను శ్రీవేంకటేశుఁడ యేలితివి
వెరవుతో నీపుక్కిట విడె మున్నట్లున్నది ||అంద||

**అర్థములు:** ప. అండకు = దగ్గరగా, లత్తుక = లాక్షారసము, అలక్తకము, లక్క.

1. సుసరాన = వెంటనే, సులభంగా,సరళంగా తమ్ములము = తాంబూలము, కొసరు = కోరిక, విజృంభించు.
2. కదులోన = మిక్కిలి లోపలగా, సోయగము = అందము, చక్కదనము, ఉరము = రొమ్ముభాగము, కెంపు = పద్మరాగమణి, నెలకొన్నవి = కూడి ఉన్నవి.
3. తెరవేసు = తెర నడ్డుగాపెట్టుకొను, ఒద్దిక = అనుకూల్యము, సొరిది = వరుస, క్రమము, నెమ్మొగము (నెరంమొగము) =నిండైన, అందమైన మొహము, ఇరవు = స్థానము, వెరవు = యుక్తము, విధము, పుక్కిట విడెము = నోటిలో ఉన్న తాంబూలము.

**భావము:** శృంగార నాయిక నాయకుడైన శ్రీనివాసునితో అమ్మ అలమేల్మంగ ఏమంటున్నదో వినండి. ఇలా దగ్గరగా రావయ్యా స్వామీ! నీ విషయాలన్నీ తెలిసిపోయాయి. నీ నుదురు ఎఱ్ఱనైన లాక్షారసపు కాంతులతో నిండినట్లున్నది. ముసుగుతెర వేసుకుని మూలగా యేమి చేస్తున్నావు స్వామీ! బయటకు వచ్చి నీ పెదవులు ఒకమారు చూపించరాదా! నీ రెప్పలమీద తాంబూలరసపు కాంతి ఎలా వచ్చింది స్వామీ? నీ చెక్కిలిపై నఖక్షతాలు ఎవరో కోరి కోరి వేసినట్లున్నది.



డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య

శరీరమంతా దివ్యాంబరాలు కప్పుకొని లోపల కూర్చున్నావు. ఒక్కసారి నీ దివ్యసుందరమైన వక్షభాగం చూపించరాదా! నీ కక్ష్యలు చూసినట్లైతే ఎర్రటి పద్మరాగవర్ణంతో కూడుకొని ఉన్నాయి. నీలో ఎన్ని కళలు దాగి ఉన్నవి స్వామీ! అమ్మ అలమేలుమంగను తెరవేసుకుని అనుకూల్యముగా పరిగ్రహించినట్లున్నావు. నీ నిండు చందమామ వంటి మోమును ఒక్కసారి చూపరాదా స్వామీ! ఈ తిరుమల క్షేత్రంలో శ్రీవేంకటేశ్వరునివై నన్నేలుతున్నావు. దానికి యుక్తంగానే నీ నోటిలోని తాంబూలముతో దర్శనమిస్తున్నావు.

**విశేషాంశములు:** స్వామివారి యందు నెలకొని యున్న కళలను శృంగార నాయిక ప్రస్తుతిస్తున్నది. చంద్రునిలో పదహారు కళలు ఉన్నట్లుగానే స్త్రీ, పురుషులలో కూడా పదహారు శృంగార కళా స్థానములు ఉంటాయి . "అమృతా మానదా పూషా తుష్టిః పుష్టీ రతిర్ధృతిః, శశినీ చంద్రికా జ్యోతిర్జ్యోత్స్నా శ్రీః ప్రీతిరేవ చ, అంగదా చ తథా పూర్ణామృతా షోడశ వై కళాః" అనే శ్లోకంలో చెప్పిన విధంగా ఆదిపురుషుడైన ఆ శ్రీనివాసునిలోగల షోడశ కళలైన అమృత, మానద, పూష, తుష్టి, పుష్టి, రతి, ధృతి, శశిని, చంద్రిక, కాంతి, జ్యోత్స్న, శ్రీ, ప్రీతి, అంగద, పూర్ణ, అమృత అనే కళలన్నిటితో నిండిన పూర్ణపురుషునిగా అభివర్ణించబడినది. అలాగే పురుషునికి షోడశ కళాస్థానాలుగా తల, ఎదురురొమ్ము, చేతులు, కుచములు, తొడలు, నాభి, నుదురు, కడుపు, పిఱుదులు, వీపు, చంకలు, మర్మస్థానము, మోకాళ్ళు, పిక్కలు, పాదములు, బొటన వ్రేళ్ళు ఉన్నాయి. అన్నమయ్య ఈ కళా స్థానాలలో కొన్నింటిని అన్నమయ్య మనకు ఈ కీర్తనలో ఉల్లేఖనం చేశాడు.

## 2

**అవతారిక:** అమ్మ శ్రీదేవి శృంగార నాయికగా శ్రీనివాసునితో సరస సంభాషణం చేస్తున్నది. స్వామిని బుజ్జగిస్తున్నది.

## మాళవి

ప. ఇయ్యకొంటి నిఁక నీ యిచ్చాయను
కొయ్యతనాలదాననా కొసరితిఁ గాక ॥పల్లవి॥

1. యొనయక నీతోను యెదురాడేదాననా
అనవల శొకమాట అడితిఁ గాక
పెనఁగుచు నీతోను బిగిసేటిదాననా
చనవు మెఱసి కొంతజంకించితిఁ గాక ॥ఇయ్యకొంటి॥

2. యెడచొచ్చి నీపట్టుకు నెగసక్కెపుదాననా
నడుమ నూరకే నీతో నవ్వితిఁ గాక
జడిగొని నిన్ను మీరి సాదించేదాననా
వుడివోని చన్నుల నొత్తితిఁ గాక ॥ఇయ్యకొంటి॥

3. సొరిది గబ్బితనము చూపేటిదాననా
కెరలి కాఁగిటను బిగించితిఁ గాక
యిరవై శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
జరగేదాననా మోవి చవిగొంటిఁ గాక ॥ఇయ్యకొంటి॥

**అర్థములు:** ప. ఇయ్యకొను = సమ్మతించు (ఈయకొనుయొక్క రూపాంతరము); ఇచ్చాయను= కోరికాయెను, అపేక్షాయెను; కొయ్యతనము = మూర్ఖత్వము, దుష్టత్వము; కొసరితి = ప్రార్థించితిని.

1. యెనయక = విషయము తెలుసుకోకుండా ఉండుట; ఎదురాడు = పోట్లాడు, జగడములాడు; ఆనవల = బహు, ఆనవాయితీ,

గుర్తు, మేలుగా; శోకమాట= వగపుక్రీడ; పెనగు = చుట్టుకొను, కలయు; బిగిసేటి = గర్వపడు, కఠినముగానుండు; జంకించు = వెఱపించు, బెదిరించు.

2. ఎడ = నడుమన, మధ్యలో; చొచ్చు = చొరబడు, ప్రవేశించు; పట్టు =పక్షము, వైపు; ఎకసెక్కెము= పరిహాసము, ఎగతాళి; జడి = నిరంతరము; ఉడి = నాశనము, వ్యర్థము; చన్నులు = ఎదపుట్టువులు, ఱొమ్ము.

3. సొరిది = వరుస, క్రమము; గబ్బితనము = కొంటెతనము, చిలిపిచేష్ట; కెరలు= ఉప్పొంగు, త్రుళ్ళిపడు; జరిగేదాననా = దూరంగా జరిగివెళ్ళే దానినా; మోవిచవి= అధరామృతము, రుచి.

**భావము:** స్వామీ! ప్రాణనాథా! మీమీద కోరికాయెను. ప్రాణప్రదంగా మిమ్మల్ని ఇష్టపడుతున్నాను. మిమ్మలను ప్రార్థిస్తున్నానే గానీ, మూర్ఖురాలనా చెప్పండి?

విషయమేమీ తెలుసుకోకుండా మీతో జగడాలాడేదాననా? సరదాగా బాగుంటుందని మీతో వగపు క్రీడగా శోకం నటించానుగానీ, గర్వపడి మీతో కఠినంగా ప్రవర్తిస్తూ కలిసే దాననా? ఏదో చనువు కొద్దీ, కొంత అదిరిస్తూ, బెదిరిస్తూ వెరపించాను తప్ప అంటున్నది.

మీ పట్టువిడుపులకు నడుమన చొరబడి ఏమైనా పరిహాసాలాడితినా? మధ్యమధ్యలో కొంచెం హాస్యమాడాను కానీ, ఎల్లవేళలా మిమ్ములను సతాయించేదాననా? ఏదో సరదాగా మీ ఉన్నత వక్షస్థలమొత్తితిని అంతే.

స్వామీ! మీతో ఎల్లవేళలా వరుసగా కొంటెచేష్టలు చేశానా చెప్పండి? ఉప్పొంగిన ప్రేమాభిమానంతో మిమ్మల్ని బిగికౌగిట బంధించాను అంతే! ఓ శ్రీవేంకటేశ్వరా! నన్నేలుకునే నాథా! నా అధరపానం చేస్తుంటే నేనేమైనా ప్రక్కకు జరిగానా చెప్పండి? అని ప్రశ్నిస్తున్నది శృంగార నాయికయైన శ్రీదేవి.

**విశేషాంశములు:** అష్టవిధనాయికలలో పరస్త్రీలను గాంక్షింపక తనయందే అనురక్తుడైన పతిగల నాయికను స్వాధీనపతిక అంటారు. అలాంటి శ్రీదేవి స్థానం ఎప్పుడూ స్వామి వక్షస్థలం మీదనే! ప్రతి శుక్రవారం పసుపు తదితర సుగంధ ద్రవ్యాలతో అభిషేకం జరిగేది శ్రీవారి వక్షస్థలం మీది శ్రీ మహాలక్ష్మికే! "తద్వక్షః స్థల నిత్యావాసరసికాం" అని ఆరాధించగలిగేది ఒక్క లక్ష్మీదేవినే! ఆ స్థానంలో శ్రీదేవి కొలువుదీరేది ఒక్క శ్రీవేంకటేశ్వరునికి మాత్రమే! అలాంటి వక్షస్థలాన్ని శ్రీదేవి శృంగార చేష్టలతో వర్ణించడం విశేషమే!

## 3

**అవతారిక:** ఒక శృంగార నాయిక స్వామిని నిందిస్తూ ఇలా చేయ దగునా? అమ్మతో ఇలాంటి ప్రణయకలహాలు ఎందుకు కొనితెచ్చుకుంటారు స్వామీ! అని ప్రశ్నిస్తున్నది.

### సాళంగనాట

ప. తొలుత నెఱఁగవా తొయ్యలి లాగు
బలిమి చూపఁగనేల పంతమియ్యనేల ॥పల్లవి॥

1. వొడివట్టి తీసి నీవువొడఁబరచఁగ నిటె
కొడిమెలు నిన్ను నెంచి కొసరీనాపె
అదరి యప్పటి నీవు అవుఁగాము లాడుకోఁగా
బెడిదపుబెదవులు పిప్పి గట్టీ నిదివో ॥తొలుత॥

2. కక్కసించి పెనఁగుచు కాఁగిలించి వేఁడుకోఁగా
చక్కఁ గిందవేసుకొని జరసీ నాపె
వెక్కసమై నీవందుకు వినయాలు నేయఁగాను
పక్కన నీసేఁతలెల్లాఁ బచ్చిదేరీ నిదివో ॥తొలుత॥



డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య

3. శ్రీ వేంకటేశుఁడ యిట్టె చేరి నీవు గూడఁగాను
భావించి నీవురముపై నెక్కీ నాపె
వేవేగ నిప్పుడే నీవు విడెము చేతి కియ్యగా
చేవదేరి నీవలపు చిమ్మిరేగె నిదివో ॥తొలుత॥

**అర్థములు:** ప. తొలుత= మొట్టమొదట; తొయ్యలి= స్త్రీ, ఇంతి; ఇలాగు= ఈ విధముగ; బలిమి= గొప్పదనము; పంతము= పౌరుషము, పోటీ.

1. వొడివట్టి= యత్నించి, పాల్పడి, ప్రయత్నించి; ఒడగబరచు= ఒప్పించు, ఆమోదింపజేయు; కొడిమెలు= నిందలు; కొసరి= కోరికను తెలియజేయు; అదరి= విజృంభించు, ఉప్పొంగు; అవుగాములు= అగుటయు కాక పోవుటయు, ఉచితానుచితాలు, సత్యాసత్యములు; బెడిదము= కఠినము, అధికము; పిప్పి= కందిపోవు.
2. కక్కసించు= బాధించు, సంకటపెట్టు; గింది= ఆటలలో చేసే తొండి; జరసి= నిందించు; వెక్కసము= అధికము; పచ్చిదేరు= పచ్చిగా; తడియగు.
3. వేవేగ= చాలా వేగముగా; చేవదీరె= ధైర్యము, సారము; చిమ్మి= వ్యాపించు; రేగు= ఎగసిపడు, విజృంభించు.

**భావము:** స్వామీ! మొదట నీకు ఇంతుల సంగతులు ఎలా ఉంటాయో తెలియదా? మీ పంతాలు పట్టింపులు చూపించి వారితో పోటీలు పడడమెందుకు?

ఎంతో ప్రయత్నపూర్వకంగా నీవు నిందలు మోపి ఆపైన ఆమె కోరికలను బయటబెట్టడమెందుకు? మీరు ఉప్పొంగి ఉచితానుచితాలు గ్రహించకుండా ఆటలాడుకోవడంవల్ల పెదవులు చూశారా ఎంత కందిపోయాయో!

ఎంతో సంకటపెట్టి కౌగలించి వేడుకోగా, చక్కగా ఆటలలో తొండి చేసే విధంగా నీమీద నిందలు మోపుతున్నది. నీవందుకు ఉప్పొంగిన అతిశయంతో వినయము నటించడము, నీ చేతలన్నీ పచ్చి పచ్చిగా ఉన్నాయి స్వామీ!

ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు ఈ విధంగా కూడగా, శ్రీదేవి నీ వక్షస్థలంపై యెక్కి కూర్చున్నది. వెంటనే నీవు తాంబూలము ఇవ్వగానే నీ వలపు ఆమెపై ఎగజిమ్మింది.

**విశేషాంశములు:** స్వామి వారి మూల విరాట్ వక్షస్థలంపై స్వర్ణలక్ష్మి విగ్రహాన్ని భగవత్ రామానుజుల వారు ప్రతిష్టించారు. ఈ స్వామి సాక్షాత్తు వెంకటనాథుడు ఈభూమి పై కొలువై ఉన్నారనీ, స్వామివారికి, శంఖ, చక్రాలను పచ్చకర్పూరాన్ని ఏర్పాటు చేయడంతో పాటు స్వామివారి వక్షస్థలంపై స్వర్ణలక్ష్మీనీ ప్రతిష్టించారు. అమ్మవారు స్వామివారి వక్షస్థలంపై ఉండటం వల్ల ప్రతి శుక్రవారం అమ్మవారికి ప్రత్యేక అభిషేకాలు చేసిన అనంతరం స్వామి వారికి కూడా అభిషేకం చేసి అమ్మవారిని మంగళసూత్రంతో అలంకరించి భక్తులకు దర్శనం కల్పిస్తారు. అన్నమయ్య ఈ కీర్తనలో ఆ శ్రీదేవిని "నీ ఉరముపై నెక్కె" అని కీర్తించారు.

## 4

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామివారితో ఛలోక్తులు పలుకుచున్నది. స్వామీ! మీ స్వభావం మాకు గోచరమవడంలేదు. మీతో అధిక చనువు ప్రదర్శిస్తే ఎక్కడ కోపగిస్తావోనని భయంగా ఉన్నది అంటున్నది.

## దేవగాంధారి

ప. దేవర గుణములు దెలియవు
నీవే మాకును నేరుపవయ్యా ॥పల్లవి॥

1. వదలక నీతో వాసికిఁ బెనఁగిన
యెదుటనె నీమనసెట్టుండునో
కదిసి నీరతికిఁ గడుదమకించిన
యిది వేసాలని యెంతువో నీవు ॥దేవర॥

2. చెనకఁగ నీయెడ సిగ్గులు నెరపిన
పనులవి యేమని భావింతువో
ననిచి నీయెదుట నవ్వులు నవ్విన
తనివిలేనిదని తగ నాడుదువో ॥దేవర॥

3. కూడుచు నిన్నిటు గుబ్బల నొత్తిన
వోడ దనుచు గో రూఁదుదువో
యీడనె శ్రీవేంకటేశ యేలితివి
వీడె మిచ్చితే వెరగందుదువో ॥దేవర॥

**అర్థములు:** ప. దేవర= దేవుఁడు, ప్రభువు, స్వామి; గుణము= అలవాట్లు, స్వభావము; నేరుపవయ్యా= నేర్పవయ్యా!.

1. వాసి= ఆధిక్యము, ఎక్కువ, ప్రసిద్ధి; పెనగిన= కలయు, చుట్టుకొను; కదిసి= దగ్గరగా వచ్చుట; కదు= మిక్కిలి, తమకించు= త్వరపడు, మోహపడు; వేసాలు= అనవసరపు పోకడలు పోవు; ఎంతువు= భావించుదువు, తలచుదువు.
2. చెనకు= తాకు; నెరపిన= నెరవేర్చు, చేసిన; అనిచి= పూనుకొని, యత్నించి; తనివి= తృప్తి; ఆడుదువో= మాట్లాడుదువో.
3. కూడుచు= కలియుచు; గుబ్బలు= వక్షములు; వోడ= కోల్పోవు, అపజయముపొందు; గోరూదు= గోరుతోనొక్కు; వీడెము= తాంబూలము; వెరగు= ఆశ్చర్యము, నిశ్చేష్ట.

భావము: ఓ దేవదేవా! నీ స్వభావము మాకెరుగ రాకున్నది. నీవే మాకు నేర్పించరాదా!

నీతో వదలకుండా ఎక్కువగా చనువుతో మెదలినట్లైతే, నీ మనసులో ఏమనుకుంటున్నావో ఎరగము స్వామీ.. అధిక మోహంతో రతి క్రీడకు త్వరపడినట్లైతే, ఏమిటీవిడ వేషాలువేస్తున్నది, అనవసరపోకడలు పోతున్నది అని భావిస్తావేమో!

మిమ్మల్ని స్పృశిస్తూ శృంగార చేష్టలాడుతూ సిగ్గుపడినట్లైతే, ఏమిటా పనులని తలచెదవేమో, పూనుకొని నీ ఎదురుగా హాస్యమాడినట్లైతే, తృప్తిలేని దాననని తగవాడతావేమో!

మిమ్మల్ని కలిసి వక్షోజాన్ని ఒత్తినట్లైతే, ఓటమి పాలయానని గోళ్ళతో నొక్కుతావేమో (నఖక్షతాలు), ఈ వైకుంఠమనే తిరుమల క్షేత్రంలో నన్నేలుకుంటున్న శ్రీవేంకటేశ్వరా! తాంబూలం యిచ్చినట్లైతే ఆశ్చర్యపోయి నిశ్చేష్టుడవవుతావేమో.

## 5

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ శృంగార నాయికయై శ్రీనివాసునితో ఛలోక్తిపూర్వకంగా శృంగార కబుర్లను చెప్తున్నది.

### కన్నడగౌళ

ప. సేసతో బెండ్లాడితివి చెల్లుబడి కాకపోదు
గాసిఁ బెట్ట కిట్టె నన్ను గరుణించరాదా ॥పల్లవి॥

1. చెన్నుమీర చిత్తము రా సేవలు నేయకుండితే
నన్ను నీవప్పుడు మరి నగరాదా
వన్నెల నిన్నిట్టె కైవసము సేసుకుంటే
మిన్నక నీ పంతములు మెరయరాదా ॥సేసతో॥

2. ఆయము లంటుచు నిన్ను నాసకొలుపకుండితే
పాయపుమదాన నన్నే పలుకరాదా
చాయల నే నీమోవి చవులుగొనకుండితే
సోయగపు బి (వి)న్నాణానఁ జూడఁగరాదా ॥సేసతో॥

3. చేవమీరినరతుల సిగ్గులు రేచకుండితే
నీవాసు లిన్నియును నెరపరాదా
శ్రీవేంకటేశ్వర యిట్టె చేకొని కూడితివి
యీ వేడుకులు గలిగె నిఁక మెచ్చరాదా ॥సేసతో॥

**అర్థములు:** ప. సేస= అక్షతలు; గాసి= శ్రమ;

1. చెన్ను= విధము, విలాసం; వన్నె= నైపుణ్యము, అలంకారము; మిన్నక= మాట్లాక. కైవసము= అధీనము, వశము.
2. ఆయము= జీవస్థానము, ప్రాణము; పాయము= వయస్సు; మదము= గర్వము; చాయల= రంగుతోనున్న; మోవిచవులు= అధరామృతము; సోయగము= అందము; బిణ్ణానము= అందము, నేర్పు.
3. చేవమీరు= మితిమీరు, అధికము; రేచ= రేగు, ఎసగొల్పు; వాసులు= ఔన్నత్యములు; నెరపు= నెరవేర్చు.

**భావము:** స్వామీ...దేవతలంతా అక్షింతలు వేయగా నన్ను మీరు చేకొన్న వివాహం అందరూ అంగీకరించినదే కదా! నన్ను ఈవిధంగా శ్రమపెట్టకుండా నాపై ప్రేమ చూపించరాదా!

నీకెన్నో విధముల సేవలు చేయకుండా ఉన్నట్లైతే, నన్ను చూసి నీవప్పుడు పరిహాసము చేయవచ్చుగదా! నైపుణ్యంతో అలంకారంగా మిమ్ములను ఆధీనము చేసుకొన్నట్లైతే, మాట్లాడకుండా నీ పంతం నెగ్గించుకోవచ్చుగదా!

ప్రాణాస్పదమై మీకోరికలు రేకెత్తించకుండా ఉన్నట్లైతే, వయసు గర్వం, బింకముతో నన్ను పలకరించరాదా! దొండపండ్లవంటి నీ అధరామృతము గ్రోలకుండా ఉన్నట్లైతే, నేర్పరియై సౌందర్యంతో నున్న నన్ను ఒక్కసారి చూడరాదా!

మితిమీరిన తాపంతోరతివాంఛకు సిగ్గుపడి నేను శృంగారాన్ని రేకెత్తించకుండాఉన్నట్లైతే, నీ ఔన్నత్యాన్ని ప్రదర్శించరాదా! ఓ శ్రీవేంకటేశ్వరా! యిలా నన్ను కూడితివి. ఎంతో ఇచ్చగలిగి ఉన్నాను. నన్ను మెచ్చి చేపట్టరాదా!

## 6

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామిపై కినుక వహించి తనపై ప్రేమ చూపకుండా ఆటపట్టిస్తున్నాడని కోపాన్ని ప్రదర్శిస్తున్నది.

### మంగళకౌశిక

ప. ఎటువంటివాడవయ్యా యిచ్చకము సేయగాను
సటలంటా బొమ్మలను జంకింతురా ॥పల్లవి॥

1. వూరకే నీపాదములు వొత్తుచుఁ బిసుకఁ గాను
గోరుదాఁకెనంటా యేల కొచ్చి చూచేవు
చేరివూడిగాలు గడుఁ జేసితే మెచ్చుఁ గాక
నేరుపు నేరము లెంచి నిందవేతురా ॥ఎటువంటి॥

2. కన్న గన్న చోటనెల్లా గందము నీకుఁబూయఁగా
చన్నులు నా టెనంటా సాదించేవు
వున్నతి బత్తిసేసితే నొడఁబడుదురుగాక
సన్నలఁ దప్పులు మోపి చండి సేతురా ॥ఎటువంటి॥

3. మొల్లమిరతుల నిన్ను మోవి యాని కూడఁగాను
పల్లు సోఁ కెనంటా నాతోఁ బంతమాడేవు
యిల్లిదె శ్రీ వెంకటేశ ఇందుకె నవ్వుట గాక
కొల్లగా సిగ్గువరచి కొసరుదురా ॥ఎటువంటి॥

**అర్థములు:** ప. ఇచ్చకము= ప్రియవచనాలు, ముఖప్రీతి, ముఖస్తుతి; సటలు= బాధలు; జంకించు= భయపెట్టు.

1. కొచ్చి= గుచ్చి; వూడిగాలు= సేవలు; నింద= అపవాదు
2. కన్న= చూసిన; గన్న= అవసరము; ఉన్నతి= ఎక్కువ, అధికము; బత్తిసేయు= బక్తి చూపు; ఒడబడు= సమ్మతించు; సన్నలు= సైగ, సంజ్ఞ; చండి = కోపము.
3. మొల్లమి= విస్తారము, సాంద్రత; యాని= ఆనించి, సమీపించి; పంతము= పట్టుదల, విధము; ఇల్లిదె= ఇదుగో ఇది; కల్లగా= ఎక్కువగా; కొసరు= చెలరేగి, కోరి

**భావము:** ఓ శ్రీనివాసా! ఎలాంటివాడివి స్వామీ.. ఇష్టముగా ప్రియవచనాలు పలికితే, ఎవరైనా బాధపెట్టానని అంటూ కనుబొమ్మలను అదిరించి బెదిరిస్తారా?

అడుగకుండానే సరదాగా మీ పాదములు పిసుకుతూ ఉంటే, గోరు తగిలిందంటూ ఎందుకు గుచ్చి గుచ్చి నన్ను చూస్తావు? ఇలా మీకు సేవలు చేస్తుంటే మెచ్చుకోవడం గాకుండా, గొప్పగా నామీద నేరం మోపి అపవాదులు వేస్తారా?

నేను మీ దివ్య దేహంపై గంధం పూయడానికి పూనుకుంటే నా వక్షోజాలు తగిలాయంటూ సాధిస్తారా? మీపట్ల ఇంత ఎక్కువగా భక్తిప్రపత్తులు చూపిస్తూ ఉంటే సమ్మతించి ఆనందిస్తారు గాని, ఇలా సైగలు చేస్తూ మాపై తప్పులు మోపి కోపిస్తారా?

మీమీద అపారమైన ప్రేమతో నా మొహాన్ని మీకు ఆనించడానికి ప్రయత్నిస్తూ ఉంటే, నా దంతాలు మీకు తగిలాయంటూ నాతో పట్టుదలలకు పంతాలకు పోతారా? స్వామీ.. శ్రీవేంకటేశ్వరా! ఇలా చూడండి. ఇలా అపహాస్యం చేస్తూ నవ్వడమే కాక, నన్ను ఎక్కువగా సిగ్గుపడేట్టు చేసి మితిమీరిన కోరికలు కోరెదరా?

## 7

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామి కొంటె పనులను గురించి ప్రశ్నిస్తున్నది. ఏవేవో తీయని కబుర్లు చెప్తూ ఉంటావని అంటోంది.

### దేశాక్షి

ప. ఏమనేమయ్య నీవు యేలికవు మాకునెల్లా
ఆమనిగా మోవి చూపి యాస రేఁచేవు ॥పల్లవి॥

1. ఇచ్చకములే సేసి యెలయించి యెలయించి
పచ్చిదేర నింతులను భ్రమయించేవు
ముచ్చటలాడి కడు మోహములు పైఁజల్లి
మెచ్చులుగా వలపించి మేకులు సేసేవు ॥ఏమనే॥

2. సందడిఁ జేతులు చాఁచి జవ్వనము లంటియంటి
మంద పెండ్లి కూఁతులను మరిగించేవు
విందులవీడెము లిచ్చి వేసాలు గడునెరపి
యిందులోనే యేకతాన యెమ్మెల మించేవు ॥ఏమనే॥

3. నమ్మిక లెన్నైనా నిచ్చి నగవులు పచరించి
మమ్ము నిందరినిఁ గూడి మన్నించేవు
నెమ్మది శ్రీవేంకటేశ నేరుపులు పచరించి
నిమ్మపండు చేతికిచ్చి నీటులు చూపేవు ॥ఏమనే॥

**అర్థములు:** ప. ఏలిక= ప్రభువు; మాకునెల్లా= మాకందరికి; ఆమని= బాగా, సమృద్ధి; రేచేవు= కలిగించు.

1. ఇచ్చకము= ప్రియవచనాలు, ముఖప్రీతిమాటలు; ఎలయించి= పురిగొల్పి, ప్రేరేపించి; పచ్చిదేర= తడికలిగించు, పచ్చిపచ్చిగా;

భ్రమయించు= మోహము కలుగజేయు, భ్రాంతికి గురిచేయు; మోహములు= వలపు, ప్రీతి; పైజల్లి= కలిగించి; మెచ్చులు= సంతోషపెట్టే కబుర్లు; మేకులు= పెద్దరికము.

2. సందడి= అతిశయము, మంద= ఎక్కువమంది; పెండ్లికూతులను= పెండ్లి కుమార్తెలను; మరగించు= మోహింపజేయు; వీడెము= తాంబూలము; వేసాలు= అన్వసరమైన చేష్టలు; కడు= చాల; నెరపి= ప్రకటించు, వెలయించు; ఏకతాన= ఒకని మీదనే నమ్మకముంచినవాడు; అనన్యచిత్తుడు; ఎమ్మెల= విలాసము, వన్నె, అందము; మించేవు= అధికముగా చేయు.

3. నమ్మిక= నమ్మకం; నగవులు= నవ్వులు; పచరించి= వ్యాప్తిచేయు; మన్నించేవు= గౌరవించేవు; నేరుపులు= కొంటె ప్రజ్ఞలు; నీటులు= విలాసములు, ఒయ్యారాలు.

**భావము:** ఓ శ్రీనివాసా! మిమ్మల్ని మీ కొంటే చేష్టలను ఏమనగలము? మాకందరికి నీవే ప్రభువై యున్నావు. నీ దివ్యసుందరమైన ముఖ సౌందర్యాన్ని చూపి మాలో ఆశలు కలిగిస్తున్నావు.

మీ ప్రియవచనాలతో మమ్మల్ని ప్రేరేపించి, మాలో ప్రేమబీజాలు మొలకెత్తేట్టు ఆర్ద్రత కలిగించే విధంగా మమ్మలను మోహంలో ముంచెత్తుతావు. ఏవో అందమైన కబుర్లు చెప్పి మాపై లేనిపోని మోహాన్ని వెదజల్లి, కడు సంతసం చెందేవిధంగా మాట్లాడి, ప్రీతి చూపించి నీ పెద్దరికాన్ని నిలబెట్టుకుంటావు.

అతిశయించిన పారవశ్యంతో చేతులు చాచి మా యవ్వన సంపదలను అంటుకొని, ఎంతమంది పెండ్లి కుమార్తెలపై ప్రేమనే మోహాన్ని రుచి చూపించావు. విందులుచేసి తాంబూలము చిలుకలిచ్చి అనవసరమైన కొంటె పనులెన్నో చేసేవు. ఒకరిమీదనే నమ్మకముంచిన అనన్య చిత్తునివలె విలాసముతో మమ్ములను ఎక్కువగా మురిపిస్తావు.

ఎంతో నమ్మకంగా నవ్వులు వ్యాపింపజేసి మమ్మలనందరిని గౌరవిస్తావు. ఓ వేంకటేశ్వరా! నిదానంగా నీ కొంటె ప్రజ్ఞలు ప్రదర్శించి మాకు నిమ్మపండు చేతికిచ్చి నీ విలాసాలను, ఒయ్యారాలను చూపిస్తావు.

**విశేషాంశాలు:** ఏకంతాన = ఏకతాన, ఏకం తానయతి శ్రద్ధదాతి. అమ్మ అలమేలుమంగమ్మ మీదనే నమ్మక ముంచిన వాడు, అనన్యచిత్తుని గా శ్రీనివాసుడు అభివర్ణింబడ్డాడు.

## 8

**అవతారిక:** దక్షిణనాయకుడైన శ్రీవేంకటేశ్వరుని కొంతమంది నాయికలు, తమ్ము దయతో చూడమని విన్నపాలు చెప్పుకుంటున్నారు.

### తెలుఁగు గాంబోది

ప. దయఁ జూడవయా తతిగొని మొక్కేము
ప్రియురాండ్లము నినుఁ బెండ్లాడితిమి ॥పల్లవి॥

1. చలములు నీతో సాదించేమా
వలచినవారము వనితలము
బలములు నీతోఁ బచరించేమా
కొలిచినవారము గోలలము ॥దయ॥

2. పెనఁగుచు నీతో బిగి సేమా నీ-
ననుపులవారము నాతులము
పవివడి నేరమి పై వేసేమా
చనవరివారము సాదులము ॥దయ॥

3. యీ వేళఁ గూడితి మొలయించేమా
దేవుళ్లము నీ తెఱవలము
శ్రీ వేంకటేశ్వర చెలఁగి నగేమా

బూవపువారము భోగులము ॥దయ॥

**అర్థములు:** ప. తతిగొని= సమయం చూసి.

1. చలము= పట్టుదల; బలుములు= ఎక్కువ; పచరించు= కనబరచు; గోలలు= బేలతనం, నిష్కపటం.

2. పెనగు= కలియు; బిగియు= పట్టుదల; అనుపులవారు= ఆజ్ఞకు లోబడినవారు; ఆతులము= తొందరపాటుగల; పవి వడి= పిడుగు, , మెరుపు; వడి= వేగము; నేరమి= అజ్ఞానము; చనవరి= చనువుగలవారు; సాదులు= మంచివారు.

3. మెలయించు= మెలగజేయు; దేవుళ్ళము= వెంపరలాడువారు; తెఱవలు= ఆడువారు; నగుట= పరిహసించు; బూవపువారు= సహపంక్తి భోజనం చేయువారు; భోగులము= సంతోషించే వారు.

**భావము:** ఓ శ్రీనివాసా! నీకివే మా మ్రొక్కులు. సమయము చూసుకొని మమ్మల్ని దయచూడండి. నిన్ను పెండ్లాడి నీకు ప్రియమైన వారము.

పట్టుదలతో మిమ్మల్ని సాధిస్తున్నామా? వలచి వచ్చిన ఆడువారము. ఎక్కువగా నీతో వాదులాటలు కనపరుస్తున్నామా? మిమ్మల్ని కొలువ వచ్చిన బేలతనపు వారము.

మీతో కలిసినప్పుడు పట్టుదలలు చూపేవారమా? నీ ఆజ్ఞకు లోబడినవారము. మెరపులవంటి అజ్ఞానముతో నీపై బడుతున్నామా? చనువుగల, మంచి వారలము.

ఈవేళ మీతో కలిసి మెలసి యున్నాము. నీకోసం వెంపరలాడేవారము మీకు చెందిన స్త్రీలము. ఓ శ్రీవేంకటేశ్వరా మీతో అతిశయించి పరిహాసాలాడుతున్నామా? మీతో సహపంక్తిభోజనాలు చేసి సంతోషించే వారలము గదా!

9

**అవతారిక:** ఇది జానపద బాణీలో సాగే గమ్మత్తైన సంకీర్తన. సాధువా! అని శ్రీవేంకటేశ్వర స్వామిని సంభోదిస్తూ ఒక శృంగార నాయిక గానం చేస్తున్నది.

## శుద్ధవసంతం

ప. జంకించితనేవు నన్ను సాదవా నీవు
సంకించ వేమిటికి సాదవా నీవు ॥పల్లవి॥

1. దూరి కొపకత్తెనంటా తొయ్యలుల కందరికి
సారె సారెఁ జెప్పేవు సాదవా నీవు
వూరికే మాటలాడుతా నొద్దఁ గూచుండి నా కిట్టె
సారపుబుద్ధి చెప్పేవు సాదవా నీవు ॥జంకించి॥

2. గొరబుగా నావలపు కొల్లున నవ్వుతా నీవు
సరవితోఁ గేరేవు సాదవా నీవు
తెరవేసి యానవెట్టి దిమ్మరి సేఁతలు చేసి
సరుగఁ జెక్కునొక్కేవు సాదవా నీవు ॥జంకించి॥

3. కలికినాకుచములు కాఁగిటను బిగియించి
చలపట్టి కూడితివి సాదవా నీవు
అలరి శ్రీ వేంకటేశ అదరపుతేనె లిచ్చి
చలివాసితివి సిగ్గు సాదవా నీవు ॥జంకించి॥

**అర్థములు:** ప. జంకించి= భయపెట్టి; తనేవు= తనియెదవు; తృప్తిపడేవు; సాదవా! (జానపద ఫణితిలో)= సాధువా! సంకించు= శంకించుట, అనుమానించుట; ఏమిటికి= ఎందుకు.

1. కొపకత్తె= కోపదారి ఆదుది; తొయ్యలులు= ఆడువారు; సారె సారె= మాటి మాటికి; సారపుబుద్ధి= మంచిసారవంతమైన బుద్ధి.
2. గొరబు= వికారవిశేషము, వేషము; కొల్లున= గొల్లుమని, నీరుప్రవహించిన రీతిగా; సరవి= క్రమము, వరుస; గేరేవు= గీరెదవు; దిమ్మరి= భ్రమ లేక మత్తు కలిగించు వాడు; సరుగ= కొనసాగు; చెక్కు= చెక్కిలి
3. కలికి= స్త్రీ, కుచములు= వక్షోజములు; చలపట్టి= పట్టుబట్టి; అలరి= సంతోషించి; అదరపుతేనె= అధరామృతము; చలివాసితివి= బుజ్జగించితివి.

**భావము:** ఓ సాధువా! నన్ను భయపెట్టి తృప్తిపొందేవు. నన్ను ఇలా మాటి మాటికి అనుమానించడం ఎందుకు సాధువా! చెప్పండి.

సాధువా! పనిబడినట్లుగా వెళ్ళి నేను కోపదారి స్త్రీనంటూ తోడి ఆడువారందరికి మాటి మాటికి ఎందుకు చెప్తావు? ఊరకే నీ వద్ద కూర్చుని మాట్లాడుతూ ఉంటే నాకు మంచి సుద్దులెందుకు చెప్తావు సాధువా?

సాధువా! వికారవేషాలు వేస్తూ, నా వలపును గ్రహించి గొల్లుమని నవ్వుతూ తరువాత మరలా నీవే నన్ను గోట గీరెదవు. తెరలు వేసుకుని, మర్యాద నటిస్తూ, ఒట్టు పెడుతూ లేనిపోని భ్రమలు కలిగించి మత్తులో ముంచి నా చెక్కిలి నొక్కుతావు సాధువా ఏమిటిది?

సాధువా! నా వక్షస్థలమును కౌగిట గట్టిగా పట్టుబట్టి బిగించి నన్ను చేరేవు. ఓ శ్రీవేంకటేశ్వరా! సంతోషంతో నీ అధరామృతాన్నిచ్చి సిగ్గుపడే విధంగా బుజ్జగిస్తావు సుమా!

**విశేషాంశములు:** ఈకీర్తన సాదవా! సాదవా! (సాధువా!) అని జానపద ఫణితిలో సాగడం విశేషం. వ్యవహారిక పదప్రయోగానికి ఉచ్ఛారణ ప్రాణం వంటిది. ఈ ఉచ్ఛారణ వ్యాకరణ విరుద్ధం కావచ్చు కాని, జానపదుల సహజ సంభాషణానికి అద్దం పట్టింది. అన్నమయ్య పామరుల ఉచ్ఛారణను యధాతధంగా గ్రహించి కీర్తనల్లో శాశ్వతం చేశాడు. ఈ కీర్తనలోని కొపగత్తె కూడా అలాంటి పదమే.

## 10

**అవతారిక:** ఈ కీర్తన శ్రీకృష్ణావతారంలో శ్రీవేంకటేశ్వరుడు చేసిన కొంటె క్రీడలు, శృంగార చేష్టలు స్తుతిస్తూ ఒక శృంగార నాయిక కీర్తిస్తున్నది.

### కేదారగౌళ

ప. వింటిమి యీ కొత్తలు వీనులు చల్లఁగాను
జంటలై నీపై వలపు చల్లెనట చెలియ ॥పల్లవి॥

1. వేడుకలు వెదచల్లి వీడెము పుక్కిటఁ బెట్టి
ఆదరానిమాట లాపె ఆడెనట
కోడెకాఁడవై నీవు కొండగొడ(డు?) గెత్తఁగాను
నీడనుండే చెమటలు నించెనట చెలియ ॥వింటిమి॥

2. చిప్పిల నవ్వులు నవ్వి చేతులు బుజాల వేసి
చెప్పరానిసేఁత లాపె చేసెనట
గొప్పలుగా నీవు పిల్లఁగోవి రాగా లొత్తఁగాను
దెప్పరాన నలపెల్లా దేరేనట చెలియ ॥వింటిమి॥

3. చాయలు సన్నలు చూసి చన్ను లురమున నాని
సేయరాని సేవ లాపె చేకొనెనట
యీయెడ శ్రీవేంకటేశ ఇటు నన్నుఁ గూడితివి
మోయరానిచోటు మోపి మొక్కెనట చెలియ ॥వింటిమి॥

**అర్థములు:** ప.కొత్తలు= వింతలు; వీనులు= చెవులు; జంటలై= రెట్టింపై; చల్లెనట= కురిపించు; చెలియ= శృంగార నాయిక.

1. వేడుక= సంతోషం, కుతూహలం; వెదచల్లి= కురిపించి; వీడెము= తాంబూలము; పుక్కిట= బుగ్గ లోపల; ఆడరాని మాటలు= అనకూడని మాటలు; ఆపె= ఆమె; కోడెకాడు= మంచివయసులో నున్న యువకుడు; కొండగొడుగు= గోవర్ధనగిరినేగొడుగుగా పట్టిన వాదు శ్రీకృష్ణుడు. నించెనట= నిండచేయు.
2. చిప్పిలు= పైకి ఉబుకు; సేతలు= పనులు; తెప్పరాన= ఆదమరచి; నలపు= బాధ; తేరెనట= కలిగెనట;
3. చాయలు సన్నలు= బహుగుర్తులు, జాడలు అనే అర్థంలో వాడే జంటపదం; చన్నులురమునాని= వక్షస్థలము రొమ్ముభాగమునకు తాకించి; చేకొను= చేయు; ఈ యెడ= ఈ స్థలము.

**భావము:** శ్రీకృష్ణా విన్నామయ్యా! చెవిలకింపుగా నీ వింత వింత పనులు. రెండింతలుగా నీపై చెలియ వలపు కురిపించిందట గోపిక.

సంతోషాలు కురిపించి తాంబూలము బుగ్గనపెట్టుకొని అనరాని మాటలు అన్నదట. యువరక్తం పెల్లుబికే నీవు గోవర్ధనగిరినే గొడుగుగా పట్టుకోగానే ఆమెకు ఆ నీడలో చెమటలు పుట్టాయట.

ఉప్పొంగే సంతోషంతో నవ్వుతూ ఆమె నీ భుజాలపై చేతులువేసి చెప్పరాని చిలిపి పనులు చేసిందట. నీవు గొప్పగా పిల్లనగ్రోవి ఊది రాగాలు పలికించగానే, ఆమె ఆదమరచి వలపు బాధను పొందినదట.

పలు రకాలైన వన్నెలు చిన్నెలు చూపించి ఆమె వక్షస్థలము నీ రొమ్మున కానించి చేయరాని సేవలన్నీ చేసిందట. ఈ స్థానంలో ఓ శ్రీవేంకటేశ్వరా ఈవిధంగా నన్ను కలిశావు. భారం వహించి ఆమె నీకు మ్రొక్కులు చెల్లించుకొందట.

**విశేషాంశాలు:** ద్వాపర యుగంలో ఉన్న శ్రీకృష్ణుడే కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీవేంకటేశ్వరుడని అన్నమయ్య వివరిస్తూ గోవర్ధనగిరినెత్తడం, మురళీనాదంతో గొల్లచెల్లుల మనసు కొల్లగొనడం ఇక్కడ వర్ణించబడినది.

## 11

**అవతారిక:** ఈ కీర్తనలో అన్నమయ్య ఒక జవ్వని శ్రీనివాసుని మీద ప్రేమతో ప్రియ సంభాషణలాడడానికి ప్రయత్నిస్తున్న శోభను కదు రమ్యంగా వర్ణిస్తున్నాడు.

### ఆహిరి

ప. ఎప్పుడు మన్నించేవయ్య ఇఁక నీవు
వుప్పతిల్లు వేడుకెల్లా వొడిగట్టుకొన్నది ॥పల్లవి॥

1. జవ్వనమదముతోడ చన్నుల వేఁకముతోడ
నివ్వెరగుపడి చెలి నిలుచున్నది
నవ్వులు సెలవిఁగారఁ నయము మోమున మీర
వువ్విళ్లూరుచు నీపై నొరగుకొనున్నది ॥ఎప్పుడు॥

2. సిగ్గులనే విఱ్ఱవీఁగి చిప్పిలఁగ మోవి మాఁగి
వొగ్గి విడె మందుకొని వూరకున్నది
నిగ్గుఁబులక లెసఁగ నిట్టూర్పులు వొసఁగ
కగ్గుదేర నేకతానఁ గాఁగిలించుకొన్నుది ॥ఎప్పుడు॥

3. పెనుఁ గొప్పు కదువీడ ప్రియాలు మాటలఁగూడ

గునియుచు నీతొడపైఁ గూచున్నది
యెనసితివి శ్రీ వెంకటేశ యీకెను మన్నించి
ననుపుల నిన్ను నిట్టె నమ్మివున్నది ॥ఎప్పుడు॥

**అర్థములు:** ప. మన్నించు= అనుగ్రహించు; ఉప్పతిల్లు= పుట్టు; వేడుక= ఆనందము, వొడిగట్టుకును= సిద్ధపడి ఉండుట.

1. జవ్వనమదము= వయసులోనున్నప్పటి గర్వాతిశయము; వేకము= బిగువు, అధికము; నివ్వెర= పారవశ్యము. సెలవిగార= పెదవులమూల; నయము= సంతోషము.
2. విఱ్ఱవీగు= నిక్కుచూపించు; చిప్పిలు= పైకి ఉబుకు; మాగి= పండి; వొగ్గి= పూనుకుని, సిద్ధపడి; విడెమంది= తాంబూలము చేతబట్టి. నిగ్గు= కాంతి; పులకలు= గగుర్పాటు; ఎసగ= మితిమీరు, విజృంభించు; ఒసగ= ఇచ్చు; కగ్గు= తగ్గు, వివర్ణమవుట; ఏకతాన= ఒకరిమీదనే నమ్మకముంచువారు; గాగిలించు= కౌగలించుకొను.
3. పెనుగొప్పు= పెద్ద కొప్పు; కడు= ఎక్కువగా; వీడ= విడిపోవు; ప్రియాలు= ప్రియసంభాషణలు; గునియు= కులుకు; ఎనయు= పొందు; ఈకె= ఈమె, ఈస్త్రీ; మన్నించి= గౌరవించి; అనుపు= అనురాగము.

**భావము:** ఎప్పుడు అనుగ్రహిస్తావయ్యా యిక ఆ రమణిని నువ్వు? ఉబికి ఉబికి పైకి తన్నుకొస్తున్న ఆనందాన్ని అనుభవించేందుకు సిద్ధపడి తయారుగా ఉన్నది. ఒక్కసారి ఆమెను వీక్షించి కటాక్షించవయ్యా!

మంచి యుక్త వయసు వలన వచ్చిన గర్వాతిశయంతో, బిగువైన వక్షోజసంపదతో పారవశ్యంతో చెలి నిలబడియున్నది. ఆమె నవ్వులు పెదవులమూలగా ముఖంపై కొట్టినచ్చినట్లున్న నవ్వుతో, వువ్విళ్ళూరుతూ నీపై కొరగి నీ మేను తాకుతున్నది.

సిగ్గుతో తన నిక్కు ప్రదర్శిస్తూ, మోము ఎఱ్ఱని కాంతితో కూడి, నీకు తాంబూలమందిచడానికి సిద్ధపడి నీవైపు చూస్తూ ఊరక నిలబడి ఉన్నది. ఆమె శరీరాన్ని చూస్తే మితిమీరిన గగుర్పాటుతో, వేడి నిట్టూర్పులు విడుస్తూ, నీపైనే నమ్ముకముంచి నిన్ను గాఢంగా కౌగలించుకొన్నది.

పెద్దదైన తన కొప్పు విడిపోయినా గమనించకుండా, ప్రియ సంభాషణలు చేయడానికై కులుకుతూ నీ తొడపై కూర్చున్నది. ఓ శ్రీవేంకటేశ్వరా! గౌరవించి ఆమె పొందుగోరావు. ఆమెకూడా అనురాగంతో నీ పై కడు నమ్మికతో ఉన్నది.

**విశేషాంశాలు:** అన్నమయ్య శ్రీనివాసునిగా, అలమేలుమంగగా, శృంగార నాయికలుగా మారి కీర్తించడమే కాక, ఒక నాయిక తరపున ఆమె స్వామికి చేరువవడానికి చేస్తున్న యత్నాన్ని స్వామికి కడు రమ్యంగా నివేదిస్తున్నాడు.

## 12

**అవతారిక:** ఈ కీర్తనలో అన్నమయ్య ఒక శృంగార నాయికగా మారి స్వామి వారి కొంటె పనులను వర్ణిస్తున్నాడు.

### సాళంగం

ప. ఏమయ్య యింతయేల యెకసక్కేలు
సాముసేసిన నీతో సతి పెనఁగీనా ॥పల్లవి॥

1. పలచనినగవులపగిడికాఁడవు
వెలలేనివేడుకల వేసదారివి
మలకలపలుకులమతకరివాఁడవు
కలికి నీకు నేడు కత చెప్పఁ గలదా ॥ఏమయ్య॥

2. తిరువు మురువు సే సే దిమ్మరీఁడవు
పరుగు పెక్కువిద్యలబయకాఁడవు
అరుదై నజూదాల ఆగడీఁడవు

గరిమ నీకు నింతి కత చెప్ప గలదా ॥ఏమయ్య॥

3. సంతకూటముల జాణకా డవు
మంతనపురతుల మాసటీఁడవు
చెంతఁ గలసితివి శ్రీ వేంకటేశ్వర
కాంత నీకు నిట్టె కత చెప్ప గలదా ॥ఏమయ్య॥

**అర్థములు:** ప. ఎకసెక్కేలు= ఎగతాళిమాటలు, గేళిచేసే మాటలు; సాము= వ్యాయామము, మల్లవిద్య; సతి= భార్య; పెనగీనా?= మారాడేనా? కలిసేనా?, కూడేనా?.

1. పలచని= చిన్నదైన, నగవుల= నవ్వుల; పగిడికాడు= పరిహాసగాడు; వేడుకల= చిత్రమైన, తమాషా; వేసదారివి= వేషాలువేసే వాడివి; మలకరి= వంకరైన; మతకరి= మాయావి. కలికి= స్త్రీ; కత= కథ, కల్పితమైన మాటలు.

2. తిరువు మురువు= తికమక; సే సే= చేసే; దిమ్మరీడు= మత్తుకలిగించే వాడు; పరుగు= పరుగులెత్తే; బయకారుడు= యౌవనముచే శృంగార చేష్టలు చేసే వాడు; అరుదు= వింత; ఆగడీడు= అకార్యములు చేసే వాడు; గరిమ= గొప్పదనము, దొడ్డతనము.

3. సంతకూటములు= సంతలుండే స్థలము, అమ్మేవారు, కొనేవారు ఉన్న ప్రదేశము; జాణకాడు= నేర్పరి, సమర్థుడు; మంతనము= ఏకాంతము, రహస్యము; మాసటీడు= శ్రేష్టుడు, గొప్పవాడు.

**భావము:** ఏమయ్యా! ఇంత గేళిచేస్తున్నావు? మల్లవిద్యలు చేసిన నీతో భార్య మారుమాట మాట్లాడగలదా?

చిరుత నవ్వులతో పరిహాసాలు చేసే వాడవు. వెలకట్టలేని చిత్ర విచిత్రమైన వేషాలు వేసే గుణం కలవాడివి. వంకరైన మాటలు మాట్లాడుతూ మాయ చేసే వాడివి. స్త్రీ నీకు కల్పిత మాటలు చెప్పగలదా?

తికమకకు గురిచేస్తూ సుందరమైన మోముతో మత్తెక్కించే వాడవు. చాలా విద్యలు తెలిసి యౌవన బలిమితో శృంగార చేష్టలు చేసే వాడివి. వింతైన జూదాలు ఆడుతూ అకార్యాలు చేసే వాడివి. ఎంత గొప్ప స్త్రీ అయినా నీకు కల్పితపు మాటలు చెప్పగలదా?

సంతలున్న కూడళ్ళలో ఉండే నేర్పరివి. ఏకాంతంగా రతిక్రీడలు జరిపే గొప్పవాడివి. ఓ శ్రీవేంకటేశ్వరా! నా ప్రక్కన చేరావు. ఏ స్త్రీ అయినా నీకు కల్పించి మాయ మాటలు చెప్పగలదా?

**విశేషాంశాలు:** అన్నమయ్య రోజులలో వస్తువులు అమ్మడానికి సంతలుండేవి. ఆ సంతలో సరుకులు అమ్మడం కొనడానికి విశేషంగా జనం వచ్చినప్పుడు జూదగాళ్ళు, వ్యభిచారులు కూడా జొరబడి తమ పనులన్నీ పూర్తిచేసుకునేవారు. అలా సంతకూడళ్ళలో స్వామి చేసిన కార్యాలన్నీ అభివర్ణించబడ్డాయి.

## 13

**అవతారిక:** ఈ కీర్తనలో అన్నమయ్య శ్రీకృష్ణావతారంలో శ్రీనివాసుడు గొల్లభామతో జరిపే సరస సంభాషణన్ని కమనీయంగా వర్ణిస్తున్నాడు.

### లలిత

ప. కానీవే గొల్లెతా గబ్బిగొల్లెతా
ఆనుక తెలుసుకొంటి వవునవురా గొల్లఁడా ॥పల్లవి॥

1. పంతకారిగొల్లెతా పదరకు గొల్లెతా
రంతుల నట్టేకానీరా గొల్లఁ డా
యింత గట్టు(ట్టి?) వాయవౌత యెరిఁగితినే నేను
సంతలోనె వింటిరా నీసాదుఁదనాలెల్లను ॥కానీవే॥

2. మతకారిగొల్లెతా మంకులాఁడిగొల్లెతా
రతులకు మా యింటికి రారా గొల్లఁడా

కతకారివౌత ఇట్టె కానవచ్చెనే నేఁడు
చతురతలు మోమున జడి సేరా నీకును ॥కానీవే॥

3. చనవరిగొల్లెతా చనవిమ్మా గొల్లెతా
కెలయకు శ్రీ వేంకటగిరిగొల్లఁడా
పొలఁతు లందరు నేఁడు పొగడేరే నిన్నును
కలపితి వౌర నిన్ను కమ్మటి మెచ్చితిని ॥కానీవే॥

**అర్థములు:** ప.కానీవే= అంగీకారము తెలుపవే అని అడుగుట; గొల్లెత= గొల్ల స్త్రీ; గబ్బి= గర్వముగల, నిక్కుగల; ఆనుక= తరువాత; ఔనౌరా= అవును నిజమే; గొల్లడా= గొల్లపిల్లవాడా!

1. పంతకారి= పంతములుపట్టువాడు, పోటీపడువాడు; పదరు= తొందరపడు; రంతులు= రతి, క్రీడ; కతకారి= కథలు చెప్పేవారు; గట్టు= తీరము; వాయవ= గాలి; ఔత= అవుతాను; సాదుదనము= మంచితనము.
2. మతకారి= మాయలాడి, మంకులాడి= మొండి స్త్రీ; కతకారి= నేర్పరి; చతురత= తెలివిగల; జడియు= ప్రకతితమగు; కతకారి= కథలు
3. చనవరి= స్నేహితురాలు; చనవు= కోరిక, ప్రేమ; కెలయు= విజృంభించు, చెలరేగు; పొలతులు= స్త్రీలు; కలపు= కలియు; కమ్మటి (క్రమ్మర అనేపదానికి ఔపవిభక్తికరూపము) = మరల.

**భావము:** ఓ నిక్కు జూపించే గొల్లభామా! త్వరగా నీ అంగీకారం తెలియజెయ్యవే.. అని శ్రీకృష్ణుడు అడగగా, ఆమె నీ విషయం తరువాత తరువాత అర్థమైంది. సరే! అవునవును గొల్లపిల్లవాడా అంటున్నదా గొల్లెత నర్మగర్భంగా.

శ్రీకృష్ణుడు పంతాలు పట్టింపులు పెట్టుకుని ఊరకే తొందరపడకు ఓ గొల్లెతా అని మొదటి పంక్తిలో అంటే, ఆమె అలాగే.. నీ రాచక్రీడలు కానీరా గొల్లపిల్లవాడా! నేను ఈతీరాల గాలినౌతాను నేను, నువ్వు విషయం తెలుసుకుంటే, నీ మంచిదనాన్ని సంతలో విన్నానులే గొల్లపిల్లవాడా! అని చమత్కారంగా జవాబిస్తున్నది.

శ్రీకృష్ణుడు ఓ మాయదారి మొండి గొల్లభామా! అని అంటే ఆమె రాచక్రీడకు మాయింటికి రారా! చూస్తుంటే మంచి నేర్పు గలవాడివని కనిపిస్తున్నది. నీ తెలివితేటలు నీ మోమున ప్రకటితమౌతున్నాయిలే అని గడుసుగా జవాబిచ్చింది.

శ్రీకృష్ణుడు మంచి స్నేహితురాలివిగదే గొల్లభామా.. నీ ప్రేమ కావాలి యివ్వు అని అడగ్గా ఆమె మరీ చెలరేగిపోకు వేంకటగిరి మీదనున్న గొల్లపిల్లవాడా! (శ్రీవేంకటేశ్వరా!) స్త్రీలందరూ నిన్ను పొగుడుతూ ఉన్నారు. ఇక్కడ కలిశావు నిన్ను మరల మరల మెచ్చుకుంటున్నాను అని జవాబిచ్చింది గొల్లెత.

**విశేషాంశాలు:** ఇది గొల్లభామ శ్రీకృష్ణుల మధ్య జరిగిన సరస చతురోక్తుల సంభాణాపూర్వకమైన కీర్తన. పల్లవిలో ఒక పంక్తి శ్రీకృష్ణుడు అనగా రెండవ పంక్తి గొల్లభామ అందుకున్నది. చరణాలలో మొదటి పంక్తి శ్రీకృష్ణుడు అనగా మిగతా మూడు పంక్తులు గొల్లభామ సరసమైన జవాబులిచ్చింది. చివరి చరణంలో 'వేంకటగిరి గొల్లడా!' అని శ్రీవేంకటేశ్వరుని సంబోధించింది.

## 14

**అవతారిక:** ఒక రమణి స్వామివారిని ఎవరో వనితతో కూడివచ్చిన విషయం ప్రస్తావిస్తూ ఒక వంక అనుమానిస్తూనే, మరో వంక స్వామి వలపులో చిక్కి పారవశ్యం పొందుతున్నది.

### హిజ్జిజి

ప. విన వేడుకయ్యీ మాకు వింతలైన మీ సుద్దులు
యెనలేని ముచ్చటలు యెటువంటివో ॥పల్లవి॥

1. యెంగిలిపెదవి వంచి ఇందాఁకా నీ చేతిలోన-
నంగవించి మాటలాడె నది యెవ్వతో

పొంగుచు నీ మేన నిట్టె పులకలు గడునిండె
సంగతి న వెటువంటిసంతోసములో ॥విన॥

2. చెమటచన్నులు దాఁక చేలాగు నీకు నిచ్చి
అమర లోనికిఁ దెచ్చె నది యెవ్వతో
తమితోఁ గళలు రేఁగి తతి నివ్వెర గైతివి
సమమైన వెటువంటిసంగడిపొందులో ॥విన॥

3. జవ్వనమదము గార సదమదముగ నిన్ను
అవ్వలఁ గాఁగిటఁ గూడె నది యెవ్వతో
ఇవ్వల శ్రీ వేంకటేశ ఇటు నన్ను నేలితివి
వువ్విళ్లూర నెటువంటి వుపాయములో ॥విన॥

**అర్థములు:** ప. వేడుక= సంతోషము; వింత= ఆశ్చర్యము; సుద్దులు= మంచికబుర్లు; ఎనలేని= సాటిలేని;

1. ఎంగిలిపెదవి= తడియైన పెదవి; అంగవించు= దగ్గరగు; పొంగు= సంతోషించు; మేను= శరీరము; పులకలు= గగుర్పాటు; సంగతి= చేరిక.
2. చేలాగు= చేయూత; అమర= పొందిక; తమి= వలపు; కళలు= వివిధ నైపుణ్యాలు, వన్నెచిన్నెలు; రేగి= విజృభించు; తతి= సమయము; నివ్వెర= పారవశ్యము; సమము= ఈడుజోడు; సంగడి= జత.
3. జవ్వనమదము= యౌవనముతోగూడిన అతిశయము; కారు= పొంగు; సదమదము= నలుగుట; అవ్వల= ఆవైపు; గాగిట= కౌగిట; కూడు= కలియు; ఇవ్వల= ఇక్కడ; వువ్విళ్ళూరు= ఆత్రముగా కోరుకొనుట. ఉపాయములు= ఎత్తుగడలో.

**భావము:** స్వామీ! మీ మాటలు మాకు వినడానికి ఎంతో కుతూహలంగా, ఆశ్చర్యంగొల్పేట్టు ఉంటాయి. దేనికీ సాటిరానటువంటి ఆ కబుర్లు ఎటువంటివోగదా!

స్వామీ! తడియైన ఆ పెదవులనువంచి ముద్దు ముచ్చట్లాడుతూ ఇప్పటిదాకా నీచేతుల్లో ఒదిగి నీ సమీపంలో మాట్లాడుతున్నది ఎవరు? నీ శరీరం ఉప్పొంగుతూ గగుర్పాటుతో నిండిండిపోయింది. ఆ మీ చేరిక ఎటువంటి సంతోషదాయకమో గదా!

స్వామీ! వక్షోజాలంతా చెమటతో నిండేంతవరకూ నీకు చేయూతనిచ్చి పొందికగా నిన్ను పొదవిపట్టుకుని లోనకు దీసుకునివచ్చినది ఎవ్వతో? ఆ వలపుతో తమరు వివిధ వన్నెచిన్నెలు గురిపిస్తూ పారవశ్యం పొందారు. మీ ఈడుజోడు చక్కగా జతగూడినప్పుడు ఆ కలియికలెటువంటి సౌఖ్యాన్నదించేవో గదా!

స్వామీ! యౌవనముతోగూడిన అతిశయము పొంగిపొరలుతూ ఉండగా, దేహమంతా నలిగేట్లుగా నిన్ను కౌగిట బంధించనది ఎవ్వతో గదా! ఇక్కడ ఈవిధంగా నన్ను శ్రీవేంకటేశ్వరుడై యేలితివి. అంత త్వరపడి కోరుకునే మీ ఎత్తుగడలు ఎలాంటివో కదా!

**విశేషాంశములు:** అన్నమయ్య ఈ కీర్తనలో జవ్వనమదము అని ఉపయోగించాడు. కులమదము, యౌవనమదము, స్త్రీమదము, అన్నమదము, ధనమదము, విద్యామదము, ఉద్యోగమదమనే సప్త మదములలో జవ్వనమదము కూడా ఒకటి. అలాగే అన్నమయ్య ఉపాయములను గూర్చి కూడా చెప్పాడు. ఈ ఉపాయములు చతుర్విధములుగా ఉంటాయి అవి సామము, భేదము, దానము, దండము. ఇవి కాక మాయ, ఉపేక్ష, ఇంద్రజాలము ఈమూడింటినిగూడ జేర్చి సప్తోపాయములని కొందఱు నీతికోవిదులు వ్రాశారు. ఇక్కడ అన్నమయ్య నాయకుడు నాయికయొక్క కోపమును పోగొట్టునపుడు ఉపయోగించెడు ఉపాయములైన సామము, భేదము, దానము, నతి, ఉపేక్ష, రసాంతరము అనే ఉపాయములగురించి చెప్పారు.

## 15

**అవతారిక:** ఎవరో నాయికను కూడివచ్చిన విషయం పసిగట్టిన అమ్మ అలమేలుమంగమ్మ స్వామి శరీరంపై రకరకాల గుర్తులను గమనించి కోపం వహిస్తూ మాట్లాడుతున్నది.



డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య

## వరాళి

ప. ఏఁటికి సత్యాలు సేసే వెందాఁకా నీవు
గాఁటముగ నింకాఁ దారుకాణించవలెనా ॥పల్లవి॥

1. చెలియిచ్చిన పువ్వులచెండు నీచేత నున్నది
మలసి నీచేఁత కది మచ్చము గాదా
కొలఁదిమీరఁగ తొల్లె గొల్లెతల మగఁడవు
యెలమి నీయొద్దతనా లెంచిచూపవలెనా ॥ఏఁటికి॥

2. రమణిచే ముద్దుటుంగరము నీవేల నున్నది
కొమరై నీపొందు కది గురుతుగాదా
తమితోడ నీవు తొల్లె ధర్మరాజు మఱఁదివి
గములై నీ నిజాలకు కడగురు తున్నదా ॥ఏఁటికి॥

3. అంగనకంటసరి నేఁడట్టె మెడ నున్నది
సంగతిగా నీకదె లాంచనము గాదా
చెంగట నన్నేలితివి శ్రీ వేంకటేశ్వర
అంగపునీరతులకు నౌఁగాము లున్నవా ॥ఏఁటికి॥

**అర్థములు:** ప. సత్యాలు= ఒట్లు; గాటముగ= ఎక్కువగా; తారుకాణించు= ఋజువుచేయు.

1. మలసి= తిరిగి ; మచ్చము= గుర్తు; కొలదిమీర= అపరిమితముగ; తొల్లె= ముందు; గొల్లెతలు= గొల్లభామలు; ఎలిమి= ప్రేమ, సంతోషము; ఒద్దతనము= అత్యుత్సాహము;
2. కొమరు= మనోజ్ఞము; తమి= అపేక్ష; మఱది= చెల్లెలి భర్త; గములు= లెక్కలేనన్ని; కడగురుతు= చివరి జ్ఞాపకం.
3. కంటసరి= మెడలో ధరించు కంటె; సంగతి= చేరిక; లాంచనము= గుర్తు; చెంగట= సమీపము; అంగము= దేహము; రతులు= అనురాగము, కలయిక; ఔగాములు= యుక్తాయుకములు.

**భావము:** స్వామీ! ఎంతవరకూ మీరు ఈ ప్రమాణాలు చేయడం, ఒట్లు పెట్టడం? మీ చేష్టలకు ఇంకా ఎక్కువగా ఋజువులు కావలెనా?

స్వామీ చెలి యిచ్చిన పువ్వుల చెండు నీచేతిలోనే ఉన్నది. గమనించి చూచినట్లైతే నీచేతికది గుర్తుకాదా? పూర్వం ఎంతోమంది గొల్లభామలకు మగడైనావు. ఇంకా నువ్వు అత్యుత్సాహంతో ప్రేమను కురిపిస్తూ చేసే పనులు ఎత్తిచూపించవలసిన అవసరం ఉందా?

ఆ అమ్మాయి చేతికి ఉండవలసిన ముద్దుటుంగరము నీ వేలికి యున్నది. మనోజ్ఞమైన నీ కలయికకు అది గుర్తు కాదా? ముందు ఎంతో ఆపేక్షగా ధర్మరాజుకు మరిదివై యున్నావు. లెక్కలేనన్ని నీ స్వభావములకు చివరి జ్ఞాపకమున్నదా?

ఆ అమ్మాయి మెడలోనుండవలసిన కంటె నీ మెడలోకి చేరినది. నీ చేరికకు అది గుర్తుకాదా? ఓ శ్రీవేంకటేశ్వరా చెంత నన్ను భార్యగా అనుగ్రహించావు. నీ రతిలీలా విలాసములకు యుక్తాయుక్తములున్నవా?

**విశేషాంశములు:** అన్నమయ్య స్వామి ద్వాపరయుగంలో గొల్లచెలుల మనసు కొల్లగొట్టి వారిని కూడిన విషయం, ధర్మరాజు మరిదివి కదా నీవిలా చేయడం ధర్మమేనా? అని ప్రశ్నించడం ఈకీర్తనలో ఉన్నది. ఇంకా అన్నమయ్య 'రతులు' అనేమాటలో శుద్ధరతి, ఛాయారతి, ప్రతిబింబిత రతి, జడ రతి, కపట రతి అనే పంచరతులగురించి అన్యాపదేశంగా తెలిపాడు.

## 16

**అవతారిక:** ఈ కీర్తనలో అమ్మ అలమేలుమంగమ్మ దక్షిణ నాయకుడైన శ్రీవేంకటేశ్వరుడు చేసి వచ్చిన శృంగార చేష్టలను వర్ణిస్తూ

అన్య స్త్రీలపై ఉన్న అసూయను ప్రకటిస్తున్నది.

## శ్రీరాగం

ప. అంతలోనె తేరెనా ఆకె మనసు
పొంతనుండి యింకానేమి బుజ్జగించేవయ్యా ॥పల్లవి॥

1. సెలవి నవ్వులతోడ చెలియ మాటాడఁగాను
వెలయఁబూబంతిఁ గొని వేసితివి
నిలువుఁదురుము దాఁకె నిన్ను నాకె చూడఁగాను
చెలరేఁగి యేమిటికిఁ జెక్కు నొక్కేవయ్యా ॥అంతలోనె॥

2. కొసరుఁజూపులతోడ కోమలి నీకు మొక్కఁగా
పొసఁగఁ బన్నీరు దిగఁబోసితివి
వెసఁ బయ్యెద దడిసి వేడుక యానవెట్టఁగా
విసువక ఇప్పుడేమి విడెమిచ్చేవయ్యా ॥అంతలోనె॥

3. సిగ్గులచేఁతలతోడ చెలి కాఁగిలించుకోఁగా
వొగ్గి గందవొడి చల్లి వొనరితివి
నిగ్గులశ్రీవేంకటేశ నిన్ను నాకె మెచ్చఁగాను
అగ్గమై యప్పటి నెంత ఆస సేసేవయ్యా ॥అంతలోనె॥

**అర్థములు:** ప. తేరు= ప్రసన్నమగు; ఆకె= ఆమె; పొంత= దగ్గరకుతీసుకుని; బుజ్జగించు= బతిమలాడు, లాలించు.

1. సెలవినవ్వు= పెదవి మూలగానవ్వు; వెలయు= ప్రకాశించు; పూబంతి= పువ్వుల చెండు; వేయు= సున్నితముగావిసరు; నిలువు తురుము= నిలువుగానుండు కొప్పు; ఆకె= ఆమె; చెలరేగి= విజృభించి; చెక్కు= చెక్కిలి.
2. కొసరు= సంకోచము; కోమలి= స్త్రీ; పొసగ= స్నేహముగ; దిగబోయు= క్రిందికి కారునట్లు; వెస= తొందరగా; పయ్యెద= పైట; వేడుక= వినోదము ; ఆనవెట్టు= కోపమూను, ఆజ్ఞాపించు; విసువక= విసుగులేక; విడెమిచ్చు= తాంబూలమిచ్చు.
3. సిగ్గుచేతలు= సిగ్గుపడే చేష్టలు; కాగిలించుకొను= కౌగలించుకొను; ఒగ్గి= హడావిడిగా; గందవొడి= గంధంపొడి; వొనరు= ఇంపునుకలుగజేయు; నిగ్గులు= సొబగులు; అగ్గము= ఆధీనము; అప్పటి= మరల; ఆససేయు= ఆపేక్ష చూపించు.

**భావము:** ఓ స్వామీ అంతలోనే ఆమె మనసు ప్రసన్నమయినదికదా! ఆమెను దగ్గరకుతీసుకుని ఇంకా ఎందుకు లాలిస్తున్నావు?

పెదవిని వంకరగా పెట్టి, మూలగా నవ్వులు చిందిస్తూ చెలి నీతో మాటలాడగానే, మీరు ఆనందోత్సాహలతో వెలిగిపోతూ, పూలచెండునొకదానిని ఆమెపైకి సుతారంగా విసరగా, అది ఆమె నిలువుకొప్పును తాకగా మిమ్మల్ని వీక్షించినది. ఎందుకు ఇంకా విజృంభించి ఆమె చెక్కిలిని అదుముతున్నారు?

సంకోచపు చూపులతో ఆ ఇంతి నీకు మ్రొక్కగానే, నువ్వు ఆమెపై పన్నీరు పైనుండి క్రింది పారేట్టు పోసావు. ఆ తొందరలో పైటభాగము తడిసిపోయినదని ఆమె కోపం వహించగా, వినోదం చూస్తూ ఆమెకు తాంబూలము చేతికిచ్చావు.

సిగ్గులొలకబోస్తూ ఆమె నిన్ను కౌగలించుకోగానే, హడావుడిగా ఆమెపై గంధపుపొడి చల్లి ఆమెకు ఇంపును కలిగించావు. ఓ సొబగులు చిందే శ్రీవేంకటేశ్వరా! నిన్ను ఆమె మెచ్చుకొనగా, నీ ఆధీనమైన ఆమెపై మరలా ఎంతటి ప్రేమను చూపించావయ్యా!

**విశేషాంశములు:** శృంగార క్రీడలో భాగంగా చేసే కార్యాలైన పూలచెండుతో ఆడుకోవడం, పన్నీరు చల్లుకోవడం, గంధవడి చల్లుకోవడం వంటి పనులను వర్ణిస్తున్నాడు అన్నమయ్య.

## 17

**అవతారిక:** ఈ కీర్తనలో నాయిక స్వామిని వివిధ గుణాలతో అభివర్ణిస్తూ నీవు చాలా టక్కరివి సుమా అని నిందాస్తుతి చేస్తున్నది.

## ముఖారి

ప. నీవలెనుఁ గొసరఁగ నేరుతుమా
సేవలు చేసి నిన్నుఁ జేకొందుఁ గాక ॥పల్లవి॥

1. వెలలేనివలపుల వేడుక కాఁడవు
చలమరిచేఁతలజాజరకాఁడవు
పలుకులఁ గరిగించేబయకారివాఁడవు
నిలువుఁ జక్కఁదనాల నీటుకాఁడవు ॥నీవలెనుఁ॥

2. తచ్చనతరితీపులతగవరివాఁడవు
పచ్చలాయకట్టేలాబపువాఁడవు
లచ్చిగొండితనములలాగవేగకాఁడవు
విచ్చనవిడి తగులువిరికాఁడవు ॥నీవలెనుఁ॥

3. చొప్పులెత్తి సోదించేసుంకరివాఁడవు
కుప్పళించి పొందు సే సేకోడెకాఁడవు
ఇప్పుడె శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నిట్టె
తొప్పఁదోగేరతులకు దొమ్మికాఁడవు ॥నీవలెనుఁ॥

**అర్థములు:** ప. కొసరు= విజృంభించు; నేరుతుమా?= నేర్చినవారమా? చేకొను= పొందు, దక్కించుకొను.

1. 1. వెలలేని= వెలకట్టలేని, అమూల్యమైన; వేడుక= కుతూహలము, ఇచ్ఛ, కోరిక; చలమరి= ఉడుకుబోతువాడు; జాజర= మోసగాడు; వంచనచేయువాడు; బయకారివాడు= శృంగారచేష్టలవాడు; నిలువు= నిలువెల్ల, నీటుకాడు= విలాసవంతుడు.

2 తచ్చన= పరిహాసం, కపటపు, తరితీపు= వలపు; తగవరి= న్యాయాధిపతి, తగవులను తీర్చేవాడు; పచ్చలాయకట్టు= ధనాదాయం కలిగేట్టు; లాబపువాడు= లాభముసంపాదించేవాడు; లచ్చిగొండి= ధనవంతుడు; వేగకాడు= వడిగలవాడు; విచ్చనవిడి= విచ్చలవిడి (స్వతంత్రము) తిరుగువాడు; తగులు= చిక్కుకొను; విరికాడు= పూలరంగడు.

3 చొప్పులు= మార్గములు; ఎత్తి= చూపించు; సోదించు= శ్రద్ధతో వెదకు; సుంకరి (సుంకము ం అరి)= ధనము వసూలుచేయువాడు; కుప్పళించు= కురిపించు; కొడెకాడు= యుక్త వయసులోనున్నవాడు; ఏలితివి= పరిగ్రహించితివి, పాలించు; తొప్పదోగు= ఎక్కువగా మునిగిపోవు, అధికాసక్తిగల; దొమ్మికాడు= సాహసకాడు.

**భావము:** ఓ స్వామీ! నీమాదిరిగా విజృంభించడం నేర్చినవారమా? నీకు సేవలు చేసుకుంటూ నీపొందు దక్కించుకొనేవారము మాత్రమే!

స్వామీ! నీవు కపటపు చూపులతో వలపులను అధికంగా కురిపిస్తూ తీర్పులు చెప్పేవాడవు. ధనాదాయం, సంపదలు కలిగేట్టు చేసి లాభనష్టములు లెక్కించే వాడవు. గొప్ప వడ్డీతో ద్రవ్యార్జనచేసే నేర్పుగల వాడివి. స్వతంత్రించి తిరుగాడుతూ ప్రజ్ఞతో నీ వలపులో చిక్కునేట్టు చేయగల పూలరంగడివి.

స్వామీ! నీవు వెలకట్టలేని అమూల్యమైన కుతూహలంతో ఉన్నవాడవు. ఉడుకుబోతుతనముతో ఉన్న శృంగార చేష్టలాడే వాడవు. మాటలతోనే మా మనసులు కరిగించగల నేర్పరివి. నిలువెల్లా విలాసవంతుడవు సుమా!

స్వామీ! నీవు మాకు సరైన మార్గాన్ని చూపించి, శ్రద్ధతో ధనము వసూలు చేసేవాడవు. మాపై వలపులను కురిపిస్తూ, మా పొందునుకోరే యుక్తవయసుగల వాడివి. ఇప్పుడు ఇక్కడ శ్రీవేంకటేశ్వరుడవై నన్ను పాలిస్తున్నవాడవు. శృంగార రతికార్యాలకు అధికాసక్తి చూపిస్తూ ఉన్న సాహసవంతుడివి.

**విశేషాంశములు:** నాయిక స్వామిని శృంగార చేష్టలున్నవాడివని నిందిస్తూనే, శ్రీవేంకటేశ్వరునిగా అందరిదగ్గరా వడ్డీకాసులను వసూలుచేసేవాడని అంటున్నది.

డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య

## 18

**అవతారిక:** ఈ కీర్తనలో చెలులు శ్రీవేంకటేశ్వరుని, అమ్మ అలమేలుమంగమ్మను వివాహం చేసుకోమని ప్రోద్బలం చేస్తూ, ఆమె మదనావస్తను వివరిస్తూ, తమ మొరాలకించమని వేడుకుంటున్నారు.

### శంకరాభరణం

ప. అలివేణిని బెండ్లాడవయా
చెలుల విన్నపము చేకొనవయ్యా ॥పల్లవి॥

1. సొలపులఁ దొలితొలి చూచినచూపులు
కొలఁదిమీర నుంకువలాయ
చెలఁగి చేతులను సేసినసన్నలు
తలఁపఁగ నలుగడఁ దలఁబాలయ ॥అలివేణిని॥

2. ననుపున సెలవుల నవ్వినవవ్వులు
గొనకొనఁగఁ బాలకూళ్ళాయ
అనువుగఁ బ్రియమున నాడినమాటలు
మనసిజతంత్రపుమంత్రములాయ ॥అలివేణిని॥

3. వేడుకకాఁగిటివినయపు సేఁతలు
కూడినకూటపుగురులాయ
యీడనె శ్రీ వేంకటేశ యేలితివి
తోడలమేల్మంగ దోమట్లాయ ॥అలివేణిని॥

**అర్థములు:** ప.అలివేణి= తుమ్మెదలవలె నల్లనైన వెంట్రుకలు; చేకొను= అనుగ్రహించు.

1. సొలపు= పారవశ్యము; తొలితొలి= మొట్టమొదటి; కొలది= అపరిమితము; నుంకు= ఉపవాసము; చెలగి= ఆనందం; సన్నలు= హస్తాదులచేత చేసెడు సంజ్ఞ; నలుగడ= నాలుగు ప్రక్కలు; తలబాలు= తలంబ్రాలు.
2. అనుపు= ఆజ్ఞాపించు; సెలవు= విడుపు; గొనగొను= ప్రయత్నములు; బాలకూళ్ళు= స్త్రీల కలయికలు; అనువు= అనుకూలం; మనసిజ= మన్మథుడు; తంత్రము= ఉపాయము; మంత్రము= రహస్యము.
3. వేడుక= కుతూహలము, సంతోషము; కాగిటి= కౌగిలి; వినయము= విధేయత; సేతలు= పనులు; కూటము= చావడి; గురులు= ఘనమైన, గొప్పవి; దోమట్లు= మాయలు.

**భావము:** ఓ స్వామీ! ఈ తుమ్మెదరెక్కలవంటి కేశములున్న బాలామణిని చేపట్టి వివాహం చేసుకోవయ్యా ! ఈ చెలికత్తెలు చేసే విన్నపాలను, మొరను ఆలకించి ఆదరించి అనుగ్రహించవయ్యా !

తమరు పారవశ్యంతో ఆమెను చూచిన తొలిచూపులు అపరిమితానందాన్ని కలుగజేసి ఆమెకు నిద్రాహారాలు కరువయ్యేవిధంగా చేశాయి. ఆనందంతో చేసిన చిలిపి సైగలను, కనుగీట్లను తలచుకొంటూ ఉంటే నలుదిక్కులనుండి తలంబ్రాలు కురిసిన ఆనందంగా ఉంది.

తమరు మధ్య మధ్యలో నవ్వుతున్న చిరునవ్వులు, ఆ బాలామణిని చేరడానికి చేసే ప్రయత్నాలులాగా ఉన్నాయి. ఆమెకు అనుకూలంగామీరు చెప్పే కబుర్లు, మన్మథుడు రహస్యంగా పన్నిన ఉపాయంలాగా ఉన్నది.

తమరు సంతోషంతో ఆమెను కౌగలించుకొని నటించే వినయ విధేయతలు, ఆమెను కలిసిన ప్రదేశాలు, చావళ్ళు చాలా

గొప్పగా ఉన్నవి. ఓ శ్రీవేంకటేశ్వరా! నీకు తోడైన అలమేల్మంగమ్మను ఇక్కడనే యేలుకుని అనేక మాయలకు గురిచేశావు.

**విశేషాంశాలు:** అన్నమయ్య ఆనాటి జానపద పదాలను గమ్మత్తుగా కీర్తనల్లో నిక్షిప్తం చేశాడు. ఈ కీర్తనలో "పాలకూళ్ళు" అన్న మాట ఒకటి ప్రయోగించాడు. అంటే పాలతో వండిన భోజనమంటే పాయసము అనే అర్థంలో ప్రయోగించాడు. అలాగే "తలబాలు" అనే ప్రయోగంలో తలంబ్రాల బియ్యం అని అర్థం.

## 19

**అవతారిక:** ఈ కీర్తనలో ఒక నాయిక అలమేలుమంగమ్మతో, ప్రణయ కలహాలు వలదని, స్వామిని త్వరగా కూడమని హెచ్చరించుచున్నది.

### వేళావళి

ప. ఏమిటికిఁ జలము యెందాఁకా
నాముల తోడుత నగవే యింకను ॥పల్లవి॥

1. బలము లేమిటికిఁ బచరించేవే
వలచినదానవు వనితవు
సొలయచు రమణుని సోదింతురటే
అలరి ఇచ్చకములాడుట గాక ॥ఏమిటికి॥

2. తగవులఁ బెట్టఁగ తగునటవే యింక
మగనితోడ పలుమరు నిపుడు
అగడుసేతురా అతని నింతేసి
చిగురుమో వొసఁగి చెలఁగుటగాక ॥ఏమిటికి॥

3. కూడినవేళను గుట్టుసేతురా
యీడనె శ్రీ వేంకటేశునెడ
ఆడకు వెంగెము లలమేల్మంగవు
వీడెము లంచుక వెలయుటగాక ॥ఏమిటికి॥

**అర్థములు:** ప. చలము= వణకు; ఆము= ఆతిశయించిన; తోడుత= తోడుగా నగవు= నవ్వు.

1. బలుము= అధికము; పచరించు= కనబరచు; సొలయు= విముఖత; రమణుడు= మన్మధుడు; సోదించు= పరీక్ష చేయు; అలరి= సంతోషము; ఇచ్చకములు= ముఖప్రీతి మాటలు.
2. తగునటవే= తగునా; పలుమరు= అనేకసార్లు; అగడు= నింద; చిగురుమోము= లేతయైనమొహము (ప్రౌఢ స్త్రీ); వొసగి= ఇచ్చి; చెలగు= సంతోషించు.
3. కూడిన= కలసిన; వేళ= సమయము; గుట్టు= రహస్యము; ఎడ= స్థానము; వెంగెము (వ్యంగ్యము)= గేళిచేయు; వీడెము= తాంబూలము; అందుక= తీసుకుని; వెలయు= ప్రకాశించు, ఒప్పు;

**భావము:** ఓ అలమేలుమంగ తల్లీ! ఎప్పటివరకూ స్వామిని ఇలా కంపిపజేసి బెదరగొడతావు. అతిశయించిన సంతోషంతో ఇప్పటికైనా నవ్వరాదా?

అధికంగా కనబడ్డానికి ఎందుకు ప్రయత్నిస్తావు? ఆ స్వామిని అమితంగా వలచి వలపించుకొన్న స్త్రీ వి. అలా విముఖత జూపిస్తూ మన్మధరూపంగల ఆ స్వామిని అలా పరీక్షకు గురి జేస్తారా? సంతోషంతో ముఖప్రీతి మాటలు మాట్లాడుకోవడం చెయ్యకుండా అలా ఉంటారా!

మగనితో అకారణంగా అనేకమార్లు జగడాలు బెట్టుకోవడం తగునా? ఆయనపై ఇన్ని నిందలు మోపుతారా ఎవరైనా? నీ

లేతమోము ఆయనకు అందించి సంతోషపెట్టక అలా ఉంటారా!

కలసిన సమయాలలోని రతి రహస్యాలను అందరికి చెప్తారా? ఇక్కడనే ఉండి శ్రీవేంకటేశ్వరుని స్థానంలో పరిహాసములాడి గేళిచేయడం తగునా? తాంబూలములందుకొని సంతోషించకుండా అలా ఉంటారా!

## 20

**అవతారిక:** ఈ కీర్తనలో అన్యస్త్రీతో కూడి వచ్చిన తన పతి శ్రీవేంకటేశ్వరునిపై కోపం ప్రదర్శిస్తూ అన్నీ చేసివచ్చి, ఏమీ తెలియనట్టు నన్నెందుకు బ్రతిమాలుకుంటారని అలమేలుమంగమ్మ నిందిస్తున్నది.

### రామక్రియ

ప. అవునయ్య నీసుద్దు లటువంటివి
జవళితో నంటుబచ్చలివంటివాఁడవు ॥పల్లవి॥

1. చెలరేఁగి యేడలేని చేఁతలెల్లాఁజేసివచ్చి
వెలయ నిప్పుడు నన్ను వేఁడుకొనేవు
పలుమారు నీచేత బాసలుగొన వెరతు
కలువకంటులయెడ కాతరీఁడ వనుచు ॥అవునయ్య॥

2. వాడవారిపైనెల్లా వలపులు చల్లి వచ్చి
యీడ నాతో నేడలేని యిచ్చలాడేవు
కోడెకాఁడ నీవోజ కొనియాడ సిబ్బితయ్యీ
జాడతో నింతులయెడ చంచలుఁడ వనుచు ॥అవునయ్య॥

3. పెక్కుగోపికలనెల్లా బెండ్లాడి యిట వచ్చి
గక్కన నాకాఁగిటఁగలసితివి
నిక్కి శ్రీ వేంకటేశుఁడ నే నలమేల్మంగను
కక్కసించ నోప నీవు గబ్బివాఁడ వనుచు ॥అవునయ్య॥

**అర్థములు:** ప. సుద్దులు= సూక్తులు, మంచి కబుర్లు; జవళి= జంట, జత; అంటుబచ్చలి= ఒకదానిని ఆధారంగా చేసుకొని ఉండడం.

1. చెలరేగి= విజృంభించి; యేడలేని= ఎక్కడా లేనటువంటి; చేతలు= పనులు; వెలయ= ప్రసన్నత; వేడుకొను= బ్రతిమాలు; పలుమారు= అనేకసార్లు; బాస= ఓట్టు, ప్రమాణము; వెరతు= చింత, నిశ్చేష్టత; కలువకంటులు= కలువ పుష్పమంటి కన్నులు గలవారు; కాతరీడు= భయముగలిగించే గుణము గలవాడు, వ్యాకులత పుట్టించే వాడు;
2. వాడవారు= స్త్రీలంపటుడు, స్త్రీలపై అనురాగం కురిపించేవాడు; ఇచ్చలు= ప్రేమ; కోడె కాడు= పడుచువాడు; ఓజ= కౌశలము, నేర్పు; కొనియాడు= పొగడు; సిబ్బిత= సిగ్గుపడే స్త్రీ; జాడ= ఆనవాలు; చంచలుడు= కాముకుడు, మనసు నిలకడలేని వాడు.
3. పెక్కు= అనేకమంది; గక్కన= ప్రక్కన; కాగిట= కౌగిట; నిక్కి= ఆసక్తి; కక్కసించు= సంకటపరచు; ఓప= తాళలేకపోవు; గబ్బి= గర్వము, కపటము.

**భావము:** ఓ స్వామీ! నువ్వు చెప్పే కబుర్లెటువంటివో గదా! అంటుబచ్చలిలా జతగూడి అల్లుకుపోయే స్వభావమున్నవాడవు.

మీరు విజృంభించి ఎక్కడలేని అకార్యాలు, శృంగారలీలలు చేసివచ్చి, మంచి ప్రసన్నతను నా యెడ కురిపిస్తూ నన్ను బ్రతిమాలుకుంటావు. ఎన్నో సార్లు నాకు అనేక ఒట్లు పెట్టి , ప్రమాణాలు చేసిన విషయం గుర్తొచ్చి కంగారుగా ఉన్నది. నీవు స్త్రీలపట్ల వ్యాకులత పుట్టించేవాడివని చింతగా ఉన్నది.

మీరు వాడలో ఉన్న స్త్రీల పైన ప్రేమలు కురిపించివచ్చి, ఇక్కడ మాత్రంనామీద ఎక్కడా లేనటువంటి ప్రేమలొలకబోస్తావు.

ఓ పడుచువాడా! నీ కౌశలాన్ని కొనియాడడానికి సిగ్గవుతున్నదయ్యా! నీ ఆనవాలుచూస్తే స్త్రీలయెడ మనసు నిలకడలేనివని బాధగా ఉన్నది.

ఓ స్వామీ తమరు అనేకమంది గోపికామణులను వివాహం చేసుకొని, ఇక్కడ వచ్చి నా ప్రక్కన చేరి నన్ను కౌగిట్లోకి తీసుకుంటావు. ఓ కపట మనస్సుగల శ్రీవేంకటేశ్వరా! నీపై ఆసక్తిగల అలమేల్మంగనయ్యా! నన్ను సంకటపరిస్తే నేను తాళలేకుండా ఉన్నాను. స్వామీ! కరుణించు!

## 21

**అవతారిక:** ఈ కీర్తనలో నాయిక అలమేలుమంగమ్మ అన్యస్త్రీలతో కూడి వచ్చిన తనపతి శ్రీవేంకటేశ్వరుని ఆ వివరాలడగమని చెలులకు ఉద్బోధిస్తున్నది.

### గౌళ

ప. చెలులాల చూడరే చెలువుని బాగులెల్లా
నిలువుఁ జక్కఁదనాల నిలుచున్నాఁ డీడను ॥పల్లవి॥

1. ఇయ్యఁగదే విడెము యిందాఁకా నేడ నుండెనే
నెయ్యపు రమణుఁడంటా నే నుంటిని
పయ్య దంటవచ్చీని పలుమారు నన్నుఁ జూచి
కొయ్యతనాలు నేరిచె గొంకఁ డేమిటికిని ॥చెలులాల॥

2. అడుగవే సుద్దులు ఆడ నుండి తా వచ్చె
నడుమఁ దనప్రియాలు నమ్మితిని
వొడివట్టి పెనఁగీని వొనరి సంతోసాన
గడుసాయఁ జేఁతలను కరఁగఁ డెంతయినా ॥చెలులాల॥

3. మొక్కవే నామారు ముంచి నన్నిటు గూడె
యిక్కడ శ్రీ వేంకటేశు కిరవైతిని
అక్కరతో మన్నించీని అలమేలుమంగ నేను
తక్కక రతుల మించీ దంట తనమునను ॥చెలులాల॥

**అర్థములు:** ప. చెలువుడు= ప్రియుడు; బాగులు= పనులు; నిలువు= నిలువెత్తు, ఆకృతి; ఈడను= ఇక్కడ.

1. ఇయ్యగదే= ఇవ్వవే; విడెము= తాంబూలము; ఏడ= ఎక్కడ; నెయ్యము= స్నేహము, ఇంపైన; రమణుడు= సుందరుడు పయ్యెద= పైటచెంగు; కొయ్యతనాలు= కొంటెదనము; నేరిచె= నేర్చుకున్నాడు; గొంకు= తగ్గు; ఏమిటికిని= ఎందుకని.
2. సుద్దులు= విషయాలు; ప్రియాలు= ముద్దుమాటలు; వొడి= తొడపై భాగము, %ఋణబఎబ%; పెనగు= చుట్టుకొను; ఒనరు= కలుగు; కడు= మిక్కిలి; సాయ (ఛాయకు జానపదరూపం) = దిక్కు, మార్గము.
3. నామారు= నాబదులు; ముంచు= అతిక్రమించు, మీరిపోవు; ఇరవు= స్థానము, స్థిరము; అక్కర= అవసరము, ప్రియము; మన్నించి= గౌరవించు, సమ్మానించు; తక్కక= తప్పక; రతులు= రతిక్రీడలు; మించు= అతిశయించు; దంటతనము= నేర్పరి తనము.

**భావము:** ఓ చెలులారా! నిలువెత్తు సుందరాకృతితో ఇక్కడ నిలుచున్న ఈ ప్రియుడి చేసే పనులు బాగా చూడండి.

ఓ చెలులారా! ఇప్పటిదాకా ఎక్కడ ఉన్నాడో ఏమో! అతనికి తాంబూలము ఇవ్వండే! స్నేహభావంతో ఆ సుందరరూపుని కోసం నేనిక్కడ ఉన్నాను. పైటచెంగు పట్టుకొని అనేకమార్లు నన్ను చూసి, కొంటెపనులు నేర్చినవాడై ఏమాత్రం తగ్గకుండా ఉన్నాడు

ఓ చెలులారా! ఎక్కడనుండో వచ్చాడు కదా! విషయాలేమిటో కొంచెం కనుక్కోండి. ఈ నడుమ ఆయన చెప్పే ముద్దుమాటలు

నమ్మాను. నా నడుమును పట్టుకుని నన్ను చుట్టుకొని సంతోషంతో, చిలిపి చేష్టలతో ఒకపట్టాన నన్ను వదలడంలేదు

ఓ చెలులారా! నా బదులుగా ఒక్కసారి మీరు అతనికి మ్రొక్కండి. మీరిన ఉత్సాహంతో నన్ను చేరుకున్నాడు. ఇక్కడ శ్రీవేంకటేశ్వరుని సదనంలో స్థిరంగా ఉన్నాను. అతని మీది ప్రియంతో అతనిని గౌరవించిన అలమేలుమంగను నేను. వారు తప్పకుండా అతిశయించిన నేర్పరి తనంతో రతిక్రీడా సామర్థ్యంతో నన్ను పరవశింపజేస్తాడు.

## 22

**అవతారిక:** ఈ కీర్తనలో అమ్మ అలమేలుమంగమ్మ స్వామివారు చెప్పే మాయ మాటలను చాలించమని, పొరబాటు దారులలో ఆరితేరిపోయావని నిందిస్తున్నది.

### దేసాళం

ప. ఇందరు నెఱిఁగినవే యీ సుద్దులు
యెందాఁకా వట్టిమాయ లేమిసేసే నిపుడు ॥పల్లవి॥

1. తప్పులుదారులు నన్ని తానె తేరీఁగాని
చెప్పరాదా నీమాట చేరి వినేను
అప్పట నుండియు నీవు ఆఇత్తపడే విట్టె
నెప్పున నీనిజములు నెరుపేవు సారెకు ॥ఇందరు॥

2. తీపులుఁగారాలు నిట్టె తేటతెల్లవయ్యీఁగాని
చూపరాదా నీమోవి చూచే నేను
పైపై నే మల సేవు పంతగారితనమున
వోపికఁజెలుల నేమి నొడఁబరచేవు ॥ఇందరు॥

3. పాడియునుఁ బంతమును బాయిటఁబడీఁ గాని
కూడరాదా నీవు నన్నుఁగోరి మెచ్చేను
వేడుక నేలితివి శ్రీ వేంకటేశ ఇంతలోనే
యీడ నే నలమేల్మంగను ఇంపు నాకుఁ జేసేవు ॥ఇందరు॥

**అర్థములు:** ప. ఇందరు= మీరందరు; సుద్దులు= మంచి మాటలు, ప్రియవచనాలు.

1. తప్పులుదారులు= పొరబాటు మార్గములు; తానె= ఆతడే; తేరీ= ఆరితేరిపోవు; అప్పట= ఆనాటి; ఆయిత్త= సిద్ధం; సన్నాహం; నెప్పున= పాదుకొను, నిజము= స్వభావము; నెరపేవు= నెరవేర్చుకొనేవు; సారెకు= మాటిమాటికి, మళ్ళీ మళ్ళీ.
2. తీపులు గారాలు= మంచి చెడులు; మలయు= తిరుగు, వ్యాపించు; పంతగారి= పట్టినపట్టు వదలని; ఓపిక= శక్తి; ఒడబరచు= ఒప్పించు.
3. పాడి= ధర్మము; పంతము= పట్టుదల; బాయిటబడు= బయటపడు, వెల్లడగు; కూడు= చేరు; వేడుక= ఇష్టము; ఏలు= పరిగ్రహించు; సంతోషము; ఈడ= ఇక్కడ; ఇంపు= సంతోషము.

**భావము:** ఓ స్వామీ! మీరు చెప్పే ఈ ప్రియవచనాలు ఇక్కడున్న అందరూ అందరికీ తెలిసినవే కదా! ఎప్పటిదాకా ఇంకా మమ్మల్ని మాయలలో ముంచెత్తుతావెందుకు?

పొరబాటు దారులన్నింటిలో ఆరితేరి పోయారు గానీ,యింతకీ, విషయమేంటో చెప్పరాదా వింటాను. ఆనాటినుండీ నీవు నాకోసం సిద్ధమై ఉన్నావు. నీ నిజస్వరూప స్వభావాలు పాదుకొని మాటి మాటికీ నెరవేర్చుకొంటున్నావు.

నీ మంచి చెడులు, గుణదోషాలు యిట్టే బయటబడ్డాయి గానీ, ఒక్కసారి నీ ముఖారవిందం చూపించరాదా! సులభంగా పట్టుదలలతోటి తిరుగుతుంటావు. నీ శక్తిమేరకు చెలులను ఒప్పించి తీరుతావు.

ధర్మాధర్మాలు, ఔచిత్యానౌచిత్యాలు ఇట్టే బయటపడ్డాయి కాని, నిన్ను కోరి మెచ్చిన నన్ను చేరరాదా! ఇష్టంతో నన్ను పరిగ్రహించావు. ఇక్కడనేను అలమేలమంగనై ఉన్న నాకు ప్రీతిని కలిగించావు.

**గమనిక :** ఈ కీర్తనలో క్రిందుగీతతో ఉన్న పదాలు రాగిరేకు చిలుము పట్టడం వల్ల అరిగిపోగా కీ.శే.గౌరిపెద్ది రామసుబ్బశర్మ గారు వాటిని పరిష్కరించి అక్కడ ఉండవలసిన పదములను కీర్తననుసరించి చేర్చారు.

## 23

**అవతారిక:** అన్యస్త్రీల విషయంలో అబద్ధాలాడుతున్న స్వామిని అమ్మ ప్రశ్నల మీద ప్రశ్నలు వేసి సుతిమెత్తగా మందలిస్తున్నది.

### పాడి

ప. బొంకని తప్పనియట్టి పురుషుఁడవు
మంకుదీర నీ వెట్లా మాటలాడేవయ్యా ॥పల్లవి॥

1. చనవుచేసుక ఇంతి సారె సొలయఁగా
నునుపుచేసుక నీవు నవ్వఁగాను
మొనసి సవతులెల్లా మోములు చూచుకొనేరు
పొనుగక వారినెట్టు బుజ్జగించేవయ్యా ॥బొంకని॥

2. ప్రియము గూరిచి యాపె బెట్టియాన వెట్టఁగాను
క్రియగూడ నీవు నట్టె కెలయఁగాను
కయిపుగాఁ దోడివారు కనుసన్నలఁ జూపేరు
నయమున వారి నెట్టు నమ్మించేవయ్యా ॥బొంకని॥

3. మక్కువ నిన్నలమేలుమంగ గాఁగిలించఁగాను
నిక్కి శ్రీ వేంకటేశుఁడ నీవు మెచ్చఁగా
తక్కిన సతులెల్లా నాసగించేరు
అక్కరతో వారినెట్టు ఆదరించేవయ్యా ॥బొంకని॥

**అర్థములు:** ప. బొంకు = అసత్యాలు; తప్పనియట = తప్పకుండా చెప్పే స్వభావం గల; మంకు = పట్టుబట్టు.

1. చనవు= ఆప్యాయత; సారె సారె= మాటిమాటికి; సొలయు= బడలిక; అనుపు= సాగనంపు; మొనసి= పూను; పొనుగు= నిస్పృహ.
2. ప్రియము= ప్రేమ; గూరిచి= చేసి; ఆపె= ఆమె; బెట్టియాన = నిష్ఠూరములతో కూడిన ఒట్టు; క్రియగూడ= పనిబడినట్లు; కెలయు= విజృంభించు; కయిపు= మైకం; సన్నలు= సైగలు; నయము= మృదువుగా, అందము.
3. మక్కువ= ప్రేమ, ఆపేక్ష; గాగిలించు= కౌగలించు; నిక్కి= అతిశయము; ఆసగించు= కోరుకొను; అక్కర= ప్రేమ.

**భావము:** స్వామీ! అసత్యాలు చెప్పడం అలవాటున్న మొగవాడివి. పట్టుబట్టి అన్య స్త్రీలతో ఎలా ముచ్చట్లాడేవయ్యా!

మీపై ఆప్యాయతలొలకబోస్తూ ఆమె మాటిమాటికి బడలికలనొందగా, నీవామెను సాగనంపుతూ నవ్వగా, పూనుకుని చుట్టూ ఉన్న స్త్రీలంతా ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు. నిస్పృహ నిరాశలు లేకుండా వారిని ఎలా బ్రతిమాలావయ్యా!

నీమీద ప్రేమతో ఆమె నిన్ను నిష్ఠూరాలాడుతూ ఒట్లు పెట్టగా, పనిబడినట్లుగా నీవు అక్కడ విజృంభించి చెలరేగిపోగా, ఆ మైకంలో మునిగిపోయి తోడివారు కనుసైగలు చేశారు. ఎంతో మృదుత్వం చూపిస్తూ, సుతిమెత్తగా వారినెట్లు నమ్మించగలిగావయ్యా!

ఎంతో ప్రేమతో నిన్ను అలమేల్మంగ కౌగలించుకోగా, అతిశయంతో నీవామెను మెచ్చుకొన్నావు. అక్కడ ఉన్న మిగిలిన స్త్రీలంతా నిన్ను కోరుకోగా, ప్రేమతో వారినెలా మన్నన చేశావయ్యా!

**గమనిక :** ఈ కీర్తనలో క్రిందుగీతతో ఉన్న పదాలు రాగిరేకు చిలుము పట్టడం వల్ల అరిగిపోగా కీ.శే.గౌరిపెద్ది రామసుబ్బశర్మ గారు

వాటిని పరిష్కరించి అక్కడ ఉండవలసిన పదములను కీర్తననుసరించి చేర్చారు.

## 24

**అవతారిక:** ఈ కీర్తనలో అమ్మ అలమేలుమంగ చెలికత్తెలు, అమ్మ యొక్క మన్మథావస్థను వర్ణిస్తూ స్వామితోఆమెను చేపట్టమని వేడుకుంటున్నారు.

### మధ్యమావతి

ప. ఎటువంటి వలపో యెవ్వరికొలఁది గాదు
ఘటనతోఁ దమకించీఁ గనుఁగొనవయ్యా ॥పల్లవి॥

1. తళుకున నిన్నుఁ జూచి తలవంచుకొని యింతి
తలపోసీ నీరూపు తనలోననె
నిలువుఁ జెమటతోడ నిట్టూరుపులతోడ
చెలరేఁగి గుబ్బతిలీఁ జిత్తగించవయ్యా ॥ఎటువంటి ॥

2. కోరి నీపై నాసపడి గొబ్బునను సిగ్గువడి
పేరఁబెట్టి మాటలాడీఁ బెదవులనె
సారపుతురుముతోడ జవ్వనభారముతోడ
ఆరీతి నివ్వెరగందీ నాదరించవయ్యా ॥ఎటువంటి ॥

3. కాఁగిటికిఁ జెయ్యి చాఁచి కన్నులనే నీకు మొక్కి
మాఁగినమోవి యిచ్చీ మతకాననె
చేఁగదేర నిన్నుఁ గూడె శ్రీ వేంకటేశుఁడ
వీఁగ దలమేలుమంగ వినోదించవయ్యా ॥ఎటువంటి ॥

**అర్థములు:** ప. కొలది= పరిమితి; ఘటన= ప్రయత్నం; తమకము= మోహము; కనుగొను= తెలిసికొను.

1. తళుకు= మెరుపు, ప్రకాశము; నిలువు చెమట= నిలువెల్ల చమటతో తడిసి; నిట్టూర్పు= వగర్పు; చెలరేగి= విజృంభించి; గుబ్బటిల్లు= ఉప్పొంగు; చిత్తగించు= సావధానముగా విను.
2. గొబ్బున= త్వరగా; పేరబెట్టి= బెదురుతో; పెదవులనె= పెదవులతో; సారపు= అందమైన; తురుము= కొప్పు; జవ్వన భారము= పెద్దవైన వక్షోజములవలన కలుగు భారము, యౌవన భారము; ఆరీతి= ఆవిధంగా; నివ్వెరగందు= నివ్వెరపడు; ఆదరించు= చేకొను, చేపట్టు.
3. కాగిటికి= కౌగిలికి; మాగిన మోవి= పక్వమునకు వచ్చిన, యౌవన సౌందర్యము; మతకము= స్తబ్ధత; చేగదీరె= పక్వమునకు వచ్చు, చేవదీరు; వీగుట= ఓడిపోవుట; వినోదించు= క్రీడించు.

**భావము:** స్వామీ! ఆమెకు నీపైగల అపరిమిత మోహము ఎటువంటిదో తెలియకుండా ఉన్నది. ప్రయత్నపూర్వకముగా నీవే ఆమె ప్రేమను తెలుసుకోవయ్యా!

మెరుపు లాగా నిన్ను చూసి సిగ్గుతో ఆమె తలవంచుకొంటున్నది. నీ దివ్యమంగళదేహాన్ని తన మనసులో తలుస్తూ, నిలువెల్లా శరీరమంతా చెమటలతో నిండిపోయి వగరుస్తూ ఉన్నది. సావధానంగా విని ఆమెను నీవు విజృంభించి ఉప్పొంగిపోవునటుల చేయవయ్యా!

నిన్ను కోరుకొంటూ నీపై ఆశపడినా త్వరగా సిగ్గుపడిపోతూ, బెదురు పెదవులతో మాట్లాడుతున్నది. అందమైన కొప్పుతోను, యౌవన భారంతో ఆ రీతిగా నివ్వెరపడి చూస్తున్న ఆమెను చేకొనవయ్యా!

ఓ శ్రీవేంకటేశ్వరా! నీ కౌగిలిని చేరడంకోసం రెండు చేతులూ చాచి కండ్లతోనే నమస్కరిస్తూ, బాగా పక్వమైన మోవితేనెను

నీకందివ్వడానికి సిద్ధమైనది. స్తబ్ధతతో దిక్కుతోచక నిన్ను చేరుకోడానికి సిద్ధమై నీకడకు వచ్చింది. ఈ అలమేలుమంగ నీ శృంగార చేష్టలకు అలసి ఓడిపోనటువంటి స్వభావమున్నది కనుక ఆమెతో క్రీడించవయ్యా!

**గమనిక :** ఈ కీర్తనలో క్రిందుగీతతో ఉన్న పదాలు రాగిరేకు చిలుము పట్టడం వల్ల అరిగిపోగా కీ.శే.గౌరిపెద్ది రామసుబ్బశర్మ గారు వాటిని పరిష్కరించి అక్కడ ఉండవలసిన పదములను కీర్తననుసరించి చేర్చారు.

25

**అవతారిక:** ఈ కీర్తనలో చెలికత్తెలు అమ్మ అలమేలుమంగమ్మ భోగాన్ని వర్ణిస్తూ, అయ్యవారిని ఇంతగా ఆకట్టుకున్న నేర్పరివని ప్రస్తుతిస్తున్నారు.

## భల్లాటి

ప. ఏమిటికి మాముందర యెమ్మెలెల్లాఁ జూపేవు
నేమూ నీవలె మేలు నెరపఁగఁగలమే ॥పల్లవి॥

1. చక్కనిదాన వౌదువే సణఁగులాఁడి వౌదువే
నిక్కి విభునిఁ గొసర నేరుతువే
దక్కీనే నీ పంతములు తరుణులలోనెల్లా
మక్కువ నాతని నింత మరిగించుకొంటివి ॥ఏమిటికి॥

2. జవ్వని వౌదువే మంచి జాణకత్తె వౌదువే
రవ్వసేసి భ్రమయించ రాజవే నీవు
నవ్వు లీడేరెనే నీకు నడుమ నిందరులోన
బువ్వాన నీతని నింత పొందుసేసుకొంటివి ॥ఏమిటికి॥

3. మేటి వౌదువే అలమేలుమంగ వౌదువే
పాటించి శ్రీ వేంకటేశుఁ బనిగొంటివి
మాటలు చెల్లె నీకు మావంటివారిలోనెల్లా
చాటున మమ్మేలితని చనవు గై కొంటివి ॥ఏమిటికి॥

**అర్థములు:** ప. ఎమ్మెలు= అనవసర ప్రసంగాలు; నేము= మేము; మేలు= మోహము; నెరపు= కనబరచు.

1. సణగులు= విడవకుండా చెప్పడం, గొణుక్కోవడం; ఔదువే (ఔదువు ం ఏ) = అవుతావే; నిక్కి= అతిశయంచి; కొసర= విజృంభించ; దక్కీనే= నెరవేరేయాయని చెప్పడం; మక్కువ= ప్రేమతో; మరగించు= మోహించు.
2. జవ్వనము= మంచి యుక్త వయసు; జాణకత్తె= సమర్థురాలు; రవ్వ= అల్లరి; భ్రమయించు= భ్రాంతిలో ఉంచు; రాజవు= రాజ సంబంధము, రాణివి; ఈడేరు= నెరవేరుట; నడుమ= మధ్య; బువ్వాన= కలిసిభోజనం చేయు; పొందు= కలయిక.
3. మేటి= గొప్పదానవు; పాటించు= ప్రకటించి; బనిగొను= బంధించు; చెల్లె= నెగ్గు, చెల్లిపోయాయి; చాటువ= ఖ్యాతి; చనవు= అభిమానము.

**భావము:** ఓ కాంతా! ఎందుకు మాముందు అనవసర ప్రసంగాలు చేస్తున్నావు. మేము కూడా నీమాదిరి స్వామిపై మోహము కనబరచగలము కదా!

బాగా అందమైన దానివే! ఇంకా విడవకుండా చక్కగా మాట్లాడే దానివేలే! అతిశయంతో విజృంభించి ప్రాణనాథునిపై కోరిక చూపేదానివేలే! చెలులలో నీ పట్టుదలలన్నింటిని నెరవేర్చుకున్నదానవు. ప్రేమతో ఆతడిని యింతగా మోహపరవశుణ్ణి చేశావు.

మంచి తరుణవయస్సులో ఉన్నదానవు అలాగే మంచి సమర్థురాలివి కూడా! స్వామిని నీ అల్లరిచేతలతో భ్రమలో ముంచెత్తే రాజవంశపు దానవు. మధ్య మధ్యలో నీ దరహాసాలు కురిపిస్తూ నీ కోరికలు నెరవేర్చుకుంటున్నదానవు. కలిసి భోజనం చేస్తూ

అతన్ని ఇంతగా నీ ప్రేమతో బంధించావు.

చాలా గొప్పదానివయ్యావు. అలమేలు మంగవయ్యావు. ప్రకటిస్తూ శ్రీవేంకటేశ్వరుని నీప్రేమతో బంధించావు. మాలాంటి వారిలో నీ పంతం నెగ్గింది. ఖ్యాతి సంపాదించి మము పాలిస్తూ ఇతని అభిమానాన్ని పొందావు.

26

**అవతారిక:** ఈ కీర్తనలో ఒక నాయిక అమ్మ అలమేలుమంగమ్మను స్వామి చేసే శృంగారచేష్టలకు అడ్డుచెప్పడం తగదని హితోపదేశం చేస్తున్నది.

## పాడి

ప. ఎంతైనా నాతఁడు నీకు నెక్కుడుగాదా
కాంతుఁడు మన్నించఁగానే ఘనురాల వైతివి ॥పల్లవి॥

1. వెక్కసములాడకువే విభునితో సారె సారె
మిక్కిలి నాతఁడు నీకు మేలువాఁడు
జక్కవపిట్టలవంటి చన్నులు వి(పి?)సికెనంటా
వుక్క(క్కు?) వంటి గోరనేల వూఁదేవే నీవు ॥ఎంతైనా॥

2. ఆరితేరి యెంచకువే అండనుండి ఇంతలోనె
చేరి నీకు బ్రియములు చెప్పీ నాతఁడు
తోరపు మొయిలువంటితురు మాతఁ దంటెనంటా
బీరానఁ జేతులు చాఁచి పెనఁగుదురటమే ॥ఎంతైనా॥

3. నీ వలమేలుమంగవు నిందలు వేయకువే
శ్రీ వేంకటేశుఁడు నిన్నుఁ జెందినవాఁడు
ఆవటించి నిన్నుఁగూడి యట్టె చెక్కంటెనంటా
కావరించి నీ వప్పటి ఘాతనేయఁదగునా ॥ఎంతైనా॥

**అర్థములు:** ప. ఎక్కుడు = అధికుడు; కాంతుడు = మగడు; ఘనురాలు= మహానుభావురాలు.

1. వెక్కసము= ఎక్కువ; విభుడు= ప్రియుడు; సారె సారె= మాటిమాటికి; మిక్కిలి= ఎక్కువైన; మేలువాడు= శుభము చేకూర్చేవాడు; జక్కువ= చక్రవాక పక్షి; చన్నులు= వక్షములు; వి(పి)సుకు= నొక్కు; ఉక్క(క్కు?)= కఠినమైన లోహము (ఇనుము, కర్బనము కలిపి చేయబడినది) గోర= గోళ్ళచే; ఊదు= అదుము..

2. ఆరితేరు= నిపుణత; ఎంచు= భావించు; అండ= సమీపమునచేరి; ప్రియములు= ఇష్టమైన మాటలు; చెప్పీ= చెప్పుచున్నాడు; తోరము= చక్కని; మెయిలు= మేఘము; తురుము= కొప్పు; అంటు= తాకు; ;రము= అహంకారము; పెనగు= వదిలించుకోవడానికి యత్నించుట.

3. చెందిన= సంబంధించిన; ఆవటించు= కౌగలించు; చెక్కు= చెక్కిలి; అంటెను= తాకెను; కావరించి= పొగరెక్కి, గర్వించి; అప్పటి= ఆసమయమున; ఘాతము= ప్రేమతో వేయు చిన్న దెబ్బలు, గ్రుద్దులు

**భావము:** ఓ లలనా! ఎంతైనా నీకు ఆ శ్రీనివాసుడు అధికమైన ప్రేమ చూపించే వాడే కదా! అలాంటి మగడు నిన్ను గౌరవించగానే మహానుభావురాలవయ్యావు.

నీవు మాటిమాటికి ప్రియునితో అధికంగా మాట్లాడకూడదు. నీకాతడు ఎక్కువ శుభం చేకూర్చేవాడే కదా! చక్రవాక పక్షులవంటి ఆకారంతో గుండ్రంగా ఉన్న నీ వక్షోజాలు నొక్కగానే, కఠినమైన నీ లోహపు గోళ్ళతో విభుణ్ణి అదిమి ఏల బాధించేవు?

గొప్ప నిపుణురాలిలా భావించకు. ఆ విభుడు నిన్ను చేరి నీకిష్టమైన ప్రియభాషణలు చెప్తూ, నీ చక్కని మేఘవర్ణమైన నల్లనైన

కొప్పు తాకగానే, అహంకారముతో చేతులు చాచి అడ్డుమాటలాడుతూ ఆయనను చేతులు తీసివేసే ప్రయత్నం చేస్తావా?

శ్రీనివాసునికి ఎంతో ప్రియమైన ఇల్లాలివి. అలమేలుమంగవు! ఆ శ్రీవేంకటేశ్వరుడు నీకు సబంధించినవాడు. వారు నిన్ను కౌగలించుకొని నీ చెక్కిలి ముట్టుకోగానే, ఆ సమయంలో నీవు పొగరెక్కి, గర్వంతో వారిని చిన్నగా గుద్దులు గ్రుద్దవచ్చునా?

**విశేషాంశాలు:** ఈకీర్తనలో అన్నమయ్య "జక్కవపిట్టలవంటి చన్నులు" అని గొప్ప ప్రయోగం చేశాడు. చక్రవాక పక్షి జంటలు ఉదయం ప్రొద్దులలో జంటగా ఉంటాయి. రాత్రిళ్ళు విరహవేదనను అనుభవిస్తాయి. ఎందుకంటే ఆ పక్షులకి కేవలం వెన్నెలే ఆహారం. వెన్నెల కోసం విడిపోతాయి. అన్నమయ్య ఇక్కడ నాయిక చనుదోయిని జక్కువ పక్షులతో పోల్చి చెప్పడంలో జక్కువ పక్షుల జంటకు ఎడబాటు ఉంటే వుండొచ్చు గానీ ఈ చన్నులజంటకు ఎడబాటు అనేదే ఉండదట. నాయకుని శరీర వెచ్చదనం (సూర్యకాంతి) సోకగానే విరహవ్యధ ఉండదు అని భావంతో గొప్ప ప్రయోగం చేశాడు

**గమనిక:** 1. ఈకీర్తనలో మొదటి చరణములో "విసికెనంటా" అనే ప్రయోగం బహుశః "పిసికెనంటా" అయిఉండనోపు. ఇక్కడ విసుకు అనే పదం కానీ విసుగు అనే పదం కానీ నప్పడం లేదు. బహుశః రాగిరేకు వ్రాయయసగాళ్ళు 'పి' అనే అక్షరాన్ని 'వి' గా ('గుడి' కలిసిపోయి) చెక్కి ఉండవచ్చునని భావిస్తూ మార్చబడినది. 'పిసుకు' అనే ప్రయోగం అన్నమయ్య అనేక కీర్తనల్లో గమనించవచ్చు. ఉదా: 12-431, 14-148, 23-152 మరియూ 28-13.

2. అదే చరణములో "వుక్కవంటి గోరనేల" అనే మాట బహుశః "వుక్కువంటి గోరనేల" అయిఉండనోపు. ఎందువలననగా అన్నమయ్య యిదే విధమైన ప్రయోగం "ఉక్కుగోరు" అనే మాటను "వుక్కుగోరు సోక నీకు ఓ శింగరీ" (7-315) వాడి యున్నాడు.

## 27

**అవతారిక:** ఈకీర్తనలో స్వామి ఎవరితోనో సరస శృంగారాలాడి వచ్చాడని గమనించి, ఆ వివరాలను ఉటంకిస్తూ, ఆ లలనామణి గురించి అమ్మ ఆరా తీస్తున్నది.

## శుద్ధవసంతం

ప. సూటిగా నన్నేమి చూచేవు
నీటుతోడ నన్నీ నేరుపవయ్యా ॥పల్లవి॥

1. నవ్వుతా నిన్ను నాయము లడిగీ-
నెవ్వతో ఆనతి యియ్యవయ్యా
జవ్వని యప్పటి సరిబేసులాడీ
వువ్విళ్లూరఁ బందే లోగి వేయవయ్యా ॥సూటిగా ॥

2. మచ్చికతోడుత మనవి చెప్పీ
విచ్చనవిడిని వినవయ్యా
వచ్చి యాపె నీతో వసంతమాడీ
పచ్చివలపులు పైఁ జల్లవయ్యా ॥సూటిగా ॥

3. పలుమరు నీపైఁ బాటలు వాడీ
మెలుపున నిట్టె మెచ్చవయ్యా
అలమేలుమంగనైన నన్నేలితి-
వెలమి శ్రీ వేంకటేశ నేఁడయ్యా ॥సూటిగా ॥

**అర్థములు:** ప.సూటి= గురిపెట్టి; నీటు= మురిపెము; నేరుపు= సామర్థ్యము.

1. నాయము= యోగక్షేమాలు; ఎవ్వతో= ఎవరో; ఆనతి= సెలవు; జవ్వని= యౌవనములోనున్న స్త్రీ; సరిబేసులాట= ఒక

బాలక్రీడ; వువ్విళ్ళూరు= తహతహలాడు; బందె= బంధించు; ఒగి= సిద్ధపడి.

2. మచ్చిక= మోహము; మనవిచెప్పు= విన్నవించు; విచ్చనవిడి= స్వేచ్ఛాప్రవృత్తి, ఇష్టమొచ్చినవిధంగా; వసంతము= పసుపుసున్నమును కలిపిన ఎర్రనీరు. పచ్చి= లేలేత.

3. పలుమరు= అనేకసార్లు; బాటలు= పాటలు; వాడీ= పాడితిని; మెలుపు= చాతుర్యము; ఎలమి= తృప్తి.!

**భావము:** ఓ స్వామీ! నాపై గురిపెట్టి నన్నెదుకు చూస్తున్నావు? మురిపెముతో నాకు అన్నీ నేర్పింపరాదా!

వలపు నవ్వులు నవ్వుతూ యోగక్షేమాలడిగే ఆమె ఎవరో కొంచెం సెలవియ్యవయ్యా స్వామీ! యౌవనంతో తుళ్ళిపడే ఆ స్త్రీ నీతో బాలక్రీడలుతున్నది. తహతహలాడుతూ ఆమెను నీ కౌగిట్లో బందీని చేయవయ్యా!

మోహముతో విన్నపాలన్నీ చెప్పి స్వేచ్ఛాప్రవృత్తితో తిరుగుతున్న ఆమె నీతో వసంతాలాడుతున్నది, ఆమెపై కాస్తా ప్రేమాదరములు కనబరచవయ్యా!

అనేకసార్లు నీపై పాటలను పాడుతున్నది, జాగ్రత్తగా ఆమెను మెచ్చుకోవచ్చుగదా! ఓ శ్రీవేంకటేశ్వరా! ఇక్కడ నేడు తృప్తితో అలమేలుమంగగా నన్నేలుకుంటున్నావు.

**విశేషాంశములు:** ఈకీర్తన అన్నమయ్య మొదటి చరణములో "సరిబేసులాట" అనే ప్రయోగం చేశాడు. ఇది ఆకాలంలో చిన్నపిల్లలు ఆడుకునే ఆట.

## 28

అవతారిక: ఒక శృంగారనాయిక శ్రీనివాసునితో అమ్మ అలమేలుమంగ మన్మథావస్థ గమనించమని చెప్తూ , వెంటనే కలవమని రాయబారం నెరపుతున్నది.

### దేవగాంధారి

ప. మిక్కిలి మేలుది అలమేలుమంగ
అక్కరతో నిన్నుఁ జూచీ నలమేలుమంగ ॥పల్లవి॥

1. కొచ్చి కొచ్చి యాళా(లా?)పించి కూరిమితోఁ బాడఁగాను
మెచ్చీ నిన్ను నిదె యలమేలుమంగ
నెచ్చెలులతోడనెల్లా నీగుణాలు సారెసారె
అచ్చలాన నాడుకొనీ వలమేలుమంగ ॥మిక్కిలి॥

2. వాడలవాడల నీవు వయ్యాళిఁ దోలఁగాను
మేడలెక్కిచూచీ నలమేలుమంగ
వీడెము చేతఁబట్టుక వెస నీవు పిలువఁగా
ఆడనుండి వచ్చె నీడ కలమేలుమంగ ॥మిక్కిలి॥

3. యీలీల శ్రీ వేంకటేశ ఇంతచన వియ్యఁగాను
మేలములాడీ నల మేలుమంగ
యేలిననీరతులను ఇదె తననేరు పెల్లా
ఆలోచనలు నేసీ నల మేలుమంగా ॥మిక్కిలి॥

**అర్థములు:** ప. మిక్కిలి=ఎక్కువైన; మేలుది=ఉపకారగుణమున్నది. అక్కర=మోజు.

1. కొచ్చి=మొనదేలి యుండు (ఇక్కడ కోరి కోరి అనే అర్థము గ్రహించనగును); ఆలాపించి=రాగమును విస్తరించిపాడు; కూరిమి=ప్రేమ; మెచ్చీ=మెచ్చినది; నెచ్చెలులు=స్నేహితురాండ్రు; సారె సారె=మాటిమాటికి; అచ్చలము=పట్టు.

2. వయ్యాళి (వ్యాహ్యాళి ప్రకృతి – వయ్యాళి వికృతి)=విహారము. తోలు=నడుపు; వీడెము=తాంబూలము; వెస=త్వరపడి.

3. మేలము=పరిహాసము; నేరుపు=నైపుణ్యము; ఆలోచనలు=పరిశీలించు, యోచన

**భావము:** ఓ స్వామీ! ఎంతో ఉపకారమున్న అలమేలుమంగ మోజుతో నిన్నే చూస్తున్నది.

మంచి కంఠస్వరంతో సుశ్రావ్యంగా కోరికోరి గీతాలాలపిస్తుండగా, బాగు బాగుయని మెచ్చుకుంటుంటూ తమనే గమనిస్తున్నది. అలమేలుమంగ తన చెలికత్తెలందరితో మీ సద్గుణాలు మాటిమాటికి మెచ్చుకొంటూ పట్టుగా ఆటలాడుకొనుచున్నది.

తిరుమలగిరి వీధుల్లో నీవు విహరిస్తుండగా, అమ్మ మేడలెక్కి నిన్నే గమనిస్తూ ఉన్నది. నీవు తాంబూలము చేతబట్టుకుని ఇలా పిలవగానే అలా నీదగ్గరకు వచ్చేసింది.

ఈ విధమైన శృంగారచేష్టలతో నువ్వింత అభిమానము చూపగానే నీతో పరిహాస సంభాషణాలు చేస్తున్నది. నైపుణ్యంతోగూడిన రతిక్రీడా విలాసాలతో ఆనందిస్తూ, నిన్ను గురించే అలమేలుమంగ యోచిస్తూ పరిశీలిస్తున్నది.

**విశేషాంశాలు :** అన్నమయ్య ఈ కీర్తన మొదటి చరణములో "కొచ్చి కొచ్చి" అనే వింత ప్రయోగం చేశాడు. వాస్తవానికి "కొచ్చి" అనే మాటకు కొనదేలిన, వాడియైన అన్న అర్థం ఉంది. కానీ అన్నమయ్య ఇంకొక కీర్తనలో "కొచ్చి కొచ్చి తన్ను నేఁ గోపగించఁగా తా నచ్చపు నవ్వులు నవ్వీ నంతె కాదా." (సంపుటి: 15-107) అని కూడా ప్రయోగం చేశాడు. ఇంకా అన్నమయ్య కీర్తనలలో అదే అర్థంతో వాడినట్లు తోస్తున్నది. కనుక ఇక్కడ "కోరి కోరి" అనే అర్థమే సరైనదిగా భావించడమైనది. కాలానుగుణంగా పదాలు అర్థవిపర్యయము చెందడం పరిపాటే!

## 29

అవతారిక: ఈ కీర్తనలో అమ్మ అలమేలు మంగమ్మ శ్రీనివాసుని ద్వాపర యుగపు శ్రీకృష్ణ లీలలు వర్ణిస్తూ, ఇంతమంది గొల్లెతల హృదయాలను ఎలా కొల్లగొన గలిగాడని ఆశ్చర్యం వ్యక్తం చేస్తున్నది.

### శ్రీరాగం

ప. ఎట్టు దరించఁగవచ్చు నిల్లాండ్లకు నూరిలోన
చుట్టమవై సిగ్గులెల్లా చూరలాడేవు ॥పల్లవి॥

1. మాయదారిమాట లాడి మనసులు మరిగించి
పాయపుగొల్లెతలను భ్రమయించేవు
చాయలుసన్నలుఁ జేసి చవులుగా మోవిచూపి
ఆయములు గరగించి ఆసరేఁచేవు ॥ఎట్టు॥

2. సెలవుల నవ్వునవ్వి చిట్టంటుచేఁతలు నేసి
కలికిజవరాండ్లఁ గాఁకరేఁచేవు
ప్రియముల నవ్వునవ్వి పెంపుగఁ గాఁకలముంచి
నయగారితనమున నమ్మించేవు ॥ఎట్టు॥

3. కన్నులఁ దప్పక చూచి కాఁగిటను బిగియించి
కన్నెలనుఁ జొక్కించి కైకొనేవు
అన్నిటా శ్రీవేంకటేశ ఆలమేలుమంగను నేను
మన్నించి నన్ను నేలి మంతనమాడేవు ॥ఎట్టు॥

**అర్థములు:** ప. దరించు=అంగీకరించు; ఇలాండ్లు=గృహిణి; ఊరిలోన=ఈ గోకులంలో ఉన్నటువంటి; చుట్టము=బంధువు; సిగ్గు=లజ్జ, బిడియము; చూరలాడు=ప్రయత్నపూర్వకముగా అభిమానము పొందు

1. మరిగించు=మోహింపజేయు; పాయము=యౌవనము; భ్రమయించు=మైకము; చాయలు=వన్నెలు; సన్నలు=సైగలు; చవులు=కోరికలు; ఆయము=మర్మము; ఆసరేచు=ఆశరేపు.

2. సెలవులు=ఆటవిడుపు; చిట్టంటుచేతలు=చిలిపిపనులు (నఖదంతాది క్షతములు); కలికి=మనోజ్ఞము, అందము; జవరాండ్రు=స్త్రీలు; కాకరేచు=తాపముపుట్టించు; ప్రియము=ఇష్టము; పెంపుగ=ఎక్కువగా; కాక=వేడి; నయగారితనము=మృదువైనపలుకులవాడు.
3. తప్పక చూచు=నిపుణతో చూచుట; కాగిట=కౌగిట; బిగియించి=బంధించి; జొక్కించు=మత్తులో ముంచి; కైకొను=చేకొను; మన్నించి=మర్యాదచూపి; మంతనము=ఏకాంతము, రహస్యము.

**భావము:** ఓ స్వామీ! ఈవూరిలోన ఉన్న గృహిణులను ఎలా అంగీకరింపజేస్తావు? అందరికి చుట్టమై వారి అభిమానాన్ని ఎలా పొందగలుగుతున్నావు? వారి బిడియాన్ని ఎలా దూరం చేస్తావు? నీ లీలలు అర్థం కావు స్వామీ!

నీ మాయమాటలతో వారిని మోహానికి గురిచేసి, మనసు కరిగించి యౌవనంలో ఉన్న గొల్లభామలకు ఏదో మైకము కలిగిస్తావు. నీ వన్నె చిన్నెలు చూపించి సైగలతో నీ సుందరమైన మొహన్ని చూపించి వారి మర్మాలను గ్రహించి, కోరికలతో ఏవో ఆశలు రేపుతుంటావు.

మధ్య మధ్య ఆటవిడుపులతో నవ్వులు చిందిస్తూ ఏవో చిలిపి పనులన్నీ చేసి ఆ సుందరాంగులలో తాపము పెంచుతుంటావు. వారికిష్టమైన నవ్వులతో అధిక కాంక్షలకు గురిచేస్తూ నీ మృదువైన సంభాషణలతో వారిని నమ్మిస్తూ ఉంటావు.

మోహంలో ముంచెత్తే కళ్ళతో బహు నైపుణ్యంతో చూస్తూ వారిని నీ కౌగిట్లో బంధించి, మత్తులో పారవశ్యులను జేసి చేపడుతూ ఉంటావు. ఓ వేంకటేశ్వరా! అందరిలో నేను నీ అలమేలుమంగను, నాపై అనురాగం చూపి ఏకాంతంగా రహస్యాలాడుతున్నావు.

**విశేషాంశాలు:** శ్రీకృష్ణ తత్త్వం అందరికి అంత సులభంగా బోధపడదు. విష్ణుమూర్తి త్రేతాయుగంలో శ్రీరాముడై మానవుడిగానే జీవించాడు. ద్వాపరయుగంలో కృష్ణావతరం పరిపూర్ణావతారం. పుట్టడమే నాలుగు భుజములతో శంఖ చక్ర గదా పద్మములతో పుట్టి సాధారణ మానవుడిగా మారాడు. కృష్ణుడిగా ఎన్నో లీలలు చేసాడు. ఇది రెండు అవతారాల మధ్య ఉన్న తేడా. రాముడి వనవాస కాలంలో ఆయన్ను చూసి మహర్షులు సైతం "పుంసాం మోహన రూపాయ" అన్న చందాన ఆ దివ్యసుందరమైన రూపాన్ని చూసిన మహర్షులు ఒక్కసారి కౌగిలించుకోవలని ఉందనగా, రాముడు రాబోయే యుగంలో ఆ అవకాశం ఇస్తానని చెప్పాడు. ఆవిధంగా ద్వాపర యుగంలో వారంతా గోపికలుగా మారారు. శ్రీకృష్ణుణ్ణి పతిగా పొందాలని, పరమేశ్వరునిలో ఐక్యానికి తపించి తపించి తాపసులయ్యారు. జ్ఞానం పొంది జ్ఞానులయ్యారు. మౌనం వహించి మునులయ్యారు. తర్వాత మహర్షులయ్యారు. కృష్ణపరమాత్మను చేరాలి, ఆయనలో రమించాలి, బ్రహ్మానందాన్ని పొందాలి అని వరంపొంది ఎవరిని చేరితే ఇక మళ్ళీ జన్మ ఉండదొ అటువంటి స్వామిని వారు పొందారు. కృష్ణుడు ఆత్మస్వరూపుడు. వారికి కృష్ణపరమాత్మకు శారీరక సంబంధం ఉండదు. కాబట్టి ఆ గోపిలనతా పరమాత్మను చేరారు తప్ప ఒక వ్యక్తిని కాదు. కృష్ణుడు ఎప్పుడు ఏవరిని మోహించలేదు. అందరు వాసుదేవుణ్ణే మోహించారు. కృష్ణుడు గోపికల సహవాసం ఎన్నడూ కోరుకోలేదు. ఆ గోపికలే కృష్ణతత్వంలో ఆనందించి ఆయన కోసం తపించి పరమాత్మ దగ్గరకు చేరారు. ఆ విషయాన్ని బోధపరచడానికే అన్నమయ్య అలమేలుమంగమ్మతో అలా ప్రశ్నింపజేసి జవాబును వెదుక్కోమని మనకు ఉద్బోధిస్తున్నాడు.

## 30

**అవతారిక:** ఈ కీర్తనలో శ్రీనివాసుడు పరకాంతలతో కూడి చేస్తున్న శృంగారచేష్టలను అమ్మ అలమేలుమంగమ్మ ప్రశ్నిస్తున్నది.

### రామక్రియ

ప. వట్టిబాఁతిపడి నీపై వలపులు చల్లేముగాక
యిట్టయితే మరి యిఁక నేమిచెప్పేదయ్యా ॥పల్లవి॥

1. కాంతను నాయెదుటనె కాఁగిలించుకొంటివి
పంతములాడఁగ నిఁకఁ బనియేది

వింతలుగా సిగ్గులెల్లా విడిచినమీఁదట
యెంతకొసరినా నందు నేమిగలదయ్యా ॥వట్టిబాఁతిపడి॥

2. నావద్దనుండి యాకెతో నవ్వులు నవ్వితివి
భావించి చూచిన నిఁకఁ బనియేది
వేవేలకు మతిలోనివెరపు దీరినమీఁద
చేవమీరినసుద్దులు చెప్పఁ జోటేదయ్యా ॥వట్టిబాఁతిపడి॥

3. చలివాసి యాకెతోనే సరసములాడితివి
పలుమారుఁ బచ్చిసేయఁ బనియేది
అల మేల్మంగనైన న న్నట్టె యేలితివి
యెలమి శ్రీ వేంకటేశ యెట్టు మెచ్చేదయ్యా ॥వట్టిబాఁతిపడి॥

**అర్థములు:** ప. వట్టి=ఏమీలేకుండు, ఉత్త; బాతి=భ్రాంతి, భ్రమ; వలపులు=కోరిక, ప్రేమ; చల్లు=కురిపించు, ఇట్టయితే=ఈరీతిలో ఉంటే.

1. కాగిలించు=కౌగలించుకొను; పంతము=పట్టుదల; పని=అవసరము (నెల్లూరు జిల్ల మాండలికంలో పల్లేదు అనగా అవసరం లేదు అని అర్థం); వింతలు=ఆశ్చర్యము, విచిత్రము; కొసరు=కోరు.
2. ఆకె=ఆమె; భావించు=అనుకొను; పని=అవసరము; వేవేలకు=వేలు వేలుగా; మతిలోని=మనసులోనున్న; వెరపు=అధీనము, వశము; చేవమీరిన=బలమైన, దృఢమైన; సుద్దులు=మంచిమాటలు; చోటు=స్థానం.
3. చలివాసి=బుజ్జగించి; ఆకె=ఆమె; పచ్చిసేయ=అబద్ధమాడు; పని=అవసరము; ఎలమి=సంతోషము; మెచ్చు=శ్లాఘించు, పొగడు.

**భావము:** ఓ స్వామీ! నీవు కల్పించే ఉత్త మాయాజాలంలో చిక్కుకుని నీపై ప్రేమలు కురిపిస్తున్నాము. ఇలా అయితే ఎలా స్వామీ! నేను ఇక మీకేమి నివేదించగలను?

ఒక కాంతను నా ఎదురుగానే నీ కౌగిట్లో బంధించావు. నీతో పట్టుదలలు పెట్టుకునే అవసరం మాకిక ఏమున్నది? చిత్రవిచిత్రంగా సిగ్గు, అభిమానం విడిచిపెట్టాక ఏవిధంగా నిన్ను కోరినా అందులో ప్రయోజనం ఏముటుంది?

నా వద్ద ఉన్నప్పుడే ఆమెతో ముసిముసి నవ్వులు నవ్వావు. ఆలోచించి చూసినట్లైతే ఇంక అవసరమేముంది? నీ మనసులో ఉన్న వేల వేల కోర్కెలు తీర్చుకున్నపిమ్మట ఇంక నీతో గట్టిగా సరస సంభాషణలు జేయడానికి స్థానం ఎక్కడున్నదయ్యా!

బుజ్జగించి, బ్రతిమాలి ఒకామెతో సరసాలాడావు. అనేకసార్లు అబద్ధమాడే అవసరం నీకెందుకయ్యా! ఓ శ్రీనివాసా! అలమేలుమంగనైన నన్ను ఈరీతి ఏలుకొనడానికి చేరుకొన్నావు. ఇక సంతోషంతో నిన్ను ఏవిధంగా పొగడమంటావు.

## 31

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ విభునిపై ఎందుకో కినుక వహించింది. అలకను బూనింది. స్వామి ఎన్నివిధములుగా బుజ్జగించినప్పటికి కోపమేమాత్రం తగ్గలేదని గ్రహించిన చెలులంతా కలిసి స్వామి గుణగణాలను వర్ణిస్తూ ఆయనతో కూడమని చెప్తున్నారు.

## మనోహరి

ప. అలమేలుమంగవు నీ వన్నిటా నేరుపరివి
చలములేఁటికి నిఁక సమ్మతించవే ॥పల్లవి॥

1. విడియము చేతికిచ్చి విభుఁడు వేడుకపడి
వొడివట్టి పెనఁగగా నొద్దనకువే
వుడివోని వేడుకతో నుంగరము చేతికిచ్చి

యెడయక వేడుకొనఁగా నియ్యకొనవే ॥అలమేలు॥

2. చిప్పిలువలపుతోడ చెక్కులు నొక్కుచు మోవిఁ-
గప్పుర మందియ్యఁగాను కాదనకువే
కొప్పు దువ్వి బుజ్జగించి కొసరి మాటలాడి
అప్పసము నవ్వఁగాను అట్టె కానిమ్మనవే ॥అలమేలు॥

3. యిచ్చగించి శ్రీ వేంకటేశ్వరుఁడు నిన్నుఁ గూడి
మచ్చికఁ గాఁగిలించఁగాను మారాడకువే
పచ్చడము మీఁదఁ గప్పి పట్టపుదేవులఁ జేసి
నిచ్చలాన నేలుకొనె నీవూఁ గైకొనవే ॥అలమేలు॥

**అర్థములు:** ప. నేరుపరి=సామర్థ్యముగల, సమర్థతగల; చలము=అదరు, బెదరు; ఏటికి=ఎందుకు; సమ్మంతించు=ఒప్పు, అంగీకరించు.

1. విడియము=తాంబూలము; విభుడు=ప్రియుడు; వేడుక=కుతూహలము, ఇచ్ఛ; వొడివట్టి=కౌగిలిలోకి తీసుకొను; పెనగు=చుట్టుకొను; ఉడివోని=పొల్లుమాటలు కానివి; వేడుక=ఇష్టము; వేడుకొను=ప్రార్థించు; ఇయ్య=అంగీకరించు.
2. చిప్పిలు=పైకిపొంగు; చెక్కులు=చెక్కిళ్ళు; కప్పురము=కర్పూరతాంబూలము; బుజ్జగించి=బ్రతిమాలి; కొసరి=ప్రార్థించు, వేడుకొను; అప్పసము=ఎల్లవేళల; అట్టే=అలాగే.
3. ఇచ్ఛగించు=ఆపేక్షపడు; కూడి=చేరి; మచ్చిక=మోహము; కాగిలించు=కౌగలించు; మారాడు=బదులుచెప్పు; కాదను; పచ్చడము=పైన కప్పుకొను వస్త్రము; పట్టపు దేవుల=పట్టపు రాణిని; ఇచ్చలాన=సంపూర్తిగా ఇష్టంతో; ఏలుకొను=పాలించు; కైకొను=గ్రహించు.

**భావము:** తల్లీ! నీవు అలమేలుమంగవు. శ్రీవారికి రాణివి. నీవు అన్నికళలలోను నైపుణ్యం ఉన్నదానవు. స్వామివారి పట్ల బెదురుచూపులు మాని, ఆయనను పొందడానికి ఎందుకు అంగీకరించవో తెలియడంలేదు.

నీ ప్రియుడు కుతూహలంతో తాంబూలము చేతికిచ్చి, నీ పైటచెంగుపట్టి నిన్ను చుట్టుకోవడానికి ప్రయత్నించినప్పుడు వద్దని అనవద్దు. ఏమీ మాట్లాడకుండా నీపై తదేక దృష్టిపెట్టి, ఆనందంతో తన వ్రేలి ఉంగరము నీకిస్తూ నిన్ను వేడుకొంటూ ఉండగా అంగీకరించవలెగదా?

పొంగిపొరలుతున్న ప్రేమాతిశయంతో నీ చెక్కిళ్ళు వత్తుతూ నీ నోటికి కర్పూరతాంబూలం అందిస్తుండగా కాదనవద్దు. నీ కొప్పు బాగా దువ్వి, నిన్ను బ్రతిమాలి, ప్రార్థనా పూర్వకంగా వేడుకుంటూ సరస సంభాషణలతో ఎల్లవేళలా నవ్వులు చిందిస్తూ ఉన్నాడు కదా! అలాగే కానివ్వు అనవే!

ఆ శ్రీవేంకటేశ్వర స్వామి ఎంతో అపేక్షతో నిన్ను చేరి, మోహంతో కౌగలించడానికి యత్నించినప్పుడు బదులు చెప్పి, వద్దని మాట్లాడతగదు. ఆయన పై వస్త్రము ఎంతో ప్రీతితో నీపై కప్పి నిన్ను పట్టపురాణిని చేశాడు. ఇష్టంతో నిన్ను ఏలుకొంటున్న స్వామిని నీవు కూడా చేపట్టవే!

## 32

**అవతారిక:** ఈ కీర్తనలో అమ్మ అలమేలుమంగమ్మ స్వామిని కూడిన ఏకాంత సమయాల్లో కూడా చెలులు వీడిపోకుండా ఏవో చిలిపి పనులకు దిగుతున్నారు. స్వామి చిరునవ్వులు చిందిస్తూ వినోదం చూస్తున్నారు. అమ్మ స్వామితో ఇది తగునా అని అడుగుతున్నది.

### కురంజి

ప. ఇంత కాకు గలదా యేమోయి చెలులను
చెంతల మందెమేళాలు సేసుకొంటి విట్లా ॥పల్లవి॥

1. యేకతాన నీవు నాకు నిట్టె కతలు చెప్పఁగా

దాకొని సతులెల్లాను తామూ వినేరు
జోకతో నీవు విడేలు సొరిది నా కందియ్యఁగా
చేకొని తామూ నట్టె చేతులు చాఁచేరు ॥ఇంత॥

2. సరసమాడుచు నా చన్నులు నీవంటఁగాను
సొరిదిఁ దమచన్నులు చూపేరు నీకు
తెరలో నాకు నీ మోవితేనె విందు వెట్టఁగాను
గరిమఁ దామును నట్టె కడునోరూరేరు ॥ఇంత॥

3. పలుమారు నీవు నాకుఁ బచ్చడము గప్పఁగాను
కలికికాంతలు తమ్మూఁ గప్పుమనేరు
ఆల మేల్మంగనై న న్నట్టె నీవు కూడి తేను
నెలవై శ్రీ వేంకటేశ నిన్నుఁ దామూ కూడేరు ॥ఇంత॥

**అర్థములు:** ప. కాకు=అలజడి, అల్లరి; చెంతల=చేరువ; మందెమేళాలు=అధిక చనువుతో గూడిన సఖ్యత.

1. ఏకతాన=ఒకని మీదనే నమ్మకముంచినవాడు, అనన్యచిత్తుడు; దాకొను=మరుగున ఉండు; సతులు=చెలులు; జోక=సహాయము; విడెము=తాంబూలము; సొరిది=వరుసగా;
2. అంటు=తాకు; మోవితేనె=అధరామృతము; గరిమ=దొడ్డతనము; కడు=ఎక్కువ; నోరూరు=రుచిగల వస్తువులు తినుకోరికచే నోటనీళ్లూరు, కోరుకొను.
3. పచ్చడము=పైన కప్పుకొను వస్త్రము; కలికికాంతలు=అందమైన ఆడువారు; తమ్మూ=తమకుకూడా; కూడు=పొందు; నెలవు=చోటు చూసుకొని; కూడు=చేరు.

**భావము:** ఓ శ్రీనివాసా! నీలో చెలులను ఇంతగా అల్లరిపెట్టే స్వభావమున్నదా! అధికచనువుతో వారిపట్ల సఖ్యత కనబరుస్తూ ఉన్నావు.

నామీదనే ధ్యాస ఉన్నవానివలె నాకు ఏవేవో కబుర్లు, కథలు చెప్తూ ఉండగా మరుగున దాగి చెలులంతా ఆ కబుర్లు తామూ వింటున్నారు. నాకు సహాయమందిస్తూ నాకు తాంబూలము ఇవ్వగానే నేను తీసుకోగా వారూ తాంబూలనికై చేతులు చాస్తున్నారు.

సరసల్లాపాలతో నా వక్షోజాలు స్పృశించగానే వాళ్ళు కూడా తమ వక్షోజాలనందుకోమన్నట్లుగా నీకు చూపిస్తున్నారు. తెరగట్టి మరుగున నాకు నీ అధరామృతాన్నందించగా దొడ్డతనంతో వాళ్ళు కూడా కోరికతో నోరూరింపజేసుకుంటున్నారు.

నీవు అనేకసార్లు నీపైవస్త్రాన్ని నాకు కప్పగా, ఆ అందమైన యువతులు మాకు కూడా కప్పమని అడుగుతున్నారు. ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు అలమేలుమంగనైన నన్ను ఆవిధంగా చేరగా వారు కూడా చోటు చేసుకొని ఇక్కడికే చేరుతున్నారు.

## 33

**అవతారిక:** ఈ కీర్తనలో అన్నమయ్య తానే ఒక చెలికత్తెగా మారి స్వామివారితో తక్కిన కాంతలు చేస్తున్న శృంగార చేష్టల విశేషాలు గోవిందరాజా అంటూ వివరిస్తూ, తనకోసం శ్రీదేవి, భూదేవీ ఎదురుచూపులు చూస్తున్నారని చెప్తున్నాడు.

### దేసాళం

ప. కొలువులోపలనున్న కొమ్మలెల్లా నవ్వేరు
కొలఁది మీరకువయ్య గోవిందరాజా ॥పల్లవి॥

1. పాదములొత్తేయట్టి పడఁతికి నిదివొ
ఆదిగొని చెమరించె నంగమెల్లాను
కాదనక పచ్చడము గప్పి మఱఁగుననె

పోదితో నాపెఁదనివి బొందించవయ్యా ॥కొలువు॥

2. సరుసఁ గూచుండినట్టి సకియకు నిదివొ
సిరులుగాఁ బులుకించె చెక్కులెల్లాను
తెరవేసుకొని సిగ్గుదేరిచి గుట్టుననె
గరిమతో లోలోనె కాఁగిలించవయ్యా ॥కొలువు॥

3. శ్రీసతికి భూసతికిఁ జేరి కూడఁగ నిదివొ
రాసి నిట్టూర్పులు మించె రతులలోనా
ఆసతోడుత శ్రీ వేంకటాద్రి గోవిందరాజ
లేసుగా నిద్దరిని లాలించఁగదవయ్యా ॥కొలువు॥

**అర్థములు:** ప. కొలువు=సేవ; కొమ్మలు=ఆడువారు; కొలదిమీరు=మితిమీరు;

1. ఆదిగొని=పొంచి, కన్నువేసి యుండు; చెమరించు=స్వేదముతో నిండు; అంగము=శరీరము; పచ్చడము=పైనకప్పుకొను వస్త్రము; మఱుగున=మాటున, లోపల; పోది=వైభవము; పొందించు=కలుపు.
2. సరుస=ప్రక్కన; సకియ=చెలికత్తె; సిరులుగా=శోభగా; పులక=గగుర్పు;చెక్కులు=చెక్కిళ్ళు; తెరవేసుకు=తెరవేసుకుని; సిగ్గుదేరిచె=సిగ్గును తెలికపడునట్లు చేయు; గుట్టు=రహస్యము; గరిమ=గొప్పదనము; లోలోనె=తెరల లోపలనే; కాగిలించు=కౌగలించు.
3. శ్రీసతి=లక్ష్మీదేవి; భూసతి=భూదేవి; కూడగ=చేరగ; రాసి=అధికమైన; ఆస=ఆశ; తోడుత=కూడుకొని; లేసు=మృదువు; లాలించు=బుజ్జగించు.

**భావము:** స్వామీ! ఓ గోవిందరాజా! నీ సేవలోనున్న చెలులెల్లా నవ్వుతున్నారు. నీ చేతలు మితిమీరకుండా చూసుకోవయ్యా!

ఇదిగో చూడవయ్యా! నీపాదములు వత్తేటి స్త్రీ యొక్క శరీరం మొత్తం తాపంతో చెమటలు పడుతున్నాయి గమనించవయ్యా! ఆమెను కాదనకుండా నీ పై వస్త్రము కప్పి, ఆ మాటున ఆమెతో నీ పెదవులను వైభవంగా కలపవయ్యా!

నీప్రక్కన కూర్చున్న కాంతను గమనించావా! శోభతో సిగ్గెక్కి ఆమె చెక్కిళ్ళు ఎరుపెక్కుతున్నాయి. తెరవేసుకొని ఆమె సిగ్గును పోగొట్టవయ్యా! నీ లీలలు గొప్పదనాలు చూపించి తెరమాటునే లోపలే ఆమెను కౌగలించుకోవయ్యా!

శ్రీదేవి భూదేవీ సమేతుడైన శ్రీవేంకటేశ్వరా! వారిద్దరూ అపరిమితంగా ఉచ్ఛ్వాస, నిస్స్వాసలతో నిట్టూర్పులు విడుస్తూ నీ రతికేళీవిలాసం కోసం ఆశతో ఎదురుచూపులు చూస్తున్నారు, మృదువుగా వారిద్దరిని బుజ్జగించవయ్యా!

**విశేషాంశాలు:** భగవద్ రామానుజాచార్యుల వారు ప్రస్తుతం తిరుపతి నగరం నడిబొడ్డున ఉన్న గోవిందరాజస్వామి ఆలయానికి పునాది వేశారు. ఈ నగరాన్ని ఆధ్యాత్మిక కేంద్రంగా మార్చారు. ఏడుకొండల మీద నున్న తిరుమల ఆలయంలో సమతా ధర్మాన్ని స్థాపించి, పూజా కైంకర్యములను రూపొందించిన భగవద్ రామానుజులు తిరుమల తిరుపతి రెండు నగరాలకు మూలకర్తగా నిలిచారు. క్రమంగా చుట్టూ పెద్ద అగ్రహారాన్ని నిర్మించి దానికి తన గురువు పేరిట రామానుజపురం అని నామకరణం చేశారు. అందుకే ఇది చాలా కాలం పాటు రామానుజపురంగా గౌరవించబడింది. ఈ పట్టణాన్ని మొదట గోవిందరాజపట్టణం అని, తరువాత రామానుజపురం అని, 13వ శతాబ్దం ప్రారంభం నుండి తిరుపతి అని పిలుస్తున్నారు. అందుకే అన్నమయ్య వేంకటాద్రి గోవిందరాజని సంబోధించారు.

## 34

**అవతారిక:** ఈ కీర్తనలో అమ్మ అలమేలుమంగమ్మ దక్షిణ నాయకుడైన శ్రీనివాసుని మితిమీరిన శృంగార చేష్టలను అభివర్ణిస్తూ పరోక్షంగా ఇది నీకు తగునటయ్యా అని అడుగుతున్నది.

### వరాళి

ప. ఎంతలేదు నీ యాసోద మేమిచెప్పేది

బంతినుండి రతులకే బాంతిపడేవు ॥పల్లవి॥

1. చెలులై తేంజాలు నట్టె చేరి యెంతవడియైనా
మలసి మలసి నీవు మాటలడేవు
కొలందిమీరినయట్టి కుచములు గంటేంజాలు
యెలమి నూరకయైనా యేంకారేవు ॥ఎంతలేదు॥

2. తప్పకం జూచితేంజాలు తనియక మీంద మీంద
వుప్పతిలుందమకాన నోలలాడేవు
చిప్పిల నవ్వితేంజాలు చెంతల నట్టె భ్రమసి
వొప్పగు మోవితేనెకు నొగి నోరూరేవు ॥ఎంతలేదు॥

3. కాంగిలించుకొంటేంజాలు కడు సంతోసముతోడ
చేంగదేరి వలపులు చిమ్మిరేంగేవు
వీంగక శ్రీవేంకటేశ వెస నన్నుం గూడితివి
పాంగినతరితీపులం బచ్చిదేరేవు ॥ఎంతలేదు॥

**అర్థములు:** ప.ఆసోద=కోరిక; బంతి=నలుగురితో మాట్లాడు; బాతి=అధికము, ప్రియము.

1. వడి=వేగము; మలసి=చెలరేగి; కొలదిమీరు=పెద్దవైన; కంటేచాలు=చూస్తేచాలు; ఎలమి=సంతోషము; ఊరక=ఏమీమాట్లాడకుండా; ఏకారు=ఎక్కుగా కోరుకొను.
2. తనియక=తృప్తిపడక; ఉప్పతిల్లు=పుట్టు; తమకము=మోహము; ఓలలాడు=మునిగితేలు; చిప్పిల=పైకి ఉబుకు; చెంతల=దగ్గరగా; భ్రమయు=మత్తెక్కు; ఒప్పగు=తగియుండు; మోవితేనె=అధరామృతము; ఒగి=క్రమముగా, చక్కగా; నోరూరు=ఇష్టపడు.
3. కాగిలించు=కౌగలించుకొను; చేగదేరి=ధైర్యము; చిమ్మి=ఒలకజేయు; రేగు=రెచ్చిపోవు, వ్యాపించు; వీగు=తగ్గు; వెస=వేగము; కూడు=చేరు; పాగు=చిక్కనైన; తరితీపు=అపేక్ష, ప్రేమ; పచ్చితేరు=మరుగులేకుండుట.

**భావము:** ఓ స్వామీ! ఎంతని చెప్పనయ్యా నీ ఆశలు, కోరికలు, అంతులేకుండా ఉన్నవి. పర స్త్రీలతో మాటలాడుతూనే అధికమైన రతిక్రీడా లీలలకు మోజు చూపిస్తున్నావు.

స్త్రీలైతే చాలు! వారు ఎక్కడున్నా సరే! వెంటనే వాయువేగంతో వాలిపోయి ఆ బంతిలో చేరి వారితో చెలరేగిపోయి మాట్లాడుతావు. బలిసిన వారి వక్షోజాలను చూస్తే చాలు సంతోషంతో మరుమాటాడకుండా వారిని ఎక్కువగా కోరుకొంటూ ఉ ంటావు.

వాళ్ళను చూడడంతో తృప్తి పడకుండా వారి పైపైన బడి, నీలో పుట్టే మోహంతో మునిగితేలుతుంటావు. వారు పైకి సంతోషం కనబరిస్తే చాలు వారిని సమీపించి వారికి మత్తెక్కించి, వారి అధరామృతపానానికి ఆసక్తిని చూపిస్తుంటావు.

వారు కౌగలించుకుంటే చాలు, అమితానందంతో ధైర్యంతో నీ ప్రేమాభిమానాలు ఒలకబోస్తూ రెచ్చిపోతావు. ఓ శ్రీవేంకటేశ్వరా! ఏమాత్రం తగ్గకుండా వేగముగా నన్ను చేరుకున్నావు. చిక్కనైన అపేక్షతో మరుగేమీ లేకుండా ప్రవర్తిస్తుంటావు.

## 35

**అవతారిక:** ఈ కీర్తనలో ఒక నాయిక అలమేలుమంగమ్మను, నీ అందచందాలు, లావణ్యాలు చూపించి, స్వామిని కొంగుకుముడివేసుకున్నావని హాస్యమాడుతున్నది.

### ముఖారి

ప. ఏమే విభునినేల యెలయించేవే నీ–
మోమున సింగారాలు మొలచున్నవి ॥పల్లవి॥

1. సెలవుల నొకమాటు చేరి నీవు నవ్వితేనే
వెలలేని మహిమల వెన్నెల గాయు
తళుకున నీవటు తప్పక చూచితేనే
నిలువెల్లాఁ జీఁకటుల నిగ్గుదేరును ॥ఏమే॥

2. మురిపేన వాతెరమోవి నీవు చూపితేనే
సొరిదినే పగడాలసోంపు నిండును
మరుగుచు నీవిట్టె మాటలు సారె నాడితే
యిరవై కప్రపుపల్కులిటు నిండును ॥ఏమే॥

3. సందడి నీపయ్యదలో చన్నులు చూపితేనే
కుందణం(నం?)పువన్నెలెల్లా గుదిగొనును
కందువ శ్రీవేంకటేశుఁ గాఁగిట నీవు గూడితే
యెందు నలమేల్మంగ నీయిరవు గాన్పించును ॥ఏమే॥

**అర్థములు:** ప.వెలయించు=సంతోషపెట్టు; సింగారాలు=అలంకారములు; మొలుచు=పైకికనిపించు.

1. సెలవు=ఆజ్ఞ; మహిమల వెన్నెల=గొప్పదనాల కాంతి; కాయు=వ్యాపించు; తళుకు=ప్రకాశవంతము; నిలువెల్లా=మొత్తం; నిగ్గు=గొప్ప; తేరును=వ్యాపించును.

2. మురిపేన=సరసముతో; వాతెర=అధరము; మోవి=మొహం; సొరిది=వరుస, క్రమము; పగడాలసొంపు=పగడములవంతి దంత సౌందర్యం; నిండు=వ్యాపించు; మరుగు=ఆశపడు; సారె=మాటిమాటికి; ఇరవు=స్థానము; కప్రపుపల్కు=కర్పూరసుగంధముతో గూడిన మాట; నిండు=వ్యాపించు.

3. సందడి=అతిశయము; కుందనపు వన్నె=మేలిమిబంగారము ఛాయ; గుదిగొను=దట్టముగావ్యాపించు; కందువ=ఏకాంతము; కాగిట=కౌగిట; గూడు=చేరు; ఎందు=ఎక్కడ; ఇరవు=స్థానము.

**భావము:** ఏమమ్మా! అలమేలుమంగా! నీ స్వామినెలా సంతోషపెట్టావమ్మా? నీ మొహంపై అలంకారాలన్నీ స్పష్టంగా కనిపిస్తున్నాయి.

ఆతని అనుజ్ఞచేత నీవొకసారి ఆ స్వామిని సమీపించి నవ్వగానే గొప్ప కాంతిరేఖలు అక్కడ వ్యాపిస్తాయి. ప్రకాశంతో వెలిగిపోతూ నీవలా స్వామిని చూడగానే, అక్కడ ఆవరించిన చీకట్లు మొత్తం మటుమాయమై గొప్ప వెలుగురేఖలు వ్యాపిస్తాయి.

సరసంతో నీ అధరాన్ని చూపిస్తేనే నీ దంత సౌందర్యం పగడాల కాంతితో నిండిపోతుంది. ఆశపడి నీవు మధురంగా మాటిమాటికి మాట్లాడుతూ ఉంటే కర్పూర సుగంధాల పరిమళం అక్కడ వ్యాపిస్తుంది.

అతిశయంతో నువ్వు నీపయ్యెదలోనున్న వక్షోజాలు చూపించినట్లైతే అక్కడంతా మేలిమి బంగారు ఛాయ వ్యాపిస్తుంది. ఏకాంతములో నీవు శ్రీవేంకటేశ్వరుని కౌగిట్లో చేరితే ఇక ఎక్కడమ్మా నీ ఆనవాలు కనిపించేది?

## 36

**అవతారిక:** ఈ కీర్తనలో ఒక నాయిక శ్రీనివాసునికి అమ్మ అలమేలుమంగమ్మ మీద ఉన్న ప్రేమను వర్ణిస్తూ స్వామిని సంతోషభరితుణ్ణి చేస్తున్నది.

### సింధురామక్రియ

ప. ఎంత వేడుకకాఁడవు ఇన్నిటా నీవు
సంతసించేవు మోహము చల్లినంతనె ॥పల్లవి॥

1. వన్నెవచ్చె మేనికిని వాడుదేరె మోమెల్ల
కన్నులను నాపె నీవు గాంచినంతనె

చెన్నుమీర సంతోసాన చెక్కులెల్లాఁబులకించె
పన్నుగా నాకెమాటలు విన్నంతనె ॥ఎంత॥

2. ఆసవుట్టి మనసుకు అరిమురిఁ జెమరించె
సేసవెట్టి యాపె నిన్నుఁ జేరినంతనె
వాసిమీర పైపైనే వలపులు గడుమించె
చేసన్నలు నీయెడకుఁ జేసినంతనె ॥ఎంత॥

3. నిట్టూరుపులు రేఁగె నిండుఁదమకము నిండె
గుట్టుతోడ నీవు రతిఁ గూడినంతనె
అట్టె శ్రీవేంకటేశ ఆనందము గడునుబ్బె
చుట్టి ఆ కెఆయములు సోఁకినంతనె ॥ఎంత॥

**అర్థములు:** ప. వేడుకకాడు=విలాసవంతుడు; మోహము=వలపు; చల్లు=కురిపించు.

1. వన్నె=అందము, కాంతి; మేను=శరీరము; వాడుదేరు= ప్రకాశవంతమగు; ఆపె=ఆమె; కాంచు=చూచు; చెన్ను మీరు=ఒప్పు; చెక్కులు=చెక్కిళ్ళు; పులకించె=గగుర్పాటు, అదిరిపడు; పన్ను=సిద్ధపడు; ఆకె=ఆమె.
2. ఆశ=కోరిక; అరిమురి=శీఘ్రముగ, తొందరగా; చెమరించు=చెమటలు పోయు; సేస=అక్షింతలు; ఆపె=ఆమె; వాసిమీరు=పరిమితిని దాటు; పైపైన=సులభముగ; వలపు=అపేక్ష, ప్రేమ; కదు మించె=ఎక్కువాయెను. చేసన్నలు=చేతితో చేయు సైగలు;
3. నిట్టూరుపులు=దీర్ఘ నిశ్వాసలు; రేగె=వచ్చు; తమకము=మోహము; నిండు=కలుగు; గుట్టు=రహస్యము; రతికూడు=రతిక్రీడ; ఉబ్బె=పొంగు; చుట్టి=కౌగలించి; ఆకె=ఆమె; ఆయములు=మర్మస్థానములు; సోకు=తగులు.

**భావము:** స్వామీ! ఎంత విలాసవంతుడవయ్యా నీవు! అమ్మ అలమేలుమంగమ్మకాస్తా వలపు కురిపించినంతమాత్రాన ఎంతెంత పరమానంద భరితుడవవుతున్నావు.

నీ కన్నులు ఆమెను చూచినంతనే, నీ శరీరంపై వింత కాంతులు వెల్లివిరిస్తూ, నీ మొహమెంతో ప్రకాశిస్తూ ఉన్నది. ఆమె మాటలు శ్రద్ధగా వినగానే సంతోషంతో నీ చెక్కిళ్ళు అదిరిపడి గగుర్పాటు పొందుతున్నాయి.

ఆమె అక్షతలు వేసి నిన్ను చేరగానే నీ మనసు కోరికలతో గూడి, త్వరగా చెమటలు పడుతున్నాయి. నీకు చేతితో సైగలు చేయగానే నీకామెపై వలపు అధికమైనది.

ఓ శ్రీవేంకటేశ్వరా! నీవామెను రహస్యంగా చేరగానే నిశ్వాసలు ఎక్కువయి మోహం అధికమయింది. ఆమెను కౌగిలిలో చుట్టుకొని బంధించి, ఆమె శరీరభాగాలు తాకగానే నీ ఆనందం రెట్టింపై పొంగి పొరలుతున్నది.

## 37

**అవతారిక:** ఈ కీర్తనలో ఒక శృంగార నాయిక సతిపతులిద్దరు కొంత ఎడబాటు తర్వాత కలిసినప్పుడు కలిగే ఆనందాన్ని స్వామికి నివేదిస్తున్నది.

### ఆహిరి

ప. ఎడసి కూడిన పొందు ఇంపులాయను
తడవి మీ భావములు తలపోసేమయ్యా ॥పల్లవి॥

1. చెక్కునఁ బెట్టినచెయ్యి సెలవిఁ బారేటినవ్వు
వొక్కమాటే చెలియకు నొనగూడెను
నిక్కపువోరమణుఁడ నీమహిమలే ఇవి

మిక్కిలి మాలో నేమే మెచ్చుకొనేమయ్యా ॥ఎడసి॥

2. మేర మీరు నిట్టూర్పులు మితిమీరు తమకము
యీరెండు నింతికి నిట్టె ఇరవాయను
ఆరయ వోరమణుడ అమరించితివి రీతి
యేరుపరచి మీసుద్దు లెంచుకొనేమయ్యా ॥ఎడసి॥

3. పయ్యదలెడజారును పచ్చిదేరే రతిచొక్కు
నెయ్యపుఁ గామిని కిట్టె నెలవాయను
యియ్యెడ శ్రీవేంకటేశ యెనసితి వింతలోనె
చయ్యన మిమ్ముఁ బొగడి సంతోసించేమయ్యా ॥ఎడసి॥

**అర్థములు:** ప.ఎడసి=ఎడబాటు; పొందు=కలయిక; ఇంపు=ఇష్టము; తడవి=ప్రయత్నించి; భావములు=అభిప్రాయములు; తలపోయు=విచారించు.

1. చెక్కు=చెక్కిలి; సెలవి=పెదవి మూలగా; పారు=సాగు; ఒక్కమాటి=ఒక్కసారి; ఒనగూడు=సిద్ధించు; నిక్కము=యదార్ధము; రమణుడు=సుదరుడు; మిక్కిలి=ఎక్కువ.
2. మేరమీరు=అతిక్రమించు; నిట్టూర్పు=నిశ్వాస; మితిమీరు=అధికమగు; తమకము=మోహము; ఇరవు=స్థానము; ఆరయ=విచారించు; రమణుడు=మనోహరరూపుడు; అమరించు=ఏర్పరచు; యేరుపరచు=వింగడించు, విడివిడిగా చూచు; సుద్దులు=మంచిమాటలు; ఎంచుకొను=ఎన్నుకొను.
3. పయ్యెద=పైట; ఎడజారు=స్థానంతప్పు; పచ్చిదేరు=ఆర్ధము, తడిగల; చొక్కు=మైకము, మత్తు; నెయ్యము=ఇంపు; కామిని=వలపుకత్తె; నెలవు=స్థానము; యెనయు=కలియు; చయ్యన=త్వరపడి.

**భావము:** స్వామీ! ఎడబాటుతో గూడిన కలయిక ఎప్పుడూ అమిత సంతోషాన్నిస్తుంది. మేమెల్లవేళలా మీ యిరువురి శృంగార భావములనే తలపోస్తుంటాము.

చెక్కిలిపై బెట్టుకొన్న చెయ్యి, పెదవిమూలగా సాగే చిరునవ్వులు రెండూ కలసి ఒక్కసారే చెలికి సిద్ధించాయి. సుందరా! వాస్తవానికి ఇవన్నీ నీ మహిమలే సుమా! ఇవన్నీ మాలో మేమే మెచ్చుకుంటూ ఉంటామయ్యా!

అవధిదాటి వస్తున్న నిశ్వాసలు అధికమైన మోహము ఈ రెండూ ఆ రమణికి నెలవయ్యాయి. ఓ మనోహరా! ఆలోచించి చూస్తే ఇవన్నీ నీవలన కలిగినవే సుమా! నీ లీలలు మాటలు మేము ఎన్నని లెక్కించేమయ్యా!

పైటకొంగు స్థానం తప్పడం ఆర్ధమైన నీ శృంగార చేష్టలు మైకం కల్గించడం, నీతో కూడిన ఆ వలపుకత్తెకు స్థానమయ్యాయి. ఓ వేంకటేశ్వరా! ఇక్కడ ఇంతలోనే ఆమె పొందు గూడావు. ఇవన్నీ వీక్షిస్తున్న మేము నిన్ను వెంటనే పొగడి కీర్తించి సంతోషం పొందుతామయా!

**విశేషాంశములు:** అన్నమయ్య పల్లవిలో "మీ భావములు తలపోసేమయ్యా" అంటూ భావప్రస్తావన తెచ్చాడు. భావమనగా రసజ్ఞానయోగ్యత అని లక్షణము. బాల్య యౌవన సంధియందు శృంగార భావములు ఉత్పన్నమగు అంతఃవికారములు అష్టాదశవిధములని ప్రతాపరుద్రీయములో చెప్పబడింది. అవి 1. భావము, 2. హావము, 3. హేల, 4. మాధుర్యము, 5. ధైర్యము, 6. లీల, 7. విలాసము, 8. విచ్ఛిత్తి, 9. విభ్రమము, 10. కిలికించితము, 11. మోట్టాయితము, 12. కుట్టమితము, 13. బిబ్బోకము, 14. లలితము, 15. కుతూహలము, 16. చకితము, 17. విహృతము, 18. హాసము.

## 38

**అవతారిక:** ఈ కీర్తనలో స్వామిపై అలిగి కోపించిన అలమేలుమంగమ్మను ఒక నాయిక ఇలా చెయ్యడం తగునా? అంటూ

సుతిమెత్తగా అమ్మను మందలిస్తున్నది.

### బౌళి

ప. చెక్కునొక్కి ఇచ్చకము సేతురుగాక
వెక్కసపుఁ సేతలను వింత సేతురా ॥పల్లవి॥

1. వలచిన రమణుండు వాడికెకు నీమీద
కలువల వేసితేను కాతాళింతురా
తలుపుదెరచి నీదండ గూచుండినవాని
చలపట్టి బొమ్మలను జంకింతురా ॥చెక్కునొక్కి॥

2. పొంద్దైనమగవాడు బుజముపైఁ జెయివేసి
కందువ లంటితేనే కాదందురా
విందులవోవి చూపి విడెమడిగేటివాని
మందెమేళములాడుచు మారుకొందురా ॥చెక్కునొక్కి॥

3. శ్రీవేంకటేశుఁడు చేరి నిన్ను గాఁగిలించి
ఆవటించి కూడితేనే అలయుదురా
దేవులవంటా నిన్నుఁ దెగడి నవ్వించేవాని
కావరపుఁజూపు చూచి కాతరింతురా ॥చెక్కునొక్కి॥

**అర్థములు:** చెక్కు=చెక్కిలి; ఇచ్చకము=మోహము; వెక్కసము=అధికము; వింత=చిత్రము.

1. రమణుడు=మనోహరుడు; వాడిక=మచ్చిక; కతాళించు=కోపించు; దండ=సమీపము; చలపట్టు=కోపగించు; బొమ్మలు=కనుబొమలు; జంకించు=బెదిరించు.
2. పొంద్దైన=స్నేహమున్న; చెయి=చెయ్యి; కందువ=చమత్కారాలు; కందువ=చమత్కారపు మాటలు; విందులవోవి=అందమైన మోము; విడెము=తాంబూలము; మందెలమాడు=ఉపేక్ష; మారుకొను=ఎదిరిచు.
3. కాగిలించి=కౌగలించి; ఆవటించు=పూనుకొని; అలయు=విసుగు; దేవులు=పట్టపురాణి; తెగడి= నెగ్గించు, ఆపేక్షించు(దేశ్య క్రియ); కావరము=గర్వము; కాతర=తత్తర, భయము.

**భావము:** అమ్మా అలమేలుమంగమ్మా! స్వామి నీపై ప్రేమాతిశయంతో నీ చెక్కిలినొత్తి మోహంతో ఏవో చిలిపిపనులు చేసి ఉండవచ్చుగాక అంత మాత్రాన స్వామిని చిత్రంగా దూరం పెడతావా?

నిన్ను మోహించిన నీ మనోహరుడు మచ్చికతో నీమీద కలువపూలను విసిరితే అంతమాత్రాన్నే కోపిస్తావా? తలుపులు తెరచుకొని నీ కోసం వచ్చి సమీపించిన స్వామిని కోపించి కనుబొమలెగురవేసి బెదిరించి భయపెడతావా?

స్నేహప్రీతితో స్వామి నీ భుజాలపై చేయి వేసి కాస్తా చమత్కారంగా మాట్లాడినంత మాత్రాన కాదుపొమ్మంటావా? తన దివ్యసుందరమైన మొహన్ని నీకు చూపిస్తూ తాంబూలమిమ్మని అడిగితే ఉపేక్ష చేసి ఎదిరించి కాదు పొమ్మంటావా?

సాక్షాత్తూ శ్రీవేంకటేశ్వరుడు నిన్ను చేరి కౌగలించుకొని, తనకైతాను పూనుకొని ఎంతో ప్రేమనొలకబోస్తూ వుంటే విసుగును ప్రకటిస్తావా? నీవు పట్టపురాణివి అంటూ నిన్ను నెగ్గిస్తూ అపేక్షించే స్వామిని గర్వపు చూపులతో భయపెడతావా?

## 39

**అవతారిక:** ఈ కీర్తనలో అలమేలుమంగమ్మ స్వామివారితో వివాహానికి సిద్ధమై ఉన్నవేళ జరిగే విశేషాలను ఓ శృంగార నాయిక వివరిస్తున్నది.

### లలిత

ప. చిత్తగించవోయి నీవు శిరసువంచుకొనక
బిత్తరాన నీకె నీపై ప్రియము చల్లీని ॥పల్లవి॥

1. పలుచనిసిగ్గుతోడ బాసికము గట్టుకొని
చెలరేఁగి సతి నీపై సేసచల్లీని
చెలులమాటుననుండి చిప్పిలుఁదమకమున
తళుకుఁజూపుల నిన్ను తప్పక చూచీని ॥చిత్తగించవోయి॥

2. చెంది మురిపెముతోడ సింగారించుకొని
కందువ లంటుచు నీకాలుదొక్కీని
సందడివేళలందు జాణతనాలాడి నీకు
ముందుముందుగాఁదాను మోవి చూపీని ॥చిత్తగించవోయి॥

3. గాటఁపుటాసలతోడి కంకణము నీకుఁగట్టి
పీఁటమీఁదఁగూచుండి పెండ్లాడీని
యీటున శ్రీవేంకటేశ యిటు నన్ను గూడితివి
మేటియై యిందుకు నాపె మెచ్చు మెచ్చీని ॥చిత్తగించవోయి॥

**అర్థములు:** ప. చిత్తగించు=సావధానముగా విను; బిత్తరాన=విలాసము, సరసము; ప్రియము= వలపు; చల్లీని=కురిపించుచున్నది.

1. పలుచని సిగ్గు=కొద్దిగా సిగు; బాసికము=పెండ్లియందు వధూవరుల నొసట కట్టెడు మౌక్తికహారము, లలామకము; చెలరేగి=విజృంభించి, అతిశయించి; సేస=అక్షింతలు; చిప్పిలు=పైకిఉబుకు; తమకము=మోహము; తళుకు=మెరసెడి;
2. చెందు=కలుగు, పుట్టుబీ మురిపెము=విలాసము; సింగారించు=అలంకరించుకొను; కందువ=నేర్పు, చమత్కారము; సందడివేళలు=జనసమూహమున్న; జాణతనము=కౌశలము; మొవి=మొహము.
3. గాటము=అధికము, పట్టరాని; ఈటున=ఉత్సాహము; మేటి=అధికురాలు, మేలైన; ఆపె=ఆమె; మెచ్చు=ప్రేమను చూపుట, కొనియాడు.

**భావము:** ఓ స్వామీ! తలను వంచుకోని ఉండక, సావధానంగా మొరాలకించవయ్యా! విలాసంతో సరసంగా నిన్ను వలచిన అమ్మ అలమేలుమంగమ్మ నీపైన వలపు జల్లులు కురిపిస్తున్నది.

కొద్దికొద్దిగా సిగ్గుపడుతూ బాసికము కట్టుకొని, విజృంభించి నీపై అక్షతలు చల్లుచున్నది. ఉబికి వస్తున్న మోహాన్ని కప్పిపుచ్చుకుంటూ చెలికత్తెల చాటున దాగిఉండి మెరుపు చూపులతో నిన్నే తదేకంగా చూస్తున్నది.

నీపై మురిపెంతో ముద్దుముద్దుగా సర్వాలంకార భూషితురాలై, చమత్కారంతో నిన్ను చేరి నీ కాలు ద్రొక్కి, జనసమూహమున్న సమయాలలో తన నైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ మునుముందుగా, నీ అధరపానంకోసమా అన్నట్టుగా తన మోవిని నీకు చూపిస్తున్నది.

పట్టరాని ఉత్సాహంతో ఎంతో ఆశపడుతూ నీకు కంకణము కట్టి, పీటలమీద కూర్చుని వివాహమాడడానికి సిద్ధమైవున్నది. ఓ శ్రీవేంకటేశ్వరా! ఉత్సాహంతో ఈవిధంగా నన్ను చేరుకున్నావు. ఇందువల్లనే అన్నిటా అధికురాలైన ఆమె నిన్ను మెచ్చి తన ప్రేమను చూపుతూ కొనియాడుతున్నది.

**గమనిక:** కడపటి చరణంలో ప్రయోగింపబడిన "ఈటు" అనే పదానికి వ్యర్థము, శూన్యము అనే అర్థాలున్నాయి. అన్నమయ్య ప్రయోగాల్లో ఈ మాట పొసగదని ప్రయోగాన్ని బట్టి వేడుక, ఉత్సాహము అనే అర్థాల్లో తీసుకోవాలని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి సూచించారు. అలాగే బలిమి, దర్పం, అతిశయం అనే అర్థాలలో కూడా తీసుకోవచ్చని వేటూరి ఆనందమూర్తిగారు సూచించారు.

**విశేషాంశాలు:** హిందూ వివాహ సంప్రదాయంలో 35 ముఖ్యమైన ఘట్టాలు ఉన్నాయి. వివాహ ప్రక్రియ పెళ్లిచూపులతో మొదలై

పెళ్లిచూపులు, నిశ్చితార్థం, స్నాతకం, కాశీయాత్ర, వరపూజ, ఎదురుకోలు, గౌరీపూజ, మంగళస్నానాలు, కన్యావరణం, మధుపర్కాలు, యజ్ఞోపవీతధారణ, మహాసంకల్పం, కాళ్లుకడగటం, సుముహూర్తం (జీలకర్ర, బెల్లాన్ని వధూవరులు ఒకరి శిరస్సు మీద మరొకరు ఉంచడం), చక్రపాదాలు, కన్యాదానం, సువర్ణజలాభి మంత్రం, యోక్త్ర బంధనం, మంగళసూత్ర ధారణం, తలంబ్రాలు, బ్రహ్మముడి, గౌరీశంకర సంవాదం (అంగులీయకాలు తీయడం), సప్తపది పాణిగ్రహణం, హోమం, సన్నికల్లు తొక్కడం, లాజహోమం, స్థాలీపాకం, నాగవల్లి, సదస్యం, నల్లపూసలు కట్టడం, అరుంధతీ నక్షత్ర దర్శనం, ఉయ్యాలలోని బొమ్మను ఆడపడచుకు అప్పజెప్పడం, అంపకాలు, గృహప్రవేశం, సత్యనారాయణ వ్రతం, కంకణ విమోచనం, గర్భాదానం ఈ ముప్ఫై ఐదూ వివాహ సంప్రదాయంలో జరిగే ముఖ్యమైన ఘట్టాలు. ఈ ఘట్టాలలో వివాహ సాంప్రదాయాలైన బాసికం కట్టుకోవడం, కాలు ద్రొక్కి కంకణం కట్టడం అనే కొన్ని ముఖ్య ఘట్టాలను అన్నమయ్య మనకు ఈ కీర్తనలో వివరించాదు.

## 40

**అవతారిక:** ఈ కీర్తనలో ఓ నాయిక అమ్మ అలమేలుమంగమ్మ ఎల్లకాలం స్వామి తనతోనే ఉండాలని, అన్ని భోగాలు తానే అనుభవవించాలని కోరుకోవడం ఉచితం కాదని ఉద్బోధిస్తున్నది.

### అమరసింధు

ప. ఉచిత మెఱఁగవద్దా వువిదలకు
రచనల నీసరి రారా యెవ్వరును ॥పల్లవి॥

1. యింతులెల్లా నిలుచుండి యిట్టెకొలువు సేయఁగ
మంతనములాడేవు మగనితోను
జంతవై నీవొకతెవే జట్టిగొంటివా యేమి
వంతువరుసలు మరివలదా యెవ్వరికి ॥ఉచిత॥

2. సవతు లిందరును మీసరుసనే వుండఁగాను
పవళించే వీతనిపానుపుమీఁద
కవగూఁడగా నీకే కాణాచాయనా యేమి
తవిలి నీసాటికి రాఁదగదా యెవ్వరికి ॥ఉచిత॥

3. తోడివా రెల్లా నట్టెవూడిగాలు సేయఁగాను
వేడుకఁ గూడితివి శ్రీ వేంకటేశుని
కూడిమాడి నీవే రతిఁ గొల్ల గొంటివా యేమి
వోడక నీవంటియాస వుండదా యెవ్వరికి ॥ఉచిత॥

**అర్థములు:** ప. ఉచితము = ధర్మము, తగినది; ఉవిద=స్త్రీ; రచన = శృంగారము; సరి = సమానము; రారా = రాగలరా.

1. ఇంతులు = స్త్రీజనము; కొలువు = సేవ; మంతనము = ఏకాంతంగా రహస్యములాడు; జంత= గయ్యాళి; జట్టిగొను = వశపరచుకొను; వంతువరుసలు = వావివరుసలు; వలదా = అక్కరలేదా?.
2. సరుస = ప్రక్కన; కవగూడు = సంభోగించు, అనుభవించు; కాణాచి = నివాసస్థానము; తవిలి = బంధించు, కట్టుకొను;
3. వేడుక = సంతోషము, ఇచ్ఛ; కూడిమాడు = కలసిమెలసి వర్తించు; కొల్లగొను = దోచుకొను; అంటుకొని యుండు; ఓడు = వెనుదీయు; వెనుకంజవేయు; ఆశ= మోహము.

**భావము:** ఓ అలమేలుమంగమ్మా! ఈపని తగినదా! కాదా! అనే ధర్మాధర్మాలు ఆలోచించుకోనక్కరలేదా? శృంగారములో నీకు ఎవ్వరూ సాటిరారా?

స్త్రీజనమంతా స్వామి వద్ద నిలబడి సేవలు చేస్తూ ఉండగా, మగనితో ఏకాంతంగా ఆ రహస్యాలు, ఆ చెవులు కొరుక్కోవడం

అదీ చూస్తూ ఉంటే గయ్యాళిగా నీవొక్కతెవే స్వామిని వశపరుచుకున్నావా ఏమిటి? ఎవరికైనా సరే వావివరుసలు అనేవేమీ అవసరంలేదా?

సవతులంతా స్వామి నీకు ప్రక్కనే ఉండగా ఆతని పానుపు మీద హాయిగా పడుకొంటునావు. అనుభవించడమనేది ఆ స్వామి స్థానం నీకే స్వంతమనుకొన్నావా?ఆయనను మోహంతో బంధించడంలో నీకు సరిసాటి ఎవరైనా రాగలరా?

తోడి జనమంతా స్వామికి సకలవిధములైన సేవలు చేస్తూ ఉండగా, నీవు సంతోషంగా శ్రీవేంకటేశ్వరస్వామిని చేరావు. ఇలా కలిసిమెలసి వర్తిస్తూ స్వామివారి శృంగారాన్ని దోచుకొన్నావా ఏమిటి? నీలాగే వెనుదీయకుండా స్వామితో ఉండాలని ఎవరికైనా ఆశగా ఉండదా?

## 41

**అవతారిక:** ఒక నాయిక అమ్మ అలమేలుమంగమ్మపై స్వామివారికి గల ప్రేమాభిమానాలను బహుధా ఉల్లేఖిస్తూ పరవశం చెందుతున్నది.

### సౌరాష్ట్రం

ప. చూడవయ్యా నీసేఁతలు సూటిపడేను
ఆడరాదు నీతో మారు అవుఁగాదనుచును ॥పల్లవి॥

1. సరసములాడితివి చనవు లొసఁగితివి
తరుణితోడ నీవు తమకానను
యిరవై యీపె నేడు యేమిభాగ్యము సేసెనో
సిరులవలపులెల్లా చెక్కుల నిండెను ॥చూడవయ్యా॥

2. సేవ సేయించుకొంటివి సిగ్గులు దేరిచితివి
భావించి వనిత నింత పనిగొంటివి
పావనమె తనజన్మఫల మదియెట్టిదో
చేవ దేరినవలపు మోవిమీఁద నున్నది ॥చూడవయ్యా॥

3. గక్కనఁ బెండ్లాడితివి కాఁగిటఁ గూడితివి
మిక్కిలివేడుక నలమేలుమంగను
యిక్కువ శ్రీ వేంకటేశ యెటువంటి తగులమో
చక్కనివలపులెల్లా చన్నులపై నున్నవి ॥చూడవయ్యా॥

**అర్థములు:** ప. సూటిపడు=సరితాకు, సూటిగా తగులు; అవుగాదనుచు=ఇది యుక్తం ఇది అయుక్తం అని ఆలోచించు, ఆలోచించు.

1. చనువు=అపేక్ష; తమకము=మోహము; ఇరవు=స్థానము; ఈపె=ఈమె; భాగ్యము=సుకృతము, అదృష్టము; సిరులవలపులు=శ్రీవారి ప్రేమ; చెక్కు=చెక్కిలి;
2. తేరిచి=మునిగితేలు; ప్రసన్నతనొందించు; పనిగొను=నియోగించు, పూనుకొను; పావనము=పవిత్రము; చేవదీరు=పక్వమునకు వచ్చు.
3. గ్రక్కన=శీఘ్రముగా; కాగిట=కౌగిట; వేడుకు=కుతూహలము, సంతోషము; ఇక్కువ=స్థానము; తగులము=ఆసక్తి; వలపు=మోహము.

**భావము:** ఓ స్వామీ! చూడవయ్యా! నువ్వు చేసే ప్రతి చేష్ట కూడా అమ్మను సూటిగా తాకుచున్నవి. నీతో యుక్తాయుక్తాలను గురించి మాట్లాడవలసిన అవసరము లేదుకదా!

సరసాలాడి మోహంతో ఆమెపై ఎంతో ప్రేమానురాగాలు కురిపించావు. ఈవిధమైన స్థానం పొందడానికి ఆమె చేసుకున్న

అదృష్టం ఎటువంటిదో కదా! నీ తలపులతో ఆమె చెక్కిళ్ళు ఎఱ్ఱబడ్డాయి.

అమ్మతో ఎన్నో సేవలు చేయించుకొని సిగ్గులతో మునిగితేలేట్టు చేసి ప్రసన్నురాలను చేశావు. నీవు తలచి ఆమెను ఇంతగా నియోగించుకొన్నావు. ఆహా! ఆమె జన్మ ఎంత పవిత్రము పావనము అయినదోగదా! పక్కానికి వచ్చిన మోహపు తలపులన్నీ ఆమె ముఖారవిందంలో తొణికిసలాడుతున్నవి.

శ్రీవేంకటేశ్వరా! ఎంతో ప్రేమాతిశయంతో అలమేలుమంగను శీఘ్రంగా వివాహం చేసుకుని కౌగిట్లో బంధించావు. నీ చక్కని దృష్టంతా ఆమె వక్షోజంపైనే ఉన్నది. ఇంత అధికమైన స్థానాన్నిచ్చావంటే ఆమెపై నీకు ఉన్న ఆసక్తి చెప్పరానిది.

## 42

**అవతారిక:** ఈ కీర్తనలో స్వామివారి సేవలకై ఉప్పొంగిపోతూ అన్నిటిని సర్వసన్నద్ధం చేస్తున్న అలమేలుమంగమ్మను గురించి స్వామివారికి ఓ నాయిక వివరిస్తున్న సందర్భం.

### సాళంగనాట

ప. ఇదివో మా విన్నపము యిట్టె చిత్తగించవయ్య
సుదతి వున్న జాడలు చూతువు రావయ్యా ॥పల్లవి॥

1. యిప్పుడే వచ్చేవని యింటవాకిటను చెలి
కప్పురపుటారతెత్తఁ గాచుకున్నది
దప్పిదేర నీకునేలఁ(నీయ?) తట్టిలోన బాగాలు
కుప్పలుగా మీఁదెత్తు కొని వున్నది ॥ఇదివో॥

2. ఆరగించవచ్చేవని అన్నిదెరఁగులనెల్లా
చేరి విందాయితముగాఁ జేసుకున్నది
గారవానఁ బాదాలుగడిగేనంటాఁ బన్నీరు
ఆరీతిఁ బైఁడిబిందెల నమరించకున్నది ॥ఇదివో॥

3. పవళించవచ్చేవని పట్టెమంచముమీఁదట
వివరించి వూఁబరపు వేసుకున్నది
నివిరి శ్రీ వేంకటేశ నీవు విచ్చేసి కూడఁగ
తవిలి యలమేల్మంగ తనివితో నున్నది ॥ఇదివో॥

**అర్థములు:** ప. చిత్తగించు=సావధానముగా విను; సుదతి=చక్కని పలువరుసగల స్త్రీ, స్త్రీ: జాడలు=విధము, ఆచూకీ.

1. కప్పురపుటారతి=కర్పూరహారతి; కాచుకున్నది=తయారుగా ఉన్నది; దప్పిదేర=తనివితీర; తట్టి=కంచము, పళ్ళెము; ఈయ=ఇవ్వడానికి; బాగాలు=వక్కపలుకులు;
2. ఆరగించు=తిను; తెరగు=విధము; విందాయితము=విందుసిద్ధము జేసుకొను; గారవము=గౌరవము; పైడి బిందెలు=బంగారుబిందెలు; అమరించు=ఏర్పరచుకొను.
3. వివరించి=తెలియజేయు; ఊపరపు= ఇష్టమైన పాన్పు; నివిరి=శరీరమును మెత్తగా తాకు; విచ్చేసి=వచ్చి; కూడగ=కలియగ; తవిలి=యత్నించి; తనివి=తృప్తి.

**భావము:** ఓ స్వామీ! ఇదుగో మావిన్నపము సావధానంగా వినండి. అందమైన అలమేలుమంగమ్మ ఆచూకీ తెలుసుకొందురుగాని ఇలా రండి.

నీవు ఇప్పుడే వచ్చావని, ఇంటి ద్వారాలు తెరిచి కర్పూరహారతి నివ్వడానికి తయారుగా ఉన్నది. నీ తనివి తీరేవిధంగా పళ్ళెంలోని వక్కపలుకులు ఇవ్వడానికి కుప్పలుగా పోసుకుని భుజంపై పెట్టుకుని ఉన్నది.

అన్నివిధాలైన ఆహారపదార్థాలు యిష్టంగా తినడానికి వస్తావని ఆమె విందు సిద్ధంచేసుకుని ఉన్నది. నిన్ను గౌరవించి నీ పాదాలు కడిగేందుకు బంగారు బిందెలలో పన్నీరుపోసుకుని సిద్ధమైనది.

నీవు పవళించడానికి వస్తున్నావని పట్టెమంచంపై నీకిష్టమైన పానుపు సిద్ధంచేసి ఉంచింది. ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు వచ్చి అలమేలుమంగమ్మను కూడి, సుతిమెత్తని నీస్పర్శతో అమ్మను పరవశురాలిని చేస్తే ఆమెకు తృప్తి కలుగుతుంది.

## 43

**అవతారిక:** స్వామి వేరొక కాంతతో కూడి చేస్తున్న శృంగార చేష్టలకు, ఎక్కడ అలమేలుమంగమ్మ కోపగిస్తుందోనని బెరుకుతో ఆమెతోనే కూడమని చెప్తున్నది.

### శుద్ధదేశి

ప. ఇప్పటికిఁ జనవరి యింతి నీకు
కొప్పుదువ్వి నన్ను నేల కొంగువట్టేవిపుదు ॥పల్లవి॥

1. మలసి నీవు నాతో మాటలాడితివంటాను
సొలసీ నాపె నిన్నుఁ జుట్టి చుట్టి
కలికి యన్నిటా కదుఁగతలెల్ల నేరుచును
వెలలేని యాపెమాటే వినవయ్యా నీవు ॥ఇప్పటికి॥

2. ననుపున నాతో నవ్వులు నవ్వితివంటా
గునిసీ నాపె నిన్నుఁగొచ్చి కొచ్చి
చనవరివినోదాల సరసురా లన్నిటాను
వొనర నాపెతో నవ్వి వుండవయ్యా నీవు ॥ఇప్పటికి॥

3. గక్కన నన్ను నీవు కాఁగిటఁ గూడితివంటా
కక్కసించీ నాపె నిన్నుఁ గమ్మి కమ్మి
నిక్కి శ్రీ వేంకటేశుఁడ నేనలమేలుమంగను
లెక్కతోనే యాపెఁ గాగిలించవయ్యా నీవు ॥ఇప్పటికి॥

**అర్థములు:** ప. చనవరి=చనువుగల, నేస్తము; ఇంతి=స్త్రీ; కొంగువట్టు=కొంగు పట్టుకొను.

1. మలయు=తపించు; సొలసి=వ్యాపించి; చుట్టుజుట్టు=కౌగలించుకొను; కతలు=కల్పనలు; వెలలేని=వెలకట్టలేని; ఆపె=ఆమె.
2. అనుపున=పొంచియుండి; గునియు=లోలోనబాధపడు; ఆపె=ఆమె; కొచ్చి కొచ్చి=గ్రుచ్చి గ్రుచ్చి చూచుట; చనవరి=చనువుగల; వినోదము=ఆనందము; సరసురాలు=రసికురాలు; ఒనర=తగినట్లు; ఆపె=ఆమె.
3. గక్కన=తొందరపడి; కాగిట=కౌగిలిలో; కక్కసించు=సంకటపెట్టు, బాధించు; ఆపె=ఆమె; కమ్మి=చుట్టుకొను; నిక్కు =పైకెత్తు; లెక్కతో=లక్ష్యముతో, కోరికతో; ఆపె=ఆమె; కాగలించు=కౌగలించు.

**భావము:** ఓ స్వామీ! ఆమెతో నీ సాంగత్యములు, స్నేహము ఇప్పటికీ ఉన్నవేగదా! నా కొప్పు దువ్వి, కొంగెందుకు పట్టుకుంటారు? ఆమెకు కోపం రాదా?.

ఎంతో తపనతో నీవు నాతో మాట్లాడినట్లైతే, ఆమె మీపై పారవశ్యంతో మిమ్ము కౌగలించుకొని, అన్ని విధములుగా కల్పనలు

చేసి కథలెన్నో చెపుతుంది. ఎందుకొచ్చిన తంటా స్వామీ ఆమె మాటే వినవయ్యా!

పొంచియుండి నాతో సరదాగా కలిసి నవ్వులెన్నో నవ్వావు. ఆమెను చూడవయ్యా! అన్నిటా ఆనందాన్నిచ్చే చనువుగల తను నిన్ను గ్రుచ్చి గ్రుచ్చి చూస్తున్నది. ఇవన్నీ ఎందుకు స్వామీ ఆమెతోనే ఆ నవ్వులు నవ్వరాదా?

తొందరపడి నన్ను కౌగలించుకున్నట్లైతే, ఆమె నీపై కోపించి, నిన్ను చుట్టుకుని, నిన్నెలాంటి బాధలకు గురిచేస్తుందో ఏమో!ఓ శ్రీవెంకటేశ్వరా! తలపైకెత్తి చూడవయ్యా నేను అలమేలుమంగను. కోరికతో ఆమెనే కౌగలించుకోవయ్యా!

## 44

**అవతారిక:** ఈ కీర్తనలో అమ్మ అంచందాలను స్వామి ప్రశంసిస్తున్నాడు.

### తెలుఁగుఁగాంబోది

ప. నీవే యెరుఁగుదువు నానెయ్యము వో రమణి
భావము లోపలనుండి భ్రమయించ నేఁటికి ॥పల్లవి॥

1. చూపుటమ్ము బొమ్మవింట జోడై నిలిచెఁగాన
చేపట్టి మర్మ వేదనఁ జేయుఁగాక
కోపులమంచితనపుఁగుచమండలము నేఁడు
యేపున బ్రాణాలతోడ యేలాట మెట్లాడీనే ॥నీవే॥

2. తొడఁగి మబ్బుగవిసి దొడ్డకుటిలపుఁగొప్పు
కడుఁగామాంధకారముఁ గప్పుఁగాక
నడుమ మోముఁజందుద్రు నవ్వువెన్నెల గాయుచు
చిడుముడి నామదినిఁ జీఁక టేల సేసీనే ॥నీవే॥

3. పచ్చిదొండపండు వంటి బాగుల రాగపు మోవి
రిచ్చవడ మోహము రేఁచుఁగాక
ఇచ్చకపు శ్రీ వేంకటేశుఁడ రమ్మని నన్ను
ఇచ్చఁగూడితివి రతి నిందాఁకా నెట్లుండెనే ॥నీవే॥

**అర్థములు:** ప. నెయ్యము=స్నేహము, ప్రేమ; రమణి=అందమైన స్త్రీ; భావము=మనసు, అంతఃకరణ; భ్రమయించు=సందేహించు.

1. చూపుటమ్ము=తీక్షణమైన చూపు; బాణమువలె గ్రుచ్చుకొను వీక్షణము; బొమ్మవింట=కనుబొమ్మలు; జోడై=జతయై; మర్మవేదన=తెలియనిరాని నొప్పి; కోపులు=అందమైన, ; కుచమండలము=వక్షోజము; ఏపున=బాధ; ఏలాటము=పరిహాసము.
2. తొడగి=ప్రారంభించు; గవిసి=జతగూడి; దొడ్డ=మంచిదైన; కుటిలపుగొప్పు=వంకరయైన కొప్పు; కామాంధకారము=ప్రేమచే కన్ను మిన్ను గానక యుండు; మోము చంద్రుడు=చంద్రబింబమువంటి మొహము; నవ్వువెన్నెల=సంతోషాన్నికలిగినే మంచి పున్నమి వెన్నెల; చిడుముడి=తొందర పడు; సేసీనీ=చేసెను?
3. పచ్చిదొండపండు=లేతగానున్న ; బాగులు=అభినయములు, చేతలు; రాగపు మోవి=అనురాగముతో చూచు మొహము; రిచ్చవిడ=దిగులుపోగొట్టు; ఇచ్చకము=మోహము, ప్రియము; ఇచ్చ=కోరిక, అపేక్ష; ఇందాక=ఇప్పటివరకు.

**భావము:** ఓ సుందరాంగీ! నీకిన్ని అనుమానాలు, సందేహాలు ఏల? నీయెడ గల నా ప్రేమ నీవెరుగనిదా?

నీచూపుల వాడిబాణాలు నీ కనుబొమ్మలతో సమానమై ఉన్నాయి (సుందరమైన కనుబొమ్మలు) నన్ను చేపట్టి అవగతమవని మన్మథబాధకు గురిజేయవచ్చుకదా! యౌవనంతో ఎగిసిపడుతూ వాడియైఉన్న నీ వక్షోజప్రదేశము ఈనాడు నన్ను చెప్పరాని బాధలకు గురిచేస్తున్నది. ఎందుకు ఇలా నాతో చెలగాటం, పరిహాసాలాడడం ఎందుకు?

నీ అందమైన కొప్పు భాగము కారుమబ్బుల గాడాంధకారమును తలపిస్తున్నది. మధ్య మధ్యలో చంద్రబింబంవంటి నీ

మోహం, పున్నమినాటి పండు వెన్నెలను కురిపిస్తున్నది. ఇంకా తొందరపడి నా అంతరంగాన్ని చీకటిలో నింపడమెందుకు?

పచ్చి లేత దొండపండు వంటి పక్వం కాని నీ అభినయములు, చేతలు నా దిగులును పోగొట్టి గాఢమోహాన్ని కలిగిస్తున్నాయి. మోహముతో ఉన్న శ్రీవేంకటేశ్వరా! నన్ను మనసారా ఆహ్వానిస్తున్నావు ఇక ఆ రతిక్రీడా విలాసమెలా ఎంత పసందుగా ఉంటుందో కదా!

**విశేషాంశాలు:** స్త్రీ ముఖ సౌందర్యాన్ని కవులు కమలంతోను, చంద్రబింబంతోను పోల్చి వర్ణించడం ఉంది. అన్నమయ్య లేత దొండపండుతో పోల్చడంలోని ఆంతర్యం గమనిస్తే లేత దొండకాయపై ఒకవిధమైన మెరుపు కనిపిస్తుంది. ఆ మెరుపును అన్నమయ్య పట్టుకున్నాడు. అలాగే ఈ కీర్తనలో కనుబొమ్మలు వాడి బాణములని, కొప్పు కారుమబ్బుల గాడాంధకారమని వర్ణించడం భవిష్యత్ కవులకు మార్గదర్శకంగా నిలుస్తుంది.

## 45

**అవతారిక:** ఒక నాయిక అందాలరాశి అలమేలుమంగమ్మపై నిర్లక్ష్యం వహిస్తున్నాడని గ్రహించి స్వామిని తగదని వారిస్తున్నది.

### పాడి

ప. తరుణులతోడనా నీ తరితీపులు
తొరలింపుఁ గూరిముల దొరపాటివాఁడవు ॥పల్లవి॥

1. వలచినసతితోను వాసికిఁ బెనఁగుదురా
పలుకులు నేరిచిన పంతగాఁడవు
బలిమిఁ జెనకఁగాను పరాకు సేయుదురా
నెలకొన్న జవ్వనపునెరవాదివాఁడవు ॥తరుణు॥

2. ఆసగించివున్న యింతి నారఁడిఁ బెట్టుదురా
సేసవెట్టి పెండ్లాడిన చెలువుఁడవు
నీసరిఁ గూచుండఁగాను నీటులు చూపుదురా
వేసటలేనిరతుల వేడుకకాఁడవు ॥తరుణు॥

3. అలమేలుమంగఁ గూడి అలయించి నవ్వుదురా
తెలివి శ్రీ వేంకటాద్రి దేవుఁడవు
కలసి మొక్కఁగా మోవికడుపిప్పి సేతురా
తలపోఁత లెఱిఁగిన దయగలవాఁడవు ॥తరుణు॥

**అర్థములు:** ప. తరితీపులు=ఉపేక్ష, ఉద్ధృతి; తొరలింపు=గుమ్మరించు; కూరిమి=స్నేహము; దొరపాటి=గొప్పవాడు.

1. వాసి=ఆధిక్యత; పెనగు=మారాడు; పంతగాడు=పౌరుషవంతుడు, పోటీకి నిలిచేవాడు ; బలిమి=ఔదార్యము; చెనకు=తాకు; పరాకు=ఉదాశీనత; నెలకొను=నిలిచిఉండు; జవ్వనము=యుక్తవయసు; నెరవాది=సమర్థుడు, నేర్పరి.
2. ఆసగించు=ఆశతోనుండు; ఆరడి=దుఃఖము; సేస=అక్షింతలు; నీటులు=ఒయ్యారము; వేసట=అలుపు; వేడుకకాడు=ఆసక్తిగలవాడు.
3. అలయించు=శ్రమపెట్టు; తెలివి=ప్రకాశము; పిప్పి=రసవిహీనము; తలపోత=ఆలోచన.

**భావము:** ఓ స్వామీ! స్త్రీజనంపై అశ్రద్ధ ఎందుకు చూపిస్తున్నావు? నీవు స్నేహం కుమ్మరించే గొప్పవాడివికదా!

నిన్ను వలచి నిన్నే మోహించిన అర్ధాంగితో ఆధిక్యత చూపుతూ మారాడుతారా? నీవు మాటలు నేర్చి అన్నిటికి పోటీలు పెట్టుకునే పౌరుషవంతుడివి. ఆమె ఔదార్యముతో తాకడానికి యత్నిస్తే ఇలా ఉదాశీనతతో ఉంటారా? నీవు యుక్తవయసులో ఉన్న నేర్పరివి.

నీపై ఎన్నో ఆశలు పెట్టుకున్న స్త్రీని దుఃఖానికి గురిచేస్తారా? అక్షింతలు వేసి వివాహం చేసుకున్న సమర్థతగల వాడవు. నీ

ప్రక్కన కూర్చున్నంత మాత్రాన ఇలా ఒయ్యారాలొలకబోస్తావా? అలుపు సొలుపు లేని రతిక్రీడలయందు ఆసక్తి గలవాడవు.

అమ్మ అలమేలుమంగమ్మనిలా శ్రమపెట్టి నవ్వడం తగునా? ప్రకాశవంతుడైన శ్రీవేంకటాద్రిపై వెలసిన స్వామివి. చెలులతో కలిసి మ్రొక్కినంతమాత్రాన ఆమెను ఇలా నిర్లక్ష్యంతో నిరాకరిస్తారా? ఆలోచన ఉన్న దయగలవాడివి కదా!

## 46

**అవతారిక:** అలమేలుమంగమ్మ ఏ కారణంవల్లనో స్వామి శ్రీనివాసునిపై కోపం ప్రదర్శిస్తున్న వేళలో ఘనాఘనుడైన ఈ శ్రీవేంకటేశ్వరునిపై ఈవిధమైన కినుక తగునా అని పట్టుదలలకు పోవద్దని ఒక నాయిక చెప్తున్నది.

### వసంతవరాళి

ప. నను జూడవే ఇఁకను నా సొమ్ము చేసుకొనేను
ఘనుఁ డీతనిచెయ్యి నేఁ గైదండ చేకొంటిని ॥పల్లవి॥

1. చనవరిదానవు చలమరిదానవు
యెనలే కాతనిఁ గూడ కేల మానేవే
మనసునమ్మినయట్టిమాటపట్టు వుచ్చుకొంటి-
వినుమడించె వలపు లిట్టుండవలదా ॥నను జూడవే॥

2. ఇతవరిదానవు ఇయ్యకొన్న దానవు
రతుల నింటికి నేల రాకుండేవే
సతముగా నన్నిటా సమ్మతి చేసుకొంటివి
బలుకు నీవలె నిట్టె పచరించవలదా ॥నను జూడవే॥

3. పాయరానదానవు పంతగారిదానవు
చాయల నేపోన్దూనేల జంటవాసేవే
రేయి వచ్చి శ్రీ వేంకటాద్రిగోవిందుఁడే నన్నేలె
యీయెడ నవ్వునవ్వితి వింత మెచ్చవలదా ॥నను జూడవే॥

**అర్థములు:** ప. సొమ్ము చేసుకొనేను=స్వంతము చేసుకొను; కైదండ=చేయిపట్టుకొను.

1. చనవరి=చనువు, అపేక్ష; చలమరి (చలము ం అరి)=మాత్సర్యము; ఎనలేక=సాటిలేని; కూడ=కలియుటకు; మాను=తిరస్కరించు; మాటపట్టు=మాటపట్టింపు; ఇనుమడించు=రెట్టింపగు.
2. ఇతవరి=హితమును చెప్పు; ఇయ్య=అంగీకరించు; రతుల నింటికి=రతికేళీగృహమునకు; సతము=శాశ్వతము; సమ్మతి=అంగీకరించు; పచరించు=కనబరచు.
3. పాయరాని=వయసులోని; పంతగారి=పట్టుదల; చాయలు=సమీపము; పొందు=కలయిక; వాసి=వీడిపోవు.

**భావము:** ఓ అలమేలుమంగా! నన్నిలా ప్రేమతో వీక్షించవే! ఇంక నిన్ను నా స్వంతం చేసుకున్నాను. ఘనాఘనుడైన ఈ శ్రీవేంకటేశ్వరుని కరగ్రహణం చేసినదానవు.

నువ్వీతని పట్ల ఎంతో అపేక్ష, చనువే కాక మాత్సర్యం కూడా గలదానవు. అతణ్ణి కూడేందుకు ఎందుకు నిరాకరిస్తున్నావు? మనసులో ఏవేవో ఊహించుకొని మాటపట్టింపుతో ఉంటున్నావు గాని, ప్రేమ రెట్టింపయే విధంగా మోహంతో ఉండవలెను గదా?

అతని త్రికరణశుద్ధిగా అంగీకరించిన దానవు. ఇష్టమైన విషయాలను మాట్లాడే దానవుగదా మరి రతికేళీ గృహానికి రావడానికి ఎందుకు వ్యతిరేకిస్తున్నావు? శాశ్వతముగా అన్నింటిని ఒప్పుకొన్నదానవే గదా ! మరి ఆ విషయాలన్నీ నీ మాటలలో కనబరచవలెను కదా!

మంచి తరుణ వయసులోనున్నదానివి కదా? మరి ఈ పట్టుదలలేల? అతణ్ణి సమీపించి అతనితో కలియకకు ఎందుకు

వైముఖ్యత చూపిస్తున్నావు? ఈ రాత్రికి వచ్చి శ్రీవేంకటేశ్వరుడు నన్ను ఏలుకుంటాడు. ఈ అవకాశంతోనైనా నీవు హర్షం వ్యక్తము చెయ్యవలెను గదా!

## 47

**అవతారిక:** ఈ కీర్తనలో అలమేలుమంగమ్మ శ్రీనివాసుని పట్ల దర్పం గర్వం ప్రదర్శిస్తూ ఉండడం గమనించిన ఒక చెలి తగదని ఉద్బోధిస్తున్నది.

### సాళంగం

ప. వలపేల దాఁచేవే వనిత నీవు
తిలకించి యెంత తరితీపు సేసేవే ॥పల్లవి॥

1. పలుమారు నాతఁడు బాఁతిపడి పిలువఁగా
వోలసీనొల్లమి నేల వూఁకొనేవే
బలిమి నాతఁడు నీకు పచ్చడము గప్పుఉగాను
అలరి వొయ్యారాన నట్టె లోనయ్యేవే ॥వలపేల॥

2. చిమ్మిరేఁగి యాతఁడు చేసన్న సేయఁగాను
వుమ్మడిజాగుతోనేల వొద్దికయ్యేవే
నెమ్మితోడ నాతఁడు నీకు విడెమియ్యఁగాను
చిమ్ముల మెల్లనే యొట్టు చేయిచాఁచేవే ॥వలపేల॥

3. అట్టె శ్రీ వేంకటేశుఁడు అంకెఁ గాఁగిలించుకోఁగా
గుట్టునఁగరఁగి యెంత గుబ్బతిల్లేవే
యిట్టె యాతఁడు నిన్ను నేలి నేఁడు మన్నించఁగా
దిట్టవై యలసి యేమి తేలించి చూచేవే ॥వలపేల॥

**అర్థములు:** ప. వలపు=ప్రేమ; తరితీపు=ఉపేక్షించు, గర్వించు, నిర్లక్ష్యము చేయు.

1. బాతిపడు=ప్రీతిచెందు; ఓలసి=నెపము; ఒల్లమి=అయిష్టత; ఊకొను=ఊకొట్టు; బలిమి=బలవంతముగా; పచ్చడము=వస్త్రము; అలరి=ప్రకాశించు; ఒయ్యారము=విలాసము.
2. చిమ్మిరేగు=అధికముగా విజృంభించు; చేసన్న=చేతితో చేయు సైగలు; ఉమ్మడి=పొత్తు; జాగు=ఆలశ్యము; ఒద్దిక=అనుకూలత; నెమ్మి=ప్రేమ; విడెము=తాంబూలము; చిమ్ములు=కులుకులు; మెల్లనే=నిదానంగా.
3. అంకె=వశము; కాగిలించు=కౌగలించుకొను; గుట్టు=రహస్యము; కరగి=లొంగిపోయి; గుబ్బతిల్లు=అతిశయించు, ఉప్పొంగు; దిట్ట=శ్రేష్టత; అలయు=బడలిక; తేలించు=సంతోషపెట్టు.

**భావము:** ఓ అలమేలుమంగమ్మా స్వామిపై నీకు గల ప్రేమను లోలోపల మనసులోనే ఎందుకు దాచుకుంటున్నావు? స్వామిని చూసికూడా దర్పం గర్వం ప్రదర్శిస్తూ నిర్లక్ష్యము చేయదగునా!

అనేక సార్లు స్వామి నిన్ను ప్రీతితో చేరబిలువగా, ఏదో ఒక నెపంతో అయిష్టతను చూపుతూ ఊరుకుంటున్నావు. నీమీద ప్రేమతో బలవంతంగా స్వామి నీకు పైవస్త్రం కప్పుతూ ఉండగా ప్రకాశిస్తూ నీ విలాసాలన్నీ ప్రదర్శిస్తున్నావు.

స్వామి నీపై ఉన్న ప్రేమతో విజృంభించి ఆగలేక చేతితో సైగలు చేస్తూ ఉండగా పొత్తుకై ఆలశ్యము చేస్తూ మరలా ఆ స్వామికి అనుకూలంగా ప్రవర్తిస్తున్నావు. నీమీద ఉన్న గాడాభిమానంతో నీకు తాంబూలము ఇవ్వబోగా కులుకులతో వయ్యారపు చేష్టలతో నిదానంగా చేయిచాస్తున్నావు.

ఆ శ్రీవేంకటేశ్వరుడు నిన్ను వశంచేసుకుని కౌగలించుకోగానే అతని బిగి కౌగిలిలో స్వామికి రహస్యంగా లొంగిపోయి

ఎంతగా అతిశయం చూపిస్తున్నావు? ఈవిధంగా ఆ స్వామి నిన్ను మన్నించగానే నీ గొప్పదనం చూపిస్తూ అలసి సొలసి ఎంత సంతోషం వ్యక్తం జేస్తున్నావే!

## 48

**అవతారిక:** అలమేలుమంగమ్మ పిలుస్తున్నా వెళ్ళకుండా కాలయాపన చేస్తున్నందుకు, స్వామివారితో ఒక చెలి అమ్మవారి సౌందర్య విశేషాలు వివరిస్తూ అమ్మను కూడమని చెప్తున్నది.

### హిందోళవసంతం

ప. మాకేల విన్నవించ మాపు దాఁకా నీతోను
దాకొని నీవే దయఁదలఁచేవు గాని ॥పల్లవి॥

1. హత్తి రమణి విలిచీ నాడకు విచ్చేయరాదా
చిత్తము వచ్చినట్లాఁజేసేవుగాని
మొత్తమి నిపుడే నీవు మొగము చూడఁగరాదా
యిత్తల నన్నియు నీవే యెఱిఁగేవు గాని ॥మాకేల॥

2. మనసిచ్చి యేకతాన మాటలాడి చూడరాదా
పనివడి నీవే నిజపట్టేవుగాని
చెనకుచుఁ బానుపుపైఁజేరి కూచుండఁగరాదా
ననిచి మానిజమెల్లా నమ్మేవుగాని ॥మాకేల॥

3. కక్కసమేఁటికి యాకెఁ గాఁగిలించి కూడరాదా
మిక్కిలి శ్రీ వేంకటేశ మెచ్చేవుగాని
యిక్కువ నిప్పట్టిపొందు యిట్టె యీడేరించరాదా
మక్కువలు సేసి నీవే మరిగేవు గాని ॥మాకేల॥

**అర్థములు:** ప. విన్నవించు=మనవిచేయు; మాపు=సాయంత్రము; దాకొని=దాగుడుమూతలాడు.

1. హత్తి (అత్తి)=అపేక్ష, కోరిక; విలిచీ=పిలిచి; ఆడకు=అక్కడకు; మొత్తమి=మొత్తము; ఇత్తల=ఇవతల.
2. ఏకతాన=ఒకని మీదనే నమ్మకముంచు; నిజపట్టు=నిజము గ్రహించు; చెనకు=స్పృశించు; అనిచి=యత్నించి.
3. కక్కసము=సంకటము; ఏటికి=ఎందులకు; యాకె=ఆమె; కాగలించి=కౌగలించి; ఇక్కువ=సంకేతస్థలము; ఈడేరించు=సిద్ధింపజేయు; మక్కువలు సేసి=ప్రేమను చూపించి; మరగు=ఆశపడేవు.

**భావము:** ఓ శ్రీనివాసా! మాకెందులకు తెలపడంలేదు? సాయంత్రం వరకూ దాగుడుమూతలాటలాడి నీవే చివరకు దయ తలుస్తావు కదా!

మిక్కిలి మోహంతో, అపేక్షతో ఆ అలమేలుమంగమ్మ మిమ్మల్ని పిలుస్తున్నది కదా! మీరక్కడికి విచ్చేయవచ్చుకదా! నీ ఇష్టం వచ్చినట్లు చేస్తావు కానీ ఇప్పటికిప్పుడే ఆ అమ్మ ముఖారవిందాన్ని తిలకించవచ్చుకదా! ఇవతలి విషయాలన్నీ నీవెరిగినవే గదా స్వామీ!

స్వామీ! అమ్మతో మనసుపెట్టి ఒకసారి మాట్లాడి చూడరాదా? అలా చేసినట్టైతే తమరే నిజానిజాలు గ్రహించగలరు కదా! అమ్మను ప్రేమతో స్పృశిస్తూ పట్టుపాన్పు పై కూర్చొన వచ్చుకదా! ఒక్కసారి ప్రయత్నిస్తే మేము చెప్పేదాంట్లో సత్యాసత్యాలు మీకే అర్థమవుతాయికదా!

స్వామీ! ఓ వేంకటేశ్వరా! ఇంకా సంకటపడడమెందుకు? ఈమెను ఒక్కసారి కౌగలించి చూసినట్టైతే తమరే మెచ్చుకుంటారు. ఆ సంకేతస్థలములో జరిపే కలయికేదో ఇక్కడే సిద్ధింపజేయవచ్చు గదా! అలమేలుమంగమ్మకు నీ ప్రేమను చూపించినట్టైతే

తరువాత నీవే ఆమెకు అధీనుడవుతావు.

## 49

**అవతారిక:** అలమేలుమంగమ్మ స్వామి వారికి తను చేయవలసిన సేవల గురించి అడుగుతూ, ఇంకా ఏమైనా మిగిలి ఉన్నాయా స్వామీ! సెలవియ్యవయ్యా! అని ప్రార్థిస్తున్నది.

### నాగగాంధారి

ప. ఇంకా నేమనేవయ్యా యెదుట నుందాన నేను
కుంకుమ నీకుఁ బూయనా గురుతుగా నేను ॥పల్లవి॥

1. సన్నలు నీవు సేయఁగా సమ్మతించి కాదనక
విన్నపము సేయనా వేడుకతోడ
వెన్నెలబాయిటఁజేయివేయఁగా నప్పటి నీకు
కన్నుల నే మొక్కనా కడుఁదమకమున ॥ఇంకా॥

2. నాయెడకు జెడలేని నవ్వులెల్లా నవ్వఁగాను
ఆయములు సోఁక నిన్ను నాడనా నేను
దాయక పాయకనీవు దండ నిట్టెకూచుండఁగా
సేయనా వూడిగములు చెప్పినట్టెల్లాను ॥ఇంకా॥

3. పంతమున కాఁగిటను బలిమి నీవు గూడఁగా
మంతనాన మెచ్చనా మచ్చికతోడ
చెంతనే మన్నించితివి శ్రీవేంకటేశ నన్ను
సంతోసించనా నీసరసములకును ॥ఇంకా॥

**అర్థములు:** ప. నుందాన=ఉన్నదానను; గురుతు=చిహ్నము.

1. సన్నలు=సంజ్ఞ, సైగ; వేడుక=సంతోషము; వెన్నెల బాయిట=పండు వెన్నెలలో బయట ఉండుట; కడు=మిక్కిలి; తమకము=మోహము.
2. చెడలేని=ఇష్టమువచ్చినట్లు; ఆయము=రహస్యము; దాయక-పాయక=దగ్గరకురాక అలా అని దూరంగా ఉండక; దండ=దగ్గర; ఊడిగములు=సేవలు.
3. పంతము=పట్టుదల; కాగిట=కౌగిట; మంతనము=ఏకాంతము; మచ్చిక=మోహము.

**భావము:** ఓ శ్రీనివాసా! నా ప్రాణనాథా! ఇంకా ఏమంటావయ్యా! నేను నీ యెదుటనే ఉన్నాను. గుర్తుగా నీ దివ్య మంగళ దేహానికి కుంకుమ పూయమంటారా? చెప్పండి.

నీవు సైగలు చేసినప్పుడు ఏమాత్రం కాదనకుండా, అంగీకరించి సంతోషంతో విన్నపాలు చేసుకోమంటారా స్వామీ! పండువెన్నెలలో ఆరుబయట నాపై నీ హస్తము పడగానే, మీకు మోహంతో కనులతోనే మ్రొక్కమంటారా స్వామీ సెలవివ్వండి.

నావద్ద ఇష్టం వచ్చినట్లు మీరు నవ్వులు నవ్వుతూ ఉండగా, నా శరీర స్పర్శ మీకు తగిలేట్టు నాట్యం చేయమంటారా స్వామీ! మీరు నాకు తగిలీ తగలకుండా ఇలా కూర్చొని ఉండగా, మీరు చెప్పిన సేవలెల్లా చేయమందురా స్వామీ ఆనతీయండి.

పట్టుదలతో నన్ను మీ కౌగిట బంధించగా ఏకాంతంగా మోహంతో మీతో కబుర్లు చెప్పమంటారా? ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను చేరి నీ రాణిగా ఏలుకొని, సరససల్లాపాలతో నాకెంతో ఆనందం కలిగించినందుకు సంతోషించాను స్వామీ!

**విశేషాంశాలు:** స్వామివారికి చేసే విశేష ఉపచారములలో కొన్నింటిని అన్నమయ్య ఇక్కడ ఉటంకిస్తున్నాడు." హరిద్రా కుంకుమ

చైవ, సింధూరం కజ్జలాధికం" అన్నట్లు కుంకుమపూత మేనికి పూయమంటారా స్వామీ! ఇంకా నృత్యం దర్శయామి అన్నట్లు నృత్యం చేయమంటారా స్వామీ అని అలమేలు మంగమ్మ అడుగుతున్నది.

## 50

**అవతారిక:** ఈ కీర్తనలో అలమేలు మంగమ్మ స్వామివారికి శృంగారంపట్ల ఉన్న అత్యాసక్తిని గురించి చెబుతూ ఇలా చేయడం నలుగురిలో నగుబాటు కాదా! ఇది తగునా అని స్వామిని ప్రశ్నిస్తున్నది.

### మాళవి

ప. వేగిరకాఁడవు నీవు వెసలఁ బెట్టుమనేవు
ఆగడము సేసి యేల అలయించేవు ॥పల్లవి॥

1. చలము పాదించరాదు జంకించి చూడఁగరాదు
యెలమి నింతలో నేరా యెగ్గుపట్టేవు
బలిమి చూపఁగరాదు పంతములాడఁగరాదు
తిలకించి యేమిరా తిట్టు దిట్టేవు ॥వేగిర॥

2. బెట్టి మాటాడఁగరాదు బిగువు చూపఁగరాదు
అట్టు అదేరా ఇట్టె యేఁచేవు
గుట్టున నుండఁగరాదు కొసరి నవ్వఁగరాదు
వుట్టిపడి నీవేరా వుప్పతించేవు ॥వేగిర॥

3. కదిసి పెనగరాదు కాగిలించుకొనరాదు
వుదుటున నౌరారా వొడివట్టేవు
ఇదివో శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
పొదిగి యేమిటికిరా బుజ్జగించేవు ॥వేగిర॥

**అర్థములు:** ప. వేగిరకాడు=త్వరపడేవాడు, ఆత్రగాడు; వెసలుపెట్టు=వేగముగా చెయమను; ఆగడము=అకార్యము. అలయించు =ఆయాసపెట్టు.

1. చలము=వణకు; పాదించు=చేయుట; జంకించు=బెదిరించు; ఎలమి=సంతోషము; బలిమి=ఆధిక్యత; పంతము=పట్టుదల; తిలకించు=చూచు.
2. బెట్టి=కఠినము; బిగువు=గర్వము; అట్టు=నింద; కొసరి=కోరిక; ఉట్టిపడు=అతిశయించు; ఉప్పతించు=నిందారోపణ చేయు;
3. కదియు=దగ్గరగా వచ్చు; పెనగు=చుట్టుకొను; కాగిలించు; ఉదుటున=ఉదృతము; ఔరౌరా=ఆశ్చర్యార్థసూచకమైన మాట; వొడివట్టు=పట్టుకొను; పొదిగి=చుట్టుకొని, కౌగలించుకొను.

**భావము:** ఓ స్వామీ! నీవింత తొందరపాటువాడవని అనుకోలేదు. నన్నేల అన్నిటికి తొందరపెడుతున్నావు. అకార్యములు చేసి నన్నెందుకు ఆయసపెడుతున్నావు? నీకిది ధర్మమేనా?

అన్నిటికి నన్ను వణికిస్తున్నావు, పైగా బెదురుపుట్టేవిధంగా చూస్తున్నావు. సంతోషంతో ఉన్న నన్ను ఎందుకు తప్పులెంచుతున్నావు? నీ ఆధిక్యత చూపి నన్ను పట్టుదలలతో చూస్తూ నన్నేల నిందిస్తున్నావు?

కఠినంగా మాట్లాడ తగునా? గర్వాతిశయాలు చూపతగునా? గుట్టు రట్టు చేస్తున్నావు. ఇలా మౌనంగా ఉండదగునా? మరలా కోరికలతో నవ్వ తగునా? అతిశయించి నీవు మరలా నిందారోపణ చేయతగునా?

స్వామీ! మరలా మీరే దగ్గరకు వచ్చి నన్ను మీ బిగి కౌగిలిలో బంధించి చుట్టుకుని ఉక్కిరి బిక్కిరి చేస్తారు. ఉదృతంగా ఔరౌరా! అంటూ పట్టుకుంటారు. ఇదిగో! ఓ వేంకటేశ్వరా నన్ను ఈ విధంగా చుట్టుకొని లాలిస్తూ ఏలుకుంటావు.

## 51

**అవతారిక:** ఈ కీర్తనలో దక్షిణ నాయకుడైన శ్రీనివాసుడు అన్యకాంతతో కూడి వచ్చిన విషయం అమ్మ అలమేలుమంగమ్మ కనిపెట్టి, ఋజువులు చూపిస్తూ అడుగుతున్నది.

### సామంతం

ప. మేలు మేలు నీ గుణము మెచ్చితి నేను
నీ లీల లోకమెల్లా నిండెఁగా నేఁడు ॥పల్లవి॥

1. వలపుగలుగువారు వద్దనే వుందురుగాక
తిలకించి వాడలకు దిరుగుదురా
తెలిపి చెప్పగనేల తేటతెల్లమిగ నాపె-
కలువదండ నీ మెడఁ గంటిగా నే నిపుడు ॥మేలు॥

2. ననుపుగలుగువారు నవ్వుతానుందురుగాక
తనివో కెవ్వితెనై నాఁ దలపోతురా
వెనుకటి సుద్దులేల వేడుకతో నాపెచేతి-
కొనవేలివుంగరము గురుతాయఁగా ॥మేలు॥

3. కైవసమైనవారు కాఁగిట నుందురుగాక
ఆవలివారితో మేలాలాడుదురా
శ్రీవేంకటేశ నన్నుఁ జేరి యిట్టెకూడితివి
నీవే నన్ను మన్నించుట నిజమాయఁగా ॥మేలు॥

**అర్థములు:** ప. మేలు మేలు=బాగున్నది; నిండెను=వ్యాపించెను.

1. వలపుగలుగువారు=ప్రేమగలవారు; తిలకించి=ప్రసన్నతనొంది; వాడలకు=వీధులయందు; తేటతెల్లమిగ=మిక్కిలి స్పష్టముగ; ఆపె=ఆమె.

2. ననుపు=అనురాగము; తనివోవు=తృప్తిపడు; ఎవ్వెతనై=ఏ స్త్రీనై; తలపోయు=చింతించు, ఆలోచించు; సుద్దులు=సూక్తులు, మాటలు; వేడుక=సంతోషము; ఆపె= ఆమె; కొనవేలు=చివరి వేలు; గురుతు=సంకేతము.

3. కైవసము=అధీనము, వశము; కాగిట=కౌగిట; ఆవలివారు=పరస్త్రీలు; మేలాలాడు=పరిహాసములాడు; నిజమాయె=శాశ్వతమగు.

**భావము:** ఓ ప్రాణనాథా! నీ గుణగణములు చేష్టలు బహుబాగున్నవి. నీ లీలలు ఈ లోకమంతా మెచ్చుకుంటున్నారు.

నాపై ప్రేమగలవారు నా వద్దనే ఉండవలెనుగదా! వాడవాడలలో వేరే చెలులకోసం చూస్తూ తిరుగుతారా? ఆమె వేసిన కలువపూల మాల నీ మెడలో నుండగా వేరే చెప్పడమెందులకు? ఆమెతో నువ్వు గడపిన విషయం తేటతెల్లమై పోయిందిగదా?

నాపై అనురాగం ఉన్నవారు నాతోనే నవ్వుతూ మాట్లాడుతూ ఉండవలెనుగదా! తృప్తి పడకుండా వేరొక చెలిని గూర్చి ఆలోచిస్తారా? ఆమె చేతి కొనవేలి ఉంగరము సంతోషముతో మీరు ధరించినపుడే నాకు సంకేతంగా తెలుస్తున్నది కదా! వేరే మాటలెందులకు?

నాకు వశమై అధీనమైనవారు నా కౌగిట్లోనే ఉండవలెనుగదా! వేరొక స్త్రీతో పరిహాసాలాడుతారా? ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను ఈ విధంగా తిరుమలగిరిపై కూడితివి. నీవే నన్ను మన్నించి దరిచేర్చుకోవడమే సత్యము, శాశ్వతము కదా!

**విశేషాంశాలు:** ఈ కీర్తనలో అన్నమయ్య గుణముల ప్రసక్తి చేశాడు. గుణములు దశవిధగుణములు అవి 1. కామము, 2.

క్రోధము, 3. లోభము, 4. మోహము, 5. మదము, 6. మాత్సర్యము, 7. దంభము, 8. దర్పము, 9. ఈర్ష్య, 10. అసూయ.

## 52

**అవతారిక:** స్వామికి, అలమేలుమంగమ్మకు ఏవో మాట పట్టింపులు వచ్చాయి. ఓ చెలి మరొక చెలికత్తెతో వారిద్దరికి మైత్రి చేకూర్చమని అడుగుతున్నది.

### కేదారగౌళ

ప. ఇద్దరిఁ గూర్చఁగదవె యింతిరో నీవు
సుద్దులు చెప్పేనంటే చోటెంతైనాఁ గలదు ॥పల్లవి॥

1. పడఁతి కడకు నిట్టె పతిఁ దోడుకొనిరావె
యెడమాట లాడఁబోతే యెన్నిలేవు
వెడవెడ మాని యట్టె విడెము చేతి కియ్యవే
ఆదరి యాతని ప్రియా లవెన్నై నాఁ గలవు ॥ఇద్దరి॥

2. మిగులా నిద్దరిఁ బాన్పు మీఁదఁ గూచుండఁ బెట్టవే
తగవుల బెట్టేమంటే తనివిలేదు
బగి వాయకుండా నట్టె పచ్చడము గప్పవే
పగటు లాతనివి చెప్పఁ గఁ గొత్త లిపుడు ॥ఇద్దరి॥

3. శ్రీవేంకటేశ్వరుచేత సేసలు వెట్టించవే
వావులు దెలుపఁగాను వయిపాయను
దేవులకు దేవునికి తెరవేయఁగదవే
చేవదేరేమోహము చెప్పనరు దిఁకను ॥ఇద్దరి॥

**అర్థములు:** ప.కూర్చు=మైత్రి చేయు, కలుపు; ఇంతిరో=ఓ వనితా; సుద్దులు=సూక్తులు; చెప్పేనంటే=చెప్పవలెనంటే; చొటు=తావు ఎంతైనా=ఎంతో.

1. కడకు=వద్దకు; నిట్టె=ఇప్పుడే; తోడుకొని=తీసుకొని, వెంటబెట్టుకుని; ఎడమాట=సంధిమాట; వెడవెడ=అల్పమైన, చిన్నవైన; విడెము=తాంబూలము; ఆదరి=ఉత్సాహము, సన్నద్ధము; ప్రియాలు=ఇష్టమైనవి.
2. మిగులా=అతిశయముతో; పాన్పు=పడకమంచము; తగవు=జగడము; తనివి=తృప్తి; బగివాయు=మర్యాదలు; పచ్చడము=వస్త్రము; పగటు=మురిపెము, లావణ్యము; కొత్తలు=ధనము.
3. సేసలు=అక్షతలు; వావులు=బంధుత్వములు; వయిపాయెను=లక్ష్యమగు; దేవులకు=అమ్మవారికి; దేవునికి=శ్రీనివాసునికి; తెరవేయు=అడ్డుతెరవేయు; చేవదేరు=పక్వమగు; మోహము=వలపు, ప్రేమ; అరుదు=ఆశ్చర్యము, అపూర్వము. ఇకను=ఇక మీదట.

**భావము:** ఓ రమణీ! నీవు ఇద్దరికి మైత్రి చేయవే! సూక్తులు చెప్పడానికి తావు ఎంతైనా ఉంటుంది.

ఆ శ్రీనివాసుని ఇక్కడున్న అలమేలుమంగమ్మ వద్దకు వెంటబెట్టుకుని తీసుకుని రావే! సంధిమాటలు చెప్పి కలపవలెనంటే ఎన్ని ఉపాయాలు లేవు చెప్పు? అల్పమైన చిన్న చిన్న విషయాలు మాని తాంబూలము త్వరగా చేతికివ్వవే. చెప్పవలెననుకుంటే అతనికి ఇష్టమైనవెన్నో ఉన్నాయి.

అతిశయంతో వారిద్దరిని పడకగదిలో పట్టెమంచంపై కూర్చొండబెట్టవే. ఇద్దరికి జగడం పెట్టాలనుకుంటే తృప్తి తీరదు. మర్యాదలు తప్పకుండా వారిద్దరికి పట్టువస్త్రం కప్పవే. స్వామివారి లీలలు లావణ్యములు చెప్పవలెనంటే దానికి యిప్పుడు క్రొత్త,

వింత ఏమున్నది.

శ్రీవేంకటేశ్వరుని చేత అమ్మపై అక్షతలు వేయించవే! బంధుత్వం చెప్పడానికి తగిన సమయం ఇప్పుడే. స్వామికి అమ్మకు తెరవేయవే! వారి వలపు ఇప్పుడు పక్వమై చెప్పుటకు అపూర్వము, ఆశ్చర్యమై ఉన్నది.

**గమనిక:** క్రిందుగీత గల పదములు చిలుము తినివేయడంవల్ల శ్రీమాన్ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు పరిష్కరించారు.

## 53

**అవతారిక:** ఈ కీర్తనలో శ్రీనివాసుడు మరొక కాంతను చేపట్టిన సంగతి గమనించిన అమ్మ అలమేలుమంగమ్మ కొన్ని గుర్తులను పసిగట్టి గుట్టు రట్టు చేస్తున్నది.

### గుండక్రియ

ప. దేవరవు గావా యీ తెఱగులకు
చేవదేరె నిఁక రట్టు సేయగవలెనా ॥పల్లవి॥

1. అఱిముఱి నూడిగాలు ఆపెచేత జేయించేవు
యెఱఁగనా నీజాడ లెప్పుడు నేను
మఱి నీవు దొరవౌదు మనసున మెచ్చితివి
గుఱుతులు నాకిన్నిటాఁ గొచ్చి చూపవలెనా ॥దేవరవు॥

2. కానుకగా నాపెసొమ్ము గక్కన నాకిచ్చేవు
కాననా నీ సేఁతలు కలకాలము
పూని నిజమరి వౌదు పొంచి నిన్ను నమ్మితిమి
తానకమై ఆ సుద్దులె తలపెట్టవలెనా ॥దేవరవు॥

3. అలమి నన్నుఁ గూడి ఆపెపేరఁ బిలిచేవు
తెలియనా నీగుట్టు తెల్లమిగాను
యిల జాణఁడ వౌదువు యిన్నిటాఁ దనిసితిమి
యెలమి శ్రీవేంకటేశ యెచ్చరించవలెనా ॥దేవరవు॥

**అర్థములు:** ప. దేవర=ప్రభువు, స్వామి, దేవుడు; తెఱగు=విధము, తీరు; చేవదేరు=బలపడు, పక్వమగు, సారవంతమగు; రట్టు=అల్లరి, బహిర్గతము, బయటపెట్టు.

1. అఱిముఱి=వరుసగా, ఒకదానివెంట మరొకటి; ఊడిగాలు=సేవలు; ఆపె=ఆమె; జాడ=గుర్తు; దొర=రాజు, గొప్పవాడు; గొచ్చి=త్రవ్వు.

2. ఆపె=ఆమె; గక్కన=త్వరగా; కాననా=చూడలేనా; కలకాలము=చిరకాలము; పూని=ప్రయత్నముతో; నిజమరి=సత్యశీలుడు; పొంచి=దాగి; తానకము=ఉనికి, స్థానము; సుద్దులు=సూక్తులు.

3. అలమి=క్రమ్మి, చుట్టుకొని; ఆపె=ఆమె; పేర=పేరుతో; తెల్లమి=స్పష్టము (తేటతెల్లము యొక్క రూపాంతరము); జాణడు=వగలాడు, నీటుగాడు; తనయు=తృప్తిచెందు; ఎలమి=సంతోషము; ఎచ్చరించు=సూచన చేయు, జాగ్రత్త చెప్పు.

**భావము:** ఓ స్వామీ! ఈ పనులేమిటి? నీవు నా స్వామివి, దైవానివి కదా! నీ చేతలన్నీ బాగా బలపడి సారవంతమయ్యాయి. ఇంకా గుట్టు రట్టు చేయవలెనా?

ఒక దానివెంట మరొక సేవలేమో ఆమె చేత చేయించుకొంటావు. నీవు చేసే చిలిపి పనులు గుర్తులు నేనెరుగనా చెప్పండి? నీవు ఆమెకు స్వామివై, ఏలుకునే ప్రభువై ఆమె మనసు గెలుచుకున్నావు. ఆ గుర్తులన్నీ నేనిప్పుడు త్రవ్వి చూపవలెనా?

బహుమతుల పేరుతో ఆమె సొమ్ములు త్వరపడి నాకిస్తావు. నీ చేతలు చిరకాలమునుండి గమనిస్తూనే ఉన్నాను. నేను నిన్ను

సత్యశీలుడవని, అన్నీ నిజాలే చెప్తావని సంపూర్తిగా నమ్మియున్నాను. నీవుచెప్పే ఆ సూక్తులే నాకు వినిపిస్తున్నారు.

నన్ను క్రమ్ముకుని చుట్టి ఉక్కిరిబిక్కిరి చేస్తూ మధ్యలో ఆమె పేరును కలవరిస్తూ పిలుస్తావు. నీ గుట్టు నాకు తెలియదనుకొంటిరా? వేరే ప్రత్యేకంగా చెప్పవలెనా చెప్పండి. నీతో అన్నివిధాలా తృప్తిపొందినవారము మహా గొప్ప వగలాడివై యున్నావు. ఓ శ్రీవెంకటేశ్వరా నీకు మళ్ళీ సూచనలు జాగ్రత్తలు చెప్పవలసిన అవసరముందంటారా చెప్పండి.

**విశేషాంశములు:** ఈకీర్తనలో అన్నమయ్య అటిముటి అనే గొప్ప ప్రయోగం చేశాడు. ఏదైనా పనులను వెంటవెంటనే ఒకదాని వెంట ఒకటి చేసినపుడు ఉపయోగించే పదం అది. మహాభారతములో "యుధిష్ఠిరుండటిముటిజంపె సారథి దదశ్వములంబటుబాణ పాణియై" అన్నాడు విరాట పర్వంలో తిక్కన సోమయాజి. అనగా ముందు సారథిని ఆ తర్వాత గుర్రాలను వెంటవెంటనే బాణపాణియై ధర్మరాజు చంపడం వర్ణించాడు. అలా ఈ కీర్తనలో శ్రీనివాసుడు సేవలను అటిముటిగా చేయించుకొన్నాడని అంటున్నాడు.

## 54

**అవతారిక:** ఈ కీర్తనలో స్వామి ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడై చేసిన రుక్మిణీ కరగ్రహణాన్ని, గొల్లచెలులను లోబరుచుకున్న వివరాలను వర్ణిస్తూ అతని గొప్పదనాలను అభివర్ణిస్తున్నది నాయిక.

### సింధురామక్రియ

ప. తొల్లె ఇన్నిటా నీవు దొడ్డవాఁడవు
చెల్లఁబెట్టి యిందరితోఁ జెప్పఁగ నేమిటికి ॥పల్లవి॥

1. పలుకులఁ గరఁగించి భావములఁ జొక్కించి
నెలఁతల వలపించనేరవా నీవు
వెలయు గొల్లెతలెల్లా వెన్నతోఁ బెట్టిరి నీకు
పొలసి నీ మహిమలు పొగడ నేమిటికి ॥తొల్లె॥

2. ననుపులు గడుఁజేసి నయములట్టె చూపి
వొనరఁ బెండ్లిండ్లాడ నోపవా నీవు
చనవిచ్చి రుకుమిణి సాముసేయించెను నాఁడె
పెనఁగుచు మెచ్చి నిన్ను బ్బించఁగ నేమిటికి ॥తొల్లె॥

3. చెక్కులు వేమరు నొక్కి సేఁతలన్నియునుఁ జేసి
లెక్కలేనిరతి సేయలేవా నీవు
యిక్కువతో శ్రీ వేంకటేశ నన్నుఁ గూడితివి
తక్కిననీపొందులెల్లాఁ దడవ నేమిటికి ॥తొల్లె॥

**అర్థములు:** ప. తొల్లె=మునుపు (తొల్లి రూపాంతరం); దొడ్డవాడు=గొప్ప, మంచి; చెల్లబెట్టు=ప్రయాసపడు, వ్యయపడు;

1. కరగించి=లోబడునట్లు చేయు, కరుగజేయు; జొక్కించు=పరవశింపజేయు; నెలతలు=భామలు; వెలయు=ప్రకాశించు; పొలయు=వ్యాపించు.
2. ననుపులు=అనురాగము; కదు=మిక్కిలి; నయములు=మహిమలు; ఒనర=ఒప్పుట; ఓపు=సహించు, ఊరుకొను; చనవు=కోరిక, ప్రేమ; సాము=యుద్ధము; పెనగు=చుట్టుకొను; ఉబ్బించు=పొంగించు, ముఖస్తుతిచేయు; ఏమిటికి=ఎందులకు.
3. చెక్కులు=చెక్కిళ్ళు; వేమరు=అనేకసార్లు; లెక్కలేని రతి=అసంఖ్యాకమైన సరససల్లాపాలు; ఇక్కువ=జాడ, స్థానము; తక్కిన=మిగిలిన; దడయు=భయపడు, వణకు

**భావము:** ఓ స్వామీ..మీరు ఆది నుండి అన్నివిధములా గొప్పవారు. ఇప్పుడు ప్రయాసపడి ఇందరితో చెప్పడమెందుకు?

మాటలతో మమ్ములను లోబడునట్టు, పరవశంపొందేట్టు జేసి, ఇప్పుడు భామలపై ప్రేమను చూపించలేరా? గొల్లభామలంతా

మీకు వెన్నను ప్రీతిగా బెట్టారు గదా? ప్రత్యేకించి మీ మహిమలు పొగడడమెందుకు?

అనురాగం బాగా చూపించి, మీ మహిమలను చూపించి, వారిని పెండ్లాడడానికి ఎందుకు ఒప్పుకోవడంలేదు? కోరికతో రుక్మిణీదేవి ఆనాడు మీతో యుద్ధం చేయించలేదా? ఇంకా నిన్ను మేము చుట్టుకొని కౌగలించుకొని మనసును పొంగించి ముఖస్తుతి చేయడం ఎందుకు?

మా చెక్కిళ్ళు అనేక సార్లు వత్తి, చేయరాని చిలిపి శృంగార చేష్టలన్నీ చేసి, ఇప్పుడు వారితో అనేకమార్లు రతి కార్యక్రమానికి విముఖతనెందుకు చూపుతున్నావు? ఓ వెంకటేశ్వరా! ఇక్కడి జాడ తెలిసి నాతో పొందు కూడితివి, ఇక మిగిలిన కలయికలకు భయపడడం ఎందుకు?

**విశేషాంశములు:** అన్నమయ్య ఈ కీర్తనలో నయములు అనే విశేష పదం వాడాడు. సామాన్యార్థంలో నయములు అనగా మహిమలు అనే అర్థంలో తీసుకోవచ్చు. కానీ స్వామి సప్త నయములైన 1. నైగమము, 2. సంగ్రహము, 3. వ్యవహారము, 4. ఋజుసూత్రము, 5. శబ్దము, 6. సమభిరూఢి, 7. ఏవంభూతము కలిగియున్నాడని చెప్పడం అన్నమయ్య అంతరార్థం.

## 55

**అవతారిక:** శ్రీనివాసుడు వేరొక కాంతను వెంటబెట్టుకుని వచ్చి శృంగారం నెరపుతూ ఉండగా మాత్సర్యం వహించి, స్వామితో జగడమాడుతున్న అమ్మ అలమేలుమంగమ్మను వలదని ఓ నాయిక వారిస్తున్నది.

### ఆహిరినాట

ప. ఎంతలేదు నీపగటు యెందాకానే
కాంతుని కిచ్చకమాడి కలయఁగరాదా ॥పల్లవి॥

1. వేడుకకు రమణుఁడు వేమారు నవ్వితేను
జాడెఱఁగక బొమ్మల జంకించేవే
యీడువెట్టి వేరొక్కతె నింటికిఁ దెచ్చుకొంటే
పాడిదప్పి నీ పంతము పై వచ్చెనటే ॥ఎంతలేదు॥

2. చెలరేఁగి యాతఁడు చెనకి చన్నులంటితే
పెలుచవై సారెనేల పెనఁగేవే
కొలువులోపలనున్న కొమ్మలఁ గాఁగిలించితే
చలపట్టి నీవుమరి సాదించేవటే ॥ఎంతలేదు॥

3. శ్రీవేంకటేశుఁడు నిన్నుఁ జేరి యిట్టె కూడితేను
ఆవటించి రతినెంత ఆలయించేవే
కావరించి వూడిగపుకాంతలతోఁ జెప్పితేను
తావుకొన్న నీ<u>వలపు</u> దాఁచేవటే ॥ఎంతలేదు॥

**అర్థములు:** ప. పగటు=మురిపెము, లావణ్యము; ఇచ్చకము=ప్రీతికరమగు ప్రియ వచనాలు పలకడం; కలయు=కూడు.

1. వేడుక=సంతోషము; వేమారు=పలుమార్లు; జాడ=విధము, దారి; బొమ్మలు=కనుబొమ్మలు; జంకించు=అదరవేయు; ఈడువెట్టి=వయసులోనున్నవాడు; పాడి=ధర్మము; పంతము=పట్టుదల, పైవచ్చు=పైకి కనబడచేయు.
2. చెలరేగి=విజృంభించి; చెనకి=అంటి; అంటు=తాకు; పెలుచ=కోపము; సారె=మాటిమాటికి; పెనగు=మారాడు; కొమ్మలు=కాంతలు, స్త్రీలు; కాగలించు=కౌగలించు; చలపట్టి=మాత్సర్యము చూపు; కోపగించు; సాదించు=బాధించు.
3. ఇట్టె=వెంటనే; కూడు=కలియు; ఆవటించు=పూనుకొని; అలయించు=శ్రమపెట్టు; కావరించి=మదించి; వూడిగము=సేవ;

తావుకొను=నిలచిఉండు; వలపు=మోహము.

**భావము:** ఓ అలమేలుమంగా! నీ లావణ్యములు చూపిస్తూ మురిపెములు పోవడం ఎంతవరకూ తల్లీ! నాలుగు ప్రీతికరమైన మాటలు మాట్లాడి ఆయన పొందు కోరవచ్చు గదా!

సంతోషంతో నీ స్వామి పలుమార్లు నవ్వితే, నీవాతని మనసు తెలుసుకోకుండా కనుబొమలు అదేపనిగా అదర వేస్తున్నావెందుకు? శ్రీవారు మంచివయసులోనున్నవారుగదా! వేరొక భామను ఇంటికి తెచ్చుకుంటే, నీవు ధర్మాధర్మ విచక్షణ లేకుండా పంతంతో పట్టుదలలు పైకే కనబరచడం ఎంతమాత్రం సమర్ధనీయం చెప్పు?

ఆ స్వామి విజృంభించి నీ వక్షభాగం స్పృశించగానే, అధిక కోపం వహిస్తూ, మాటిమాటికి స్వామితో ఎందుకు మారుమాట్లాడుతున్నావు? తన కొలువులో పనిచేస్తున్న స్త్రీజనాన్ని ఒక్క మారు కౌగలించుకోగానే, మాత్సర్యం చూపి కోపంతో ఎందుకు సాధిస్తున్నావు?

శ్రీవేంకటేశ్వరుడు నిన్ను వెంటనే చేరుకోగానే, పూనికతో రతులలో ఎంత అలసిసొలసి పోయావు చెప్పు? ఆ విషయాలన్నీ పొగరుగా నీవు సేవజేసే కాంతలతో చెబితే, స్వామిపై నీవు దాచుకొన్న మోహం దాచగలవా?

**గమనిక:** క్రిందుగీత గల పదములు చిలుము తినివేయడంవల్ల శ్రీమాన్ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు పరిష్కరించారు.

**విశేషాంశాలు:** ఈ కీర్తనలో అన్నమయ్య "పెలుచ" అనే గొప్ప ప్రయోగం చేశాడు. పెలుచ అనగా అధికమైన, కఠినమైన అనే అర్థాలున్నప్పటికి పూర్వం కావ్యాలలో ఉచ్ఛైరర్థకము, గట్టిగా అనే అర్ధాలలో వాడారు. నిర్వచనోత్తర రామాయణంలో తిక్కన సోమయాజి ఒకచోట "పాంచజన్యంబు బెలుచ బూరించి" అంటాడు. అంటే అంత గట్టిగా శంఖం ఊదాడని అర్థంలో వాడాడు. ఏదైనా పని శృతిమించి చేసినప్పుడు ఈ పెలుచ పదాన్ని కావ్యకర్తలుపయోగించిన రీతిలో అన్నమయ్య "పెలుచవై సారెనేల పెనగేవే" అన్నాడు. అనగా అంత అధికకోపం ప్రదర్శించినదనే అర్ధంలో వాడడం జరిగింది.

## 56

**అవతారిక:** ఈ కీర్తనలో శ్రీనివాసుడు ఎంత దయాసముద్రుడో తెలుపుతూ ఆయన అందచందాలను చేష్టలను నాయిక వివరిస్తున్నది.

### రామక్రియ

ప. ఎంతటివాఁడవు నిన్ను నేమిచెప్పేది
కంతుని తండ్రివౌట కంటిమి నేమెల్లాను ॥పల్లవి॥

1. తేనే (ల?) లు వంటిమాటలు తివిరి నీవాడఁగాను
ఆనుకొని వలచిరి యతివలెల్లాను
మోనముతోఁ బొరుగున మొక్కులు చేత మొక్కఁగ
మానలేక తగిలిరి మగనాండ్లెల్లను ॥ఎంతటి॥

2. జోడుగాఁ దరితీపుల చూపులు నీవు చూడఁగ
వేడుకతోఁ బైకొనిరి వెలయాండ్లు
వాడి కెనవ్వులు నీవు వరుసతో నవ్వఁగాను
ఆడానీడాఁ బొందిరి పాయపుకన్నెలెల్లాను ॥ఎంతటి॥

3. సేయరానిమంతనపు సేఁతలెల్లాఁ జేయఁగాను
ఆయ మెటిఁగి పెండ్లాడి రచ్చరలెల్లా
యీయెడ శ్రీవేంకటేశ యేలితివి మమ్ము నిట్టె
డాయఁ గొలిచేరు నీపట్టపుదేవుళ్ళెల్లను ॥ఎంతటి॥

**అర్ధములు:** ప.ఎంతటి వాడవు=ఎంత దయాసముద్రుడవు; కంతుడు=మన్మథుడు; కంటిమి=చూసితిమి; ఎలాను=సమస్తము.

1. తేనెలవంటి మాటలు=తీయనైన పలుకులు; తివిరి=ఆలోచించి, త్వరపడి; వలచు=మోహించు; అతివలు=ఆడువారు, స్త్రీలు; మోనము=మౌనము; పొరుగు=సమీపము; మొక్కు=నమస్కరించు; చేత=చేయుట; తగిలిరి=చిక్కు; మగనాండ్రు=భర్తగల ఇల్లాళ్ళు.
2. తరితీపు=ప్రీతి, అపేక్ష; వేడుక=కుతూహలము; పైకొను=ప్రయత్నించు, దగ్గరగు; వెలయాలు=వేశ్య; వాడికె నవ్వులు=అలవాటుగానవ్వే నవ్వు; వరుస=క్రమము; ఆడనీడ=అక్కడ ఇక్కడ; పాయపు కన్నెలు=యుక్తవయసుగల కన్నెలు.
3. మంతనము=ఏకాంతము, రహస్యము; సేతలు=పనులు; ఆయము=జీవస్థానము; అచ్చరలు (వి)=అప్సరస (ప్ర); డాయ=సమీపించు; పట్టపు దేవుళ్ళు=పట్టము కట్టుకొన్న రాణులు.

**భావము:** ఓ శ్రీనివాసా ఎంతటి దయాసముద్రుడవు? నీవు మన్మథుని తండ్రివవడం మా కందరకు తెలిసిన విషయమే కదా!

నీవు మాట్లాడే మాటలు తెనెసోనలకంటే అత్యంత మధురంగా ఉండడం వలన అతివలంతా నిన్నే అంటిపెట్టుకొని వదలకుండా నీపట్ల మోహం చూపిస్తున్నారు. ఆ స్త్రీలంతా మౌనం వహించి నిన్ను సమీపించి ఎన్నో మొక్కులు మొక్కుకుంటూ నిన్ను వదలలేక నీ మోహంలో చిక్కుకుంటున్నారు.

వారితో జతగూడి ప్రీతిగా అపేక్షతో ఒక్కసారి చూడగానే వారంతా కుతూహలంతో ప్రయత్నపూర్వకంగా నీకు దగ్గరవుతున్నారు. అలవాటైన నీ చిరుమందహాసాలతో ఉండగా అక్కడా ఇక్కడా కన్నెపిల్లలంతా నీ పొందు కోరుకుంటున్నారు.

నీవు ఏకాంతంలో చేయరాని చిలిపి చేతలు చేయగానే ఆ అప్సరసల వంటి స్త్రీలు ఇష్టపూర్వకంగా నీకు చేరువవుతున్నాను. ఓ శ్రీవేంకటేశ్వరా! ఇక్కడ తిరుమలగిరిలో ఇలా మమ్ము పరిగ్రహించగానే, నిన్ను సమీపించి పట్టపు రాణులంతా నిన్ను అనేక విధాల ఆరాధిస్తున్నారు.

**గమనిక:** క్రిందుగీత గల పదములు చిలుము తినివేయడంవల్ల శ్రీమాన్ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు పరిష్కరించారు. ఆవిధమైన పరిష్కరణలో మొదటిపాదంలో “కంతుని తండ్రివౌట కంటిమి నేమెల్లాను” అని సవరించారు. కానీ కొంచెంలోతుగా చూసినట్లైతే “కంతుని తండ్రివౌట కంటిమి మేమెల్లాను” అనడం సబబని అనిపిస్తున్నది. “నే” శబ్దము “నా” శబ్ద ప్రథమైకవచనమునకు సరళస్థిరవర్ణములు పరములగుచో ద్రుతములోపించిన రూపము. అనగా నేగెలిచితిని, నేవింటిని లాంటి రూప ప్రయోగం జరిగింది. కీర్తన మొత్తం బహువచనంతో సాగి చివరకు “శ్రీవేంకటేశ యేలితివి మమ్ము నిట్టె” అన్నాడు అన్నమయ్య. కనుక “నేమెల్లాను” అనే పదం కంటే “మేమెల్లాను” అనడమే సబబని భావిస్తున్నాను.

## 57

**అవతారిక:** ఈ కీర్తనలో అమ్మ స్వామి శ్రీనివాసునితో శృంగారం నెరపుతున్న సమయంలో, ఒక నాయిక దూరం నుండి గమనిస్తూ స్వామికి చేస్తున్న సైగలను, చేష్టలను అమ్మ అలమేలుమంగమ్మ గమనించి ప్రశ్నిస్తున్నది.

### శంకరాభరణం

ప. ఆకెఁ బిలువవయ్యా యిచ్చటికిని
కాకరిపను లడుగఁగవలె నిఁకను ॥పల్లవి॥

1. నునుపులమాఁటలు నాతోనాడఁగ
కనుగొని నవ్వీఁగడ నొకతె
యెనయఁగ నీగుణ మేమిదెలిసెనో
వెనకటిపను లవి వినవలె నిఁకను ॥ఆకెఁ॥

2. సరసముతో నాసరులు దిద్దఁగా
కెరలుచు నటు గొణఁగీ నొకతె
ధర నీ సేఁతలు తానేమెఱుఁగునో

గరిమ లన్నియునుఁ గనవలె నిఁకను ॥ఆకె॥

3. కందువతో ననుఁ గాఁగిలించగా
చెంది సన్న సేసీ నొకతె
యిందునె శ్రీవేంకటేశ కూడితివి
చందము లిటు మెచ్చఁగవలె నిఁకను ॥ఆకె॥

**అర్థములు:** ప. ఆకె=ఆమె; కాకరి=టక్కరి, మాయగాడు.

1. నునుపు=అనురాగము; నవ్వీ=నవ్వుచున్నది; కడ=సమీపము; ఎనయగ=కలియగ; వెనుకటి=ఇదివరకటి.
2. సరులు=దండలు, మాలలు; కెరలు=అతిశయించు; గొణగీ=చిన్నగా అస్పష్టముగా మాట్లాడుట; ఒకతె=ఒక స్త్రీ; ధర=భూమి; గరిమ=అధికము.
3. కందువ=ఏకాంతము; కాగిలించు=కౌగలించుకొను; సన్న=సైగ; చందము=విధము; మెచ్చగవలె=మెచ్చుకొనవలెను.

**భావము:** ఓ శ్రీనివాసా! ఆమెను ఇక్కడికి పిలువవయ్యా..ఆమె చేసే చిలిపి పనులూ మాయలు అడగవలసి ఉంది.

అనురాగంతో నాతో మాట్లాడుతూ ఉంటే, అది చూస్తూ సమీపములో నవ్వుతూ నిలబడ్డది ఒక కాంత. ఆమె అలా నవ్వడానికి ముందు కాలంలో నీవు చేసిన ఘనకార్యాలేమిటో వినవలెనని ఉన్నది.

సరససల్లాపాలాడుతూ నువ్వు నా మెడలోని హారాలను సరిచేస్తూ ఉంటే, అతిశయంతో అల్లంత దూరంలో ఒక వనిత ఎదో వినబడీ వినబడకుండా మాట్లాడుతున్నది. నీవు ఇక్కడ చేసిన చేతలు ఆమె ఏమేమి తెలిసికొని ఉన్నదో, నీ గొప్పదనాలన్నీ చూడాలని వినాలని ఉన్నది.

ఏకాంతములో నిన్ను కౌగలించుకోగానే, ఒక రమణి ఏవో సైగలు చేస్తున్నది. ఓ శ్రీవేంకటేశ్వరా ఇచ్చోట నన్ను కూడియున్నావు నీ విధానాలేమిటో తెలిసికొని మెచ్చుకోవలసి ఉన్నది.

## 58

**అవతారిక:** ఈ కీర్తనలో ఒక నాయిక స్వామి శ్రీనివాసుడు చేసే చిలిపి శృంగార చేష్టలను వివరిస్తూ మెచ్చుకొంటున్నది.

### దేశాక్షి

ప. మంచివాఁడవయ్య నీవు మరిగి సిగ్గువడవు
యెంచరాని నీ వలపు ఇటు చూపవలెనా ॥పల్లవి॥

1. నవ్వులకు నీతోను నాతియాడినమాటలు
రవ్వలేల సేసేవు రచ్చలోనను
పువ్వుల వేసే వప్పటి బుజ్జగించే వంతలోనె
ఇవ్వల నీగజరులు ఇటు చూపవలెనా ॥మంచివాఁడ॥

2. విందువలె మోవితేనె వెలఁది యొసగి తేను
అందరిలో నేల చెప్పే వంగడి నీవు
అందు కొనేవు పయ్యెద అట్టె చన్నులు మూసేవు
ఇందు లోనే తమకములు యిటు చూపవలెనా ॥మంచివాఁడ॥

3. కలసి మెలసి యింతి కాఁగిలించి కూడితేను
వెలినేల నవ్వేవు వేడుకతోను
యెలమి శ్రీవేంకటేశ యేలి కమ్మటి నంటేవు
యిలపై నీ యెమెలెల్లా నిటు చూపవలెనా ॥మంచివాఁడ॥

**అర్థములు:** ప. మరిగి=అలవాటయి; సిగ్గువడవు=సిగ్గుపడవు; ఎంచరాని=గణించలేని; వలపు=మోహము.

1. నవ్వులకు=నవ్వుకోవడానికి; నాతి=ఆడుది, స్త్రీ; రవ్వలు=అల్లరి; సేసేవు=చేస్తావు; రచ్చ=ఎత్తైన ప్రదేశము, మార్గము; బుజ్జగించు=లాలించు; గజరులు=పులకించు.
2. మోవితేనె=అధరామృతము; వెలది=స్త్రీ; ఒసగు=ఇచ్చు; అంగడి=అల్లరిచేయు; పయ్యెద=పైటకొంగు; తమకము=మోహము.
3. కలసిమెలసి=అన్యోన్యముగ; కాగలించి=కౌగలించి; వెలి=బయటకు; వేడుక=సంతోషము, కుతూహలము; ఎలమి=వికాసము; కమ్మటి=మరల; ఎమెలు=విలాసములు.

**భావము:** ఓ శ్రీనివాసా! ఎంత మంచి మనసయ్యా నీది. నీవు సిగ్గుపడకుండా మాపై చూపించే అనురాగం లెక్కకట్టలేనిదయా స్వామీ.

ఏదో నవ్వుకోడానికి నీతో ఆ ఇంతి మాట్లాడిన మాటలను పట్టుకొని, అందరిలో ఆమెను అల్లరి అల్లరి చేస్తున్నావెందుకు? ఒకవైపు పువ్వులు విసురుతావు, లాలిస్తావు. ఇలా నీ పులకింతలన్నీ ఈ విధంగా చూపించవలెనా?

ఆమె ఇచ్చే అధరామృతాన్ని విందులాగా స్వీకరిస్తావు. మరలా ఆవిషయాలన్నీ రచ్చకీడ్చి అందరిలో అంగడిపెట్టినట్లుగా అల్లరి చేస్తావు. ఆమె పైట చెంగు అందుకుని ఆమె వక్షోజాలను చేతులతో మూస్తావు. ఇంతలోనే నీ మోహాలన్నీ ఈవిధంగా చూపవలెనా?

అన్యోన్యంగా ఆ కాంతామణి నిన్ను కౌగలించుకోగానే అన్నీ బట్టబయలు చేస్తూ కిలకిలా నవ్వుకుంటావు. ఓ శ్రీవేంకటేశ్వరా! వికాసముతో నన్నేలుకుంటూ మరల మరలా చిలిపిగా స్పృశిస్తూ ఉంటావు. ఈ భూమిపై నీ విలాసాలు ఈ విధంగా పలువిధాలుగా దర్శింపజేయవలెనా?

## 59

**అవతారిక:** ఈ కీర్తనలో ఒక నాయిక స్వామి ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడై వెలసి గొల్లచెల్లుల మనసు కొల్లగొట్టడం, పాలుపెరుగు అమ్మినటువంటి విషయాలన్నీ ఏకరువు పెడుతున్నది.

### శ్రీరాగం

ప. ఎఱఁగరా నీ సుద్దులు యింతు లెల్లాను
అఱిముఱి దొడ్డి (దొడ్డ?) వారమని మమ్ము నవ్వేవు ॥పల్లవి॥

1. గొల్లవాఁడవై తిరిగి కోరి నీవు మరికదా
వెల్లవిరి మధురలొ వెలవెట్టితి
పల్లదపు సేఁతలతొ పసులఁ గాచికదా
యెల్లవారికిని మరి యేలికవైతివి ॥ఎఱఁగరా॥

2. బెరసి యశొదకు బిడ్డఁడవై వుండి కదా
పొరలి దేవకి నిజపుత్రుఁడవైతి
వరుసతొ రేపల్లె వాడల దిరిగి కదా
నరపతివై ద్వారకా నగరమెక్కితివి ॥ఎఱఁగరా॥

3. మందలోని సతులను పొంది పొంది మరికదా
అంది పదారువేలఁ బెండ్లాడితివి
యిందునె శ్రీ వేంకటేశ యిటు నన్నుఁ గూడికదా
దిందుపడి శ్రీ వేంకటాద్రి పై నిలిచితివి ॥ఎఱఁగరా॥

**అర్థములు:** ప. ఎరగు=తెలిసికొను; సుద్దులు=సూక్తులు, మంచిమాటలు; అఱిముఱి=మిక్కిలి; దొడ్డవారు=మంచివారు.

1. గొల్లవాడు=శ్రీకృష్ణుడు; వెల్లవిరి=వ్యాపించు; వెలవెట్టు=వెలకుపెట్టు, పందెము కాచు; పల్లదము =విలాసము, వ్యర్థభాషణము; సేతలు=పనులు; పసుల=పశువులను; గాచి=కాయుట; ఎల్లవారు=అందరికి; ఏలిక=ప్రభువు, రాజు.
2. బెరయు=చేరి, వ్యాపించు, పొందు; పొరలి=దొర్లు, తిరుగాడు; నిజపుత్రుడు=అసలైన కుమారుడు; వరుస=క్రమము, వయస్సు; నరపతి=రాజు, ప్రభువు; ఎక్కితివి=సింహాసనమధిష్టించు.
3. మంద=సమూహము, గుంపు; సతులు=ఆడువారు; పొందు=కలయు; అంది=చేకొని; పదారువేల=పదహారువేలమంది స్త్రీలను; ఇందునె=ఈ తావుననే; దిందుపడు=భూమండలమునకు దిగి.

**భావము:** ఓ స్వామీ! నీ విషయములన్నీ ఇక్కడ ఉన్న ఈ స్త్రీజనానికి తెలియదా! చాలా మంచి వాళ్ళమని మమ్ములను జూసి నవ్వుతున్నావు. నీ సంగతులన్నీ మాకు తెలుసులే.

అలనాడు ద్వాపరయుగంలో గొల్లవాని రూపంలో శ్రీకృష్ణుడవై, కోరి కోరి విజృంభించి మధురానగరంలో వెన్న నెయ్యి వంటి పదార్థములు అమ్మినావు కదా! విలాసపు చేతలతో గోవులను కాచావు గదా! అక్కడ అందరికి ప్రభువైనావు.

దేవకీదేవి అసలు పుత్రుడవైన నీవు కోరి చేరి యశోదమ్మకు బిడ్డగా ఉండి కదా, బంధుత్వాలు పెట్టుకొని రేపల్లెలోని వాడ వాడలు తిరిగికదా చివరకు ద్వారకాధీశుడవైనావు.

మందలు మందలుగా ద్వారకా నగరంలో ఉన్న గొల్లెతలను సరసల్లాపాలలో ముంచి చేపట్టి పదహారువేల మందిని పెండ్లి చేసుకొన్నావు. అక్కడనుండి భూమికి దిగి, కలియుగ దైవమై, ఈ తిరుమల గిరిలో శ్రీవేంకటేశ్వరుడవై నన్ను చేపట్టావు.

## 60

**అవతారిక:** ఈ కీర్తనలో అమ్మ అలమేలుమంగమ్మ పట్టపురాణులలో తనకు గల గౌరవస్థానానికి ఉబ్బి తబ్బిబౌతూ స్వామిని బహుధా ప్రశంసిస్తున్నది.

### వసంతవరాళి

ప. పరగ నేఁ జేసినట్టి భాగ్యము గాక
సరస నీ దేవుళ్ల లో చక్కనిదాననా ॥పల్లవి॥

1. మన్నించి నీవు నను మాఁటలాడించేవు గాక
యెన్నిక నీ సతులలో నేమి బాఁతి
అన్నిటా నేరుపరివై యాదరించేవు గాక
కన్నెలు పదారువేలకంటె దొడ్డ దాననా ॥పరగ॥

2. యెల్లగా నాచే విడె మిప్పించుకొనేవు గాక
తొల్లిటి కాంతలకంటె దొరనా నేను
మెల్లనె నాచన్నుల మీఁదఁ జేయి వేసేవు గాక
గొల్లెతలకంటె నే నెక్కుడు దాననా ॥పరగ॥

3. ననుపునఁ గూడి నన్ను నవ్వు నవ్వించేవు గాక
చనవరి కాంతల సరివత్తునా
యెనసితివి శ్రీ వేంకటేశ నన్ను నింతలోనె
మనెడి వారికంటె మలసేటి దాననా ॥పరగ॥

**అర్థములు:** ప. పరగ=ఒప్పుగ; భాగ్యము=అదృష్టము; సరస=ప్రక్కన; దేవుళ్ళు=వేల్పులు.

1. మన్నించు=గౌరవించు; ఎన్నిక=ఎంచుకొను; బాతి=ప్రేమ, శ్రద్ధ; నేరుపరి=నేర్పరి, సమర్థుడు; ఆదరించు=ప్రేమించు, చేరదీయు, గౌరవించు; దొడ్డ=మంచిగుణముగల.

2. ఎల్లగా=మర్యాదగా; విడెము=తాంబూలము; తొల్లిటి=క్రితం ఉన్నటువంటి; దొర=గొప్ప; మెల్లనె=చిన్నగా, అలవోకగా; గొల్లెత=గొల్లభామ; ఎక్కుడు=ఎక్కువైన, శ్రేష్టమైన.
3. ననుపు=అనురాగము, ప్రేమ; చనవరి=చనువుగల, స్నేహితురాలు; సరివచ్చు=సమానము; ఎనయు=పొందుకూడు; మనెడి=కలసి జీవించు; మలయు=తిరుగు, సంచరించు.

**భావము:** స్వామీ! ఆహా! నేనెంతటి అదృష్టం చేసుకున్నానో గదా! నీ ప్రక్కన ఉన్న దేవేరులలో, రాణులలో అంత చక్కని దానినా?

నన్నెంతో గౌరవించి నీవు నాతో సంభాషణలాడుతున్నావు గాని, నీ రాణులలో ఎంచి చూస్తే నాపై ఎందుకింత శ్రద్ధ, ప్రేమ చూపిస్తున్నావు. అన్ని విషయాలలో సమర్థుడవై నన్ను ఆదరిస్తున్నావు గాని, నీకున్న పదహారువేల కాంతలలో అంత మంచిదాననంటారా?

మర్యాదతో, మక్కువగా నా చేతి తాంబూలం స్వీకరిస్తున్నారు గాని, క్రితం ఉన్న అందరి రమణులకంటే అంత గొప్పదాననా? ఎవరూ గమనించకుండా చిన్నగా చనువుతో నా వక్షోజాన్ని తాకుతున్నావు గాని, అంతమంది గొల్లభామలలో నేనెక్కువదాననంటారా?

అనురాగం చూపిస్తూ నాతో చేరి నవ్వులు రువ్వుతూ నన్ను అలరిస్తున్నావు గాని, నీకు చనువైన అందరి కాంతలకంటే నేను సరిపోల్చదగిన దాననా? ఇంతలోనే ఎంతో అనురాగంతో ఈ తిరువేంకటాద్రి పై శ్రీవేంకటేశ్వరుడవై నన్ను చేకొన్నావు. నీతో కలిసి మెలసి ఉండెడి స్త్రీజనానికన్నా నేను అంత ఇష్టమైన దాననా స్వామీ!

## 61

**అవతారిక:** అన్యకాంతలతో గూడి స్వామిచేసే శృంగార చేష్టలకు అమ్మ అలమేలుమంగమ్మ కినుక వహించి వైనమడుగుతున్న దృశ్యం.

## శుద్ధవసంతం

ప. ఇంతేసి మీ గుట్టు లెవ్వ డెఱుఁగు
వింతలాయ నేఁడు వివరించగాను ॥పల్లవి॥

1. చల్లని చూపుల నీవు సారెఁ దన్నుఁ జూడఁగాను
మెల్లని మాటల నాపె మెచ్చనాడఁగా
యెల్లవారు నెరిఁగిరి యిద్దరి మీ పొందులు
కల్లలంటా నుంటిమి యీకత లిన్నాళ్లదాఁకా ॥ఇంతేసి॥

2. చెలరేఁగి నీవు నట్టె చేసన్నలు సేయఁగాను
నలువంకలను నాపె నవ్వఁగాను
తెలిసి రిందరు నేఁడు తేటతెల్లమిగాను
బెళుకులంటా నుంటిమి ప్రియము లిందాఁకాను ॥ఇంతేసి॥

3. శ్రీ వేంకటేశ నీవు చేకొని కూడఁగాను
కావరించి పయ్యదాపె గప్పఁగాను
యీవల మమ్మేలితిరి ఇంతులు సంతోసించిరి
ఆవలపులే సతమనుచు నేముంటిమి ॥ఇంతేసి॥

**అర్థములు:** ప. ఇంతేసి=ఎక్కువైన, అధికమైన; గుట్టు=రహస్యము; ఎ!రుగు=తెలుసు; వింతలు=ఆశ్చర్యము; వివరించు=తెలియజెప్పు.

1. సారె=మాటిమాటికి; దన్ను=అండ; మెల్లని=చిన్నవైన; ఆపె=ఆమె; మెచ్చనాడు=మెచ్చుకొను; ఎల్లవారు=అందరు; ఎరిగిరి=తెలిసికొనిరి; పొందులు=కలయికలు, కూడికలు; కల్ల=అబద్ధము;కత=కథ; కల్పితమైనది; ఇన్నాళ్ళు=ఇన్ని రోజులు.
2. చెలరేగి=విజృంభించి; చేసన్నలు=చేతితో చేయు సైగలు, సంజ్ఞలు; నలువంకలు=నాలుగు దిక్కులు; ఆపె=ఆమె; తేటతెల్లమి=ఎక్కువ స్పష్టమగు; బెళుకులు=తళతళ ప్రకాశించు; ప్రియము=ఇష్టము; ఇందాకా=ఇప్పటివరకు.

3. చేకొని=చేపట్టి, గ్రహించి; కూడు=కలియు, పొందుచేయు; కావరించు=మదించు, గర్వించు; పయ్యద=పవిట కొంగు; ఆపె=ఆమె; కప్పగాను=మూసుకొనుట; ఈవల=ఈప్రక్కన; ఇంతులు=స్త్రీలు; సతము=శాశ్వతము; నేముంటిమి=మేమున్నాము.

**భావము:** ఓ స్వామీ! ఇంత అధికమైన రహస్యములెవ్వరికి తెలియును? ఈనాడు అన్నీ తెలియజెప్పడానికి మాకెంతో ఆశ్చర్యంగా అనిపిస్తున్నవి.

మీరు మాటి మాటికి చూసే చల్లని చూపులు అండగా ఉండగా, చిన్నచిన్నగా ఆమె మీతో మాట్లాడుతూ మిమ్ములను మెచ్చుకొనడం, యివన్నీ అందరికి తెలిసినవే గదా మీ యిరువురి కూడికలు, చేరికలు. అవన్నీ అబద్ధాలనుకుంటూ ఉన్నాము. ఈ కల్పనా చాతుర్యపు మాటలాడడం ఇంకెన్నాళ్ళు స్వామీ!

స్వామీ! మీరు విజృంభించి చేతితో ఆమెకు ఏవో సైగలు చేయగా, ఆమె నాలుగు దిక్కులా చూసి పకపకా నవ్వగా, మీ యిద్దరి విషయము పూర్తిగా మాకు స్పష్టమయినది. ఇంత ప్రకాశాన్ని విరాజిల్లుతున్న మీ ప్రియమైన సఖ్యతలు, శృంగార చేష్టలు యిప్పటి వరకూ చూస్తూనే ఉన్నాము.

ఓ శ్రీవేంకటేశ్వరా! నువ్వు ఆమెను చేపట్టి కలియగానే, ఆమె సిగ్గుతో పైటకొంగు కప్పుకొన్నది. ఈ ప్రక్కన తిరుమలగిరులపై మమ్మేలుకొనగా రమణులంతా సంతోషించిరి. ఆ ప్రేమలే శాశ్వతమని నమ్ముకొని మేమున్నాము.

## 62

**అవతారిక:** ఈ కీర్తనలో అమ్మ అలమేలుమంగమ్మ శ్రీనివాసునితో సంభాషిస్తూ స్వామీ నా మాటలకు మీరు ఎదురు మాటాడవద్దు, కాదని పలుకవద్దు అంటూ స్వామి ముందరి కాళ్ళకు బంధం వేస్తున్నది.

### సామంతం

ప. మారుమాట లాడరాదు మరి నేరా లెంచరాదు
సారెకు నిదివో నీ సంగాతాలు ॥పల్లవి॥

1. ఇచ్చకము లాడవలె ఇయ్యకొని యుండవలె
నిచ్చలు నేపొద్దు నాకు నీతో బదుకు
పచ్చి దేర నవ్వవలెఁ బనులన్నీఁ జేయవలె
గచ్చులను నీతోడికాఁపిరము నాకు ॥మారుమాట॥

2. తప్పక చూడఁగవలె తమకము చూపవలె
నెప్పున నెప్పుడు నాకు నీపొందులు
ముప్పిరిఁ బొగడవలె మోహము చెప్పఁగవలె
కుప్పలుగ నీతోడిమక్కువ నేస్తాలు ॥మారుమాట॥

3. కలసి వుండఁగవలె కాఁగిట బిగించవలె
తోలఁగరా దెంతైనా నీతో చెలిమి
యెలమి శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నిట్టె
అలమేల్మంగనే నేను అదె నీనాకూటమి ॥మారుమాట॥

**అర్థములు:** ప.మారుమాట=ఎదురు చెప్పు, ప్రత్యుత్తరము; నేరాలు=అపరాధములు; సారెకు=మాటి మాటికి; సంగాతము=స్నేహము.

1. ఇచ్చకము=ముఖప్రీతి మాటలు, ప్రీతినిచ్చెడు మాటలు; ఇయ్యకొను=అంగీకరించు, సమ్మతించు; నిచ్చలు=ఎల్లప్పుడు; ఏ పొద్దు=ప్రతి క్షణము; బదుకు=జీవితము; పచ్చిదేర=తడియగు, శృంగారపరమైన; గచ్చులు=దుడుకుమాటలు; నీతోడి=నీతోకలిసి ఉండు; కాపిరము=కాపురము, సంసారము.

2. తమకము=మోహము, ప్రేమ; నెప్పున=స్థానమున; ముప్పిరి=మూడింతలుగ; మోహము=వలపు; కుప్పలుగ=అతిశయించు;

నీతోడి=నీతోకలిసి ఉండు; మక్కువ=ఇష్టము; నేస్తాలు=స్నేహితులు.

3. కాగిట=కౌగిటిలో; తోలగరాదు=పోగొట్టుకొనరాదు; చెలిమి=స్నేహము; ఎలమి=సంతోషము, వికాసము; ఏలితివి=పాలించు, పరిగ్రహించు; నీనా=నీయొక్క మరియూ నాయొక్క; కూటమి=సాంగత్యము, కూడిక.

**భావము:** ఓ శ్రీనివాసా! నీతో కొన్ని విషయాలు విన్నవించవలసి యున్నది. మరి నీవు ఎదురుచెప్పనూకూడదు, ప్రశ్నలనూ వేయకూడదు. అలాగే అపరాధములను కూడా లెక్కించకూడదు సుమా!. ఎందుకంటే నేను ఎల్లప్పుడూ నీ స్నేహమునే కోరుకొంటున్నదానను.

నాతో నిరంతరము ప్రీతిని కూర్చే మాటలే మాట్లాడుతూ అన్నిటికీ సమ్మతించి ఉండాలి. ఎల్లప్పుడూ, ప్రతి నిముషమూ కూడా నీతోనే నా బ్రతుకు ముడిపడి ఉన్నది. సదా శృంగారపరమైన మాటలే మాట్లాడుతూ నవ్వుతూ ఉండాలి. నేను చెప్పిన పనులన్నీ చేయాలి. నీతో సంసారం దుడుకుమాటలతో కూడినది స్వామీ!

నాపై ఎల్లప్పుడూ మోహాన్ని చూపుతూ నన్నే చూస్తూ ఉండాలి. నిరంతరము నీ స్థానములో నీతో కూడి మాత్రమే ఉండాలి. నన్ను ఎల్లవేళలా ఎంతెంతో గొప్పచేసి పొగడుతూ నాపై ప్రేమను చూపిస్తూ ఉండాలి. నీపై మక్కువచూపే స్నేహితులు కోకొల్లలుగా ఉనారు స్వామీ!

ఎల్లప్పుడూ నన్నంటిపెట్టుకుని ఉంటూ నన్ను సదా నీ బిగి కౌగిలిలో బంధించి ఉంచాలి. ఏదిఏమైనా నీతో స్నేహము పోగొట్టుకోరానిది స్వామీ! ఓ శ్రీవేంకటేశ్వరా! సంతోషముతో నన్ను ఇక్కడ ఈవిధంగా పరిగ్రహించావు. నేను అలమేలుమంగను స్వామీ! నీయొక్క మరియూ నాయొక్క సాంగత్యము అదే స్వామీ! అనుగ్రహించండి.

## 63

**అవతారిక:** ఈ కీర్తనలో స్వామి శ్రీనివాసుని పొందుకై నిద్రాహారాలు మాని పరితపిస్తున్న అలమేలుమంగమ్మ మదన తాపాన్ని ఓ శృంగార నాయిక స్వామికి నివేదిస్తున్నది.

### ఆహిరి

ప. అదివో నీ చిత్తము ఆకె భాగ్యము
కదలిఁక లిందులోనే కనుకో నీవిఁకను ॥పల్లవి॥

1. పున్నమవెన్నెలలోనఁ బొద్దువోక జవరాలు
నిన్నుఁదలఁచి రేయల్లా నిద్దురవోదు
విన్నవించితిమి నీకు వేవేలకు నొక్కమాటె
యెన్నికలెల్లా నీవే యెఱుఁగుదు విఁకను ॥అదివో॥

2. చేరి యారామములోనఁ జెక్కుచేతితోడఁ జెలి
నీరూపు భావించి నివ్వెరగందె
యీరీతిఁ గానుక నీకు నిచ్చి వొప్పగించితిమి
తారుకాణ లన్నియునుఁ దలఁచుకో యిఁకను ॥అదివో॥

3. కనకపుమేడలోనఁ గామించి యలమేల్మంగ
తనివోనినీరతికిఁ దమకించెను
యెనసితివి శ్రీ వేంకటేశ యింతలో విచ్చేసి
మన సొక్కటాయ నిట్టె మన్నించు మిఁకను ॥అదివో॥

**అర్థములు:** ప. చిత్తము=మనసు; ఆకె=ఆమె; భాగ్యము=అదృష్టము; కదలిక=చలనము; కనుకో=కనుక్కో (రూపాంతరము), తెలుసుకో.

1. పున్నమ వెన్నెల=పౌర్ణమి వెన్నెల; పొద్దువోక=ఉబుసుపోక, కాలక్షేపం చేయలేని స్థితి; జవరాలు=యుక్తవయసులోనున్న స్త్రీ; నిద్దురవోదు=నిద్రపోదు; విన్నవించు=మనవిచేయు; వేవేలు=వెయ్యిసార్లు, పలుమార్లు; ఎన్నికలు=నిర్ణయము.
2. అరామము=తోట; చెక్కు చేయి=చెక్కిలిపై చేయి ఉంచుకొన్న; చెలి=స్త్రీ, స్నేహితురాలు; భావించు=మనసులో తలచుకొను; నివ్వెర=పారవశ్యము; ఒప్పగించు=అధీనము చేయు; తారుకాణ=సాక్ష్యము.
3. కనకపుమేడ=బంగారు భవంతి; కామించి=ప్రేమించి; తనివోని=తృప్తినొందు; రతికి=కూడికకు; తమకించు=మోహంతో త్వరపడడం; ఎనయుట=పొందుట, కలియుట; విచ్చేసి=వచ్చి చేరి; ఒక్కటాయ=ఒకేవిధంగా ఉందు; మన్నించు=అనుగ్రహించు.

**భావము:** ఓ శ్రీనివాసా! ఇక మీ చిత్తము ఆమె భాగ్యము ఎలా ఉన్నదో! వ్యవహారమంతా మీచేతుల్లోనే ఉన్నది. ఆవ్యవహారం సావధానంగా విచారించి ఆమెను అనుగ్రహించండి.

నిండు పున్నమి వెన్నెలలో నిలబడి ఉబుసుపోక ఆ కాంతామణి అటూ ఇటూ తిరుగుతూ అస్తమానం మనసులో నిన్నే తలుచుకుంటూ రాత్రి వేళలలో నిద్రించడం కూడా లేదు. తమకు ఇవన్నీ అనేకసార్లు విన్నవించితిమి. ఇక ఆమెను పరిగ్రహించడమనే విషయం తమరి ఎంపికకే వదలిపెడుతున్నాము.

ఆమె తోటలో ఒంటరిగా చెక్కిలిపై చేతులుంచుకొని, నీ రూపాన్నే ఊహించుకొంటూ నీ కొరకై పారవశ్యంలో మునిగి ఉన్నది. మేము ఈ రమణి అనే కానుక నీకు అధీనము చేసి యున్నాము. సాక్ష్యములన్నియు గ్రహించి ఆమెను చేపట్టవలసినది.

ఆ బంగారు భవంతిలో ఉన్నట్టి అలమేలుమంగ మిమ్ములను ప్రేమించి సదా మీ తృప్తిలేని పొందుకోసం మోహంతో త్వరపడుతూ ఉండిపోయినది. ఓ శ్రీవేంకటేశ్వరా! అంతలోనే తమరు ఇక్కడకు దయచేయగానే ఆమె మనసంతా ఒక విధమైన సంతృప్తితో నిండిపోయినది. ఆమెను ఇకనైనా అనుగ్రహించమని కోరుతున్నాము.

## 64

**అవతారిక:** ఓ నాయిక స్వామితో అమ్మ అలమేలుమంగమ్మను జనసమూహాల్లో మీ శృంగారచేష్టలతో చికాకు పరచవద్దు. సంతోషంగా ఇంటికి విచ్చేసి అమ్మను కూడండి అంటూ అమ్మ తరఫున రాయబారియై విన్నవిస్తున్నది.

### రీతిగౌళ

ప. ఏమిటికి దూరేవు యెరవులవానివలె
యీ మోహమే నిజమైతే నింటికి రారాదా ॥పల్లవి॥

1. మంతనము గాకుండఁగా మాటలాడదాయఁ గాని
పంతముగాదు నీతోఁ బడఁతికిని
సంతజాణతనమౌను సబలోన నాడితేను
ఇంత గలవాఁడవైతే నింటికి రారాదా ॥ఏమిటికి॥

2. సిగ్గులు నిండుకొనఁగ చేరి మెక్కదాయఁగాని
వెగ్గళించి కాదుసుమ్మీ వెలఁది నీతో
అగ్గమై సందడిలోననైతే గొల్ల దోమటౌను
యెగ్గులేనివాఁడవైతే నింటికి రారాదా ॥ఏమిటికి॥

3. కడుఁబరవశములుగాఁగా నవ్వదాయఁగాని
గడుసుగా దలమేల్మంగ నియ్యెడను
అదరుచు శ్రీ వేంకటాధిప కూడితి విట్టె
యెదయ కెప్పుడు నిట్టె ఇంటికి రారాదా ॥ఏమిటికి॥

**అర్థములు:** ప. దూరు=ప్రవేశించు; చొచ్చు; ఎరవు=(ఎరువు రూపాంతరం) చేబదులు.

1. మంతనము=ఏకాంతము, రహస్యము; మాటలాడదాయ=మాట్లాడలేదు; పంతము=పోటీ; సంత జాణతనము=తాత్కాలికమైన నేర్పుగల మాటలు; సభ=సమూహము, గుంపు.
2. మొక్కదాయ=మొక్కలేదు; వెగ్గళించు=అధికము; వెలది=స్త్రీ; అగ్గము=ఆధీనము, వశము; సందడి=జనము మధ్య; దోమటి=అన్నం, (గొల్లదోమటి అనగా అనుభవింపరానిది); ఎగ్గు=అనాదరము.
3. కడు=మిక్కిలి; పరవశము=పరాధీనము, ఒడలెరుగకయుండు; నవ్వదాయ=నవ్వలేదు; గడుసు=ధైర్యము; అడరుచు=ఎదురేగు; ఎడయక=ఎడబాయక.

**భావము:** ఓ స్వామీ శ్రీనివాసా! ఏమిటిది? ఏదో అప్పు యిచ్చినవాని రీతిగా లోనకు ధైర్యంగా చొచ్చుకొని వచ్చేస్తున్నావు. అమ్మపై ఈ వలపే నిజమైతే ఇంటికే రారాదా!

స్వామీ! ఆమె ఏకాంతము లేకుండా మాట్లాడలేదు అందువల్ల ఆమెతో నీవు పంతాలకు, పట్టింపులకు పోవద్దు. బయట జనసమూహములలో మాట్లాడినట్లైతే, ఏదో గుంపులో గోవింద లాగా తాత్కాలిక నేర్పరి తనమౌతుంది గదా! అమ్మపై ఇంత దయ గలవాడివైతే తిన్నగా ఇంటికే రారాదా!

స్వామీ! ఆమెకు అపారమైన సిగ్గు కదా! నిన్ను కలుసుకొని ప్రార్థించలేదు గానీ నీపై ప్రేమ అధికమై యున్నది. జనమధ్యములో నీ వశమైనట్లైతే తినడానికి సాధ్యం కాని భోజనం లాగా అసాధ్యమౌతుంది. ఆదరం ఉన్నవాడివైతే ఇంటికి రారాదా!

స్వామీ! ఎంతో మోహం మీపై ఉన్నప్పటికి ఆమె నవ్వజాలదు. ఓ శ్రీవేంకటేశ్వరా! తమరు ధైర్యంగా ఆ అలమేలుమంగమ్మను ఇక్కడ ఆమెను కూడియున్నారు. ఎడబాయకుండా ఎల్లప్పుడూ ఇలాగే ఇంటికే రారాదా!

## 65

అవతారిక: ఈ కీర్తనలో అమ్మ అలమేలుమంగమ్మ స్వామి కూడికకై ఎదురు చూపులు చూస్తూ పడుతున్న విరహవేదనను ఓ నాయిక స్వామికి చెప్తున్నది.

### ఆహిరి

ప. చిత్తగించి నీవు దయ సేయఁగరాదా
బత్తి సేసి నీకుఁ గడు బాఁతిపడి వున్నది ॥పల్లవి॥

1. చెక్కు చేతఁబెట్టుకొని సెలవుల నవ్వుతాను
నెక్కొని యున్నది చెలి నీయెదుటను
వెక్కసపుఁదమకాన విడెము చేతఁ బట్టుక
యెక్కువైన యాసలతో నిచ్చగించి యున్నది ॥చిత్తగించి॥

2. సారె జారుఁగొప్పుతోడ జవ్వనాన విఱ్ఱవీఁగి
నేరుపుతో మాటలాడీ నీ యెదుటను
బోరున నిన్నెచ్చరించి పువ్వుల వేసుకొంటా
కూరిములు గానరాఁగా గుట్టుతోడ నున్నది ॥చిత్తగించి॥

3. అలరి కాఁగిటఁగూడి అలపు సొలపుతోడ
నిలిచె నలమేల్మంగ నీయెదుటను
యెలమి శ్రీ వేంకటేశ ఇరవై పానుపుమీఁద
వెలసినసింగారాల వేడుకతో నున్నది ॥చిత్తగించి॥

**అర్థములు:** ప. చిత్తగించు=సావధానముగా విను; బత్తి=భక్తి; బాతిపడు=ప్రేమచూపించు.

1. చెక్కు=చెక్కిలి; సెలవుల నవ్వు=పెదిమ మూలభాగంలో ఉన్న నవ్వు; నెక్కొని=పాదుకొను; వెక్కసము=అధికము,

తమకము=మోహము; విడెము=తాంబూలము; యాసలు=ఆశలు, కోరికలు; ఇచ్చగించు=ఒప్పుకొను, సంతసించు;

2. సారె=మాటిమాటికి; జారుకొప్పు=విడివడియున్న కేశములు; జవ్వనము (వి)=యౌవనము (ప్ర); బోరున=శీఘ్రముగా; హెచ్చరించు=సూచనలుచేయు; వేసుకుంటా=తురుముకుంటూ; కూరిమి=స్నేహము; గుట్టు=రహస్యము.

3. అలరి=సంతోషించు; కాగిట=కౌగిట; సొలపు=పారవశ్యము; ఎలమి=వికాసము; ఇరవై=వాస స్థానము; వేడుక=కుతూహలం, సంతోషము.

**భావము:** స్వామీ! సావధానముగా విని, మీరు అమ్మ మీద దయచూపరాదా! నీపై భక్తిని చూపిస్తూ ప్రేమతో ఉన్నది.

ఆమెను గమనించారా? చెక్కిలిపై చేయివేసుకొని పెదవిమూలగా నవ్వుచున్నది. ఆవిధంగా నెలకొనియున్న ఆ రమణి నీ ఎదుటనే ఉన్నది. అధికమైన మోహంతో తాంబూలము మీకివ్వాలని చేతబట్టుకొని ఎక్కువైన ఆశలతో సంతోషిస్తూ, ఇష్టంతో నిలబడి యున్నది.

మాటిమాటికి విడిపోతున్న కొప్పుముడిని సరిచేసుకుంటూ యౌవనంతో మెరసిపోతూ నిక్కుతూ నిలబడి యున్నది. మీ ఎదుటనే ఎంతో నేర్పుతో మాట్లాడుతూ, మిమ్మల్ని త్వరపెట్టి సూచనలు చేస్తూ, రకరకాల పుష్పాలను ధరిస్తూ నీపై స్నేహం కనబరుస్తూ రహస్యంగా నిలబడి ఉన్నది.

అధిక సంతోషంతో నీ కౌగిట్లో ఉన్నప్పటి పారవశ్యంతో అలసి సొలసిన ఆ అలమేలుమంగమ్మ నీ ఎదుటనే నిలిచి ఉన్నది. ఓ శ్రీవేంకటేశ్వరా! ఎంతో గొప్పదైన వికాసంతో నీ పడకమీద, నీ కిష్టమైన అలంకారములనెన్నో చేసుకొని కుతూహలంతో ఎదురు చూపులు చూస్తున్నది.

## 66

అవతారిక: అమ్మ అలమేలుమంగమ్మ స్వామి రహస్యంగా కూడివచ్చిన ఆ కాంత ఎవరో చెప్పమని, నిజాన్ని కప్పిపుచ్చవద్దని నిలదీస్తున్నది.

### తెలుఁగుఁగాంబోది

ప. ఆనతియ్యవయ్య అదేల దాఁచేవు
యీ నేర్పు లేకుండితే నింత సేతువా ॥పల్లవి॥

1. చెక్కులు నొక్కుచు సేదలు దేరిచి
పెక్కు ప్రియాలు చెప్పేవు నాకు
యెక్కడ నెవ్వత నెనసి వచ్చితో
యిక్కువ నూరకే యింత సేతువా ॥ఆనతియ్యవయ్య॥

2. కన్నుల మొక్కుచు కందువ లంటుచు
యెన్నేసివేసాలు పన్నే విందు
కన్నె నెవ్వతె నిక్కడకుఁ దెచ్చితివొ
యెన్నఁడైన నీవు యింత సేతువా ॥ఆనతియ్యవయ్య॥

3. వావులు చెప్పుచు వరుసఁ గూడేవు
శ్రీవేంకటగిరి గోవిందుఁడా
దేవుళ్ళ నెందరిఁ దీపులఁ బెట్టితో
యీవేళ నన్నేలి యింత సేతువా ॥ఆనతియ్యవయ్య॥

**అర్థములు:** ప. ఆనతి=అనుజ్ఞ, సెలవు; అదింఏల, అదేల=ఆవిషయం ఎందుకు; దాచేవు=కప్పిపుచ్చుతున్నావు; నేర్పు=చాతుర్యము; లేకుండితే=లేకపోయినట్లైతే; సేతువా?=చేస్తావా?

1. చెక్కులు=చెక్కిళ్ళు; సేద=అలుపు; దేరిచి=దీర్చి; పెక్కు=అనేక; ప్రియాలు=ఇంపైన మాటలు; ఎవ్వత=ఎవరామె; ఎనసి=పొందుకూడి; వచ్చితో=వచ్చావో; ఇక్కువ=జాడ, సంకేత స్థలము; ఊరకే=ఉచితార్థంగా; సేతువా=చేస్తావా.
2. కందువ=ఏకాంతము; వేసాలు=కపటపు మాయలు; పన్ను=కలిగించు; ఇందు=ఈవిషయమునందు; ఎవ్వతె=ఎవరు; ఎన్నడైన=ఎప్పుడైన; ఇంత=ఈవిధంగా, సేతువా=చేస్తావా.
3. వావులు=బంధుత్వములు, చుట్టరికములు; వరుస=పంక్తి; దేవుళ్ళు=వేల్పులు; తీపులబెట్టితో=తమకింపజేశావో; ఇంత సేతువా=ఈవిధంగా చేస్తావా.

**భావము:** ఓ స్వామీ! ఇకనైనా సెలవియ్యవయ్యా! ఆ విషయం ఎందుకు నాకు చెప్పకుండా దాచి కప్పిపుచ్చుతున్నావు? నీకు ఎంత చాతుర్యం, నేర్పరితనము లేకపోతే ఇంత చేస్తావు చెప్పు?

నాకు దగ్గరై నా చెక్కిళ్ళు నొక్కుతూ బుజ్జగిస్తూ అలుపులు దీరుస్తూ ఎన్నెన్నో యింపైన కబుర్లు చెప్తావు. ఎక్కడ ఏ స్త్రీ పొందుకూడి వచ్చావో  నాకు చెప్పకుండా జాడ తెలుపకుండా అకారణంగా ఇంత చేస్తావా స్వామీ.

నావద్ద కండ్లతోనే నమస్కరిస్తూ, ఏకాంతంలో చమత్కారాలు చేస్తూ ఎన్నెన్ని కపటపు వేషాలు వేస్తూ ఎన్నో పన్నాగాలు పన్నుతూ ఉన్నట్లుంటావు. ఆ కన్యామణి ఎవరు? ఆమెను ఇక్కడకు ఎందుకు తీసుకొచ్చావో చెప్పండి. ఏదిఏమైనా ఇంత చేస్తావా స్వామీ.

చుట్టరికాలు కలుపుకుంటూ, బంధుత్వాలు చెప్పుకుంటూ వారితో పొందుకూడుతుంటావు. ఓ శ్రీవేంకటేశ్వరా! గోవిందుడా! స్వామీ! ఎందరు దేవేరులను ఈ విధంగా తమకింపజేశావో! ఈరోజు నన్ను ఏలుకుంటూ ఇంతటి కాని పనులు చేయడం న్యాయమేనా?

## 67

**అవతారిక:** ఈ కీర్తనలో అమ్మ అలమేలుమంగమ్మ గుంభనగా ఉంటూ ఏమి జరిగినా  విషయాలనేమీ చెలికత్తెలకు చెప్పకుండా ఉండడం గమనించిన చెలికత్తెలు స్వామికి ఎమి జరిగిందో తెలుసుకోమని కోరుతున్నారు.

### శంకరాభరణం

ప. చెప్పదు యెంతైనఁ జెలులకును
చొప్పులెత్తుచును సోదించరాదా ॥పల్లవి॥

1. ననుపున నీ విటు నవ్వులు నవ్వఁగా
మునుకొనె సిగ్గులు ముద్దియకు
మనసునఁబారినమతక మేఁటిదో
అనువున నదియును నడుగఁగరాదా ॥చెప్పదు॥

2. పలుమరు నీవిటు పైఁజేయి వేయఁగా
పులకలు నిండెను పొలఁతికిని
యెలమినిఁ బొడమినయింపు లెట్టివో
తిలకించి అవియుఁ దెలియఁగరాదా ॥చెప్పదు॥

3. గక్కన నీ విటు కాఁగిలించఁగా
చొక్కులు మించెను సుదతికిని
యిక్కువలు శ్రీవేంకటేశ యెట్టివో
మిక్కిలి మేలిఁక మెచ్చఁగరాదా ॥చెప్పదు॥

**అర్థములు:** ప. ఎంతైన=ఏమైనప్పటికి; చొప్పులెత్తు=దారి తెలుసుకొను; సోదించు=వెదకు.

1. ననుపు=అనురాగం; మునుకొను=ఎదురుపడు; ముద్దియ=ఇంతి, స్త్రీ; మతక=మాయ; ఏటిదో=ఏవిధమైనదో; అనువున=ఉ

పాయము, ప్రయత్నము.

2. పలుమరు=అనేకసార్లు; పైజేయి=భుజంపైన చెయ్యి; పులకలు=గగుర్పాటు; పొలితి=(పొలతి రూపాంతరం) స్త్రీ; ఎలమి=సంతోషము, తృప్తి; పొడ=రూపము; మినయింపు=మెరిసేటి కాంతి; తిలకించి=చూసి, గమనించి; అవియు=వాటిని కూడా; తెలియగ=తెలియునట్లు చేయు;

3. గక్కన=శీఘ్రముగా; కాగలించు=కౌగలించు; చొక్కులు=కాంక్ష, కామము; సుదతి=స్త్రీ; ఇక్కువ=జాడ; మిక్కిలి=అధికము; మేలుంఇక, మేలిక=శుభమింక; మెచ్చు=పొగడు.

**భావము:** ఓ శ్రీనివాసా! ఆమె ఎల్లప్పుడు గుంభనగానే ఉంటూ ఏమి జరిగినా ఆ విషయాలనేమీ చెలికత్తెలకు చెప్పకుండా ఉన్నది. తమరే ఆ సంగతులన్నీ మార్గం కనిపెట్టి తెలుసుకొనవచ్చును కదా!

అనురాగంతో మీరు నవ్వులు నవ్వగానే, ఆమెకు వల్లమాలిన సిగ్గు ముంచుకొస్తుంది. ఆమె మనసులో నెలకొన్న మాయ ఏమిటో ప్రయత్నంతో ఉపాయం పన్ని అడుగవచ్చు గదా!

అనేకసార్లు మీరు ఆమె భుజంపై చేయి వెయ్యగానే, ఆమెకు గగుర్పాటు కలుగుతున్నది. సంతోషం వెళ్ళబుచ్చుతూ ఆ రూపంలో మెరిసే కాంతిరేఖలు ఏమిటో, ఒక్కసారి గమనించి అవన్నీ తెలుసుకోవచ్చును గదా!

త్వరపడి నీవామెను కౌగలించుకోగానే, ఆమెకు నీపై కాంక్ష అధికమైంది. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ హొయలు, విశేషాలు ఎలాంటివో, అధికమైన శుభములు చేకూరుస్తూ ఆమెను మెచ్చుకోవచ్చుగదా!

## 68

**అవతారిక:** ఈ కీర్తనలో స్వామి అన్యకాంతలతో రహస్య శృంగారాలు సాగిస్తున్నాడని తెలిసికూడా ఆ వివరాలన్నీ మీరు నాచేతనే చెప్పించాలనుకోవడం న్యాయమేనా ! అంటూ అమ్మ అలమేలుమంగమ్మ చెలికత్తెలను దెప్పిపొడుస్తున్నది.

### కేదారగౌళ

ప. నాతో నేలానవెట్టేరే నడుమ మీరు
యీతల నాతనిసేఁత లెఱఁగనా నేను ॥పల్లవి॥

1. కడుబత్తిగలవాడు కడల కేలపోవునే
వొడయఁడై నావద్దనే వుండుఁగాక
వుడివోక మీరెంత వొడఁబరచేరే నన్ను
యెడనెడ తనగుట్టు యెరఁగనా నేను ॥నాతో॥

2. బాసలిచ్చినట్టివాఁడు పరుల నేల చూచునే
సేసవెట్టి కాఁపురము సేసుఁగాక
వేసరక మీరేల వేఁడుకొనేరే నన్ను
యీ సుద్దు లన్నియు ముందే యెరఁగనా నేను ॥నాతో॥

3. చేరి కూడినట్టివాఁడు సిగ్గులేల నెరపునే
వూరకే లోనై మరిగుండుఁగాక
మీరెల్లా శ్రీ వేంకటేశు మెచ్చి యేలపొగడేరే
యీరీతిజాణఁ దవుత యెఱఁగనా నేను ॥నాతో॥

**అర్థములు:** ప.ఏలాన=ప్రకటించు; చెప్పించు; నడుమ=మధ్యలో, అర్థాంతంగా; ఈతల=అధికంగా; సేతలు=పనులు; ఎరుగు=తెలిసికొను.

1. కడుబత్తి=ఎక్కువ భక్తి లేక ప్రేమ; కడలు=నలువైపుల, అనేక దిక్కులు; వొడయు=స్వాధీనుడైన స్వామి; వుడివోక=తప్పుకోక; వొడబరచు=ఒప్పించు; ఎడనెడ=అక్కడక్కడా, అప్పుడప్పుడు; గుట్టు=రహస్యము.

2. బాస=ప్రమాణము; సేస=అక్షింతలు; కాపురము=సంసారము; వేసరు=విసుగు; వేడుకొను=ఎక్కువగా అడుగు; సుద్దులు=సూక్తులు, మంచి మాటలు.

3. నెరపు=వ్యాపింపజేయు; ఊరకే=ఏమీ విషయం లేకుండ; మరిగిండుందు, మరిగుండు=అలవాటైఉండు; రీతి=పద్ధతి; జాణడు=విలాసవంతుడు, నేర్పరి; అవుత=కావడం; ఎరుగు=తెలిసికొను.

**భావము:** ఓ చెలులారా! నాతో ఈవిధంగా ఆతని చేతలను గురించి మధ్యమధ్యలో నాచేతనే చెప్పించడం న్యాయమేనా? ఎక్కువైన అతని పనులను మీరెరుగరా? చెప్పండి.

నాపై ఎంతో భక్తిని ప్రేమను నటించే ఆయన నానా దిక్కులకు ఎందుకు వెళ్తున్నాడు? స్వాధీనుడై నావద్దనే ఉండిపోవచ్చుగదా! మీరందరూ తప్పుకోకుండా ఒప్పించి నాచేత చెప్పిస్తున్నారెందుకు?

ఎప్పటికప్పుడు అతని రహస్యాలన్నీ ఎరగని దాననా నేను? మీరే చెప్పండి. నాదగ్గర అనేక ఒట్లు వేసి ప్రమాణాలు చేసే వారు, ఇతర స్త్రీలను ఎందుకు చూడడం? అక్షింతలు వేసి ఆశీర్వదించిన స్వామి నాతోనే గుట్టుగా సంసారం చెయ్యాలికదా? విసుగు లేకుండా మీరంతా నన్నెందుకు ఎక్కువగా ప్రశ్నిస్తున్నారు?

ఆయన శృంగార చేష్టలు, మాయమాటలు, చెప్పే సూక్తులు ముందే నాకు తెలియనివా చెప్పండి? నాతో చేరి ఉంటున్నవాడల్లా మధ్యమధ్యలో సిగ్గుపడుతూ ఉంటాడెందుకని? ఏమీ కారణమే లేకుండా ఆ చేతలాతనికి అలవాటైపోయి ఉండిఉండవచ్చు. మీరంతా ఆ శ్రీవేంకటేశ్వరుని గొప్పచేసి పొగడ్తల వర్షం ఎందుకు కురిపిస్తున్నారు? ఆయన ఏ విధమైన విలాసవంతుడైన నేర్పరోనన్న విషయం నాకు తెలియనిదా చెప్పండి.

## 69

**అవతారిక:** ఈ కీర్తనలో స్వామి చరితలు, సంగతులు, కథలు కథలుగా ఉన్నవంటూ ఓ కాంత చెప్పే సంగతులు చెప్తున్నాడు అన్నమయ్య.

### దేవగాంధారి

ప. ఏమని వినెనో యిటు నీ సరితలు
తామర విసురుచుఁ దాఁకించీని ॥పల్లవి॥

1. యీలాగున నీ వింటికి రాఁగా
వాలుకచూపులు వంచీఁ జెలి
ఆలరివై మాటాడకమును పే
కోలుముందుగాఁగొసరీని ॥ఏమని॥

2. ననుపున వీవిటు నవ్వులు నవ్వఁగ
కినియుచుఁ గదుజంకించీని
చనవునఁ బైఁ జేయి చాఁచకమునుపే
పెనఁగుచు నానలు వెట్టీని ॥ఏమని॥

3. గక్కున నీవిటు కాఁగిలించఁ గా
అక్కజపురతుల నలసీని
యిక్కువ శ్రీ వేంకటేశ మునుపనే
చెక్కులు నొక్కుచుఁ జెనకీని ॥ఏమని॥

**అర్థములు:** ప. సరిత=చరిత్ర; విసురుచు=వేయుట; తాకించీనీ=తాకించుచున్నది.

1. ఈలాగున=ఈ విధంగా; వాలుక=వాడియైన; వంచీ= వంచుకొన్నది; ఆలరి=అవివేకము; కోలు=అంగీకారము;

కొసరీని=కోరుకొన్నది, ప్రార్థించుచున్నది.

2. ననుపు=అనురాగము, ప్రేమ; కినియు=కోపించు; కడు=మిక్కిలి; జంకించీని=అదిరించుచున్నది; చనవున=కోరికతో; పెనగు=చుట్టుకొను; నాన=ఒట్టు; వెట్టీనీ=పెడుతూఉన్నది.

3. గక్కున=శీఘ్రముగా, త్వరగా; కాగిలించు=కౌగలించు; అక్కజపురతులు=అధికమైన శృంగార చేష్టలు; అలసీని=అలసిపోయినది; ఇక్కువ=స్థానము; మునుప=ముందు; చెక్కులు=చెక్కిళ్ళు; చెనకీని=తాకినది.

**భావము:** స్వామీ.. ఏమని చెప్పమందురు నీ చరితలు! సంగతులు! కథలు కథలుగా ఉన్నవి. ఒకవైపు తామర పూలతో విసురుతూ మెల్లిగా వాటిని తాకిస్తుంటారు.

ఇలాగే నీవు ఇంటికి రాగా ఆ రమణి వాలుచూపులు రువ్వుతూ, అమాయకంగా మీరు మాట్లాడక ముందే మీపై అంగీకారం తెలుపుతూ మిమ్మల్ని కోరుకొంటున్నది.

అనురాగం చూపిస్తూ నువ్వు హాస్యపూర్వకంగా నవ్వగానే కోపంతో ఎక్కువగా అదరిపడుచున్నది. చనువుగా పైన చెయ్యి వేయడానికి ఎత్తకమునుపే మిమ్ములను చుట్టుకొని ఏవేవో ఒట్లు పెట్టుచున్నది.

శీఘ్రముగా నీవు అలా కౌగలించుకోగానే మీ అధికమైన శృంగార చేష్టలకు అలసిపోవుచున్నది. ఈ స్థానంలో ఉన్న శ్రీవేంకటేశ్వరా! ముందుగానే చెక్కిళ్ళు వత్తుతూ ఎక్కడెక్కడో తాకుతూ ఉంటారు.

## 70

**అవతారిక:** ఈ కీర్తనలో స్వామి శ్రీనివాసుని మనసు గ్రహించలేని అలమేలుమంగ స్వామీ! మీ మనసులో ఏమున్నదో అవగతం కావడంలేదు. డొంకతిరుగుడు లేకుండా సూటిగా సెలవివ్వండంటూ ప్రశ్నిస్తున్నది.

### నాగవరాళి

ప. నేనొకటి సేయఁగాను నీ వొకటి భావించేవు
ఆనతీవయ్య యింక ననుమాన మేఁటికి ॥పల్లవి॥

1. చనవుగలదంటాను సారె నిన్నుఁ గొసరితి
ననుపుగలదంటాను నవ్వితి నేను
యెనసి యిందుకుఁగాను యేల సిగ్గులు వడేవు
చెనకి నీ యందేమైనా సేఁత గలదో ॥నేనొకటి॥

2. దేవుల నయితినంటా దిష్టించి నిన్నుఁ జూచితి
కైవసమైతివంటాను కాఁగిలించితి
చేవదేర నీవేల శిరసు వంచుకొనేవు
నీవొళ్ళ నేమైనా మరి నేరములు గలవో ॥నేనొకటి॥

3. విన్నపము విందువంటా వేవేలు నాడితి
మన్నింతువంటా నిన్నే మరిగుంటిని
యిన్నింటా శ్రీ వేంకటేశ యింతలో నన్నేలితివి
తిన్నఁగా నీవేమి బుద్ధిఁ దలఁచుకొంటివో ॥నేనొకటి॥

**అర్థములు:** ప. సేయగాను=చేయగా; భావించు=తలచు; ఆనతి=అనుజ్ఞ; ఏటికి?=ఎందులకు?

1. చనవు=కోరిక, ప్రేమ; సారె=మాటి మాటికి; కొసరు=కోరు; ననుపు=అనురాగము; ఎనసి=పొందు; వడేవు=పడేవు; చెనకు=తాకు; సేత=పని; గలదో?=కలదా?, ఉన్నదా?;

2. దేవులు=దేవేరి, దేవత; దిష్టించు=దృష్టిపెట్టు; కైవశమగు=వశమగు; కాగిలించు=కౌగలించు; చేవదీర=సారము, పక్వమగు;

నీవొళ్ళ=నీ వడిలో; నేరములు=అపరాధములు.

3. విన్నపము=విజ్ఞాపన; విందువంటా=వింటావని; మరిగి=అలవాటై; తిన్నగా=సూటిగా.

**భావము:** స్వామీ! ఇదేమిటి? నేనొక పని చేయగా నీవు మరోవిధంగా తలుస్తున్నావు. నీ మనసులో నేమున్నదో అనుజ్ఞ యీయవయ్యా! ఇంకా లేనిపోని అనుమానాలు పెట్టుకోవడం ఎందుకయ్యా!

ఎంతో కోరికతో చనువుగలదని భావించి మాటిమాటికి నిన్ను ఏవేవో కోరికలు కోరాను. పొందుగూడినందుకు ఎందుకు అంతగా సిగ్గుపడుతున్నావు. తాకినందుకు నీకేమైనా వేరే భావన ఉన్నదా?

నీ దేవేరినయ్యానని నీపై దృష్టిపెట్టి నిన్ను తదేకంగా చూస్తూ ఉన్నాను. నాకు వశమయ్యావు గదా అని తలచి నిన్ను గాఢంగా కౌగలించుకొన్నాను. దానికి మీరెందుకు అలా వొడిలో తలవొంచుకుంటారు. మరి నేనేమైనా అపరాధం చేశానంటారా?

స్వామీ! నా విన్నపాలు వింటావని వేనకు వేలుగా నేను చేసుకున్నాను. అలవాటుగా నీయందే మనసుపెట్టి నిన్నే కోరుకుంటూ ఉన్నాను. ఓ శ్రీవేంకటేశ్వరా! ఇంతలోనే ఈ తిరుమలగిరిపై నన్నేలుకొన్నావు. మీ మనసులో ఏమున్నదో ? డొంకతిరుగుడు లేకుండా సూటిగా సెలవివ్వండి.

## 71

**అవతారిక:** ఈ కీర్తనలో ఓ నాయిక, మీకై తపిస్తూ సేవలు చేస్తున్న అమ్మ అలమేలుమంగపై ప్రేమాభిమానాలు చూపించమని స్వామిని వేడుకుంటున్నది.

### కన్నడగౌళ

ప. బాయిటఁ బడె వలపు పడఁతికి నీకును
యీ యెడ నా మోము చూచి యెంత నవ్వేవు ॥పల్లవి॥

1. అక్కర యంతో కాని అప్పటప్పిటికి నిన్నుఁ
జెక్కు నొక్కి చెలి నీపై సేస వెట్టీని
పక్కన నాకెసేసేబత్తి చేకొనఁగరాదా
యిక్కున నామోము చూచి యెంతనవ్వేవు ॥బాయిటఁ॥

2. యేకతా లెట్టివో కాని యెదుటనే కాచుకుండి
మేకొని సన్నలు సేసి మేలమాడీని
నీకేమి యాపెసలిగె నెమ్మదిఁ జెల్లించరాదా
యీకడ నామోము చూచి యెంతనవ్వేవు ॥బాయిటఁ॥

3. వేడుక యెట్టిదో కాని వెలఁ ది కాఁగిటఁ గూడి
జోడై శ్రీ వేంకటేశ చొక్కించీని
యీడుగా నన్నేలితివి యిట్టె యాపెఁ గూడరాదా
యీడేర నామోము చూచి యెంతనవ్వేవు ॥బాయిటఁ॥

**అర్థములు:** ప. బాయిట=బయట; ఈ యెడ=ఇక్కడ.

1. అక్కర=మోజు; అప్పటప్పిటికి=అప్పుడప్పుడు; చెక్కు=చెక్కిలి; సేస=అక్షింతలు; ఆకె=ఆమె; సేసే=చేయునటువంటి; బత్తి=భక్తి; ఇక్కువ=చోటు, స్థానము.
2. ఏకతా=ఒకటే స్థితి; కాచుకుండి=కాచుకొని ఉండి; మేకొను=సమ్మతించు; సన్నలు=సైగలు; మేలమాడు=పరిహాసములాడు; ఆపె=ఆమె; సలిగె=చనవు; నెమ్మది=నిదానంగా; చెల్లించు=అందించు; ఈకడ=ఈప్రదేశంలో.
3. వేడుక=కుతూహలం, సంతోషం; వెలది=స్త్రీ; కాగిట=కౌగిట; జోడు=జత; చొక్కించు=మత్తు గొలుపు, పారవశ్యమగు;

ఈడు=వయసు; ఏలు=పరిగ్రహించు, చేకొను; ఆపె=ఆమె; కూడు=కలియు, పొందు; ఈడేరు=వర్ధిల్లు, పెరుగుట; మోము=మొహము.

**భావము:** ఓ స్వామీ! నీకు ఆమెకు ఉన్న ప్రేమాతిశయం బయటపడిపోయినది. ఈ సమయంలో నా ముఖ సౌందర్యాని చూసి ఎంతలా నవ్వుతున్నావు. మర్మమేమిటో బోధపడలేదు.

మోజుపడి నీపై ప్రియంతో అప్పుడప్పుడూ, నీ చెంపలు నొక్కుతూ నీపై అక్షింతలు వేస్తున్నది. ఆమె పవిత్రమైన భక్తిని గమనించి స్వీకరించవచ్చుగదా! ఈరీతిగా నా ముఖవిలాసమును గాంచి అధికంగా నవ్వులు చిందిస్తున్నావు.

అన్య భావము లేకుండా నీపైనే ప్రేమ చూపుతూ నీ ఎదుటనే కాచుకొని ఉండి నీకు సైగలు చేస్తూ నీపనులన్నీ సమ్మతిస్తూ పరిహాసములాడుతూ నవ్వులు చిందుస్తున్నది. ఆమె నీపై చనువుతో ఉంటున్నప్పుడు ఆమె అడిగే అన్ని కోర్కెలను నిదానంగా అందించరాదా! మరి నీవు ఇక్కడ నా ముఖారవిందాన్ని చూసి పలుమార్లు నవ్వుతూ ఉన్నావు.

ఓ శ్రీవేంకటేశ్వరా! ఆమె కుతూహలముతో కూడిన కోరికలు ఎలాంటివో గదా! ఆమె నీ కౌగిలిలో చేరి, నీకు సరైన ఈడుజోడై పారవశ్యం పొందుతున్నది. నిత్య యౌవనంతో నన్ను పరిగ్రహించి ఉన్నావు. ఈవిధంగానే ఆమెతో కూడా పొందుచేసుకోవచ్చుగదా! తృప్తిగా నెరవేరిన కోరికలతో నా ముఖకమలాన్ని చూసి ఎంత విలాసంతో నవ్వుతున్నావు.

## 72

**అవతారిక:** ఈ కీర్తనలో అమ్మ అలమేలుమంగమ్మ స్వామి శ్రీనివాసునికై పరి పరివిధాల తపిస్తున్న వైనం ఓ నాయిక స్వామికి నివేదిస్తున్నది.

### మలహరి

ప. ఎఱిఁగిన పనులకు నేల గుట్టు సేసేవు
గుఱిలేని కోరికలు గూఁటఁ బెట్టేవా ॥పల్లవి॥

1. చెలపచెమట గారీఁ జెక్కులను
సెలవుల నవ్వులూరీఁ జెలియకును
పిలిచి మాటాడరాదా ప్రియుఁడవు
వలపులు దాఁచుకొని వడ్డి కిచ్చేవా ॥ఎఱిఁగిన॥

2. పున్నమవెన్నెల చిందీఁ గన్ను చూపుల
చన్నులఁ బులక లుబ్బీ సకియకు
మన్నించి కూడఁగరాదా మగఁడవు
పిన్నవయసుఁదనము పెట్టెఁ బెట్టేవా ॥ఎఱిఁగిన॥

3. ముప్పిరిఁదేనెలు జారీ మోవిమీఁ దను
చిప్పిలీఁ గళలవివో చిన్ని మోమున
యిప్పుడె శ్రీ వేంకటేశ యేలితివి
తప్పకుండా రతులు వెదలు వెట్టేవా ॥ఎఱిఁగిన॥

**అర్థములు:** ప. ఎరిగిన=తెలిసిన; ఏల=ఎందుకు; గుట్టు=రహస్యము; సేసేవు=చేస్తావు; గురి=లక్ష్యము; గూట=గూటిలో, చిన్న అరలో.

1. చెలపలు=చెంపలు; కారీ=కారుచున్నది; సెలవులు=మధ్యమధ్య, ఆటవిడుపు; నవ్వులూరు=నవ్వులు చిందించు; వడ్డీ=వృద్ధి, పెరుగు.

2. చిందు=వ్యాపించు; పులక=గగుర్పు; సకియ=చెలికత్తె, స్నేహితురాలు; ఉబ్బు=వృద్ధిపొందు; పెట్టెబెట్టు=దాచుకొను.

3. ముప్పిరి=మూడింతలు (అధికము అనే అర్థంలో) జారీ=జారిపడు; మోవి=మోహం; చిప్పిలు=పైకి ఉబుకు; కళలు=శృంగార సంబంధమైన నైపుణ్యాలు; మోము=మొహము; ఏలు=పరిగ్రహించు, కైకొను; వెదలు=విత్తు, ఆరంభించు.

**భావము:** ఓ స్వామీ! అందరికి తెలిసిన పనులను కూడా రహస్యంగా ఎందుకు చేస్తున్నావు?

ఆమెకు నవ్వుల పారవశ్యంతో మధ్యమధ్యలో సిగ్గులు చిందిస్తూ ఉండగా చెంపల మొదళ్ళనుండి కారే చెమట చెక్కిళ్ళనంటున్నది. ఆమెనొక సారి పిలిపించి ప్రియవచనాలు మాట్లాడవచ్చు గదా! నీ ప్రేమనంతా దాచుకొని వడ్డీకిచ్చి వృద్ధిచేస్తావా ఏమిటి చెప్పండి?

నిండు పున్నమి వెన్నెలలు చిందిస్తూ ఉంటే గగుర్పాటుతో ఆమెకు వక్షోజములో  పెద్దవవుతున్నాయి. ఆమెను మన్నించి మర్యాద చేసి ఆమెతో పొందుకూడవచ్చుగదా! నీ యౌవనాన్నంతా పెట్టెలో బెట్టి దాచుకుంటావా ఏమిటి చెప్పండి?

స్వామీ! గమనించారా! ఆమె ముఖారవిందంపై తేనెసోనలు జారి జారిపడుతున్నాయి. ఆమె మొహంలో అనేక శృంగార కళలు ఉబికి ఉబికి పైకి కనిపిస్తూ ఉన్నాయి. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈసమయంలోనే నన్ను పరిగ్రహించి చేకొన్నావు. మరి తప్పకుండా యింక శృంగార రతిక్రీడా విశేషాలు ఆరంభిస్తారా!

**విశేషాంశాలు:** ఈ కీర్తనలో 3వ చరణంలో "చిప్పిలీ గళలవివో చిన్ని మోమున" అంటూ అన్నమయ్య షోడశ కళల ప్రస్తావన చేశారు. 1. అమృత, 2. మానద, 3. పూష, 4. తుష్టి, 5. పుష్టి, 6. రతి, 7. ధృతి, 8. శశిని, 9. చంద్రిక, 10. కాంతి, 11. జ్యోత్స్న, 12. శ్రీ, 13. ప్రీతి, 14. అంగద, 15. పూర్ణ, 16. అమృత అనే 16 కళలతో స్వామి విరాజిల్లుతున్నాడన్న భావన కలిగించాడు.

## 73

**అవతారిక:** ఈ కీర్తనలో స్వామి పరకాంతల యందనురక్తుడై ఉండడం గ్రహించిన అమ్మ అలమేలుమంగమ్మ స్వామితో ఎల్లప్పుడూ పొరుగింటి పుల్లగూరే రుచి కదా అంటూ పరిహాసం చేస్తున్నది.

### సామంతం

ప. ఆయలేవయ్యా సుద్దులన్నియు నెరుఁగుదుము
చాయకాఁడ వౌదువు నీ సట లేఁటికయ్యా ॥పల్లవి॥

1. మితిమీరినవలపు మిక్కుటమై వుండఁగాను
సతిమాటలెల్లా నీకుఁ జవులాయను
వెతదీర విన్నపాలు వేగినంతాఁ జేసినాను
ఇతరులయెడ కింత ఇతవయ్యీనా ॥ఆయలేవయ్యా॥

2. వుప్పతిల్లుఁ దమకము వువిదపై నుండఁగాను
వొప్పి యీపెవిందులెల్లా నొద్దికాయను
ఇప్పు డెవ్వరైనా బోనమింటికి నీకుఁ దెచ్చితే
చప్పనై తోఁ చుఁ గాక ఆసలు వుట్టీనా ॥ఆయలేవయ్యా॥

3. పానుపుమీఁదిరతులు పచ్చిదోఁచి వుండఁగాను
తేనెగారేఆపెమోవి తీపులాయను
ఆనుక శ్రీ వేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
యేనెలఁతలందునైనా ఇటువలె మెచ్చేవా ॥ఆయలేవయ్యా॥

**అర్థములు:** ప. ఆయ=మర్మము, రహస్యము; సుద్దులు=సూక్తులు, మంచి కబుర్లు; చాయకాడు=వన్నెకాడు; ఔదువు=అయ్యేవు; సటలు=కపటము, మోసము; ఏటికి=ఎందుకు?

1. వలపు=మోహము; మిక్కుటము=అధికము; చవులు=కోరికలు, రుచులు; వెత=కష్టము; విన్నపాలు=వినతి; ఇతవు=హితము,

ప్రీతి.

2. ఉప్పతిల్లు=పైకి పొంగు; తమకము=మోహము; వువిద=స్త్రీ; ఒప్పి=తగియుండు; ఆపె=ఆమె; ఒద్దిక=అనుకూల్యము; బోనము=భోజనము; చప్పనై=రుచిలేనిదై; ఆశలు=కోరికలు; వుట్టు=పుట్టు.

3. పచ్చిదోచు=ఆర్ద్రతతోనుండు; ఆపె=ఆమె; మోవి=మొహము; తీపులు=వేడుకలు; అనుక=తర్వాత; నెలత=స్త్రీ; ఇటువలె=ఈవిధంగా.

**భావము:** ఓ స్వామీ! మీవన్నీ రహస్యాలే! నీ వ్యవహారమంతా నాకు తెలుసు. గొప్ప వన్నెకాడవుతున్నావు గానీ నీ కపట నాటకాలు ఎందుకో చెప్పవయ్యా!

నీకు మోహము మితిమీరి యుండగా, ఆ స్త్రీ చెప్పే కబుర్లన్నీ నీకు రుచిస్తూనే ఉంటాయి. నా కష్టాలు తీరుతాయని ఎన్నెన్నో వినతులను మీకు ఎంతో తపించి చేసుకున్నాను. ఇతర స్త్రీలయందు నీకు ఇంత ప్రీతి ఎందుకయ్యా!

నీకు ఆ స్త్రీపై వ్యామోహం పైకి ఉబికి కనిపిస్తుండగా, ఆమె పెట్టే విందుభోజనం మీకు ఎంతో రుచిగా ఇంపుగా ఉంటుంది. కానీ ఇప్పుడెవరైనా నీకు భోజనం నీకు ఇంటికి తీసుకుని వచ్చినట్లైతే, అది మాత్రం రుచీ పచీ లేకుండా చప్పగా ఉందని అంటారు గానీ ఏవైనా కోరికలు పుట్టిస్తాయా?

పట్టు పానుపుపై ఆమెతో పవళించినపుడు నీకు దొరికే రతిక్రీడా విలాసాలు మంచి పసందుగా ఉంటూ, తేనసోనలు చిందుస్తున్న ఆమె మొహబింబం మంచి వేడుక కలిగించేవిగా ఉంటాయి. తరువాత ఓ శ్రీవేంకటేశ్వరా! ఇలాగే ఇక్కడ నన్ను పరిగ్రహించావు. ఏ వనితలందునైనా నన్ను ఈ విధంగా మెచ్చుకున్నావా?

**విశేషాంశాలు:** ఈ కీర్తనలో రెండవ చరణంలో అన్నమయ్య "వొప్పి యీపె విందులెల్లా నొద్దికాయను బోనమింటికి నీకు దెచ్చితే, చప్పనై తోచుగాక ఆసలు వుట్టీనా" అన్న సామెత ప్రయోగించాడు. దీనికి ప్రస్తుతం వాడుకలో ఉన్న సామెత "పొరుగింటి పుల్లకూర రుచి" అనే అర్థంలో వాడినట్లు తెలుస్తున్నది. ఎంత రుచికరంగా వంట చేసినా, ఇంట్లో కూరలు మనకు నచ్చవు. పక్కింటి వారు, ఇచ్చిన కూర ఎలా ఉన్నా బాగుందని లొట్టలేసుకుంటూ తింటామనే భావలో ఇంటిలో నీకుపెట్టిన భోజనం రుచి చప్పనై ఉండదా అని అర్థంలో ప్రయోగం జరిగింది.

## 74

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ శృంగార వేళలో ఏవిధంగా క్రీడించినప్పటికి వెగటు పుట్టదని స్వామికి నివేదిస్తున్నది.

### వేళావళి

ప. తగుతగు నీదొరతనము లిఁక
వెగటులన్నియును వేడుకలాయ ॥పల్లవి॥

1. విరసపుతిట్లు వేవేలు దిట్టిన
సరసపువేళల చవులాయ
యెరవులచేఁత నీవేమి సేసినా
సరి నాకాఁగిట చందములాయ ॥తగుతగు॥

2. బొమ్మజం కెనలు పొరి నెన్నైనా
సమ్మతించితే చవులాయ
దిమ్మరివై యెందు దిరిగినచ్చినా
నెమ్మి నన్నేలఁ గా నేరుపులాయ ॥తగుతగు॥

3. అంగము లలయఁగ నంటఁబెనఁగినా
సంగడిరతులను చవులాయ

రంగు శ్రీ వేంకటరమణ నన్నేనసితి–
వెంగిలిమోవుల కిచ్చుకమాయ ॥తగుతగు॥

**అర్థములు:** ప. తగుతగు=చాలు చాలు; దొరతనము=పాలనము, కార్యములు; వెగటు= విరసము; వేడుక=వినోదము.

1. విరసము=విసుగుతోకూడు; వేవేలు=లెక్కకు మించి; సరసపువేళ=శృంగార చేష్టలు చేసే సమయము; చవులు=రుచి, ఆహ్లాదము; ఎరవు=శాశ్వతము కాని; కాగిట=కౌగిట; చందము=విధము, అందము.
2. బొమ్మ=కనుబొమ్మలు; జంకెన=అదిరిపడు; పొరి=మాటిమాటికి (పోలి రూపాంతరము); సమ్మతించు=అంగీకరించు; చవి=రుచి, ఆనందము; దిమ్మరి=మత్తునుకలిగించువాడు; నెమ్మి=ప్రేమ; నేరుపు=నైపుణ్యము, చాతుర్యము.
3. అలయు=శ్రమించు; అంటబెనగు=గాఢంగా బంధించు; అంగడి రతులు=అల్లరి శృంగారము; చవులు=రుచి, ఆహ్లాదము; రంగు=వలపు; ఎనయు=పొందు; ఎంగిలి=అధరామృతముతముతో గూడిన; ఇచ్చకము=ప్రీతికరము.

**భావము:** ఓ శ్రీనివాసా! చాలు చాలు! నీ కార్యములిక. నీవు చేసే విరసపు పనులన్నీ వినోదం కలిగిస్తున్నాయి.

విసుగుతో నువ్వు పలుమారు దూషించినప్పటికి, శృంగార వేళల్లో ఎంతో ఆహ్లాదాన్నిస్తున్నాయి. అప్పటికప్పుడు నీవు ఏవో పనులు చేసినప్పటికి, అవన్నీ నా కౌగిట్లో కూడినప్పుడు ఎంతో రంజుగా అందగిస్తున్నాయి.

నీవు ఎప్పుడైనా కనుబొమ్మలు అదిరించినప్పుడు కూడా అంగీకరించినట్లైతే ఎంతో మాధుర్యాన్నిస్తున్నాయి. మత్తెక్కి పారవశ్యంతో ఎక్కడెక్కడ విచ్చలవిడిగా తిరిగి వచ్చినప్పటికి, ప్రేమతో నన్ను చేకొనగానే నీ చాతుర్యం, నైపుణ్యం అపురూపంగా ఉన్నది.

శరీరావయవాలు అలసి పోయే విధంగా శృంగార చేష్టలతో గాఢంగా పెనవేసుకున్నప్పటికి, ఆ అల్లరి శృంగారము కూడా నాకు ప్రీతిపాత్రంగా ఉన్నది. ఓ శ్రీవేంకటేశ్వరా! నా అధరామృతం మీద మక్కువతో నన్నే కోరుకుంటూ వలపుతో గాఢ మోహంతో నన్ను పొందుకూడావు.

**విశేషాంశాలు:** శృంగార క్రీడలో ఉన్న జంటకు ఉచితానుచితాలు తెలియవు. వారినోటి వెంట వస్తున్నవి అశ్లీలమా కాదా అని గమనించే ధ్యాసలో కూడా ఉండరు. ఆ శృంగార క్రీడలో శరీరాలు అలసిపోతున్నా కూడా అలసట ఎరుగని విధంగా తమకంతో ఉంటారని చెప్తూ అన్నమయ్య "విసరపు తిట్లు వేవేలు దిట్టినా సరసపు వేళల చవులాయ" అనీ, "అంగములలయగ నంట బెనగినా సంగడి రతులను చవులాయ" అంటూ ఆ సమయాలలో అన్నీ అత్యద్భుతంగానే అనిపిస్తాయి అని చెప్తున్నాడు.

## 75

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామికి సేవలు చేస్తూ "నాకు లోపల ఒక మాట బయట ఒక మాట అనేవి ఉండవు" అని చెప్తున్నది.

### సాళంగనాట

ప. ఎవ్వ రెట్టయినా నుండనీ ఇదివో నేను
నవ్వుతా నీసేవ సేతు నడుమ నేను ॥పల్లవి॥

1. మనసున నొకమాట మఱఁగున నొకమాఁట
యెనసి నే (న?) నయములు యెఱఁగ నేను (?)
వనితనై నీమీఁదివలుపే గతియని
తనివోక బదికేటిదానను నేను ॥ఎవ్వ॥

2. వొలిసితే నొకటియు నొల్లకుంటే నొకటియు
చలివేఁడివేసాలు జరప నేను
కలికితనాన నీతో కాఁపురమే గతియని

తలంచి పొందులు సేసేదానను నేను ॥ఎవ్వ॥

3. వొక్కపరి యిచ్చకము వొక్కపరి మచ్చరము
యిక్కడా నక్కడ యెలయించను నేను
గక్కన శ్రీ వేంకటేశ కలసితి విటు నన్ను
మక్కువ నిటువలెనే మరుగుదు నేను ॥ఎవ్వ॥

**అర్థములు:** ప. ఎట్టైనా=ఏవిధంగా; ఇదివో=ఇదుగో; సేతు=చేస్తాను; నడుమ=మధ్యలో.

1. మరుగున=రహస్యముగ; ఎనయు=అందిపుచ్చుకొని; నఅనయము=ఆవశ్యకము; గతి=విధానము, త్రోవ, దారి; తనివోవు=తృప్తిపడు.
2. వొలసితే=ఇష్టపడితే (వలయు అనే పద రూపాంతరం); ఒల్లకుంటే=ఇష్టంలేకపోతే; చలివేడి=సుఖ దుఃఖాలు; సాలు=పద్ధతి; కలికితనము=చక్కదనము; దృష్టి; గతి=దారి.
3. ఒకపరి=ఒకసారి; ఇచ్చకము=ప్రీతి; మచ్చరము=అసూయ; ఎలయించు=ఆసక్తిపడు; గక్కన=త్వరగా; మక్కువ=ప్రీతి, ప్రేమ; మరుగుదు=అలవాటుపడు.

**భావము:** ఓ స్వామీ! సావధానంగా నా మాటలాలకించండి. ఎవరే విధంగానైనా ఉండనివ్వండి. ఇదుగో నేను మాత్రం మధ్యమధ్యలో నవ్వుతూ సంతోషపూర్వకంగానే నీ సేవలు చేసుకుంటాను.

నాకు లోపల ఒక మాట బయట ఒక మాట అనేవి ఉండవు. అందిపుచ్చుకుని గ్రహించి మీకు ఎప్పుడెప్పుడు ఎటువంటి అవసరములంటాయో గ్రహించిన దానను. ఒక స్త్రీగా మీ మీద అత్యంత అనురాగంతో ఉండడమే నా దారి యని భావిస్తూ తృప్తిగా జీవనం సాగించే దానను.

మీ పై ఇష్టమైనప్పుడు ఒకవిధంగా, ఇష్టంలేనప్పుడు ఒక తీరుగా ఉండేదాన్ని కాదు స్వామీ! సుఖదుఃఖాలనగా ఏమిటో తెలిసినదానను. అకార్యాలను చేయజాలను. చక్కగా మీతో సంసార సుఖమే మేలని, అదే నా మార్గమని భావిస్తూ మీతో పొందుకూడి యున్నదానను.

మీపైన ఒకసారి ప్రీతి, మరొకసారి అసూయ చూపిస్తూ ఇక్కడా అక్కడా ప్రవర్తించను. ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను ఇంత త్వరపడి ప్రేమతో నన్ను చేకొని పొందుకూడితివి, ఎంతో ప్రీతితో ఈవిధంగానే ఎల్లవేళలా అలవాటుగా మిమ్మల్ని కాచుకొని ఉంటాను.

## 76

**అవతారిక:** శ్రీనివాసుడు ద్వాపరంలో చేసిన అల్లరిపనులను, పదహారువేలమంది గొల్లెతలను మురళీనాదంతో మోహింపజేసిన వైనాన్ని ఓ కాంత వివరిస్తున్నది.

## గంభీరనాట

ప. ఇంకా మమ్ముఁ జెనకేవు యేరా వోరి
కొంకులేక కొసరేవు కొమ్మల నందరిని ॥పల్లవి॥

1. గోవుల మరపినట్టు గొల్లెతల వలపించి
కావరించి తిరిగేవు కానీకానీరా
వేవేలు ఇండ్లు చొచ్చి వెన్నదినేనంటానే
మోవులు చవిగొంటివి ముద్దియల నెల్లను ॥ఇంకా॥

2. పిల్లఁ గోవిరాగాలనె పెక్కుమంత్రాలు మంత్రించి
కల్లరివై తిరిగేవు కానీకానీరా

చల్లదుత్తలంటాను చన్నులపైఁ జేయి చాఁచి
కొల్లగొంటివి మానము కోమలులనెల్లను ॥ఇంకా॥

3. మదుగులఁ జొక్కుచల్లి మచ్చిక నేయించుకొని
గదుసరివై తిరిగేవు కానీకానిరా
నడుమ శ్రీ వేంకటేశ నన్ను నిట్టె యేలితివి
తొడిఁబడఁ గూడితివి తొయ్యలులనెల్లను ॥ఇంకా॥

**అర్థములు:** ప. చెనకు=తాకు; కొంకు=భయము; కొసరు=కోరుకొను; కొమ్మ=స్త్రీ.

1. మరపినట్టు=అలవాటుచేసిన విధము; గొల్లెతలు=గొల్లభామలు; వలపు=మోహము; కావరించి=మదించి; వేవేలు=లెక్కలేనన్ని; చొచ్చి=ప్రవేశించి; చవిగొను=అనుభవించు; ముద్దియ=స్త్రీ.
2. పిల్లగోవి=పిల్లనగ్రోవి, మురళి; మంత్రించి=మాయచేసి; కల్లరి=బొంకువాడు; చల్లదుత్తలు=మజ్జిగకుండలు; కొల్లగొను=దోచుకొను; మానము=శీలము; కోమలి=చక్కదనముగల ఆడుది.
3. మదుగులు=పరిశుద్ధులైనవారు; చొక్కు=పారవశ్యము, మత్తు; మచ్చిక=వశము; నేయించుకొను=పదుగుపేకల్లా కలిసిపోవు; గదుసరి=ధైర్యవంతుదు; నడుమ=మధ్య; ఏలు=కైకొను, పొందు; తొడిబడు=చలించు, తొట్రుబాటు; కూడితివి=పొందితివి; తొయ్యలులు=ఆడుది, స్త్రీ.

**భావము:** ఏరా! ఓరి అల్లరిగొల్లవాడా! ఇంకా మా వెనుకబడి మమ్ము తాకుతూ, ఏమాత్రం భయమనేదిలేకుండా ఈ గోకులంలో ఉన్న స్త్రీలందరిని కోరుకుంటున్నావు.

నీవు గోవులను కాస్తూ వాటిని మాలిమి చేసుకున్న విధంగానే ఈ గొల్లభామలందరిని మోహములో ముంచెత్తి మదించి విజృంభించి తిరిగుచున్నావు. సరే! సరే కానీ, లెక్కలేనన్ని గొల్లవారి ఇండ్లలో దూరి వెన్న తింటూ ఉంటూనే ఆ భామల అధరపానం కూడా చేశావు.

నీ మనోహరమైన మురళీ నాదంతో ఏదో మాయజేసి అనేక రాగాలనే మంత్రాలను పలుకుతూ, అబద్ధపుమాటలాడుతూ తిరిగావు. సరే! సరే కానీ, మజ్జిగ కుండలను అందుకుంటూ వారి వక్షోజాలపై చేతులువేసి, వారి శీలాన్ని దోచుకున్నావు.

పరిశుద్ధమైన హృదయంగల వారికి ఏదో మత్తుమందు చల్లి వశం చేసుకొని, ధైర్యంగా తిరుగుతున్నావు. సరే! సరే కానీ, ఓ శ్రీవేంకటేశ్వరా! మధ్యలో నన్ను ఈవిధంగా అనుగ్రహించి ఏలుకొన్నావు. ఆ గొల్లభామలందరిని తడబాటుకు గగుర్పాటుకు గురిచేశావు.

## 77

**అవతారిక:** స్వామి శ్రీనివాసుడు చేసే అల్లరి పనులకు, శృంగార చేష్టలకు అమ్మ సిగ్గుపడుతూ ఉండగా, చెలులు ఆ సిగ్గుల వైనాన్ని వివరిస్తున్నారు.

### శ్రీరాగం

ప. వలపేమి వెగటా వనితలకు
చిలుకుగోళ్ళనేల చెమట చిమ్మేవే ॥పల్లవి॥

1. అదనెరిఁగి పచ్చిమాటాతఁడు నిన్నాడితేను
వదనకమల మేల వంచేవే
సదరానఁ గప్పురము చన్నుదాఁక వేసితేను
వుదుటున లోలోన వుసురనేవేలే ॥వలపేమి॥

2. చవులువుట్టిం చాతఁడు సన్న నీకుఁ జేసితేను

అవలివలై యేల అలసేవే
తివిరి యట్టె ముసుఁగు దీసి మోము చూచితే
జవళిఁ జొక్కుచు నేల జడిసేవే ॥వలపేమి॥

3. శ్రీ వేంకటేశుఁడు నిన్నుఁ జేరి కాఁగిలించితేను
భావము గరఁగి యెంత పదరేవే
కావరపునవ్వుతోడఁ గడుసరసమాడితే
చేవదేర నెంతకెంత చెలఁగేవే ॥వలపేమి॥

**అర్థములు:** ప. వలపు=కోరిక, ప్రేమ; వెగటు=అయిష్టము, వైరస్యము; చిలుకుగోళ్ళు=బాణంవంటి వాడియైన గోళ్ళు; చెమట=స్వేదము; చిమ్ము=వ్యాపింపజేయు.

1. అదను=తగిన సమయము; పచ్చిమాట=శృంగారపు మాట; వదన కమలము=తామరపుష్పం వంటి మొహము; సదరాన=చాతుర్యముతో; కప్పురము=కర్పూరము; చన్నుదాక=వక్షోజములు దాకునట్లు; ఉదుటున=విలాసముతో; లోలోన=లోపలలోపల; ఉస్సురను=తాపము, కోపము ఉన్నప్పుడు విడిచే ఉచ్ఛ్వాస నిశ్వాసలు.
2. చవులు=కోరికలు; పుట్టించి=పుట్టించి; సన్న=సైగ, సంజ్ఞ; అవలి=ఇతరురాలివై; తివిరి=ప్రయత్నముతో; జవళి=ఇద్దరు, రెండు; చొక్కు=పారవశ్యము; జడియు=భయపడు.
3. చేరి=కూడి; కాగిలించు=కౌగలించు; భావము=మనోభిప్రాయము; కరగి=ద్రవించు; పదరు=చలించు; కావరము=మదము; కడు=అధికమైన; చేవదేరు=సారవంతమగు; ఎంతకెంత=చర్యకు ప్రతిచర్యగా; చెలగు=చుట్టుకొను.

**భావము:** స్వామీ! కోరికలు, ప్రేమలు స్త్రీలకు వైరస్యమా లేక అయిష్టమా చెప్పు? నీ బాణాల్లాంటి చేతివేళ్ళ చివరలనుండి అంత చెమటలు చిందిస్తున్నావెందుకు?

తగిన సమయము చూసుకుని వచ్చి నీతో స్వామి మంచి శృంగారపరమైన కబుర్లు చెబుతూ ఉంటే నీ తామరపుష్పం వంటి ముఖారవిందాన్ని సిగ్గుతో ఎందుకు వంచుకుంటావు? ఆతడు చాతుర్యముతో నీ వక్షోజంపై కర్పూరపు పొడి చల్లినట్లైతే, తాపముతోను, సిగ్గుతోను త్వరపడి లోపలలోపల వుస్సురంటూ ఉచ్ఛ్వాస నిశ్వాసలెందుకు విడుస్తావు?

నీలో కోరికలు పుట్టిస్తూ నీకు అనేక విధములుగా సైగలు చేస్తూ ఉంటే, అటునిటు నవుతూ ఆందోళనగా ఎందుకు అలసిపోతున్నావు? ఆతడు ప్రయత్నించి నీ ముసుగు తొలగించి నీ ముఖారవిందాన్ని తిలకిస్తే ఆతడితో జతకూడి పారవశ్యంపొందికూడా ఎందుకు భయపడతావు?

శ్రీవేంకటేశ్వరుడు నిన్ను చేరుకుని కౌగిట్లో బంధిస్తే వారి కౌగిలిలో ఎంత చలించిపోయావు? ఆ స్వామి శృంగారపరమైన నవ్వులు చిందించి ఏవో చిలిపి పనులు చేస్తే, ఆ సమయాన అధికమోహముతో ఆయనకు సరిదోడుగా చుట్టుకొని పోయావు?

## 78

**అవతారిక:** శృంగార నాయికలు స్వామి శ్రీనివాసుడు చేసే అల్లరి శృంగార చేష్టలనూ వివరిస్తూ ఎంత మంది కాంతలను ఈ విధంగా మోహంలో ముంచెత్తావు చెప్పవయ్యా అంటూ ప్రశ్నిస్తున్నారు.

## హిందోళవసంతం

ప. ఎంత కాకు సేసేవు యింతుల నింతేసి నీవు
వంతులు వెట్టుక యేమి వల్లె వేసేవు ॥పల్లవి॥

1. కందువ మర్మములంటి గజరుఁదనము చూపి
యెందరితో నవ్వు నవ్వి యెలయించేవు
చిందేటి మోవితేనెలు చిమ్మి రేఁచి చవిగొని

విందుల వలపులెట్టు వెదచల్లేవు ॥ఎంత॥

2. చన్నులపైఁ జేయి వేసి జాణతనములు చూపి
యెన్నికతలఁ గరపే విందరి నీవు
వెన్నెలనవ్వు నవ్వించి వేడుకలు చిత్తగించి
పన్నిన మాయల నెట్టు భ్రమయించేవు ॥ఎంత॥

3. కాతరాలు వుట్టించి కాగిటను బిగియించి
యేతుల నెందరి గుండే (గూడే?) వింపుల నీవు
యీతల శ్రీ వేంకటేశ యిట్టె నన్ను గూడితివి
జాతుల నెందరిపై సేసలు వెట్టేవు ॥ఎంత॥

ప. కాకు=తిరస్కారం; ఇంతేసి=ఇన్నివిధములుగ; వంతులు=పట్టుదలతో కలహించు; వెట్టుక=పెట్టుకొని; వల్లె వేయు=చెప్పినమాట మరల మరల చెప్పు.

1. కందువ=ఏకాంతము, జాడ; మర్మములంటు=ఆడువారిని తాకకూడని తావులను తాకు; గజరుతనము= కోరిక లేక కామంతో ఉండుట; ఎలయించు=ఆసక్తిని కలుగజేయు; చిందు=వ్యాపించు, తొణకు; మోవితేనె=అధరామృతము; చిమ్ము=మీటు, వ్యాపింపజేసి; రేచు=ఎగదోయు; చవిగొని=రుచిచూచు; వెదజల్లు=విస్తారముగా వ్యాపించు.

2. జాణతనము=నేర్పరిదనము, చాతుర్యము; కతలు=కథలు, కల్పనలు; కరపు=బోధించు, చెప్పు; వెన్నెలనవ్వు=పండువెన్నెల వంటి చల్లనైన నవ్వు; వేడుక=సంతోషము; చిత్తగించు=సావధానముగా విను; పన్నిన=కలుగజేయు; భ్రమయించు=మాయలో ముంచు.

3. కాతరము=వ్యాకులత; వుట్టించి=పుట్టించి; కాగిట=కౌగిట; ఏతులు=గొప్పలు; కూడు=చేరు; ఇంపు=ఇష్టము; ఈతల=ఈవల; కూడితివి=చేరితివి; జాతులు=సైగలు, సేస=అఖింతలు; వెట్టు=పెట్టు.

**భావము:** ఓ స్వామీ! స్త్రీలపై ఇన్నివిధములుగా తిరస్కారభావం చూపిస్తున్నావయ్యా! పట్టుదలకుపోయి చెప్పినమాటలే మరలా మరలా చెబుతున్నావు.

ఏకాంతములో ఉండగా స్త్రీలను ముట్టుకోగూడని తావులను, శృంగార భావంతో స్పృశిస్తూ నీ చాతుర్యమును ప్రదర్శిస్తూ ఎంతమంది స్త్రీజనంతో నీ మాయ నవ్వులు నవ్వి కోరికలు కలిగించావో కదా! వారి మోములనుండి స్రవిస్తున్న అధరామృతాన్ని రుచి చూసి, సంతోషంతో వేడుకగా నీ ప్రేమను ఎలా వారిపై వ్యాపింపజేస్తున్నావో గదా!

వారి వక్షోజాలపై చేతులువేస్తూ నీ చాతుర్యాన్నంతా రంగరించి చూపిస్తూ, ఈ ఆడువారి మధ్యలో చేరి ఎన్నెన్ని కల్పనలు చేసేవు. వెన్నెలలాంటి తెల్లని చల్లని నవ్వులు నవ్వుతూ వారిలో కోరికలు రగిలించి, వాటిని సావధానంగా తిలకిస్తూ ఎన్నెన్ని మాయలను వారిపై ప్రయోగించి వారికి పారవశ్యాన్ని కలిగించావు.

వారిలో ఈవిధంగా వ్యాకులత, గగుర్పాటు కలిగించి, వారిని నీ బిగి కౌగిట్లో బంధించి, ఈ స్త్రీజనాన్ని ఎంతమందిని ఇష్టంతో ఆసక్తితో ఎంతమందిని కలిశావో లెక్కలేదు. ఓ శ్రీవేంకటేశ్వరా ఈవల నన్ను ఈవిధంగా పరిగ్రహించావు. సైగలు చేసి ఎందరి స్త్రీలపై అక్షింతలు చల్లావో కదా!

## 79

**అవతారిక:** ఒక నాయిక స్వామి శ్రీనివాసుడు చేసే సుతిమెత్తని శృంగార చేష్టలను వివరిస్తున్నది

### ఛాయానాట

ప. నేఁడు గొత్తలా తనకు నెయ్యపుజాణతనాలు
నాఁడే కానవచ్చెను ననుపులెల్లాను ॥పల్లవి॥

1. చెంత నుండి పలికీని చేయి మీఁద వేసీని
యెంత లేదు తనవలపెరుఁగు నటే
వంతు తోఁ బువులెల్లాను వాసనలు చూపీని
ఇంతటితనతమక మేమి చెప్పేనే ॥నేఁడు॥

2. సెలవుల నవ్వీని చెక్కులు గడు నొక్కీని
తెలిసితిఁగదే తన తెఱఁగెల్లాను
బలిమి నూరకే తాను పచ్చడము గప్పీని
కలిగెనె తన పొందు కాణాచి నాకు ॥నేఁడు॥

3. కన్నులఁ దప్పక చూచీ కాఁగిలించి కూడీని
నన్ను శ్రీవేంకటేశుఁడు మన్నించెఁ దానె
సన్నల నప్పుడే నాతో సరసము లాడీని
పన్నిన వేడుకతో నా భాగ్యమాయనే ॥నేఁడు॥

**అర్థములు:** ప. కొత్తలా=అపూర్వమా? నెయ్యము=స్నేహము; జాణతనాలు=చాతుర్యము, నైపుణ్యము; నాడే=అంతకు మునుపే; ననుపు=అనురాగము.

1. చెంత=దగ్గర; పలికీని=పలుకుతూ ఉందు; వేసీని=వేస్తూ ఉందు; వంతు=పట్టుదల; పువులెల్లాను=పువ్వులన్నిటిని; చూపీనీ=చూపించు; తన=తనయొక్క; తమకము=మోహము, చెప్పేనే=చెప్పగలము.

2. సెలవులు=ఆటవిడుపు, మధ్యమధ్యలో; తెరగు=స్వభావము; బలిమి=బలవంతము; ఊరకే=అకారణంగా; పచ్చడము=దుప్పటి; కాణాచి=నివాసస్థానము.

3. తప్పక=విధిగా; కాగలించి=కౌగలించి; మన్నించు =గౌరవించు; సన్నలు=సైగలు, సంజ్ఞలు; వేడుక=కోరిక, వినోదము, కుతూహలము.

**భావము:** ఆ స్వామికి ఈరోజేమైనా క్రొత్తనా? ఆయనకు ఆ నైపుణ్యం ఎప్పటినుంచో ఉన్నదే గదా! ఇంతకు ముందు ఎన్నిసార్లో ఆయన అనురాగం, ప్రేమ మనకు అనుభవమే కదా!

అతి దగ్గరగా సమీపించి ఏవో మాటలు చెవిలో చెబుతూ పైన చేతులు వేస్తాడు. ఎన్ని చేయలేదు ఇటువంటి పనులు, ఆయన ప్రేమ అందరూ ఎరిగినదే కదా! పట్టుదలతో వినకుండా అనేక పుష్పాలను వాసన చూపిస్తాడు. ఆయనకు ఇంత మోహమేమిటో అర్థం కావడంలేదు.

మధ్య మధ్యలో చిరునవ్వులు చిందిస్తూ చెక్కిళ్ళు నొక్కుతూ ఉంటాడు. ఆయన పద్ధతులన్నీ తెలిసినవే కదా! వద్దన్న వినకుండా బలవంతంగా ఆ దుప్పటిని మీద కప్పుతూ పొందుగోరుతూ నివాసస్థానమై ఉంటాడు.

దివ్యనేత్రాలతో నన్ను అదేపనిగా దర్శిస్తూ కౌగిలిలో బంధిస్తూ కలుస్తాడు. ఆ శ్రీవేంకటేశ్వరుడు గౌరవించి, నాకు ఎన్నెన్నో సైగలు చేస్తూ సరస శృంగాలలో తేలుస్తాడు. ఆయన కుతూహలంతో చేసే పనులన్నీ నాకు అదృష్టాన్ని ఇచ్చేవే గదా!

## 80

**అవతారిక:** ఓ శ్రీవేంకటేశ్వరా! నీ మనసు తెలిసికోవడం చాలా కష్టం స్వామీ! అంటున్నది అమ్మ అలమేలుమంగమ్మ.

## నట్టనారాయణి

ప. ఈడనుండే చుట్టరిక మిది చాలదా
వాడిక సుద్దులు నీవు వదలేటివాఁడవా ॥పల్లవి॥

1. పలుమారు నీతోను పంతములాఁడగ రాదు

చలములు సారెసారె సాదించరాదు
పొలుపుగ నీవు నన్నుc బొందులు సేయుమనేవు
వొలిసినట్టు మట్టున నుండేటి వాcడవా ॥ఈడనుండే॥

2. యెక్కువ తక్కువ నీతో నెదురు మాటాడరాదు
కక్కసించి నిన్నెంతైనాc గాదనరాదు
ఇక్కువ లంటుచు నన్ను నియ్య కొలుపవచ్చేవు
తక్కిన పనులు నీవు తలcచని వాcడవా ॥ఈడనుండే॥

3. శ్రీ వేంకటేశ్వర నీచిత్తము దెలియరాదు
వావితో నన్నేలితివి వద్దనరాదు
కావలె ననుచు నాకు గంగణము గట్టితివి
చేవదేర గూడితివి సిగ్గు పడేcవాడవా ॥ఈడనుండే॥

**అర్థములు:** ప. ఈడనుండే=ఇక్కడ ఉన్న; వాడిక=అలవాటు; సుద్దులు=సూక్తులు.

1. పలుమారు=అనేకసార్లు; పంతము=పట్టుదల; చలములు=పట్టుదల; సారెసారె=మాటిమాటికి; పొలుపు=విధము; పొందులు=కూడికలు; వొలిసి=వలచి; మట్టున=కుదురుగ.
2. కక్కసించు=బాధించు, సంకటపెట్టు; ఇక్కువ=ఉనికి, జాడ; ఇయ్యకొలుపు=అంగీకరింపజేయు; తలచని=ఆలోచించని.
3. చిత్తము=మనసు; వావి=బంధుత్వము; కంకణము=దీక్షవహించు; చేవదేర=సారవంతమగు, పక్వమగు; కూడితివి=కలిసితివి.

**భావము:** ఓ స్వామీ! నీతో ఇక్కడ ఉన్నటువంటి బంధుత్వమిది చాలదా? అలవాటుగా మాట్లాడే మాటలు చేతలు నువ్వు వదిలిపెట్టే వాడవా?

స్వామీ! ఇన్నిసార్లు నీతో పంతాలు పట్టింపులకు పోకూడదు. ఆ పట్టుదలతో మాటి మాటికి సాధించకూడదు. ఒక పద్ధతిలో నీవు నన్ను కూడమని చెప్పేవు. కానీ వలచి ఒక చోట కుదురుగా ఉండేవాడవా?

స్వామీ! నీతో ఎక్కువతక్కువలు చేసి నీతో యెదురు మాట్లాడకూడదు. నిన్ను బాధపెడుతూ కాదని అనకూడదు. స్థానం తెలుసుకొని నన్ను ఇష్టపడి అంగీకరింపజేస్తావు. మిగతా పనులన్నీ ఎరుగని వాడవా?

ఓ శ్రీవేంకటేశ్వరా! నీ మనసు తెలిసికోవడం చాలా కష్టం స్వామీ! బంధుత్వముతో నన్ను చేకొన్నావు కనుక నేను వద్దనరాదు. నన్ను కోరి నేను కావలెననుకొని నాకు కంకణము గట్టావు. ఇంత హొయలు చూపి నన్ను చేరుకున్నావు. నీవు సిగ్గుపడేటి వాడవా?

## 81

**అవతారిక:** మదనతాపంతో బాధపడుతున్న అలమేలుమంగమ్మ శ్రీనివాసుని త్వరగా విచ్చేయమని చెలితో కబురు పంపుతున్నది.

### దేశాక్షి

ప. రమ్మనవే చెలియా రమణుని నీడకు
యిమ్మనవే చనవులు యెలయింపు లేcటికే ॥పల్లవి॥

1. కన్నులcజూచిన దాకాcకడలేదు తమకము
సన్నల మొక్కినదాcకా చల్లీcగూరిమి
మన్నన లడుగుదాcకా మలసీc గోరికలు
యెన్ని లేవు యెడమాట లింకా నేcటికే ॥రమ్మనవే ॥

2. సరసమాడినదాcకా జడి వట్టీc జెమటలు

వరసకు వచ్చు దాఁకా వంచీఁ జలము
గరిమఁ బై కొన్న దాఁకాఁ గమ్మీ నడియాసలు
ఇరవై నడుమఁ దెర యిఁక నేఁటికే ॥రమ్మనవే ॥

3. కదిసి కూడిన దాఁకా కడుఁ జన్ను లదరీని
పెదవి యానిన దాఁకా నిదే నోరూరీ
అదన శ్రీ వేంకటేశుఁ డంత లోనె నన్నుఁ గూడె
యెదుటనే వొడఁబాటు లింకా నేఁటికే ॥రమ్మనవే ॥

**అర్థములు:** ప. చెలియ=చెలికత్తె, స్నేహితురాలు; రమణుడు=అందమైనవాడు; ఈడకు=ఈతావుకు; చనవులు=అనురాగం; ఎలయించు=ప్రోత్సహించు, ఆసక్తిచూపు; ఏటికే=ఎందులకు.

1. కడలేదు=అనంతము; తమకము=మోహము; సన్నలు=సైగలు, చల్లీ=వ్యాపింపజేయుచూ; కూరిమి=స్నేహము, ప్రేమ; మన్నన=క్షమించు; మలసీ=పెనగుచూ, వ్యాపించు; ఎడమాట=దూరము చేసే మాటలు.
2. జడివట్టీ=ఆగక కురియు; వంచు=వంచిపోయు; గరిమ=ఘనత, గొప్పదనం; పైకొను=ప్రయత్నించు; కమ్ము=దట్టముగా వ్యాపించు; అడియాస=కలుగుననెడియాశ; ఇరవై=స్థానమై; తెర=అడ్డుతెర.
3. కదియు=దగ్గరగా వచ్చు; కడు=అధికము; చన్నులదరు=వక్షోజము కంపించు; నోరూరు=నోటిలో నీళ్ళు పుట్టు; అపేక్షించు; అదన=తగినసమయము; కూడె=కలిసెను; ఒడబాటు=సంధి, సమ్మతము.

**భావము:** ఓ చెలీ! ఆ సుందరాంగుడిని ఇక్కడకు రమ్మనవే! ఇంకా ఈ ఎదురుచూపులన్నీ ఎందులకే! త్వరగా తన వలపును అనురాగాన్నీ చూపమనవే!

స్వామిని నా కళ్ళతో చూచేదాకా ఈ మోహము అంతులేకుండా ఉన్నది. వారు సైగలు అర్థం చేసుకుని మ్రొక్కేదాకా, నాపై స్నేహాన్ని చూపమనవే! స్వామిని తప్పులు మన్నించమని అడిగేదాకా ఈ చుట్టుముడుతున్న కోరికలను దాచుకోగలనా? దూరంచేసే మాటలు ఇంకా ఎందుకు చెలీ!

స్వామితో సరశృంగారాములాడేంతవరకూ ఈ శరీరముపై చెమటలు వర్షంలా కురుస్తున్నది. నా సరసకు వచ్చేంత వరకు ఈ నీటినిపోసి, తన ఘనతను చూపించేదాకా నాలో కోరికలు అడియాసలవుతున్నాయి. ఇంకా మామధ్య ఉన్న ఈ అడ్డుతెర దేనికే!

స్వామిని కలిసేంతవరకూ నా వక్షోజాలు అదేపనిగా కంపిస్తున్నవి. ఆయన పెదవి నా పెదవిపై ఆనేంతవరకూ నోటిలో అదేపనిగా అమృతం ఊరుతూనే ఉంది. తగినసమయం చూసి నా స్వామి శ్రీవేంకటేశ్వరుడు అంతలోనే నన్ను చేరుకున్నాడు. చెలీ! ఇంకనూ ఈ సంధి సమ్మతాలు ఎందుకే!

**విశేషాంశాలు:** అన్నమయ్య కీర్తనల్లో వాడే అసమాపక క్రియాపదాలు వినూత్నంగా కనబడుతుంది. సాధారణంగా అలాంటి పదాలను చల్లుతూ, వంచుతూ, కమ్ముతూ అనడానికి భిన్నంగా చల్లీ, వంచీ, కమ్మీ అని వాడడం ఈ కీర్తనలో గమనించవచ్చు.

## 82

**అవతారిక:** ఈ కీర్తనలో నాయికానాయికల విరహవేదన వర్ణించబడినది.

### ఆహిరి

ప. ఎవ్వతెకో నేఁడు నిన్ను నింత సేసెను
పువ్వులైన వలపులే పూపఁలు నౌను ॥పల్లవి॥

1. చెవిలోఁ జెప్పిన మాట చిత్తము లోపల నాటీ
వివరింప వినుకలి విరహ మవును
తనివి యదే సారెఁ దలపోయ తలపోయ

కవిసి నివ్వెరగులై కమ్ము కొనును ॥ఎవ్వతెకో॥

2. కనుఁగవచూపులే కాయముమీఁదఁ బారీ
వెనుకొని కనుకలి విరహ మౌను
తనరి యాకాంక్షలఁ దగులఁగ దగులఁగ
యెనసేటిరతులకు నేఁకట లౌను ॥ఎవ్వతెకో॥

3. సెలవి నవ్వినవ్వు సేసలై తలకెక్కీ
వెలయుచు నేకశయ్య విరహ మౌను
అలమి శ్రీ వేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
యెలమి సంతోసాల కిరవులౌను ॥ఎవ్వతెకో॥

**అర్థములు:** ప. ఎవ్వతెకో (ఎవ్వతె-ఒకో)=ఎవరీమె; పూపలు=పూలపాత్రలు.

1. నాటీ=నాటుకొని; వినుకలి=వినుటకు; ఆప్యాయత, తృప్తి; సారె=మాటికి; కవిసి=కలిగించు; నివ్వెరగు=భయము, పారవశ్యము; కమ్ముకొను=చుట్టుకొను.
2. కనుగవ=కన్నులజత; కాయము=శరీరము; పారీ=ప్రసరించు; వెనుకొలి=వెంబడించు; కనుకలి=చూపు; తనరి=వృద్ధియగు, పెరుగు; తగులగ=పట్టుకొను; ఎనసేటి=పొందేటి; ఏకట=ఎక్కువైన కోరిక.
3. సెలవి=పెదవి మూల; సేసలు=అక్షింతలు; వెలయు=ప్రకాశించు; ఏకశయ్య=ఒకేపడక; అలమి=క్రమ్ముకొని; కూడితివి=చేకొంటివి; ఎలమి=సంతోషము, తృప్తి; ఇరవు=స్థానము.

**భావము:** ఆమె ఎవరో కదా! నన్నింతగా ప్రేమలో ముంచెత్తినది. పుష్పాలైననూ అనురాగంతో కూడిన పుష్పపాత్రలవలె కనబడుతున్నాయి.

చెవిలో చెప్పిన ప్రతి మాటా నా మనసులో నిలిచిపోయినది. వివరంగా చెప్పాలంటే వినడానికి విరహమవుతుంది. ఆ ఆప్యాయతనే మాటిమాటికి ఆలోచించగా, అవన్నీ అమిత పారవశ్యాన్ని కలిగిస్తూ నన్ను చుట్టుకుంటున్నాయి.

ఆమె కంటిచివరల చూసే విరితూపులే నా శరీరము మీద నాటుకొని ప్రవహిస్తున్నాయి. ఆ చూపులే నన్ను వెంబడిస్తూ ఎంతో విరహాన్ని కలిగిస్తున్నాయి. పెరిగిపోతున్న కోరికలు నన్ను చుట్టుముట్టి పట్టుకొనగా, పొందబోయే శృంగార రతులు మీద ఆసక్తి, కోరికలు అధికమౌతున్నవి.

ఆమె పెదవి మూలగా రువ్వే చిరునవ్వులు అక్షింతలై తలమీద పడుతున్నాయి. అందమైన పడకమంచముమీద ఒంటరినై పవళించిన నాకు మరింత విరహాన్ని పుట్టిస్తున్నది. ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను క్రమ్ముకొని కలిసి చేకొంటివి. నాకెంతో సంతోషాలకు చిరస్థానమై ఉన్నది.

## 83

**అవతారిక:** స్వామిని ప్రసన్నం చేసుకోవడం కోసం రమణులు పరితపిస్తూ, అండజేర్చుకోమని వినతులు చేస్తున్నారు.

## దేసాళం

ప. వలపులలో నీకీవన్నె లివి ఇన్నియును
మలతురు సొలతురు మంకుల నుండుదురు ॥పల్లవి॥

1. చలపాదితనములు సహజము సతులకు
వెలఁది నేమీననక వేఁడుకొవయ్యా
పలుకుదు రేమైనాఁ బక్కన జంకితురు
పిలువఁ బిలువ నట్టె బిగుతు రెంతైనా ॥వలపులలో॥

2. కడుగట్టితనములు కలిగిన వెప్పుడును

పడఁతికి నీవిట్టేపంతమీవయ్యా
కొడిమెలు గట్టుదురు కోపములు చూపుదురు
తడవినంతటిలోనే తప్పులువట్టుదురు ॥వలపులలో॥

3. ఆసోదపుఁదనములె అంగములు కాంతలకు
యీ సుదతిఁ గూడితివి యేలుకోవయ్యా
బాస లడుగుదురు పై పై శ్రీ వేంకటేశ్వర
సేసవెట్టి గర్వాన చెక్కులు నొక్కుదురు ॥వలపులలో॥

**అర్థములు:** ప. వలపు=ప్రేమ; వన్నె=అందము, కీర్తి; మలతురు=తిరుగుదురు, చుట్టుకొందురు; సొలయు=నీరసపడు, వెనుదీయు; మకులు=మొండి, మూర్ఖత్వము.

1. చలపాదితనము=మాత్సర్యము; వెలది=ఆడుది; వేడుకొను=బ్రతిమాలు, ప్రార్థించు; పక్కన=సమీపము; జంకించు=అదురు; బిగుతు=వదులుకానిది, బిర్రు.
2. గట్టితనము=కఠినము; పంతము=పట్టుదల; కొడిమెలు=నిందలు; తడవు=నిమురు ; వట్టుదురు=పట్టుకొందురు.
3. ఆసోదపుతనము=కోరిక; సుదతి=స్త్రీ; కూడితివి=కలిసితివి; బాసలు=ప్రతిజ్ఞ, ఒట్లు; సేస=అక్షింతలు.

భావము: స్వామీ! ఏమని చెప్పమందురు? ప్రేమవిషయంలో నువ్వు చూపించే వన్నెచిన్నెలు అన్నీ ఇన్నీ కాదు. వనితలంతా నీ చుట్టూ తిరుగుతూ నిన్నే ధ్యానిస్తూ నిన్నే చుట్టుకుంటూ వైరస్యంతో ఒక్కోసారి మొండితనం కూడా చూపిస్తున్నారు.

మాత్సర్యమనే గుణం ఆడువారికి సహజమే కదా! అందువల్ల వారిపై కోపించక వారిని ఆదరించవయ్యా. కొంతమంది ఏవో అనకూడని మాటలు అంటూ ఉంటూ ప్రక్కన జేరి అదిరిస్తూ బెదిరిస్తూ ఉంటారు. మీరు వారిని బ్రతిమాలినకొద్దీ బిగుసుకుపోయి తమ బిర్రును చూపిస్తూ ఉంటారు.

ఎంతో కఠినంగా ఉన్న ఆడువారు కూడా ఉంటారు స్వామీ! అలాంటివారిపై నీవు సరదాగా పంతాలకు పోయినట్లైతే నీపై నిందలు వేస్తారు ఇంకా కినుక వహిస్తారు కూడా! అంతెందుకు..ఊరికే చేత్తో మృదువుగా ప్రేమతో నిమిరినా సైతం నీపై తప్పులెంచుతారు.

స్వామీ! నీకు చెప్పేంతవారమా? ఆడువారికి కోరికలు అధికము కదా! ఈ రమణిని చేకొన్నావు కదా! ఇక ఏలుకోవయ్యా! ఓ శ్రీవేంకటేశ్వరా! ఏవేవో ఒట్లు పెట్టడం, పంతాలకు పోవడం వారి నైజం సుమా! అక్షింతలు వేయడమే కాదు నీ పాలబుగ్గలు నొక్కుతారు కూడా స్వామీ!

## 84

**అవతారిక:** స్వామి ఇతరకాంతలను కూడడంపై మాత్సర్యం వహించి, అమ్మ అలమేలుమంగమ్మ తగదని వేడుకుంటున్నది.

### మేఁచబౌళి

ప. ఎవ్వతెతో మాటలాడే విపుడు నీవు
జవ్వని నిలుచున్నది చక్కఁజూడవయ్యా ॥పల్లవి॥

1. కలువకన్నుల నిన్నుఁ గసరి
కులుకుఁజన్నుల నిన్నుఁ గొసరి
చెలిఁ బయ్యదకొంగు విసరి
చెలిఁ నీ సేవలు సేసీఁ జిత్తగించవయ్యా ॥ఎవ్వతెతో॥

2. చిమ్ముల మోహరసము చిలికి
పమ్ముచు ప్రియములెల్లాఁ బలికి
అమ్ముడుసిగ్గులఁ గొంత యలికి

కొమ్మ నీకుఁ దమకించి కొసరీ మెచ్చవయ్యా ॥ఎవ్వతెతో॥

3. చొక్కపుటాసల నిన్ను సొలసి
మక్కువలు చల్లి చల్లి మలసి
గక్కన శ్రీ వేంకటేశ కలసి
మొక్కీ సంతోసాన నింతి ముదమందవయ్యా ॥ఎవ్వతెతో॥

**అర్థములు:** ప. ఎవ్వతె=ఎవరు; జవ్వని=యవ్వనవతి; చక్కజూడు=బాగుగా చూచు.

1. కలువకన్నుల=కలువపుషపువంటి కన్నులుగల స్త్రీ; కసరి=కోపించు, తిట్టు; కులుకు చన్నుల=శృంగారముగా కదులుచున్న కుచములు గల స్త్రీ; కొసరి=కోరుకొను; పయ్యెద=పైటకొంగు; విసరి=ఆడించు; చిత్తగించు=సావధానముగా విను.
2. చిమ్ములు=చల్లు; మోహరసము=వలపురసము; పమ్ము=అతిశయించు; ప్రియములు=ఇష్టమైన మాటలు; అమ్ముడు సిగ్గులు=దాసురాలైనప్పటి సిగ్గు; అలికి=అలసటపొంది; కొమ్మ=స్త్రీ; తమకించు=తత్తరపడు; కొసరు=కోరిక.
3. చొక్కపు=మనోహరము, స్వచ్ఛము; సొలయు=వైరస్యత; మక్కువ=ఇష్టము, ప్రేమ; మలసి=పెనగు, చుట్టుకొను; గక్కన=వేగముగా; ముదమందు=సంతోషించు, అలరారు.

**భావము:** స్వామీ! ఇందాకా నువ్వు ఏ లలనామణితో మాట్లాడుతున్నావు? ఇంత అందమైన యౌవనవతి ఇక్కడ నిల్చున్నది పరికించి చూడవయ్యా!

స్వామీ! కలువపుష్పములవంతి కన్నులుగల ఆ ఇంతి నీపై కోపించి, శృంగారంతో చలించుచున్న వక్షోజములుగల ఆ స్త్రీ తన పైటకొంగును ఆడిస్తూ ఆ చెలి నీ సేవలు చేసుకోవడానికి సిద్ధమై నిలుచున్నది కదా కొంచెం సావధానంగా గమనించవయ్యా!

స్వామీ! ఆ రమణి వలపులరసాన్ని నీపై చల్లుతూ, ఆనందాతిశయంతో నీకిష్టమైన మాటలు చెబుతూ, నీకు దాసురాలయ్యానన్న సిగ్గువల్ల కొంచెం అలసటచెందిన ఆ లలనామణి నీవల తత్తరపాటుకు లోనవుతున్నది. ఆమె కోరికలను మన్నించవయ్యా!

స్వామీ! ఓ వెంకటేశ్వరా! ఆ మనోహరమైన కాంత ఎన్నెన్నో ఆశలతో నీకొరకు అధికమైన కోరికతో, అలసి వైరస్యత జెంది, నీపై విపరీతమైన ఇష్టం తో శీఘ్రముగా నిన్ను చుట్టుకొని పెనవేసుకొని సంతోషంతో నీకు మ్రొక్కుతున్నదయ్యా! ఆ ఇంతికి ఆనందం కలుగజేయవయా!

**విశేషాంశాలు:** అన్నమయ్య ఈకీర్తనలో కసరి, కొసరి, చిలికి, బలికి, సొలసి, మలసి వంటి అందమైన అంత్యప్రాసలను ఉపయోగించి కీర్తనకు వన్నె తెచ్చారు.

## 85

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామి శృంగార లీలలు అనన్యసామాన్యమని నివేదిస్తున్నది.

### పళవంజరం

ప. ఆఁటది యేమి యెఱుఁగు నన్నిటను మగవాని-
మాఁటలోని దింతమర్మము నీచే నున్నది ॥పల్లవి॥

1. సేయకుండవచ్చునా చెప్పినట్టెల్లా నేను
పాయపువాఁడవు నీవు బలువుఁడవు
యేయెడాఁ జెప్పఁగరానియెన్నికలు నీరతులు
తోయరాదు పాయరాదు దోసము నీది ॥ఆఁటది॥

2. ఆడకుండవచ్చునా అనుకున్నట్టెల్లా నీతో
కోడెకాఁడవు నీవు గొంటరివి
పాడితో నూఁకొనరానిపచ్చివి నీసుద్దులు

వాడిక నాజవ్వనము వడి నీకె సెలవు ॥ఆcటది॥

3. వూరకుండవచ్చునా వొడ్డారమున నీతో
ధీరుcడవు శ్రీవేంకటాద్రినివాసుcడ
యీరీతి మానcగరావు యెన్నcడు నీపొందు లివి
కేరడముగాcదేలినకీరీతి నీది ॥ఆcటది॥

**అర్థములు:** ప. ఆటది యేమి=ఆటగానున్నదా? మర్మము=రహస్యము; నీచే=నీవలన.

1. సేయకుండ=చెయ్యకుండా; వచ్చునా=ఉండదగునా?; పాయము=యౌవనము; బలువుడు=బలవంతుడు, బలిమికాడు; యేయెడా=ఎక్కడా; ఎన్నికలు=లెక్కించలేని; రతులు=శృంగార చేష్టలు; తోయు=తొలగించు; పాయు=విడుచు; దోసము (వి)=దోషము (ప్ర), తప్పు.
2. ఆడకుండ=చేయకుండ; కోడెకాడు=వయసులో ఉన్న; కొంటరి= కొంటె; పాడి=ధర్మము, న్యాయము; ఊకొనరాని=అంగీకరింపలేని; పచ్చివి=తడివి; సుద్దులు=సూక్తులు; వాడిక=అలవాటు; వ్యవహారము; జవ్వనము (వి)=యవ్వనము (ప్ర); వడి=వేగము; సెలవు=ఆజ్ఞ.
3. ఒడ్డారము=ప్రతిఘటన; ధీరుడు=ధైర్యవంతుడు; మానగరావు=వదులుకులేకపోవు; పొందు=కలయిక; కేరడము=ఉపేక్ష, వంకరమాట; కీరీతి=కీర్తి.

**భావము:** ఓ శ్రీనివాసా! మగవారి మాటల్లో ఇంత దాపరికము దాగి ఉన్నదా? క్రీడా వినోదం లాగా ఉన్నటువంటి నీ లీలలు సామాన్యులకు ఎలా అర్థమవుతాయి స్వామీ!

చెప్పినమాటల మీద నిలబడవలెను కదా? నువ్వు మంచి వయసులోనుండి బలిష్టమైన వాడవు. ఎక్కడా చెప్పుకోడానికి వీలుకాని విధంగా నీ శృంగార చేష్టలున్నాయి. విడవలేము అలాగని తొలగించలేము. ఈ విషయంలో అపరాధమంతా నీదే స్వామీ!

స్వామీ! అనుకున్న కార్యములన్నీ చేయకుండా మానవచ్చునా? మంచి యుక్త వయసులోనున్న కొంటె చేష్టల వాడివి. న్యాయంగా చెప్పాలంటే నీ దుందుడుకు చర్యలు అంగీకరింపరానివిగా ఉన్నాయి. నా యుక్తవయసంతా నీకే శీఘ్రంగా అర్పిస్తున్నాను. ఇక నీ చిత్తము.

స్వామీ! నీ ఈ చర్యలకు ప్రతిఘటించకుండా, వద్దు వద్దు అనవచ్చునా? అలా ఉండగలమా? ఓ వేంకటాద్రి నివాసా! శ్రీవేంకటేశ్వరా! ఎంతో ధైర్యశాలివి. ఈ నీతీరు నీ కూడికలు కలయికలు నిరంతరం మార్చగలేనివై ఉన్నవి. ఘన కీర్తి ఉన్న ఓ స్వామీ! తిరస్కరించలేని నీ చర్యలు అనంతములు కదా!

## 86

**అవతారిక:** స్వామి చేస్తున్న శృంగార క్రీడలకు ఉక్కిరిబిక్కిరవుతూ అమ్మ అలమేలుమంగమ్మ కొంచెం సహనం వహించమని ప్రార్థిస్తున్నది.

### నాట

ప. చిత్తాన నోరుపు లేదు విడువcజాలవు
హత్తి నిన్ను నేమందు నౌదువయ్యా జాణవు ॥పల్లవి॥

1. మోము చూచితే ముసిముసినవ్వులు నవ్వేవు
కామించి తలవంచితే కాతరించేవు
గోమునc జెనకితేను కొంకి సాములు నేసేవు
నేమమున నుండితేను నిక్కి పైకొనేవు ॥చిత్తాన॥

2. ఆనుక మాటలాడితే నటు గుట్టు చూపేవు

మోనాన నుండితే చను మొన లంటేవు
కానుక లిచ్చితేను నలుగడలునుఁ జూచేవు
మాని వూరకుండితేను మంతనమాడేవు ॥చిత్తాన॥

3. సేవలు సేయవచ్చితే చేతు లొడ్డించుకొనేవు
వోవరిలొఁబండుండితే నొడివట్టేవు
యీవేళ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
వావులు చెప్పినంతనే వలపులఁజిక్కేవు ॥చిత్తాన॥

**అర్థములు:** ప. చిత్తాన=మనసులో; ఓరుపు=ఓరిమి, సహనము; హత్తి=కూడుకొని; ఔదువయ్యా=అవుతావు; జాణవు=నేర్పరి.

1. కామించి=మోజుపడి; కాతరించు=భయపెట్టు; గోమున=సుకుమారము; చెనకు=తాకు, స్పృశించు; కొంకి=సంకోచించి; సాములు=యుద్ధము; నేమము=నియమము, పద్ధతి; నిక్కి=మునికాళ్ళపైలేచి చూచు; పైకొను=చేపట్టు, మీదకువచ్చు.
2. ఆనుక=తరువాత; గుట్టు=మర్మము; మౌనము; చనుమొనలు=వక్షోజపు చివరలు; నలుగడలు=నాలుగుదిక్కులు; మంతనము=ఆలోచన, ఏకాంతము.
3. సేవ=కొలువు; ఒడ్డించుకొను=చేతులడ్డుపెట్టి నిరాకరించు; ఓవరి=లోపలగది; పండుండితే=పవళించి ఉంటే; ఒడివట్టు=ఒడిలోకి లాగు; ఏలితివి=పరిగ్రహించు; వావులు=బంధుత్వము; వలపులు=కోరికలు.

**భావము:** స్వామీ! నీకు ఏమాత్రం సహనగుణము లేదు సరికదా సిగ్గుగా ఉన్నది. పట్టుకుని గట్టిగా కౌగలించుకొని విడువలేవు. నిన్ను ఏమనగలను? నువ్వు గొప్ప చతురతతో గూడిన నేర్పరికాడవయ్యా!

మీ ముఖారవిందంకేసి చూచినట్లైతే ముసిముసి నవ్వులు చిందిస్తావు. పోనీ మోజుపడి నీకు తలవంచితే ఉక్కిరిబిక్కిరి చేసి భయపెడతావు. ఏదో సుకుమారంగా స్పృశించబోతే సంకోచంతో నాతో లేనిపోని యుద్ధాలు చేస్తావు. ఏదో నియమంగా బుద్ధిగా ఉందామనుకొంటే త్వరపడి మీదపడి మీదకు లాక్కుంటావు.

పోనీ సరస సంభాషణలాడుదామని ప్రయత్నిస్తే ఏవో ఆలోచనలో ఉండిపోతావు. బహుమతులిద్దామనుకొంటే ఎందుకో నాలుగు దిక్కులా కలయ జూస్తావు. అలా అని ఊరకుండిపోతే ఏమీ మాట్లాడకుండా ఏకాంతంగా ఉండిపోతావు.

కొలువు చేద్దామని వస్తే సేవలకడ్డుపడి చేతులడ్డంగా ఊపుతూ వద్దు వద్దు అని నిరాకరిస్తావు. ఓ శ్రీవెంకటేశ్వరా! లోపల ఒంటరిగా శయనమందిరంలో పవళించి ఉంటే ఒడిపట్టి ఈవేళ నన్ను ఈవిధంగా పరిగ్రహించావు. ఏమాత్రం బంధుత్వం చెప్పినా సరే, వలపులు జిమ్మి నాపై కోరికలతో విజృంభిస్తావు.

## 87

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ తనపై సరైన అనురాగం చూపడంలేదని స్వామిని ప్రశ్నిస్తున్నది.

## కేదారగౌళ

ప. ఎరవులే నీ గుణాలు ఇన్నాళ్ళ దనకాను
సరివచ్చె నాడుకొనే జవరాండ్ల మాటలు ॥పల్లవి॥

1. వెలవెట్టనివలపు వెలది నీపైఁ జల్లఁగా
నలువంకలా నీకు నవ్వులు గావా
మొలకచన్నులు మరి మోమున కెగరఁగాను
యెలమి సంతోసాలుగా కిఁక నెన్నఁడయ్యా ॥ఎరవులే॥

2. పోరచి దెచ్చి విడేలు పొరుగాపె యియ్యఁగాను
సారె కిందరిలోనా చవులు గావా

తీరనిమోవితేనెలతీపు నీమోవి సోఁకఁగ
యీరీతి నీ భాగ్యమాయ నిన్నిటా మేలయ్యా ॥ఎరవులే॥

3. పీటమీఁద నీకు నిట్టె పెండ్లికూఁతు రుండఁగాను
పాటించి ఇన్నిటా నీరపములే కావా
యీటున శ్రీవేంకటేశ ఇటు నన్ను నేలితివి
మీటాయ నీసుద్దులెల్లా మెచ్చాయనయ్యా ॥ఎరవులే॥

**అర్థములు:** ప.వెలవెట్టని= విలువకట్టలేని; వెలది = స్త్రీ; చల్లు= చిమ్ము; నలువంకలు= నాలుగుదిక్కులు; మొలక చన్నులు= బాల్యపు వక్షోజములు; ఎగరు= పైకెగరు; ఎలమి = సంతోషము; ఎన్నడు = ఎప్పుడు.

2. పోరచి = కానుక; విడేలు= తాంబూలము; పొరుగాపె= పొరుగింటి స్త్రీ; సారె= మాటికి; చవులు = రుచులు; తీరని= తృప్తిలేని; మోవితేనెలు= అధరామృతము; సోకు= తగులు; భాగ్యము= అదృష్టము; అన్నిటా= అన్నివిధముల.

3. పీటమీద = పెండ్లిపీటలపై; పాటించు= అనుసరించు; నీరపములు= నీలాపనిందలు; ఈటు= ఇంతగా, (తమిళంలోని ఈట్టుకు సమానమైన పదం); మీటు= అధికము; సుద్దులు= సూక్తులు; మెచ్చు= శ్లాఘించు.

**భావము:** ఓ స్వామీ! ఈనాటివరకూ నీతో తగవులాడడమే సరిపోయినది. ఇక్కడ మాట్లాడుకుంటున్న పడతుల మాటలు కూడా నీ చేతలకు దీటుగానే ఉన్నాయి.

అంతులేని ప్రేమను నీపై ఒలకబోస్తూ ఉండగా నాలుగు దిక్కులా చూసి నవ్వులెందుకు నవ్వుతున్నారు? బాల్య యౌవన వక్షోజసంపదతో సంతోషంతో నిండి మీ మోముపై దర్శనమిస్తుండగా, ఇక ఆనందం ఎప్పుడు కలిగిస్తావయ్యా!

పొరుగింటి స్త్రీ కానుకలుగా నీకు మంచి కర్పూర తాంబూలాలు అందివ్వగా మాటిమాటికి ఇందరు ఇంతులలోను అవి రుచిపుట్టించవా? తృప్తి తీరని ఆ పడతుల అధరామృతము నీ పెదవులకు సోకి రుచిపుట్టించగా, ఎంత భాగ్యమయ్యా నీది! అన్నివిధములా అదృష్టవంతుడవయ్యా స్వామీ నువ్వు!

పెండ్లి పీటల మీద పెండ్లికుమార్తె ఉండగా, నువ్వు యిన్నేసి నీలాపనిందలు వేయడం తగునా? ఓ శ్రీవేంకటేశ్వరా! ఇంత అధికమైన ప్రేమతో నన్ను పరిగ్రహించి యేలుకున్నావు. నీ మాటలన్నీ పెంపై శోభిస్తున్నవి.

## 88

**అవతారిక:** స్వామిచేసే చిలిపి శృంగార చేష్టలకు పరవశత్వం పొందుతున్న అమ్మ అలమేలుమంగమ్మ పలుకులివి.

### సాళంగం

ప. నీ చేఁతలే ఇవి నీవేల సిగ్గువడేవు
చేచేత వలపులు చిమ్మి రేఁచకుండునా ॥పల్లవి॥

1. తగ నీతనికి నీవు తతిగొని చెప్పఁగాను
చిగురుమోవికి వాడుచెందకుండునా
పగటుసరసమునఁ బై పైఁ బెనఁగఁగాను
వెగటుఁ జన్నులు వెల్లవిరి గాకవుండునా ॥నీ చేఁతలే ॥

2. నడుమ నూరకె నీవు నవ్వులు నవ్వఁ గాను
జడియని నీ కొప్పు జారకుండునా
వొడివట్టి తీసి పతి నొద్దికిఁ బిలువఁగాను
వెడవెడ పోఁకముడి వీడకుండునా ॥నీ చేఁతలే ॥

3. ముందె శ్రీ వేంకటెశు మోవి చవిగొనఁగాను

కందువమర్మము కరcగక వుండునా
సందులేక కాcగిటిలో సతములై వుండcగాను
మందలించి వేడుకలు మరిగించకుండునా ॥నీ చేcతలే ॥

**అర్థములు:** ప. చేతలు = పనులు; చేచేత = చేజేతులారా, స్వయంగా; వలపు = మోహము; చిమ్మి = వ్యాపించి; రేచు = ఎగదోయు, వ్యాపించు.

1. తతిగొను = సమయము కనిపెట్టి; చిగురుమోవి = లేలేత ముఖము; వాడుచెందు = వాడిపోవు; పగటు = లావణ్యము; పైపై = లోతులేని, తేలికైన; పెనగు = చుట్టుకొను; వెగటు = వైరస్యము; వెల్లవిరి = వ్యాపించునట్లు, ప్రకటితమగు.
2. జడియని = బెదురు; కొప్పు = శిఖ; ఒడి = తొడపై భాగము; ఒద్దికి = సఖ్యత, అనుకూల్యము; వెడవెడ = కొంచెంగా, పోకముడి = చీరెకట్టుకొన్న ముడి; మృదువుగ; వీడు = విడిపోవు.
3. చవి = రుచి; కందువ = ఏకాంతము; మర్మము = రహస్యము; కరగక = ద్రవించక; తెలిసిపోక; సందులేక కౌగిలి = ఏమాత్రము వదులులేని బిగి కౌగిలి; సతము = శాశ్వతము; మందలించి = మనవిచేసి; వేడుకలు = కోరికలు, సంతోషము; మరగించు = మోహింపజేయు.

**భావము:** స్వామీ! నీవు చేస్తున్న పనులకు నీవే సిగ్గుపడడం బాగున్నదా? చేతులారా స్వయంగా మోహము వ్యాపించి బహిర్గతము కాకుండా మానునా?

స్వామికి పనిగట్టుకొని అదను చూసి ఏవో మాటలు చెప్పినప్పుడు ఆమె లేలేత సౌందర్యము వాడకుండా ఉంటుందా? మీరు లావణ్యంతో పైపైన చుట్టుకొన్నట్లైతే ఆమె వక్షోజ సంపద వ్యాపించి, బహిర్గతము కాకుండా ఉంటుందా?

మధ్యమధ్యలో మీరు ముసి ముసి నవ్వులు చిందిస్తూ ఉంటే, తన్మయత్వంతో ఉన్నప్పుడు బెదురుతో ఆమె కొప్పు ముడి వీడకుండా ఉంటుందా? చేతులతో బంధించి భర్త సఖ్యతతో పిలిచినప్పుడు కొంచెం కొంచెంగా ఆమె చీరముడి వీడిపోకుండా ఉంటుందా?

ఆ శ్రీవేంకటేశ్వర స్వామి నీ అధరామృతాన్ని గ్రహించగానే ఏకాంతంలో ఉండగా మీ యిద్దరి రహస్యాలు బహిర్గతం కాకుండా ఉంటాయా? ఏమాత్రం వదులులేక నీవు ఆ స్వామి బిగి కౌగిలిలో శాశ్వతముగా ఉండగా కోరికలు మోహింపజేయకుండా, చెలరేగకుండా ఉంటాయా?

## 89

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామిపై ప్రణయ కోపం వహించగా, చెలులు సమాధానపరుస్తున్నారు.

### ఆహిరి

ప. ఘనుcడైనవాని నింత కాకు సేతురా
మనసునc బెట్టుకొని మంతనము లాడవే ॥పల్లవి॥

1. అంగనలు కొలువు సేయcగ నుండేరమణుని
వెంగెములాడకువే వేమారును
సింగారించుక యద్దము చేతcబట్టి చూడcగాను
చెంగట నాతనిమై మచ్చములు చూపకువే ॥ఘనుcడైన॥

2. చెప్పరానిబాసలెల్లాc జేసేటిమగవానిc
దప్పులెల్లా నెంచకువే తగవు గాదు
ముప్పిరివల్లెవాటుతో మురిపెముచూపేవాని
దుప్పటిపసపు చూపి దూరులు సేయకువే ॥ఘనుcడైన॥

3. చేరి కాఁగిలించుకొన్న శ్రీ వేంకటేశ్వరుని
నేరము లెంచకువే నీకుఁ దగదు
కూరిమితో నిను వేఁడుకొంటా నుండేటివాని–
తారుకాణచేఁతలెల్లాఁ దలఁపు సేయకువే ॥ఘనుఁడైన॥

**అర్థములు:** ప. ఘనుడు = గొప్పవాడు; కాకు = బాధపెట్టు, అవమానించు; మంతనము = ఆలోచన, ఏకాంతము.

1. అంగనలు = ఆడువారు, స్త్రీజనము; కొలువు = సేవ; రమణుడు = అందమైనవాడు, మన్మథుడు; వెంగెము = వ్యంగ్యము, వేళాకోళము; వేమారు = అనేకసార్లు; సింగారించుక = అందంగా అలంకరించుకుని; యద్దము = అద్దము, దర్పణము; చెంగట = సమీపము; మై = పార్శ్వము; మచ్చములు = మత్సరములు, ఈర్ష్య.
2. బాసలు = ప్రతిజ్ఞ, ప్రమాణము; ముప్పిరి = మూడు విధాలుగా; వల్లెవాటు = వల్లెవాటుగా మెలిపెట్టివైచుకొన్న యుత్తరీయము; మురిపెము = ప్రేమ, పసవు = కోరుకొను; దూరులు = తగవులు.
3. కాగిలుంచుకొన్న = కౌగలిచుకొన్న; నేరము = అపరాధము; ఎంచు = లెక్కించు; తగదు = పాడిగాదు; కూరిమి = స్నేహము; తారుకాణ = ఋజువుచేయు; తలపు = చింత.

**భావము:** ఏమమ్మా! అంత గొప్ప ఘనకీర్తిగల వానిని ఎవరైనా ఇలా మనసు గాయపరచి బాధిస్తారా? ఏవైనా ఉంటే మనసులో నుంచుకొని అతనితో ఏకాంతముగా ఆలోచనలు చెయ్యవే!

ఏమమ్మా! స్త్రీజనమంతా కలిసి ఆ దివ్యసుందరమూర్తియైన ఆ స్వామికి ఏకాంత సేవలు చేస్తూ ఉండగా, అన్నిమార్లు పరిహాసాలాడడం తగునా! నీవు అద్దములో చూసుకుంటూ అందముగా అలంకరించుకొంటూ ఉండగా, అసూయ ఈర్ష్య మొదలైనవి ఆ స్వామిపై ప్రదర్శించడం తగునా?

ఏమమ్మా! నీకు స్వామి ఎన్నెన్నో ప్రమాణాలు చేస్తూ ఉండగా, ఆయనపై అకారణంగా తప్పులెంచడం ధర్మమేనా? వల్లెవాటు వస్త్రంతో నిన్ను ఇంత ప్రేమగా చూసుకొని నీతో దుప్పటి పంచుకొనే వానితో తగవులు పెట్టుకోవడం ఎందుకే!

ఏమమ్మా! నీకై తపిస్తూ నీకడకు చేరి నిన్ను బిగి కౌగిలిలో బంధిస్తూ ఉన్న ఆ శ్రీవేంకటేశ్వర స్వామిపై అపరాధాలు లెక్కించడం న్యాయమా చెప్పు? స్నేహభావంతో ఉన్న ఆ స్వామిపై ఉంటూ ప్రాధేయపడి సర్వదా నీకు వశ్యుడై ఉన్నవానిని ఏవో కారణాలు ఋజువులు పట్టుకుని అల్లరిపాలు చేయడం సబబేనా?

## 90

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మను కూడడానికి సంశయం చూపిస్తున్న స్వామిని త్వరగా కూడమని చెలులు వినతులు చేస్తున్నారు.

### పాడి

ప. ఇంకనేల కొంకను యిన్నియుఁ జెల్లుబడాయ
అంకెకు వచ్చిన పని ఆపె దానే యెరుఁగు ॥పల్లవి॥

1. మోహముగలవాడవు మొక్కించుకో ఆపెచేత
పోహణించి నన్నేమి బుద్దెడిగేవు
సాహసివని పొగడి సాము సేయు మాపెతోడ
బాహుమూలములఁ గలపస తానే యెరుఁగు ॥ఇంకనేల॥

2. పొందుసేసినవాఁడవు పొత్తున నాకెఁ బెట్టుకో
విందువలె నాతోనేల విచారించేవు
అందరిలో సంతోసించి ఆపెనే నీవడుగుము

మందలించి నీ వాడేటిమాటలు దానెరుఁగు ॥ఇంకనేల॥

3. పెండిలాడినవాఁడవు పిలువు నీవే యాపెను
అండనే నాతోనేమి ఆలోచించేవు
నిండుక శ్రీ వేంకటేశ నీవు నన్ను నేలితివి
పండుమోవిగురుతులభావము దా నెరుఁగు ॥ఇంకనేల॥

**అర్థములు:** ప. ఇంకనేల = ఇంకెందులు; కొంకు = భయపడు; చెల్లుబడి = అందరూ అంగీకరించు, అధికారము; అంకె = వశము; ఆపె = ఆమె.

1. మోహము = ప్రేమ, అపేక్ష; మొక్కించు = ప్రార్తనచేయించు; ఆపె = ఆమె; పోహణించు = స్తుతించు, కూర్చు; బుద్దెడిగేవు = హితముచెప్పు; సాహసి = ధైర్యముకల; పొగడి = మెచ్చుకొని; సాము = అర్ధభాగమై; ఆపె = ఆమె; బాహుమూలములు = కక్ష్యలు, చంకలు; పస = మృదుత్వము.
2. పొందు = కూడు, గ్రహించు; పొత్తు = సహవాసము; ఆకె = ఆమె; విందు = చుట్టము; విచారించు = పరిశీలించు, తెలిసికొను; ఆపె = ఆమె; మందలించు = మనవిచేయు; నీవాడు = నీవు మాట్లాడు; తానెరుగు = తనకు తెలుసు.
3. పెండిలాడు = పెండ్లి చేసుకొను; ఆపె = ఆమె; అండ = సమీపము; ఆలోచించు = యోచించు; నిండుక = పరిపూర్ణముగ; పండుమోవి = పక్వమైన; గురుతులు = గుర్తులు, జ్ఞాపకము; భావము = అభిప్రాయము, మనసు.

**భావము:** స్వామీ! ఇంకా ఎందుకు సంశయిస్తూ మొహమాటం పడుతున్నావు? అన్ని విషయాలలో ఆమెను అంగీకరింపజేశావు కదా! వశమై ఉన్న ఆమె వచ్చి కోరుకుంటున్న పని నీకు పూర్తిగా అర్థమైనదే కదా!

ఆమెపై ఎంతో ప్రేమకలవాడవు కనుక ఆమెచే ప్రార్ధన చేయించుకో! పొగుడుతూ నన్నెందుకు హితాహితాలు అడుగుతున్నావు? ఎంతో ధైర్యసాహసాలున్నవాడివి ఆమెను స్తుతిచేసి ఆమెతో అర్ధభాగమై పొందుకూడుము. బాహుసంధులలో ఉన్న మృదుత్వం ఎరిగిన ఆమెకు అన్నీ తెలిసినవే కదా!

ఆమెతో కూడియున్నవాడవు గనుక ఆమెతో సహవాసము పెట్టుకోవయ్యా! ఏదో చుట్టం లాగా నన్నెందుకు మరలా ఏమీ ఎరగని వాడివలె విచారణ చేస్తున్నావు? అందరిలో ఆమెను సంతోషపెట్టి ఆమెనే నీవు అన్ని వివరాలు అడిగి గ్రహించవచ్చుగదా! మనవిచేసి నీవడిగే విషయాలు నీ సంభాషణా చాతుర్యం అంతా ఆమెకు ఎరికే గదా!

స్వామీ! ఆమెతో వివాహం చేసుకున్నవాడవు కదా ఆమెను చనువుతో పిలువవచ్చు కదా! ఇక్కడా నాతో ఎందుకు ఆలోచనలు చేస్తూ కాలం గడుపుతున్నావు? ఓ శ్రీవేంకటేశ్వరా! సంపూర్ణంగా మనసిచ్చి నన్ను పరిగ్రహించిన వాడవు. తాంబూలంతో పండిన నీనోటి గుర్తులు ఆమెకు పూర్తిగా తెలియును.

## 91

**అవతారిక:** సేవల పేరుతో చెలులు స్వామివారితో అతిగా సమీపించడం, శృంగార చేష్టలు చేయడం సహించలేని అలమేలుమంగమ్మ వారికి జాగ్రత్తలు చెప్తున్నది.

### ధన్నాసి

ప. ఊడిగపు నిబ్బరాన వొరపు లెరఁగరు
తాడుపడి గోళ్లేల తాఁకించేరే మీరు ॥పల్లవి॥

1. పన్నీట మజ్జనమార్చి పావడలఁ దడివొత్తి
చన్నులేల తాఁకించేరే సతులాలా
తిన్ననికప్పురధూళి తిరుమేననెల్లా మెత్తి
వున్నతపుఁ గొప్పులేల వూఁదేరే మీరు ॥ఊడిగపు॥

2. తట్టుపుణుఁ గలది యంతటా మెరుఁగులు వెట్టి
చుట్టుబయ్యద లేఁటికి సోఁకించేరే
గట్టిగా సొమ్ములు వెట్టి కడుసింగారాలు సేసి
వట్టి మీ చెమటలేల వడియుంచేరే ॥ఊడిగపు॥

3. అలమేలుమంగ నురమందు నెలవుకొలిపి
యెలమి శ్రీ వేంకటేశు నేలనవ్వేరే
బలిమి నానాజాతిపండ్లు నైవేద్యమిచ్చి
అలమి మోవిండ్లవి యేమి చూపేరే ॥ఊడిగపు॥

**అర్థములు:** ప. ఊడిగము = సేవ; నిబ్బరము = పారవశ్యము, వేగము; ఒరవు = పద్ధతి, విధము; తాడుపడు = లగ్నమగు, లీనమగు.

1. మజ్జనము = స్నానము; పావడలు = లంగా, స్త్రీల ధౌతవస్త్రము; తిన్న = యుక్తము; కప్పురధూళి = మెత్తని కర్పూరపు పొడి; తిరుమేను = పవిత్రమైన శరీరము; మెత్తి = అద్ది; ఉన్నతము = పెద్దవైన; కొప్పు = తల శిఖ; ఊదు = అదుము, వత్తు.
2. తట్టుపుణుగు = పునుగు పిల్లివలన కలుగు సుగంధద్రవ్యము; అలది = పూసి; పయ్యెద = పైటకొంగు; సోకించు = తాకించు; వడియించు = కారునట్లుచేయు.
3. ఉరము = హృదయభాగము; నెలవు = స్థానము; ఎలమి = వికాసము, సంతోషము, తృప్తి; బలిమి = పక్వమైన; అలమి = క్రమ్ముకొని; మోవిండ్లు = పెదవులు.

**భావము:** స్వామికి సేవలు చేసే పారవశ్యంలో లగ్నమై మీ గోళ్ళు స్వామివారి మేనికి తగిలి గ్రుచ్చుకుంటున్నాయన్న విషయం కూడా గమనించడంలేదు.

స్వామిని పన్నీటి జలకాలాడించి లో వస్త్రంతో తడిని తుడుస్తూ, మధ్య మధ్యలో మీ వక్షోజాలను ఎందుకు తగిలిస్తున్నారు? మెత్తని కర్పూరపు పొడిని స్వామివారి పవిత్రమైన శరీరానికి అద్దడం సరే! మీ తలకొప్పులు వారి శరీరంపై వత్తుకుంటున్నాయన్న ధ్యాస లేదా మీకు?

పునుగుపిల్లి సుగంధ ద్రవ్యాన్నద్ది ఆయనకు మెరుగులు పెడుతున్నారు సరే! మీ పవిట చెంగులను వారికి ఎందుకు తగిలేట్టు చేస్తున్నారు? ఆయనకు అనేక ఆభరణాలను ధరింపజేసి అలంకారం బాగానే చేస్తున్నారు కానీ, మీ చెమటలు ఆయన మేనిపై కారేట్లు చేస్తున్నారెందుకు?

అలమేలుమంగను హృదయస్థానంపై నిలిపి, సంతోషంతో తృప్తి కలిగించారు సరే! శ్రీవేంకటేశ్వర సామిని చూసి నవ్వులెందుకు రువ్వుతున్నారు? వారికి పక్వమైన ఫలాలన్నీ తెచ్చి నైవేద్యంగా అర్పిస్తున్నారు సంతోషమే కానీ, మీ అధరాలను స్వామి వారి దగ్గరగా ఎందుకు చూపిస్తున్నారు?

## 92

**అవతారిక:** స్వామి అన్యకాంతలతో చేసే చిలిపి పనులు గమనించిన అమ్మ భలే విచిత్రం గొలుపుతూ ఉన్నాయయ్యా నీ చేష్టలుఅంటున్నది

## రామక్రియ

ప. ఏమి నెరపేవు మేకు లింతులెల్లా జూడఁగాను
ఆమని వేడుకకాఁడ వౌదువయ్య నీవు ॥పల్లవి॥

1. నీవద్దఁ గాచుకున్న నెలఁతుక వుండఁగాను
ఆవలాకెతో సరసమాడేవు
తోవలఁ బెళ్ళిచెట్లు మందుగాదనినమాటలు

నీవల్లనే కానవచ్చె నెమ్మది నిందరికి ॥ఏమి॥

2. వరుసతోఁ బెండ్లాడినవనిత మాటాడఁగాను
పొరుగాపెతో నవ్వేవు పోరచిగాను
సరినున్న మేనవారు సరకుగా రనుమాట
నిరతితోడుత నీవే నిజము సేసితివి ॥ఏమి॥

3. అలమేలుమంగ వురమందు నిట్టెవుండఁగాను
ఇల వీఁపెక్కించుకొంటి వెన్నికగాను
భళి శ్రీ వేంకటేశుఁడ పైకొసరు లాభమని
తెలిపితి విందరికి తేట తెల్లమిగాను ॥ఏమి॥

**అర్థములు:** ప. నెరపు = నెరవేర్చు; మేకు = పెద్దరికము; ఆమని = సమృద్ధిగా; వేడుకకాదు = వినోదకాదు, అపేక్షించేవాడు.

1. నెలతంఁక = (నెలతుక) స్త్రీ, ఆడుది; ఆవల = అటువేపు; ఆకె = ఆమె; తోవల = దారిలో; పెళ్ళిచెట్టు మందుగాదు = పెరట్లో ఉన్న చెట్టు మందుకు పనికిరాదను ఒకానొక సామెత; నెమ్మది = నిదానంగా.
2. వరుస = వివాహమునకు అర్హమైన; పొరుగాపె = ఇరుగుపొరుగు స్త్రీ; పోరచి = వ్యర్థము; కారణములేకుండా; సరినున్న = సరిపోయిన; మేనవారు = మేనరికమున్నవారు; సరకు = లక్ష్యము; నిరతి = ఆసక్తి, ఇష్టము.
3. ఉరము = ఉదరభాగము; వీపెక్కించుకొను = వీపుపై ఎక్కించుకొను; ఎన్నిక = కోరుకొను; భళి = భలే!; పైకొసరు = వస్తువుకొన్నప్పుడు ఉచితముగా ఇచ్చే భాగము; తేటతెల్లమి = సులభంగా బోధపడునట్లు.

**భావము**: ఓ స్వామీ! ఇంతమంది భామలు చూస్తుండగా ఎన్నెన్ని ఘనకార్యాలు చేస్తున్నావయ్యా! బాగా వినొదాలతో వారిని మురిపిస్తూ అపేక్షిస్తున్నావు.

నీవద్దనే నీకోసం ఎదురు చూపులు చూస్తూ ఒక స్త్రీ ఉండగా, పెరట్లో ఉన్న చెట్టు మందుకు పనికిరాదనే విధంగా, అవతల ఆ స్త్రీతో శృంగార చేష్టలు కానిస్తుంటావు. అందరికి అన్నీ నీ ద్వారానే వినబడుతున్నాయి.

అర్హమైన స్త్రీతో వివాహము చేసుకుని, ఆమె నీతో సంభాషిస్తూ ఉండగా, పొరుగున ఉన్న ఆమెతో వ్యర్థంగా హాస్యమాడుతున్నావు. నీకు వరుసైనవారు, ప్రక్కనున్నవారు నీకు సరిపోరా? నీకు వారు తగరన్న విషయం తెలిసి తెలిసీ వారిపై ఆసక్తి కనపరుస్తూ లేనిపోని ఆరాటాలు పడుతున్నావు.

అలమేలుమంగమ్మ నీ ఉదరభాగంపై నెలవై ఉండగా, ఇంకో స్త్రీని వీపుపై ఎక్కించుకొని ఊరేగడమెందుకు? ఓ శ్రీవేంకటేశ్వరా! భలే విచిత్రాలయ్యా నీ చేష్టలు. అసలు కన్న కొసరు మేలన్న చందాన్ని నీలీలలు అందరికి సులభంగా అర్థమయేట్టు చేసావు.

**విశేషాంశాలు:** అన్నమయ్య గ్రామ్యాలే కాదు సామెతలను కూడా కీర్తనల్లో దించడంలోనూ దిట్ట. 'పెళ్ళిచెట్లు మందుగాదనినమాటలు' అనడంలో అర్థం పెరట్లో ఉన్న చెట్టు మందుకు పనికిరాదను సామెతను, ఇంట్లో ఉన్న నేను పనికిరాను కానీ బయట ఉన్న స్త్రీలు నీకు పనికివస్తారా అనే మాటగా సమన్వయం చేస్తూ ప్రయోగించాడు. పెరడు అనే మాటకు పర్యాయపదాలుగా దొడ్డి, పెడలు, పెళ్ళు అని ఉన్నాయి.

## 93

**అవతారిక:** అలమేలుమంగమ్మ తోడి చెలులు అమ్మకు స్వామిపైగల మోహాన్ని వర్ణిస్తూ చేకొనమని ప్రార్థిస్తున్నారు.

## సామవరాళి

ప. ఏమని విన్నవించేము యిట్టె కనుఁగొనవయ్య
మోమునఁ జేతులలోన మొక్కులున్నవి ॥పల్లవి॥

1. నెలఁతమనసులోన నిండువలపు లున్నవి

సెలవినవ్వులలోన సిగ్గులున్నవి
తలిరుమోవిమీఁద తరితీపు లున్నవి
కలువ కన్నుల లోన కాంక్ష లున్నవి ॥ఏమని॥

2. అంగనమాటలలోన నడియాస లున్నవి
రంగగుచన్నులపై కరఁగు లున్నవి
అంగపుసేవలలోఁ బ్రియములెల్లా నున్నవి
సింగారంపుఁగొప్పుమీఁద సేస లున్నవి ॥ఏమని॥

3. కప్పి యలమేలుమంగకాఁగిట నీమేనున్నది
చిప్పిలఁ జెక్కులమీఁద చిహ్నా లున్నవి
యిప్పుడె శ్రీ వేంకటేశ యిద్దరునుఁ గూడితిరి
నెప్పున నీకెవేల నీవుంగర మున్నది ॥ఏమని॥

**అర్థములు:** ప. విన్నవించు = మనవిచేయు; కనుగొను = తెలిసికొను; మొక్కులు = ప్రార్థనలు.

1. నెలత = స్త్రీ; నిండు వలపు = అధికమోహము; సెలవి = పెదవి మూలగా నవ్వు; తలిరు = చిగురు, లేత; తరితీపు = అపేక్ష, ప్రేమ; కలువకన్నులు = కలువఱేకుల వంటి కన్నులుగల; కాంక్ష = కోరిక, ఆశ.
2. అనగన = స్త్రీ; అడియాస = తీరని కోరిక; రంగగు = కాంతులీను; కరగులు = ప్రేమాదులచే వచ్చు పరవశము; అంగపు సేవలు = స్వామికి చేయు శరీర సేవలు; ప్రియము = ఇష్టము; సింగారపు = అందమైన; సేస = అక్షింతలు.
3. కప్పి = ఆచ్ఛాదనమై; కాగిట = కౌగిట; మేన = శరీరాము; చిప్పిలు = ఉబుకు, స్రవించు; చెక్కులు = చెక్కిలి; చిహ్నాలు = గుర్తులు; నెప్పున = స్థానము; ఈకె = ఈమె.

**భావము:** ఓ స్వామీ! నీకేమని మనవిచేయమంటావయ్యా! నీవే తెలిసికోవయ్యా! ఆమెను చూశారా! చేతులు రెండూ జోడించి ముఖంపై ఉంచుకుని నీకై ప్రార్థిస్తూ ఉన్నది.

ఆమె మనస్సులో నీమీద అధికమైన మోహం దాగున్నది. ఆమె పెదవి మూలగా నవ్వే నవ్వులలో ఎంతో సిగ్గు దాగున్నది. ఆమె లేత ముఖారవిందంపై చెప్పలేని అపేక్ష ఉన్నది. ఆమె తామరరేకుల వంటి నేత్రాలు చూసినట్లైతే ఎన్నో ఆశలు కోరికలు కనిపిస్తున్నాయి.

ఆమె మాటలలో ఎన్నో తీరని కోరికలు కనిపిస్తున్నాయి. ఆమె కాంతులీనే వక్షోజాలు నీపై ఉన్న ప్రేమాతిశయం వ్యక్తమవుతున్నది. ఆమె వేసుకున్న అందమైన కొప్పుపై నీవు చల్లిన అక్షింతలు కనిపిస్తున్నాయి.

ఆ అలమేలుమంగ నీ శరీరంపై కప్పువలె కనిపిస్తూ నీ కౌగిట్లో బంధింపబడి ఉన్నది. ఆమెతో మీరు చేసిన శృంగార చేష్టల వలన ఆమె సిగ్గులు పైకి ఉబికివస్తున్నాయి. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ సమయంలోనే మీ యిద్దరూ జతగూడి ఉన్నారు. ఆమె చేతి వేలికి నీ ఉంగరం నెలవై యున్నది.

## 94

**అవతారిక:** ఏవో పంతాలు పట్టింపులతో స్వామిని చేరకుండా ఉన్న అలమేలుమంగమ్మను చెలులు ఇలా చేయడం సబబేనా అని మందలిస్తున్నారు.

### శంకరాభరణం

ప. మాటలాడఁగదె మగనితో
ఆఁటదాని కింత యమరునా ॥పల్లవి॥

1. చెలులు బుద్దులుచెప్పినా వినవు

చలము పతితో సాధింతురా
కలసి మెలసి కాఁపరాలు సేసి
అలుకలు మతి యమరునా ॥మాటలాడఁ॥

2. నవ్వేవిభునితో నాలేల సేసేవు
రవ్వ లింతయేలే రామలకు
జవ్వనమదాన జడయుచు నుండి
అవ్వలిమోములు అమరునా ॥మాటలాడఁ॥

3. మచ్చికచుట్టాల మండాటు సేయవే
హెచ్చుఁగుందులేల యీవేళను
యిచ్చల శ్రీవేంకటేశుఁడు గూడెను
అచ్చమాయ సిగ్గు లమరునా ॥మాటలాడఁ॥

**అర్థములు:** ప. మాటలాడగదె = మాటలాడవమ్మా; ఆటదాని = ఆడదాని; అమరునా = ఒప్పునా?

1. చెలులు = చెలికత్తెలు; బుద్ధులు = మంచిమాటలు; చలము = కంపము, పట్టుదల; అమరునా = ఒప్పుతుందా.
2. ఆలేల = మండిపడు; రవ్వ = అల్లరి; రామలు (రమలు) = రమించు ఆడువారు; జవ్వనము = వయసులో నున్న స్త్రీ; జడయు = నివారించు; అవ్వలి = అవతలి; అమరునా = లభించునా.
3. మచ్చిక చుట్టాలు = చాలా దగ్గరి బంధువులు; మండా = తీయనైన మండెగ (భక్ష్య విశేషము); అటు = విధంగా; హెచ్చు గుందులు = ఎక్కువతక్కువలు; ఇచ్చల = కోరికలతో; కూడెను = కలిసెను; అచ్చమాయ = తిరస్కారభావంతో ఉండు; అమరునా = ఒప్పునా? తగినవా?

**భావము:** ఏమమ్మా! అలమేలుమంగమ్మా! మగనితో మాట్లాడవచ్చుగదా. ఆడదానివి ఇలా చేయడం సబబేనా? నీకు ఒప్పుతుందా?

ఒకప్రక్కన చెలులు చెప్పే మంచిమాటలు నీ చెవికెక్కవు. ఏవో పంతాలు పట్టుదలలు పెట్టుకొని ఊరికే స్వామిని సతాయిస్తుంటావు. కలసి మెలసి కాపురం చేస్తున్నదానివి, చిన్న చిన్న విషయాలకు ఇలా అలగడం నీకొప్పుతుందా?

నీతో సంతోషంగా ఉన్న మగడితో మండిపడుతూ లేనిపోని కోపం ప్రదర్శిస్తావు. ఇలా అల్లరిచేయడం స్వామివారితో రమించే నీలాంటి ఆడదానికి తగునా? ఇంత వయసులో ఉన్న స్త్రీవికదా! ఆయన్ను వలదని నివారించడం వల్ల ఆయన పొందు నీకు దక్కుతుందా?

ఎంతో దగ్గరి బంధువైన వారిని తీయనైన మాటలతో దారికి తెచ్చుకోవాలి కానీ ఇలా ఎక్కువతక్కువలు మాట్లాడడం తగునా? శ్రీవేంకటేశ్వర స్వామి ఎంతో ఇష్టంతో ఇక్కడికి వేంచేసి నీతో కలిశాడు గదా! ఇంకా ఈ తిరస్కారభావమెందుకే! అవన్నీ నీకు తగినవా? స్వామివారిని కూడి తరించు.

## 95

**అవతారిక:** స్వామి అలమేలుమంగమ్మపై అలిగిన వేళలో, అలక తీర్చడంకోసం బ్రతిమాలుకొని శరణంటున్నది అమ్మ.

### నాదరామక్రియ

ప. ఎంతగోస నాస సేసేవేల మమ్ముఁ గొసరేవు
పంతము నీ కిచ్చినదే పైకొంటగాదా ॥పల్లవి॥

1. యెదిరించి నీకుఁ జేతులెత్తి మొక్కినపుడే
కొదలేక నిన్ను వేఁడుకొంటగాదా

పొదిగి యేపొద్దు నీపొంత నున్నయపుడే
అదనఁ గూడుకొని నీయాల నౌటగాదా ॥ఎంతగోస॥

2. కనుఁగొని కొలువులోఁ గాను కిచ్చినపుడే
చెనకి నీకుఁ బ్రియాలు చెప్పుటగాదా
ననుపుతో సెలవుల నవ్వునవ్వినప్పుడే
యెనసేననుచునీతో నియ్యకొంటగాదా ॥ఎంతగోస॥

3. మచ్చిక నీచెవిలోన మాటలాడినపుడే
కొచ్చికొచ్చి నీకాఁగిటఁ గూడుటగాదా
అచ్చపు శ్రీవేంకటేశ అలమేల్మంగను నేను
మెచ్చి నీరతిఁజొక్కితి మేలుదానఁ గాదా ॥ఎంతగోస॥

**అర్థములు:** ప. గోస = బాధ; ఆశ = కోరిక; సేసేవేల = ఎందుకు చేస్తావు? కొసరు = ప్రార్థించు, వేడుకొను; పంతము = పోటీ, పట్టుదల; పైకొంట = యత్నించు, కలుగు.

1. ఎదిరించు = ప్రతిఘటిను; కోదలేక = తక్కువకాకుండా; వేడుకొంట = ప్రార్థించుట; పొదిగి = చుట్టుకొని; ఏపొద్దు = ఏకాలమైనా; పొంత = సమీపము; అదన = తగిన సమయము; కూడు = కలయు; యాల = సతి; ఔట = అగుట.

2. కొలువు = సేవ; కానుక = బహుమతి; చెనకు = తాకు, స్పృసించు; ప్రియాలు = ఇష్టమైన మాటలు; ననుపు = అనురాగము; సెలవులు = ఆజ్ఞ; ఎనయు = పొందు; ఇయ్యకొను = సమ్మతించు, ఒప్పుకొను.

3. మచ్చిక = మోహము; కొచ్చి = గ్రుచ్చు; కాగిట = కౌగిట; కూడుట = కలియుట; అచ్చపు = నిర్మలమైన, స్వచ్ఛమైన; మెచ్చి = ప్రశంసించి; చొక్కు = పారవశ్యం; మేలుదాన = మంచిదానను.

**భావము:** ఎన్నో ఆశలతో ఎంత బాధపడుతున్నావమ్మా! మమ్ము వేడుకుంటున్నావు. నీ పట్టుదల వల్లనే కదా ఈ ప్రయత్నాలన్నీ చేస్తున్నది.

నిన్ను ప్రతిఘటించే శక్తిలేక నీకు చేతులారా మ్రొక్కి నీకు శరణన్నప్పుడే కదా ఏమీ తక్కువకాకుండా వేడుకున్నది. నిన్ను చుట్టుకొని సర్వకాలాల్లో నీకు ప్రార్థనలను వినిపిస్తూ నీ చెంతనే కదా, తగిన సమయం చూసి నిన్ను చేరి నీ యిల్లాలినవడం వల్లనే కదా!

నిన్ను గుర్తించి, కొలువులోనున్నప్పుడు నీకు అనేక బహుమతులను సమర్పించుకొన్నది నిన్ను స్పృశించి నీకు అనేక ప్రేమ కబుర్లు చెప్పడం కోసమే కదా! అనురాగంతో మధ్య మధ్యలో నీ ఆనగా చిరునవ్వులు నవ్వినప్పుడే కదా నీపైన ఇష్టం చూపించుచున్నది నీ పొందు కోరకే కదా!

నీ మీద ఉన్న మోహాతిశయంతో నీ చెవిలో ఏవో శృంగార పలుకులు పలకడంచెప్పినప్పుడే కదా గ్రుచ్చి గ్రుచ్చి నీ కౌగిట చేరేందుకే కదా స్వామీ! శ్రీవేంకటేశ్వరా! నేను స్వచ్ఛమైన నిర్మలమైన హృదయంతో నీకోసం తపిస్తున్న అలమేలుమంగనయ్యా నేను. నిన్నెంతో ప్రశంసిస్తూ నీ రతిసౌఖ్యం కొరకై పరితపిస్తూ పారవశ్యంలో మునిగితేలుతున్నదానను నీకు శ్రేయం కూర్చడం కోసమే కదా!

## 96

**అవతారిక:** చిదంబరంలో ఉన్న తిల్లగోవిందరాజు వైభవాన్ని వర్ణిస్తున్నాడు అన్నమయ్య

### సామంతం

ప. సారె వలపందరిపైఁ జల్లుచున్నాఁడు
తీరుగా సరసమాడి తిల్లగోవిందరాజు ॥పల్లవి॥

1. భరితమై మేడలోనఁ బవ్వళించి వున్నవాఁడు
తరుణులతో నవ్వుతా నున్నాఁడు
పరగ నందరిచేత పాట వింటానున్నవాఁడు
తెర దీసుకున్నవాఁడు తిల్లగోవిందరాజు ॥సారె॥

2. సేసపాలశిరసున సిగ్గుతోడ నున్నవాఁడు
ఆసపాటుచూపులచాయల నున్నాఁడు
బాసికపుసతులపై పాదాలు చాఁచుకున్నాడు
తీసిపెట్టుగానితమిఁ దిల్లగోవిందరాజు ॥సారె॥

3. బావపురతులఁ గూడి పంతముతో నున్నవాఁడు
శ్రీవనిత భూవనితఁ జేసుకున్నాఁడు
వావు లిందరికిఁ జెప్పి వన్నెకాఁడై పొందినాఁడు
దేవుఁడు శ్రీ వేంకటాద్రి తిల్లగోవిందరాజు ॥సారె॥

**అర్థములు:** ప. సారె = మాటిమాటికి; తీరుగా = చక్కగా; తిల్ల = చిదంబరంలో ఉన్న గోవిందరాజు.

1. భరితము = ఆనందముతో గూడి; పరగ = ఒప్పుగా; తెరదీసుకొను = మరుగు, అడ్డుగా ఉన్న వస్త్రము.
2. సేసపాలు = అక్షింతలు; ఆశపాటు చూపులు = ఆశతో కూడిన చూపులు; చాయ = తీరు; బాసికపు సతులు = బాసికము కట్టుకొని పెండ్లాడిన సతులు; తీసిపెట్టుగాని = కాదనలేని; తమి = మోహము.
3. భావము = మనసునందు; పంతము = పట్టుదల; శ్రీవనిత = శ్రీదేవి; భూవనిత = భూదేవి; చేసుకున్నాడు = పెండ్లాడినాడు; వావి = వరుస, బంధుత్వము; వన్నెకాడు = సౌందర్యవంతుడు; పొందు = కూడు, కలియు; దేవుడు = దేవతామూర్తి; శ్రీవేంకటాద్రి = తిరుమల.

**భావము:** ఈ చిదంబరంలో కొలువై ఉన్న శ్రీగోవిందరాజు సరసల్లాపాలతో తీరుబడిగా మాటి మాటికి తన ప్రేమను వారిపై కురిపిస్తున్నాడు.

ఆ గోవిందరాజ స్వామి ఆనందనిలయుడై సుందరమైన భవంతిలో పవళించి ఆ స్త్రీజనంపై చిరుమందహాసాలు కురిపిస్తున్నాడు. ఒప్పుగా ఏకాంతసేవలో వారి కీర్తనలు వింటూ తెరతీసుకుని ఉన్నాడు.

స్వామి తన శిరసుపై ఉన్న అక్షింతలతో సిగ్గుపడుతూ, వారి వంక కోరికతో ఆశగా చూస్తున్నాడు. బాసికము కట్టుకుని పెండ్లాడిన వారివైపు కాళ్ళను జాపుకొని వారి పాద సేవకై ఎదురుచూస్తున్నాడు. త్రోసిరాజాలని మోహంతో ఉనాడా గోవిందరాజు.

మనసులో రతికాంక్షకై తహతహలాడుతూ, సమయంకోసం అదేపనిగా వారి ఊహలతో పంతంపూని ఉన్నాడు. స్వామి శ్రీదేవి భూదేవులను పత్నులుగా స్వీకరించినవాడు. ఆ బంధుత్వాన్ని అందరికి చాటిచెప్పి గొప్ప సౌందర్యవంతుడైన ఆ గోవిందరాజు వారిని చేపట్టియున్నాడు.

**విశేషాంశాలు:** ఈ కీర్తనలో అన్నమయ్య శ్రీవేంకటేశ్వరుని తిల్లగోవిందరాజు అని సంభావించడం గమనించదగ్గ విశేషం. తమిళనాడులోని ఆర్కాట్ జిల్లాలో ఉన్న చిదంబరం క్షేత్రానికి తిల్లై అని పేరు. ఆ ప్రదేశంలో తిల్ల మొక్క అరణ్యంలో ఉండేదని చెప్తారు. అక్కడ వెలసిన స్వామిని తిల్ల గోవిందరాజు అని పిలుస్తారు. తమిళులు తిల్లైసిత్రంబలం అని వ్యవహరిస్తారు.

## 97

**అవతారిక:** అన్నమయ్య ఓ చెలికత్తెగా స్వామివారి విశేషాలను, శృంగార భావాలను వర్ణిస్తున్నాడు.

### శంకరాభరణం

ప. వింటిమయ్యా నేఁడు నీ వేడికెలు

కంటిమయ్యా తోడుతనే కందువ వాడికెలు ॥పల్లవి॥

1. వలపుల తమ్మివిరివాటులు
సొలపులఁ బెనఁగినచోటులు
నెలకొని వున్న నీనీటులు
కొలువులో సుద్దులివి కొండలుఁ గోటులు ॥వింటి॥

2. వెల్లవిరిచూపుల నీవీడేలు
మెల్లనె తమకముల మేడేలు
కొల్లలు నీతమకపుగూడేలు
పెల్లురేఁగెఁ బుక్కిళ్ళ పెండ్లివీడేలు ॥వింటి॥

3. పాలకూళ్ళలోననె పంతాలు
చాలా నమరె నీసంతాలు
యేలితివి శ్రీవేంకటేశ యలమేల్మంగను
యీలీల నాతో నాడేవు యేకాంతాలు ॥వింటి॥

**అర్థములు:** ప. వింటిమయా = చెవులారా వినాము; వేడికె = విన్నపము; కంటిమయా = కన్నారా దర్శించాము; తోడుత = ప్రక్కనే ఉండి; కందువ = చమత్కారము, జాడ; వాడికె = అనుకూలత, ఆచారం.

1. తమ్మివిరివాటు = పద్మం యొక్క సుతిమెత్తని దెబ్బ; సొలపు = పారవశ్యము; పెనగు = చుట్టుకొను; చోటులు = ప్రదేశాలు; నెలకఽని = స్థిరపడి; నీటులు = మురిపెములు; సుద్దులు = మంచిమాటలు; కొండలు = పెద్దవైన ; గోటులు = కడియాలు.

2 .వెల్లవిరి చూపు = విస్తరించి చూసే చూపు; వీడేలు = తాంబూలములు; మెల్లనె = నిదానముగా; తమకము = మోహము; మేడేలు = ఈటెవంటి సూటియైనవి; కొల్లలు = అధికము; తమకము = మోహము; గూడేలు = పొందులు; పెల్లురేగు = అతిశయించు; పుక్కిళ్ళ = బుగ్గననుండు; పెండ్లి వీడేలు = వివాహ తాంబూలములు.

3. పాలకూళ్ళు = పాయసముతో కూడిన విందుభోజనములు; పంతము = పట్టుదల; సంతాలు = స్వంతమయినది; ఏకాంతాలు = రహస్యములు.

**భావము:** ఓ స్వామీ! నీ విన్నపాలు చెవులారా విని, నీ చమత్కార సంభాషణలు, ఆచారాలు ప్రక్కనే ఉండి కళ్ళారా తిలకించామయ్యా!

మోహంతో ప్రేమపూర్వకంగా నువ్వు చూసే నీ చూపులు పద్మంతో కొట్టే సుతిమెత్తని దెబ్బలవలె ఉన్నాయి. నీ మురిపెములన్నీ ఇక్కడే నెలకొని సేవలో తమరు చెప్పే కబుర్లు కొండలంత ఉన్న కడియాలవలే కనిపిస్తున్నాయి.

విస్తరించి చూసే నీ చూపులనే తాంబూలములు చిన్నచిన్నగా ప్రేమాతిశయంతో ఈటెలవలె వాడిగా గ్రుచ్చుకుంటున్నాయి. నీ మోహపు పొందులు చాలా అధికపారవశ్యాన్ని కలిగించేవిగా ఉన్నవి. నీ బుగ్గన ఉన్న పెండ్లి తాంబూలపు చిలుకలు గొప్ప శోభతో అతిశయిస్తున్నాయి.

ఓ స్వామీ! పరమాన్న విందుభోజనాల సమయంలోనే నీ పంతాలు పట్టింపులు అధికమై నీకే సొత్తై అందంగా అమరి ఉన్నాయి. ఈవిధంగా నాతో ఏకాంతంగా రహస్యాలు నెరపుతూ అలమేలుమంగమ్మను పరిగ్రహించావు.

**విశేషాంశాలు:** అన్నమయ్య ఈ కీర్తన చివరిచరంలో "పాలకూళ్ళు" అనే గొప్ప ప్రయోగం చేశాడు. పయస్సు అనగా పాలు. పాలకూళ్ళు అంటే పాయసాన్నం అని అర్థం. విందుభోజనాలలో మాత్రమే వండబడేది పాయసము.

## 98

**అవతారిక:** అమ్మను చేరవచ్చిన శ్రీనివాసునితో ఏవో పరిహాసాలాడుతున్నదని గ్రహించిన చెలులు ఆమెను ప్రశ్నిస్తున్నారు.

### కాంబోది

ప. ఏమిటికిఁ జేసేవే యెగసక్కేలు
కామించిన రమణునిఁ గలయఁగరాదా ॥పల్లవి॥

1. కప్పి నిన్నాతఁడు తమిఁ గాఁగిలించుకొనఁగాను
యిప్పుడు నీవిన్నపము లేమిసేసేవే
ముప్పిరిదప్పికిని నీమోవితేనె లడుగఁగ
అప్పటిఁ బన్నీరేల అందియిచ్చేవే ॥ఏమిటి॥

2. సొలసి చక్కఁదనాలు చూచి యాతఁడు చొక్కఁగా
తల దువ్వి తురుము యెందాఁకాఁ బెట్టేవే
కలికి నీచన్నులకుఁ గడు చేయిచాఁచఁగాను
వెలయ నిప్పుడు యేల వీడె మందిచ్చేవే ॥ఏమిటి॥

3. శ్రీ వేంకటేశ్వరుఁడు చేరి రతిఁ గూడఁగాను
యీవేళనే పాదములు యేఁటి కొత్తేవే
కావిరి నేకతమునఁ గడు నీతో నవ్వఁగాను
చేవమీరి ఇఁకనేల సిగ్గువడేవే ॥ఏమిటి॥

ప. ఏమిటికి = ఎందుకు; యెగసెక్కేలు (ఎకసక్యములు) = ఎగతాళి, పరిహాసము; కామించిన = వరించిన; ఇష్టపడ్డ; రమణుడు= అందగాడు, మన్మథుడు.

1. కప్పి = ఆచ్ఛాదనం; తమి = మోహము; కాగలించు = కౌగలించుకొను; విన్నపము = నివేదన; ముప్పిరి = మూడువిధములుగా, దప్పి = దాహము; మోవితేనె = అధరామృతము.

2. సొలయు = పారవశ్యముబొందు; చక్కదనాలు = సౌందర్యము; చొక్కు = మత్తు; తురుము = కొప్పు; వీడెము = తాంబూలము.

3. ఏటి కొత్తవే = ఎందుకు వత్తవు; కావిరి = పొగ(క్రమ్ము; ఏకతమున = ఒకరియందే గల ధ్యాస; చేవమీరు = పక్వమై, సారవంతమై.

**భావము:** అమ్మా ఎందుకు పరిహాసాలు ఎందుకు చేస్తున్నావు? నిన్ను కోరుకున్న అ స్వామిని కలియవచ్చుగదా! లేనిపోని అర్థంలేని పనులన్నీ ఎందుకు చేస్తున్నావు?

నిన్నా స్వామి బిగి కౌగిలిలో గట్టిగా బంధించి ఉండగా ఇప్పుడెందులు వారికి ఏవో విన్నపాలు చేస్తునావు? పరిపరివిధములుగా నీ అధరామృతాన్ని అడుగుతూ ఉంటే, ఎప్పటిదో పన్నీరు తెచ్చి ఆయనకెందుకు అందిస్తున్నావు?

స్వామి నీ సౌందర్యానికి పారవశ్యం పొంది ఆ మత్తులో ఉండగా, వారికి తలదువ్వి తలకొప్పు పెడుతున్నావెందుకు? స్వామి అందమైన నీ వక్షోజాలను అందుకోవడానికి చేతులు చాస్తూ ఉండగా ఇప్పుడెందుకు వారికి తాంబూలం అందిస్తున్నావు?

శ్రీవేంకటేశ్వరుడు నీ రతి సౌఖ్యం కోసం చేరి నీ చెంత ఉన్నప్పుడు, ఈ సమయంలో వారి పాదములు వత్తుతూ ఉన్నావెందుకు? ఆయన ఏకాంతములో త్రికరణశుద్ధిగా అన్యచింతనలేనివాడై నీతో నవ్వులు కురిపిస్తూ ఉంటే, మంచి యౌవనములో ఉన్న నీవు ఎందుకు సిగ్గులు చిందుస్తున్నావు? ఆయనతో సుఖించవలదా?

## 99

**అవతారిక:** చెలులు స్వామి అమ్మ చేస్తున్న శృంగార చేష్టలను గమనించి ఆటపట్టిస్తూ ఇద్దరికిద్దరూ సరిపోయారని మేలమాడుతున్నారు.

### ముఖారి

ప. నీవు మొదలు జాణవు నీకంటె నాకె జాణ
ఈవల నావల మిమ్ము నిద్దరి మెచ్చేము ॥పల్లవి॥

1. పయ్యద మాటుసేసుక పలుమారు నవ్వుకొంటా
వుయ్యాలమంచాన నిన్ను నూఁచీఁ జెలి
వొయ్యనె పాదాన నాపెవొడి నీవు దాఁకించఁగ-
నియ్యెడ సిగ్గువడీ నింతలో నీదేవులు ॥నీవు॥

2. పుక్కిటివిడెముతోడ పొంచి పొంచి చూచుకొంటా
వొక్కట నాకుమడిచి వొసగీఁ జెలి
చక్కనినీకొనగోరు చనుమొన నంటించఁగా
చెక్కు చేతమోపుకొని సిగ్గువడీ దేవులు ॥నీవు॥

3. తనివోనిగుట్టుతోడ తమకము రేఁచుకొంటా
యెనసి కాఁగిట మోవి యిచ్చీఁ జెలి
ఘనుఁడ శ్రీ వేంకటేశ కళలుమించఁ గూడఁగ
చెనకేచెలులఁ జూచి సిగ్గువడీదేవులు ॥నీవు॥

**అర్థములు:** ప.మొదలు = ముందే; జాణవు = నేర్పరి; ఆకె = ఆమె; ఈవల నావల = ఇక్కడా అక్కడా.

1. పయ్యెద = పైటకొంగు; మాటు = చాటున; పలుమారు = అనేకసార్లు; సూచీ = చూస్తూ; ఒయ్యనె = మెల్లగా; ఆపె = ఆమె; ఒడి = తొడపై భాగము; తాకించు = తగులునట్లు చేయు; ఇయ్యెడ = ఈస్థానము; సిగ్గువడీ = సిగ్గుపడుచూ; దేవులు = దేవత.
2. పుక్కిటి = బుగ్గన; విడెము = తాంబూలము; పొంచి = చాటుగా దాగి; ఒక్కట = ఒక్కసారిగా; ఒసగీ = ఇస్తూ; అంటించు = తగులునట్లు చేయు; చెక్కు = చెక్కిలి; చేతమోపుకొను = చేయి పైన ఉంచుకొను; సిగ్గువడీ = సిగ్గుపడుతూ.
3. తనివోని = తృప్తి చెందని; గుట్టు = రహస్యము; తమకము = మోహము, ప్రేమ; రేచు = ఉసిగొల్పు; ఎనసి = పొందు; కాగిట = కౌగిట; ఘనుడు = గొప్పవాడు; కళలు = నేర్పరితనము; కూడు = కలియు; చెనకు = తాకు, స్పృశించు; దేవులు = దేవత.

**భావము:** స్వామీ! ముందే నీవు నేర్పరివి. నీకంటే ఆమె ఇంకా గొప్ప నేర్పరి. ఇచ్చుటా నచ్చుటా మీ కార్యములు గాంచి ఇద్దరిని మెచ్చుకుంటున్నాము.

ఉయ్యాల మంచంపై నున్న నిన్ను చూచి ఆమె పైటకొంగు నడ్డుపెట్టుకొని అనేకసార్లు నవ్వులు చిందిస్తూ ఉండగా మెల్లగా నీవు నీ పాదాన్ని ఆమెకు తగిలించగానే, దానికామె సిగ్గులొలకపోస్తూ ఉండిపోయినది.

బుగ్గన తాంబూలమునిడుకొని దాగి దాగి నిన్ను చూస్తూ, ఆమె ఒక్కసారిగా ఆ తమలపాకు మడచి నీకు అందివ్వగా, నీవు చమత్కారంగా నీ కొనగోరు ఆమె వక్షోజానికి తగలగానే, చెక్కిలిపై చేతులుంచుకొని ఆ చెలి సిగ్గుపడుతూ ఉన్నది.

ఆమె తృప్తిచెందని మోహంతో రహస్యంగా ప్రేమాతిశయముతో, నీ పొందుకోరి, నీ కౌగిట్లో చేరి, నీకు మోమును అందిస్తూ ఉండగా, గొప్పవాడవైన ఓ శ్రీవేంకటేశ్వరా! నీ శృంగారచేష్టలనే కళలు అతిశయించి ఆమెను చేరగా, వెనుక నిన్ను తాకుతూ ఉన్న చెలులంతా ఒక్కసారి గొప్ప సిగ్గులనొలకబోశారు.

## 100

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామికి తనపై ఏమాత్రం ప్రేమాభిమానాలున్నాయో కాస్తా విచారించమని చెలులను పురమాయిస్తున్నది.

### మధ్యమావతి

ప. ఏపాటి బత్తిగలఁడో యిటు నామీఁద
దాపుగా నా సుద్దులిట్టె తలపెట్టి చూడవే ॥పల్లవి॥

1. మనసు దెలియరాక మర్మము లడుగరాక
వొనగూడి గుట్టుతోడ నున్నదాననే
ఘనుఁ డాతఁ డన్నిటాను కాంతరో నీవై నాను
అనుమానించక మాటలాడించి చూడవే ॥ఏపాటి॥

2. కూరిమి గొసరరాక కొంగువట్టి తియ్యరాక
వోరుచుక సిగ్గుతోడ నున్నదాననే
నేరుపరి యీతఁడు నెట్టుకొని నీవైనా
చేరి వద్దివారిచేతఁ జెప్పించి చూడవే ॥ఏపాటి॥

3. బలిమి సేయఁగరాక పాసి వుండఁగరాక
వొలిసి కాఁగిటఁ గూడివున్నదాననే
యెలమి శ్రీవేంకటేశుఁ డేలె నన్ను నీవయినా
సొలవక కోరికలు సోదించి చూడవే ॥ఏపాటి॥

**అర్థములు:** ప. ఏపాటి = ఎంతమాత్రం; బత్తి = భక్తి, గౌరవము; దాపు = సమీపము; సుద్దులు = సూక్తులు, మంచిమాటలు, తలపెట్టు=ఆరంభించు.

1. తెలియరాక = అర్ధమవక; అడుగరాక = అడగలేక; ఒనగూడు = నెరవేరు; ఘనుడు = గొప్పవాడు; కాంతరో = ఓ లలనా.
2. కూరిమి = ప్రేమ; =సరరాక = కోరలేక; =గువటి= =గుపట్టుకుని; తియ్యరాక = తీయలేక; వోరుచుక = ఓర్చు=, భరిస్తూ; నేరుపరి = నేర్పరి; నెటుకొని = బలవంతంగానైనా; వద్ది = చెంత, వద్ద.
3. బలిమి = బలవంతము; సేయగరాక = చేయలేక; పాసి = తొలగి, దూరం; ఒలసి = కలసి, చేరి; కాగిట = కౌగిట; కూడి = చేరి; ఎలమి = ప్రకాశము, వికాసము; సొలయు = వెనుదీయు; సోదించి = శోధనచేసి.

భావము: ఓ చెలీ! స్వామివారికి నామీద ఏమాత్రం ప్రేమ భక్తులున్నవో, ఆయన చెప్పే సూక్తులలోని నిజానిజాలు ఈ సమయంలోనే తెలుసుకోవే.

నేను వారి మనసు తెలుసుకోలేక, విషయమేమిటో అడగనూలేక, తెలియనిదాననై రహస్యంగా ఉండిపోయాను. స్వామివారు ఎంతో గొప్పవారు కనుక నీవైనా అనుమానించకుండా ఒక్కసారి వారితో మాటలాడి చూడరాదటే!

ఆయనతో ముడివడి ఉన్నటువంటి ప్రేమానురాగాలతో వారిని ఏమీ కోరలేక, కొంగుపట్టుకుని తీయలేక, అన్నీ ఓరిమితో భరించి సిగ్గుతో ఉండిపోయాను. స్వామివారి నేర్పరితనము లింతింతయని చెప్పజాలను, నీవైనా బలవంతంగానైనా సరే వారి వద్ద చేరి ఎవరితోనైనా నా ప్రేమ గురించి చెప్పించరాదా!

స్వామివారిని ఎలాంటి బలవంతమూ చేయలేని దాననై, అలాగని వారిని విడిచి ఒక్క క్షణమైనా ఉండలేక, వారి కౌగిలిలో ఉండిపోయినదానను. వికాసముతో ఆ శ్రీవేంకటేశ్వరుడు నన్ను పరిగ్రహించి ఏలుకుంటున్నడు, నీవైనా వెనుదీయకుండా ఒక్కసారి ఆయన కోరికలేమిటో పరిశీలించి చెప్పవే!

## 101

**అవతారిక:** కొంటెపనులు చేస్తూ ఆరళ్ళు పెడుతున్న అలమేలుమంగమ్మను స్వామి బుజ్జగిస్తున్న సన్నివేశం.

### ముఖారి

ప. ఏఁటికి నన్ను గుంపించే వేమే నీవు
చాటిచెప్పేవు నాకిది సఫలము గాదా ॥పల్లవి॥

1. కుప్పళించి నీవు నాకొంగువట్టి తీసేననే-

విప్పుడే లోకములెల్ల నేలనా నేను
పిప్పిగట్ట నీవు నాతో పెనఁగులాడవచ్చేవు
కప్పుచు నట్టైతే నాభాగ్యముగాదా ఇపుడు ॥ఏటికి॥

2. చేరి చేరి నామీఁద చేతులు చాఁచవచ్చేవు
గారవించ నాకిది ఘనతగాదా
ఆరితేరి నామేన నటు గోరు సోఁకించేవు
నేరుపుతో నాకిది నిధానముగాదా ॥ఏటికి॥

3. పిక్కటిల్లఁ గాఁగిట బిగియించవచ్చేవు
యెక్కువైనపదవి నా కిదేకాదా
చెక్కు నొక్కి కూడితివి శ్రీవేంకటేశుఁడ నేను
చొక్కపురతు లివెల్లా సోబనముగాదా ॥ఏటికి॥

**అర్థములు:** ప. గుంపించు = అతిక్రమించు; చాటిచెప్పు = ప్రకటించు; సఫలము = సార్థకము.

1. కుప్పళించు = కురిపించి; ప్రసరించు; తీసేననే = తీశానని; ఏలనా = పరిపాలించనా; పిప్పిగట్టు = గట్టిగానగు; పెనగులాడు = చుట్టుకొను; అట్టైతే = అలాగయినట్లైతే; భాగ్యము = అదృష్టము.
2. చేరి చేరి = దగ్గర్గా వచ్చి; గారవించు = గౌరవించు, మన్ననచూపు; ఘనత = గొప్పదనము; ఆరితేరు = సమర్ధుడగు; నేమేన = శరీరముపై; సోకించు = తాకించు; నేరుపు = సామర్థ్యము; నిధానము = ఉండుటగు తగిన స్థలము.
3. పిక్కటిల్లు = అతిశయము; కాగిట = కౌగిట; చెక్కునొక్కు = చెక్కిళ్ళను వత్తు; కూడితివి = కలిసితివి; చొక్కపు = మనోహరమైన; సోబనము = మంగళకరము.

**భావము:** అలమేలుమంగా! ఏమిటిది? నీవు నన్ను అతిక్రమిస్తున్నావు? అన్నివిషయాలు బాహాటంగా ప్రకటించి చాటింపు వేస్తున్నావు.

నేను నీమీద ప్రేమాభిమానాలు చూపిస్తూ నీ పైట తీశానని అంటున్నావు కానీ నేను ఈముల్లోకాలను ఏలే నాధుణ్ణి కానా చెప్పు? ఇంత గట్టిగా పోట్లాడుతూ నన్ను చుట్టుకొని పెనవేసుకుంటున్నావు. ఇలా నన్ను కప్పుకోవడం నా అదృష్టం కాదా?

నా దగ్గరగా వచ్చి నా మీద చేతులు వేయడానికి చాస్తున్నావు, నిన్ను మన్నించి గౌరవించడం నీకు గొప్పగా అనిపించడంలేదా? నేర్పరివై నా శరీరంపై నీ గోళ్ళు తాకిస్తున్నావు. నీ సామర్థ్యానికిది తగిన ప్రదేశం కాదా?

గొప్ప అతిశయంతో నన్ను నీ బిగికౌగిట బంధించాలని ప్రయత్నిస్తావు కదా! నాకన్నింటికంటే ఇష్టమైన గౌరవమిదే! ఓ అలమేలుమంగా నేను నీ స్వామిని నీ అందమైన చెక్కిళ్ళు నొక్కి చేరవచ్చిన శ్రీవేంకటేశ్వరుడను, ఈ మనోహరమైన రతులన్నీ మంగళకరము కాదా!

**విశేషము:** శృంగారంలో నఖక్షతాలు, దంతక్షతాలు అనాదిగా ఉన్నవే! అమ్మ అలమేలుమంగమ్మ స్వామితో చేసే చిలిపి శృంగార చేష్టలను గిల్లికజ్జాలను సుమనోహరంగా వర్ణించాడు అన్నమయ్య.

## 102

**అవతారిక:** స్వామిని గూర్చి తపిస్తూ వివిధ నాయికలు పడుతున్న మదనావస్తను ఒక రమణి స్వామికి హృద్యంగా నివేదిస్తున్నది.

## సింధురామక్రియ

ప. ఒద్దనున్న కాంతలకు నుల్లములు గరగెను
సుద్దులేమి చెప్పేము చూతువు రావయ్యా ॥పల్లవి॥

1. పట్టెమంచము మీఁదటఁ బవ్వళించీని చెలియ
నెట్టుకొన్నవేడుకతో నిన్నుఁ దలఁచి

గుట్టున మనోరథాలు గోరుకోంటా ముక్కుమీఁది-
జుట్టవేలితో నున్నది చూతువు రావయ్యా ॥ఒద్దనున్న॥

2. వొక్కతె యేకతముననండి యుల్లసముతోడ
పక్కన నీమీఁదటి పదాలు వాడి
యిక్కువ నీమోవితేనె కేకట నోరూరుకొంటా
చొక్కి నిట్టూర్పులు నించీఁ జూతువు రావయ్యా ॥ఒద్దనున్న॥

3. ఇట్టె నీవు రాగా శిరసెత్తి నీమొగము చూచి
గట్టిగా శ్రీ వేంకటేశ కాఁగిట గూడిఁ
నెట్టుకొని రతులను నిన్ను మెప్పించీ దినముఁ
జుట్టి చుట్టి ఇట్లానే చూతువు రావయ్యా ॥ఒద్దనున్న॥

**అర్థములు:** ప. ఒద్ద = దగ్గర; ఉల్లము = హృదయము; సుద్దులు = మంచి మాటలు, సూక్తులు.

1. పవ్వళించీని = పడుకొని యున్నది; నెటుకొన్న = అతిశయించిన; గుట్టున = రహస్యముగ; మనోరథాలు = కోరికలు; కోరుకుంటా = అడుగు, అర్థించు; జుట్టవేలు = చుట్టబడిన వ్రేలు.
2. ఏకతము = ఒకరిమీదనే ధ్యాసతో; ఉల్లసము = సంతోషము; పదాలు = కీర్తనలు; ఇక్కువ = జాడ; మోవితేనె = అధరామృతము; ఏకట = అపేక్ష; చొక్కు = మోహము; నిట్టూర్పు = నిశ్వసనము; నించీ = నిండజేయుచుండు.
3. శిరసెత్తి = తలను ఎత్తి; కాగిట = కౌగిట; నెటుకొను = అతిశయించు; మెప్పించీ = మెప్పించుచు; చుట్టి చుట్టి = చుటుకొను, పెనవేయు; ఇట్లానే = ఈమాదిరిగానే.

**భావము:** ఓ స్వామీ అక్కడ ఉన్న రమణులందరికి హృదయములుప్పొంగి మీ కొరకై నిలబడ్డారు. ఇంకా ఈ మాటలెందుకు చూద్దాం రండి.

చెలియ పట్టెమంచంపై పడుకొని వారి ఆనందోత్సాహాలు అతిశయించి ఉప్పొంగగా నిన్నే ధ్యానిస్తున్నది. ఆమె తన కోరికలన్నీ మనసులోనే రహస్యంగా దాచుకుంటూ ముక్కుపై వేలుపెట్టుకొని తదేకంగా యోచిస్తున్నది ఇలా వచ్చి చూడవయ్యా!

ఆమె ఒంటరిగా పరధ్యాసలేక నిన్నే తలచుకొని సంతోష వదనంతో కీర్తిస్తూ నీ అధరామృతానికై అర్రులు చాస్తూ నోరూరిన ఆమె మోహం చూస్తే భారంగా శ్వాస వదులుతున్నది. ఇలా వచ్చి చూడవయ్యా!

నీవు రాగానే తలనెత్తి నీ ముఖారవిందాన్ని తిలకించి, శ్రీవేంకటేశ్వరుడవైన నీ బిగి కౌగిలిలో యిమిడిపోయి గొప్ప అతిశయించిన రతులతో నిన్ను మెప్పించాలని ఈరోజు కృతనిశ్చయంతో ఉన్నది. అలాగే చుట్టూ చూసుకుంటూ వచ్చి చూడవయ్యా!

**విశేషాంశాలు:** అన్నమయ్య ఈ కీర్తనలో రెండవ చరణంలో "పదాలు" అని ప్రయోగించాడు. పతంజలి మహాభాష్యం ప్రకారం "చత్వారి పదజాతాని నామాఖ్యాతోపసర్గ నిపాతాశ్చ" అనగా పదములు నాలుగు రకములు అవి 1.నామము, 2.ఆఖ్యాతము, 3. ఉపసర్గము, 4.నిపాతము. కావున ఆమె స్వామిపై పదాలు అనగా నామధ్యాస చేయుచున్నది అని చెప్తున్నాడు అన్నమయ్య.

## 103

**అవతారిక:** వలచి వచ్చిన ఒక వనిత పట్ల స్వామి నిరాదరణ చూపుతున్నాడని భావించిన మరొక నాయిక రాయబారం నడుపుతున్నది.

## సామంతం

ప. ఏమిటికిఁ దలవంచే వేల సిగ్గులువడేవు
కామించి వచ్చెఁగాక గాతసేయ వచ్చెనా ॥పల్లవి॥

1. మచ్చిక నీతోఁ జెలి మాటలాడ వచ్చెఁగాక

పచ్చిగాఁ జీఁకటితప్పు పట్టవచ్చెనా
ముచ్చటదీరఁగ నీమోము చూడవచ్చెఁగాక
తెచ్చుకొన్నయాకెతో వాదించవచ్చెనా ॥ఏమిటికి॥

2. అట్టె నిన్ను వీడె మడుగఁగ వచ్చెఁగాక
దిట్టయై నీసేతలు సోదించవచ్చెనా
నెట్టన నీసేవసేయ నెయ్యముతో వచ్చెఁగాక
గట్టిగా నీనేస్తాలు కాకుసేయ వచ్చెనా ॥ఏమిటికి॥

3. మిక్కిలి కాఁగిటఁ గూడి మెప్పించవచ్చెఁగాక
కక్కసించి నీపై నద్దికము వచ్చెనా
మొక్కుచు శ్రీ వేంకటేశ మోవి యానవచ్చెఁగాక
పక్కన నాపెను నిన్నుఁ బచ్చి సేయవచ్చెనా ॥ఏమిటికి॥

**అర్థములు:** ప. ఏమిటికి = ఎందుకు? కామించు = వలచు; గాత = బాధ.

1. మచ్చిక = స్నేహము; చీకటితప్పు = వ్యభిచారం; ఆకె = ఆమె.
2. వీడెము = తాంబూలము; దిట్ట = బలముతో; సోదించు = వెదకు, తప్పు పట్టు; నెట్టన = అనివార్యముగా; నెయ్యము = స్నేహము; కాకు = తిరస్కారము.
3. కాగిట = కౌగిటిలో; కక్కసించు = బాధించు; అద్దికము = రక్షణ, కావలి; ఆపె = ఆమె; పచ్చిచేయు = మరుగులేని, బహిరంగము.

**భావము:** ఓ స్వామీ! ఎందుకు తలవంచి సిగ్గులు చిందిస్తున్నావు? నిన్ను మోహించి వచ్చింది గానీ నిన్నేదో బాధపెట్టాలని రాలేదు కదా!

ఈ చెలి నీతో స్నేహం నెరపుతూ మాట్లాడాలని ఆశపడి వచ్చింది కానీ, నీవు అన్యకాంతలతో చేసే శృంగారచేష్టలను చెప్పడానికి రాలేదు కదా! తనివితీరా నీ ముఖారవిందాన్ని మనసారా దర్శించవచ్చిన ఇలాంటి రమణితో వాదించవచ్చునా?

ఈమె నిన్ను తాంబూలమడుగ వచ్చింది కాని, ఏదో బలిమితో నీ కార్యాలను కనిపెట్టాలన్న ఉద్దేశంతో వచ్చిందా? అనివార్యమై నీ సేవచేసుకుందామని స్నేహభావంతో వచ్చిందికాని, నీ నెయ్యముగోరి వచ్చిన వారినిలా తిరస్కారభావంతో చూడవచ్చునా?

నీ కౌగిట్లో చేరి నిన్ను మెప్పించాలన్న ఉద్దేశమేకాని, నిన్ను బాధపెట్టాలన్న ఉద్దేశంతో కానేకాదు సుమా! ఓ శ్రీవేంకటేశ్వరా! నీకు మ్రొక్కులిడుతూ నీ మోవిపై తన మోవిని తగిలించప్రయత్నిచాలన్న యత్నమే గానీ, నీ ప్రక్కన వచ్చి నీ రహస్యాలను బహిరంగపరచడానికి రాలేదుకదా స్వామీ!

**విశేషాంశములు: 1.** అన్నమయ్య ఈ కీర్తన రెండవ చరణంలో “నెట్టన” అనే ఒక గమ్మత్తైన పదం ప్రయోగించాడు. ఈ పదం నన్నయ ఆదిపర్వంలోని “క.ఎట్టివిశిష్టకులంబునఁ బుట్టిన సదసద్వివేకములు గల్గియు మున్ గట్టిన కర్మఫలంబులు, నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్.” అనే పద్యంలో వాడాడు. ఈ నెట్టన అనే పదాన్ని కొన్ని పద్యాలలో ద్రుతప్రకృతికముగా వాడుచున్నారు గాని దానికి సరియైన ప్రయోగములేదు. అదిగాక యది ద్రుతాంతమైన యెడఁ బక్షాంతరమున ‘ము’ వర్ణాంతరము గాదు. ఆవిధమైన ప్రయోగం శివయోగసారములో గణపతిదేవుడు చేశాడని లాక్షణికులు దోషారోపణ చేశారు

**2.** అన్నమయ్య శృంగార కీర్తనలలో అభ్యంతర వర్ణనము కబడదు. వాడిన పదాలు సైతం కూడితి, ఏలితి వంటి సూచక శబ్దాలతోనే పరమార్థాన్ని సూచించాడు. అలాంటి పదమే “చీకటితప్పు” అనేది కూడా.

## 104

**అవతారిక:** అలమేలుమంగమ్మ మనసులో ఏవో పెట్టుకుని స్వామిని చికాకు చేస్తున్నదని తగదని చెలులు హితవు చెప్తున్నారు.

## మలహరి

| | | |
|---|---|---|
| ప. | ఇంత సేతురా యిటువలె రమణుని | |
| | యింతిని నిను నెలయించె ననుచును | ॥పల్లవి॥ |
| 1. | సారెకు నేఁటికి జంకించేవే | |
| | కేరుచు నతఁడు నగె ననుచును | |
| | జీరలుగా గోరఁ జిమ్ముదురటవే | |
| | వూరకె పరాకై యుండె ననుచును | ॥ఇంత॥ |
| 2. | పెనుఁదురు మేఁటికిఁ బిడికిటఁ బట్టేవే | |
| | ననుపున నీతోఁ బెనఁగె ననుచును | |
| | అనుగుకుచంబుల నదుముదు రటమే | |
| | తనలో నొకతెను తలఁచె ననుచును | ॥ఇంత॥ |
| 3. | జంటల నింతేల చలములు మీ రేవే | |
| | నంటున నీతో నెనసెననుచును | |
| | ఇంటిలో శ్రీవేంకటేశు జరతురటే | |
| | అంటుచు సరసములాడే ననుచును | ॥ఇంత॥ |

**అర్థములు:** ప. సేతురా? = చేయుదురా?; ఇటువలె = ఈ రీతిగా; రమణుడు = సుందరమైనవాడు (శ్రీనివాసుడు); ఇంతి = ఇల్లాలు; ఎలయించు = పురికొల్పు, ప్రోత్సహించు.

1. సారెకు = మాటిమాటికి; ఏటికి = ఎందులకు; జంకించు = బెదిరించు; కేరుచు = ఉత్సాహముతో; నగు = నవ్వు; జీరలు = గాట్లు; గోర = గోటితో; చిమ్ము = పొడుచు; పరాకు = అన్యధ్యాస.

2. పెనుతురుము = పెద్ద కొప్పు; పిడికిట = పిడికిలితో; అనుపున = బలిమితో; పెనగు = చుట్టుకొను; అనుగు = సుందరమైన; కుచంబుల = వక్షోజముల; అదుము = వత్తు; ఒకతె = ఒక స్త్రీ.

3. ఇంతేల = ఈ విధముగా; చలములు = పట్టుదలలు; మీరు = అతిక్రమించు; నంటు = స్నేహము; ఎనయు = అంగీకరించు; జరయు = నిందించు; అంటుచు = తాకుతూ; సరసము = సారస్యము, వినోదక్రీడ.

**భావము:** ఓ అలమేలుమంగమ్మా! నిన్ను స్వామి ఎంతగా ప్రేమించి, ప్రోత్సహించినప్పటికి, నీలా ఎవరైనా స్వామిపట్ల ఈవిధంగా ప్రవర్తిస్తారా?

మాటిమాటికి ఎందుకు బెదిరిస్తున్నట్లు మాట్లాడుతున్నావు? ఉత్సాహంగా స్వామి నవ్వుతున్నాడని, పరాకుగా ఉన్నాడని, వారి మేనిపై గీతలు పడేట్టు ఎవరైనా ఈవిధంగా గోళ్ళతో గీరుతారా?

ఆయన పెద్ద కొప్పును ఎందుకు నీ పిడికిట బిగించి పట్టుకుంటావు? బలిమితో, ఇష్టంగా నిన్ను కౌగలించుకున్నాడని, ఇంకా తనలో ఎవరో స్త్రీని తలుచుకుంటున్నాడని భావించి, ఆయనను నీ సుందరమైన వక్షోజాలతో వత్తి ఎందుకు ఉక్కిరి బిక్కిరి చేస్తావు?

నీతో ప్రియభాషణములు చేస్తున్నాడని, నీకు అంగీకారం తెలుపుతున్నాడని, జతగా ఉంటూనే ఇలా పట్టుదలలకు ఎందుకుపోతున్నావు? గృహంలో ఉన్న శ్రీవేంకటేశ్వర స్వామిని, సదా నిన్నే స్పృశిస్తూ సరసల్లాపాలాడే వారినిలా నిందించడం తగునటే?

## 105

**అవతారిక:** అలమేలుమంగా శ్రీనివాసుల అన్యోన్య దాంపత్యం గురించి చెలులు శ్లాఘిస్తున్నారు.

## శుద్ధవసంతం

ప. వేడుకకు వెలలేదు విభుఁడ వాకెకును
జాడలెల్ల సరివచ్చె సమ్మతాయ మాకును ॥పల్లవి॥

1. తచ్చితచ్చి మాటలలోఁ దనవల పఁ(పం)తయును
యెచ్చరించెఁగా నేఁడు యింతి నీకు
పచ్చిచేఁతలనే నీతోఁ బచరించవచ్చెఁగా నసుపు
యిచ్చకముగాఁ బొంచి యిందరిలోన ॥వేడుకకు॥

2. సెలవినవ్వులలోనే చేసేటివిన్నపాల్లెలా
తలఁపించెగా నేఁడు తరుణి నీకు
పిలిచేనేరుపులోనే బెరయించెఁగా పగటు
నలువై నీమెచ్చుగాను నడుమఁ దాను ॥వేడుకకు॥

3. కూడిన కాఁగిటిలోనే గురుతైనకాఁపురాలు
యీడేరఁ జేసెఁగా యీసతి నీకు
జోడై శ్రీవేంకటేశ చొక్కి నన్ను నేలితివి
వీడెమిచ్చెఁగా మఱియు వింతలేక యిపుడు ॥వేడుకకు॥

**అర్థములు:** ప. వేడుక = సంతోషము; విబుడవు = భర్తవు; ఆకె = ఆమె; జాడ = విధము; సరివచ్చు = సాటియగు; సమ్మతి = అంగీకారము.

1. తచ్చితచ్చి = మధించి, మధించి,(చిలికి, చిలికి); ఎచ్చరించు = జ్ఞప్తికి తెచ్చు; పచ్చిచేతలు = మరుగులేని పనులు; పచరించు = కనబరచు; అనుపు = బలిమి; ఇచ్చకము = ముఖస్తుతి; పొంచి = దాగి.
2. సెలవి నవ్వు = పెదవి మూలగానవ్వు; విన్నపాలు = వినతులు; నేరుపు = సామర్థ్యము; పెరయించు = కలియు; పగటు = ప్రకాశము; నలువు = ఒప్పినది.
3. గురుతైన = విదితమైన; ఈడేరు = నెరవేరు; జోదు = జత; చొక్కు = పరవశము, వీడెము = తాంబూలము; వింత = ఆశ్చర్యము.

**భావము:** ఓ శ్రీనివాసా! నీ సంతోషానికి వెలగట్టలేము. ఆ అలమేలుమంగమ్మకు భర్తవై యున్నావు. నీ గురుతులు నీ విధానాలు అన్నీ దానికి సాటిగానే ఉన్నాయి.

విషయాలన్నీ మధించి మాట్లాడుతూ, తన ప్రేమంతా మీపై కుమ్మరిస్తూ అమ్మ నీకు గత మధుర జ్ఞాపకాలను గుర్తుకు చేస్తున్నది. మరుగులేని శృంగార చేష్టలు కనబరుస్తూ ముఖప్రీతి మాటలు మాట్లాడుతూ విషయాలన్నీ దాగి ఇందరిలోనూ స్పష్టంగా కనిపిస్తూనే ఉన్నాయి.

అమ్మ పెదవిమూలగా దరహాసం చేస్తూ చేసుకునే విన్నపాలు నీకు బహిరంగంగా కనిపిస్తూనే ఉన్నాయి. అలా మిమ్మల్ని పిలిచే సామర్థ్యంలోనే మీ పొందులు కలయికలు ప్రకాశవంతమై కనబడుతూ ఉన్నాయి.

మీ అన్యోన్యమైన కౌగిలిని గమనిస్తే మీ కాపురం ఎంత మధురమైనదో విదితమవుతున్నది. ఇవన్నీ అమ్మ మీకు నెరవేరే విధంగా జేస్తున్నది. ఓ శ్రీవేంకటేశ్వరా ! జతగూడి పారవశ్యంతో నన్ను కూడి ఏలుకుంటున్నావనే విషయం తాంబూలం ఇచ్చే విధానంలోనే ఏమాత్రం ఆశ్చర్యం లేకుండా కనబడుతున్నది.

**విశేషము:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామివారికి స్వాధీనపతికయని అన్నమయ్య నిరూపిస్తున్నాడు.

**అవతారిక:** శ్రీవారి సేవలో తరిస్తున్న ఇంతుల సౌభాగ్యాన్ని వర్ణిస్తున్నాడు అన్నమయ్య.

## బౌళిరామక్రియ

ప. ఏమాయనయా యింతటిలోనే
కామునికి నివి గల సహజములు ॥పల్లవి॥

1. చనవరికాంతలు సరసములాడఁగ
ననుపున విభుఁడవు నవ్వితివి
పెనుఁగుచు రమ్మని పేరునఁ బిలువఁగ
పనివడి యట్టే పలికితివి ॥ఏమాయ॥

2. కొలువు కామినులు కుచములు చూపిన
సొలయుచుఁ దప్పక చూచితివి
కలువ పువ్వులటు కానుక లిచ్చిన
అలరి కరంబుల నందితివి ॥ఏమాయ॥

3. వూడిగపుసతులు వొడి వట్టుకొనిన
వేడుకతో బెండ్లాడితివి
యీడనె శ్రీవేంకటేశ నన్నెనసి
తోడనె దోమటి దొడికితివి ॥ఏమాయ॥

**అర్థములు:** ప.ఏమాయనయా = ఏమైందయ్యా!; ఇంతటిలోనే = ఇంతలోనే; కాముడు = మన్మధుడు; సహజము = స్వభావము.

1. చనవరి = స్నేహితురాలు; అనుపు = అనుకూలత; పనివడు = పూనుకొను; అట్టే = వెంటనే.
2. కొలువు = సేవ; కామినులు = సంగమం కోరు స్త్రీలు; కుచములు = వక్షోజములు; సొలయు = వైముఖ్యము; అలరి = సంతోషపడి; కరంబులు = చేతులు; నందు = తీసుక=ను.
3. వూడిగము = సేవలు; సతులు = స్త్రీలు; వొడి = తొడపైభాగము; వట్టుకొను = పట్టుకొను; వేడుక = సంతోషము, వినోదము; ఈడనె = ఇక్కడే; ఎనసి = పొంది; తోడనె = కూడా, వెనువెంట; దోమటి = విందు; దొడకు = గ్రహించు.

**భావము:** ఇంతలోనే ఏమయిందయ్యా స్వామీ శ్రీనివాసా! ఇవన్నీ మన్మధుని ప్రేరణవల్ల జరిగే సహజ లక్షణములేగదా!

చనువుతో స్నేహంగా ఉన్న స్త్రీలు సరస సల్లాపాలు ఆడితే, తదనుగుణంగా వారికి ప్రభువైన నువ్వు మందహాసం చేశావు. నీపై మమకారంతో కౌగలించుకొని నిన్ను పేరుతో బిలువగా పూనుకొని వారికి సమాధానమిచ్చావు.

నీ కొలువులో ఉంటూ నీతో సంగమించగోరే కాంతలు వక్షోజం చూపించగానే వైముఖ్యంతో చూశావు. వారు నీకు కలువ పువ్వులను కానుకగా అందించగా, సంతోషంతో వాటిని గ్రహించావు.

నీకు సేవలు చేసి తరించే స్త్రీజనం నీ మీద ప్రేమతో నీ ఒడి పట్టుకోగానే వారిని వినోదంతో వివాహమాడావు. ఓ శ్రీవేంకటేశ్వరా! ఇక్కడే నన్ను కూడి వెంటనే విందుభోజనాలనారగించావు.

**విశేషము:** అన్నమయ్య "దోమటి" అనేపద ప్రయోగంపై పలు పండితులు భిన్నాభిప్రాయాలు వెలిబుచ్చారు. అన్నమయ్య వివిధ సందర్భాలలో తన కీర్తనలలో మొత్తం 62 సార్లు అంటే అధ్యాత్మిక కీర్తనలలో 15 సార్లు, మిగిలిన 47 సార్లు శృంగార కీర్తనలలో ఉపయోగించాడు. కామిశెట్టి శ్రీనివాసులు దోమడి అంటే ఉత్సవమని చెప్పారు. వేటూరి ఆనందమూర్తి గారు ఈపదం ప్రయోగాన్ని బట్టి ఔపవిభక్తికమని తోచుచున్నదని, ప్రథమాంతరూపం కానరాదని చెప్పారు. వారన్నట్లు 'దోమడి ' ప్రథమాంత ప్రయోగం కనబడదు కాని, 'దోమటి' అనే శబ్దమే ప్రథమాంతంగా వాడబడినది. కొన్ని చోట్ల దోమట్లు అనే బహువచన రూపం కూడా ఉన్నందువల్ల "దోమటి" శబ్దాన్నే ప్రాతిపదికగా తీసుకున్నట్లు అనిపిస్తున్నది. సి.పి.బ్రవున్ నిఘంటువులో దోమటి, దోమడి అనే

రెండు శబ్దాలను కూడా పేర్కొన్నారు. ఈ పదాన్ని, అన్నము, విందుభోజనము అలాగే కపట/మొరటు స్వభావము, అన్న రెండు అర్థాల్లో వాడినట్లు తెలుస్తున్నది.

## 107

**అవతారిక:** స్వామివారు తనకొక్కదానికే స్వంతం అన్నట్టు అలమేలుమంగమ్మ ప్రవర్తిస్తున్నదని గమనించిన ఇతర నాయికలు ఈ ప్రవర్తన తగదని హితవు చెప్తున్నారు.

### సాళంగనాట

ప. వెక్కసపు వలపుల విఱ్ఱవీఁగేవు
మక్కువలు మారుకొంటే మఱి యేమి సేసేవే ॥పల్లవి॥

1. యింతులెల్లా నుండగాను యేకతము నీ వాడేవు
చెంత నుండి విభునికి సేవ సేసేవు
యెంత కెత్తు కొంటివే నీ వించుకాఁ దగవెంచవు
యింతలో దొమ్మి సేసితే నేమి సేసేవే ॥వెక్కసపు॥

2. సరివారిలోననెల్లా చనవుల నెరుపేవు
గరిమ నాతనితోడ గదునవ్వేవు
దొరతన మెంత గద్దే తోడి వారి గైకోవు
నిరతి దొమ్మి గూడితే నీవేమి సేసేవే ॥వెక్కసపు॥

3. కావరించి చెనకేవు కాగిటనుఁ గూడేవు
శ్రీవేంకటేశ్వరునిఁ జెలగించేవు
దేవుల వౌదువే ఆ దేవుడే మమ్మును నేలె
యీ విధాన సంతమైతే నిక నేమి సేసేవే ॥వెక్కసపు॥

**అర్థములు:** ప. వెక్కసము = అధికము; విఱ్ఱవీగు = గర్వపడు; మక్కువ = ప్రేమ; మారుకొను = ఎదుర్కొను.

1. ఏకతము = రహస్యము; ఆడేవు = మాట్లాడేవు; ఇంచుక = కొంచెము; తగవుంఎంచవు = తగాదాల గురించి ఆలోచించవు; దొమ్మి = అందరూ కలబడినప్పుడు జరిగే గ=డవ.

2. సరివారు = సమానమైన వారు; చనవులు = ప్రేమ; గరిమ = గ=ప్పదనం; కదు = ఎక్కువ; ద=రతనము = అధికారము; గద్దు = గలదు; గైకోవు = తీసుకోవు, అనుమతించవు; నిరతి = అధికాసక్తి.

3. కావరించి = మదముతో; చెనకు = తాకు; చెలగించు = అలరారు; దేవుల = పట్టపురాణి; సంతము = స్వంతము.

**భావము:** ఏమమ్మా అలమేలుమంగమ్మా స్వామిపై అంత అధికమైన ప్రేమను ప్రదర్శిస్తూ విర్రవీగుతున్నావు. అదే విధంగా మిగతా స్త్రీజనం కూడా ఎదుర్కుంటే నీవేమి చేస్తావు?

ఇక్కడ ఎంతో మంది ఆడువారు ఉండగా నువ్వు స్వామితో చేరి రహస్యాలాడుతూ వారి వెంట వెంట ఉండి సేవలు చేస్తున్నావు. ఏమాత్రం తగవులు వస్తాయని ఆలోచించకుండా ఎంతకు సిద్ధపడ్డావు? వారంతా కలసికట్టుగా నీ మీద దాడిచేస్తే ఏమి చేస్తావు?

నీ సాటి స్త్రీలు ఉన్నప్పటికి స్వామితో ఎంతో చనువుగా ప్రవర్తిస్తుంటావు. నీ ఆధిక్యతను చూపిస్తూ కిలకిలా నవ్వులు రువ్వుతున్నావు. నీకీ అధికారం ఎక్కడనుంచీ వచ్చినదో తెలియకుండా ఉన్నది. అసలు తోడివారిని లక్ష్యపెట్టనే పెట్టడంలేదు. వారు స్వామిపై అధికాసక్తితో నీపై మూకుమ్మడిగా తగాదాకు వస్తే ఏమి చేస్తావు?

ఎంతో మదముతో స్వామిని స్పృశిస్తూ కౌగిట్లోకి చేరుతున్నావు. అలాగే శ్రీవేంకటేశ్వరునితో కూడి అలరారుతున్నావు. నీవు

స్వామి పట్టపురాణివి అవుతావా? ఆ స్వామే మమ్ములనుకూడా ఏలుకుంటున్నాడన్న విషయం విస్మరిస్తున్నావు. ఈ రీతిగా మేము ప్రవర్తిస్తే నీవేమి చేయగలవు?

**విశేషము:** అన్నమయ్య విప్రలబ్ధ నాయికయైన అమ్మవారిని వర్ణన గావించాడు.

## 108

**అవతారిక:** స్వామియందే అనురక్తురాలైన అలమేలుమంగమ్మ, స్వామి తనను లక్ష్యపెట్టడం లేదని అన్యస్త్రీలతో కూడి ఉంటున్నాడని భావించి, తగదని వేడుకుంటున్నది.

### ద్రావిళభైరవి

ప. ఆసపడ్డవారిని అలయింతురా
పోసరించి యేల జరవులఁ బెట్టేవికను ॥పల్లవి॥

1. కన్నులనే మొక్కితి కైదండ నీ కిచ్చితి
విన్నపములు సేసితి వేమారును
యెన్నక యింతటనైనా ఇంటికి రారాదా
సన్నల నెందాకా రచ్చల సేసే విచ్చట ॥ఆసపడ్డ॥

2. సేవలెల్లా జేసితి చెక్కులు నేనొక్కితి
వేవేలకు గొసరితి వేమారును
చేవదేర మంచముపై జేరి కూచుండరాదా
తోవల చెలులతో సుద్దు లేమిటి కిపుడు ॥ఆసపడ్డ॥

3. కందువ లిట్టేయంటితి కాగిలించు కొంటిని
విందుగా శ్రీ వేంకటేశ వేమారును
పందెము లేమాడేవు పవ్వళించరాదా
చెందితివి నన్ను నేఁడుఁ చింతలు మరేఁటికి ॥ఆసపడ్డ॥

**అర్థములు:** ప. అలయించు = శ్రమపెట్టు, పోసరించు = మదించి, జరవు = వేగం.

1. కైదండ = చేయూత, వేమార్లు = పలుమార్లు, సన్నలు = సైగలు, రచ్చ = అల్లరి.
2. సేస = అక్షతలు, చెక్కులు = చెక్కిళ్ళు, కొసరు = కోరు, సుద్దులు = పోచుకోలు మాటలు.
3. కందువ = జాడ, చింత = విచారము.

**భావము:** ఓ స్వామీ! మీ యందు అనురక్తులైనవారిని శ్రమపెడతారా? మీ గడుసుదనం చూపి నన్నెందుకు హడావుడి పెడతారు చెప్పండి?

మిమ్ములను సదా కన్నులతో మ్రొక్కి , నా చేయూత సదా మీకందిస్తున్నదానను. మీకు వేలాది విన్నపాలు చేసుకున్నదానను. నన్ను కోరి ఇకనైనా గృహానికి విచ్చేయరాదా? సైగలు చేస్తూ ఇక్కడ కలకలం ఎందుకు సృష్టిస్తారు?

మీకు అనేక విధములుగా సేవలు చేసుకుంటూ మీ అందమైన చెక్కిలిపై ఆశపడి నొక్కేటిదానను. వేల వేల కోరికలను మీకు వినిపించి కోరుకొన్నదానను. బలిమితో ఈ పట్టెమంచముపై పరుండరాదా స్వామీ? మధ్యలో త్రోవలో కనబడిన స్త్రీజనంతో ముచ్చట్లెందుకు పెట్టుకుంటారు?

ఓ వేంకటేశ్వరా! విందుగా వేయిమార్లు మీ జాడలిట్టే కనుగొని బిగియార కౌగలించు కొన్నదానను. పట్టు పానుపుపై పవళించకుండా వారితో వీరితో మీరు పందేములాడడమెందుకు స్వామీ? ప్రీతిగా నన్ను పొందిన మీకిక ఈ అనవసరపు యాతనలెందుకు స్వామీ!

## 109

**అవతారిక:** స్వామియందే మనసు లగ్నం చేసిన అలమేలుమంగమ్మను నిర్లక్ష్యం చేయడం తగదని ఓ నాయిక స్వామిని వేదుకుంటున్నది.

### ఆహిరి

ప. ఎవ్వరేమి చెప్పేరు యిఁక నీకును
నివ్వటిల్ల నింకా నవే నేరుచుకోవయ్యా ॥పల్లవి॥

1. ఆసపడి రతులకు నండ నుండి చిత్తమురా
సే(సె) సె(సే)గా ఆకె నీకు సేవలెల్లాను
పూసగుచ్చినట్టు చెప్పి బుద్ధులెల్లా నీకు నూరి-
పోసెఁగా చెవిలోనను పొద్దు వొద్దు నీకును ॥ఎవ్వరేమి॥

2. వాడికగా నీమీఁద వలపులు చల్లి చల్లి
వీడెమిచ్చెఁగా నీకు వేడుకతోను
యేడలేని సుద్దులెల్లా నెచ్చరించి యింతేసి
తోడ సాము సేయించెఁగా దొరతనమునను ॥ఎవ్వరేమి॥

3. చెక్కునొక్కి సేసవెట్టి సేఁతలెల్లాఁజేసి చూపి
చిక్కించెఁగా ఆపె నిన్ను శ్రీ వేంకటేశ
మక్కువతో నీచేత మన్నింపించి నన్ను మెచ్చి
మిక్కిలి నవ్వునవ్వెఁగా మేరమీరి నిన్నును ॥ఎవ్వరేమి॥

**అర్థములు:** ప. ఇవ్వటిల్లు = నెరవేరు; అవే = ఆవిషాయాలే; నేరుచుకో = నేర్చుకో.

1. ఆస(వి) = ఆశ(ప్ర); అండ = చెంత; చిత్తము = మనసు; ఆకె = ఆమె; పూసగుచ్చినట్లు = వివరంగా; బుద్ధులు = మంచిమాటలు; నూరి = పలుమార్లు మదిలో నాటుక=నునట్లుగా; పొసె = వినిపించెను; పొద్దు = రోజు.
2. వాడిక = అలవాటు; చల్లి = చిలకరించు; వీడెము = తాంబూలము; వేడుక = సంతోషము; యేడలేని = ఎక్కడా లేని; సుద్దులు = మాటలు; ఎచ్చరించి = గుర్తుచేయు; దొరతనము = అధికారము.
3. చెక్కు = చెక్కిళ్ళు; సేస = అక్షింతలు; సేతలు = పనులు; చిక్కించు = పట్టుకొను; ఆపె = ఆమె; మక్కువ = ప్రీతి; మన్నిపించు = మన్నింపజేయు; మిక్కిలి = అధికమైన; మేరమీరు = అతిక్రమించు.

**భావము:** ఓ స్వామీ! ఎవరు మాత్రం ఏమి చెప్పగలరు మీకు? నీ కోరిక నేరవేరే విధంగా ఆ విషయాలే నేర్చుకోవయ్యా!

నీ తోడునీడై యుండి రతిసౌఖ్యమునకు ఆశపడిన మనసుతో ఆమె అనేక విధములుగా సేవలు చేస్తున్నది. మంచి విషయాలు వివరంగా పూసగుచ్చినట్లు చెప్పి మంచి మాటలు నీకు మదిలో నాటుకొనే విధంగా నీ చెవిలో, ప్రతి రోజూ నూరిపోసినది.

అలవాటుగా నీమీద ప్రేమను పెచుకొని నీకు తాంబూలమందిచ్చినది. ఎక్కడా లేని మంచి మాటలను జ్ఞప్తికి తెచ్చి ఆమె అధికారంతో చేసిన సాము ఇంతింత అని చెప్పలేమయా స్వామీ!

ఓ శ్రీవేంకటేశ్వరా! నీ చెక్కిళ్ళు నొక్కి, తలపై అక్షతలు పెట్టి అనేకవిధముల సేవలు చేసి, నిన్ను ఆమె ప్రేమవలలో చిక్కించుకొన్నది. ఇష్టపూర్తిగా నీచేత మన్ననలు పొంది మెప్పింపబడిన మితిమీరిన సంతోషం పారవశ్యంలో నున్నది.

**గమనిక:** 1. క్రీగీతలు గలవి చిలుముపట్టి యున్న యున్నందున శ్రీమాన్ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు పరిష్కరించినవి.
2. కుండలీకరణములలో గల అక్షరములు (రాగిరేకులోనో లేక అచ్చులోనో) అటునిటు దొర్లినవి.

## 110

**అవతారిక:** శ్రీనివాసునికి అలమేలుమంగమ్మ చేస్తున్న వివిధ సేవలను స్వామికి నివేదిస్తున్నది ఒక నాయిక.

## మంగళకౌశిక

ప. అన్ని సేవలునుఁ జేసీ అంగన నీకు
సన్నల నీతో నట్టె సరసమాడీని ॥పల్లవి॥

1. కామించి సిగ్గులతోడ కంకణాలు గదలఁగ
వేమారుఁ బాదము లొత్తీ వెలఁది
ఆమనివలపుతోడ నంగమెల్లాఁ జెమరించ
గోమున నప్పటి నీకుఁ గొప్పువెట్టీని ॥అన్ని॥

2. సెలవినవ్వులతోడ చె(చి?)క్కిన పయ్యద జార
మలయుచు వీడెమిచ్చీ మగువ
పులకచెక్కులతోడ పొందులు(ల?) తలఁపు రాఁగ
వెలయ సురటి నీకు విసరీని ॥అన్ని॥

3. నిట్టూరుపులతోడ నిందునివ్వెరగుతోడ
గుట్టున గుబ్బల నొత్తీఁ గోమలి
యిట్టె శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేఁడు
జట్టిగొని యాపె యింకా చవులు చూపీని ॥అన్ని॥

**అర్థములు:** ప. సన్నలు = సైగలు, అంగన = ఆడుది.

1. వేమారు = అనేకసార్లు, వెలది = స్త్రీ, ఆమనివలపులు = వసంతకాల ప్రేమాధిక్యము, గోము = సుకుమారము.
2. సెలవి నవ్వులు = పెదవి మూల నవ్వులు, వీడెము = తాంబూలము, మలయు = పెనగు, పులకలు = గగుర్పాటు, సురటి = విసనకర్ర.
3. నివ్వెరగు = మిక్కిలి భయము, గుబ్బలు = చన్నులు, కోమలి = స్త్రీ, జట్టి = సరిసమానము, చవులు = రుచులు.

**భావము:** ఓ స్వామీ అలమేలుమంగమ్మ నీకు సకల సేవలు జేసి సైగలు చేస్తూ సరసమాడుతూ ఉన్నది.

నిన్ను కోరుకొని సిగ్గులొలకబోస్తూ, చేతికున్న కంకణములు కదలిపోతూ ఉండగా, లెక్కలేనన్ని మార్లు నీపాదములు ఒత్తినది. మన్మధావస్తతో కూడిన వలపుతో ఆమె శరీరం యావత్తూ నిండియుండగా, నీ కేశములను ప్రేమతో సవరించి నెత్తిన కొప్పు పెట్టినది.

పెదవి మూలగా వయ్యారంగా చిరునవ్వులు చిందిస్తూ జారిపోయిన పైట నీ చేతికి చిక్కగా తపిస్తూ తాంబూలము నీ చేతికిచ్చినది. గత పొందుల జ్ఞాపకాలు మదిలోకి రాగా గగుర్పాటుతో అదురుతున్న చెక్కిళ్ళతో నిన్నే గమనిస్తూ ప్రకాశవంతమైన మోముతో నీకు విసనకర్రతో సుతారంగా విసురుతున్నది.

పారవశ్యం వల్ల మాటిమాటికి వచ్చే దీర్ఘ ఉచ్ఛ్వాస నిస్వాసలతో రహస్యంగా నీ వక్షోజాలను వత్తుతున్నది. శ్రీవేంకటేశ్వరా ఈ లాగున నేడు నన్నేలుకున్నావు. ఏమైనా ఆమె మిమ్మల్ను వశపరచుకొని ఎన్నో మధుర రుచులను అందిస్తున్నది.

**గమనిక:**

1. క్రీగీతలు గలవి చిలుముపట్టి యున్న యున్నందున శ్రీమాన్ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు పరిష్కరించినవి.
2. "సెలవి నవ్వులతోడ చెక్కిన పయ్యెద జార" అనే పాదములో "చెక్కిన" అనే పదము బదులుగా "చిక్కిన" అనే పదము వలన అర్థవంతమవుతుంది. యతి సైతం భంగము కాదు.

**అవతారిక:** సవతుల సంవాదాన్ని ఆసక్తికరంగా మలిచి వినిపిస్తున్నాడు అన్నమయ్య

## సింధురామక్రియ

ప. ఎంత నీవు పోతరించి యింపులఁ బెనఁగినాను
వంతుకుఁ గొంగువట్టితి వదలకు మనవే ॥పల్లవి॥

1. కాతరించి రమణునిఁ గలకాలమెల్లా నీవే
చేతఁ జొక్కించుకొంటివి చెప్పేదేమే
యీతల నాతడే మాయింటికి విచ్చేసె నేఁడు
నీతితోడ నిలువక నేనేల విడుతునే ॥ఎంత॥

2. బలిమితో మగవాని బాసలు చేయించుకొని
యెలయించి కైకొంటివి ఇంకానేమే
వలపించి యాతని నా వద్దికి రప్పించుకొంటి
వెలయ భోగించక నీ వెంట నేలంపుదునే ॥ఎంత॥

3. కందువ శ్రీ వేంకటేశఁ గాఁగిటిరతులఁగూడి
అందరిలో మెరసితి వప్పటినేమే
ముందుముందె నే నాతనిమోవితేనె దక్కఁగొంటి
అందముగఁ బెండ్లాడక అదేల మానుదునే ॥ఎంత॥

**అర్థములు:** ప. పోతరించు = బలసిన; ఇంపు = ఇష్టము; పెనగు = చుట్టుక=ను; వంతు = పోటీ; కొంగువట్టి = కొంగు పట్టుకొను.

1. కాతరించు = ఉత్సాహమిచు; రమాణుడు = మగడు; కలకాలము = ఎల్లకాలము; చొక్కించుకొను = వశపరచుకొను; ఈతల = ఇవతల; విచ్చేసె = వచ్చెను; నీతి = న్యాయము; విడుతును = వదలిపెడతాను.

2. బలిమితో = బలవంతముగా; బాసలు = ఒట్లు; యెలయించు = పురికొల్పు; కైగ=ను = తీసుకొను; వద్దికి = వద్దకు; వెలయ = ప్రకాశించు; భోగించక = అనుభవించక; ఏల = ఏవిధముగా, అంపుదునే = పంపిస్తాను.

3. కందువ = జాడ, సంకేతము; కాగిటి = కౌగిటి; మెరసితి = ప్రకాశించితి; ముందుముందు = భవిష్యత్తులో; మోవితేనె = అధరామృతము; దక్కఁగొంటి = దక్కించుకొన్నాను; అదేల = అది ఏవిధముగా; మానుదునే = మానేస్తానా?

**భావము:** ఎంతగా నీవు అధికమైన బలిమిని ప్రదర్శించి యిష్టంతో స్వామిని చుట్టుకొని కౌగలించుకొన్నప్పటికి, ఏమాత్రం వదిలిపెట్టే ప్రసక్తే లేదు సుమా! నేను కూడా పోటీగా యిక్కడ స్వామి కొంగు పట్టుకుని నిల్చున్నాను.

ఎంత ఉత్సాహవంతురాలవైనా స్వామిని ఎల్లకాలం నీవే చేతుల్లో పెట్టుకుంటే ఇంక చెప్పేదేముందమ్మా! ఇవతల ఆ స్వామే ఇవాళే మా గృహానికి విచ్చేశాడు. నీతి న్యాయం లేకుండా నేనెట్లా విడిచి పెడతాననుకున్నావు?

బలవంతంగా స్వామితో ఒట్లు పెట్టించుకొని, ఎంతో వైభోగంతో పట్టుకున్నావు కదా! ఇంకా ఎందుకు మాట్లాడుతున్నావు? నేను ఎంతో శ్రమపడి స్వామిచే వలపించుకొని నా దగ్గరకు రప్పించుకుంటే, నేను స్వామితో శృంగారక్రీడలు జరుపకుండా నీతో ఎలా పంపిస్తాననుకున్నావు?

జాడ తెలిసి శ్రీవేంకటేశ్వరుని కౌగిట్లో బంధించి రతి పారవశ్యంతో కూడి, అందరిలోను మెప్పు పొందినాను కదా! ఇకముందు ముందు నేనే స్వామి అధరామృతాన్ని దక్కించుకొదలచాను. స్వామిని అతి మనోహరంగా వివాహమాడకుండా నెనెలా వదులుతాననుకున్నావు?

**గమనిక:** 1. క్రీగీతలు గలవి చిలుముపట్టి యున్న యున్నందున శ్రీమాన్ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు పరిష్కరించినవి.

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ పడుతున్న సిగ్గులు, తాపాలు, పనులు అర్థంకాక తలపట్టుకున్న చెలులు ఆ విషయాన్ని స్వామివారికి చెప్తున్నారు.

## కేదారగౌళ

ప. నీవైనా నానతీవయ్యా నెరజాణవు
తావుల నీ దేవులైతే దాఁపిరము సేసెను ॥పల్లవి॥

1. పొలఁతి నీమాటలకు బొమ్మల జంకించి చూచి
తలవంచి సిగ్గుతోడఁ దడఁ బడీని
అలరి చెలికత్తెలు ఆరహస్య మడిగితే
తెలియఁజెప్పఁగరాక తెరవేసుకొనెను ॥నీవైనా॥

2. అప్పటి నీ సేఁతలకు నాయములు సోఁకనాడి
కప్పుకొన్నపయ్యదతో కాఁతాళించీని
వొప్పుగ నూడిగములవువిద లడిగితేను
ముప్పిరి నొడుగరాక ముసుఁగిడుకొనెను ॥నీవైనా॥

3. నీవు నవ్వినవ్వుకు నీతురుము వట్టి తీసి
వోవరిలోపలఁ గూడి వొగి మెచ్చీని
శ్రీ వేంకటేశ నీదేవు లలమేలుమంగ
వోవల నడిగితే నీవుర మెక్కుకొనెను ॥నీవైనా॥

**అర్థములు:** ప. ఆనతి = సెలవు, అనుమతి. నెరజాణ = నేర్పరి, తావు = స్థానము, దేవులు = దైవీభావము, దాపిరము = గోప్యము, దాపరికము.

1. పొలతి = ఆడుది, బొమ్మల = కనుబొమ్మల, జంకించు = అదిరించు, తడబడు = చలించు, కంగారుబడు, అలరి = సంతోషపడి, తెరవేసుకొనెను = తెరలో దాగుకొనెను.
2. నాయములు = న్యాయము, సోకనాడు = శోకాలుపెట్టు, కాతాళించు = కోపించుబీ ఊడిగములు = సేవలు, ఉవిద = స్త్రీ, ముప్పిరి = పెనగొను, చుట్టుకొను, నొడుగు = మాటడు.
3. తురుము = కొప్పు; వోవరి = లోపలిగది, వొగి = క్రమముగా; వోవల = తీర్పు, ఉరమెక్కు = వక్షస్థలమెక్కు.

**భావము:** ఓ శ్రీనివాసా! నీవైనా ఆనతీయరాదా! నేర్పరియైన ఆ దేవేరి తనస్థానములో కూర్చొని అన్ని గుట్టుమట్టుగా సాగిస్తున్నది. విషయమేమిటో బోధపడడంలేదు.

ఆమె నీవాడే మాటలకు కనుబొమ్మలు అదిరిపడేట్టు చూస్తూ సిగ్గుతో తల వంచుకొని కంగారు పడుతున్నది. తీరా చెలికత్తెలు ఆ రహస్యం ఏమిటో చెప్పమని అడిగితే, చెప్పకుండా తెరచాటుకు వెళ్ళిపోయినది.

అప్పుడెప్పుడో నీవు చేసిన పనులకు న్యాయాన్యాయాలు తెలియక శోకాలు పెడుతూ కోపించి, నీవు సేవలు చేయమని అడిగితే ఏమీ మాట్లాడలేక పైటచెంగు ముసుకు కప్పుకొని పడుకొన్నది.

నీవు నవ్వుతున్నప్పుడు నీ కొప్పు సరిచేస్తూ లోపలి గదిలో నిన్ను కూడి మెప్పించినది. ఓ శ్రీవేంకటేశ్వరా! నీ దేవేరి అలమేలుమంగమ్మ ఏమిటమ్మా అని వివరంగా తీర్పు చెప్పమంటే నీ ఉరమెక్కి కూర్చున్నది.

## 113

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మపై స్వామివారు ఎందుకో అలకబూనారు. అలక తీర్చి ఇద్దరికి సంధి చేసే ప్రయత్నంలో చెలులు చెప్తున్న విశేషాలు.

## ఆహిరినాట

ప. ఏల గడించుకొనేవు యేడలేని కతలును
లోలోనే గుబ్బతిల్లక లోనికి రావయ్యా ॥పల్లవి॥

1. చిగురుమోవిమీఁద చిప్పిలుఁదేనే గారితే
వొగరుఁదిట్ల నేవు వూరకే నీవు
మగువ నీమీఁదట మచ్చరించి పలుకఁగ
నిగిడి యింతటిలోన నేవేమి సేసితివి ॥ఏల॥

2. నలిఁజంద్రవదనాను నవ్వు వెన్నెల గాసితే
అలరుచు నెగసక్కెలనేవు
చెలియ నీమీఁదట చిట్టకము నెరపఁగ
నెలకొన్నయట్టితప్పు నీవేమి సేసితివి ॥ఏల॥

3. జక్కవ చనుముక్కులు సరివాఁడు లై తేను
వుక్కునఁ గాఁగిట నిన్ను నొత్తెననేవు
అక్కున శ్రీ వేంకటేశ అలమేల్మంగ జరయ
నిక్కి పానుపుమీఁదట నీవేమి సేసితివి ॥ఏల॥

**అర్థములు:** ప.ఏల = ఎలా, గడించు = సంపాదించు, ఏడలేని = ఎక్కడా కనబడని, కథలును = కథలను, కల్పితాలను, లోలోనే = లోపలలోపల, గుబ్బతిల్లు = ఉప్పొంగు.

1. చిగురుమోవి = లేత ముఖము, చిప్పిలు = పైకి ఉబుకు, ఒగరుతిట్లు = కఠినమైన తిట్లు, మచ్చరించి = కోపగించి, నిగిడి = కలిగించు.

2. నలి = యోగ్యమైనబీ చంద్రవదన = స్త్రీ, అలరుచు = వికసింపజేయు, ఎగసెక్కేలు = పరిహాసాలు, చిట్టకము = శృంగారచేష్ట, నెలకొను = పుట్టు, కలుగు.

3. జక్కువ = చక్రవాక పక్షులు, చనుముక్కులు = చను మొదళ్ళు, సరివాడి = సరిసమానమైన వాడిగలవి, ఉక్కున = గట్టిగా నలుగుబీ కాగిట = కౌగిటిలో, ఒత్తు = నొక్కు, అక్కున = వక్షస్థలముపై, జరయు = నిందించు, కోపించు, నిక్కి = పైకెత్తి.

**భావము:** స్వామీ! ఎక్కడలేని కల్పిత కథలన్నీ ఎలా సృష్టిస్తావయ్యా! లోపల లోపలే ఉప్పొంగే ఆనందంతో బయటే ఉండిపోక లోనకు దయచేయవయ్యా!

అలమేలుమంగమ్మ చిగురుటాకువంటి మోముమీద పైకి ఉబికివచ్చే తేనె కారుతూ ఉంటే ఊరకనే కఠినమైన మాటలెందుకు అంటావు? ఆమె నీమీద కోపగించి ఏవో నాలుగు మాటలంటే, నీవెందుకు ఇలాంటి పనులు చేస్తున్నావు?

చంద్రబింబం వంటి ఆమె ముఖారవిందంపై నవ్వుల వెన్నెలలు కురుస్తుంటే నీవెందుకు ఇలాంటి పరిహాసపు మాటలు మాట్లాడుతున్నావు. ఆమె నీతో శృంగార చేష్టలు చెయ్యాలని ప్రయత్నిస్తుండగా, నీవేమి తప్పు చేశావు? నీకు కోపావేశమెందుకు?

చక్రవాక పక్షుల రెక్కలతో సమానమైన వాడి కలిగియున్న ఆమె వక్షోజాలమొనలైతే, గట్టిగా కౌగిట్లోకి తీసుకున్నదని నానా యాగీ ఎందుకు చేస్తున్నావు? ఓ శ్రీవేంకటేశ్వరా! నీ వక్షస్థలంపై ఉన్న అలమేలుమంగమ్మ కోపించే విధంగా నీవు పట్టుపానుపు పై ఏమి చేశావు?

## 114

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామివారిని వివాహమాడిన అనంతర సన్నివేశాలైన తలంబ్రాలు, వసంతాలు మొదలైన విశేషాలు చెలులు వర్ణిస్తున్నారు.

## సాళంగనాట

ప. వేడుకకాఁడ వౌదువు వింతమాసటీఁడ వౌదు-
వేడ చూచినా మెచ్చేరు యింతులెల్లా మిమ్మును ॥పల్లవి॥

1. తెఱవఁ బెండ్లియాడి తేరుమీఁద నేఁగిరాఁగా
చిఱుఁజెమటలు గారెఁ జెక్కులమీఁద
మెఱయుచు వీదులను మించి విఱ్ఱవీఁగఁగాను
నెఱవాదిసాముల నిట్టూర్పులు నిండెను ॥వేడుక॥

2. బాసికము గట్టుకొని పడఁతితో మెఱయఁగ
సేసముత్తేలు చూపట్టె శిరసుల పై
ఆసతో వాడలనెల్లా నారుతులె త్తించుకోఁగా
పోసరించి మోముల గొబ్బున మించెఁగళలు ॥వేడుక॥

3. అలమేలుమంగఁ గూడి అట్టె వసంతాలాడఁగ
చెలఁగెఁ బులకలు మెయి శ్రీవెంకటేశ
వెలయ నిండ్లనెల్లా విందు తారగించఁగాను
వలపులు మోవిమీఁద వన్నెచూపె నిపుడు ॥వేడుక॥

**అర్థములు:** ప. వేడుకకాడు = కుతూహలపరుడు, మాసటీడు = శ్రేష్ఠుడు.

1. తెరవ = ఇంతి, తేరు = రథము, ఏగిరాగ = తరలిరాగా, చెక్కులు = చెక్కిళ్ళు, మెరయు = ప్రకాశించు, విర్రవీగు = అతిశయించు, గర్వపడు, నెరవాది = నేర్పరి, సాము = ప్రదర్శన, వ్యాయాయామము. నిట్టూర్పు = దీర్ఘ ఉచ్ఛ్వాస నిశ్వాసములు.
2. సేసముత్తెలు = ముత్యములతో కలసిన అక్షింతలు; చూపట్టె = కనిపించెను; ఆరతులు = హారతులు; ఎత్తించుకొను = పట్టించుక=నుబీ పోసరించి = పోతరించు, మదమెక్కు, గొబ్బున = త్వరగా; మించె = మెరయు.
3. వసంతాలు = పసుపు, సున్నము కలిపిన నీళ్ళు, చెలగు = ప్రకాశించు, పులకలు = గగుర్పాటు, మెయి = దేహము, ఆరగించు = తిను; మోవి = ముఖము, వన్నె = అందము.

**భావము:** ఓ శ్రీనివాసా! ఎంత కుతూహలం చూపిస్తున్నావయ్యా స్త్రీజనం మీద! ఎంత గొప్పవాడివయ్యా నువ్వు? ఎక్కడ చూసినా రమణులందరూ మిమ్ములను ఎంత శ్లాఘిస్తున్నారయ్యా!

ఆ అలమేలుమంగమ్మను గమనించారా స్వామీ! మిమ్ములను పెండ్లాడిన అనంతరం రథం మీద వస్తూ ఉండగా, ఆమె చిరుచెమటలు చెక్కిలిమీద కారుతూ ఎంతో ప్రకాశిస్తున్నది. ఆ విధంగా వీధులలో ఊరేగుతూ ఉండగా ఆ సంతోషాతిశయానికి ఆమె దీర్ఘ ఉచ్ఛ్వాస నిశ్వాసములు విడుస్తున్నది.

బాసికము కట్టుకొని ఆ పడతి తేజోవంతమై ప్రకాశిస్తూ ఉండగా మీ తలలపై ఉన్న ముత్యపు తలంబ్రాలు చూపరులకు మెరుస్తూ కనిపిస్తున్నాయి. వాడల వాడలలో మీకు జనం హారతులు పడుతూ ఉండగా మీ ముఖ సౌందర్యం మిక్కిలి ఆనందంతో అనేక కళలను ప్రదర్శిస్తూ ఉన్నది.

ఓ శ్రీవేంకటేశ్వరా! అలమేలుమంగమ్మతో కూడి వసంతాలాడుతూ ఉండగా ఆమెకు పులకరింపు కలుగుతున్నది. మీరు అందరి ఇండ్లలో విందుభోజనాలు చేస్తూ ఉండగా ప్రేమతో కూడిన మీ ఇద్దరి ముసి ముసి నవ్వుల అందం ఎంత అందంగా ప్రకాశిస్తున్నది స్వామీ! మా జీవితాలు ధన్యమైనవి.

## 115

**అవతారిక:** చెలులు అలమేలుమంగమ్మకు స్వామివారికి వివిధ సేవలను చేసి తరించమని చెప్తున్నారు.

## అమరసింధు

ప. ఎంత బత్తో నీమీఁద నీ రమణుఁడు
చెంతనుండి ఇయ్యఁగదే చేతికి బాగాలు ॥పల్లవి॥

1. పయ్యదకొంగు పట్టి పతి నీతోఁ బెనఁగీని
ఇయ్యకొని రాఁగదవే ఇంటికి నేఁడు
చెయ్యార నప్పటి నీచెక్కు నొక్కి వేఁడుకొనీ
వుయ్యాలమంచముపైఁ గూచుండఁగదె సరుస ॥ఎంత॥

2. నెట్టుకొనఁ గాఁగిలించి నిన్ను నొడఁబరచీని
అట్టె కానిమ్మనఁగదె ఆతనితోను
వొట్టుకొని పాదము నీవొడిమీఁదఁ జాఁచీని
గుట్టుతో నానతిచ్చీ నూఁకొనఁగదె మాట ॥ఎంత॥

3. చెలరేఁగి మంతనాన శ్రీవేంకటేశుఁ డెనసె
ఆలమేలుమంగవు నీవలమఁగదె
పలుమారు నవ్వుతాను బాసికము గట్టీని
చలమెల్లా నీడేరె చల్లఁగదె సేస ॥ఎంత॥

**అర్థములు:** ప. బత్తి = భక్తి, సేవ, ఇయ్య = ఇవ్వ, బాగాలు = వక్కపొడి పలుకులు.

1. పెనగు = చుట్టుకొను, కౌగలింత, ఇయ్యకొను = సమ్మతించు, చెయ్యార = చేతితో, చెక్కు = చెక్కిలి, వేడుకొను = ప్రార్థించు, విన్నవించు, సరుస = ప్రక్కన.
2. నెట్టుకొను = బలవంతముగా తోసుకొనివచ్చి, కాగలించి = కౌగలించుకొని, ఒడబరచు = ఒప్పించు; కానిమ్ము = అలాగేనను, ఒట్టుకొని = ప్రమాణముచేసి, ఒడి = తొడలపైన, గుట్టు = రహస్యము, ఊకొను = ఊకొట్టు, సరేనను సంకేతము.
3. చెలరేగు = విజృభించు, మంతనము = ఏకాంతము, ఎనసె = సరిపోలు, అలము = కౌగలించు, ఆక్రమించు, చలము = కంపము, ఈడేరు = నెరవేరు, సేస = అక్షింతలు.

**భావము:** ఓ అలమేలుమంగా! నీమీద స్వామికి ఎంత నమ్మకమో, ఎంత ప్రేమాభిమానాలో కదా! ప్రక్కన కూర్చొని వారికి వక్క పలుకులనందివ్వరాదా!

ఆ స్వామి నిన్ను కౌగలించుకొని, నీ పైట కొంగు పట్టుకొని సమ్మతించి ఇంటికి రావచ్చును గదా! తను నీ బుగ్గలు పుణికి, నిన్ను వేడుకుంటూ ఉండగా, ఉయ్యాల మంచంపై కూర్చొండబెట్టవచ్చుగదా!

స్వామి నిన్ను ఒప్పించి బిగికౌగిలిలో బంధించగా సరేనని ఒప్పుకోవచ్చుగదా! ఆతని పాదపద్మాలు నీవొడిలో ఉంచుతుండగా, సమ్మతిస్తూ గుట్టుగా సరేనని అనవచ్చుగదా!

ఆ స్వామి విజృంభించి ఏకాంతముగా ఉండగా నీవు ఆయన్ను ఆక్రమించి కౌగిలోకి తీసుకొని ఉండిపోరాదా! ఆయన నీకు బాసికము గట్టి మందస్మిత వదనంతో ఉండగా నీ కంపము, భయము ఆందోళనలు తగ్గిపోయాయిగదా! ఇకనైనా ఆయనపై అక్షతలు చల్లి అక్కున చేర్చుకోరాదా!

### 116

**అవతారిక:** స్వామి వారు ఏక కాలంలో వివిధకాంతలతో ఇంటా బయటా త్రిభంగితో కూడడాన్ని గురించిన వర్ణన.

## సాళంగం

ప. ఆయనాయ నుండవయ్య అలసితివి
చేయిమీఁదుగా నన్నుఁ జెనకేవు ఇపుడు ॥పల్లవి॥

1. వెలి నింతలో నొక్క వెలదిఁకాఁగిట నుండి
కలలోన నొకకాంతఁ గలతువు
యెలమి నీయాసోద మేమిచెప్పే దప్పటిని
కొలఁదిమీరఁగ నాకొంగువట్టే విపుడు ॥ఆయనాయ॥

2. శిర సీవలఁ బెట్టుక చెలితో మాటాడుతానే
తెరలో నొక్కతెఁ గూడి కెరలింతువు
గొరబులుగానీ నీగుణము లెట్టు గనేది
సరి నాపై నిదివో సేసలు చల్లే విపుడు ॥ఆయనాయ॥

3. వెలయ భూకాంతను వీఁపునను మోచుకొని
ఆలమేలుమంగ నురమందు మోచేవు
తెలిసి శ్రీ వేంకటేశ దేవిగా నన్నేలితివి
వలెనని ముప్వంకలా వలచితి విపుడు ॥ఆయనాయ॥

**అర్థములు:** ప. ఆయనాయ = చిత్తం, అయినదేదో అయినది, చెనకు = తాకు.

1. వెలి = బయట, వెలది = స్త్రీ, కాగిట = కౌగిట, కలతువు = బాధ, ఎలమి = ఆనందము, యాసోద = గాఢమైన కోరిక, కొలదిమీర = అపరిమితము, లెక్కలేని, కొంగువట్టు = కొంగుపట్టుక=ను.
2. శిరసు = తల, ఈవల = ఇటువైపు, కూడి = కలిసి, కెరలించు = కవ్వించు, గొరబులు = వేషాలు వేయు, సేసలు = అక్షింతలు.
3. వెలయ = ప్రసన్నత, భూకాంత = భూదేవి, వీపున = వెనుకభాగమునందు, ఉరము = వక్షస్థలము, వలెనని = కోరికతో, ముప్వంక = త్రిభంగిమ, నిలిచి యుండు స్త్రీల యొక్క గాని దేహవిలాస వైఖరి, వలచు = కోరుకొను.

**భావము:** ఓ స్వామీ! అయిందేదో అయింది. కాస్త నిదానించవయ్యా! అసలే భామినులతో అలసి సొలసి ఉన్నావు మరలా నా చేతిని మెల్లగా తాకుతున్నావు.

బయట ఒక స్త్రీ కౌగిట్లో ఉండి, కలలో ఇంకో కాంతను కలవరిస్తూ ఉంటావు. హయ్యో! స్వామీ! నీ గాఢమైన కోరికలనేమని వర్ణించాలి చెప్పండి? మరలా ఇప్పుడేమో నా కొంగుపట్టుకుని లాగుతున్నావు.

తల ఇటువైపు ఉంచుకొని ఒక చెలితో ముచ్చట్లాడుతూనే, ముసుగులో ఇంకోక పడతిని కవ్విస్తుంటావు. నీ వేషాలు ఏమని చెప్పను స్వామీ! ఇంతలో ఇటు తిరిగి నాపై అక్షింతలు చల్లుతున్నావు.

ప్రసన్నంగా భూదేవిని వీపున మోస్తూ, అలమేలుమంగను వక్షస్థలంపై ఉంచుకొని, తెలిసి తెలిసి శ్రీదేవిగా నన్నేలుకున్నావు. త్రిభంగిమ చందాన ముగ్గురినీ వలచి వలపించుకొన్నావు స్వామీ!

## 117

**అవతారిక:** స్వామి వారితో అమ్మ అలమేలుమంగమ్మ మదన తాపాన్ని చెలులు వర్ణిస్తున్నారు.

## భైరవి

ప. ఆదరించవయ్యా అంగన నింతటనైనా
పోది వలపులు తలపోయుచున్నది ॥పల్లవి॥

1. చెప్పరాని ప్రియములు చేరి మీకుఁ జెప్పఁగాను

దప్పి దేరీ మోవిమీఁద తరుణికిని
వుప్పతిల్లు సేవ నీకు వొద్దనుండి సేయఁగాను
చిప్పిలఁగఁ జెమరించె చెక్కులెల్లాను ॥ఆదరించ॥

2. నసుపులు చేసుకొని నవ్వు నీతోనవ్వఁగాను
నినుపులై నిగిడీని నిట్టూర్పులు
తనియక వీడెమిచ్చి తగ నిన్ను వేఁడుకోఁగా
వొనరెను పులకలు వొళ్ల నెల్లాను ॥ఆదరించ॥

3. కలికితనాలు చూపి కాఁగిలించు కొనఁగాను
మలసీని కోరికలు మనసునను
అలమేలుమంగ నేలి తట్టై శ్రీ వేంకటేశ
నెలకొనె వేడుకలు నిలువెల్లాను ॥ఆదరించ॥

**అర్థములు:** ప.ఆదరించు = అభిమానించు, అంగన = స్త్రీ, పోది = (ప్రోది కి వ్యవహారికం) రక్షించడం, పోషించడం, వలపులు = ప్రేమలు, తలపోయు = యోచించు.

1. ప్రియములు = మంచి మాటలు, దప్పిదేరు = తనవితీరు, తరుణి = స్త్రీ, ఉప్పతిల్లు = పుట్టు, చిప్పిలగ = పైకి ఉబుకు, చెమరించు = చెమటలుపోయు, చెక్కులు = చెక్కిళ్ళు.
2. నసుపు = అనురాగము, ఇంపు, నినుపు = నిండు, సమృద్ధి, నిగిడీని = వ్యాపించెను, నిట్టూర్పు = ఉచ్ఛ్వాస నిశ్వాసలు, తనియక = తృప్తిచెందక, వీడెము = తాంబూలము, వేదుకొను = ప్రార్థించు, ఒనరు = కలుగు, పులకలు = గగుర్పాటు, వొళ్ళనెల్లాను = శరీరమంతటా.
3. కలికితనము = చక్కదనము; కాగలించు = కౌగలించు; మలయు = వ్యాపించు; నెలకొను = కలుగు, వేడుకల్ = సంతోషము, నిలువెల్లా = పూర్తిగా.

**భావము:** ఓ స్వామీ శ్రీనివాసా! ఆమెపై నికనైనా ప్రేమాదరాభిమానాలు చూపి చేకొనవయ్యా! ఆమె నీ రక్షణకోసం, ప్రేమకోసం తపిస్తున్నది.

చెప్పనలవిగాని మంచికబుర్లన్నీ నీకు చెప్పి చెప్పి ఆమెకు తనివితీరినట్లనిపిస్తున్నది. ఆమెకు పుదుతున్న ప్రేమచే నీకు దగ్గరుండి సేవలు చేస్తూ ఉండగా, పుట్టిన చెమటలు ఆమె చెక్కిలిభాగంపై స్పష్టంగా కనిపిస్తున్నాయి.

అనురాగంతో నీతో నవ్వినప్పుడు ఆమెకు దీర్ఘ నిట్టూర్పులు వస్తున్నవి. ఇంకా తృప్తిచెందక నీకు తాంబూలమిచ్చి నిన్ను ప్రార్థించగా ఆమెకు వళ్ళంతా చెప్పలేని గగుర్పాటు శరీరమంతా వ్యాపించియున్నది.

తన చక్కదనము చూపించి నిన్ను కౌగలించుకోగానే మనసులో కోరికలు విజృంభించి వ్యాపించాయి. ఓ శ్రీవేంకటేశ్వరా! అలమేలుమంగమ్మను ఇదే విధంగా ఏలుకొనగానే ఆమె నిలువెల్లా సంతోషాతిశయం నిండిపోయినది.

## 118

**అవతారిక:** ఏవో పంతాలకు పట్టింపులకు పోతూ అలమేలుమంగమ్మను స్వామి వారు సరిగా పట్టించుకోవడంలేదని చెలులు అమ్మ తరపున మాట్లాడుతున్నారు.

### శోకవరాళి

ప. ఏమి విన్నవించేము యెందాఁకా నీకు
నీమనసునఁ గలట్టు నెలఁతను గావుము ॥పల్లవి॥

1. పంతగాఁడ వౌదువయ్య పడఁతి నింతసేసేవు

ఇంతకీర్తి గట్టుకొంటి విప్పుడు నీవు
మంతనానఁ జెలువెల్లా మంచివాఁడవని నిన్ను
వంతులకుఁ బొగడేరు వాడలవాడలను ॥ఏమి॥

2. బలువుఁడ వౌదువయ్య బయలీఁదించితి వింత
చల మీడేర్చుకొంటివి సాదువలెనె
సులభాననే నీకీసుకృతము చేరెను
నలుగడ నవ్వేరు నమ్మినట్టివారలు ॥ఏమి॥

3. నిరతపుజాణవయ్యా నేఁ డింటికి విచ్చేసి
గరిమఁ గూడితి వీకెఁ గరుణించి
సిరుల శ్రీ వేంకటేశ చేఁతలు చందము లాయె
ఆ(అ?)రుదుగ మెచ్చేరు అందరు నీకతలు ॥ఏమి॥

**అర్థములు:** ప.విన్నవించు = మనవిచేయు, ఎందాకా = ఎంతవరకు, గలట్టు = గలవిధముగా, నెలత = స్త్రీ, కావుము = రక్షించు, క్షేమము జూచు.

1. పంతగాడు = పోటీలు పడేవాడు, సేసేవు = చేస్తున్నావు, మంతనము = ఏకాంతము, చెలువు = అందము, విధము, వంతులు = పనిగట్టుకొని.

2. బలువుడు = బలిమిగలవాడు, బయలీదించు = వట్టి ఆశలు కల్పించు, చలము = చలించు, వణకు, ఈడేర్చు = నెరవేరు, సాదు = మంచివాడు, సులభాన = సులభముగా, సుకృతము = పుణ్యము, నలుగడ = నాలుగు వైపుల.

3. నిరతము = మిక్కిలి ఆసక్తి, జాణ = నేర్పరి, గరిమ = గొప్పదనము, ఈకె = ఈమె, సిరులు = వైభవోపేతమైన, చేతలు = పనులు, చందము = ఆకారము, అరుదుగ = ఆశ్చర్యము, కతలు = కలిపించి చెప్పు మాటలు.

**భావము:** ఓ స్వామీ శ్రీనివాసా! నీకు ఏమని మనవిచేయగలము? ఎన్ని మార్లని మనవి చేయగలము? నీ మనసులో ఉన్నవిధంగానే ఈ రమణి యోగక్షేమాలు చూడు! మీ చిత్తము వచ్చినవిధంగానే చెయ్యండి.

స్వామీ! ఏవో పంతాలకు పట్టింపులకు పోతూ, ఈ లలనామణిని ఈ విధంగా చూస్తున్నావు. ఇంత కీర్తిని మూటగట్టుకున్నవాడవు. అందరూ మంచి గుణవంతుడవని, పనిగట్టుకొని నిన్ను వేనోళ్ళ బొగడుతున్నారు.

స్వామీ! ఎంతో బలిమిని పొందినవాడవు. వింతగా ఈ వనితకు లేనిపోని ఆశలను కలిగించడమెందుకు? నీ పట్టుదలను మాత్రం నేరవేర్చు కొంటున్నావు. మంచి వానివలె అనిపిస్తావు. నీకీ పుణ్యం సులభంగా చేకూరినది. కానీ నలువైపులా నిన్ను నమ్మినవారు నవ్వుతున్నారన్న విషయం మీకు అర్థం కావడంలేదు.

స్వామీ! ఎంత ఆసక్తిగల నేర్పరివయ్యా! ఈరోజు ఎంతో గొప్పమనసుతో ఆమె గృహానికి విచ్చేసి ఆ తరుణీమణిని కరుణించి పొందుకూడావు. ఓ వైభవోన్నతుడవైన శ్రీవేంకటేశ్వరా! నీ పనులు చాలా అబ్బురంగా ఉంటాయయ్యా! అందరూ ఆశ్చర్యంతో నీ చేతలు మెచ్చుకుంటారు స్వామీ!

**విశేషం:** "నలుగురూ నవ్విపోతారు. సిగ్గుచేటు" అని కానిపనెవరైనా చేసినప్పుడు అనడం పరిపాటి. అన్నమయ్య ఈ మాటను "నలుగడ నవ్వేరు నమ్మినట్టివారలు" అని మార్చి ప్రయోగించాడు. అంటే తెలిసినవాళ్ళు ఎవరైనా గమనిస్తే సిగ్గుపోయే విషయమని అన్నమయ్య సూచన.

## 119

**అవతారిక:** స్వామి వారు అమ్మ అలమేలుమంగమ్మపై ఎందుకో అలిగారు. చెలులు అమ్మ పట్ల ప్రేమాభిమానాలు చూపించమని అడుగుతున్నారు.

## ఆహిరి

ప. తెఱవ మొక్కఁగాఁ బిరితియ్యఁ దగవుగాదు
గుఱిగా మన్నించవయ్య కొసరేల ఇఁకను ॥పల్లవి॥

1. పంతమాడ నేరుతువు భావించనేరుతువు
యింతులను లాలించ నెఱఁగవా
అంత నీవు సేసినందు కాకె యలిగివున్నది
సంతము సేసుకోవయ్య చలసేల యిఁకను ॥తెఱవ॥

2. పెనఁగనేరుతువు పెండ్లాడనేరుతువు
అనిశముఁ జనవియ్య నది నేరవా
యెనయ నిన్న రానందు కిటు మాటాడకున్నది
మనసు నమ్మించవయ్య మరఁగేల ఇకను ॥తెఱవ॥

3. కలయఁగనేరుతువు కాఁగిలించనేరుతువు
అలరి యురమున మోయఁగనోపవా
కలికి శ్రీ వేంకటేశ కైవశమై నీకున్నది
సెలవి నవ్వించవయ్య చెప్పనేల ఇఁకను ॥తెఱవ॥

**అర్థములు:** ప. తెఱవ = స్త్రీ, పిరితీయు = వెనుదీయుట; తగవుగాదు = న్యాయముకాదు, గురి = లక్ష్యము, నిశ్చయము, మన్నించు = అనుగ్రహించు, కొసరు = సంకోచము.

1. పంతమాడు = పోటీలు పడు, నేరుతువు = నేర్చుకొందువు, భావించు = తలుచుకొను, లాలించు = బుజ్జగించు, ఎరుగు = తెలియు, ఆకె = ఆమె, అలుగు = కోపించు, సంతము = స్వంతము, తనదిగా, చలసు = పట్టుదల.

2. పెనగు = చుట్టుకొను, పోట్లాడు, అనిశము = ఎల్లప్పుడు, సదా, చనువు = ప్రేమ, ఆదరము, నేరవా = ఎరుగవా?, ఎనయు = పొందు, మరగు = దాగుఽ=ను.

3. కలయగ = కలుసుకోవడం, కాగలించ = కౌగలించుకొనుట, అలరి = సంతోషము, ఓపు = ఓర్చుకొని భరించు, కలికి = మనోజ్ఞమైన స్త్రీ, కైవశము = స్వాధీనము, సెలవి = పెదవిమూల.

**భావము:** స్వామీ శ్రీనివాసా! ఒక స్త్రీ నీకై మొక్కి నిన్ను కోరుకున్నప్పుడు వెనుదీయుట తగునా? నిశ్చయముతో ఆమెను అనుగ్రహించవయ్యా! ఇంకనూ సందేహాలు అనుమానాలు ఎందులకు?

స్వామీ! తమకు పోటీలు పడడం పంతాలకు పోవడమే కాక ఆమెను మనసులో తలచుకోవడమూ తెలుసు. రమణులను బుజ్జగించడం ఎరుగనివాడవా? నీవు ఈ పనులన్నీ చేసినందువల్లనే ఆమె నీపై కోపించి ఉన్నది. ఇంకా పట్టుదలలకు పోకుండా స్వాధీనం చేసుకోవయ్యా!

స్వామీ! నీకు ప్రేమతో చుట్టుకోవడం తెలుసు, వివాహం చేసుకోవడమూ తెలుసు. మరి సదా ఆమెపై ప్రేమాదరాలు చూపించడం తెలియదా చెప్పు? నిన్న పొందుకోరి రానందుకు ఆమె నీపై అలిగి మౌనంగా కూర్చొని ఉన్నది. ఆమె మనసును గెలిచి ఆమెకు నమ్మకం పుట్టించవయ్యా ఇంకా దాగుడుమూతలు ఎందుకు చెప్పు?

స్వామీ! నీకు ఆమెను కలవడమూ తెలుసు కౌగలించుకోవడమూ తెలుసు. ఆమెను సంతోషపెట్టి వక్షస్థలంపై మోయడం తెలిసినవాడివి. ఓ శ్రీవేంకటేశ్వరా అలమేలుమంగమ్మ నీకు స్వాధీనమై ఉన్నది. ఆమెను సంతోషపెట్టి ఆమె పెదవులపై దరహాసాలు కురిపించవయ్యా! ఇంకా మేము నీకివన్నీ చెప్పవలెనా స్వామీ!

**అవతారిక:** అమ్మకు స్వామివారిపై ఉన్న పైన గాఢ అనురక్తిని వివరిస్తున్నారు చెలులు.

## ముఖారి

ప. ఎంతగద్దో నీ యాసోద మిప్పు డీకెకు
చింతదీర మనసులో చిక్కు వాపరాదా ॥పల్లవి॥

1. ననుపున నొకమాఁటు నాతో మాటాడితివంటా
గునిసీ తప్పకచూచి కోమలి నిన్ను
పనివడి నీవాపెతో పచ్చిమాటలెల్లా నాడి
వెనకటిగజరెల్లా విడిపించరాదా ॥ఎంతగద్దో॥

2. సమ్మతి నామోము చూచి సరసమాడితివంటా
వుమ్మడిఁ జన్నుల నొత్తీ నువిద నిన్ను
చిమ్ముచు నీకొనగోర జీరలు మేనెల్లాఁ జేసి
దిమ్మురేఁగినమదము తెలుపఁగరాదా ॥ఎంతగద్దో॥

3. నవ్వుతా నప్పటి నీవు నన్నుఁ గూడితివంటా
రవ్వగా తాఁ గాఁగిలించీ రతికి నిన్ను
యివ్వల శ్రీ వేంకటేశ యెదురుగా నాపెఁ బెట్టి
కువ్వలై నకూటముల గుదిగుచ్చరాదా ॥ఎంతగద్దో॥

**అర్థములు:** ప.గద్దు = కలదు, ఆసోదము = కోరిక, ఈకె = ఈమె, చింత = విచారము, చిక్కు = ఆపద, పాపు = తగ్గించు.

1. అనుపు = ఆజ్ఞ, గునియు = కులుకు, నర్తించు, పనివడి = పనిబెట్టుకొని, పచ్చి = మరుగులేని, గజరు = కోరిక, విడిపించు = తెలియజేయు.
2. సమ్మతి = అంగీకారం, ఉమ్మడి = ఏకకాలమున, ఉవిద = స్త్రీ, చిమ్ము = పొడుచు, జీరలు = మరకలు, మేనుంఎల్లా = శరీరమంతట, దిమ్మురేగు = మత్తును కలిగించు, మదము = గర్వాతిశయం.
3. నవ్వుతా = నవ్వుతూ, కూడు = కలియు, రవ్వ = అల్లరి, కాగిలించి = కౌగలించుకొని, ఇవ్వల = ఇవతల, ఆపె = ఆమె, కువ్వలు = కుప్పలు, కూటములు = సాంగత్యము, గుదిగుచ్చు = పోగుచేయు.

**భావము:** స్వామీ! ఈమెకు నీపైన ఎంత గాఢ అనురక్తి యున్నదో గదా! అవన్నీ ఆమె శరీరంపై స్పష్టంగా కనిపిస్తున్నవి. నీవామె సందేహాలను తొలగించి సమస్యను తగ్గించలేవా?

ఆజ్ఞమేరకు ఒకసారి ప్రియసంభాషణ చేశావు గదా! కులుకులు ఒలకబోస్తూ ఆమె నిన్ను చూచినది. పనిబెట్టుకుని వచ్చి నీవామెతో పచ్చి పచ్చి సంభాషణలను చేశావు కదా! ఆమెకు వెనుక ఉన్న నీ కోరికలను తెలియజేసి వినిపించరాదా!

అంగీకారభావంతో నా ముఖారవిందాన్ని చూసి ఎన్నో సరసాలాడావు కదా! ఏకకాలములో నీ వక్షోజాలను ఒత్తి ఆమె నిన్ను గోళ్ళతో శరీరమంతా గీరలు పడునట్లుగా నఖక్షతాలు చేసినది కదా! మత్తును కలిగించే నీ ప్రేమాతిశయాన్ని చెప్పవచ్చుగదా!

ఆ సమయములో చిరునవ్వులు చిందిస్తూ నీవు నన్ను పొందితివి కదా! అల్లరి చేతలతో కౌగలించుకొని రతిక్రీడాభిలాషియై ఈ ప్రదేశంలో కొలువైన శ్రీవేంకటేశ్వరా! ఎదురుగా నామెను కూర్చుండజేసి కుప్పలు కుప్పలుగా మీ సాంగత్యముల గురించిన కబుర్లను పోగుచేసుకొని చెప్పుకోవచ్చుకదా!

**గమనిక:** 1 వ చరణములో నున్న "విడిపించరాదా" అనే పదం సరైనదిగా తోచడం లేదు. "వినిపించరాదా" అసలైన పదమని భావించడమైనది. వెనకటి కోరికలు వినిపింపమని శ్రీనివాసుని కోరడం అనేభావంతో వ్రాయడం అన్నమయ్య భావం.

**విశేషం**: అన్నమయ్య అనేక శబ్దాలు నిఘంటువులలో కానరావు. ఆయన సర్వస్వతంత్రుడై క్రియలను విశేషణాలను తనకు నచ్చిన

రీతిలో మార్చి వాడడం గమనించవచ్చు. అట్టి శబ్దములలో "ఆసోదము" అనేపదం కూడా బహు చర్చలకు గురైనది. ఆసోదము అనే పదము బ్రౌన్ మిశ్రమ మాండలిక పదకోశంలో మాత్రమే కనిపిస్తున్నది. బ్రౌన్ ఇచ్చిన విశ్రాంతి, సేదదీరడం అనే అర్థాలు అన్నమయ్య సంకీర్తనలలో పొసగవు. అన్నమయ్య కీర్తనలు పరిష్కరించిన సంపుటాల్లో కూడా ఈ పదం రామణీయకత అనే అర్థంతో చెప్పారు. వేటూరి ఆనందమూర్తిగారు వాంఛ, కోరిక అనే అర్థం ఉన్నట్టు తెలిపారు. ఇదే సమంజసంగా తోస్తున్నది.

## 121

**అవతారిక:** స్వామివారు, అలమేలుమంగమ్మ కలిసి చేసే సరస సల్లాపాలాను వర్ణిస్తున్నారు చెలులు.

## హిందోళం

ప. ఇద్దరి వసంతము లీడేరెను
వుద్దండాలు మాని ఇంక నూరకుండరాదా ॥పల్లవి॥

చ.1 కామిను లిందరు నిన్నుఁ గాఁగిటఁ బెట్టుకుండఁగా
నీమీఁదఁ జె(జ?)ల్లెఁ గా పన్నీరు చెలి
యేమరించి విడిపించు కేతెంచి నీవాకె-
కోమలపుఁజన్నులపై కుంకుమ చల్లితివి ॥ఇద్దరి॥

చ.2 వూడిగాలవారిచేత నొంటి నడెవెట్టించి
జాడతోఁ గప్పురధూళి చల్లెఁగా నీపై
వోడక నీవప్పటిని వొడ్డి తప్పించుక కొప్పు
వీడఁగా నాపెమీఁద విరుల వేసితివి ॥ఇద్దరి॥

చ.3 దొమ్మి నడపాలవారి దోమతెర వేయుమని
చిమ్మెఁగా గందము నీపై శ్రీ వేంకటేశ
యెమ్మెతో నీకెఁ గూడి ఇంపులచెమటలకు
కమ్మరఁ గమ్మర నట్టె కస్తూరి నించితివి ॥ఇద్దరి॥

**అర్థములు:** ప. వసంతము = కామ సంబంధ సౌఖ్యము, ఈడేరు = తీరు, ఉద్దండము = సాహసము.

1. కామినులు = మోహించినవారు, కాగిట = కౌగిట; బెట్టుకుండు = పెటుకొని ఉండుట, ఏమరించి = పరధ్యానము, ఏతెంచి = వచ్చి, ఆకె = ఆమె, కోమలము = మృదువైన, చన్నులు = వక్షోజములు.
2. ఊడిగము = సేవ, అడెవెట్టు = ప్రయాసపెట్టు, కప్పురధూళి = కర్పూరము పొడి, ఆపె = ఆమె, విరులు = కేశసముదాయము.
3. దొమ్మి = సందడి, నడపాలవారు = నడిచేటివారు, చిమ్ము = వ్యాపించు, గందము = గంధము; ఎమ్మె = విలాసము, ఈకె = ఈమె, కూడి = కలసి, ఇంపుల చెమటలు = ఇష్టంతో వచ్చే స్వేదము, కమ్మర = చుట్టుక=ను, ఇంచితివి = ఇచ్చితివి.

**భావము:** అయ్యా! మీ ఇష్టాలు, కోరికలు నెరవేరాయి కదా! ఇప్పటినుండైనా పట్టుదలలు, సాహసములు మాని ఊరకుండవచ్చుగదా!

నిన్ను మోహించిన కాంతలు నిన్ను కౌగిట బెట్టుకుని ఉండగా, చెలి నీపై పన్నీరు చల్లగా, పరధ్యానం నుండి తేరుకుని వారి కౌగిలి విడిపించుకుని శీఘ్రముగా విచ్చేసి ఆమె మృదువైన వక్షోజములపై కుంకుమ చల్లినావు.

నీకు అనేక సేవలుచేసే భామినులను దేహాలను ప్రయాసపెట్టించి, ఆ విషయం గ్రహించిన ఇల్లాలు నీపై కస్తూరిపొడిని చల్లగా, తమరు ఏమాత్రం తగ్గకుండా తప్పించుకునే సమయంలో నీ తలకొప్పు వూడిపడగా ఆ కేశములను ఆమెపై సుతారంగా తాకించావు.

నీతో సరస సందడులు చేసే అంగనామణులతో దోమతెర వేయమని చెప్పగా, ఆమె నీపై గంధము చిమ్మగా ఓ శ్రీవెంకటేశ్వరా! విలాస బంధురంగా ఆమెను పొంది, ఆ ఇష్టమైన కార్యాలకు చెమటలు దేహమంతా నిండిపోగా, చుట్టుకొని, పొదవుకొని కస్తూరిని

పూశావు.

## 122

**అవతారిక:** స్వామివారు ఏదో కార్యంపై వెళ్ళి అలసి సొలసి ఇంటికి చేరుకున్నారు. వారికి సేవలు చేయమని చెలులు అమ్మను వేడుకుంటున్నారు.

### దేవగాంధారి

ప. బడలెను పానుపు పరచరే
అడుగరే యిదియేమియని చెలులు ॥పల్లవి॥

1. చెలపచెమటలు మైఁ జిప్పిలీని
అలసి వచ్చినాఁడు నేఁడదే విభుఁడు
చలువగాఁ గప్రము పైఁ జల్లఁగదరే
వెలయు సురటిఁగొని విసరరే ॥బడలెను॥

2. పొనుగు నిట్టూరుపుల బుసకొట్టీని
పనిసేసి వచ్చినాఁ డప్పటి విభుఁడు
తనివారఁ చల్లనిగందము మెత్తరే
నినువుగఁ బన్నీరు నించరే ॥బడలెను॥

3. దాఁగక దప్పి మోవులు దడిపీని
కాఁగి వచ్చినాఁడు శ్రీవేంకటవిభుఁడు
పొఁగి వాసించినబాగా లియ్యరే
చేఁగదేర నన్ను నేలె సేవలేల్లాఁ జేయరే ॥బడలెను॥

**అర్థములు:** ప.బడలిక = అలసట, పానుపు = పడక, పరచరే = చినీచీనాంబరములు కప్పుట.

1. చెలప చెమటలు = కనిపించే చెమటలు, చిప్పిలు = ఉబుకు, నేడు = ఈరోజు, చలువ = ప్రేమాతిశయము, కప్రము = కర్పూరము, వెలయు = ప్రకాశించు, సురటి = విసనకర్ర, విసరు = గాలితగులునట్లు వీచుట.
2. పొనుగు = పొట్టి, నిస్తేజము, బుసకొట్టు = చిన్న శబ్దముతో వచ్చు ఉచ్ఛ్వాస నిశ్శ్వాసలు, తనివార = తృప్తి దీర, మెత్తు = అద్దు, ఇనువు = అనుకూలమైన రీతిలో, ఇంచు = ఇచ్చు.
3. దాగక = మరుగులేని, దప్పిమోవి = దాహముతో ఉన్న ముఖము, తడిపినీ = మంచినీరు ఇచ్చుడీ, కాగి = తపించి, పొగి = వసతి, వాసించు = మంచి గుభాళింపు, బాగాలు = వక్కపొడి, చేగదీరు = బలిమిగ.

**భావము:** ఓ చెలులారా! స్వామి బాగా అలసి సొలసి వచ్చియున్నాడు. విషయం ఏమిటో అడిగి తెలుసుకొని, చినీ చీనాంబరములు కప్పి, పడక సిద్ధంచేయండి.

స్వామి వారికి శరీరంపై స్పష్టంగా కనిపిస్తున్న స్వేద బిందువులు చూశారా! ఏదో కార్యమై వెళ్ళిన స్వామి అలసి వచ్చినట్లున్నాడు. ప్రేమాతిశయంగా పడకపై కర్పూర పొడిని చల్లండి. ఒక మంచి విసనకర్రతో బాగా గాలితగిలేట్టు విసరండి.

స్వామివారికి చిరుసవ్వడితో వచ్చే ఉచ్ఛ్వాస నిశ్శ్వాసలు గమనించారటే! ఏదో పని మీద వెళ్ళివచ్చిన విభుని శరీరంపై గంధపు పూత పూయండి. అనుకూలమైన తీరులో పన్నీరు ఇవ్వండి.

ముఖసౌందర్యంపై బహిర్గతమవుతున్న దాహార్తిని గమనించారా! తాపముతో వచ్చిన విభుడు శ్రీవేంకటేశ్వరునికి చల్లని మంచినీరు అందించండి. వసతిని చేకూర్చి మంచి సువాసనతో నున్న వక్కపలుకులు అందించండి. స్వామి సేదతీరి నన్ను సుముఖంగా ఏలుకునేవిధంగా సేవలందించండి.

## 123

**అవతారిక:** స్వామివారికి అమ్మ అలమేలుమంగమ్మపై ఉన్న ప్రేమాతిశయాన్ని చెలులు వర్ణిస్తున్నారు.

### పళవంజరం

ప. ఎంత వేడుకకాఁడవో యీపెకు నీవు
అంతరంగమెల్లా మాకు నానతీవయ్యా ॥పల్లవి॥

1. కాంతకానుక యంత కనుపట్టి వుండెనో
అంతటిలోఁ చేయిచాఁచె వందరిలోన
బంతి నాపెసరస మేపాటి మేన నంటెనో
వింతయి మోముకళల విఱ్ఱవీఁగేవు ॥ఎంత॥

2. చెలియపలుకు లెంత చెవిసోఁకి వుండెనో
అలరి యప్పటి మాఁట లడిగేవు
మలసి యాపెచూపు మర్మము లెట్లంటెనో
తలపోసి రతులకుఁ దమకించేవు ॥ఎంత॥

3. మగువవలపు లెంత మనసునఁ బట్టెనో
నగి నగి సారెసారె నంటుచూపేవు
జిగి నన్నుఁ గూడితివి శ్రీ వేంకటేశ నేఁడు
పొగడి యాపెను నాతోఁ బురుఁడు వెట్టేవు ॥ఎంత॥

**అర్థములు:** ప.వేడుకకాడు = కుతూహలపరుడు, ఈపె = ఈమె, అంతరంగము = హృదయములో ఉన్న మాట, ఆనతి = సెలవు.

1. కాంతకానుక = ఇష్టసఖి ఇచ్చే బహుమానము, కనుపట్టి = గోచరమగు, అంతటిలో = అంతలోనే, బంతి = వరుస, ఆపె = ఆమె, సరస = చెంత, మేననంటు = శరీరమునకు దగులు, వింత = ఆశ్చర్యము, మోముకళలు = ముఖకాంతులు, విఱ్ఱవీగు = అతిశయించు.
2. చెవిసోకు = తాకు, అలరి = సంతోషపడు, అప్పటి = పూర్వపు, మలసి = వ్యాపించు, ఆపె = ఆమె, మరము = రహస్యము, తలపోయు = ఆలోచించి, విచారించి, తమకించు = త్వరపడు.
3. నగి = నవ్వి, సారె = మాటి మాటికి, అంటు = కూడిక, జిగి = చల్లని వెలుగు, కూడితివి = పొందితివి, పొగడి = మెచ్చుకొని, ఆపె = ఆమె, పురుడు = ప్రేమవిషయంలో సమత్వము జూపడం.

**భావము:** ఓ స్వామీ! ఈమె పట్ల కుతూహలం చూపిస్తున్న నీవు ఎంత సరదా పురుషుడవయ్యా! అసలు నీ అంతరంగంలో ఉన్న విషయమేమిటో మాకు కాస్త సెలవివ్వరాదా?

ఆ కాంత ఇచ్చే బహుమానాలు నిన్ను ఎంత ఆనందింపజేస్తున్నాయో కదా! అందరిలో ఏమాత్రం మొహమాటం బిడియము లేకుండా చేతులు చాస్తున్నావు. ఆమె సరసన నీకు ఎలాంటి మధురోహలు మనసులో మెదులుతున్నాయో! ఆ ముఖకాంతులన్నీ మొహంపై కనబడుతూ అతిశయించి దర్శనమిస్తున్నావు.

ఆ చెలి మాట్లాడే మాటలు మీకు ఎంత కర్ణామృతముగా తోచుచున్నవో కదా! సంతోషముతో పూర్వపు వ్యవహారాలన్నీ గుర్తుకు తెచ్చుకుంటున్నావు. నీపై వ్యాపించి ఆమె చూసే చూపులు ఎంత మధురంగా ఉన్నాయో ఎన్నెన్ని రహస్యాలను వివరిస్తున్నాయో! వాటినన్నింటినీ ఆలోచించించి ఆలోచించి రతులకు త్వరపడుతున్నావు.

ఆ మగువ ప్రేమ ఎంత మనసున నాటుకున్నదో, హర్షాతిశయంతో ఆమె వంకే మాటిమాటికీ చూస్తున్నావు. ఓ శ్రీవేంకటేశ్వరా! నేడు నన్ను ఈ చల్లని వెలుగులో కూడితివి. నన్ను మెచ్చుకుంటూ ఆమెతో సరిసమానమైన ప్రేమను నాపై కురిపిస్తున్నావు.

## 124

**అవతారిక:** స్వామివారికి చెలులు సుద్దులు చెప్తున్నారు.

### సోమరాగం

ప. మాతో నేమి చెప్పేవు మాపు దాఁకాను
యీ తరవాతనే నీవు యియ్యవయ్య చనవు ॥పల్లవి॥

1. అనరాదుగాక నిన్ను ఆపెయెదుటనే నీవు
ననిచి వేరొకతెతో నవ్వనేఁటికి
మనసిచ్చి యందుకుఁగా మాటలాడదాయ నేమో
పెనఁగి చేవట్టితీసి పెట్టవయ్య విడెము ॥మాతో॥

2. అట్టు సేయరాదుగాక నెట్టవ సతిచెలితో-
నట్టె నీవు జూజము లాడవచ్చునా
ఇట్టె యిందుకుఁగానే ఇంటిలోనే వున్నదేమో
గుట్టున వద్దఁ గూచుండి కూడవయ్య కాఁగిట ॥మాతో॥

3. తప్పు మోపరాదుగాక తరుణి నిట్టె కూడి
కప్పులు దేరఁగ మోవి గంటి సేతురా
చిప్పిలి యిందుకుఁగాను సిగ్గుపడి వున్నదేమో
అప్పటి శ్రీ వేంకటేశ చెప్పవయ్య ప్రియము ॥మాతో॥

**అర్థములు:** ప. మాపు = సాయంకాలము, రాత్రి, చనవు = ప్రేమ, అనురాగం.

1. ఆపె = ఆమె, అనిచి = ప్రీతితో, ఏటికి = ఎందుకు, పెనగి = చుటుకొని, చేవట్టి = గ్రహించి, విడెము = తాంబూలము.
2. అట్టుసేయు = అచ్చుకెక్కు, నెట్టవ = తప్పక, అట్టె = అదేవిధముగ, జూజము = ద్యూతము, పందెము, గుట్టున = రహస్యముగా, కూచుండి = కూర్చొని, కూడు = పొందు, కాగిట = కౌగిట.
3. మోపు = నిందవేయు, కప్పులు = రెండువైపుల, గంటి = గాయము, చిప్పిలి = ఉబికి.

**భావము:** ఓ స్వామీ! మాతో ఏమి కబుర్లు చెబుతావులే పొద్దుగూకులూను ! ఆ తరువాతనే ఆమెకు ప్రేమ అనురాగం పంచీయవయ్యా!

స్వామీ! మళ్ళీ అంటే నీకు కోపం వస్తుందేమో కానీ, ఆమె ఎదురుగా ఉండగానే ప్రేమగా ఇంకొక రమణితో హాస్యాలాడడమెందుకు? నీకు మనసిచ్చిన స్త్రీగా ఆ కారణం వల్లనే మాట్లాడడం లేదేమో స్వామీ! ఆమెను చుట్టుకొని తాంబూలము అందివ్వవయ్యా!

స్వామీ! ఇలా రచ్చకెక్కవచ్చునా? ఆ చెలితో నీవు జూదమాడదగునా? ఈ కారణంవల్లనే ఆయమ్మ ఇంటివద్దనే ఉండిపోయిందేమో! వెంటనే వెళ్ళి రహస్యంగా ఆమెను కూడి కౌగలించుకోవయ్యా!

అమ్మ మీద ఇలా అకారణంగా నిందలు మోపవచ్చునా? అమ్మను కూడిన సమయములో మోవికిరువైపులా గాయమయేట్టు దంతక్షతాలు చేస్తారా? శ్రీవేంకటేశ్వరా! ఆ విషయమై ఆమె సిగ్గుపడి కూర్చున్నదేమో! కాస్త గమనించి వెంటనే వెళ్ళి ఆమెను కూడి ప్రియభాషణముతో ఆమెను లాలించవయ్యా!

## 125

**అవతారిక:** స్వామివారు అనేకమంది రమణులతో చేస్తున్న సరసల్లాపాలను మనోహరంగా వర్ణిస్తున్నారు చెలులు.

### వరాళి

ప. ఒక్కరు నోచిన నోము వొకరికి ఫలియించె

నెక్కొని చూడ నిద్దరు నీదేవుళ్లే కారా ॥పల్లవి॥

1. మరిగి మీరిద్దరును మంచముపై నుండఁగాను
తరుణి తొంగిచూచి తలవంచెను
సరసనున్న యాపెకే చాల నీవు వలతువు
నిరతి వెలినున్నాకె నీకే వలచును ॥ఒక్కరు॥

2. కందువ మీ రిద్దరును కాఁగిలించుకుండఁగాను
చెంది వేరొకతె చూచి సిగ్గుపడెను
అంది ఆయాలంటినాపె కటు నీవు చిక్కితివి
విందువచ్చినాకె నీవేడుకకుఁ జె (జి,జో?)క్కెను ॥ఒక్కరు॥

3. పొంచి మీ రిద్దరు మోవిబువ్వపుతేనె లానఁగా
పొంచుకున్న యాకె తాను పొత్తుగూడెను
యెంచఁగ శ్రీ వేంకటేశ ఇచ్చకుఁడ వొకతెకు
నించి వేరొక్కతెయైతే నీఇచ్చలోనిది ॥ఒక్కరు॥

**అర్థములు:** ప. నోచు = వ్రతమాచరించు, ఫలియించు = నెరవేరు, ఎక్కొను = అతిశయించు; దేవుళ్ళు = దేవేరులు, పట్టపురాణులు.

1. మరుగు = అలవాటు, సరస = చెంత, ఆపె = ఆకె, వలతువు = ప్రేమను చూపెదవు, నిరతి = అధికాసక్తి, వెలి = బయట, ఆకె = ఆమె.

2. కందువ = ఏకాంతము, కాగిలించు = కౌగలించు, చెందు = కలుగు, ఆయములు = రహస్యము, ఆపె = ఆమె, ఆకె = ఆమె, వేడుక = వినోదము, కోరిక.

3. పొంచు = చాటున దాగు, మోవిబువ్వపుతేనె = అధరామృతము, పొంచుకున్న = దాగియున్న, ఆకె = ఆమె, పొత్తు = ఉమ్మడిగా కలియుట, ఎంచగ = లెక్కించి చూడగా, ఇచ్చకుడు = ప్రియభాషణలచే మోసం చేసేవాడు, ఒకతె = ఒకస్త్రీ, వేరొక్కతె = మరొక స్త్రీ, ఇచ్చ = ఇష్టమైనది.

**భావము:** ఓ స్వామీ! ఒకరు వ్రతమాచరించగా మరొకరికి నోము ఫలించినట్లైనది కదా! అతిశయించి గమనిస్తే ఇద్దరూ నీ దేవేరులే కదా!

అలవాటు మేరకు మీ ఇద్దరూ పట్టు మంచముపై ఉండగా, మరొక దేవేరి తొంగి చూచి సిగ్గుతో తలవంచుకొన్నది. నీ చెంతనున్న ఆమెకే నీవు అధిక ప్రేమను చూపిస్తావు. అధికాసక్తితో నున్న వేరొక స్త్రీ నిన్నే ప్రాణప్రదంగా భావించేను.

ఏకాంతములో మీ ఇద్దరూ కౌగిలిలో ఉండగా, చూసిన మరొకతె సిగ్గుపడినది. నీ ప్రాణాస్పదమైన ఆమెకు నీవు చిక్కియున్నావు. విందుకు వచ్చినామె నీ సంతోషానికి పట్టుబడినది.

చాటున దాగియుండి మీ ఇద్దరూ అధరామృతపానం చేస్తూ ఉండగా, దాగియున్న ఆమెకూడా మీతో పొత్తు కలిసినది. ఇదంతా చూసినట్లైటే ఓ శ్రీవేంకటేశ్వరా! ప్రియభాషణములతో మోసపుచ్చుతూ, ప్రీతిపాత్రమైనావు ఒకతెకు, మరొకతె అయినట్లైతే ఇష్టా ఇష్టాలమీద ఆధారపడి ఉంటుంది.

## 126

**అవతారిక:** చెలులు స్వామివారిపై అలమేలుమంగమ్మకు గల భక్తి ప్రపత్తులను, ప్రేమను స్తుతిస్తూ ఆమెకు సంతోషం కలిగించేవిధంగా ప్రవర్తించమని చెప్తున్నారు.

### సామంతం

ప. అంత మనసునఁ గద్దు ఆపెకు నీమీఁది బత్తి

సంతోస మప్పటిఁ జేసీ చనవియ్యవయ్యా ॥పల్లవి॥

1. ఘనమైననీదుచక్కనిరూపు చూచిచూచి
తనివి దీర దెంతైనాఁ దరుణికిని
పనివడి నీవలెనే బంగారుపతిమఁ జేసి
వెనుకొ నాపెమోమున వేలఁగట్టవయ్యా ॥అంత॥

2. సరసములాడి నీతో సారెకు నవ్వులు నవ్వీ
మరిగియున్నది నీ పై మచ్చికలెల్లా
సరుసఁగూచుండి నీవు చవులుగాఁ జెనకుచు
కెరలించి కెరలించి గిలిగించవయ్యా ॥అంత॥

3. ముట్టి నీపాదము లురమున నిడుక వొత్తుచు
యిట్టె పాయదు శ్రీ వేంకటేశ నిన్నును
నెట్టన నన్నేలితివి నీవింకా సొమ్ములు సేసి
మెట్టి నీపాదుకలాపెమెడఁ గట్టవయ్యా ॥అంత॥

**అర్థములు:** ప. గద్దు = గలదు, ఆపె = ఆమె, బత్తి = భక్తి, అప్పటి = మరల, చనవు = ప్రేమ, అనురాగం.

1. ఘనము = గొప్పదనము, తనివి = తృప్తి, పనివడి = పనిగట్టుకొని, పతిమ = విగ్రహము, వెనుకొ = వెంబడించి, ఆపె = ఆమె, మోమున = మొహముపై, వేలగట్టు = వ్రేలాడదీయు.
2. సరసము = ఉల్లాసము, సారెకు = మాటిమాటికి, మరిగి = అలవాటై, మచ్చిక = ఆసక్తి, మోహము, సరుస = చెంత, చవులు = ముత్యపు కాంతి, చెనకు = తాకు, కెరలించు = కవ్వించు, గిలిగించు = గిలిగింతలు కలుగజేయు.
3. ముట్టి = తాకి, ఉరము = వక్షస్థలము, ఇడుకొని = ఉంచుకొని, వత్తుచు = నొక్కుచు, ఇట్టె = ఈ విధంగా, పాయదు = వదలిపెట్టదు, నెట్టన = అనివార్యముగా, మెట్టి = నడిపించు, ఆపె = ఆమె, మెడగట్టు = మెడలో వేయు.

**భావము:** ఓ స్వామీ! ఆ అమ్మ మనసంతా నిన్నే నింపుకొని నీపై భక్తి ప్రపత్తులు పెంచుకొని యున్నది. ఆమెకు నీ ప్రేమను అందించి సంతోషము కలుగజేయవయ్యా!

నీ దివ్యసుందర దేహాన్ని కన్నులారా నిరంతరం చూసినప్పటికి అమ్మకు తనివి తీరడంలేదు. నీవు పనిగట్టుకొని ఒక బంగారు బొమ్మను చేసి ఆమె సదా వీక్షించే విధంగా వేలాడగట్టవయ్యా!

నీతో సరససంభాషణలు చేసి మాటిమాటికి నవ్వులు రువ్వుతూ, నీపై ఆసక్తితో నీ ప్రేమకు అలవాటై యున్నది. ఆమె చెంత కూర్చొని, నీ ప్రేమాదరాలను చూపిస్తూ, కవ్వించి కవ్వించి ఆమెకు గిలిగింతలు కలించవయ్యా స్వామీ!

ఓ శ్రీవేంకటేశ్వరా! ఆ అలమేలుమంగమ్మ నీ దివ్య పాదాలను పట్టుకొని తన ఒడిలో ఉంచుకొని ప్రేమగా వత్తుచూ, నిన్నెన్నటికి వదలనేరదయ్యా! నన్నేలుకుంటున్న ఓ శ్రీనివాసా! నీవు ఆభరణాలను అనేకం చేయించి, ఆమెను నడిపిస్తూ నీ దివ్య పాదుకలను ఆమె మెడలో కట్టవయ్యా! ఆ అమ్మ మురిసిపోతుంది.

## 127

**అవతారిక:** స్వామివారు దక్షిణనాయకుడు కావడంతో అమ్మ అలిగి నీకు ఎవరిమీద నిజమైన ప్రేమ ఉన్నదో తెలియజేయమంటున్నది.

### శుద్ధదేశి

ప. ఏది నిజమని వుందు మెరుఁగించవయ్య మాకు
మేదించి వలపు లిరుమేలాఁ బూసేవు ॥పల్లవి॥

1. విన్నపము నేఁజేయఁగ వీనులనే వింటివి

కన్నుల నాపెఁ జూచేవు కమ్మటి నీవు
చన్నులనేనొత్తితేను సరిఁ బులకించేవు
సన్న లాపెకు జేసేవు సారెసారె నిపుడు ॥ఏది॥

2. మాటలు నే నాడఁగాను మచ్చిక నూఁకొంటివి
గాఁటాన మోవి చూపేవు కడు నాపెకు
యీటున నే నవ్వితేను యిచ్చగించే విందుకు
పాటించి మన సాపెపై నిలిపేవు ॥ఏది॥

3. పిలిచితే వచ్చితి ప్రియాన మా యింటికి
యెలమి నాసపడేవు ఇంకా నాపెకు
కలసితి విటు శ్రీ వేంకటేశ్వర నన్నును
తొలుతటిపొందు లాపెతోఁ బొదిపేవు ॥ఏది॥

**అర్థములు:** ప. ఎరిగించు = తెలుపు, మేదించి = మర్దించు, ఇరుమేల = రెండుప్రక్కల, పూసేవు = అలదుకొను.

1. వీనులు = చెవులు, ఆపె = ఆమె, కమ్మటి = మరల, పులకించు = గగుర్పు కలుగు, సన్నలు = సైగలు, సారె సారె = మాటి మాటికి.
2. మచ్చిక = ఆసక్తి, ఊకొను = ఊకొట్టి విను, గాటము = చురుకైన,మోవి = మొహము, ఆపె = ఆమె, ఈటు = పరిమితి, ఆపె = ఆమె, నిలుపు = స్థిరముగా ఉంచు.
3. ప్రియాన = ప్రేమతో, ఎలమి = సంతోషము, ఆసపడు = మక్కువ చూపించు, ఆపె = ఆమె, తొలుతటి = ప్రథమముగా, పొందు = కలయిక, ఆపె = ఆమె, పొదుపు = ఎక్కువజేయు.

**భావము:** స్వామీ! ఏది నిజమని నమ్మమంటావు? మాకు కాస్తా తెలిసేవిధంగా చెప్పవయ్యా! పూనుకొని నీ ప్రేమను మాత్రం ఇరువైపులా జోడు గుర్రాల స్వారి లాగా సాగిస్తున్నావు.

నేనేదైనా విన్నపము జేసినట్లైతే చెవులారా వింటావు. నీ మధురమైన దృష్టి మాత్రం మరల ఆమెపై ఉంటుంది. నీ వక్షోజాన్ని నేను వత్తినప్పుడు పులకింతలు పొందుతావు. కానీ సైగలు మాత్రం మాటి మాటికి ఆమెకు చేస్తూ ఉంటావు.

నేనేదైనా మాట్లాడినప్పుడు ఆసక్తిగా ఊకొడుతూ వింటావు. నీ చురుకైన ముఖారవిందం మాత్రం ఆమె వైపే చూస్తూ ఉంటుంది. నేను పరవశంతో నవ్వినప్పుడు నాతో విందారగించడానికి సిద్ధమవుతావు. నీ మనసు మాత్రం ఆమె పైనే ఉంటుంది.

నేను ఎంతో ప్రీతితో ప్రేమగా పిలవగా మా గృహానికి వచ్చి పావనం చేశావు. ఇంకా ఎందుకు ఆమెపై మోహం చూపిస్తావు? ఓ శ్రీవేంకటేశ్వరా! ఈవిధంగా ఇటు నన్ను పొందుకూడావు కానీ, తొలి పొందులు ఆమెతోనే ఎక్కువగా పొందావన్న విషయం నాకు తెలుసు సుమా!

## 128

**అవతారిక:** స్వామివారు ఏవిధంగా మాయమాటలు చెప్పి నమ్మిస్తాడో తెలిసికూడా, అలమేలుమంగమ్మ అన్నీ యోచించి తెలిసికొని కూడా, స్వామివారికై తపిస్తున్నదని చెలులు స్వామికి నివేదించే సన్నివేశం.

### పాడి

ప. ఎట్టు నమ్మించేవో నీవే యెరుఁగుదువు
ఇట్టె అన్నిపనులు నెంచుకొని వున్నది ॥పల్లవి॥

1. మనసు రంజిల్ల నీతో మాటలాడెఁగాని చెలి
వెనుకటిసుద్దులెల్లా వినియున్నది

యెనసి వేడుకతో నీ కిచ్చమాడీఁ గాని
అనుగు నీ గుణములు అరసే నునున్నది ॥ఎట్టు॥

2. సెలవి నవ్వుదెచ్చుక చేరి నీతో నవ్వేఁగాని
కలికి నీచేఁతలెల్లాఁ గని వున్నది
వలచినదై నీతో వాదించఁజాలదు గాని
సొలసి నిన్నేకతాన సోదించే ననున్నది ॥ఎట్టు॥

3. ఆసలు మానఁగలేక అట్టెనిన్నుఁ గూడెఁగాని
బాసలు నేయించుకొన్నఁబరగున్నది
లాసి శ్రీ వేంకటేశ నీలాగు దెలిసెఁగావి
మూసినముత్యమై నీ ముంగిటనే వున్నది ॥ఎట్టు॥

**అర్థములు:** ప. ఎట్టు = ఏవిధముగా, ఇట్టె = ఈవిధంగా, ఎంచుకొని = యోచించి.

1. రంజిల్లు = అనురాగమగు, సుద్దులు = మంచి మాటలు, ఎనసి = అంగీకరించు, వేడుక = సంతోషము, ఇచ్చమాడి = ఇష్టమైన మాటలను చెప్పు, అనుగు = ఇంపు, అరసి = విచారించి తెలుసుకోవడం.
2. సెలవినవ్వు = పెదవి మూలగా నవ్వడం, కలికి = స్త్రీ, కని = చూసి, సొలయు = వైముఖ్యత, ఏకతాన = అనన్య చిత్త, సోదించు =పరీక్షించు.
3. ఆశలు = కోరికలు, కూడు = కలియు, బాసలు = ఒట్లు, పరగు = ప్రవర్తించు, లాసి = పెద్దగా, కావి = ఎర్రనైన, మూసిన ముత్యము = అణిగిమణిగి యుండు, ముంగిట = ఇంటిలోపలి భాగము.

**భావము:** ఓ శ్రీనివాసా! స్వామీ! ఏవిధంగా నమ్మిస్తావో మాయమాటలు చెప్తావో, అమ్మ అలమేలుమంగమ్మ అన్నీ యోచించి తెలిసికొనే ఉన్నది.

తన మనసులోని అనురాగం చేత నీతో మాట్లాడుతున్నది కాని, ఆమె నీ వెనుకటి ఘనకార్యాలను వినే వున్నది. అంగీకరించి నీతో సంతోషముతో ప్రియవచనాలు పలుకుతూ ఉన్నది కానీ, ఇంపైన నీ గుణగణములు విచారించి ఎప్పటికప్పుడు తెలుసుకుంటూనే ఉన్నది.

పెదవి మూలగా నవ్వులు రువ్వుతూ నీతో మాట్లాడుతూ ఉన్నది కానీ, ఆయమ నీ పనులన్నీ కళ్ళారా చూస్తూనే ఉన్నది. నిన్ను అమితంగా ప్రేమించి యుండడం వలన నీతో ఏమీ వాదించకుండా మౌనం వహించి యున్నది కానీ, నిన్ను అనన్య చిత్తంతో, త్రికరణశుద్ధిగా కోరుకుంటూ నిన్ను సకల పరీక్షలు చేస్తూనే ఉన్నది.

నీతో మాట్లాడడం ఇష్టంలేకపోయినా నిన్ను ప్రేమాతిశయంతో మానకుండా అలాగే నిన్ను పొందుకూడి యున్నది. ఓ శ్రీవేంకటేశ్వరా! ప్రసిద్ధికెక్కిన నీ తీరుతెన్నులన్నీ గ్రహించే ఉన్నది. ఆ అమ్మ మూసిన ముత్యం లాగా అణిగి మణిగి ప్రకాశరహితమై ఇంటిలోన నీ కై తపించుచున్నది.

## 129

**అవతారిక:** స్వామివారు అన్య కాంతలను గూడి వచ్చి సాక్ష్యాధారాలతో దొరికిపోయాక, అమ్మ అలమేలుమంగమ్మ నిలదీసే సన్నివేశం.

### బౌళి

ప. ఇంకానేల దాఁచేవు యెదురుగుదురుగాను
పొంకపు నీ గుణములు యీ బూమెల్లా నెఱఁగదా ॥పల్లవి॥

1. వుంకించి నిన్నిందరిలో వొడివట్టి తీసితేను
జంకించి వద్దని యేల సన్నసేసేవు
కుంకుమచన్నులచొప్పు గురిగా నీ మేన నంటె
లంకెల నీసుద్దులు యీలలన లెరఁగరా ॥ఇంకానేల॥

2. జల జాక్షులనుఁ గూడ జాణవని పొగడితే
నెలిమి నోరేల మూసే వింతలోనను
పలుసోఁకులమచ్చము పట్టిఇయ్యఁదొడఁగెను
వొళవై ననీవోజు యీవొద్దివా రెరఁగరా ॥ఇంకానేల॥

3. సొరది నీనాసంది చుట్టరికాలు చెప్పితే-
నెరవు నేయకుమని యేల మొక్కేవు
నిరతి శ్రీ వేంకటేశ నిలువెల్లాఁబచ్చిదేరె
పొరి నీపొందు లిరుగుపొరుగు లెఱఁగరా ॥ఇంకానేల॥

**అర్థములు:** ప.ఎదురుగుదురు = ఎదురుగా, కుదురు = అమరు, పొంకము = పొందిక, బూమి-ఎల్లా = బూమెల్లా = ఈ భూ ప్రపంచం మొత్తం, ఎరుగదా? = తెలియదా?

1. వుంకించు = పైకెగయు, భయపెట్టు, వొడి = తొడపైభాగము, వట్టి = పట్టుకొని, జంకించు = భయపెట్టు, సన్న = సైగ, కుంకుమ చన్నులు = కుంకుమ యద్దిన వక్షోజములు, చొప్పు = విధము, గురిగా = సరాసరి, మేన = శరీరంపై, అంటె = తగిలెను, లంకెలు = సంబంధములు, సుద్దులు = మంచి మాటలు, లలన = స్త్రీ.
2. జలజాక్షులు = తామరలవంటి కన్నులుగల స్త్రీ, కూడ = పొందగా, జాణ = నేర్పరి, ఎలిమి = సంతోషము, మచ్చము = గుర్తు, ఒళవు = సులభముగా అటునిటు తిరుగు, ఓజు = శోభ, ఒద్దివారు = చెంతనున్నవారు.
3. సొరది = వ్యాకులత, సంది చుట్టరికాలు = వీధి చుట్టరికము, నెరవు = తగవు, నిరతి = మిక్కిలి ఆసక్తి, పచ్చిదేరు = మరుగులేని విధము, పొరి = క్రమముగా.

**భావము:** ఓ స్వామీ! ఎదురుగుండా అన్నీ సాక్ష్యాలతో కనిపిస్తూ ఉండగా, ఇంకా ఈ దాపరికాలెందుకు? పొందికైన నీ సుగుణాలన్నీ ఈ భూప్రపంచమంతా ఎరిగినదే కదా!

నలుగురిలో నీవు అల్లరి పనులు చేసినప్పుడు వొడిపట్టుకుంటే, నన్ను కళ్ళతో అదిరిస్తూ వద్దు వద్దు అని ఎందుకు చెప్తున్నావు? ఏ లలనదో మరి! చన్నులకున్న కుంకుమ నీ శరీరానికంటి కనిపిస్తూ ఉన్నది. నీ ఈ చాటుమాటు వ్యవహారాలన్నీ ఈ అంగనామణులెరగరా చెప్పు?

తామరకన్నులవంటి అందమైన కనులు గల స్త్రీలను పొందినప్పుడు నువ్వు గొప్ప నేర్పరివని పొగడుతూ ఉండగా లోలోన సంతోషపడుతూ అమాయకంగా నోరు మూసుకుంటున్నారు. మీ తీరుతెన్నులన్నీ గుర్తులే పట్టిస్తుండగా, నీ గుణాల శోభలన్నీ నీ చెంతనున్నవారు గమనించలేరనుకుంటున్నావా?

నేను వ్యాకులపడి మీ వీధి చుట్టరికాలను చెబితే తగవు పెట్టుకోవద్దని ఎందుకు బ్రతిమాలాడుకుంటున్నావు? ఓ శ్రీవేంకటేశ్వరా! నీ వ్యవహారాలు శృతిమించి ఏమాత్రం మరుగులేకుండా ఉన్నవి. అసలు చెప్పాలంటే నీ పొందులన్నీ ఇరుగుపొరుగు వారెవరూ గమనించలేదనుకుంటున్నావా?

**విశేషము:** ఈ కీర్తనలో అమ్మ అలమేలుమంగమ్మ ఖండిత నాయికగా గమంచించదగును.

## 130

**అవతారిక:** స్వామివారికి ఎందరో కాంతలతో సాంగత్యం ఉందని తెలిసి, ఎవరిపై నిజమైన ప్రేమ ఉన్నదో తెలుపని చెలులు

అడుగుతున్న సన్నివేశం.

**ఆరిబి**

| | | |
|---|---|---|
| ప. | ఒక్కరి గాదనలేక వూరకున్నాడవు నీవు | |
| | మక్కువతో నెవ్వరిపై మనసున్నదయ్య | ॥పల్లవి॥ |
| 1. | ఇంతి నిన్నొకతె తమఇంటికి బిలిచితేను | |
| | పంతాన వేరొకతె చెయివట్టి తీసీని | |
| | వంతులకు నిరుమేలా వలపులు దైవారి | |
| | పొంతల నెవ్వరితోడ పొందుసేసేవయ్య | ॥ఒక్కరి॥ |
| 2. | కోమలి యెకతె నీకు గొప్పు గడుదువ్వితేను | |
| | వేమారు బాదాలొత్తీ వేరొక్కతె | |
| | నేమాన నెదురుబడి నెయ్యము లాసలు చూపి | |
| | చేముంచి యెవ్వరిచేత సేవగొనేవయ్యా | ॥ఒక్కరి॥ |
| 3. | కందువ నొకతె నిన్ను గాఁగిలించి కూడితేను | |
| | సందడి బెండ్లాడీని సరి నొక్కతె | |
| | ఇందులోనే కూడితివి యిద్దరి శ్రీ వేంకటేశ | |
| | విందుచెప్పి యెవ్వతెకు వీడెమిచ్చేవయ్య | ॥ఒక్కరి॥ |

**అర్థములు:** ప.కాదనలేక = త్రోసిపుచ్చలేక, మక్కువ = ఇష్టము.

1. ఇంతి = స్త్రీ, చెయివట్టి = చేయిపట్టుకుని, వంతు = పట్టుదల, ఇరుమేల = ఇరువైపుల, దైవారి = ప్రకాశించు, పొంతల = సమీపములో, పొందు = కూడిక.
2. కోమలి = అందమైన స్త్రీ, కడు = బాగా, వేమారు = వెయ్యిసార్లు, పాదాలొత్తి = పాదములు పిసికి, నేమన = నియమమున, నెయ్యము = స్నేహము, ఆశలు = ఆసక్తి, చేముంచి = బుద్ధిపూర్వకముగా, సేవ = ఉపచారములు.
3. కందువ = జాడ, కాగిలించి = కౌగలించి, సందడి = జనసమూహం, సరి = యుక్తము, వీడెము = తాంబూలము.

**భావము:** ఓ స్వామీ! నువ్వు ఇందరు ఇంతులలో ఏ ఒక్కరినీ కాదనలేక ఇలా ఊరక సతమతమవుతున్నావు. నీకు అసలు ఎవరిపై ప్రేమ అధికంగా ఉందో చెప్పవయ్యా స్వామీ!

స్వామీ! ఆ రమణులలో నొకతె నిన్ను తన ఇంటికి రమ్మని బిలువగా, పంతానికి బోయి వేరొకతె నీ చెయ్యిపట్టి లాగింది. వారిద్దరూ అలా వంతులు వేసుకుంటూ ఉండగా, నీవేమో అతిశయంతో సమీపంలో ఎవరి పొందుగూడావో తెలియజెప్పవయ్యా!

వారిలో నొక కోమలాంగి నీ వెంట్రుకలు చిక్కుతీసి చక్కగా కొప్పు దువ్వగా, అనేకసార్లు నీ పాదపద్మాలను వత్తుతూ మరొకతె ఉన్నది. నియమంతో నీకెదురుబడి స్నేహభావంతో అధికాసక్తిని జూపుతూ ఉన్నది. ఇంతకీ బుద్ధిపూర్వకముగా ఎవరిచేత ఉపచారాలు సేవలు గైకొంటావో చెప్పవయ్యా స్వామీ!

జాడ తెలిసుకొని వచ్చి ఒక రమణి నిన్ను చేరి కౌగలించుకొని ఉండగా, అదే సమయముగా భావించి ఇంకొకతె నిన్ను పెండ్లి చేసుకొన్నది. ఈ విధంగా ఇద్దరినీ పొందుకూడిన ఓ శ్రీవేంకటేశ్వరా! ఇంతకీ విందుభోజం చేసి ఎవరికి తాంబూలం ఇచ్చావయ్యా! చెప్పవయ్యా!

**విశేషము:** చేముంచి అనే పదం నిఘంటువులలో కానరాదు. బుద్ధిపూర్వకము, నిజంగా, ప్రమాణపూర్తిగా అనే అర్థంలో అన్నమయ్య వాడాడని వేటూరి ఆనందమూర్తి అభిప్రాయ పడ్డారు.

**అవతారిక:** చెలులు స్వామివారు తనవాడై ఉన్నాడని గర్వించవద్దని, ప్రేమాభిమానాలు చూపమని అమ్మ అలమేలుమంగమ్మకు చెలులు సలహాలనిచ్చే సన్నివేశం.

## శంకరాభరణం

ప. గుట్టున నుండవే కోమలి
జట్టిగొనుచు నిను జరసీ నిపుడు ॥పల్లవి॥

1. సముకాన నతఁడు సరసమాడఁగా
తమకించకువే తరుణీ
చెమటలు నీమేనఁజిప్పిలఁగఁజూచి
తిమురుచు రమణుఁడు తెగడీ నిపుడు ॥గుట్టున॥

2. చెలిమి సేసి పతి చేకొనఁగానే
బలిమి సేయకువె పడఁతీ
పులకలు చెక్కుల పొదిగొనఁగనుగొని
నలుగడఁదా నటు నవ్వీ నిపుడు ॥గుట్టున॥

3. సొరిది శ్రీ వేంకటేశుఁడు గూడఁగానె
గరిసించ నేఁటికే కలికీ
నిరతి మోమునఁ గళ నిండఁగ దిష్టించి
కెరలుచు నీతఁడే కేరీ నిపుడు ॥గుట్టున॥

**అర్థములు:** ప. గుట్టు = రహస్యము, కోమలి = చక్కనైన ఆడుది, జట్టి = వశపరచుకొను, జరయుట = నిందించు.

1. సముకము = ఎదురు, తమకించు = మోహపడు, మేన = శరీరంపై, చిప్పిలు = పైకి ఉబుకు, తిమురు = త్వరపడు, తెగడు = ఉపేక్షించు.
2. చెలిమి = స్నేహము, చేకొను = చేపట్టు, బలిమి = దేహబలము, పులకలు = గగుర్పాటు, చెక్కులు = చెక్కిళ్ళు, పొదిగొను = చుట్టుకొను, వ్యాపించు, నలుగడ = నాలుగువైపులు.
3. సొరిది = వరుస, క్రమము, గరిసించు = గర్వించు, ఏటికే = ఎందులకే!, కలికి = మనోజ్ఞమైన స్త్రీ, నిరతి = ఆసక్తి, కళ = సౌందర్యము, దిష్టించి = దృష్టిపెట్టు, కెరలు = అతిశయించు, కేరు = విజృంభించు.

**భావము:** ఓ చెలీ! కొంచెం గుట్టుగా ఉండవే! స్వామి నిన్ను వశపరచుకొంటూనే నిన్ను నిందిస్తున్నాడు.

స్వామి నీ ఎదురుగా సరసప్రియ సంభాషణములాడుతూ ఉండగా అతిగా మోహపడవద్దు. నీ శరీరంపై చెమట పైకి ఉబికి కనిపిస్తుండగా ఆ స్వామి త్వరపడి నిన్నిపుడు ఉపేక్షిస్తాడేమో!

నీవు ఎంతో అనురాగంతో స్వామిని చేపట్టగానే, నీ బలిమిని చూపవద్దు. గగుర్పాటు నీ చెక్కిళ్ళపై కనిపిస్తూ ఉండగా స్వామి నాలుగువైపులా చూసి నవ్వుతున్నాడిప్పుడు.

నీకు వరుసైన ఆ శ్రీవేంకటేశ్వరుడు నిన్ను కూడగానే ఎందుకు గర్విస్తున్నావు? ఆసక్తి నిండిన నీ ముఖపద్మం సౌందర్యంతో అలరారుతుండగా దృష్టిపెట్టి చూస్తున్న స్వామి గొప్ప అతిశయంతో విజృంభిస్తాడు.

## 132

**అవతారిక:** స్వామివారు, అలమేలుమంగమ్మ మన్మథావస్తలో ఉండగా పొడసూపిన సాక్ష్యాలను గమనిస్తున్న చెలులు మరుగూ మర్మం లేని మీ కార్యాలకు సిగ్గుపడడం ఎందుకని ఛలోక్తులాడుతున్నారు.

## సౌరాష్ట్రం

ప. చెప్పరయ్య వూడిగాలు సేసేము నేము
చిప్పిలు మోవితేనెలు చిమ్మనేల సిగ్గులు ॥పల్లవి॥

1. మచ్చికలు దైవారె మదనకళలు దేరె
యిచ్చలో నిద్దరికిని యింపులు మీరె
తచ్చి సతు లాడుకొంటే తలవంచుకొననేల
పచ్చియైతి రిఁకనేల పలుమారు సిగ్గులు ॥చెప్పరయ్య॥

2. అంగాలఁ జెమట మించె ఆసలు లోలోఁ బొంచె
రంగుగా నిద్దరి సింగారములు ముంచె
ముంగిటిచెలులతోడ మూసి మంతనములేల
యింగిత మెఱఁగవచ్చె నిఁకనేల సిగ్గులు ॥చెప్పరయ్య॥

3. తలపోఁతలెల్లా దక్కె తనువులు కడుఁ జొక్కె
కలసితి రిద్దరిభోగములు నిక్కె
యెలమి శ్రీవేంకటేశ యిందరితో మఱఁగేల
యెలుఁగెత్తి నవ్వరాదా యిఁకనేల సిగ్గులు ॥చెప్పరయ్య॥

**అర్థములు:** ప. ఊడిగాలు = సేవలు, సేసేము = చేస్తాము, నేము = మేము.

1. మచ్చిక = మోహము, దైవారు = ప్రకాశించు, మదనకళలు = మన్మథ శోభలు, తేరు = కలుగు, ఇచ్చ = ఇష్టము, ఇంపు = ఆనందం, మీరె = అధికమవడం, తచ్చి = మథించు, పచ్చి = మర్మము లేని.
2. లోలో = లోపల లోపల, పొంచె = దాగియుండు, రంగుగా = సొంపుగా, సింగారము = అలంకారము, ముంచు = దాటిపోవు, ముంగిట = ముందు, మూసి = దాచి, రహస్యముగా, మంతనము = ఆలోచనలు, ఇంగితము = అభిప్రాయము.
3. తలపోతలు = ఆలోచనలు, దక్కె = లభించె, చొక్కె = పరవశము, నిక్కె = ఎక్కువగు, ఎలమి = వికాసము, మరగు = అంటకాగు, ఎలుగెత్తి = అందరికి తెలియునట్లు.

**భావము:** మీకు మేము ఎన్నో సేవలు చేసుకుంటూ ఉన్నవారము. అధరామృత బిందువులు పైకి ఉబికి వచ్చేవిధంగా మీరు ఇంకా సిగ్గు పడనేల?

మోహం బట్టబయలై మన్మథ కళలు అతిశయిస్తున్నాయి. ఇష్టాలలో అభీష్టాలలో మీ యిద్దరూ ఒకరికి ఒకరు తగ్గకుండా అధికమై ప్రకాశిస్తున్నాయి. ఏదో మల్లగుల్లాలు పడుతూ సతులాడుకునే మాటలకు సిగ్గుపడి తలవంచుకోవడం ఎందుకు? మరుగూ మర్మం లేని మీ కార్యాలకు ఇన్ని మార్లు సిగ్గుపడడం ఎందుకు?

శరీరంపై పొడసూపుతున్న చెమటలు అధికమై ఆశలు లోపల లోపల దాగి ఉన్నాయి. సొంపుగా ఇద్దరి అలంకారములు అతిశయించి పరిధి దాటిపోతున్నాయి. ముదర ఉన్న చెలులతో ఇంకా ఆలోచనలెందుకు? మీ అభిప్రాయాలు బహిరంగమైనపుడు ఇంకా సిగ్గుపడడం ఎందుకు?

మీ ఆలోచనలన్నీ ఫలిస్తున్నాయి. మీ శరీరాలు మిక్కిలి పరవశత్వం బొంది, ఇద్దరి భోగములు పైకి పొడసూపుతున్నాయి. ఓ శ్రీవేంకటేశ్వరా! ఇందరితో అంటకాగుతూ ఇంకా రహస్యం ఎందులకు? బహిరంగంగానే మీ నవ్వులు చిందించవచ్చుకదా? ఇంకా ఈ సిగ్గులు పడనేల?

**గమనిక:** అన్నమయ్య కర్తకు సంబంధించి ఒకచోట ఏకవచనం, మరొక చోట బహువచనం వాడడం ఉంది. "నా" శబ్ద ప్రథమా, బహువచనమునకు రూపాంతరముగా అనేక కీర్తనల్లో ఉంది.



డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య

## 133

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామికై సర్వసమ్మతమై ఉన్నదని, ఆమె సేవలతో స్వామి సంతృప్తి చెందాడని, వివాహానికి అన్నీ సమకూరాయని చెలులు చెప్తున్న సన్నివేశం.

### ఆహిరినాట

ప. మాముందర నింత యాల మతకాలు నెరుపేవు
గామిడివి గావోయి కడపరాయా ॥పల్లవి॥

1. కందువ సేవలు సేసి కడునవ్వులు నవ్వీని
పొందు గద్దో తొల్లి నీకుఁ బొలఁతితోను
విందు చెప్పవచ్చీని విడెము చేతి కిచ్చీని
అందెనో వొడఁబాట్లు ఆపెకు నీకు ॥మాముందర॥

2. ఆసల చూపులు చూచి అంటి ముట్టి పెనఁగీని
బాస సేసితివో తొల్లి పడఁతికిని
సేసలు పైఁజల్లీని చెంగట గొలువు సేసీ
ఆసుద్దు లొనగూడెనా ఆపెకు నీకు ॥మాముందర॥

3. కాయము చన్నుల నొత్తీ కాఁకదేరి మాటలాడీ
ఆయనా చుట్టరికము అంగనతోను
యీయెడ శ్రీ వేంకటేశ ఇటు నన్ను నేలితివి
ఆయితమా పెండ్లికి ఆపెకు నీకు ॥మాముందర॥

**అర్థములు:** ప.యాల = ఏల?, మతకాలు = మాయలు, కామిడి = దుష్టుడు, కడపరాయ = కడపలోని దేవునిగడపలో ఉన్న శ్రీవేంకటేశ్వర స్వామి.

1. కందువ = ఏకాంతము, గద్దు = కలదు, తొల్లి = పూర్వము, పొలతి = స్త్రీ, విడెము = తాంబూలము, ఒడబాటు = అంగీకారం, ఆపె = ఆమె.
2. ఆస = ఆశ, అంటి ముట్టి = తాకుట, పెనగు = చుట్టుకొను, సేశ = తలంబ్రాలు, చెంగట = సమీపము, కొలువు = సేవ, సుద్దులు = మాటలు, ఒనగూడు = నెరవేరు, ఆపె = ఆమె.
3. కాయము = శరీరము, చన్నులు = వక్షోజములు, కాకదేరు = ఆరితేరు, అంగన = స్త్రీ, ఆయితము = సిద్ధము, ఆపె = ఆమె.

**భావము:** ఓ శ్రీనివాసా! మా చెంత ఇంత మాయలు ఎందుకు చేస్తున్నావు? నీవేమీ దుష్టుడవు కాదుకదా? ఓ దేవునిగడపలో నివాసమున్న శ్రీలక్ష్మీ సమేత వెంకటేశ్వరా!

ఏకాంతములు ఎన్నో సేవలు పొందుతూ ఎక్కువ సంతోషంతో ఆ అమ్మతో నీకు పూర్వం నుండీ పొందు ఉన్నదే కదా! ఆమె విందుభోజనానికి ఆహ్వానిస్తూ నీకు తాంబూలము చేతికిచ్చుచున్నది. ఆమెకు నీకూ సర్వం సమ్మతమైనట్లేగా కదా స్వామీ!

ఆశతో కూడిన చూపులతో ఆమెను స్పృశిస్తూ లాలనగా ఆమెకు ఏమేమి ప్రమాణాలు చేశావో? అక్షతలు తలపై చల్లి నీ సమీపములో సేవకు సిద్ధమైనది కదా! ఆ మధుర సంభాషణల సారమంతా ఆమెకు నీకూ నెరవేరినట్లే కదా స్వామీ!

ఆయమ వక్షోజములను ఒత్తుతూ ఆరితేరిన నీ వాక్కులతో, ఆమెకు నీకు మంచి చుట్టరికము కుదిరినట్లే కదా! ఓ ( శ్రీవేంకటేశ్వరా! ఇక్కడ ఈవిధముగా కూడి ఏలుకున్నావు. ఆమెతో వివాహానికి సిద్ధమయినట్లేకదా స్వామీ!

## 134

**అవతారిక:** సవతుల సంవాదం సాగుతున్నది. నల్లనివాడు పద్మనయనంబుల వాడు నావాడంటే, నావాడని వాదులాడుకున్న సందర్భంలో అన్నమయ్య అద్భుత రచన.

## రామక్రియ

| | | |
|---|---|---|
| ప. | ఏమి జాణతనా లాడే వింకా నీవు | |
| | ఆ మాటే నిక్కమౌనె ఆతని వలనను | ॥పల్లవి॥ |
| 1. | సుదతిరో నీవద్దఁ గూచున్న చుట్ట మెవ్వఁడే | |
| | మదనగురుఁడే వీఁడు మాయింటిలోన | |
| | అదియేమె నావిభుఁడౌట నీ వెఱఁగవా | |
| | కదిసి నన్నేలేనంటేఁ గాదనఁగవచ్చునా | ॥ఏమి॥ |
| 2. | యెవ్వరితో నవ్వితివే యిందాఁకా నీవు | |
| | నివ్వటిల్ల గిలిగించీనే కృష్ణుఁడు | |
| | యివ్వల నాకిచ్చిన బాసెరఁగవా | |
| | చివ్వనఁ బొందు సేయఁగ సిగ్గులు వడుదునా | ॥ఏమి॥ |
| 3. | నీమంచమేపై నెవ్వఁడు నీటు చూపీనే: నన్నుఁ | |
| | బ్రేము శ్రీ వేంకటేశుఁడు పెండ్లాడెనే | |
| | ఆముందే నన్నుఁ బెండ్లాడె నదెరఁగవా | |
| | నామగఁడ ననఁగా మానఁగవచ్చునా | ॥ఏమి॥ |

**అర్థములు:** ప.జాణతనము= నేర్పరితనము, నిక్కము= నిజము.

1. సుదతి = స్త్రీ, చుట్టము = బంధువు, మదనగురుడు = మన్మథరూపుడైన వాడు, విభుడు = భర్త, ఎరుగు = తెలియు, కదియు = సమీపించి.
2. ఇందాకా = ఇప్పటివరకు, నివ్వటిల్లు = నెరవేరు, గిలిగించు = గిలిగింతలు పెట్టు, బాస = మాట, ప్రమాణము, చివ్వన = ఉన్నట్టుండి, పొందు = కలియక, వడుదునా? = పడుదునా?
3. మంచముంవేపై = మంచమేపై = మంచము వైపు, నీటు = మురిపెము, ప్రేము = ప్రేమతో, నామగడ = నా భర్తను, మాను = ప్రకాశము.

**భావము:** అహాహా! ఏమి నేర్పరివే! ఏమి జాణమాటలు! అమాయకురాలిలాగా ఇంకా ఏమి మాట్లాడుతున్నావే! ఆ స్వామి దయవల్ల ఆయన మాటలే నిజమౌతాయా!

ఓ రమణీ! నీ సరసన కూర్చున్న ఆ చుట్టం ఎవరే? ఆ మహానుభావుడు నా హృదయమందిరంలో మా గృహాన్ని పావనం చేసిన మదనుడు సుమా! అని యొకతె అనగా ఇంకొకతె అదేంటే? ఆయన నా భర్త అని నీవెరుగవా? ఎంత నంగనాచివే! ఆయన నన్నే కలిసి చుట్టుకొని నన్నేలే నాథుడంటే నీవు కాదు అని అనవచ్చా? తప్పు కాదుటే!

ఎవరితో నీ నవ్వులు పంచుకున్నావే ఇందాకా? నీ కోరికలు నేరవేరే విధంగా గిలిగింతలు పెట్టినవాడు నల్లని వాడు కాదుటే! ఇంకొకతె అహా! అవునా? మరి ఈవల నాకు బాసలెన్నో చేసిన సంగతి నీవెరుగనిదా? ఉన్నట్టుండి ఇలా అతనితో సాంగత్యం పెట్టుకోవడంతో నేనేమైనా సిగ్గుపడతానా చెప్పు?

అవునూ! ఓ లలనామణీ! నీ పట్టెమంచమ్మీద ఎవరాయన మురిపాలొలకబోస్తూ చిరునవ్వులు చిందిస్తున్నాడు? ఒక రమణి అంటుంది "అవునే శ్రీవేంకటేశ్వరుడు నా మీద ప్రేమతో నన్ను వివాహమాడాడు గదే! అవునా? ఆముందుగానే నన్ను పెండ్లి చేసుకున్న సంగతి నీవెరుగవా ఏమిటి? నామగడు అంటే మేమంతా చేతగాని వారిలాగా ఊరుకుంటామనుకొంటున్నావా? అదేమీ

కుదరదు సుమా!

## 135

**అవతారిక:** శ్రీనివాసునిపై అమ్మ అలమేలుమంగమ్మ ఎందుకో కినుక వహించింది. స్వామిని కూడమని చెలులు నచ్చజెపుతున్న సన్నివేశం.

### కన్నడగౌళ

ప. అలసేవు సొలసేవు అప్పుడే నీవు
వలపు రేఁచుట గాక వట్టిసట లేఁటికే ॥పల్లవి॥

1. సరసమాడేవిభుఁడు చన్ను లెంతపిసికినా
కరఁగి కూడుటగాక కసరనేలే
గొరబుగాఁ గూడేవాఁడు గోర నెంత వూఁదినాను
దొరసి మెచ్చుట గాక దూరనేఁటికే ॥అలసేవు॥

2. మగఁడైనవాఁడు రతి మచ్చరము చూపితేను
నగుట గాక మాఁటలవెగటులేలే
తగుల మోహించువాఁడు తమకించి పొదిగితే
సొగిసి లోనౌటగాక బిగియనేలే ॥అలసేవు॥

3. సందడిఁ బెండ్లాడేవాఁడు సారెఁ బువ్వులవేసితే
విందులఁజొక్కుటగాక విసువులేలే
యిందరిలో శ్రీ వేంకటేశుఁడిట్టె నిన్ను నేలె
సందుకొనవలెఁగాక చలపట్టనేలే ॥అలసేవు॥

**అర్థములు:** ప. అలయుట = శ్రమవలన కలిగిన విసుగు, సొలయుట = బడలిక, సట = మోసము.

1. విభుడు = భర్త, కరగు = ప్రేమపరవశము, కసరు = కోపించు, గొరబు = వేషకారి, గొరనూదు = గోళ్ళతో అదుము (నఖక్షతములు వేయు), దొరసి = కలయు, దూరనేటికి = మధ్యలో కల్పించుకొని ప్రవేశించుట ఎందుకు?
2. మచ్చరము = పట్టుదల, నగుట = నవ్వుట, వెగటు = అరుచి, తగుల = ఆసక్తి, తమకించు = త్వరపడు, పొదుగు = క్రమ్ము, సొగిసి = సుఖించు, బిగియుట = బెట్టుచేయు.
3. సందడి = అతిశయము, సారె = మాటిమాటికి, చొక్కు = పరవశము, విసువు = విసుగు, సందుకొను = పరిగ్రహించు, చలపట్టు = కోపగించు.

**భావము:** ఓ అలమేలుమంగమ్మా! ఊరకే శ్రమపడినట్లు విసుగుచెందుతావు. బడలికలు కనుపరుస్తావు. స్వామిపై వలపులు క్రుమ్మరించక ఈ టక్కరి వ్యవహారాలెందుకు చేస్తున్నావే?

స్వామి నీతో సరససల్లాపాలాడుతూ నీ వక్షోజాలను వత్తినప్పుడు పరవశంతో కౌగలించుకొని కూడకపోగా కోపం వహిస్తున్నావెందుకు? స్వామి నీ కొరకై వేషాలు వేస్తూ నిన్ను కూడాలని ఉన్నసమయంలో కొద్ది గోటి గాయాలైతే, కలిసి మెచ్చుకోకపోగా, దూరం దూరం జరుగుతున్నావెందుకే?

స్వామి పురుషుడు కనుక రతి విషయంలో పట్టుదల చూపినప్పుడు నవ్వులు చిందించాలే గాని, అరుచి కలిగించే మాటలు మాట్లాడడం న్యాయమా? నీపై అధికాసక్తితో కూడిన సమయంలో త్వరపడి నిన్ను క్రమ్ముకొన్నప్పుడు, ఆనందాతిశయంతో సుఖించకపోగా, బెట్టు చూపిస్తావెందుకే!

అతిశయించి నిన్ను వివాహమాడేవాడు కనుక పువ్వులను నీపై విసిరితే, ఆతని విందు పారవశ్యంలో తేలియాడవలెను కాని,

విసుగు, కోపతాపాలు ప్రదర్శించడం ఎందుకే! ఇంతమంది ఇంతులలో శ్రీవేంకటేశ్వరుడు నిన్నే ఏరి కోరి ఏలుకుంటుండగా, స్వామిని సంతోషంతో స్వీకరించవలెను కానీ లేనిపోని పట్టుదలలకు ఎందుకు పోతున్నావో చెప్పవే?

## 136

**అవతారిక:** స్వామివారు సమయాసమయాలను గమనించకుండా కాంతలతో సరసాలాడే సన్నివేశాన్ని చెలులు హాస్యభరితంగా చెప్తున్నారు.

### దేశాక్షి

ప. కంటిమయ్య నీచేఁతలు కన్నులపండుగగాను
పెంటలైన ముచ్చటలే ప్రియము నీకు ॥పల్లవి॥

1. మంతనమాడేటివేళ మజ్జనమాడేటివేళ
ఇంతితోడి సరసము లింపులు నీకు
అంతలోఁ గప్పురకాపు అవధరించేటివేళ
సంతతపు వసంతము చవులు నీకు ॥కంటి॥

2. పొందులవేళలఁ దట్టుపుణుఁగు పూసేటివేళ
ఇందుముఖితోడిమాట లితవు నీకు
చెందమ్మి పూవుదండలు సింగారించుకొనేవేళ
విందుల మోవియీవులు వేడుక నీకు ॥కంటి॥

3. సొలసి నవ్వేటివేళ సొమ్ము లిడుకొనేవేళ
అలమేల్మంగకూటమి అనువు నీకు
యెలమి శ్రీ వేంకటేశ ఇద్దరుఁ బెండ్లాడేవేళ
కొలువులోని మొక్కులు కొసరు నీకు ॥కంటి॥

**అర్థములు:** ప.కంటిమి = చూశాము, చేతలు = పనులు, పెంట = వివాదాస్పదమైనవి.

1. మంతనము = రహస్యము, మజ్జనము = స్నానము, ఇంపు = ఇష్టము, కప్పురకాపు = కర్పూరపు మేనిపూత, అవధరించు = ధరించు, సంతతము = ఎల్లప్పుడు, వసంతము = పసుపుసున్నమును కలిపిన యెఱ్ఱనీళ్ళు, చవులు = ఆనందము.
2. తట్టుపుణుగు = శ్రేష్టమైన సుగంధ ద్రవ్యము, ఇందుముఖి = స్త్రీ, హితవు = ఇష్టము, చెందమ్మి = ఎఱ్ఱతామరలు, సింగారించు = అలంకరించుకొను, ఈవులు = దానములు.
3. సొలసి = అలుపు, సొమ్ములు = ఆభరణములు, కూటమి = సాంగత్యము, అనువు = యుక్తము, ఎలమి = సంతోషము, మొక్కులు = నమస్కారములు, కొసరు = అపేక్ష, ఇష్టము.

**భావము:** ఓ స్వామీ! నీవు చేసే కార్యాలన్నీ కన్నుల పండుగగా వీక్షిస్తున్నాము. అదేమి చిత్రమో మరి! వివాస్పద విషయాలే నీకెప్పుడూ ప్రియంగా ఉంటాయి.

ఏవైనా రహస్యాలు చెప్పుకునే సమయంలోను, స్నానమాచరించే సమయంలోను స్త్రీలతో సరసములాడ్డం నీకు ఇష్టమైన పని. కర్పూరపు పూతలు ధరించే సమయంలో ఎల్లవేళలా వసంతాలాడడం నీకు ఆనందంగా ఉంటుంది.

ఇష్టమైన కాంతలతో పొందుకూడేటి సమయాలలో, తట్టుపునుగు సుగంధ ద్రవ్యాన్ని మేనిపై పూసుకునే సమయంలో రమణీయ స్త్రీల సంభాషణలు నీకింపును కలిగిస్తాయి. ఎఱ్ఱతామర పుష్పమాలలు ధరించే సమయంలో, విందుగొలిపే స్త్రీలు నీకందించే అధరామృత ధారలు ఎంతో సంతోషాన్నిస్తాయి.

అలుపుదీరా ఇంతులతో నవ్వేటి వేళలలో, ఒకరికొకరు ఆభరణాలు యిచ్చిపుచ్చుకునే వేళలలో, అమ్మ అలమేలు మంగమ్మ

సాంగత్యం ఎంతో యుక్తమై ఉంటుంది. వికాసముతో మీరిద్దరూ వివాహమాడే వేళలో నీ కొలువులో ఇంతులు నీకు చేసే నమస్కారాలు ఎంతో ప్రీతిపాత్రంగా ఉంటాయి.

**విశేషము:** అన్నమయ్య పదాల వాడికలో నిర్మొహమాటం ప్రదర్శిస్తాడనడానికి స్వేచ్ఛావిహంగంలా విహరిస్తాడనడానికి "పెంటలైన ముచ్చటలే ప్రియము నీకు" ఒక ఉదాహరణ.

## 137

**అవతారిక:** స్వామివారిని చెలులు అమ్మవారిని అనుగ్రహించమని, ఆమె చేసిన సేవలను పునరుద్ఘాటిస్తూ విన్నవిస్తున్నారు.

### సౌరాష్ట్రం

ప. అందులోనే వున్నవివె అన్ని విన్నపములును
కందువతోడఁ గలసీ కరుణించవయ్యా ॥పల్లవి॥

1. చెక్కులపై వెడజారుఁజెమట నీపచ్చడాన
గక్కనఁ దుడుచుకొనీఁ గామిని
వెక్కసపుఁ గుచముల వెట్ట దీర నీ చేతుల
అక్కరతో నద్దుకొనీ నప్పటప్పటికిని ॥అందులోనే॥

2. ఆలయిక లెల్లాఁ దీర నండ నున్న నీమీఁద
పలుమారు నొరగీని పడఁతి
నిలువుఁగొప్పు వీడితే నిన్నే ముడువుమనీ
తలఁపించి విరహపుతమకముతోడను ॥అందులోనే॥

3. తెల్లమిగాఁ దనదప్పి దేరుచుకొని మోవి
మెల్లనే చేకొనీ నలమేలుమంగ
చెల్లుబడి నీకాఁగిట శ్రీవేంకటేశుఁడు(డ?) గూడి
యిల్లిదే నిన్నుఁ బొగడి యిచ్చకమాడీని ॥అందులోనే॥

**అర్థములు:** ప.విన్నపము = మనవి, కందువ = జాడ, కరుణించు = అనుగ్రహించు.

1. చెక్కులు = చెక్కిళ్ళు, వెడజారు = వింతగా జారిపడు, పచ్చడము = అంగవస్త్రము, గక్కన = వెంటనే, కామిని = స్త్రీ, వెక్కసపు = అధికమైన, కుచములు = వక్షములు, వెట్ట = వేడిమి, అక్కర = అవసరార్థం, అద్దుకొని = తుడుచుకొని, అప్పటప్పటికి = అప్పటికప్పుడు.
2. అలయిక = బడలిక, అండ = సమీపము, పలుమారు = అనేకసార్లు, తలపించు = జ్ఞప్తికిదెచ్చుకొను, తమకము = దాహము.
3. తెల్లమి = స్పష్టము, తేరుచు = ప్రసన్నత, మెల్లన = చిన్నగ, చేకొని = పట్టుకొని, చెల్లుబడి = అధీనము, ఇల్లిదె = ఇదుగో ఇక్కడే, పొగడి = స్తుతించి, ఇచ్చకమాడు = ప్రియసంభాషణలు.

**భావము:** ఓ స్వామీ! మా విన్నపములన్నీ సావధానచిత్తుడవై విని, జాడ తెలిసుకొని కలసి అమ్మను అనుగ్రహించవయ్యా!

చెక్కిళ్ళపై జాలువారే చెమట నీ అంగవస్త్రానికి అంటుకొనగానే, ఆ రమణి వెంటనే తుడుచుకొని, మదించియున్న వక్షస్థలము యొక్క వేడిమి చల్లారునట్లు నీ చేతులతో అవసరార్థం అద్దుకొనే సమయానికి (తర్వాతి చరణంతో అన్వయము)

బడలిక నుండి తేరుకొని చెంతనే ఉన్న నీ మీద అనేకసార్లు ఒరిగి ఉన్న ఆ లలనామణి కొప్పు జారి విడివడగా, నిన్నే ముడిచి సరిచేయమంటూ అనేక విషయాలు జ్ఞప్తికి తెచ్చుకుంటూ విరహమనే దాహంతో ఉండగా (తర్వాతి చరణంతో అన్వయము)

తన దాహార్తి తీర్చుకొని మీ ముఖ పద్మాన్ని అందుకొని నీకు అధీనమై నీ కౌగిట కూడినది. ఓ శ్రీవేంకటేశ్వరా! ఇదుగో ఇక్కడే నిన్ను అనేక విధాల స్తుతించి ప్రియ సంభాషణములాడుతున్నది.

## 138

**అవతారిక:** స్వామివారు చెలులందరికి విఘ్నాలేమీ లేకుండా అందరినీ సమాదరించి సర్వ భోగాలను సమకూరుస్తాడన్న విశ్వాసం ప్రకటించే సన్నివేశం.

### శంకరాభరణం

ప. ఇంకనేమి గడ మిందరికి
పొంకముగా నిటు భోగించఁగలఁడు ॥పల్లవి॥

1. జగడములడిచినసవతుల కెల్లా
తగవులు చెప్పఁగఁ దాఁ గలఁడు
వెగటునఁదనతో వెంగెములాడిన
మగిడి వేఁడుకొన మతి తాఁ గలఁడు ॥ఇంకనేమి॥

2. ప్రియపడి కాంతలు పెనఁగి యలసితే
దయలు దలంచఁగఁ దాఁ గలఁడు
రయమునఁ దనకై గాఁపుగ వలచిన
నయమున నవ్వుచు నమ్మించఁగలఁడు ॥ఇంకనేమి॥

3. సతమై వనితలు సరిఁ బెండ్లాడిన
తతిగొని కూడఁగఁ(గఁ?)దాఁ గలఁడు
యితవై శ్రీ వేంకటేశుఁడు తానె
గతియై మమ్మేలెఁ (లఁ?)గమ్మటిఁగలఁడు ॥ఇంకనేమి॥

**అర్థములు:** ప. గడము = విఘ్నము, పొంకము = పొందిక, భోగించు = అనుభవించు.

1. జగడము = తగవు, లడచు = పోగొట్టు, వెగటు = విరసము, వెంగెము = పరిహాసము, మగిడి = తిరిగి, వేడుకొను = ప్రార్థించు.
2. ప్రియపడి = ఇష్టపడి, పెనగి = చుట్టుకొని, రయము = వేగము, కాపు = రక్షణ, వలచిన = ప్రేమించిన, నయమున = మృదువుగా, నమ్మించు = విశ్వసించు.
3. పతము = వశమై, తతిగొని = సమయమరసి, కూడగ = పొందుకూడుటకు, హితవు = ఇష్టప్రీతి, గతి = దిక్కు, కమ్మటి = సొగసైనవాడు, స్వర్ణకారుడు.

**భావము:**ఓ చెలులారా! ఇక మనందరికి విఘ్నాలేమీ లేవు. స్వామి అందరినీ ఆదరించి సర్వ భోగాలను సమకూరుస్తాడు.

జగడాలు పెట్టుకున్న సవతులందరికి స్వామి తానే తగవులన్నీ తీరుస్తాడు. ఎవరైనా పొరబాటుగా స్వామితో పరిహాసాలాడినా తిరిగి మనమంతా ప్రార్థించడానికి తానున్నాడు.

కాంతలలో ఎవరైనా ఇష్టపడి స్వామిని చుట్టుకొని అలసి సొలసినట్లైతే దయ చూపించడానికి తానున్నాడు. త్వరపడి ఎవరైనా తనను గాఢంగా వలచినట్లైతే, మృదువైన సంభాషణలతో స్వామి మనకు విశ్వాసం కలిగిస్తాడు.

స్వామిని శాశ్వతముగా స్వంతం చేసుకోవడానికై ఎవరైనా పెండ్లాడినట్లైతే, సమయసమయాలు గ్రహించి పొందుకూడగలడు. మనందరికి ఇష్టుడైన శ్రీవేంకటేశ్వర స్వామి తానే దిక్కై ఏలుకొనే సొగసైన సౌందర్యవంతుడై యిచట కొలువున్నాడు.

## 139

**అవతారిక:** స్వామివారు ఒక కాంత వద్ద నున్నప్పుడు వేరొక కాంతకై తాపత్రయం పడడం కూడదని చెలులు విన్నవిస్తున్నారు.

## ఆహిరి

ప. వద్దనేమా మిమ్ము నేము నట్టి దూరు మాకేల
పొద్దువొద్దు దప్పకుండా భోగించరాదా ॥పల్లవి॥

1. మరిగినచెలి నీపై మచ్చికలు చల్లఁగాను
తొరలింపుఁ దమకాన తోఁగి చూచేవు
ఇరవైనఅడియాస లింతగలవారు మీరు
గరిమలఁ జలివాయఁ గాఁగిలించరాదా ॥వద్దనేమా॥

2. పొంచిపొంచి యాపె నిన్ను పూవులను వేయఁగాను
చఁచలించి యట్టె నీవు సన్నసేసేవు
మంచితనముల నింతమరిగినవారు మీరు
కొంచక పీఁటమీఁదటఁ గూచుండరాదా ॥వద్దనేమా॥

3. వెనకనుండాపె నేఁడు విడెము నీకియ్యఁగాను
యెనసితివి శ్రీ వేంకటేశ ఆపెను
మనసార నలమేలుమంగను నన్నేలితివి
పెనఁగనేల ఇద్దరూఁ బెండ్లాడరాదా ॥వద్దనేమా॥

**అర్థములు:** ప. నేము = మేము, దూరు = నింద, భోగించు = అనుభవించు, సుఖించు.

1. మరుగు = అలవాటగు, మచ్చికలు = ప్రేమాసక్తులు, చల్లు = వ్యాపింపజేయు, తొరలింపు = పదేవిధంగా, తమకము = మోహము, ఇరవైన = నెలకొన్న, స్థిరపడిన, అడియాస = అందని కోరిక, గరిమ = గొప్పదనము, చలివాయు = బుజ్జగించు, కాగలించు = కౌగలించు.
2. పొంచి = దాగి, ఆపె = ఆమె, చచలించు = కదిలిపోవు, సన్న = సైగ, మరిగిన = అలవాటైన, కొంచక = సందేహించక.
3. ఆపె = ఆమె, విడెము = తాంబూలము, ఎనయు = పొందు, పెనగు = మారాడు.

**భావము:** ఓ శ్రీనివాసా! మేమెప్పుడైనా కాదు కూడదు అని అన్నామా? అట్టి నిందలు మాకెందులకు? ప్రతి రోజూ వచ్చి సుఖించరాదా!

నీ ప్రేమాభిమానాలు అలవాటైన చెలి నీపై ఆసక్తి చూపుతుండగా, నీ దృష్టి ఆమెపైనే నిలిపి తొంగి తొంగి చూస్తావు. ఇంత తీరని కోరికలుగలు నెలకొన్న మీరు గొప్పదనముతో కాస్తా ఆమెను బుజ్జగించి కౌగలించుకోవచ్చును కదా!

ఆమె మూల మూల దాగి నీపై పువ్వులను రువ్వుతుండగా, ఆగలేక కదిలిపోయి ఆమెకు ఏవో సైగలు చేస్తావు. ఇంత మంచితనం హృదయములో నిండియున్న మీరు, సందేహించక పెండ్లి పీటల మీద కూర్చొని వివాహమాడవచ్చు కదా!

ఓ శ్రీవేంకటేశ్వరా! వెనుకవైపున ఆమె నిలబడి నీకు తాంబూలమునందించగా, ఆమెను కూడితివి. మనసారా అలమేలుమంగమ్మనైన నన్నేలుకున్నావు. ఇంకా మారాడడం ఎందుకు? ఇద్దరూ పెండ్లి చేసుకొనవచ్చును కదా!

# 140

**అవతారిక:** ఏదో కాలక్షేపముగా అన్యస్త్రీలను కూడితే కూడవచ్చు గానీ, చెంత అలమేలుమంగమ్మ ఉండగా ఇతర స్త్రీలు ప్రీతికరం గావడం సమంజసం కాదని చెలులు విన్నవిస్తున్న దృశ్యం.

## పాడి

ప. పొద్దువోక నీవు వట్టి పొందులు సేసేవు గాక
వొద్ద నాపె వుండగాను వొరు లితవయ్యేరా ॥పల్లవి॥

1. చెంగట నేపొద్దు నీకు సేవలు సేసీనాపె
వుంగిటి నెదుట నిలిచున్నది ఆపె
సంగతిగా నవ్వునవ్వి సరసమాడీ నాపె
సింగారపు సతులెల్లాఁ జిత్తానఁ బట్టేరా ॥పొద్దు॥

2. వేడుకతో సారె మోవివిందులు వెట్టీ నాపె
యీడుజోడై నీకు విడేలిచ్చీ నాపె
యేడలేని విన్నపాలు ఇట్టె సేసి నాపె
వాడవారి మీఁద నీకు వలపు వుట్టీనా ॥పొద్దు॥

3. సందుకొని కాఁగిలించి చన్నుల నొత్తీ నాపె
మందె మేళపుటలమేల్మంగే ఆపె
ఇందరిలో శ్రీవేంకటేశ నన్ను నేలితివి
సందిగొందులవారిని సరకు గొనేవా ॥పొద్దు॥

**అర్థములు:** ప.పొద్దువోక = ఏమీ తోచక, పొందు = కూడిక, ఒద్ద = దగ్గర, ఒరులు = పరాయి వారు, హితవు = ఇష్టము.

1. చెంగట = అతిసమీపమున, ఉంగిటి = ఊపిరాడని స్థితి, సంగతి = చేరిక, సింగారము = శృంగారము, చిత్తము = మానసము, పట్టు = చేకొను.
2. వేడుక = సంతోషము, సారె = మాటిమాటికి, మోవివిందు = అధరామృతము, వెట్టి = పెట్టి, ఆపె = ఆమె, ఈడుజోడు = సరిసమానము, విడెము = తాంబూలము, ఎడలేని = గడువు, విన్నపాలు = ప్రార్థనలు, వాడవారు = వీధిలోని వారు, వుట్టీనా = కలిగినదా?.
3. సందుకొని = విజృంభించి, కాగలించు = కౌగలించు, చన్నులు = వక్షోజములు, ఆపె = ఆమె, మందెమేళము = చనువుతో ఉన్న, సందిగొందులవారు = ఇరుకువీధులు. సరకుగొనేవా = లక్ష్యపెడతావా?

**భావము:** ఏదో కాలక్షేపముగా నీవు అన్యస్త్రీలను కూడితే కూడవచ్చు గాక. నీ చెంత ఆ అలమేలుమంగమ్మ ఉండగా ఇతరస్త్రీలే నీకు ప్రీతిగా కనిపిస్తున్నారా?

నీ సమీపమున పగలు రాత్రి అనే తేడా లేకుండా నీకు సేవలు చేస్తూ ఊపిరాడక నీ ఎదుట నిలబడినది. ఆమెను నిన్ను చేరి సరస సంభాషణలతో ఉల్లాసం కలిగిస్తుండగా, ఇతర శృంగార కాంతలు నీకు మనసుకు బట్టడం ఎంతవరకూ సబబు స్వామీ!

ఆ అమ్మ సంతోషంతో నీకు అధరామృతమునందిస్తూ, ఈడుజోడై, నీకు నిరంతరము తాంబూలము నందిస్తూ, నీకు గడువులేకుండా ఎన్నో ప్రార్థనలు చేస్తున్నది కదా!

స్వామీ! విజృంభించి నిన్ను కౌగలించుకొని, వక్షోజములనొత్తుతూ నీపట్ల చనువుతో ఉన్న ఆమె మరెవరో కాదు సాక్షాత్తూ అలమేలుమంగమ్మే సుమా! ఓ శ్రీవేంకటేశ్వరా! ఇందరిలోను నన్ను మోహించి ఏలుకున్నావు కదా! మరి ఇరుకుసందులలోనున్న కాంతలను లక్ష్యపెట్టడమెందుకు? వారితో పొందులు నీకెందులకు స్వామీ!

## 141

**అవతారిక:** అలమేలుమంగమ్మను కూడియున్న స్వామి సిగ్గు పడుతుండగా, చెలులు స్వామిపై అమ్మకున్న గాఢానురక్తిని వివరించే సన్నివేశం.

### భైరవి

ప. గక్కన లాలించరాదా కాఁగిట నించఁగరాదా
చెక్కు చేతితో నిదెంత సిగ్గులువడేవు ॥పల్లవి॥

1. చలివాసి నీతోను సరసమాడీ నదె
మొలకచన్నులు నీపై మోపీ నదె
చెలఁగి చుట్టరికము చెప్పీ నింతలోన నదె
చెలిఁ జూచి నీవెంత సిగ్గులువడేవు ॥గక్కన॥

2. కడువెల్లవిరిగాను కన్నుల మొక్కీ నదె
వొడిమీఁదఁగూచుండి వొరసీ నదె
జడియుఁదమితో మోవిచవు లడిగీ నదె
చిదుముడి నీవెంత సిగ్గులువడేవు ॥గక్కన॥

3. చెనకుచు నిను గూడిసేవలు సేసీ నదె
మనసిచ్చె నలమేలుమంగ నీ కదె
ఘనుఁడ మమ్మేలితివి కందువ శ్రీ వేంకటేశ
చినుకుఁజెమట నెంత సిగ్గులువడేవు ॥గక్కన॥

**అర్థములు:** ప.గక్కన = త్వరగా, లాలించు = బుజ్జగించు, కాగిట = కౌగిట, నించు = ఉంచు, చెక్కుచేయి = చెక్కిలిపై చేయిఉన్న చేయి, వడేవు = పడతావు.

1. చలివాసి = ప్రేమతో సన్నిహితమగు, మొలకచన్నులు = అప్పుడే అంకురిస్తున్న వక్షోజములు. చెలగు = ఉత్సాహము, వడేవు = పడేవు.
2. కడు = మిక్కిలి, వెల్లవిరి = వ్యాపించు, ఒడి = తొడలపై, ఒరసి = రుదుకొని, జడియుతమి = బాధతో కూడిన మోహము, మోవిచవులు = అధరామృత రుచులు, చిదుముడి = చీకాకు, తొట్రుపాటు, వడేవు = పడేవు.
3. ఎనకు = తాకు, ఘనుడు = గొప్పవాడు, కందువ = ఏకాంతము, జాడ, చినుకుచెమట = బిందువులుగా జారిపడే చెమట, వడేవు = పడేవు.

**భావము:** ఓ స్వామీ ఇలా చెక్కిలిపై చేతినుంచుకొని సిగ్గులు పడుతున్నావెందుకు? త్వరగా వెళ్ళి ఆయమను లాలించరాదా? కౌగిట చేర్చుకొని బుజ్జగించుకోరాదా?

ప్రేమతో నీతో కూడి సరసాలాడుతూ, యౌవనమంకురిస్తున్న వక్షాలను నీపై మోపి ఉన్నది. ఉత్సాహించి నీతో తనకున్న బంధుత్వాన్ని చెబుతూ ఉండగా, ఇంతలోనే ఆ చెలిని చూసి నీవు సిగ్గులు చిందిస్తున్నావెందుకు?

వ్యాపించిన అధికాసక్తితో, కన్నులతోనే ప్రార్థనలు చేయుచున్నది. నీ ఒడిలో ధృడంగా కూర్చొని, మోహంతో నీ అధరామృతం అడుగుచున్నది, ఇంతలోనే చీకాకుతో నీవెందుకు సిగ్గులొలకబోస్తున్నావు?

నిన్ను స్పృశిస్తూ, నిన్ను చేరి ఊడిగాలు చేస్తున్నది, ఆ అలమేలుమంగమ్మ నీకు మనసిచ్చినది. ఓ మహిమాన్వితుడైన శ్రీవేంకటేశ్వరా! ఏకాంతమున మమ్మేలుకున్న స్వామివి! చెమట చుక్కలు రాలుతూ ఉండగా ఎంత సిగ్గులు చిందిస్తున్నావయ్యా!

## 142

**అవతారిక:** చెలులు స్వామివారి వైభోగాన్ని వర్ణిస్తూ, వెంట ఉండి సేవలు చేసుకుని జీవించే వారమని, వారి సౌఖ్యాన్ని కూడా తలచవలసినదిగా ప్రార్థిస్తున్నారు.

### శ్రీరాగం

ప. నాడే నీవిచ్చిన బాస నమ్మి వున్నారము నేము
పోఁడిమిఁ దలచవయ్య పొంతనే మా సేవలు ॥పల్లవి॥

1. పఱపుపైఁ బవళించి పడఁతి విడె మియ్యఁగ

నెరిసరసము గడునిండా నాడేవు
యెఱుకతో సంతోసాల నెంతపరాకై నాఁగద్దు
మఱవకురయ్యా మాపై మన్నన లెప్పుడును ॥నాడే॥

2. గద్దెమీఁదఁ గూచుండి గందము నీకుఁ బూయఁగ
వొద్దిక నాపెతోడ నవ్వులు నవ్వేవు
కొద్దిలేనివలపులు కోటానఁగోటులు మీకు
సుద్దులు దలఁచి దయఁజూడవయ్యా మమ్మును ॥నాడే॥

3. కొలువులోనిలుచుండి కూరిమి నీపైఁ జల్లఁగా
అలమేలు మంగ నురమందు నించేవు
తొలుతె శ్రీ వెంకటేశ దొరసితి రిద్దరును
అలరి మమ్మేలి మాయంకల రాఁగదవయ్యా ॥నాడే॥

**అర్థములు:** ప.నాడు = ఆదినము, పోడిమి = సౌఖ్యము, పొంత = సమీపము.

1. పరపు = పరుపు, విడెము = తాంబూలము, నెరి = అందము, ఎరుక = తెలిసియున్న, పరాకు = పారవశ్యము, గద్దు = గలదు, మరవకురయ్యా = అయ్యా మరవకండి, మన్నన = దయ.
2. గద్దె = ఆసనము, ఒద్దిక = అనుకూలము, ఆపె = ఆమె, కొద్దిలేని = తక్కువగాని, కోటానుగోటులు = అధికము, సుద్దులు = మంచిమాటలు.
3. కొలువు = ఆస్థానము, కూరిమి = ప్రేమ, ఉరము = వక్షస్థలము, నించేవు = నిలిపావు, తొలుత = పూర్వము, దొరయు = పొందు కలయు, అలరి = సంతోషము, అంకల = ప్రక్కన, రాగదవయ్యా = రావయ్యా!

**భావము:** ఆనాడే నీవు చేసిన ప్రమాణములను నమ్మి యున్నవారము. నీ వెంట వెంట ఉండి సేవలు చేసుకుని జీవించే వారము. మా సౌఖ్యము తలచవలసినదిగా ప్రార్థిస్తున్నాము.

పట్టుపానుపుపై పడుకున్న నీకు అమ్మ తాంబూలము నందించగా, అందమైన సరసాలు ఎన్నెన్నో ఆడి యున్నావు. ఇవన్నీ తెలిసి పారవశ్యంతో ఎంతో సంతోషాన్ని వెలిబుచ్చావు. ఓ స్వామీ! నీ సేవకులమైన మమ్మలనెప్పుడూ మరవక మీ దయను చూపించమని కోరుకుంటున్నాము.

ఆసనము మీద కూర్చొండజేసి నీకు చందనమును పూయగా, అనుకూలుడవై ఆమెతో హర్షం వ్యక్తం చేసావు. ఏమాత్రం తక్కువగాని ప్రేమలు కోకొల్లలుగా చూపించావు. మంచి మాటలను తల్చుకుని మాపె కూడా నీ దయను చూపమని ప్రార్థిస్తున్నాము.

ఆస్థానములో నిలుచుండి నీపై ప్రేమాతిశయము చూపినందువల్ల ఆ అలమేలుమంగమ్మను వక్షస్థలమందు ధరించావు. ఓ శ్రీవేంకటేశ్వరా! ఇద్దరూ పూర్వమే పొందుకూడితిరి. స్వామీ! సంతోషముతో మమ్మునూ ఏలుకొని మా ప్రక్కకు రావయ్యా! మాపై కూడా నీ దయను ప్రసరించవయ్యా!

## 143

**అవతారిక:** శ్రీ వేంకటాద్రి గోవిందరాజును స్తుతిస్తూ చెలులు చేసుకునే విన్నపాలు.

### పాటి

ప. కమ్మటి నెవ్వరినైనాఁ గాకు సేసీని
ఇమ్ముల నా సోదము యెంత గద్దో చూడరే ॥పల్లవి॥

1. కొలువై వున్నాఁడు వాఁడె గోవిందరాజు మించి
చెలు లిద్దరు పాదాలు చేరి యొత్తఁగా

చెలరేఁగి నవ్వుకొంటా శేషునిపైఁ బవళించి
పలుమారు వలపులు పచరించీఁ జూడరే ॥కమ్మటి॥

2. తగవులు దిద్దీ వాఁడే తమితో గోవిందరాజు
మగువ లందెంది యాకుమడిచియ్యఁగా
జిగి మర్మాలంటుకొంటా చిత్తరువుమేడలోన
వెగటులేని మోహము వెదచల్లీఁ జూడరే ॥కమ్మటి॥

3. కదిసీ నదివో శ్రీ వేంకటాద్రి గోవిందరాజు
సుదతులు కాఁగిట మెచ్చులు మెచ్చఁగా
గుదిగొన మోవియిచ్చుకొంటా నేకతమున
పొదిగొన్నమచ్చికలు పోదిసేసీఁ జూడరే ॥కమ్మటి॥

**అర్థములు:** ప.కమ్మటి = మరలా, కాకు = కలత, ఇమ్ముల = పూర్తిగా, ఆసోదము = గాఢ భావన, గద్దో = గలదో, చూడరే = చూడండి చెలులారా!

1. చెలరేగి = విజృంభించి, పచరించు = కనబరచు
2. దిద్ది = సరిచేసి, తమి = అపేక్షతో, అందింఅంది = అందంది = మీద మీద అందించుట, యాకుమడచి = తమలపాకులు మడచి, జిగి = కాంతి, మర్మాలంటుకొను = రహస్యావయములను తాకుతూ, చిత్తరువు = ఆశ్చర్యము, మేడ = భవంతి, వెగటు = వైరస్యము, మోహము = వలపు, వెదచల్లీ = వ్యాపింపజేసెను, చూడరే = చూడండి చెలులారా!
3. కదిసి = సమీపించు, సుదతులు = స్త్రీలు, కాగిట = కౌగిట, మెచ్చులు = అభినందనలు, గుదిగొన = అతిశయించునట్లు, మోవి = ముఖము, ఏకతమున = అన్యచింతనలేక, పొదిగొను = గుంపుగూడు, మచ్చిక = ఆసక్తి, అలవాటు, పోదిసేసి = ప్రోగుచేసి.

**భావము:** ఓ చెలులారా! గమనించారా! స్వామి మరలా పూర్తిగా కలత చెంది ఎలాంటి భావనలు కలిగియున్నాడో గదా! చూడండి.

చెలులారా! ఇక్కడ కొలువై ఉన్న గోవిందరాజ స్వామికి, చెలులిద్దరూ పాదాలొత్తి సేవలు చేస్తుండగా, విజృంభించి చిరునవ్వులు చిందిస్తూ, శేషపానుపుపై, పవళించి, అనేకమార్లు వారిపై వలపులు చిందిస్తున్నాడు.

చెలులారా! అనేకమార్లు వారి తగవులను తీర్చిన గోవిందరాజుకు అపేక్షతో ఆ మగువలందిస్తున్న తాంబూలమును సేవిస్తూ, ఆ ఆశ్చర్యంగొలిపే భవంతిలో వారిద్దరితో వైరస్యము లేని వలపును ప్రదర్శిస్తూ ఉన్నాడు.

చెలులారా! అదిగో శ్రీవేంకటాద్రి గోవిందరాజు! వారిద్దరూ ఆ స్వామిని సమీపించి, కౌగిటి సుఖాలనుభవిస్తూ, ప్రశంసిస్తూ, తమ మోవిని అందిస్తూ అధరామృతం గ్రోలమని అనన్య చింతనతో గుంపుగూడిన అపేక్షలతో సతమతమవుతూ ఉన్నారు. చూడండి చెలులారా!

## 144

**అవతారిక:** అలమేలుమంగమ్మ స్వామిపై కినుక వహించి, ఆరడి పెడుతున్నదని తెలిసిన చెలులు యిదేమాత్రంతగదని స్వామిని కూడమని హితవు చెప్తున్నారు.

### మలహరి

ప. ఏఁటికి గుంపెన లిఁకనేలే నీకు
కూటమి రతులకుఁ గొసరఁగ రాదా ॥పల్లవి॥

1. వొడివట్టుచునుఁ బతి వొడఁబరచఁగాను
జడియుచుఁ బలికి కసరుదురటే

అదరి కెమ్మోవితేనియలు గురిసీ నదే
తొడరి నీవుబువ్వము దొడుకcగరాదా ॥ఏcటికి॥

2. నమ్మిక లొసగుచు నవ్వులు నవ్వcగాను
చిమ్ముచు నాఆడి యింతసేతురటే
వుమ్మడిcగుచము లాతcడొరసీ: వలపులు
నెమ్మి చుట్టరికములు నెఱపcగరాదా ॥ఏcటికి॥

3. కలయుచుc గాcగిట కందువ లంటగాను
కెలయుచుc గడును జంకింతురటే
యెలమిని శ్రీ వేంకటేశcడు మన్నించీని
పలుకుcబంతముల పై కొనరాదా ॥ఏcటికి॥

**అర్థములు:** ప.ఏటికి = ఎందుకు? గుంపెన = గంతులు, మిడిసిపాటు, కూటమి = కూడిక, కొసరు = ప్రార్థించు.

1. వొడివట్టు = తొడపైభాగము, పతి = మగడు, ఒడబరచు = ఒప్పించు, జడియుచు = భయముచెందు, పలికి = మాట్లాడి, కసురు = కోపించు, అదరి = అలరించు, కలిగించు, కెమ్మోవి = అధరము, తేనియలు = అమృతము, తొడరి = అనుసరించి, బువ్వము = పెండ్లి విందు, దొడుక తొడుకు = గ్రహించు.
2. చిమ్ముట = ఆడించు, ఆరడి = అగచాట్లు, ఉమ్మడి = ఏకకాలమున, ఒరసి = ఒత్తిడి కలిగించు, నెమ్మి = ప్రేమ, చుట్టరికము = బంధుత్వము, నెరపు = చేయు.
3. కాగిట = కౌగిట, కందువ = ప్రదేశము, కెలయు = విజృంభించు, జంకించు = అదరగొట్టు, ఎలమి = వికాసము, మన్నించు = గౌరవించు, పలుకుబంతము = పట్టుదల మాటలు, పైకొను = యత్నించు.

**భావము:** ఓ అలమేలుమంగమ్మా! ఈ కుప్పిగంతులు, మిడిసిపాటుతనము ఇంకా నీకెందుకు? స్వామిని కూడి కలయికకు ప్రార్థించరాదా?

నీ ఒడి పట్టుకుని భర్త నిన్ను అంగీకరింపజేయగా, భయపడుతూ ఏవేవో మాట్లాడి కోపపడతారటే! అలరించే అధరామృతము పైకి ఉబికి వస్తున్నది, స్వామిని అనుసరించి నీవు పెండ్లి విందు గైకొనరాదటే!

నీతో ఉల్లాసమైన కబుర్లాడుతూ నవ్వులు రువ్వుతూ ఉండగా, ఆతణ్ణి ఆటలాడిస్తూ ఇన్ని అగచాట్ల పాలు చేస్తావటే! ప్రేమాతిశయంతో స్వామిపై నీ కుచములు గట్టిగా నొక్కిపట్టి, నీ చుట్టరికాన్ని చూపి స్వామిని అలరించరాదా?

స్వామి నిన్ను కౌగిట తీసుకొని అందరాని తావులంటుకోగా, విజృంభించి ఇలా బెదరగొడతారటే! వికాసముతో శ్రీవేంకటేశ్వరుడు నీ చేతలన్నీ మన్నించి, నిన్ను గౌరవించాడు కదా! ఇంకా నీకీ పట్టుదలమాటలెందుకు? మానుకోరాదా?

## 145

**అవతారిక:** సకల సేవలూ చేస్తున్న అమ్మను కలవకుండా స్వామి ఎందుకో తాత్సారం చేస్తున్నాడని, బిడియాలు పోతున్నాడని గ్రహించిన చెలులు స్వామికి చేసే నివేదన.

### కన్నడగౌళ

ప. ఇంతసేసినవాcడవు యీడేరించుకొనరాదా
వింతలాయc జేcతలెల్ల వెరపేల నీకును ॥పల్లవి॥

1. పొందులేనివాcడవైతే పొంతc గూచుండcగనేల
ఇందుముఖి నీతోడ నేల నవ్వీని

మందలించి నన్నునేల మాటల భ్రమఇంచేవు
సందుకొంటి విఁక వట్టిసటలేల నీకును ॥ఇంత॥

2. ఆసలేనివాఁడవైతే లాసి ఇట్టె చూడనేల
మోసదీర సతి నీకు మొక్కఁగనేల
బాసలిచ్చి నన్నునేల పై పై నొడఁబరచేవు
రాసికెక్కితివి విచారములేల నీకు ॥ఇంత॥

3. చుట్టమవు గాకుంటే సుద్దులు చెప్పఁగనేల
ఇట్టె ఆయింతి విడె మియ్యవచ్చునా
నెట్టన శ్రీ వేంకటేశనేఁడు నన్ను నేలితివి
గుట్టెల్లాఁ దెలిసితిమి కొంకనేల నీకు ॥ఇంత॥

**అర్థములు:** ప. ఈడేరించు = సిద్ధించు, వెరపు = అదురు బెదురులు.

1. పొందు = కూడిక, పొంత = సమీపము, మందలించు = హెచ్చరించు, భ్రమయించు = భ్రాంతికి గురిచేయు, సందుకొను = కూడికకై వచ్చు, సటలు = మాయలు.
2. లాసి = ఎక్కువగా, మోస = అడ్డు, బాస = ప్రమాణము, ఒడబరచు = ఒప్పించు, రాసి = అధికము అనే అర్థంలో, విచారము = చింత.
3. చుట్టమవు = చుట్టమగు, సుద్దులు = మంచిమాటలు, విడె = తాంబూలము, నెట్టన = అనివార్యము, గుట్టు = రహస్యము, కొంకు = సంకోచము, అనుమానము.

**భావము:** ఓ స్వామీ! ఇంత చేసినవాడవు. ఇకనైనా నీ కోరికలు సిద్ధింపజేసుకోరాదా? నీ కార్యాలు చాలా వింతలు విచిత్రాలు గా ఉంటాయి. ఇంకా ఈ అదురుబెదురులెందులకు?

నీకు పొందు కూడే ఉద్దేశమే లేనట్టైతే వచ్చి ప్రక్కన ఎందుకు కూర్చొంటున్నావు? ఆ రమణి నీతో కలిసి నవ్వనేల? సున్నితంగా భయపెడుతూ కూడా మరలా మాటలతో భ్రాంతులకు గురిచేస్తున్నావు. కూడికకై వచ్చినవాడివి కదా ఇంకా ఈ మాయలు నీకెందుకు?

ఏమాత్రం ఆశలేని వాడవైతే ఈవైపే ఎక్కువగా ఎందుకు నీ చూపులు సారిస్తున్నావు? అడ్డూ అలుపులు లేకుండా ఆ లలన నీకు మ్రొక్కులు చెల్లించనేల? ఏవేవో మాటలు చెప్పి ప్రమాణాలు చేసి నన్నెందుకు పైపై మాటలతో ఒప్పించడానికి ప్రయత్నిస్తున్నావు? ఇంత అధికమైన ప్రేమాదరణ కనబరచావు కదా! ఇంకా ఏవేవో చింతలలో మునగడం ఎందుకు?

నీవు నాకు బంధువు కాకపోతే మంచి మంచి మాటలన్నీ నాతో చెప్పడం ఎందుకు? ఊరకే ఏమీ లేకుండానే ఆమె నీకు తాంబూలం అందిస్తుందా? ఓ శ్రీవేంకటేశ్వరా! తక్షణమే నన్నేలుకున్నావు. రహస్యాలన్నీ బట్టబయలయ్యాయి కదా ఇంకా ఈ జంకుగొంకులు నీకేల? వచ్చి కూడరాదా?

## 146

**అవతారిక:** అలమేలుమంగమ్మ చేసే పనులన్నింటిని ఉపేక్షిస్తూ, సర్వ విషయాలలో దోషాలెంచుతున్న స్వామిని వివరమడిగే సన్నివేశం.

### వరాళి

ప. నీ వొళ్ళఁ గల్లలేకుంటే నిండుక వుందువుగాక
చేవదేరి వుండఁగాను సిగ్గువడ నేఁటికి ॥పల్లవి॥

1. మొగము చూచి చెలి మొక్కలు నీకు మొక్కఁగా-

నెగసక్కెలంటా నేల యెంచుకొనేవు
నగుతా నాపె నిన్ను నాయము లడుఁగఁగాను
వెగటువెంగేలంటా వీఁగఁగ నేమిటికి ॥నీ వొళ్ళ॥

2. మక్కువతో నేడలేనిమాట లింతి యాడఁగాను
వెక్కసము లందులో భావించి చూచేవు
యిక్కువ నాపె నీకు నిచ్చకములు, చూపఁగ
పక్కన నొరపు లట్టె పట్టఁగ నేమిటికి ॥నీ వొళ్ళ॥

3. మనసిచ్చిన సతి నీ మర్మములు ముట్టఁగాను
తనివోని సిగ్గుతోడఁ దలవంచేవు
ఘనుఁడ శ్రీ వేంకటేశ కందువ నన్నేలితివి
పెనఁగీఁ గాఁగిట నాపె బిగువులేమిటికి ॥నీ వొళ్ళ॥

**అర్థములు:** నీ వొళ్ళ = నీ వల్ల, కల్ల = తప్పు, నిండుక = నిండుకుండవలె, ఏమీ భీతి లేకుండా, చేవదీరు = ధైర్యము, ఏటికి = ఎందుకు?

1. మొక్కలు = మ్రొక్కులు, ఎగసెక్కేలు = పరిహాసాలు, ఎంచు = లెక్కించు, నగుతా = నవ్వుతూ, ఆపె = ఆమె, నాయము = న్యాయము, వెగటు వెంగెములు = బాధకలిగించే వేళాకోళములు, వీగు = ఉత్సాహించు, ఏమిటికి = ఎందులకు?
2. మక్కువ = ఇష్టము, వెక్కసము = అధికము, భావించి = ఆలోచించి, ఇక్కువ = జాడ, ఆపె = ఆమె, ఇచ్చకములు = ప్రీతికలిగించు సంభాషణలు, ఒరపు = దోషము.
3. మర్మము = రహస్యము, ముట్టు = తాకు, తనివోని = తృప్తిలేని, ఘనుడు = గొప్పవాడు, కందువ = ఏకాంతము, పెనగు = చుట్టుకొను, కాగిట = కౌగిట, ఆపె = ఆమె, బిగువు = బింకము.

**భావము:** ఓ స్వామీ! నీవల్ల ఏ తప్పూ లేకుంటే ఏమీ భీతిలేకుండా హాయిగా ఉంటావు కదా! ధైర్యముగా ఉండక ఇలా సిగ్గుపడడమెందులకు?

చంద్రబింబంబము వంటి నీ ముఖారవిందాన్ని చెలి అనేక మ్రొక్కులు మ్రొక్కగా, పరిహాసాలాడుతున్నాదంటూ ఎందుకు భావిస్తావు? నవ్వులు చిందిస్తూ ఆమె నిన్ను న్యాయాన్యాయాలడిగితే, నీకు బాధ కలిగించే వేళాకోళం అని భావిస్తావెందులకు?

నీమీద ప్రేమతో ఆ ఇంతి ఎక్కడా లేని కబుర్లన్నీ నీముందు కుమ్మరించగా, అందులో ఎక్కువ తక్కువలెంచడం ఎందుకు? నీ జాడ తెలిసి నీతో ప్రీతికలిగించే మాటలు మాట్లాడితే, దానిలో దోషాలెంచడం ఎందుకు?

నీకు మనసిచ్చిన భార్య నీతో కూడి మర్మస్థానాలను ముట్టినపుడు ఎక్కడలేని సిగ్గులొలకబోస్తూ తలవొంచుకుంటావు. ఓ సర్వ శ్రేష్ఠుడైన శ్రీ వేంకటేశ్వరా! ఏకాంతమున నన్నేలులుకున్నావు. ఆమె నిన్ను చుట్టుకొని కౌగిట బంధించినప్పుడు ఇంకా బిగువులు బింకాలు నీకెందులకు?

## 147

**అవతారిక:** స్వామిని అమ్మ అలమేలుమంగమ్మ తను చేసే మర్యాదలలో, ఉపచారాలలో లోపమున్నదా యని ప్రశ్నిస్తూ, ప్రతిపనికి పోట్లాటలెందుకు పెట్టుకుంటారని వాపోతున్నది.

### నట్టనారాయణి

ప. దేవరవు గావా తెలిసితి మల్లనాఁడె
చేవదేరిన పనులు చెప్పనేల యిఁకను ॥పల్లవి॥

1. జఱసి జఱసి నీ యాచారము లేమి చెప్పేవు
యెఱఁగనా నీ సరిత లింతక తొల్లి

యెఱుకలు సేసి నివు యెచ్చరించ నిపుడేల
మఱచేవా నీకతలు మాటికి మాటికిని ॥దేవర॥

2. వెంటనే పొగడుకొని విఱ్ఱవీఁగే వెంతేసి
కంటిగా నీ గుణములు గరగరగా
పెంటలుగాఁ బచారించి పెనఁగులాడఁగనేల
జంటగాక విడిచేవా చలముతో నీవు ॥దేవర॥

3. పుక్కిటివిడె మిచ్చి పొంచి వొడఁబరచేవు
దక్కెఁగా నీకాఁగిలి తతితోడను
గక్కన శ్రీ వెంకటేశ కలసితి విదె నన్ను
తక్కువయినవా నీ తగిన మన్ననలు ॥దేవర॥

**అర్థములు:** ప.దేవర = ప్రభువు, అల్లనాడే = ఏనాడో, చేవదీరు = సారవంతము.

1. జరసి = నిందించు, ఆచారము = అలవాట్లు, సరిత = చరిత్ర, కథ, తొల్లి = పూర్వము, ఎరుకజేయు = తెలియజెప్పు, హెచ్చరించు = సూచనలు చేయు.
2. విర్రవీగు = మిడిసిపడు, ఎంతేసి = ఎంతో ఎక్కువగా, గరగర = శోభలు, పెంటలుగా = బాధపడే విధంగా, పచరించు = కనబరచు, పెనగులాడు = పోట్లాడు, చలము = కంపము.
3. విడెము = తాంబూలము, పొంచి = దాగి, ఒడబరచు = అంగీకరింపజేయు, దక్కు = పొందు, కాగిలి = కౌగిలి, తతి = అదను, గక్కన = త్వరగా, మన్నన = గౌరవము.

**భావము:** నీవు మా ప్రభువువు కావా స్వామీ! ఏనాడో మాకు నీ కార్యములన్నీ తెలిసినవి. నీ ఘనకార్యాలు ఇంకా చెప్పుకోవడమెందులకు?

ఏవో నిందలు వేస్తూ నీ అలవాట్లు, ఆచార వ్యవహారాలు చెప్పడమెందుకు? పూర్వం నుండి నీ చరిత్ర మొత్తం నాకు తెలియదా ఏమిటి? ఇప్పుడు నీవు ప్రత్యేకంగా మాటిమాటికి తెలియజెప్పడం ఎందుకు? నీ కథలన్నీ మరచిపోయావా?

వెంటనే స్తుతించుకుంటూ ఈ మిడిసిపాటులెందుకు? నీ శోభించే గుణగణములన్నీ మేమెరిగినవే కదా! ఇప్పుడు బాధపడే విధంగా అవన్నీ మాకు కనబరచి పోట్లాటలు పెట్టుకోవడమెందుకు? కంపముతో నాతో జంట కూడకుండా విడిచిపెడతావా ఏమిటి?

నీ బుగ్గన ఉన్న తాంబూలమిచ్చి దాగి దాగి నన్నంగీకరింపజేస్తావు. అదను చూసి చుట్టుకున్న నీ కౌగిలి మాకు దక్కినది. ఓ శ్రీవేంకటేశ్వరా! శీఘ్రముగా నీవీవిధంగా నన్ను కూడావు. ఇవ్వవలసిన మర్యాదలు మానుండి నీకేమైనా తక్కువైనవా స్వామీ విన్నవించండి.

**విశేషము:** ఈ కీర్తనలోని నాయికను కలహాంతరితగా భావించదగును.

## 148

**అవతారిక:** స్వామివారికి అలమేలుమంగమ్మకు ఏవో చిలిపి గిల్లికజ్జాలున్నప్పటికి, వారిరువురి బంధం విడదీయరానిదని పలు ఉపమానాలతో ఉదాహరిస్తున్నారు చెలులు.

## దేసాళం

ప. అన్నియుఁ దెలిసినవే అందరును
వెన్నలో నేతివంటిది వేడుక నీ ప్రియము ॥పల్లవి॥

1. మొక్కలాన నాకె నిన్ను మోత నొకమాటాడితే
వెక్కసములాడేవు వేమారును

మక్కువ మీ ఇద్దరికి మాటలే వాండ్లుగాని
లక్కవంటి వెంచిచూడ లవి మీ మనసులు ॥అన్నియు॥

2. చిట్టకాన కాపె నీపై జెనకి చేయిచాcచితే
వొట్టుకొని పెనcగుతా నొడ్డుకొనేవు
గుట్టుతోడ నుండేవి మీ గుణము లింతేకాని
పట్టుజిగురువంటిది పాయనిమీవలపు ॥అన్నియు॥

3. చెలిమిసేయుచు నాపె సెలవుల నగితేను
చెలరేగి నవ్వేవు శ్రీ వేంకటేశ
బలిమి చూపేవి మీ పంతము లింతేకాని
తలిరులవంటివి బిత్తరపు మీ మోవులు ॥అన్నియు॥

**అర్థములు:** ప. ప్రియము = ప్రేమాభిమానము.

1. మొక్కలాన = మోటుదనము, ఆకె = ఆమె, మోత = భారము, వెక్కసము = అధికము, వేమారు = వెయ్యిమాట్లు, మక్కువ = ప్రేమ, వాండ్లు = వాడు కు బహువచన రూపం, లక్క వంటివి = విడదీయరానివి, ఎంచు = లెక్కించు.
2. చిట్టకాలు = శృంగార చేష్ట, ఆపె = ఆమె, చెనకి = తాకు, వొట్టుకొను = వొట్టుపెట్టుకుని, పెనగు = పోట్లాడు, ఒడ్డుకొను = తప్పుకొను, గుట్టు = రహస్యము, పట్టుజిగురు = పట్టుపురుగుల వలన వచ్చు జిగురు (గట్టియైనది) పాయని = వీడని, వలపు = ప్రేమ.
3. చెలిమి = స్నేహము, ఆపె = ఆమె, సెలవులు = అనుకూలమైన, బలిమి = బలము, పంతము = పట్టుదల, తలిరులు = చిగుళ్ళు, బిత్తర = అదిరిపడు.

**భావము:** ఓ స్వామీ! అన్ని విషయాలు తెలిసినవే గదా! నీ ప్రేమ వెన్నలో నేయి వలె విడదీయరానిది.

మోటుదనముతో ఆమె నిన్ను కోపభారంతో ఒక మాట అంటే, నీవు తిరిగి అధికముగా వేయి మాటలంటావు. మీ మాటలు పదునైనవిగా ఉన్నప్పటికి మీ ప్రేమలధికమై లక్కవలె మీ మనసులను సులభంగా కరిగిపోయి ఒకరికొకరు కలిసిపోతారు.

ఏదో శృంగార చేష్టగా ఆమె నిన్ను స్పృశిస్తూ చేయి చాచగా, ఒట్టుపెట్టుకొని పోట్లాడుతూ తప్పుకుంటావు. మీ సహజ గుణములింతే అయినా మంచి గుట్టుతో కాపురం సాగిస్తారు, పట్టులోని జిగురువలె మీ ప్రేమలెప్పటికి వీడనే వీడవు.

స్నేహభావంతో ఆమె అనుకూలమైన నవ్వులు నవ్వితే, ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు కూడా విజృంభించి నవ్వుతుంటావు. మీ పంతాలు పట్టింపులు సాధారణమైనవే లేత చిగురుటాకులవంటివి మీ అదిరిపడే ముఖారవిందాలు.

**విశేషము:** అన్నమయ్య ఈ కీర్తనలో స్వామికి అమ్మవారి కల ప్రేమానురాగాలను వెన్నలోనేయితోను, లక్కతోను, జిగురుతోను సంభావించి విడదీయరాని బంధం అని ప్రస్తుతించాడు.

## 149

**అవతారిక:** సర్వ సలక్షణమైన అలమేలుమంగమ్మ దేవేరిగా నీ చెంత నుండగా, ఇంకా అన్య స్త్రీలపై మోజెందుకని చెలులు ప్రశ్నిస్తున్నారు.

### బౌళిరామక్రియ

ప. నీదు సేcతలకు నీవే దిష్టము
మేదివి నేమెల్లా మెచ్చితిమయ్యా ॥పల్లవి॥

1. యీడగుకాంతలు యింటనే వుండcగ
వాడలసతులకు వలచితివి

వోడక క్షీరాబ్ధినుండి రేపల్లెను
తోడనే వెన్నలు దొంగిలినట్లు ॥నీదు॥

2. వుంగిటివాసన లొడలనే వుండఁగ
అంగడి గందము లడిగితివి
బంగారు పీతాంబరము నీకుండఁగా
చెంగటికోకలు చేకొన్నట్లు ॥నీదు॥

3. ఆసఁ గౌస్తుభము అక్కున నుండఁగ
శ్రీ సతి నురమునఁ జేర్చితివి
సేస శ్రీవేంకటశిఖ (రీడ?)డు కుండఁగ
రాసికుచగిరుల రమించినట్లు ॥నీదు॥

**అర్థములు:** ప.నీదు = నీయొక్క, సేతలు = పనులు, దిష్టము = చూడబడినది, సాక్ష్యము, మేదిని = భూమండలము, నేమెల్లా = మేమెల్లా, మెచ్చు = పొగడు.

1. యీడగు = సాటివచ్చు, చక్కగా సరిపోయినటువంటి, వాడల సతులు = వీధులలో ఉన్న భామలు, ఓడక = అపజయముపొందక, క్షీరాబ్ధి = పాలసముద్రము, దొంగిలినట్లు = దొంగిలించినట్లు.
2. ఉంగిటి వాసన = కపటపు ఛాయలు, ఒడలన = శరీరంపై, అంగడి = దుకాణము, గందము = గంధము, పీతాంబరము = పసుపచ్చని వస్త్రము, చెంగటి కోక = సమీపములోని చీరలు, చేకొను = పట్టుకొను.
3. ఆస = కోరికతో ధరించిన, కౌస్తుభము = వక్షస్థలమునందలి మణి విశేషము, అక్కు = రొమ్మున, శ్రీసతి = శ్రీమహాలక్ష్మి, ఉరమున = వక్షస్థలముపై, సేస = తలంబ్రాలు, అక్షింతలు, శిఖడు = కొప్పు లేక శిఖగలవాడు, రాసి = కుప్పలు, అధికమైన, కుచగిరులు = వక్షోజములు, రమించు = శృంగారక్రీడలోనుండు.

**భావము:**ఓ స్వామీ! నీవు చేసే ఘన కార్యాలకు నీవే సాక్షి! ఈ సమస్థ భూమండలంలోని జనులెల్లా మెచ్చుకుంటున్నారయ్యా!

వరసైన వారు, ఈడైనవారు, నీ కీర్తికి సాటివచ్చేవారు ఇంటనుండగా, వీధులలోని భామలను కాంక్షిస్తావెందుకయ్యా! సలక్షణమైన పాలసముద్రం విడిచిపెట్టి, రేపల్లెలో దూరి వెన్నలు దొంగిలించినట్లుందయ్యా నీ ఈ చేతలు.

నీ మాయలు, కపటపు వేషాలు అలాగే ఉన్నాయి సుమా! అంగడి సరుకుపై నీకు మోజెందుకు స్వామీ? ఇదెలా ఉందన్నదంటే పట్టు పీతాంబరాలు ధరించే నీకు చెంతనున్న స్త్రీల ముతకనేత చీరలు పట్టుకున్నట్లుగా ఉంది.

వక్షస్థలముపై కోరికతో ధరించిన కౌస్తుభమణిహారం ఉండగా నీ ఉరమున శ్రీదేవిని చేర్చుకున్నావు. ఓ శ్రీవేంకటేశ్వరా! అక్షింతలు, తలంబ్రాల బియ్యం అలాగే నీ కొప్పున ఉండగా, చెలుల వక్షోజములతో క్రీడిస్తూ రమించినట్లుగా ఉన్నది.

**విశేషాంశాలు:** ఇందులో అన్నమయ్య మూడవ చరణములో "శ్రీవేంకట శిఖడు" అనే పదం వాడాడు. అన్నమయ్య చాలా సంస్కృత పదాలకు విభక్తులను తగిలించి తెలుగు చేసినవిషయం మనకు తెలుసు. ఉదా: అప్పడు, తిరువేంగళప్పడు లాంటివి. శర పదం నుండి శరుడు పుట్టినట్లుగానే, శిఖ అనే పదానికి "డు" చేర్చి శిఖడు అన్నాడు. శిఖడు అంటే ఇంకా అందగించి ఉండేది. ఇక్కడ అర్థం శిఖ గలవాడు అని తీసుకోవలసి ఉంది. పరిష్కర్త సూచించిన విధంగా "శిఖరీడు" అనే పదమైనా తీసుకోవచ్చు. శిఖరీ అనే సంస్కృతపదానికి కొండ అనే అర్థంలో పుంలింగ విశేష్యము. కనుక అన్నమయ్య వాడిన శిఖడు అనే పదమైనా సరిపోతుందని నా భావన.

## 150

**అవతారిక:** అలమేలుమంగమ్మ తన రహస్యాలన్నీ స్వామి అన్యస్త్రీలకు చేరవేస్తున్నాడని గ్రహించి కినుకవహించగా, స్వామికి ఇది తగునాయని హితవు చెప్తున్నారు చెలులు.

## నాదరామక్రియ

ప. అందుకే పో చింతించీ నప్పటినుండి
చెంది వేఁడుకొనవయ్యా చెలిని యీ వేళను ॥పల్లవి॥

1. గుట్టున నుండినదాని గోరు చంటిమీద దీసి
నట్టనడుమ నూరకే నవ్వితివట
అట్టె అదియునుగాక అలయించి యేమిటికో
ఱట్టుగా గేరడము లిట్టె యాడితివట ॥అందుకే॥

2. ముప్పిరిసిగ్గరిదానిముసుగు దీసి మోమెత్తి
తప్పక చూచితివట త త్తరానను
అప్పటి వేరొకతెతో నాపెరహస్యములెల్లా
చెప్పి మోవిమీఁద గంటిసేసితివట ॥అందుకే॥

3. చెలఁగి కూడినదానిచీర నీవు గట్టుకొని
యెలమిఁ బచ్చడ మాపె కిచ్చితివట
అలమేలుమంగపతివైన శ్రీవేంకటేశుఁడ
నిలువు గల్కితగాలు నేర్పితివట ॥అందుకే॥

**అర్థములు:** ప. చింతించు = బాధపడు, వేడుకొను = బ్రతిమిలాడు.

1. గుట్టు = రహస్యము, చంటి = చన్ను, ఱట్టు = నింద, కేరడము = తిరస్కారభావము
2. ముప్పిరి = మూడువిధములు, తత్తరము = తడబాటు, గంటి = గాయము.
3. చెలగు = విజృంభించు, ఎలమి = వికాసము, పచ్చడము = పై అంగవస్త్రము, కల్కితగాలు = సొబగులు, దగ్గరయుండి నేర్పించు.

**భావము:** ఓ శ్రీనివాసా! ఈవేళ అలమేలుమంగమ్మ దగ్గరచేరి బ్రతిమాలుకోవయ్యా! నీకోసం ఆమె ఎప్పటినుండో చింతిస్తూ కూర్చున్నది.

నిబ్బరంగాకూర్చున్న ఆమె వక్షోజములపై చేయి వేసి గోటనొక్కి (నఖక్షతాలు చేసి), మధ్య మధ్యలో ఊరకే నవ్వులు చిందిస్తున్నావట. అదీ కాకుండా ఆమెను శ్రమపెట్టి, ఎందుకో ఎత్తిపొడుపు మాటలు కూడా మాట్లాడావట గదా!

అసలే సిగ్గుపడుతూ ఉన్న ఆమె మేలి ముసుగు తీసి ఆమె ముఖారవిందాన్ని తొందరపాటుతో పరికించావట. అలాగే వేరొకతెతో ఆమె రహస్య విషయాలన్నీ చెప్పి ముఖంపై గోటిగాయాలు (నఖక్షతాలు) వేశావట గదా!

నీ ఉత్సాహం ఎంత అధికమైనా, పొందు కోరినదాని చీరను నువ్వు ధరించి, నవ్వుతూ నీ అంగవస్త్రం ఆమెకు ధరింప జేశావట. అలమేలుమంగకు పతియైన ఓ శ్రీవేంకటేశ్వరా! ఆమెకు ఎన్నో విషయాలు స్వయంగా దగ్గరుండి నేర్పించావట.

## 151

**అవతారిక:** స్వామివారి శృంగారలీలలు గ్రహించిన అలమేలుమంగమ్మ ఆయన శరీరంపై దంత, నఖక్షతాలేల కనబడుతున్నాయని ప్రశ్నించి నిలదీస్తున్నది.

## దేశాక్షి

ప. చెల్లదా నీవేమేమి సేసినా నీకు
వెల్లవిరిగా నేల వింతలు సేసేవు ॥పల్లవి॥

1. చీటికిమాటికి నన్ని సేఁతలెల్లా జేసివచ్చి
మాటలెన్ని యాడేవు మాతోడను
నాటకుఁడ నిన్నుఁ జూచి నగితే నాముందరనే
యేఁటికి బాసలు సేసే వింకా నీవు ॥చెల్లదా॥

2. వోపిక నీవొళ్ళినేరా లొక్కటొక్కటి యెంచితే
చూపు లేమిచూచేవు సోద్యముగాను
వై పెరిఁగి నేను నీవలపు సోదించితేను
పై పై నన్ను నెంత వొడఁబరచేవు నీవు ॥చెల్లదా॥

3. మాఁగినమోవిమీద మణులెల్లా నించుకొని
కాఁగిట నెట్టు గూడితి కమ్మటి నన్ను
వీగకు శ్రీవేంకటేశ వేఁడుకొని మొక్కితేను
నాఁగువారఁ బొందులెల్లా నడపేవు నీవు ॥చెల్లదా॥

**అర్థములు:** ప. చెల్లు = సరిపోవు, వెల్లివిరి = అందరికి తెలియువిధము, వింత = అబ్బురము.

1. చీటికిమాటికి = మాటిమాటికి, నాటకుడు = వివిధ వేషగాడు, నగు = నవ్వు.
2. ఒల్లు = ఇష్టపడు, సోద్యము = వింత, సోదించు = పరిశోధించు, ఒడబరచు = వశము చేసుకొను.
3. మాగిన = పరిపక్వమైన, కాగిట = కౌగిట, కమ్మటి = మరల. వీగకు = ఉత్సాహపడు, ఆగువారు = బయట ఉన్న స్త్రీలు.

**భావము:**ఓ శ్రీనివాసా! నీవేమేమి చేసినా చెల్లుబాటవుతుంది. నీకు నువ్వే సాటి. ఇంకా ఆశ్చర్యం గొల్పేవిధంగా, లోకమంతా తెలిసేట్టుగా నీ లీలలు ఎందుకు ప్రదర్శిస్తున్నావు?

ఓ స్వామీ! మాటిమాటికి లెక్కలేనన్ని ఘనకార్యాలు చేసి వచ్చి, ఏమీ ఎరగనట్టు మాతో ఎన్నో కబుర్లు చెప్తావు. ఎంత మాయగాడివి? వేషగాడివి? నిన్ను చూసి నవ్వినప్పుడు, ఇంకా నాముందరనే ఏమీ చేయనట్టుగా ఇంకా ప్రమాణాలు చేస్తుంటావెందుకు?

ఓపిక సన్నగిల్లి, నీ తప్పులన్నీ ఒక్కొక్కటిగా బయటపెడుతూ ఉంటే, అమాయకమైన చూపులతో ఆ చూపులెందుకు చూస్తున్నావు స్వామీ! నీ విషయాలన్నీ గ్రహించి నీ ప్రేమ విషయంలో పరీక్షలు చేయగా, పై పై మాటలేవో చెప్పి నన్ను ఒప్పించడానికి ప్రయత్నిస్తుంటావు.

నీ పరిపక్వమైన ముఖారవిందంపై మణులున్న రీతిగా, ఏవేవో దంతక్షతాలు, నఖక్షతాలు ఉంచుకొని, నన్ను మరలా ఏమీ తెలియనట్లుగా నన్ను కౌగిట్లో బంధిస్తావు. ఓ శ్రీవేంకటేశ్వరా! ఊరకే ఉత్సాహించకు! నిన్ను నమ్మి నీకెన్నో ప్రార్ధనలు చేసుకుంటూ ఉండగా, బయట వారితో అధికమైన పొందులు నడుపుతూ ఉన్నావు.

## 152

**అవతారిక:** వసంతకాలాగమనంతో ఒక రమణికి శృంగార కోరికలు విజృంభించాయి. ఆవిషయం చెలులకు చెప్పి, స్వామి వారికి తను సమాగమం కోరుకుంటున్నానన్న విషయం మనవి చేయమని కోరుతున్నది.

### మాళవిగౌళ

ప. కానుకకుఁ జేయిచాచీ గమ్మటిఁ దాను
నానిన చెమటతో సన్నలు సేసీని ॥పల్లవి॥

1. ఆమనికాలము వచ్చె నంగనవలపు హెచ్చె

యేమని విన్నవింతమే యీతనితోను
కామునమ్ములు వాఁడెక్కె కమ్మటిఁ జిగురులు నిక్కె
నాములువారఁ దా నింక నవ్వులు నవ్వీని ॥కానుక॥

2. చందురుఁడు నుదయించె జవ్వన మీ కెకు మించె
కందు వేడ జూపుదమే కాంతునికి
మందమారుతము రేఁగె మలసి యలులు మూఁగె
చెంది మోము చూచితేనే సిగ్గులువడీని ॥కానుక॥

3. కోకము లొద్దికిఁ జేరె గుబ్బచన్నుఁ గవ మీరె
చేకూరిచే దెట్లానే శ్రీవేంకటేశు
దాకొనె నిద్దరిసొంపు దైవారె రతులముంపు
కై కొని పొగడితేనే కళలుదేరీని ॥కానుక॥

**అర్థములు:** ప.కమ్మటి = మరల, నానిన చెమట = కొంతసేపటినుండి చెమటతో ఉన్న, సన్నలు = సైగలు.

1. ఆమనికాలము = వసంత ఋతువు, అంగన = స్త్రీ, హెచ్చె = అధికమయ్యెను, వింత = ఆశ్చర్యము, కామునమ్ములు = మన్మధ బాణాలు, వాడి = మొనతేలి, కమ్మటి = ఇంకా, జిగురులు = బంధములు, నిక్కు = అతిశయించు, నాములువారు = ఎక్కువైన.
2. చందురుడు = చంద్రుడు, జవ్వనము = యౌవనము, ఈకె = ఈమె, కందు = జాడ, కాంతుడు = మగడు, మందమారుతము = పిల్లగాలి, మలయు = వ్యాపించు, అలులు = పూలసౌరభము, మూగె = వ్యాపించెను.
3. కోకము = చక్రవాక పక్షులు, ఒద్దికి = దగ్గరగా, గుబ్బచన్ను = గుండ్రటి వక్షోజములు, కవ = జతగలియు, దాకొను = దాగుకొను, సొంపు = సంతోషము, తైవారు = పూర్తియగు, ముంపు = సమూహము, కైకొను = పూనుకొని, కళ = సౌందర్యము.

**భావము:** ఏవైనా బహుమతులిస్తే చేతులు చాచడమే గాక స్వేదంతో ఉన్న శరీరంతో ఏవేవో సైగలు చేస్తుంటాడు.

వసంతకాలం రాగా స్త్రీల వలపులధికమయ్యాయి. ఈవిషయాలన్నీ స్వామికి ఏవిధంగా చెప్పగలము? మన్మధ బాణాలు వాడెక్కగా కూడాలనే ఆసక్తి ఇంకా అధికమైనది. స్వామి మాత్రం యధావిధిగా అధికమైన నవ్వులు రువ్వుతూనే ఉంటాడు.

జాబిల్లి ఉదయించగా ఆ లలనకు తన యౌవనబాధ అధికమైనది. ఈ సంగతులన్నీ విన్నవించి స్వామికి జాడ ఏవిధంగా చెప్పాలి? చెలులారా మీరే చెప్పండి? పిల్లగాలులు అదేపనిగా వీస్తుండగా, పుష్పాల సుగంధం వ్యాపిస్తున్నది. తీరా ఆ స్వామి ముఖారవిందము చూస్తేనే సిగ్గు పడుతున్నాడు.

చక్రవాక పక్షులు దగ్గరకు చేరాయి. వక్షోజాలు ఉబికి జతగలిసి బాధిస్తున్నాయి. శ్రీవేంకటేశ్వరునీ తావుకు రావించడమెలానే? ఇద్దరి సంతోషాలు మితిమీరగా రతిక్రీడలు గుమురుకొన్నాయి. పూనుకొని స్వామిని స్తుతిస్తే సౌందర్యమంతా బట్టబయలయింది.

**విశేషము:** అన్నమయ్య ఈ కీర్తనలో వసంత కాలంలో ప్రేయసీ ప్రియుల సమాగమాన్ని అత్యద్భుత అలంకారాలతో వర్ణించాడు.

## 153

**అవతారిక:** అమ్మ చేసే శృంగార క్రీడల విషయంలో చిన్న చిన్న విషయాలకు సైతం గుణదోషాలెన్నుతూ, అమ్మను నిందిస్తున్న స్వామికి, చెలులు అమ్మ విచారాన్ని స్వామికి వివరిస్తున్న సన్నివేశం.

## కురంజి

ప. మెచ్చవలదా నీవు మెలుఁత నేరుపులకు
హెచ్చుకుందు లెంచుకొని యెగ్గులు వట్టుదురా ॥పల్లవి॥

1. పంతమాడి నీమోవిఁ బచ్చిసేఁత సేసితేను
కాంతనేల దూరేవు గద్దెనతోను
దొంతినున్నవలపులు దోమటి దొడికితేను
చింతతోడ నిపుడేల శిరసువంచేవు ॥మెచ్చు॥

2. ఇట్టె జవ్వనమదాన నెంగిలి నిన్నుఁ జేసితే
తిట్టులేల తిట్టేవు దీకొనుచు
గుట్టుతోడఁ దరితీపుగుణ మేరుపరచితే
వొట్టుకొని చింతలేల వొడిగట్టుకొనేవు ॥మెచ్చు॥

3. రావాడి కడపలోన రతి నలయించితేను
శ్రీవేంకటేశుడ యెంత చిమ్మిరేఁగేవు
వేవేలుతమకముల వీడుదోడు లాడితేను
చేవదేర నెంతేసి సెలవి నవ్వేవు ॥మెచ్చు॥

**అర్థములు:** ప. మెచ్చు = పొగడు, మెలుత = స్త్రీ, నేరుపు = నైపుణ్యము, హెచ్చుకుందులు = హెచ్చుతగ్గులు, ఎంచు = లెక్కించు, ఎగ్గులు = తప్పులు, వట్టు = పట్టు.

1. పంతము = పట్టుదల, పచ్చిసేత = మరుగులేని శృంగార చేష్ట, గద్దెన = గద్దింపుమాట, దొంతి = ఒకదానిమీద ఒకటి, దోమటి = మొరటుదనము, తొడకు = మొదలుపెట్టు, చింత = విచారము, బాధ, శిరసు = తల.

2. జవ్వనమదము = యౌవనాతిశయము, ఎంగిలిచేయు = అధరామృతము గైకొను, దీకొను = ఎదిరించు, తరితీపు = అపేక్ష, ప్రేమ, ఏరుపరచు = కేటాయించు, ఒట్టుకొను = ప్రమాణము చేయు, చింత = విచారము, వొడిగట్టుకొను = సంపాదించుకొను.

3. రావాడి = కరుకుదనము, అలయించు = శ్రమపడు, చిమ్మి = వ్యాపించి, రేగు = విజృంభించు, తమకము = మోహము, ఈడుదోడు = ఇద్దరికి సమానమగు, చేవదీర = సారవంతమగు, సెలవినవ్వులు = పెదవిమూల నవ్వులు.

**భావము:** ఓ స్వామీ! ఆయమ నైపుణ్యాలకు నీవు మెచ్చుకొనవలెను గదా! మళ్ళీ గుణదోషాలు వెదుకుతూ తప్పులు పట్టుకుంటారా?

ఏదో పట్టుదలకు బోయి నీకు బహిరంగంగా అధరామృతం అందిస్తే, ఆమెనెందుకు నిందిస్తున్నావు? వరుసగా పేర్చినట్లున్న ప్రేమాభిమానాలను, నీ మొరటుదనముకు గురిచేసి, ఇప్పుడు విచారపడి తలవంచుకుంటే లాభమేమిటి?

ఆమె యౌవనదర్పంతో నీ ముఖారవిందాన్ని తనమోవితో ఎంగిలి చేస్తే తిట్టరాని తిట్లు తిడుతూ ఎదిరించి మాట్లాడతావు? గుట్టుగా ప్రేమ, ఆపేక్షలు కనబరిస్తే ఏవో ఒట్లు పెట్టుకొని లేనిపోని విచారాలు ఎందుకు పోగుచేసుకొంటావు?

ఏదో కాస్తా కరుకుదనముతో కడపలో ఆయమ రతిక్రీడలో శ్రమపడితే, ఓ శ్రీనివాసా ఎంతగా మండిపడి విజృంభించి తూలనాడావు? వేల వేల మోహాలు ఇద్దరిని చుట్టుముట్టాడుతుండగా, ఎంతగా సారవంతమైన నవ్వులు చిందించావయ్యా!

## 154

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ సదా ఏవో కోరికలను వెలిబుచ్చుతూ స్వామివారిని అసంతృప్తికి గురిచేస్తుండగా, చెలులు ఆ స్వామి గొప్పదనాన్ని స్తుతిస్తూ, తగదని అమ్మకు హితవు చెప్తున్నారు.

### శుద్ధదేశి

ప. ఆతనినేల కొసరే వప్పటి నీవు నీ-
యేతులెల్లాఁ జూచెఁగదె ఇందాఁకాను ॥పల్లవి॥

1. నిన్నుఁ బేరుకొని పిల్చి నీతోనే మాటలాడి
యెన్నికలు సేసెఁగదె ఇందరిలోన

విన్నపాలెల్లా విని వీడెము చేతికిచ్చి
ఇన్నిటా లాలించెఁగదె ఇందాఁకాను ॥ఆతని॥

2. సరసములెల్లా నాడి సంగడినే కూచుండి
అరుదుగా మొక్కెఁగదె అండనే వుండి
తెరవేసుకొని మోవితేనియలు నీకొసగి
ఇరవుగా నవ్వెఁగదె ఇందాఁకాను ॥ఆతని॥

3. వొడివట్టి నినుఁ దీసి వొద్దిక జూజాలాడి
జడిగొనఁ గూడెఁగదె చవికెలోన
చిదుముడి నన్నునేలె శ్రీవేంకటేశుఁడు నేఁడు
యెడయఁడుగదె నిన్ను నిందాఁకాను ॥ఆతని॥

**అర్థములు:** ప.కొసరు = కోరుకొను, యేతులు = గొప్పలు, బడాయితనము.

1. పేరుకొను = పేరుపెట్టి పిలుచు, ఎన్నిక = ఎన్నుకొను, వీడెము = తాంబూలము, లాలించు = బుజ్జగించు.
2. సరసము = శృంగారచేష్ట, సంగడి = జతకలిసి, స్నేహముగా, అరుదు = ఆశ్చర్యము, మోవితేనియలు = అధరామృతము, ఇరవు = స్థిరము. ఇందాకా = ఇప్పటిదాకా.
3. వొడివట్టి = నిన్ను చేరదీసి, ఒద్దిక = అనుకూల్యము, జూజాలాడు = అచ్చికబుచ్చికలాడు, జడిగొను = గుంపుగూడు, చవికె = మండపము, చిదుముడి = త్వరపడు, ఎడయు = వీడు.

**భావము:** అమ్మా! ఆస్వామిని కోరరాని కోరికలు ఎందుకు కోరుకుంటావు? నీ పోకడలన్నింటిని ఆయన ఇప్పటివరకూ జూచే ఉన్నాడు కదా! ఆయన ఎప్పటికి నీ వాడే కదా!

నిన్ను పేరుపెట్టి పిలిచి, నీతో సరస సంభాషణలాడి, ఇందరిలో నిన్నే ఎన్నుకొన్నాడు కదా! నీ ప్రార్థనలన్నీ విని నీకు తాంబూలము చేతికిచ్చి, నిన్ను ఎన్నో విధములుగా బుజ్జగించాడు కదా!

నీతో సరసాలాడుతూ జతకలిసి కూర్చొని, ఆశ్చర్యకరంగా నీమాటలకన్నింటిని విని మన్నించి నీ అండనే ఉన్నాడు కదా! తెరవేసుకొని తన అధరామృతాన్ని నీకు పంచియిచ్చి, నెలకొని ఉండి నవ్వులు చిందించాడు కదా!

నిను పట్టుకుని చేరదీసి నీతో అచ్చికబుచ్చికలాడి నీతోనే మండపంలో నిలిచి ఉన్నాడు కదా! ఈరోజు త్వరపడి నిన్నేలుకొన్న శ్రీవేంకటేశ్వరుడు, ఎప్పటికి విడవకుండా అంటిపెట్టుకునే ఉన్నాడు కదా!

## 155

**అవతారిక:** స్వామి అమ్మపట్ల చూపుతున్న ప్రేమానురాగాలకు, చేస్తున్న ఉబ్బితబ్బిబ్బై, స్వాధీనపతికయైన అమ్మ చెప్తున్న విశేషాలు.

### ముఖారి

ప. సొరిది నీ సరితలు చూచితిఁ గాక
సిరుల నీ సేవలు సేయక విడిచేనా ॥పల్లవి॥

1. కప్పురాన వేసేవు కడుసన్నలు సేసేవు
యెప్పుడు నీసుద్దులు నే నెఱఁగనివా
దప్పిదేరఁ బలికేవు తమితో బుజ్జగించేవు
చెప్పినట్లు నే నీకు సేయకుండేనా ॥సొరిది॥

2. విరులెల్లా ముడిచేవు వీడెము నాకిచ్చేవు
మరిగి నీమేలు నేను మఱచితినా

పొరిఁబొరిగుణములు పొగడేవు నావద్ద
తిరముగా నిట్టె సమ్మతించక మానుదునా ॥సొరిది॥

3. కలకలనవ్వేవు కాఁగిట బిగించేవు
తొలుతనే నే నిన్ను సంతోసించనివా
యెలమి శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నిట్టె
నెలవైననాకు నవి నేఁడు గొత్తలా ॥సొరిది॥

**అర్థములు:** ప.సొరిది = వరుస, సరితలు = చరిత్రలు, సిరులు = శోభలు, సేవలు = ఆరాధన.

1. కప్పురము = కర్పూరము, కదు = మిక్కిలి, సన్నలు = సైగలు, సుద్దులు = మాటలు, దప్పిదేరు = తృప్తి దీర, తమి = మోహము, బుజ్జగించు = లాలించు.
2. విరులు = పూలు, ముడిచేవు = కొప్పులో పెట్టు, విడెము = తాంబూలము, మరిగి = అలవాటై, మేలు = సహాయము, పొరిబొరి = పైపై, తిరము = స్థిరము, సమ్మతించు = అంగీకరించు.
3. కలకల = గలగలా, కాగిట = కౌగిట, తొలుత = పూర్వము, సంతోసించనివా = ఆనంద పడనివా, ఎలమి = వికాసము, నెలవు = వాసస్థానము, కొత్తలా = క్రొత్త విషయాలా?

**భావము:** ఓ స్వామీ! నీ విషయాలన్నింటినీ వరుసగా విని, కని, ఉన్నాను కదా! శోభించి నీకు సేవలు చేయకుండా విడిచిపెడతానా?

నాకు కర్పూరధూళి కాపు వేస్తావు అలాగే చాలా సైగలు చేస్తూ ఉంటావు. నీ మాటల చాతుర్యం నేనెరుగనిదా? తృప్తిదీరా కమ్మని కబుర్లు చెబుతావు అలాగే మోహముతో లాలించి బుజ్జగిస్తావు. నీవు చెప్పినట్లు చేయకుండా ఉంటానా స్వామీ!

నా కొప్పులో పూలన్నీ ముడుస్తావు. తంబూలము నా చేతికిస్తావు. నీతో అలవాటైన సేవలు నేను మరచిపోతానా? నా వద్దచేరి నా గుణాలన్నీ పైపైన పొగడుతూ ఉంటావు. నిలకడగా ఇక్కడ నీ మాటలనాలకించి అంగీకరించకుండా ఉంటానా?

గలగలా పెద్ద పెద్ద నవ్వులు నవ్వుతావు. నన్ను నీ కౌగిట్లో బిగిస్తావు. పూర్వం నుంచీ ఇవన్నీ నేను ఆనందపడని విషయాలా స్వామీ! ఓ శ్రీవేంకటేశ్వరా! వికాసంతో కూడి ఈవిధముగా నన్నేలుకున్నావు. ఇక్కడ నీ కొలువులో వాస స్థానంలో ఉన్న నాకు ఇవన్నీ తెలియనివా? క్రొత్త విషయాలా? సర్వం నేనెరుగుదును స్వామీ!

## 156

**అవతారిక:** స్వామిని అకారణంగా సంకటపెడుతున్న అలమేలుమంగమ్మకు చెలులు నిందించడం తగదని స్వామిని ప్రేమతో దరిజేరమని హితవు పలుకుతున్నారు.

### హిందోళవసంతం

ప. జవ్వనపుదాన వింత చలమేఁటికే
చివ్వన వీడె మొసగి సేవ సేయవే ॥పల్లవి॥

1. మక్కువతో రమణుఁడు మంచిమాట లాడఁగానే
వెక్కసములాడి యేల వేగిరించేవే
పక్కన నందుకుఁగాను పైఁ జేయివేసితేను
మొక్కలానఁ గాతాళించి మో మేల వంచేవే ॥జవ్వన॥

2. నయమిచ్చి యాతఁడు నవ్వు నీతో నవ్వఁగాను
రయమున నీవెంత రవ్వసేసేవే
ప్రియమున నప్పటిని పెనఁగి పొందుసేయఁగ
నియమానఁ జలపట్టి నీవేల లోఁగేవే ॥జవ్వన॥

3. శ్రీ వేంకటేశ్వరుడు చేరి నిన్ను గూడcగానే
కావరించి నీవేల కక్కసించేవే
చేవదేర మీcద మీcదజిమ్మి రేcగ మన్నించcగా
వే వేలు విధాల నెట్టు వెరగందేవే ॥జవ్వన॥

**అర్థములు:** ప. జవ్వనము = యౌవనము, చలము = వణకు, భయము, చివ్వన = తక్షణము, వెంటనే, వీడెము = తాంబూలము.

1. మక్కువ = ప్రీతి, వెక్కసము = అధికము, వేగిరించు = తొందరబాటు, మొక్కలాన = ధైర్యము, కాతాళించు = భయపడు.
2. రయము = వేగము, రవ్వ = అల్లరి, పెనగు = చుట్టుకొను, నియమాన = నియమనిష్ఠలతో, చలపట్టు = కోపించు.
3. కావరించి = మదించి, కక్కసించు = సంకటపెట్టు, చిమ్మిరేగు = బాగుగా వ్యాపించు, వెరగు = ఆశ్చర్యము.

**భావము:** ఓ యౌవనములో మంచి తరుణ వయసులోనున్న దానా! నీవింత భయాందోళనలకు గురికావడమెందుకు? తక్షణమే తాంబూలమిచ్చి స్వామికి సేవలు చేసుకోవే!

ప్రీతిగా ఆ స్వామి నీతో నాలుగు మాటలు మాటాడగానే, తొందరపాటుగా ఏవో అధికమైన మాటలు మాట్లాడతావెందుకే? ప్రక్కన ఉన్న నిన్ను అందుకోవడానికి పైన చేయి వేయగానే పొగరుబోతుతనంతో కోపించి నీ మొహం ఎందుకు వంచుకుంటావు?

స్వామి నీకు సకల సౌఖ్యములిచ్చి, నీతో సరదాగా నవ్వులు రువ్వుతుండగా, వెంటనే నీవు అల్లరి ఎందుకు చేస్తావు? అప్పటికి ఎంతో ప్రీతితో నిన్ను చుట్టుకొని పొందుకూడడానికి ప్రయత్నిస్తూ ఉంటే ఏవో కట్టుబాట్లు అవీ ఇవీ అంటూ కోపగించి నీవు ఎందుకు వెనుదీస్తున్నావు?

ఆ శ్రీవేంకటేశ్వరుడు నిన్ను చేరి కూడగానే, మదంతో ఆ స్వామిని ఎందుకు సంకటపెడుతున్నావే! ఆ స్వామి సరసుడై నీమీద మీద పడుతూ సరసాలు చేస్తూ ఉంటే మన్నించవలసినది పోయి ఇన్ని విధాల ఆశ్చర్యం ప్రకటిస్తున్నావెందుకే!

## 157

**అవతారిక:** ఇంటిదాకా వచ్చిన స్వామి ఏదో బింకంతో ఉన్నాడని గ్రహించిన అమ్మ లోపలికి దయచేసి ఏలుకోమని ప్రార్థిస్తున్నది.

### ఛాయానాట

ప. ఇట్టె రాcగదరా యింటిలోనికి
వుట్టిపడి బిగియcగ నొద్దురా ఇcకను ॥పల్లవి॥

1. జవ్వనపాయమువారు చలమునc బెనcగితే
రవ్వలై వలపులు మేరలు మీరును
పువ్వువంటిదాన నేను పొరుగున నుండి నీవు
వువ్విళ్లూర నింత సేయవొద్దురా నీవు ॥ఇట్టె॥

2. ప్రేమగలుగువారు బీరములు చూపితేను
దోమటి తమకములు చూరుకెక్కును
కామించినదాన నేను ఘనుcడ విన్నిటా నీవు
వోముచు గుట్టున నవ్వనొద్దురా ఇపుడు ॥ఇట్టె॥

3. ఆలుమగcడైనవారు ఆసల నూరకుండితే
చాలుకొన్న తరితీపు సందడించును
మేలిమి శ్రీ వేంకటేశ మెచ్చి నన్ను నేలితివి
వోలవేసి కొసరcగనొద్దురా ఇకను ॥ఇట్టె॥

**అర్థములు:** ప. ఇట్టె = ఈలాగునే, ఉట్టిపడు = అతిశయించు, బిగియు = బిగిసిపోవు.

1. జవ్వనపాయము = యుక్తవయసు, యౌవన దశ, చలము = ఒకవిధమైన భీతి, పెనగు = మారాడు, రవ్వలు = అల్లరి, మేరలు = హద్దులు, పొరుగున = ప్రక్కన, ఉవ్విళ్ళూరు = త్వరపడు.
2. బీరములు = ధైర్యము, సాహసము, దోమటితమకము = కపటత్వము, చూరు = ఇంటికప్పు, కెక్కు = చేరును, కామించిన = వలచిన, ఘనుడు = అన్నింటా శ్రేష్ఠుడు, ఓము = కాచు, రక్షించు, గుట్టు = రహస్యము.
3. ఆలుమగడు = భార్యకు భర్తయైనవాడు, ఆస = కోరిక, చాలుఁ=ను = కట్టగట్టుకొన్న, తరితీపు = ఆపేక్ష, సందడించు = అతిశయించు, సందడిచేయు, మేలిమి = శ్రేష్ఠమైన, వోలవేయు = నెపముచూపి, కొసరు = కోరు.

**భావము:** ఓ శ్రీనివాసా! ఈలాగునే ఇంటిలోపలకు రావచ్చుగదా! అతిశయించిన బిగుతనము ఇక వద్దు. లోనకు దయచెయ్యండి.

తరుణ వయసులోనున్నవారు భీతితో మారాడితే వలపు అల్లరిపాలై హద్దులు మీరదా? నేను పువ్వు వంటి సుకుమారమైన దానను. ఇలా ప్రక్కన నిలబడి తహతహలాడుతూ ఇంత చేయవద్దు.

ప్రేమ ఉన్నవారు ధైర్యం ప్రదర్శిస్తే ఈ తమకాలన్నీ ముగిసిపోవా? ఓ సర్వశ్రేష్ఠుడైన శ్రీనివాసా! నిన్ను మనసారా వలచిన దానను, నన్ను కాచుకొని మరలా గట్టున చేరి నవ్వడం న్యాయమా?

భార్యకు, భర్త అన్నవాడు కోరికలు చూపించకుండా ఊరక ఉండిపోతే, కట్టగట్టుకొన్న అపేక్షలన్నీ విజృంభిస్తాయి. మేలిమి బంగారు వంటి మనసున్న శ్రీవేంకటేశ్వరా! నన్నేలుకున్నావు, మరి ఇక యేవేవో నెపాలు అంటగట్టి కోరికలమూట విప్పవద్దు.

## 158

**అవతారిక:** శ్రీవేంకటాద్రి నారసింహుడు అన్యస్త్రీలను గూడివచ్చిన గుర్తులను కనిపెట్టి, నిలదీసి దాగుడుమూతలు కట్టిపెట్టమని, తన్నే ఏలుకోమని అమ్మ ప్రార్థిస్తున్నది.

### బౌళి

ప. కంటిమి వింటిమి నేఁడు కందువగాను
వొంటిఁ జిక్కించుక నిన్ను నొరసే దేమి ॥పల్లవి॥

1. నిక్కి నీవు సేయించుకొనిన గురుతులెల్లాను
చెక్కులనే వుండఁగాను చెప్పేదేమి
పిక్కటిల్లుఁజెమటలు పిచ్చిలి మేననుండఁగ
అక్కడి నీసుద్దులెల్లా నడిగేదేమి ॥కంటిమి॥

2. పెనఁగి యెక్కడనో తెప్పించుకొన్నవుంగరము
కొనవేల నుండఁగానే కొసరేదేమి
వెనకటి నీపొందులు వెంటనె వచ్చివుండఁగా
దినదినము నీతోఁ దెలిపేదేమి ॥కంటిమి॥

3. కాముకళలెల్లా నొక్కగనియై నేఁడింతలో నీ-
మోముననే వుండఁగాను మొరఁగేదేమి
ఆమని శ్రీవేంకటాద్రి అహోబల నరసింహా (నరసింహ్వా)
చేముంచి నన్నేలితివి సిగ్గువడదేమి ॥కంటిమి॥

**అర్థములు:** ప.కంటిమి = చూశాము, వింటిమి = విన్నాము, కందువ = జాడ, చిక్కించుక = చిక్కినటువంటి, ఒరయు = పరీక్షించు.

1. నిక్కి = అతిశయించి, చెక్కులు = చెక్కిళ్ళు, పిక్కటిల్లు = నిండిన, పిచ్చిలి = పొంగులెత్తు, మెన = శరీరంపై, సుద్దులు = మాటలు.

2. పెనగి = చుట్టుకొను, కొనవేలు = చివరి వేలు, కొసరు = కోరు, పొందులు = కలయికలు, తెలుపు = తెలియజేయు.

3. కాముకళలు = మన్మథ కళలు, గని = పుట్టుస్థలము, మొరగు = దాగు, ఆమని = వసంతకాలము, చేముంచి = వశమై, సిగ్గువడదేమి = సిగ్గుపడడమెందుకు?

**భావము:**స్వామీ! శ్రీనివాసా! నీ లీలలన్నీ జాడనెరిగి చూశాము, విన్నాము. నీ చేతికి చిక్కి ఉన్నవారము ఇంక మేము వేరే మాట్లాడడం పరీక్షించడమెందుకు?

అతిశయించి నీవు ఇష్టపడి వేయించుకొన్న నఖ, దంతక్షతపు గుర్తులన్నీ చెక్కిలిమీదనే ఉండగా ఇంకా చెప్పనేమున్నది? మేనంతా నిండిన చెమట పొంగులెత్తుతూ శరీరంపైనే ఉండగా ఇంకా నీగురించి చెప్పవలసినదేమున్నది?

చుట్టుకొని ఎక్కడనో సంపాదించుకున్న ఉంగరము నీ చివరివేలికి ఉండగా ఇంకా కోరుకునేదేమున్నది? గతంలో నీతో కలసిన కలయికలన్నీ గుర్తొస్తూనే ఉన్నాయి, ఇంకా ప్రతి దినమూ నీతో ఏమని చెప్పగలము?

మన్మథ సామ్రాజ్యపు కళలన్నీ ఒక చోటే నిబిడీకృతమైన రీతిగా నీ ముఖబింబంపై ప్రకాశిస్తూ ఉండగా ఇంకా దాగుడుమూతలెందుకు? వసంతకాల శోభతో ప్రకాశిస్తున్న ఓ వేంకటాద్రి నారసింహా! నన్ను వశపరచుకొని ఏలుకుంటున్నావు గదా! ఇంకా సిగ్గు పడడం ఎందుకు?

**విశేషము:** అన్నమయ్య ఈ కీర్తనలో శ్రీవేంకటాద్రి అహోబల నారసింహా! అని సంబోధిస్తున్నాడు. అన్నమయ్య అహోబిల మఠస్థాపకుడైన ఆదివన్ శఠగోపయతి వద్ద పట్టుగ వైష్ణవాగమ శాస్త్రాలు నేర్చుకొన్నాడు. ఆ అహోబల నారసింహ స్వామినే వేంకటాద్రి నారసింహస్వామిగా స్తుతిస్తున్నాడు. అహోబిల క్షేత్ర రంగమండపంలో చెంచులక్ష్మి, లక్ష్మీ నారసింహ విగ్రహాలను దర్శించవచ్చు. రాగిరేకుపై నరసింహా అని కాక నరసింహ్వా అని ఉండడం లేఖకుల తప్పిదమై ఉండవచ్చును.

## 159

**అవతారిక:** అమ్మతో కూడి ఉండగా  స్వామి ప్రక్క చూపులు చూడడం గమనించిన చెలులు, ఈ అకార్యాలు ఏమిటని వాపోతున్నారు.

### పాడి

ప. ఎవ్వరిముందరఁ జూపే వేడలేని నీ గుట్టు
నవ్వులేమి నవ్వేవు నాలితనమునను ॥పల్లవి॥

1. విన్నవించీ నాపమాట వినుకొనరాదా
యెన్నిపరాకులు సేసే వెఱిఁగివుండే
సన్న సేసీ నివెల్లా జాడతోఁ జూడరాదా
కన్నులేల మూసేవు కడుసిగ్గుతోడను ॥ఎవ్వరి॥

2. ఆపెయిచ్చెవిడెము అందుకొనరాదా
చూపులేమి చూచేవు సోరణగండ్ల
ఆపని కాసపడితే నట్టె కానిమ్మనరాదా
యేపున నేలకొంకేవు యిందరిలోపలను ॥ఎవ్వరి॥

3. కూడిన యాపెకూటమిఁ గోరి చెంగలించరాదా
వాడుమోముతో నెంత వాను లెంచేవు
యీడనే శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
యీడులేల పెట్టేవు యివ్వలా నవ్వలాను ॥ఎవ్వరి॥

**అర్థములు:** ప.ఏడలేని = ఎక్కడాలేనటువంటి, గుట్టు = రహస్యాలు, ఆలితనము = దైన్యము.

1. ఆప = ఆమె, పరాకులు = అన్యధ్యానము, సేసే = చేసేవు, ఎరిగిఉండే = తెలిసికొని ఉన్నాము, సన్న = సైగ, నివెల్ల =

నీవంతా, జాడ = ఆచూకీ.

2. ఆపె = ఆమె, విడెము = తాంబూలము, సోరణగండ్ల = కిటికీ కున్న రంధ్రములద్వారా చూచుట, కానిమ్ము = సరేయను, ఏపున = విజృంభించి, కొంకు = భయపడు, వెనుదీయు.

3. కూటము = కూడిక, ఆపె = ఆమె, చెంగలించు = అతిశయించు, వాడుమోము = వడలిన మొహము, వానులెంచు = కుండలు లెక్కపెట్టు, ఇవ్వల = ఇక్కడ, అవ్వల = అక్కడ.

**భావము:** స్వామీ! ఎక్కడాలేనటువంటి నీ రహస్యాలన్నీ ఎవరి ముందు ప్రదర్శిస్తున్నావు? మరలా దైన్యంగా చూస్తూ, ఆ నవ్వులు నవ్వడమెందుకు?

ఆమె విన్నపాలను కాస్తా చెవివేసుకోరాదా? తెలిసి తెలిసి ఎన్ని మార్లు పరధ్యానంగా ఉంటావు? నీవు సైగలు చేసి అమ్మజాడనెరిగి రారాదా? పైపెచ్చు సిగ్గుతో కన్నులెందుకు మూసుకుంటావు స్వామీ!

ఆమె ఇస్తున్న తాంబూలము నందుకోవచ్చును కదా! ఆ కిటికీ సందులలోనుండి దొంగచూపులెందుకు చూస్తున్నారు. నీకామెపై ఆసక్తి ఉంటే ఆ కార్యమునకు అంగీకరింప జేయవచ్చుగదా! ఇంతలోపు అలా ఎందుకు భయపడి వెనుదీస్తావు?

నీతో జతకలసిన ఆ ఇల్లాలిపై అతిశయించి కూడికకు ఆసక్తిని కనబరచరాదా? ఆ వాడిపోయిన మోముతో ఎందుకు అవీ ఇవీ పరికిస్తూ దిక్కులు చూస్తావు స్వామీ! ఓ శ్రీవేంకటేశ్వరా! ఇక్కడనే నన్నేలుకున్నావు. మధ్యలో ఇక్కడా అక్కడా ఈ స్వామ్యాలెందుకు? అడ్డంకులెందుకు? చెప్పండి స్వామీ!

## 160

**అవతారిక:** ప్రహ్లాద వరదుడైన స్వామి లక్ష్మీదేవిని తొడపై కూర్చొండబెట్టుకున్న వివరాన్ని గుర్తుచేస్తూ, మాయలు మాని తననే ఏలుకోమని అమ్మ కోరుతున్నది.

### సామంతం

ప. మాయలేల సేసేవు మన్నించరాదా
బాయిటఁ బడె నీగుట్టు ప్రహ్లాద (ప్రంహ్లాద)వరద ॥పల్లవి॥

1. వొరసివలపు తొల్లే వొడిఁ గట్టుకొన్నందుకు
అరుదైనతొడపై తొయ్యలి సాకిరి
సరుసనే మాతోను జాణతనాలాడేవు
యిరవై నీయాసోద మేమిచెప్పే దిఁకను ॥మాయలేల॥

2. మొనసి చుట్టరికము తొల్లి మోపు గట్టుకొన్నందుకు
యెనలేని వీఁపుమీఁది యింతి సాకిరి
ననుపు నాతోనే నవ్వులెల్లా నవ్వేవు
నినుపులై గజరెల్లా నిండె నీమైనిపుడు ॥మాయలేల॥

3. తమకమెల్లాఁ దవ్వి తలకెత్తుకున్నందుకు
కొమరైనశిరసుపై కొమ్మ సాకిరి
మమత శ్రీవేంకటేశ మరిగి నన్నేలితివి
జమళినీపొందులు సతమాయ నేఁడు ॥మాయలేల॥

**అర్థములు:** ప.బాయిట = బట్టబయలు, గుట్టు = రహస్యము.

1. ఒరసి = రాచుకొని, వత్తుకొను, తొల్లి = పూర్వము, తొయ్యలి = ఆడుది, సాకిరి = సాక్షి, జాణతనము = నైపుణ్యము, ఇరవు = నెలవు, స్థానము, ఆసోదము = కనిపించే గాఢ భావన.

2. మొనసి = కలిగు, తొల్లి = పూర్వము, మోపుకట్టు = కట్టలుకట్టలుగా గట్టు, ఎనలేని = ఎక్కడా సాటిరాని, వీపు = వెనుకభాగము, ఇంతి = స్త్రీ సాకిరి = సాక్షి, అనుపు = ఆజ్ఞాపించు, నినుపు = నింపుట, గజరు = కోరిక, మైను = మేను రూపాంతరము.
3. తమకము = మోహము, త్రవ్వితలకెత్తు = ఒరగబెట్టు, కొమరు = మనోజ్ఞము, శిరసు = తల, సాకిరి = సాక్షి, మమత = అనురాగము, ప్రేమ, మరుగు = అలవాటు, జమిళి = జత, సతమగు = శాశ్వతము.

**భావము:** ఓ స్వామీ! ఇలా అడుగుతున్నందుకు క్షమించు. మాయలెందుకు చేస్తావు? ఓ ప్రహ్లాదవరదా! నీ గుట్టుమట్టులన్నీ మొత్తం బహిర్గతమైనాయి.

నీవు ఆమెపై ప్రేమాభిమానాలు కురిపించి, అన్నిటికి సిద్ధపడినందుకు ఋజువు, అపురూపమైన నీతొడపై కూర్చున్న అలివేణి సాక్షి. సమీపమున మాతో నీ నైపుణ్యాలన్నీ చూపిస్తున్నావు. ఇప్పుడు నెలకొన్న నీ భావనలను ఏమి చెప్పగలము?

కట్టలు గట్టుకొన్న నీ ప్రేమకు, చుట్టరికానికి పూర్వము నీవు వీపుపై ధరించిన కోమలాంగి సాక్షి. ఆజ్ఞాపించి నాతో నవ్వులెలా నవ్వుతున్నావు? కోరికలన్నీ మూటగట్టుకుని నీ దేహమంతా నిండిపోయినవి.

మోహావేశంతో తలపెట్టి ఏదో ఒరగబెడదామనుకుని, నీ తలమీద పెట్టుకున్న అంబుజాక్షి సాక్షి. ఓ శ్రీవేంకటేశ్వరా! ప్రేమాపేక్షలతో అలవాటై నన్నేలుకున్నావు. నీ యీ జంట పొందు శాశ్వతమైనది.

**గమనిక:** రాగిరేకుపై ప్రహ్లాదవరద అని కాక ప్రంహ్లాదవరద అని ఉండడం లేఖకుల తప్పిదమై ఉండవచ్చును.

## 161

**అవతారిక:** స్వామి లక్ష్మీ నారసింహునిగా అమ్మపై చూపిన ప్రేమాతిశయానికి ఉప్పొంగుతూ చెలులు ప్రశంసల వర్షంలో ఆయనను ముంచెత్తుతున్నారు.

### ఆహిరి

ప. ఎటువంటి వలపులో యిద్దరికిని
చిటుకంటే మెచ్చేవు శ్రీనరసింహా ॥పల్లవి॥

1. గిరులెక్కి లకిమమ్మ కిన్నెర వాయించుకొంటా
పరగ నీమోము తప్పక చూడఁగా
సరుగన నీవు వచ్చి సంగడినే కూచుండి
సిరులతోఁ బొగడేవు శ్రీనరసింహా ॥ఎటువంటి॥

2. యెదురుమేడపై నెక్కి యెలుఁగెత్తి పాడిపాడి
వుదుటునఁ దామరపూవుల వేయఁగా
పొదిగి నీవంతలోనే బుజముపైఁ జేయివేసి
చెదరక చెక్కంటేవు శ్రీ నరసింహా ॥ఎటువంటి॥

3. పఱపుపై నీకె నీపై పరాకునఁ జెలితోడ
అఱిముఱి నిన్నుఁ జూపేకాంత మాడఁగా
మెఱయ శ్రీవేంకటాద్రిమీఁద వచ్చి కూడితివి
చెఱఁగువట్టి చొక్కుతా శ్రీనరసింహా ॥ఎటువంటి॥

**అర్థములు:** ప. చిటుకు = చిన్నశబ్దము, మెచ్చు = పొగడు.

1. గిరులు = పర్వతాలు, లకుమమ్మ = లక్ష్మీదేవి, కిన్నెర = ఒక సంగీత వాయిద్యము, పరగ = ఒప్పుకోలు, సరుగున = హెచ్చువు, సంగడి = స్నేహము, జతగలియు, సిరులు = శోభలు.

2. ఎలుగెత్తి = గొంతెత్తి, ఉదుటు = విలాసము, పొదిగు = క్రమ్ముకొను, చెదరు = కలత, చెక్కంటు = చెక్కిలిని తాకు.

3. పరపు = పానుపు, ఈకె = ఈమె, పరాకున = పరధ్యానముగ, అరిమురి = మిక్కిలి, మాడ = బంగారువలె, మెరయు = ప్రకాశించు, కూడు = కలియు, చెరగు = చీర అంచు, చొక్కు = మత్తు, పరవశము.

**భావము:** ఓ స్వామి నారసింహా! మీ ఇద్దరి ప్రేమ అనన్యసామాన్యమైనది. చిన్న చిన్న విషయాలకే ఆమెను ప్రశంసిస్తూ ఉంటావు.

కొండలెక్కి ఆ లక్ష్మీదేవి కిన్నెర మీటుకుంటూ, ఒప్పుకోలుగా నీ ముఖారవిందాన్ని దర్శించగా, అధికప్రేమతో వచ్చి ప్రక్కనే కూర్చొని ఎన్నెన్నో శోభలతో ఆమెను ప్రశంసల వర్షంలో ముంచెత్తుతావు.

ఓ నారసింహా! ఎదురుగా ఉన్న భవంతిపైకెక్కి గొంతెత్తి పాడుతూ పాడుతూ, విలాసంగా తామరపుష్పాలు నీమీద వేయగా, నీవు క్రమ్ముకొన్న ప్రేమాతిశయంతో వచ్చి బుజంపై చేయి వేసి, ఆమె చెక్కిలినంటుకునేవు.

పట్టుపానుపుపై పరుండిన ఆమె మిక్కిలి ప్రకాశంతో శోభిస్తూ పరధ్యానంగా నిన్ను ప్రక్కన ఉన్న చెలికి చూపిస్తూ ఉండగా, మేలిమి బంగారు కాంతులతో మెరుస్తూ ఉన్న ఆ కాంతను అత్యంత శోభతో శ్రీవేంకటాద్రి మీద కూడి, ఆమె చెరగు అంచు పట్టుకొని పారవశ్యంతో పట్టుకున్న నారసింహా! నీ లీలలు  అనంతాలు.

**విశేషం:** పూర్వం విష్ణుమూర్తి నారసింహుని అవతారంలో చెంచులక్ష్మిని వివాహం చేసుకొని కొంతకాలం అడవులలో ఉండిపోతాడు. ఆ కాలంలో వారిద్దరిమధ్యా జరిగిన విశేషాలను అన్నమయ్య వివరిస్తున్నాడు.

## 162

**అవతారిక:** చాగలమఱ్ఱిలో నెలకొన్న చెన్నకేశవస్వామి స్తుతి. అమ్మ శ్రీనివాసుని తనను సంకటపెట్టకుండా ఏలుకోమని ప్రార్థిస్తున్నది.

### భైరవి

ప. ఇచ్చలోనిదాన నేను ఇన్నిటా నీకు
గచ్చు లేమిటికిరా చేఁగలమఱ్ఱిచెన్నుఁడా ॥పల్లవి॥

1. ఆరితేరి కతలెల్లా నడుగుతా నన్ను నీవు
చేరి యానవెట్టకురా చెప్పేఁగాని
దూరుసేయ కిఁకనైనా దోసము లేదనరా
సారెసారె నీకు మొక్కి జట్టిగొనే నేను ॥ఇచ్చ॥

2. వొగ్గి కొంగువట్టుకొని వొకటొకటే యడిగి
సిగ్గులువడకురా చెప్పేఁగాని
అగ్గలమై కిందుపడి ఆసుద్దులు మఱవరా
అగ్గమై నీవూడిగాలే అన్నిఁ జేసే నేను ॥ఇచ్చ॥

3. యెన్నిఁగ శ్రీ వేంకటాద్రి నిరవై నన్నేలితివి
చిన్ని గోరు దియ్యకురా చెప్పేఁగాని
మన్నించితి వెప్పుడు నామచ్చిక దలఁచరా
సన్నల నీరతులకే సమ్మతించే నేను ॥ఇచ్చ॥

**అర్థములు:** ప. ఇచ్చ = ఇష్టము, ప్రీతి, గచ్చులు = దుడుకు పలుకులు, చేగలమఱ్ఱి చెన్నుడు = చేగలమఱ్ఱిలో ఉన్న శ్రీ లక్ష్మీ చెన్నకేశవస్వామి.

1. ఆరితేరు = సమర్థుఁడగు. నిపుణుఁడగు, కతలు = కథలు, ఆన = బాస, దూరుసేయు = నిందించు, దోసము = తప్పు, సారె సారె = మాటిమాటికి, జట్టిగొను = సాముచేయు.

2. ఒగ్గు = పూనుకొని, ఒకటొకటే = ఒక్కటొక్కటీ వివరంగా, అగ్గలము = అధికము, కిందుపడి = ప్రాధేయపడు, సుద్దులు =

మంచి మాటలు, అగ్గము = అధీనము, ఊడిగాలు = సేవలు.

3. ఎన్నిగ = ఎంచుకొని, ఇరవు = స్థానము, తియ్యకు = వేయకు, మచ్చిక = స్నేహము, ప్రేమ, సన్నలు = సైగలు, సమ్మతించు = అంగీకరించు.

**భావము:** ఓ శ్రీనివాసా! అన్నివిషయాలలోను నీకు ప్రీతిపాత్రమైన దానను. చాగలమర్రిలో నెలవైన ఓ చెన్నకేశవస్వామీ! ఇంకా ఈ దుడుకుమాటలెందుకు?

స్వామీ! కథలు చెప్పడంలోను రకరకాల వేషాలు వేసి మాయచేయడంలోను మీరు సమర్థులు. నన్నింకా లేనిపోని ఆశలకు గురిచేయవద్దు. మాటిమాటికి నీకు మ్రొక్కులు మ్రొక్కి నీతో సాముచేయలేను. నన్ను ఇంకా నిందలకు గురిచేయకుండా నా తప్పులేమీ లేవని చెప్పి మన్నించవలదా?

పూనుకొని నీ కొంగు పట్టుకుని విషయాలన్నీ ఒక్కొకటే చెప్తాను కానీ, నిన్ను ప్రార్థిస్తున్నాను, జరిగిన విషయాలు మాట్లాడకుండా, అధికమైన ఆ మాటలన్నీ ఇకనైనా మరచిపోరాదా! నీ అధీనమై, నీ సేవలే చేసుకుంటూ ఉన్న నీ దానను.

నన్నే ఎంచుకొని ఈ శ్రీవేంకటాద్రి మీద స్థిరమై నన్నేలుకున్నావు. నాపై నీ గోళ్ళు వేసి నఖక్షతలములకు గురిచేయవద్దు. నన్ను సదా మన్నించి నా ప్రేమను కోరుకొనమని ప్రార్థిస్తున్నాను. స్వామీ! ఓ శ్రీవేంకటేశ్వరా! సైగలు చేసి నీవు పూనుకునే రతిక్రీడా విశేషాలకు నేను ఎల్లప్పుడూ సమ్మతిస్తూనే ఉన్నాను.

**విశేషాంశము:** చాగలమర్రి, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములో నంద్యాల జిల్లాకు కడప జిల్లాకు సరిహద్దులోనున్న గ్రామం. ఇక్కడ శ్రీ లక్ష్మీ చెన్నకేశవస్వామివారి ఆలయం ఉన్నది. ఆ ఆలయాన్ని దర్శించి కీర్తించిన అన్నమయ్య కీర్తన.

## 163

**అవతారిక:** స్వామి రాకకై మదనతాపంతో ఉన్న అమ్మను చెలి సమాదరించి చేపట్టమని స్వామివారిని ప్రార్థిస్తున్నది.

### ధన్నాసి

ప. చిత్తగింతువు రావయ్య చెలికడకు
పొత్తుల తలపోఁతల బోగించీని ॥పల్లవి॥

1. మనసు నిలుపరాక మాటలనుఁ బొద్దువోక
వొనరి విరహమున నున్నది చెలి
కొనలుసాగిన యాస కొప్పునఁ బెట్టేసేసఁ
దనివోక కూటమికిఁ దమకించీని ॥చిత్త॥

2. చెమటలఁ దొప్పఁదోఁగి సిగ్గులనే కదుమాఁగి
అమరినజవ్వనాన నలసీఁ జెలి
తిమురువలపులను తియ్యనసొలపులను
జమళిపులకలతో జాజుకొనీని ॥చిత్త॥

3. యెదురుచూపులు చూచి యిచ్చె కాఁగిటికి లాచి
ముదమునఁ జేతులెత్తి మొక్కీఁ జెలి
అదన శ్రీ వేంకటేశ అట్టె నీవు గూడఁగాను
వుదుటుఁగళలు రేఁగి పూరుపు లాఁగీని ॥చిత్త॥

**అర్థములు:** ప. చిత్తగించు = ఇష్టపడు, పొత్తులు = సహవాసము, తలపోత = యోచన, బోగించు = సుఖించు, అనుభవించు.

1. నిలుపరాక = నిలుపోలేక, పొద్దువోక = కాలక్షేపం లేక, ఒనరు = తగియుండు, విరహము = ఎడబాటు, కొనలుసాగు = వర్థిల్లు, సేస = అక్షింతలు, తనివోక = తృప్తిజెందక, కూటమి = సాంగత్యము, తమకించు = మోహించు.

2. దొప్పదోగు = తేలియాడు, కడు = మిక్కిలి, మాగి = అధికమై, జవ్వనము = యవ్వనము, యుక్తవయసు, తిమురువలపులు = ఉద్రేకించు ప్రేమాతిశయము, సొలపు = పారవశ్యము, జమళి = రెట్టించిన, పులకలు = గగుర్పాటు, జాజుకొను = ఉద్భవించు, పుట్టు.
3. కాగిటికి = కౌగిలికి, లాచి = పొంగు, అదన = అంతట, ఉదుటు = అతిశయము, రేగి = వ్యాపించి, ఊరుపు = శ్వాస, ఊపిరి, ఆగీనీ = ఆగిపోవుచున్నది.

**భావము:**ఓ స్వామీ! సంపూర్ణమైన ప్రీతితో చెలి వద్దకు రావయ్యా! నీ సహవాసానికై ఎన్నో ఆలోచనలు చేసి చేసి నీతో సుఖించడానికి సిద్ధపడియున్నది.

ఆ లలన మనసు నిలకడగా ఉండడం లేదు, ఆమెకు ఏ అన్య సంభాషణలూ కాలక్షేపమివ్వక పోగా పూర్తిగా ఎడబాటునకు గురై ఉన్నది. నానాటికి ఉప్పొంగుతూ వర్ధిల్లుతున్న ఆశలు, నీవు ఆమె కొప్పున వేసే అక్షతలతో తృప్తిజెందక నీ కూడికకై అధికంగా త్వరపడుతున్నది.

సిగ్గులు మొగ్గలై తీవ్ర రూపం దాల్చగా, వస్తున్న చెమటలతో ఆమె తేలియాడుతూ సతమతమవుతున్నది. అంకురించిన యౌవనభారం వల్ల చెలి అలసి పారవశ్యంతో నున్నది. ఉద్రేకించి వస్తున్న ప్రేమను, తీయని మధురమైన ఆలోచనలను రెట్టించిన గగుర్పాటు దేహమంతా అలుముకొన్నది.

ఆ చెలి నీకై ఎదురుచూపులు చూచి చూచి, నీకౌగిలికై ఉప్పొంగిపోతూ, సంతోషాతిశయంతో చేతులెత్తి ప్రార్థిస్తున్న సమయాన, ఓ శ్రీవేంకటేశ్వరా! సరైన సమయం గమనించి, నీవు జతకూడగానే, శోభించి, ఆమె శ్వాస ఒక్కసారి ఆగిపోయినంత పారవశ్యం కలిగినది.

## 164

**అవతారిక:** అలమేలుమంగకై తపిస్తున్న స్వామిని అపహాస్యం చేయడం, అల్లరి చేసి బాధపెట్టడం తగదని చెలులు ఉద్బోధిస్తున్నారు.

### ఆహిరి

ప. ఇన్నిటా నీచలములు యీడేరెనే
పన్ని నీనేరుపు లిట్టె పచరించవలెనా ॥పల్లవి॥

1. పెనగిఁ యాతఁడు నీకుఁ బ్రియములెల్లాఁ జెప్పె
తనిసి ఇంతటా నీచిత్తము వచ్చెనా
యెనసి వలచేనంటా ఇందరిలోనా నీవు
ననిచినమగవాని నగుఁబాటు సేతురా ॥ఇన్నిటా॥

2. చెలరేఁగి సేయరానిచేఁతలెల్లా నీకుఁ జేసే
తలచిననీదుపంతము చెల్లెనా
మెలఁగి నీమాటలు మీరెనంటా నీవు
కిలకిలనగి యింత కిందుపరపింతురా ॥ఇన్నిటా॥

3. కూరిమి నీకాఁగిటను కూడినట్టెల్లాఁ గూడె
కోరిన నీకోరికలు కొనసాగెనా
యీరీతి శ్రీ వేంకటేశుఁ డిచ్చకుఁడంటా నీవు
రారాపు లిటుసేసి రతి నలయింతురా ॥ఇన్నిటా॥

**అర్థములు:** ప. ఇన్నిటా = ఈవిషయాలన్నింటిలో, చలములు = అదురుపాటు, ఈడేరు = నెరవేరు, నేరుపు = నైపుణ్యము, ప్రతిభ, పచరించు = కనబరచు.

1. పెనగి = చుట్టుకొని, ప్రియములు = ఇష్టమైన మాటలు, తనియు = తృప్తిచెందు, చిత్తము = మనసు, ఎనయు = సమ్మతించు, అనిచి = మొగ్గదొడుగు, నగుబాటు = నవ్వులపాలు.
2. చెలరేగు = విజృంభించు, దుంపతము = సమూలము, చెల్లు = నెరవేరు, మెలగు = వర్తించు, సంచరిను, మీరు = అతిక్రమించు, కిలకిలనగు = పెద్దగా నవ్వడం, కిందుపరచు = భూశయనము.
3. కూరిమి = ప్రేమ, కాగిట = కౌగిట, కొనసాగు = తీరు, ఇచ్చకుడు = ఇష్టమైన వాడు, రారావు = రాపిడి, బాధించి, అలయించు = ఆయాసపెట్టు.

**భావము:** అమ్మా! ఈ స్వామికి సంబంధించిన విషయాలన్నింటిలోను, నీ అదురుబెదురులన్నీ తీరిపోయాయి కదా! ఇంకా ఈవిధమైన పన్నాగాలతో స్వామిని ఈవిధంగా నీ ప్రతిభను చూపించి ఇబ్బంది పెట్టడం న్యాయమా?

ఆ స్వామి నిన్ను చుట్టుకొని నీతో ప్రియభాషణలు చేస్తూ, తృప్తిచెంది యున్నాడు కదా! నీకు ఇకనైనా మనసు తృప్తిచెందినదా? అన్నింటికీ సమ్మతించి, ఇందరు సుందరాగులలో నిన్నే ప్రేమిస్తున్నాడు. కోరికలు చిగురించిన స్వామినీవిధంగా నవ్వులపాలు చేస్తారా?

విజృంభించి, చేయకూడని అకార్యములన్నీ నీ కోసమే చేసిన స్వామి కోరికలను ఈవిధంగా సమూలంగా ద్రుంచివేయడం తగునా? ఏదో నీమాటలు ఎప్పుడో కొన్నిమార్లు అతిక్రమించాడని ఈ విధంగా అపహాస్యంగా కిలకిల నవ్వులతో స్వామిని భూశయనం గావిస్తావా?

స్వామి ప్రేమాభిమానాలతో నిన్ను కౌగిటిలోకి తీసుకొని ఉండగా నీకోరికలన్నీ నెరవేరినట్లే కదా! ఈ విధంగా శ్రీవేంకటేశ్వరుడు నీపై మరులు గొలుపుతూ ఉండగా, ఈవిధంగా రచ్చలు రట్టళ్ళు చేస్తూ రతిక్రీడలో బాధపెట్టం తగునా?

## 165

**అవతారిక:** గండికోటలో ఉన్న శ్రీరామ చంద్రమూర్తిని వర్ణిస్తూ, సీతామహాదేవిని త్రేతాయుగంలో ఏలుకున్న విధంగా వేంకటాద్రిపై ఉన్న అలమేలుమంగమ్మకు ప్రేమాభిమానాలు అందించమని నివేదన.

### దేవగాంధారి

ప. రాజపు నీకెదురేది రామచంద్ర
రాజీవనయనుఁడ రామచంద్ర ॥పల్లవి॥

1. వెట్టిగాదునీవలపు వింటి నారికిఁ దెచ్చితివి
అట్టుసేయఁ బనిలేదు యిట్టె రామచంద్ర
గుట్టుతోడ జలనిధిపై గొండలు ముడివేసితి-
వెట్టు మఱవఁగవచ్చు నివి రామచంద్ర ॥రాజపు॥

2. బతిమితోడుతఁ బైఁడిపతిమెఁ గై కొంటివి
రతికెక్కె నీచలము రామచంద్ర
మితిమీరి జవ్వనము మీఁదుకట్టితివి నాకై
యితరు లేమనఁగల రిఁక రామచంద్ర ॥రాజపు॥

3. నావంటిసీతను నాఁగేటికొనఁ దెచ్చితి
రావాడితమకముతో రామచంద్ర
యీవేళ శ్రీ వేంకటాద్రి నిరవై నన్నుఁ గూడితి
చేవదేర గండికోట శ్రీరామచంద్ర ॥రాజపు॥

**అర్థములు:** ప.రాజపు = రాచరికపు, ఎదురేది = తిరుగేది, రాజీవ నయనుడు = కమలములవంటి కన్నులుగల.

1. వెట్టి = ఊరక, వింటినారికి = శివధనస్సు విరిచి, రట్టు = నింద, జలనిధి = సముద్రము, కొండలు = బండరాళ్ళు, ముడివేయు = ఒకదానికొకటి ప్రక్క ప్రక్కన పరచు, ఎట్టు = ఏవిధముగా.
2. బతిమి = వ్రతము, పైడిపతిమె = బంగారు విగ్రహము, రతికెక్కు = ఆనందము, చలము = ఆనందము, మితిమీరి = అవధులు దాటి, జవ్వనము = యౌవనము, మీదుకట్టు = ముదుపుకట్టు.
3. రావాడి = రాజసము చూపు, తమకము = మోహము, ఇరవు = స్థానము, చేవదేర = ధృడమై, గండికోట శ్రీరామచంద్ర = గండికోటలో వెలసిన శ్రీరఘునాథ దేవా!

**భావము:** రాజరికము ఉట్టిపడుతున్న తిరుగులేని ఓ రామచంద్రా! కమలములవంటి కన్నులుగల రామచంద్రా!

ఆ సీతామహాసాధ్విని ఊరకే నీవు కొనిరాలేదు. విల్లు విరిచి వింటినారిని ధనుస్సునకు బిగించి తెచ్చితివి. నిన్ను ఏమాత్రము నిందించపని లేదు. ఆ మహాసాగరంలో కొండరాళ్ళు ఒకదానికొకటి పరచి ముడివేసి వారధి నిర్మించావు. ఆ వింతలన్నీ విని ఎలా మరచిపోగలము రామచంద్రా!

వ్రతము పేరుతో సీతమ్మ బంగారు ప్రతిమను పొందిన వాడవు. నీ ఆనందము చెప్పనలవిగానిది. అవధులు దాటిన నీ యౌవనమంతా నాకొరకై ముదుపుగట్టుకొన్నావు. నిన్ను ఎవరు ఏమనగలరు రామచంద్రా!

నాగేటి కొసనుండి పుట్టిన నావంటి సీతను త్రేతాయుగములో ఎంతో మోహముతో తెచ్చుకున్నావు. ఈ యుగములో ఈవేళ శ్రీవేంకటాద్రిపై స్థిరముగా నిలబడి నన్ను కూడితివి. ఎంత సాహసవంతుడవయ్యా! గండికోట శ్రీరామచంద్రా! నీకు నీవే సాటి.

**విశేషములు:**

1. అన్నమయ్య పదాలను ఉపయోగించడంలో సర్వ స్వతంత్రుడు. ఈ కీర్తన పల్లవిలో “రాజపు” అనే ఒక క్రొత్త ప్రయోగం చేశాడు. ఈ ప్రయోగం నిఘంటువులలో కానరాదు. రాజరికములో ఉన్న అనే మాటను చాలా సులభముగా “రాజపు” అనే మాటగా మార్చి ఉపయోగించాడు. అనగా రాజరికపు, రాజపుత్రా! రాజసము ఉట్టిపడే అనే ఎన్నో విధములుగా దీనికి అర్థం తీసుకోవచ్చు. కొన్ని గ్రంథాలలో “రాజవు(పు) గా మార్చి స్వరపరచిన కీర్తన కూడా ఉన్నది.
2. అలాగే గండికోట శ్రీరామచంద్రా! అని గండికోటలో కొలువై ఉన్న రఘునాథ స్వామిని కీర్తించాడు. కడప దగ్గర ఉన్న ఈ గండికోట ఇప్పుడు శిధిల స్థితిలో నున్నది. అలాగే ఆ రఘునాథ ఆలయము సైతము చాలావరకు శిధిలమై ఉన్నది. ఆ గుడిలో దశావతార శిల్పములు చెక్కబడి ఉన్నవి. దానిని దర్శించిన సమయంలో అన్నమయ్య పై కీర్తనను వ్రాసినట్టు తెలుస్తున్నది.

## 166

**అవతారిక:** అన్య స్త్రీని చెంత ఉంచుకొని సరసాలలో ఉన్న స్వామిని అలమేలుమంగమ్మ అన్యాపదేశంగా నిందిస్తున్నది.

## సాళంగం

ప. ఏల కూరిమి గొసరే విప్పుడు నన్ను
వాలాయించి నీవాపెకు వసమై వున్నాఁడవు ॥పల్లవి॥

1. తమకించి నే నిన్ను దప్పులుదేరిచేనంటే
అమరునా నీవద్దనాపె వుండఁగా
సముకాన నుండి మోవిచవులు చూపేనంటే
తెమలేవా ఆపె తరితీపులు నున్నాఁడవు ॥ఏల॥

2. వెస నాముచ్చటలెల్లా వేడుక జెప్పే నంటే
బొసఁగునా ఆపె నీతో బొందు సేయగా
రసికత నీతో సరసము లాడేనంటే

అస మిచ్చేవా ఆపై ఆసల నున్నాఁడవు ॥ఏల॥

3. సతమై నీకుఁ బచ్చడము గప్పేనంటే
ఇతవౌనా ఆపె నిన్ను నెనయఁగను
పతివై నన్నేలితివి బాగుగా శ్రీ వేంకటేశ
తతిఁ గాదనేనా ఇందరిఁ గూడున్నాఁడవు ॥ఏల॥

**అర్థములు:** ప. ఏల = ఎందుకు, కొసరు = కోరు, వాలాయించు = అవశ్యము, ఆపె = ఆమె, వసము = వశము.

1. తమకించు = త్వరపడు, దప్పులుదేరుచు = దాహార్తి దీర్చు, అమరు = కుదురు, ఆపె = ఆమె, సముకాన = సమీపము, మోవిచవులు = అధరామృతము, తెమలు = పనిపూర్తిచేసుకొను, ఆపె = ఆమె, తరితీపులు = అపేక్ష.
2. వెస = వేగము, వేడుక = వినోదము, పొసగు = అనుకూలించు, ఆపె = ఆమె, పొందు = కూడు, రసికత = రసజ్ఞత, సరసము = ఉల్లాసము, అస = చనువు, ఆశలు = కోరికలు.
3. సతము = శాశ్వతము, పచ్చడము = అంగవస్త్రము, హితవు = ఇష్టము, ఆపె = ఆమె, ఎనయు = సరిపోలు, తతి = సమయము.

**భావము:** ఓ శ్రీనివాసా! నీవామెకు అవశ్యము వశమై ఉన్నప్పుడు ఎందుకు మరలా నా సఖ్యము కోరుతున్నావు?

స్వామీ! నేను తొందరపడి నీ కోరికలు తీర్చాలంటే, ఆమె నీ వద్ద ఉండగా అది కుదిరేపనేనా? నిన్ను సమీపించి నా అధరామృతం అందిద్దామంటే, ఆమె వద్దనున్న పనులు తొందరగా పూర్తిచేసుకొని రాలేక ఆమె ప్రేమామృతములో తేలియాడుతున్నావు.

నేను త్వరపడి నా విషయాలన్నీ విలాసవంతంగా ఏకరువు పెడదామనుకుంటే, ఆమె పొందులో ఉన్న నీకు కుదిరేపనేనా? ఏదో రసజ్ఞత చూపి నీతో సరస సల్లాపాలాడుదామంటే, ఆమె కోరికలవలలో చిక్కినవాడివి నాకు చనువు అవకాశమి ఇవ్వగలవా?

నీకు స్థిరమై చినీ చీనాంబరాలైన అంగవస్త్రం కప్పుదామంటే, ఆమెతో కూడి ఉండగా నీకిష్టమవుతుందా? ఓ శ్రీవేంకటేశ్వరా! భర్తవై నన్ను ఇంత బాగా ఏలుకుంటున్నావు. ఇది సరైన సమయము కాదనేనా ఇందరితో కూడి ఉన్నావు.

## 167

**అవతారిక:** స్వామి అన్యకాంతలకు తగని మర్యాదలు చేస్తున్నాడని, నిందా స్తుతి చేస్తున్న చెలి.

## నాదరామక్రియ

ప. కంటివిగా యెటువంటి గయ్యాళి యీపె
ఇంటికాడనే చూపి ఇచ్చీనట తాను ॥పల్లవి॥

1. యెలమి నీవట యాడోయింతి బెండ్లాడితివట
వెలఁది యాడిన మాట వింటివా వోయి
ఆలరి నీవేమైనా నటువంటి వాఁడవా
కలవి లేనివి నీపై గడియించీఁ దాను ॥కంటివి॥

2. మేరతో నీవేల నేడో మెట్టె లిడుకొంటివట
చేరి యాకె కోపము చూచితివా వోయి
నేరమి నీయందుఁ గద్దా నేమెన్నఁడూ నెఱఁగము
తారుకాణించే నంటాఁ దమకించీఁ దాను ॥కంటివి॥

3. విందుల నెవ్వతెకో విడె మిచ్చి వచ్చితట
చెంది యాకె గుట్టు తెలిసితివా వోయి
పొందితివి నన్ను నిట్టె పొసఁగ శ్రీవేంకటేశ

నిందలివే యని మొక్కి నిన్ను మెచ్చీఁ దాను. ॥కంటివి॥

**అర్థములు:** ప. గయ్యాళి = ధిక్కరించి మాటాడునది, ఈపె = ఈమె, ఇచ్చీనట = ఇచ్చెనట.

1. ఎలమి = సంతోషము, యాడో ఇంతి = ఎక్కడనో ఉన్న ఆమె, వెలది = స్త్రీ, వోయి = పురుష సంబోధనమునందు ఉపయోగింపబడునది, అలరి = ఒప్పి, కలవిలేనివి = ఉన్నవీలేనివి, గడియించు = లెక్కించు.
2. మేర = మర్యాద, మెట్టులిడు = మెట్టెలు ధరింపజేయు, ఆకె = ఆమె, నేరమి = దోషము, తారుకాణ = సాక్ష్యము, ఋజువు, తమకించు = త్వరపడు.
3. విడెమిచ్చు = తాంబూలమిచ్చు, ఈకె = ఈమె, పొందితివి = కూడితివి, పొసగ = విధి, నిందలు = అపవాదులు.

**భావము:** ఓ శ్రీనివాసా! ఈమె ఎటువంటి గయ్యాళితనంతో ఉన్నదో చూస్తూనే ఉన్నావుగదా! ఇంటిదగ్గరనే ఉండి ఆమె తన వ్యవహారాలన్నీ నడిపిస్తున్నదట.

సంతోషించి నీవు ఎక్కడో ఉన్న ఒక లలనను పెండ్లిచేసుకున్నావట. దానికి ఆమె ఏమన్నదో విన్నావా స్వామీ! అసలు నీవటువంటివాడవా స్వామీ! ఉన్నవి లేనివి కల్పించి చెప్పడంలోతాను దిట్ట స్వామీ!.

మర్యాదగా ఎక్కడో ఉన్న ఒక ఇంతికి మెట్టెలు ఇచ్చావట. దానికి ఆమె ఆగ్రహావేశాలు చూశావా స్వామీ! దోషమేమైనా ఉ ందా ఇందులో! మేమెన్నడూ ఇటువంటివి ఎరిగితిమా?

మొన్న జరిగిన విందులో ఎవ్వతెకో తాంబూలము ఇచ్చావట. ఈ రహస్యము కూడా ఆమెకు తెలిసిపోయినదయ్యా స్వామీ! ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను ఈవిధముగా పొందు కూడావు. ఇవన్నీ నీమీద వచ్చిన అపవాదులే అని యెరిగి నిన్ను చివరకు ప్రశంసించినది.

**గమనిక:** క్రీగీతలు గల పదములు, రాగిరేకు చిలుము తినడం వలన శ్రీమాన్ గౌరిపెద్ది రామసుబ్బ శర్మగారు పరిష్కరించిన పదములు.

## 168

**అవతారిక:** సదా సేవలు చేస్తూ పొంగిపోతున్న అమ్మ ఘనతను, స్వామివారికి చెలులు వివరిస్తున్నారు.

### నాగవరాళి

ప. ఎక్కడ గడించుకొంటి వీకెను నీవు
పక్కన సేవలు సేసి పాదాలొత్తీని ॥పల్లవి॥

1. సొంపు మీరి నీతోడ సుద్దు లెల్లా విన్నవించి
చెంపల జారే కురులు చేత దువ్వీని
యింపు వుట్ట నేడలేని యిచ్చకములెల్లాఁ జేసి
జంపుల నవ్వులు నవ్వి జట్టి గొనీని ॥ఎక్కడ ॥

2. మచ్చిక మాఁటలాడించి మర్మములు సోఁకించి
మెచ్చి మెచ్చి గందము నీ మేనఁ బూసీని
లచ్చెనగా గోరుదీసి లావులు చూపి పెనఁగి
కుచ్చి కాఁగిలించి నిన్నుఁ గోరికొసరీని ॥ఎక్కడ ॥

3. బాగా లిచ్చి వేఁడుకొని పచ్చడము మీఁదఁ గప్పి
ఆగడాలు సేసి కూడె నాపె నిన్నును
చేగదేర నేలితివి శ్రీ వేంకటేశ నన్ను
లాగుల నప్పటి మోవిలంచము దానిచ్చీని ॥ఎక్కడ ॥

**అర్థములు:**

1. సొంపు = సమృద్ధి, సుద్దులు = మంచి మాటలు, విన్నవించు = మనవిచేయు, ఇంపు = ఇష్టము, ఏడలేని = ఎక్కడా లేనటువంటి, ఇచ్చకము = ముఖప్రీతి మాటలు, చంపుల = ఊరక, జట్టి = వశపరచును.
2. మచ్చిక = మోహము, సోకు = తగులు, మెచ్చి = పొగడి, మేన = శరీరంపై, అచ్చెన = పూజ, లావులు = సామర్థ్యము, పెనగు = కౌగలించుకొను, కుచ్చి = తగినవిధము, కాగలించి = కౌగలించు, కోరి = కోరుకొని, కొసరు = కోరిక.
3. బాగాలు = వక్కపలుకులు, పచ్చడము = అంగవస్త్రము, ఆగడాలు = ప్రతికూలమైన పని, ఆపె = ఆమె, చేగదేర = చేవదీర, లాగులు = ఆకర్షించే విధము, మోవిలంచము = అధరామృతము, తనిచ్చీని = తాను ఇచ్చుచున్నది.

**భావము:** ఓ శ్రీనివాసా! ఎక్కడ సంపాదించావయ్యా ఈమెను నీవు? నీకు సదా సేవలు చేస్తూ నీ పాదాలను ఒత్తుతున్నది.

నీతో ఇష్టమైన కబుర్లన్నీ మనవి చేసుకొంటూ చెంపలపై జారుతున్న కురులను చేతితో సవరించుకొనుచున్నది. ఎక్కడాలేని కబుర్లన్నీ పోగుచేసి నీకు ఆసక్తి గలిగే విధంగా చెబుతూ, ఊరకనే ముసి ముసి నవ్వులు నవ్వుతూ నిన్ను వశపరచుకొన్నది.

మోహముతో నిండిన మాటలెన్నో చెబుతూ శరీరంలో తగలకూడని అవయవాలు తాకిస్తూ, నిన్ను స్తుతిస్తూ మంచి గంధాన్ని నీ శరీరంపై పూస్తున్నది. నిన్ను పూజించి, గోరు తీసి తన శక్తినంతా చూపిస్తూ నీ కౌగిట్లోకి చేరుచున్నది. తగినరీతిలో నిన్ను చేరి నిన్నే కోరుకుంటున్నది.

నీకు వక్కపలుకులనిచ్చి విన్నపాలు చేసుకుంటూ అంగవస్త్రం పైన కప్పి, ఎన్నో కార్యాలు చేస్తూ నిన్ను కూడుకున్నది. ఓ శ్రీవెంకటేశ్వరా! సాహసవంతుడవై నన్నేలుకున్నావు. నిన్నాకర్షించే విధంగా తన అధరామృతము నీకందించుచున్నది.

**గమనిక**: క్రీగీతలు గల పదములు, రాగిరేకు చిలుము తినడం వలన శ్రీమాన్ గౌరిపెద్ది రామసుబ్బ శర్మగారు పరిష్కరించిన పదములు.

## 169

**అవతారిక:** అమ్మ అలమేలు మంగమ్మ స్వామివారిని అన్యకాంతలతో కూడిన సమయాలలో గర్వం బిగువు చూపవద్దని ప్రార్థిస్తున్నది.

### మాళవిగౌళ

ప. ఇందరు నెరిఁగినవే యీ సుద్దులు
యెందు నుండినాను మా యింటికి రావలెను ॥పల్లవి॥

1. యెంత వాఁడవైనాను యెపుడును మాతోను
పంతములాడకురా పలుమారును
కాంతల మోవి తేనెలు కైకొనేటి వేళను
పొంతనుండి యెంగిలికి పొత్తుగూడవలెను ॥ఇందరు॥

2. ఘనుఁడవౌదువు నేఁడు గర్వము మాతో సరి-
పెనఁగకురా నీవు పెచ్చు రేఁగుచు
వనితలైనవారు వడిఁ గాఁగిలించేవేళ
చనుఁగొండలసందిఁగి చనవియ్యవలెను ॥ఇందరు॥

3. మగఁడవైతివి నాకు మక్కువ శ్రీవెంకటేశ
బిగియకురా ఇంత పెనఁగుతాను
మగువలైనవారి మరిగి కూడేవేళ
పొగరుఁబాదములువీఁపున మోవవలెను ॥ఇందరు॥

**అర్థములు:** ప. ఇందరు = ఇక్కడున్నవారెల్లా, సుద్దులు = నీ ఘనమైన మాటలు.

1. ఎంతవాడవైనను = నీవెంత గొప్పవాడవైనప్పటికి, పంతము = పట్టుదల, పలుమారు = అనేకసార్లు, మోవితేనె = అధరామృతము, కైగొను = అందుకొను, పొంత = సమీపమున, పొత్తు = సాంగత్యము.
2. ఘనుడు = గొప్పవాడు, సరిపెనగు = సరిసమానముగా పోట్లాడు, పెచ్చురేగు = ఎక్కువ రెచ్చిపోవు, వడి = వేగముగా, కాగలించేవేళ = కౌగిలి కూడే సమయము, చనుగొండలు = వక్షోజములనే పర్వతాలు, సందు = మధ్య ప్రదేశము, ఈగు = ఇచ్చుట, చనువిచ్చు = చొరవిచ్చు.
3. మక్కువ = ప్రీతి, బిగియు = సంకోచించు, పెనగు = చుట్టుకొను, మగువ = భార్య, మరిగి = అలవాటుగా, కూడేవేళ = పొందుకూడు సమయము, పొగరు = గర్వము, వీపున = వెనుకవైపు.

**భావము:** ఓ స్వామీ! ఇక్కడ ఉన్నవారందరికి నీ ఘనకార్యాలు, మాటలు తెలియనివా? ఎక్కడ ఉన్నా సరే మా ఇంటికి వెంటనే రావలెను సుమా!

నీవెంత గొప్పవాడవైనా మాతో ఎప్పుడూ పంతాలు పట్టింపులు పెట్టుకోకూడదు. స్త్రీలతో జతకలిసి అధరామృతము గైకొనే సమయాలలో, చెంతనే ఉండి ఆస్వాదించాలి.

నీవెంత గొప్పవాడవైనా ఇంత గర్వాతిశయము పనికిరాదు. ఎక్కువ విజృంభించి మాతో పోట్లాట చేయవద్దు. వనితలు మిమ్ములను కూడి త్వరపడి కౌగిలిలోనికి తీసుకునే సమయాల్లో వక్షోజాలనొత్తుకొని చొరవగా ప్రవర్తించాలి.

ఓ శ్రీవేంకటేశ్వరా! ప్రీతితో నాకు భర్తగా ఉన్నావు కదా ఇంత బిగువు చూపించడం తగునా? గర్వంతో కూడుకున్న నీ పాదములను, రతి క్రీడా సమయాలలో వీపున వేయరాదా?

## 170

**అవతారిక:** స్వామివారు ఒకే సమయంలో పలువురు కాంతలను గూడి చేస్తున్న శృంగార కార్యాలను చెలులు పరిహాసంతో వివరిస్తున్నారు.

### బౌళి

ప. ఎంతలేదు నీ యాసోద మేమిచెప్పేది
చెంతనుండి నామీఁదఁ జేయి చాఁచేవు ॥పల్లవి॥

1. వొక్కతెతో మాటాడుతా నొక్కతెతో నవ్వేవు
అక్కర నొకతె వీడె మడిగేవు
వుక్కుమీరి వొక్కతెను వొడివట్టి తీసేవు
మక్కువ నప్పటిని నామర్మము లంటేవు ॥ఎంత॥

2. చెయివట్టే వీకెను చేసన్న సేసే వాకెను
పాయఁజాల కిల్లీ కెకుఁ బనిచెప్పేవు
చాయల నల్లాకెతోడ సరసము లాడేవు
సోయగాన నాకప్పటి సొమ్ము లిచ్చేవు ॥ఎంత॥

3. యెవ్వతెనో పేరఁ బిల్చి యెవ్వతెనో కూడేవు
దవ్వుల నదెవ్వతెనో తలపోసేవు
రవ్వగా శ్రీ వేంకటేశ కత నన్నుఁ జెలగించి
చివ్వన నప్పటి నవ్వే చేరికూడేవు ॥ఎంత॥

**అర్థములు:** ప.ఆశోదము = కోరిక, చెంత = సమీపము.

1. ఒక్కతె = ఒక స్త్రీ, వీడెము = తాంబూలము, ఉక్కుమీరు = అతిశయము, వొడివట్టు = తొడపైభాగము, మర్మము = రహస్యము.

2. చేయివట్టి = చేతిని పట్టుకొని, ఈకె = ఈమె, చేసన్న = చేతిసైగ, ఆకె = ఆమె, పాయజాలక = విరామములేకుండా, ఈకె = ఈమె, చాయలు = కాంతి, అలాకె = అక్క దున్న స్త్రీ, సోయగము = సౌందర్యము, సొమ్ములు = నగనత్రా వస్త్రాదులు.
3. ఎవ్వతెనో = ఏస్త్రీనో, పేరబిల్చు = పేరుపెట్టి పిలుచు, కూడు = జత కలియు, దవ్వు = దగ్గర, తలపోయు = ఆలోచించు, రవ్వ = అల్లరి, కత = కట్టుకథలు, చెల్గించు = ముట్టుకొను, చివ్వన = హటాత్తుగా, చేరి కూడు = వచ్చి జతకూడు.

**భావము:** స్వామీ! నీవద్ద చాలా ఘనకార్యములున్నవి. నీలీలలు చెప్పనళవి కావు. నీ కోరికలను ఏమి చెప్పగలను? నన్ను సమీపించి మీద చెయ్యివేయడానికి యత్నిస్తావు.

ఒక స్త్రీతో మాట్లాడుతూనే క్షణంలో యింకొకతెతో నవ్వులు కలుపుతావు. అవసరార్థం ఒకతెను తాంబూలం అడుగుతావు. ప్రేమాతిశయంతో ఇంకొకతెను ఒడిపట్టి దరిచేర్చుకుంటావు. మరలా ఎంతో ప్రేమతో నన్ను ముట్టకూడని ప్రదేశాలను ముట్టుకుంటావు.

ఒక వనిత చేయిపట్టుకుని కబుర్లాడుతూనే ఇంకొకతే చేతితో ఏవో సైగలు చేస్తావు. విధి విరామము లేకుండా యిక్కడున్న ఈమెకు ఏవో పనులు పురమాయిస్తావు. ప్రకాశంతో నవ్వులు చిందిస్తూ అక్కడున్న ఆమెతో సరసల్లాపాలకు దిగుతావు? మరలా సౌందర్యముతో నా చెంతజేరి ధనము, నగలు, వస్త్రాదులను సమర్పించుకొంటావు.

ఎవరినో పేరుబెట్టి పిలిచి మరలా ఎవరితోనో జతకూడుతావు. సమీపంలో మరొకతెను మదిలో తలపోస్తూ ఉంటావు. ఓ అల్లరి వేంకటేశా! ఏదో కట్టుకథ ఒకటి జెప్పి, నవ్వుతూ అప్పటికప్పుడు నాతో జత కూడుతావు.

## 171

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ యుక్త వయసు వచ్చినప్పటినుండి ఆమెకై వేచి యుండి స్వామి చేసిన చిలిపి పనులను ప్రశంసిస్తున్నది.

### కన్నడగౌళ

ప. ఎప్పుడూ నీయాల నేను ఇటు నాకు మగఁడవు
చిప్పిల నాచేత నీవు సేవగొనవయ్యా ॥పల్లవి॥

1. కన్నెనాటనుండి నాకుఁ గాచుకుండి యింతేసి-
చన్నులు రాఁగాను సేసవెట్టితివి
విన్నవించే దేమున్నది వేగినంతా నీవు నన్ను
మన్నించిన మన్ననలు మఱవకుమయ్యా ॥ఎప్పుడూ॥

2. మొలక వలపులే మొదలుసేసుకొని
తొలిసమరుతాడితే దొరసితివి
బలిమి చెప్పఁగనేల పలుమారు నీవు నాకు-
నెలమి నిచ్చినమాఁట యీడేరించవయ్యా ॥ఎప్పుడూ॥

3. తమకపుఁ జూపులనే దక్కి నాకాఁగిటిలోన
కొమరెపాయ మీదేరఁ గూడితివి
అమర నాడఁగనేల ఆసతో శ్రీవేంకటేశ
జమళి నావద్దనుండి చనవియ్యవయ్యా ॥ఎప్పుడూ॥

**అర్థములు:** ప.నీయాల = నీ ఆలిని, మగడవు = పతివి, చిప్పిలు = పైకిఉబుకు (ప్రేమ పొంగునట్లు)

1. కన్నె = పెండ్లికాని స్త్రీ, కాచుకుండి = వేచియుండి, చన్నులు = వక్షోజములు, సేసవెట్టు = అక్షతలు చల్లు, విన్నవించు = మనవిచేసుకొను, వేగు = ఆరట, మన్నన = గౌరవము.
2. మొలకవలపులు = తొలిప్రేమలు, తొలిసమరుతాడు = మొదటిసారి రజస్వలయగు, దొరయు = సమీపించు, పలుమారు =

అనేకసార్లు, ఎలమి = సంతోషము, ఈడేరించు = నెరవేర్చు.

3. తమకము = మోహము, కాగిట = కౌగిట, ఽ=మెరపాయము = యుక్తవయసు, ఈడేర = నెరవేరు, అమర = పొందిక, జమళి = జంట, చనవు = అధికారము, ప్రేమ.

**భావము:** ఓ స్వామీ! నేనెప్పుడూ నీ ఇల్లాలినే! నీవు నాకు భర్తవు. నీప్రేమ పొంగునట్లుగా నాచేత సేవలు చేయించుకోవయ్యా!

నేను కన్యగా ఉన్నప్పటినుండి నాకొరకే వేచి యుండి, యుక్తవయసు వచ్చి వక్షోజములు రాగానే నాపై అక్షతలు చల్లినావు. నీకిక నేను వేరుగా మనవి చేసుకునేదేముంటుంది ? అన్ని విషయములు నీవెరిగినవే కదా! నీవు నాకు చూపించిన మర్యాదలనెన్నటికి మరవవద్దు.

తొలివలపులు మొదలైనప్పటినుండి, మొదటిసారి రజస్వల అయిన నాటినుండి సమీపించి, నువ్వు చేసిన పనులు, నీ శౌర్యము ఇంకా చెప్పడం ఎందుకు? సంతోషంతో ఇచ్చిన మాటలన్నీ నెరవేర్చవయ్యా!

మోహపు చూపులు చూస్తూ నాపొందుకోరి నా కౌగిట్లో యుక్తవయసుతో నేను సంతసించించే విధంగా నన్ను పొందుకున్నావు. ఓ శ్రీవేంకటేశ్వరా! ఇంకా నా పొందికకోసం ఆశతో ఈ దొంగాటలెందుకు? జంటగా నా వద్దనే యుండి నీ ప్రేమాధికారాలు నాకు ఇవ్వవయ్యా!

## 172

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మను చెలులు స్వాధీనపతిక యని మెచ్చుకుంటూ, తోడి సవతులను కూడా ఆదరించమని, స్వామి ప్రేమాభిమానాలను తమకూ దక్కజేయమని సవతులు చేసే విన్నపాలు.

### రామక్రియ

ప. నేమూ నీవలెనే నేరుతుమే ఇన్నిటాను
నేమముతో మామీఁద నించవే మన్ననలు ॥పల్లవి॥

1. చెప్పినట్టు సేసేపతి చేతికి లోనై యుండఁగా-
నిప్పుడేకాక పంతము లిఁక నెన్నఁడే
ముప్పిరి నీవేలను ముద్దుటుంగర మదిగో
చిప్పిల నీ కన్నిటాను చెల్లునే నీపగటు ॥నేమూ॥

2. వలచి యీ విభుఁడు నీవాఁడై నేఁ డుండఁగాను
యెలమి నవ్వునవ్వక యేలమానేవే
పలుసవతులలోన పట్టపుదేవులవట
చలమున నేలవే సవ(తుల?) రాజ్యము ॥నేమూ॥

3. శ్రీవేంకటేశుఁడు నిన్నుఁ జెంది కాఁగిలించఁగాను
ఆవేడుక లీ వేడుక లమరుఁగదే
కైవశమై భోగములు కాణాచులాయ నిట్టె
యీవల నన్నేలె నితఁడిది నీమతకము ॥నేమూ॥

**అర్థములు:** ప. నేమూ = మేమూ, నేరుతుము = నేర్చిఉన్నాము, నేమము = నియమము.

1. సేసేపతి = చేసే భర్త, లోనై = వశమై, ముప్పిరి = అల్లుకొను, చిప్పిల = పైకి ఉబుకు, పగటు = లావణ్యము.
2. ఎలమి = ప్రకాశము, పట్టపుదేవులు = పట్టపురాణి, చలము = ఈర్ష్య.
3. కాగిలించు = కౌగలించు, వేడుక = సంతోషము, వినోదము, కైవశము = పూర్తి స్వాధీనము, కాణాచి = కాణయాచి పదం యొక్క రూపాంతరము - చిరకాలవాసస్థానము, ఈవల = ఈవైపు, మతకము = మాయ, కపటము.

**భావము:** మేమూ నీమాదిరిగా అన్నిటా నైపుణ్యముగలవారమే! నియమముతో మా పనులన్నింటిని మన్నించవే!

నీవు చెప్పినట్లు విని చేసే భర్త నీకు లొంగి ఉండగా, ఇప్పుడు కాకుండా ఇంక పంతములెప్పుడు? నీవేలికి అల్లుకొని ఉన్న ముద్దుటుంగరము అదిగో కనిపిస్తూనే ఉంది. నీ లావణ్యం అనేక రీతుల్లో కనిపిస్తూ నీమాటే చెల్లుచున్నది.

నిన్నే వలచి ఈ భర్త నీవాడై ఈనాడు యుండగా, ప్రకాశించి నవ్వులు నవ్వకుండా ఎలా ఉంటావు? ఇంతమంది సవతులలో నీవు పట్టపురాణివి, ఇక ఈర్ష్యతో ఈ సవతుల రాజ్యాన్ని ఏలుకోవే!

శ్రీవేంకటేశ్వరుడు నిన్ను చేరి కౌగలించుకోగా, ఆ వేడుకలు ఈ వేడుకలు నీకు పూర్తిగా నీకమరి యున్నవి. నీకు పతి పూర్తిగా స్వాధీనమై యుండగా భోగములన్నీ నీకే చిరకాలవాసస్థానమై విరాజిల్లుతున్నది. ఇక్కడ నన్నేలుకొను చున్న ఈతడిది మాయ కాదా?

## 173

**అవతారిక:** వాయల్పాడులో నెలకొన్న పట్టాభి శ్రీరామచంద్రుని వర్ణిస్తూ, స్వామి లీలలు బట్టబయలయ్యాయని, అన్య స్త్రీల సాంగత్యం వలదని స్వామికి విన్నవిస్తున్నారు.

### దేసాళం

ప. వెల్లవిరాయఁ బనులు విట్ఠలేశ్వరా
చల్లజంపు సేఁతల సటకారివాఁడవు ॥పల్లవి॥

1. ననుఁజూచి కొలువులో నవ్వినదే చాలదా
వనితల యెడల గర్వపు వాఁడవు
చెనకి యప్పటి నన్నుఁ జేఁ(జే?)త నంటవలెనా
పొనుగనివలపులపొత్తులవాఁడవు ॥వెల్లవిరాయ॥

2. మచ్చికల నాతోడ మాటాడుటే చాలదా
కుచ్చితపు బహు పరాకులవాఁడవు
విచ్చనవిడి నిప్పుడే విడెమియ్యవలెనా
మచ్చు వేసితీ సేవెడమాయదారివాఁడవు ॥వెల్లవిరాయ॥

3. సంగడి నాపై సేస చల్లుటే చాలదా
సంగ తెరిఁగి నెన రజాణకాఁడవు
చెంగట నన్నేలితివి శ్రీవేంకటేశుఁడవై
యెంగిలి సేయవలెనా యిచ్చకపువాఁడవు ॥వెల్లవిరాయ॥

**అర్థములు:** ప.వెల్లవిరి = ప్రకటితము, బయల్పడు, విట్ఠలేశ్వరా = వాయల్పాడులోని విఠలుడా!, చల్లజంపు = చల్లగా చంపువాడు, సటకారి = మాయ, కపటము.

1. చెనకు = తాకు, చేతనంటు = చేతితో ముట్టుకొను, పొనుగు = పూనిక వహించు, పొత్తులు = సాంగత్యము.
2. మచ్చికలు = మోహము, కుచ్చితము = కుటిలము, బహు పరాకు = రాజులు దర్బారులోనికి ప్రవేశించునపుడు సేవకులు పలుకు ప్రశంసాపదము, పరధ్యాస ఉన్నవాడు, విచ్చనవిడి = స్వేచ్ఛాప్రవృత్తి, విడెము = తాంబూలము, మచ్చు = మాదిరి, వెడ = అల్పము, మాయదారి వాడు = మోసగాడు.
3. సంగడి = జతకలియు, సేస = అక్షతలు, నెరజాణకాడు = ఎక్కువైన నేర్పరి, చెంగట = సమీపమున, ఎంగిలి = అధరామృతముగ్రోలు, ఇచ్చకము = ముఖప్రీతి.

**భావము:** ఓ విట్ఠలేశ్వరా! నీపనులన్నీ బట్టబయలైనాయి. మెల్లగా చల్లగా ప్రాణంతీసే విధంగా మా ప్రేమలను సాధించుకోగల మాయగాడివి సుమా!

నన్ను చూసి కొలువులో నవ్వడమే కాకుండా, స్త్రీల పట్ల గర్వాతిశయం చూపించేవాడివి. నన్ను సమీపించి తాకడమే కాకుండా నా చేయిని చేత పట్టుకుంటావా? ఆశలతో ప్రేమలొలకబోసి సాంగత్యాలు నెరపే వాడివి.

మోహావేశంతో నాతో మాట్లాడడమే కాకుండా, కుటిలపు ఆలోచనలను లోన పెంచుకొని, కూడికలకై సదా ఉత్సాహంతో ఉన్నవాడవు.

జతకలిసి నాపై అక్షతలు చల్లడమే కాకుండా, మా విషయాలు, మర్మాలు పూర్తిగా తెలుసుకొన్న నేర్పరివి. సమీపించి నన్నేలుకున్న ఓ శ్రీవేంకటేశ్వరుడవై, అధరామృతం కోసం అర్రులు చాస్తూ ముఖప్రీతిమాటలాడేవాడవు.

**విశేషాంశాలు:**

1. అన్నమయ్య జిల్లా, వాల్మీకిపురం మండలంలో, తిరుపతి మదనపల్లి మార్గమధ్యలో తిరుపతికి 90 కి.మీ. దూరంలో వాయల్పాడు అనే గ్రామంలో ఉన్న ప్రధాన ఆలయమైన పట్టభిరామాలయంలో వెలుపల పశ్చిమముఖంగా విఠలేశ్వరుడు ఆలయం ఉన్నది. ఆ మూర్తిని దర్శించి అన్నమయ్య గానం చేసిన సంకీర్తన ఇది.
2. అన్నమయ్య ఈ కీర్తన పల్లవిలో “చల్లజంపు సేతలు” అనే క్రొత్త ప్రయోగం చేశాడు. అంటే ఆంగ్లంలో “కోల్డ్ బ్లడెడ్ మర్డర్” కు సమానమయిన మాట. నిదానంగా ఆలోచించి ఆలోచించి చేసే పనులకు “నమ్మించి గొంతులు కోయడం” అన్న అర్థంలో ఉపయోగించబడిన మాట.
3. విట్ఠలేశ్వరుని పదం గురించి పరిష్కర్త ఇచ్చిన వ్యాఖ్యానవిశేషము ముద్రణలో లుప్తమైనది.

## 174

**అవతారిక:** అన్నమయ్య ఉదయగిరి కోటలో కొలువైన శ్రీకృష్ణుని వర్ణిస్తూ, ద్వాపర యుగంలో శ్రీకృష్ణుడుగా గొల్ల చెల్లులతో చేసిన సరస సల్లాపాలను వివరిస్తునాడు.

### శంకరాభరణం

ప. ఉద్దగిరి కృష్ణుఁడు వుబ్బరికాఁడు వీఁడు
ముద్దులు చూపుతానే ముసుఁగులు దీసేనే ॥పల్లవి॥

1. చెంగట నిద్దిరించేటిచెలువంపు గొల్లెతల
దొంగిడుచు వచ్చి వచ్చి తొడ లంటీనే
ముంగిటఁ గూచుండఁగాను ముడిచినపోఁకముడి-
కొంగులు విడిచి యట్టె కొల్లున నవ్వీనే ॥ఉద్దగిరి॥

2. వేడుకతో గొల్లెతలు వెన్నముద్దలు సేయఁగ
చాడెసంది వచ్చి తాను చన్నులంటీనే
జోడై యెకరొకరు సుద్దులుచెప్పేటివేళ
కోడెకాఁడై యండనుండి కొప్పులు వట్టీనే ॥ఉద్దగిరి॥

3. అట్టె విడేలు సేయుచు నాకులు మడుచుకోఁగా
గట్టిగాఁ గళలురేఁగ కాఁగిలించీనే
యిట్టె మమ్మిందరిని యేలి శ్రీవేంకటేశుఁడై
దిట్టతనమున మోవితేనే లిచ్చీనే ॥ఉద్దగిరి॥

**అర్థములు:** ప.ఉద్దగిరి = ఉదయగిరి, ఉబ్బరికాడు = సంతోషంతో ఉప్పొంగే వాడు, ముసుకులు = ఆడువారి మేలిముసుకులు.

1. చెంగట = చెంత, చెలువంపు = అందమైన, గొల్లెతలు = గొల్లస్త్రీలు, దొంగిడు = దొంగతనముగా, ముంగిట = ఇంటిముందు, పోకముడి = స్త్రీల కట్టుకోక ముడి, కొల్లున = కలకలమని.

2. చాదె సంది = కుండలమధ్యగా, సుద్దులు = మంచిమాటలు, కోడెకాడు = యుక్తవయసువాడు, కొప్పు = తలకొప్పు.

3. విడెము = తాంబూలము, కళ = శోభ, కాగలించు = కౌగలించుకొను, దిట్టతనము = నేర్పు, మోవితేనెలు = అధరామృతము.

**భావము:**: ఉదయగిరి కృష్ణుడు సామాన్యుడు కాదు సుమా! గొప్ప చిలిపి కృష్ణుడు. నిత్యం సంతోషంతో ఉప్పొంగే వాడు. స్త్రీలతో ముద్దు ముద్దు మాటలాడుతూనే వారి మేలిముసుకులు తొలగిస్తూ ఉంటాడు.

సమీపాన నిద్రలో ఉన్న అందమైన గొల్లభామలను రహస్యంగా వచ్చి తొడలు ముట్టుకుంటాడు. ఇంటిముందు కూర్చుంటే చిలిపిగా చేరి కొంగులు పట్టుకొని స్త్రీల కోకముడులు విప్పి కలకలమని నవ్వుతున్నాడు.

గొల్లభామలు సరదాగా వెన్నముద్దలు చేస్తూ ఉంటే, కుండల సందులో దూరిపోయి వాళ్ళ వక్షోజాలు ముట్టుకుంటాడు. ఎవరైనా జతగలిసి కబుర్లు చెప్పుకుంటూ ఉన్నవేళల్లో యుక్తవయసులో ఉన్న ఈ కృష్ణుడు వారిని సమీపించి కొప్పులు పట్టుకుని నవ్వులు చిందిస్తూ ఉంటాడు.

గొల్లభామలు తాంబూలపు చిలుకలు చేయడానికి ఆకులు ముడుస్తూ ఉండగా గట్టిగా శోభించి కౌగిట్లోకి తీసుకుంటాడు. ఈవిధంగా మమ్ములను ఏలుకుంటూ శ్రీవేంకటేశ్వరుడై, తన నైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ అధరమృతాన్ని అందిస్తున్నాడు.

**విశేషాంశాలు:** ఉదయగిరి కోట విజయనగర రాజుల పాలనలో నెల్లూరు జిల్లాలో ఉన్న ప్రాంతం. దానినే అన్నమయ్య ఉద్దగిరి అని సంభోదించాడు. అక్కడ శ్రీకృష్ణ, ఆంజనేయస్వామి ఆలయములున్నవి. శ్రీకృష్ణ ఆలయాన్ని సందర్శించిన అన్నమయ్య ఈ కీర్తనను, ఇంకా "ఉవిదలాల చూడరే వుద్దగిరి కృష్ణుడు" (3-235) అన్న కీర్తనను రచించినట్లు తెలుస్తున్నది.

## 175

**అవతారిక:** స్వామివారికి అలమేలుమంగమ్మ, తెరవెనుక చేస్తున్న వివిధ సేవలన్నీ, అన్యకాంతకు ఎలా తెలిసిపోతున్నాయని ఆశ్చర్యపోతూ ప్రశ్నించే సన్నివేశం.

### శ్రీరాగం

ప. ఏడలేని సత్యాలు నేఁడేల చేసీనే
వీడెమందినాఁడు యీ విద్యకుఁ దా ననరే ॥పల్లవి॥

1. మంతనానఁ దాను నేను మాటలాడుకొన్న వెల్లా
ఇంతటిలోననే ఆపె యెట్టెరిఁగెనే
అంతటివిభుఁడు తానె ఆనతియ్యఁ బోలుఁగాక
వంతులకు నాపె వచ్చి వద్ద నుండెనా ॥ఏడలేని॥

2. గుట్టునఁ దాను నేను కూడుకొన్న సుద్దులెల్లా
గట్టిగా వెలినుండాపె కనెనటవే
చుట్టమువలెనే తాను చొప్పు చూపఁబోలుఁగాక
పొట్టపొరుగాపె వచ్చి పొందేయప్పు దుండెనా ॥ఏడలేని॥

3. చేరి తెరలోఁ దనకు సేసిన సేవలెల్లా
తేరకే ఆపెమతిఁ దెలియుటెట్టే
మేరతో భూపతిచెరువు మేటి శ్రీవేంకటేశుఁడు
యీరీతి నన్నుఁ గూడఁగా నీడ నాలె వుండెనా ॥ఏడలేని॥

**అర్థములు:** ప. సత్యాలు = విషయాలు, సంగతులు, వీడెము = తాంబూలము, విద్య = జ్ఞానము, తెలివి, అనరు = జీవస్థానము, నెలవు.

1. మంతనము = ఆలోచన, ఆపె = ఆమె, ఎట్టెరిగె = ఎలా తెలుసుకొన్నది. వంతు = పట్టుదల.

2. వెలినుండి = బయటనుండి, కనెను = చూసెను, చొప్పు = తీరు, పొట్టపొరుగు = ఎక్కువ దొర్లు, ఆపె = ఆమె.

3. తెరలో = ముసుగులో, తేరకు = ఊరక, ఆపె = ఆమె, మేర = మర్యాద, నీడ నాలె = నీడ మాదిరి.

**భావము:** ఎక్కడాలేని సంగతులు విశేషాలు ఈరోజు ఆయనెందుకు చేస్తున్నాడు? తాంబూలమందుకుని అన్ని విషయాలలో తానే సాటిలేని మేటి అనుకుంటున్నాడా?

ఏదో ఏకాంతంగా శ్రీవారు నేను మాట్లాడుకున్న విషయాలన్నీ, ఇంతలోనే ఆమెకెట్లా తెలిసిపోయాయి? స్వామి అంతటి వాడు వచ్చి ఏవో అనుజ్ఞలు చేస్తుండగా, కావాలని పట్టుదలకు వచ్చి ఆమె ప్రక్కన వచ్చి చూడడమెందుకు?

ఏదో రహస్యంగా తాను నేను కలిసి ముద్దుముచ్చట్లు చెప్పుకుంటూ ఉంటే, బయట పొంచి ఉండి ఆమె చూసిందా? ఆమె బంధువు రీతిగా వచ్చి తన తీరు చూపబోగా, పొర్లుకుంటూ దొర్లుకుంటూ వచ్చి మేము కలిసే సమయాల్లో ఉండవచ్చునా?

స్వామికి నేను తెర వెనుక చేస్తున్న వివిధ సేవలన్నీ, ఊరకే ఆమెకు ఎలా తెలిసిపోతున్నాయే! ఎంతో మర్యాదతో కోనేటి మేటి అయిన ఆ శ్రీవేంకటేశ్వరుడు, ఈ విధంగా నన్ను చేపట్టి భోగిస్తూ ఉండగా నీడ నీడల్లో ఆమె దాగి ఉండి చూస్తున్నాదా?

**విశేషము:** భూపతి చెరువు అనగా తిరుమలలోని స్వామి పుష్కరిణి. కోన్ అంటే తమిళములో ప్రభువు అని అర్థం. ఏరు అంటే పుష్కరిణి. కోనేరు అంటే మానవ నిర్మిత విశాలమై ఉండీ దిగడానికి అనువుగా మెట్లు కలిగిన జల వనరు. నూరు ధనుస్సుల పొడవువెడల్పులు ఉండే విధంగా త్రవ్వించే చతురస్రాకారం కొలను. దేవాలయాల సమీపంలో ఉన్నప్పుడే ఈ కొలనులను కోనేరులనీ, పుష్కరిణి అనీ అనడం సంప్రదాయమైంది. కానీ, ఆనాడు భూపతి చెరువు అనే ప్రాంతము మరొకటి ఉన్నదా లేదా అన్న ప్రశ్నకు జవాబు దొరకడంలేదు. కోనేరు అన్నపేరుతో తెలంగాణ రాష్ట్రం, జోగులాంబ గద్వాల జిల్లా, అలంపూర్ మండలంలో ఒక గ్రామం ఉన్నది. అలాగే చుట్టుప్రక్కల కోనేరుకుప్పం, కోనేరుపల్లి, కోనేరుపురం అనే గ్రామాలు కూడా ఉన్నాయి. అన్నమయ్య ఈ ప్రాంతాలు దర్శించినట్టు, కీర్తనలు వ్రాసినట్టు సాక్ష్యాధారాలు లేవు కాబట్టి, తిరుమల పుష్కరిణిని భూపతి చెరువు అనుకోవడంలో ఎలాంటి తప్పు లేదు.

## 176

**అవతారిక:** స్వామివారిని చూడగానే అలమేలుమంగమ్మకు కలిగే మోహావేశాన్ని రసరమ్యంగా చెలులు స్వామికి వివరించి చెబుతూ త్వరగా విచ్చేయమని కోరుతున్నారు.

### పాడి

ప. చూతువుగా నీ యామేలు సొంపులుగాను
కాతరాన లోనికి రాఁగదవయ్య ఇపుడు ॥పల్లవి॥

1. మొక్కలాన దవ్వులనే మోము చూచి నవ్వితేనే
చెక్కులెల్లాఁ బులకించె చెలియకును
చక్కనిచన్ను లంటితే చవులేమి వుట్టునో
గక్కనఁ బాన్పుపైకి రాఁగదవయ్య ఇపుడు ॥చూతువు॥

2. పోలసి యల్లంతనుండి పూఁచి మాటలాడితేను
చెలపచెమట గారెఁ జెలిమేనను
యెలమిఁ గతచెప్పితే నింపు లెట్టు వొడమునో
కలికి సంగడికి రాఁగదవయ్య ఇపుడు ॥చూతువు॥

3. తమకించి ఇంతనంతఁ దప్పక చూచితేను
అమరెఁ జెలిమోమున అట్టెకళలు

జమళి శ్రీ వేంకటేశ సమరతిఁ గూడితివి
కమలాక్షియంకెకు రాఁగదవయ్య ఇపుడు ॥చూతువు॥

**అర్థములు:** ప.మేలు = సహాయము, సొంపు = సుందరము, కాతరము = తత్తరపడు.

1. మొక్కలాన = ఉత్సాహము, దవ్వులు = దగ్గరగా, చెక్కులు = చెక్కిళ్ళు, పులకించు = గగుర్పాటు, చవులు = కోరికలు, గక్కన = శీఘ్రముగా.
2. పోలసి = సమీపించి, పూచి = పూనుకొని, చెలప = పైరుపంటలోని చిన్న కాలువ, మేన = శరీరమున, ఎలమి = వికాసము, కత = కథ, ఇంపు = ప్రీతి, ఒడము = పుట్టు, కలికి = స్త్రీ, సంగడి = జతగూడుటకు.
3. తమకము = మోహము, ఇంతనంత = ఇప్పుడు, అప్పుడు, అమరు = కలుగు, కళ = శోభ, జమళి = జత, సమరతి = ఇద్దరికిద్దరు సాటిలేని శృంగారము, కూడు = కలియు, కమలాక్షి = తామరపుష్పాలవంటి కన్నులుగలది, అంకె = సమీపము.

**భావము:** స్వామీ! నీ సహాయములన్నీ సుందరమైనవిగా కనిపిస్తున్నాయి. తత్తరపడనేల? వెంటనే లోనకు దయచేయవయ్యా!

స్వామీ! మీరు ఉత్సాహంతో చెలిని సమీపించి మోహము చూచి నవ్వినపుడు, ఆమె చెక్కిళ్ళు ఎరుపెక్కి గగుర్పాటు కలిగినది. ఇంకా చక్కని ఆ వక్షోజాలు ముట్టుకుంటే కోరికలు ఏమేమి పుడతాయో ఏమో! వెంటనే ఏమీ ఆలసించక పానుపుపైకి రావయ్యా!

దగ్గరై అత్యంత సమీపంలో నిలబడి కలగజేసుకుని మాట్లాడడం ప్రారంభిస్తే, పొలంలోని వృథా నీరు ప్రవహించిన రీతిగా, చెలి శరీరంపై చెమటలు ప్రవాహంలా కారుతున్నాయి. ఇంకా గుట్టువిప్పి అసలు కథలన్నీ విప్పి చెబితే నీ సంతోషమెట్లుండునో! ఇంకా ఆలశ్యం ఎందుకు చేస్తున్నావు? ఆమె జతగూడ రావయ్యా!

మోహంతో ఇంతంతగా నిశితంగా చూడగా చెలిమోహంపై ఎన్నెన్నో శోభలు వికసించాయి. జతగూడిన ఓ శ్రీవేంకటేశ్వరా! ఇద్దరికిద్దరు సరి సమానమైన రతిక్రీడలలో తేలియాడుతున్నారు. తామరపుష్పములవంటి కన్నులు గల అమ్మ చెంతకు ఇంక ఏమాత్రం ఆలశ్యం చేయకుండా రావచ్చుగదా!

## 177

**అవతారిక:** అలమేలుమంగమ్మ భాగ్యాన్ని కళ్ళారా చూస్తున్న తోడి సతులు అన్యాపదేశంగా నిందారోపణలు చేస్తూ నిష్ఠూరాలాడే దృశ్యం మనకు చూపిస్తున్నాడు అన్నమయ్య.

### రామక్రియ

ప. కంటిమి యీభాగ్యము కన్నులపండుగగాను
జంటలై మీరుండఁగా సాదించేదేమే ॥పల్లవి॥

1. విడెము నీచేతికిచ్చి విభుఁడు సెలవి నవ్వె
యీడేరె నీపంతము లిఁక నేఁటికే
వేడుకకు వెలలేదు వెక్కసములాడరాదు
యేడనున్నా సవతులు యేమిసేసేరే ॥కంటిమి॥

2. పేరున నిన్నుఁ బిలిచి ప్రియుఁడు సరసమాడె
కోరినకోరిక చెల్లెఁ గోఁ(గొం?)క నేఁటికే
నేరుపులెల్లా దక్కె నెయ్యములు దలకెక్కె
యీరసించి తోడివారు యేమిగట్టుకొనేరే ॥కంటిమి॥

3. యింటికి వచ్చి శ్రీ వేంకటేశుఁడు నిన్నుఁ గూడె
దంటయై కాఁగిట నించెఁ దడవనేలే
పెంటలాయ సేసలు పెనగొనె నాసలు

వెంటనే వచ్చె మీమేలు వెదకేదెట్లనే ॥కంటిమి॥

**అర్థములు:** ప.కంటిమి = చూసితిమి, భాగ్యము = అదృష్టము, జంటలై = జతగా, సాదించు = నెరవేర్చు.

1. విడెము = తాంబూలము, సెలవినవ్వు = పెదవిమూలగా నవ్వు, ఈడేరు = నెరవేరు, పంతము = పట్టుదల, ఏటికే = ఎందుకు, వేడుక = వినోదము, వెక్కసము = అధికము.
2. పేరున = పేరుబెట్టి, చెల్లె = తీరెను, గొంకు = తగ్గు, నేర్పు = నైపుణ్యము, నేర్పరితనము, దక్కె = పొందెను, నెయ్యము = స్నేహము, తలకెక్కు = అతిశయించు, ఈరసించు = ఈర్ష్యపడు, గట్టుకొను = బావకొను.
3. కూడె = పొందెను, దంట = దిట్టతనము, కాగిట = కౌగిట, దడుచు = భయపడు, పెంటలగు = కార్యము చెడిపోవు, సేస = అక్షింతలు, పెనగొను = ఆవరించు, వెదకు = వెతుకు.

**భావము:** మీ అదృష్టాన్ని కన్నులపండుగగా కళ్ళారా చూశాము. మీరు జత కలిసి ఉండగా ఇక మేము చేయగలిగినదేమున్నది?

భర్త తాంబూలము నీ చేతికిచ్చి పెదవి మూలగా నవ్వాడు. నీ పంతాలు పట్టింపులు నెరవేరాయి కదా ఇంకా ఎందుకు? మీ వినోదాలు లెక్క కట్టలేనివే అయినా మీరిలా అధికముగా ప్రవర్తించి మనసు నొప్పించకూడదు. సవతులు ఎక్కడున్నప్పటికి చేయునదేమున్నది?

నీ ప్రియుడు నిన్ను పేరుబెట్టి పిలిచి సరసాలాడుతున్నాడు. నీవు కోరిన కోరికలెల్లా నెరవేరుతున్నాయికదా! ఇంకా ఈ నిరాశలెందుకు? నీ నైపుణ్యాలన్నీ లాభించాయి. మీ స్నేహ బాంధవ్యాలు అతిశయించాయి. ఇంకా ఈర్ష్యపడి సవతులమైన మేము సాధించేది ఏమున్నది?

శ్రీవేంకటేశ్వరుడు నీ ఇంటికే వచ్చి నిన్ను జత కూడాడు కదా? దిట్టతనముతో నిన్ను కౌగిట బంధించాడు కదా! ఇంకా ఈ భీతి ఎందులకు? మేము వేసుకున్న అక్షతలన్నీ వృధాయైనవి. మా ఆశలన్నీ అడియాసలైనవి. మా వెంట వచ్చు మీ మేలు ఎలా మరచిపోగలము?

## 178

**అవతారిక:** శ్రీవారి విలాసాలు, శోభలు వర్ణిస్తూ, మోహంతో ఇతర స్త్రీల పట్ల ప్రవర్తిస్తున్న తీరు, సరససల్లాపాలు వివరిస్తున్నారు చెలులు.

### సాళంగనాట

ప. ఏమి చెప్పేది తన యెమ్మెలు నేఁడు
ఆముకొని కాచుకున్నాఁ డత్తునా యేమైనా ॥పల్లవి॥

1. అలసిన వారికేల అట్టె పనులు చెప్పీనే
కలసినవారికేల కాఁకరేఁచీనే
మొలకచన్నులు చూచి మొక్కీ నింతటిలోనే
తలఁచిసవరమియ్యఁదనకు దేవరలా ॥ఏమి॥

2. సిగ్గు వద్దవారి నెంత చిమ్మిరేఁచవచ్చీనే
యెగ్గులేనివారినేల యెచ్చరించీనే
నిగ్గులనామోవి చూచి నిలువుఁగొలువు సేసీ
అగ్గలమై సేవగొన నది దనయేలికా ॥ఏమి॥

3. వూరకున్నవారినేల వొడివట్టి కూడీనే
యీరీతి శ్రీవెంకటేశుఁ డెంత సేసీనే
గారవించి నామేను కప్పిదాఁచీఁ బచ్చడాన

నేరుపున రక్షించునిధానమా ॥ఏమి॥

**అర్థములు:** ప.ఎమ్మెలు = విలాసములు, ఆముకొని = పైకొను, వ్యాపించు, అత్తు = కూడు.

1. అలయు = శ్రమించు, కాకరేచు = కోపము వచ్చు, మొలకచన్నులు = అప్పుడే అంకురించిన వక్షోజములు, సవరము = వింజామర, దేవరలు = దేవతలు.
2. చిమ్మిరేచు = గీరి ఉసిగొల్పు, ఎగ్గులేని = దోషములేని, ఎచ్చరించు = పలుకరించు, నిగ్గులు = కాంతితో కూడిన, నిలువుగొలువు = నిలువుజీతము, నిలుచుండి పనిచేయుటకై ఇచ్చెడు జీతము, అగ్గలము = అధికము, ఏలిక = రాజు.
3. ఊరకున్న = మాట్లాడక యున్న, కూడు = కలియు, గారవించు = గౌరవించు, మేను = శరీరము, కప్పిదాచు = ఏదైనా వస్త్రముతో కప్పి దాచిపెట్టు, నేరుపు = నైపుణ్యము, నిధానము = పాతర, నిక్షేపము.

**భావము:** అమ్మలాలా! ఏమిచెప్పవలెనమ్మా శ్రీవారి విలాసాలు, శోభలు. వ్యాపించి కాచుకున్నప్పటికి కూడేననే ఆశ ఉన్నదా?

శ్రమించిన వారికే మరలా మరలా పనులెందుకు చెప్తున్నాడమ్మా! తనను కలిసినవారికి కోపం వచ్చే విధంగా ఎందుకు ప్రవర్తిస్తున్నాడు. యౌవనమప్పుడే వస్తున్న ఆ స్త్రీ సౌందర్యము వక్షోజాలు చూసి వారికి చేయిమోడుస్తున్నాడు. వరమియ్యడానికి వాళ్ళేమైనా దేవతలా చెప్పండి?

సిగ్గు పడుతున్నవారిని ఇంకా గీరి గీరి ఉసిగొలుపుతున్నాడు. ఏ దోషమూ లేనివారిని ఎందుకు మాటలు కలిపి ముగ్గులోకి దించుతూ ఉన్నాడు. అందమైన ఆమె ముఖారవిందాలు చూస్తూ నిలువుజీతమిచ్చి, అంత ఎక్కువైన సేవలు చేయించుకోవడానికి ఆమె ఏమైనా తన ఏలుబడిలోని కన్యనా?

ఊరక మాట్లాడకుండా వున్న వనితలను ఒడిపట్టుకొని లాగి మరీ కలుస్తాడు. ఈవిధంగా ఆ శ్రీవేంకటేశ్వరుడి ఎన్ని పనులు చేస్తున్నాడే! అయినప్పటికి ఆయన నన్ను మన్నించి నా శరీరంపై తన పచ్చడము కప్పి ఎంత నైపుణ్యముతో నిక్షేపము లాగా కాపాడుతున్నాడు.

## 179

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ అన్యస్త్రీలకే స్వామి సదా సేవలు చేస్తుంటాడని, తను చిన్న చిన్న కోరికలు కోరినా నిరాదరిస్తున్నాడని అలిగి చిలిపి కయ్యమాడుతున్నది.

### సాళంగం

ప. ఔనయ్యా మంచివాఁడ వన్నియు నెఱిఁగితిమి
మానలేము నిన్నాడక మనసులోఁ గలది ॥పల్లవి॥

1. దప్పిదేరె నీమోవికి తరుణులమోము చూచి
కప్పుర మిమ్మంటేనే కాఁతాళించేవు
తప్పు లెంచితినా నిన్ను దయదలఁచితిఁగాక
యెప్పుడూ నీయనుమానా లేఁతై (లెంతై) నా విడువవు ॥ఔనయ్యా॥

2. నిరతిఁ జెక్కులమీఁదినిండుఁజెమటలు వాయ
సురటి విసురుమంటేఁ జూచి తిట్టేవు
నెరసు లెంచితినా నెయ్యము చూచితిఁగాక
యెరవులే కలకాలమెల్లా నెరుపేవు ॥ఔనయ్యా॥

3. సారె జాఱుఁదురుమున జాజులు నిండాఁ బెట్టి
చేరి ముడువుమంటేనే సిగ్గువడేవు
అరయ శ్రీవెంకటేశ అంతలో నన్నేలితివి

కోరికెఁదనివిలేక కొంగులు వట్టేవు ॥ఔనయ్యా॥

**అర్థములు:** ప. మానలేము = వదులుకోలేము, నిన్నాడక = నిన్ను అనకుండా.

1. దప్పిదీరె = దాహము తీరినది, తరుణులు = వయసులో ఉన్న స్త్రీలు, కాతాళించు = కోపించు.
2. నిరతి = మిక్కిలి ఆసక్తి, చెక్కులు = చెక్కిళ్ళు, వాయ = ధారలగు, సురటి = వింజామర, నెరసు = తప్పు, ఎంచు = లెక్కించు, నెయ్యము = స్నేహము, ఎరవు = భేదము, పరాయితనము, నెరపు = చేయు.
3. సారె = వీణమెట్లవంటి, జారు దురుము = సిగలో జారునట్లు వేలాడు, జాజులు = జాజిపుష్పములు, ముడుచు = పెట్టు, అరయ = పరీక్షించి చూడగా, తనివి = తృప్తి, కొంగు = చీంకొంగు.

**భావము:** ఓ శ్రీనివాసా! ఔనయ్యా! ఔనౌను! నీవు చాలా మంచివాడవు. మేము అన్నీ తెలుసుకునే ఉన్నాము. నీతో మనసులో ఉన్నది ఉన్నట్లు చెప్పడం అనేది మానుకోలేక పోతున్నాము.

అన్య స్త్రీల ముఖారవిందాలను చూస్తేనే నీకు దాహం తీరిపోతూ ఉంటుంది. ఏదో కర్పూరం ఇవ్వవయ్యా అంటే కోపం చెందుతావు. ఎప్పుడూ నీమీద దయే తప్ప నేనెన్నడైనా నిన్ను తప్పులు పట్టుకున్నానా? ఎప్పుడూ సంకోచాలు, అనుమానాలతో ఎంతైనా విడిచిపెట్టవు.

నీమీద ఉన్న అధికాసక్తితో శరీరంపై ఉన్న చెమటలు ధారలవుతున్నా కాస్తా వింజామర వీవవయ్యా అంటే తిడతావు. నేనేమైనా తప్పులెంచానా? నీతో స్నేహమే కోరుకున్నాను కానీ..ఎప్పుడూ ఎడబాటులతోనే గడుపుతున్నావు.

వీణమెట్లవంటి నా కేశముల కొప్పులో జాజిపుష్పాల మాల కాస్తా పెట్టమంటేనే సిగ్గులొలకబోస్తావు. ఓ శ్రీవేంకటేశ్వరా! అంతలోనే చూడగా నన్ను కూడి ఏలుకొన్నావు. కోరిక తీరక ఇంకా కొంగు పట్టుకున్నావు.

## 180

**అవతారిక:** స్వామి అలమేలుమంగమ్మ సమక్షంలో ఉన్నప్పటికి అన్యకాంతల చింతనే ఆయనలో నిండి ఉన్నదన్న విషయం గమనించిన అమ్మ నిందారోపణలకు దిగింది.

### మాళవిగౌళ

ప. కోరి నీపైఁ దొల్లి నాకుఁ గోప మున్నదా
ఆ రీతి ఱట్టు సేయఁగా నంటి నింతేగాక ॥పల్లవి॥

1. ఆనలేల పెట్టేవు అంత వేఁడుకొననేల
కానీవయ్యా నీమాఁటకుఁ గాదనేమా
నేనిట్టె మాటాడఁగాను నేరుపుతో నాపె చేతి-
కాను కందుకొనఁగాను కసరితిఁగాక ॥కోరి॥

2. కొప్పుదువ్వి యెంత నన్ను కొస రొడఁబరచేవు
చెప్పినట్టెల్లా నీకుఁ జేయకుండేనా
యిప్పుడు నావద్ద నుండి యెలమి నాపెమట్టెల-
చప్పు డాలకించఁగాను జరసితిఁగాక ॥కోరి॥

3. వీడె మిచ్చి చేయి నాపై వేసేవు శ్రీవెంకటేశ
కూడితి విందులకు నియ్యకొనవలదా
జాడతోడ నన్నేలి సంగడినున్నాపె మోము
చూడఁగా నందుకు నిట్టె సొలసితిఁగాక ॥కోరి॥

**అర్థములు:** ప. తొల్లి = పూర్వము, రట్టు = నింద.

1. ఆనలు = ఒట్లు, నేరుపు = నైపుణ్యము, ఆపె = ఆమె, కానుక = బహుమతి, కసరితి = కోపించితిని.
2. కొసరు = కోరిక, ఒడబరచు = ఒప్పించు, ఎలమి = వికాసము, ఆపె = ఆమె, మెట్టెల చప్పుడు = మెట్టెలతో తిరుగునప్పుడు వచ్చు శబ్దము, జరయు = నిందించు.
3. వీడెము = తాంబూలము, కూడితి = కలిసితిని, ఇయ్యకొను = (ఈయ రూపాంతరము) ఒప్పుకొను, జాడ = ఆనవాలు, సంగడి = ప్రేమ, స్నేహము, సొలయు = వెనుదీయు, విముఖత చూపు.

**భావము:** ఓ స్వామీ! నీపై నాకు పూర్వమునుండి ఎలాంటి కోపమునూ లేదు. నువ్వు ఆ విధంగా నిందలు వేయడం వలన నేను అలా అనవలసి వచ్చింది.

స్వామీ! ఏవేవో ఆశలు పుట్టించి మరలా బ్రతిమాలుకొంటావు. నేనిలా మాట్లాడుతూ ఉండగానే ఆమె చేతి కానుకను నీవు అందుకొన్నందుకు ఏదో కొద్దిగా కినుక వహించాను అంతే.

నా కొప్పు దువ్వి, నీ కోరికలకు నన్ను ఎంత ఒప్పించేవు. నీవు చెప్పినట్టెల్లా నేను చేయకుండా ఉన్నానా? ఇప్పుడు నావద్దనే ఉన్నప్పటికి ఆమె మెట్టెల చప్పుడును ఆసక్తిగా గమనించి చూస్తున్నారని కొంచెం కోపంగా చూశాను అంతే.

ఓ శ్రీవేంకటేశ్వరా! తాంబూలమిచ్చి నా భుజంపై చేయి వేస్తావు. విందులకు వచ్చినదానిని నాపై ప్రేమాతిశయం చూపవలెను కదా! ఆనవాలు గ్రహించి నన్నేలుకున్నావు కదా! మరలా ఆమె ముఖారవిందాన్ని తదేకంగా చూస్తూ పరవశించిపోతున్నావని మీపై కొంచెం విముఖత చూపితిని అంతే స్వామీ!

## 181

**అవతారిక:** స్వామి పరధ్యానంగా పూర్వాపూర్వాలు గ్రహించక, సేవలు చేస్తున్న అలమేలుమంగమ్మను పట్టించుకోకపోవడంతో స్వామికి ఆమె సేవలను చెలులు వివరిస్తున్న సన్నివేశం.

### ముఖారి

ప. కనుకొనరాదా కడమదొడములెల్లా
పనివడి నీముందరఁ బచారించీ నిఁకను ॥పల్లవి॥

1. బంతి నాపె మొక్కఁగాను పరాకులు సేసుకొంటే
పంతమాడఁదగదా పడఁతికిని
ఇంతలో నిందుకుఁగాను యెగ్గు లేల పట్టేవు
దొంతరవలపులను తోడుచూపీ నిఁకను ॥కనుకొన॥

2. యెనసి కానుకియ్యఁగా నేమీననక వుండితే
పెనఁగఁగఁ దగగా ప్రియురాలికి
యెనలేని తలపోఁత నిచ్చోట నేమిటికి
వెనకటి సేఁతలెల్లా వెలయించీ నిఁకను ॥కనుకొన॥

3. సారెఁ బాదా లొత్తఁగాను జడిసి నిద్దిరించితే
గోర గీరఁదగదా కోమలికిని
యీరీతి శ్రీ వేంకటేశ యేలి యింకాఁ గొసరేవు
కోరికరతులు నీకుఁ గుప్ప సేసీ నిఁకను ॥కనుకొన॥

**అర్థములు:** ప. కడమ = చివర, తొడములు = తొడిమెలు, పచారించు = ప్రకటనజేయు.

1. బంతి = వరుస, ఆపె = ఆమె, పరాకు = పరధ్యానము, పంతమాడు = పట్టుదలకుబోవు, ఎగ్గు = తప్పు, దొంతర = వరుసగా, పరంపరగా, తోడుచూపు = దారిచూపు.

2. ఎనయు = సరిపోవు, తలపోత = ఆలోచనలు, ఇచ్చోట = ఇక్కడ, సేతలు = పనులు, వెలయించు = వెల్లడించు.
3. సారె = పలుమార్లు, జడియు = అడలిపోవు, గోరగీరు = గోటితో గీరపడునట్లు (నఖక్షతము), కోమలి = స్త్రీ, కొసరు = కోరు, కోరికరతులు = కోరుకొన్న రతిక్రీడా విశేషాలు, కుప్ప చేయు = రాసిపోయు.

**భావము:**స్వామీ ! శ్రీనివాసా! నీవు విషయాలన్నింటిని పూర్తిగా చివరివరకూ విచారించవలెను కదా! పనిబడినట్లు హడావుడిగా పరికించి వాటిని ప్రకటించడమెందుకు? పూర్వాపూర్వాలు సరిగా విచారించవలదా?

ఆమె వరుసలో నిన్ను మొక్కి నీకు విన్నపాలు చేసుకుంటూ ఉంటే, నీవు పరధ్యాన్నముగా ఉండి ఆమెతో పట్టుదలలకు, పంతాలకు పోవడం ఎందుకు? ఇంతలోనే దోషాలను నిర్ణయిస్తావు. వరుసగా, ఒకదానిపై ఒకటి పేర్చినట్లు ప్రకటితమవుతున్న ప్రేమాతిశయాలన్నీ దారిని చూపుతున్నాయి కదా!

వారు మీకు కానుకలను సమర్పించుకోగా, నేనీమీ అనకుండా ఉండిపోయినప్పటికి, ఆమెకు ప్రేమ చూపి ఆదరించవలదా? ఎక్కడా లేని ఆలోచనలన్నీ ఇక్కడే ఎందుకు చేస్తారు? పూర్వము చూపిన ప్రేమాభిమానాలు వెల్లడించవలదా?

మీకు ఆమె పలుమార్లు పాదాలొత్తి అలసిపోయి అలా నడుము వాల్చి నిదురించితే, గోరుతో గీరి నఖక్షతాలు ఆమెపై వేయడం తగునా? ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ తీరుగా నన్నేలుకుంటూ ఇంకా ఏవేవో కోరికలు ప్రకటిస్తూనే ఉంటావు. నీవు కోరే రతిక్రీడా విశేషాలన్నీ ఇక కుప్పలు బోసి అందిస్తున్నాము. మమ్మాదరించండి స్వామీ!

## 182

**అవతారిక:** స్వామిపై ఉన్న ప్రేమాభిమానాలకు మోహావేశాలకు అలమేలుమంగమ్మ తట్టుకోలేకపోతున్నదని గమనించిన చెలులు ఆమె ప్రేమతమకాన్ని వర్ణిస్తున్నారు.

### లలిత

ప. మూసి దాఁపిరములేల ముందరికి రాఁగదవే
సేసపాల వెంటనే చిమ్మిరేఁగె వలపు ॥పల్లవి॥

1. చిప్పిలుఁ జెమటలివె చెక్కులపై నున్నవి
రెప్పల నిద్దురలు దేరీ నిదివో
ఇప్పు డాతఁడు నిన్నేలె నెఱఁగమా ఇదె నేఁడు
కుప్పలుఁదెప్పలునై గొనకొనె వలపు ॥మూసి॥

2. చెలపచెలపనవ్వు సెలవుల వడిసీని
పులకలు మేననెల్లాఁ బొదిగొనెనే
మలసి నీనాయకుఁడు మన్నించుట వినమా
కులుకుఁ జన్నులమీఁద గుదిగొనె వలపు ॥మూసి॥

3. మిసమిసనికళలు మించీ నీమోమున నవె
పొసఁగినపొందు నిన్నుఁ బొదిగొన్నది
యెసఁగి శ్రీవేంకటేశుఁ డేలె నన్ను నీతఁ డిట్టె
పస నీచిగురుమోవిఁ బాదుకొనె వలపు ॥మూసి॥

**అర్థములు:** ప. దాపిరము = దాపరికము, సేసపాలు = తలంబ్రాలు, అక్షతలు, చిమ్మిరేగు = విజృంభించు.

1. చిప్పిలు = పైకుబికి వచ్చు, చెక్కులు = చెక్కిళ్ళు, రెప్పల నిద్దురలు = రెప్పలపైకి వస్తున్న నిద్ర, కుప్పలుదెప్పలు = అసంఖ్యాకము అను అర్థమున వాడఁబడు జంటపదము, గొనకొను = సమ్మతించు.
2. చెలపచెలప నవ్వు = నీటి గుంటలలో నీరూరినట్లు మాటిమాటికి పెదాలపై కనిపిస్తున్న నవ్వు, సెలవులు = ఆటవిడుపు,

పులకలు = గగుర్పాటు, పొదుగు = క్రమ్ముకొను, మలసి = వ్యాపించు, కులుకు = లయగా కదులు, గుదిగొను = అతిశయించు.

3. మిసమిస = మెరయుట, పొసగు = అనుకూలించు, పొదిగొను = గుంపుగూడు, ఒసగు = ఇచ్చు, పస = చాతుర్యము, సారము, పాదుకొను = నెలకొను.

**భావము:** అమ్మా! నీవు ఇంకా దాగుకొని ఉండి ఈ దాగుడుమూతలాటలేల ఆడుతున్నావు? బయటకు రారాదా? అక్షింతలు చల్లగానే నీకు ప్రేమ పెల్లుబికి వస్తున్నది.

పైకి ఉబికి వస్తున్న చెమటలు చెక్కిళ్ళపై ధారలై పారుతున్నవి. రెప్పలపై దట్టమై వస్తున్న నిదుర తీరిపోయినది. ఈ సమయములో నిన్నా స్వామి ఏలుకునే విషయం మేమెరుగమా! నీ వలపు అధికమై ఉప్పొంగి కనిపిస్తున్నది.

నీటిగుంటలలో నీరూరినట్లు మాటి మాటికి పొంగి వచ్చే నవ్వుకు ఆటవిడుపు లభించింది. గగుర్పాటు శరీరమంతా నెలకొన్నది. విజృంభించి, వ్యాపించి నీ ప్రభువు నిన్ను మన్నించి చేరదీయడం మేమెరుగమా? వినమా? నీ లయగా నాట్యమాడే చన్నులమీదనే ఆ శ్రీవారి చూపు, వలపూ నిలిచి ఉన్నది.

మెరిసిపోతున్న శోభ నీ మోముపై నెలకొని ఉన్నది. అనుకూలించిన నీ కూడిక గుంపుగూడి ఉన్నది. అదుగో శ్రీవేంకటేశ్వరుడిట్టే శ్రమపెట్టక నిన్నేలుకుంటున్నాడు. ఆ చాతుర్యము నీ లేలేత ముఖారవిందంపై నెలకొని ఉండడం మేము గమనించాము.

## 183

**అవతారిక:** స్వామి పలు కాంతలను కూడి శృంగార కార్యాలలో మునిగి తేలుతున్నాడని, కంగారులో మాటలు తొట్రుపడడం గ్రహించిన చెలులు హాస్యమాడుతున్న సన్నివేశం.

భైరవి

ప. అందరికి నీ రీతే కా అటమటా లేమిటికి
నిందలకుఁ జొర నీదే నేరుపింతేకాక ॥పల్లవి॥

1. పడఁతికి నిన్ననె బాసయిచ్చినవాఁడవు
తడఁబడి యింతలోనే తప్పవచ్చునా
నడుమ నన్నుఁ జూచి నాతో మొగమోటానకు
చిడుముడి నిచ్చకాలు సేసేవుగాక ॥అందరికి॥

2. ప్రేమముతో నిందాఁకాఁ బిలిపించినవాఁడవు
దోమటిదొడుక కిఁకఁ దోయవచ్చునా
నామనసు గన్నదాఁకా నాటకములు జరపి
గామిడి వేసాలు సేసి కదిసేవుగాక ॥అందరికి॥

3. అండఁబెట్టు కాపెవిడే లందుకొన్నవాఁడవు
దండిగాఁ గూడ కిఁక దాఁచవచ్చునా
కొండవలె నన్నేలితి కోరి శ్రీవెంకటేశుఁడ
చండిసేసి వినోదాలు జరుపేవుగాక ॥అందరికి॥

**అర్థములు:** ప. ఈ రీతే = ఈ తీరుగానే, కా = కదా!, అటమట = విచారము, నింద = అపవాదు, చొరు = చొచ్చు, నేరుపు = నైపుణ్యము.

1. తడబడు = తొట్రుపడు, నడుమ = మధ్యలో, మొగమాటము = సంకోచము, చిడుముడి = చీకాకు, ఇచ్చకము = ముఖప్రీతి మాటలు

2. దోమటి = మొరటుదనము, తొడుకు = ఒడిసిపట్టి, తోయు = త్రోయు, కన్నదాకా = తెలుసుకొనేతవరకు, నాటకములు = వివిధ వేషములు వేయు, కామిడి = చెడ్డ, కపటము, కదియు = దగ్గరగు.

3. ఆపె = ఆమె, విడేలు = తాంబూలము, దండిగా = ఎక్కువగా, చండి = కోపము బూని, వినోదాలు = విలాసము.

**భావము:** ఓ స్వామీ! అందరిలో గూడా ఈతీరులోనే గదా నువ్వు ప్రవర్తిస్తున్నావు. మేము లేనిపోని అపవాదుల బడదానికి నీ నైపుణ్యం ఇంతింతలని చెప్పలేము గదా!

ఒక పడతికి నిన్ననే ఒట్టువేసి కూడుతానని మాట ఇచ్చావు కదా! మరలా ఈ తొట్రుపాటుతో ఇంతలోనే మాటతప్పవచ్చునా? మధ్యలో ఈలోపు నన్ను చూచి ముఖప్రీతికోసం కంగారుతో ఏవేవో మాటలు మాట్లాడుతున్నావు.

ప్రేమతో ఇంత చేసి ఇందాక వచ్చి పిల్చినవాడవు. మరలా మొరటుదనముతో వచ్చి ఇలా త్రోయడం సమంజసమేనా? నా మనసు తెలుసుకునే దాకా ఏవేవో దొంగాటలు, నాటకాలు ఆడావు. దొంగమాటలు జెప్పి దగ్గరయ్యావు.

ఆమెను దగ్గర ఉంచుకుని తాంబూలాలు సేవించావు. అంత ఎక్కువగా కలిసిన తర్వాత ఇంకా దాపరికాలు ఎందుకు స్వామీ! ఓ శ్రీవేంకటేశ్వరా! ఒక పెద్ద కొండవలె నన్నేలుకొన్నావు. ఎక్కువ చీకాకు పరచి వినోదాలు నెరపేవాడివి కావా?

## 184

**అవతారిక:** స్వామి అమ్మను గూడవచ్చి, సంకోచిస్తూ బయటనే నిలబడ్డాడని గ్రహించిన అలమేలుమంగ గొప్పలు మాని లోపలి రమ్మనమని తోడి చెలితో సందేశం చెబుతున్నది.

### కేదారగౌళ

ప. విచ్చనవిడిని యిఁక వీడేలు సేసుఁగాని
రచ్చలఁబెట్టక యిఁక రమ్మనవే లోనికి ॥పల్లవి॥

1. పంతగాఁడైనవాఁడు పరపుపై నుండుఁగాక
ఇంతలోనే నావద్దకి యెట్టు వచ్చెనే
యెంతలేదె తనసుద్దు లిన్నియు నెఱుఁగుదును
రంతులు సేయక ఇట్టె రమ్మనవే లోనికి ॥విచ్చన॥

2. యేతులు నెరపేవాఁడు యేమీ ననకుండుఁగాక
యీతల మాతో మాట లేలాడీనే
చూతము తననేరుపు చుట్టులఁ బెట్టఁగనేల
రాతిరాయ నిఁకనైనా రమ్మనవే లోనికి ॥విచ్చన॥

3. దిట్ట యెంతవాఁడు తాను దేవర శ్రీవెంకటేశుఁ-
డెట్టు గూడెనె నను నిందరిలోన
అట్టె కానీవే తన ఆయము నేఁగన్నదే
రట్టుసేయ కిఁకనైనా రమ్మనవే లోనికి ॥విచ్చన॥

**అర్థములు:** : ప.విచ్చనవిడి = స్వేచ్ఛాప్రవృత్తి, వీడేలు = తాంబూలము, రచ్చ = అల్లరి.

1. పంతగాడు = పట్టుదలగలవాడు, సుద్దులు = మాటలు, రంతి = అరచు, గోలచేయు.

2. ఏతులు = డంబాలు, గొప్పలు, ఈతల = ఇవతల, నేరుపు = గొప్పదనము, చుట్టులు = స్త్రీపాద ఆభరణములు, రాతిరాయ = రాత్రి అయినది.

3. దిట్ట = ధైర్యశాలి, దేవర = దేవుడు, ఆయము = ప్రాణము, రట్టు = అల్లరి.

**భావము:** ఓ చెలీ! ఇక స్వేచ్ఛగా తాంబూల చిలకలు చుట్టి నోటికి అందిస్తానుగాని, అల్లరి చేయకుండా ఇంక లోపలికి రమ్మనవే!

అంత పట్టుదల ఉన్నవాడైతే చక్కగా తను పట్టుపానుపుపై పరుండవలెను గదా! ఇంతలోనే నా వద్దకు ఎందుకు వచ్చినట్లు? ఎంత చేయలేదు? తన మాటలన్నీ ఎరిగినవే కదా! అరుపులు గోలలు లేకుండా ఇట్టే ఇంట్లోకి రమ్మనవే!

డంబాలు చెప్పి గొప్పలకు పోయేవాడు ఏమీ అనకూడదు గదే! ఇవతల మాతో ముచ్చట్లు పెట్టుకోవడం ఎందుకు? ఆ స్వామి నేర్పరితనాలన్నీ చూస్తూనే ఉన్నాను, ఇంకా నా కాళ్ళకు చుట్లు తొడగడం ఎందుకు? ఎంతో రాతిరి పొద్దుపోయిందిగదా ఇంకనైనా లోపలికి దయచేయమనవే!

ఆ ధైర్యవంతుడైన దేవతా మూర్తి వేంకటేశ్వరుడు, నన్ను ఇందరిలోను ఎలా జతకూడాడే? సరే! అలాగునే కా నివ్వవే! తన మర్మాలన్నీ నేనెరిగినవే కదా! అల్లరి పనులు మాని ఇకనైనా ఇంటిలోనికి విచ్చేయమనవే!

## 185

**అవతారిక:** ఒక చెలి అలమేలుమంగమ్మకు తమకు మధ్య శృంగార సమయాలలో పోలికలు చెప్తూ ఎవరు నీకు ఇష్టమైన వారని ప్రశ్నించే సన్నివేశం.

### సౌరాష్ట్రం

ప. ఎవ్వరు మంచివారమో ఇప్పుడు నీకు
పువ్వువలె నాకు నీవు బుద్ధిచెప్పవయ్యా ॥పల్లవి॥

1. బత్తితోఁ బాదము లొత్తి బాగాలు చేతికిచ్చి
చిత్తమురా సేవలెల్లాఁ జేసీ నాపె
కొత్త కొత్త మాటలాడి కొంగు వట్టి తీసి నిన్ను
గుత్తపు గుబ్బల నూఁది గునిసేము నేము ॥ఎవ్వరు॥

2. అంగములు సోఁకించి అట్టె మోవి చవిచూపి
చెంగటనే కాఁపిరము సేసీ నాపె
జంగిలి దూరులు దూరి జంకెన బొమ్మలు చూపి
వెంగెములనే సడివేసేము నేము ॥ఎవ్వరు॥

3. చనవునఁ గాఁగిలించి చాయలు సన్నలుఁ జేసి
యెనసీ శ్రీవెంకటేశ యెదుట నాపె
ననుపుల నిన్నుఁగూడి నవ్వుతానే గోర గీరి
చెనకి రతుల ఘాతసేసేము నేము ॥ఎవ్వరు॥

**అర్థములు:** ప. పువ్వువలె = సుతిమెత్తగా, బుద్ధిచెప్పు = హితముచెప్పు.

1. బత్తి = భక్తి, బాగాలు = వక్కపలుకులు, చిత్తము = మనసు, మది, ఆపె = ఆమె, కొత్త కొత్త మాటలు = అపూర్వమైన సంగతులు, గుత్తము = బిగువు, గుబ్బలు = వక్షోజములు, ఊది = ఒత్తి, గునియు = కులుకులాడు.
2. సోకించు = తాకించు, చవి = రుచి, చెంగట = చెంత, కాపిరము = కాపురము, ఆపె = ఆమె, జంగిలి = నిలకడలేని, దూరులు = మార్గాలు, జంకెన = బెదరింపు, బొమ్మలు = కనుబొమ్మలు, వెంగెము = వెక్కిరించు, సడి = నింద, వేసేము = వేస్తాము.
3. చనవు = కోరికతో, కాగలించి = కౌగలించి, చాయ = కాంతి, సన్నలు = సైగలు, ఎనయు = సరిపోలు, ఆపె = ఆమె, అనుపుల = ఆజ్ఞల మేరకు, గోరగీసి = గోరుతో గీతలు పడునట్లు చేయు (నఖక్షతములు వేయు), చెనకు = తాకు, ఘాత = దెబ్బ, నేము = మేము.

**భావము:** ఓ శ్రీనివాసా! ఇప్పుడు నీకు ఇష్టమైన వారెవరో పువ్వు రీతిగా సుతిమెత్తగా హితము చెప్పవయ్యా!

నీకు భక్తిమీర పాదములొత్తి, వక్కపలుకులను చేతికందించి, మనసుకు హాయిగలిగించే విధంగా ఆమె సేవ చేసుకొనుచున్నది. మరి మేము అపూర్వమైన వింతలు విశేషాలు చెబుతూ నీ పైపంచె పట్టి తీసి మా బిగుతైన వక్షోజములను నీకు ఒత్తి కులుకుతాము.

తన శరీర భాగాలనన్నిటిని నీకు తాకిస్తూ, తన మోవి నీకు చూపుతూ నీ చెంతనే కాపురముండే వనిత ఆమె. మరి మేము నిలకడలేని చేష్టలతో మా కనుబొమ్మలను అదిరిస్తూ నీతో అపహాస్యపు, వెక్కిరింపు మాటలు మాట్లాడుతూ నీపై నిందలు ఎన్నో వేస్తుంటాము.

ఓ శ్రీవేంకటేశ్వరా! చనువుతో ప్రీతిగా నిన్ను కౌగలించుకొని ప్రకాశవంతమై, సైగలు చేస్తూ నీతో సరిపోయే విధముగా ఎదుటగా ఉన్నది ఆమె. మరి మేము నీ ఆజ్ఞల మేరకే ఉంటూ కూడా నవ్వుతూ నవ్వుతూ గోళ్ళతో నఖక్షతములు చేస్తూ రతిక్రీడల సయ్యాటలలో దెబ్బలను చవి చూపిస్తాము.

## 186

**అవతారిక:** ఒక చెలి అకారణంగా తనను ఆడిపోసుకోవద్దని, స్వామి చేస్తున్న వివిధ శృంగార లీలలను వర్ణిస్తూ అమ్మకు విన్నవిస్తున్నది.

### శుద్ధవసంతం

ప. ఊరకే నన్నిటు దూరి వుప్పతించేవు
యే రీతి తక్కరియౌటా యెఱఁగవు నీవు ॥పల్లవి॥

1. ఆతఁడు వాసులెక్కించి ఆటకానకుఁబెట్టితే
యేతులకుఁగాఁతాళించి యేలచూచేవే
రాతిరిఁబగలుఁ దాను రచ్చ లెందోసేసి వచ్చి
యీతల సటలు సేసే దెఱఁగవు నీవు ॥ఊరకే॥

2. తానే సన్నలు సేసి తగవులఁ బెట్టితేను
పేనిపట్టుక నీవేల పెనఁగాడేవే
ఆనుకొని వాడవారి నందరిఁబెండ్లాడివచ్చి
యీనేరుపులు చూపేది యెఱఁగవు నీవు ॥ఊరకే॥

3. శ్రీ వేంకటేశ్వరుఁడు చేరి యిద్దరిఁగూడితే
చేవమీర నీవేల సిగ్గువడేవే
వేవేలుసతులకు వేరేసేసవెట్టివచ్చి
యీవిధాన మొఱఁగేది యెఱఁగవు నీవు ॥ఊరకే॥

**అర్థములు:** ప.ఉప్పతించు = ఆడిపోసుకొను, తక్కరి = టక్కరి.

1. వాసులు = తారతమ్యాలు, ఆటకాన = నిరోధము, ఏతులు = గొప్పలు, కాతాళించు = కోపించు, రచ్చలు = అల్లరి. సటలు = బాధలు.
2. సన్నలు = సైగలు, పేనిపట్టుక = పురిపెట్టు, పెనగాడు = మెలిపెట్టు, ఆనుకొను = అంటకాగి, వాడ = వీధి, నేరుపు = నైపుణ్యము.
3. చేవమీర = సారమై, వేవేలు = వేలకువేలు, వేరే సేస = విడివిడిగా అక్షతలు, ఒరగు = పైబడువిధము.

**భావము:** ఓ చెలీ! అకారణంగా నన్నీవిధంగా ఆడిపోసుకోవడం తగునా! ఎన్ని విధాలుగా నీవు టక్కరియౌతున్నావో తెలుసుకోలేక పోతున్నావు.

ఆ స్వామి తారతమ్యాలను గ్రహించకుండా నిరోధాలు సృష్టిస్తూ ఉంటే, ఏవో గొప్పలకు బోతూ ఎందుకు కోపగిస్తున్నావు.

రాత్రి పగలు అనే తేడా లేకుండా స్వామి ఎక్కడెక్కడో విహరించి వచ్చి, మళ్ళీ ఇక్కడ ఏమీ ఎరుగని వాడిలా బాధలకు గురిచేయడం సమంజసమైన విషయమా?

ఆ స్వామి ఏవో సైగలు చేసి తగాదాలు చేస్తూ ఉంటే, ఇంకా పురెక్కించి నీవెందుకు ఇంకా మెలిపెడుతున్నావు. ఈ వీధులు సందుగొందుల స్త్రీలనందరిని వివాహమాడి వచ్చి, ఏమీ తెలియనట్టు అమాయకంగా పొయే పోకడలు నీవెరుగవు.

ఆ శ్రీవేంకటేశ్వరుడు ధైర్యంతో ఇద్దరిని కూడగా నీవెందుకిలా సిగ్గులొలకబోస్తున్నావు. వేల వేల మంది స్త్రీజనానికి అక్షింతలు వేసి వచ్చి, ఈ తీరుగా మనపై బడడం తెలియని దానవా?

## 187

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ మనసెరిగినదానని, పోట్లాటలు పెట్టుకోవడం లేదని, త్రికరణశుద్ధిగా మనసావాచా నమ్మిన దాననని విన్నవిస్తున్నది.

### కాంబోది

| | | |
|---|---|---|
| ప. | నాకేల వేగిరము నమ్మితి నేను | |
| | మేకొని నీవే నన్ను మెచ్చేవుగాని | ॥పల్లవి॥ |
| 1. | ప్రియురాలు విభునితో పెనఁగులాడఁగఁబోతే | |
| | నయమున వూరివారు నవ్వఁజూతురు | |
| | క్రియ గూడ నిట్టె చేతికిని లోనై వుండఁగాను | |
| | దయ నీచిత్తములోన తానే వుండీఁగాని | ॥నాకేల ॥ |
| 2. | పాయరానివారు నీతే పంతము లాడఁగఁబోతే | |
| | కాయకపుసవతులు కాకుసేతురు | |
| | వోయి నీవెంతసేసినా నోరుచుకవుండఁగాను | |
| | యీయెడ నీవే తగవు యెటిఁగేవుగాని | ॥నాకేల ॥ |
| 3. | కందువ నే నిట్టె నిన్నుఁగాఁగిలించి కూడఁబోతే | |
| | పొందైన నీసతులెల్లాఁ బొగడుదురు | |
| | ఇందులో శ్రీవేంకటేశ యేలితి విట్టె వుండఁగా | |
| | మందలించి నీవే యింకా మన్నించేవుగాని | ॥నాకేల ॥ |

**అర్థములు:** ప. వేగిరము = తొందర, మేకొను = సమ్మతించు.

1. పెనగులాడు = కలియబడు, నయము = తేలికభావము, క్రియ = చేసే పనులు.
2. పాయరానివారు = విడచిపెట్టదగని వారు, కాయకము = తోడి జీవించు, కాకు = కలత, ఓరుచుక = ఓర్చుకుని, వహించి.
3. కందువ = జాడ, కాగిలించు = కౌగలించుకొను, పొగడు = స్తుతించు, మందలించు = హెచ్చరించు, మన్నించు = గారవించు.

**భావము:** ఓ స్వామీ! నేనేమీ తొందరబడడంలేదు. మిమ్మల్నే మనసావాచా నమ్మిన దానను. సమ్మతించిన నీవు విషయం తెలిసిన తర్వాత నన్నే కొనియాడతావన్న విషయం నాకు తెలియదా?

స్వామీ! ప్రియురాలు స్వామితో కలియబడి పోట్లాటలు పెట్టుకుంటే ఊరిజనమంతా నవ్విపోరా? నీవు చేసే పనులు కూడా ఇలాగే ఉన్నాయిలే! నీ మనసునిండా నేనే ఉన్నానని నేనెరుగనా?

నిన్నే నమ్మి నిన్ను ఎన్నటికి విడిచిపెట్టలేని వారు నీతో పట్టుదలలకు దిగితే చూసే తోడి సతులు కలత చెందుతారు. ఓ శ్రీనివాసా! నీవెన్ని తొందరబాటు పనులు చేసినప్పటికి నీకై సర్వమూ ఓర్చి ఉండగా, నీవే సర్వమూ ఎరిగి యున్నావు.

జాడనెరిగి నేను నిన్ను గాఢముగా కౌగలించుకోబోగా, అక్కడ ఉన్న సతులందరూ నిన్నే స్తుతిస్తారు కదా! ఓ శ్రీవేంకటేశ్వరా! ఈరీతిగా నన్నేలుకొని ఉండగా, నీవే ఏవో మందలింపు చర్యలతో కోపగించినప్పటికి నన్ను మన్నించి గౌరవించే నా నాథుడవు నీవే సుమా!

## 188

**అవతారిక:** సతులతో సరసాలాడుతుంటే తాము అడ్డుచెప్పబోమని, కొలువులో సేవలు చేయించుకోమని స్వామికి విన్నవిస్తున్నారు.

### బౌళి

ప. ఇంక విచారములేల యిద్దరును నొక్కటే
సంకెలేక వుండితేను జరసేరా సతులు ॥పల్లవి॥

1. వనితకు నీకును వాడికమాటలవల్ల
మనసులు సరిదాఁకె మరి యేఁటికి
పెనఁగించుకొననేల ప్రియము తొల్లె కలదు
వొనగూడి వుండఁగాను వొద్దనేరా సతులు ॥ఇంక॥

2. సుదతికి నీకును సూటులచూపులవల్ల
కదిసెఁజుట్టరికేలు కత లేఁటికి
పదర నింతేసి యేల పనులెల్లా నీడేరె
యెదురెదుర నవ్వగా నేలనేరా సతులు ॥ఇంక॥

3. జలజాక్షికిని నీకు సారెఁజెనకులవల్ల
కొలఁది మీరె రతులు కొంకనేఁటికి
వెలయఁ గోనేటి శ్రీవేంకటేశ నన్నేలితి
కొలువు సేయించుకొంటేఁ గొసరేరా సతులు ॥ఇంక॥

**అర్థములు:** ప.విచారము = చింత, సంకె = అనుమానము, జరయు = నిందించు.

1. వాడికమాటలు = అలవాటైన మాటలు, సరిదాకు = సరికట్టు, దృష్టాంతమగు, పెనగు = మారాడు, తొల్లె = పూర్వము, ఒనగూడు = నెరవేరు.
2. సుదతి = స్త్రీ, సూటులచూపులు = అందమైన చూపులు, కదియు = దరిచేరు, చుట్టరికేలు = బంధుత్వము, కథ = కల్పితాలు, పదర = కోపించు, ఈడేరు = నెరవేరు, ఎదురెదుర = ఎదురుగానే, ఏలంఅనేరా, ఏలనేరా = ఎందుకు అంటారా.
3. జలజాక్షి = తామరపువ్వుల వంటి కన్నులుగల స్త్రీ, సారె = మాటి మాటికి, చెనకు = తాకు, కొలదిమీరు = అపరిమితమగు, కొంకు = సంకోచించు, కోనేరు = పుష్కరిణి, కొసరు = సంకోచించు.

**భావము:** ఇంకా విచారమెందుకు? ఇద్దరూ ఒకటేగదా? అనుమానంలేకుండా ఉంటే సతులు ఎందుకు నిందిస్తారు?

ఆ వనితకూ నీకు అలవాటైన మాటలవల్ల, మనసులు కలిసి దగ్గరైనవి కదా మరి ఇంకేమిటి సమస్య? ప్రేమాభిమానాలు పూర్వం నుంచీ ఉన్నవేకదా? ఇంకా మారాడడము ఎందుకు? మీరిద్దరూ కలసి ఒద్దికగా ఉంటే సతులు ఏమైనా తగదంటారా?

ఆ వనితకూ నీకు అందమైన చూపులద్వారా చుట్టరికాలు కలిశాయికదా! ఇంకా ఏవో కట్టుకథలు కల్పితాలు ఎందులకు? కోపించి ఇంతింత చేయడం ఎందుకు? పనులన్నీ అయినవి కదా? మీరిద్దరూ ఎదురెదురుగా నిలబడి సరసాలాడుకుంటే సతులు వద్దంటారా?

ఆ తామరపుష్పాలవంటి చూపులగల తల్లిని, నువ్వు మాటిమాటికి స్పృశించడం వల్ల మీ మోహం అధికమై రతిక్రీడలు అపరిమితమయ్యాయి కదా ఇంకా సంకోచాలెందుకు? ప్రకాశించి ఆ కోనేటి రాయడైన శ్రీవేంకటేశ్వర స్వామి నన్నేలుకున్నాడు.

కొలువులో ఊడిగాలు చేయించుకుంటే సవతులేమైనా సంకోచిస్తారా?

## 189

**అవతారిక:** స్వామిపై మనసు కలిగిన ఒక చెలి, స్వామి ఎన్ని పనులలో నిమగ్నమై ఉన్నా తనను గమనిస్తూనే ఉన్నందుకు సంతోషం వ్యక్తం చేస్తున్నది.

## పాడి

ప. ఎంతసేసినా నీవు ఇన్నిటికిఁ దగుదువు
బంతికిఁ బిలుతు సిగ్గువడేవని కాని ॥పల్లవి॥

1. బగివాయ కాపెమీఁదిపరాకునున్నవేళ
నగినదే చాలదా నాతో నీవు
పొగడుదు నిందరిలో పొంచి నీ సుద్దులు చెప్పి-
యగడు సేసితినంటా ననేవనికాని ॥ఎంత॥

2. చెలిఁగాఁగిలించేవేళ చేరి నిన్నుఁబిలిచితే
పలుకుటే చాలదా పై పై నీవు
సొలసిందుకు మొక్కుదు చూచినవా రేమని
తలఁతురో యని కొంకి దాఁగేవనికాని ॥ఎంత॥

3. వోడక మీరిద్దరును వుండఁగా నే వచ్చితే
కూడుటే చాలదా గొబ్బననీవు
వీడె మిత్తు నిందుకు శ్రీవేంకటేశ వెంగెమని
వాడు మోముతోఁదలవంచేవనికాని ॥ఎంత॥

**అర్థములు:** ప. తగుదువు = తగిఉన్నావు, బంతికి = పంక్తిభోజనమునకు, బిలుతు = పిలుస్తాను.

1. బగివాయు = మర్యాదపోవు, ఆపె = ఆమె, పరాకు = పరధ్యానము, నగినది = నవ్వినది, పొగడు = మెచ్చుకొను, పొంచి = దాగి, సుద్దులు = మాటలు, అగడు = నింద.
2. కాగలించు = కౌగలించు, పైపై = మామూలుగా, సొలయు = పారవశ్యం పొందు, కొంకు = సంకోచించు, దాగు = లోపలగా నుండు.
3. ఓడక = దేనికితీసిపోని, కూడు = కలయు, గొబ్బ = గొప్ప, వీడెము = తాంబూలము, వెంగెము = పరిహాసము, వాడుమోము = వడలిపోయిన మొహము, తలవంచు = అవమానముగా తలచు.

**భావము:** ఓ స్వామీ! నీవెన్ని చేసినప్పటికి అన్నింటికి తగిన వాడవు. నిన్ను పంక్తి భోజనానికి పిలవాలనే ఉంది కానీ సిగ్గుపడతావని ఊరకున్నాను.

మర్యాదపోయేవిధంగా ఆమెతో పోట్లాడి, పరధ్యాన్నంగా ఉన్నసమయంలో నన్ను చూసి నవ్వినదే నాకు చాలు. ఇందరిలో నిన్ను మెచ్చుకుందామనుకుంటే ఏవేవో మాట్లాడి నిందలేశానని అంటావేమోనని మాట్లాడకుండా ఉండిపోయాను.

ఆ చెలి నిన్ను కౌగలించుకునే సమయాన నిన్ను పలకరిస్తే, నువ్వు పైపైన పలికినదే ఆనందంగా భావించాను. పారవశ్యంతో మొక్కాలని అనుకున్నా గానీ, చూచే వాళ్ళు ఏమనుకుంటారో నన్న సంకోచంతో నువ్వు దాక్కున్నావని గమనించి మానుకున్నాను.

మీరిద్దరూ విలాస క్రీడలలో ఒకరిని మించి ఒకరు తగ్గక ఉన్న సమయంలో నేనొచ్చి నిలబడినప్పుడు కలియడమే నాకు చాలు మహద్భాగ్యంగా భావించాను. విందుకు బిలిచి తాంబూలమిచ్చి మిమ్మల్ని ఆనందింపజేద్దామనుకున్నా గానీ, మీరెక్కడ వాడిన మోముతో తలవంచుకుని ఉండిపోతారన్న భీతితో మానుకున్నాను.

## 190

**అవతారిక:** అలమేలుమంగమ్మ తొందరపడి స్వామిని ఏవో పరిహాసపు మాటలతో మనసును బాధకు గురిచేసింది. తర్వాత తీరిగ్గా పశ్చాత్తాపము చెందుతూ ఇకపై అలా ఉండనని స్వామితో సఖ్యతచేయమని కోరుతున్నది.

### ఆహిరి

ప. ఎగసక్కే లాడనేర యిచ్చకము లాడనోప
జగడాలు మాని యింక చక్కనుండుమనవే ॥పల్లవి॥

1. చెలిమిసేసేవాఁడైతే చేఁతకల్లా లోనౌఁగాక
మలకలమలకలమాట లేఁటికే
వలపెల్లా నాసొమ్ము వట్టిసట దనసొమ్ము
చలము లింకానేల చక్కనుండుమనవే ॥ఎగసక్కే॥

2. తప్పులేనివాఁడైతే తాలిమితో నుండుఁగాక
అప్పటిని యింతేసియాన లేఁటికే
యెప్పుడూ నేఁదనదాన యెవ్వరివాఁడో తాను
చప్పుడు సేయక యిఁక చక్కనుండుమనవే ॥ఎగసక్కే॥

3. సమ్మతించినవాఁడైతే చనవిచ్చి కూడుఁగాక
కమ్మటి రేపుమాపని గడు వేఁటికే
తమ్మిపువ్వుకాంతను తా(శ్రీవేంకటేశుఁడు
సమ్మదము లోనగూడె చక్కనుండుమనవే ॥ఎగసక్కే॥

**అర్థములు:** ప.ఎగసెక్కెము = పరిహాసాలు, ఎగతాళిమాటలు, ఆడనేర = ఇకపై ఆడను, ఇచ్చకములు = ముఖప్రీతిమాటలు, జగడాలు = తగాదాలు, చక్కనుండు = చక్కగా, బుద్ధిగా ఉండు.

1. చెలిమి = స్నేహము, చేతకు = పనులకు, లోనౌ = లోబడి, మలకలమాటలు = శుష్కప్రియాలు, వట్టి మాటలు, సట = కపటము, చలము = భీతి, చక్కనుండు = బుద్ధిగా ఉండు.
2. తాలిమి = ధైర్యము, ఆన = బాస, ఏదనదాన = ఏమీ మాట్లాడని దానను, ఎవ్వరివాడో = ఏ వనితకు చెందినవాడో, చప్పుడు = హడావుడి, చక్కనుండు = బుద్ధిగలిగి యుండు.
3. సమ్మతించిన వాడు = ఒప్పుకొన్నవాడు, చనవు = స్నేహము, కోరిక, కూడు = కలియు, కమ్మటి = మరల, రేపుమాపని = రాత్రికి, రేపు అని, గడువు = అవధి, తమ్మిపూవు కాంత = కమలములవంటి కన్నులుగల స్త్రీ, సమ్మదము = సమ్మతము, లోనగూడె = లోబడి ఉన్నాడు.

**భావము:** ఓ చెలీ! ఆ స్వామితో నేనిక ఎగతాళిమాటలు మాట్లాడను. ముఖప్రీతిమాటలు మాట్లాడలేను. ఇకనైనా తగాదాలు మాని సఖ్యతతో ఉండమని చెప్పవే!

నిజంగా నా మీద ప్రేమానురాగాలు కలవాడైతే, నాపనులకు లోబడి ఉండేవాడు కాదా! వట్టి శుష్కప్రియమైన మాటలు మాట్లాడడం ఎందుకే? ప్రేమించడం నావంతు, నన్ను కపటంతో చూడడం ఆయన వంతు. ఇంక నైనా భీతి మాని బుద్ధిగా ఉండమనవే!

ఏమే! నిజంగా స్వామి తప్పు చేయని వాడైతే ధైర్యంతో ఉండాలి కదా! అప్పటికీ ఎంతలేసి బాసలు చేయడమెందుకే! ఎప్పటికి నేను తన దాననే కదా! కాని ఆయన మనసు ఎవ్వరిమీదనున్నదో తెలియడంలేదు. ఇకనైనా హడావుడి పనులు మాని బుద్ధిగా ఉ ండమని చెప్పవే!

నన్ను ఇష్టపడి అంగీకరించినవాడైతే నాతో స్నేహం నెరపుతూ వచ్చి కలుస్తాడు కదా! రేపు మాపని చెబుతూ ఈ గడువులు పెట్టడం ఎందుకే! కమలాక్షిని నేనైతే తాను శ్రీవేంకటేశ్వరుడు. అన్నిటికీ సమ్మతమై లోబడి ఉన్నప్పుడు చక్కగా బుద్ధికలిగి ఉండమనవే!

## 191

**అవతారిక:** స్వామి అలమేలుమంగమ్మ ఎదుటనే పరకాంతను కూడి శృంగారం సాగిస్తున్నాడని వాపోతున్న సన్నివేశం.

### వరాళి

ప. ఇంతకు వచ్చెనా నేఁడు యీపె వలపు
సంత సతులకు నేఁడు సన్నలు చూపేవు ॥పల్లవి॥

1. సేసకొప్పు వంచదా చేరి నీకు మొక్కదా
ఆసతో సేవలు సేయదా యింతి
వాసులెక్కించి యాడోవనితనుఁ బురికొల్పి
మాసటీనివలె నేఁడు మాటలాడించేవు ॥ఇంతకు॥

2. పెడరేఁచి వీడెమీదా ప్రియములు చెప్పదా
చిడుముడి చన్నులఁ బూజించదా యింతి
యెడమిచ్చి వేరొక్కతె నెఱఁగనటే తెచ్చి
కడవానివలె నేఁడు కాకుసేయించేవు ॥ఇంతకు॥

3. ఇటు నిన్నుఁగూడదా యింపు నీకుఁజేయదా
నటన శ్రీ వేంకటేశ నవ్వదా ఇంతి
ఘటనఁబరకాంతను కన్ను లెదుట నిలిపి
విటునిచందాన నేఁడు విద్యలాడించేవు ॥ఇంతకు॥

**అర్థములు:** ప. ఈపె = ఈమె, సంతసతులు = సంతలలో తిరిగే స్త్రీలు, సన్నలు = సైగలు.

1. సేసెకొప్పు = అక్షింతలు వేసిన సిగ, వాసులు = తారతమ్యాలు, యాడో = ఎక్కడో, పురికొల్పు = ప్రోత్సహించు, మాసటీడు = శూరుడు.
2. పెడ రేచు = తెగ విజృంభించి, వీడెము = తాంబూలము, చిడుముడి = తొందర, ఎరుగనటే = తెలియనట్లే, కడవాడు = వేరేవాడు, కాకు = తిరస్కారము.
3. ఇంపు = ప్రీతి, నటన = కపటము, ఘటన = కూర్పు, విటుడు = శృంగారనాయకుడు, విద్యలు = నేర్పులు.

**భావము:** ఓ స్వామీ! ఇంతవరకూ వచ్చిందా ఈవిడపై మీ ప్రేమ ఈనాటికి సంతలలో ఉన్న స్త్రీజనానికి సైగలు చేస్తావు.

ఆమె తన అక్షతలు వేయించుకొన్న కొప్పు వంచి నిన్ను ప్రార్థించదా? కోరికలతో సేవలు చేయదా చెప్పండి? ఎక్కడో ఉన్న లలనకు ఏవేవో కోరికలు ఎగదోసి, గొప్ప శూరుడిలాగా మాటలు చెప్తున్నావు.

నీకొరకై విజృంభించి నీకు తాంబూలమందించదా? నీకు ప్రియమైన ఎన్నో కబుర్లు చెప్పదా చెప్పండి? శరవేగాన కులుకాడే తన సొగసైన వక్షోజములతో నిన్ను ఆమె సేవించదా? ఆమెకు ఇలా వేరుచేసి ఇంకొకతెను ఏమీ తెలియనట్టు గుట్టుగా తెచ్చుకొని అనుభవిస్తూ, ఈమెను అన్యురాలిగా భావించి ఈరోజెందుకు తిరస్కరిస్తున్నావు?

కోరినవెంటనే నిన్ను కూడి ప్రీతిని కలిగించదా? కపటము నేర్చిన ఓ శ్రీవేంకటేశ్వరా! నీతో గూడి ఆహ్లాదం కలిగించదా?

చేరి చేరి ఒక పరకాంతను ఆమె కన్నులెదుటనే కూడి ఒక శృంగారనాయకుని తీరుగా ఈనాడేల నీ నేర్పులన్నీ ప్రదర్శిస్తున్నావు?

## 192

**అవతారిక:** స్వామి ఏవో కపటపు ఆలోచనలతో తమపై నిందలు వేస్తున్నాడన్న విషయం గ్రహించి చెలులు వాపోతున్నారు.

## దేసాళం

ప. ఏమి గట్టుకొంటివి యింతేసి మమ్ముఁజేసి
దోమటి దొడికి మాకు దూరులు గట్టుదురా ॥పల్లవి॥

1. పోహణించి నీవేల పూఁచి బాససేసేవు నీ-
మోహమెల్లాఁ గంటిమి మొన్ననే నేము
వూహాపోహ లెరిఁగి వూరకున్నదాన నేను
సాహసించి చన్నులపైఁ జాఁతురా నీ చేతులు ॥ఏమి॥

2. చేరి మమ్మునేల నీవు చెనక వచ్చేవు నీ-
నేరుపెల్లాఁగంటిమి నిన్ననే నేము
కూరిమిగొసరి నీగుట్టు దెలుసుకొంటిమి
మేరమీరి యింతలోనే మెట్టుదురా పాదము ॥ఏమి॥

3 .కొయ్యతనాన నన్నుఁగూడితి పానుపుపై నీ-
నెయ్యమెల్లాఁగంటిమి నేఁడే నేము
యియ్యెడ శ్రీవేంకటేశ యిన్నియు నియ్యకొంటిమి
నియ్యిచ్చులమోవిపయి నింతురా గుఱుతులు ॥ఏమి॥

**అర్థములు:** ప.కట్టుకొను = సాధించు, దోమటి = కపటము, ఒడుకు = దారితీయు, దూరులు = నిందలు, గట్టు = పూనుకొను.

1. పోహణించు = కూర్చు, పూచి = బాధ్యత, బాస = ఆన, ఊహాపోహలు = ఆవశ్యకమైన దానిని తెచ్చుకొని అనావశ్యకమును వదలుట.
2. చెనకు = తాకు, నేరుపు = నైపుణ్యము, కూరిమి = స్నేహము, కొసరు = కోరు, మేరమీరు = అతిక్రమించు, మెట్టు = పెట్టు.
3. కొయ్యతనము = కొంటెతనము, నెయ్యము = స్నేహము, నేము = మేము, ఇయ్యకొను = సమ్మతించు, ఇచ్చులు = అపేక్ష, ఇంతు = ఉంచు, గురుతులు = నఖ, దంతక్షత గుర్తులు.

**భావము:** స్వామీ! ఏమి సాధించావయ్యా! మమ్ము ఇలా సాధించి ఇంతదాకా? కపటపు ఆలోచనలకు దారితీసి, మాపై ఇంకా నిందలు కూడా వేస్తున్నారా?

అన్నిటికి ఒప్పుకొని కూర్చి మాకు అనేక ఆనలెందుకు చేశావు? నీ ప్రేమలను పూర్తిగా చూసి విని యున్నదానను. అవసరమేదో అనవసరమేదో తెలిసి విచక్షణ యున్నదానను. ఇలా ధైర్యంగా వక్షోజాలమీదకు చేతులు చాచడం తగిన పనేనా?

పనిగట్టుకొని మాదగ్గర జేరి మమ్ములను సదా తాకాలని ప్రయత్నిస్తుంటావు. నీ నైపుణ్యాలు గుణగణాలు అన్నీ మేము నిన్ననే చూశాము స్వామీ! స్నేహముతో కోరికలతో ఉంటూ నీ గుట్టుమట్టులన్నీ తెలుసుకొన్నాము. ఇంతలోనే ఇంత హద్దులు మీరి పాదములు లోన బెడతారా?

కొంటెతనముతో నన్ను పట్టుపానుపుపై కలిశారు. నీ ఇంపుసొంపులన్నీ ఈనాడు కళ్ళారా చూశాము కదా! ఈ తావున

శ్రీవేంకటేశ్వరా అన్నీ సమ్మతించితిమి. అపేక్షగల ముఖారవిందం నఖ,దంత క్షతపు గుర్తులను వేస్తారా?

## 193

**అవతారిక:** స్వామి అలమేలుమంగమ్మతో మితిమీరిన శృంగారం చేస్తున్నాడని గ్రహించిన చెలి అమ్మను అటమట పెట్టతగదని చెప్తున్నది.

## శ్రీరాగం

ప. ఇదివో మీ సుద్దులు ఇందుకే వెరగయ్యీని
వుదుటు మీ వయసులు వొక్కరతే కాదా ॥పల్లవి॥

1. వేడుకతో నిన్నుఁగూడి వింతలై యుండి తనకు
వాడుమోమేల వచ్చె వనితకును
జాడతో నీమోమైతే సరిఁజెంగలించినది
వోడక మీకిద్దరికీ వొక్కరతే కాదా ॥ఇదివో॥

2. పువ్వువలె నీతోడ పొందుసేసె నిందాఁకా
నివ్వెరగేఁటికి వచ్చె నెలఁతకును
నవ్వులైతే నీసెలవి నారుకొన్నట్టున్నవి
వువ్విళ్లూర నిద్దరికీ నొక్కరతే కాదా ॥ఇదివో॥

3. కలిమె నీకాఁగిటను కడఁగి శ్రీవేంకటేశ
అలపులేఁటికి వచ్చె నంగనకును
కొలఁదిలేవు నీకైతే గుఱుతైనచెనకులు
వొలిసి మీకిద్దరికీ నొక్కరతే కాదా ॥ఇదివో॥

**అర్థములు:** ప.సుద్దులు = నీతివాక్యాలు, పనులు, వెరగు = ఆశ్చర్యము, ఉదుటు = విజృంభించు, ఒక్కరతె = ఒక్కతె (స్త్రీ).

1. వేడుక = వినోదము, వింతలు = అపూర్వము, వాడు మోము = వాడిన మొహము, జాడ = గుర్తు, చెంగలించు = అతిశయించు, ఓడక = దేనికీ తగ్గక.
2. పువ్వువలె = అతిసుకుమారముగా, నివ్వెరగు = పారవశ్యము, భయము, సెలవి = పెదవి మూల, నారుకొను = ఏర్పడు, వువ్విళ్ళూరు = మిక్కిలి త్వరపడు.
3. కలిమె = సంపద, పుష్కలమైన పంట, కడగు = ప్రయత్నము, అలుపు = అలసట, కొలదిలేవు = తక్కువగాలేకపోవడం, గురుతైన చెనకులు = గుర్తుపట్టేవిధంగా ఉన్న తాకిళ్ళు (దంత,నఖక్షతములు), ఒలయు = చుట్టుకొను.

**భావము:** స్వామీ! ఇదుగో ఇందుకే మీ ఘనకార్యాలన్నీ ఆశ్చర్యం అనిపించేది. విజృంభించిన మీ వయసుకు సరిజోడు ఆమె ఒక్కతేకదా!

ఎంతో ఉల్లాసముతో నిన్ను కూడగానే అన్నీ అబ్బురముగా అనిపించాయి తనకు. కానీ ఆమె ముఖబింబం అలా వాడిపోయి ఉన్నదెందుకని? గుర్తుతెలిసి నీ మోమైతే అలాగే ప్రకాశవంతమై యున్నది. దేనికీ తగ్గక యున్న మీకు ఆమె ఒక్కతేకదా!

పువ్వులాగా అతిసుకుమారంగా ఆమె నీతో ఇంతవరకూ పొందుకూడింది. అంత భయము, భీతి ఆ వనితకేల కలిగాయి? సంతోషమైతే నీ పెదవి చివర అలాగునే ఉన్నది. అంత త్వరపడ్డం ఎందుకు? మీకు ఆమె ఒక్కతేకదా!

ఓ శ్రీవేంకటేశ్వరా! ఆ వనిత నీ కౌగిలిలో ప్రయత్నించి కలిసినదికదా! అంత అలసటామెకు ఎందుకు కలిగినది చెప్పండి? నీకైతే శరీరమంతటా ఆ తాకిళ్ళు, దంత, నఖక్షతాలకు తక్కువలేదు కదా! చుట్టుకొన్న మీ ఇద్దరికి, ఆమె ఒక్కతే మీ పట్టపురాణి అలమేలుమంగమ్మ కదా! అలా అటమటపెట్టదగునా స్వామీ!

## 194

**అవతారిక:** అలమేలుమంగమ్మ కంటే స్వామి సర్వోన్నతుడనీ, పూర్వము నుండీ కూడా ఆమెకూడా నీకు అధికురాలేనని చెలులు వారిద్దరి బంధాన్ని స్తుతిస్తున్నారు.

### రామక్రియ

ప. ఆపెకంటె నీవెక్కుడు ఆపె తొల్లె నీకెక్కుడు
చేపట్టి చెలి మొక్కఁగా చెనకేవు నీవు ॥పల్లవి॥

1. కన్నులనే సన్న సేసి కాఁకలు నీపైఁ బూసి
మిన్నక పరాకుసేసి మెలుఁత
చన్నులపైఁజేయి చాఁపి సంగతి నిట్టూర్పు లాఁపి
వున్నతి వలపు చల్లి వొరసేవు నీవు ॥ఆపెకంటె॥

2. మాటలనే పొద్దువుచ్చి మచ్చిక నీపైఁగుచ్చి
కూటముల నవ్వు దచ్చీ కోమలి
నీటులనే మేనువెంచి నేరుపలనే మించి
పూఁటవూఁటకుఁగొసరి పొదిగేవు నీవు ॥ఆపెకంటె॥

3. కదుఁదమకాన మొక్కి కాఁగిటిలోపలఁజొక్కి
అదరి కాలుదొక్కీ నంగన
విడువక రతిఁబొంది వెస మోవితేనె చింది
కడఁగి శ్రీ వేంకటేశ కైకొనేవు నీవు ॥ఆపెకంటె॥

**అర్థములు:** ప. ఆపె = ఆమె, నీవెక్కుడు = నీవు ఉన్నతుడవు, తొల్లి = పూర్వము, నీకెక్కుడు = నీకు ప్రేమాస్పదమై అంది, చెనకు = స్పృశించు.

1. సన్న = సైగ, కాక = తాపము, పూసి = ప్రసరింపజేసి, మిన్నక = మాట్లాడక, పరాకు = పరధ్యానము, మెలుత = స్త్రీ, సంగతి = చేరిక, నిట్టూర్పులు = దీర్ఘ ఉచ్ఛ్వాస నిశ్వాసనములు, ఉన్నతి = గొప్పదైన, చల్లి = వ్యాపింపజేసి, ఒరయు = విచారించు.

2. పొద్దువుచ్చి = కాలక్షేపము జేసి, మచ్చిక = ఆసక్తి, కూటములు = కూడిక, తచ్చి = మధించి, కోమలి = స్త్రీ, మేను = శరీరము, నేరుపులు = నైపుణ్యాలు, శోభలు, పూటపూటకు = మాటిమాటికి (వ్యవధిలేని) పొదుగు = క్రమ్ము.

3. తమకము = మోహము, కాగిటి = కౌగిటి, అదరి = అతిశయించి, అంగన = స్త్రీ, రతిబొంది = రతిక్రీడలో నిమగ్నులగు, వెస = శీఘ్రముగా, మోవితేనె = అధరామృతము, కడగి = యత్నించి, కైకొను = గ్రహించు.

**భావము:** స్వామీ! ఆమె కంటే నువ్వు సర్వోన్నతుడవు, ఆమె నీకు పూర్వము నుండీ కూడా అధికురాలే! ఆమెను చేపట్టి, నీకు మ్రొక్కి ప్రార్థించగా ఆమెను ప్రేమతో స్పృశించావు.

కన్నులతో అనేక సైగలు చేసి, తాపము నీమీద చూపించి, ఏమీ మాట్లాడక పరధ్యానంగా ఉండిపోయింది ఆ లలన. ఆమె వక్షోజముపై చేయి జాపి, చేరి యామె దీర్ఘ ఉచ్ఛ్వాస నిశ్వాసనములనాపి, శ్రేష్టమైన ప్రేమాతిశయములను ఆమెపై ప్రసరింపజేసి మంచి చెడ్డలను విచారణ జేస్తావు.

మంచి సంభాషణలచేత కాలక్షేపము జేసి, నీపై అధికాసక్తిని కనబరుస్తూ, కూడికలలో చిరునవ్వులు చిందిస్తూ అనుభవాలను మధిస్తూ ఉండేదా కోమలి. శృంగార గర్వ శరీర భావనతో, నీ అధిక నైపుణ్యంతో మాటిమాటికి వ్యవధిలేక ఆమెను క్రమ్ముకుని సుఖించేవు.

ఆమె మిక్కిలి మోహముతో నీకు మ్రొక్కి, నీ కౌగిటిలో బందీ అయి, అతిశయించి నీ కాలు ద్రొక్కినది ఆ రమణి. ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు విడువకుండా ఆమెతో రతిసౌఖ్యం అనుభవిస్తూ, ఆలస్యం చేయకుండా ఆమె అధరామృతం యత్నించి గైకొనే వాడవు.

**విశేషం:** అమ్మ అలమేలుమంగమ్మ స్వాధీన పతికయని చెలులు చెప్పున్నట్లు వర్ణిస్తున్నాడు అన్నమయ్య.

## 195

**అవతారిక:** స్వామి ఏవో అకార్యాలు చేసివచ్చి బయట నిలబడ్డాడు. అమ్మ స్వామిని లోనకు రమ్మని సందేశం పంపుతున్నది.

### కొండమలహరి

ప. ఎంతలేదు రమ్మనవే యేల వేసాలు సేసీని
పంతగాఁడై వూరకుంటే పచారించేరా ॥పల్లవి॥

1. అలయనేలే తాను ఆసురుసు రననేలే
నలినాక్షి తనతోఁబెనఁగులాడితే
వలవఁగ నింతేసి వచ్చెఁగాక అటు తాను
తొలుతే సాజాన నుంటే దొమ్మిసేసేరా ॥ఎంతలేదు॥

2. సిగ్గులు వడఁగనేలే సెలవుల నవ్వనేలే
నిగ్గులను వసంతపునీరు చల్లితే
బగ్గన తా వచ్చి వొడివట్టి తియ్యఁగానేకాక
వొగ్గి గుట్టుననుండితే నొలవేసేరా ॥ఎంతలేదు॥

3. మేనిమురిపెములేలే మేకులు చూపఁగనేలే
ఆనుక తనకాఁగిట నాపె గూడఁగా
యీనెపము శ్రీ వేంకటేశుఁడు తాఁ జెసెఁగాక
మోనాన వాసితో నుంటే మొరయవచ్చేరా ॥ఎంతలేదు॥

**అర్థములు:** ప. వేసాలు = వేషాలు, సేసీని = చేస్తున్నాడు, పంతగాడు = పౌరుషమున్న వాడు, పచారించు = ప్రవర్తించు.

1. అలయు = బడలు, అసురుసు = శ్రమకు ధ్వన్యనుకరణము, మిక్కిలి అలసిపోవుట, నలినాక్షి = తామరలవంటి కన్నులు గలది, స్త్రీ, పెనగులాడు = కలియబడు, వలవగ = ఇష్టపడు, తొలుత = ముందు, సాజాన = కలయికతో, దొమ్మి = అందరూ కలియబడు.
2. సెలవులు = పెదవిమూల, నిగ్గులు = అందమైన, బగ్గన = తొందరగా, ఒగ్గి = పూనుకొను, గుట్టు = రహస్యము, ఒల = వల.
3. మేనిమురిపెము = నడకలో ఉన్న కులుకు, మేకులు = పెద్దరికము, ఆనుక = తర్వాత, కాగిట = కౌగిట, ఆపె = ఆమె, నెపము = తప్పు, మోనము = మౌనము, వాసి = ఆధిక్యత, మొరయు = ఉరిమిచూచు.

**భావము:** ఆ స్వామి ఎన్ని వ్యవహారాలు నడుపలేదు. ఇక రమ్మనవే! లేనిపోని వేషాలు వేయడమెందుకు? అంత పౌరుషమున్నవాడైతే ఊరకున్నవారితో యిలా ప్రవర్తిస్తారా?

ఆ తరుణి పోట్లాడితే తను అలసిపోవడమెందుకు, అసురుసురని అనడమెందుకు? ఇష్టపడి వచ్చినవాడు ముందే సఖ్యతతో నున్నట్లైతే ఈవిధంగా అందరూ కలియబడతారా? ఊరకే సిగ్గులులొలకబోస్తూ పెదవిమూలగా ఆ నవ్వులెందుకు?

అందమైన ఆమె వసంతపు నీటిని చల్లినపుడు తొందరపడి వచ్చి వొడిపట్టుకోవడమెందుకు? గుట్టుగా ఉన్నవారిపై ఈవిధంగా వలలు విసురుతారా?

నీ కులుకు తళుకుల నడకలతో మోయలు పోవడమెందుకే, ఆ స్వామి తన కౌగిట ఆమెను బిగించి, కలిసి కోరికతోనుండగా, ఈ తప్పు శ్రీవేంకటేశ్వరుడు చేసిఉంటే ఉండవచ్చుగాక, మౌనంగా ఉన్నప్పుడు అలా ఉరిమురిమి చూస్తారా?

## 196

**అవతారిక:** స్వామివారికి తనపై మనసులేదని గ్రహించిన అలమేలుమంగమ్మ బాధను వ్యక్తం చేస్తున్నది.

### సాళంగనాట

ప. పొందు గలిగితే నన్నీఁ బొసఁగుఁగాక
చందము గానియప్పుడు సమ్మతులు గూడునా ॥పల్లవి॥

1. మనసురాని చోటికి మంతనము లేమిటికి
చనవులేనియడకు సరసాలేల
ననుపులేనిపట్ల నగవులు చవిగావు
అనుమానమైనచొట ఆసపడఁదగునా ॥పొందు॥

2. యితవుగానివేళ ఇచ్చకము లేలవచ్చు
సతముగానివారిసంగా లొద్దు
రతి కెక్కనివలపు రాయిడికి మూలము
తతిగానివయసుకు తమక మమరునా ॥పొందు॥

3. సిగ్గులు ముంచుకొనఁగా సేసలెట్టు వెట్టఁజెల్లు
యెగ్గుపట్టఁ బూనితేను యెనయరాదు
అగ్గమై శ్రీ వేంకటేశ అట్టె నన్ను నేలితివి
వెగ్గలించె సంతోసాలు వేగిరించఁదగునా ॥పొందు॥

**అర్థములు:** ప.నన్నీ = నన్నే, పొసగు = పొందుపడు, చందము = న్యాయము, సమ్మతి = అంగీకారము.

1. మంతనము = ఆలోచన, చనవు = ప్రేమ, అనుపు = తోడు, ఆస = ఆశ.
2. హితవు = ఇష్టవు, ఇచ్చకము = మోహం, సతము = శాశ్వతము, సంగాలు = సహవాసము, రతికెక్కని = రతిక్రీడారహితమైన, రాయిడి = వేధ, బాధ, తతి = సమానమగు, సరియగు, తమకము = శృంగారము.
3. సేస = అక్షింతలు, వెట్టు చెల్లు = పెట్టడం ఏవిధంగా సమంజసము, ఎగ్గు = దోషము, ఎనయు = పొందుకూడు, అగ్గము = అధీనము, వెగ్గలించు = అధికము, వేగరించు = సమాచారము తెయుట.

**భావము:** ఆ స్వామి నన్ను పొందదలిచినట్లైతే నన్నే కోరి పొందకోరవచ్చును కదా! మనసులు కలవనప్పుడు, ఇద్దరికి అంగీకారము కుదురుతుందా చెప్పండి?

మనసు లేనప్పుడు అలాంటి ఆలోచనలు చేయడమెందుకు? ప్రేమాభిమానాలు లేనిచోట సరసాలు పడడం కుదిరే పనేనా? తోడు కూడలేని వారిపట్ల ఆశపడడం తగునా?

అసలు ఇష్టమే కానపుడు ఇక ప్రేమ వ్యవహారాలు మాట్లాడడం ఎందుకు? శాశ్వతము కాని ప్రేమ వ్యవహారాల్లో సహవాసాలకు తావులేదు. రతికి దారితీయని వలపులు చివరకు వేధకు బాధకు గురి చేస్తాయి కదా! సరిసమానమైన ఈడుజోడు అని భావించని సమయాల్లో వలపు పుడుతుందా?

అంతగా సిగ్గులు మొగ్గలవుతున్నప్పుడు అక్షతలు వేయడం ఏవిధంగా సమంజసం? ఎల్లవేళలా దోషాలనే ఎంచాలని ఆలోచనలున్నప్పుడు పొందుకూడడమే తగని పని. ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను నీ అధీనం చేసుకుని నన్నేలుకున్నవు. నా సంతోషమధికమైనవేళలో ఇలాంటి వ్యర్థ సమాచారాలు తెలుసుకోవడం నాకు తగదు స్వామీ! క్షమించు!

## 197

**అవతారిక:** స్వామి సతుల మధ్య అక్కడిమాటలిక్కడా, ఇక్కడి మాటలక్కడా చెప్పి లేనిపోని తగాదాలకు దారితీస్తున్నాడని భావించి తగదని హితవు చెప్తున్నారు.

### సామవరాళి

ప. ఏమి గట్టుకొంటివి నీ విందువంకను
సాము లిందులోనే చేసి సాదించవయ్యా ॥పల్లవి॥

1. అలిగి నేనే తిట్టితినంటా నాపెతోఁజెప్పి
తెలిపి నీవే తగవు దిద్దవచ్చేవా
వెలయ నిద్దరికిని వేఁడికోపములు రేఁచి
చెలఁగి నడుమ నీవు సీతు గాయవయ్యా ॥ఏమి॥

2. పెనఁగి నే నాపె నొట్టు వెట్టితి నంటాఁజెప్పి
పొనిగి యంతటిలోనే పొందు సేసేవా
వొనరఁగఁ దరితీపు లూరించి వూరించి
యెనలేని వేడుకల నీఁదులాడవయ్యా ॥ఏమి॥

3. నాలితో నాపె నేను నవ్వితినంటాఁ జెప్పి
తాలిమితోడుతనే సంతముసేసేవా
యీలీల శ్రీ వేంకటేశ యేలితి విద్దరి మమ్ము
పోలిమి మావలపు మైఁబూసుకొనవయ్యా ॥ఏమి॥

**అర్థములు:** ప.కట్టుకొను = సాధించు, ఇందువంక = ఈ విధంగా, సాము = బలము చూపించు, సాదించు = నెరవేర్చుకొను.

1. ఆపె = ఆమె, దిద్దు = సరిచేయు, వెలయు = బయటపడు, రేచి = రేగి, వ్యాపించి, చెలగు = ఉత్సాహించు, సీతు = చలి.
2. పెనగి = పోట్లాడి, ఆపె = ఆమె, పొనిగి = శ్రమపడి, పొందు = కలయిక, ఒనరగ = యుక్తముగా, తరితీపు = అపేక్ష, ఎనలేని = సాటిలేని, వేడుక = కుతూహలము, ఈదులాడు = వేలాడు.
3. ఆలి = భార్య, ఆపె = ఆమె, తాలిమి = ధైర్యము, సంతము = స్వంతము, తనది, లీల = క్రీడ, పోలిమి = పోలిక, మైబూసుకొను = శరీరమున రాచుకొను.

**భావము:** ఓ స్వామీ! ఇలాంటి చిలిపిపనులన్నీ చేసి ఏమి మూటగట్టుకుంటావయ్యా! నీ గొప్పలన్నీ ఇందులోనే ప్రదర్శించి నీకోరికలు నెరవేర్చుకోవయ్యా!

కోపంతో అలిగి నేను తిట్టానని నువ్వే ఆమెతో చెప్పి, మరలా నువ్వే తగవు దీర్చడానికి బయలుదేరావా? మా ఇద్దరి కోపాలు భగ్గుమన్నప్పుడు, నీవు మధ్యలో ఏమీ ఎరగనట్టు ఛలి కాచుకోవడానికి సిద్ధమయ్యావా స్వామీ!

ఏదో చిన్న పోట్లాట వచ్చిందని ఆమె మీద ఒట్టుపెట్టానని ఆమెతో నువ్వే చెప్పి, మరాలా పాపం అమాయకంగా ఏమీ ఎరుగనట్టు శ్రమపడి తగాదా తీర్చడానికి సిద్ధమయ్యావా స్వామీ! ఇలా మామధ్య అపేక్షలు ఊరించి ఊరించి సాటిలేని వినోదాలు చేస్తూ ఆనందిస్తూ ఊరేగవయ్యా!

నీ భార్యతో నేనూ ఆమె కలిసి పరిహాసాలాడామని చెప్పి,యిలా సాహసంతో అందరిని స్వంతం చేసుకునేవా స్వామీ! ఓ శ్రీవేంకటేశ్వరా! నీ లీలావినోదాలకు అంతులేదు కదా! ఇంక ఆలస్యమెందులకు మా వలపులన్నీ నీవు దక్కించుకొని మమ్మలను ఉద్ధరించరాదా!

## 198

**అవతారిక:** స్వామి పగలు రాత్రీ తేడా లేకుండా డంబాలు చెప్తున్నాడని గ్రహించిన చెలులు, అన్నీ ఆలోచించుకొని మాట్లాడమని ఉద్బోధిస్తున్నారు.

### దేవగాంధారి

ప. మాతో నేమి చెప్పేవు మాపు దాఁకా సుద్దులు
నీతి విచారించుకొంటే నీవెఱఁగవా ॥పల్లవి॥

1. నమ్మిక గావలెనని నవ్వు దెచ్చుకొనెఁగాక
కొమ్మమనసులోపలికోప మారెనా
సమ్మతించవచ్చునా చల్లజంపు లివిగాక
నెమ్మి నీచేసినచేఁత నీ వెఱఁగవా ॥మాతో॥

2. మచ్చిక చూపవలసి మాటలాడె నింతెకాక
కచ్చుపెట్టుకున్నయలుకలు దీరెనా
మెచ్చఁదగునా యివి మిక్కిలి కాఁకలుగాక
నిచ్చలపు నీగుణాలు నీ వెఱఁగవా ॥మాతో॥

3. వలపు రేఁచేనని వంకచూచె నింతెకాక
తలపులో నెంజరి వింతటఁ బాసెనా
యెలమి శ్రీవేంకటేశ యింతి నిట్టె కూడితివి
నెలకొన్న నీమహిమ నీవెఱగవా ॥మాతో॥

**అర్థములు:** ప. మాపు = సాయంత్రము, రాత్రి, సుద్దులు = గొప్పలు, నీతి = న్యాయము.

1. నమ్మిక = విశ్వాసము, కొమ్మ = స్త్రీ, ఆరు = తగ్గ, సమ్మతించు = అంగీకరించు, చల్లజంపు = చల్లగా చంపు, నెమ్మి = ప్రేమ, చేత = పని.
2. మచ్చిక = ఆసక్తి, కచ్చు = పగ, కాక = కోపము, నిచ్చలము = సత్యము, స్వచ్ఛము.
3. రేచు = రేగు, నెంజరి = మనస్తాపము, పాయు = వీడు, ఎలమి = వికాసము, ఇంతి = స్త్రీ, నెలకొను = కలుగు, పుట్టు, మహిమ = గొప్పదనము.

**భావము:**పగలు రాత్రీ తేడాలేకుండా మాతో డంబాలు ఏమి చెప్తున్నావయ్యా స్వామీ! అసలు నీతి న్యాయం అనేవి విచారించుకుంటే అన్నీ నీకే అర్థమవుతాయి కదా!

ఏదో నమ్మకంకోసం రాని నవ్వు తెచ్చుకుంటున్నావు కానీ, ఇంతి మనసులో ఉన్న కోపం తగ్గిందా! ఇవన్నీ చల్లగా గొంతులుకోసే వంటు పనులు కావా! ప్రేమతో నెమ్మదిగా ఆలొచిస్తే నీవు చేసిన పనులు నీకే అర్థమవుతాయి.

ఏదో ఆసక్తి చూపిస్తూ కాస్తా ప్రేమగా మాట్లాడావే కాని, మనసులో పగ పెట్టుకుంటే ఆడుదాని అలుక తీరుతుందా? ఇవన్నీ కోపాన్ని పెంచుతాయే తప్ప మెచ్చదగిన విషయాలేనా? స్వచ్ఛంగా నిలబడి నిజానిజాలు ఆలోచిస్తే నీ గుణాలన్నీ నీకుతెలియనివా?

నీమీద ప్రేమ కలిగిందని నీ వైపు దృష్టి సారించాదేతప్ప మనసులో ఉన్న మనోవ్యథ వీడిపోతుందా? ఓ శ్రీవేంకటేశ్వరా! వికాసముతో ఆ ఇంతినిట్టే పొందుకున్నావు. కుదురుకొన్న నీ మహిమలు నీకు తెలియనివా?

## 199

**అవతారిక:** ఇచ్చిన మాట మరచి స్వామి తనను నిరాదరణకు గురిచేస్తున్నాడని గ్రహించిన అలమేలుమంగమ్మ , స్వామిని తనవద్దకు రమ్మని చెప్పమని చెలితో రాయబారం పంపుతున్నది.

## శ్రీరాగం

ప. ఇప్పటనుంటీ గొసరనేమిటికి నింతలోనే
తప్పీనా తానే ఆ సుద్ది దడవీఁ గాని ॥పల్లవి॥

1. రయమున విరహాన రాఁగిననన్నుఁ జూచితే
దయ పుట్టకుండునా తనకైనాను
ప్రియములు చెప్పియైనాఁ బిలువవే యిక్కడికి
నియతానఁ దానే మన్నించీఁగా ని ॥ఇప్పట॥

2. వెగటులేని నావిన్నపములెల్లా వింటే
చిగిరించకుండునా చిత్తమైనాను
మొగము చూడుమనవే ముచ్చటయ్యీనిదే నేఁడు
జగమెల్లా మెచ్చఁగాను చనువిచ్చీఁగాని ॥ఇప్పట॥

3. గుఱుతుగా నన్ను నిట్టె కూడినాఁడు ఇటులైతే
చిఱునవ్వు రాకుండునా సెలవినైనా
యెఱిఁగి శ్రీవేంకటేశుఁడేలె నన్ను విడెమీవే
జఱయుచుఁ దనమోవి చవిచూపీఁగాని ॥ఇప్పట॥

**అర్థములు:** ప. ఇప్పట = ఇప్పటి, ఽ=సరు = వెనుదీయు, తప్పీనా = మాట తప్పెనా, సుద్ది = వృత్తాంతము, వ్యవహారము, తడవి = తడబడుట.

1. రయము = వేగము, విరహము = ఎడబాటు, వియోగము, రాగిన = బాధపడు, నియతము = నిత్యము, నియమము, మన్నించీ = మన్నించును.
2. వెగటు = ఏవగింపు, చిగిరించు = ఆశలురేకెత్తు, చిత్తము = మనసు, అయ్యీనిదే = అవుచున్నది (అసమాపక క్రియ), జగము = ప్రపంచము, చనువిచ్చీ = ప్రేమానురాగాలిచ్చు (అ.క్రి).
3. గురుతు = ఋజువు, తార్కాణము, సెలవి = పెదవిమూల, ఎరిగి = కనుగొని, విడెము = తాంబూలము, జరయు = సమీపించు, చవిచూపు = రుచిపెట్టు.

**భావము:** చెలీ! చూడవే...ఆ స్వామీ, ఇప్పటికిప్పుడు ఇంతలోనే వెనుదీయడమెందుకు? ఆయన ఇచ్చిన మాటను, చేసిన ఆనలను అంతలోనే మరచిపోయి తడబడుతున్నాడేలనే?

ఎడబాటుతో రగిలిపోతున్న నన్ను జూసినప్పటికి స్వామికి దయపుట్టకుండా ఉంటుందా? ఏవైనా నాలుగు మంచిమాటలను చెప్పి ఇక్కడికి పిలువవే! తర్వాత తానే నియామాలను గుర్తుజేసుకుని నన్ను మన్నించి మర్యాద చూపిస్తాడు.

ఏవగింపు ఏమాత్రం లేని నా విన్నపాలు విన్నట్లైతే స్వామివారికి మనసులో కోరికలు చిగురెత్తకుండా ఉంటాయా? ఒక్కసారి విచ్చేసి ముచ్చటగొలిపే నా ముఖారవిందాన్ని గమనించమనవే! ఈ ప్రపంచం మొత్తం మెచ్చుకొనేవిధంగా ప్రేమానురాగాలను నాకు ప్రసాదిస్తాడు.

దానికి ఋజువుగా నన్ను ఈవిదంగా ఇక్కడ కూడినాడు కనుక ఎవరికైనా పెదవిమూల చిరునవ్వులు మొలకెత్తకుండా ఉంటాయా చెప్పు? ఆ శ్రీవేంకటేశ్వరుడు అవన్నీ తెలిసికొనే నన్నేలుకుంటూ ఉన్నాడు. తాంబూలమివ్వవే! ఆ స్వామి నన్ను చేరుకుని అధరామృతాన్ని నాకు రుచిపెడతాడతాడు గదే!

**విశేషం**: అమ్మ అలమేలుమంగమ్మ విరహోత్కంఠిత నాయికగా వర్ణిస్తున్నాడు అన్నమయ్య.

## 200

**అవతారిక:** స్వామివారు తనను అందరు స్త్రీలతో సమానంగా పరిగణిస్తున్నాడని, నిజమైన ప్రేమ చూపడం లేదని, అలమేలుమంగమ్మ వాపోతున్నది.

### శుద్ధవసంతం

ప. కాంతలనెల్లా నొక్కగాడిఁ గట్టేవింతేకాక
మంతనమాడితేనే మర్మము గరఁగునా ॥పల్లవి॥

1. తలఁపే కలిగితే దండనుండవా నీవు
వలచినవాఁడవై తే వాసులెంతువా
నెల కొకమాటు వచ్చి నిద్రతెంకి నుండఁగాను
తెలిసెనా నాగుణము తేటతెల్లమిగను ॥కాంతల॥

2. చుట్టరిక మెఱిఁగితే సులభాన నవ్వవా
గుట్టుగన్నవాఁడవైతే కొంచివుందువా
యెట్టకేల కిటు మాతో యేలాటా లాడితేనే
పట్టెనా నీమనసున పంతపునాసేవలు ॥కాంతల॥

3. కరుణించవలసితే కప్పురమిడె మియ్యెవా
సరసానకు లోనైతే సమ్మతించవా
యిరవై శ్రీవేంకటేశ యిట్టె నన్ను నేలితివి
సరివచ్చెనా తొల్లిటి సంగాతపు రతులు ॥కాంతల॥

**అర్థములు:** ప.కాంతలు=స్త్రీజనము, గాడి = వరుస, మంతనము = రహస్యము, మర్మము = కపటము, కరగునా = ద్రవించు, తగ్గిపోవు.

1. తలపు = ఆలోచన, దండ = చెంత, వాసులు = తారతమ్యాలు, నిద్రతెంకి = నిద్రించు స్థానమ్ము, శయ్యాగృహము, తేటతెల్లమి = మిక్కిలిస్పష్టము, బహిర్గతము.

2. సులభాన = సుఖముగా, గుట్టు = రహస్యము, కన్నవాడు = తెలిసినవాడు, కొంచు = సంకోచించు, ఎట్టకేల = చివరకు, ఏలాట = పరిహాసము, పంతము = పోటీ.

3. కరుణించు = దయచూపు, కప్పురవిడెము = కర్పూరపు తాంబూలము, సమ్మతించు = అంగీకరించు, ఇరవు = నెలవు, సరివచ్చు = ఈడుపడు, తొల్లిటి = పూర్వపు, సంగాతము = చెలిమి.

**భావము:** ఓ స్వామీ! అందరు స్త్రీలను ఒక్కటే రీతిగా చూడడం న్యాయమా? అంతేగాక, ఏవో రహస్యాలు కొన్ని చెప్పినంతమాత్రాన కపటాలన్నీ తగ్గిపోతాయా?

నీకు అసలు ఆలోచనే ఉన్నట్లైతే చెంత నీవు నిలబడవా? నిజంగా ప్రేమించినవాడవైతే తారతమ్యాలు లెక్కిస్తావా? శయ్యాగృహంలో గాఢ నిద్రలోనుండగా, మాసానికి ఒకసారి వచ్చి నీవు చేసే పనులవలన నీ గుణగణాలన్నీ బహిర్గతమవుతున్నాయి.

నిజంగా బంధుత్వమున్నదని భావించిన వాడివైతే సంతోషంతో గలగలా నవ్వేవాడివి కదా! రహస్యాలు తెలిసినవాడవైతే ఇలా సంకోచించడం ఎందుకు? చిట్టచివరకు ఇలా మాతో పరిహాసాలాడితే నీ మనసులో నేను మీకు చేసుకునే నిస్స్వార్థంగా పోటీ పడి చేసే సేవలకు స్థానం ఉంటుందా?

నిజంగా దయ చూపించే వాడివే అయితే కర్పూర తాంబూలమందివ్వవా? సరదాపడి సరసాలాడితే అంగీకరించవా? స్వామీ శ్రీవేంకటేశ్వరా! ఇక్కడ కొలువై నన్నేలుకున్నావు. పూర్వపు చెలిమిరతులు, సయ్యాటలు ఇప్పుడు ఈడుపడ్డాయా?

**విశేషం:** అమ్మ అలమేలుమంగమ్మను విప్రలబ్ధ నాయికగా వర్ణిస్తున్నాడు అన్నమయ్య.

## 201

**అవతారిక:** స్వామి సతులైన శ్రీదేవికి భూదేవికి మధ్య ఏదో మాటా మాటా వచ్చినట్లున్నది. శ్రీదేవి స్వామికి సేవలు చేస్తూనే, ఇలాంటివన్నీ భూదేవి చేత కూడా చేయించుకోండి స్వామీ చూద్దాం, అంటూ తన దర్పాన్ని ప్రదర్శిస్తున్నది.

### పూర్వగౌళ

ప. కానవచ్చీ నందులోనే కడమదొడమలెల్లా
నీ నేరుపు లాపె మీఁద నెరపుమా చూతము ॥పల్లవి॥

1. చేపట్టుఁగుంచమనంటా సిగ్గు లీడఁ బలికేవు
ఆపెతోడ నీమాటే ఆడుమా నీవు
వోపుదునంటా నాకు వూడిగాలు చెప్పేవు
యేపున నాపెచేత చేయించుకోమ్మా చూతము ॥కానవచ్చీ॥

2. గోలదాననంటా నన్నుఁ గొనగోరఁ జెనకేవు
నాలి నాపెతోడ నిట్టె నవ్వుమా నీవు
మేలుగలదాననంటా మెట్టేవు నాపాదము
గేలి నాపెపాదానఁ దాఁకించుమా చూతము ॥కానవచ్చీ॥

3. సేసుకొన్నదాననంటా చేరి నన్నుఁ గూడితివి
ఆసల నాపెఁ గాగిట నంటుమా నీవు
శ్రీసతినంటా నన్ను శ్రీ వేంకటేశ యేలితి
భూసతి ఆపెను నిట్టె పొందుమా చూతము ॥కానవచ్చీ॥

**అర్థములు:** ప.కానవచ్చీ= కనబడుతున్నవి, కడమదొడమలు= మిగిలినది, తగిలినది, వచ్చినది-పోయినది ఇత్యాద్యర్థములలో వాడబడు పదము, ఆపె= ఆమె, నెరపు= వ్యాపింపజేయు.

1. చేపట్టు= గైకొను, కుంచము= వింజామర, ఆపె= ఆమె, ఓపు= ఓపికతోనుండు, ఊడిగాలు= సేవలు, ఏపున= బాగా, ఆపె= ఆమె.
2. గొలది= అల్లరి చేసే స్త్రీ, కొనగోర= గోరు చివర, చెనకు= తాకు, ఆలి= భార్య, ఆపె= ఆమె, మెట్టు= త్రొక్కు, కేళి= ఆట.
3. సేసుకున్న= వివాహమాడిన, ఆస= కోరిక, ఆపె= ఆమె, కాగిట= కౌగిట, అంటు= తాకు, శ్రీసతి= శ్రీదేవి, శ్రీమహాలక్ష్మి, భూసతి= భూదేవి, పొందు= కూడు.

**భావము:** స్వామీ! నీవు చెప్పిన మాటలోనే మొదలు చివరా అన్నీ వివరంగా కనిపిస్తూనే ఉన్నాయి. నీ నైపుణ్యం చాతుర్యం కాస్తా ఆమె మీద చూపండి స్వామీ! నేనూ చూస్తాను.

వింజారమందుకోమని, వీవమని, సిగ్గులొలకబోస్తూ ఇక్కడ మాట్లాడతావు. అదే మాట అక్కడ కూడా అనండి స్వామీ! నేను సేవలు చేస్తున్నాను కదా అని అన్నీ నాకే చెప్తావు. అలాగే ఆమె చేత ఇలాంటి సేవలన్నీ చేయించుకోవయ్యా! నేనూ చూస్తాను.

నేనేదో అల్లరి చేసేదానని ప్రచారాలు చేస్తూ, నీ గోరుచివరలు తాకించి నఖక్షతాలు నాపై వేస్తుంటావు. ఆమెతో కూడా ఇలాంటి పరిహాసాలాడవయ్యా! నేను వలపులు కురిపించే దానని నా కాలు ద్రొక్కుతావు. ఆట మాదిరిగా ఆమెకు కూడా నీ పాదాన్ని తాకించండి.స్వామీ!నేనూ చూస్తాను.

నేను వివాహమాడిన దానననని వచ్చి నన్ను పొందు గూడావు. అలాగే కోరికతో ఆమెను గూడా కౌగిట పొందుకోండి స్వామీ! శ్రీదేవి నని నన్ను ఏలుకున్నావు. అలాగే ఆ భూదేవిని కూడా ఈలాగునే పొందు కోరండి. నేనూ చూస్తాను.

**విశేషాంశాలు:** శ్రీమహావిష్ణువు శేషశయనం యొక్క పడగల క్రింద కుడివైపున శ్రీదేవితోను, ఎడమ వైపున భూదేవితోను కూడి ఉంటాడు. లక్ష్మీదేవి యొక్క ప్రత్యామ్నాయ శక్తిని శ్రీ దేవి సూచిస్తుంది. సంతానోత్పత్తిని భూదేవి సూచిస్తుంది. విష్ణువు ఇద్దరి పట్ల సమానమైన వాత్సల్యాన్ని కలిగి ఉంటాడు. కానీ అన్నమయ్య సవతులైన వారిద్దరిమధ్య సరదా సంవాదం సృష్టించాడు.

## 202

**అవతారిక:** స్వామి చిన్న చిన్న పొరబాట్లకు కూడా సంకటపెడుతున్నాడని అమ్మ ఆవేదనచెంది, త్వరగా దరిజేర్చుకోవచ్చుగదా యని వాపోతున్నది.

## మధ్యమావతి

ప. అందుకుఁగా మమ్మేల ఆఱడిఁబెట్టీఁ దాను
సందడిఁ గాలుదొక్కితే సాదించవలదా ॥పల్లవి॥

1. అద్దుకొని యెడమాట లాడించకుండితే నేమి
వద్దికి రాఁగాను నే వద్దనేనా
ముద్దుముద్దువలె నేను మొక్కి నిలుచుండితేను
అద్దో పరాకు సేసితే నలుగఁగవలదా ॥అందుకు॥

2. చప్పుడు గాకుండా వచ్చి సన్న సేయకుంటేనేమి
కప్పురవీడె మియ్యఁగాఁ గాదనేనా
దుప్పటికొంగు వట్టితి తొలుతఁ దా రానందుకు
కొప్పువట్టి తీసి నేను కోపగించవలదా ॥అందుకు॥

3. సేనలుగాఁ బ్రియములు చెప్పకుండితే నేమి
తెనేమోవిచ్చితే సమ్మతించననేనా
తానే శ్రీవేంకటేశుఁడు తగిలి నేఁ గూడితేను
పూని యలసినందుకు పోదిసేయవలదా ॥అందుకు॥

**అర్థములు:** ప.ఆరడి= బాధ, సందడి= జనమధ్యము, సాదించు= ఓర్చుకొను.

1. అద్దుకొను= తాకి, ఎడమాట= భేదంతో గూడిన మాటలు, వద్దికి= వద్దకు, ముద్దుముద్దువలె= రమణీయముగా, అద్దో= అదిగో, పరాకు= అన్య ధ్యాస, నలుగు= తగ్గు.
2. సన్న= సైగ, కప్పురవిడెము= కర్పూరతాంబూలము, తొలుత= మొదట, కొప్పు= సిగ.
3. సేనలు= బహు, ప్రియములు= ప్రేమ కబుర్లు, మోవి= మొహము, సమ్మతించు= అంగీకరించు, తగిలి= మోహించి, పోది= రక్షణ.

**భావము:** చిన్న చిన్న విషయాలకు గూడా మమ్ములను ఇలా తాను సంకటం పెట్టుతున్నాడం సబబేనా? ఏదో జనసమూహంలో పొరబాటుగా కాలు ద్రొక్కితే ఓర్చుకోవలెను కదా!

దగ్గర చేరి తాకుతూ ఏవో పోట్లాటలొచ్చే విధంగా కాని మాటలన్నీ నాతో మాట్లాడించడం ఎందుకు? నేనంత రమణీయంగా, మనోహరంగా నిలబడి ఆయనకు మొక్కితే, అదుగో ఆవిధంగా పారవశ్యంతో ఉంటూ కాస్తా తగ్గితే వచ్చే నష్టం ఏమిటట?

ఏమాత్రం చడీ చప్పుడూ లేకుండా విచ్చేసి సైగలు చేయడమెందుకు? కర్పూర తాంబూలం చేతికిస్తే కాదని అనేదాననా? స్వామి రావడంలేదని దుప్పటి కొంగు పట్టుకున్నాను కానీ వాస్తవానికి ఆయన కొప్పు పట్టుకొని కోపపడవలసి ఉన్నది.

నాకు యిన్నేసి ప్రేమ కబుర్లు చెప్పకపోతే నేమైంది? తన తేనెలూరే మోవిలోని అధరామృతాన్నిస్తే నేనేం కాదన్నానా? ఆ శ్రీవేంకటేశ్వరుణ్ణి మోహించి కలిసినప్పుడు ఆయన పూనుకొని రక్షణ కల్పించే బాధ్యత తీసుకొనవలెను కదా!

## 203

**అవతారిక:** స్వామిని ప్రాణప్రదంగా ప్రేమిస్తున్న యువతులు తమ్ము నిరాదరించవద్దని, బయటివారితో పొందులు మానుకోమని వినతి చేస్తున్నారు.

### గౌళ

ప. నివ్వెరగుతోడ నేము నిలుచున్నార మిదివో
దవ్వులనుండి నీకెట్టు తమి రేఁచేమయ్యా ॥పల్లవి॥

1. మనసులోపలిమాట మగువ కాడఁగరాదు
తనువుమీఁదటికాఁక ధరించరాదు
వనితఁ బాసివాడలవారితో జూజమాడేవు
వినయాన నీకేమని విన్న వించేమయ్యా ॥నివ్వెరగు॥

2. కన్నులఁజూచేయాసలు గక్కన నాపఁగరావు
పన్ని పాయపుసిగ్గులు పట్టఁగరావు
సన్నల నింతులతోడ సాము సేసే విందు
అన్నిటా నిన్నెట్లాఁ జాయకుఁ దెచ్చేమయ్యా ॥నివ్వెరగు॥

3. కూడినట్టి నీరతులు కొలఁదివెట్టఁగరావు
వాడుమోవిగుఱుతులు వంచించరావు
యీడనే శ్రీ వేంకటేశ యేలితి వింతలో వచ్చి
తోడనే నీకిరితిఁ బోదులు సేసేమయ్యా ॥నివ్వెరగు॥

**అర్థములు:** ప.నివ్వెరగు= పారవశ్యము, నేము= మేము, దవ్వు= దూరము,, తమిరేచు= వలపు కలిగించు.

1. మగువకాడగ= స్త్రీలకు చెప్పుటకు, తనువు= శరీరము, కాక= తాపము, పాసి= విడచి, జూజమాడు= ఆటలాడు.
2. గక్కన= తొందరగా, పాయపు సిగ్గులు= తరుణవయసులో ఉన్న సిగ్గు, పట్టగ= గ్రహించు, సన్నలు= సైగలు, సాము= కలిసి, సేసే= చేయునటువంటి, చాయకు= దారికి.
3. రతులు= శారీరక కలయికలు, కొలదివెట్టు= తక్కువని చెప్పగ జాలము, వాడు= కాంతివిహీనమగు, వంచించరావు= అబద్ధములు చెప్పవు, కిరితి= కీర్తి, పోదులు= పారించు.

భావము: స్వామీ! మేమిక్కడ సంభ్రమాశ్చర్యాలతోను పారవశ్యంతోను నిలబడి ఉన్నాము. ఇంత ఎడబాటుతో దూరంగా నిలబడి నీకు ఏవిధంగా ప్రేమానురాగాలను, మోహాన్ని కలిగించగలము చెప్పండి?

స్వామీ! ఎప్పుడైనా గానీ మనసులో ఉన్న మాట ఆడువారికి చెప్పడం కుదరదుగదా! అలాగని శరీరంలో పుడుతున్న తాపాన్ని భరించనూ లేము గదా! ఇక్కడున్న వనితలను కాదని వీధులలో, వాడవాడలలో ఉన్న స్త్రీలతో ఆటలాడుతున్నావు. నీకు యేమని వినతులు చేసుకొగలము?

చక్షుప్రీతి ద్వారా కలిగే కోరికలను అంతతొందరగా ఆపలేము. ఈ యుక్త వయసులో వచ్చే సిగ్గులు చెప్పడానికి వీలుకాదు. నీవేమో ఏవేవో సైగలు చేస్తూ వెలుపలి వనితలతోడ కలిసి విందుభోజనాలు ఆరగిస్తూ వారితోనే అల్లుకొని ఉంటావు. అన్ని విషయాలు నీకెలా వివరంగా చెప్పి దారికి తెచ్చేమో అవగతం కావడంలేదయ్యా!

గతంలో కలసినప్పుడు నీ శృంగార క్రీడలు తక్కువని చెప్పలేము. మా వాడిన మొహాలపై ఉన్న దంత, నఖక్షతాల గుర్తులు బహిర్గతమవుతూ దాచలేనట్టివై ఉన్నాయి. శ్రీవేంకటేశ్వరా! ఈ తావులోనే ఇంతలోనే వచ్చి నన్నేలుకున్నావు. నీ వెంటనే నీ ప్రేమాదరాన్ని, నీ ఔదార్యాన్ని, అవధులు లేకుండా కీర్తించగలము.

**విశేషాంశాలు:** యువతులు తమకు యౌవనం వల కలిగే మదనా వస్తను అద్భుతంగా వర్ణిస్తున్నాడు అన్నమయ్య. "వాడుమోవి గురుతులు" అన్న పదం, వాడిపోయిన వారి ముఖారవిందాలను, రతులకై వారి తహతహలను తెలియజేస్తున్నదనే భావన ఒకటి కాగా, గత రతుల వలన వారి మొహములపై కలిగిన గుర్తులు ఎవరినీ మోసగించలేవు అన్న అర్థంతో శ్లేషతోను, వక్రోక్తితో అన్యార్థకల్పన మొనర్చుట ద్వారా తెలియజెపుతున్నాడు.

## 204

అవతారిక: స్వామి టక్కరి వాడని అనేక విధములుగా నిందించి చెలులతో చెప్పుకున్న అమ్మ అలమేలుమంగమ్మ చివరకు స్వామి జతగూడగానే పరమానంద భరితురాలై సేవలకు పూనుకొన్నది.

### పాడి

ప. ఎంత దక్కరీఁడే వీఁడు యేమి సేతునే
మంతనపు చెలులాల మనసియ్యఁ డిదివో ॥పల్లవి॥

1. చేసన్న చేసినవాఁడు చేరి మాటలాడరాదా
అసల నవ్వల నెత్తమాడ నేఁటికి
యీసుద్దు లెఱుఁగ నేను యీతనివేళ గాచుక
సేసవట్టుకున్న దాన చిత్తగించఁ డిదివో ॥ఎంత॥

2. తప్పక చూచినవాఁడు దండనే కూచుండరాదా
కప్పురపువసంతాలు కడనేఁటికి
తప్పు విచారించనైతి తనకే వొడిగట్టుక
అప్పటనుంటీఁ జూచేను అవుఁగాదనఁడిదివో ॥ఎంత॥

3. వీడె మిచ్చి కూడేవాఁడు వేరులేక చొక్కరాదా
వాడికసతులకళవళమేఁటికి
యీడనే శ్రీవేంకటేశుఁ డింతసేసి నన్నుఁ గూడె
పాడితో సేవలు సేసేఁబాయలేఁ డిదివో ॥ఎంత॥

**అర్థములు:** ప. తక్కరీడు= మోసగాడు, టక్కరి, మంతనము= ఏకాంతము, రహస్యము.

1. చేసన్న= చేతితో చేసే సైగ, ఆస= కోరిక, అవ్వల= అవతల, నెత్తమాడు= జూదమాడు, ఆటలాడు, వేళగాచుక= వేచి వేచి యుండు, సేస= అక్షతలు, చిత్తగించు= యోచించు.
2. అండ= చెంత, కప్పుర వసంతాలు= కర్పూరము కలిపిన వసంతపు నీరు, కడ= దిక్కు, వొడిగట్టు= పాల్పడు, అప్పట= అప్పటి, అవుగాదను= అవును కాదని చెప్పు.
3. వీడెము= తాంబూలము, వేరులేక= విడిపోక, చొక్కు= పారవశ్యము, వాడిక= అలవాటు, కళవళము= కలత, ఇంతసేసి= ఇన్నివిధాలుగా చేసి, పాడి= న్యాయము, సేసే= చేయుట, పాయు= వీడు, ఇదివో= ఇదిగో!

**భావము:** స్వామి ఎంత టక్కరి వాడే! కానీ, యేమి చేయగలము? ఓ నా ఏకాంత చెలులారా నాకు మనసివ్వడంలేదిదుగో చూడండి.

చేతితో ఏవేవో సైగలు చేసినవాడు చెంతజేరి మాట్లాడవలెనుగదా! కోరికలను పుట్టించి ఇలా ఆటలాడడమెందుకు? ఈతని మాటలన్నీ చెప్పలేకుండా ఉన్నాను, వేళగాని వేళలలో స్వామికై వేచి వేచి అక్షింతలు చేతితో పట్టుకుని నిలబడ్డానిదిగో చూడండి.

ఆశతో నన్ను చూసినవాడు నా చెంత చేరి కూర్చొండవలెను కదా! ఈ కర్పూర వసంతాలాడడం ఎందులకు? నేను స్వామి తప్పులనెంచకుండా ఆయనకే నా సర్వస్వ మర్పించి ఒడిగట్టుకున్న దానను కదా! అప్పటినుంచీ స్వామి ఇదుగో ఇలా చూస్తూనే ఉ న్నాడు కానీ, అవును కాదని తేల్చి చెప్పడంలేదు.

నాకు తాంబూలమిచ్చి చేరుకున్నవాడు యెడబాటు లేకుండా నా మీదనే తన పారవశ్యం చూపించవలెను కదా! మరలా అలవాటైన స్త్రీలతో కూడి వచ్చి, ఏమీ ఎరగనట్టుగా కలతపెట్టడం ఎందులకు? శ్రీవేంకటేశ్వరుడు ఇంతచేసి నన్నారటలు పెట్టినప్పటికీ నావాడై, ఈ వేంకటాద్రిపై నన్ను చేరుకున్నాడు. ఇక నేను స్వామివారికి అసలైన సేవలు చేస్తున్నాను. ఇదుగో చూడండే చెలులారా! స్వామి నన్ను ఎన్నటికి వీడిపోడు.

**విశేషాంశాలు:** అన్నమయ్య వింత పదప్రయోగశీలి. "ట" కు బదులు "త" అనే అక్షరం ఉపయోగిస్తాడు. 'టక్కులు మాను' అనడానికి 'తక్కులు మాను' అంటాడు. అలాగే ఈ కీర్తనలో "టక్కరీడు" అనే మాట "తక్కరీడు" గా ఉపయోగించాడు. 'నగుట గాక' అనడానికి 'నగుత గాక' (19-213) అనీ, 'దూరుటగాక' అనే మాటకు 'దూరుతగాక' (19-461) అనీ వింత వింత ప్రయోగాలు చేయడం గమనించదగ్గ విశేషం.

## 205

**అవతారిక:** స్వామి చెయ్యవలసిన కార్యాలన్నీ మరుగులేకుండా చేసేసి తరువాత సిగ్గుపడడం చూసి ఆశ్చర్యం వ్యక్తం చేస్తూ ఒక రమణి చెప్పే కబుర్లు బహుపసందుగా ఉంటాయి.

### భైరవి

ప. సిగ్గువడ నిఁకనేల శిరసు వంచఁగనేల
తగ్గులేని సరసాల తమి రేఁచరాదా ॥పల్లవి॥

1. పలుమారు నీచేఁతలు పచ్చిగా నాడఁగరాక
చెలియ చెక్కిటిమీఁదిచేత నున్నది
మొలకచన్నులమీఁద మొనగోర సోఁకింపించి
సెలవుల నవ్వింపించి చెంగలించరాదా ॥సిగ్గువడ॥

2. కొచ్చి కొచ్చి నీమేన గురుతులు చూపలేక
ముచ్చెటతో సారె నీకు మొక్కుచున్నది
కచ్చుపెట్టి యాపెను నీకాఁగిటను బిగియించి
ఇచ్చకపు వలపుల నీఁదింపించరాదా ॥సిగ్గువడ॥

3. రతికెక్కినట్టినిన్ను రవ్వసేయఁ జాలక
మితిమీరి నిన్నుఁ గూడి మెచ్చుచున్నది
సతమై శ్రీ వేంకటేశ చనవిచ్చి మన్నించి
యితవుగా మోవి ఇచ్చి ఇటు మెప్పించరాదా ॥సిగ్గువడ॥

**అర్థములు:** ప. ఇకనేల= ఇంకెందుకు, శిరసు= తల, తగ్గులేని= మితముకాని (అపరిమితము), తమి= వలపు, రేచు= హెచ్చుగు.

1. పలుమారు= అనేకసార్లు, పచ్చి= మరుగులేని, మొలకచన్నులు= అప్పుడే అంకురించిన వక్షములు, మొంగోర= గోరుచివర, సోకింపించి= తగిలించు, సెలవుల= పెదవిమూల, నవ్వింపించి= నవ్వింపజేసి, చెంగలించు= అతిశయించు.
2. కొచ్చి కొచ్చి= గ్రుచ్చి గ్రుచ్చి, నేమేన= నీ శరీరం పై, ముచ్చెట= ముచ్చట, సారె= మాటిమాటికి, కచ్చు= పట్టుదలతో, ఆపె= ఆమె, కాగిట= కౌగిట, ఇచ్చకము= ముఖప్రీతి, ఈదింపించు= ఈదింపజేయు.

3. రవ్వ= అల్లరి, మితిమీరి= అవధులు దాటి, సతము= శాశ్వతము, చనవు= ప్రేమ, మన్నించు= దయచూపు, ఇతవు= హితవు (ఇష్టము), మెప్పించు= ఒప్పుకొనునట్లు చేయు.

**భావము:** స్వామీ! ఇంక సిగ్గుపడడమెందుకు? అలా తలవంచుకొని ఉండడమెందుకు? మీ అపరిమిత సరస సల్లాపాలను సాగించి వలపు రాగాలను రేకెత్తించరాదా?

అనేకమార్లు నువ్వు చేసిన మరుగులేని కార్యాలను చెప్పనళవికాక ఆ రమణి చెక్కిలిమీద చేయి వేసుకొని అలా చూస్తుండిపోయినది. యౌవనమంకురిస్తున్న వక్షోజాల మీద నీ గోరుచివరలు తగిలించి, పెదవిమూల నవ్వులను ఆమెచే నవ్వింపజేసి అతిశయించరాదా స్వామీ!

నీ శరీరంపై ఉన్న దంత, నఖక్షతాల గుర్తులను పట్టి పట్టి చూపించలేక, ఆ లలనామణి మాటి మాటికి నీకు మ్రొక్కుచున్నది. పట్టుదల వహించి ఆ వనితను నీ బిగి కౌగిట్లో బంధించరాదా! ముఖప్రీతి ప్రేమలను ప్రోగు చేసి దానిలో ఆమెను ఈదింపజేయరాదా?

శృంగార సామ్రాజ్యంలో తేలియాడుతున్న నిన్ను అల్లరిమాటలు మాట్లాడడం ఇష్టంలేక, నిన్ను కలిసి అవధులు దాటేవిధంగా మెచ్చుకొనుచున్నది. ఓ శ్రీవేంకటేశ్వరా! శాశ్వతంగా ఈ వేంకటగిరిపై నాపై ప్రేమానురాగాలు చూపిస్తున్నావు. ఇష్టంగా నీ అధరామృతాన్ని అందించి నన్ను ధన్యురాలను చేయరాదా!

**విశేషాంశాలు:** అన్నమయ్య భాష విషయంలో బహు చమత్కృతి ప్రదర్శిస్తాడు. ఈ కీర్తనలో కొన్ని వింత క్రియాపదాలను ఉపయోగించాడు. 'సోకించి' అనడానికి బదులు 'సోకింపించి' అనీ, 'నవ్వించి' అనడానికి బదులు 'నవ్వింపించి' అనీ, 'ఈదించరాదా' అనడానికి 'ఈదింపిచరాదా' అని వాడి కీర్తనకు క్రొత్త సొబగులను అద్ది, నిఘంటువులలో క్రొత్తమాటలకు సృష్టికర్త అయ్యాడు.

## 206

**అవతారిక:** స్వామివారితో అలమేలుమంగమ్మ నేను ఎప్పుడూ అకారణ దూషణ చేయనేలేదు స్వామీ! అంటూ ప్రసన్నం చేసుకొంటున్నది.

### వరాళి

ప. ఇందుకు నేనేమి సేతు ఇది నీకే తెలుసును
విందువలె లోలో వట్టివిచారాలు సేసేవు ॥పల్లవి॥

1. యెన్నఁడైనా నే నిన్ను యొగసక్కె మాడుదునా
కొన్నేసి నీవే గండించుకొందువుగాక
పన్ని నిన్ను నేఁ దప్పులు పట్టితినా యిటు తొల్లి
వున్నట్టేవుండి నీవే వులికిపడేవు ॥ఇందుకు॥

2. యెచ్చరించి నే నేమైనా యేతువ లెత్తితినా
పచ్చిదేర నీవే సిగ్గుపడేవు గాక
నెచ్చులులముందరను నీపైఁ నింద మోపితినా
బచ్చెనమాటల నీవే బాసలు సేసేవు ॥ఇందుకు॥

3. పూనిపట్టి యెప్పుడైనా బొమ్మల జంకించితినా
ఆనుక నీవే వెరగందేవు గాక
వీనుల నీ సుద్దులెల్లా వినెనా శ్రీ వేంకటేశ
నానాటికి నన్నునేలి నవ్వులు నవ్వేవు ॥ఇందుకు॥

**అర్థములు:** ప. సేతు= చేసెదను, లోలో= లోపల లోపల, వట్టి= పసలేని, విచారాలు= తలపోయు.

1. ఎగసెక్కెము= పరిహాసము, కొన్నేసి= కొన్ని సార్లు, గండించు (గడించు)= కల్పించుకొను, పన్ని= అదేపనిగా, తొల్లి= పూర్వము, ఉలికిపడు= ఆకస్మికముగా కలిగిన భయాదులచే అదరిపడు.

2. ఏతువ= కారణము, నెచ్చెలులు= తోడి చెలులు, నింద= అపవాదు, పచ్చెన= రంగు, బాస= ప్రమాణము.

3. పూనిపట్టి= పట్టుదలచూపి, బొమ్మలు= కనుబొమలు, జంకించు= అదిరించు, ఆనుక= తర్వాత, వెరగందు= ఆశ్చర్యపడు, సుద్దులు= గొప్ప మాటలు, నానాటికి= క్రమక్రమంగా.

**భావము:** స్వామీ! దీనికి నేనేమి చేయగలను. ఈ విషయాలనన్నీ ఎరిగినవాడివి. ఏదో విందుమాదిరిగా లోపల లోపల ఏవో పసలేని విచారాలు, కార్యాలు చేస్తూ ఉంటావు.

స్వామీ! చెప్పండి ఎప్పుడైనా నేను మీతో వేళాకోళాలు ఆడితినా? కొన్ని కొన్ని నీవే కల్పించుకొని, ఊహించుకుంటూ ఉంటావు. ఇప్పుడుగాని ఇంతకు ముందుగానీ నేను కావాలని కోరి కోరి తప్పులెంచినదాననా? అదేమో స్వామీ ఎందుకో ఏమో! నీవే ఉన్నట్టుండి అదిరిపడుతూ ఉంటావు. కారణాలు నీకే తెలియాలి.

అకారణంగా నేనేమైనా నీ కార్యాలను విమర్శించి తప్పులు పట్టానా? నీవే ఎందుకు మరుగులేకుండా ఏవో తుంటరి పనులు చేసి సిగ్గులొలకబోస్తూ ఉంటావు. నా తోడి చెలుల ముందు నీపై ఏమైనా అపవాదులు చేశానా? నీవే రకరకాల రంగు మాటలు చెప్పి ప్రమాణాలేవేవో చేస్తూ ఉంటావు.

నేను మీ మీద కోపం పూని నా కనుబొమ్మలు అదిరించి మిమ్మల్ని అదరగొట్టానా? మీరే అన్నీ చేసేసి తర్వాత తీరిగ్గా ఆశ్చర్యాలు ప్రకటిస్తూ ఉంటారు. ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు చెప్పే మాటలన్నీ నా చెవులారా వినడంలేదా చెప్పండి? క్రమ క్రమంగా నన్ను ఏలుకొంటూ దరహాసాల్ని చిందిస్తూ ఉంటారు.

**విశేషాంశం:** ఇందులో అన్నమయ్య "బచ్చెన మాటలు" అని ఒక అద్భుత ప్రయోగం చేశాడు. బచ్చన అంటే పై పై రంగులు, అంతస్సారం లేని ఊసుకోలు కబుర్లు అని అర్థం.

## 207

**అవతారిక:** స్వామి అన్యకాంతలతో సరసల్లాపాలాడుతూ అలమేలుమంగమ్మను ఆరళ్ళకు గురిచేస్తున్నాడని అమ్మ పడే ఆవేదన.

### కన్నడగౌళ

ప. తేటతెల్లమిగ నన్నిఁ దెలిసితిమి
ఆఁటదాననంటా నన్ను నాఱడిఁ బెట్టేవు ॥పల్లవి॥

1. చెంత నాపె నీకు నిట్టె సేవసేయఁగాఁ జూచి
యింత నీవు వేఁడుకొన్నా నితవయ్యీనా
యెంతలేదు నీవేసాలు యెఱఁగనా నేఁ దొల్లి
సంతకూటములు చూపి సటలఁబెట్టేవు ॥తేట॥

2. సన్నల నాపె నీతో సరసాలాడఁగాఁ జూచి
మన్నన లెన్నిచ్చినాను మనసొగ్గీనా
పన్నిన నీమాయ లివి భావించి తెలియనా
తిన్నని మోవితేనెల తీపులఁబెట్టేవు ॥తేట॥

3. గరిమెతో నాపె నీకాఁగిట నుండఁగాఁ జూచి
సరి నెంతలాలించినా చవు లయ్యీనా
యిరువై శ్రీవేంకటేశ యేలితివి నన్ను విట్టె
శిరసువంచి నవ్వి సేసలు వెట్టేవు ॥తేట॥

**అర్థములు:** ప.తేటతెల్లమి= మిక్కిలి స్పష్టం, ఆటదాన= ఆడుదానిని (స్త్రీని), ఆరడి= కష్టము.

1. ఇతవు (హితవు)= ఇష్టము, తొల్లి= పూర్వము, సంతకూటమి= కొనువారియొక్కయు-అమ్మువారి యొక్కయు కూటమి, సటలు= బాధ.
2. సన్న= సైగ, మన్నన= మర్యాద, ఒగ్గు= సిద్ధపడు, మోవితేనె= అధరామృతము.
3. గరిమె= గొప్పదనము, ఆపె= ఆమె, లాలించు= బుజ్జగించు, చవులు= రుచులు, ఇరవు= స్థానము, సేస= అక్షింతలు.

**భావము:** స్వామీ! అన్నివిషయాలు స్పష్టంగా అర్థమయ్యాయి. ఆడదానిననే గదా నన్నిట్లా మీరు కష్టాలపాలు చేస్తున్నారు.

అక్కడ ఆమె నీకు ఎన్నో సేవలు చేస్తూ ఉండగా, నిన్నెంత వేడుకొన్నప్పటికి నీకు రుచించదు గదా! నీ కపటపు నాటకాలు మొదటి నుండి తెలిసినవే గదా! సంతలలో ఉన్నవారిని చూపించి నన్ను బాధలపాలు చేయడం సమంజసమేనా?

ఆమె నీతో ఏవో సైగలు చేసి సరసాలాడుతూ ఉండగా చూచినప్పటికి, నీకు తగు మర్యాదనిచ్చి, నా మనసులో ఉన్నత స్థానమే యిచ్చాను కానీ మనసులో ఏమాత్రం బాధపడలేదు కదా! నీవు పన్నిన మాయలు మర్మాలు గమనిస్తే తెలియనివి కాదు కదా! నా అధరామృతం గైకొనకుండా బాధలకు గురిచేస్తున్నావు.

ఎంతో ఘనంగా ఆమె నీ బిగి కౌగిట్లో ఉండగా చూచి, నిన్ను ఎంత బుజ్జగించినప్పటికీ, నీకు రుచించడం లేదు. శ్రీవేంకటేశ్వరా! ఇక్కడ స్థిరమై నన్నేలుకున్నావు. తల వంచి నవ్వులు చిందిస్తూ అక్షింతలు వేస్తున్నావు.

## 208

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామిని ఏవో అనకూడని మాటలని తర్వాత స్వామి తన వద్దకు వస్తాడో రాడో యని దిగులుపడుతున్న సమయంలో చెలులు ఆమెకు ధైర్యం చెబుతున్న సన్నివేశం.

### రామక్రియ

ప. ఆఱడిఁ బెట్టఁగనేల ఆతని నింతేసి నీవు
మీఱక బంగారుపీఁటమీఁదఁ గూచుండవే ॥పల్లవి॥

1. కొంగుపట్టి తియ్యనేలే కొసర నేమిటికే
సంగతెఱిఁగిన నెరజాణ విభుని
ముంగిట నున్నాఁ డుతఁడు మొక్కితే నెఱుకగాదా
రంగుగాఁ దానే వచ్చీ రావే లోపలికి ॥ఆఱడి॥

2. విన్నపము సేయనేలే వేఁడుకొన నింత యేలే
సన్న దెలిసినయట్టి సరసునికి
కన్నాఁడు నీగుట్టు వేళగాచుటే తగులుగాదా
పన్ని నిన్ను నేలీఁగాని పఱవవే పానుపు ॥ఆఱడి॥

3. చనవునఁ దిట్టనేలే చవులు చూపఁగనేలే
యెనసిన శ్రీవేంకటేశు నెదుట
ననిచి వున్నాఁ డితఁడు నగుటే వుంకువగాదా
తనివి నొందించి యింకాఁ దడవవే కాఁగిట ॥ఆఱడి॥

**అర్థములు:** ప. ఆరడి= బాధ, ఇంతేసి= ఇంతగా, మీరక= హద్దు దాటకుండా.

1. కొసరు= కోరు, నెరజాణ= నేర్పరి, ముంగిట= ఇంటి ముందు, ఎరుక= తెలియు, రంగుగా= సొంపుగా.
2. విన్నపము= వినతి, వేడుకొను= ప్రార్థించు, సన్న= సైగ, గుట్టు= రహస్యము, వేళగాచు= సమయము, తగులు= చిక్కు.
3. చనవు= ప్రేమ, తిట్టనేల= తూలనాడడం ఎందుకు, చవులు= రుచులు, ఎనయు= పొందు, అనిచి= ఆజ్ఞాపించి, నగుట= నవ్వుట, ఉంకువ= స్థిరత్వం, తనివి= తృప్తి, ఆప్యాయత, దడయు= దిగులు.

**భావము:** నువ్వు ఆ స్వామిని ఇన్ని రకాలుగా ముప్పుతిప్పలు పెట్టడమెందుకమ్మా? మాట్లాడకుండా హద్దు మీరక ఆ బంగారు పీటమీద స్థిరంగా ఉండు. అన్నీ నిదానంగా చక్కబడతాయి.

ఆయన సంగతులన్నీ తెలిసికూడా, ఇంకా కొంగు పట్టుకొని తమాషాలాడుతూ కోరికలు చెప్పడమెందుకు? ఆయన నీ యింటి ముందే ఉన్నాడు కదా! ఒక్క సారి ప్రార్థిస్తే సొంపుమీర లోనకు దానే విచ్చేస్తాడు కదా!

సైగలు అర్థం చేసుకునే సరస హృదయుడైన స్వామికి, ఇంతగా వినతులు చేసుకోవడమెందుకో ఆశ్చర్యంగా ఉన్నది. నీ రహస్య కార్యాలన్నీ మొత్తం కనిపెట్టాడు. తగిన సమయం కోసం ఎదురు చూసి నీ చేతికి చిక్కుతాడు గదా! స్వామి పూనుకొని నిన్నేలుకుంటాడు గానీ, మొదట ఆ పట్టుపానుపు పరచి పట్టెమంచం సిద్ధం చేయవే!

ఏదో చనువుతో ఉన్నాడని, స్వామిని తూలనాడడం తగునా? పొందు కోరిన శ్రీవేంకటేశ్వర స్వామి ఎదుటనే నిలిచి ఉన్నాడు కదా! ఆనతికై ఉన్నవానిని గమనించి చిరునవ్వులు చిందించడమే తగిన స్థిరత్వం, ధీరత్వం అనిపించుకోదా! ఆయనను అంతా ఊరించి, తహతహలపాలు చేసి ఇంకా ఎందుకు దిగులుతో భయంతో ఉన్నావమ్మా!

**విశేషాంశం:** ఈ కీర్తనలో అన్నమయ్య అలమేలుమంగమ్మను కలహాంతరిత నాయికగా మనకు చూపిస్తున్నాడు.

## 209

**అవతారిక:** స్వామి త్రేతా, ద్వాపర యుగాలలో ఏవిధంగా ప్రవర్తించాడో చెలికి చెబుతూ, ఎప్పుడైనా స్త్రీల గురించి పరితపించేవాడేలే ఈ స్వామి అంటున్నది అమ్మ అలమేలుమంగమ్మ.

### కాంబోది

ప. తలఁచుకొమ్మనవే తనగుణాలెల్లా నేఁడు
కొలనిలో సతులను కోరఁడా తాను ॥పల్లవి॥

1. పంతములేలాడీనే పడఁతులుగలవాఁడు
యింతలోనే మరుబాణా లిటు గెల్చెనా
అంతటాను తనసుద్దు లల్లనాఁడే వింటిమి
వింతగా సీతాదేవి వెదకఁడా తాను ॥తలచు॥

2. నవ్వులేల నవ్వీనే నను పైనకోడెకాఁడు
ఇవ్వలఁ దనపాయము ఇట్టె గెల్చెనా
చివ్వనఁ దనయెమ్మెలు చెప్పీనేలే మాముందర
దవ్వుల రుక్మిణికిఁగా తగులఁడా తాను ॥తలచు॥

3. చెప్పుకోనేలే మాటలు శ్రీ వేంకటేశ్వరుఁడు
యిప్పుడే తనమనసు యిట్టె గెల్చెనా
వొప్పుగా నన్నిటు గూడె నొరయనేలే చన్నులు
నెప్పున నురాన లక్ష్మి నిలుపఁడా తాను ॥తలచు॥

**అర్థములు:** ప. గుణాలు= స్వభావము, కోరు= అపేక్షించు.

1. పంతము= పట్టుదల, మరుబాణాలు= మన్మధుని బాణములు, సుద్దులు= గొప్పమాటలు, వింత= ఆశ్చర్యముగ.
2. అనుపైన= సొగసైన, కోడెకాడు= యుక్తవయసువాడు, ఇవ్వల= ఈప్రక్క, పాయము (ప్రాయము)= వయసు, గెలుచు= జయించు, ఎమ్మెలు= వ్యర్థపు మాటలు, దవ్వు= దూరము, తగులు= పట్టుకొను.
3. ఒప్పుగా= తగినట్లు, అందముగా, ఒరయు= రాచు, రుద్దు, ఒప్పున= తగినట్లు, అందముగా, ఉరాన= వక్షస్థలమందు, నిలుపు= ప్రతిష్ఠించు.

**భావము:** ఓ చెలీ! స్వామిని తన స్వభావాలన్నీ ఒక్కసారి తలుచుకోమని,జ్ఞప్తికి తెచ్చుకోమని, చెప్పవే! తాను సరస్సులో స్నానమాడే స్త్రీజనాన్ని కోరలేదా?

అంతమంది పడతులను వద్ద ఉంచుకొని ఇంకా పట్టుదలలకు పోవడమెందుకే! ఇంతలోనే మన్మథ బాణాలను జయించాననుకుంటున్నాడా? తాను చెప్తున్న కబుర్లన్నీ ఆనాడే విన్నాము కదా! ఆశ్చర్యం గొలిపే విధంగా తాను సీతాదేవికై కొండలు, గుట్టలు వెదకలేదా?

ఆ యుక్తవయసువాడు ఇంకా ఎందుకు అలా నవ్వులు చిందిస్తున్నాడే! ఈవైపు తన వయసును జయించాననుకొంటున్నాడా! ఉన్నట్టుండి తన వ్యర్థ ప్రసంగాలన్నీ మాముందర చెప్తూనే ఉన్నాడు కదా! అక్కడెక్కడో దూరాన విదర్భలో ఉన్న రుక్మిణీదేవిని తాను స్వయంగా వెళ్ళి చేపట్టలేదా?

శ్రీ వెంకటేశ్వరుడు ఇలాంటి మాటలన్నీ చెప్పుకోవడమెందుకే! ఇప్పుడేమైనా తనమనసును జయించాడా ఏమిటి? తగిన విధంగా నన్ను చేపట్టి వక్షోజాలను రాపిడికి గురిచేయలేదా? అందంగా తన వక్షస్థలం మీద శ్రీలక్ష్మిని నిలుపుకోలేదా చెప్పు?

**విశేషాంశం:** ఈ కీర్తనలో అన్నమయ్య శ్రీ మహావిష్ణువైన కలియుగ వేంకటేశ్వరుడు త్రేతా యుగంలో సీతకై పరితపించి వెదకాడని, ద్వాపరంలో కొలనులో స్నానం చేస్తున్న యువతులతో ఆటలాడడం గాకుండా, రుక్మిణీదేవి ఎంత దూరంలో ఉన్నా వెళ్ళి చేపట్టాడని, ఇప్పుడు శ్రీలక్ష్మిని వక్షస్థలంపై పెట్టుకున్నాడని, ఏ యుగంలోనైనా మన్మథుని పంచబాణాలైన అరవింద, అశోక, చూత, నవమల్లిక, నీలోత్పలాలకు ఓడిపోతూనే ఉన్నడని చమత్కారంగా చెప్తున్నాడు.

## 210

**అవతారిక:** స్వామి చేసే చిలిపి శృంగార చేష్టలను అలమేలుమంగమ్మ గ్రహించలేదనుకున్నాడు. అమ్మ స్వామి వేషాలన్నీ గమనించి, అన్యాపదేశంగా స్తుతి నిందకు దిగింది.

### సౌరాష్ట్రం

ప. ఏమి సేయవచ్చు నిఁక నెవ్వరితో నాడేము
నీ మన సెఱఁగనిది నేము చెప్పేమా ॥పల్లవి॥

1. నెలవుల నగనా చెప్పినట్టు సేయనా
కొలఁదిమీర నన్నేల కొసరేవు
తలుపుమాఁటుననున్న తరుణి నడుగరాదా
యెలమి నీయంత నీవు యెఱఁగకుండితేను ॥ఏమి॥

2. సేస నీపైఁ బెట్టనా చేతికి విడెమియ్యనా
వేసాలకు నన్నునేల వేఁడుకొనేవు
యీసుద్ది నీవెనకదిక్కింతిని నడుగరాదా
దోసము పుణ్యము నీకుఁ దోఁచకుండితేను ॥ఏమి॥

3. కైవసమై కూడనా కాఁగిలించుకొననా
శ్రీ వేంకటేశుఁడ నాచెక్కు నొక్కేవు
భావము నీదాఁపిరముపడఁతి నడుగరాదా
చేవమీఁతినసిగ్గునఁ జెప్పరాకుండితేను ॥ఏమి॥

**అర్థములు:** ప. ఆడేము= చెప్పగలము, నేము= మేము.

1. నెలవులు= వాసస్థానం, నగు= నవ్వు, కొలదిమీర= అపరిమితము, కొసరు= కోరు, ఎలమి= వికాసం.

2. సేస= అక్షింతలు, విడెము= తాంబూలము, వేసాలు= నాటకాలు, వేడుకొను= బ్రతిమాలు, సుద్ది= మాట, వెంకదిక్కింతి= వెనుకన వైపు ఉన్న స్త్రీ, దోసము, పుణ్యము= మంచి చెడులు.
3. కైవశము= పూర్తిగా వశమగు, కాగిలించు= కౌగలించు, చెక్కు= చెక్కిలి, దాపిరము= రహస్యము, చేవమీరు= సారవంతమైన, అధికమైన, జెప్పరాక= చెప్పుటకు వీలు లేనట్టిది.

**భావము:** ఏమి చేయగలము? ఎవరితో చెప్పుగోలము? నీ మనసుకు తెలియని విషయాలు, మేము చెప్పగలందులకు ఏముంటాయి?

నేనున్న తావులోనే నవ్వులు చిందించనా లేక నువ్వు చెప్పినట్లు చేయమంటావా? అపరిమితమైన కోరికలెందుకు కోరుకుంటున్నావు? ఆ తలుపు వెనుక నక్కి ఉన్న ఆ లలనను అడగవయ్యా! ప్రకాశించి నీ అంతగా నువ్వు గ్రహించలేని పక్షంలో స్వామీ!

నీపైన అక్షింతలు వేయమంటావా లేక చేతికి తాంబూలము అందివ్వనా? నీవు వేసే ఈ నాటకాలకు నన్నెందుకు బ్రతిమాలుకుంటావు? ఈ మాట నీ వెనుకనే పొంచి ఉన్న అమ్మయిని అడుగరాదా? ఒకవేళ తప్పేదో ఒప్పేదో తెలిసికోలేనంత అమాయకుడవైతే స్వామీ!

నీకు సర్వం వశమై కౌగలించుకోమంటారా? ఓ శ్రీవేంకటేశ్వరా! నా చెక్కిలి నొక్కుతావు. దీనికి అర్థం నువ్వు దాచిన ఆ పడతిని అడుగవచ్చు గదా! ఒకవేళ నీకు చెప్పరాని సిగ్గులధికమై అలుముకుంటేను స్వామీ!

**విశేషాంశం:** అన్నమయ్య ప్రతి చరణంలోను శ్రీనివాసుడు ఎవరో ఒక లలనను దాచి ఏమీ ఎరుగనట్టు అలమేలుమంగమ్మతో నటించే దృశ్యాన్ని, తలుపుమాటునున్న తరుణి, వెనక దిక్కు ఇంతి, దాపిరము పడతి అంటూ అందంగా చిత్రీకరించాడు.

## 211

**అవతారిక:** స్వామి చేసే అకార్యాలన్నీ తెలిసికూడా తెలియనట్టుగా నటిస్తూ, అనేకవిధాల పొగుడుతూ, తప్పంతా చెలులదే సుమా! అంటూ నేరాలన్నీ వారిపైకి నెట్టి, స్వామిని ప్రసన్నం చేసుకోవడానికి యత్నిస్తున్నది నాయిక.

### శుద్ధవసంతం

ప. మంచివాఁడవే నీవు మావాఁడవు
అంచెలనేల గుక్కేవాడవయ్య మాట ॥పల్లవి॥

1. ఆగడాలేలల సేసే వటువంటివాఁడవా
మీగుణా లైమైనాను మే మెఱఁగమా
నీగుఱు తెఱఁగలేక నిందలాడిరి చెలులు
యీగతి నేఁటికి వంచే వెత్తవయ్య శిరసు ॥మంచి॥

2. నేరములు నీకున్నవా నీయందు నేమి గడమ
గారనవునీచేఁతలు కన్న వే కావా
దూరిరింతే నిన్నిందరు తుదమొద లెఱఁగక
నారుకొన్న చింత యేల నవ్వవయ్య సెలవి ॥మంచి॥

3. బొంకనేరుతువా నీవు పొందుగా మమ్మేలితివి
కొంకేల శ్రీవేంకటేశ కొస రున్నదా
సంకించక నిన్ను నిట్టె సాదించిరింతేకాక
బింకపుగుట్టేమిటికి పెట్టువయ్య సేస ॥మంచి॥

**అర్థములు:** ప. అంచ= సమీపము, కుక్కు= బలవంతముగాజేయు.

1. ఆగడాలు= చేయకూడనిపనులు, గుణము= స్వభావము, నింద= అపవాదు.
2. కడమ= కొరత, గార= మరక, దూరు= ప్రవేశించు, తుదమొదలు= మొదలు చివర, నారుకొను= ఏర్పడు, సెలవి= పెదవిమూల.

3. బొంకు= అబద్ధము, కొంకు= సంకోచము, కొసరు= కోరిక, సంకించక= శంకించక, సాదించు= నిందించు, బింకము= నిక్కు, గుట్టు= రహస్యము, సేస= అక్షింతలు.

**భావము:** ఓ స్వామీ! నీవు ఎంతో ఉత్తమమైన గుణములున్నవాడవు. మా వాడివి కదా! మరి ఎందుకిలా దగ్గర చేరి బలవంతంగా మాట మీద మాటలు మాట్లాడుతున్నావు?

ఏమైనా చేయకూడని అకార్యాలు చేసే వాడవా అంటే కాదు. నీ గుణగణాలన్నీ మాకు తెలియనివా స్వామీ! నీ విషయం సరిగా అర్థంచేసుకోలేని చెలులు ఏవో అపవాదులు నీ మీద వేశారు. దీనికే అంత బాధపడి తలవంచుకొని కూర్చోవడమెందుకు? తలెత్తి మాట్లాడవయ్యా స్వామీ!

నీవేమైనా అపరాధాలు చేసేవాడివా అంటే కాదు కదా! ఇంకేమిటి కొరత చెప్పండి. మరకలంటేవిధంగా చేసే నీ కార్యాలు అందరికి తెలిసినవే కదా! నీ వద్దకు మొదలు కొసా తెలియకుండానే  ఆరాటపడి వస్తుంటారు. నీకిప్పుడేర్పడిన ఆలోచనలు సమస్యలు ఏమిటి? కొంచెం పెదవిమూల నవ్వులు కురిపించవయ్యా స్వామీ!

నీవేమైనా అబద్ధాలు చెప్పి, అకార్యాలు చేసేవాడివా అంటే కాకపోగా మమ్మేలుకుంటున్న వాడివి.  ఓ శ్రీవేంకటేశ్వరా! ఇంకా ఈ సంకోచాలెందుకు? ఏమైనా కోరికలున్నవా చెప్పండి. నిన్ను అనుమానించకుండా చెలులు ఏదో కొంత ఇబ్బందులు పెట్టిన మాట నిజమే కానీ, ఇంకా నిక్కుతో రహస్య వ్యవహారాలెందుకు? అక్షింతలు వేయవయ్యా స్వామీ!

## 212

**అవతారిక:** స్వామి పూర్తిగా ఒక అన్యకాంత భ్రమలో పడి తాను చేసే మరుగులేని కార్యాలను, చెలులు చూసి ఆటపట్టిస్తున్నరన్న సంగతి గమనించిన అమ్మ , స్వామిని ఇది సబబేనా? అని ప్రశ్నిస్తున్నది.

### ముఖారి

ప. ఏమి సేయవచ్చు నిఁక నియ్యకొనవలెఁ గాక
దీమసపు టాసలే కా దిమ్మరిఁ జేసినవి ॥పల్లవి॥

1. చెలరేఁ గాపె సుద్దలే చెప్పేవు పలుమారు
చెలులతోనెల్లా నీవు సిగ్గువడక
నలువంక సవతులు నవ్వే రిందురు నిన్ను
వలపుగా నిన్ను నింత వాఁటము సేసినది ॥ఏమి॥

2. సూటిగా నాపెమెట్టెలు చూపేవు నీవేలఁ బెట్టి
చీటికిమాటికి నీవు సిగ్గుపడక
చాటువగా నండవారు సన్న సేసే దెఱఁగవు
పాటించి మనసేకా పచ్చిగాఁ జేసినది ॥ఏమి॥

3. వడి నాపెకుఁ బూనుక వచ్చేవు శ్రీ వేంకటేశ
చిడుముడి నన్నేలితి సిగ్గువడక
పడఁతులు నీచేఁతలు పట్టి ఇచ్చేది యెంచవు
కడఁగి నీవయసేకా కళలు నించినది ॥ఏమి॥

**అర్థములు:** ప. ఇయ్యకొను= సమ్మతించు, దీమసము= ధైర్యము, దిమ్మరి= భ్రమకలిగించు.

1. చెలరేగి= విజృంభించి, ఆపె= ఆమె, సుద్ద= మంచి మాట, వాటము= అనుకూలము.
2. సూటిగా= నేరుగా, ఆపె= ఆమె, వేలబెట్టి= వేలుతో చూపించు, చాటువ= పోలిక, అండ= సమీపము, సన్న= సైగ, పచ్చి= మరుగులేనిది.

3. వడి= వేగము, ఆపె= ఆమె, పూనుక= ఉపక్రమించి, చిదుముడి= తొట్రుపాటు, కడగి= పురికొల్పు, కళలు= శృంగార కళలు.

**భావము:** స్వామీ! చేయగలిగినది ఏమున్నది? అన్నిటికీ సమ్మతించవలసినదే తప్ప! నీ మితిమీరిన సాహసాలే కదా ఇలా భ్రమలలో ముంచెత్తినది.

స్వామీ! చెలులతో విజృంభించి ఎల్లవేళలా, ఏమాత్రం సిగ్గుపడకుండా, ఆమెను గురించిన కబుర్లే మాటి మాటికి చెప్తుంటావు. నాలుగుప్రక్కలా ఉన్న చెలులు నవ్విపోతారన్న అలోచనే లేదాయ మీకు. ఆమె ప్రేమే కదా నిన్నీ స్థితికి తెచ్చినది.

స్వామీ! ఏమాత్రం సిగ్గుపడకుండా నీ వేలుపెట్టి ఆమె మెట్టెలను చూపిస్తూ ఉంటావు. నీ చాటుమాటున ఉన్నవారు సైగలు చేసుకొని చిరునవ్వులు చిందిస్తూ నువ్వు చేసే పనులు చూస్తున్నారన్న ధ్యాసే నీకు లేదాయ! ఆమె మనసేగా మిమ్ములను మోహంలో ముంచెత్తి మరుగుకూడాలేకుండా ఇలాంటి పనులన్నిటనీ చేయిస్తున్నది.

ఓ శ్రీవేంకటేశ్వరా! ఆమెను కూడి శీఘ్రముగా వచ్చి తొట్రుపాటుతో వ్యవహరిస్తూ నన్నేలుకుంటావు. ఆ స్త్రీజనమంతా నీ చేతలు గమనించి నిన్ను  ఆట పట్టిస్తున్నారన్న ఎరుకే మీకు లేదాయ! ఇలాంటి శృంగార కార్యాలకు పురికొల్పే కారణం మీ వయసే కదా  స్వామీ!

**విశేషాంశం:**

1. అన్నమయ్య ఈ కీర్తనలో స్త్రీల కాలి మెట్టెల ప్రసక్తి చేశాడు. స్త్రీల ఆభరణాలన్నీ ఏకరువు పెట్టడం అనేక కీర్తనల్లో చూస్తాం. అందెలు, ఆలవట్టము, ఉంగరాలు, ఒడ్డాణము, చమ్మాళిగలు, గజ్జలు, గదరుబిళ్ళలు, కౌస్తుభమణి ఇలా అనేక ఆభరణాల ప్రసక్తి ఉంది. ఇవన్నీ ఆనాటి స్త్రీల ఆచార వ్యవహారాలు మనకు అద్దం పడతాయి.
2. ఈ కీర్తనలో "కదా!" అన్న మాటకు "కా!" అన్న అవ్యయము వాడడం కీర్తనకు శోభనిచ్చింది.

## 213

**అవతారిక:** స్వామివారు ఏవో కొన్ని అకార్యాలు చేయడం, అమ్మ వాటిని గురించి స్వామికి నివేదించుకోవడం, నిలదీయడం షరా మామూలైన పరిస్తితులలో ఒక సారి అలమేలుమంగమ్మ స్వామివారితో మృదుమధురంగా చెప్తున్న సంగతులు.

### దేశాక్షి

ప. మాపు దాఁకా నేమిచెప్పే మఱియును నేనిఁక
ఆ పనికి లోనైవుండుటది మేలు నాకు ॥పల్లవి॥

1. ప్రియపడి నీతో నింత పెనఁగ నే మున్నది
నయగారిమాటలకు నగుతగాక
నియతాన నడవఁగా నీకు బుద్ది చెప్పేనా
అయినట్టయిన నీవుండు టదిమేలు నాకు ॥మాపు॥

2. సారెసారె నే నిన్ను సాదించఁగా నేమివచ్చీ
మేరతో నీచేఁతలెల్లా మెచ్చుటగాక
వోరలేక వండఁగాను వొడఁబరచవచ్చేనా
ఆరతి నీ యిచ్చనుండు టదిమేలు నాకు ॥మాపు॥

3. శ్రీవేంకటేశ నీతోడ సిగ్గువడఁ బనియేమి
భావించి నిన్నుఁ గూడుటే పంతముగాక
నీవొళ్ళ లేనిగుణము నేఁ జేసిపెట్టేనా
ఆవటించి నమ్మివుండు టదిమేలు నాకు ॥మాపు॥

**అర్థములు:** ప.మాపు= రాత్రి, సాయంత్రము, మేలు= ఉపయోగము.

1. ప్రియపడి= ఇష్టపడి, పెనగు= చుట్టుకొను, నయగారి మాటలు= మృదుభాషణములు, నగుత= నవ్వుట, నియతము= నియమము.
2. సారె సారె= మాటి మాటికి, సదించు= నిందించు, మేర= మర్యాద, ఓరలేక= ఊరుకోలేక, ఒడబడుచు= అనుకూలించు, ఆరతి= హారతి, ఇచ్చ= అపేక్ష.
3. పంతము= పట్టుదల, కోరిక, వొళ్ళ= వల్ల, నేజేసిపెట్టేనా= నేను చెప్తున్నానా?, ఆవటించి= పొందుపడి, నమ్మి= విశ్వసించి.

**భావము:** స్వామీ! పొద్దుగూకులూ నీకు ఏమి చెప్పగలము? ఇంకనేను వేరే పనులన్నీ మానుకొని ఆపని మీదే ఉండడమే అవుతుంది.

ఇష్టపడిన నీతో ఈ విధంగా మారాడుతూ ఉండడమెందుకు? నీ మృదుసంభాషణలు విన్నవారెవరైనా నవ్విపోగలరు. ఒక నియమం ప్రకారం ఉంటే నీకు ఇలా బుద్ధి చెప్పవలసిన అవసరం ఉండేదా? ఆ మాదిరిగానే నీవు ఉండడం నాకు ఉపయోగం కదా!

మాటిమాటికీ వచ్చి నిన్ను నిందించడానికి నాకు వేరే పనులు లేవా? మర్యాదగా నే నీ కార్యాలన్నీ మెచ్చవలెను గదా! పొద్దూరాత్రి ఊరక ఉండలేక సమ్మతించడానికై మాట్లాడానికి వచ్చేదాననా? నీకు హారతులనిచ్చి నీపై అపేక్షగా ఉండడమే నాకు మేలు కదా!

ఓ శ్రీవేంకటేశ్వరా! నీతో సిగ్గుపడవలసిన పని ఏమీ లేదు. పట్టుదలతో నిన్ను మెప్పించి నిన్ను చేరడమే నా పరమావధి. నీకు లేని మంచిచెడ్డలనే గుణగణాలు నేను ఏకరువు పెడతానా? నీతో పొందుపడి నిన్ను విశ్వసించి నీకు సేవచేసి తరించడమే నాకు చాలు.

**విశేషాంశం:** అన్నమయ్య ఈ కీర్తనలో నగుత గాక, మెచ్చుట గాక, పంతము గాక అనే అంత్యప్రాసలే గాక, పల్లవితో సహా అన్ని చరణాలలో "అది మేలు నాకు" అనే అంత్యప్రాసలు చరణాంతములలో ఉపయోగించడం విశేషం.

## 214

**అవతారిక:** స్వామివారితో చనువుగా మసలే విషయంలో అమ్మకు తోడి చెలికి ఏదో భేదాభిప్రాయం వచ్చింది. అలమేలుమంగమ్మ చెలిని తిట్టి తూర్పారబడుతూ నిందారోపణలకు దిగింది.

### మాళవిగౌళ

ప. చెప్పవద్దా బుద్ధులు నీచెలువునికి
వుప్పతించ కేలుంటివే వొడివట్టఁగాను ॥పల్లవి॥

1. విందువలె నాతనిచే విడెము నే నందుకోఁగా
సందుడి నీవేల జరసేవే
పొందుసేసి నీవింతేసి పూనుక వచ్చేదానవు
యెందుంటివే నన్నతఁడు యేలుకొనఁగాను ॥చెప్ప॥

2. వొద్దనుండి నేనాతని కూడిగాలు సేయఁగాను
గద్దించి నీవేఁటికిఁ గాఁతాళించేవే
సుద్దులే చెప్పుచు వట్టిసూడు వట్టేదానవు
తిద్దుకోవద్దటవే యీ తెరవు రాఁగాను ॥చెప్ప॥

3. గక్కన శ్రీవేంకటేశుకాఁగిట నేఁ గూడఁగాను
వెక్కసాన నేమిటికి వెరగందేవే
అక్కరతో నెడచొచ్చి ఆయాలంటేదానవు
మొక్కి వేఁడుకొనవదా ముందుముందుగా ॥చెప్ప॥

**అర్థములు:** ప. చెలువుడు= ప్రియుడు, ఉప్పతించు= నిందారోపణము చేయు, ఏలంఉంటివే= ఎలా ఉన్నావు?, వొడివట్టగాను= యత్నించు.

1. విడెము= తాంబూలము, సందుండు= మధ్యలో ఉండు, జరయు= నిందించు, పూనుక= పనిచేయ యత్నించు, ఎందుంటివి= ఎక్కడ ఉన్నావు.
2. ఒద్ద= సమీపము, ఊడిగాలు= సేవలు, గద్దించి= భయపెట్టు, కాతాళించు= కోపించు, సూదు= పగ, తిద్దుకొను= సరిదిద్దుకొను, తెరవు= రీతి.
3. గక్కన= వెంటనే, కాగిట= కౌగిట, వెక్కసాన= ఎక్కువగా, వెరగందు= ఆశ్చర్యము, అక్కర= అవసరము, ఎడ= స్థానము, ఆయాలు= మర్మస్థానాలు, వేడుకొను= ప్రార్థించు.

**భావము:** ఓ చెలీ! నీ ప్రియుడికి అన్నీ చెప్పాలిగదా! ఇంకా నిందలు వేయడానికి ప్రయత్నము చేయకుండా ఎలా ఉన్నావే!

విందుమాదిరిగా నేనాతని చేతి తాంబూలమును అందుకొనగా, మధ్యలో చేరి నీవు ఎందుకు మాట్లాడవే? ఆయనతో స్నేహం నడిపి నీవింతగా పనిచేయడానికి ముందుకొచ్చేదానివి, నన్నాతడు యేలుకొనడానికి వచ్చినప్పుడు ఎక్కడ ఉన్నావు?

నేను స్వామి వద్దనే ఉండి సేవలు చేస్తూ ఉండగా, భయపెట్టి నీవెందుకు కోపపడుతున్నావు. ఎప్పుడూ మంచి మాటలే చెప్తూ తెలియని పగను పెంచుకొన్నట్లున్నది. మంచిగా ఈ తీరుకు వస్తున్నప్పుడునీ పద్ధతి మార్చుకొని దిద్దుకోవదా?

నేను శీఘ్రమే స్వామి కౌగిట్లో చేరినప్పుడు, అంత అధికాశ్చర్యం ప్రకటిస్తున్నావెందుకు? అవసరంతో వచ్చి స్వామివారి స్థానానికి వచ్చి మాటిమాటికి ఆయన్ను రాచుకొని పూసుకొని తిరిగేదానవు. ముందుగానే ఆయనకు నమస్కరించి ఆయనకు నీ ప్రార్ధనలు వినిపించలేవా !

## 215

**అవతారిక:** స్వామి దేవేరిపట్ల ఎందుకో పరాకు చూపిస్తుండగా, చెలి స్వామిని ప్రస్తుతిస్తూ, ఆమెను చేపట్టి నీ దొరతనాన్ని నిలుపుకోవయ్యా అని ప్రార్థిస్తున్నది.

### బౌళి

ప. దొడ్డవాఁడ వవుదువు దొరతనములు చెల్లు
వెద్దువెట్టి వేఁడుకొని విచారించరాదా ॥పల్లవి॥

1. యేమిటికిఁ దలవంచే వెక్కడిపరాకు నీకు
కామిని నీచేతికిఁ గానుకియ్యఁగా
వాములుగా నీమీఁద వలపులు దొంతివెట్టి
మోము చూచీఁ జిత్తగించి ముచ్చటాడరాదా ॥దొడ్డ॥

2. సిగ్గులేల నెరపేవు చిరునవ్వు లేలవచ్చె
వెగ్గళించి యాపె నీకు తమకము వడ్డికిచ్చి
తగ్గుమొగ్గులేక నీకు విందుచెప్పఁగా
యెగ్గులేనిముచ్చ టాడీ నిచ్చగించరాదా ॥దొడ్డ॥

3. నీటులేల చూపేవు నీకునీకే అలసేవు
గాఁటపురతులఁ గూడి కాఁగిలించఁగా
పాటించి శ్రీ వేంకటేశ పాయము తరపువెట్టి
మేటిపంతములు చూపీ మేల మాడరాదా ॥దొడ్డ॥

**అర్థములు:** ప.దొడ్డవాడు= మంచివాడు, దొరతనము= ప్రాభవము, వెడ్డువెట్టు= మోసగించు, వేడుకొని= ప్రార్థించి, విచారించు= మంచిచెడ్డలు తెలుసుకొను.

1. పరాకు= అన్యచింతన, కానుక= బహుమతి, వాములు= అధికముగా, వలపు= ప్రేమ, దొంతి= వరుస, చిత్తగించు= ఇష్టపడు.
2. నెరపు= చేయు, వెగ్గళించి= అధికము, ఆపె= ఆమె, తమకము= మోహము, వడ్డికిచ్చి= అధికమయేట్టు, మొగ్గు= సరి తూకము, ఎగ్గు= అపరాధము, ఇచ్చగించు= ఆసక్తి కనబరచు.
3. నీటు= మురిపెము, నీకు నీకే= నీకు నువ్వే, అలయు= శ్రమపడు, గాటపురతి= అధికమైన శృంగారక్రీడ, కాగలించు = కౌగలించు, పాటించు= ఆదరించి, పాయము= వయసు, తరపు= పోగొట్టు, మేటి= శ్రేష్టము, మేలమాడు= పరిహసించు.

**భావము:** స్వామీ! మంచి శ్రేష్టుడవు అవుతావు. మంచి ప్రాభవము నీకు సంప్రాప్తిస్తుంది. ఆమెను కాస్తా మభ్యపెట్టి వేడుకొని, మంచి చెడ్డలు తెలుసుకొనవచ్చును గదా!

ఆ భామ నీ చేతికి ఏదో బహుమతినివ్వగా, ఎందుకో అర్థంగాని పరధ్యాన్నంతో, పరాకుగా తలను వంచుకొని ఆలోచిస్తూ ఉంటావు. అత్యధికమైన ప్రేమాభిమానములు చూపించి, ఆమె ముఖారవిందాన్ని ఇష్టపడి నాలుగు ముచ్చట్లు చెప్పరాదా!

స్వామీ! ఆమె తన మోహాన్ని నీకు ఇంతింతవునట్లుగా చూపిస్తూ ఉండగా, సిగ్గులు చిందిస్తూ చిరునవ్వులు నవ్వడమెందుకు? ఆమె నీకు విందు చేయ పూనుకోగా, ఏ అపరాధమూ లేని ముచ్చట్లు చెప్పి ఇష్టం చూపరాదా!

స్వామీ! ఎక్కడా లేని మురిపెములన్నీ చూపిస్తావు. నీకు నువ్వే ఊరకే అలసి సొలసి పోతుంటావు. ఆమె కౌగిట శృంగార క్రీడల్లో తేలియాడించగా, ఓ శ్రీవేంకటేశ్వరా! నువ్వా అదేవిధముగా నీ వయసుతో ఆమె శ్రమను మరిపించి, శ్రేష్టమైన నీ పంతాలు పట్టింపులూ చూపించి ఆమెతో కాస్తా పరిహాసపు మాటలు మాట్లాడరాదా!

## 216

**అవతారిక:** శ్రీనివాసుడు శ్రీదేవి, భూదేవి ఇద్దరికి సమానగౌరవాలు ఇచ్చిన విషయం తెలిసిందే! అయినా స్త్రీ సహజ ఈర్ష్యతో శ్రీదేవి తాను పట్టపురాణినని, తనకు ప్రత్యేక స్థానం ఉండాలని భావిస్తూ, స్వామివారితో సంభాషణ చేస్తున్నది.

### పాడి

ప. ఇద్దరము నున్నారము యిరుదిక్కులా నీకు
పెద్దరికముతోడనే పెనఁగఁగవలెను ॥పల్లవి॥

1. ఆకె నొడఁబరమకో అంకెకు వచ్చినదాఁకా
నాకేమి చెప్పేవు నమ్మినదాన
శేకరమాయ వలపు సిగ్గులు వడితేఁ బోదు
చేకొలఁదిఁ బ్రియములు చెప్పవలె నిఁకను ॥ఇద్దరము॥

2. పూని యాకెనే నీవు బుజ్జగించి పిలుచుకో
నేనెప్పుడుఁ దొలుతనే నీదానను
నానాఁడే పెండ్లాడి నవ్వులు నవ్వితేఁ బోదు
తేనేమోవి యిచ్చి తరితీపు చూపవలెను ॥ఇద్దరము॥

3. యింటిలో నాకెఁ గూడితి విందాఁకాఁ గాఁగిట నించు(కో?)
జంటయి నేఁ గూడితి నిచ్చకపుదాన
వెంటనే శ్రీవేంకటేశ వేసాలు నేసితేఁ బోదు
అంటువాయ కిట్లానే ఆదరించరాదా ॥ఇద్దరము॥

**అర్థములు:** ప. ఇరుదిక్కుల= రెండువైపుల, పెద్దరికము= గౌరవము, పెనగు= కలియు, చుట్టుకొను.

1. ఆకె= ఆమె, ఒడబరము= ఒప్పించు, అంకె= వశము, శేకరము (శేఖరము)= శిరోభూషణము, చేకొలది= చేపట్టినంత, ప్రియములు= వలపు మాటలు.
2. పూని= యత్నముతో, ఆకె= ఆమె, బుజ్జగిగించి= లాలించి, బ్రతిమాలి, నానాడు= ప్రతిదినము, తేనెమోవి= అధ్రామృతము, తరితీపు= అపేక్ష.
3. ఆకె= ఆమె, కూడివి= పొందుకొంటివి, కాగిట= కౌగిట, కూడితి= కలిసితి, ఇచ్చకము= ప్రియము, వేసాలు= మాయలమారి, అంటువాయ= సంబంధము వదలకుండా, ఆదరించు= గౌరవించు, సమ్మానించు.

**భావము:** ఓ స్వామీ! నీకు ఇరువైపులా శ్రీదేవి, భూదేవి అనే పేర్లతో ఇద్దరము ఉన్నాము. నీవు గౌరవముతో మాతో ప్రవర్తింపవలెను.

ఆమె నీ వశమైనదాకా ఆమెను ఒప్పించుకో! మరి నాకేమని చెప్తావు, నేను ముందే నీకు వశమై యున్నదానను కదా! ఈ ప్రేమాతిశయం అనేది శిరోభూషణం వంటిది సుమా! సిగ్గుపడినంత మాత్రాన వీడుతుందా? చేపట్టిన నీవు ఇంక వలపు మాటలు చెప్పవలెను కదా!

ప్రయత్నించి ఆమెను లాలించో, బ్రతిమాలో మరో విధంగానో పిలిచి నీకు కైవశం చేసుకో! నేనెప్పటికి పూర్వమునుండి నీ దాననే కదా! ప్రతిదినము పెండ్లాడి నవ్వులు నవ్వితే సరిపోతుందా స్వామీ!

ఇంటిలో చేరి ఇంతవరకూ ఆమెను పొందుకున్నావు కదా! ఆమెను కౌగిలిలో బంధించండి. మరినేను నీకు జతగా కూడి ప్రీతితో ఉన్నదానను. ఓ శ్రీవేంకటేశ్వరా! ఏవో మాయ నాటకాలు వేస్తే సరిపోతుందా? మమ్ములను విడిపోకుండా ఇలానే ఆదరించి గౌరవాభిమానాలను చూపించరాదా!

**విశేషాంశాలు:**

1. మొదటి చరణములో "శేఖరమాయ" అనే పదాన్ని మార్చి, ప్రాస కొరకు అన్నమయ్య శేకరమాయ అని ప్రయోగించాడు. శేఖరము అనగా సిగదండ. బాసికదండ, కిరీటము, శిఖరము అని పలు అర్థాలున్నాయి. అన్నమయ్య వాడిన ఈపదాన్ని కొండల (శిఖరము)రాయుని మాయ అని ఉపయోగించుకొన్నా లేక శిరోభూషణము అన్న అర్థంతోనూ ఉపయోగించుకోవచ్చు.
1. నానాడే పెండ్లాడి అని అన్నమయ్య అనడం గమనిస్తే, దినదినమూ అనగా నిత్య కల్యాణం జరిగేదని తెలుస్తోంది. అంటే 15వ శతాబ్దంలో తాళ్లపాక వంశస్థులచే ఈ కల్యాణోత్సవం ఆరంభించబడినట్లు శాసనాలవల్ల తెలుస్తోంది. తాళ్లపాక వంశస్థులే నేటికీ కన్యాదాతలుగా వ్యవహరించటం గమనార్హం. అయితే క్రీ. శ 1546లో ఇదొక ఉత్సవంగా మారింది. శ్రీదేవి, భూదేవి సమేతుడైన శ్రీమలయప్పస్వామికి ప్రతినిత్యం కల్యాణోత్సవం జరుగుతుంది. రెండవ అర్చన, గంట, నివేదన పూర్తయిన తర్వాత శ్రీవారి ఉత్సవమూర్తులు సకల రాజమర్యాదలతో తిరుచ్చిని అధిరోహించి, ఆనందనిలయం నుండి సంపంగి ప్రదక్షిణలో గల కల్యాణమండపానికి తరలివస్తారు.

## 217

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మపై ఎందుకో స్వామి కినుక బూనాడు. అమ్మ స్వామిని బ్రతిమాలి ఇలా చేయడం న్యాయమా? బంధుత్వంతో చేరదీయవలెనని కోరుతున్న దృశ్యం.

## దేసాళం

ప. పాయపు మదములేల పచారించేవు
చాయలా సన్నలా నిట్టె జట్టిగొనరాదా ॥పల్లవి॥

1. చలము సాదింతురా సతులపై విభుఁడవు
వలచి ప్రియము చెప్పవలెఁగాక
తొలుతే నమ్మించి తెచ్చి దోసము గట్టుకోనేల

చెలియచనవు నేఁడు చెల్లించరాదా ॥పాయపు॥

2. అట్టుగాఁ జేయుదురా గుట్టున రామల నీవు
చుట్టరికమై నయము చూపుట గాక
వట్టియాసలనుఁ బెట్టి వలవంత నేఁచనేల
ఇట్టె కొంతకోరిక యీడేర్చరాదా ॥పాయపు॥

3. తగవులఁ బెట్టుదురా తరుణుల నింతేసి
తగినరతులఁ గూడి దక్కుట గాక
మిగులా శ్రీ వేంకటేశ మెచ్చి గుట్టుసేయనేల
మగువఁ గూడితి విట్టె మన్నించగాదా ॥పాయపు॥

**అర్థములు:** ప.పాయము= యౌవనము, మదము= గర్వాతిశయము, పచారించు= తిరస్కరించు, చాయలు= శోభ, సన్నలు= సైగలు, జట్టిగొను= మొత్తముగా వశపరచుకొను.

1. చలము= కంపము, దోసము= పాపము, చనవు= కోరిక, చెల్లించు= తీర్చు.
2. రట్టు= నింద, రామల= కోరిన స్త్రీ, ఏచు= బాధించు, ఈడేర్చు= తీర్చు.
3. దక్కు= పొందు, మిగుల= మిక్కిలి, గుట్టు= దాపరికము, మన్నించు= గౌరవించు.

**భావము:** ఓ శ్రీనివాసా! యౌవన మద గర్వాతిశయముతో నన్నిలా తిరస్కరించడం తగునా? మాకు నువ్వు చూపించే శోభలా, సైగలా ఏమున్నవి? నన్ను ఇట్టే వశపరచుకోరాదా!

అసలు భర్త అనే వాడు సతులకిలా వణకు, కంపము పుట్టిస్తాడా? ప్రేమించి బుజ్జగించి ప్రియవచనాలు చెప్పాలిగానీ, ముందు నమ్మించి, ఇలా పాపము కట్టుకోవడం తగునా స్వామీ! చెలియకు ప్రేమ కలిగించి నీ కోర్కెలు తీర్చుకో రాదా!

నిందల పాలు చేసి కోరివచ్చిన స్త్రీని ఇలా బాధిస్తారా? బంధుత్వంతో మృదువుగా వ్యవహరించవలెను కదా! నెరవేరని ఆశలతో మా ప్రేమనంతా ఇలా బాధించడం సబబైన విషయమేనా?

తరుణులతో ఇలా తగాదాలు పెట్టుకుంటారా స్వామీ రతిక్రీడలలో తేలియాడించవలెను కదా! ఓ శ్రీవేంకటేశ్వరా! మెచ్చి ఇలా రహస్యాలన్నీ బట్టబయలు చేయడం సరైన పనేనా? మగువనైన ఇప్పుడే పొంది మన్నన చూపరాదా!

## 218

**అవతారిక:** చెలులు అమ్మను ఏమాత్రం సిగ్గుపడకుండా నీకు అధీనుడైన స్వామిని కైవశం చేసుకొని మమ్మలను కూడా ఉద్ధరించమని ప్రార్థించవలసినదిగా వేడుకొంటున్న దృశ్యం.

### అమరసింధు

ప. సిగ్గుపడితేఁ బోదు చెప్పేము నీకుఁ బ్రియము
తగ్గక నీమాట జవదాఁటకున్నాఁ డతఁడు ॥పల్లవి॥

1. మన్నించి నన్ను నిట్టె మచ్చికతో నేలుమని
విన్నవించవమ్మా విభునికిని
పన్ని ఇన్నిటా నీవు పట్టపుదేవులవు
కన్నెరో నీయప్పణకుఁ గాచుకున్నాఁ డతఁడు ॥సిగ్గు॥

2. దట్టముగా నేఁడు మమ్ము దయతో రక్షించుమని
కట్టడ సేయవమ్మా కాంతునికి
అట్టేనీవు మొదల మోహపుఁబెండ్లికూఁతురవు

యెట్టైనా నీ పంపుసేయ నెంచుకున్నాఁ డతఁడు ॥సిగ్గు॥

3. చేకొంటి వతని నీవు చేరి నన్నుఁ గూడుమని
కై కొలుపవమ్మా శ్రీవేంకటపతికి
నీకరుణవారము నీ వేలికసానివి
యీకడ నాయింటిలో నీయింపు చూపీ నతఁడు ॥సిగ్గు॥

**అర్థములు:** ప.పోదు= సరిపోదు, ఏమాత్రం జవదాటు= అతిక్రమించు.

1. మచ్చిక= మోహము, విన్నవించు= వినతిజేయు, విభుడు= భర్త, ప్రభువు, పన్ని= సిద్ధపడి, పట్టపు దేవులవు= పట్టపు రాణివి, అప్పణ= ఆజ్ఞ, ఉత్తరువు, కాచుకొను= ఎదురు చూచు.
2. దట్టము= అధికము, కట్టడ= నియమం, కాంతుడు= మగడు, పంపుసేయు= ఆజ్ఞాపించు.
3. చేకొను= గైకొను, చేపట్టు, కైకొలుపు= ధైర్యము జెప్పు, కరుణ= దయ, ఏలికసాని= దొరసాని, రాణి, ఇంపు= ప్రేమ.

**భావము:** అమ్మా! ఊరక సిగ్గులొలకబోస్తూ ఉంటే సరిపోదు. నీకు చెప్పే మంచి మాటలను ఆలకించు. నీ మాటలను అతిక్రమించకుండా ఉన్నాడు నీ భర్త.

నీ విభునికి నిన్ను మన్నించి మోహముతో నేలుకొనమని విన్నపాలు చేసుకో. నీవు పట్టపురాణివన్న సంగతి మరువకు, నీ ఉత్తరువులకోసమే నీ భర్త ఎదురు చూస్తున్నాడు.

నీ నాధుడికి మమ్మలందరిని ఎక్కువ దయచూపి కాపాడమని నియమం పెట్టవమ్మా! నీవు మొట్టమొదటినుండీ కూడా ఆయన మోహించిన పెండ్లికూతురివి. ఏవిధంగానైనా సరే నీ యాజ్ఞ అయితే చాలని ఎదురుచూస్తున్నాడు నీ మగడు.

పొందుకోరి ఆతనిని చేపట్టుటకై నీవు వేచి ఉన్నావు. ఆ శ్రీవేంకటేశ్వరుని కొంచెం ప్రియవచనాలు చెప్పి నీ ఆధీనం చేసుకో! మేమంతా నీ దయా దాక్షిణ్యములతో బ్రతుకుతున్న వారము తల్లీ! నీవాయనకు పట్టపు రాణివి. నీ ఇంటిలో స్వామి నీమీద ఇష్టముతో, ప్రీతితో విచ్చేసి యున్నాడు తల్లీ!

## 219

**అవతారిక:** శ్రీనివాసుని స్వభావం అమ్మకు తెలియరాకున్నది. ఒక్కో సారి ఒక్కోవిధంగా ప్రవర్తిస్తున్న స్వామిని చూసి ఇలా ఉన్నావేమయ్యా అని అడుగుతున్నది.

## పాడి

ప. సాదుఁగొయ్య వైనాఁడవు సరికి బేసికి నీవు
యేది నిజ మేది గల్ల యేమిసేతునయ్యా ॥పల్లవి॥

1. బిగియరాదు నీకుఁ బ్రియము చెప్పఁగరాదు
నగరాదు చూపులు నాటించరాదు
సగము మంచితనము సగము బింకము చూపే
వెగసక్కెవువిభుఁడ వేమి సేతువయ్యా ॥సాదు॥

2. బొమ్మల జంకించరాదు పొందులు చూపఁగరాదు
కెమ్మోవి యడుగరాదు కినియరాదు
దిమ్మరితనము గొంత దిట్టరాజసము గొంత
యెమ్మెకాఁడ వై నాఁడ వేమిసేతువయ్యా ॥సాదు॥

3. మచ్చిక మానరాదు మనసు సోదించరాదు

కొచ్చి శ్రీవేంకటేశుఁడ కూడితి నన్ను
పచ్చిసేఁతలు బాసలు నీవాకునను
యిచ్చకుఁడ వై నాఁడ వేమి సేతునయ్యా ॥సాదు॥

**అర్థములు:** ప.సాదుగొయ్య= పైకి సాధువుగా కనిపించి సరసుడుకాని వాడు, సరికిబేసికి= ఐనదానికి కాని దానికి.

1. బిగియు= బింకము, నగు= నవ్వు, నాటించు= నిలుపు, బింకము= గర్వము, ఎగసెక్కెము= పరిహాసము.
2. బొమ్మలు= కనుబొమ్మలు, జంకించు= అదరవేయు, పొందు= కూడు, కెమ్మోవి= అదరము, కినియు= కోపించు, దిమ్మరితనము= భ్రమ, దిట్టరాజసము= గర్వోన్నతి, ఎమ్మెకాడు= విలాసవంతుడు.
3. మచ్చిక= మోహము, సోదించు= పరిశీలించు, కొచ్చి= బాతాఖానీ, పచ్చిసేతలు= మరుగులేని పనులు, బాస= ప్రమాణము, వాకున= పలుకున, ఇచ్చకుడు= ముఖప్రీతిమాటలాడేవాడు.

**భావము:** ఓ స్వామీ! అయినదానికి కానిదానికి నీవు పైకి సాధువులా కనిపిస్తున్నావు. ఏది నిజమో ఏది అబద్ధమో తెలియడంలేదు స్వామీ! నీ స్వభావం ఏమిటో తెలియరాకున్నది.

కొంచెం బింకంగా ఉండకూడదు అలా అని ప్రియవచనాలు మాట్లాడకూడదు. నవ్వకూడదు నీమీద చూపులు నాటి ఉంచరాదు. నీలో సగం మంచితనము, సగము గర్వము కనిపిస్తూ ఉంటుంది. నేనేమి చేయగలనయ్యా! ఎల్లవేళలా పరిహాసాలాడే మగడవుగా ఉన్నావు.

కనుబొమ్మలను అదరవేసి మాట్లాడకూడదు, పొందు కోరకూడదు. అధరము అడగకూడదు అలాగే కొపము చూపకూడదు. నీలో మత్తును కలిగించే గుణము కొంత, గర్వోన్నతి చెందే రాజసం కొంతా ఉన్నది. విలాసవంతుడవై యున్నావు ఏమి చేయగలను.

మోహముతో ఏమీ మాట్లాడ కూడదు. మనసు నొప్పించి మాట్లాడ కూడదు. ఓ శ్రీవేంకటేశ్వరా! ఉత్త పనికి మాలిన కబుర్ల రాయుడివై నన్ను కూడుకున్నావు. అన్నీ మరుగులేని పచ్చి పచ్చి చేతల మాటలు. ముఖప్రీతి మాటలు మాట్లాడుతూ ఉంటావుంటావు. నేనేమి చేయగలను చెప్పు స్వామీ!

## 220

**అవతారిక:** స్వామి ఒక యువతితో గడిపిన మధుర క్షణాలు గుర్తుచేస్తూ పరిహాసం చేస్తున్నది ఒక చెలి.

### ఆహిరి

ప. చెప్పగదవయ్యా చెవులుచల్లఁగా వినే
దెప్పరపుఁ దలపోఁతే దిష్టమాయనో ॥పల్లవి॥

1. తిలకించి యాపె నీదిక్కు చూచితే నీవు
సెలవి నవ్వితి విట్టె సిగ్గుతోడను
యెలమిఁ దనమాటున నేమైనాఁ జేసితివో
చలివేఁడివలపులు సరివచ్చేనో ॥చెప్పు॥

2. విన్నపము లేకతాన వెలఁది నీకుఁ జేయఁగా
సన్నల జంకించితివి సరసానను
కన్నె యెవ్వతైనా వచ్చి కాచుకున్నదనేనో
నున్ననినీచెక్కు దననోరు సోఁకిపించెనో ॥చెప్పు॥

3. జవ్వని నీకాఁగిటను చన్నుల నొత్తితే నీవు
పువ్వుల వేసితివి నీపొందు చూపుచు
రవ్వగా శ్రీ వేంకటేశ రతి నలయించెనో

నివ్వటిల్లఁ జక్కఁగాను నిన్ను నెచ్చరించెనో ॥చెప్ప॥

**అర్థములు:** ప.తెప్పరము= నిశ్చింత, తలపోత= ఆలోచన, దిష్టము= భాగ్యము.

1. ఆపె= ఆమె, దిక్కు= వైపు, సెలవి= పెదవి మూల, ఎలమి= వికాసము, చలివేడి= శీతోష్ణ, సరివచ్చు= సమానమగు.
2. ఏకతాన= అనన్య చితన, వెలది= స్త్రీ, సన్నలు= సైగలు, జంకించు= అదిరించు, చెక్కు= చెక్కిలి, సోకింపించు= తగిలించు.
3. జవ్వని= యౌవనములో నున్న స్త్రీ, కాగిట= కౌగిట, చన్నులు= రొమ్ములు, పొందు= కూడిక, రవ్వ= అల్లరి, అలయించు= శ్రమపెట్టు, నివ్వటిల్లు= నెరవేరు, హెచ్చరించు= జ్ఞాపకము జేయు.

**భావము:** స్వామీ! వీనుల విందైన చల్లని వార్త చెప్పరాదా! నీ దివ్యమైన ఆలోచనలే మాకు భాగ్యాన్నిచ్చేవి, చింతలను దూరం చేసేవి కదా!

ఆమె ఒక్కసారి నువ్వు ఉన్నదిశగా చూసినట్లైతే, నీవు సిగ్గులు చిందిస్తూ పెదవిమూల నవ్వులు నవ్వుతావు. వికానముతో అతిశయించి ఆమె మరగున ఏమైనా చేశావో ఏమో! చలికి దగ్గ వేడిమి సరిపోయినదికదా!

ఆమె ఏవో విన్నపాలు నీకు చేసుకుంటూ ఉండగా, సరసముతో సైగలు చేసి భయము కలిగించావు. మీకొరకు ఏ కన్యయినా వచ్చి కాచుకుని ఉన్నదంటే, మీ నున్నని చెక్కిలిపై ఆమె నోరు తగిలి దంతక్షతాలు అవుతాయి కదా!

ఆ యౌవనవతి అయిన కాంత నీకౌగిట చేరి మీ వక్షోజాలను స్పృశించి, సుతారంగా వత్తినట్లైతే ఆమెకు నీ పొందునందిస్తూ పువ్వుల వర్షం కురిపిస్తావు. ఓ శ్రీవేంకటేశ్వరా! ఇంత అల్లరి చేతలతో రతిక్రీడలో శ్రమపెట్టావు. ఆ కోరిక నేరవేరిన తర్వాత ఆమె నీకు ఆ మధుర స్మృతులన్నీ జ్ఞాపకం చేస్తుందేమో కదా!

## 221

**అవతారిక:** స్వామి అమ్మపై ఎందుకో అలిగాడు. మనస్తాపం చెందిన అమ్మ చెలులతో ఆయనిలా ప్రవర్తిచడం ధర్మమా? అంటూ చెలులను ప్రశ్నిస్తున్నది.

### హిందోళవసంతం

ప. అడుగరే చెలులాల ఆసలేల పెట్టీని
యెడయక పెనఁగితే నిచ్చగించీనా ॥పల్లవి॥

1. నాలిసేసి నాతోను నమ్మికమాట లాడి
యేల బేరిజోకొట్టీనే యిప్పుడు తాను
వాలాయించి నేఁ గనక వలెనని పైకొంటేను
వోలి నన్నిటికీఁ దాను వొడఁబడీనా ॥అడుగరే॥

2. చాయలా సన్నలాఁ జూపి సారె నాతో నవ్వీని
ఆయి గిలిగించనేలే అట్టుతోఁ దాను
పాయక నేనందుకును బాఁతిపడి కొసరితే
నాయము దప్పక తాను నడఁపఁగఁగలఁడా ॥అడుగరే॥

3. గారవించి నన్నుఁ గూడె కడునిచ్చకము చేసి
యేరు నిద్రవుత్తురటే యింతలోఁ దాను
యీరీతి శ్రీ వేంకటేశుఁ డిందుకు నే వేడుకొంటే
వూరట నారతులకు నొడిగట్టీనా ॥అడుగరే॥

**అర్థములు:** ప.ఆస= ఆశ, ఎదయు= వీడు, పెనగు= మారాడు. ఇచ్చగించు= ఇష్టపడు.

1. ఆలిసేసి= భార్యను చేసుకొని, నమ్మిక= నమ్మకము, బేరిజోకొట్టు= తీవ్రత తగ్గించు విధము, వాలాయించు= వాదించు, నిర్బంధించు, పైకొను= యత్నించు, ఓలి= అనుబంధము, ఒడబడు= సమ్మతించు.
2. చాయ= శోభ, సన్నలు= సైగలు, సారె= మాటిమాటికి, ఊయిగిలిగింత= కఠినమైనగిలిగింత, రట్టు= అల్లరి, నింద, బాతిపడు= భ్రమపడు, కొసరు= కోరు, నాయము= న్యాయము, నడపు= ప్రవర్తించు.
3. గారవించు= గౌరవించు, ఇచ్చకము= ముఖప్రీతి, ఏరునిద్రవుత్తు= అసాధ్యమైన పని (ఏరులో అలలు లేకుండా చేయు), వేడుకొను= ప్రార్థించు, ఊరట= విశ్రాంతి, ఒడిగట్టు= పూనుకొను.

**భావము:** ఓ చెలులారా! స్వామిని అడగండి. ఇలా ఆశలు పెట్టడమెందుకు? వదలకుండా ఆయనతో మారాడితే ఇష్టపడతాడా?

స్వామి నన్ను తన భార్యగా చేసుకొని, ఎంతో నమ్మకముతో మాటలు చెప్పి, ఇప్పుడెందుకిలా నా ఆధిక్యతను తగ్గించే విధంగా మాట్లాడుతున్నాడు. నేను ఆయనతో వాదులాడి వెంటనే కలవవలెనని నిర్బంధపెట్టి ప్రయత్నాలు చేసినట్లైతే, అలాంటి అనుబంధానికి తాను సమ్మతిస్తాడా?

గతంలో తన శోభలు జూపించి, ఎన్నో సైగలు చేసి, మాటిమాటికి నాతో నవ్వులు చిందించి, ఇప్పుడిలా అల్లరి చేస్తూ కఠినమైన గిలిగింతలు పెట్టడమెందుకు? అయినా నేను స్వామిని వీడక మోహముతో కోరినట్లైతే, స్వామి ఏ తగవులూ, పంతాలకు పోకుండా ప్రవర్తిస్తాడా?

నన్ను ఎంతో గౌరవించి, గొప్ప ముఖప్రీతి మాటలనెన్నో మాట్లాడి, ఇంతలోనే యిలాటి అసాధ్యమైన కార్యాలకు ఒడికడతాడటే! ఈవిధంగా శ్రీవేంకటేశ్వరుని నేను ప్రార్థనలు చేస్తుంటే తాపీగా రతిక్రీడకు సిద్ధమౌతాడా?

**విశేషాంశము:** అన్నమయ్య ఈ కీర్తనలో బేరిజోకొట్టి, రాయి గిలిగించనేల, ఏరు నిద్రవుత్తురటే అనే మూడు అద్భుత పదప్రయోగాలను, ఆనాడు వాడికలో ఉన్న పలుకుబళ్ళను ఉపయోగించాడు. బేరిజోకొట్టు అనగా భేరీ వాయించే శబ్దాలను జోకొట్టడం అనగా నెమ్మదిగా కొట్టడం లేక తీవ్రతను పూర్తిగా తగ్గించడం అని అర్థం. రాయి గిలిగించనేల అనే పలుకుబడికి రాయికి గిలిగింతలు పెట్టడం అంటే కష్టసాధ్యమైన పనికి పూనుకోవడం అనే అర్థం. అలాగే ఏరు నిద్రపుచ్చడం అంటే ఏటిలోని అలల తీవ్రత తగ్గించడం అనేది ఎవరికైనా దుస్సాధ్యమైన పని. ఇలా కష్టసాధ్యమైన పనులకు ఆనాడు ఉన్న ఎన్నో పలుకుబళ్ళను ఉపయోగించాడు అన్నమయ్య.

## 222

**అవతారిక:** స్వామి చేసే అల్లరి పనులకు, శృంగార క్రీడలకు అంతులేకున్నది. అవన్నీ గమనించిన చెలులు ఆయన చేసిన ఘన కార్యాలను ఆయనకు కదు రమ్యంగా వినిపిస్తూ, నిన్నేమని అనగలము స్వామీ అంటున్నారు.

### కుంతలవరాళి

ప. ఇందులోనే వున్నది మీ యిద్దరి జాణతనము
అందరము నేమని యాడేము నిన్నును ॥పల్లవి॥

1. బాగాలిచ్చే యాఁటదాని పయ్యదకొంగెడలించి
చేఁగదేరేచన్నులు పిసికేవేమయ్యా
ఆగడీఁడవని నిన్ను నొఁగాదనఁగలేక
సోగకన్నులఁదప్పక చూచెనాపెనిన్నును ॥ఇందు॥

2. కుంచేవేసేమగువను కొప్పువట్టి తీసిమోవి-

యంచు గంటిసేసితి వౌనయ్యా
వంచఁకుఁడ వనుచు రవ్వలుగాఁ జేయఁగలేక
ముంచినమొగమోటాన మొక్కినవ్వీ నిన్నును ॥ఇందు॥

3. సురటివిసరేయింతిఁ జొక్కించి కాఁగిటఁ గూడి
కెరలించేవు సిగ్గు చెక్కిట నేమయ్యా
పొరపొచ్చెగాఁడవని పోరక శ్రీ వేంకటేశ
సరినిక్కి పై నొరగి యాసలఁబెట్టీ నిన్నును ॥ఇందు॥

**అర్థములు:** ప. జాణతనము= నేర్పరితనము, ఆడేము= మాట్లాడేము.

1. బాగాలు= వక్కపలుకులు, యాటది= ఆడుది, ఎడలించి= తొలగించు, చేగడేర= బలముతో, ఆగడీడు= అకార్యాలు చేసేవాడు, ఔగాదు= అవునుకాదు, సోగకన్నులు= పొడవైన కన్నులు, ఆపె= ఆమె.
2. కుంచెవేయు= చామరమువీచు, మోవియంచు= మూతికొసన, గంటి= గాయము, వంచకుడు= మోసగాడు, రవ్వ= అల్లరి, ముంచిన మొగమాటము= అధికమైన బెదురు.
3. సురటి= వింజామర, చొక్కు= మత్తు, కాగిట= కౌగిట, కెరలించు= కవ్వించు, పొరపొచ్చెగాడు= కపటము తెలిసినవాడు, పోరక= పోట్లాడక, సరినిక్కి= సమానంగా నిలబడి, ఒరగు= వాలు, ఆసలు= ఆశలు.

**భావము:** స్వామీ! మేమందరము నిన్నేమనగలము? మీ యిద్దరి నేర్పరి తనములన్నీ మీ చేతలలోనే ఉన్నవి.
నీకు వక్కపలుకులనందించే పడతిని పైటకొంగు తొలగించి, నీ బలం కొద్దీ ఆమె రొమ్ములు పిసుకుతామేమయ్యా! నువ్వు అసలే అకార్యాలు చేసేవాడవని యెరిగినామె నిన్ను ఔననలేక, కాదనలేక, దీర్ఘమైన నేత్రాలతో అలా చూస్తూ ఉండిపోయినది.

చామరము వీచే యువతిని కొప్పు పట్టుకొని అధరామృతం సేవించి పెదవులపై దంతక్షతాలనువేశావు. నువ్వు ఉత్త మాయలుచేసేవాడివని తెలిసి, అల్లర్లు రచ్చలు చేయకుండా, తన్నుకొచ్చే బెదురు మోమాటంతో నీకు మ్రొక్కి నిన్ను చూస్తూ అలాగే ఉండిపోయింది.

నీకు వింజామరవీచే రమణిని మత్తులో ముంచి కౌగిట బంధించి, ఆమెను కవ్వించి మరీ ఆమె బుగ్గలపై సిగ్గులు జాలువారేట్టు చేసిన ఘనుడవు. ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు గొప్ప మోసగాడివని తెలిసి నీతో పోట్లాట పెట్టుకోకుండా నీతో సరిసమానంగా నిలబడి, నీపై వాలి, యాశలలో ముంచెత్తినది.

**విశేషాంశము:** స్వామికి గావించే ఉపచారాలను ఉటంకిస్తున్నాడు అన్నమయ్య. సాధారణ వింజామరకు (విసనకర్ర) చామరానికి తేడా ఉన్నది. చమర మృగము వెంట్రుకలతో చేయబడినదానిని చామరము అని పిలుస్తారు. "చమరంఅణ్, చమరః మృగ విశేషః తస్య వికారః" అని ఉత్పత్తి.

## 223

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ పరాయి స్త్రీలతో చనువుగా ఉన్నప్పుడు మన రహస్యాలు చెప్పవద్దని, సమయం దొరికినప్పుడే ఏలుకోమని స్వాధీనపతికగా ప్రార్థిస్తున్నది.

### సామంతం

ప. సందుసుడిదానఁ గాను సతమైనదాన నీకు
అందరివలెనే నన్ను నలయించ కిఁకను ॥పల్లవి॥

1. వొత్తి నీకు విన్నవించే వూకొని విను నామాట
చిత్తమువచ్చినప్పుడు సేతువుగాని
బత్తిగల వెరుఁగుదు పఱమారు నారతులు

చిత్తగించి యాపెతోడఁ జెప్పకు నీవిఁకను ॥సందుసుడి॥

2. కనుఁగొన నీకు మొక్కే కానుకగాఁజేకొను
పనిగలప్పుడు చేపట్టేవుగాని
చనవిచ్చితివి తొల్లి సరసపునాచేఁతలు
సొరిది నాపెముందరఁజూపకు నీవిఁకను ॥సందుసుడి॥

3. తతి నాచన్నులనొత్తేతనివొంది కాఁగిలించు
యితవై నప్పు డింకా నేలేవుగాని
పతివి శ్రీ వేంకటేశ పచ్చయిననాసుద్దులు
నతమాయ నా పెతో పచారించకు మిఁకను ॥సందుసుడి॥

**అర్థములు:** ప. సందుసుడి= సందుచూసుకుని మోసము చేయు, సతము= శాశ్వతము, అలయించు= శ్రమపెట్టు.

1. వత్తి= గట్టిగా నొక్కి, ఊకొని= ఊకొట్టి, సరేనని, చిత్తము= ఇష్టము, బత్తి= భక్తి, ఆరతి= నీరాజనం, చిత్తగించు= సావధానముగా విను, ఆపె= ఆమె.
2. కానుక= బహుమతి, చెపట్టు= గైకొను, చనవు= ప్రేమ, తొల్లి= పూర్వము, సొరిది= వరుస, ఆపె= ఆమె.
3. తతి= సమయము, తనివి= తృప్తి, కాగలించు= కౌగలించు, హితవు= ఇష్టప్రీతి, ఏలేవు= పాలించు, పచ్చయి= సంపద, సుద్దులు= మాటలు, సతము= శాశ్వతము, ఆపె= ఆమె, పచారించు= తిరస్కరించు.

**భావము:** స్వామీ! నేను సందుజూచి మోసాలు మాయలు చేసేదానను కాదు, నీకు శాశ్వతమైన దాన్ని. అందరి మాదిరిగా అన్ను శ్రమపెట్టి బాధించవద్దు.

నీకు నొక్కి మరీ విన్నపము , చేస్తున్నాను, ఊకొట్టి నామాటలు విను! నీ ఇష్టమొచ్చినప్పుడే నిర్వర్తించవచ్చు. నాపై భక్తి ఉన్న సంగతి నేనెరుగుదును అందుకే నీకు అనేకసార్లు నీరాజనాలర్పిస్తున్నాను. సావధానముగా విని, ఆమెతో ఈ సంగతులన్నీ పూసగ్రుచ్చవద్దు.

గమనించి చూస్తే నీకు భక్తిశ్రద్ధలతో మ్రొక్కుతున్నాను బహుమతిగా స్వీకరించండి. చేయవలసిన కార్యమున్నప్పుడు చేయవచ్చును. నీకు పూర్వం నుండీ నా శృంగార చేష్టలతో చనవిచ్చితిని. ఈవిషయాలన్నీ వరుసగా ఆమె ముందు చూపవద్దు.

సమయము చూచి నా వక్షోజములను వత్తి కౌగలించుకోవచ్చును. ఇష్టమైనప్పుడు ఇంకా నన్ను ఎక్కువగా ఏలుకొనవచ్చును. నాకు భర్తవైన ఓ శ్రీవేంకటేశ్వరా! నా పలుకులన్నీ సంపదవంటివి. ఆమెతో శాశ్వతమై నన్ను తిరస్కరించవద్దు.

## 224

**అవతారిక:** స్వామి అన్య కాంతతో సాగిస్తున్న శృంగారలీలలు తెలుసుకొన్న అమ్మ అన్నీ వివరంగా చెబుతూ మీరు సామాన్యవారు కాదు సుమా! అని ఆశ్చర్యం వ్యక్తం చేస్తున్నది.

### వరాళి

ప. ఇన్నాళ్ళవలెఁ గాదు ఇప్పుడు నీవు
తిన్నని మోమునఁ గళ దేరుచుకున్నాఁడవు ॥పల్లవి॥
గద్దరికన్నుల నిన్ను గద్దించి గద్దించి
సుద్దులు చెప్పుతానుండె సుదతి నీతో
పొద్దువొద్దుకేమైనా బుద్దులు నీకుఁ జెప్పునో

1. తిద్దువడె నీ గుణాలు తేటతెల్ల మిగను ॥ఇన్నాళ్ళ॥
జవ్వనపుచనుఁగవ సరిఁ గులికి కులికి
నవ్వులు నవ్వుతానుండె నాతి నీ తోను

అవ్వల దొక్కకుండా నిన్నలవరచుకొనెనో
2 రవ్వలాయ నీవలపు రాతిఁబగలును ॥ఇన్నాళ్ళ॥
వుట్టిపడ మోవితేనే లూరఁబెట్టి వూరఁబెట్టి
పట్టిపెనఁగుతానుండె పడఁతి నీతో
నెట్టన శ్రీ వేంకటేశ నిన్ను సిగ్గుదేర్చెనో
3. యిట్టె నన్నుఁ గూడితివి యిచ్చకముతోడను ॥ఇన్నాళ్ళ॥

**అర్థములు:** ప. తిన్నని= మనోజ్ఞము, కళతేరు= శోభలు మించు.

1. గద్దరి= నేర్పరి, గద్దించి= అదిలించు, అదరవేయు, సుద్దులు= మాటలు, సుదతి= స్త్రీ, పొద్దు పొద్దుకు= ప్రతి సారి, బుద్దులు= నీతులు, తిద్దువడు= దిద్దుబడు, తేటతెల్లమి= మిక్కిలి స్పష్టము.
2. జవ్వనము= యౌవనము, చనుగవ= రెండురొమ్ములు, కులికు= విలాసముగా, నాతి= స్త్రీ, అవ్వల= ఆప్రక్క, తొక్కకుండా= కాలుబెట్టకుండా, అలవరచుకొను= అలవాటు చేసుకొను, రవ్వలు= అపకీర్తి, అల్లరి.
3. ఉట్టిపడు= అతిశయించు, మోవితేనె= అధరామృతము, ఊరబెట్టి= దాచి, పట్టి పెనగు= చుట్టుకొని బంధించు, పడతి= స్త్రీ, నెట్టన= అనివార్యమై, కూడు= కలియు, ఇచ్చకము= ప్రియవచనములు.

**భావము:** స్వామీ! ఇన్నిరోజులవలె కాక ఇప్పుడు నీ మోము శోభ చంద్రుని మించి యున్నది.

నేర్పరితనముతో నున్న కన్నులతో అదరవేసి మాట్లాడి, మాట్లాడి, ఆ రమణి నీకేవో మాటలను చెప్పుచున్నది. నీకు ప్రతి రోజూ ఏవైనా నీతులన్నీ వల్లిస్తున్నదో ఏమో నీ గుణాలన్నీ దిద్దుపడి స్పష్టంగా కనిపిస్తున్నాయి.

యౌవనముతో ఎగసిపడే రొమ్ములు కులికి కులికి ఏవో నవ్వులు నవ్వుతూ ఉన్నది యా వనిత నీతో. అటూ ఇటూ పోకుండా నిన్ను బాగా కట్టడి చేసినట్లున్నది. ఆమెతో నీ ప్రేమ రాత్రి పగలు అన్న భేదం లేకుండా సాగుచున్నది.

ఉబికి వస్తున్న ఆమె అధరామృతాన్ని దాచి దాచి, నిన్ను గట్టిగా చుట్టుకొని కౌగిలిలో బంధినదేమో! ఇక తప్పనిసరి పరిస్థితులలో ఆ శ్రీవేంకటేశ్వరుడు నీ సిగ్గును తీర్చినట్లున్నాడు. ఈవిధముగా నన్ను, ప్రీతితో కూడుకున్నావు.

## 225

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామికై ఎదురుచూపులు చూస్తున్న తరుణంలో అయ్యవారితో అమ్మ తరఫున చెలులు రాయబారం చేస్తున్నారు

### గౌళ

ప. ఎందు వోయీ మా పొందు లెప్పుడు మీ వారమే
ఇందరిలో నాపె నీపై యేఁకటతో నున్నది ॥పల్లవి॥
1. ఆడరాదా మాటలు ఆపెతోడఁ గొంతవడి
వేడుకతో నున్నది వినేనంటాను
చూడరాదా నెమ్మోము సూటిగా నీయెదుటను
2. వీడెము చేతఁబుట్టుక వేళగాచుకున్నది ॥ఎందు॥
చుట్టరికమైనాఁ గొంత చూపరాదా నీమీఁద
రెట్టించినరతులకోరిక నున్నది

ముట్టరాదా చనుఁగవ ముచ్చటైనతమితోడ
యెట్టయెదుట నీకేమిఁదెత్తుక తానున్నది ॥ఎందు॥

3. కూచుండరాదా దండ గొబ్బున మంచముమీఁద
లాచి కూడినమందెమేళాన నున్నది
యేచి యిట్టె శ్రీవేంకటేశ నన్ను నేలితివి
చేచేత నిద్దరిఁ జూచి చేరి నవ్వుచున్నది ॥ఎందు॥

**అర్థములు:** ప. ఎందు వోయీ= ఎక్కడ పోయినవి, పొందు= కూడిక, ఆపె= ఆమె, ఏకట= మిక్కిలిప్రేమ.

1. ఆపె= ఆమె, కొంతవడి= కొంత సేపు, వేడుక= కుతూహలము, నెమ్మోవి= అందమైన మొహము, సూటిగా= ఎదురుగ.
2. వీడెము= తాంబూలము, చుట్టరికము= బంధుత్వము, రెట్టించిన= అధికమై, రెండింతలై, ముట్టు= తాకు, చనుగవ= వక్షోజము, తమి= అపేక్ష, మీదెత్తుక= భారమువేసి.
3. దండ= సమీపము, గొబ్బున= శీఘ్రముగ, లాచి= పొంగి, మందెమేళము= చనవు, ఏచి= బాధించు, చేచేత= స్వయముగ.

**భావము:** స్వామీ! మేమెప్పటికి మీ వారమే! మా పొందులెక్కడ పోయినవి. ఇందరు రమణులలో ఆమె నీపై అమితాపేక్షతో నున్నది.

స్వామీ! ఆమెతో కొంతసేపు మాట్లాడరాదా! వినడానికి సిద్ధమై కుతూహలముతో నున్నది. ఆమె ముఖారవిందాన్ని ఎదురుగా నిలబడి చూడరాదా? ఆమె తాంబూలము చేతపట్టుకొని మీకై వేచియున్నది.

బంధుత్వం ద్వారానైనా కొంత ప్రేమను చూపరాదా! ఆమె నీమీద అధికమోహముతో రతిక్రీడకు సిద్ధమై ఉన్నది. కోరికతో ఆమె చనులను తాకి నీ అపేక్షను ప్రదర్శించరాదా! ఎదురుగాతాను నిలబడి మీమీదనే భారము వహించి యున్నది.

స్వామీ ఇక శీఘ్రమే పట్టె మంచముపై చెంత కూర్చుండరాదా! ఆమె నీపై ఉప్పొంగిన చనువుతో ప్రేమతో ఉన్నది. ఓ శ్రీవేంకటేశ్వరా! కొంచెం ఇబ్బందులపాలు చేసినప్పటికి నన్ను ఏలుకొన్నావు. స్వయముగా ఇద్దరిని చూచి మహదానందమైనది.

## 226

**అవతారిక:** స్వామి అమ్మపై ఎందుకో ఉదాశీనంగా ఉన్నారు. ఇది తగదని అమ్మను కూడమని, ఆమె సర్వ సన్నద్ధమై ఉన్నదని చెలులు స్వామికి నివేదించే సన్నివేశం.

### కేదారగౌళ

ప. ఏఁటికిఁ బరాకుసేసే విప్పుడు నీవు
మాఁట లాడి ఇఁకనైనా మన్నించరాదా ॥పల్లవి॥

1. చిమ్ముఁజూపులనుఁ జూచి చేతికిచ్చీ పూబంతి
కొమ్మ నీకు నిదె యందుకొనరాదా
వుమ్మగిలఁ జెమరించి వూరకే నీవుండఁగాను
ఇమ్మిచ్చి తొడమీఁదట నిడుకొనరాదా ॥ఏటికి॥

2. వినయాన నీకు మొక్కి విందుచెప్పవచ్చెఁ జెలి
గునియక యిట్టె ఇయ్యకొనరాదా
నినుపునిట్టూర్పు నించీ నీవు గుట్టుతో నుండఁగా
చనవిచ్చి చెక్కు నొక్కి సమ్మతించరాదా ॥ఏటికి॥

3. కొంగువట్టి పానుపుపై కూచుండఁ బెట్టీ నిన్ను
ఇంగిత మెరిఁగి మోవి ఇయ్యరాదా
చెంగలించి రతిఁగూడి శ్రీ వేంకటేశ మెప్పించె-

నంగన నెప్పుడు నిట్టె ఆదరించరాదా ॥ఏటికి॥

**అర్థములు:** ప. ఏటికి= ఎందుకు, పరాకు= ఉదాశీనము, మన్నించు= గౌరవించు.

1. చిమ్ము= వెదజల్లు, పూబంతి= పూల చెండు, కొమ్మ= ఆడుది, ఉమ్మగిలు= ఉడికిపోవు, చెమరించి= చెమటతో, ఇమ్ము- ఇచ్చి= సుఖము, ఇడుకొను= కూర్చొండజేయు.
2. వినయాన= అణకువ, గునియు= కులుకు, ఇయ్యకొను= సమ్మతించు, నినుపు= సంపూర్తి, చెక్కు= చెక్కిలి, సమ్మతించు= అంగీకరించు.
3. ఇంగితము= ఉద్దేశము, చెంగలించు= అతిశయముతో, మెప్పించె= పొగడునట్లు చేయు, అంగన= స్త్రీ, ఆదరించు= ప్రేమించి దగ్గరకు తీసుకొను.

**భావము:** స్వామీ! ఎందుకింత ఉదాశీనత వహిస్తున్నారు? ఇంకనైనా ప్రణయకలహాలు మాని మాట్లాడవలెను కదా!

మీపై చూపులను వెదజల్లుతూ ఆమె నీ చేతికి పూలచెండు నిచ్చుచున్నది. ఆమె ఇచ్చే తాంబూలము నందుకొనరాదా! ఉడికిపోయే తమకముతో చెమటతో ఊరకే నీవలా చూస్తూ ఉండకపోతే ఇష్టముతో ప్రేమ మీర నీ తొడపై కూర్చొండ బెట్టుకోరాదా!

ఆమె ఎంతో అణకువగా నీకు నమస్కరించి విందుచేద్దామని పిలుస్తున్నది. నీ కులుకులతో బాధింపక ఆమెకు సమ్మతి తెలియజెయ్యరాదా! నీవు నిట్టూర్పులతో నీవు ఏమీ మాటాడకుండా ఉన్నావు, ఆమెకు కాస్త ప్రేమాదరాలు చూపించి చెక్కిలి నొక్కి అంగీకరించి ఆమెను సంతోషపెట్టరాదా!

నీ కొంగు పట్టుకొని పట్టుపానుపు పై కూర్చొండజేసినప్పుడు, ఆమె ఉద్దేశ్యాన్ని, ప్రేమను గమనించి నీ మోవి అందించరాదా! అధరపానము చేయించరాదా! ఓ శ్రీవేంకటేశ్వరా! ఈవిధముగా ఆమెను కూడి మెప్పించావు. ఇదే విధముగా ఎల్లవేళలా ఆమెను సమాదరించరాదా!

## 227

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామిని చూసి ఇంత అబ్బురాలు ప్రకటిస్తున్నావేమిటని, జనమంతా ఈ సుద్దులే ఆడుకుంటున్నారని అన్యాపదేశంగా చెప్తున్నది.

### ఆహిరి

ప. విచారించుకో నీవే వింతలు నాతోనేల
పచారపు నీ చేఁతలు పట్టి చూపగలనా ॥పల్లవి॥

1. మొగమునఁ గళలెల్లా ముంచుకొని వుండఁగాను
నగరాదా నిన్నుఁ జూచి నాకు నీవేళ
నిగిడి సింగారమే నీకు వెంగమైతేను
మగువ నింత నేను మానుపఁగలనా ॥విచా॥

2. చిడుముడితో నీ చెక్కుల వడియఁగాను
తుడువరాదా చెమట తొడఁగి నాకు
వుడిబడి నీ సుద్దలు వూరెల్లా నాడుకొంటే
తడయక నే నందు కుత్తర మియ్యఁగలనా ॥విచా॥

3. వుప్పతిల్ల నీ మేననున్న పులకలు చూచి
కప్పరాదా పచ్చడము <u>కడఁగి</u> నాకు
యిప్పుడే శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నిట్టె
చిప్పిల సిగ్గువడఁగా చిమ్మిరేఁచఁగలనా ॥విచా॥

**అర్థములు:** ప. వింతలు= అబ్బురము, పచారము= ప్రకటించు, అభినయించు.

1. కళ= శోభ, నగుట= నవ్వుట, నిగిడి= వ్యాపింపజేయు, సింగారము= అలంకారము, వెంగము= పరిహాసము.
2. చిదుముడి= తొందరపాటు, చెక్కులు= చెక్కిళ్ళు, వడియు= కారు, ఉడివడి సుద్దలు= చిల్లర మాటలు, ఆడుకొను= మాటాడు, తడయు= ఆలశ్యము జేయు, ఉత్తరము= జవాబు.
3. ఉప్పతిల్లు= పుట్టు, మేన= శరీరముపై, పులకలు= గగుర్పాటు, పచ్చడము= అంగవస్త్రము, కడగి= యత్నించు, చిప్పిలు= పైకి ఉబుకు, చిమ్మి= వ్యాపించి, రేచు= రేగజేయు.

**భావము:** స్వామీ! నీవే బాగా ఆలోచించుకో! ఈ అబ్బురాలన్నీ నాతో పడడం ఎందుకు? ప్రకటించే నీ చేతలను పట్టించడం సాధ్యమా స్వామీ!

నీ మొహాన వింత శోభలు ముంచెత్తుతుండగా ఒక్కసారి నన్ను జూచి నవ్వరాదా స్వామీ! వ్యాపించి వెలుగొందుతున్న నా ఈ అలంకారాలే నీకు పరిహాసాలయితే, ఆడుదానిని నేను మాన్పగలనా?

తొందరపాటుతో ఉన్న నీకు చెక్కిళ్ళనుండి కారుతున్న చెమటను తుడవనీయరాదా స్వామీ నన్ను! నీవాడేది చిల్లర మాటలని ఊరంతా ఆడిపోసుకుంటూ ఉంటే, నేను ఆలశ్యము చేయకుండా వారికి జవాబివ్వగలనా?

నీ శరీరంపై కనిపించే గగుర్పాటు చూసి నాకు నీ అంగవస్త్రాన్ని కప్పరాదా స్వామీ! శ్రీవేంకటేశ్వరా! ఇప్పుడే నన్నేలుకున్నావు. పైకి ఉబికే సిగ్గులను వ్యాపించకుండా ఆపుకోగలనా!

**గమనిక:** క్రీగీత గల అక్షరములు రాగిరేకు చిలుము తిన్నందున పరిష్కర్త సరిచేసినవి.

## 228

**అవతారిక:** మితిమీరిన ఉత్సాహంతో పైనా క్రిందా కన్నుగానని స్థితిలో ఉన్న స్వామిని చూసి అమ్మ చెలులతో ఇదేమి పద్ధతో అడంగండి చెలులారా అని వాపోతున్నది.

### ఛాయానాట

ప. కిందు మీఁదు నెఱఁగఁడు కెలసీఁ గాతరమున
చందము సేయఁగదరే సతులాల ॥పల్లవి॥

1. పొద్దువోదా <u>తన కేమి</u> పొలఁతులెల్లా నవ్వఁగా
వుద్దండపునవ్వు నవ్వి వొడివట్టీ
పెద్దరికమా యిదేమి ప్రియురాండ్ల నింత సేయ
బుద్దులుచెప్పరే మీరు పూఁచి చెల్లులాల ॥కిందు॥

2. వుండఁబట్టదా తనకు నూడిగము సేయుఁగాను
చండిపైట్టి వాఁతవాశి (వ్రాత వ్రాసీ?) చన్నుల మీఁద
బండారము గూడెనా పడఁతులఁ తక్కించఁగా
అండనుండి వేఁడుకోరే అతివలాల ॥కిందు॥

3. పాయపుమదమా యిది పంతానఁ దెరలోన
ఆయమంటి నన్నుఁగూడె నచ్చలానను
చేయి మీఁ<u>దాయఁగా</u> నేఁడు శ్రీవేంకటేశ్వరుఁడు
పాయకున్నాఁడు మెచ్చరే భామలాల ॥కిందు॥

**అర్థములు:** ప. కిందుమీదు= కిందా మీద గమనించని స్థితి (అమితోత్సాహము) కెలయు= విజృంభించు, కాతరము= వ్యాకులచిత్తము, చందము= న్యాయము, సతులాల= చెలులారా,

1. పొలతులు= స్త్రీలు, ఉద్దండపు= మిక్కుటము, ఒడిపట్టి= తొడపైభాగము, పెద్దరికము= గౌరవము, పూచి= పూనుకొని.
2. ఉండబట్టు= ఉందగల్గు, ఊడిగము= సేవ, చండిపెట్టు= మొండికెత్తు, వాత వాశి(సీ?) = వ్రాతలు వ్రాసి, బండారము= గుట్టు, తక్కించు= మోసగించు, వేడుకోరే= ప్రార్థించగోరు, అతివలాల= చెలులారా
3. పాయపుమదము= యౌవన గర్వము, పంతము= పట్టుదల, తెరలోన= ముసుగులో, అచ్చలాన= పట్టుదలతో, చేయిమీదగు= పైచేయి యగు, సాధించినవాడు, పాయక= వీడక, మెచ్చు= ప్రశంసించు.

**భావము:** ఈ స్వామీ మితిమీరిన ఉత్సాహంతో పైనా క్రిందా కనబడని స్థితిలో వ్యాకుల చిత్తుడై ఉన్నాడమ్మా! చెలులారా మీరే న్యాయం చెప్పండి.

ఈ పడతులులతో నవ్వులాటలాడకపోతే ఆ స్వామికి పొద్దుపోదా? ఏమీ తోచదా? స్వామి మిక్కుటంగా నవ్వుతూ ఒడిపట్టుకుంటున్నాడు. ఇదేమి గౌరవం? ఎంత ప్రియురాళ్లైనా ఇలా చేయడం న్యాయమా? చెలులారా! మీరైనా బుద్ధి చెప్పవచ్చుగదా!

స్వామికి సేవలు చేసుకుంటూ ఉండగా, మొండికెత్తి, వక్షోజాలపై రాస్తూ, మోసగించడానికి యత్నిస్తూ వారిని గుట్టుగా కూడుతున్నాడు. చెలులారా! ఇవేమి పనులని సమీపించి స్వామిని ప్రార్థించండి.

ఇవేమైనా యౌవన గర్వంతో కూడిన పనులా ఏమో! పట్టుదలతో తెరలో నాకు శృంగార క్రీడలతో దగ్గరయ్యాడు. ఎప్పుడూ శ్రీవేంకటేశ్వరుడు పట్టినదే పట్టు వదలడు.ఆయన చెయ్యే మీదైనది కదా ఈరొజు. విడవకుండా ఉన్నాడు చెలులారా స్వామిని ప్రశంసలతో ముంచెత్తండి.

**గమనిక:** క్రీగీత గల అక్షరములు రాగిరేకు చిలుము తిన్నందున పరిష్కర్త సరిచేసినవి

## 229

**అవతారిక:** చుట్టూ కొలువులో ఉన్న రమణులతో స్వామి అల్లరి చేయడం గురించి ప్రశ్నిస్తూ, అమ్మ తనకు తగిన స్థానం ఎక్కడని అడుగుతున్నది.

### ఆహిరి

ప. ఇంత అట్టు గాఁదగునా ఇంతులకును
మంతనాన నీవే నన్ను మన్నించరాదా ॥పల్లవి॥

1. పచ్చిమాటలేలాడేవు పరాకులేల సే సేవు
తచ్చి నే నీకుఁ బాదము లొత్తఁగా
యెచ్చరికతోఁ జెలు లిరువంకా నున్నవారు
బచ్చెనసిగ్గు విడిచి పై కొందునా నేను ॥ఇంత॥

2. కొనగోరే లంటించేవు గుట్టులేల సేసేవు
యెనయ నీకు వింజామ రిట్టె వేయఁగా
మనికై వూడిగాలభామలు గొలువు సేసేరు
మనసుమఱఁగు లేక మర్మాలు ముట్టుదునా ॥ఇంత॥

3. దుప్పటేల కప్పేవు తూరి యేమి భావించేవు
చెప్పి శ్రీవేంకటేశుఁడ చేరి కూడఁగా
చొప్పుగా సవతులెల్లా చుట్టిరానున్న వారు
యిప్పటలయిక మాన కింకాఁగూడుదునా ॥ఇంత॥

**అర్థములు:** ప. రట్టు= అల్లరి, ఇంతులు= స్త్రీలు, మంతనము= ఆలోచన.

1. పచ్చిమాటలు= మరుగులేని మాటలు, పరాకు= పారవశ్యము, తచ్చు= తలయొగ్గి, హెచ్చరిక= సూచన, బచ్చెన= రంగు, పైకొను= కౌగలించు.
2. కొనగోరు= గోరుచివర, గుట్టు= రహస్యము, ఎనయు= కలిసి, వింజామర= విసనకఱ్ఱ, మని= వాసస్థానము, ఊడిగాలు= సేవలు, మరుగు= రహస్యము.
3. తూరి= దూరి, చొప్పు= విధము, చుట్టిరానున్న= ప్రదక్షణముచేయు, ఇప్పటల= ఇప్పటిలో, కూడు= చేరు, కలయు.

**భావము:** స్వామీ! ఈ రమణులు ఇంత అల్లరి చేయడం తగునా? ఆలోచించి నీవే ఆదరించరాదా!

స్వామీ! మరుగు లేకుండా బహిరంగంగా ఈ పచ్చి పచ్చి మాటలేమిటి? పైగా ఈ పారవశ్యమేమిటి? నీ అనుజ్ఞలకు నేను తలయొగ్గి నీ పాదములొత్తగా, సూచనచేస్తూ ఇరువైపులా ఆ రమణులిద్దరూ ఎందుకలా నిలబడ్డ వారిని చూసి రంగులీనే సిగ్గులతో విడిచిపెట్టి ఎలా కౌగలించుకోగలను?

స్వామీ! నీ కొనగోరు తాకించి నఖక్షతములు వేస్తూ రహస్యాలేవో చేస్తున్నారు. కలిసి నీకు వింజారమలు వీచగా, వాసస్థానములో సేవలు చేసే భామలు నీ కొలువు చేస్తున్నారు. మనసులో రహస్యాలు లేకుండా నిన్ను ముట్టుకోగలా స్వామీ!

స్వామి దుప్పటి కప్పుకుని లోపల ఏమి ఆలోచిస్తున్నారు. ఓ శ్రీవేంకటేశ్వరా! మీ అనుమతితో మిమ్ము కూడగా, ఈ విధంగా సవతులంతా మీ చుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నారు. ఇప్పుడిక మానకుండా ఇంకా మిమ్మల్ని కూడడం సాధ్యమా?

**గమనిక:** క్రీగీత గల అక్షరములు రాగిరేకు చిలుము తిన్నందున పరిష్కర్త సరిచేసినవి

## 230

**అవతారిక:** స్వామి అన్యమనస్కంగా చేస్తున్న అనాలోచిత పనులకు కోపించిన అమ్మ, కాంతలతో కూడటం గురించి ప్రశ్నిస్తున్నది.

### లలిత

ప. తరుణి చెనకులు నీ తనువెల్లా నిండినవి
యిరుమేలాఁ జూడరాదా యెంత నీకీ మరపు ॥పల్లవి॥

1. నివ్వటిల్ల నీపె నేఁడు నిన్నుఁ బేరుకొని పిల్చీ
యెవ్వతెతో మాటలాడే వేమి సేసేవు
పువ్వుల వేసీఁ గమ్మటి పూఁచిపూఁచి యిందుకుఁగా
ఇవ్వల చూడఁగరాదా యేల నీకీమఱపు ॥తరుణి॥

2. సముకాన నుండి యీకె సారె నిన్నుఁ జూడఁగాను
తమక మెచ్చుట నుండీ తలఁ పెచ్చేట
గుమితాన నెరుకగా కొంగువట్టి తీసీని
అమరఁ బెండ్లాడరాదా అంతయేల మఱపు ॥తరుణి॥

3. ననుపున నీకె నీతో నవ్వులెల్లా నవ్వఁగాను
పెనుఁగులాట లేవంక ప్రియ మేవంక
ఘనుఁడ శ్రీ వేంకటేశ కలసి నిన్నెచ్చరించీ
చనవు లియ్యఁగరాదా సరినేల మఱపు ॥తరుణి॥

**అర్థములు:** ప. చెనకు= తాకు, స్పృశించు, ఇరుమేల= రెండువైపుల, మరపు= మరచిపోవు.

1. నివ్వటిల్లు= అతిశయించి, ఈపె= ఈమె, పేరుకొని= పేరుబెట్టి, కమ్మటి= మరల, పూచి= బాధ్యతవహించు.
2. సముకము= సముఖము, ఎదుట, ఈకె= ఈమె, సారె= మాటిమాటికి, తమకము= మోహము, తలపు–హెచ్చు= అధికాలోచనలు, గుమితము= ఆశ్చర్యము, అమర= ఒప్పుగా,

3. ననుపు= అనురాగము, ఈకె= ఈమె, పెనుగులాట= గొడవ, వంక= వైపు, ప్రియము= ప్రేమ, ఘనుడు= గొప్పవాడు, హెచ్చరించి= పలుకరించు, చనవు= ప్రేమ, సరి= యుక్తము.

**భావము:** స్వామీ! ఆ స్త్రీ చేసిన దంత, నఖక్షతములు నీ శరీరమంతా కనిపిస్తున్నాయి. నీకెందుకింత మతిమరపు రెండువైపుల చూడరాదా?

ఈ రమణి అతిశయంతో నిన్ను పేరుబెట్టి పిలుస్తున్నది. ఎవ్వతెతో మాట్లాడుతున్నావు? ఆమెను ఏమి చేశావు? పువ్వులను ఆమెపై వేసి మరల మరల బాధ్యత వహించి, ఏమిటేమిటో కార్యాలు చేస్తున్నావు. ఈవైపు కూడా మీ దృష్టి సారించండి. మీకెందుకీ మతిమరపు?

సమక్షములో నుండి ఈమె నిన్ను అనేకసార్లు చూస్తూ ఉండగా, మోహము ఎక్కడ నుండి? మీ మనసులోని ఆలోచనలెక్కడ ఉన్నాయి? ఆశ్చర్యముగా, ఆమె కొంగుపట్టి లాగుతున్నారు. హాయిగా పెండ్లి చేసుకోవచ్చును కదా! అంత మతిమరపు మీకేల?

అనురాగముతో ఈమె నీతో గలగలా నవ్వులు నవ్వుతూ ఉండగా, ఇంక గోడవలు ఏ మూల? ప్రేమలు ఏ మూల చెప్పండి? ఓ గొప్పవాడైన శ్రీవేంకటేశ్వరా! కలిసి పలకరించి ప్రేమాభిమానాలు చూపరాదా? ఈ మతిమరపు మాటలెందుకు?

## 231

**అవతారిక:** అమ్మ స్వామికి ఎల్లవేళలా నీతులు చెప్తున్నదని అలిగాడో ఏమో మరి తెలియదు. తను అటువంటి దానను కాను సుమా అని బ్రతిమాలి దారికి తెచ్చుకోవడానికి యత్నిస్తున్నది.

### పాడి

ప. తెలియఁ జెప్పఁగవలె తెలుసునో తెలియదో
మెలుపున నీకు నమ్మినదాన నేను ॥పల్లవి॥

1. మచ్చరించ నేరఁగాని మనసిచ్చి నీతోడ-
నిచ్చకమాడనేరుతు నిందరికంటె
కుచ్చితురాలఁ గాను గుణము తెలుసుకొంటే
హెచ్చుఁగుందు లేనట్టిహితవరి నేను ॥తెలియ॥

2. గద్దించనోపఁగాని కలకాలము నీకు
బుద్ధులు చెప్పనోపుదు పొందులుగాను
వుద్దండపుదానఁగాను వొద్దికై యెప్పుడు నీ-
తిద్దుతీరుకు వచ్చినదేవుల నేను ॥తెలియ॥

3. వేసరించఁజాలఁగాని, వేడుక శ్రీవేంకటేశ
ఆస వుట్టించఁ జాలుదు నన్నిరతుల
రేసులదానఁగాను రేపును మాపునునీకు
సేసవెట్టి పెండ్లాడినచిన్నదాన నేను ॥తెలియ॥

**అర్థములు:** ప. మెలుపు= నేర్పు.

1. మచ్చరము= ఈర్ష్య, ద్వేషము, ఇచ్చకము= ప్రీతికరమైన మాటలు, కుచ్చితురాలు= కపటము, గుణము= బుద్ధి, హెచ్చుగుందులు= ఎక్కువతక్కువ అనే తారతమ్యాలు, హితవరి= ఇష్టమైనది.
2. గద్దించు= భయపెట్టు, కలకాలము= ఎల్లకాలము, బుద్ధులు= మంచి నడవడిని బోధించు, పొందు= కూడిక, ఉద్దండము= మిక్కుటము, ఒద్దిక= అణకువ, తిద్దుతీరు= తీర్చిదిద్దుట, దేవుల= దేవతా సంబంధము.
3. వేసరించు= శ్రమపెట్టు, రేసులు= ఈర్ష్యపడు, సేస= అక్షింతలు, చిన్నదాన= యౌవనవతిని.

**భావము:** స్వామీ! మీకు తెలుసునో తెలియదో నాకు తెలియదు కానీ, నీకు ఎన్నో విషయాలు చెప్పాలసి ఉన్నది. నేర్పుతో ప్రవర్తిస్తూ నిన్నే త్రికరణశుద్ధిగా నమ్ముతున్నాను.

నేను నీకు మనసిచ్చినదాననే కానీ, ఈర్ష్యాద్వేషాలు చూపించేదాననుగాను. మీ స్త్రీగణమందరికంటే ప్రీతికరమైన సంభాషణ చాతుర్యమున్నదానను. నా గుణము పరిశీలిస్తే ఇష్టమైన దాననే తప్ప, ఏమాత్రం ఎక్కువతక్కువలు పట్టించుకునే దానను గాను, కపటమున్నదానను అసలే కాను.

నేనేదో నిన్ను ఎల్లవేళలా భయపెట్టాలని, అదుపాజ్ఞలలో ఉంచాలని కోరుకునే దాన్ని కాను. ఎప్పుడూ నీకు హితవచనాలు చెప్పి పొందుగోరాలనే కోరికతో చూసేదానను. మిక్కుటంగా ప్రవర్తిస్తూ ఉండేదాన్ని అసలే కాదు. అణకువగా మీ దేవేరినై మిమ్ములను తీర్చిదిద్దుటకు వచ్చిన దానను.

శ్రీవేంకటేశ్వరా! నిన్ను శ్రమపెట్టాలని నాకేమాత్రమూ లేదు. నీకు అన్నివేళలా కోరికలు పుట్టించి, రతిక్రీడలలో తేలియాడాలని ఉన్నదానను. పొద్దుగూకులు అయిన దానికి కాని దానికి ఈర్ష్యపడే దానను కాను ఎందుకంటే నీచే అక్షింతలు వేయించుకొని పెండ్లాడిన యౌవనములోనున్నదానను.

## 232

**అవతారిక:** స్వామి తాను చేసిన పనులు, చెప్పగూడని రహస్యాలను ఎవరికో చెప్పిన విషయం అమ్మకు తెలిసిపోయిందని సిగ్గుపడుతున్నాడు. అమ్మ సిగ్గు స్త్రీలకే తప్ప మగవారికి కూడదని పరిహాసాలాడుతున్నది.

### శుద్ధవసంతం

ప. మగవాని కేడ సిగ్గు మగువల కింతేకాక
యెగసక్కేలాడేనంటా యేల నవ్వేవిపుడు ॥పల్లవి॥

1. మంతనాన నిద్దరము మాటలాడుకొన్న వెల్లా
యింతలోనే ఆపె నేఁడు యెట్టెరిఁగెను
చెంతల నీవెమ్మెలకు చెప్పితివేమోకాక
వింతగా నీచెవులనే వినవయ్యా సుద్దులు ॥మగవాని॥

2. చేరి యింటిలో మనము చేసుకొన్న బాసలు
వారించి యాపెకు నే దెవ్వరు చూపిరి
మేరమీరి మురిపెము మెరసితి వేమోకాక
ఆరీతి నీవే యడుగవయ్యా యీ సుద్దులు ॥మగవాని॥

3. పానుపు పై నిద్దరము పైకొన్న కూటము లెల్లా
తానకమై యేరీతిగాఁ దలఁచినది
కానీలే నీవే పెద్దరికము చూపేవేమోకాక
మేన శ్రీ వేంకటేశుఁడ మెచ్చవయ్యా సుద్దులు ॥మగవాని॥

**అర్థములు:** ప. ఇంతే గాక= ఇదే గాకుండా, ఎగసెక్కెము= పరిహాసము.

1. మంతనము= రహస్యము, ఆపె= ఆమె, ఎట్టెరిగె= ఎలా తెలుసుకొన్నది, ఎమ్మె= విలాసత్వం, వింత= అబ్బురము, సుద్దులు= మాటలు.
2. బాసలు= ప్రమాణాలు, వారించు= అడ్డగించు, ఆపె= ఆమె, మేరమీరి= అతిక్రమించి, మురిపెము= సరసము, శృంగారము.
3. పానుపు= పడక, పైకొను= కౌగలించు, కూటము= కలయిక, తానకము= స్థానము, పెద్దరికము= గౌరవము, మేన= శరీర సంబంధి.

**భావము:** స్వామీ! మగవారు ఇలా సిగ్గుపడవచ్చునా? సిగ్గనేది ఆడువారికే చెల్లినది. నేనేదో పరిహాసాలాడానని నువ్వు నవ్వడం ఎందుకు?

మనమేదో రహస్యంగా మాట్లాడుకొన్న మాటలన్నీ, ఇంతలోనే ఆమెకు నేడెలా తెలిసిపోయాయి? నీవే చేరి విలాసత్వంకోసం చెప్పిఉంటావేమో! ఆ అబ్బురాలన్నీ నీ చెవులతోనే వినవయ్యా!

మనం ఇంటిలో చేసుకున్న ప్రమాణాలన్నీ, అడ్డంగా ఆమెకు ఈరోజెవ్వరు తెలియజేసినట్లు? నువ్వు అతిక్రమించి సరస సమయంలో ప్రకాశంతో చెప్పిఉన్నావేమో! ఆ తీరుతెన్నులను మాటలను నీ నోటితో నువ్వే అడగవయ్యా ఆమెను.

మనం పట్టెమంచముపై పవళించి కౌగలించుకొని కలిసినప్పుడు చేసిన శృంగార కార్యాలన్నీ స్థానంలో ఉండగా, నువ్వు భావించి చెప్పిన విషయాలన్నీ ఆమెకు తెలిసిపొయాయి. కానివ్వండి స్వామీ! నువ్వే పెద్దరికముతో గౌరవము చూపాలి కదా! ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ మాటలన్నింటిని ప్రశంసించవయ్యా!

## 233

**అవతారిక**: పరమ భాగవతోత్తముడైన అన్నమయ్య శ్రీవేంకటేశ్వరునికి సేవకుడు. తనకు తానే నాయికా తత్వాన్ని ఆపాదించుకొని నాయికచేత చెప్పిస్తున్నాడు. నాయికలు ఒకరు గాదు ఇద్దరు. వారే సేవికలు కూడా ఏమంటున్నారో చూడండి.

### బౌళి

ప. నా మోము చూచి చూచి నడుమ నేల కొంకేవు
ఆముకొని మెచ్చఁగా నే నడ్డమాడేనా ॥పల్లవి॥

1. బత్తి గలవాడవు పడఁతి పాట వింటివి
చిత్తము రంజించి నీకు చెవి బట్టెనా
యిత్తల మే చెమరించె నెంత గరఁగెనొ మతి
పొత్తుల వాకుచ్చి యాకెఁ బొగడఁగరాదా ॥నా మోము॥

2. సరి నిడుకొంటివి చదివించితి వా పెను
తిరమైన యాయర్థము తెలిసితివా
నిరతిఁ బులుకలెల్లా నిండెను సంతోసమెంతో
అరదైనవుడుగర లట్టె ఇయ్యరాదా ॥నా మోము॥

3. శ్రీవేంకటేశుడు చెలియాట చూచితివి
భావించి నీకు గన్నుల పండుగాయనా
యీవల నన్నేలితివి ఇదెంత జాణతనమో
సేవసేసే మిద్దరము సేసచల్లరాదా ॥నా మోము॥

**అర్థములు:** ప. మోము= మొహము, నడుమ= మధ్యలో, కొంకు= సంకోచించు, ఆముకొని= పైకొని, అడ్డమాడు= కాదుగూడదను.

1. బత్తి= భక్తి, ప్రేమ, పడతి= స్త్రీ, చిత్తము= మనసు, రంజించు= ఆహ్లాదము కలుగజేయు, చెవిబట్టు= వినిపించుకొను, ఇత్తల= ఇక్కడ, మే చెమరించె= శరీరముపై చెమట కలుగు, కరగు= ద్రవించు, పొత్తులు= స్నేహము, బంధము, వాకుచ్చి (వాక్రుచ్చి)= చెప్పి, ఆకె= ఆమె.
2. ఇడుకొను= అట్టిపెట్టుకొని, ఆపె= ఆమె, తిరమైన= స్థిరమైన, నిరతి= అధికాసక్తి, పులకలు= గగుర్పాటు, అరుదు= అపూర్వము, ఉడుగర= కానుక.
3. కన్నులపండుగ= నేత్రపర్వము, మనోజ్ఞము, మనోహరము, ఈవల= ఈప్రక్కన, జాణతనము= నైపుణ్యత్వము, సేస= అక్షింతలు.

**భావము:** స్వామీ! నా ముఖారవిందాన్ని చూచి చూచి మధ్య మధ్యలో ఎందుకు సంశయిస్తున్నావు? నన్ను పైకొని ప్రశంసిస్తే నేడు కాదు గూడదు అంటావా?

ఎంతో ప్రేమతో ఆ స్త్రీ పాడిన పాటను విన్నావు. ఆ గీతం మనసుకు ఆహ్లాదం గలిగించి నీకు చెవికి ఇంపుగా ఉన్నదా? ఈప్రక్కన శరీరమంతా స్వేదంతో నిండిపోయినది, మనసెంత కరిగి ద్రవించిందో కదా! స్నేహాతిశయం గురించి చెప్పి ఆమెను కొంచెం పొగడవచ్చును కదా!

ఆమెను నీవద్దనే ఉంచుకొని ఎన్నో శాస్త్రాలు చదివించావు. ఆ చదువుకు అసలైన పరమార్థం తెలిసికొన్నావా? అధికాసక్తితో శరీరం గగుర్పాటుకు గురైనది. నీవామెకు అపూర్వమైన కానుకలనిచ్చి సత్కరించరాదా?

ఓ శ్రీవేంకటేశ్వరా! చెలి చేసిన నృత్యాన్ని సావధానంగా పరిశీలించావు. ఇక నీకు కన్నుల పండుగైనదని అనుకుంటున్నాను. అలాగే ఈవలకు నన్నేలుకున్నావు. నీ నేర్పరితనం చెప్ప సాధ్యమా స్వామీ! మేమిద్దరమూ నీ సేవలో తరించే వారము మాపై అక్షింతలు చల్లి ఆశీర్వదించి చేపట్టరాదా?

**విశేషము:** నాయిక ఆటపాటలతో నాయకుణ్ణి అలరించవలసిన అవసరం ఉన్నది. తత్కారణంగా చాలా మంది యువతులు చదువుకోవడం, నృత్యము, సంగీతాది కళలలో ప్రావీణ్యం సంపాదించేవారు. వారు చక్కని గృహిణులుగా సైతం రాణించే వారు. దీనికి చక్కని తార్కాణం తాళ్ళపాక తిమ్మక్క. ఆమె ఉత్తమ విదుషీమణి. అన్నమయ్య ఈ దృష్టితోనే నాయిక చేత ఆటపాటలాడించి శ్రీనివాసుని అలరింపజేశాడని అనుకోవచ్చు.

## 234

**అవతారిక:** దక్షిణ నాయకుడైన శ్రీనివాసుడు ఒకేసారి అనేకమంది స్త్రీజనానికి మాట ఇవ్వడంతో వారంతా నిలయంలో గుమికూడారు. వారిని చూసి అమ్మ స్వామితో పరిహాసమాడుతూ ప్రశ్నిస్తున్నది.

### నాదరామక్రియ

ప. ఓపుదు వెంతకై నాను వువిదలఁ గంటేఁ జాలు
పూపవలపు లెన్నైనాఁ బోది సేయఁ గలవు ॥పల్లవి॥

1. బాస చేసినాపె వచ్చి పానుపుపై నున్నది
ఆసవెట్టి నాపె నీయండ నున్నది
గోస నాస తోడ మరి కొప్పు దువ్వనేల నన్ను
లాసి యెన్ని చోట్లను లాగవేగా లాడేవు ॥ఓపుదు॥

2. రిత్తవచ్చి నాపె కూరిమిఁ దెరలో నున్నది
కొత్తగా వచ్చినయాపె కూచున్నది
హత్తి సరసము లాడే వప్పటి నాతో నీవు
సత్తుగా నెన్ని చోట్ల చవులు చూపేవు ॥ఓపుదు॥

3. పూనుక వచ్చినయాపె పొరుగున నున్నది
కానుక యిచ్చిన యాపె కాచుకున్నది
ఆనుక శ్రీ వేంకటేశ అట్టె నన్ను నేలితివి
సేనగా నెన్మి చోటుల సేస వెట్టేవు ॥ఓపుదు॥

**అర్థములు:** ప. ఓపు= భరించు, ఉవిదలు= స్త్రీలు, పూపవలపు= లేలేత వలపు, పోది= ప్రోగు.

1. బాస= ప్రమాణము, ఆపె= ఆమె, అండ= చెంత, గోస= గొప్ప, ఆస= కోరిక, కొప్పు= తలమీది కొప్పు, లాచు= వ్యాపించి, ఆగవేగాలు= అతివేగము.

2. రిత్త= సంబంధములేని స్త్రీ, కూరిమి= స్నేహము, ఆపె= ఆమె, హత్తి= కూడుకొని, సత్తు= నిజము, చవులు= రుచులు.

3. పూనుక= ప్రయత్నించి, ఆపె= ఆమె, పొరుగు= ప్రక్క, కాచుకొను= సిద్ధముగా, ఆనుక= ఆతర్వాత, సేన= దండు, సేస= అక్షింతలు.

**భావము:** స్వామీ! ఇటు చూదండి. మీరు మాట ఇచ్చిన రమణి వచ్చి పానుపుపై కూర్చొని తయారుగా ఉన్నది.

నీవు కోరికతో ఆశపెట్టిన ఇంకొకతె నీ చెంతనే ఉన్నది. మరి గొప్ప కోరిక ఉన్నచందాన నా కొప్పు దువ్వి, అతిశయించి, ఎన్ని చోట్ల ఇలా ఆఘమేఘాలమీద ఇలాంటి కార్యాలకు తలపడ్డావు?

స్వామీ! ఏమాత్రమూ సంబంధములేని అపరిచిత స్త్రీ వచ్చి స్నేహం నటిస్తూ దోమతెరలో ఉన్నది. క్రొత్తగా వచ్చిన ఇంకొకతె అక్కడ కూర్చొని ఉన్నది. మరి నీవేమో నన్ను హత్తుకొని సరసాలాడుతున్నావు. ఈవిధంగా ఎన్ని చోట్ల ప్రేమలను కురిపిస్తావు స్వామీ!

ప్రయత్నించి నీ కోసం చూస్తూ ఒకావిద ప్రక్కన నీకోసం వేచి చూస్తూ నిలబడి ఉన్నది. నువ్వు బహుమతి యిచ్చినావిద నీకోసం కాచుకొని ఉన్నది. ఓ శ్రీవేంకటేశ్వరా! ఆ తరువాయి నన్నేలుకుంటున్నావు. ఇలా ఆడువారిమీదకు దండెత్తి ఎంతమందిపై అక్షింతలు చల్లుతావు.

## 235

**అవతారిక:** స్వామితో యువతులు మాట్లాడినా, చూచినా, ప్రతి చిన్న విషయానికి, ఊరక ప్రేమలో పడిపోతాడని పరిహాసం చేస్తూ సాగిన కీర్తన.

### ముఖారి

ప. కంటిమి నీ లాగులు కతలు గాను
పెంటలుగాఁ గొసరేవు పెనఁగఁగఁ గలవా ॥పల్లవి॥

1. చూపులకే వలచేవు సుద్దులకే భ్రమసేవు
ఆపడఁతి నేరుపు లెన్నని చెప్పేము
చాపలాన బొమ్మలను జంకించితేఁ గనక
పైపై నీ చేసిన భాగ్య ఫలమిది గాదా ॥కంటిమి॥

2. మొక్కులకే తగిలేవు ముచ్చటకే లాచేవు
యెక్కువ నీకె పంతము లెంతమెచ్చేము
పక్కన నంతలోనే గుబ్బల నొత్తితేగనక
యిక్కువ నీ మనోరథ మీడేరుట గాదా ॥కంటిమి॥

3. నవ్వులకే పొదిగేవు నమ్మికలకె కూడేవు
జవ్వనిభావము యెందు సరిచూపేము
యివ్వల శ్రీవేంకటేశ యెనసె నీ కెగనక
రవ్వల నీకు మదనసామ్రాజ్యము గాదా ॥కంటిమి॥

**అర్థములు:** ప. లాగులు= విధములు, పెంటలు= కుప్పలు, కొసరు= కోరుకొను, పెనగగ= పోరాడు, చుట్టుకొను.

1. సుద్దులు= మంచిమాటలు, భ్రమయు= భ్రాంతికిలోనగు, నేరుపు= నైపుణ్యము, చాపలము (చాపల్యము)= చాంచల్యము, బొమ్మలు= కనుబొమ్మలు, జంకించు= అదరవేయు, పైపై= పైపైన చేయు బాధ్యతలేని పనులు.
2. మ్రొక్కులు= ప్రార్ధనలు, తగులు= చిక్కుకొను, లాచు= వ్యాపించు, పంతము= పట్టుదల, గుబ్బలు= వక్షోజములు, ఇక్కువ= జాడ, మనోరథము= మనసులోని ఆశయము, ఈడేరు= నెరవేరు.
3. పొదుగు= క్రమ్ము, కూడేవు= కలిసేవు, జవ్వని= యౌవన స్త్రీ, సరిచూపు= సక్రమమైన దృష్టి, ఇవ్వల= ఈవల, ఎనయు= పొందు, ఈకె = ఈమె, రవ్వ= అల్లరి, మదన సామ్రాజ్యము= మన్మధ సామ్రాజ్యము, శృంగార కేళి.

**భావము:** స్వామీ! నీ తీరుతెన్నులన్నీ కథలు కథలుగా చూస్తూనే ఉన్నాము. ఇంత కుప్పలు కుప్పలుగా కోరికలు అతిశయించి కోరుకొంటున్నావు భరాయించగలవా?

స్వామీ! వట్టి చూపులకే భ్రాంతికి లోనవుతావు. మాటలకే మైమరచిపోతావు. ఆ రమణి నైపుణ్యం ఇంతింత అని చెప్పలేము గదా! ఏదో చాంచల్యంతో కనుబొమ్మలు అదరవేస్తే పైపైన బాధ్యత లేని పనులు చేసే నైజం నీదికాదా!

స్వామీ! తరుణుల ఉత్త ప్రార్థనలకే ప్రేమలో చిక్కుకొని పోతావు. ఉత్త ముచ్చట్లు చెబితేనే అతిశయంతో ప్రేమలు కురిపిస్తావు. నీ పంతాలు పట్టుదలలు ఎన్నని చెప్పాలి? ప్రశంసించాలి స్వామీ! ప్రక్కనే ఉన్న సంత కూటములలో ఉన్న స్త్రీల వక్షోజములు వత్తినట్లైతే, నీ మనసులో ఉన్న కోరికలన్నీ నెరవేరుతాయి కదా!

ఉత్త నవ్వులకే క్రమ్ముకుని కలుస్తావు. నమ్మకమైన మాటలకు కూడి వస్తావు. యౌవన భారాన్ని ఎక్కడ చూపించగలము? ఈవల శ్రీవేంకటేశ్వరా! ఈమె కాబట్టి పొందుకూడావు. అణువణువునా నీకు మన్మథ సామ్రాజ్యమే కదా స్వామీ!

## 236

**అవతారిక:** స్వామి ఇంతులపట్ల కురిపిస్తున్న ఉత్సాహాన్ని, ప్రేమాతిశయాన్ని ఒకవైపు చెబుతూనే, ఇంకో వైపు ఇలా చేయడం తగునా అని ప్రశ్నిస్తున్నది.

### లలిత

ప. ఏమి చెప్పేము నీసుద్దు లెంతవడియైనాను
చే ముంచి నా తురుముపైఁ జేయి వేయవలెనా ॥పల్లవి॥

1. పొఁడిమి నందరితోడాఁ బొందు సేయనేర్తువట
నేఁడు నన్ను నమ్మించ నేరవా నీవు
ఆఁడువారము గనక అలసి నిన్ను దూరితే
వాఁడికొనగోర చంద్రవంక లొత్తవలెనా ॥ఏమి॥

2. ననిచినవారితొడ నవ్వునవ్వ నేర్తువట
పెనఁగి నన్ను సమ్మతింపించనేరవా
వనితలముగనక వడి నిన్ను సొలసితే
ఘనమైనచన్నులు విసుకఁగ నింతవలెనా ॥ఏమి॥

3. శ్రీ వేంకటేశ కొల్వులో సిగ్గువడనేర్తువట
యీవల నన్నుఁ గూడితి వింతనేరవా
కైవసపుటింతులముగనక నిన్ను మెచ్చితే
చేవదేరేమోవితేనె చిప్పిలించవలెనా ॥ఏమి॥

**అర్థములు:** ప. సుద్దులు= మాటలు, వడి= వేగము, చేముంచి= ప్రమాణపూర్తిగా, బుద్ధిపూర్వకంగా, తురుము= కొప్పు.

1. పొడిమి= బహిరంగంగా, పొందు= కూడు, నేరవా= యత్నించవా? దూరు= దరిచేరు, వాడి= సూదియైన, కొనగోర= గోటిచివరి, చంద్రవంకలు= నఖక్షతములు.
2. ననిచి= అతిశయించి, పెనగి= చుట్టుకొని, సమ్మతింప= అంగీకరింప, వడి= వేగము, సొలయు= నీరసపడు, ఘనమైన చన్నులు= పెద్దవైన వక్షోజములు, విసుకగ= పిసుకగ, ఇంతవలెనా= ఈ మాదిరిగానా?
3. ఇంత నేరవా= ఇంత నేర్చుకోలేవా? కైవసపు= వశమైన, ఇంతులము= స్త్రీలము, చేవదీరు= సారమైన, మోవితేనె= అధరామృతము, చిప్పిలించు= పైకి ఉబికించు.

**భావము:** స్వామీ! ఏమి చెప్పగలము నీ కబుర్లు, చేతలు ఎంత శీఘ్రమైనవైనా, బుద్ధిపూర్వకముగా నా కొప్పుపై చేయివేయతగునా?

బహిరంగంగా అందరితో కూడి అకార్యాలు చేయనేర్చినవాడవు, ఈరోజు నన్ను నమ్మించి రంగంలోకి దింపే నేర్పు లేదందుమా? స్త్రీలము కాబట్టి ఏదో అలసి అలా నీ చెంత సేద దీరితే నీ వాడి గోళ్ళతో నఖక్షతములు వేయడం తగునా?

అతిశయించి అందరితో నవ్వులు నవ్వడం నేర్చినవాడవు, నన్ను చుట్టుకొని సమ్మతింపజేయలేవా? ఆడువారము కదా అని వేగముగా నీరసపడి నిన్ను చేరితే, మా పెద్దవైన వక్షోజములు ఇంతగా పిసుకతగునా?

ఓ శ్రీవేంకటేశ్వరా! కొలువులో ఇంత సిగ్గులొలకబోయడం నేర్చిన వాడవు, ఇక్కడ నన్ను కూడడం నేర్వవా! నీకు వశమైన స్త్రీలము కాబట్టి నిన్ను ప్రశంసించి చెంత జేరితే మా అధరామృతాన్ని పైకి ఉబికేవిధంగా చేయడం తగునా!

## 237

**అవతారిక:** స్వామి ఉత్సాహం నిలుపరాకున్నది. ఎక్కడ రమణుల తగదాలైన మధ్యలో దూరి తీర్పులిచ్చేస్తూ ఉంటాడు. అదే అదనుగా వారిని కూడి శృంగార కార్యాలు కూడా చేస్తుంటాడని చెప్పే కీర్తన.

### భైరవి

ప. ఇంత సేసినవాఁడవు యిద్దరికి నీవేకావా
దొంతి విడేలు వెట్టేవు తొడిఁబడ నేఁడు ॥పల్లవి॥

1. జగడించేసవతుల సంగడికి నీవు వచ్చి
తగవులు చెప్పేవు తమకానను
నిగిడి వొండొక రట్టె నీమీఁద వొట్టువెట్టఁగా
నగవులు నవ్వేవు నడుమ నేఁడు ॥ఇంత॥

2. కొద్దిమీరఁ బంతాలాడే కొమ్మలవద్దికి వచ్చి
బుద్ధులెల్లాఁ జెప్పేవు పొసఁగఁగను
చద్దికి వేఁడికిఁ దమలో సాకిరి నిన్నుఁ గోరఁగా
పెద్దరికాన మించేవు పీఁటమీఁద నేఁడు ॥ఇంత॥

3. రాఁగతానాన జరసేరమణులఁ జేరవచ్చి
కాఁగిలింపించి కూడేవు కందువ లంటి
ఆఁగుచు శ్రీవేంకటేశ అట్టె నీమో వెడుగఁగా
మాఁగి రతిఁ జొక్కించేవు మగువల నేఁడు ॥ఇంత॥

**అర్థములు:**ప. నీవే కావా= నీవే దిక్కు, దొంతి= వరుసగా, విడేలు= తాంబూలము, తొడిబడ= వ్యాపించి.

1. జగడించు= కలహించు, సంగడి= చెంతకు, తమకము= మోహము, నిగిడి= పైకిలేచి, ఒండొక= వేరొక, అట్టె= ఆవిధంగా, ఒట్టువెట్టు= ప్రమాణముచేయు, నడుమ= మధ్యలో.
2. కొద్దిమీర= సమృద్ధిగ, పంతాలాడు= పట్టింపులకుపోవు, కొమ్మలు= స్త్రీలు, వద్దికి= వద్దకు, బుద్దులు= నీతులు, పొసగ= తగినట్టు, చద్దికి వేడికి= చలికి వేడికి, సాకిరి= సాక్షి, పెద్దరికము= గౌరవస్థానము.
3. రాగతనము= మాత్సర్యము, జరయు= నిందించు, కాగలింపించి= కౌగలింపజేసి, కందువ= జాడలు, ఆగుచు= కలిసీఅగు, మొవి–అడుగగ= మోవిని అడుగగా, మాగి= పక్వమైన, చొక్కించు= మత్తులోముంచు.

**భావము:** స్వామీ! ఇన్ని ఘనకార్యాలు చేసినవాడవు. ఇద్దరికీ నీవే దిక్కు కదా! గొప్ప అతిశయముతో ఈనాడు వరుస తాంబూలాలు అందించావు.

కలహాలాడుకునే సవతుల మధ్యలో దూరి మోహంతో తగవుల గురించి మాట్లాడుతావు. వేరొకతె పైకిలేచి నీమీద ఎన్నో ప్రమాణాలు చేయగా ఏమీ ఎరగనట్టు మధ్యన జేరి నవ్వులు చిందిస్తున్నావు.

పంతాలు పట్టింపులకు పోయే ఆడువారి దగ్గర జేరి వారికి తగినవిధంగా నీతులు చెప్తుంటావు. మంచికి చెడుకు నిన్నే సాక్షిగా భావించి నిన్నడుగగా గౌరవంతో పీటమీద చేరి అతిశయముతో నిలిచావు.

ఈర్ష్య, మాత్సర్యములతో రగిలిపోయే యువతులు నిన్ను జేరరాగా జాడలెరిగి వారిని కౌగలించుకునేట్టు చేశావు. శ్రీ వేంకటేశ్వరా! అలాగే ఆగి నీ ముఖారవిందాన్ని కోరగా మత్తులో ముంచెత్తి, అనేక విధములుగా శృంగార లీలలు మగువలకు నేడు రుచిచూపించావు.

## 238

**అవతారిక:** సిగ్గులు చిందిస్తున్న స్వామితో  నీ సుద్దులు, నీ చేతలు ఊరూవాడ ఎరిగినవేనని అమ్మ  పరిహాసమాడుతున్నది.

**బౌళి**

ప. ఇంతటా నీసుద్దులే యేఁటికి సిగ్గువడేవు
యెంత లేదు నాకు నిట్టె ఇయ్యవయ్య విడెము ॥పల్లవి॥

1. వినరాదా ఆపె మాట వేడుకలు దై వార
యెనలేని పరాకులు యేలసేసేవు
మునుపే యెరుఁగుదురు ముదితలు నీపొందులు
తనివోక నీవేల దాఁచేవో కాని ॥ఇంతటా॥

2. చూడరాదా ఆపెదిక్కు సూటులు దప్పకుండా
తాడుపడి నీ వేల తలవంచేవు
వాడలెల్లా నిండె నీవు వలచినవలపులు
గాడిఁగట్టి నీ వేల కప్పేవో కాని ॥ఇంతటా॥

3. వేయరాదా నీచేయి వెక్కసపుఁ జన్నులపై
యీ యెడ శ్రీ వేంకటేశ యేల నవ్వేవు
చాయల నన్నేలితివి సమరతి నా కెవద్ద
నీ యలపు లేమిటికి నెరపేవోకాని ॥ఇంతటా॥

**అర్థములు:**ప. సుద్దులు= పలుకులు, డంబపు మాటలు, విడెము= తాంబూలము.

1. ఆపె= ఆమె, వేడుక= వినోదము, తైవారు= పూర్తియగు, పరాకు= ఉదాశీనత, ముదితలు= స్త్రీలు, తనివోక= తృప్తిదీర.
2. సూటులు= సరియైన చూపులు, తాడుపడు= బంధితమగు, గాడికట్టు= పాదుకొను, కప్పేవు= మూయు.
3. వెక్కసము= అధికము, ఎడ= స్థానము, చాయలు= శోభ, కాంతి, సమరతి= ఉపరతికి వ్యతిరిక్తమైనది, ఆకె= ఆమె, అలపు= అలసట, నెరపు= చూపించు.

**భావము:** స్వామీ! ఎక్కడ చూసినా నీ మాటలే! నీ చేతలే! ఇంకా సిగ్గుపడి ప్రయోజనం ఏమిటి? ఎన్ని వినలేదు చెప్పండి? ఇంకా ఆలసించక నా చేతికి తాంబూలమందించవయ్యా!

ఆమె చెప్పే మాటలేమిటో ఒక్కసారి పూర్తిగా వినరాదా? ఎక్కడా లేని ఈ ఉదాశీనత మీరెందుకు చూపిస్తున్నారు? ఎప్పటినుండో ఆ స్త్రీలు మీ పొందు మరగినవారే కదా! ఇంకా తృప్తి దీరనట్లు ఎందుకు దాస్తున్నారు?

ఒక్కసారి ఆమె వైపు సూటిగా సరిగా చూడరాదా? ఏదో తాడుతో కట్టిపడేసినట్లుగా ఎందుకు తలవంచుకొంటున్నావు? నీ ప్రేమ వ్యవహారాలు ఈ ఊరు వాడా అంతా ఎరిగినదే కదా! ఇప్పుడు పూనుకొని నీవు వాటిని కప్పిపుచ్చాలంటే కుదిరేపనేనా?

ఒక్కసారి నీ చేయి అధికవత్తిడికి గురవుతున్న వక్షోజాలపై వేయరాదా? ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ విధంగా ఎందుకు నవ్వులు చిందిస్తున్నావు? నన్నేమో శోభతో ఏలుకున్నావు కానీ సమరతి ఆమె వద్ద చూపిస్తున్నావు. ఈ ఆపసోపాలు అలుపులు ఎందుకు చూపిస్తున్నావో అర్థం కావడంలేదు.

## 239

**అవతారిక:** కాలు త్రొక్కి కంకణము కట్టించుకొన్న తనను మరచిపోయారని ఒక నాయిక విరహవేదనతో, సాక్ష్యాధారాలు చూపించి స్వామిని యింటికి రమ్మని చెలి ద్వారా ఆహ్వానిస్తున్నది.

### నాగవరాళి

ప. తారుకాణ సేసుకొంటే తానే నేను
యీ రీతినే నవ్వుఁగానీ ఇంటికి రమ్మనవే ॥పల్లవి॥

1. చెక్కులివె చెమరించె చిత్తమెల్లాఁ జిగిరించె
కుక్కినట్టు కోరికలు కొనసాగెను
తొక్కినాఁడు నాపాదము తొలుతే సందడిలోన
యెక్కడ పరాకు సేసి నింటికి రమ్మనవే ॥తారుకాణ॥

2. దప్పిదేరె పెదవుల తమకము దైవారె
కొప్పు వీడి చన్నులపై కుప్పలాయను
ముప్పిరిఁగా గట్టినాఁడు ముంజేత కంకణము
యిప్పుడేల నించీ సిగ్గులు యింటికి రమ్మనవే ॥తారుకాణ॥

3. ఆయాలంటి నన్నుఁ గూడె అంగమెల్లాఁ బులకించె
చేయి చేయి సోఁకి యాస చిమ్మిరేఁగెను
చాయలా సన్నలా సేస చల్లె శ్రీ వేంకటేశుఁడు
యీయెడ నన్ను మన్నించీ యింటికి రమ్మనవే ॥తారుకాణ॥

**అర్థములు:** ప. తారుకాణ= ఋజువు, రీతి= తీరు.

1. చెక్కులు= చెక్కిళ్ళు, చెమరించు= చెమటలుపోయు, చిత్తము= మనసు, చిగిరించు= లేలేతగానగు, కుక్కినట్లు= పల్లమగు, సందడి= జనసమూహము, పరాకు= నిర్లక్ష్యము.
2. దప్పిదీరు= దాహముతీరిపోవు, తమకము= మోహము, తైవారు= ప్రకాశించు, కుప్పలగు= చిందర వందరగా పడు, ముప్పిరి= మూడువిధముల, ముంజేతి= చేయి ముందుభాగము.
3. ఆయాలు= ప్రాణములు, అంగము= శరీరము, పులకించు= గగుర్పాటు కలుగు, చిమ్ము= వ్యాపించు, చాయలు= శోభలు, సన్నలు= సైగలు.

**భావము:** ఋజువులు చూసుకుంటే ఆయన మదిలో ఉన్నది నేనే సుమా! స్వామి ఎప్పుడూ ఈలాగునే నవ్వులు చిందిస్తూ ఉంటాడు కానీ త్వరగా ఇంటికి విచ్చేయమనవే చెలీ!

ఇదుగో నా చెక్కిలి చెమటతో తడిసి ముద్దై, మనసంతా చిగురించుచున్నది. నా కోరికలు పల్లమై సాగుతున్నాయి. స్వామి నాపాదమును పూర్వమే జనమధ్యంలో తొక్కియున్నాడు. ఇంకా పరధ్యానం, నిర్లక్ష్యం మాని ఇంటికి రమ్మని చెప్పవే!

దాహము తీరి పెదవులపై కోరికలు, మోహము ప్రకాశిస్తున్నవి. కొప్పు వీడి వెంట్రుకలు చిందవందరగా వక్షోజములపై బడిపోయాయి. ఆయన ఎంతో ప్రేమతో నా ముంజేతికి కంకణాన్ని కట్టియున్నాడు. ఇంకా ఇప్పుడు సిగ్గులొలకడం ఎందుకే! ఇంటికి రమ్మనవే!

నా మర్మస్థానములను తాకగా నా శరీరమంతా గగుర్పాటు కలిగినది. నా చేయి, స్వామి చేయి తగిలి పెనవేసుకోగా ఆశలు అతిశయించి వ్యాపించాయి. శ్రీవేంకటేశ్వరుడు శోభించి సైగలు చేస్తూ అక్షింతలు చల్లారు. ఈ స్థానములో నన్ను క్షమించి ఇంటికి రమ్మని చెప్పవే!

**విశేషము:** అన్నమాచార్యుడే నాయికగా మారి శ్రీవేంకటేశ్వరుని ప్రియునిగా భావించి, శృంగార లీలా విలాసాదులను భావించి తన్మూలంగా మధురభక్తి ప్రకటన చేస్తున్నాడు.

## 240

**అవతారిక:** స్వామి చేసే శృంగార క్రీడలు పెచ్చుమీరడంతో కోపించి మీరేమి చేస్తున్నారో కూడా తెలియడంలేదని పరిహాసం చేస్తున్నది.

### రామక్రియ

ప. నవ్వేవారి నెఱఁగవు నయమున నిన్నుఁ జూచి
నివ్వటిల్లిన దొరవు నీ వింతేసి సేతురా ॥పల్లవి॥

1. పువ్వులనేల వేసేవు బుజమేల గీరేవు
యెవ్వతె నీకు నేరిపె నిటువంటివి
చివ్వనవూడిగాలు నా చేతఁ జేయింతురుగాక
అవ్వలివిడెము నీవే అంది నాకు నిత్తురా ॥నవ్వేవారి॥

2. చన్నులేల పిసికేవు సారెనేల పెనఁగేవు
యిన్నేసి నీగజరుల కేమందును
వున్నతినీపాదాలు నావొడిపై వేతురుగాక
మిన్నక నీవుంగరము మెట్టెగాఁ బెట్టుదురా ॥నవ్వేవారి॥

3. చెక్కులేల నొక్కేవు సిగ్గులేల తడవేవు
దిక్కుల నీవోజలెల్లాఁ దెలిసె నాకు
గక్కన శ్రీ వేంకటేశ కలసితి విటు నన్ను
మెక్కించుకొందురుగాక మోము నాకు వంతురా ॥నవ్వేవారి॥

**అర్థములు:** ప. నయము= అందము, మృదుత్వము, నివ్వటిల్లు= అతిశయించు, దొర= నాయకుడు, రాజు, సేతురా= చేస్తారా.

1. బుజము= భుజము, గీరు= గోకు, నేరిపె= నేర్పించినది, చివ్వన= శీఘ్రముగా, ఊడిగాలు= సేవలు, అవ్వలి= అక్కడున్న, విడెము= తాంబూలము.
2. పిసుకు= వత్తు, సారె= మళ్ళీ మళ్ళీ, పెనగు= చుట్టుకొను, కౌగలించు, గజరు= కోరిక, కామం, ఉన్నతి= శ్రేష్ఠమైన, మిన్నక= మాట్లాడక, మెట్టె= స్త్రీలు కాలికి తొడుగు ఆభరణము.
3. చెక్కులు= చెక్కిళ్ళు, తడవు= నిమురు, ఓజ= నేర్పు, గక్కన= వేగముగా, మోము= ముఖము, వంతురా= వంచెదరా?

**భావము:** స్వామీ! నిన్ను గమనించి నవ్వేవారిని గురించి ఏమాత్రం పట్టించుకోవడంలేదు. అతిశయించిన నాయకుడవు కదా! ఇలాంటి అకార్యాలు చేయదగునా!

పువ్వులను విసురుతావు, భుజాలను గోకుతావు, అయినా ఇలాంటివన్నీ ఏ స్త్రీ నేర్పించినది స్వామీ మీకు? సేవలన్నీ శీఘ్రముగా నాచేతనే చేయించుకొంటావు. అదుగో అక్కడున్న తాంబూలము నాకు మీరే అందివ్వండి.

స్వామీ! వక్షోజములను ఊరక వత్తుతూ మాటిమాటికి కౌగిలిలో బంధిస్తారు. ఇన్ని కామకోరికలనేమనాలి? శ్రేష్ఠమైన నీ పాదాలను నా వొడిలో ఉంచితే ఉంచవచ్చు గాని, మీ ఉంగరాన్ని నాకు మెట్టెగా పెట్టడం ఏమిటి? ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు? ఇలా చేయడం తగునా?

మాటిమాటికి చెక్కిళ్ళు నొక్కి లేనిపోని సిగ్గులు నటిస్తూ నన్ను నిమురుతూ ఉంటారు. ఓ శ్రీవేంకటేశ్వరా ఇంత శ్రీఘ్రముగా నన్ను కలిసికొన్నారు. నీకు మ్రొక్కులు అనేకకం మ్రొక్కి సేవిస్తాను గానీ నీ ముఖం నావేపుకు కొంచెం వంచండి స్వామీ!

## 241

**అవతారిక:** స్వామి ఒకవైపు అన్యకాంతలతో సరసశృంగాలలో ఉంటూనే అమ్మను కూడా చేపట్టడం ఆవేదన చెంది స్వామిని ప్రశ్నిస్తున్నది.

### రీతిగౌళ

ప. బలిమి జేయఁగనేల పరపుపై నున్నదాన
నలువంకలుఁ జూచితే నవ్వురాదా నాకు ॥పల్లవి॥

1. మునుకొన్న నాగుణములు పొగడేవుగాని
వినరాదా నామాట వింతగాను
చనవిచ్చి సతులతో జాణతనాలాడుతానే
ననుపు నాతోఁ జేసితే నమ్మికౌనా నాకు ॥బలిమి॥

2. జాడ దప్పకుండా నాతో సరసాలాడేవుగాని
చూడరాదా నాదిక్కు సూటితోడను
కోడెకాఁడవై సందడికొలువులో నుండుతానే
వోడక నన్ను మెచ్చితే నొద్దికౌనా నాకు ॥బలిమి॥

3. యీరీతి శ్రీ వేంకటేశ యిట్టె మన్నింతువుగాని
రారాదా యింటిలోనికి రాఁపు సేయక
సారెఁ జెలికత్తెల కాసలెల్లాఁ జూపుతానే
వోరలేక కూడితేనే వొడబాటా నాకు ॥బలిమి॥

**అర్థములు:** ప. బలిమి= బలవంతము, పరపు= పట్టు పానుపు.

1. మునుకొను= అతిశయించు, వింత= అబ్బురము, జాణతనము= నేర్పరితనము, ననుపు= అనురాగము, నమ్మిక= విశ్వాసము.
2. జాడ= దారి, దిక్కు= వైపు, సూటి= తిన్నగా, కోడేకాడు= వయసులోనున్నవాడు, సందడి= జనసమూహము, ఓడు= అపజయముపొందు, ఒద్దిక= అనుకూలము.
3. ఈరీతి= ఈతీరుగా, మన్నించు= గౌరవించు, రాపు= రాపిడి,బాధ, సారె= మాటి మాటికి, ఆశలు= కోరికలు, వోరలేని= తెల్లవార్లు, కూడు= కలియు, ఒడబాటు= సమ్మతి.

**భావము:** స్వామీ! నన్నిలా బలవంతపెట్టడం ఎందుకు? నేను ఈ పట్టుపానుపుపైనే ఉన్నా కదా! నీవు అలా నలువైపులా చూస్తూ, తత్తరపాటుతో ఉండినట్లైతే నాకు నవ్వు రాదా చెప్పండి?

అతిశయించిన నా గుణగణాలనెప్పుడూ పొగుడుతూనే ఉంటావు గానీ, ఒక్కసారి నా మాట కూడా వినండి స్వామీ! ఒకవైపు ప్రేమతో సతులతో నేర్పరితనాలన్నీ చూపిస్తూ అతిశయాలకు పోతూ ఉంటావు. నాతో ఇలా చేసినట్లైతే నాకు నీ మీద నమ్మకం ఏముంటుంది చెప్పండి స్వామీ!

దారి తప్పకుండా నాతో సరసశృంగాలు నెరపుతూనే ఉంటావు. ఒక్కసారి నావైపు తిన్నగా చూడరాదా స్వామీ! ఒకవైపు యౌవనగర్వంతో కొలువులో ఉండి ఏమాత్రం తగ్గకుండా నీదే పైచేయి అనిపించేట్లు ప్రవర్తిస్తూ, నన్ను మెచ్చుకున్నట్లైతే, అది నాకు అనుకూలమైన విషయమౌతుందా స్వామీ!

ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ విధముగా నన్ను గౌరవించావు. బయటనే నిలబడి నన్ను మన్మథ తాపానికి గురిచేయక ఇంటిలోనికి దయచేయరాదా! తోడి చెలులకు ఏవేవో కోరికలు రేకెత్తిస్తూనే, నన్ను కూడినట్లైతే నాకు సమ్మతమౌతుందా స్వామీ!

## 242

**అవతారిక:** స్వామి తనపట్ల ముభావం ప్రదర్శిస్తూ చేస్తున్న సేవలను సరిగా అర్థంచేసుకోవడంలేదని అమ్మ చెలిదగ్గర వాపోతున్నది.

### హిందోళం

ప. చూడవే యీతఁడప్పటి సొలసీ నన్ను
యేడ నేరిచినాఁడో యేమందునే ॥పల్లవి॥

1. చెక్కులు నొక్కుటయెల్లా సేస వెట్టుటకే కాదా
గక్కన విభునిచేఁత కంటివా చెలి
అక్కరతో మాటాడిన దాసపడుటేఁ(టకే?) కాదా
ఇక్కడ నేమారుమాట లేమందునే ॥చూడవే॥

2. కప్పుర మిచ్చుటయెల్లా కదియవలనే కాదా
చిప్పిలీ నీతఁడు తెలిశితివా చెలి
దప్పిదేర నవ్వుటెల్లా తమకించుటకే కాదా
ఇప్పుడిట్టె వేగిరించి నేమందునే ॥చూడవే॥

3. కనుసన్న సేయుటెల్లా కాఁగిలించుటకే కాదా
వినయము సేసీఁ దాను వింటివా చెలి
చెనకుచు మన్నించి శ్రీ వేంకటేశ్వరుఁడు
యెనసినాఁడిదె నన్ను నేమందునే ॥చూడవే॥

**అర్థములు:** ప. సొలపు= వైరస్యము, నేర్చినాడు= నేర్చుకొన్నాడు.

1. చెక్కులు= చెక్కిలి, సేస= అక్షింతలు, గక్కన= శ్రీఘ్రముగ, విభుడు= భర్త, కంటివా= చూశావా, అక్కర= అవసరము, ఆశపడుట= కోరికలు కోరుటకు. ఏమారు= అన్యచింతన.
2. కప్పురము= కర్పూరము, కదియు= దగ్గరచేరు, చిప్పిలు= పైకి ఉబుకు, తెలిశితివా= తెలిసికొంటివా, దప్పి= దాహము, తమకించు= మోహపడు, వేగిరిరించు= తొందరపెట్టు.
3. కనుసన్న= కనుసైగ, కాగిలించు= కౌగలించు, చెనకు= తాకు, మన్నించు= గౌరవించు, ఎనయు= పొందు.

**భావము:** ఓ చెలీ చూడవే! ఈ స్వామి అప్పుడే వైరస్యము చెంది ముభావంగా ఉన్నాడు. ఎక్కడ నేర్చాడో తెలియదు ఈ నేర్పులన్నీ ఏమని చెప్పనే!

నేను చెక్కిలి వత్తడం, త్వరగా అక్షతలు వేయడానికే గదా! చూశావా చెలీ! అవసరపడి ఆ స్వామితో మాట్లాడేది కోరికలు తీర్చుకోవడానికే గదా! మళ్ళీ ఇక్కడ నన్ను ఏమార్చే మాటలు మాట్లాడడాన్ని ఏమనాలి?

కర్పూరం ఇవ్వడమనేది దగ్గరవడం కోసమే గదే! స్వామి ఎందుకిలా పైకి ఉబికి ఉబికి వస్తున్నాడు చూశావా? నేను దాహమడిగేట్లు నవ్వడం ఆయన్ను మోహములో ముంచెత్తడం కోసమే కదా! ఇప్పుడు స్వామికి ఈ తొందరపాటు ఎందుకో ఏమి చెప్పగలనే చెలీ!

కన్నులతో సైగలు చేయడమనేది స్వామి కౌగిలి చేరడానికే గదా! ఆయన ఎన్ని వినయాలు ప్రదర్శిస్తున్నాడో విన్నావా? చూశావా? చెలీ! శ్రీవేంకటేశ్వరుడు నన్ను స్పృశిస్తూ చెంతచేరి గౌరవిస్తూ పొందుకోరుకున్నాడు నా భాగ్యమెంతటిదో కదా!

## 243

**అవతారిక:** సవతులు స్నేహభావంతో మెలుగుతున్నారని, బెరుకులు, సిగ్గులు పడనవసం లేదని అమ్మ ఒక చెలిని సముదాయిస్తున్న సన్నివేశం.

## భైరవి

ప. సవతుల మిందరము సంగడినుంటే నేమాయ
యివల నీ వెట్టుండినా యెవ్వ రేమనేరే ॥పల్లవి॥

1. ఆతనిమోము చూచేవు అంతలోన భ్రమసేవు
చేతిమీఁది చెక్కుతోడ చెమరించేవే
కాతర మింతగలితే కడుసిగ్గువడనేల
యేతులఁ గాఁగి లించితే నెవ్వ రేమనేరే ॥సవతుల॥

2. పై కొని మాటలాడేవు భావములో నలసేవు
దాకొన్నయాసలతోడ తడఁబడేవు
నీకింతఁయాకటయైతే నివ్వెరగు లిపుడేల
యీకడ నెంతసేసినా యెవ్వ రేమనేరే ॥సవతుల॥

3. అడియాలములు చూపేవు ఆయములు సోఁకించేవు
తడవి శ్రీ వేంకటేశుదండ వాయవు
బడి నాతఁడు నన్నేలె పచ్చిగా నవ్వనేల
యెడయక నీవెంతన్నా యెవ్వ రేమనేరే ॥సవతుల॥

**అర్థములు:** ప. సంగడి= స్నేహము, యివల= ఈవైపు, నీవుంఎట్టుండినా= నీవెలాగ ఉన్నా, ఎవ్వరుంఏమనరే= ఎవరైనా ఏమైనా అంటారా.

1. భ్రమయు= భ్రాంతికిలోనగు, చెక్కు= చెక్కిలి, చెమరించు= చెమటపట్టు, కాతరము= పిరికితనము, ఏతులు= డంబాలు, కాగలించు= కౌగలించు.
2. పైకొని= యత్నించు, భావము= మనసులో, దాకొన్న= దాచుకొన్న, ఆశలు= కోరికలు, తడబడు= తొట్రుపడు, ఆకటము= బాధ, నివ్వెరగు= పారవశ్యము, ఈకడ= ఇక్కడ.
3. అడియాలము= గురుతు,చిహ్నము, ఆయములు= జీవస్థానములు, సోకించు= తాకు, తడవి= నిమురు, దండవాయు= వదలిపెట్టు, పడి= యత్నించి, పచ్చిగా= మరుగులేక, ఎడయు= ఎడబాటు.

**భావము:** సవతుల మిందరము ఇలా స్నేహభావముతో నుంటే ఏమైనది? ఇక్కడ నీవెలా ఉన్నా ఎవ్వరు ఏమంటారే!

నీవు ఆయన ముఖారవిందాన్ని చూస్తావు. అంతలోనే మోహభ్రాంతికి లోనవుతావు. చెక్కిలిపై చేయి ఉంచుకొని స్వామిని చెమరింపజేస్తావు. ఇంత పిరికితనముతో ఉండి సిగ్గులు పడడమెందుకు? గొప్పమాటలు చెబుతూ కౌగలించున్నట్లైతే ఎవరేమంటారే చెప్పు?

ప్రయత్నించి మాటలాడుతావు కానీ లోలోపల మనస్సులో బాధను వ్యక్తం చేస్తావు. దాచిపెట్టుకొన్న కోరికలతో తొట్రుబాటుకు గురవుతూ ఉంటావు. నీకింత తాపము బాధ ఉన్నప్పుడు ఈ పారవశ్యము ఎందుకు? ఇక్కడ నీవేమి చేసినా ఎవ్వరేమంటారే చెప్పు?

స్వామికి ఏవేవో గురుతులు, చిహ్నాలు చూపిస్తావు. మర్మస్థానాలను తగిలిస్తావు. స్వామి వద్ద చేరి ఆయన చేయి వదలిపెట్టవు. ఆ స్వామి నన్ను ఏలుకుంటున్నాడని మరుగులేని నవ్వులెందుకు? ఆయన ఎడబాటులేకుండా నీవేమన్నప్పటికి ఎవరేమి చేస్తారో చెప్పవే!

## 244

**అవతారిక:** అమ్మ అలమేలుమంగ సౌందర్యాన్ని చెలులు వివిధ వర్ణనలతో స్వామికి నివేదిస్తున్నారు.

### పాడి

ప. ఏల పంతాలాడేవు ఇంతేసి మాతోను
సోలగిలి యాపె దిక్కు చూడకుండఁగలవా ॥పల్లవి॥

1. చెలియ చూచినచూపు చీఁకటిలోవెన్నెల
అలవోక మాట బయలువందిలి
తళుకుమోవితీపు తంగెటఁబెట్టినజున్ను
తలఁచుకో ఆపెఁబాసి దరిఇంచఁగలవా ॥ఏల॥

2. ముదితచక్కఁదనము ముంగిటినిధానము
వెదచల్లేనవ్వు చలివెన్నెలతేట
పొదలుఁ జన్నులు కడివోనివూగుత్తులు
సదరాన నీచలము సాదించఁగలవా ॥ఏల॥

3. పడఁతి మేనిచాయ బంగారులోనినిగ్గు
జడియనికాఁగిలి జాజులశయ్య
అదరి శ్రీవేంకటేశ అట్టె యీపెఁ గూడితివి
మెడఁ గట్టుకొందుగాక మితిమీరఁగలవా ॥ఏల॥

**అర్థములు:** ప. పంతాలు= పట్టింపులు, సోలగిలు= పరవశించు, ఆపె= ఆమె, దిక్కు= వైపు.

1. చీకటిలో వెన్నెల= శోభగల, కాంతివంతము, అలవోక= స్వేచ్ఛ, వందిలి= చిక్కు, తళుకు= మెరసెడి, తగెటబెట్టిన జున్ను= అందుబాటులోనున్న వస్తువు, ఆపె= ఆమె, దరియించు= ఓర్చుకొను.
2. ముదిత= స్త్రీ, ముంగిటి నిధానము= ఇంటిముంగిట ఉన్న పాతర, వెదజల్లు= వ్యాపించు, చలివెన్నెల తేట= సమశీతోష్ణ స్థితి, పొదలు= వర్ధిల్లు, చన్నులు= వక్షోజములు, కడివోని= చెడని, సదరాన= స్నేహము, చలము= పట్టుదల, సాధించు= పొందు.
3. పడతి= స్త్రీ, మేనిఛాయ= శరీర వర్ణము, నిగ్గు= ఉత్కృష్టకాంతి, జడియని= భయపడని, కాగిలి= కౌగిలి, జాజులశయ్య= పూలపానుపు, అదరు= అతిశయించు, ఈపె= ఈమె, కూడు= కలియు, మెడగట్టుకొను= వివాహమాడు, మితిమీరు= అధికమైన.

**భావము:** స్వామీ! ఎందుకిలా మాతో పంతాలు పట్టింపులు పెట్టుకుంటారు. పరవశించి ఆమె వైపు చూడకుండా ఉండగలవా?

ఆ చెలి చూచే చూపు చీకటిలో వెన్నెలలా ప్రకాశిస్తుంది. స్వేచ్ఛగా మాట్లాడే మాటలు చిక్కులకు దారితీస్తుంది. ఆమె ధగధగ మెరిసే ముఖం తంగేటి జున్నుగా అందుకో వీలైనది. స్వామీ! ఒక్కసారి ఆలోచించు ఆమెను వీడి ఓర్చుకొని ఉండలవా?

ఆ చెలి చక్కదనము చూస్తే ముంగిట్లోని సంపదలా భాసిస్తున్నది. ఆమె వెదజల్లే నవ్వులు సమశీతోష్ణస్థితిని కలిగిస్తున్నాయి. వర్ధిల్లి ఉప్పొంగే ఆమె వక్షోజము ఎన్నటికి వాసన వీడని పూలచెండ్లు. స్నేహపూర్వకంగా పట్టుదలతో పొందు సాధించగలవా స్వామీ!

ఆ లలన శరీర ఛాయ శుద్ధబంగారములోని నిగ్గుదేలిన ఛాయ. ఏమాత్రం జంకని ఆమె కౌగిలి చక్కని జాజుల పూలపానుపులా ఉంటుంది. ఓ శ్రీవేంకటేశ్వరా అతిశయించి ఆమెను కలిసితివి. వివాహమాడిన పిదప ఆమెను వీడలేవు కదా!

## 245

**అవతారిక:** స్వామి కొలువులోని కాంతను అధిక మోహంతో కోరుకొని ఏవేవో చిలిపి పనులు చేయడం అమ్మ సహించలేక చెలితో చెప్తున్న మాటలివి.

### మధ్యమావతి

ప. ఎంత మేలువాఁడో తాను యీ సతికి
పంతగాఁ డింతేసి యేల పచ్చి సేసుకొనీనే ॥పల్లవి॥

1. సెలవి నవ్వినయింతి చేతికి విడెమియ్యదా
తలపోసి తానేల తమకించీనే
కొలువుకువచ్చినాపె కోరి మొక్కక మానీనా
చలివాసి తానేల సాదించీనే ॥ఎంత॥

2. మాటలాడినట్టికాంత మరిగి పై కొనదా
చీటికి మాటికినేల చేయిచాఁచీనే
గాఁటమై పిలిచినాపె కాఁగిలించక మానీనా
కూటమికిఁ బెనఁగేల కొంగువట్టీనే ॥ఎంత॥

3. ముచ్చట గలట్టిరామ మోవితేనె లొసఁగదా
విచ్చనవి దెంతేసి వేఁడుకొనీనే
తచ్చి శ్రీవేంకటేశుఁడు తానప్పటి నన్నుఁగూడె
యిచ్చకము లిపుడెంత యిట్టె నాకుఁ జేసీనే ॥ఎంత॥

**అర్థములు:** ప. మేలువాడు= శుభములు గోరు వాడు, పంతగాడు= పట్టుదలతో ఉన్నవాడు, పచ్చి సేసుకొను= మరుగులేకుండా ప్రవర్తించు.

1 సెలవి= పెదవిమూల, విడెము= తాంబూలము, తలపోసి= యోచించి, తమకించు= మోహపడు, కొలువు= స్వామి సేవ, మానీనా= మానుతుందా?, చలివాయు= బుజ్జగించు, సాదించు= నిష్ఠూరపుమాటలను.

2. కాంత= స్త్రీ, మరిగి= అలవాటున, పైకొను= సమీపించు, చీటికి మాటికి= మాటిమాటికి, గాటము= అధికాసక్తి, ఆపె= ఆమె, కాగలించు= కౌగలించు, మానీనా= మానుతుందా?, కూటమి= కలయిక, పెనగు= చుట్టుకొను, కొంగువట్టు= పైటకొంగుపట్టుకొను.

3. ముచ్చట= కోరిక, రామ= స్త్రీ, మోవితేనె= అధరామృతము, విచ్చనవిడి= స్వేచ్ఛాప్రవృత్తి, వేడుకొను= కోరుకొను, తచ్చి= మధించు, ఇచ్చకము= ముఖప్రీతి.

**భావము:** ఈస్వామి ఆ సతికి ఎంత శుభములు గూర్చువాడో గదా! మరి ఆ పట్టుదలతో, ఇంతగా మరుగులేకుండా ఈ పనులెందుకు చేస్తున్నాడే!

పెదవి మూలగా నవ్వులు రువ్వుతున్న ఆ పడతి చేతికి తాంబూలమందించదా! ఇంతలోనే యోచించి ఎందుకు మోహము కనపరుస్తున్నాడే! స్వామి సేవకై వచ్చినామె కోరి స్వామికి మ్రొక్కక మానుతుందా? బుజ్జగించి ఎందుకు ఆమెను ఏవేవో నిష్ఠూరపు మాటలెందుకు అంటున్నట్టు?

ఇంత సంతోషంగా సంభాషించే ఆ కాంత అలవాటున స్వామిని సమీపించదా? స్వామి ఎందుకు తానే మాటి మాటికి చేయిజాచి పిలుస్తున్నాడు? స్వామిపై అధికాసక్తి కనబరుస్తున్న ఆమె కౌగలించుకోకుండా నిలువగలదా? ఇంతమందిలో ఆమె కొంగుపట్టుకొని పొందుకోరడం న్యాయంగా ఉందా?

అంత చక్కని రమణి తన అధరామృతము అందివ్వక మానుతుందా? మరీ ఇంత స్వేచ్ఛగా ఆమెను వేడుకోవడం సబబేనా? ఆలోచించి, ఆలోచించి ఆ శ్రీవేంకటేశ్వర స్వామి నన్ను చేరుకొన్నాడు. ఇపుడెంత ముఖప్రీతి మాటలు తీపి కబుర్లు చెప్తున్నాడో చూడవే!

## 246

**అవతారిక:** స్వామివారి సన్నిధి శృంగార సామ్రాజ్యానికి నిలయమని గ్రహించిన, అమ్మ అలమేలుమంగమ్మ స్వామిని ప్రశంసలతో ముంచెత్తుతున్నది

### నాగగాంధారి

ప. ఇదివో నీ మహిమలు యేమని పొగడేమయ్యా
కదిసితేనే యినుము కనకమై మించెను ॥పల్లవి॥

1. సెలవి నీవు నవ్వితే చిత్తము చీఁకటివాసె
వెలసెను నాలోనివేడుకలెల్లా
చెలిమిసేసి నాపైఁ జేయి నీవు వేసితేను
బలిమితో వలపులపంటలెల్లాఁ బండెను ॥ఇదివో॥

2. తప్పక నీవు చూచితే తనువుపై కాఁక మాని
వుప్పతిల్లె జవ్వనము వుదుటునను
కొప్పుదువ్వి నీవు నన్నుఁ గొనగోరు సోఁకించితే
కుప్పళించి తమకపుకొటారులు నిండెను ॥ఇదివో॥

3. చేరి నీవు వలికితే సిగ్గులు మూల కొదిగి
కారుకమ్మె నెమ్మోమునఁ గళలన్నియు
యీరీతి శ్రీవేంకటేశ ఇన్నిటా నన్నేలితివి
సారె నాకిట్టె మదనసామ్రాజ్యము హెచ్చెను ॥ఇదివో॥

**అర్థములు:** ప. పొగడు= కీర్తించు, కదియు= దరిచేరు, కనకము= బంగారము, మించు= మెరయు.

1. సెలవి= పెదవిమూల, చిత్తము= మనసు, చీకటివాయు= అంధకారమగు, వెలయు= ప్రకాశించు, వేడుక= కుతూహలము, చెలిమి= స్నేహము, బలిమి= సమృద్ధిగా.
2. తప్పక= మానక, తనువు= శరీరము, కాక= వేడిమి, ఉప్పతిల్లు= పుట్టు, జవ్వనము= వయస్సు, ఉదుటున= ఉధృతి, కొంగగోర= గోరుచివర, సోకించు= తగిలించు, కుప్పళించు= కురియు, కొటారు= నిలువ వుంచు స్థలము.

3. వలుకు= పలుకు, మూలకొదుగు= పారిపోవు, కారుకమ్ము= అతిశయించు, నెమ్మోవి= అందమైన మోము, కళ= శోభ, సారె= మాటిమాటికి, మదనసామ్రాజ్యము= శృంగార కాంక్ష, హెచ్చు= అధికమగు.

**భావము:** స్వామీ! నీ గొప్పదనాలను ఏమని ప్రశంసించగలమయ్యా! నీ దరిచేరితేనే చాలు ఇనుము కూడా బంగారమై ప్రకాశిస్తుంది.

నీవు పెదవి మూలగా నువ్వితే చాలు స్వామీ! మనసులోని అంధకారం దుఃఖము మటుమాయమౌతాయి. నాలోని కుతూహలము నానాటికి అధికమౌతున్నది. నీవు స్నేహంతో నాపైన చెయ్యి వేస్తే చాలు. సమృద్ధిగా ప్రేమ వర్షమై కురుస్తుంది. నా వలపు పంటలనీ పండుతాయి.

నీవు మానకుండా నా వంక చూస్తేనే చాలు. నా తనువుపై ఉన్న ఈ మోహజ్వరము తగ్గి, నా యౌవనము ఉప్పొంగిపోతుంది. నా కొప్పు దువ్వి నీ కొనగోరు తాకించి నఖక్షతములు వేస్తే చాలు. ఒక్కసారి కుంభవృష్టి కురిసిన రీతిగా నా మోహపు గాదెలన్నీ నిండిపోతాయి.

నీవు నన్ను పలకరించి మాట్లాడితే చాలు నా సిగ్గులన్నీ ఎక్కడికో మూల మూలలకు పారిపోయి, నా ముఖారవిందంపై పలు శోభలు ఆక్రమిస్తాయి. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ రీతిగా నన్ను అంతటా ఏలుకొన్నావు. మాటి మాటికి నా శృంగారకాంక్షలు అధికమై విహరిస్తున్నాయి.

## 247

**అవతారిక:** స్వామి అన్యకాంత పొందుగూడడమే కాక ఆ చేతలన్నీ, అమ్మకు తిరిగి వివరించడంతో కినుక వహించి అమ్మ శ్రీదేవి చెలికత్తెతో పలుకుతున్న పలుకులివి.

### వేళావళి

ప. ఇన్నిటా సిగ్గులుదేరె నిఁకనేలే
కన్నుల నాపె సొబగు కప్పించుకొమ్మనవే ॥పల్లవి॥

1. కోపించఁజాలక నేను గుట్టుతో నుండఁగాను
యేపురేఁగి తనచేఁత లేల చెప్పీనే
ఆపాటి గలవాఁడు ఆపెనే యీడకుఁ దెచ్చి
యేపొద్దూ మెడఁగట్టుక యెమ్మెచూపుమనవే ॥ఇన్నిటా॥

2. కోరి వెంగెమాడక గుక్కుతా నే నుండఁగాను
యీరీతిఁ దనవలపు లెంతచెప్పీనే
మేరమీర వేడుకై తే మేడమీఁద నిద్దరూ నుండి
వూరివారెల్లాఁ బొగడ నొద్దికగమ్మనవే ॥ఇన్నిటా॥

3. యెడయక శ్రీవేంకటేశుఁడు నేఁ గూడఁగా
వొడలిపై రేకలేల వొగిఁ జెప్పీనే
అడరి శ్రీకాంత నేను అవ్వలిపొందు గలితే
వొడిఁగట్టుక మాయింట నుండి నవ్వుమనవే ॥ఇన్నిటా॥

**అర్థములు:** ప. ఆపె= ఆమె, సొబగు= సౌందర్యము, కప్పించుకొను= క్రమ్ముకొను.

1. గుట్టు= రహస్యము, ఏపురేగు= విజృంభించు, చేతలు= పనులు, ఆపాటి= ఆవిధమైన, ఆపె= ఆమె, ఈడకు= ఇక్కడకు, పొద్దు= కాలము, మెడగట్టుకొను= పెండ్లాడు, ఎమ్మె= విలాసము.
2. వెంగెమాడు= పరిహాసమాడు, కుక్కు= బలవంతము, మేరమీరు= అతిక్రమించు,హద్దుదాటు, వేడుక= వినోదము, పొగడు= ప్రశంసించు, ఒద్దిక= అనుకూలము.

3. ఎడయక= వీడక, వొడలు= శరీరము, రేకలు= గీరలు, ఒగి= వరుస, అడరు= అతిశయించు, శ్రీకాంత= శ్రీలక్ష్మి, అవ్వలి= అవతల, వొడిగత్తు= అకార్యములుచేయు.

**భావము:** అన్ని విషయాలలోనూ సిగ్గులే కలుగుతున్నాయి, ఇక మాటాడనేలే! స్వామి కళ్ళల్లో నిరంతరం ఆమె కనిపిస్తూ ఉన్నట్లైతే ఆమె సౌందర్యములోనే మునిగితేలమని చెప్పవే!

ఎందుకు కినుక వహించడమని నేనూరక ఉన్నా కూడా స్వామి అలా విజృంభించి తన అకార్యాలనన్నిటిని కొండంతలు చేసి చెప్తున్నాడు. ఆమెపై అంతటి ప్రేమానురాగాలు ఉన్నట్లైతే ఆమెనే యిక్కడకు రప్పించి ప్రొద్దు గూకులూ ఆమెనే మెడలో కట్టుకోని తన విలాసాలన్నీ ఆమెకే చూపించమనవే.

కోరి కోరి స్వామితో పరిహాసాల మాటలెందుకని నేను బలవంతంగా అణిగి మణిగి ఉన్నా సరే! ఈ విధముగా తన ప్రేమ కథలన్నీ చెప్పడం తగునా! అంత హద్దులు దాటిన ప్రేమే ఆమె మీద ఉంటే, మేడమీద యిద్దరూ ఉండి, ఈ వూరివారి చేత పొగిడించుకొని అనుకూల దాంపత్యం సాగించమనవే.

నేను శ్రీవేంకటేశ్వరుని వీడక అంటిపెట్టుకుని ఉండి కలిసినప్పుడు స్వామి తన శరీరంపై ఉన్ననఖక్షతాలనేల నాకు చూపించెనే! నేను శ్రీమహాలక్ష్మినై అతిశయించి పొందుగూడగా, ఆమె పనిబడా అలాంటి కార్యాలే చేయదలుచుకుంటే, మా ఇంటికొచ్చి తన నవ్వులు చిందించమనవే.

## 248

**అవతారిక:** స్వామి తనపై అనుమానాలు పెట్టుకున్నాడని తెలుసుకొన్న అమ్మ తగదని నేనెప్పటికి నీదాననేనై సంజాయిషీ ఇస్తున్నది.

### గుజ్జరి

ప. అన్నిటా మీ వారమే అనుమానించఁగవద్దు
యెన్నికలు సరివచ్చె నీవయ్య చనవు ॥పల్లవి॥

1. పచ్చిసేసేదాననా బాఁతితోడ నీవలపు
తచ్చి తచ్చి దాఁచుకొనేదానఁగాక
మచ్చములుగ నేనంటా మరి నాకేల లోఁగేవు
రచ్చవేయఁ జేఁత లిట్టె రావయ్య నా వద్దికి (?) ॥అన్నిటా॥

2. నవ్వేటిదానవా ననిచి నీసుద్దులెల్లా
దవ్వుల వంకలుదిద్దేదానఁ గాక
యెవ్వరు నెరఁగకుండా నేకాంతమేలాడేవు
వువ్విళ్లూరఁ గాఁతాళించ నుండవయ్య యీడను ॥అన్నిటా॥

3. సిగ్గువరచేదానవా చేరి నీకాఁగిటఁ గూడి
తగ్గనిరతుల మెచ్చేదానఁ గాక
నిగ్గుల శ్రీవేంకటేశ నీవేల వేఁడుకొనేవు
యెగ్గుపట్ట నన్ను నిట్టె యేలవయ్య యిపుడు ॥అన్నిటా॥

**అర్థములు:** ప. అన్నిటా= అన్నివిధములుగా, ఎన్నిక= ఎంపిక, సరివచ్చె= సరిపోయినది, చనవు= ప్రేమానురాగాలు.

1. పచ్చి= రహస్యాన్ని బహిరంగం చేయడం, బాతి(భ్రాంతి)= ఉన్నది లేనట్టు,ప్రేమ, తచ్చి= చిలికు,మధించు, మచ్చము(మత్సరము)= ఈర్ష్య, లోగు= లొంగు,అధీనమగు, రచ్చవేయు= అల్లరిచేయు.

2. ననిచి= చిగుర్చు, సుద్దులు= మాటలు, దవ్వులు= దూరము, వంకలు= లోపాలు, దిద్దు= సరిచేయు, ఏకాంతము= ఒంటరిగా రహస్యాలు, వువ్విళ్ళూరు= తొందర, కాతాళించు= కోపించు, ఈడ= ఇక్కడ.

3. తగ్గనిరతులు= వెనుదీయని శృంగార కార్యాలు, నిగ్గు= శోభించు, వేడుకొను= కోరుకొను, ఎగ్గు= దోషము.

**భావము:** స్వామీ! మీరు అనుమానాలు శంకలూ ఏమీ పెట్టుకోవద్దు. మేము అన్నివిధములుగా మీ వారమే. నీ వెంచుకున్నవన్నీ సరిగానే ఉన్నవి. ఇంకనైనా చనవు ఇవ్వవయ్యా!

నేను నీ గుట్టు రట్టు చేసేదాననా స్వామీ! నీ మీద ఉన్న మోహంతో, ప్రేమతో, భక్తితో అన్ని విషయాలు మథించి మనసులో దాచుకునే దానను. నేను ఈర్ష్యా, అసూయలు చూపించే దాన్నైతే మరి నాకెట్లు లొంగి అధీనమయావు స్వామీ! అల్లరి చేయకుండా నావద్దకు విచ్చేయవయ్యా స్వామీ!

నేనేమైనా పరిహాసాలాడేదాననా? నీ మాటలెల్లా చిగురింపజేసి అక్కడా ఇక్కడా తప్పులు దిద్దేదాన్ని. ఎవ్వరూ గమనించకుండా నాతో రహస్యంగా ఎందుకు కలిసినట్టు స్వామీ! నన్ను తొందరపడి కోపించకుండా ఇక్కడ ఉండవయ్యా!

నేనేమైనా అకార్యాలు చేసి నిన్ను సిగ్గుపడేట్లు చేసేదాననా? నీ కౌగిట్లో చేరి నీవు చేసే శృంగార క్రీడలన్నీ ఆనందించే దానను గానా! శోభిస్తున్న శ్రీవేంకటేశ్వరా! నీవెందుకింతగా కోరుకుంటున్నావు. ఊరకే దోషాలు వెదకకుండా నన్ను చేపట్టి ఏలుకోవయ్యా స్వామీ!

## 249

**అవతారిక:** స్వామి ఏవో పిడివాదములతో నుండగా అమ్మ అలమేలుమంగమ్మ తన భక్తిప్రపత్తులు చెప్తూ స్వామిని ప్రసన్నం చేసుకొంటున్న సన్నివేశం.

### శ్రీరాగం

ప. చిగురుఁబెదవి నిండె సింగారములు నేఁడు
నగితివి మేలుమేలు నల్లఁబల్లిచెన్నుఁడా ॥పల్లవి॥

1. చెక్కులఁ జెమట గారీ సిగ్గులు మోమున నూరీ
యెక్కడనుండి వచ్చితి విందాఁకాను
మొక్కేము నీకిదివో మొనగోరు కడువాఁడి
మొక్కలము లిఁకనేల మోహించితి నీకును ॥చిగురు॥

2. తురు మించుక చెదరె తోడనే సందులదరె
చిరుతపను లేమేమి సేసితివి
గురుతై సేవసేసేము కుచములు గట్లు
జరుపులఁ బెట్ట కిఁక సతినై తి నీకును ॥చిగురు॥

3. కాయమెల్లాఁ బులకించీ కళలు నీయందు మించీ
చేయిచ్చి నన్నేలితివి శ్రీవేంకటేశ
నీ యిచ్చ రతిసేసితివి నిండు నాపిఱుఁదు వేఁగు
పాయకు నన్నిఁక నిట్టె బత్తిసేసే నీకును ॥చిగురు॥

**అర్థములు:** ప. చిగురు= లేలేత, సింగారములు= అలంకారము, శోభ, నగితివి= నవ్వితివి.

1. చెక్కులు= చెక్కిళ్ళు, నూరు= మర్దించు, మొనగోరు= గోరు చివర, కడువాడి= మిక్కిలి వాడియైన, మొక్కలము= పిడివాదము, శౌర్యము, మోహించు= ప్రేమించు.
2. తురుము= కొప్పు, ఇంచుక= కొంచెము, చిరుత= చిన్న చిన్న అకార్యములు, గురుతు= గుర్తు, గట్టింలు= గట్టియైనవి, జరుపులు= చర్చలు, సతి= భార్య.

3. కాయము= శరీరము, పులకించు= గగుర్పాటు, కళ= శోభ, మించు= అధికమగు, ఇచ్చ= ఇష్టము, పిరుదు= పృష్ఠభాగము, వేగు= తపించు, పాయక= వీడక, బత్తి= భక్తి, మన్నన.

**భావము:** ఓ స్వామీ! నల్లబల్లిలో వెలసియున్న ఓ చెన్నకేశవా! ఇక్కడ నాకు లేత పెదవులన్నీ శోభతో నిండి శృంగారాన్ని పండిస్తున్నాయి. నీవు నవ్విన నవ్వులు ఇక చాలు. నన్ను కటాక్షించండి.

నా చెక్కిళ్ళనుండి చెమట ధారలుగా కారి సిగ్గులు మోవిపై మర్దించినట్లవుతున్నవి. ఇప్పటివరకూ ఎక్కడనుండి ఇటకు వచ్చావు స్వామీ! స్వామీ! నీకివే మా మ్రొక్కులు. నా గోరు చివరలు మిక్కిలి వాడియై నఖక్షతములు వేసేందుకు సిద్ధమై ఉన్నవి. నిన్ను వలచి నీకై ఎదురు చూపులు చూస్తున్నాను. ఇంకా నీకెందులకీ శౌర్యప్రతాపాలు, పిడివాదములు స్వామీ! అనుగ్రహించండి.

స్వామీ! నా కొప్పు కాస్తా చెదరిపోయి, కేశాలన్నీ ప్రక్కలకు వ్యాపించాయి. నీవు కొంటెపనులు ఏమి చేశావో అర్థంకావడం లేదు. నీకు గుర్తెరిగి సకల సేవలు చేసుకుంటున్నాము. గట్టియైనట్టి నా వక్షోజములను గమనించి, మీ అర్ధాంగినైన నన్ను ఇంకైనా చర్చలతో కాలక్షేపం చెయ్యకుండా అనుగ్రహించండి.

స్వామీ! శ్రీవేంకటేశ్వరా! నా శరీరమంతా గగుర్పాటుకు లోనయి, మీ మీద ప్రేమానురాగాలు, శోభలు పెచ్చుపెరగగా నీ కరమందించి నన్ను ఏలుకొన్నావు. నా రెండు పిరుదులు మీకై తపించుచున్నవి. నీకు భక్తి తత్పరతతో సేవ చేసుకుంటున్న నన్నిక వీడకుండా చేపట్టి అనుగ్రహించండి.

**విశేషము:**

1. నల్లబల్లి కడపజిల్లా ముద్దనూరు మండలములో నున్న గ్రామము. ఇచ్చటనున్న చెన్నకేశవస్వామి ఆలయమును అన్నమయ్య పలుమార్లు దర్శించి అనేక కీర్తనలను రచించాడు.
2. అన్నమయ్య ఈ కీర్తనలో రెండు శృంగార కళా స్థానాలను ప్రస్తావనకు తెచ్చాడు. మొత్తం కళాస్థానాలు 16 రకాలు. అవి తల, ఎదురురొమ్ము, చేతులు, కుచములు, తొడలు, నాభి, నుదురు, కడుపు, పిఱుదులు, వీపు, చంకలు, మర్మస్థానము, మోకాళ్ళు, పిక్కలు, పాదములు, బొటన వ్రేళ్ళు. వీటిలో ఉన్న కుచములు, పిరుదుల ప్రస్తావనే కాక నా కొనగోళ్ళు మిక్కిలి వాడియనవని నఖక్షతములు వేయడానికి సిద్ధంగా ఉన్నానని నాయిక చేత చెప్పిస్తున్నాడు.

## 250

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామిని తనను పరాయి భావంతో చూడవద్దని, శాశ్వతంగా సేవించుకొంటూ సంతోషపరచడమే తన పరమావధియని స్వామికి విన్నవిస్తున్నది.

### ఆహిరి

ప. ఎరవు లదానఁగాను యెంతైనా నే నీకును
సురతవిద్యలకెల్లా చుట్టమను సుమ్మీ ॥పల్లవి॥

1. సరసములాడి నీచనవు చేకొందుఁగాక
సరికి బేసికి నిన్ను సాదించేనా
విరసాన నీవు నన్ను వెంగెముగాఁ జూడకు
నిరతపు నీ సేఁతకు నే లోనుసుమ్మీ ॥ఎరవు॥

2. ఇచ్చకములాడి నిన్ను యిట్టె దక్కఁగొందుఁగాక
తచ్చనలుసేసి నిన్ను దక్కించేనా
ఇచ్చట సిగ్గుపడకు యేమిటా విచారించకు
మచ్చిక నీమాటకు సమ్మతిదానఁజుమ్మీ ॥ఎరవు॥

3. చేరి నిన్నుఁ గాఁగిలించి సెలవి నవ్వుదుఁగాక

మారుకొని నే నిన్ను మందలించేనా
కూరిమి శ్రీవేంకటేశ కూడితివి నన్ను నిట్టె
గారవముతోడి వూడిగపుదానఁజుమ్మీ ॥ఎరవు॥

**అర్థములు:** ప. ఎరవు= తాత్కాలికము, సురత= నైపుణ్యము, చుట్టము= బంధువు, సుమ్మీ= నిశ్చయార్థకము.

1. చనవు= ప్రేమ,అధికారము, సరిబేసి= అయినదానికి, కానిదానికి, సాదించు= విసికించు,బాధించు, విరసము= విరుద్ధ భావము, వెంగెము= పరిహాసము, నిరతము= మిక్కిలి ఆసక్తి, సేత= పనులు, లోను= లొంగియుండు.
2. ఇచ్చకము= ముఖప్రీతిమాటలు, దక్కగొను= పొందగోరు, తచ్చన= పరిహాసము,కపటము, దక్కించు= పొందుకొను, ఏమిటా= ఏవిషయంలోనూ, మచ్చిక= మోహము, సమ్మతిదాన= అంగీకరించినదానను.
3. కాగలించి= కౌగలించుకొని, సెలవి నవ్వు= పెదవిమూల నవ్వు, మారుకొను= ఎదిరించి, మందలించు= కోపపడు, కూరిమి= స్నేహము, గారవము= గౌరవము,మన్నన, ఊడిగము= సేవ.

**భావము:** స్వామీ! నేను నీపై తాత్కాలికమైన సేవాసక్తితో ఉన్న దాననా? నైపుణ్యమైన విద్యలు గలిగి నీకు శాశ్వతమైన చుట్టమును సుమా!

నీతో సరసశృంగార చేష్టలు జేసి నీ ప్రేమను పొందినదాననే కానీ అయినదానికి కానిదానికి నిన్ను విసికించి, బాధించేదాననా? స్వామీ! అలా విరుద్ధ భావంతో నన్ను పరిహాసముగా చూడవద్దు. మిక్కిలి ఆసక్తితో ఎల్లవేళలా మీసేవలు చేసేందుకు సిద్ధమై మీకు లొంగి ఉన్నాను.

నీతో సదా ప్రీతికరమైన సంభాషణలు చేస్తూ నిన్ను దక్కించుకొన్న దానిని. ఇక్కడ సిగ్గుపడవలసినది కానీ, ఎక్కడా విచారించదగ్గది కానీ లేదు. నీపై మోహముతో నీ ప్రియ సంభాషణలకు దాసాను దాసురాలనై, సర్వదా అంగీకరించి ఉన్నదానను.

స్వామీ! నిన్ను చేరి గాఢాలింగనంతో చిరునవ్వులు చిందించేదాననే గానీ, నిన్ను ఎదిరించి మాట్లాడే గయ్యాళిదాననా? ఓ స్నేహప్రీతితో దరిజేరిన శ్రీవేంకటేశ్వరా! నేను ఈవిధంగా  కలియడంతో నేను ధన్యురాలనయ్యాను. ఇక గౌరవ మర్యాదలతో నీకు సేవలు చేసుకోవడమే నా కర్తవ్యము సుమా!

## 251

**అవతారిక:** స్వామి ఎక్కడో ఒక అంగనామణిని కూడి వచ్చాడన్న విషయం పసిగట్టిన అమ్మ సాక్ష్యాలు చూపిస్తూ, ఏమైనా అంటే అందరూ ఆడిపోసుకుంటారంటూ చెలితో చెప్తున్న మాటలివి.

## సామంతం

ప. ఏమనీనే రమణుఁడు ఇంకా నన్ను
కామించి నేరిచినాఁడు కతకారాలు ॥పల్లవి॥

1. తగవులఁ బెట్టీనవే తన్ను నదె చూడవే
చిగురుఁబెదవిమీఁదిసింగారాలు
అగడు నేఁ జేసితినా అందరు నాడుకొనేరు
నగవుఁజూపులలోని నయగారాలు ॥ఏమనీనే॥

2. యెదుటనే వున్నవనే యెన్నికగాఁ జూడవే
వుదుటుఁజెక్కులమీఁది వొయ్యారాలు
వెదకితేఁ దనమేలు వెల్లావిరులాయ నేఁడు
పదిమారులునేఁటికే బయకారాలు ॥ఏమనీనే॥

3. చెంగటనే నన్నుఁ గూడె శ్రీవేంకటేశుఁ జూడవే

అంగడిఁ బెట్టీ పులకలంభారాలు
యెంగిలిపుక్కిటివిడె లిప్పుడే కానఁగవచ్చె
పంగెనరతులలోనిపచారాలు ॥ఏమనీనే॥

**అర్థములు:** ప. కామించి= మోహించు, కతకారాలు= కథలుచెప్పడంలో దిట్ట.

1. తగవులు= పోట్లాటలు, చిగురుపెదవి= లేతపెదవి, సింగారాలు= శోభలు,అందాలు, అగడు= నింద, ఆడుకొను= మాటలనుకొను, నయగారాలు= మృదువైన మాటలు.
2. ఎన్నిక= ఎంచి, లెక్కించి, ఉదుటు= అతిశయము, చెక్కులు= చెక్కిలి, ఒయ్యారము= విలాసము, వెల్లవిరి= వ్యాపించు, బయకారాలు= యౌవనమందున్న శృంగారచేష్టలు.
3. చెంగట= చెంత, అంగడిబెట్టు= అల్లరిపెట్టు, పులకలు= గగుర్పాటు, అంబరాలు= ఆకాశము, పుక్కిటివిడెము= బుగ్గననున్న తాంబూలము, పంగెన= పట్టుదల, పచారము= అంగడి.

**భావము:** ఓ చెలీ! ఆ స్వామి ఏమేమి అన్నాడు నన్ను? ఇంకా విడమరచి చెప్పవే! నన్ను మోహించి కూడా ఇంకా ఈ కథలెందుకు పడుతున్నాడో అర్ధం కావడంలేదే!

చీటికి మాటికి నాతో తాను ఈ తగాదాలు పడడమెందుకే? అవన్నీ స్వామి చిగురుపెదవుల మీది అలంకారమనుకోవాలా? అదే నేను నిందలేసి ఒక్క చిన్న మాట అన్నా సరే అందరూ నన్ను పలురకాలుగా మాట్లాడుకుంటారు. ఆయనకైతే అవన్నీ స్వామి నగవుచూపులలోని మృదువైన మాటలని అనుకోవాలా?

నేను స్వామి ఎదుటనే ఉన్నాననుగదా ఎంపికజేసి జూడవే! స్వామివారికి అతిశయించిన చెక్కిళ్ళమీద విలాసములు చూడవే! తీరా చూస్తే ఆయన విషయాలన్నీ బయటపడ్డాయి. వారి శృంగార చేష్టలు పలుమార్లు చెప్పవలెనా చెలీ!

ఓ చెలీ! చూడవే! స్వామి శ్రీవేంకటేశ్వరుడు నా చెంతకు చేరుకున్నాడు. నాలోని గగుర్పాటు పూర్తిగా బహిర్గతమైనది. అదుగో స్వామి పుక్కిటనున్న తాంబూలము కనిపిస్తుండగా స్వామివారి పట్టుదలతో కూడిన రతికార్యాలు దుకాణముబెట్టిన తీరుగా నున్నది.

**విశేషము:**

1. ఈ కీర్తనలో అన్నమయ్య కతకారాలు, సింగారాలు, నయగారాలు, ఒయ్యారాలు, బయకారాలు, పులకలంబారాలు అనే అంత్యప్రాసలను వాడి కీర్తనకు వన్నె తెచ్చాడు.
2. గౌరిపెద్దివారు ఈకీర్తనలోని భావము స్పష్టముగాలేదని మరియూ, అన్నమయ్య వాడిన "పులకలంభరాలు" అనే పదాన్ని "పులకలరాశులా?" అన్న సందేహం వెలిబుచ్చారు. పులకలు అనగా గగుర్పాటు అంభారాలు అనగా పెద్దగా ఆవుకూసే కూత కావచ్చును. భాగవతములో దశమ స్కందములో "గోవులెల్లనంభాయని చీరి హుమ్మనుచుఉ బైపడి మూర్కొని పంచితిల్లె" అన్న "అంభా!" యన్న పదము ప్రేరణ కావచ్చు. అతిశయించిన గగుర్పాటు అన్నదానికి అన్నమయ్య చెప్పిన అందమైన పదము "పులకలంభారాలు" గా సరియైనదిగానే భావించదగును.

## 252

**అవతారిక:** స్వామి తనకు దగ్గరైనట్టే ఉండి, మరలా ఏదో కారణాలతో కస్సు బుస్సుమంటున్నాడని చెలితో చెప్పి వాపోతున్నది అలమేలుమంగమ్మ.

### సింధురామక్రియ

ప. నేరిచినాఁడన్నిటాను నెరతనాలు
తారుకాణ లన్నియును తనవల్లఁ గంటిమే ॥పల్లవి॥

1. సెలవి నవ్వినవాఁడు చెక్కునఁ జెయ్యిడనేల
నెలకొన్నరాజసమె నెరపుఁగాక

నిలువుఁజెమటతోడ నీతితో నేకతమాడీ
చెలియరో వీనిజాడ చెప్ప నెట్టువచ్చునే ॥నేరిచి॥

2. తప్పక చూచినవాఁడు తలవూఁచి మెచ్చనేల
నెప్పునఁ గైవశమై మన్నించుఁగాక
చిప్పిలుసిగ్గులతోడఁ జెప్పీ నీకుఁ బ్రియములు
యిప్పు డీతనివిద్య లేమని నే నెంతునే ॥నేరిచి॥

3. కాఁగిట నించినవాఁడు కదుబుసకొట్టనేల
చేఁగదేరేగుట్టుతోడఁ జెలఁగుఁగాక
ఆఁగుచు కడపరాయఁడై శ్రీ వేంకటేశుఁడు
వీఁగఁడు యీవేసా లెట్టు వెలయించవచ్చునే ॥నేరిచి॥

**అర్థములు:** ప. నెరతనము= నేర్పు, తారుకాణ= ఋజువు, తనవల్ల= ఆయనవల్ల.

1. సెలవి నవ్వు= పెదవిమూల నవ్వు, చెక్కున= చెక్కిలిపై, చెయ్యిదు= చేయివేయు, నెలకొను= నిలిచియుండు, రాజసము= గర్వము, నెరపు= నెరవేర్చు, నిలువుజెమటలు= నిలువెల్లా వ్యాపించిన చెమట, నీతి= న్యాయము, ఏకతము= అనన్య చింతన.
2. తలవూచు= సమ్మతించు, నెప్పున= ఉపాయము, కైవశము= అధీనము, చిప్పిలు= ఉబికివచ్చు, ప్రియము= ఇష్టమైన ముచ్చట్లు, విద్యలు= నేర్పులు, ఎంతును= లెక్కింతును.
3. కాగిట= కౌగిట, కదు బుస= మిక్కిలికోపము, చేగదేరు= చేవదేరు, చెలగు= ఉత్సాహించు, వీగదు= చలించదు, వెలయించు= ప్రకటించు.

**భావము:** ఈ స్వామి అన్నివిధములుగా నైపుణ్యము ప్రదర్శిస్తున్నాడు. దానికి తగిన సాక్ష్యాలన్నీ తనవల్లనే చూచితిమి.

పెదవిమూల నవ్వుతున్నవాడు చెక్కిలిపై చేయివేయడమేల? ఆ స్వామి రాజసత్వమే దానికి కారణమై యుండుగాక! నిలువెల్లా చెమటలతో నుండి న్యాయముగా అన్యచింతనే లేనట్టు మాట్లాడే ఈ స్వామి అచూకీ కనిపెట్టడమెలాగునే!

నన్ను తదేక దృష్టితో చూచినవాడు, తలపంకించి సమ్మతించినవాడు, ఏదో ఉపాయంతో నన్ను చేరదీసి నాకు వశమై మన్నించవచ్చుగదా! ఉబికి వచ్చే సిగ్గులతో నీకు ఇష్టమైన కబుర్లన్నీ ఎందుకు చెప్తున్నాడే? ఇప్పుడాతని గుణగణాలను ఏమనుకోవాలో నువ్వే చెప్పవే?

కౌగిటిలోకి తీసుకున్న స్వామి మరలా తానే బుసలు కొడుతూ కోపమెందుకు ప్రదర్శిస్తున్నాడే? సారవంతమై గుట్టుమట్టుతో ప్రవర్తించాలి కదా? ఈ కడపరాయుడైన శ్రీవేంకటేశ్వరుదు, దేనికీ తగ్గక, చలించక, ఎన్నెన్ని వేషాలు వేస్తున్నాడో! ఎలా వెల్లడించాలీతని వ్యవహారాలను చెలీ!

## 253

**అవతారిక:** స్వామి వశమయ్యాడని స్వాధీనపతికైన అమ్మ వైభవాన్ని చెలులు కొనియాడుతున్నారు.

### దేశాక్షి

ప. నేమేయంటా నుండుదుము నిక్కము నీ(ఈ?)విద్యలకు
కామించి నీవొక్కతెవూఁ గలిగితివే ॥పల్లవి॥

1. చెలరేఁగి చెలరేఁగి చేసేవు విన్నపాలు
చలివాయ నాతఁ డింతచన విచ్చెనా
వలచి కాచుకుండిన వనితలెల్లాఁ జూడఁగా

తలఁచినట్టెల్లా నీ పెద్దరిక మీడేరెనే ॥నేమే॥

2. యింటిలో నిడుక పన్నులెన్నియైనాఁ జెప్పేవు
బంటువలె నాతఁడింతపంపు చేసేసునా
దంటలై సవతులెల్లా తమలో నేఁకారఁగాను
పంట వండినట్టు నీభాగ్యము సిద్ధించెనే ॥నేమే॥

3. శ్రీ వేంకటేశ్వరునిఁజేరి కాఁగిలించేవు
వావితో నాతఁడు నీకై వసమాయనా
యీవేళ మమ్మేలెఁదానె ఇందరము నున్నారము
చేవదేరి నీమేలు సేసపాలై నిండెనే ॥నేమే॥

**అర్థములు:** ప.నేమేయంటా= మేము ఏమని, నిక్కము= నిజము, కామించి= మోహించి.

1. చెలరేగి= విజృంభించి, విన్నపాలు= వినతి, చలివాయు= బుజ్జగించు, చనవు= ప్రేమ, వనిత= స్త్రీ, తలచినట్టు= భావించిన విధంగా, పెద్దరికము= గౌరవము, ఈడేరు= నెరవేరు.
2. ఇదుక= ఉంచి, బంటు= సేవకుడు, పంపు= ఆజ్ఞ, చేసేసునా= చేయవచ్చునా? దంటలు= జంటలు, ఏకారము= కోరుకొను, పంటపండు= సమృద్ధిగా, భాగ్యము= అదృష్టము, సిద్ధించు= నెరవేరు.
3. కాగలించు= కౌగలించు, వావి= వరుస, వశమగు= కైవశమగు, చేవదేరి= ఫలవంతమై, మేలు= పుణ్యము, శుభము, సేసపాలు= అక్షింతలు జల్లు.

**భావము:** అమ్మా! మేమేనగలం? నీ ఈ నైపుణ్యాలకు, ఆయనను ప్రేమించి నీవు ఒక్కదానివే ఈవిధంగా స్వామి ప్రేమకు పాత్రురాలవయ్యావు.

నీవు విజృంభించి స్వామికి వినతులు చేస్తావు. ఆయన నిన్ను బుజ్జగిస్తూ ఈవిధంగా నిన్ను ప్రేమిస్తూ నీకు తగిన అధికారమిచ్చాడేమో! ఇంకా ఎంతో మంది వనితలు స్వామిని వలచి ఆయనకై ఎదురుచూపులు చూస్తుండగా, స్వామి నీవు భావించినట్లు నీకే పెద్దరికమిచ్చి నీ ఆశలు నెరవేర్చాడు.

ఆయన్ను ఇంటిలోనే ఉంచుకొని ఎన్నెన్నో పనులను అప్పజెప్పినప్పటికి, ఆయన ఏమాత్రం ఎదురాడకుండా నీ ఆజ్ఞలను సమ్మతిస్తున్నాడు, మిగతా సవతులంతా తమలో తాము స్వామిని కోరుకున్నప్పటికి, నీ భాగ్యమేమని చెప్పగలము? నీ పంటపండినట్లై నీ అదృష్టము సిద్ధించినది.

శ్రీవేంకటేశ్వరుని చేరి కౌగిలిలో బంధిస్తావు. ఆయన నీకు వరసైనాడు గనుక నీకు పూర్తిగా వశమైనాడు. ఈరోజు మమ్మేలుకుంటున్నాడు. సవతులము ఇందరమున్నా నీ భాగ్యము పండి నీపై అక్షతలు నిండాయి.

## 254

**అవతారిక:** అమ్మ మొండిపట్టుదలతో స్వామిని దూరం పెట్టడం గ్రహించిన చెలులు అది తగదని స్వామిని చేరమని ఉద్బోధిస్తున్నారు.

### ధన్నాశి

ప. ఎంత కెంత సేసేవే ఇందుకుఁగాను
పంతము లాడితేనే పైకొని మన్నించఁడా ॥పల్లవి॥

1. పిలిచి యాతఁడు నీకుఁ బ్రియములు చెప్పఁగాను
చలము లేమిటికి జన్నవివి
మొలకచన్నులనీ మొన లురమునఁ బెట్టి

బలిమి చూపితే నీకుఁబంపు సేయఁడా ॥ఎంత॥

2. నగుతా నీతఁడు నీలో ననుపు నటించఁగాను
బిగియనేమిటికి పిన్నదానవు
వొగరుమోవితేనె లొద్దికఁజవులు నించి
తగవులు చూపితే చెంత నిన్ను మెప్పించఁడా ॥ఎంత॥

3. అంకెల శ్రీవేంకటేశుఁడట్టె నిన్నుఁ గూడఁగాను
మంకులేఁటికి పట్టపుమగువవు
పొంకపుఁగాఁగాఁగిటిలో నీపొందులు సతముచేసి
వుంకువఁ జొక్కించితివి వొరపు మరుగఁడా ॥ఎంత॥

**అర్థములు:** ప. పంతము= పట్టుదల, పైకొని= యత్నించి, మన్నించు= క్షమించు.

1. ప్రియములు= ప్రియమైన మాటలు, చలము= పట్టుదల, జవ్వని= వయసులోనున్న స్త్రీ, మొలకచన్నులు= అప్పుడే యౌవనము వచ్చిన, ఉరము= వక్షస్థలము, బలిమి= బలము, పంపు= ఆజ్ఞ.
2. ననుపు= అనురాగము, బిగియు= బిగిసిపోయి ఉండు, పిన్నది= చిన్నపిల్ల, వొగరు మోవి= అప్పుడే పక్వమైన లేత మొహము, చవులు= రుచులు, మెప్పించు= ప్రశంసించు.
3. అంకెలు= వశము, మంకు= మొండి, పట్టపు మగువ= పట్టపురాణి, పొంకము= పొందిక, కాగిట= కౌగిట, పొందు= కలయిక, సతము= శాశ్వతము, ఉంకువ= వాసస్థానము, చొక్కు= మత్తు, ఒరపు= సౌందర్యము, మరుగు= అలవాటగు.

**భావము:** ఎంతకెంత చేశావు? నీవు పట్టుదల వహిస్తే మాత్రం స్వామి నిన్ను మన్నించి చేకొనడా?

ఆ స్వామి నిన్ను పిలిచి ఎన్నో ప్రియమైన మాటలు చెప్తూ ఉంటే, ఇంకా ఏవో పట్టుదలలకు పోతావేమిటే? మంచి యౌవనములో నున్నదానవు. నీ యౌవనమంకురించిన వక్షోజములను స్వామి వక్షస్థలముపై బెట్టి రుద్దినట్లైతే నీకు అధీనుడై నీ ఆజ్ఞలు శిరసావహించడా?

ఆ స్వామి నవ్వుతూ నీతో అనురాగంగా ఉన్నప్పుడు, ఇంకా ఇలా బిగిసి ఉండడం ఎందుకే? ఇంత వయసులో ఉన్నదానవు, నీ లేత మోవినుండి వచ్చే అధరామృతాన్ని ఆస్వామికి రుచి చూపించినట్లైతే, ఎన్ని తగాదాలాడినప్పటికి, నిన్ను మోహించి చెంతదేరి నిన్ను ప్రశంసలకు గురిచేయడా?

నీకు వశమైన శ్రీవేంకటేశ్వరుడు నిన్ను చేరి యుండగా నీకింకా మొండిపట్టుదలలు ఎందుకు? నీవు స్వామికి పట్టపురాణివి కదా! పొందికగా స్వామి కౌగిలిలో శాశ్వతముగా నీ వాస స్థానంలో ఉండిపోయి ఆ స్వామిని మత్తుకు గురిచేస్తే నీ సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ ఉండిపోడా!

## 255

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామిపై భక్తితో, ప్రేమతో, అనుగ్రహం కోసం ఎదురుచూపులు చూస్తున్నదని ఒక చెలి స్వామికి నివేదిస్తున్నది.

### పాడి

ప. చిత్తగించు తమకమే చిమ్మిరేఁచె లోలోన
మత్తగజగమనను మన్నించవయ్యా ॥పల్లవి॥

1. వలపు నిలుపలేక వనిత నిన్నుఁజూచి
పలుకులఁగొసరీని పలుమారును
చలివాసి యప్పటిని సరసములాడీని

నిలుచుండి చేయిచాఁచీ నీమీఁదను ॥చిత్త॥

2. విరహ మాఁపఁగలేక వెలఁది నీయెదుటను
నిరతిఁగొలువుసేసీ నెయ్యమునను
వొరసి వొరసి మరి వూడిగాలు సేసిని
పరిపరివిధముల బాఁతిపడీ నిపుడు ॥చిత్త॥

3. ఆసలు విడువలేక అలమేలుమంగ నిన్ను
సేసవెట్టి కూడీని శ్రీ వేంకటేశ
తాసువలెఁ బెనఁగిని తరితీపు సేసీని
మూసినముత్యమువలె మొక్కు మొక్కీనీకును ॥చిత్త॥

**అర్థములు:** ప. చిత్తగించు= దయతో ఆలకించు, తమకము= మోహము, చిమ్మిరేచు= వ్యాపించు, మత్తగజము= మదించిన ఏనుగు, గమన= నడక.

1. కొసరు= కోరుకొను, చలివాపు= బుజ్జగించు, సరసము= శృంగారపు పనులు.
2. విరహము= దుఃఖము, వెలది= స్త్రీ, నిరతి= మిక్కిలి ఆసక్తి, నెయ్యము= స్నేహము, ఒరయు= విచారించి, ఊడిగాలు= సేవలు, పరిపరివిధములు= అనేక రకములు, బాతిపడు= భ్రాంతికిలోనగు.
3. అసలు= ఏమాత్రము, సేస= అక్షింతలు, తాసు= త్రాచుపాము, పెనగు= చుట్టుకొను, తరితీపు= సంతసింపజేయు, మూసిన ముత్యము= అణగిమణగి యుండు, మొక్కు= నమస్కరించు.

**భావము:** స్వామీ! ఆమెలో మోహము వ్యాపించి అధిగమించుచున్నది. తమరు దయతో ఆలకించండి. మదించిన ఏనుగువలె నడకగలదానిని దయతో మన్నించండి.

ప్రేమను ఆపుకోలేక ఆ వనిత మిమ్ములను చూసి, మాటలతో మిమ్ములను మరీ మరీ ప్రశంసించి, నీ స్నేహంకోరుకొంటున్నది. బుజ్జగించి గతములోవలె ఆమెతో సరస శృంగారములు నెరపండి. ఆమెను అలా నిలబడి సోయగముతో మీపై చేయి చాచుచున్నది అందుకోండి.

మీపై పొంగుతున్న విరహవేదన ఆపుకోలేక ఆమె నీ ఎదుట నిలబడ్డది. మీరు అధికాసక్తి చూపి స్నేహ హస్తాన్ని అందుకోండి. ఆమె విచారించి విచారించి మీ కొలువులో సేవ చేయుచున్నది. మీపై అనేకవిధములుగా భ్రాంతిని పెంచుకొన్నది.

ఓ శ్రీవేంకటేశ్వరా! ఆశలు చంపుకోలేక, ఆ అలమేలుమంగమ్మ నిన్ను అక్షింతలు వేసి కూడినది. పెద్ద త్రాచుపామువలె నిన్ను చుట్టుకొనడానికి యత్నిస్తూ సంతోషమును కలుగ జేస్తున్నది. ఆమె ఎల్లవేళలా మూసిన ముత్యమువలె అణగిమణగి నీకు నమస్కరించుచున్నది.

## 256

**అవతారిక:** అధిక చనువిచ్చి అలమేలుమంగమ్మను నెత్తికెక్కించుకున్నాడని చెలులు స్వామితో యిది తగదని చెప్తున్న సన్నివేశం.

### మాళవిగౌళ

ప. అదె నీ పెద్దరికమే అన్నిటాను
పొదిగి నీ కాఁగిటిలో బుజ్జగించవయ్యా ॥పల్లవి॥

1. బలిమిగలకాంతకు పట్టినదే పంతము
కలసి నీచెల్లుబడి గలిగితేను
యెలమి మందెమేళాన యేమి నిన్నుఁజేసీనో
వలచినాపెకును గర్వము దగునయ్యా ॥అదె॥

2. సేసవెట్టినచెలికి సేసినదెల్లాఁ జేఁత
ఆనయిచ్చి నీవుగన ఆదరించితే
వాసితో నీచనవున వడి నేమేమాడెనో
నీసరినున్నాపెకు నిన్నేసి దగునయ్యా ॥అదె॥

3. నెమ్మి నలమేల్మంగకు నిల్చినదే నిలుకడ
ఇమ్ముల నీవు శ్రీ వేంకటేశ కూడితే
వుమ్మడి నీరతి నెంతవొద్దిక నొరసెనో
తమ్మివిరిపై యాపె కింతయుఁ దగునయ్యా ॥అదె॥

**అర్థములు:** ప. పొదిగి= అనుకూలముగా క్రమ్ము, కాగిట= కౌగిట, బుజ్జగించు= బ్రతిమాలు.

1. బలిమి= బలవంతురాలు, పంతము= పట్టుదల, చెల్లుబడి= అధికారము, ఎలమి= వికాసము, మందెమేళము= చనవు, ఆపె= ఆమె.
2. సేస= అక్షతలు, చేత= పని, ఆన= ఆనతి, వాసి= ఆధిక్యము, ఆపె= ఆమె.
3. నెమ్మి= ప్రేమ, ఇమ్ములు= కలుగు,వసించు, ఉమ్మడి= పొత్తు, ఒద్దిక= అనుకూలము, ఒరయు= వత్తిడి, తమ్మివిరి= కమలము.

**భావము:** అన్నిచోట్లా నీవు పెద్దరికం చూపడమేనా స్వామీ! ఆమెను పొదవిపట్టి నీ కౌగిట్లో బంధించి బ్రతిమాలుకోవయ్యా!

నీవామెను కలసి అధికారము చనువు చూపిస్తే తప్ప, ఆ బలవంతురాలైన వనితకు పంతము పడితే పట్టుకోవడం చాలా కష్టము. ఆమె నీ మీద చనువుతో ఏమి చేస్తుందో ఏమో తెలియకుండా ఉన్నది. నిన్ను ప్రేమించిన ఆ స్త్రీకి ఇలాంటి గర్వం ఉండవచ్చునా?

నీకు అక్షింతలు వేసి దరిచేరిన ఆమెకు ఆడినదెల్లా ఆటగా ఉన్నది. అనుజ్ఞ ఇచ్చి నీవామెను ఆదరించవలెను. ఆధిక్యతతో నీ మీద ఉన్న చనువుతో ఆమె ఏమేమి మాట్లాడుతుందో ఎరుగకున్నాము. నీకు సరిజోడుగా ఉన్న ఆమెకు ఇన్నేసి పంతాలు తగునా స్వామీ!

నీమీద ప్రేమానురాగాలతో ఉన్న అలమేలుమంగమ్మకు నిలిచినదే నిలుకడగా ఉన్నది. ఆమెతో వసించే శ్రీవేంకటేశ్వరా! నీవామెను కూడినట్లైతే మీ ఇద్దరి పొత్తు ఎంత రసరంజకంగా ఉంటుందో కదా! కమలాక్షుడైన నీపై ఆమె యిలా ప్రవర్తించడం తగునా స్వామీ!

## 257

**అవతారిక:** ద్వాపరమున శ్రావణ బహుళాష్టమి రోజున శ్రీకృష్ణుడై జన్మించి కంసుని మదమణగించిన స్వామి శ్రీవేంకటేశ్వరుడే అని తెలుపుతున్నాడు అన్నమయ్య.

### సాళంగనాట

ప. మంతనాన నాడేరమ్మ మధురలో యీ సుద్దులు
వింతలాయ వినరమ్మ వీనుల పండుగలు ॥పల్లవి॥

1. గక్కనఁ గృష్ణుడు వుట్టెఁ గంసుని మదమడఁగె
మొక్కిరి దేవతలెల్లా ముదమందుచు
చక్కఁగా జయంతి నేఁడు శ్రావణబహుళాష్టమి
తక్కక దేవకి తల్లి, తండ్రి వసుదేవుఁడు ॥మంత॥

2. యమున దాఁటి యట్టె యశోదయింటఁ బెరిగి
జమళితో బలభద్రసమేతుఁడై

సమమై చంద్రోదయము సమకూడె తోడఁదోడ
రమణఁ బువ్వులవాన రాసులుగాఁ గురిసె ॥మంత॥

3. పనులెల్లా నీడేరె బ్రదికె లోకములెల్లా
నినుపులై ధర్మములు నెలకొనెను
వొనర నలమేల్మంగ నురమున నిడుకొని
ఘనశ్రీవేంకటేశుఁడై కందువ నిలిచెను ॥మంత॥

**అర్థములు:** ప. మంతనము= ఏకాంతము, సుద్దులు= మంచిమాటలు, వింతలు= అబ్బురము, వీనులు= చెవులు.

1. గక్కన= శీఘ్రముగ, వుట్టె= పుట్టెను, మదము= గర్వాతిశయము, అడగె= నశించెను, ముదము= సంతోషము, జయంతి= జన్మదినము, తక్కక= తప్పక.
2. జమళి= జంట, బలభద్రుడు= బలరాముడు, సమము= సమానము, రాసులు= కుప్పలు.
3. ఈడేరు= సాధ్యపడు, నినుపులు= సమృద్ధి, ఒనర= ఇంపు, ఉరము= వక్షస్థలము, ఇడుకొను= ఉంచుకొను, కందువ= ఏకాంతము.

**భావము:** ఓ చెలులారా! ఏకాంతముగా మధురలో మాట్లాడుకొన్న మాటలు విన్నారా? అపూర్వమైన ఈ విషయాలు వీనులవిందుగా అందరూ వినరండి.

శ్రీకృష్ణుడు జన్మించగానే, ఆ దుష్టుడైన కంసుని గర్వము అణిగిపోయినది. దేవతలందరూ సంతోషముతో ఆయనకు మ్రొక్కులిడినారు. ఈరోజు శ్రావణ బహుళాష్టమి ఆ శ్రీకృష్ణుని జయంతి. ఆయనకు దేవకీ వసుదేవులు తల్లిదండ్రులై సంతోషముతో నున్నారు.

యమునా నది దాటి యశోద ఇంటిలో పెరిగినాడు. బలరామునితో జతకూడి సరి సమానమైన బలపరాక్రమాలు చూపించినాడు. చంద్రోదయ సమయాన అందమైన పుష్పాల వర్షం కురిసింది.

సర్వ కార్యములు సమకూరి జనులెల్లా సుఖ సంతోషాలతో జీవిస్తున్నారు. అక్కడ ధర్మము నెలకొన్నది. ఇక్కడ శ్రీవేంకటేశ్వరుడై వక్షస్థలమున అలమేలుమంగమ్మను ఉంచుకొని తన ఘనతను చాటుతూ ఏకాంతముగా నిలిచి యున్నాడు.

## 258

**అవతారిక:** శ్రీకృష్ణుడు చిన్నతనములో చేసిన చిలిపి పనులు వర్ణిస్తూ, ఆ శ్రీకృష్ణుడే శ్రీవేంకటాద్రి మీద వెలసిన శ్రీవేంకటేశ్వరుడన్న విషయాన్ని చెప్తున్నాడు అన్నమయ్య.

### శంకరాభరణం

ప. ఏమమ్మ యశోద యిదె నీబిడ్డఁడు
గామిడితనాలఁ గదిసీ వీఁడే ॥పల్లవి॥

1. గొల్లలుఁ దానును గోపికలిండ్ల
కొల్లగా నుట్లు గొట్టి వీఁడే
పల్లదాన వారిపాలిండ్లమీఁదట
చిల్లరసేఁతలు చేసీ వీఁడే ॥ఏమమ్మ॥

2. పాలువెన్నలును బానలతోడత
కేలు చాఁచి యారగించీ వీఁడే
మేలిమిసతుల మేనబావనంటా
కోలుముందుగాఁ గూడీ వీఁడే ॥ఏమమ్మ॥

3. అట్టులుఁజక్కిలా లడుకులు వేలఁ-
గట్టినఁ గోలలఁ గొట్టీ వీఁడే
దిట్టయి శ్రీవేంకటాద్రి నలమేల్మంగఁ-
గట్టుక దేవుఁడై కడఁగీ వీఁడే ॥ఏమమ్మ॥

**అర్థములు:** ప. ఇదె= ఇదుగో, కామిడితనము= అకార్యములు, కదియు= వచ్చిచేరు.

1. కొల్ల= దొంగతనము, ఉట్టి= పాలుపెరుగు దాచుకొనుటకు వేలాడదీయబడునది, పల్లదము= గర్వము, పాలిండ్లు= వక్షస్థలము, చిల్లరచేతలు= చిలిపి పనులు.
2. బానలు= పెద్ద పెద్ద కుండలు, కేలు= చేయి, ఆరగించు= తిను, మేలిమి సతులు= గొప్ప గొల్లభామలు, మేనబావ= బావ వరసైన వాడు, కోలు= పెద్ద, కూడు= చేరు.
3. అట్టులు= దోశలు, అడుకులు= అటుకులు, గోలలు= కట్టుగట్టే కర్ర, దిట్ట= గొప్ప, కట్టుక= కట్టుకొని,పెండ్లాడి, కడగు= పూనుకొను.

**భావము:** ఏమమ్మా యశోదమ్మా! చూశావా! నీ బిడ్డ కృష్ణుడు ఎన్నెన్ని అకార్యాలు చేస్తూ ఉన్నాడో గమనిస్తున్నావా? అవన్నీ చేస్తున్నది వీడే సుమా!

గొల్ల పిల్లలతో కలిసి గోపికల ఇండ్లలో దొంగతనముగా ఉట్లు గొట్టిన వాడు వీడే! చిలిపి చేష్టలు చేస్తూ గోపికల వక్షస్థలములను ముట్టుకొని చిల్లర చేష్టలు చేస్తున్నదీ వీడే!

గొల్లవారి ఇళ్ళలో బానలతో ఉన్న పాలు వెన్నలు చేతులు చాచి ఆరగించినవాడు వీడే! ఆ గొల్లచెల్లులకు వరసైన మేనబావనని చెప్పి, పెద్దరికము వహిస్తూ నిలబడ్డవాడు కూడా వీడే సుమా!

దోశలు, చక్కిలాలు, అటుకులు మొదలైనవి వ్రేలాడదీసిన ఆయింటిలో కొక్కెములను విప్పి, కొల్లగొట్టి ఆరగించినది వీడే! ఘనుడై వేంకటాద్రి మీద అలమేలుమంగమ్మను కూడి శ్రీవేంకటేశ్వరుడై, దేవతామూర్తి అయినవాడు కూడా వీడే సుమా!

**విశేషము:** ఈ కీర్తనలోని అంత్యప్రాసలు “వీడే..వీడే” అంటూ సాగి శ్రీమద్భాగవతంలోని పద్యాలను గుర్తుకు తెస్తున్నాయి.

## 259

**అవతారిక:** అమ్మ అకారణంగా స్వామితో కయ్యాలు పెట్టుకొంటున్నదని గ్రహించిన చెలులు తగదని చెప్తున్న దృశ్యం.

### శంకరాభరణం

ప. తగవులు చెప్పుమనీ దండనే నీ రమణుఁడు
మొగము చూపరాదా మునికొనిఁ(నీ?న?) వలపు ॥పల్లవి॥

1. నీవాతని వెంగెమాడ నేరిచినదానవు
యీవేళ నిట్టె పంతమియ్య నేరవా
చేవదేర బుద్దులెల్లాఁ జెప్పేరు నీకుఁ జెలులు
వోవరిలోఁ దలవంచు కూరకుండనేఁటికే ॥తగవులు॥

2. సంగడినే బొమ్మల జంకించినదానవు
ముంగిటి కాతఁడు వస్తే మొక్కఁగవద్దా
చెంగట నుండి నీతులు చిలుకలు చదివీని
సంగతి దెలుసుక యిచ్చక మాడఁదగదా ॥తగవులు॥

3. శ్రీవేంకటేశ్వరుఁ జేరి కూడినదానవు

సేవ లలమేల్మంగవు సేయఁగవద్దా
కావరపుఁబావురాలు గక్కున రతులు చూపీ
నీవు నాతఁడును నిట్టె నెలకొనఁ జెల్లునే ॥తగవులు॥

**అర్థములు:** ప. అండ= ప్రక్క, రమణుడు= సుందరుడు, మునికొను= అతిశయించు.

1. వెంగెము= పరిహాసము, పంతము= పట్టుదల, చేవదేరు= సారవంతమగు, ఓవరి= లోపలిగది.
2. సంగడి= వెనుక, బొమ్మలు= కనుబొమ్మలు, జంకించు= అదరవేయు, ముంగిటి= ముందర, చెంగట= చెంత, నీతులు చిలుకలు= నీతులు, బుద్ధులు మొదలైనవి చెప్పుట, సంగతి= విషయము, ఇచ్చకము= ముఖప్రీతి.
3. సేవ= ఊడిగము, కావరపు బావురాలు= మదముతో గూడిన పనులు, గక్కున= శీఘ్రముగా, నెలకొను= కలుగు.

**భావము:** ఏమమ్మా అలమేలుమంగమ్మా! ఈ తగవులెందుకు చెప్పమని ప్రక్కనే ఉన్న నీ నాథుడు ప్రశ్నిస్తున్నాడు. ఆయనకు నీ అతిశయించిన ప్రేమాదరములతో నీ ముఖారవిందము వారికి చూపించరాదా!

నీవు ఆ స్వామిని పరిహాసాలాడడం బాగా నేర్చిన దానవు. ఈరోజు ఇంత పంతముతో ప్రవర్తిస్తున్నావు. నీ విధముగా ప్రవర్తిస్తే చెలులు నీకు బుద్ధిచెప్పకమానరు. లోపలి గదిలో తలవంచుకుని కూర్చోవడమెందుకు?

స్వామి వెనుక నిలబడి కనుబొమ్మలు జంకించినదానవు. నీ ముందరికి వస్తే ఆయనకు నమస్కరించవద్దా? ప్రక్కనే ఉండి ఎన్నో నీతి వాక్యాలు పలుకుతావు గానీ, విషయము తెలుసుకొని ఇష్టమైన కబుర్లు చెప్పాలిగదా!

శ్రీవేంకటేశ్వరుని చేరి కూడిన దానవు కదా ఆ స్వామికి సేవలు చేయవలదా చెప్పు? మదముతో కూడిన పనులు చేసినా ఆ స్వామి నిన్ను శీఘ్రముగా చేకొని శృంగారక్రీడలో తేలించాడు గదా! నీవు ఆ స్వామితో ఈ విధముగానే నెలకొని యుండగా అన్ని విషయాలు కొనసాగిపోతాయి కదా! ఇంక పంతాలు పట్టింపులు ఎందులకు?

## 260

**అవతారిక:** అలమేలుమంగమ్మ యౌవనము, స్వామిపైగల వలపు ఎలాంటివో వివిధ వర్ణనలతో వివరిస్తున్నాడు అన్నమయ్య.

## దేవగాంధారి

ప. అంగనజవ్వన మామనికాలము
సంగడినె నీకు జడిగొనె వలపు ॥పల్లవి॥

1. తీగెమెఱుఁగులు తెఅవచూపులు
బాగైనమేఘమ్ము బలుకొప్పు
చేగదేర రతిచెమట వానలు
యీగతిఁ గురిసె నింతాయ వలపు ॥అంగన॥

2. యింతిమోవి కెంపు లింద్రగోపములు
చెంతఁ గోరికలు సెలయేరులు
పొంతనున్న నీరుబుగ్గలు పులకలు
అంతటాఁదొరుగఁగా నసలాయ వలపు ॥అంగన॥

3. అలమేలుమంగ మోహము నిగిడినసోన
నెలకొన్న చెరువు నీమనసు
వలనై శ్రీవెంకటేశ్వర నీవు గూడఁగ
ఫలమై జగములోనఁ బదనాయ వలపు ॥అంగన॥

**అర్థములు:** ప. అంగన= వనిత, జవ్వనము= యౌవనము, ఆమని= వసంతము, సంగడి= సమీపము, జడిగొను= అతిశయించు, వలపు= ప్రేమ.

1. తీగె మెరుగులు= తీగ మెరుపులు, తెరవ చూపులు= ఆడుదాని చూపులు, మేఘము= నల్లనైనది, కొప్పు= శిఖ, చేగదేర= సారవంతమైన, ఈగతి= ఈతీరుగా.
2. ఇంతి= స్త్రీ, కెంపులింద్రగోపములు= కెంపులు, ఇంద్రనీల మణులు, బుగ్గ= నీటిచెలమ, పులక= గగుర్పు, దొరుగగా= లభించగా.
3. నిగిడిన= నిక్కిన,దీర్ఘమైన, సోన= అల్పవర్షము, ఫలము= పండు, జగము= ప్రపంచము, పదను= వాడి.

**భావము:** స్త్రీ యౌవనమనేది వసంతకాలం వంటిది. సమీపించగనే ప్రేమ అతిశయించడం సహజము.

ఆడుదాని చూపులు తీగ మెరుపుల వంటివి. తళుక్కున మెరుస్తూ ఉంటాయి. ఆమె కొప్పు మబ్బులా నల్లగా కారు మేఘంలా ఉంటుంది. సారవంతమైన రతిక్రీడా విలాసము చెమటవాసనలతో యింపైనది. ఈరీతిగా ప్రేమ వర్షంలా కురుస్తూ యింతగా జేసినది.

ఆడుదాని ముఖం కెంపులు, ఇంద్రనీల మణులు. ఆమె చెంత నున్న కోరికలు సెలయేరుల్లాగా ప్రవహిస్తూ ఉంటాయి. ప్రక్కనే ఉన్న నీటి బుగ్గల్లోని నీరు బుగ్గలపై కలిగే గగుర్పాటులా సదా ఊరుతూనే ఉంటుంది. అంతటా దొరకేటి ఈ ప్రేమ అసలైనది సుమా!

అలమేలుమంగమ్మ ప్రేమ మోహములు దీర్ఘమైన చిన్నగా కురిసేటి వర్షంలా ఉన్నది. మరి నీ మనసేమో పెద్ద కాసారములా నిండుగా ఉన్నది. వలలో చిక్కిన చేపవలె శ్రీవేంకటేశ్వరుని ఆమెను కూడగా, మాగిన ఫలము వలె ఈ జగతిలో ఆ ప్రేమ ఎంత వాడియైనదో కదా!

**విశేషము:** ఈ కీర్తనలోని అంత్యప్రాసలు "వలపు..వలపు" అంటూ సాగిన అంత్యప్రాసలు కీర్తనకు వన్నె తెచ్చాయి.

## 261

**అవతారిక:** తిరుపతిలో గోవిందరాజుగా వెలసిన శ్రీవేంకటేశ్వరుని వర్ణన చేస్తున్నాడు అన్నమయ్య.

## సామంతం

ప. కుందణ(న?)పుదట్టి గట్టి గోవిందరాజు సంది-
గొందుల సతులఁ గూడె గోవిందరాజు ॥పల్లవి॥

1. గోవులఁ గాచిననాఁటి గోవిందరాజు నేఁడు
కోవిదుఁడై వున్నవాఁడు గోవిందరాజు
కూవలు చేసీ వలపు గోవిందరాజు! పిల్లఁ-
గోవిలోనే మాటలాడీ గోవిందరాజు ॥కుంద॥

2. కుండలతోఁ బాలుదాగే గోవిందరాజు! నేఁడు
కొండంతదొరైనాఁడు గోవిందరాజు
కొండుకబాలులతోడ గొవిందరాజు! వుట్లు
కొండాటముగఁ గొట్టె గోవిందరాజు ॥కుంద॥

3. కొలనిలో ఆగడీఁడు గోవిందరాజు నేఁడు
కొలువు సేయించుకొనీ గోవిందరాజు
కొలఁదిమీర మమ్మేలె గోవిందరాజు మా
కొలమే శ్రీవేంకటాద్రి గోవిందరాజు ॥కుంద॥

**అర్థములు:** ప. కుందనము= మేలిమి బంగారము, దట్టి= పంచె, సందిగొందులు= ఊరిలోని సందులు,గొందులు, కూడె= కలిసె.

1. కోవిదుడు= విద్వాంసుడు, కూవలు= కుప్ప,కువ్వ, పిల్లగోవి= మురళి,పిల్లనగ్రోవి.
2. కొండనత దొర= చాలా ప్రసిద్ధికెక్కిన, కొండుక= బాలిక, కొండాటము= సంతోషము, కొట్టు= దోచు.
3. కొలను= సరస్సు, ఆగడీడు= అకార్యాలు చేసేవాడు, కొలువు= సేవ, కొలదిమీర= అపరిమితముగ, కొలము= కులము.

**భావము:** శ్రీగోవిందరాజ స్వామి మేలిమి బంగారువన్నె వస్త్రము ధరించి, సందు గొందులలో ఉన్న అంగనామణులకై తిరుగుచున్నాడు.

ద్వాపరంలో గోవులను గాచిన ఈ గోవిందరాజు, నేడు సుప్రసిద్ధుడై ఇచట విద్వాంసుడై కొలువైనాడు. ఈ స్వామి ప్రేమలను రాశులుగా చేసి మురళీనాదంతోనే అందరితో మాట్లాడగల స్వామి.

ఆనాడు కుండలతో పాలుత్రాగి, వెన్నను దోచినవాడు, నేడు ఇక్కడ భక్తులకు కొండంత అండయై నిలిచిఉన్నాడు. ఆనాడు బాల, బాలికలతో కలసి అల్లరి చిల్లరగా తిరుగుతూ ఆనందముతో ఉట్లు గొట్టిన వాడు ఈ గోవిందరాజే సుమా!

ఆనాడు కొలనులో స్త్రీల వస్త్రములు దోచి అల్లరి పెట్టి, ఎన్నో అకార్యములు చేసిన ఈ గోవిందరాజు, నేడు అందరిచేత సేవలు చేయించుకొంటూ ఇక్కడ తిరుపతి క్షేత్రంలో కొలువై ఉన్నాడు. అపరిమితములైన మా కోర్కెలను తీరుస్తూ మమ్మేలుచున్న ఈ గోవిందరాజు, మా కులమే సుమా!

**విశేషము:** తిరుమల శ్రీనివాసుడు, తిరుపతి గోవిందరాజులు రెండూ విష్ణుస్వరూపాలే అయినప్పటికి భక్తులు గోవిందరాజస్వామిని శ్రీనివాసుని అన్నగా భావిస్తూంటారు. తిరుపతి వేంకటేశ్వరుని దర్శనానికి వెళ్ళిన కొందరు భక్తులు తిరుపతిలోని గోవిందరాజస్వామి దర్శనం చేసుకునే కొండ ఎక్కేఆచారం ఆనాడు ఉండేది. కొండపైకి ఎక్కలేని భక్తులు కొందరు గోవిందరాజస్వామిని దర్శించుకుని వెనుదిరిగి వెళ్ళిపోయేవారట. ఆ కారణంగానే గోవిందరాజస్వామిని తిరుమలలో కొలువైన వేంకటేశ్వరునికి అన్నగా భక్తులు సంభావిస్తూంటారు.

## 262

**అవతారిక:** ద్వాపర యుగములో శ్రీకృష్ణుడు చేసిన పనులను కొనియాడుతూ కీర్తిస్తున్నాడు అన్నమయ్య.

### గుజ్జరి

ప. ఓపినంత తొల్లె వింటి నూరిలోన నీ సుద్దులు
నీపాటివారమా నెలంతల మిపుడు ॥పల్లవి॥

1. చెలరేఁగి చెలరేఁగి చెప్పేవు మాటలు
కొలఁది వెట్టరావు వూఁకొనే నంటేను
బలిమికాఁడవు తొల్లె పదారువేలసతుల-
వలపెల్లాఁ జెప్పేనంటే వసమా వినఁగను ॥ఓపి॥

2. సారెసారె నాముందరఁ జదివేవు నీతులు
మేర మితి లేదు నిన్ను మెచ్చేనంటేను
ఆరితేరినవాఁడవు అట్టె గొల్లెతలకథా-
భారతము చెప్పఁగానే భట్టనా పొగడను ॥ఓపి॥

3. కొసరి కొసరి నన్నుఁ గూడేవు శ్రీవేంకటేశ
సరసమా నీనేరుపు చూచేనంటేను
అసమానుఁడవు నీవు అష్టమహిషల రతి-
పస లెంచితే మనసు పట్టునా సంతోసము ॥ఓపి॥

**అర్థములు:** ప. ఓపినంత= సహనముతో ఉన్నంత కాలము, తొల్లె= పూర్వము, సుద్దులు= మాటలు, నీపాటి= నీకు సరియైన, నెలతలు= స్త్రీలు.

1. చెలరేగి= విజృంభించి, కొలది= పరిమితి, ఊకొను= సమ్మతించు,ఊకొట్టు, బలిమికాడు= బలవంతుడు, పదారువేల సతులు= ద్వాపర యుగములో శ్రీకృష్ణుడుగా ఉన్నప్పటి పదహారువేలమంది భార్యలు, వసము= వశము,శక్యము.
2. సారె సారె= మాటిమాటికి, నీతులు= గొప్పమాటలు, మేరమితి= పరిమితి, ఆరితేరు= మిక్కిలి నేర్పరి, గొల్లెతల కథా భారతము= ద్వాపర యుగపు గొల్లభామల కథలు, భట్టు= భట్రాజు,రాజులను పొగడెడి వాడు.
3. కొసరు= కోరు, సుసరము= సూక్ష్మము,వెంటనే, నేరుపు= నైపుణ్యము, అసమానుడు= అసాధ్యుడు,మిక్కిలి గొప్పవాడు, అష్టమహిషులు= శ్రీకృష్ణుని అష్టభార్యలు, పస= చాతుర్యము, సంతోసము= ఆనందము.

**భావము:** ఓ స్వామీ! సహనమున్నంతవరకూ ఈ ఊరిలో చెప్పుకునే నీ కథలన్నీ పూర్వమే వినియున్నాము. మేము నీకు సరియైనవారమా? ఆడువారము కదా!

నీ విషయాలన్నీ విజృంభించి మరీ చెప్తూ ఉంటావు. సమ్మతించి ఊకొట్టినప్పటికి, వాటికి పరిమితిలేనే లేదు. నీవు గొప్ప బలవంతుడవు. పూర్వము పదహారు వేలమంది అంగనామణులకు భర్తవై యున్నావు. ఆ ప్రేమ కథలు చెప్తూ ఉంటే వినడం మా తరమౌతుందా స్వామీ!

స్వామీ! మాటి మాటిమి మా ముందు ఏవో నీతి వాక్యాలు వల్లిస్తుంటావు. నిన్ను ప్రశంసించినప్పటికి ఆ విషయాలకు పరిమితిలేదు. నీవు నేర్పరివైనప్పటికి, ఆ గొల్లెతల విశేషాలన్నీ విని పొగడడానికి మేమేమైన భట్రాజులమా నిన్ను మాటిమాటికి కీర్తించడానికి చెప్పండి.

ఓ శ్రీవేంకటేశ్వరా! కోరి కోరి నన్ను చేరుకుంటావు. కానీ నీ నైపుణ్యాలను పొగడడం అంత సులభ సాధ్యమా? నీవు సాటిలేని వాడవు. కానీ, మాటి మాటికి ఆ అష్ట మహిషుల ప్రసక్తి తెచ్చినట్లైతే, ఆ విషయం మా మనసులకు సంతోషాన్నిస్తుందా ఆలోచించండి స్వామీ!

**విశేషాంశాలు:**

1. ఈ కీర్తనలో చరణాల ప్రారంభంలో చెలరేగి, సారె, కొసరి అనే ఆదిప్రాసలను వాడి కీర్తనకు మంచి శోభ కలిగించాడు. అలాగే వసమా వినగను, భట్టనా పొగడను, పట్టునా సంతోసము అనే అంత్య ప్రాసలు సైతం ప్రశంసించదగ్గవి.
2. శ్రీకృష్ణుని అష్టభార్యల ప్రసక్తి ఈ కీర్తనలో ఉంది. ద్వాపర యుగంలో శ్రీకృష్ణునికి రుక్మిణి, సత్యభామ, జాంబవతి, కాళింది, మిత్రవింద, నగ్నజితి, భద్ర, లక్ష్మణ అనే ఎనిమిది మంది భార్యలున్నారన్న విషయం చివరి చరణంలో ఉటంకించాడు.

## 263

**అవతారిక:** అలమేలుమంగమ్మపై స్వామి ప్రసన్నతను చూపుతున్నాడని గమనించిన చెలులు అమ్మతో స్వామికి నమస్కరించి దరిచేరమని ప్రబోధిస్తున్నారు.

### కుంతలవరాళి

ప    .మొక్కవే పాదాలకు మొనసి నీవు<br>
మిక్కిలి నీ నాయకుఁడు మేలువాఁడే నీకు    ॥పల్లవి॥

1.    చెక్కునఁబెట్టినచెయ్యిసెలవుల నీనవ్వు<br>
నిక్కిచూచి మోహించెనే నీరమణుడు<br>
ముక్కుపైఁ బెట్టిన వేలు ముంచిననీనివ్వెరగు<br>
తక్కక పొగడీ నిదే తమితోడ నిపుడు    ॥మొక్కవే॥

2.    పదఁతులపై వొరగుపాదముపై పాదము

చిదుముడితోఁ దలపోసెఁ జిత్తములోన
అడియాసమాటలు అట్టె పైకొనే జోకలు
తడయక సంతోసించె తన్నుఁదానె యిపుదు ॥మొక్కవే॥

3. సారెకుఁజెమటసోన జారినపయ్యదకొంగు
చేరి వేరులేక యెంచీ శ్రీవేంకటేశుఁ-
డీరీతిఁదా నినుఁగూడె యితవరి నీప్రియాలు
తారుకాణై తేఁ బొదిగి దైవార నిపుదు ॥మొక్కవే॥

**అర్థములు:** ప. మొక్కు= నమస్కరించు, మొనసి= పూని, మేలువాడు= శుభములు కూర్చేవాడు.

1. చెక్కున= చెక్కిట, సెలవుల నవ్వులు= పెదవి మూల నవ్వులు, నిక్కి= పొడవుగా,దీర్ఘముగా, మోహించు= వలచు, రమణుడు= సుందరుడు, ముంచిన= అతిశయించిన నివ్వెరగు= పారవశ్యము, తక్కక= వెనుదీయని, తమి= కుతూహలము.
2. పడతి= స్త్రీ, ఒరగు= వాలు, చిదుముడి= తొట్రుపాటు, చిత్తము= మనసు, అడియాస= తీరని కోరిక, పైకొను= కలుగు, జోకలు= విధము, తడయు= ఆలసించు.
3. సారె= మాటిమాటికి, చెమట సోన= అల్పవర్షమువంటి చెమట, హితవరి= ప్రియుడు, తారుకాణ= ఋజువు, పొదిగి= చుట్టుకొను, దైవారు= ప్రకాశించు.

**భావము:** ఓ అలమేలుమంగమ్మా! స్వామి పాదాలకు పూని నమస్కరించవే! ఈ స్వామి నీకు సర్వదా శుభములను కూర్చేవాడు.

చెక్కిలిపై పెట్టుకొన్న నీ చేయి, నీ పెదవిమూల నవ్వులు అన్నీ తలపైకెత్తి నిగిడి చూస్తూ గమనిస్తున్నాడే నీ మనోహరుడు. ముక్కున వేలు బెట్టుకొని అతిశయించిన నీ పారవశ్యము, నీ అందమును, స్వామి వెనుదీయక తప్పక మోహముతో ప్రశంసిస్తాడు ఇపుడు చూడవే!

రమణులపై వాలే విధంగా పాదము పైన పాదముతో, తొట్రుపాటుతో మనసులో ఆలోచిస్తూ, తీరని కోరికలనే నీ మాటలు, అదేవిధంగా నీకు కలిగే మోహాతిశయము ఆలసించక, తన్ను తాను గమనించి నెరవేరుస్తాడుగదే ఇపుడే!

మాటి మాటికి అల్పవర్షంలా కారే చెమట, జారిన నీ పైటకొంగు చూసి వేరేవిధంగా అనుకోక శ్రీవేంకటేశ్వరుడు ఈ విధముగా నిన్ను చేరుకొని, నీతో మాట్లాడే ప్రియవచనాలే దానికి ఋజువు. నిన్ను చుట్టుకొని ప్రకాశించడమే స్వామికిప్పుడు ప్రియమైన కార్యము.

## 264

**అవతారిక:** స్వామికి తనపై ఆదరాభిమానాలున్నాయని తనకు తెలియుననీ, ఆయన గౌరవాన్ని తగ్గించే విధంగా ఎన్నడూ చేయజాలనని, అమ్మ చెలులతో చెప్తున్నది.

### ధన్నాసి

ప. ఇంత నాపై బత్తి గలుతెరుఁగుదునే
మంతనాన నన్నుఁ దాను మన్నించుటే చాలదా ॥పల్లవి॥

1. మొక్కకుమనవే తాను మునుపనే దొడ్డదొర
తక్క కడపము వట్టేతరుణి నేను
దిక్కులఁదనపట్టపుదేవుల్లు విని యట్టె
వెక్కసాన నవ్వితేను వినవోప నేను ॥ఇంత॥

2. కిందుపడకుమనవే క్రియగలపంతగాఁడు
కందువ కాళాఁజివట్టేకామిని నేను
దొంద్దిదనకొత్తపెండ్లి కూఁతులు యీసుద్దెరిఁగి

చెంది తన్నుఁ బంగించితే సిగ్గువడఁజాలను ॥ఇంత॥

3. తమకించకుమనవే తాను శ్రీవేంకటేశుఁడు
అమర బోనము వెట్టేయంగన నేను
సముకానఁ దా నన్నేలె చనవరులెల్లాఁజూచి
క్రమముతోఁబెనఁగితే కాదనఁగనేరను ॥ఇంత॥

**అర్థములు:** ప. బత్తి= భక్తి, గలుత–ఎరుగుదునే – గలుతెరుగుదునే= కలిగియున్నాడన్న విషయము ఎరిగి యున్నాను, మంతనము= ఏకాంతము, మన్నించు= గౌరవించి చేపట్టు.

1. మొక్కకు= మ్రొక్కవద్దు, మునుపు= పూర్వమే, దొడ్డదొర= కీర్తివంతుడైన ప్రభువు, కడపము= ఇంటి కడప, వట్టు= పట్టుకొని, తరుణి= స్త్రీ, దిక్కుల= నలుగు ప్రక్కల, పట్టపు దేవుళ్ళు= పట్టపు రాణులు, వెక్కసము= అధికము, విననోప= వినజాలను.
2. కిందుపడకు= క్రిందకు ఒంగి నమస్కరించు, క్రియగల= వ్యవహారముగల, పంతగాడు= పట్టుదల ఉన్నవాడు, కందువ= జాడ, కాళాజి= తమ్మపడిగె, తరుణి= స్త్రీ, గొంది= మరుగు, పెండ్లికూతులు= పెండ్లి కుమార్తెలు, ఈసుద్దెరిగి= ఈమాటలు విని, పంగించు= పూర్వము చేసిన పొరబాటునెత్తి చూపు.
3. తమకము= మోహము, అమర= తగినవిధముగా, బోనము= భోజనము, అంగన= స్త్రీ, సముకము= ఎదురుగా, చనవరి= స్నేహితుడు, పెనగు= చుట్టుకొను, కాదనగనేరను= కాదనలేను.

**భావము:** స్వామికి నాపై ఇంత గౌరవాదారాలు ఉన్నాయన్న సంగతి ఎరిగినదాననే సుమా! ఏకాంతములో స్వామి నన్ను గౌరవించి చేకొంటే అంతే చాలు నాకు.

స్వామికి ఎంత ప్రేమ ఉన్నప్పటికి నాకు నమస్కరించవద్దని చెప్పవే! స్వామి కీర్తివంతుడైన ప్రభువు కదా! నేను ఇంటి కడప పట్టుకొని ఆయనకై ఎదురు చూసే దాన్ని కదా! చుట్టుప్రక్కల నున్న ఆయన పట్టపురాణులు విని అధికముగా నవ్వితే విని ఓర్చుకోలేను కదా!

ఆ స్వామిని నాకే వంగి నమస్కరించవద్దని చెప్పవే! ఆయన సర్వ సమర్థుడైన పట్టుదలగలవాడు. నేనేమో ఆయన తమ్మపడిగెను పట్టే స్త్రీని. మరుగున ఉన్న స్వామి క్రొత్త పెండ్లి కుమార్తెలు ఈ మాటలు తెలుసుకొని, ఆ స్వామి చేసిన పొరబాట్లు ఎత్తిచూపితే నేను సిగ్గుపడజాలను.

నన్ను మోహముతో త్వరపరచవద్దని చెప్పవే! ఆయన మహిమాన్వితుడైన శ్రీవేంకటేశ్వరుడు. నేను ఆయనకు భోజనము వడ్డించే స్త్రీని. ఎదురుగా నన్నేలుకుంటున్న వాడు. చుట్టుప్రక్కల ఉన్న వనితలు ఇదంతా చూచి ఆయనను వరుసగా చుట్టుకొంటే నేను కాదనగలనా చెప్పండి.

## 265

**అవతారిక:** అమ్మ స్వామిపట్ల ఎందుకో ముభావంగా ఉండడం గమనించిన చెలులు స్వామి కోరినప్పుడు దరిజేరి ప్రార్థించి కోరికలన్నీ చెల్లించుకోమని చెబుతున్న సన్నివేశం.

## దేసాళం

ప ప్రియము చెప్పేవేళ బిగియనేల
నయగారితనముల నవ్వు లిట్టె వలెనా ॥పల్లవి॥

1. కూటమికి నాతఁడు కొంగువట్టుకుండఁగాను
యేటికిఁబెనఁగులాడే వెందాఁకాను
నీటున జోలిసేసేవు నేరుపరి విన్నిటాను
మాట లేమిగలిగినా మరి యాడరాదా ॥ప్రియము॥

2. ఆసపడి మోవితేనె లాతఁడిట్టె యడుగఁగా
వాసులేల నెరపేవు వట్టిబీరాన
వోసరించి యేడలేనివూడిగా లొనరించేవు
చేసేటినీబత్తి మరి చెల్లించరాదా ॥ప్రియము॥

3. యిప్పుడే శ్రీవేంకటేశుఁడిటు నిన్నుఁగూడఁగాను
తప్పక యేమి చూచేవు తమకించేవు
అప్పటిని మెచ్చి మెచ్చి యట్టె బుజ్జగించేవు
కొప్పుదువ్వి మరి వేఁడుకొని మొక్కరాదా ॥ప్రియము॥

**అర్థములు:** ప. ప్రియము= మంచిమాట, బిగియు= బెట్టుచేయు, నయగారితనము= మృదుత్వము.

1. కూటమి= సమూహము, ఏటికి= ఎందుకు, పెనగులాడు= తిరస్కరించుకోవడం, నీటు= శృంగార గర్వము, జోలి= విషయము చెప్పు, నేరుపరి= నేర్పరి.
2. మోవితేనె= అధరామృతము, వాసులు= గొప్పలు, బీరము= డంబములు, ఓసరించు= అయిష్టముగ, ఊడిగాలు= సేవలు, బత్తి= భక్తి,మర్యాద, చెల్లించు= జరిపించు.
3. తప్పక= తదేకమైన చూపు, తమకము= మోహము, బుజ్జగించు= లాలించు, వేడుకొను= ప్రార్థించు, మొక్కు= నమస్కరించు.

**భావము:** స్వామితో మంచి కబుర్లాడుకొంటూ సంతోషంగా ఉన్న సమయాలలో ఇలా బెట్టు చేయడమెందుకు? ఎంత మృదువైన స్వభావం ఉంటే మాత్రం ఇలా నవ్వులు నవ్వడం తగునా?

జనసమూహంలో స్వామి కొంగు పట్టుకోగానే, ఎందుకు అలా పెనగులాడి వదిలించుకుంటావు? శృంగార గర్వముతో విషయమేమీ చెప్పకుండా , నేర్పరిగా ప్రవర్తిస్తున్నావు. ఏమైనా మాటలాడవలసిన విషయాలుంటే తనివి తీరా మాట్లాడరాదా?

ఆ స్వామి ఎంతో ఆశగా నీ అధరామృతాన్ని అడిగితే గొప్పలకు పోతూ నీ డంబాలన్నీ ప్రదర్శిస్తూ ఉంటావు. అయిష్టం చూపుతూనే ఎక్కడాలేని సేవలన్నీ చేస్తూ ఉంటావు. అంత భక్తిప్రపత్తులున్న దానివైతే అవన్నీ జరిపించుకోరాదా?

ఈ సమయములో స్వామి శ్రీవేంకటేశ్వరుడు నిన్ను కలియగానే, తదేకంగా చూస్తూ మోహాన్ని కలిగిస్తున్నావు. స్వామిని ప్రశంసిస్తూ లాలించి బుజ్జగించి ఆయన కొప్పు దువ్వి నమస్కరించి నీ కోరికలీడేర్చమని ప్రార్థించరాదా!

## 266

**అవతారిక:** స్వామి చేసే చిలిపి శృంగార చేష్టలకు కొలువులో స్త్రీజనం సిగ్గుపడుతున్నారంటూ అమ్మ స్వామికి చేస్తున్న నివేదన.

### నీలాంబరి

ప. చూచితివో చూడవో సుదతులవంక నీవు
కాచుకొని నేనిన్నియుఁ గనుఁగొంటి నిపుడు ॥పల్లవి॥

1. పానుపుపైఁ బవళించి పడఁతిఁబేరఁబిలిచి
పానిపట్టి పాదాలు పైఁజాఁచితివి
దానికేపో కొలువులో తరుణులు సిగ్గువడి
మోనముతోడుత ముసిముసినవ్వు నగిరి ॥చూచి॥

2. గుట్టుననే తమకించి కొమ్మఁగొంగువట్టితీసి
ముట్టి చన్నులపై గోరు మోపితివి
చుట్టిరానున్నసతులు చూచి తమలో లోఁగి
అట్టుమీచేఁతకు శిర సట్టె వూఁచుకొనిరి ॥చూచి॥

3. కావరపువలపుతో కాంతఁగాఁగిట నునిచి
శ్రీవేంకటేశ నన్నుఁబచ్చిగా నేలితి-
వీవేళ నందరు నన్ననెనసిరి కాతరించి
వేవేలురతులు భావింపుచుఁ బొగడిరి ॥చూచి॥

**అర్థములు:** ప. సుదతులు= స్త్రీలు, కాచుకొను= వేచిచూచు, కనుగొను= గమనించు.

1. పడతి= స్త్రీ, పేర పిలుచు= పేరుబెట్టి పిలుచు, పానిపట్టు= ప్రయత్నించు, పైజాచు= పైకి జాపుకొను, తరుణులు= స్త్రీలు, మోనము= మౌనము, నగిరి= నవ్విరి,
2. గుట్టు= రహస్యము, తమకించు= తత్తరపడు, కొమ్మ= స్త్రీ, ముట్టి= తాకి, గోరుమోపు= గాయము చేయు, చుట్టిరానున్న= ప్రదక్షిణ చేయనున్న, లోగు= వెనుదీయు, రట్టు= అల్లరి, శిరసు= తల, ఊచుకొను= సరేయను.
3. కావరపువలపు= మదముతోకూడిన ప్రేమ, కాగిట= కౌగిట, ఉనిచి= ఉండునట్లుచేయు, పచ్చిగా= మరుగులేక, ఎనయు= పొందు, కాతరించి= భయపడి, వేవేలు= లెక్కకు మిక్కిలి, భావింపుచు= భావించి, పొగడు= కీర్తించు.

**భావము:** స్వామీ! మిమ్మే నమ్ముకున్న ఆడువారివైపు మీరు చూస్తున్నారో లేదో తెలియదు కానీ వేచి వేచి ఆ విషయాలన్నీ నేను గమనిస్తున్నాను.

పట్టు పాన్పుపై పడుకొని పేరుపెట్టి పిలుస్తూ, ప్రయత్నించి నీ పాదాలు వారిమీదకు చాచుకొన్నావు. దానికే కొలువులో ఉన్న స్త్రీలు సిగ్గుపడి మౌనంగా ముసి ముసి నవ్వులు నవ్వుకొన్నారు.

కొలువులో రహస్యంగా తత్తరపడుతూ ఆ భామ కొంగుపట్టి తీసి ఆమె రొమ్ములపై నీ నఖక్షతాలు వేశావు. మీకు ప్రదక్షిణలు చేస్తున్న రమణులంతా తమలో తాము వెనుదీసి, మీ అల్లరి పనులకు తలయూచి అలాగే ఉండిపోయారు.

పట్టరాని మదముతో గూడిన ప్రేమాతిశయముతో ఆ కాంతను కౌగిటిలోకి లాగి ఉంచుకొని, శ్రీవేంకటేశ్వరా ఇట నన్ను మరుగులేకుండా పొంది ఏలుకున్నావు. ఈవేళ అందరూ వనితలూ భయముతో నీ లెక్కలేనన్ని రతిక్రీడలను తలచుకొంటూ ప్రశంసిస్తున్నారు.

## 267

**అవతారిక:** స్వామిని తలచుకొని అమ్మ సిగ్గులు చిందిస్తుండగా చెలులు ఆవిషయాలన్నీ స్వామి వారికి వివరిస్తున్నారు.

## సామంతం

ప కామినిభావము నేఁడు కంటివా నీవు
కోమలపు కొత్తపెండ్లికొడుక వైనాఁడవు ॥పల్లవి॥

1. నిలిచి యేకతమున నీపై గీతాలు వాడి
చెలి నీ వంతలో రాఁగా సిగ్గువడెను
నలిరేఁగి నీవందుకు నవ్వినవ్వి మెచ్చఁగాను
కులికి కులికి మేనఁ గురిసీఁ జెమట ॥కామిని॥

2. చతురత నీదట్టి చన్నులపై గప్పుకొని
తతి నట్టె నిన్నుఁజూచి తలవంచెను
కతలుగా నీవందుకు కరుణతోఁ బొఁగడఁగా
కుతుకపుతమకాన గుప్పీఁబులకలు ॥కామిని॥

3. నెట్టన శ్రీవేంకటేశ నీపానుపుపైఁబండి
అట్టె నీవు కూడఁగా నరుదందెను

వొట్టి నీవందుకు నన్ను నొనరి బుజ్జగించcగా
ముట్టిననీరతులలో ముంచీ వలపులు ॥కామిని॥

**అర్థములు:** ప. కామిని= స్త్రీ, భావము= మనసులో ఉన్నది, కోమలము= అందమైన.

1. ఏకతము= అనన్య చింతన, వాడి= పాడి, నలిరేగు= విజృంభించు, కులికి= నర్తించి, మేన= శరీరంపై, కురిసీ= కురిసెను.
2. చతురత= చమత్కారము, దట్టి= దళసరి వస్త్రము, తతి= సమయము, కతలు= కథలు, కరుణ= దయ, కుతుకము= అనుభవింపని కోరికయందలి ఆశ, గుప్పీ= విసరు, పులకలు= గగుర్పాటు.
3. నెట్టన= అనివార్యముగా, బండి= పడుకొని, అరుదు= అపూర్వము, ఒట్టి= రిక్తము,ఏమీలేని, ఒనరు= కలుగు, బుజ్జగించు= లాలించు,బ్రతిమాలు, ముట్టిన= తాకిన, ముంచీ= అతిక్రమించు.

**భావము:** స్వామీ నువ్వు ఆ స్త్రీ మనసులోనున్నది గ్రహించావా ఏమిటి క్రొత్త పెండ్లికొడుకుగా అందంగా తయారయ్యావు.

ఆమె అనన్యచింతనతో నీపై పాటలు పాడుతూ నీవు రాగానే సిగ్గుపడినది. విజృభించి నీవు నవ్వులు నవ్వి ఆమెను మెచ్చుకొనగా, ఆమె నర్తించి, నర్తించి, శరీరముపై చెమట వర్షంలా గురియుచున్నది.

చమత్కారంగా ఆమె వక్షస్థలముపై వస్త్రము కప్పుకొని, నిన్ను ఆ సమయములో చూడగానే సిగ్గుతో తలవంచుకొన్నది. నీవు దయతో అందులకు ఆమెను ప్రశంసించగా, అనుభవింపని కోరికయందలి ఆశలు మోహముతో విసరినట్లై, ఆమె మేను గగుర్పాటుకు గురియైనది.

ఓ వేంకటేశ్వరా! అనివార్యముగా పానుపుపై పరుండి, నీవు ఆమెను కూడగా, అది అపూర్వ సంగమమాయెను. స్వామీ నీవందులకు ఆమెను బుజ్జగించి లాలించగా, ఆమెను తాకిన నీ ప్రేమలు రతిక్రీడలతో అతిశయించాయి.

## 268

**అవతారిక:** స్వామి ఏకాంతముగా నున్న సమయములు దేవేరులిద్దరూ దరిచేరి ఆయన్ను ప్రసన్నం చేసుకోవడానికి యత్నిస్తున్నారు.

### నారాయణి

ప. కందువుగాని యప్పుడే కలిగిన వలపులు
సందడి జాగు లేcటికి సంగడి నున్నారము ॥పల్లవి॥

1. పొంచి మా యిద్దరినేరుపులుc జూడవలసితే
మంచముపైకి రారాదా మందలించేము
యెంచనేల పెండ్లాడితి విద్దరిని నొకమాటె
పంచుక పైcజాచరాదా పాదా లొత్తేము ॥కందువు॥

2. దండిమాచన్నులగొప్పతన మెరcగవలస్తే
నిండcగాc గాcగిలించరాదా నీటుచూపేము
అండనే మాతో నవ్వేవు అట్టే మానదుమ నీవు
పండి చూడరాదా నిన్నుcబచారించేము ॥కందువు॥

3. మించిన మా రతిబలిమి యెరcగ వలసితే
కంచపు మో వియ్యరాదా కళరేcచేము
అంచల శ్రీ వేంకటేశ అట్టె మమ్ము నేలితివి
నించరాదా పై రెంటెము నిన్ను మెప్పించేము ॥కందువు॥

**అర్థములు:** ప. కందువు= ఏకాంతము, సందడి= జనసమూహము, జాగు= ఆలశ్యము, సంగడి= స్నేహము.

1. పొంచి= దాగి, నేరుపులు= నైపుణ్యములు, మందలించు= మనవిజేయు, ఎంచు= లెక్కించు, పంచుక= నియోగించి.

2. దండి= ఎక్కువ, నిండగా= పూర్తిగ, కాగలించు= కౌగలించు, నీటు= శృంగారగర్వము, అండ= సమీపము, నడుమ= మధ్యలో, పండి= శయనించి, పచారించు= ప్రకటించు.

3. మించిన= అతిశయించిన, రతిబలిమి= రతిక్రీడలో సామర్థ్యము, కంచపు= వడ్డించిన,సిద్ధమైన, కళ= శోభ, రేచు= ఉసిగొల్పు, అంచల= దగ్గర, నించు= చూచు, రెంటెము= జతవస్త్రము, ధోవతిచాపు, మెప్పించు= ప్రశంసించు.

**భావము:** ఏకాంతముగా లేని సమయములో ప్రేమ కలిగినది కదా! ఇంకా ఆలశ్యము చేయడం ఎందుకు జతగూడి స్నేహముతో నున్నాము కదా!

దాగి చూచి మా ఇద్దరి నైపుణ్యము పరిశీలించవలసి వస్తే, పట్టు పానుపు పైకి రారాదా స్వామీ! అన్ని విషయాలు వివరంగా మనవి జేసుకుంటాము. ఇంకా ఈ లెక్కింపులెందుకు స్వామీ! మా ఇద్దరినీ ఒక్కమారే వివాహమాడావు. కొంచెం నియోగించి నీ పాదాలను జాచినట్లైతే ప్రేమగా వత్తుతాము కదా!

నిండైన మా వక్షస్థలము గురించి తెలుసుకోవాలనుకుంటే, మమ్మల్ని గాఢంగా కౌగలించుకోరాదా స్వామీ మా శృంగార కళలన్నీ చూపిస్తాము. చెంతనే ఉండి నీవు మా ఇద్దరి మధ్యా చేరి నవ్వుతూ ఉంటావు. ఒక్కసారి పానుపుపై పడుకొని చూడరాదా స్వామీ! సౌఖ్యం, ఆనందాల విషయమేమిటో పూర్తిగా నీకు తెలిసేట్టు ప్రకటిస్తాము.

ఇంత ఏల? నీకు మా రతిక్రీడలో సామర్థ్యం తెలుసుకోవాలని ఉంటే, ఒక్కసారి సిద్ధమై ఉన్న నీ అధరామృతాన్ని మాకు పంచరాదా! గొప్ప శోభలను ఉసిగొల్పే విధంగా ప్రకటిస్తాము. సమీపమునన్ను ఓ శ్రీవేంకటేశ్వరా! ఈవిధముగా మా ఇద్దరినీ ఏలుకొన్నావు. ఇకనైనా మా పైనున్న జతవస్త్రములను దయయుంచి చూడరాదా! నిన్ను మెప్పించేందుకు సిద్ధమై యున్నాము.

## 269

**అవతారిక:** స్వామి ఏక కాలంలో అనేకమంది సతులను తన శృంగార క్రీడలతో మెప్పించగలడని సవతులు ఆశ్చర్యం ప్రకటిస్తూ మాట్లాడే మాటలివి.

### ముఖారి

ప. నడుమనే కంటిమి నీ నయగారాలు
వుడివోని కోరికల నున్నారు సతులు ॥పల్లవి॥

1. చేరి వొకతెతొడపై శిరసు మోపుకవుండి
యేరా పాదా లొకతెపై యిటు చాఁచేవు
యేరీతి నుండెనోకాని ఇద్దరి అడియాసలు
సారెకుఁజెమటలతో జడిసేరు సతులు ॥నడుమ॥

2. మెక్కుచు మాటలాడేవు మునుపటియాకెతోడ
నిక్కపుఁజూపు లీపెపై నివాళించేవు
నిక్కుఁదమకము లెట్టు నెరపుకొన్నారోకాని
మిక్కిలి నిట్టూరుపుల మెరసేరు సతులు ॥నడుమ॥

3. బలిమి శ్రీవెంకటేశ పట్టపుదేవుల నేలి
చెలఁగి కూడితి విట్టె చిన్న దానిని
నిలిచినరతుల నెట్టు నిన్ను మెప్పించిరోకాని
పులకమొలకలతోఁ బొదలేరు సతులు ॥నడుమ॥

**అర్థములు:** ప. నడుమ= మధ్యలో, నయగారాలు= విలాసము, ఉడివోని= నాశములేని.

1. శిరసు= తల, మోపుక= ఆనించి, ఏరా= సవతి, అడియాస= తీరని కోరిక, సారె= మాటిమాటికి, జడియు= భయపడు.

2. ఆకె= ఆమె, నిక్కము= నిజము, ఈపె= ఈమె, నివాళించు= హారతిచ్చు, నిక్కుదనము= గర్వాతిశయము, నెరపుకొను= నెరవేర్చు, మెరయు= ప్రకాశించు.

3. బలిమి= దృఢత్వము, పట్టపుదేవులు= పట్టపురాణులు, చెలగి= విజృంభించి, చిన్నదానిని= బాలిక, నిలచిన= ప్రతిష్ఠితమైన, పులకలమొలకలు= గగుర్పాటుతో కలిగిన స్థితి, పొదలు= వర్ధిల్లు.

**భావము:** స్వామీ! నీవు చూపించే విలాసాలన్నీ కళ్ళారా చూస్తూనే ఉన్నాము. ఇక్కడి సతులంతా తీరని కోరికలతో ఉన్నారు.

స్వామీ! మీ తలను ఒక రమణి తొడపై పెట్టుకుని, ఇంకొక సతివేపు నీ పాదాలు చాచి ఒత్తమని కోరుతున్నావు. ఏ తీరులో ఉన్నారో ఎంత వ్యామోహముతో ఉన్నారో గానీ, ఆ ఇద్దరు సతులు తీరని కోరికలతో సతమతమౌతుండగా వారి శరీరము నుండి చెమట కారిపోతూ తెలియరాని భీతితో , వ్యాకులతతో ఉన్నారు.

వినమ్రంగా ఏవో కోరికలు కోరుతూ మునుపటి స్త్రీతో మాట్లాడుతున్నావు. నీ అసలైన చూపు ఈమె మీదనే హారతిచ్చినట్టు నిలిపి ఉన్నావు. ఉబికి వస్తున్న దీర్ఘమైన మోహాలను ఎలా ఆపుకున్నారో తెలియదు కానీ, ఆసతులిద్దరూ ఊరకే దీర్ఘ ఉచ్ఛ్వాస నిస్స్వాసములకు లోనయి ప్రకాశిస్తున్నారు.

ఓ శ్రీవేంకటేశ్వరా! నీ దృఢత్వము, ప్రకాశము సామాన్యమా స్వామీ! అందరు పట్టపు దేవేరులను ఏలుతూనే, విజృంభించి ఈ నవ యౌవనవతియైన చిన్నదాన్ని కలిసావు. నెలకొని వున్న రతిక్రీడలతో నిన్ను వారలు ఎలా మెప్పించారో తెలీదు కానీ వస్తున్న గగుర్పాటుతో పులకలు మొలకలై ఆ సతులు వర్ధిల్లుతున్నారు.

## 270

**అవతారిక:** స్వామి కొలువులో స్త్రీజనంతో ప్రవర్తించే పద్ధతికి సిగ్గుపడే కొందరు చెలులు ఆయనను ప్రశ్నిస్తున్నారు.

## రేవగుప్తి

ప .తెలియరాదు నీ మది దిమ్మరివాఁడవు గాన
చెలరేఁగి యడిగేము చెప్పరాదా మాకు ॥పల్లవి॥

1. అగ్గమై యందరిలో నానతీవఁ గాఁగిలించఁగా(?)
సిగ్గుపడి సన్న సేసీఁ జేతనే నీకు
కగ్గి నీకు యీపె నింత కాకు సేయవలశో
నిగ్గులవలపు నీకు నిక్కమును గలదో ॥తెలియ॥

2. సకులెల్లాఁ జూడఁగాను చవులమో వెడిగితే
మోకము వంచి కన్నుల మొక్కు మొక్కీని
ప్రకటించి యీపె నింత పచ్చి సేసేనంటానో
వొకట మేలువాఁడవై వొనరినచందమో ॥తెలియ॥

3. పూడిగపువారుండఁగా నొద్దికై పెనఁగితేను
యీడనె శ్రీవేంకటేశ యీ కె నవ్వీని
జాడతో నీపె నింత సమఁ(వ?)తు సేయవలశో
వేడుకకాడవై నవిధ మిటువంటిదో ॥తెలియ॥

**అర్థములు:** ప. మది= మనస్సు, దిమ్మరి= భ్రమకలిగించు, చేలరేగి= విజృంభించి.

1. అగ్గము= బహిరంగంగా, ఆనతీవ= అనుజ్ఞ నిచ్చి, కాగలించు= కౌగలించు, సన్న= సైగ, చేత= చేతితో, కగ్గి= వివర్ణమై, ఈపె= ఈమె, కాకు= తిరస్కారము, నిగ్గ= ఉత్కృష్టకాంతిర్, నిక్కము= నిజము.

2. చవులమోవి= అధరామృతపు రుచి, మోకము= మోహము, ప్రకటించి= తెలియునట్లు, ఈపె= ఈమె, పచ్చి చేయు= మరుగులేకుండా ప్రవర్తించు, ఒకట= ఒకచోట, మేలువాడు= శుభములనిచ్చువాడు, ఒనరు= ఒప్పు, చందము= విధానము.
3. ఊడిగపువారు= కొలువులో సేవ చేసేవారు, ఒద్దిక= అనుకూలముగా, పెనగు= చుట్టుకొను, ఈకె= ఈమె, జాడ= గుర్తు, ఈపె= ఈమె, సమతు= సమానము, వేడుక= వినోదము, విధము= తీరు, ఇటువంటిదో= ఇటువంటిదా?

**భావము:** స్వామీ! నీవు సదా కాంతలను భ్రమలలో ముంచెత్తేవాడవు కాబట్టి, మేము విజృంభించి దాపరికము లేకుండా కొన్ని అడగాలనుకుంటున్నాము. మాకు సమాధానమియ్యరాదా!

బహిరంగంగా ఆమె అందరిలో ఉన్నప్పుడు తమరు ఆనతిచ్చి చటుక్కున కౌగలించుకోగా, సిగ్గుతో చేతులతో ఏవో సైగలు చేస్తున్నది. ఆ స్త్రీకి ముఖము వివర్ణమైపోయినది. నిజానికి స్త్రీపట్ల ఇంత ఉత్కృష్ట కాంతులు వెదజల్లుతూ ఉండడం తగునా స్వామీ!

తోటి చెలులందరూ చూస్తూ ఉండగా ఆమె అధరామృతము నీవడిగితే, ఆమె సిగ్గుతో తలవంచుకొని నీకు కళ్ళతోనే నమస్కరించినది. ఆమె అంగీకరించి ఉన్నట్లైతే మరుగులేకుండా ఇలాంటి పనులు చేస్తావా అని అంటావేమోనని భావించినది. మాకు అన్నివిధాలా ఆనందము శుభము చేకూర్చే విధంగా ప్రవర్తించరాదా స్వామీ!

ఓ శ్రీవేంకటేశ్వరా! నీకు కొలువులో సేవలు చేసేవారందరూ అక్కడే ఉండగా, అనుకూలముగా కౌగలించుకుంటే ఇక్కడనే ఈమె నవ్వులు చిందించినది. గుర్తెరిగికూడా ఈమెతో యిలా సమానమైన క్రీడ సాగించవచ్చునా? నీవు వినోదాలకాడవు సుమా! నీ చందము అవగతం కాకుండా ఉన్నది.

## 271

**అవతారిక:** దక్షిణనాయకుడైన శ్రీనివాసుడు చిలిపి శృంగారచేష్టలతో యీ విధంగా బజారుపాలు చేయడం తగదని ఒక చెలి స్వామిని వేడుకుంటున్నది.

### వసంతవరాళి

ప. నలినాక్షి ఇందరిలో నగుఁబాటులాయ నేఁడు
యెలమి నీకే తెలుసు నేమిచెప్పే మిఁకను ॥పల్లవి॥

1. ఇచ్చగించి యాపె నీఇంటికి తానే వచ్చి
ముచ్చట మాటలాడి మొక్కు మొక్కెను
పచ్చిగా నాపెచెక్కుపై గోరుదీసి నీవు
రచ్చల బెట్టితి విదె రమణివలపులు ॥నలినాక్షి॥

2. చెంతల గొలువుసేసి చిత్తమురా విన్నవించి
పంతములెల్లా నిచ్చి పాదా లొత్తెను
వింతలుగా చన్నులపై వెలయ నచ్చువాఁ(వ్రా?)సి
సంతలఁ బెట్టితివి సకియవలపులు ॥నలినాక్షి॥

3. కడుసిగ్గులు విడిచి కాగిట నిన్ను గలసి
బడిబడి నీవెంట బాయదాయను
అదరి శ్రీవేంకటేశ ఆపెమోవి గంటిసేసి
వడి నంగడివేసితి వనితవలపలు ॥నలినాక్షి॥

**అర్థములు:** ప. నలినాక్షి= స్త్రీ, నగుబాటు= నవ్వులపాలు, ఎలమి= ప్రేమ.

1. ఇచ్చగించు= ఇష్టపడు, ముచ్చట= విషయము, మొక్కు= నమస్కారము, పచ్చిగా= బహిరంగంగా, ఆపె= ఆమె, చెక్కు= చెక్కిలి, గోరుదీసి= గోటితో గీరవేసి, రచ్చలబెట్టు= అల్లరిపాలుజేయు, రమణి= స్త్రీ.

2. చెంత= సమీపము, చిత్తము= మనసు, వింత= అబ్బురము, అచ్చువాసి= గుర్తువేయు, సంతబెట్టు= బజారుపాలు చేయు, సకియ(సఖియ)= చెలి.

3. కదు= మిక్కిలి, కాగిట= కౌగిట, పడిపడి= ఎక్కువగా, పాయదు= వీడదు, అదరి= ప్రయోగించి, మోవిగంటి= ముఖముపై పంటి గుర్తు (దంతక్షతము), వడి= వేగముగ, సంగడి= స్నేహము.

**భావము:** స్వామీ! ఆ ఆడుదాన్ని నలుగురిలో నవ్వులపాలు జేయడమెందుకు? ప్రేమతో విచారిస్తే నిదానంగా అన్నీ నీకే అర్థమవుతాయి నేమేమి చెప్పగలను.

ఆమె ఎంతో ప్రేమతో నీ యింటికి తానే వచ్చినప్పుడు, నీకు నమస్కరించి తన కోరికలు దెలుపుకొన్నది. నీవు ఏమాత్రం మరుగులేకుండా ఆమె చెక్కిలి పైన పది నఖక్షతములు వేసినావు. ఆమె ప్రేమను అలా అల్లరిపెట్టడం తగునా?

నిన్ను సమీపించి నీ కొలువులో సేవలు చేసుకొని తన మనసుదీరా ఉన్న విషయాలన్నీ ఏకరువు పెట్టి నీ పాదాలను భక్తితో వత్తినది. దానికి గాను నీవు ఆమె రొమ్ములపై నీ చేతిగోళ్ళ ముద్రలు (నఖక్షతములు) వేసి ఆమెను, ఆమె ప్రేమను బజారుపాలు చేయడం ధర్మమా?

ఆమె తనకున్న అధికమైన సిగ్గును కూడా విడిచిపుచ్చి, నీ కౌగిట కలిసి, ఎక్కువగా నిన్ను వీడక, చెంతనే ఉండిపోయినది. ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు చెలరేగి ఆమె ముఖముపై దంతక్షతము చేసి, స్నేహ పూర్వకముగా వనిత వలపులను స్వీకరించావు.

**విశేషము:** అన్నమయ్య ఆనాటి పలుకుబళ్ళను అందముగా తన కీర్తనలలోకి తీసుకుని వచ్చాడు. ఈ కీర్తనలో "సంతలబెట్టితివి" అనడంలో మనమీనాడు "బజారులో బెట్టావు" అనే మాట ఆనాడు ఆవిధమైన పలుకుబడిగా వ్యాప్తిలో ఉండివుండవచ్చు.

## 272

**అవతారిక:** ఒక నాయిక స్వామిని వలచి విరహంతో బిడియపడుతూ ఉండగా, చెలులా విషయం స్వామికి నివేదిస్తున్నారు.

### కన్నడగౌళ

ప. నే మిందాకా జెప్పితిమి నెలంతకు బుద్దులెల్లా
కామించి మీఁదట నిఁక కందము నీ నేరుపు ॥పల్లవి॥

1. చింతతోడ నాకె నేఁడు చెక్కుచేతితో నున్నది
పంత మాడి యైన నీవు పరికించేవా
వింత నీసుద్దులు విని వెరగుతో నున్నది
యింతలో వంచినశిర సెత్తించేవా ॥నే మిందాకా॥

2. నియమపుఁ జలముతో నిట్లు చేసుక వున్నది
నయగారితనమున నవ్వించేవా
ప్రియముతోఁ బరపుపై బిగియుచుఁ దానున్నది
రయమున నీవద్దికి రప్పించేవా ॥నే మిందాకా॥

3. కడలేనియాసలతోఁ గాఁతాళాన నున్నది
తడఁబడక రతులఁ దనియించేవా
యెడయక శ్రీ వేంకటేశ నిన్నుఁ గూడున్నది
వుడివోని నీ సత్యాల నొడఁబరచేవా ॥నే మిందాకా॥

**అర్థములు:** ప. నేమిందాకా= మేము ఇప్పటివరకూ, నెలత= స్త్రీ, కామించి= మోహించి, కందము= గట్టియైన, నేరుపు= నైపుణ్యము.

1. చింత= విచారము, ఆకె= ఆమె, చెక్కు= చెక్కిలి, పంతము= పట్టుదల, పరికించు= విచారించు, సుద్దులు= మాటలు, వెరగు= ఆశ్చర్యము.

2. నియమము= ఏర్పాటు, చలము= కంపము, నయగారితనము= మృదుభాషి, ప్రియము= ప్రేమ, పరపు= పట్టుపరుపు, బిగియు= మొహమాటము, రయము= వేగము.

3. కడలేని= అంతులేని, కాతాళము= ప్రణయకోపము, తడబడు= తొట్రుపడు, తనియు= తృప్తిపడు, ఎడయు= ఎడబాటు, ఉడివోని= నాశములేని, ఒడబరచు= ఒప్పించు.

**భావము:** స్వామీ! ఈ స్త్రీకి యిప్పటివరకూ బుద్ధులు చెప్తూనే ఉన్నాము. మోహించిన తర్వాత నీవే దృఢమైన నైపుణ్యాన్ని చూపవలసి ఉంటుంది.

ఆమె విచారవదనంతో చెక్కిలిపై చేయివేసుకుని ఉన్నది. నీవు పట్టుదలతోనైనా విషయమేమిటని విచారించావా? ఆమె నీ వింత వింత మాటలు విని ఆశ్చర్యముతో నున్నది. ఆమె వంచినతలను నీ చతురతతో ఎత్తించగలవా స్వామీ!

కొన్ని నియమాలు నిబంధనల మేరకు ఆమె ఈ విధంగా ఉన్నది. నీవు నీ మృదువచనాలతో ఆమెను నవ్వించగలవా? నీ మీద ప్రేమతో పట్టుపానుపుపై పరుండి మొహమాటవదనంతో నున్నది. ఏదైనా పథకము వేసి వేగముగా నీ వద్దకు రప్పించుకోగలవా?

ఆమె అంతులేని ఆశలతో కొంచెం ప్రణయకోపముతో నున్నది. నీవేమాత్రం తడబడకుండా ఆమెను రతిక్రీడలతో సంతోషపెట్టి తృప్తిపరచగలవా? ఓ శ్రీవేంకటేశ్వరా! నిన్నేమాత్రం వీడకుండా అంటిపెట్టుకుని నీతో కూడి యున్నది. వ్యర్ధపుచ్చని నీ మాటలతో ఆమెను ఒప్పించగలవా?

**విశేషములు:** 1. అన్నమయ్య ఈకీర్తనలో నెలతకు బుద్ధులు చెప్పడం గురించి ప్రస్తావించాడు. ఈ బుద్ధిగుణములు శుశ్రూష, శ్రవణము, గ్రహణము, ధారణము, ఊహము, అపోహము, అర్థవిజ్ఞానము, తత్వజ్ఞానము అని అష్టవిధములుగా శాస్త్రములో చెప్పబడ్డాయి. 2. అన్నమయ్య “మేము” అని ఉపయోగించ వలసిన చోట్ల, “నా” శబ్ద ప్రథమా, బహువచనమునకు రూపాంతరముగా “నేము” అని ఉపయోగించడం పలు కీర్తనల్లో ఉంది.

## 273

**అవతారిక:** ఒక నాయిక స్వామిపట్ల తనకు గలుగుతున్న విరహానికి తాళలేక,స్వామిని తోడి తీసుకురమ్మని చెలులతో రాయబారం పంపుచున్నది.

### ఆహిరి

ప. వింటే దయవుట్టి యిట్టె విచ్చేసీ నీడకు
యింటికిఁ దోడి తేరమ్మా యీకె ప్రాణేశ్వరుని ॥పల్లవి॥

1. చిత్తరుపటము చూచి సెలవుల నవ్వు నవ్వీ
తత్తరాన బొన్నుచూచి తలవంచీని
పొత్తులడపము చూచి పులకించీ మేనెల్లా
హత్తి విన్నవించరమ్మా అంగన విభునికి ॥వింటే॥

2. చేరి కేళాకూళి చూచి చింతతోడఁ దలపోసీ
పారువపుగుంపుఁ జూచి భ్రమసీని
కోరి పువ్వుటిల్లు చూచి కుప్పళించీఁ బెంజెమట
సారె నెరిఁగించరమ్మ సతినాయకునికి ॥వింటే॥

3. నిలువుటద్దము చూచి నివ్వెరగుతో నున్నది
చెలిక త్తెలనుఁ జూచి సిగ్గువడీని
కలసీఁ గాఁగిట దానె గక్కన నేతించి నేఁడు
చెలఁగి కానుకీరమ్మా శ్రీవేంకటేశునికి ॥వింటే॥



డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య

**అర్థములు:** ప. దయవుట్టి= దయకలిగి, విచ్చేసీ= వచ్చితిని, తోడి= వెంటబెట్టుకుని, ఈకె= ఈమె, ప్రాణేశ్వరుని= భర్తను.

1. చిత్తరుపటము= చిత్రపటము, సెలవునవ్వులు= పెదవిమూల నవ్వు, తత్తరము= సంభ్రమము, పొత్తులడపము= స్నేహపుతిత్తి, పులకించు= సంతసించు, మేను= శరీరము, హత్తు= కలియు, అంగన= స్త్రీ, విభుడు= భర్త.
2. కేళాకూళి(వి)/ఖేళా కూల(ప్ర)= విహరించి ఆడుకొను సరస్సు, పారువపుగుంపు= పారవశ్యమై యున్న సమూహము, భ్రమ= భ్రాంతి, పువ్వటిల్లు= పూలతీగలతో కూడిన మందిరము, కుప్పళించు= కురియు, బెంజెమట= ఎక్కువ చెమట, సారెసారె= మాటిమాటికి, ఎరిగించు= తెలియజెప్పు.
3. నివ్వెరగు= పారవశ్యము, కాగిట= కౌగిట, గక్కన= శీఘ్రముగ, ఏతెంచి= వచ్చి, చెలగి= విజృంభించి, ఈరమ్మా= ఇవ్వబూనండి.

**భావము:** ఓ చెలులారా! మీరు దయతో వినండి. మీ సహాయం కోసం వచ్చాను. నా ప్రాణవిభుణ్ణి ఎక్కడున్నా సరే వెదకి వెంటబెట్టుకుని రండమ్మా!

ఆయన చిత్రపటమును చూసి పెదవిమూలగా నవ్వులు చిందిస్తూ, సంభ్రమముగా పట్టుపానుపు చూసి సిగ్గుతో తల వంచుకొన్నది. ఈ సాంగత్యపు ఆలోచనలతో ఆమె శరీరమంతా సంతోషముతో పులకించుచున్నది, కలిసి కొంచెం ఈ విషయాలన్నీ స్వామివారికి మనవి చేయండమ్మా!

సమీపించి, విహరించి ఆటలాడుకొనే సరస్సులో స్వామివారిని గమనించి ఆలోచనలతో నిండి, పారవశ్యానికి గురవుతున్నది. ఆమె స్వామివారు తిరిగే పుష్ప మందిరము చూసి ఆమెకు చెమటలు అధికమవుతున్నాయి. ఈవిషయాలన్నీ స్వామికి మళ్ళీ మళ్ళీ పలుమార్లు విన్నవించదమ్మా!

నిలువుటద్దములో తనను తాను చూచుకొని పారవశ్యములో మునిగితేలుతూ తోడి చెలికత్తెలను చూడగానే సిగ్గులు మొగ్గలవుతున్నాయి. శ్రీవేంకటేశ్వరుడు ఈనాడు తనకు తానై విచ్చేసి శీఘ్రముగా కౌగలించుకోగానే పారవశ్యం పొందుతున్నది. మీరంతా కలిసి ధన్యవాదములతో స్వామికి బహుమతులు అందజేయండమ్మా!

**విశేషములు:** ఆనాటి పలుకుబళ్ళను అన్నమయ్య ఈ కీర్తనలో చాలా ఎక్కువగా ఉపయోగించిన వాటిలో పొత్తులడపము, కేళాకూళి, పారువపుగుంపు, పువ్వటిల్లు గమనించదగ్గవి.

## 274

**అవతారిక:** శ్రీనివాసునిపట్ల శృంగార గర్వంతో ప్రవర్తిస్తున్న అలమేలుమంగమ్మను, ఇలా ప్రవర్తించడం తగదని చెలుగు హితవు పలుకుతున్నారు.

### సాళంగం

ప. గుట్టుగలవాఁడు గాఁగా గుంపించకున్నాఁడు గాక
వొట్టుక నేమెల్లాఁ జూచి వోర్వఁగఁగలమా ॥పల్లవి॥

1. అతనినేల దూరేవే అంగడికెక్కె వలపు
యేతులఁ బెండ్లాడినవా రెందరు లేరు
యీతలఁ జెలుల నంపి ఇంటికి రప్పించీని
చేతికి లోనాయనంటే చిమ్మిరేఁచవలెనా ॥గుట్టు॥
2. పంతము లేలా దేవే పట్టరాదు పాయము
వంతులకు నెందరైనా వద్దనున్నారు
వింతలుగా నవ్వుతానే విందారగించఁబెట్టి
బంతిఁగూచుండి విభునిఁ బంగించవలెనా ॥గుట్టు॥
3. సిగ్గులే లలమేల్మంగ శ్రీవేంకటేశుఁడు గూడె

కగ్గులేనిసవతులు గాచుకున్నారు
యెగ్గులేక నన్నునేలె నితనిఁ బానుపుమీఁద
అగ్గలపురతుల నీ వలయిఁచవలెనా ॥గుట్టు॥

**అర్థములు:** ప. గుట్టు= రహస్యము, గుంపించు= అతిక్రమించు, ఒట్టుక= ప్రమాణపూర్తిగా, నేమెల్లా= మేమెల్లా, ఓర్చు= భరించు.

1. దూరు= ఇతరవిషయాలలోకి చొచ్చుకొని పోవు, అంగడికెక్కు= బజారుపాలగు, ఏతులు= ప్రగల్భాలు,గొప్పలు, ఈతల= ఇవతల, లోనాయ= లోబడు, చిమ్మిరేచు= అధికంగా చెలరేగు.
2. పంతము= పట్టుదల, పట్టరాదు= పట్టలేనిది, పాయము= వయసు, వంతులు= పని విభజన, వింత= అపూర్వము, బంతి= వరుస, పంగించు= పొరబాట్లను ఎత్తి చూపించి మాట్లాడు.
3. కగ్గులేని= దేనికీ తగ్గని, ఎగ్గు= కీడు, అగ్గలము= అధికము, అలయించు= శ్రమపెట్టు.

**భావము:** ఎంతో గుట్టూ మట్టూ ఉన్నవాడని అనుకుని స్వామి దరిజేరితే హద్దులతిక్రమిస్తూ ఉన్నాడు. దానికి మేమంతా ఒట్లుపెట్టుకొంటూ చూసి భరించగలమా?

నీవు అతని విషయంలో మధ్యలో ఎందుకు కలగజేసుకుంటావు? ఇప్పుడు నీవలపు బజారుపాలయినది గదా! ఇలా గొప్పలు పలికేవారిని వివాహమాడినవారెందరో ఉన్నారు. చెలులను ఇంటి పంపించి మరీ తన వద్దకు రప్పించుకున్నవాడు, చేతికి చిక్కాడు కదా అని, మరీ ఇంతలా చెలరేగి రెచ్చిపోవడం నీకు ధర్మమేనా?

అతనితో నీ పట్టుదలలేమిటే! వయసు పట్టనలవికానిది కదా? ఇలా అతని వద్ద సేవకు ఎందరో తయారుగా ఉన్నారు. ఆయన అబ్బురపు నవ్వులతోటే విందు భోజనం పెట్టించాడు. ఆ సమయంలో ఆయన పొరబాట్లు ఎత్తిచూపి మనస్తాపం కలిగించవచ్చునా?

ఇంకా సిగ్గులు మొగ్గలవడం ఎందుకమ్మా అలమేలుమంగమ్మా! శ్రీవేంకటేశ్వరుడు వచ్చి నిన్ను చేరుకున్నాడు కదా! దేనికీ తగ్గమన్న రీతిలో సతులందరూ ఆయనకై ఎదురుచూపులు చూస్తున్నారు. ఏమీ అపకారం తలపెట్టక, పట్టుపానుపుపై నిన్ను ఏలుకొంటున్న స్వామిపై ఇలా అధికమైన రతిక్రీడతో ప్రవర్తిస్తూ స్వామిని శ్రమకు గురిచెయ్యడం న్యాయమేనా?

## 275

**అవతారిక:** స్వామిపై అమ్మకు, అమ్మపై స్వామికి ఉన్న అనురాగం ఎటువంటిదో తెలియరాక చెలులు తికమకతో వారి కార్యాలను ప్రశ్నిస్తున్నారు.

### పళవంజరం

ప. ఏఁటి మతకములో యీపెకు నాతనికి
నాఁటకము లివి గొన్ని నడచీఁ జూడరే ॥పల్లవి॥

1. కొలువునేసేఁయాటది గుట్టుతోడ నుండుఁగాక
కలకల నగనేలే కాఁతాళానను
చెలఁగి విభుఁడు లోలో సేఁత లేమినేసెనో
తలఁపునఁ బుట్టుకొని తమకించీఁదాను ॥ఏఁటి॥

2. విందుచెప్పవచ్చినాపె వినయాలు సేసుగాక
పందేలాడఁ దనకేలే పలుమారును
కందువ నాతనివల్ల కపటాలేమిగనెనో
మందలించవలసిట్టె మాట దీసీఁ దాను ॥ఏఁటి॥

3. పీఁటపై పెండ్లికూఁతురు ప్రియముతోఁగూడుఁగాక
నీటున జంకించనేలే నేరుపుతోడ

సూటి శ్రీవేంకటేశుఁడు చూ చెలమేల్మంగను
కూటములు నేర్చుకొని గురినేసీఁ దాను ॥ఏఁటి॥

**అర్థములు:** ప. ఏటి= ఎటువంటి, మతకము= మాయ, ఈపె= ఈమె.

1. ఆటది= ఆడుది, గుట్టు= రహస్యము, నగు= నవ్వు, కాతాళము= కోపము, చెలగి= కలిగి, సేత= పని, తలపు= జ్ఞప్తికిదెచ్చుకొని, తమకించు= మోహము.
2. ఆపె= ఆమె, వినయము= అణకువ, సేసు= చేయు, పందేలాడు= పోటీలుపెట్టుకొను, కందువ= జాడ, కపటము= మోసము, మదలించు= హెచ్చరించు.
3. నీటు= మురిపెము, నేరుపు= నైపుణ్యము, కూటమి= కలయిక, కురియు= వాత్సల్యము జూపు.

**భావము:** ఆ స్వామికి..ఈ అమ్మకు అదేమి మాయో..మంత్రమో తెలియరాకున్నది. ఎన్ని నాటకములు నడుస్తున్నాయో ఏమిటో! కొన్ని మీరూ చూడండి.

స్వామి కొలువులో సేవ చేసే స్త్రీ రహస్యముగా గుట్టుతోడ ఉండవలెను కదా! ఈ కలకల నవ్వులెందుకు? మధ్యలో ఆ కోపాలెందుకు? ఈ స్వామి లోపల ఒంటరిగా ఉన్నప్పుడు ఏమి కార్యాలు చేశాడో ఏమో! అవే తలచుకొని అమ్మ మోహములో మునిగి తేలుతున్నది.

విందు చెప్పడానికి వచ్చినామె ఎంత అణకువతో ఉండాలి? స్వామితో ఈ పోటాపోటీగా మాటలెందుకు? జాడనెరిగి ఆ స్వామివల్ల ఈమెకేమి అపకారము జరిగిందో తెలియరాకున్నది. ఆ స్వామి ఈమెను హెచ్చరించి మాట్లాడవలెను కదా!

పెండ్లి పీటలమీద ఈ అమ్మ పెండ్లికూతురై కుదురుగా కూర్చొని ఉండవలెను కదా! మురిపెముతో తన నైపుణ్యాలను ప్రదర్శిస్తూ కనుబొమ్మలు అదరవేసి అదరగొట్టడం ఎందుకు? స్వామి శ్రీవేంకటేశ్వరుడు పరీక్షగా అమ్మ అలమేల్మంగమ్మను చూస్తున్నాడు. కలయిక నేర్చుకొని హుందాగా వాత్సల్యాన్ని కురిపిస్తున్నాడు.

## 276

**అవతారిక:** స్వామి పనికల్పించుకుని సహాయం చేసేవానివలె నటిస్తూ చిలిపి శృంగార చేష్టలు చేస్తున్న విషయం అలమేలుమంగమ్మ గమనించి పరిహాసంగా మాట్లాడుతున్నది.

## సౌరాష్ట్రం

ప. ఔనయ్యా మంచివాఁడ వందుకెల్లా నేనా గురి
నానఁబెట్టి సెలవుల నవ్వులు నవ్వేవు ॥పల్లవి॥

1. చెలియచేసినసేఁత చెప్పేవానివలెనే
కలుపుకోలుగ నన్నుఁ గాఁగిలించేవు
పొలసి గోరనూఁదుట చూపేవానివలెనే
కెలయుచు నాబుజము గీరేవు నీవు ॥ఔనయ్యా॥

2. యెచ్చుగుందుమాటలు యెంచేవానివలెనే
వచ్చిదేరేవొట్టు నాపైఁ బచారించేవు
దిచ్చరిసాకిరు లిట్టె తెలిపేవానివలెనే
ముచ్చటఁ జేతులు నామోముపైఁ జాఁచేవు ॥ఔనయ్యా॥

3. పెనఁగులాటలు తలపించేవానివలెనే
గొనకొని నా పెద్దకొప్పు వట్టేవు
యెనసి శ్రీ వేంకటేశ యింతిఁ గూడినట్లానే

అనువైనఅలమేల్మంగనైననున్నఁ గూడేవు ॥ఔనయ్యా॥

**అర్థములు:** ప. గురి= లక్ష్యము, నానబెట్టి= బాగా యోచించి, సెలవులనవ్వులు= పెదవిమూల నవ్వులు.

1. సేత= పని, కలుపుగోలు= కలసిమెలసి, కాగలించు= కౌగలించు, పొలసి= సమీపించి, గోరనూదు= గోటిగీరులు పడునట్లు చేయు.
2. కెలయు= విజృంభించు, ఎచ్చుగుందుమాటలు= ఎక్కువతక్కువ మాటలు, ఎంచు= లెక్కించు, పచ్చిదేరు= మరుగులేని పనులు చేయు, పచారించు= అతిశయముచూపు, దిచ్చరి= మోసము, సాకిరి= సాక్షి.
3. పెనగులాటలు= పోట్లాటలు, కొనకొను= యత్నించు, వట్టు= పట్టు, ఎనయు= సరిపోలు, ఇంతి= స్త్రీ, అనువు= యుక్తము, కూడు= కలియు.

**భావము:** అవునయ్యా ....స్వామీ !నీవు చాలమంచి వాడవు. అందుకు నేనా లక్ష్యము? నిదానించి నిదానించి పెదవి మూల నవ్వులు నవ్వుతున్నావు.

ఆ స్త్రీ చేసిన పనులన్నీ చెప్పేవానివాడి మాదిరి దరిజేరి , ఆమాట ఈ మాట చెప్పి నన్ను చటుక్కున కౌగలించుకుంటావు. చెంతజేరి గోటిగీరులు చూపించే వానివలె మాట్లాడుతూ నా భుజం గీరుతావు.

ఏదో పెద్ద మంచి చెడ్డలు చెప్పేవానిలాగా దరిజేరి మరుగులేని ప్రమాణాలన్నీ చేసి అతిశయిస్తావు. మోసాలకు సాక్ష్యం చెప్పేవానిగా ప్రవర్తిస్తూ నా ముఖాన్ని అందుకోవడానికి చేతులు చాచుతావు.

ఏదో పోట్లాటలు గురించి మాట్లాడేవానివలె యత్నించి నా పెద్దదైన కొప్పును పట్టుకుంటావు. ఓ శ్రీవెంకటేశ్వరా! సరిగ్గా, ఆ స్త్రీని పొందిన విధంగానే, అలమేలుమంగనైన నన్ను సైతం పొందుకూడావు.

## 277

**అవతారిక:** స్వామివారికి అలమేలుమంగమ్మకు మధ్యనున్న ప్రేమానురాగాల గురించి చెలులు వర్ణిస్తున్నారు.

### నట్టనారాయణి

ప. ఇన్నాళ్లు నేడ నుండెనో యెవ్వరు నెఱఁగరు
కన్నుల యెదుట నేఁడు గానబడెఁగాని ॥పల్లవి॥

1. యేమి గావలెనో కాని యీపె నీకు నెదురై
మోముకళలుదేరఁగ మొక్కె నిపుడు
చేముట్టి యీసతినిఁ జేరి కాఁగిలించితివి
మీమీచుట్టరికము మేమిదివో కంటిమి ॥ఇన్నాళ్లు॥

2. యేవూరోకాని తాను నీ యింటికే వచ్చి బత్తితో
సేవలెల్లాఁ జేసితేను చెలఁగితివి
భావమెరిఁగి గందము పైఁబూసి నవ్వితివి
దోమటిఁ (వన?)మీయిద్దరిపొందులు నేఁడు గంటిమి ॥ఇన్నాళ్లు॥

3. తనుపే రేఁటిదోకాని తగిలి శ్రీవేంకటేశ
చెనకుచు నీపైఁ దాను సేసవెట్టెను
యెనసితి విటు నన్ను యే నలమేలుమంగను
నినుపులమీ ఇంపుల నేఁడు నేము గంటిమి ॥ఇన్నాళ్లు॥

**అర్థములు:** ప. ఏడ= ఎక్కడ, కానబడియె= కనబడుచున్నది.

1. ఈపె= ఈమె, ఎదురై= ఎదురుపడి, మోముకళ= ముఖారవింద శోభ, చేముట్టి= చేతితో తాకు, సతి= స్త్రీ, కాగలించు= కౌగలించు, చుట్టరికము= బంధుత్వము.
2. బత్తి= ప్రేమ, చెలగు= ఉత్సాహించు, భావము= మనసు, దోవన= మార్గమున.
3. చెనకు= స్పృశించు, సేస= అక్షింతలు, ఎనయు= ప్రకాశించు, నినుపు= నిండు ,సమృద్ధి, ఇంపు= ఇష్టము, నేము= మేము.

**భావము:** ఓ స్వామీ! ఇన్నిరోజులనుండీ మీ యీ ప్రేమానురాగాలు ఎక్కడ ఉన్నవో ఎవ్వరూ చూడలేదు. ఈరోజు మాత్రము స్పష్టముగా అవగాహనకు వచ్చినది.

ఈమెకు ఏమి కావాలో తెలియదు కానీ నీకు ఎదురుపడి ఆమె ముఖారవింద శోభలు విరబూసే విధంగా నీకు నమస్కరించుచున్నది. చేతులతో తీసుకుని ఆ సతిని గాఢముగా కౌగిలిలో బంధించావు. ఇప్పుడు మీ మీ బంధుత్వాలు ఏమిటో స్పష్టముగా అర్థమైనది.

ఆమెది ఏ వూరో ఏ ప్రాంతమో తెలియదు కానీ, సరాసరి నీ ఇంటికే వచ్చి భక్తిమీర సేవలు చేసుకొనగా ఉత్సాహించి గమనించావు. ఆమె మనసు తెలుసుకొని ఆమె శరీరముపై మంచి గంధం పూసి నవ్వులు చిందించావు. ఈ రీతిలో ఈమార్గములో మీ ఇద్దరి పొందులు తెలియదు కానీ నేడు కళ్ళారా చూచితిమి.

తనపేరేమిటో తెలియదు కానీ ఓ శ్రీవేంకటేశ్వరా! ఆమె నిన్ను స్పృశించి మరీ నీపై అక్షతలు వేసినది. ఈవిధమైన వికాసంతో నేను అలమేల్మంగమ్మను మీ నిండైన ఇష్టాన్ని మేము చూరగొన్నాము.

## 278

**అవతారిక:** అలమేలుమంగా శ్రీనివాసుల శృంగార సన్నివేశాలు మనోహరంగా చెలులతో చెప్పిస్తున్నాడు అన్నమయ్య.

### ఆహిరి

ప. ఏమని విన్నవించేము ఇంతి నీపైఁ గల ప్రేమ
కోమలపుఁ గలికి చెక్కునఁ జేయిచేర్చెను ॥పల్లవి॥

1. యేకతాన నుండి సతి ఇట్టె నిన్నుఁ దలఁపైతే
చేకొని నిట్టూర్పు నించి చెలులఁ జూచె
పైకొని వారందరు కోపాన నిన్ను దూరితేను
దాకొని యేమీ ననక తలవంచుకొనెను ॥ఏమని॥

2. మంచముపైనుండి కాంత మనసు నీపైఁ బారితే
పొంచి మాటాడేచిలుకఁ బొక్కుచుఁ దిట్టె
ముంచి యందుకు నది నీముఁజేత వాలితేను
దించని చలమున నీదిక్కు చూచెను ॥ఏమని॥

3. వురమె క్కెలమేల్మంగ వోగి చన్నులు నాఁటితే
వొరటుజక్కవలపై నొలవేసెను
మొరసి శ్రీ వేంకటేశ ముక్కులన వెంటించితే
తెరసేసి నినుఁగూడి తెప్పలనుఁ దేలెను ॥ఏమని॥

**అర్థములు:** ప. కోమలము= మృదువైన, కలికి= స్త్రీ, చెక్కున= చెక్కిలిపై,

1. ఏకతాన= అనన్యచింతన, తలపు= ధ్యానము, చేకొని= చేపట్టి, పైకొను= మీరు, దూరు= జోక్యముచేసుకొను, దాకొను= దాగియుండు.
2. పారు= ప్రవహించు,చేరు, పొంచి= దాగి, పొక్కు= ఉలుకు, ముజేత= ముంజేతిపై, చలము= కంపము, దిక్కు= వైపు.

3. ఉరము= వక్షస్థలము, ఓగి= యోగ్యము, నాటు= గట్టిగానొక్కు, ఒరటు= మోటు, జక్కవలు= చక్రవాక పక్షులు, ఒరసి= రాచుకొను, ముక్కులాని వెంటించు= ముక్కులు తగులునట్లుగా, తెప్పలు= ఓలలాడు.

**భావము:** స్వామీ! నీకు అలమేలుమంగమ్మపై నున్న ప్రేమను ఏమని చెప్పగలము? ఆ మృదుశీలి చెక్కిట చేయివేసుకొని నీకై ఎదురుచూపులు చూస్తున్నది.

ఆమె అనన్య చింతనతో నీ గురించే తలపోస్తూ, నిట్టూర్పులు విడుస్తూ చెలులను చూస్తున్నది. చెలులంతా దీనికి కోపించి నీతో చెప్పబూని జోక్యం చేసుకోగా, ఆమె తలవంచుకొని ఎక్కడో దాగి యున్నది.

మంచముపై పండుకొన్న ఆ సతి మనసు నీపైనే ఉండగా, ఎక్కడో దాగి యున్న చిలుక వచ్చి ఏదో తింటూ తనను తూలనాడింది. చిలుక విషయము చెప్పడానికి వచ్చి నీ ముంజేతిపై వాలగా, ఆమె భయపడి కంపముతో నీ వైపు చూచినది.

నీ వక్షస్థలముపై నున్న అలమేలుమంగ రొమ్ములు అనుకూలముగా నీపై హత్తుకొనగా, మోటుగా చక్రవాక పక్షులపై వల వేసినట్లాయెను. ఓ శ్రీవేంకటేశ్వరా ఆ పక్షుల ముక్కులవలె వాడిగా నున్న చన్నుల మొనలు నిన్ను తాకగా, తెరవేసుకొని కూడి శృంగార క్రీడలతో ఓలలాడినది.

**విశేషము:** అన్నమయ్య వర్ణనా చమత్కృతి గొప్పది. వక్షోజములను చక్రవాక పక్షులతో సరిపోల్చడమే కాక, వాటి వాడియైన ముక్కులను చనుమొనలతోను, ఆ వక్షోజములనే పక్షులను వలవేసి పట్టుకొన్నట్లు మనోహరంగా వర్ణించడం విశేషం.

## 279

**అవతారిక:** నాయిక విభునికి తన మనవి వినిపించమని కోరుతూ, స్వామితో జతగూడితే కలిగే పరవశాన్ని చెబుతూ రాయబారం పంపుతున్నది.

### శ్రీరాగం

ప. విన్నవించరే యీమాట విభునికిని
తన్నుఁ దానె యెఱుఁగును తలఁచుకొమ్మనవే ॥పల్లవి॥

1. మనసు లేకములై తే మాటలు సమ్మతులౌను
ననుపు గలిగితేను నవ్వు గలుగు
తనువులు సోఁకితేనే తమకములు రేఁగును
చనవు సతమైతేనే సరసము చెల్లును ॥విన్న॥

2. పాడితో నడచితేనే పంతము లీడేరును
జోడుగూడి వుండితేనే సొంపైవుండును
వేడుక లొనగూడితే వీడుదోడు లితవౌను
వాడికలు దొరికితే వలపు లమరును ॥విన్న॥

3. యేకతములై తేనే ఇక్కువలు గరఁగును
కై కొని కాఁగిలించితే కళ లుబ్బును
యీకడ నలమేల్మంగ నేలె శ్రీ వేంకటేశుఁడు
చేకొని నన్నుఁ గూడెను చిత్తగించుమనవే ॥విన్న॥

**అర్థములు:** ప. విన్నవించు= మనవిచేయు, విభుడు= భర్త, తన్ను తానే= తనవిషయం తనకే, తలుచుకొను= ధ్యానించు.

1. ఏకము= సమానము, సమ్మతి= అంగీకారము, ననుపు= అనురాగము, తనువు= శరీరము, సోకు= తగులు, తమకము= మోహము, సతము= శాశ్వతము, చెల్లును= ఈడేరును.

2. పాడి= ధర్మము, పంతము= పట్టుదల, ఈడేరు= తీరు, జోడు= జత, సొంపు= అందము, వేడుక= కుతూహలం, ఈడుదోడు= ప్రాయపుజత, హితవు= ఇష్టము, వాడిక= అలవాటు, అమరు= ఏర్పడు.
3. ఏకతము= వేరే ధ్యాసలేని, ఇక్కువ= ఉనికి, కైకొని= చేకొని, కాగలించు= కౌగలించు, కళ= శోభ, ఉబ్బు= అతిశయించు, ఈకడ= ఈప్రదేశంలో, చేకొని= గైకొని, చిత్తగించు= సావధానముగా విను.

**భావము:** చెలులారా! ఈ నామాట స్వామివారికి నివేదించండి. తన విషయం తనకే తెలియును కనుక నా విషయం లో జోక్యం చేసుకొనమనవే!

మనసులు కలిసి ఒకటైనట్లైతే మాటలు సైతము అంగీకరింపబడుతాయి. అనురాగం కలిగితేనే కదా నవ్వులు విరజిమ్ముతాయి. శరీరముల స్పర్శ కలిగితేనే మోహం వెల్లివిరిస్తుంది. చనువు బాగా ఉన్నట్లైతేనే సరసము బాగా పండుతుంది.

నీతి, ధర్మాలతో ప్రయత్నిస్తేనే పట్టుదలలు నేరవేరుతాయి కదా! ఇరువురు ఒకరికొకరు జతగూడి ఉంటేనే అందం ఇనుమడిస్తుంది. కుతూహలము హెచ్చి ఉంటేనే వయసుతోడు బాగా ఇష్టమై ఉంటుంది.

ఇద్దరూ అన్యచింతనలేకుండా ఏకమై ఉంటేనే ఉనికికి పరమార్థం కలుగుతుంది. చేకొని కౌగలించుకుంటేనే శోభలుద్దీపన చెందుతాయి. ఈ తావున శ్రీవేంకటేశ్వరుడు అలమేలుమంగమ్మను ఏలుకున్నాడు. నన్ను కూడా స్వామి కలుసుకున్నాడు కనుక తన ప్రియము చూపించమనవే!

## 280

**అవతారిక:** కొలువులో ఉన్న స్త్రీజనం స్వామిపట్ల ప్రదర్శిస్తున్న అతి చనువుకు, ప్రేమలకు అమ్మ అలమేలుమంగమ్మ స్వామితో ఆవేదనతో పలుకుతున్న పలుకులివి.

### భైరవి

ప. కానీవయ్యా అందరికీఁ గలిగిన సంసారమే
వీనులార నన్నియును వినేము నే మిఁకను ॥పల్లవి॥

1. చెప్పుదురు పతులతో చెలులు తమనేర్పులు
వొప్పి యెంతవడియైనా నూఁకొంటేను
నెప్పున నాకెమాటలు నీకు బాఁతై నేఁడున్నవి
వుప్పతించ మాకేల వొడఁబడే మిపుడు ॥కానీ॥

2. చూపుదురు తమయెమ్మె సుదతు లెంతవడైనా
ఆపనలకు నాయకుఁ డాసవడితే
పైపయి నాపెకు నీవు భ్రమసి వున్నాఁడవు
కోపగించ మాకేల కూడి సంతసించేము ॥కానీ॥

3. నవ్వుదు రెంత వడైనా ననుపుతో వనితలు
రవ్వగా వలచినట్టి రమణునితొ
యివ్వల శ్రీ వేంకటేశ యేనలమేలుమంగను
చివ్వన మమ్మేలతివి చేరె మాకు రతులు ॥కానీ॥

**అర్థములు:** ప. వీనులారా= చెవులారా, వినేము= వింటాము, నేమికను= మేము ఇకమీదట.

1. నేర్పులు= నైపుణ్యాలు, ఒప్పు= తగినవిధము, వడి= వేగము, ఊకొను= ఊకొట్టు,సమ్మతించు, నెప్పున= స్థానము, ఆకె= ఆమె, బాతి= ప్రియము, నేడు= ఈరోజు, ఉప్పతించు= ఊరక ఆడిపోసుకొను, వొడబడు= అనుకూలించు.

2. ఎమ్మె= విలాసము, సుదతులు= స్త్రీలు, ఆపన= ప్రాప్తి, నాయకుడు= ప్రియుడు, ఆసవడు= కోరుకొను, పైపయి= లోతులేని, ఆపె= ఆమె, భ్రమయు= భ్రాంతి.

3. ననుపు= అనురాగము, రవ్వ= అల్లరి, రమణుడు= ప్రియుడు, ఇవ్వల= ఇక్కడ, ఏను= నేను, చివ్వన= వెంటనే, చేరు= కలుగు.

**భావము:** స్వామీ! శ్రీనివాసా! ఇక మాటలేల? ఇవన్నీ అందరికి సంసారములో ఉన్న బాధలే కదా! ఇక చెవులారా అన్నీ వింటాము స్వామీ!

స్వామీ! ఈ చెలులు ఎంత లౌక్యము నేర్చినవారో చూశావా! తమ నైపుణ్యాలన్నీ భర్తలతో గోరంతలు కొండంతలుగా వినిపిస్తారు. ఊకొడుతూ వింటూ ఉంటే అవి ఎంత ఎలాంటివైనా సరే అదేపనిగా చెబుతూ ఉంటారు. ఈనాడు ఆమె మాటలు నీకెంత ప్రియముగా నున్నవో కదా! ఊరకే ఆడిపోసుకుంటామనే చెడ్డపేరు మాకెందుకు? అన్నిటికీ అనుకూలించి సిద్ధమై ఉన్నాము.

స్వామీ! ఈ వనితలు తమ విలాసాలన్నీ ఎంత వాడిగా ప్రదర్శిస్తారో! ఆ విలాసాలకు ప్రియుడైన నీవు ఆశపడినట్లైతే, ఆమె ఆమె పై పైన మాట్లాడే, చేసే పనులకే భ్రాంతిలో పడి ఉన్నట్లవుతుంది. మళ్ళీ కోపం ప్రదర్శించామన్న అపవాదు మాకేల? చూస్తూ సంతోషించడమే మా పని.

స్వామీ ! ఈ కాంతలు అల్లరి వారలై వలచిన ప్రియుడైన నీపై ఎంతగా అనురాగం ప్రదర్శిస్తున్నారో చూశావుగదా! ఓ శ్రీవేంకటేశ్వరా! ఇక్కడ నేను అలమేలుమంగమ్మను. శీఘ్రముగా మమ్మేలుకొనగానే మాకు రతిక్రీడా విశేషాలన్నీ సిద్ధించి గొప్ప సంతృప్తిని కలిగించాయి.

**విశేషము:** అన్నమయ్య ఈ కీర్తనలో "ఎంత వాడియైనా" అనే శబ్దసామ్యము గలిగియున్నట్టి శబ్దాలంకారమును, వివిధ సందర్భాలలో వివిధ అర్థములు వచ్చేవిధంగా ఉపయోగించాడు. సాధారణ అర్థంలో వడి అంటే వేగము, శౌర్యము, కాలము అనే అర్థంలో వాడబడతాయి. కానీ అన్నమయ్య మొదటి చరణములో "ఒప్పి ఎంత వడైనా" అనడంలో "ఎంత శ్రమ కలిగించినా" అనే అర్థంలోను, రెండవ చరణములో "సుదతులు ఎంతవడైనా" అనడంలో స్త్రీలు "ఎంతసేపైనా" అన్న అర్థంలోను, మూడవ చరణంలోను "నవ్వుదు రెంతవడైనా" అనడంలో స్త్రీలు "ఎంత అతిశయముగానైనా" అనే అర్థములో వాడినట్లు తెలుస్తున్నది. అందుకే అన్నమయ్య పదాలను వాడడంలో సర్వ స్వతంత్రుడు అంటారు పెద్దలు.

## 281

**అవతారిక:** అన్నమయ్య ఈ కీర్తనలో మన్మథ సామ్రాజ్య విహారం చేస్తూ అనేక గొప్ప ఉదాహరణలతో శృంగార విశేషాలను వర్ణించాడు. చక్కటి ఔపమ్యంతో రూపకాలంకార చతురతో కీర్తన మనోజ్ఞమై భాసిల్లింది.

### పాడి

ప. మచ్చికతో నేలవయ్య మదనసామ్రాజ్యలక్ష్మి
పచ్చి సింగారాలచేత బండారాలు నిండెను ॥పల్లవి॥

1. కొమరెతురుమునను గొప్పమేఘ ముదయించి
చెమటవాన గురిసెఁ జెక్కులవెంట
అమరఁ బులకలపైరు లంతటానుఁ జెలువొంది
ప్రమదాలవలపులపంట లివె పండెను ॥మచ్చిక॥

2. మించులచూపుల తీగెమెఱుఁగు లిట్టె మెరిచి
అంచెఁ గోరికలజళ్లవె పట్టెను
సంచితపుకుచముల జవ్వనరాసులు మించె
పొంచి నవ్వుల మాని పోదిగొనె నిదిగో ॥మచ్చిక॥

3. అలమేలుమంగమోవియమృతము కారుకమ్మి
నలువంక మోహపుసోనలు ముంచెను
యెలిమి శ్రీవేంకటేశ ఇంతి నెట్టె కూడితివి
కొలఁదిమీరి రతులకొటార్లు గూడెను ॥మచ్చిక॥

**అర్థములు:** ప. మచ్చిక= మోహము,ఆసక్తి, మదనసామ్రాజ్యలక్ష్మి= మన్మథ లోకం, పచ్చి= మరుగులేని, బండారాలు= గుట్టు, ఖజానా

1. కొమరె= ఆడుది, తురుము= కొప్పు, ఉదయించి= పుట్టి, చెక్కులు= చెక్కిళ్ళు, అమర= సిద్ధమగు, పులకలపైరు= గగుర్పాటు అప్పుడే కలగడం, చెలువొందు= ఒప్పు, ప్రమద= స్త్రీ, వలపులపంట= ప్రేమఫలము.
2. మించు= అధికమైన, తీగెమెరుగు= తీగెమెరుపు,తళుక్కుమని మెరయు, మెరిచి= మెరిసి, అంచె= వరుస, కోరికలజళ్ళు= లేలేత కోరికలు, సంచితము= కూడబెట్టిన, జవ్వనరాసులు= యౌవన గిరులు, పొంచి= దాగి, పోది= అతిశయము.
3 మోవి అమృతము= అధరామృతము, కారుకమ్ము= వర్షమువలె, నలువంక= నాలుగుదిక్కుల, మోహపు సోన= అల్ప మోహము, ఎలిమి= వికాసము, ఇంతి= స్త్రీ, కొలదిమీరు= అపరిమితము, కొటార్లు= ధాన్యము మొదలైనవి నిల్వ ఉంచుకునే గదులు.

**భావము:** స్వామీ! మోహాసక్తితో మన్మథ సామ్రాజ్యాన్ని యేలుతూ నీ శృంగారాలన్నీ చూపించవయ్యా! నీవు చేసే మరుగులేని శృంగారములవలన ఖజానాలు మొత్తం నిండిపోయినది.

స్త్రీ పెట్టుకొన్న కొప్పు ఘనమైన మేఘమువలె కారుమబ్బుల వర్ణాన్ని తలపిస్తూ చెమట వానలు చెక్కిళ్ళ వెంట కారుతున్నాయి. దానికి తోడుగా గగుర్పాటు సిద్ధమై శరీరమంతటా యొప్పి ఉన్నది. ఆ వనితల వలపు పంటలు పండినట్టే సుమా!

స్త్రీ చూసే చూపులు ఆకాశములోని తీగెమెరుపు లాగా అప్పుడప్పుడూ తళుక్కుమని మెరుస్తున్నది. వరుసలో ఆశల లేలేత కోరికలు నిండినవి. సంతరించుకొన్న భారాలయిన వక్షోజాలనే యౌవన గిరులు అతిశయిస్తున్నాయి. దాగి తొంగి చూస్తున్న నవ్వుల వసంతము వీటన్నిటినీ మించి ప్రకాశిస్తున్నది.

అలమేలుమంగమ్మ అధరామృతము మేఘాలతో నిండిన వర్షపు జల్లువలె నాలుగు వైపులా మోహాసక్తితో నిండిపోయినది. ఓ శ్రీవేంకటేశ్వరా! వికాసముతో ఆమెను కూడి యున్నావు. పరిమితులు, హద్దులు లేని రతిక్రీడాదులతో ధాన్యపు కొటారులవలె సంపూర్ణంగా నిండిపోయినవి.

**విశేషాంశాలు:** పరిష్కర్త శ్రీమాన్ గౌరిపెద్దివారు రెండవ చరణములో "మెరిచి" అని ఉపయోగించిన ధాతువు 'మెరసి 'కి వ్యవహారిక రూపమా? యని సందేహం వెలిబుచ్చారు. కానీ, ఉత్తర హరివంశములో నాచన సోమన పద్యాలలో ఇలాంటి పదాలు కోకొల్లలుగా లభిస్తాయి. సోమన 14వ శతాబ్ది వాడు. వీరబుక్కరాయల ఆస్థానములో నున్న కవి. ఆయన తన కావ్యంలో "వ. నీలకంఠ నిటలతటనయన శిఖిశిఖాసహాయంబైన తెఱంగున మెఱచి చఱచి నంబురంబు సొరక కృత్యకృత్యంబు లేక మరలి పఱవంజొచ్చిన(ఉ .హరి. 3 అ)" అంటూ 'మెఱచి' అని వాడిన సోమన పదాన్ని అన్నమయ్య కొద్ది మార్పు చేసి "మెరిచి" అని ఉపయోగించాడు కనుక వ్యావహారికమని భావించడం సరియైన అభిప్రాయం కాకపోవచ్చు.

## 282

**అవతారిక:** స్వామి చెలులతో హద్దులు మీరు వర్తిస్తున్నాడని అలమేలుమంగమ్మ అలిగింది. స్వామితో ఆమె ప్రవర్తన తప్పని బుద్ధి చెప్తున్నారు.

### లలిత

ప. నేనే బుద్ధిచెప్పుకొనే నేరుపునఁ బతికిని
దానికేమి యింతలోనె తానే నన్నునేలెను ॥పల్లవి॥

1. మగవాఁడు మేరమీరి మగువలఁ జెనకితే
తగవులఁ బెట్టనేల తడవకువే
మొగమోటయినచోట మోనాన నుండుటమేలు
పగటున మిగులాను బలిమిసేయకువే ॥నేనే॥

2. పాయపువాఁడు మిక్కిలి పరచై తిరిగితేను
బాయిట వేయఁగనేల పదరకువే
తోయరానిచుట్టముతో చాయసేసుకొంటే మేలు
రాయడించి సారెసారె రచ్చలఁబెట్టుకువే ॥నేనే॥

3. శ్రీవేంకటేశ్వరుఁడు సిగ్గులు విడిచితేను
కావరించి నవ్వనేల కదుమకువే
వావులెనసిన చోట వదలకుండట మేలు
నీ వలమేల్మంగ కూడి నెలవైపాయకువే ॥నేనే॥

**అర్థములు:** ప. నేరుపు= నైపుణ్యము, బతికిని= బ్రతుకుతున్నాను.

1. మేరమీరు= హద్దులుదాటు, చెనకు= తాకు,స్పృశించు, తడవక= ఆలస్యముజేయక, మొగమాటము= జంకు,ఇబ్బందికరమగు, మోనాన= మౌనము, పగటు= ప్రకాశము, మిగుల= అధికము, బలిమి= బలము చూపు.
2. పాయము= వయసులోనున్న, పరచి= అప్పిచ్చినవాడు, బాయిట= బయట, పదరు= కోపించు, తోయరాని= వీడరాని, చాయజేయు= శోభించేవిధముగా, రాయడించు= బాధించు, సారె సారె= మాటిమాటికి, రచ్చలు= అల్లరిపాలు.
3. కావరించి= మదించి, కదుము= ఆక్రమించు, వావి= బంధుత్వము, ఎనయు= కలుగు, నెలవు= స్థిరము, పాయకు= వీడక.

**భావము**: నాకు నేనే మంచి చెడూ చెప్పుకుంటూ బ్రతికినదానిని. ఆ విషయాలన్నీ, ఎలాగున్నా ఇంతలోనే ఆ స్వామి నన్నేలుకున్నాడు.

మగవాడు హద్దులు మీరి ఆడువారితో ప్రవర్తిస్తే, తగదాలు ఆడడం ఎందుకు? యేమీ మాట్లాడకుండా మౌనంగా ఉండడం మేలు. అతిశయించి తూలనాడి నీ బలిమిని చూపవద్దు.

వయసులో నున్నవాడు ఎక్కువగా బాకీలు ఉన్నవాడిలాగా అటూ ఇటూ తిరుగుతూ ఉంటే, ఆయన వ్యవహారం బట్టబయలు చేయడం ఎందుకు? దీనికే కోపించడమెందులకు? ఆయన నీకు వీడరాని బంధువు కదా? శోభించి మంచి చేసుకుంటే చాలు కదా! బాధించి మాటి మాటికి అల్లరి పెట్టడవద్దు.

శ్రీవేంకటేశ్వరుడు నీ చెంతకు జేరి సిగ్గు విడిచి చిరునవ్వులు చిందిస్తూ నిలబడితే మదించి ఆ పరిహాసపు నవ్వులు నవ్వుతూ ఆయనను ఇంకా అణచి ఉంచుదామనే ఆలోచన చేయడమెందుకు? వావి వరస చుట్టరికాలు ఉన్న తావుల్లో వదలకుండా ఉండడం మేలు కలిగిస్తుంది. అందునా నీవు పట్టపు రాణివైన అలమేలుమంగమ్మవు కనుక స్వామిని కూడి ఇచ్చోట స్థిరమై శాశ్వతముగా వీడకుము.

## 283

**అవతారిక:** స్వామిని చూడగానే ఏదో దాస్తున్నాడని గ్రహించి అమ్మ పరిహాసముగా చెలితో మాట్లాడే మాటలివి.

### లలిత

ప. అందులోనే కానరాదా అతివ యీతని సుద్ది
కందువ లన్నియు నీవె కనుఁగొనఁ గదవె ॥పల్లవి॥

1. సెలవినేల నవ్వీనే చేరి నే మోము చూచితే
లలిఁ దనవంకను కల్లలేనివాఁడు

ములువాడిఁగోర నేను మోపితేనే లలికీనే
వెలుపల లోనాను వెరపులేనివాఁడు ॥అందు॥

2. సిగ్గులేల పెంచీనే చెయ్యివట్టి తీసితేను
యెగ్గులుఁదప్పులులేక యేచినవాఁడు
దిగ్గనఁ గాఁగిలించితే దిక్కులేక చూచీనే
బగ్గన నెవ్వతెకైనా బాసియ్యనివాఁడు ॥అందు॥

3. శిరనేల వంచీనే చెంత మోవి నే నంటితే
విరసమెరఁగని(శ్రీవేంకటేశుఁడు
అరిది నలమేల్మంగనై కూడితే మెచ్చనేలే
గొరబై యెవ్వరికిని గుట్టియ్యనివాఁడు ॥అందు॥

**అర్థములు:** ప. కానరాదా= తెలియదా! అతివ= స్త్రీ, సుద్ధి= మాట, కందువ= జాడ.

1. సెలవి= పెదవిమూల, లలి= క్రమము, కల్ల= దోషము, ములువాడి= ముల్లువలె వాడిగానున్న, మోపు= ఆనించు, వెరపు= భీతి.
2. పెంచు= అధికముజేయు, ఎగ్గులు= నింద, ఏచు= బాధించు, దిగ్గన= తటాలున, కాగలించు= కౌగలించు, దిక్కులేక= వేరేదారిలేక, బగ్గన= మొరటుదనము, బాస= మాట.
3. మోవి= ముఖము, విరసము= విసుగు, అరిది= దుర్లభము, గొరబు= వేషాలువేసేవాడు, గుట్టిచ్చు= రహస్యము చెప్పు.

**భావము:** చెలీ! స్వామి వ్యవహారమంతా అందులోనే బయటబడినది కదా! ఇంక జాడలన్నీ నీవే కనుగొన వచ్చునుగదే!

ఆయన నిజంగా దోషమే లేనివాడైనట్లైతే, నేను స్వామి ముఖారవిందము చూడగానే పెదవి మూల నవ్వులెందుకు నవ్వుతున్నాడు? వెలుపలా లోపలా యేమీ భీతిలేనివాడైతే, వాడిగా ఉన్న నా గోరు తన మీద ఆనించగానే ఒయ్యారాలు పోవడమెందుకు?

మీద చేయి వేస్తేనే, ఊరక అలా అధికంగా సిగ్గులు ప్రదర్శిస్తున్నాడెందుకు? తన తప్పులేమీ లేనట్టుగా ప్రవర్తిస్తూ ఇబ్బందిపెట్టనివాడైతే, మొరటుదనంతో ఎవరికీ మాట ఇవ్వని వాడైతే, తటాలున కౌగలించుకోగానే దిక్కులు చూడడం ఎందుకు?

విసుగూ విరసము తెలియని వాడైతే, ఆ శ్రీవేంకటేశ్వరుడు, నేను చేతితో ముఖాన్ని అందుకోగానే తలనెందుకు వంచుకుంటున్నాడు? అరుదైన అలమేలు మంగమ్మనై స్వామిని కూడితే ప్రశంసించవలెను కదా మరి, ఎవరికీ గుట్టు మట్టూ చెప్పని వాడు ఇలాంటి వేషాలెందుకు వేస్తున్నాడు?

## 284

**అవతారిక:** పట్టపురాణియైన అలమేలుమంగమ్మతో భూదేవి పలుకుతున్న పలుకులివి.

### మంగళకౌశిక

ప. చూడఁ బిన్నపు సేఁతలు చూపి చెప్పఁగఁ గొత్తలు
జాడల నిన్నిటా నేఁడు జాణవైతివే ॥పల్లవి॥

1. ఆయములుసోఁక మాటలాడ నేర్చుకొంటివే
కాయజుదీమవై నీవు గలగితివే
చాయలాను సన్నలాను సాదించ దొరకొంటివే
పాయవువిభుని నింత భ్రమలఁ బెట్టితివే ॥చూడ॥

2. నీటుసెలవినవ్వులు నీవలనఁ గంటిమే
పాటలఁ జొక్కించ నీపాలాయనే

జూటుఁ దనాలకు నీవే సూటియై నిలిచితివే
తాటించి ఆతని నిట్టె దక్కఁగొంటివే ॥చూడ॥

3. అలమేలుమంగవు నీ వట భూకాంతను నేను
యెలమి శ్రీవేంకటేశు నెనసితివే
పొలసి నాకత నీతో పొందు లీడేరించితివే
తెలిపి నీవే పట్టపుదేవులవైతివే ॥చూడ॥

**అర్థములు:** ప. బిన్నపు సేతలు= వ్యతిరేకమైన పనులు, కొత్తలు= వింతలు, జాడల= చూచేదానికి, జాణ= నేర్పరి.

1. ఆయము= ప్రాణము, కాయజుడు= మన్మథుడు, ధీమ= తెలివిగల, కలగు= కంగారుపడు, చాయలు= వన్నెలు, సన్నిలు= సైగలు, సాదించు= బాధించు, పాయు= వీడు, భ్రమ= భ్రాంతి.
2. నీటు= శృంగారంపు, సెలవినవ్వు= పెదవిమూల నవ్వు, చొక్కు= పారవశ్యము, పాలగు= వశమగు, జూటు= మోసము, సూటి= గురి, తాటించు= మొత్తు, దక్కగొను= దక్కించుకొను.
3. భూకాంత= భూదేవి, ఎలమి= వికాసము, ఎనయు= పొందు, పొలయు= వ్యాపించు, కత= విషయము, ఈడేరు= నెరవేరు, పట్టపుదేవులు= పట్టపురాణి.

**భావము:** చూడడానికి నీ వ్యతిరేకమైన పనులు చాలా వింతగా నున్నవి. గమనిస్తే అన్ని విధముల ఈనాడు నేర్పరివై యున్నావుగదే!

స్వామి జీవస్థానములు తాకగానే ఏవో మాటలు మాట్లాడడం నేర్చుకొన్నావు. మన్మథ సామ్రాజ్యములో తెలివిగల దానివై ప్రకాశిస్తూ కంగారు పెడుతున్నావు. శోభలు, సైగలు చూపి స్వామిని ఏదో విధముగా బాధింప యత్నిస్తున్నావు. వయసులో ఉన్న భర్తను ఈ విధముగా భ్రమలలో ముంచెత్తుతున్నావు గదే!

శృంగారపు పెదవి మూల నవ్వులు నీవలననే గమనించి చూశాము. నీ మనోహరమైన గీతాలతో స్వామిని పారవశ్యుడిని చేసి, మోసపు చేతలకు గురిగా నిలబడ్డావు. స్వామిని ఈవిధముగా దక్కించుకొన్నావు.

అలమేలుమంగమ్మె నీవు, భూదేవియై నేను స్థిరమైన వికాసముతో నుండగా, శ్రీవేంకటేశ్వరుని పొందు దక్కించుకొన్నావు. వ్యాపించి విషయాలన్నింటిని ఎరిగినదానివై స్వామివారి పొందులతో సర్వమూ నెరవేర్చుకొన్నావు. నీవే పట్టపురాణినని చాటుకొని తెలుపుకున్నావు గదే!

## 285

**అవతారిక:** కొలువులో స్వామి చేస్తున్న శృంగార చేష్టలను ఉటంకిస్తూ చెలులు అలమేలుమంగమ్మను కూడమని చెప్తున్నారు.

### రామక్రియ

ప. ఊరకేల దాఁచేవు వుదుటు నీచేఁతలు
యేరీతి నీవుండినాను యెవ్వరేమనేరు ॥పల్లవి॥

1. వింతచెలు లుండఁగాను వెలఁదితోఁ జెవిలోన
మంతనాన నీ వప్పుడు మాటలాడవా
ఇంతలో నేఁటికి బొంకనేమాయ నేమిసేసినా
చెంతలమగవాఁడవు చెల్లదా నీకిపుడు ॥ఊరకేల॥

2. కాకుసేసిరంటాను కడవా రెఱఁగకుండా
ఆకెయిచ్చిన వుంగర మందుకొనవా
నీ కేల సిగ్గువడ నేఁడు గొత్తలా యివి
యీకడ నీయిచ్చరాజ వేల లోఁగే విపుడు ॥ఊరకేల॥

3. వలచి శ్రీవేంకటేశ వనితల మందిలించి
అలమేలుమంగ నురమందు నుంచవా
కలసితి విటు నన్నుఁ గపటము లికనేల
బలిమికాఁడ వౌదువు పదరకు మిపుదు ॥ఊరకేల॥

**అర్థములు:** ప. ఊరక = తీరికగా, ఉదుటు = విలాసము, చేతలు = పనులు, రీతి = తీరు.

1. వింత = అబ్బురము, వెలది = స్త్రీ, మంతనము= ఏకాంతము, బొంకు= అసత్యమాడు, చెల్లు = సరిపోవు.
2. కాకు=తిరస్కారము, కడవారు = అన్యులు, ఆకె = ఆమె, కొత్తలు = అపూర్వము, ఈకడ = ఇక్కడ, ఇచ్చ = ఇష్టము, లోగు = లోకువ.
3. వనిత = స్త్రీ, మందలించు= హెచ్చరించు, ఉరము = వక్షస్థలము, కపటము = మోసపు ఆలోచన, బలిమికాడు = దృఢమైన వాడు, పదరు = ఆక్షేపించు.

**భావము:** స్వామీ! నీ చేతలన్నీ ఊరకే దాచిపెడితే సరిపోతుందా? నువ్వెలా ఉన్నా ఎవరేమి చేయగలరు, అనుకోగలరు, చెప్పండి?

ఆశ్చర్యమేమిటంటే కొలువులో చెలులంతా ఉండగానే, ప్రక్కనున్న స్త్రీ చెవిలో ఏకాంతముగా ఏదో రహస్యము చెప్తూ ఉంటావు. అడిగితే ఏమీ లేదని అబద్ధమాడుతూ ఉంటావు. నువ్వు మగవాడివి కనుక నీవేమి చేసినా చెల్లిపోతుంది స్వామీ!

ఎవరో నీ పట్ల ఏదో చేశారని, అన్యులెవరూ గమనించకుండా ఆమె ఇచ్చిన ఉంగరాన్ని అందుకొంటావు. అడిగితే మాత్రం సిగ్గులొలకబోసి తెలియనట్టు నటిస్తావు. ఇవన్నీ మాకు ఈనాడు కొత్త విషయాలా? ఈ విధముగా ఇక్కడ నీ ఇష్టా రాజ్యముగా ఇలా ప్రవర్తిస్తూ ఉంటే అందరికి లోకువవవా స్వామీ!

ప్రేమానురాగాలు చూపించి అలమేలుమంగమ్మను మోహించి కోరుకొని వక్షస్థలమందు ఉంచుకోనరాదా స్వామీ! ఆమెను యిలా కలిశావు కదా! ఇంకనూ ఏవో కల్లబొల్లి మాటలాడడం ఎందుకు? నీవు గొప్ప బలవంతుడవే స్వామీ..కానీ ఇలా అన్నిటికి ఆక్షేపణలు తగునా?

## 286

**అవతారిక:** స్వామి అమాయకంగా నటిస్తూ, ఆడువారి ఆభరణాలు పట్టి చూస్తూ, తెలియకుండానే శృంగారంలోకి దింపే మాయగాడని అలమేలుమంగమ్మ అంటున్నది.

### రామక్రియ

ప. మంచివాఁడవువలెనే మతకములు సేసేవు
అంచెలనే పైకొనే వవునయ్యా నీవు ॥పల్లవి॥

1. చీర లెస్సాయనంటాను చెరఁగువట్టి తీసేవు
హారములు చూచేనంటా నంటేవు చన్నులు
తీరాయఁ గమ్మలనుచు గోర గీరేవు చెక్కులు
ఆరీతి నింతసేతురా అంగనలను ॥మంచి॥

2. వుంగరాలు మంచివంటా నూరకే వేలువట్టేవు
సింగారమాయఁ గొప్పంటా జేయిచాఁచేవు
సంగతాయఁ గుచ్చులంటా సరుగ నొడివట్టేవు
చెంగటఁ గాకు సేతురా చెలువలను ॥మంచి॥

3. మోవిపండు తీపులంటా మంచి చవులు రేఁచేవు
శ్రీవేంకటేశుఁడ నన్నుఁ జేరి కూడేవు

ఆవల నలమేల్మంగనని నన్నుఁ బొగడేవు
భావించి సచ్చిసేతురా పడఁతులను ॥మంచి॥

**అర్థములు:** ప. మతకములు= మాయలు, అంచెలు= వరుస, పైకొను= మీరు, యత్నించు.

1. లెస్స= శ్రేష్టము, చెరగు= చెంగు, అంటు= తాకు, చన్నులు= వక్షములు, తీరు= చక్కన, కమ్మలు= కర్ణాభరణములు, గోరగీరు= గోటి గీరలు పడునట్లు చేయు, చెక్కులు= చెక్కిళ్ళు, ఆరీతి= ఆ తీరుగా, అంగన= స్త్రీ.
2. ఊరకే= పనిలేక, వేలువట్టు= వేళ్ళు పట్టుకొను, సింగారము= అలంకారము, సంగతి= యోగ్యము, గుచ్చులు= కుచ్చులు, సరుగ= విజృంభించి, చెంగట= చెంత, కాకు= కలత, చెలువలు= ఆడుది.
3. మోవిపండు= ముఖమనే ఫలము, తీపు= తీయనైనది, చవులు= రుచులు, రేచు= రేపు, ఆవల= అటు తర్వాత, సచ్చి= బాధ, పడతి= స్త్రీ.

**భావము:** స్వామీ! పైకి ఏమీ ఎరుగని అమాయకుడిగా నటిస్తూ ఎన్నో మాయలు చేస్తూ ఉంటావు. వరుసగా మితిమీరి ఏవేవో ప్రయత్నాలు చేస్తుంటావు.

నీ చీర శ్రేష్టమైనది అని చెబుతూ కొంగుపట్టుకుని తీసేస్తావు. మెడలోని దండలు బహుబాగు అని ప్రశంసిస్తూనే నా రొమ్ములు అంటుకుంటావు. ఆహా! చెవి కమ్మలు ఎంత సోయగంగా ఉన్నాయని చెబుతూ నా చెక్కిలిపై నీ గోరు గీర్లు వేస్తావు. అసలీవిధంగా ఎవరైనా చేస్తారా స్వామీ!

వేలికి పెట్టుకున్న ఉంగరాలు చాలా బాగున్నాయని చెబుతూ వారి చేతి వేళ్ళు పట్టుకుంటావు. నా అందం మనోహరమని పొగడుతూ నాకై చేతులు చస్తావు. నీ జడ కుచ్చులు బహు యోగ్యమైనవి అని అంటూనే విజృంభించి నా ఒడిపట్టుకుంటావు. ఇలా చెంతజేరి ఎవరైనా స్త్రీలను కలతకు గురిచేస్తారా స్వామీ!

నీ ముఖారవిందమనే ఫలము బహు తీపిగా ఉందని చెబుతూ ఎన్నో రుచులు రేపుతూ అధరామృతాన్ని ఆరగిస్తావు. ఈ రీతిగా శ్రీవేంకటేశ్వరా!నన్ను చేరి కలుస్తావు. అవతల అలమేలుమంగమ్మా! అంటూ నన్ను ప్రశంసలకు గురిచేస్తావు. ఇలా భావించి తలుచుకొని స్త్రీలను బాధలకు గురిచేస్తారా స్వామీ!

**విశేషము:** స్త్రీలు ధరించు నగలైన హారములు, కమ్మలు, ఉంగరాలు, కుచ్చులు మొదలైనవి ఇలా ఎన్నో ఆభరణాలు వర్ణించబడ్డాయి.

## 287

**అవతారిక:** అలమేలు మంగమ్మ ప్రణయ కలహపు కారణమెరుగలేని చెలులు, కోరి వచ్చిన స్వామిని చేరి సుఖించమని ప్రభోదిస్తున్నారు.

### పాడి

ప. వలచినదానికేలే వాసులెంచను
సెలవుల నవ్వుతాను చేకొనఁగవలదా ॥పల్లవి॥

1. పిలువఁగా నీవేల బిగిసేవే పతితోను
చలము లెందాఁకాను సాదించేవే
బలిమి నాతఁడు నిన్ను పైకొని చెనకఁగాను
కలువకన్నులఁ జూచి కాఁగిలించవలదా ॥వలచి॥

2. వొడిపట్టి తియ్యఁగాను వొరటు లింకానేలే
బడివాయకుండఁగాను పంతమేఁటికే
ఆడియాలముగ మోవి యాతఁడు నీకియ్యఁగాను
తడివి మోవి యొసఁగి దప్పి దేర్చవలదా ॥వలచి॥

3. ముందుముందె మాటాడఁగా మోసము నీకిపుడేలే

కందువ నిన్నుఁ గూడఁగ కాఁతాళమేలే
చెంది యలమేల్మంగవు శ్రీవేంకటేశుఁ డతఁడు
పొంద్దైతి రిట్లానే భోగించవలదా ॥వలచి॥

**అర్థములు:** ప. వలచు = మోహించు, వాసులు= తారతమ్యములు, ఎంచు= లెక్కించు, సెలవుల నవ్వు= పెదవి మూల నవ్వు, చేకొను= చేపట్టు.

1. బిగియు= బెట్టుచేయు, చలము= కంపము, పైకొని= చేపట్టి, చెనకు= తాకు, కలువకన్నులు= కలువరేకులవంటి కన్నులు, కాగలించు= కౌగలించు.
2. ఒరటు= మొరటు, ఇంకా నేలే= ఇంకా ఎందుకు, బడివాయు= వదలిపెట్టు, పంతము= పోటీ, అడియాలము= గుర్తు, తడివి= నిమిరి, దప్పి= దాహము, తేర్చు= పోగొట్టు.
3. కందువ= జాడ, కాతాళము= కోపము, పొంద్దైతి= కూడుకొన్నద్దై, ఇట్లానే= ఈవిధంగానే, భోగించు= సుఖించు.

**భావము:** ఈ తారతమ్యాలు, భేదాలు లెక్కించడానికి మోహించిన నీకే చెల్లినది కానీ, పెదవిమూల నవ్వులు చిందిస్తూ స్వామిని చేపట్టరాదా!

నిన్ను పేరుపెట్టి పిలుస్తున్నా కూడా ఇలా బెట్టుచేయడమెందుకు? ఈ పట్టుదలలు ఇంకా ఎంతకాలం సాగిస్తావు? స్వామి నిన్ను బలిమితో చేరి చేపట్టినప్పుడు, స్వామి కలువకన్నులను చూచైనా కౌగలించుకోవలదా?

నీ ఒడిపట్టి దగ్గరకు తీసుకొంటూ ఉండగా ఇంకా మొరటుదనము చూపిస్తావెందుకు? గుర్తుగా తన మోవి నీ కందిస్తూ ఉండగా మృదువుగా నిమురుతూ నీ ముఖమును ఆయనకు అందించి నీ అధరామృతపు విందు చేయాలి కదా!

నీతో స్వామి ముందు నుంచీ ప్రేమతో మాట్లాడుతూనే ఉన్నాడు కదా! జాడ తెలుసుకొని నిన్ను చేరి కలుస్తూ ఉండగా ఇంకా లేనిపోని కోపతాపాలెందుకే? ఇంతచేసి నీవు అలమేలుమంగమ్మవు. ఆయన శ్రీవేంకటేశ్వరుడు కదా! ఇలా కూడిన సమయాల్లో చక్కగా సుఖించవలెను కదా!

## 288

**అవతారిక:** అలమేలుమంగమ్మ స్వామిని అన్య స్త్రీలతో కలవనీయకుండా, తానే సర్వకాలములలో అంటిపెట్టుకుని యున్నదని ఈర్ష్యతో తోడి సవతులు అనే మాటలు.

### నాట

ప .నీచేతనౌనె నేర్పులివి యెల్లాను
కాచుకుండి మనసెల్లఁ గరఁగించఁగలవె ॥పల్లవి॥

1. కడువలచితినంటా కాంతుని కిచ్చకమాడి
తొడిఁబడఁ గాఁగిలించి దొమ్మిసేసేవు
అదరి చొక్కులఁబెట్టి అంతసేసినదానవు
బడిఁ దిప్పి యాతని భ్రమయించఁగలవే ॥నీచేత॥

2. పాసియుండ నోపనంటా పక్కననుబ్బించి పతి-
కాసచూపి ఇంటఁబెట్టు కలయించేవు
బేసబెల్లివై ఇట్లాఁ బెడరేఁచినదానవు
బాససేయించు కేపొద్దూఁ బనిగొనఁగలవే ॥నీచేత॥

3. పట్టపుదేవులనంటా పైకొని శ్రీవేంకటేశు-
నట్టు నిట్టుఁ గూడితివి అలమేల్మంగా

గుట్టున నన్నితఁడేలెఁ గుచ్చితపుదానవు
వొట్టుక వురముమీఁద నుండఁగఁగలవే ॥నీచేత॥

**అర్థములు:** ప. చేతలు= పనులు, ఔనె= అవునా, నేర్పులు= నైపుణ్యములు, కాచుకుండి= వేచియుండి.

1. కదు= మిక్కిలి, కాంతుని= మగడు, ఇచ్చకము= ముఖప్రీతి, తొడిబడు= తొట్రుపడు, కాగలించి= కౌగలించి, దొమ్మి= సందడి, అదరు= అతిశయించు, చొక్కు= పారవశ్యము, బడిదిప్పి= బహిరంగముగా త్రిప్పుట, భ్రమయించు= మోహమునకు గురిచేయు.
2. పాసి= విడిచి, ఓపక= ఓర్వలేక, ఉబ్బించు= పొంగు, అలయించు= శ్రమపెట్టు, బేసబెల్లి= నంగనాచితనము, పెడరేచు= మిక్కిలిరేగిపోవు, బాస= మాట, ఏ పొద్దూ= ఏ దినము, పనిగొను= పూనుకొను.
3. పట్టపుదేవులు= పట్టపురాణి, పైకొను= యత్నించు, అటునిటు= అన్నివైపుల, కూడు= కలియు, గుట్టు= ఏకాంతము, కుచ్చితము= కపటము, ఒట్టుక= ఒట్టుపెట్టుకొని, ఉరము= వక్షస్థలము.

**భావము:** ఓ అలమేలుమంగమ్మా! అన్నీ నీ చేతనవుతుందా? నీ నైపుణ్యాలు చాలా అధికమై ఉన్నవి. స్వామికై వేచి యుండి ఆయన మనసు కరిగించగలవా?

అందరికంటే ఎక్కువగా మోహించానని చెబుతూ విభునితో ముఖప్రీతి మాటలన్నీ మాట్లాడుతూ, తొట్రుపడుతూ కౌగలించుకొని మహా సందడి చేస్తావు. అతిశయముతో అంత పారవశ్యములో ముంచిన దానవు బహిరంగముగా నలుగురిలో త్రిప్పి మోహానికి గురిచేయగలవా?

అసలు ఒక్క నిముషం కూడా స్వామిని వీడి ఉండలేనని చెబుతూ ప్రక్కనే పెట్టుకొని, ఆయన పొంగిపోయే సంభాషణలాడుతూ ఆవిధముగా శ్రమపెడుతున్నావు. పెద్ద నంగనాచి మాదిరి ఇలా మిక్కిలి రేగిపోతున్నదానివి, మాట తీసుకుని ఏ రోజైనా పూనుకొని ఉండగలవా?

ఓ అలమేలుమంగమ్మా! గొప్పగా పట్టపు రాణిని అయ్యానంటూ యత్నించి ఆ శ్రీవేంకటేశ్వరుని అన్నివైపులా కూడుకుంటున్నావు. ఏకాంతముగా రహస్యముగా ఆతడు నిన్నేలుకునేట్టు చేసిన కపటపు దానవు. అలాగే ఒట్టుపెట్టుకుని అతని వక్షస్థలము మీదే ఉండిపోగలవా?

## 289

**అవతారిక:** స్వామి తన వంక ప్రేమాతిశయం చూపిస్తూనే చిన్న చిన్న విషయాలపై చికాకు ప్రదర్శించడమెందుకని అమ్మ స్వామిని ప్రశ్నిస్తున్నది.

### వరాళి

ప. ఇప్పుడే విన్నవించితి మెగ్గులువట్టేవుగన
వుప్పతించి మామీఁద నొలవేసేవు సుమ్మీ ॥పల్లవి॥

1. కొప్పుల దువ్వేవు నీవు కొంగేల పట్టేవు నన్ను
యిప్పుడే నీవద్దిచెలులెల్లా నవ్వఁగా
కప్పి నీపై నామేనికస్తురిబేంట్లు రాలీ
అప్పుడు మమ్మేమైనా నాడుకొనేవుసుమ్మీ ॥ఇప్పుడే॥

2. చెక్కులేల నొక్కేవు చెయ్యేల వేసేవు నాపై
గుక్కక సవతులెల్లా గొణఁగఁగాను
చిక్కనినాగుబ్బలపై చెమట నామేననంటే
చొక్కుచు మామీఁద నీవు సొలసేవుసుమ్మీ ॥ఇప్పుడే॥

3. కాయమేల నిమిరేవు కాఁగిటనేల నించేవు

పాయపు పెండ్లికూఁతులు పంగించఁగా
యీయెడ శ్రీవేంకటేశ యేనలమేలుమంగను
చాయలకే కూడితివి జకించేవుసుమ్మీ ॥ఇప్పుడే॥

**అర్థములు:** ప. విన్నవించు= వినతి చేయు, మొగ్గలు= వాలుట, ఉప్పతించు= ఆడిపోసుకొను, వలవేయు= వశపరచుకిను, సుమ్మీ= సుమా (నిశ్చయార్థకము).

1. కొప్పు= తలకొప్పు, వద్ది= వద్దనున్న, పేంట్లు= చెక్కలుకట్టినవి, ఆడుకొను= తమాషా పట్టించు.
2. చెక్కు= చెక్కిలి, గుక్కక= నోరెత్తకుండ, గోణుగు= చిన్నగా మాట్లాడు, గుబ్బలు= రొమ్ములు, మేనంటు= శరీరమునకు అంటుకొను, చొక్కు= పారవశ్యము, సొలయు= వెనుదీయు.
3. కాయము= శరీరము, నిమురు= మృదువుగా తాకు, కాగిట= కౌగిట, పాయము= యౌవనము, పంగించు= వెనుకటి పొరబాట్లు ఎత్తి చూపు, ఏను= నేను, చాయలు= శోభలు, జంకించు= అదరవేయు.

**భావము:** స్వామీ! నేను ఇప్పుడే అన్నీ తమకు వినతి జేసితిని. మామీద మోహముతో, ఏదో ఆడిపోసుకునే విధంగా మాట్లాడుతూనే మాపై వాలిపోయి వలవేసి మమ్ము వశపరచుకొనడం చేసేవు స్వామీ!

కొప్పు దువ్వి నా కొంగు పట్టుకోవడమెందుకు? ఈ సమయంలో దగ్గర ఉన్న చెలులంతా చూసి నవ్వుతున్నారు. నా శరీరం నీపై కప్పగానే నా మేనిపై ఉన్న ఎండిన కస్తూరి చెక్కలుగా గట్టి రాలిపడిపోయేను. ఆ సమయంలో మమ్ములను నీవు ఏమైనా అనుకొంటూ ఆటలు పట్టిస్తావు సుమా!

చెక్కిలి నొక్కుతూ నాపై జాచిన నీచేతులను వేస్తావు. చుట్టూ ఉన్న సవతులు నోరెత్తక పోవచ్చుగాని లోలోపల గొణుక్కుంటారు కదా స్వామీ! నా శరీరంపై రొమ్ములపై ఉన్న చిక్కటి చెమట నీ శరీరంపై అంటినట్లైతే, పారవశ్యం పొంది మామీద వైరస్యంపొంది ఏమైనా అంటావేమో!

నా శరీరం మృదువుగా నిమురుతూ వెంటనే బిగి కౌగిలిలో బంధిస్తావు. యౌవనములో ఉన్న పెండ్లి కూతుళ్ళంతా నీ పొరబాట్లను ఎత్తిచూపుతూ ఉన్నారు. ఈ తావులో నేను అలమేలుమంగమ్మను స్వామీ! ఈ మాత్రం శోభలకే కూడి ఎందుకు బెదరగొడుతున్నావు.

## 290

**అవతారిక:** గడుసుదనంతో స్వామిని లొంగదీసుకుని, ప్రేమాభిమానాలు పొందుతున్న అలమేలుమంగమ్మను చెలులు ఇదేమిటని ప్రశ్నిస్తున్నారు.

### తోండి

ప. కంటిమే నీవల్ల నిట్టికతలెలాల్లను
వెంటవెంట వచ్చి కడువేసాలు చూపేవు ॥పల్లవి॥

1. కాటుకకన్నులతోడ కసరుచు రమణుని
సూటిదప్పకుండా నేమిచూచేవే నీవు
నే(నే?)టనే కడమాయనా నీయాసోద మెంతలేదు
మేటివై యిందరిలోనా మేకులుసేసేవు ॥కంటిమే॥

2. కానుకగా మోవిమీఁద కప్పుచుఁ దమ్ములమ్మున
నానఁబెట్టి యిప్పుడేమి నవ్వునవ్వేవే
కానరాదా నీవలపు కలయవేసేవు పొందు
పూని నీపెద్దరిక మిప్పుడే నెరసేవు ॥కంటిమే॥

3. కంకణాలచేతులను కాఁగిటను బిగియించి
మంకవై యీవేళనేల మాటలాడేవే
కొంకక యలమేల్మంగ కూడె శ్రీవేంకటేశుఁడు
జంకెనరతుల నెంత జాగులఁబెట్టేవే ॥కంటిమే॥

**అర్థములు:** ప. కంటిమి= చూశాము, కతలు= కథలు,వేషాలు, వెంట వెంట= మళ్ళీ మళ్ళీ.

1. కరచు= కరిగించు, సూటి= గురి, నేటు= నిశ్చయము, ఆసోదము= శరీరభావన, మేటి= నేర్పరి, మేకులు= పెద్దరికము.
2. కానుక= బహుమతి, తమ్ములు= తాంబూలము, నానబెట్టు= నిదానించి, కలయవేయు= అంతటా, పొందు= కూడిక, పూను= యత్నించు, నెరయు= నిండు.
3. కాగిట= కౌగిట, మంక= మొండి, కొంకు= వెనుదీయు, జంకెన= బెదిరింపు, జాగులు= ఆలస్యము జేయు.

**భావము:** ఓ అలమేలుమంగమ్మా! నీ అకార్యాలన్నీ కళ్ళారా చూసాము, విన్నాము కూడా! వెంట వెంటనే స్వామిని సమీపించి చాలా వేషాలు వేస్తున్నావు.

నీ సొగసైన కాటుక కళ్ళతో చూస్తూ స్వామిని ఎందుకు కోపంగా చూస్తున్నారు? గురిచూస్తున్నట్లుగా స్వామిని అదేపనిగా ఎందుకు చూస్తున్నావు. ఈనాడు ఏమి మాయో తెలియదు నీ శరీర భావనల నెరుగక యున్నాము. నేర్పరివై అందరిలో పెద్దరికం చేస్తున్నావు.

స్వామి ముఖారవిందాన్ని కప్పివేస్తూ నోటిలోని తాంబూలాన్ని నానబెట్టి, ఎమీ ఎరగనట్టుగా ఎన్ని నవ్వులు నవ్వుతున్నావు? ఇప్పుడు కనబడడంలేదా! నీ మోహం అంతటా ప్రదర్శిస్తూ పొందుగూడుతున్నావు. ఇప్పుడు యత్నించి పెద్దరికం చేస్తున్నావు.

నీ కంకణాల చేతులతో స్వామిని కౌగిట గట్టిగా బంధించి, మరలా మొండిగా ఏవేవో మాట్లాడుతున్నావు. శ్రీవేంకటేశ్వరుడు ఏమాత్రం తగ్గకుండా అలమేలుమంగమ్మను పొందుకూడాడు. ఈ అదిరింపు, బెదిరింపు రతిక్రీడలతో ఇంకా ఎంతకాలం ఆలస్యం చేస్తావు?

## 291

**అవతారిక:** అమ్మ శృంగారగర్వంతో స్వామితో పరిహాసాలాడుతుండగా గమనించిన చెలులు తగదని, అన్నింటికంటే స్వామిని కూడడమే పరమార్ధమని హితవు చెప్తున్నారు.

### పళవంజరం

ప. ఏమే యింతటిదాన వెఱుఁగవటే
నామాట సరివచ్చేనా నేఁడు నీకు ॥పల్లవి॥

1. యెగసక్కెపుమాటలు యెన్నైనా నాడఁగవచ్చు
అగపడి ప్రియమాడే దరుదుగాని
మగవానితోడనేల మారుకొనఁగఁ జెలికి
మొగమోట ప్రియముతో మొక్కవలెఁగాక ॥ఏమే॥

2. బచ్చెనపంతములను బయలీఁదించఁగవచ్చు॥
నిచ్చఁ బొందు జరపేది నేరుపుగాని
యిచ్చకపుఁ బతితోడ నెమ్మెలేల మగువకు
యెచ్చుఁగుందులేక కాఁగి లియ్యవలెఁగాక ॥ఏమే॥

3. నలిరేఁగి కేరడపునవ్వులు నవ్వఁగవచ్చు
యెలిమి సరసమాడే దెక్కుడుగాని

అలమేలుమంగవు నిన్నతఁడు శ్రీవేంకటేశుఁ-
డలమె నిట్టె ముదమందవలెఁగాక ॥ఏమే॥

**అర్థములు:** ప. ఎరుగు = తెలియు, సరివచ్చు = సరిపోవు.

1. ఎగసెక్కెము= పరిహాసము, అరుదు= అపూర్వము, మారుకొను= ఎదుర్కొను, మొగమాటము= బెదురు,సంకోచము.
2. బచ్చెన పంతము= మోసపు పట్టుదల, బయలీదించు= ఆశ కలిగించు, ఇచ్చ= ఇష్టమైనది, పొందు= కూడిక, నేరుపు= నైపుణ్యము, ఇచ్చకము= ఇష్టమైన, నెమ్మె= జాప్యము,స్నేహము, హెచ్చుగుందులు= ఎత్తుపల్లాలు, కాగిలి= కౌగిలి.
3. నలి= మిక్కిలి, కేరడము= వంకర, ఎలిమి= వికాసము, ఎక్కుడు= ఎక్కువ, అలము= వ్యాపించు, ముదము= సంతోషము.

**భావము:** ఏమమ్మా అలమేలుమంగమ్మా! ఇన్నివిషయాలు తెలుసుకొన్నదానివి, ఈ మాత్రం తెలియదా? ఈనాడు నేను చెప్పిన మాటలన్నీ సరిగ్గా సరిపోయినవా లేదా! చెప్పు?

అమ్మా! పరిహాసపు మాటలు ఎన్నైనా మాట్లాడవచ్చు, స్వామి ఎదుటపడి ప్రియభాషణము చేయడమే అరుదుగ జరుగుచున్నది. అయినా స్వామి మగవాడు కదా! ఆయనతో అలా ఎదురుతిరిగి మాట్లాడడం తగునా? బెదురు, సంకోచాలు ప్రదర్శిస్తూనే నమస్కరించడమే తగిన పని కదా!

ఇలాంటి మోసంతో గూడిన పంతాలు పట్టింపులు ఆశకలిగించవచ్చును కానీ, ఇష్టముతో స్వామిని కూడడమే నీ నైపుణ్యంగా భావించు. ప్రియమైన భర్తతో ఇలా నిదానించి కాలం వృధా చేయడమెందుకు? ఎత్తుపల్లాలు అనేవి వదలి కౌగలించుకొనవలెను కదా!

అతిశయించి మిక్కిలి వంకర నవ్వులు ఎన్నైనా నవ్వవచ్చు కానీ, వికాసముతో స్వామితో సరసాలాడడమే శ్రేష్ఠమని గ్రహించు. అమ్మా! నీవు అలమేలుమంగమ్మవు, శ్రీవేంకటేశ్వరుని వ్యాపించి కౌగిలిలో బంధించి సంతోషపడవలెను కదా!

## 292

**అవతారిక:** చెలులు అలమేలుమంగా శ్రీనివాసులు జలకాలాడే వేళలో జరిగే వివిధ సేవలను, కాపులను మనోహరంగా వర్ణిస్తున్నారు.

## దేవగాంధారి

ప. జోడుగూడితి రిద్దరు సొంపగు జాణలే మీరు
తోడ నీళ్లాడరయ్య దొరకె మీకిపుడు ॥పల్లవి॥

1. చెలియగుబ్బలమీఁదిచెమట పన్నీరుకాపు
కలకలమనునవ్వు కప్పురకాపు
మలసేటి వినయపుమాటలు వేదమంత్రాలు
వెలసె మజ్జనవేళ వింతలాయ మీకు ॥జోడు॥

2. కాంతమేనితావి యటకటిఁ (లి?) చందనపుకాపు
పొంతఁ గడకుంటే చూపు పునుగుకాపు
సంతసపు సరసాలు జరిపేటిపూడిగాలు
యింతటా మజ్జనవేళ యితవాయ మీకు ॥జోడు॥

3. ఇయ్యలమేల్మంగ కాంతులెత్తే తిరుపండికాపు
గయ్యాళిమదరాగము కస్తూరికాపు
ఇయ్యెడ శ్రీవేంకటేశ యెనసితి రిద్దరును
వోయ్యనే మజ్జనవేళ వొరపాయ మీకు ॥జోడు॥

**అర్థములు:** ప. జోడు= జత, సొంపు= అందము, జాణలు= నేర్పరులు, నీళ్ళాడు= స్నానమాడించు.

1. గుబ్బలు= రొమ్ములు, పన్నీరుకాపు= పన్నీటి స్నానము, కప్పుర కాపు= కర్పూరధూళితో పెట్టు కాపడము, మలయు= వ్యాపించు, వినయము= భక్తిశ్రద్ధలు, వెలసె= బయలుపడు, మజ్జనవేళ= స్నానపువేళ, యితవు(హితవు)= మనసైనది.
2. మేని తావి= శరీర పరిమళము, అటకటి= దాగిఉండు, చందన కాపు= గంధము కాపు, పొంత= సమీపము, కడక= యత్నము, పుంగుకాపు= పునుగుపిల్లి అనే సుగంధ ద్రవ్యపు కాపు, ఊడిగాలు= సేవలు, మజ్జనవేళ= స్నానసమయము,(హి)ఇతవాయె= ప్రీతికల్గించు.
3. ఇయ్యల= ఈవల, కాంతులెత్తు= శోభలుమించు, తిరుపండి కాపు= తిరుమణి నామపు కాపు, గయ్యాళి= గడుసుదనముగలది, మదరాగము= శృంగారరాగము, కస్తూరికాపు= కస్తూరిమృగమునుండి వచ్చు సుగంధ ద్రవ్యపు కాపు, ఇయ్యెడ= ఈ తావులో, ఎనయు= పొందుకొను, ఒయ్య= మెల్లగా, మజ్జనవేళ= స్నాన సమయము, ఒరపు= యోగ్యము,తగినది.

**భావము:** అమ్మా! స్వామి మీరు ఇద్దరికిద్దరు చూడ ముచ్చటైన జంటగా, నేర్పరితనాలను, నైపుణ్యాలను ప్రదర్శిస్తున్నారు.

చెలి రొమ్ములమీద జాలువారుతున్న చెమట పన్నీరు కాపు. నీ కలకలమని నవ్వే నవ్వులు కర్పూరపు కాపు. వ్యాపించే నీ వినయవిధేయతలతో గూడిన మాటలు వేదమంత్రాలు. ఈవిధముగా ఈ స్నానపు వేళ అపూర్వమై శోభిల్లుతున్నది.

ఈ కాంతామణి శరీరపు కాంతి దాగిఉన్న సుగంధపు కాపు, చెంత గడవక యుంటే ఆమె చూపు పునుగు కాపు, మీ ఇద్దరి సంతోషకర సరసాలు జరుగుతున్న సేవలు. ఇవన్నీ ఈ స్నాన సమయంలో మీకు ఇష్టమై యున్నవి.

ఈవల ఉన్న ఈ అలమేలుమంగమ్మ శోభలతో అలరారుతున్న తిరునామపు కాపు. ఈ గడుసుదనపు శృంగార సోయగాలు కస్తూరి కాపు, శ్రీవేంకటేశ్వరా! ఈ తావులో యిద్దరూ జతగూడి పొందుకూడినారు. మెల్లగా సాగుతున్న ఈ  స్నానపు వేళ మీ ఇద్దరికి తగియున్నది.

**విశేషము:** 'కాపు'అనగా "బాధోపశమార్థం ఉష్ణజలాదినా ఔష్ణ్య సంపాదనం" అంటే ఏదైనా బాధను తొలగించే నిమిత్తం చేసే ఉపచారమని అర్థము. ఇక్కడ స్వామివారికి, అమ్మ అలమేలుమంగమ్మకు స్నాన సమయంలో జరిగే వివిధ సేవలను అన్నమయ్య వర్ణిస్తున్నాడు. పన్నీరు అద్దడం, కర్పూర ధూళి కాపు, మంచి సుగంధపు కాపు, పునుగు కాపు, తిరుపండి కాపు, కస్తూరి కాపు ఇలా వివిధ సేవలు వర్ణించడం జరిగింది.

## 293

**అవతారిక:** స్వామి చేసే అకార్యాలకు అమ్మ అలమేలుమంగమ్మ కినుక వహించింది. అమ్మను ప్రసన్నం చేసుకొని మన్నించమని , స్వామికి చెలులు హితవు పలుకుతున్నారు.

### బౌళి

ప. ఏల యెడ తాఁకించే వీడకాడకు నింతుల
మేలములాడుచునే నమ్మించవలెఁ గాక ॥పల్లవి॥

1. చాయపాటుమాటలకు సమ్మతించీనా చెలి
ఆయెడకు నీవుంగర మంపినఁగాక
చేయరానిసేఁతలెల్లాఁ జేసితివి తొలుతనె
చేయిపట్టి ప్రియమెల్లాఁ జెప్పవలెఁగాక ॥ఏల॥

2. అడియాస కానికల కాపె యీడకు వచ్చీనా
యెడయక నీవు వచ్చి యేలినఁగాక
తొడిఁబడ నీపై మోచె తోడనే ఆపెవలపు
గొడవదీరఁగ వేఁడుకొనవలెఁ గాక ॥ఏల॥

3. చుట్టి రాయబారాలకు చొక్కీనా అలమేల్మంగ
గుట్టున శ్రీవేంకటేశ కూడినఁగాక

చుట్టమవై వచ్చితివి సొరిది నీకెయింటికి
నెట్టన నిట్లానే మన్నించవలెఁగాక ॥ఏల॥

**అర్థములు:** ప. ఏల= ఎందులకు, ఎడ= దూరము,గడువు, ఈడకాడ= ఇక్కడా అక్కడా, మేలమాడు= పరిహాసముచేయు, నమ్మించు= విశ్వాసముగొను.

1. చాయ= శోభ, సమ్మతించు= అంగీకరించు, ఎడ= ప్రదేశము, అంపిన= పంపిన, తొలుత= మొదట.
2. అడియాస= తీరని ఆశ, కానిక= బహుమతి, ఆపె= ఆమె, ఎడయక= వీడక, తొడిబడు= తొట్రుపాటు, మోచు= తాకు, గొడవ= తగాదా, వేడుకొను= మన్నించమని అడుగు.
3. రాయబారము= సంధిచేసే యత్నము, చొక్కు= మత్తు,పారవశ్యము, గుట్టు= ఏకాంతము, చుట్టము= బంధువు, సొరిది= వరుస, ఈకె= ఈమె, నెట్టన= అనివార్యముగా, మన్నించు= క్షమించు.

**భావము:** స్వామీ! ఎందుకిలా అక్కడకు ఇక్కడకు ఈ పరుగులు? ఈ కాంతలతో పరిహాసాలాడినప్పటికి, విశ్వాసంతో ఉండవలెను కదా!

ఒకవేళ నీవు ఉంగరం ఆమెకు పంపించినా సరే! నీ శోభల వెల్లివిరిసే మాటలకు ఆ చెలి అంగీకరిస్తుందా? మొదట అకార్యాలెన్నో చేశావు, కనీసం యిప్పుడైనా ఆమె చేతులు పట్టుకొని ప్రియభాషణలాడి మెల్లగా దారిలోకి తెచ్చుకోవలెను కదా!

ఆమె తీరని కోరికలతో, నీవిచ్చే బహుమతులకోసం ఇక్కడకు వచ్చినా నీవు దూరం జరగకుండా దరిజేరి ఆమెను లాలించి ఏలుకోవలెను కదా! ఆమె తొట్రుపాటుతో బింకంగా నీపై సారించే ఆ వలపు చూపులు గమనించి, ఈ తగాదాలు మాని ఆమెను మన్నించమని వేడుకోవలదా స్వామీ!

నీవు ఎన్ని రాయబారాలు నడిపి అమ్మను, పారవశ్యంలోకి దింపి ప్రసన్నం చేసుకోవాలనుకున్నప్పటికి, ఓ శ్రీవేంకటేశ్వరా! రహస్యంగా ఏకాంతంగా అమ్మను కూడడమే మంచిపని. బంధువువై వచ్చినవాడవు మధ్యలో ఈ కార్యాలన్నీ వరుసగా చేయడం సబబా స్వామీ! అనివార్యంగా అమ్మను ఈవిధంగా మన్నించి చేరదీయడమే యుక్తమైన కార్యము స్వామీ!

## 294

**అవతారిక:** స్వామి ఒకే సమయములో ఇద్దరు స్త్రీలను కూడి ఉండగా, అలమేలుమంగమ్మ అభ్యంతరపెట్టనని పరిహాస ఛలోక్తులాడుతున్నది.

### ఆహిరి

ప. ననుఁ జూచి యిప్పు డెంతనవ్వు నవ్వేవు నీ-
వనితనై వున్నదాన వలదనేనా ॥పల్లవి॥

1. చెలిమికాఁడ నీవేల సిగ్గుపడేవు యేమో
వెలఁది విన్నవించీని వినరాదా
యెలమి నామోము చూచి యేల లోఁగేవు మీకుఁ-
గలసాజమే యిది కాదనేనా ॥నను॥

2. కోడెకాఁడనీవేల గుట్టు సేసేవు ఆపె
తోడనే కానుకిచ్చీ నందుకొనరాదా
వేడుక నేఁ జూచేఁగాక వెఱవనేలా మీ-
వాడికమోహము లివి వారించేనా ॥నను॥

3. శ్రీవేంకటేశుఁడ యెంతచెలరేఁగేవు నీ-
దేవులు సన్నలు సేసీఁ దెలియరాదా
గోవిందరాజవు నీవే గుఱుతుగంటి యిదే

యీవల నన్నేలితివి యీకె యేలనేనా ॥నను॥

**అర్థములు:** ప. వనిత= స్త్రీ, వలదు= కాదు.

1. చెలిమికాడు= స్నేహితుడు, వెలది= స్త్రీ, విన్నవించీని= విన్నవిస్తున్నది, ఎలమి= వికాసము, లోగు= లోకువగు, సాజము= సహజము.

2. కోడేకాడు= వయసులో ఉన్న వాడు, గుట్టు= రహస్యము, ఆపె= ఆమె, తోడ= కూడా, వేడుక= వినోదము, వెరయు= ఆశ్చర్యము, వాడికమోహము= అలవాటైన వలపు, వారించు= అడ్డగించు.

3. చెలరేగు= విజృంభించు, దేవులు= పట్టపురాణి, సన్నలు= సైగలు, గురుతు= చిహ్నము, ఈవల= ఈవైపు, ఈకె= ఈమె.

**భావము:** ఓ స్వామీ! నన్ను చూసి నీవు ఇంతలా నవ్వుతున్నావు. నీకు చెందిన దాననై ఉన్నాను కనుక వలదనగలనా?

ఓ స్నేహితుడా! నువ్వెందుకు సిగ్గులు చిందిస్తున్నావు? ఇక్కడ ఆ స్త్రీ ఏమో చెబుతున్నది నీవు చెవియొగ్గి వినవలెను కదా! వికాసముతో నా ముఖారవిందాన్ని చూసి ఎందుకంత లొంగిపోయి లోకువవుతున్నారు. స్వామీ మగవారి సహజగుణమిదే అనుకోవాలా?

మంచి యుక్తవయసులో ఉన్న ఓ స్వామీ! నీవెందుకు రహస్యాలు చేస్తున్నావు? ఆమె నీకేదో బహుమతి ఇస్తున్నది పుచ్చుకోరాదా? ఒకవేళ నేను చూచినా మీరు ఆ ఆశ్చర్యం వ్యక్తం చేయడం ఎందుకు? నీకివన్నీ అలవాటైన ప్రేమ వ్యవహారాలేకదా! నేనేమైనా వద్దని అడ్డగిస్తానా ఏమిటి స్వామీ!

ఓ శ్రీవేంకటేశ్వరా! ఎంత చెలరేగి వ్యవహరిస్తున్నావు? నీ పట్టపురాణి చేసే సైగలు సైతం గమనించలేని స్థితిలో ఉన్నారు. గోవిందరాజైన ఓ స్వామీ! గుర్తెరిగి నిన్నే గమనిస్తున్నాను. ఈ వైపు నన్ను కూడి ఏలుకుంటున్నావు మరి, ఇక్కడున్న ఈమె విషయం ఎలా అనేగదా స్వామీ మీరు అనుకుంటున్నది?

## 295

**అవతారిక:** స్వామికి అమ్మ ప్రవర్తన వింతగా కనబడుతున్నది. సతులను చూస్తూనే కోపం ప్రదర్శిస్తున్నందువల్ల శ్రీనివాసుడు సైతం అమ్మను లాలించి బుజ్జగించి, కైవశం చేసుకోవడానికి యత్నిస్తున్న దృశ్యం.

### సోమరాగం

ప ఏల తమకముసేసే వింతలోను
లాలించినానుఁ జెప్పవు లాఁతిదానివలెను ॥పల్లవి॥

1. నిక్కి చూచినదానవు నీవో మరొకతో
యిక్కువతోఁ జెప్పరాదా యెరిఁగేఁగాని
వుక్కున నీవప్పుడేతే వూఁకొంటివి నేఁ జెప్పితే
వెక్కసాన నుందానవు వింతదానివలెను ॥ఏల॥

2. కూరిమిఁ బాడినది నీకుత్తికో వేరొకతో
మేరతోడఁ దెలుపరాదా మెచ్చేఁగాని
చేరి నేఁ బొగడితేను చెలరేఁగితి వప్పుడు
బీరాన గుట్టుసేసేవు పెరదానివలెను ॥ఏల॥

3. చెంది కాఁగిలించేవి నీచేతులో చెల్లెలివో
మందలించరాదా సమ్మతించేఁగాని
అంది శ్రీవేంకటేశుఁడ నని కూడితి విప్పుడు
యెందుకైనా నొనగూడే వింటిదానివలెను ॥ఏల॥

**అర్థములు:** ప. తమకము = మోహము, లాలించు = బుజ్జగించు, లాతి = అన్యమైన,వేరు.

1. నిక్కి = దీర్ఘముగ, ఇక్కువ = జాడ, యెరుగు = తెలుసుకొను, ఉక్కున = ఉక్రోషము, ఊకొను = ఊకొట్టు,సమ్మతించు, వెక్కసము = అధికము, నుందానవు = ఉన్నదానవు, వింత = అబ్బురము.
2. కూరిమి = స్నేహము, పాడినది = చేసినది, నీకు-ఉత్తికో = నీకు ఊరకనో, మేర = మర్యాద, మెచ్చు = ప్రశంసించు, చెలరేగు = విజృంభించు, బీరము = పరాక్రమము, గుట్టుసేయు = దాచిపెట్టు, పెర = అన్యులు.
3. కాగలించు = కౌగలించు, మందలించు = హెచ్చరించు, సమ్మతించు = అంగీకరించు, ఒనగూడు = సమకూరు, ఇంటిదానివలె = ఇల్లాలివలె.

**భావము:** ఇంతలోనే అంత వ్యామోహము ఎందుకు కనబరుస్తున్నావు? నిన్ను బుజ్జగించి, లాలించినా కూడా అన్యులవలె ప్రవర్తిస్తూ చెప్పకుండా ఊరకున్నావు.

నీవు తలెత్తి అలా నిక్కిపట్టి మరొకతెను చూస్తూ ఉన్నావు. జాడనెరిగి విషయం చెబితే గదా నాకు అర్థమయేది. నేను జెప్పినప్పుడు ఉక్రోషంతో ఆసమయంలో ఊరకున్నావు గానీ, తర్వాత చాలా అధికముగా ప్రవర్తిస్తూ అబ్బురాలెన్నో చేశావు.

నీతో స్నేహం కొనసాగించినది ఊరకనో వేరే భావంతోనో తెలియదు గానీ, మర్యాదగా ప్రవర్తించి విషయం తెలిపితే నేనే కాదు అందరూ ప్రశంసిస్తారు. నేను పొగిడితే అప్పుడు విజృంభించి, ఏదో శౌర్యానికిపోయి అన్య స్త్రీవలె రహస్యాలు నెరపేవు.

నన్ను కౌగలించుకుంటున్నవి నీ చేతులా లేకపోతే నీ సోదరివో తెలియదు. కాస్త కోపం ప్రదర్శించరాదా! శ్రీవేంకటేశ్వరునిప్పుడు పొందు కూడావు. ఎందుకైనా అంగీకరించి ఇల్లాలివలె ఉన్నదానవు.

## 296

**అవతారిక:** స్వామి ఏమాత్రం భీతి వెరపు లేకుండా అకార్యాలు చేయడమే పనిగా పెట్టుకున్నాడని, అనుకున్నంత సులభంగా లొంగేవాడు కాదని అమ్మ చెలులతో చెప్పి విచారం వ్యక్తం చేస్తున్నది.

### దేశి

ప. నాకుఁ దెలుసు నితని నాటకములు
కైకొనీనా ఇంతలోనే కతకారిగాక ॥పల్లవి॥

1. యెఱఁగక చేఁత చేసి యెదిటికి రాఁడనేవు
వెఱుపు వాని కేడదే వేసాలుగాక
వొఱుపు నీమాటలకే వొడఁబడి తనమతి
కఱకరిఁ గరఁగీనా గామిడిగాక ॥నాకు॥

2. అగడుగాఁ దిరిగాడి యందుకు లోఁగీ ననేవు
తగ వాతఁ డెఱఁగునా తక్కులుగాక
తగిలి తనబాసలు తలఁపించితే నేఁడు
మొగమోడినా కడుమొక్కలీఁడుగాక ॥నాకు॥

3. వలపు లంతటాఁ జూపి వచ్చి నన్నేలీ ననేవు
సులభుఁడా ఇవిగొన్ని సుద్దులుగాక
బలిమి లోనికి వచ్చి పై కొని శ్రీవేంకటేశుఁ-
డలమె నన్నుఁ గాఁగిట నాగడీఁడు గాక ॥నాకు॥

**అర్థములు:** ప. నాటకము= వేషములు వేయుట, కైకొను= పూను, కతకారి= గడుసరితనము.

1. ఎరుగక= తెలియక, చేత= కార్యము, ఎదిటికి= ఎదుటకు, రాదు–అనేవు= రాదు అంటావు, వెరుపు= భయము,ఆశ్చర్యము, ఒరపు= ఒరిపిడి,రాపాడు, మతి= తలపు, కరకరి= కఠిన స్వభావి, కామిడి= చెడ్డ.
2. అగడు= నింద, లోగీ= లొంగిపోయి, తగవు= పోట్లాట, తక్కులు= తప్పులు, బాస= మాట, మొగమోడు= సంకోచించు, మొక్కలీడు= శూరుడు.
3. సులభుడు= గడుసుదనము లేనివాడు, సుద్దులు= మాటలు, బలిమి= బలముగల, పైకొను= యత్నించు, అలము= పరిగ్రహించు, కాగిట= కౌగిట, ఆగడీదు= అకార్యములు చేసేవాడు.

**భావము:** చెలులారా! నాకు ఈతని నాటకారిపనులన్నీ క్షుణ్ణముగా తెలియును. పూనుకొని నన్ను చేపట్టేనా? గడుసరిదనముతో ఏవో కథలు చెప్పడం అలవాటైన వాడు కదా!

ఏదో తెలియక అకార్యము చేసి కొంచెం భీతితో ఎదుటకు రాదు అంటావు కానీ, భయము లేని వాడు కదటే! అవన్నీ ఉత్త వేషాలే సుమా! నీ మాటలకే కరగిపోయి ఒడబడతాడనుకున్నావా? ఆ కఠినుడు తన స్వభావం అంత తేలిగ్గా మార్చుకుంటాడా చెప్పు?

ఏవో నిందలేస్తూ అటూ ఇటూ తిరుగుతూ ఉంటే అందుకే నాకు లొంగిపోయాడనుకుంటున్నావు కానీ, ఏవో తప్పులు పట్టడం తప్పిస్తే, జరిగిన పోట్లాట స్వామికి తెలుసా? ఆయనకు తిరిగి తాను చెప్పిన బాసలు మాటలు వినిపిస్తే సంకోచిస్తూ సమ్మతి ఏమాత్రం తెలుపకుండా శూరుడువలె మాట్లాడతాడు.

నామీద ఎంతో ప్రేమ కురిపించి నన్ను చేరుకున్నాడంటావు కానీ, అంత సులభంగా దక్కేవాడు కాదు సుమా! ఏవో కొన్ని సుద్దులు చెప్పి తప్పుకొనే యత్నమే చేస్తాడు. బలిమితో శ్రీవేంకటేశ్వరుడు యత్నించి పరిగ్రహించడం కౌగలించడం అకార్యాలు చేసేవానికి సాధ్యమంటారా!

## 297

**అవతారిక:** స్వామి యింకో లలనతో పొందుకూడిన విషయం అమ్మ చాటునుండి  అన్ని విషయాలు గ్రహించి స్వామిని నిలదీస్తున్నది. మందస్మిత వదనంతో నిలబడతాడే కానీ, స్వామి సమాధానం చెప్తాడా? గమనించండి.

### లలిత

ప .చెప్పుడుమాటలు గావు చెలువుఁడ నీ సేఁతలు
చొప్పు దప్పకుండా నేనే చూచితినయ్యా ॥పల్లవి॥

1. యెలిమి నా కెయు నీవు నెదురుబడి నుండి
సెలవుల నవ్వితివి సిగ్గులతోను
తలుపుమాటున నుండి తారుకాణగా నేఁడు
సొలవక నేనే ఇట్టె చూచితినయ్యా ॥చెప్పుడు॥

2. వోడక మీరిద్దరును వొక్కమంచముపైనుండి
వీడెలు సేసుకొంటిరి వేడుకతోను
నీడలోనే పొంచివుండి నెట్టన మీసరితలు
జోడనగా నేనే చక్కఁ జూచితినయ్యా ॥చెప్పుడు॥

3. శ్రీవేంకటేశ కాఁగిటఁ జెంది నీ వాకెయు నిట్టె
మోవితేనే లానితిరి ముచ్చటతోను
యీవలికిఁ దీసి నిన్ను నీదే నేనూఁ గూడితి
సోవలుగా నేనే మిమ్ముఁ జూచితినయ్యా ॥చెప్పుడు॥

**అర్థములు:** ప. చెప్పుదుమాటలు= చాడీలు, చెలువుడు= స్నేహితుడు, చొప్పు= విధము.

1. ఎలిమి= వికాసము, ఆకె= ఆమె, సెల్వులనవ్వు= పెదవిచివరి నవ్వు, తారుకాణ= ఋజువు, సొలయు= వైరస్యము.
2. ఓడక= ఒకరికొకరు తగ్గకుండా, వీడేలు= తాంబూలములు, సేసుకొను= తయారుచేసుకొని భుజించు, వేడుక= ఉల్లాసము, నెట్టన= తప్పకుండా, సరితలు= చరిత్ర,కథ, జోడు= జత, చక్క= బాగుగా.
3. కాగిట= కౌగిట, ఆకె= ఆమె, మోవితేనె= అధరామృతము, ఆని= గ్రహించు, ముచ్చట= కోరిక, ఈవలికి= ఇటువైపుకు, కూడితి= కలిసితిని, సోవ (సోగ రూపాంతరం)= అందము,పొడవైన.

**భావము:** ఓ స్వామీ! నేనేదో చెప్పుడు మాటలంటున్నాని అనుకోకండి. నీ అకార్యాలన్నీ నా కళ్ళారా వరుసక్రమం దప్పకుండా చూశానయ్యా!

వికాసముతో ఆ స్త్రీ నీకు ఎదురుబడగా, సిగ్గులు చిందిస్తూ పెదవి మూల నవ్వులు నవ్వావు. నేను ఏమాత్రం విముఖత ప్రదర్శించకుండా తలుపు చాటునుండి, ససాక్ష్యంగా అన్నీ దగ్గరుండి గమనించాను స్వామీ!

మీరిద్దరూ ఒకరికొకరు ఏమాత్రం తీసిపోకుండా ఒకే పట్టుమంచంపైనుండి తాంబూలాలు సేవిస్తూ ఎంత ప్రీతిగా ఉల్లాసముగా మాట్లాడుకుంటూ ఉన్నారనే విషయం, జత కలిసి కూడి చేసిన చేష్టలన్నీ ఒక ప్రక్కన నీడగా పొంచి తప్పకుండా అన్నీ వీక్షించి, మీ చరిత్ర మొత్తం తెలుసుకున్నానయ్యా స్వామీ!

ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు ఆమె బిగి కౌగిటిలో ఉండి, అధరామృతాన్ని కోరిక దీరా పానం చేశారన్న విషయం గమనించి, నిన్ను ఈవలికి దీసి నిన్ను నేను కూడితిని కదా! ఆవిషయం తెలుసుగదా! మీ శోభలు దీర్ఘ శృంగారవిన్యాసాలన్నీ నేనే కళ్ళారా చూశాను స్వామీ! ఇంకా దాచడ మెందుకు చెప్పండి?

## 298

అవతారిక: స్వామి అన్యకాంతల పొత్తు గూడడానికి వెళ్ళిన విషయం అమ్మ గ్రహించి, ఆయన వచ్చాక అన్ని విషయాలు మీరే అడగండి. ఏమి కబుర్లు చెప్తాడో చూద్దాం అని చెలులను పురిగొల్పుతున్నది.

### దేశాక్షి

ప. అడుగరే చెలులాల ఆతనినే యీ మాట
వుడివోని తమకాన నుండఁబోలు తాను ॥పల్లవి॥

1. వేడుకగలప్పుడే వెస నవ్వు వచ్చుఁగాక
వాడి వున్నప్పుడు తలవంపులే కావా
యేడనో సతులచేత యేఁపులఁబడి రాఁబోలు
యీడ నేఁ జెనకఁగాను యిటులా నుండునా ॥అడుగరే॥

2. ఆసలఁ గూడినప్పుడే ఆయాలు గరఁగుఁగాక
పాసివున్నప్పుడు తడఁబాటులేకావా
బేసబెల్లివలపుల పిరివీకై రాఁబోలు
నేస నేఁ బెట్టఁగాను సిగ్గుపడి వుండునా ॥అడుగరే॥

3. సరసమాడినప్పుడే చవులెల్లాఁ బుట్టఁగాక
గొరబై నయప్పుడు కొరతలేకావా
యిరవై శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
వరుస నిందాకా నిటువలె జొక్కకుండునా ॥అడుగరే॥

**అర్థములు:** ప. అడుగరే= అడగండి, ఉడివోని= వ్యర్థముగాని, తమకము= మోహము, ఉండబోలు= ఉండిఉండవచ్చు.

1. వేడుక= ఉల్లాసము, వెసనవ్వు= వేగము, వాడి= పదును, తలవంపులు= అవమానము, ఏపులు= ఆనందముతో గూడిన శ్రమ, చెనకు= స్పృశించు.
2. ఆసలు= కోరికలు, ఆయాలు= జీవస్థానాలు, కరగు= రసమయమగు, పాయు= వీడు, తడబాటు= తొట్రుబాటు, బేసబెల్లి= వేషాలమారి, పిరివీకులు= బాధించు, సేస= అక్షింతలు.
3. చవులు= రుచులు, గొరబు= వికార విశేషము, కొరత= వెలితి, ఇరవు= నిజనివాసము, వరుస= క్రమము, చొక్కు= పారవశ్యమొందు.

**భావము:** ఓ చెలులారా! మీరే స్వామిని విచ్చేసిన తర్వాత నా మాటలు మీ మాటలుగా అడగండి. ఏమాత్రం తగ్గని మోహముతో ఉండిఉంటాడు కాబోలు.

చెలులారా! గమనించారా! ఇలా మనసులో ఏదో ఉల్లాసమున్నప్పుడే ఇలాంటి వేగముగా తనలో తాను నవ్వుకుంటూ ఉంటాడు. ఈ వ్యవహారాలన్నీ నాకు తలవంపులు కావా చెప్పండి? ఎక్కడో ఉన్న కాంతలతో కూడి స్వామి తృప్తిగా శ్రమపడి వస్తాడు కాబోలు. ఇక్కడ నేను మాత్రం కొంచెం స్పృశిస్తే ఇంతకు ముందు మాదిరి ప్రవర్తిస్తాడా?

ఏవో కోరికలతో అన్యకాంతలను గలిసినప్పుడే అతను ఈవిధమైన రసమయ స్ఫూర్తితో ఉంటాడు. ఈ విధముగా స్వామి నాకు ఎడబాటుగా ఉంటే తొట్రుబాటు కలగదా చెప్పండి? ఈయనగారి వేషాలమారి ప్రేమలు ఆయనకు శ్రమ కలిగించాక ఇక్కడకు రావచ్చు.నేనా సమయంలో అక్షింతలు వేసి దరిచేరితే ఊరక సిగ్గులు చిందిస్తాడా? లేక చికాకు ప్రదర్శిస్తాడా?

స్వామి సరసశృంగారాలలో తేలియాడినప్పుడే అనేక రుచులెల్లా ఆయనకు సిద్ధించవచ్చు. ఇలాంటి వికార విశేషాలున్నప్పుడు నాకు వెలితిగా ఉండదా? స్వామి శ్రీవేంకటేశ్వరుడు ఇంతలోనే నిజనివాసములో నన్ను కూడి అలరించాడు. ఈ క్రమంలో ఇక పారవశ్యంలో ముంచితేల్చకుండా ఉంటాడా?

## 299

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ చూస్తూ ఉండగానే, స్వామి అన్య కాంతలతో సాగిస్తున్న ప్రణయ విహారాలను ఆమె స్వామికే స్వయంగా వివరిస్తున్న దృశ్యం.

### పాడి

ప. కంటిమయ్యా నీ సుద్దులు కతలుగాను
ఇంటిపొరుగువారిపై నింపులు చల్లేవు ॥పల్లవి॥

1. మలసి కొంగువట్టేవు మగువ దండ నుండఁగా
మొలకచన్నులు నిన్ను మోచెనంటాను
యెలమిఁ బెండ్లాడినాపె నేమిసేతువో యిఁక
చెలిమిక త్తెలమీఁద చేతులు చాఁచేవు ॥కంటి॥

2. బడినే కానుకిచ్చితే పచ్చడము గప్పేవు
పడఁతికొనగోరు నీపై సోఁకెనంటా
అదరి వుంకువవెట్టినాపె నెంత చిక్కింతువో
నడుమచుట్టాలమీఁద ననుపు చూపేవు ॥కంటి॥

3. కలసితివి సతిని గక్కన శ్రీవేంకటేశ
అలివేణిచూపులు నిన్నంటెనంటాను
యెలమి మేనవారైతే యెంత దక్కఁగొందువో

కనగొన పేరటాండ్లc గాcగిలించేవు ॥కంటి॥

**అర్థములు:** ప. సుద్దులు= కబుర్లు, కతలుగాను= కథలు కథలుగా, ఇంపులు= ఆనందము, చల్లు= చిమ్ము,

1. మలసి= విజృంభించి, మగువ= స్త్రీ, అండ= ప్రక్కన, మొలకచన్నులు= అప్పుడే అంకురించిన యౌవన వక్షోజములు, మోచు= అను, ఎలమి= వికాసము, ఆపె= ఆమె, చెలిమికత్తెలు= కొలువులో ఉన్న చెలులు.
2. బడి= వెంబడి ఉండి, కానుక= బహుమానము, పచ్చడం= అంగవస్త్రము, కొనగోరు= గోరు చివర, సోకు= తాకు, అడరి= కలిగించి, ఉంకువవెట్టినాపె= స్త్రీత్వాన్ని పణముగా పెట్టినావిడ, చిక్కించు= శ్రమపెట్టు, ననుపు= అనురాగము.
3. గక్కన= శీఘ్రము, అలివేణి= తుమ్మెదలవంటి వెంట్రుకలుగల స్త్రీ, అంటు= తాకు, ఎలమి= వికాసము, మేనవారు= తల్లి తోడబుట్టిన, దేహసంబంధము గలవారు. దక్కగొను= మిక్కిలి అనుభవించు, కనగొన= చూస్తూ, పేరంటాండ్రు= శుభకార్యములలో పసుపు కుంకుమలకు వచ్చిన ముత్తైదువలు, కాగలించు= కౌగలించుకొను.

**భావము:** స్వామీ! నీ అకార్యాలన్నీ కళ్ళారా చూస్తూనే ఉన్నాము. ఇరుగుపొరుగున్న కాంతలపై ఆనందం ప్రదర్శిస్తూ మక్కువలు చూపిస్తూ ఏదో మత్తు చల్లుతావు.

కాంత ప్రక్కనుండగా, అప్పుడే అంకురించిన యౌవన వక్షోజములు నిన్ను తాకాయంటూ ఆమె కొంగు పట్టుకుంటావు. మధ్య మధ్యలో చెలులమీద చేతులు చాస్తూ ఉంటావు. ఇక నిన్ను అగ్నిసాక్షిగా వివాహమాడినామెను ఏమి చేస్తావో తెలియదు.

నీ వెంబడి పడి కానుకలిచ్చినట్లైతే, కొనగోరు తగిలిందంటూ నానా యాగీ చేస్తూ, నీ అంగవస్త్రాన్ని పైన కప్పుతావు. ఇక నీకు తన స్త్రీత్వాన్ని ఏకంగా పణముగా పెట్టినావిడను ఎంత శ్రమపెడతావో చెప్పనలవి కాదు, ఇంకా యింటికి వచ్చిన బంధుజన స్త్రీలమీద లేనిపోని అనురాగం ప్రదర్శిస్తూ ఉంటావు.

ఓ శ్రీవేంకటేశ్వరా! ఆ అలివేణి చూపులు నిన్నే తాకుతున్నాయంటూ, ఈవిధముగా శీఘ్రముగా సతిని కలిశావు. ఇంకా తల్లి తోడబుట్టిన, దేహసంబంధము గలవారైనట్లైతే (మేనవారైతే), వరుసైన వారైతే , ఎంత మితిమీరి అనుభవిస్తావో తెలియదు. మరలా ఏమీ తెలియని వాని వలె శుభకార్యములలో పసుపు కుంకుమలకు వచ్చిన ముత్తైదువలను కౌగలించుకొని మోహపారవశ్యానికి గురిచేస్తావు.

## 300

**అవతారిక:** స్వామి కొలువులోని స్త్రీజనంతో ప్రవర్తిస్తున్న తీరును అమ్మ కొంచెం విచిత్రంగా వివరిస్తున్నది.

## శుద్ధవసంతం

ప. కందము నీ సంతలు గట్టిగా నిcక
సందడిc బెండ్లాడేవేళ చాయ కెట్టు వచ్చేవో ॥పల్లవి॥

1. కుంచెవేసేయట్టియాపె కొప్పు దాcకించెనంటాను
అంచలcబంతములెల్లా నాడుకొనేవు
మించినరతివేళను మేనెల్లాcదాcకేయపుడు
వంచనలేక యెటువలె నోర్చేవో ॥కందము॥

2. జూదమాడి వోడినాపె సొలసి తిట్టెనంటాను
తీదీపుల చలము సాదించc జూచేవు
పాదుకొని యేకతానc బచ్చిమాట లాడేవేళ
సాదవై నీవెట్లాను సమ్మతించేవో ॥కందము॥

3. సేసలు వెట్టినయాపె సిగ్గులువడె నంటాను
వాసితోc జన్నులమీcద వాc(వ్రా?) త వాc(వ్రా?)సేవు

యీసరినే శ్రీ వేంకటేశ నన్నుఁ గూడితివి
తాసువలె నిద్దరిని దయితో మన్నించేవో ॥కందము॥

**అర్థములు:** ప. కందము= మేఘము, సంతలు= వరుస, సందడి= జనసమూహము, చాయ= శోభ.

1. కుంచె= చామరము, ఆపె= ఆమె, కొప్పు= తలశిగముడి, అంచ= సమీపము, పంతము= పట్టుదల, ఆడుకొను= క్రీడించు, మించిన= అధికమైన, మేను= శరీరము, వంచన= మోసము, ఓర్చు= భరించు.
2. జూదము= వినోదభరిత క్రీడ, ఆపె= ఆమె, స్లయు= వైరస్యము, తీదీపులు= రాపిడి, చలము= పట్టుదల, పాదుకొను= నిలిచి, ఏకతాన= అనన్యచింతన, పచ్చిమాట= మరుగులేనిమాటలు, సాద= అల్పుడు, సమ్మతించు= అంగీకరించు.
3. సేస = అక్షింతలు, ఆపె= ఆమె, వాసి= భేదము, చన్నులు= రొమ్ములు, వ్రాతవ్రాయు= చిలిపిపనులు, ఈసరి= ఈతీరుగా, తాసు= తక్కెడ, దయి= దయ, మన్నించు= అనుగ్రహించు.

**భావము:** నీ విషయాలన్నీ మేఘాలవలె తేలిపోయేవే తప్ప ఒక్కటీ నిలిచేది కాదు. వివాహమాడే వేళలో నీ శోభలు ఇంకా ఎలా వింతగా పరిమళిస్తాయో కదా!

నీకు చామరము వీస్తున్న ఆమె పొరబాటుగా నీ కొప్పుకు తగిలించిందని, సమీపించి పంతముతో ఆమెతో ఆడుకొన్నావు. ఇంతదానికి అంత చేశావే మరి, అధికమైన రతిక్రీడల వేళలో శరీరము తాకేటప్పుడు మరి ఎలా ఓర్చుకున్నావో కొంచెం చెప్పరాదా స్వామీ!

నీతో జూదమాడి ఓడినామె కోపంతో ఒక్క మాట అన్నదనుకో, రాపిడి పెట్టి పట్టుదలతో ఏదో సాధించాలని చూశావు. మరి నిలిచి ఏకాంతంలో ఏవేవో పచ్చిమాటలు మాట్లాడుకునేవేళల్లో తమకెలా అంగీకరమయింది స్వామీ! కాస్తా వివరిస్తారా?

నీకు అక్షింతలు వేసినావిడ కాస్తా సిగ్గులు చిందించగానే, ఏదో తేడా వచ్చినట్టు ఆమె రొమ్ముల మీద చిలిపి చేతలు చేస్తూ ఏవేవో గీతలు గీస్తూ వ్రాసావు. ఈతావులో శ్రీవేంకటేశ్వరా నన్ను కూడి ఏలుకొన్నావు. మంచి తరాజు లాగా యిద్దరిని సరిసమానంగా భావించి అనుగ్రహించరాదా!

## 301

**అవతారిక:** అన్నమయ్య ఈ కీర్తనలో స్వామిపై స్త్రీ పెంచుకున్న అధిక తమకాన్ని బహువిధములైన ఉపమానాలతో సంభావించాడు.

### మేఘరం

ప. ఇదివో నీతోడి పొందు ఇంతేశేయా
యెదుట నున్నది చెలి యెఱుఁగుకోవయ్యా ॥పల్లవి॥

1. కొమ్మచిత్తములోనిచింత కొప్పు నెరులై నిండె
ముమ్మడితరితీపల్లా మోవిపండాయ
నెమ్మది నడియాసలు నివ్వెరగుచూపులాయ
పమ్మి పరాకులేల తప్పక చూడవయ్యా ॥ఇదివో॥

2. జలజాక్షి కోరికలు చనుఁగవరాసులాయ
వలపులు రోమరాజివరుసలాయ
వెలలేనితమకము వేఁకమై పిఱుఁదాయ
తలపోఁత లీడేర్చి దయ సేయవయ్యా ॥ఇదివో॥

3. కోమలిరతిభావాలు కొనగోరివాండ్లాయ
భూమిఁగల ఇంపులెల్లాఁ బులకలాయ
యీమేర శ్రీ వేంకటేశ యీకె నిట్టె కూడితివి

దోమటిసంతోసాలు తుదిపదములయ్యా ॥ఇదివో॥

**అర్థములు:** ప. తోడి= నీతో ఉన్నటువంటి, ఇంతేశి–అయా= ఇంతింత ఉన్నవి, ఎరుగు= గ్రహించు.

1. కొమ్మ= స్త్రీ, చింత= విచారము, కొప్పు= సిగ, నెరులు= కేశములు, ముమ్మడి= కలిసిచేసే పని, తరితీపు= అపేక్ష, ఉద్ధృతి, మొవిపండు= పండువంటి పెదవి(దొండపండు లాగా), అడియాస= తీరని కోరిక, నివ్వెరగు= భ్రాంతి,పారవశ్యము, పమ్మి= అతిశయించి, పరాకు= ఉపేక్ష.
2. జలజాక్షి= తమర పువ్వుల వంటి కన్నులు, చనుగవ= కుచద్వయము, రాసులు= కుప్పలు, రోమరాజి= నూగారు (నాభి చుట్టూ ఉన్న సన్నని వెంట్రుకలు) వేకమై పిరుదాయె= భారమైన పిరుదులు, ఈడేర్చు= సిద్ధించు.
3. కోమలి= స్త్రీ, కొనగోరివాండ్లు= వాడియైన గోళ్ళ చివరిభాగము, భూమిక= మారువేషము, ఇంపులు= ఇష్టాలు, పులక= గగుర్పాటు, ఈమేర= ఈవిధములో, ఈకె= ఈమె, కూడితివి= కలిసితివి, దోమటి= భోజనము, తుదిపదములు= చివరి మార్గము.

**భావము:** ఓ స్వామీ! నీతోటి ఉన్న పొందులు ఎంతెంత ఉన్నవో గమనించావా? చెలి ఎదురుగానే ఉన్నదిగదా, ఆమెకేమి కావలెనో తెలుసుకొని వర్తించవయ్యా!

ఆ స్త్రీ మనసులోని విచారము సిగలోని కేశములవలె విస్తరించి దట్టమై ఉన్నవి. ఉమ్మడిగా చూపించుకునే అపేక్షలు ప్రేమల ఉద్ధృతి దొండపండ్ల వంటి పెదవుల్లా ఉన్నది. నిదానంగా రాజుకునే తీరని కోరికలు ఉత్త భ్రాంతితో గూడిన చూపులే అయ్యాయి. అతిశయించిన తర్వాత ఈ ఉపేక్షలేల? తరుణిని తప్పక వీక్షించి ఆశలను తీర్చవయా!

ఆ తామర రేకులవంటి కన్నులు గల స్త్రీ కోరికలు కుచద్వయపు రాసులై ఉన్నవి. ప్రేమ అతిశయించి నూగారును పోలియున్నది. గణించలేని మోహము పిరుదులవలె అమిత భారమై యున్నవి. ఆమె మనసులోని భావమేమిటో గ్రహించి , నెరవేర్చడాని విచ్చేయవయా!

ఆ స్త్రీ రతిక్రీడా భావనలనే కొనగోళ్ళు వాడియై సూదులకంటే కూచిగా ఉన్నవి. ఈ నీమారువేషాల వ్యవహారాలన్నీ గగుర్పాటుకు గురిచేస్తున్నాయి. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ విధముగా ఈ స్త్రీని కూడియున్నావు. ఇక కలిసిచేసే విందుభోజనాలే దీనికి చివరి మార్గమై యున్నది.

**విశేషాంశాలు:** అన్నమయ్య ఈ కీర్తనలోని ఉపమానాలు అపురూప భావాలుగా చెప్పవచ్చు. తరితీపులు మోవిపండ్లనడం, కొప్పు నెరులై శోభించడం, కోరికలు చనుగవలవడం ఇంకా వలపును రోమరాజిగా, మోహము వేకమైన పిరుదులుగా, రతిభావాలు కొనగోటి వాడిగా, భూమికల ఇంపులు పులకలవడం అద్భుతమైన అన్నమయ్య పదశోభకు తార్కాణం.

## 302

**అవతారిక:** స్వామిని వలచిన అమ్మ, ఆయన సేవలలోనే నిమగ్నమై యున్నదని, ఆమెపై కరుణ చూపమని చెలికత్తెలు స్వామికి నివేదిస్తున్నారు.

### కురంజి

ప. ఇటువంటి పనులైతే నిందరు నిన్నేమందురు
కటకటా ఇఁకనైనాఁ గరుణించు మిపుడు ॥పల్లవి॥

1. మొల్లమిగా నాకె నీకు మోహించు టెఱఁగవా
చెల్లఁబో నీవేల జోలిసేసేవో కాక
తొల్లె నీరాకకు నెదురుచూచే దెఱఁగవా
వొల్లను నవ్వుకొంటా నున్నాఁడవు గాక ॥ఇటువంటి॥

2. వద్దనుండి నీకాపె సేవసేసే దెఱఁగవా

అద్దిరా నీవేల పరాకైతివో కాక
ముద్దు ముద్దు వలె నీకు మొక్కే దెఱఁగవా
సుద్దుల నీగుణా లేమి చూపేవో కాక ॥ఇటువంటి॥

3. తాలిమితో నిన్నునాపె దక్కఁగొన్న దెఱఁగవా
మేలు మేలుఇంతయేల మీరేవో కాక
యీలీల శ్రీవేంకటేశ ఇంతి నిట్టె కూడితివి
వేళ నీవెఱఁగవా నీవేడుకలు గాక ॥ఇటువంటి॥

**అర్థములు:** ప. కటకటా= అయ్యో!, ఇకనైనా= ఇకమీదనైనా, కరుణించు= అనుగ్రహించు.

1. మొల్లమి= దట్టముగా, ఆకె= ఆమె, ఎరుగవా= గ్రహించలేవా, చెల్లబో= ప్రశంస పూర్వకమైన అవ్యయం, జోలిచేయు= సంబంధముపెట్టుకొను, తొల్లె= పూర్వము, ఒల్ల= అల్లరి.
2. ఆపె= ఆమె, అద్దిరా= ఔరా!భళిరా!, పరాకు= ఉపేక్షించు, మ్రొక్కు= నమస్కరించు, సుద్దులు= మాటలు.
3. తాలిమి= ధైర్యము, ఆపె= ఆమె, దక్కగొను= పొందుట, మేలుమేలు= మంచిది అనే చెప్పే అవ్యయము, ఈలీల= ఈ తీరుగా, వేళ= సమయాసమయములు, వేడుక= వినోదము.

**భావము:** ఓ స్వామీ శ్రీనివాసా! ఇలాంటి అకార్యములు చేస్తూ ఉంటే అందరూ నిన్నేమనుకుంటారు. అయ్యో! ఇకమీదనైనా మీ అనుగ్రహాన్ని చూపండి.

ఆ స్త్రీ నీపై ప్రేమను ఎంత దట్టంగా క్రమ్ముకున్నదో నీవెరుగవా? అయ్యయ్యో! నీవు సంబంధము పెట్టుకొని ఆమెతో ఏమి చేస్తావో తెలియదు. మొదటినుండీ ఆమె నీ రాకకు ఎదురు తెన్నులు చూసేది తెలియదా? నీవేమో అల్లరిగా నవ్వుకుంటూ నిలబడ్డావు.

నీవద్దనే ఉండి ఆమె చేసుకునే ఊడిగాలు నీకు తెలియనివా? ఔరా! భళి! భళి! మరి నీవెందుకు ఆమెపై ఇంత ఉపేక్షా భావంతో నిర్లక్ష్యం చేస్తున్నావో తెలియరాకున్నది. ఆమె ముద్దు ముద్దుగా నీకు నమస్కరించుకొంటున్నది తెలియదా? నీ మాటలు, నీ స్వభావం ఏమిటో చూపిస్తావు దప్ప, ఆమెను చేరదీయడం చేయడంలేదు సుమా!

ఎంత ధైర్యముతో ఆమె నిన్ను పొందుకొన్నదో నీవెరుగవా? చాలా మేలు మేలు స్వామీ! ఇదంతా ఎందుకో తెలియదు. మీ గుణమేమిటో తెలియరాకున్నది. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ రీతిగా ఆ స్త్రీని కలిసితివి. నీ వినోదం నీదే గానీ, సమయాసమయాలు గ్రహించలేని వాడివా స్వామీ!

**విశేషాంశాలు:** అన్నమయ్య ఈ కీర్తనలో కటకటా, చెల్లబో!, అద్దిరా! మేలు మేలు! వంటి ప్రశంస, సంతాపము తెలియజేసే అవ్యయాలను ఉపయోగించాడు. అంతే గాక కాక, ఎరుగవా? వంటి అంత్యప్రాసలుపయోగించడం కీర్తనకు వన్నె తెచ్చినది.

## 303

**అవతారిక:** స్వామిపై మనసుపడ్డ అమ్మకు మంచి శుభ ఘడియలు ఆసన్నమయాయని స్వామిని చేరుకుని సేవలు చేసి కూడమని చెలులు చెప్తున్నారు.

### బౌళి

ప. ఏమి సేసినాఁ జెల్లును యిదివేళ
చే ముట్టి యాతనికే సేవలెల్లాఁ జేయవే ॥పల్లవి॥

1. నాటుకొనె చూపులు నడుమఁ గొలువులోన
గాఁటపు రమణునికి కానికియ్యవే
వాఁటమాయ చెమటలు వలపు లినుమడాయ

మాటలాడి యీతని మర్మము లంటించవే ॥ఏమి॥

2. తలకొనె నగవులు దండనుండి చెవిలోన
వెలయ రమణునికే విన్నవించవే
చలివాసె మనసుకు చనవులు తుదముట్టె
తెలిపి యీతనికి నీ తేనెమోవొసగవే ॥ఏమి॥

3. నెట్టుకొనె వేడుకలు నేఁడు శ్రీ వేంకటేశుకు
గట్టిఁగా బెండ్లాడితివి కాఁగిలియ్యవే
దట్టమాయ తమకము తగులాయ నిద్దరికి
చుట్టమవై యీతనికి సొమ్ములెల్లా నించవే ॥ఏమి॥

**అర్థములు:** ప. చెల్లు= సరిపోవు, ఇదివేళ= యిదే తగిన సమయము, చేముట్టి= చేతితో స్పృశించి.

1. నాటుకొను= దట్టంగా దిగబడు, కొలువు= స్వామికి సేవలు చేయు ప్రదేశము, గాటము= అధికము, కానుక= బహుమతి, వాటమగు= అనుకూలమగు, ఇనుమడగు= విజృంభించు, మర్మములు= జీవస్థానములు, అంటించు= తగులునట్లు చేయు.
2. తలకొను= యత్నించు, అండ= చేరువ, వెలయు= ప్రకాశించు, రమణుడు= అందమైనవాడు (స్వామి), విన్నవించు= మనవిచేసుకొను, చలివాయు= బుజ్జగించు, చనవులు= స్నేహ బాంధవ్యము, తుదముట్టు= సిద్ధించు, తేనెమోవి= మధురమైన ముఖము, ఒసగు= అప్పగించు.
3. నెట్టుకొను= అతిశయించె, వేడుక= వినోదము, కాగిలించు= కౌగలించు, దట్టము= అధికము, తమకము= మోహము, తగులాయె= సంబంధి, చుట్టము= బంధువు, సొమ్ములు= ఆభరణములు, ఇంచు= ఇష్టపడు.

**భావము:** ఇవి మంచి శుభ ఘడియలు. ఏమి చేసినా చెల్లిపోతుంది. ఆ స్వామిని స్పృశించి అన్ని సేవలూ చేసుకోవే!

స్వామి కొలువు మధ్యలో వలపుచూపులు దట్టంగా దిగబడ్డాయి. అతిశయించి యున్న ఆ అందమైనా రమణుడికి బహుమతినివ్వవే! చెమటలు అనుకూలించి ప్రేమలు విజృంభించాయి. ఆ స్వామితో ప్రియభాషణలాడుతూ నీ మర్మస్థానాలను ఆయనకు తాకించవే!

నవ్వులు యత్నించి నెలకొన్నాయి. చెంతనే ఉండి ఆ స్వామికి చెవిలో నీ కోరికలన్నీ విన్నవించుకోవే! మనసు బుజ్జగించబడ్డ మనసుతో స్నేహ బాంధవ్యాలు నెలకొన్నాయి. అవన్నీ స్వామికి విన్నవించి నీ తేనెల మోవిని అప్పజెప్పవే!

శ్రీవేంకటేశ్వరునికి వినోదము ఉత్సాహము అతిశయించాయి. వివాహమాడితివి కదా! ఇంక కౌగిలినందించవే! మోహాలు అతిశయించి యిద్దరికి వీడని సంబంధము యేర్పడినది. ఇక చుట్టమై స్వామికి నీ ఆభరణములెల్లా ఇష్టపడి అందించవే!

## 304

**అవతారిక:** శ్రీదేవి భూదేవి ఒకరికొకరు పోటీలుపడి, స్వామి ప్రేమను పొందదానికి తాపత్రయపడుతూ, తోడి చెలులను చులకన, నిర్లక్ష్యం చేస్తున్నారని గ్రహించిన ఒక చెలి వారిద్దరికీ విన్నపాలు చేస్తున్నది.

### రీతిగౌళ

ప. చెప్పుమనేవు తగవు చెప్పకుండరాదు నాకు
వొప్పుగ వినవలెఁ గాదా వువిద లిద్దరును ॥పల్లవి॥

1. పాయపుదానవు గాన పతిని సొలసి నీవు
ఆయములు సోఁక మాటలాడఁ జెల్లునే
చాయలాను సన్నలాను సవతులఁజూపి చూపి
రాయిడించి పలుకఁగరాదే నీ కిపుడు ॥చెప్పు॥

2. చేసుకొన్న యప్పుడే చెలువునికాఁగిటికి

ఆసపడి బలిమి సేయఁగఁ దగునే
వాసితోడ నీతోడివనితలమీఁదట
రాసికెక్కి చేయిచాఁచరాదు గాని నేఁడు ॥చెప్పు॥

3. చెలిమిగలఁడు నీకు శ్రీవేంకటేశ్వరు
కలయుట సహజమే కాఁగిట నీకు
పలుమారు నీతోడిభామినులముంగిటను
చలపట్టి మురియుచు సందడించ నేఁటికే ॥చెప్పు॥

**అర్థములు:** ప. ఒప్పుగ= తగినవిధముగా, ఉవిద= స్త్రీ.

1. పాయము= వయసు, సొలపు= పారవశ్యము, ఆయములు= జీవస్థానములు, సోకు= తగులు, చెల్లు= సరిపోవు, చాయలాను సన్నలాను= వన్నెలు, సైగల ద్వారా, రాయిడించు= అల్లరిచేయు.
2. చెలువుడు= చెలికాడు,స్నేహితుడు, కాగిట= కౌగిట, ఆస= ఆశ, బలిమి= బలవంతము, వాసి= భేదము, రాసికెక్కు= వన్నెకెక్కు.
3. చెలిమి= స్నేహము, తోడి= కూడా ఉన్న, భామినులు= స్త్రీలు, ముంగిట= ముందు, చలపట్టి= కోపగించు, మిరియు= గర్వించు, సందడించు= అతిశయించు.

**భావము:** ఏమైన చెప్పకుండా ఉండలేను, చెప్పినట్లైతే తగవులు అవుతాయి. కాబట్టి మీ యిద్దరు స్త్రీలు, తగిన పద్ధతిలో వినండి.

మంచి యుక్త వయసులో నున్నదానవు కాబట్టి భర్తను చూసి పారవశ్యముతో నీ మర్మస్థానాలన్నీ ఆయనకు సోకించి మాట్లాడడం తగునా? నీ వన్నెచిన్నెలు చూపించి చూపించి, సవతులతో ఈవిధంగా అల్లరి మాటలు మాట్లాడడం తగునా నీకిపుడు?

స్వామి కౌగిటిలో చేరి నీ కోరికలతో ఆయన్ను బలవంతం చేయడం న్యాయమా? భేదభావం చూపించి నీ తోడి స్త్రీల మీద నీ వన్నె చిన్నెలు చూపిస్తూ ఈవిధంగా చేయిచాచడం తగునా?

శ్రీవేంకటేశ్వర స్వామి ఎంతో స్నేహభావం గలవాడు. ఆ స్వామిని కలియడం నీకు సహజమే! కానీ, ఇన్నిసార్లు ఇన్నివిధాలుగా నీ తోడి చెలుల ముందు కోపం చూపిస్తూ అతిశయం చూపడం తగునా?

## 305

**అవతారిక:** అమ్మ ప్రవర్తన మితిమీరి స్వామిపై విజృంభించి తన ప్రేమను కనపరుస్తున్నదన్న విషయం గ్రహించిన ఒక చెలి ఆమె ప్రవర్తన గురించి స్వామికి నివేదిస్తున్నది.

### రామక్రియ

ప. నవ్వేవారి నెఱఁగదు నడుమఁ దాను
నివ్వటిల నీ వెన్నినేర్పితివో చేఁతలు ॥పల్లవి॥

1. చెలరేఁగి చెలరేఁగి చేసీ నీకు విన్నపాలు
నలనాక్షి నీకెంతచనవోకాని
చలివాసి నీ యెదుట సన్నలెల్లాఁ జేసీని
యెలమి నీవెంతసలి గిచ్చితివో యిపుడు ॥నవ్వే॥

2. కొసరి కొసరి నీకుఁగొలువులు సేసీని
సుసరాన నీకె యెంత చుట్టమోకాని
యెసగి నీకప్పటిని యిచ్చకములే సేసీని
వసమై యెంతవలచి వచ్చితివో యిపుడు ॥నవ్వే॥

3. చిమ్మరేఁగి చిమ్మిరేఁగి నేసవెట్టీ నిన్నుఁ గూడి
యెమ్మెలఁ దానెంత నీకు నింపుదోకాని
నెమ్మది శ్రీ వేంకటేశ నీవు నను నేలితివి
చిమ్ములు నాపె కెట్లఁ జెప్పితివో యిపుడు ॥నవ్వే॥

**అర్థములు:** ప. ఎరుగు= తెలిసికొను, నడుమ= మధ్యలో, నివ్వటిల్లు= విజృంభించు, చేతలు= పనులు.

1. చెలరేగి= విజృంభించి, విన్నపాలు= వినతులు, నలనాక్షి (నళినాక్షి)= స్త్రీ, చనవు= ప్రేమ,అభిమానము, చలివాసి= బుజ్జగించు, సన్నలు= సైగలు, ఎలమి= వికాసము, సలిగెంఇచ్చు= ఆశ్రయమిచ్చు.
2. కొసరి= కోరి, కొలువు= సేవ, సుసరాన= సరళము, చుట్టము= బంధువు, ఎసగు= అతిశయించు, ఇచ్చకము= ముఖప్రీతిమాట, వసము= వశము,ఆధీనము.
3. చిమ్మరేగు= వ్యాపించునట్లు చేయు, సేస= అక్షింతలు, ఎమ్మెలు= విలాసము,మనోహరత్వము, ఇంపు= ప్రీతికరము, నెమ్మది= శాంతముగా, చిమ్ములు= విజృంభించు, ఆపె= ఆమె.

**భావము:** ఆమె పరిహాసాలు చేసేవారిని కూడా గమనించడంలేదు. ఈవిధంగా విజృంభించి కార్యాలు చేయడానికి నీవు ఎన్ని పనులు నేర్పించావో తెలియరావడం లేదు.

ఆమె విపరీతంగా విజృంభించి అతిశయముతో నీకు వినతులు చేస్తున్నది. ఆమెకు నీవెంత చనవు ప్రేమ ఇచ్చావో తెలియదు. బుజ్జగించి, నీ ఎదుట నిలబడి ఏవో సైగలు చేస్తూ ఉన్నది. వికాసముతో ఆమెకు హృదయంలో ఆశ్రయమెంత కల్పించావో తెలియదు.

నీకు కోరి కోరి సేవలు చేస్తున్నది. ఆమె మామూలుగా నీకెంత చుట్టమో తెలియదు. అతిశయించి నీతో ముఖప్రీతి మాటలు మాట్లాడుతున్నది. నీవు ఆమెకు ఆధీనమై, ఎంతగా ప్రేమించి వచ్చావో ఇప్పుడు తెలియదు .

ఆమె ఎంతో వికాసముతో విజృంభించి నీకు అక్షింతలు వేస్తున్నది. ఆమె మనోహరత్వం, విలాసము నీకెంత ప్రీతికరమో కదా! శాంతవదనంతో ఓ శ్రీవెంకటేశ్వరా! నన్ను చేరి ఏలుకున్నావు. అతిశయముతో ఉన్న ఆమెకు ఎలా నచ్చజెప్పావో అర్థం కాకున్నది.

## 306

**అవతారిక:** స్వామి మాయలు ప్రదర్శిస్తున్నాడు. అమ్మను కూడిన సమయాలలో సైతం సిగ్గు, భీతి చూపించడమేమిటని అమ్మ స్వామిని ప్రశ్నిస్తున్నది.

### సాళంగనాట

ప. కానీలే అందుకేమాయ ఘనుఁడవు నీ విన్నిటా
దానికేమి యిది నీ పెద్దతికమే కాదా ॥పల్లవి॥

1. పంతమాడరాదుగాక పలుమారు నీ చేఁతలు
కొంతగొంతైనా నీతోడఁ గొనాడరాదా
అంతటివాఁడవుగావా అడఁతురా నీగుణాలు
చెంతల నామోము చూచి సిగ్గులువడుదురా ॥కానీలే॥

2. జంకించఁగరాదు గాక చక్కనినీమోము చూచి
కంకణాలచేయెత్తి మొక్కఁగరాదా
అంకె లింతనేరవా సేయఁగవద్దా వినయాలు
కొంకుదేరి నాయెదుట కొల్లున నవ్వుదురా ॥కానీలే॥

3. అలుగఁగరాదుగాక అట్టె నీకాఁగిటను

సొలవక మోవి యాని చొక్కించరాదా
యెలమి శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నిట్టె
నెలకొన్న నీ పొందులు నివ్వెర గందుదురా ॥కానీలే॥

**అర్థములు:** ప. ఘనుడు= గొప్పవాడు, పెద్దరికము= గౌరవము,అధికారము.

1. పంతము= పట్టుదల, పలుమారు= అనేకసార్లు, చేతలు= పనులు, కొనాడు(కొనియాడు)= ప్రశంసించు, అడతుట= తగ్గించు, చెంత= సమీపము, మోము= ముఖము.
2. జంకించు= అదరవేయు, మొక్కు= నమస్కరించు, అంకె= సమీపము, కొంకు= సంకోచించు, కొల్లున= గొల్లుమని.
3. సొలయు= వెనుదీయు, ఆని= తాకు, చొక్కించు= పరవశత్వముకలుగజేయు, ఎలమి= వికాసము, నెలకొన్న= కలిగిన, పొందు= కలయిక, నివ్వెరగందు= మిక్కిలి భయమునొందు.

**భావము:** కానీలే స్వామీ! నీ చేతలన్నీ మాయే కదా! నువ్వు అన్నిటా గొప్పవాడవు. ఇదంతా నీ గౌరవాధికారములని అనుకొంటాము.

అనేకసార్లు నీ చేతలన్నీ పట్టుదలలు పెంచుకొని ఉన్నవే! అప్పుడప్పుడైనా కొంచెమైనా ప్రశంసించవచ్చు కదా! నీవు అంతటివాడవు గావా స్వామీ! నీ గుణగణాలను మేము తగ్గించేవారమా? దగ్గరకు వచ్చి కూడా సిగ్గులు చిందించడమెందుకు?

ఆడువారిని ఇలా భయము చూపించి అదరగొట్టరాదు. చక్కని అందమైన నీ ముఖ సౌందర్యమును చూచి కంకణాల చేతులెత్తి నమస్కరించవద్దా? స్త్రీజనాన్ని ఇలా నిర్లక్ష్యం చేయడమెందుకు? వినయము కొంచెమైనా చూపించవద్దా? సంకోచిస్తూ నిలబడి నా ఎదుట గొల్లుమని నవ్వడం న్యాయమా?

నీ కౌగిట్లో ఉన్న సమయములో అలగడం తగదు. వెనుదీయకుండా నీ మోహం ఆనించి పరవశత్వం కలిగించరాదా? వికాసముతో ఉన్న ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను ఈవిధముగా ఏలుకొన్నావు. నీ కలియకలు కలిగిన సమయములో కూడా ఇలా భీతి చెందడం ఎందుకు?

## 307

**అవతారిక:** స్వామివారు చేస్తున్న చిలిపి పనులు అమ్మకు అర్థం కావడంలేదు. అన్నీ ముందుగానే చెప్పమని అతని చేతలను వర్ణిస్తున్నది.

### ఆరిబి

ప. తెలిపి చెప్పఁగవలె తెల్లమిగా ముందుముందే
వలపించి నన్ను నింత వలలఁ బెట్టేవు ॥పల్లవి॥

1. మొలకలచన్నుల మొనలు దాఁకీఁ జుమ్మీ
చెలరేఁగి పయ్యదపైఁ జేయివేసేవు
కలువకనులచూపులు కదువాండ్లుసుమీ
నెలవై నాయెదుటనే నిలిచివున్నాఁడవు ॥తెలిపి॥

2. మంచి గాలపుమాటలు మతిఁదగిలించీఁ జుమ్మీ
అంచెలనే నన్ను సుద్దు లడిగేవు
కొంచక నాకొనవేలిగోరు జీరవారీఁ జుమ్మీ
ముంచి నీపాదాలకు మొక్కించుకొనేవు ॥తెలిపి॥

3. చీఁకటికొప్పు నెరులు చేరి నిన్నుఁగప్పీఁజుమ్మీ
తాఁకించినచేతుల ముందులవట్టేవు
యేఁకటతో శ్రీ వేంకటేశ నన్నుఁ గూడితివి

తూఁకువసుమ్మీ పిఱుఁదు తొడ లెక్కుమనేవు ॥తెలిపి॥

అర్థములు: ప. తెలిపి= వివరించి, తెల్లమి= తెటతెల్లముగా, వలలబెట్టు= ఇబ్బందికి గురిచేయు.

1. మొలకచన్నులు= అప్పుడే యౌవనమంకురించిన రొమ్ములు, మొనలు= చివరలు, జుమ్మీ(సుమ్మీ!)= నిశ్చయార్థక పదము, చెలరేగి= విజృంభించి, పయ్యెద= పవిట, కలువకనులు= కలువ రేకులవంటి కన్నులు గల, కడు వాండ్లు= మిక్కిలి వాడియైనవి, నెలవు= వాసస్థానము.
2. గాలపు మాటలు= చిక్కుకొనే మాటలు, మతి= మనసు, అంచ= సమీపము, సుద్దులు= మంచి మాటలు, కొంచు= భయపడక, జీరవారు= గీతలుపడునట్లు, మొక్కించు= నమస్కరింపజేయు.
3. చీకటికొప్పు= ఎక్కువ నల్లనైన, నెరులు= వెంట్రుకలు, ముందుల= ముందర, ఏకట= మిక్కిలి ప్రేమ, తూకువ= తూకము, పిరుదు తొడలు= జఘనము, ఎక్కుమనేవు= ఎక్కి కూర్చోమంటావు.

**భావము:** స్వామీ! ముందుగా అన్నీ వివరించి అర్థమయే రీతిలో చెప్పవలెను కదా! ప్రేమించిన నన్ను ఇలా వలలో పట్టి ఇబ్బందులకు గురిచేయదగునా!

అప్పుడే యౌవనమంకురించిన రొమ్ముల చివరలు తాకుతూ సుమా! విజృంభించి నా పయ్యెదపై చేతులు వేస్తావు. నీ కలువ రేకులవంటి కన్నులు చాలా వాడిగా సూదిలా గ్రుచ్చుకొంటాయి సుమా! ఇక్కడ వాసస్థానంలో నిలిచి ఉన్నావు.

మంచి మాటలనే పేరుతో గాలపు మాటలతో నన్నందులో చిక్కబెడతావు సుమా! సమీపముననే ఉండి నాకు ఏవో మాటలు చెప్తూ ఉంటావు. ఏమాత్రం భయము లేకుండా నా కొనవేలి వేళ్ళపై నీ గోటి గీతలు (నక్షక్షతములు) వేస్తావు సుమా! ఇలా నీ పాదాలకు మ్రొక్కుకునేట్టు చేస్తావు.

చీకటిలా దట్టమైన కురులతో నన్ను కప్పివేస్తావు సుమా! అలాగే తాకించిన చేతులను అందుకొంటావు. అధికమైన ప్రేమాతిశయముతో నన్ను కూడుకున్నావు. తూకము సరిపోతుందని చెబుతూ నీ పిరుదులు జఘనాల మీద ఆశీనురాలిని కమ్మని చెబుతావు.

విశేషము: ఈ కీర్తనలో అన్నమయ్య వలలు విసరడం, గాలము వెయ్యడం వంటి మత్స్య సంబంధిత పదప్రయోగాలు చేయడం విశేషం.

## 308

**అవతారిక:** తనపట్ల ఉదాసీనంగా వ్యవహరిస్తున్న స్వామిని, అమ్మ ఇలా చేయడం తగునా అని నిలదీస్తున్నది.

### పూరిబి

ప. కానీవయ్య ఇఁకనేల కడు నిన్ను సొలయఁగ
మోనముతో నుండఁగాను మొక్కఁజెల్లునా ॥పల్లవి॥

1. తలఁపు నిలుపలేక తమితో మాటాడేఁగాక
పిలిచితే రానపుడే ప్రియమున్నదా
కొలమునాలఁ గనక కోరి సేవసేసేఁగాక
అలపు చూపితినప్పుడే ఆయా లంటఁదగవా ॥కానీ॥

2. చుట్టపువరుస లెంచి చూచి నీతో నవ్వేఁగాక
అట్టు నిట్టు జునిగేవు ఆసగలదా
పట్టినవ్రతముతోడ పైకొని చెనకేఁగాక
నట్టుకొట్టినపుడే విన్నపములు గలవా ॥కానీ॥

3. ఇదె నన్నుఁ గూడఁగాను ఇచ్చకము సేసేఁగాక

వదలితేc గాcగిలి వహి కెక్కీనా
పొదిగి శ్రీ వేంకటేశ పొందులు నమ్మితిcగాక
కదిసి నీ వున్నప్పుడే కాదనcగ వచ్చునా ॥కానీ॥

**అర్థములు:** ప. సొలయు= వెనుదీయు, మోనము= మౌనము, చెల్లునా= సరిపోతుందా!

1. తలపు= ఆలోచన, తమి= కుతూహలం, ప్రియము= ఇష్టము, కొలమునాలు= కులస్త్రీ, అలపు= శ్రమపడు, ఆయాలు= మర్మస్థానములు.
2. చుట్టపు వరుస= బంధుత్వము గల, ఎంచి= లెక్కించి, చునుగు= తేలికజేయు, పైకొను= యత్నించు, చెనకు= తాకు, నట్టుకొట్టు= ఆలస్యముచేయు, విన్నపము= వినతి.
3. ఇచ్చకము= ముఖప్రీతి, కాగిలి= కౌగిలి, వహి= లెక్క, పొదుగు= క్రమ్మి, పొందు= కలయిక, కదిసి= చేరు, కాదనగ= వలదని.

**భావము:** ఓ స్వామీ! నీ చిత్తం వచ్చినట్లే కానివ్వండి. ఇంకా వెనుదీయడమెందుకు? నీవు మౌనం వహిస్తే మాకు నమస్కరించడానికి మనస్కరిస్తుందా!

నీపై క్రమ్ముకుని వచ్చే ఆలోచనలు ఆపుకోలేక కుతూహలముతో మాట్లాడుతున్నాను గాని, పిలిచినప్పుడు రాకపోతే ప్రేమాభిమానాలు ఉన్నట్లా? లేనట్లా? కులస్త్రీనైన నేను కోరి కోరి నీకు సేవలు చేస్తున్నా కానీ, శ్రమపడినప్పుడు మర్మస్థానాలు తాకడం కుదరని వాడవా?

ఏదో బంధువువని ఆవరుస లెక్కించి నీతో నవ్వుతూ మాట్లాడాను కానీ, తేలికజేస్తూ అటూ ఇటూ చూస్తావెందుకు స్వామీ! అసలు కోరిక ఉన్నదా లేదా చెప్పండి? ఏదో దీక్ష వహించిన విధంగా యత్నించి నిన్ను తాకుతున్నాను కానీ, ఇలా ఆలశ్యం చేయడంలో ఏమైనా ఆంతర్యము, వినతులు ఉన్నాయా స్వామీ!

ఇదుగో స్వామీ!చేరి కూడగానే, నీతో ముఖప్రీతి మాటలు మాట్లాడాను కానీ, వదలిపెడితే ఈ కౌగిలి యిక లెక్క తేలుతుందా? ఓ శ్రీవేంకటేశ్వరా! క్రమ్ముకొని నీ పొందులనే నమ్ముకొని ఉన్నాను కాని, చేరి ఉన్నప్పుడే కాదని చెప్పదగునా స్వామీ!

## 309

**అవతారిక:** ఎవరో అన్యస్త్రీ స్వామిని వలపుతో రగిలించింది. ఆమె మధురోహల్లో ఉన్న స్వామిని అమ్మ ఆ విషయమంతా వివరిస్తూ స్వామిని ప్రశ్నిస్తున్నది.

### హిందోళం

ప. ఇంకానేల దాcచేవు ఇంతకువచ్చెc బనులు
సంకలే కానతీరాదా సమ్మతించేc గాని ॥పల్లవి॥

1. చక్కెరవంటిమాటలు సతి నీతో నాడికాదా
చొక్కించెను నిన్నునిట్టె సులభానను
చక్కనిమొగము చూచి సన్నలు సేసే కాదా
నెక్కొనుతమకమెల్లా నీకు రేcగెను ॥ఇంకా॥

2. గాలాలవంటిచూపు లొక్కటc దగిలించికాదా
తాలిమి నీమనసెల్లాc దక్కcగొనెను
మేలిమిచన్నులు నీమే నిట్టె తాcకించికాదా
కీలుకొన్న వలపులు కెరలించెను ॥ఇంకా॥

3. లతలవంటిచేతుల లలి గాcగిలించికాదా

రతిరహస్యములఁ గరఁగఁజేసెను
యితవై శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నిట్టె
కతకారియాపెకాదా కళ లెసఁగించెను ॥ఇంకా॥

**అర్థములు:** ప. ఇంకానేల= ఇంకా ఎందుకు, దాచు= కప్పిపెట్టు, పనులు= అకార్యములు, సంక(శంక)= భయము, ఆనతి= అనుజ్ఞ, సమ్మతించు= అంగీకరించు.

1. చక్కెరవంటి మాటలు= తీయనైన మాటలు, చొక్కించు= మోహములో ముంచు, సులభాన= చాలా సులభముగా, సన్నలు= సైగలు, నెక్కొను= పాదుకొను, తమకము= మోహము, రేగు= వ్యాపించు.
2. గాలాలు= కొక్కెములు, ఒక్కట= ఒక్కసారిగా, తాలిమి= ధైర్యము, దక్కగొను= పొందెను, కీలుకొను= తగులు, కెరలించు= బాధించు.
3. లత= తీగ, లలి= వికాసము, కాగలించు= కౌగలించు, కరగ జేయు= ద్రవింపజేయు, ఇతవు(హితవు)= ఇష్టము, కతకారి= నేర్పరి, ఆపె= ఆమె, కళ= శోభ, ఎసగించు= అతిశయిల్లు.

**భావము:** స్వామీ! ఇంకా ఎందుకీ విషయాలన్నీ కప్పిపుచ్చడం. నీ అకార్యాలు ఇంతదాకా వచ్చాక ఇంకా వెనుదీయడమెందుకు? జంకు లేకుండా పూర్తిగా వివరించండి. అంగీకరించడానికి నేను సిద్ధంగా ఉన్నాను.

చక్కెర వంటి మాటలన్నీ నీతో మాట్లాడి కదా ఆ స్త్రీ మత్తులోను, భ్రమలోను అతి సులభంగా ముంచెత్తినది. నీ చక్కను ముఖారవిందం చూసి, నీకు సైగలు చేసే కదా, పాదుకొన్న మోహాన్ని రేగునట్లు చేసింది.

ఆ స్త్రీ గాలముల వంటి చూపులు నీకు తగిలించే కదా, నీ మనసంతా ధైర్యంగా ఆక్రమించినది. ఆమె సౌందర్యవంతమైన రొమ్ములు నీ శరీరానికి తాకించే కదా వలపులన్నీ నీలో బాధించేటట్టు చేసినది.

ఆమె తీగల వంటి చేతులతో నిన్ను చుట్టుకొని గాఢంగా కౌగలించుకొనే కదా, నిన్ను రతిక్రీడా రహస్యాలలో ద్రవింపజేసినది. ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను ఇష్టపడి కూడి ఏలుకొన్నావు. నీపై శోభలను విరజిమ్మిన ఆమె ఇంతకీ నేర్పరి కాదా చెప్పండి?

## 310

**అవతారిక:** స్వామి ప్రవర్తన అర్థం కాని అమ్మ ఆయననే సూటిగా ప్రశ్నిస్తున్నది.

### మాళవిగౌళ

ప. ఏమని విన్నవించేము యెందాఁకాను
నీ మనసే యెఱుఁగును నేఁడెంత సేసేవు ॥పల్లవి॥

1. వలపెల్లా నొక్కటే వారివారిలోపల
కొలఁదిమీరినయట్టిగుణాలు వేరు
చెలిమీ నటువంటిదే చెప్పి చూపఁబోఇతేను
వెలలేని నేర్పులు వేవేలు గాని ॥ఏమని॥

2. మన సందరివంటిదే మరిగివుండేయపుడు
ననుపులసరసాలే నానాగతులు
తనువు లొద్దికైనవేళ తరితీపు లెంచితేను
చెనకులో సన్నలే చిత్రములుగాని ॥ఏమని॥

3. పొందులు నెప్పటివే భోగించేయప్పుడు
మందలించి కరఁగించేమర్మాలు వింత
చెందితివి నన్ను నిట్టె శ్రీ వేంకటేశ్వర

విందుల మోవియీవులే వేడుకలు గాని ॥ఏమని॥

**అర్థములు:** ప. విన్నవించు= వినతిచేయు, ఎందాకా= ఎంతవరకు, ఎరుగూను= తెలియును.

1. వలపు= ప్రేమ, లోపల= మనసులో, కొలదిమీరు= అపరిమితము, చెలిమి= స్నేహము, చూపబోతేఇను= చూపించ యత్నించు, నేర్పు= నైపుణ్యము, వేవేలు= మిక్కుటము.
2. మరుగు= అలవాటగు, ననుపు= అనురాగము, నానాగతులు= అనేక విధములు, తనువు= శరీరము, ఒద్దిక= అనుకూలము, తరితీపు= ఉదాసీనత, చెనకు= స్పృశించు, సన్నలు= సైగలు, చిత్రములు= విచిత్రము.
3. పొందులు= కలయికలు, భోగించు= అనుభవించు, మందలించు= పరామర్శ, మర్మాలు= రహస్యాలు, వింత= అబ్బురము, మోవి ఈవులు= ముఖాన్నివ్వడం, వేడుక= వినోదము.

**భావము:** ఏమని వినతిచేస్తాము స్వామీ! అదీ ఎందాకా చేస్తాము? ఈరోజు ఎంతగా చేశావు? నీ మనసు నెరుగని వారమా?

నీ ప్రేమంతా ఒకే విధంగా ఉంటుంది. అంతా వారి వారిలోపలే తిరుగుతూ ఉంటుంది. నీ అపరిమితములైన గుణాలు ఎలాగైనా వేరే కదా! స్నేహభావంతో అటువంటి విషయాన్నే చెప్పి చూపించ బూనగా నీవు లెక్కలేనన్ని నైపుణ్యాలు ప్రదర్శిస్తావు.

నీ మనసు జూడబోతే ఎప్పుడూ ఆ అకార్యలకే అలవాటుబడి యుంటావు. నీ అనురాగపు శృంగార కార్యకలాపాలే అనేక రకాలుగా ఉంటాయి. శరీరాలొకటై అనుకూలముగా చేరినపుడు ఉదాసీనత వహించి నిర్లక్ష్యము చేయడంలో చిత్రామేమిటో! అవి స్పర్శలా, సైగలా అర్థం కాక చాలా చిత్రంగా ఉంటాయి.

ఇక మీరు సాగించే పొందులు, అనుభవించే విధము ఎప్పటివలెనే ఉంటుంది. పరామర్శ చేస్తూ మనసు కరిగేట్టు చేసే రహస్యపు కార్యాలు వింతగా ఉంటాయి. ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను చేరి పొందుకూడావు. ఇక నాకు మీకు మోవిని అందించి అధరామృతపానము చేయడమే ఒక వినోద క్రీడ.

**విశేషము:** ఈ కీర్తనలో అన్నమయ్య "చూపబోఇతేను ?" అనే ప్రయోగం చేశాడు. కానీ ఇక్కడ "చూపబోయితేను" అని ఉండాలి. ఇక్కడ 'యాడాగమమూ, సంధి కలుగలేదు. ఇది రాగిరేకులు చెక్కినవారి అక్షర దోషం అనుకోవలసి యున్నది.

## 311

**అవతారిక:** స్వామి కొలువులో చేస్తున్న శృంగార క్రీడలు మితిమీరుతున్నాయని భావించిన అమ్మ అలమేలుమంగమ్మ స్వామికి విన్నవిస్తున్నది.

### నాదరామక్రియ

ప. ఇంత పని కోపుదుమా యిదివో నేమొ
మంతనానకు వచ్చితే మరిగించుకొంటివి ॥పల్లవి॥

1. పొద్దువోనివాఁడవు పొలఁతులఁ గంటేను
చద్దికి వేఁడి కాడేవు జాణతనాలు
వుద్దండీఁడవట మీఁద నొడఁబరచవచ్చితే
కొద్దిమీరి చెలిమేన గొరు దాఁకించితివి ॥ఇంత॥

2. జూటరివాఁడవు నీవు సుదతు లిచ్చి తేఁజాలు
చీటికిమాటి కంటేవు చేకానికలు
నీటుదొరవు గనక నీకు విందుచెప్ప వచ్చి
నాఁటదానికొంగువట్టి యాఁడిఁ బెట్టేవు ॥ఇంత॥

3. నిరతి శ్రీ వేంకటేశ నెలఁత లెదుట నుంటే
సరికి బేసి కంటేవు చనుమొనలు

సరసుఁడవని నిన్ను సంగడి నే మెచ్చితేను
సొరిది నన్నేలితివి చుట్టమైనదానిని ॥ఇంత॥

**అర్థములు:** ప. ఓపు= ఓపికపట్టు, మంతనము= ఏకాంతము,రహస్యము, మరిగించు= మోహింపజేయు.

1. పొద్దువోని= తోచని, పొలతులు= స్త్రీలు, చద్దికి వేడికి= చలికి వేడిమికి,అన్నింటికి అనే అర్ధంలో, జాణతనము= నేర్పరితనము, ఉద్దండుడు= గొప్పవాడు, ఒడబరచు= ఒప్పించు, ఒద్దిమీరు= అననుకులము, మేను= శరీరము, గోరుతాకించు= గోటి గాట్లు పడునట్లు చేయు. 2.జూటరి= నేర్పరి, సుదతులు= చక్కని పలువరుసగల స్త్రీ, తేజము= ప్రకాశము, చీటికిమాటికి= పదేపదే, చేకానిక(చేకానుక)= బహుమతి, నీటు= శృంగారగర్వము, ఆటదాని= ఆడుదాని, ఆరడి= అగచాట్లు.
3. నిరతి= అధికాసక్తి, నెలత= స్త్రీ, సరికిబేసి= అయినదానికి కానిదానికి, అంటు= తాకు, చనుమొనలు= రొమ్ముల చివరలు, సంగడి= స్నేహము, సొరిది= క్రమము.

**భావము:** ఓ స్వామీ! ఇంతపని చేశావు కదా మేము ఓర్వగలమా? ఇదుగో ఏకాంతమున రహస్యంగా మీ వద్దకు వస్తే మోహింపజేసుకున్నావు.

స్వామీ! నీవు ఏమీ తోచక స్త్రీలు కనిపిస్తే చాలు, అన్నింటికి నీ నేర్పరితనాలు, చేతలు చూపిస్తూ ఉంటావు. గొప్పవాడవని నిన్ను ఒప్పించాలని వస్తే అనుకూలముగా ఉండక హద్దుమీరి చెలి శరీరముపై నీ గోటి గుర్తులు వేసితివి.

నీవు నేర్పరివని నిన్ను స్త్రీలు దర్శించ వచ్చినప్పుడు ప్రకాశముతో మాటిమాటికి బహుమతులను అందుకొంటావు. ఏదో గొప్ప శృంగార స్వామివని నీకు విందివ్వాలని ఆహ్వానించడానికి వచ్చిన స్త్రీ కొంగు పట్టుకుని అగచాట్లకు గురిచేస్తావు.

ఓ శ్రీవేంకటేశ్వరా! నీపై అధికాసక్తి చూపుతూ స్త్రీలు నిలబడి ఉన్నప్పుడు అయిన దానికి కానిదానికి పనికల్పించుకొని వారి చనుమొనలు ముట్టుకుంటావు. సరస శృంగాలలో తెలుస్తావని భావించి నేను నీ స్నేహము కోరి వస్తే క్రమముగా అల్లుకుని నన్ను ఏలుకొన్నావు.

## 312

**అవతారిక:** స్వామి అమ్మను కూడుటకు ఇంటికి విచ్చేసినా ఏకాంత సమయంలో కూడా ఎవరో అన్యకాంత వచ్చి ప్రక్కన నిలబడగా, అమ్మ కోపగించక తగు మర్యాదలను చూపుతూ, విషయాన్ని స్వామికి నివేదిస్తున్నది.

### తెలుగు గాంబోది

ప. కోరిక లీడేరె నిఁకఁ గూచుండవయ్యా
సారె సారె నందుకుఁగా జలపట్టనేఁటికి ॥పల్లవి॥

1. యింతలోనే విభుఁడ నీ వింటికి విచ్చేసితివి
పంతపుమాఁటల కికఁ బనిలేదు
వంతుకు వచ్చినయాపె వద్దనే నిలుచున్నది
సంతోసించవలెఁగాని సాదించనేఁటికి ॥కోరిక॥

2. దప్పిదేర చెక్కునొక్కి తమ్ముల మిడితివి
తప్పులు నీపయి నెంచఁదగవుగాదు
చెప్పరానిగుట్టుతోడ చేసన్న చేసీ నాపె
వొప్పనాయ నీవలపు వుప్పతించనేఁటికి ॥కోరిక॥

3. కన్నులనే నవ్వి నన్నుఁ గాఁగిట నించితివి
విన్నపాలుసేయ నిది వేళ గాదు
వున్నతి శ్రీ వేంకటేశ వూరకే మొక్కీ నాకె

మన్ననలు దయివారె మతకములేఁటికి ॥కోరిక॥

**అర్థములు:** ప. ఈడేరు= నెరవేరు, సారె సారె= మాటిమాటికి, చలపట్టు= కోపగించు.

1. విభుడు= భర్త, విచ్చేయు= చేరుకొను, వంతు= పోటీ, ఆపె= ఆమె, వద్ద= సమీపము, సాదించు= బాధించు.
2. దప్పిదేరి= దాహము తీరి, చెక్కు= చెక్కిలి, తమ్ములము= తాంబూలము, ఇదు= ఇచ్చు, ఎంచదగు= లెక్కించదగిన, చెప్పరాని= చెప్పడానికి వీలులేని, గుట్టు= రహస్యము, చేసన్న= చేతిసైగ, ఆపె= ఆమె, ఒప్పను= అంగీకరించను, ఉప్పతించు= ఓర్వలేకపోవు, ఏటికి= ఎందుకు.
3. కాగిట= కౌగిట, నించితివి= ఉంచుకొన్నావు, విన్నపాలు= వినతులు, వేళకాదు= సమయము కాదు, ఉన్నతి= ఘనము, మొక్కీ= మ్రొక్కుచున్నది, ఆకె= ఆమె, మన్నన= మర్యాద, తైవారు= ప్రకాశించు, మతకము= మాయ.

**భావము:** స్వామీ! నీ కోరికలన్నీ తీరాయి కదా ఇంక నిదానించి ఆశీనులు కండి! మాటి మాటికి ఇంకా కోపగించడమెందులకు?

ఇంతలోనే భర్తవైన నీవు ఇంటికి దయచేశావు. ఇక పంతాలు పట్టింపులు ఏవీ అవసరం లేదు. పోటీగా వచ్చిన స్త్రీ ప్రక్కనే నిల్చొని ఉన్నది. దీనికి సంతోషించాలి కానీ ఇలా మనస్తాపానికి గురిచేయడమెందుకు?

దాహము తీరునట్లుగా నా చెక్కిలి నొక్కి తాంబూలమిచ్చావు. నీమీద తప్పులెంచాల్సిన పనేమీ లేదు. చెప్పరాని రహస్యముతో చేతితో సైగలు చేస్తూ ఆమె నిలబడి ఉన్నది. దీనికి కూడా ఒప్పుకొని నేను సిద్ధపడియున్నాను. స్వామీ! ఇంక ఇందులో ఓర్వలేనితనమేమున్నది చెప్పండి?

కన్నులతోనే నవ్వులు చిందించి నన్ను కౌగిటిలోకి తీసుకొని ఉన్నావు. వినతులు చేయడానికిది సమయం కాదు. ఘనుడైన ఓ శ్రీవేంకటేశ్వరా! ఆమె నీకు ఊరకే నమస్కరించుచున్నది. ఆమెకిచ్చిన మర్యాదలన్నీ ప్రకాశముగా ఉన్నవి. ఇంకా ఈ మాయలెందుకు ప్రదర్శిస్తారు.

## 313

**అవతారిక:** అన్యకాంతను మనసులో ఉంచుకొని అమ్మవద్దకు చేరిన స్వామి నవ్వడం లేదని గ్రహించిన అమ్మ కించిత్ కినుక వహించి పంతమువీడి స్వామిని నవ్వమని కోరుతున్నది.

### శంకరాభరణం

ప. నా మొగము చూచి నగరాదా
దోమటి గలసే నిందుకు నగరాదా ॥పల్లవి॥

1. చెనకు లాకెచేఁ జేయించకుండితే
నను నీ వప్పుడు నగరాదా
పెనఁగుల జంకింపించకుండితే
యినుమడిగా నీవిటు నగరాదా ॥నా మొగము ॥

2. పిలి చటు కొసరింపించకుండితే
నలువంకల మరి నగరాదా
చెలరేఁగి ప్రియము చెప్పించకుండితే
కొలఁదిమీరి గక్కున నగరాదా ॥నా మొగము ॥

3. వొట్టి పంతానఁ జెయ్యొగ్గించకుండితే
నట్టనడుమనే నగరాదా
యిట్టె శ్రీ వేంకటేశ కూడితివి
చుట్టమవై మెచ్చుగ నగరాదా ॥నా మొగము ॥

**అర్థములు:** ప. మొగము= ముఖము, నగు= నవ్వు, దోమటి= విందు.

1. చెనకు= తాకు, ఆకె= ఆమె, పెనగు= చుట్టుకొను, జంకింపించు= అదరగొట్టు, ఇనుమడి= రెట్టించిన.
2. పిలిచిఁఅటు= పిలిచి అటువైపు, కొసరింపించు= కోరికలుతెలియజేయు, నలువంకలు= అన్ని తావులు, చెలరేగి= విజృంభించి, చెప్పించకుండు= చెప్పకుండు, కొలదిమీరు= అపరిమితము, గక్కున= వేగముగా.
3. ఒట్టిపంతము= ఏమీలేకున్నా పట్టుదలకు పోవడం, చెయ్యొగ్గించు= చేయి చాచుకొను, నట్టనడుమ= అందరిలో, చుట్టమవు= బంధువువు, మెచ్చు= ప్రశంసించు.

**భావము:** స్వామీ! నా ముఖము చూచైనా నవ్వవచ్చును కదా! విందులో కలసినదిందుకే కదా కాస్తా నవ్వరాదా!

ఆ స్త్రీ తో తాకించడమనేది చేయించకుండా ఉన్నట్లైతే నీవప్పుడు నవ్వ వచ్చును కదా! చుట్టుకొని అదరగొట్టకుండా ఉండి ఉన్నట్లైతే రెట్టించిన సంతోషంతో నవ్వవచ్చుకదా!

ఆమెను పిలిచి నీ కోరికలు విన్నవించకుండినట్లైతే నాలుదిక్కులా చూసి నవ్వవచ్చు కదా! నీవు విజృంభించి మరీ ఆమెతో వలపు మాటలు మాట్లాడకుండినట్లైతే అపరిమితమైన నవ్వులు నవ్వవచ్చు కదా!

ఊరకే లేనిపోని పంతాలకు పోయి, ఆమెక చేయి చాచుకొని ఉండిఉండనట్లైతే కొలువు మధ్యలోనే నవ్వరాదా! ఓ శ్రీ వేంకటేశ్వరా! ఈవిధముగా నన్ను కూడితివి. బంధువువైనావు కదా ఇకనైనా ప్రశంసించి నవ్వవచ్చుకదా!

## 314

**అవతారిక:** స్వామి తనపట్ల ఎందుకో ముభావత చూపిస్తున్నాడని గ్రహించిన అమ్మ చెలితో రాయబారం పంపుతున్నది.

### కన్నడగౌళ

ప. ఏల తలవంచీనే యెగ్గులేల పంచీనీ
తాలిమి నెంచి చూచితే తానే నేననవే ॥పల్లవి॥

1. వొడివట్టి పెనఁగవే వొట్టు వెట్టుకున్నవాఁడు
నుడిగి దోసము లేదనుచుఁ బల్కవే
అడియాలమైనట్టియాన నాపైఁ బెట్టవే
వొడయఁడు తాను నాకు వోరుచుకొమ్మనవే ॥ఏల॥

2. పలుమారు మొక్కవే పంతముతో నున్నవాఁడు
వెలయ సిగ్గు లొల్లనే విడిపించమనవే
సెలవుల నవ్వింపించి చేరి యాసపుట్టించవే
అలుగరానిచుట్టరిక మన్నిటాఁ దెలుపవే ॥ఏల॥

3. గక్కనఁ దెరవేయవే కరుణతో నున్నవాఁడు
అక్కడిక్కడివా రేమీ ననకనవే
యిక్కువ శ్రీ వేంకటేశుఁ డీడ నిట్టె నన్నుఁ గూడె
దక్కినాఁడు తా నాకు తా నెఱుఁగుననవే ॥ఏల॥

**అర్థములు:** ప. ఎగ్గు= నింద, తాలిమి= ఓర్పు.

1. పెనగు= చుట్టుకొను, ఒట్టు= ప్రమాణము, ఉడిగి= అడుగంటు, దోసము= దోషము, అడియాలము= గుర్తుపట్టు, ఆన= ఒట్టు, ఒడయు= మగడు,స్వామి, ఓరుచుకొను= భరించు.
2. పలుమార్లు= అనేకసార్లు, పంతము= పట్టుదల, వెలయ= బయటపడు, ఒల్లనే= ఊరుకోలేను, సెలవులు= పెదవి చివర, నవ్వింపించి= నవ్వించి, ఆస= కోరిక, అలుగరాని= అలుకలులేనటువంటి, చుట్టము= బంధువు.

3. గక్కన= శ్రీఘ్రముగ, తెర= అడ్డు వస్త్రము, కరుణ= కనికరము, అక్కడిక్కడివారు= మధ్యలో నున్నవారు, అనకన= అనవద్దని, ఇక్కువ= జాడ, ఈడ= ఇక్కడ, దక్కు= పొందు, ఎరుగు= తెలుసు.

**భావము:** స్వామి ఎందుకలా తలవంచుకుని ఉన్నాడు? ఎందుకలా నిందలు మోపడం? కాస్తా ఓర్పుతో గమనించి చూడమనవే, తానే నేను, నేనే తాను అని చెప్పవే!

ఒట్లు పెట్టుకుని, అడుగంటి కూర్చొన్న ఆ స్వామిని ఒడిపట్టుకుని అతన్ని చుట్టుకొనవే! ఇందులో నా దోషము ఏమీ లేదని చెప్పవే! గుర్తుపట్టే ఆన యని భారం నాపై బెట్టవే! నా స్వామియైన మగడు తానే కదా! కాస్తా భరించమని చెప్పవే!

స్వామికి అనేక మార్లు మ్రొక్కినట్లైతే పట్టుదల వదలిపెడతాడు. ఆ ప్రకాశించే భరించలేని సిగ్గులు కాస్తా విడిచిపెట్టమనవే! పెదవిమూల నవ్వులు స్వామిచే నవ్వించి కోరిక పుట్టించవే! ఈ బంధుత్వము అలుకలు లేనిదన్న విషయం తెలుపవే!

శీఘ్రముగా తెర వేయవే! స్వామి ఇప్పుడే కనికరము చూపిస్తున్నాడు. అక్కడి వారు ఇక్కడివారు స్వామిని ఏమీ అనవద్దని చెప్పవే! జాడ తెలిసి ఆ శ్రీవేంకటేశ్వరుడు ఇక్కడ నన్నేలుకున్నాడు. నన్ను పొందుకున్న స్వామి నాకు బాగా తెలిసినవాడని చెప్పవే!

## 315

**అవతారిక:** స్వామితో అకార్యపు చేతలు చేస్తున్న ఒక చెలిని అమ్మ ఆమె యింటి గుమ్మం వద్ద నిలబడి బయటకు రమ్మని నిలదీస్తున్నది.

### బౌళి

ప. తమ్మ దామే యెఱిఁగేరు తగవులెల్లా
రమ్మంటె వత్తముగాన రావే వాకిటికి ॥పల్లవి॥

1. సతికినిఁ బతికిని సాకిరి చెప్పుదురా
తతిగొని పెనఁగఁగా దండనుందురా
యితవరి చెలులము యెవ్వరి నేమనవచ్చు
రతికెక్కెఁ బనులెల్లా రావే వాకిటికి ॥తమ్మ॥

2. పవ్వళించి వుండఁగాను పాదము లొత్తుదురా
పువ్వుల వేట్లాడఁగాఁ బొదుగుదురా
నవ్వించేవారము నాలి యెట్టు సేయవచ్చు
రవ్వలాయఁ జేతలెల్లా రావే వాకిటికి ॥తమ్మ॥

3. బాసలు చేసుకోఁగా పై పై గురియవుదురా
ఆసల మోవులానఁగా నట్టె చూతురా
సేసవెట్టి యేలినాఁడు శ్రీ వేంకటేశ్వరుఁడు
రాసులాయ వేడుకలు రావే వాకిటికి ॥తమ్మ॥

**అర్థములు:** ప. ఎరుగు= తెలిసికొను, తగవు= జగడము, వత్తము= వచ్చెదము, వాకిటికి= ఇంటి మొదలు ప్రదేశము.

1. సతికి బతికి= మొగుడు పెళ్ళాలకు, సాకిరి= సాక్ష్యం, తతి= సమయము, పెనగు= చుట్టుకొను,కౌగలించు, అండ= దగ్గరగా, హితవరి= ఇష్టుడు, రతికెక్కు= శృంగారక్రీడలకు దారితీయు, పనులు= చేయరాని పనులు.
2. పవ్వళించి= పడుకొని నిద్రించు, వేట్లు= దెబ్బలు, పొదుగు= క్రమ్ము, ఆలి= భార్య, రవ్వ= అల్లరి, చేతలు= పనులు.
3. బాసలు= ప్రమాణము, పైపై= పైపైన, కురియు= కుప్పించు, ఆసలు= కోరికలు, మోవులాను= ముఖములు తాకు, సేస= అక్షింతలు, ఏలినాడు= పరిగ్రహించు, రాసులు= కుప్పలు, వేడుక= వినోదము.

**భావము:** ఈ జగడాలన్నీ అందరికీ  తెలిసినవే కానీ, మమ్మల్ని లోనకు రమ్మంటే వస్తాము. నువ్వు మొదట వాకిట్లోకి రావే!

భార్యా భర్తల మధ్యలో చేరి ఎవరైనా ఇలా సాక్ష్యాలు చెప్తారా? సమయము చూసి మేము కౌగలించుకుని ఉంటే ప్రక్కనే నిలబడతారా? అంతా మరలా ఇష్టమైన చెలులే ఎవరిని ఏమనగలము. నీ చేతలన్నీ శృంగారక్రీడలన్నీ బయటపడ్డాయి కానీ, వాకిట్లోకి రావే!

స్వామి పడుకొని నిద్రిస్తున్న సమయములో ఆయన పాదాలొత్తుతారా ఎవరైనా? పుష్పాలు మరీ అలా దెబ్బ తగిలేట్టు విసురుతారా? అంతా నవ్వించే చెలులమే కదా! భార్యను ఎంతలా చూసుకోవచ్చు చెప్పు? నీ చేతలన్నీ అల్లరిపాలయ్యాయి కానీ, నువ్వు మొదట వాకిట్లోకి రావే!

ప్రమాణాలు చేసుకుంటూ ఉండగా, పైపైన ఇలా బాధ్యతలేకుండా ప్రవర్తిస్తారా? కోరికలతో  మేము ముఖములు తాకించుకుంటే అలాగే కళ్ళార్పకుండా చూస్తారా? ఆ శ్రీవేంకటేశ్వరుడు అక్షింతలు వేసి మమ్మేలుకున్నాడు. మా వినోదము, విలాసము ప్రోగులై ఉన్నవి కానీ, నువ్వు మొదట వాకిట్లోకి రావే!

## 316

**అవతారిక:** అలమేలుమంగా శ్రీనివాసుల శృంగార అలంకారాలను, వారి వారి వేషధారణ బహుధా వర్ణిస్తున్నాడు అన్నమయ్య.

### సాళంగం

ప. ఆనతియ్యవయ్యా నీవా తరవాతిమాట
కానుకలు వట్టుకొని కాచుకున్నా రింతులు ॥పల్లవి॥

1. చట్టువంటినీమనసు సాదించరా దెవ్వరికి
గట్టికొండలవంటివి కాంతచన్నులు
గుట్టుతో మీరుండఁగా మీ గణము దెలియలేక
చుట్టుక మొగమొగాలు చూచుకొనే రింతులు ॥ఆనతి॥

2. కాటుకవంటిది నీ చక్కని తిరుమణిచాయ
కోటిచీఁకట్ల గుంపు కొమ్మతురుము
నీటుతో మీరుండడఁగా మీనెపము లెరుఁగరాక
తేటవడ లోలోఁ జింతించుకొనే రింతులు ॥ఆనతి॥

3. కొత్తచిగురువంటిది కోరినట్టినీవలపు
చిత్తరువ్రాఁతవంటివి చెలిరతులు
ఇత్తల శ్రీ వేంకటేశ ఇద్దరుఁ గూడితిరి
పొత్తులసంతోసాలఁ బొదలేరు ఇంతులు ॥ఆనతి॥

**అర్థములు:** ప. ఆనతి= అనుజ్ఞ, తరవాతి మాట= అవతలి సంగతి, కానుకలు= బహుమతులు, ఇంతులు= స్త్రీలు.

1. చుట్టు= గుండ్రనైన,అంతుతెలియని, సాదించరానిది= తెలుసుకోలేనిది, గట్టికొండలు= దృఢమైన పర్వతములు, చన్నులు= రొమ్ములు, గుట్టు= ఏకాంతము,రహస్యము, గుణము= స్వభావము, చుట్టుక= చుట్టూజేరి, మొగమొగాలు= ఒకరి మొహం ఒకరు, ఇంతులు= స్త్రీలు.

2. కాటుక= అతి చిక్కనైన, తిరుమణి ఛాయ= వైష్ణవులు నొసటనుం?్నకొనెడు ధవళమృత్తిక శోభ, కొమ్మ= స్త్రీ, తురుము= కొప్పు సిగ, నీటు= శృంగార గర్వము, నెపము= కారణము, తేటవడు= తేలినవిధము, లోలో= లోపల లోపల, చింతించు= బాధపడు, ఇంతులు= స్త్రీలు.

3. క్రొత్త చిగురు= క్రొత్తగా వచ్చిన లేత ఆకులు, చిత్తరువు= పటమునందు వ్రాసిన రూపము, రతులు= శృంగార క్రీడలు, ఇత్తల=

ఇవతల, పొత్తులు= కలయికలు, ఇంతులు= స్త్రీలు.

**భావము:** స్వామీ! నీ మాటలన్నీ తరువాత చూసుకోవచ్చును. మొదట మీ అనుజ్ఞనివ్వండి. అక్కడ రమణులంతా బహుమతులు పట్టుకుని తయారుగా ఉన్నారు.

స్వామీ! మీ మనసు వృత్తమై ఎవ్వరికి అంతుతెలియకుండా ఉన్నది. పర్వతాలవంటి గట్టివైన కాంత రొమ్ములు. మీరు రహస్యంగా ఏకాంతంగా ఉండగా మీ స్వభావమునెరుగక చుట్టూ నిలబడి చెలులంతా ఒకరి మొహాలు మరొకరు చూసుకుంటూ ఉన్నారు.

నీ తిరుమణి శోభ కాటుకవలె చాలా చిక్కనైనది. ఆ అమ్మ కొప్పు కోటికోట్ల చీకట్లావరించుకున్నత నలుపు రంగులో ఉన్నది. మీరు శృంగార గర్వంతో విజృంభించి ఉండగా కారణాలు తెలుసుకోకుండా, తేటపడ్డ విధంగా ఇంతులంతా లోలోపల బాధకు గురవుతున్నారు.

మీరు కోరుకున్న ప్రేమానురాగాలు క్రొత్తగా చిగుళ్ళు వేసిన రీతిగా ఉన్నాయి. వర్ణచిత్ర పటము వ్రాసిన రూపములాగా చెలితోడి రతిక్రీడలు చక్కగా అమరినవి. ఇవతల ఓ శ్రీవేంకటేశ్వరా! మీ ఇద్దరూ కలుసుకొన్నారు. స్నేహ భావంతో ఉన్న కూడికలతో స్త్రీలు వర్ధిల్లుతున్నారు.

## 317

**అవతారిక:** అన్యకాంతను కూడి వచ్చాడన్న విషయం గమనించిన అమ్మ అలమేలుమంగ స్వామి దగ్గరకు వెళ్ళడానికి సంకోచిస్తూ కోపంగా ఉండగా, చెలులు స్వామికి బుజ్జగించి చేపట్టమని చెప్పే సన్నివేశం.

### నాట

ప. ఈకెకు నప్పుడుగాని యేకచిత్తము గాదు
చేకొని మచ్చిక చూపి చెప్పవయ్య ప్రియము ॥పల్లవి॥

1. కళలు దొలఁకఁగాను గక్కన నీ మోము చూచి
మలసి యెందో కొడిమలుగట్టీని
తలకొని నీ వెంత తారుకాణించవచ్చినా
చెలియ నమ్మదు ఇఁకఁ జేయవయ్య బాస ॥ఈకెకు॥

2. పంకంపుఁజెమట మేనిపై నీకు నుండఁగాను
తెంకి నేడదోయని సందేహించీని
అంకెల నొడఁబరచి అతివ కెంతచెప్పినా
కొంకక మానదు పెట్టుకొనవయ్య ఆసలు ॥ఈకెకు॥

3. సతమై నిట్టూర్పులు సారె నీకు రేఁగితేను
సతులఁ బొందితివని జరసీ నిన్ను
ఇతవుగా శ్రీ వేంకటేశ యీకెఁ గూడితివి
రతిలోనే సోదించి నేరపవయ్య నిజము ॥ఈకెకు॥

**అర్థములు:** ప. ఈకె= ఈమె, ఏకచిత్తము = ఒకే మనస్సు,అనన్యచిత్తము, చేకొని= చేపట్టి, మచ్చిక= మోహము.

1. కళ= శోభ, తొలుకు= చిందు, గక్కున= శ్రీఘ్రముగ, మలసి= వీచు, కొడిమ= అపవాదు,పాపము, తలకొను= యత్నించి, తారుకాణ= గుర్తు,చిహ్నము, బాస= ప్రమాణము.

2. పంకము= బురద, మేను= శరీరము, తెంకు= భయము, ఎడదోయు= దూరముపెట్టు, అంకె= సమీపము, ఒడబరచు= ఒప్పించు, అతివ= స్త్రీ, కొంకు= వెనుదీయు.

3. సతము= శాశ్వతము, సారె= మాటిమాటికి, రేగు= వ్యాపించు, సతి= భార్య, జరయు= నిందించు, (హి)ఇతవు= ఇష్టము, ఈకె= ఈమె, సోదించు= వెదకు, నేరపవయ్యా= నేర్పించవయ్యా.

**భావము:** ఈమెను చేపట్టి, నీ ప్రేమానురాగాలు చూపించి ప్రియభాషణమాడవయ్యా అప్పుడు కానీ ఈమెకు నీమీద మనసు పూర్తిగ లగ్నమవదు.

శోభలన్నీ చిందుతుండగా నీ ముఖారవిందం గమనించినా ఎందుకో సందేహాలు వెలిబుచ్చుచున్నది. నీవెంత యత్నించి గుర్తులు చూపినప్పటికి, ఈమె నమ్మడంలేదు కాబట్టి నీవు విచ్చేసి ఏవో ప్రమాణము చేస్తే కాని పూర్తి విశ్వాసము కలిగేట్టులేదు. చిక్కనైన చెమట నీ శరీరంపై స్రవిస్తూ ఉండగా, భీతితో దూరంగా నిలబడి ఏవో అనుమానాలు పెట్టుకొన్నది. ఆమెను సమీపించి ఒప్పించినప్పటికి ఆమెకు నమ్మకం కలుగడంలేదు, ఇంక నీవే కోరికతో వచ్చి చేరదీయవలసినదే సుమా!

నీవు నిట్టూర్పులు దీర్ఘ ఉచ్ఛ్వాస నిశ్వాసనములు మాటికి మాటికి చేస్తూ ఉండగా, అన్య స్త్రీలను పొందావన్న కోపించి, నిన్ను నిందిస్తూ నిలచి ఉన్నది. ఓ శ్రీవేంకటేశ్వరా! ఇష్టపూర్తిగా ఈమెను కూడితివి కనుక శృంగార కార్యములతోనే ఆమె చిత్తము కరగించి నిజమేమిటో ఆమెకు చెప్పి పొందుకూడవయ్యా!

## 318

**అవతారిక:** స్వామి కొలువులో నిరంతరము స్త్రీజనంతో సేవలు చేయించుకోవడమే కానీ, వారి సంగతి ఏమాత్రం పట్టించుకోవడంలేదని అమ్మ అలమేలుమంగమ్మ స్వామిని ప్రశ్నిస్తున్నది.

### వరాళి

ప. ఇంత దొడ్డవాఁడవౌత ఇంతులెల్లా నెరఁగరా
పంతము లిప్పుడే నీవు పచారించవలెనా ॥పల్లవి॥

1. తరుణి నీ వూడిగాలు తఱచుగఁ జేయఁగాను
సిరులఁజెమట మేనఁ జిప్పిలీని
సురటి విసరరాదా సుద్దు లేమి చెప్పేవు
యిరవైన దొరతన మిప్పుడే చూపేవా ॥ఇంత॥

2. కొమ్మ నిలుచుండి నీకుఁ గొలువులు సేయఁగాను
చిమ్ములయలపుతోడ సిగ్గువడీని
పమ్మి కూచుండఁబెట్టుక పన్నీరు చల్లఁగరాదా
యెమ్మెలునేతులు నీవు యిప్పుడే చూపేవా ॥ఇంత॥

3. పడఁతి వేగినంతాను పాదాలు నీ కొత్తగాను
కడఁగి కళలురేఁగి కాఁతాళించీని
అదరి శ్రీ వేంకటేశ అంతలోనే కూడితివి
యెడయని నీనేరుపు లిప్పుడే చూపేవా ॥ఇంత॥

**అర్థములు:** ప. దొడ్డవాడు= మంచివాడు, ఔత= అవడం, పంతము= పట్టుదల, పచారించు= ప్రకటించు.

1. తరుణి= స్త్రీ, ఊడిగాలు= కొలువులో సేవలు, తరచు= అనేకమార్లు, మేన= శరీరముపై, చిప్పిల్లు= ఉబికివచ్చు, సురటి= విసనకర్ర.
2. కొమ్మ= స్త్రీ, కొలువు= సేవ, చిమ్ము= వ్యాపించు, పమ్మి= అతిశయించి, ఎమ్మె= విలాసము, ఏతు= గర్వము.
3. పడతి= స్త్రీ, వేగు= తపించు, కడగి= పురికొల్పి, కళ= శోభ, కాతాళించు= చిర్రుబుర్రులాడు, అదరి= అతిశయించి, ఎడయని= దూరమవని, నేరుపు= నైపుణ్యము.

**భావము:** స్వామీ! నీవెంత మంచివాడివో ఇక్కడనున్న స్త్రీజనమంతా ఎరిగినదే కదా! నీ పంతాలు పట్టింపులు ఈ సమయంలోనే ప్రకటించవలెనా చెప్పండి?

కొలువులో ఉన్న ఒక స్త్రీ నీకు నిరంతరం సేవలు చేస్తూ ఉండగా, ఆమె శరీరంపై చెమటలు ఉబికుబికి వస్తున్నా కనీసము విసనకర్రతో వీవనైనా వీవవు. కబుర్లు మాత్రం బాగా చెబుతావు. నీ పెద్దరికమంతా ఈ సమయంలోనే చూపించవలెనా?

ఆ స్త్రీ నీ సరసన నిలబడి నీ సేవలన్నీ చేస్తూ ఉండగా, ఎంతో అలసిపోయి సిగ్గులు చిందుతూ ఉండగా, ఆమెను అతిశయించి నీ ప్రక్కనే కూర్చొండజేసి పన్నీరు చల్లవచ్చుకదా? నీ విలాసాలు శృంగార గర్వము ఇప్పుడే చూపించవలెనా?

ఆ స్త్రీ తపించి నీ పాదాలొత్తుతూ ఉండగా, అతిశయించిన శోభలతో చిర్రుబుర్రులాడుతున్నావు. కానీ ఓ శ్రీవెంకటేశ్వరా! అంతలోనే కూడి పొందుచేసుకున్నావు. కానీ నీ నేర్పులన్నీ ఇప్పుడే ప్రదర్శించవలెనా?

## 319

**అవతారిక:** ఇంతుల విషయంలో స్వామికి నచ్చినట్లైతే వారి దోషాలు, చెడ్డతనాలు కూడా అన్నీ మంచిగానే కనిపిస్తాయంటూ అమ్మ పరిహాసం చేస్తూ మాట్లాడుతున్నది.

### శ్రీరాగం

ప. కానవచ్చె నాపెమీఁది కందువైన వలపులు
నానఁబెట్టి యివి యేమి నాకుఁ జూపేవయ్యా ॥పల్లవి॥

1. నీమనసు వచ్చితేను నేరములు నేరుపులే
వేమారు విన్నవించినా వినఁ జవులే
గామిడి సేఁతలైనాను కడుఁదరితీపులే
యే మేమి నవ్వులై నాను ఇచ్చకములే ॥కాన॥

2. కూటములు గలిగితే కొసరులెల్లా నింపులే
జూటరిగుంపెనలైనాను చుట్టరికమే
నీటుతోడిజంకెనలు నిండిన సంతోసాలే
చాటున గర్వములైనా సమ్మతింపులే ॥కాన॥

3. కైవసములై తేను కాఁగిలే నిధానము
వేవేలుపంతములు వినయములే
శ్రీ వేంకటేశ నన్నుఁ జిత్తగించి యేలితివి
చేవదేరేచెనకులు సింగారాలే ॥కాన॥

**అర్థములు:** ప. ఆపె= ఆమె, కందు= తపించు, నానబెట్టి= ఆలస్యముగా.

1. నేరము= తప్పు,దోషము, నేరుపు= నైపుణ్యము, వేమారు= వేయిసార్లు, విన్నవించు= వినతిచేయు, చవి= రుచి,సుఖము, కామిడి= చెడ్డ, సేత= పని, తరితీపు= అపేక్ష, ఇచ్చకము= ఇష్టము.
2. కూటము= బృందము, కొసరు= కోరిక, ఇంపు= ఇష్టము, జూటరి= నేర్పరి, గుంపెన= విజృంభణ, చుట్టరికము= బంధుత్వము, నీటు= శృంగారగర్వము, జంకెన= అదరవేయు, సమ్మతింపు= అంగీకారము.
3. కైవశము= అధీనము, కాగిలి= కౌగిలి, నిధనము= నివాసము, వేవేలు= వేలవేల, పంతము= పట్టుదల, వినయము= అణకువ, చిత్తగించి= సావధానముగా విని, చేవదేరె= సారవంతమగు, చెనకులు= స్పర్శలు, సింగారాలు= శోభలు.

**భావము:** ఓ స్వామీ! ఆమె మీద నున్న నీ ప్రేమాతిశయాలన్నీ స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఇవన్నీ తీరిగ్గా, నిదానంగా నాకు చూపిస్తున్నావయ్యా!

నీ మనసుకు నచ్చినట్లైతే దోషాలుగూడా నైపుణ్యాలవుతాయి. వెయ్యిసార్లు వినతి చేసినా వినసొంపుగానే ఉంటాయి. చెడ్డ పనులైనా సరే నీకు మంచి అపేక్షగా ఉంటాయి. ఒకవేళ పరిహాసంగా నవ్వుతూ మాట్లాడినా నీకు ప్రియభాషణలాగే ఉంటుంది.

బృందాల్లో కలిసినప్పుడు కోరికలన్నీ మంచి పసందుగా ఉంటాయి. నేర్పరులైన వారి విజృంభణ కూడా నీకు బంధుత్వంగా అనిపిస్తుంది. శృంగారగర్వంతో నిన్ను అదరించినా సరే! నీకవే సంతోషాన్నిస్తాయి. చాటుమాటున వాళ్ళు గర్వం ప్రదర్శించినా నీకు అన్నీ అంగీకార యోగ్యంగానే ఉంటాయి.

నీ చేతికి చిక్కి వశమైతే చాలు నీకౌగిలే వారికి నిజ నివాసమనిపించేట్లు చేస్తావు. అలాగే వాళ్ళు వేలవేల సార్లు పంతాలకు పోయినా అవన్నీ నీకు  సమ్మతమే అవుతాయి. శ్రీవేంకటేశ్వరా! నన్ను సావధానంగా విని ఏలుకొన్నావు. నీ స్పర్శలు, శోభలు శృతిమించి సారవంతమైనవి.

## 320

**అవతారిక:** అలమేలుమంగా శ్రీనివాసులు ఒద్దికై దగ్గరైన వేళ చెలులు వారిద్దరినీ సమీపించి వారి అలంకారాలను, గుణగణాలను పొగడడానికి అనుమతినివ్వమని చమత్కారంగా వేడుకొంటున్నారు.

### పాడి

ప. చెప్పరయ్య మీరిద్దరు చేకొని బుద్ధులు మాకు
యిప్పుడే చెలుల మెల్లా నిఁక మెచ్చవచ్చునా ॥పల్లవి॥

1. మంతనాన మీరిద్దరు మాటలాడుకొంటిరట
చెంతల మా కవేమైనాఁ జెప్పవచ్చునా
కాంతులతో మీ మొగాలు కళలురేగి వున్నవి
అంతరంగ మదేమైనా నడుగఁగవచ్చునా ॥చెప్ప॥

2. చిమ్మిరేఁగి మీరు మీరే సింగారించుకొంటిరట
సొమ్ములు మాకవేమైనాఁ జూడఁగవచ్చునా
చిమ్ముఁజెముటలు మీకుఁజెక్కులు నిండుకున్నవి
సమ్మతించి మా కిఁక సంతోసించవచ్చునా ॥చెప్ప॥

3. వావులు చెప్పక మీరు వరుసఁ గూడితిరట
కావించి మీ గుణాలు పొగడవచ్చునా
యీవేళ శ్రీ వేంకటేశ ఇట్టె మమ్ము నేలితిరి
వేవేలు మీకీర్తులెల్లా వెలఇంచవచ్చునా ॥చెప్ప॥

**అర్థములు:** ప. చేకొను= గ్రహించి,ఆదరించి, బుద్ధులు= మంచిచెడు, సత్ప్రవర్తన మెఱిగించు,  మెచ్చు= పొగడు.

1. మంతనము= ఏకాంతము,రహస్యము, చెంతల= దగ్గర, మాకు-అవేమైనా= మాకు ఆ విషయాలేమైనా, కాంతులు= కోరికలు, కళరేగు= శోభించి, అంతరంగము= మనసులోని.
2. చిమ్మిరేగు= విజృంభించి,అతిశయముగా, సింగారించు= అలంకరించు, సొమ్ములు= ఆధీనమైన,ఆభరణము, జూడవచ్చు= చూడగలుగు, చిమ్ము= పెల్లుబుకు, చెక్కులు= చెక్కిళ్ళు, నిండుకొను= పూర్తిగా నిండు, సమ్మతించి= అంగీకరించి.
3. వావులు= బంధుత్వము, వరుస= పద్ధతి, కావించి= పాటించి, పొగడు= మెచ్చుకొను, వేవేలు= వేలసార్లు, కీర్తి= యశస్సు, వెలయించు= ప్రకటించు.

**భావము:** మీరిద్దరూ చెలులమైన మమ్ము సమాదరించి, మంచి చెడులను తెలియజేసి వివరించండి. ఇప్పుడిక మేము మీ యిద్దరి

గుణగణములు ప్రశంసించవచ్చునా?

ఏకాంతంగా రహస్యంగా మీ యిద్దరూ ఏవేవో మాట్లాడుకున్నారట. మీ చెంత ఉన్న మాకు అవిశేషాలేమైనా చెప్పవచ్చునా? మీ యిద్దరి ముఖారవిందాలు గొప్ప శోభతో కూడి ఉన్నవి. దానికి కారణమేమిటో మీ అంతరంగమేమిటో మేము తెలుసుకొనవచ్చునా?

మీరు విజృంభించిన అతిశయముతో అలంకారాలు చేసుకొన్నారట. మీరు ధరించిన ఆభరణాలను మేమేమైనా కాస్తా చూడవచ్చునా? చెమటలు ధారాపాతమై మీ చెక్కిళ్ళమీద పారుతున్నవి. అంగీకరించి మాకు ఇక ఆ విషయాలేమైనా సంతోషముతో తెలియజేస్తారా?

బంధుత్వం ఏమీ చెప్పకుండానే మీ యిద్దరూ దగ్గరై కూడినారట. పాటించి మీ గుణగణాలను మేము ప్రశంసించవచ్చునా? ఈరోజు ఓ శ్రీవేంకటేశ్వరా! మమ్ము కూడి ఏలుకున్నావు. మీ కీర్తి యశస్సులను వేవేలుగా మేము ప్రకటించవచ్చునా?

**విశేషము:** ఈ కీర్తనలో అన్నమయ్య "వెల ఇంచ వచ్చునా?" అనే ప్రయోగం చేశాడు. కానీ ఇక్కడ "వెలయించవచ్చునా?" అని ఉండాలి. ఇక్కడ 'యాడాగమమూ, సంధి కలుగలేదు. ఇది రాగిరేకులు చెక్కినవారి అక్షర దోషం అనుకోవలసి యున్నది.

## 321

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ గతంలో జరిగిన సంఘటన యేదో దృష్టిలో ఉంచుకొని స్వామితో అన్యాపదేశంగా మాట్లాడుతున్నది.

### ఆహిరి

ప. సంతోసించుకొనుటే చాలదా సారెసారెకు
చింతించి తలచుకొనే సిగ్గరికానికి ॥పల్లవి॥

1. చూపునఁదప్పక నీవు చూచినదే చాలదా
పూఁపు దెలిసినయట్టి పురుషునికి
కాఁపురాలు నీవు తారుకాణించవలెనా
యేపున నీగుణమెల్లా నెఱిఁగినవానికి ॥సంతో॥

2. నలువున కెలవుల నవ్వినదే చాలదా
చెలరేఁగి వాసిగలచెలువునికి
మలసి యేతువులెత్తి మాటలాడవలెనా
వలచి నిన్నుఁ బాయక వసమైనవానికి ॥సంతో॥

3. మునుకొని చెతులెత్తి మొక్కినదే చాలదా
నిను నింతసేసినట్టినేరుపరికి
పెనఁగవలెనా ప్రియానఁ గాఁగిట నీతో
యెనసిన శ్రీ వేంకటేశ్వరునికి ॥సంతో॥

**అర్థములు:** ప.సారె సారె= మాటిమాటికి, చింతించు= బాధపడు, సిగ్గరికము= సిగ్గుపడే తత్వము.

1. తప్పక= తదేకముగా, చాలదా= సరిపోదా, పూపు= పూనిక, కాపురాలు= సంసారము, తారుకాణించు= దృష్టాంతము, ఏపు= బాధ, గుణము= స్వభావము.
2. నలువున= సామర్థ్యము, కెలవు= అనురాగము, వాసి= ఆధిక్యత, చెలువుడు= ప్రియుడు, మలయు= ఉద్రేకము, యేతువు= కారణము, పాయక= విడువక, వసము= వశము.
3. మునుకొను= ప్రయత్నించు, నేరుపరి= నేర్పరి, పెనగు= చుట్టుకొను, ప్రియాన= ప్రేమతో, కాగిట= కౌగిట, ఎనయు= పొందు.

**భావము:** ఓ స్వామీ! మాటిమాటికి తలచుకొని సిగ్గులు చిందించే బదులుగా సంతోషిస్తే సరిపోతుందికదా!

పూనిక తెలిసిన మగవానిగా నువ్వు నావైపు చూచే తదేకమైన చూపే చాలదా? మనసులో నీ స్వభావం పూర్తిగా ఎరిగిన వారికి, సంసారము గురించి నువ్వు మరలా దృష్టాంతాలు చెప్పవలెనా స్వామీ!

విజృంభించి, ఆధిక్యుడవైన ప్రియునిగా ఆసక్తి, అనురాగం చూపిస్తూ నీవు నవ్విన నవ్వులే చాలుగదా! స్వామీ నిన్ను ప్రేమించి వీడకుండా నీకు పూర్తిగ వశమై వున్న నాకు ఉద్రేకపడి కారణాలన్నీ చూపిస్తూ మాట్లాడవలెనా స్వామీ!

నిన్ను ఇంతగా ఆకట్టుకొన్న నేర్పరియైన ప్రియురాలికి, ప్రయత్నించి చేతులెత్తి మ్రొక్కితే చాలదా స్వామీ! వికాసముతో ఉన్న శ్రీవేంకటేశ్వరా! నీతో ప్రేమానురాగాలతో కౌగిటిలో చుట్టుకొనవలెనా!

## 322

**అవతారిక:** స్వామిని ఆరళ్ళకు గురిచేస్తున్న అమ్మతో చెలులు మాట్లాడుతున్న సన్నివేశం.

### గౌళ

ప. వద్దే మామాట విన వచ్చేవో రావో
యిద్దరి మీ పొందులకు నింత చెల్లునా ॥పల్లవి॥

1. పట్టినదే వ్రతమా పడఁతి నీ వతనితో
వొట్టువెట్టుకొంటివట వొక్కటి గాదు
వట్టినేరా లెవ్వరికి వచ్చుఁ బోవు నొకవేళ
యిట్టె పాయపువారి కంత చెల్లునా ॥వద్దే॥

2. అత్తి సేసినదే చేఁతా అంగన నిన్ను నతఁడు
పొత్తుకు రమ్మనఁగాను పో ననేవు
వొత్తి విన్నవించనేల వోడలు బండ్ల వచ్చు
యెత్తయినదొరలకు నింత చెల్లునా ॥వద్దే॥

3. ఆడినదే మాటా అదె శ్రీ వేంకటపతి
కూడే నే ననఁగాను గొణఁగేవు
యీడుజోడై యింతలోనే యిద్దరూ నొకటైతిరి
యేడనైనా నీదేకాక యంత చెల్లునా ॥వద్దే॥

**అర్థములు:** ప. వద్దే= వద్దు వద్దు, పొందులు= కలయికలు, చెల్లునా= సరిపోవునా

1. పట్టినదే వ్రతమా= నీవు పట్టిన పట్టే పట్టా?, వట్టినేరాలు= సాధారణమైన తప్పులు, వచ్చుబోవు= రావు పోవు, పాయపు= వయసులో ఉన్న, చెల్లునా= సరిపోతుందా.

2 అత్తి= స్త్రీ వాచకము, చేత= పని, అంగన= స్త్రీ, పొత్తు= స్నేహము,కలయిక, వత్తి= నొక్కి, విన్నవించు= వినతిచేయు, ఓడలు బండ్లవచ్చు= పరిస్థితులు తారుమారవవచ్చు, యెత్తయిన= ఎంతయినప్పటికి, దొర= ప్రభువు.

3. ఆడినది= చెప్పినది, కూడె= కలిసె, గొణుగు= వినబడీ వినపడనట్లు మాట్లాడు, ఈడుజోడు= సరైన జంట, ఏడనైనా= ఎక్కడైనా, నీదే కాక= నీమాటే కాకుండా, యంత చెల్లునా= వేరే విధంగా ఉంటుందా.

**భావము:** అమ్మా! మా మాట వింటావో వినవో తెలియదు గానీ, మీ యిద్దరి కలయిక విషయంలో మాత్రం ఈవిధంగా నువ్వు ఆరళ్ళ పెట్టడం తగునా?

అవునూ! నువ్వు పట్టినదే వ్రతమన్నట్టు మాట్లాడుతున్నావు. నీవా స్వామితో ఏవో ఒట్లు పెట్టుకున్నావట! నిజమేనా? నీతో ఒకటి కాదులే చాలా ఉన్నాయి. చిన్న చిన్న తప్పులెవరికి రావు పోవు చెప్పు? అయినా వయసులో ఉన్నవారికీవిధంగా చేయడం

చెల్లుతుందా?

ఓ లలనా! నువ్వు చేసినదే సరైన నిర్ణయం అనుకుంటున్నావా? ఓ అంగనా! నిన్ను స్వామి పొత్తుకు రమ్మని పిలిస్తే వెళ్ళనని అన్నావట. మరలా నొక్కి నొక్కి చెప్పాల్సిన అవసరం ఉందా? పరిస్థితులు తారుమారయి ఓడలు బండ్లు బండ్లు ఓడలు అవవచ్చు. ఇంత పట్టుదలలలు తగవు. అధికుడైన ఆ స్వామికి నీవు ఇంత చేయడం చెల్లునా?

నీవు ఆడినదే మాటా? అదుగో శ్రీవేంకటేశ్వరుడు నిన్ను చేరి కూడుతాననగానే గొణుక్కుంటావట. మీరిద్దరూ ఈనాడు ఈడుజోడుగా ముచ్చటగా ఒకటయ్యారు. అమ్మా! ఎక్కడైనా నీమాటే చెల్లుతుందని ఋజువైనది. అయినా ఇలా చేయడం సబబు కాదు.

**విశేషము:** ఈ కీర్తనలో అన్నమయ్య "అత్తి" అని ఒక పదం ఉపయోగించాడు. దీనిని గూర్చి కొంత విచార మవసరము. "అత్తి, కై, అళ్, అచ్చి, అమ్మ, అది" అనునవి ద్రావిడభాషలో స్త్రీ వాచకములనియు ఆయా పదాలు ద్రావిడభాషల యందు పదముల తుదిని జేర్పంబడి స్త్రీ వాచక ప్రత్యయములుగా భిన్నరూపములతో నేడు గనుపట్టుచున్న వనుట సిద్ధాంతము. ఇందలి 'అత్తి, అచ్చి, అమ్మ" యను శబ్దములు ద్రావిడములా, తద్భవములా, తత్సమములా యను విచారణ మొకటి గలదు. ఆ విచారణము ప్రక్కకు బెడితే, అవి యా భాషలలో నున్నవే యనుటకు, స్త్రీ వాచకము లనుట నిర్వివాదము గదా! "అత్తి, అత్తికా, అత్తా, అక్కా.: శబ్దములు సంస్కృత నిఘంటువులలో నీయబడినవి. అమ్మ–అంబా శబ్దభవమని చెప్పుచున్నారు. కాని యివి ద్రావిడము లేనని నా నిశ్చితాభిప్రాయము.

## 323

**అవతారిక:** అమ్మ స్వామిని గూడినప్పుడు చేస్తున్న అల్లరిపనులను చెలులు విమర్శిస్తూ ఇక చాలు నీ విలాసాలని వివరిస్తున్నారు.

### శంకరాభరణం

ప. ఆడకే వచ్చెఁ బోవే అంతే చాలు
యీడుజోడుఁ జెప్పకువే ఇంతే చాలు ॥పల్లవి॥

1. కన్నులనే చూచితివి కాఁకలు చల్లితివి
అన్నిటా నేమీ ననకు మంతే చాలు
సన్నల నవ్వితివి చాయలు మొక్కితివి
యెన్నికలు సరివచ్చె నింతే చాలు ॥ఆడకే॥

2. బొమ్మల జింకించితివి పొద్దూఁ గడపితివి
అమ్మకువే వావులు నేఁ డంతే చాలు
చిమ్మితివి మాఁటలు సేసితివి నీఁటులు
యెమ్మె లింకఁ గొలుపవు యింతే చాలు ॥ఆడకే॥

3. దగ్గరికి వచ్చితి దవ్వుల మెచ్చితివి
అగ్గలమాయఁ జెమట అంతే చాలు
బగ్గన శ్రీ వేంకటాద్రిపతి నేఁడు కూడె నిన్ను
యెగ్గుసిగ్గు లిఁకనేలే యింతే చాలు ॥ఆడకే॥

**అర్థములు:** ప. ఈడుజోడు= సరిసమానం, జెప్పకువే= జెప్పవద్దు.

1 .కాక= తాపము, చల్లు= విరజిమ్ము, సన్నలు= సైగలు, చాయలు= శోభ, ఎన్నిక= ఎన్నుకోవడం, సరివచ్చె= సరిపోవు.

2. బొమ్మలు= కనుబొమ్మలు, జంకించు= అదరవేయు, వావి= బంధుత్వము, చిమ్ము= వ్యాపింపజేయు, నీటు= శృంగారగర్వము, ఎమ్మె= విలాసము, కొలుపవు= అంగీకారం కాదు.

3. దవ్వు= దూరము, అగ్గలు= వేడి, బగ్గన= ఎక్కువగా, ఎగ్గుసిగ్గు= సంకోచము మరియూ దోషము.

**భావము:** అక్కడకే బోవే! అక్కడికే వచ్చేను. ఈడూజోడూ సమానత్వాలు ఇవన్నీ చెప్పవద్దు ఇంక నీవు చెప్పేవన్నీ చాలు చాలు.

కండ్లతో చూసినంత మాత్రానే అతనిలో తాపం కలిగించావు. అన్నిటికీ ఏమీ అనవద్దు ఈమాత్రం చాలు. సైగలుచేసి చిరునవ్వులు నవ్వి శోభతో నమస్కరించావు. మీ ఇద్దరి ఎంపికలు సరిపోయినవి ఇక చాలు.

కనుబొమ్మలు అదరవేస్తూ పగలు రాత్రీ గడిపావు. ఇక నీ బంధుత్వాన్ని యిలా వీధులపాలు చేయకు. ఈరోజుకిది చాలు. వ్యాపించి మాటలను స్వామిమీద రువ్వి శృంగార గర్వంతో ప్రవర్తించావు. విలాసాల వలన ఏమీ ప్రయోజనం లేదు. ఇంతే చాలు.

ఒక్కోసారి దగ్గరకు వస్తావు మరలా దూరంగా వెళ్తావు. తద్వారా స్వామికి వేడిమి కలిగించి చెమటలతో నిండేట్టు చేస్తావు. ఇక చాలు. అతిశయించి శ్రీవేంకటేశ్వరుడు నిన్ను చేరుకున్నాడు. ఇంకా సిగ్గులు సంకోచాలు దోషాలెంచడం ఎందుకు? ఇంతే చాలు.

## 324

**అవతారిక:** స్వామి చేసే అకార్యాలు మితిమీరినా అమ్మ శాంతం వహించి, ఈ పద్ధతులన్నీ తగవని సర్ది చెప్తున్నది.

### నాదరామక్రియ

ప. ఈరు దియ్యఁ బేను వచ్చు నేమనఁగా నెట్లవునో
వూరకుండుటే చాలు వొద్దు సుమ్మీ బాసలు ॥పల్లవి॥

1. అడ్డమాడలేకపో అట్టె నేను నుస్సురంటి
వొడ్డారించఁగలేకే వొగి నవ్వితి
వెడ్డువెట్టి నన్నునేల వెడనిష్ఠూరిఁ జేసేవు
వొడ్డుకున్నాఁబోనీవు వోపఁజుమ్మీ యింతకు ॥ఈరు॥

2. కోపగించఁ జాలకేపో కోరి వద్ద నిలుచుంటి
రాపుసేయఁజాలకేపో రమ్మంటిని
యీపనికిఁగానే నీవు యేల పచ్చిసేసేవు
దాఁపినా విచ్చివేసేవు తప్పఁ జుమ్మీ నీకు ॥ఈరు॥

3. వేసరించఁజాలకే పో వేగమే కూడితి నిన్ను
ఆస చెరుచఁగలేకే అంకె నుంటిని
యీసరికి శ్రీ వేంకటేశ నన్ను నేలితివి
వాసికెక్కె రతులెల్లా వలెఁజుమ్మీ యిందుకు ॥ఈరు॥

**అర్థములు:** ప. ఈరు= పేనుగ్రుడ్లు, దియ్య= తీస్తే, పేను= పేలు, సుమ్మీ= సుమా, బాస= ప్రమాణము.

1. అడ్డమాడు= కాదు కూడదని చెప్పు, ఉస్సురను= మిక్కిలి శ్రమతో కూడిన నిట్టూర్పు, ఒడ్డరించు= ప్రతిఘటించు, వొగి= క్రమముగా, వెడ్డువెట్టు= వంచించు, నిష్ఠూరి= పరుషవచనములు పలుకువారు, ఒడ్డుకొను= తప్పుకొను, ఓపు= ఓర్చు.
2. రాపు= ఒరిపిడి,రాచుకొను, పచ్చిచేయు= చెయ్యకూడని పని చేయు, దాపు= దాచిపెట్టినా, విచ్చి= తెరచు.
3. వేసరించు= శ్రమపెట్టు, చెరుచు= చెడగొట్టు, అంకె= వశము, ఈసరికి= ఈసమయానికి, వాసికెక్కు= ప్రసిద్ధి యగు.

**భావము:** ఓ స్వామీ! ఏదో సామెత చెప్పినట్లు ఈపి తీయబోతే పేలు బయటకు వచ్చిన రీతిగా యేమవుతుందో తెలియరాకున్నది. తమరు కాస్తా మాట్లాడకుండా ఊరకే ఉంటే చాలు. మీరు బాసలు అవీ యేమీ చెయ్యవద్దు సుమా!

నీకు అన్నిటికి అడ్డం చెప్పలేకనే ఈ విధంగా దీర్ఘ నిట్టూర్పులు విడుస్తున్నాను. ప్రతిఘటించలేకనే నవ్వులు చిందిస్తున్నాను. ఈ విధంగా నన్ను వంచించి ఎందుకు పరుష వచనాలు పలికే విధంగా చేస్తావు. తప్పుకున్నప్పటికి పోనీయకుండా అడ్డుకుంటున్నావు సుమా! ఇది తగునా?

చీటికి మాటికి నీ మీద కోపం వహించలేకే ఈవిధంగా కోరి నీ వద్దకొచ్చి నిలబడ్డాను. ఒత్తిళ్ళు రాపిళ్ళు చేయలేకే నిన్ను రమ్మని ఆహ్వానించాను. వచ్చినవాడవు ఊరకుండక ఈ మరుగులేని పనులన్నీ బహిరంగంగా చేస్తావు. దాచినా కూడా తెరచి గుట్టు రట్టు చేస్తుంటావు సుమా! ఇది తగునా?

నిన్ను శ్రమపెట్టడం ఇష్టంలేకనే ఈవిధంగా శీఘ్రంగా వచ్చి కలిసితిని. నీ ఆశలు అడియాసలు చెయ్యడం మనసుగాక నీ వశమయ్యాను. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ సమయానికి వచ్చి నన్నేలుకున్నావు. రతిక్రీడా విశేషాలన్నీ ప్రసిద్ధికెక్కిన మాట సత్యమే గదా సుమ్మీ!

## 325

**అవతారిక:** అమ్మ  స్వామి విషయములో విచారాన్ని వ్యక్తం చేస్తుండగా, చెలులు ఆమెకు ఓదార్పు పలుకుతున్నారు.

### ఆహిరి

ప. గోరఁబొయ్యే పనికిఁగా గొడ్డలేఁటికి
ఆరయ నాతఁడే చెప్పీ నతివకు బుద్దులు ॥పల్లవి॥

1. చిత్తములోపలిచింత చెక్కుచేతఁ గానవచ్చె
అత్తి మాటాడించకురే అంగన నంత-
బత్తిగలవారమైతే పతిఁ దోడితెత్త మిట్టె
వొత్తి యాకె నేమన్న వొప్పగించీఁ దనువు ॥గోర॥

2. నిండినమైవిరహము నిట్టూర్పులను మించె-
నండనే నవ్వించకురే ఆయాలు రేఁగీ
వుండరే చుట్టాలమైతే నొక్కటిసేత మిద్దరి
చండిపెట్టి పిలిచితే చలపట్టీ నలుక ॥గోర॥

3. కూడేటితమకములు కొనచూపులందుఁ దేరె
తోడనే యుడుగకువే తొలఁగీ సిగ్గు
యీడకే శ్రీ వేంకటేశుఁ డేతెంచి కలసె నేఁడు
వాడికతో సతి మీరవలపించె నతని ॥గోర॥

**అర్థములు:** ప. గోరబొయ్యే= గోటితో పోయే, గొడ్డలేటికి= గొడ్డలి ఎందుకు, ఆరయ= విచారించు, అతివ= స్త్రీ, బుద్ధులు= మంచి మాటలు.

1. చిత్తము= మనసు, చింత= విచారము, చెక్కు= చెక్కిలి, అత్తి= ఆమెను, అంగన= స్త్రీ, బత్తి= భక్తి, పతి= భర్త, తొడితెత్తము= తోడుకొని వచ్చెదము, వత్తి= బలముగా నొక్కి, ఆకె= ఆమె, ఒప్పగించు= అప్పగించు, తనువు= శరీరము.
2. నిండిన= పరిపూర్ణమగు, మై= దేహము, విరహము= ఎడబాటు, ఆయాలు= జీవస్థానములు, ఒక్కటిసేత= ఒక్కటిగా, చండిపెట్టు= మొండికెత్తు, చలపట్టు= కోపగించు.
3. కూడేటి= కలసినప్పటి, తమకము= మోహము, కొనచూపులు= కంటిచివరి చూపు, ఏతెంచి= విచ్చేసి, కలిసె= కూడె, వాడిక= అలవాటు, సతి= భార్య, మీర= మించి, వలపించు= ప్రేమించు.

**భావము:** గోటితో పోయేపనికి గొడ్డలి వాడడం ఎందుకు? విచారించి చూస్తే ఆ స్వామే ఈవిడకు చీవాట్లు పెట్టి మంచి బుద్ధులు చెప్తాడు.

ఆమె చెక్కిలిపై ఉన్న చేయి చూస్తే, ఆమె మనసులో ఉన్న విచారము కానవస్తున్నది.ఆమెను అట్టే మాట్లాడించకండి. భక్తిగలవారమైతే పతిని ఇట్టే తోడి తీసుకుని వచ్చెదము. ఆమెను బలవంతముజేసినచో ఆమె తన తనువును అర్పిస్తుంది.

ఆమె పరిపూర్ణమైన దేహ విరహబాధతో నిట్టూర్పులు విడుస్తూ ఉన్నది. ఆమె చెంత చేరి నవ్వించకండి జీవస్థానములు పెట్రేగుచున్నవి. మనము బంధువులమైతే ఒక్కటిగా ఉండవలెనుగదా! యిలా మొండికెత్తి పిలిస్తే కోపంబూని అలుక వహిస్తుంది.

జత కలియనున్న మోహములు కంటి చూపులందు కనిపించుచున్నవి. కూడా చేరి అడిగినట్లైతే సిగ్గు తొలగిపోతుంది. ఇక్కడకే శ్రీవేంకటేశ్వరుడు విచ్చేసి ఈనాడు కలిసినాడు. అలవాటైన ప్రేమాతిశయంతో అమ్మ స్వామిని అతిశయించి సుముఖత చూపిస్తున్నది.

## 326

**అవతారిక:** అన్నీ శుభఘడియలు వచ్చాయనీ, స్వామిని కూడి సుఖించమని చెలులు అమ్మకు ఉద్బోధిస్తున్నారు.

## శుద్ధవసంతం

ప. వడి నీ జవ్వనానకు వసంతకాలము వచ్చె
అడియాస లిద్దరికి నాయములు సోఁకెనే ॥పల్లవి॥

1. ముదితచెమటలనే ముంగారులవె ముంచె
పెదవులఁ జిగిరించెఁ బెక్కులాగుల
పొదలుఁగుచములనే పూఁపలాయఁ బిందెలాయ
యెదుటనే పతి వున్నాఁ డిఁకనేమే చెలియా ॥వడి॥

2. కోమలి నీ చూపులనే కొడినాగెఁ గోరికలు
వాములాయఁ బులకలే వలపు పండి
వాముదేరీ మేనిమీఁదిననవిరివాసనలు
ఆమనివిభుఁడు చేరెనలుక లింకేలే ॥వడి॥

3. సతి నీ మోహానఁ దీగెసాగె బాహులతలు
సతమాయ నిట్టూర్పు చల్లగాలి
ఇతవై శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నిన్నుఁ గూడె
మతిలోఁ బాయకున్నాఁడు మంచిదాయఁ గదవే ॥వడి॥

**అర్థములు:** ప. వడి= వేగము, జవ్వనము= యౌవనము, అడియాస= తీరని కోరిక, ఆయములు= జీవస్థానములు, సోకు= తాకు.

1. ముదిత= స్త్రీ, ముంగారు= ముందు కారుట, ముంచు= అతిక్రమించు,దాటు, చిగురించు= ఆసలుకొనబారు, పెక్కులాగు= అనేకవిధములు, పొదలు= వర్ధిల్లు, పూపలు= లేతపూమొగ్గలు, బిందెలు= పాత్ర విశేషము.
2. కోమలి= స్త్రీ, కొడి= దీపశిఖ, వాములు= పెద్ద గడ్డి మోపులు, పులకలు= గగుర్పాటు, వాముదేరు= కుప్పగానగు, మేను= శరీరము, విరివాసనలు= పువ్వుల సువాసన, ఆమనివిభుడు= వసంత కాల భర్త, చేరె= చేరుకొనెను, అలుక= కోపము.
3. తీగసాగు= వర్ధిల్లు, బాహులతలు= తీవలవంటి చేతులు, సతము= శాశ్వతము, (హి)ఇతవు= ఇష్టము, కూడె= కలిసెను, మతి= మనసు, పాయక= వీడక, మంచిదాయ= అన్నీ మంచిగా జరుగు.

**భావము:** చెలీ! నీ యౌవనానికి శీఘ్రముగా వసంతకాలం వచ్చింది. తీరని కోరికలన్నీ ఇపుడు మీ యిరువురి జీవస్థానములను తాకి హాయిని కలిగిస్తున్నది.

రమణి చెమటలు ముందు భాగాన కారి ముంచుతున్నవి. పెదవులు బహువిధములుగా ఆశలతో కొనబారుతున్నవి. వర్ధిల్లుతున్న వక్షోజములు లేతపూమొగ్గలై బిందెలవుతున్నవి. భర్త నీ ఎదుటనే ఉన్నాడు చెలీ దిగులెందుకు?

ఓ చెలీ! నీ చూపులనే దీపశిఖవంటి జ్వలిస్తున్న కోరికలు వాములంత పెద్దవై, వలపులు పండి, గగుర్పాటును కలిగిస్తున్నవి. శరీరమునుండి వస్తున్న పూల సువాసనలు కుప్పలై యున్నవి. వసంత విభుడు నిన్ను చేరుకున్నాడులే! ఇంక అలుకలెందుకే చెలీ!

ఓ లలనా! నీ మోముపై స్వామి లతలవంటి బాహువులు తీగలై ప్రాకుతున్నవి. చల్లగాలులవంటి నిట్టూర్పులు శాశ్వతమైనవి. శ్రీవేంకటేశ్వరుడు ఇష్టుడై నిన్ను చేరుకుని కూడి నీ అంతరంగంలో వీడకుండా యున్నాడు. అన్నీ నీకు శుభ సమయములే సిద్ధించినవి.

## 327

**అవతారిక:** స్వామి అమ్మకు చందనము, కర్పూరము, కమలములు బహుమతులుగా పంపడం పట్ల అమ్మ ఆశ్చర్యం వ్యక్తం చేస్తూ చెలులతో మాట్లాడుతున్నది.

### శ్రీరాగం

ప. అన్నియుఁ జేసినఫల మదియె మాకు
విన్నపము లిందుమీఁద వేవేలు నేఁటికి ॥పల్లవి॥

1. కప్పుర మంపఁగనేలే కడమా నాకిది తొల్లి
కప్పుర గందినవుట కానఁడా తాను
కప్పురముపేర నుండి కాఁకసేసే వెరబొమ్మఁ
జిప్పిలి మమ్మేపకుండాఁ జేయుమనవే ॥అన్నియు॥

2. చందన మే లంపెనే సహజాన నేఁ దొల్లి
చందనగందినవుట చాటువే కాదా
చందనపుఁగొండఁ బుట్టి చల్లజంపు దిప్పకాయ
అంది పచ్చిరేఁచకుండా నడ్డపెట్టు మనవే ॥అన్నియు॥

3. కమలము లే లంపెఁ గానుకగా నేఁ దొల్లి
కమలగందినవుట కలదేకదే
కమలాక్షుఁడైన శ్రీవేంకటపతి దానె నేఁడు
అమరఁగఁ గూడె నన్ను నండ నుండుమనవే ॥అన్నియు॥

**అర్థములు:** ప. ఫలము= ప్రయోజనము, విన్నపము= వినతి, వేవేలు= వేలకు వేలు.

1. కప్పురము= కర్పూరము, కడమ= కొరత, తొల్లి= పూర్వము, కప్పురగంది= కర్పూర సువాసనవంటి గంధముగల స్త్రీ, కానడా= చూడడా, కాక= కోపము, వెర= ఆశ్చర్యము, చిప్పిలు= ఉబికివచ్చు, ఏపు= బాధ.
2. చందనము= గంధము, అంపె= పంపు, సహజము= స్వభావసిద్ధము, చందనగంధి= చందనపు వాసనవంటి వాసనగల స్త్రీ, చాటువు= ప్రియమైనమాట, చల్లజంపు= చల్లగా చంపు, దిప్పకాయ= గడుసరి, పచ్చిరేచు= మరుగులేకుండా యుండు, అడ్డపెట్టు= అడ్డుగాబెట్టు.
3. కమలము= ఎర్రతామర, అంపె= పంపె, కానుక= బహుమతి, తొల్లి= ముందు, కమలగంది= తామరపువ్వు వాసన వంటి వాసన గల స్త్రీ, అవుట= అవడం, కమలాక్షుడు= తామరేకులవంటి నేత్రములుగలవాడు, అమరు= ఒప్పు, అండ= చెంత.

**భావము:** సర్వమును ఆచరించిన ప్రయోజనము మాకు కలిగినది. వేవేల విన్నపములు ఈ సందర్భంగా చేసుకుంటున్నాము.

స్వామి నాకు కర్పూరము పంపడమెందుకే! నాకేమైనా కొరతా చెప్పు? పూర్వమునుండే నేను కర్పూర సువాసనవంటి గంధముగల స్త్రీనని ఎరుగడా! కర్పూరము పేరుచెప్పి, ఆశ్చర్యకరంగా కోపించడం ఎందులకే! అతిశయించి మమ్ము బాధించకుండా కార్యం నెరపమని చెప్పవే!

స్వామి నాకు మంచిగంధాన్ని పంపడం ఎందుకే? సహజముగా నేను పూర్వమునుండే చందనపు వాసనవంటి వాసనగల స్త్రీననే ప్రియమైన మాటలను ఆయన ఎరుగడా? శ్రీగంధము పర్వతముపై బుట్టి చల్లగా యిరుకులో బెట్టే మాయగాడు, గడుసరి గదే స్వామి. మళ్ళీ ఆ విషయాలన్నీ తిరగదోడి మాట్లాడుతూ యిరుకున బెట్టకుండా ఏదో ఒకటి చేయమని చెప్పవే!

స్వామి నాకు బహుమతిగా తామరపుష్పాలను పంపడం ఎందుకే! నేను మొదటగానే తామరపువ్వు వాసన వంటి వాసన గల

స్త్రీననే విషయము ఉన్నదే కదా? తామరేకులవంటి నేత్రములుగల ఆ శ్రీవేంకటేశ్వరుడు తానే గదే! ఈనాడు అన్నివిధములా ఒప్పునట్లు నన్ను కూడినాడు కనుక నా యండనే ఉండమని చెప్పవే!

**విశేషము:** ఈ కీర్తనలో అన్నమయ్య అమ్మ అలమేలుమంగమ్మను కప్పురగంధిగా, చందనగంధిగా, కమలగంధిగాను, స్వామిని కమలాక్షునిగాను ఉపమానించడం విశేషం. ఇలాంటి లక్షణములున్న స్త్రీలను పద్మినీ జాతిస్త్రీలుగా పరిగణిస్తారు.

## 328

**అవతారిక:** స్వామి చీటికి మాటికి శృంగారం పేరుతో యిబ్బందులకు గురిచేస్తూ ఉండగా, ఇంత అతిచేయవద్దని, తనను శ్రమపెట్టవద్దని అమ్మ ప్రాధేయపడుతున్నది

### మేఁచబౌళి

ప. నాకొరకు నిన్ను నింత నలఁగించవలెనా
నీకు నితవైనంతే నే నొడఁబడితిరా ॥పల్లవి॥

1. వొలసీనొల్లనిచోట నొరసితే విసుపౌను
బలిమి సేయఁగఁ బోతే పసురౌను
తలఁచితే నీవు నాతలఁపులో నుందుదువు
చెలి నీ కూటమి నింతవేసరించనోపరా ॥నాకొరకు॥

2. సారె సారె బెనఁగితేఁ జప్పనౌను వుప్పనౌను
కూరిమిఁ గొనరఁబోతే కోపమౌను
చేరువ నీ రూపము నా చిత్తరువులో నున్నది
కోరి నీ వెంటఁదగిలి కోసి రాచనోపరా ॥నాకొరకు॥

3. తనిసినరతివేళ తగుమోవే మొగచాటు
అనఁగి పెనఁగఁబోతే నలపౌను
ఘనుఁడ శ్రీ వేంకటేశ కలసితి విటు నన్ను
మనసు లొక్కటాయ మారుమాట లోపరా ॥నాకొరకు॥

**అర్థములు:** ప. లగించు= శ్రమపెట్టు, (హి)ఇతవు= ప్రీతి, ఒడబడు= సమ్మతించు.

1. ఒలయు= కలయు, ఒల్లని= వూరకుండు, విసుపు= విసుగు, బలిమి= బలవంతము, పసురు= బాధ, కూటము= సమూహము, వేసరించు= బాధించు,శ్రమపెట్టు, ఓపు= భరించు.
2. సారె సారె= మాటిమాటికి, పెనగు= చుట్టుకొను, చప్పన= రుచించని, ఉప్పన= ఉబ్బరము, కూరిమి= స్నేహము, కొనరు= కోరుకున్నట్లైతే, చేరువ= చెంత, చిత్తరువు= చిత్రపటము, వెంటదగులు= అంటకాగు, కోసి= బాధించి, రాచు= ఒత్తిడిచేయు, ఓపను= భరించలేను.
3. తనసిన= కల్సిన, రతివేళ= శృంగారక్రీడాసమయము, మోవుచాటు= మొహము చాటువేయు,తప్పించుకొను, అనగిపెనగు= కలిసి చుట్టుకొను, అలపు= శ్రమ, ఘనుడు= గొప్పవాడు, ఒక్కటాయ= ఏకమగు, మారుమాట= వేరొకవిధంగా మాటలాడడం, ఓపరా= భరించలేనయ్యా.

**భావము:** స్వామీ! నా పొందుగోరే విషయంలో ఇంత శ్రమపెట్టవలెనా చెప్పండి. నీకు ప్రీతికలిగించే తీరులోనే నేను సమ్మతించి దగ్గరయ్యాను కదా!

యుక్తాయుక్త విచక్షణ లేకుండా పరీక్షిస్తుంటే విసుగుకలగదా! బలవంతము చేసినట్లైతే బాధ కలుగుతుంది. ఎప్పుడు నీ మదిలో నన్ను తలచుకుంటావో అప్పుడు నీ ఆలోచనల్లో ఉండేదానను. చెలి కలిసి ఉన్న సమయాలలో నీవింత ఒత్తిడికి గురిచేయడం

తగునా! నేను భరించలేను సుమా!

మాటిమాటికి అదేపనిగా నన్ను చుట్టుకుంటూ ఉంటే అది రుచీపచీ లేకుండా చప్పగాను ఉప్పగాను ఉండి, నా స్నేహము కోరుకున్నట్లైతే కోపం వస్తుంది. చెంతనే నీ రూపం నా మనసులో చిత్రపటమువలె నిండియున్నది. కోరి కోరి నీవెంటే తిరుగుతూ రాసుకుంటూ పూసుకుంటూ ఉండలేను సుమా!

మోహముతో ప్రీతికాని సమయాలలో కలిసిన సమాయాలలో కలిసినట్లైతే ఈ ప్రేమ వెగటుగా తోస్తుంది. అలా అని చుట్టుకోవడానికి యత్నిస్తే శ్రమభారం మిగులుతుంది. గొప్పవాడైన శ్రీవేంకటేశ్వరా! ఈ తీరులో ఈ విధంగా నన్ను కూడినావు. మనమనసులన్నీ కలసి ఒక్కటయినాయి, ఇంక వేరుగా మాట్లాడడం నేను ఓర్చుకోలేనయ్యా స్వామీ!

## 329

**అవతారిక:** స్వామి పొందుకొరకై అమ్మపడే అగచాట్లను ఒక చెలి స్వామికి నివేదిస్తున్నది.

### తెలుఁగుఁగాంబోది

ప. ఇంక నెంత గాఁగలదో ఇఁతట నీవు రాకుంటే
లంకెఁబెట్టె ప్రాణములు లలన నీతోను ॥పల్లవి॥

1. మాటలు నాతో నాడు మనసు నీపై నుండు
చీటికిమాటికి నాతోఁ జెప్పినవే చెప్పును
కాటుకకన్నులు నీరాకకే యెదురుకోనుండు
కోటికిఁ బడగయెత్తెఁ గొమ్మ నీపై మోహము ॥ఇంక॥

2. వెలఁది నన్నీడ కంపి వెంటనే తానూ వచ్చు
యెలిమిఁ గానుక నీకు నిచ్చినవే ఇచ్చును
సొలసి నీవే నేఁగాఁజూచి భ్రమసి వెదకు
వలపు వెదలువెట్టీ వాడవాడఁ జెలియ ॥ఇంక॥

3. సెలవినే నవ్వు నవ్వు శిరసున నీకు మొక్కు
పొలయు నీ ముంగిటనే పొద్దువోకకు
అలరి శ్రీ వేంకటేశ అంగనఁ గూడితి విట్టె
చలిమి బలిమిఁ జూపె జవ్వని నీ యెడను ॥ఇంక॥

**అర్థములు:** ప. కాక= వేడిమి, లంకెబెట్టు= రెండింటిని ముడిపెట్టు, లలన= స్త్రీ.

1. ఆడు= మాట్లాడు, చీటికిమాటికి= మాటిమాటికి, ఎదురుకోనుండు= ఎదురుచూపులు చూచు, కోటికిపడగెత్తు = చాలా అధికమైన, కొమ్మ= స్త్రీ,మోహము.

2. వెలది= స్త్రీ, నన్నుంఈడకు= నన్ను ఇక్కడకు, ఎలమి= వికాసము, కానుక= బహుమతి, సొలయు= వైరస్యమందు, నీవేనేగా= నువ్వే నేనుగా, భ్రమసి= భ్రాంతి, వలపు= ప్రేమ, వెద= వ్యధ,బాధ, వాడవాడ= ప్రతి వీధి.

3. సెలవినవ్వు= పెదవిమూలనవ్వు, శిరసు= తల, పొలయు= వ్యాపించు, ముంగిట= ముందు, పొద్దువోక= కాలక్షేపం, అలరి= సంతోషపడి, అంగన= స్త్రీ, చలిమి= చెలిమి,స్నేహము, బలిమి= ఆధిక్యత, జవ్వని= యౌవనములోనున్న స్త్రీ, ఎడ= స్థానము.

**భావము:** స్వామీ! ఏమని చెప్పవలెను? ఇంకా ఇలా ఎంత యున్నదోగదా! ఈ సమయానికి నువ్వు రాకుండినట్లైతే ఆ అమ్మయొక్క ప్రాణములు నీతోడి ముడిపెట్టినట్లయ్యెను.

అమ్మ మాటలు మాత్రం నాతో మాట్లాడుతూ మనసు మాత్రం నీపై నిలిపియున్నది. మాటి మాటికి అవేమాటలు అనేకసార్లు

చెప్తూ ఉన్నది. ఆ కాటుక కన్నులు నీకోసమే సదా ఎదురుచూపులు చూస్తుంటాయి. ఆ అమ్మ ప్రేమ నీపై కోటికి పడగలెత్తినంత అధికమై నిలిచి ఉన్నది.

స్వామీ! నన్ను నీ కడకు పంపి, వెంటనే వెనుకగా తానూ వస్తున్నది. వికాసముతో తను కానుకలు ఇచ్చినవే మళ్ళీ మళ్ళీ ఇస్తూ ఉంటుంది. ఏదో మత్తులో పరవశం చెందుతూ నన్ను నీవుగా భావించి వెదుకుతూ ఉంటాడు. ఆవిధమైన ప్రేమ మత్తులో వీధులలో తిరుగుతూ బాధలో ఉంటుంది.

పెదవి మూలగా నవ్వులు చిందిస్తూ నీకు తలెత్తి మ్రొక్కుతూ ఉంటుంది. నీ ముంగిట్లోనే కాలక్షేపమవక అటూ ఇటూ తిరుగుతూ ఉంటుంది. ఓ శ్రీవేంకటేశ్వరా! సంతసముతో ఆ లలనను కూడుకున్నావు. ఆ అమ్మ నీ పట్ల తన స్నేహాన్ని, ఆధిక్యతను చూపిస్తున్నది.

## 330

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామిపొందుకై ఎదురుచూపులు చూస్తున్నదని ఇక బయటకు రావలెనని ఒక చెలి స్వామికి నివేదిస్తున్నది.

### హిందోళం

ప. సరసములాడఁగానే సరి వయసు వోయీని
తెరమరఁ గిఁకనేల దిష్టించరాదా ॥పల్లవి॥

1. చిత్తరున వ్రాసినట్టుసిగ్గువడున్నది చెలి
యెత్తి కాఁగిలించుకోవు యింతగలదా
కొత్తమెరుఁగువలెను కొంకుదేరదు వెరచి
పొత్తుకుఁ బిలుచుకొని బుజ్జగించరాదా ॥సరసము॥

2. అంచవలెఁ బొలసీని అంగన నీ యెదుటను
మంచముమీఁదికిఁ దీసి మన్నించరాదా
అంచల పూఁగొమ్మవలె నాడనుండే జడసీని
మంచితనములు నేని మాటలాడరాదా ॥సరసము॥

3. మూసినముత్యమువలె మోనముతో నవ్వీని
సేసవెట్టి రతివిందు సేయఁగరాదా
ఆసల శ్రీవేంకటేశ అంగన నిన్నిటుగూడె
వాసికెక్కె మీ వలపు వద్దనుండరాదా ॥సరసము॥

**అర్థములు:** ప. సరసము= లలితము, వయసు= యౌవనము, వోయీని= సిద్ధమైతిని, దిష్టము= భాగ్యము.

1. చిత్తరు= చిత్రపటము, ఎత్తి= యత్నించి, కాగిలించు= కౌగలించు, కొత్తమెరుగు= నూతనకాంతి, కొంకు= భయపడు, వేరయు= ఆశ్చర్యము, పొత్తు= కలయిక, బుజ్జగించు= లాలించు,
2. అంచ= హంస, పొలయు= వ్యాపించు, అంగన= స్త్రీ, దీసి= స్వీకరించి, మన్నించు= లోగొను, అంచల= దగ్గర, పూగొమ్మ= పూలతో ఉన్న కొమ్మ, ఆడ= అక్కడ, జడసీని= భయపడుతున్నది, ఏని= ఏమైనా.
3. మూసిముత్యము= మూసినముత్యము, మోనము= మౌనము, నవ్వీని= నవ్వుచున్నది, సేస= అక్షతలు, రతివిందు= శృంగారక్రీడ, అంగన= స్త్రీ, వాసికెక్కు= ఖ్యాతిగాంచు.

**భావము:** స్వామీ! సరసములాడగానే సరిపోతుందా? ఇక్కడ వయసుతో సిద్ధమై ఉండగా, ఇంకా మీరు మొహం చాటువేయడమెందుకు? మీ దర్శన భాగ్యం కలిగించండి.

ఆ అమ్మ చిత్రపటం వ్రాసినట్టుగా నిలబడిపోయి సిగ్గుపడుచున్నది. ఆమెను యత్నించి కౌగిలిలోనికి తీసుకోవచ్చును కదా! ఏవో క్రొత్త క్రొంగొత్త కాంతులను చూసినవిధంగా భయముతో సంభ్రమాశ్చర్యాలతో నుండక ఆమెను నీ కలయికకు ఆహ్వానించి లాలించి బుజ్జగించి చేకొనరాదా!

అమ్మ ఒక రాజహంసవలె అతిశయిస్తూ నీ ఎదుట నిలుచున్నది. ఆమెను పట్టెమంచముపైకి పిలిచి లోగొనరాదా! దగ్గరలో ఉన్న ఒక పెద్ద పూబంతికొమ్మవలె రెపరెపలాడుతూ అక్కడనుండే భీతి చెందుతూ భయపడుతున్నది. కాస్త నీ మంచితనము చూపించి మాట్లాడి చేరదీయరాదా!

అమ్మ ఒక మూసిన ముత్యమువలె ప్రకాశిస్తూ మౌనంగా నవ్వుచున్నది. అక్షతలు వేసి శృంగారక్రీడతో విందుచేయరాదా! కోరికలతో ఉన్న ఓ శ్రీవేంకటేశ్వరా! ఆ యమ్మ నిన్నీవిధంగా కలసినది. మీ యిద్దరి ప్రేమానురాగాలు జగద్విఖ్యాతికెక్కినవి.

## 331

**అవతారిక:** స్వామి వారి మీది మోహంతో ఒక చెలి ఆగమనాన్ని, ఆ విశేషాలనూ మరో తోడి చెలి స్వామికి విన్నవిస్తున్నది.

### ఆహిరి

ప. ఇటమీఁద నీచిత్త మిదివో నా విన్నపము
కుటిలకుంత లీదెస గుఱుతుగాఁ జూడుమా ॥పల్లవి॥

1. కలసి మెలఁగుదాఁకాఁ గన్నులనే వుండు నాస
సెలవినే వుండు నవ్వు చెనకుదాఁకా
పిలి చాదరించుదాఁకా పెదవిపై నుండు మాట
చెలియకు నీమీఁదఁ జెప్పరాదు ప్రియము ॥ఇట॥

2. పానుపు చేరినదాఁకా పాదాలనే వుండుఁ దమి
నాని సిగ్గుచేత నుండు ననపుదాఁకా
మోనాన మోవేనుదాఁకా మొకాన నున్నది దప్పి
పూనినమోహ మెట్టిదో పొలఁతి నీ మీఁదను ॥ఇట॥

3. కూడి రతిసేయుదాఁకాఁ గుచాల నుండుఁ గోరిక
జోడించి మైఁగాఁక యిందు చొక్కుదాఁకాను
యీడుగాను శ్రీవేంకటెశ ఇంతిఁ గూడితివి
తోడునీడవలె నుండుఁ దొయ్యలి నీ వలపు ॥ఇట॥

**అర్థములు:** ప. ఇటమీద= ఇకపైన, చిత్తము= ఇష్టము, విన్నపము= వినతి, కుటిలకాంత= కౌశల్యముతోనున్న స్త్రీ, దెస= దిక్కు.

1. సెలవి= పెదవిమూల, చెనకు= తాకు, చెప్పరాదు= చెప్పనలవిగాని.

2. తమి= అపేక్ష,త్వర, నాని= బాగా ఫలించి, అనపు= అతిశయము,అనురాగము, మోనము= మౌనము, మోవేను= మోవి ఆనించే దాకా, మొకాన= మొహముపై, దప్పి= దాహము, మోహము= వలపు, పొలతి= స్త్రీ.

3. కూడి= కలసి, రతిసేయు= శృంగార క్రీడ సాగించు, కుచాలు= రొమ్ములు, జోడించి= జతకలిపి, మై= దేహము, చొక్కు= మత్తు,పరవశత్వము, ఇంతి= స్త్రీ, తోడు= సహాయము, తొయ్యలి= ఆడుది.

**భావము:** స్వామీ! నా వినతినాలకించండి. ఆ కౌశల్యముతో ఉన్న స్త్రీ ఈ దిక్కుగా వచ్చుచున్న గుర్తులు పసిగట్టండి. ఆ తర్వాత మీ చిత్తం మా భాగ్యం.

కలసి మెలసి ఉండేవరకూ మీ మీది ప్రేమ, కోరికలి కన్నుల్లో దాగి ఉంటాయి. నవ్వు మిమ్మల్ని తాకేవరకూ పెదవిమూలనే ఉంటుంది. నీవు ఆమెను పిలిచి సమాదరించేదాకా మాట పెదవిపైనే ఉంటుంది. ఆ చెలి నీమీద పట్టరాని మోహంతో ఉన్నది.

పట్టెమంచముపై నున్న పానుపు మీదకు చేరేవరకూ ఆమె పాదాలపైనే అపేక్షలు దాగి ఉంటాయి. అతిశయించిన మోహానురాగాలు బాగ ఫలించి సిగ్గులతో నిండి ఉంటాయి. మౌనంతో ముఖారవిందాన్ని నీకు తాకించే వరకూ ఆమె మోహంలో ఆ దాహార్తి కనిపిస్తూనే ఉంటుంది. ఆమెకు నీపై పెట్టుకున్న ప్రేమ ఎలాంటిదో కదా!

మిమ్ము కూడి రతిక్రీడా విలాసాలలో పాల్గొనే వరకూ ఆమె రొమ్ములమీద కోరికలు అలాగే దాగిఉంటాయి. నీవు జతగూడి దేహాలు పెనవేసుకునే దాకా ఈ మత్తు భ్రమలు అలానే ఉంటాయి. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈడుజోడై ఆ స్త్రీని జతగూడితివి. ఆమెకిక నీ ప్రేమానురాగాలు తోడునీడై కలకాలము ఉంటాయి.

## 332

**అవతారిక:**శ్రీమహావిష్ణువు అవతారాలను సంస్కృతంలో కీర్తిస్తూనే శృంగార వర్ణన గావించాడు అన్నమయ్య.

### (జక్కిణి) బౌళి

ప. దేవ వాసుదేవ
భావయ తాం పాలయ ॥పల్లవి॥

1. నరహరే అహెూ నారాయణ రే
మురహర నగధర ముకుంద
తరుణీయం తు తవ విరహేణ
భరితవిచిత్రప్రతిమా జాతా ॥దేవ॥

2. దివిజవందిత దేవోత్తమ అహెూ
నవనీతప్రియ నందసుత
తవ సంగమసంతతకామనయా
యువతి ర్జాతా యోగినీవ ॥దేవ॥

3. జితదానవ అహెూ శ్రీవేంకటపతే
సతత మాధవ కృష్ణ సర్వేశ
రతిసంగమేన రమణీ యం తు
బత తే విహితాభరణా జాతా ॥దేవ॥

**అర్థములు:** ప. దేవ= ఓ దేవా, వాసుదేవ= వసుదేవుని కుమారుడా, భావయ= భావించు, పాలయ= పాలించు.

1. నరహరి= నృసింహావతారా, అహెూ= ఆహాహా, నారాయణ= విష్ణువు, మురహర= ముర అనే రాక్షసుని సంహరించినవాడా, నగధర= గోవర్ధనమెత్తినవాడా, ముకుంద= మోక్షమునిచ్చేవాడు, తరుణీయం= యౌవనవతి, తవ విరహేణ= నీ విరహముతో, విచిత్ర ప్రతిమా జాతా= చిత్రవిచిత్రమైన అవస్థలకు గురవుచున్నది.
2. దివిజ వందిత= దేవతలచే నమస్కరింపజేసుకున్నవాడా, దేవోత్తమ= దేవతలందరిలో ఘనమైన వాడా, అహెూ= అహాహా, నవనీతప్రియ= చిలికినవెన్నమీద ప్రీతిగలవాడా, నందసుత= నందుని పుత్రుడా, తవ= నీ, సంగమ= కలయిక, సంతత= ఎల్లవేళల, కామనయా= కోరుకునే స్త్రీ, యువతిర్జాతా= కదులుతున్న స్త్రీవలె, యోగినీవ= యోగాభ్యాసము చేసేవిధముగా.
3. జితదానవ= రాక్షసులను జయించిన, అహెూ= ఆహా, సతత= ఎల్లవేళల, రతిసంగమేన= రతిక్రీడ చేయుటకు, విహితాభరణా= శోభను కలిగించు.

**భావము:** ఓ దేవా! వసుదేవుని కుమారుడైన వాడా! ఆ నాయికను భావించి పాలించమని ప్రార్థన!

ఓ నృసింహావతారం ధరించిన నరహరీ! అహాహా! హే విష్ణో! ముర అనే దానవుడిని సంహరించినవాడా! గోవర్ధనగిరి నెత్తినవాడా! మోక్షాన్ని ప్రసాదించే వాడా! యౌవన భారంతో ఉన్న ఆ యువతిని గమనించారా! చిత్ర విచిత్ర అవస్థలకు లోనవుతున్నది.

దేవతాలోకంలో అందరిచేతా నమస్కరింపబడే వాడా! దేవతలకు ఘనుడైన వాడా! అహాహా! చిలికినవెన్న మీద అత్యంత ప్రీతి కలిగినవాడా! నందుని కుమారుడా! సదా నీ సంగమం కోసం వేచియున్న ఆ యువతి యోగోపాసకురాలివలె నిలిచి యున్నది.

అహాహా! రాక్షసులను తుదముట్టించినవాడా! శ్రీవేంకటేశ్వరా! ఎల్లవేళలలో శ్రీమహాలక్ష్మీదేవితో ఉన్నవాడా! మాధవుడా! సర్వేశ్వరుడా! ఇక్కడ క్రీడిస్తూ నీతోడి రతిక్రీడాభిలాషియై ఉన్న స్త్రీ నీకు అత్యంత శోభలను కలుగజేస్తున్నది.

**విశేషము:**

1. నారాయణ అన్న పదానికి నారా–ఆయన, (నారా జలం, అయనం స్థానం యస్య) జలము నివాస స్థానంగా కలవాడు. విష్ణుమూర్తి యని, ముకుంద అన్న పదానికి ముకుందాంక, (ముకుం మోక్షం దదాతి) మోక్షము నిచ్చువాడు. విష్ణుమూర్తి అనీ వ్యుత్పత్తి .
2. ఇది శ్రీమహావిష్ణువు కీర్తిస్తూ ఆధ్యాత్మికతతో కూడి ఉన్నప్పటికి, శృంగార విశేషాలతో కూడుకున్నది కాబట్టి శృంగార కీర్తనగా పరిగణించుటయే యుక్తము.

## 333

**అవతారిక:** అమ్మ స్వామిని చేరుకున్నప్పటికి, తను మితిమీరిన మొహమాటంతో ఉన్న విషయం తానే స్వయంగా నివేదిస్తున్నది.

## సాళంగం

ప. నీకుఁ దెలియదు గాని నిండిన నాలోని కాఁక
కాకు సేయకుండరాదా కమ్మరాఁ గొంతవడి ॥పల్లవి॥

1. నాకంటే మునుప నీవు నన్ను మాటాడించఁగాను
పైకొన్న మొగమోట నేఁ బలికేఁగాని
చేకొని నీ వాడానీడాఁ జేసినచేఁతలు విని
కూకులు వత్తులునాయ కొలుపదు మనసు ॥నీకు॥

2. మొగమిచ్చి సారెసారె మోహము చల్లుచు నాతో
నగఁగా నేనూ నట్టె నవ్వేఁగాని
యెగసక్కేలకు నీమై నెవ్వతోచేఁతలు చూచి
సగమై లోలో నిట్టె జడిసీ నాదేహము ॥నీకు॥

3. దగ్గరఁగ వచ్చి నీవు తగఁ గాఁగిలించఁగాను
వొగ్గి నేనూఁ గూడి వూరకుండితిఁ గాని
యెగ్గులేక శ్రీవేంకటేశ నన్నుఁ గూడఁగాను
సిగ్గుచేత నాచెక్కు చేతిమీఁద మోఁచేను ॥నీకు॥

**అర్థములు:** ప. నిండిన= పరిపూర్ణమైన, కాక= వేడిమి, కాకు= తిరస్కారము, కమ్ము= కప్పుకొను,కౌగలించు, వడి= వేగము.

1. మునుప= ముందు, పైకొన్న= యత్నించు, మొగమాటము= సంకోచము, చేకొని= గ్రహించు, ఆడానీడా= అక్కడా ఇక్కడా, కూకులు= కలవరపడు, కొలుపు= సమ్మతించు.
2. సారె సారె= మాటిమాటికి, మోహము= ప్రేమ, చల్లుచు= విరజిమ్ముచు, నగు= నవ్వు, యెగసెక్కేలు= పరిహాసము, నీమై= నీ శరీరంపై, సగమై= అర్ధభాగమై, జడియు= భీతిచెందు.
3. కాగిలించు= కౌగలించు, ఒగ్గి= పూనుకొను, కూడి= కలసి, ఎగ్గు= దోషము, చెక్కు= చెక్కిలి, మోచు= తాకు.

**భావము:** స్వామీ! నాలో రేగుతున్న పరిపూర్ణమైన తాపము నీ కర్థం కావడం లేదు. ఇకనైనా తిరస్కరించకుండా చేపట్టి నన్ను కప్పుకున్న రీతిగా కౌగిలిలో బంధించరాదా!

నాకంటే ముందు నీవు నాతో మాట్లాడ యత్నించగా, నా మోమాటం, సంకోచం వలన నే మాట్లాడాను కానీ, నీవు నన్ను చేకొని, అక్కడా ఇక్కడా చేసిన పనులు నన్ను కలవర పరచినందున సమ్మతించలేకపోతున్నాను సుమా!

నీ మోము నావైపు సారించి మాటి మాటికి నాపై నీ ప్రేమ అనే మత్తు చల్లుతూ నాతో నవ్వులు చిందించగా, నేను అలాగే నవ్వాను కానీ, పరిహాసాలకు నీమేనిపై ఎవ్వరి చేతలో చూసి, నేను దిగులుతో సగమై లోలోపల ఎంత భీతి చెందితినో తెలుసా?

నీవు దగ్గరగా వచ్చి నన్ను గట్టిగా కౌగలించుకోగా, పూనుకొని నేనూ కూడి ఊరకున్నాను కానీ, ఓ శ్రీవేంకటేశ్వరా! దోషరహితుడవై, నన్ను కలవగా, సిగ్గుతో నేను చెక్కిలిపై చేతులు వేసుకొని కూర్చొండిపోయాను.

## 334

**అవతారిక:** స్వామి తనపై మనసుగొన్నాడని భావించిన అలమేలుమంగమ్మ, కొన్ని ఆనవాళ్ళను తెలుపుతూ స్వామికి తన అంగీకారం తెలిపి చెలిద్వారా అహ్వానం పలుకుతున్నది.

### శంకరాభరణం

ప. ఆదరానిమా టది గుఱుతు
వేడుకతోనే విచ్చేయుమనవే ॥పల్లవి॥

1. కాయజకేలికిఁ గడుఁ దమకించఁగ
ఆయము లంటిన దది గుఱుతు
పాయపుఁబతికినిఁ బరిణాము చెప్పి
మోయుచుఁ దన కిటు మొక్కితిననవే ॥ఆదరాని॥

2. దప్పిమోవితో తా ననుఁ దిట్టఁగ-
నప్పుడు నవ్విన దది గుఱుతు
యిప్పుడు దనరూ పిటు దలఁచి బయలు
చిప్పిలఁ గాఁగిటఁ జేర్చితిననవే ॥ఆదరాని॥

3. పరిపరివిధములఁ బలుకలు గులుకఁగ
అరమరచి చొక్కినది గుఱుతు
పరగ శ్రీవేంకటపతి కడపలోన
సరవిఁగూడె నిఁక సమ్మతియనవే ॥ఆదరాని॥

**అర్థములు:** ప. ఆదరాని= మాట్లాడగూడని, గురుతు= ఆనవాలు, వేడుక= కుతూహలం.

1. కాయజకేళి= మన్మథ క్రీడ, తమకించు= మోహపడు, ఆయము= జీవస్థానము, పాయపుపతి= యుక్తవయసులోనున్న భర్త, పరిణాము= తీర్మానము, మోయు= వహించి.
2. దప్పిమోవి= దాహార్తితోనున్న మోవి, చిప్పిల= పైకిఉబుకు, కాగిట= కౌగిట.
3. పరగ= ఒప్పుగా, సరవి= క్రమము, సమ్మతి= అంగీకారము.

**భావము:** మాట్లాడరాని మాటలే ఆనవాలు. ఇక కుతూహలముతో స్వామిని విచ్చేయమనవే!

మన్మథ క్రీడకు మిక్కిలి మోహముతో జీవస్థానాలను తాకినది అదే ఆనవాలు. వయసులోనున్న భర్తకు నా తీర్మానాన్ని విన్నవించి, వహించి ఆయనకు నమస్కరిస్తున్నానని విన్నవించవే!

దాహార్తిగొన్న మోముతో ఆయన నన్ను దూషించగా ఆ సమయములో నవ్వినదే ఆనవాలు. ఈ సమయములో తన రూపు ఈవిధంగా బయటపడగా, పైకి ఉబికుబికి వస్తున్న ప్రేమాతిశయంతో నన్ను గాఢాలింగనం చేసుకోమనవే!

అనేకవిధాలుగా మాట్లాడుతూ కులుకులు చిందిస్తున్న వేళలో, ఆదమరచి ప్రేమ మత్తులో మునిగితేలినది ఆనవాలుగా

భావించి, ఒప్పుగా కడపలో వేంచేసి యున్న శ్రీవేంకటేశ్వరుని అంగీకారంతో కూడితిని, ఇక అన్నింటికి తనను అంగీకరింపజేయవే!

**విశేషం:** ఈ కీర్తనలో "గుఱుతు" ప్రతి చరణం రెండవపాదంలో అంత్యప్రాసగా ఉంచడం వల్ల కీర్తనకు వన్నె తెచ్చినది.

## 335

**అవతారిక:** శ్రీమహావిష్ణువు యొక్క అవతార వర్ణన చమత్కారంగా చేస్తున్నాడు అన్నమయ్య. చిత్తగించండి.

### రామక్రియ

ప. పదియుఁ బదియుఁగాను పరమాత్ముఁడితనికి
వెదకి చవులు దెచ్చి విందు లిట్టె సేయరే ॥పల్లవి॥

1. పొలసు పైఁబారెనట బురద మేనం టెనట
యిల మన్ను మోఁచెనట యీదేవుఁడు
నెలవై నరాకాసినెత్తుటఁ దోఁగినాఁడట
కలపన్నీ రెల్లఁ బోసి కడుగరే దేహము ॥పదియు॥

2. బాఁపనజిడ్డం టెనట పట్టెనట ముమ్మురము
కై పగునల్లనికోక గట్టినాఁడట
చాపలానఁ జెంచుదానిసంగడిఁ దిరిగెనట
కోపులఁ గప్పురధూళి గుప్పరే యీతనికి ॥పదియు?

3. కాంతలనే కూడెనట కడగడ దొక్కెనట
పొంతలఁ దట్టుపుణఁగు పూయరేనేఁడు
యింతట శ్రీవేంకటేశునెద నల మేలుమంగఁ
గాంతునికి మెడఁగుచ్చి కట్టరే మొక్కుదము ॥పదియు॥

**అర్థములు:** ప. పదికిపది= అన్నియు,సంపూర్ణము, పరమాత్ముడు= భగవంతుడు, చవులు= రుచి,కోరిక.

1. పొలసు= చేపమీదనుండు పొట్టు, పైబారు= శరీరముపైనుండు, మేను= శరీరము, ఇల= భూమి, మన్ను= మట్టి, మోచు= వహించు, నెలవు= స్థానము, రాకాసి= రాక్షసి, నెత్తుట= రక్తములో, దోగు= దోగాడు, కలపన్నీరు= శుద్ధమైన పన్నీరు.
2. బాపన= బ్రాహ్మణ, జిడ్డు= మడ్డి, ముమ్మురము= అధికము, కై= శరీరముపై, పగునల్లనికోక= నల్లని వస్త్రము, చాపలము= చపలస్వభావము, చెంచుదాని= చెంచులక్ష్మి, సంగడి= స్నేహము,జత, కోపు= కడ్డీ, కప్పురధూళి= కర్పూరపు పొడి.
3. కూదు= కలియు, కడగడ= అన్నిదిక్కులు, పొంత= సమీపము, తట్టుపుణుగు= సుగంధద్రవ్యము, మొక్కుదము= నమస్కరించెదము.

**భావము:** చెలులారా! వినండి! సంపూర్ణముగా ఆ దేవదేవుడితనికి, వివిధ పదార్ధములు వెదకి వెదకి దెచ్చి రుచి దీరా నారగింపజేయరే!

ఈతని శరీరముపై పొలుసులు పొడసూపినవి, అలాగే బురదకూడా అంటినది, ఈ దేవదేవుడు భూమిపై మట్టిని ధరియించి మోశాడట. అలాగి రాక్షసి నెత్తురులో దోగాడినాడు. మంచి పన్నీరు తెచ్చి కడిగి ఆ మాలిన్యమంతా పోయేవిధంగా కడగండి.

బ్రాహ్మణ మడ్డి ఈతనికి అధికముగా నంటినది, అలాగే నల్లనైన వస్త్రాన్ని ధరించాడు. ప్రేమ అనే పేరుతో చెంచులక్ష్మి వెంట వెంట స్నేహమంటూ దిరిగినాడు. కర్పూరపు ధూళి ఈతనిపై కుమ్మరించి శుభ్రం చేయండి.

అనేకమంది కాంతలతో అన్నిదిక్కులు అతనివే అన్నట్టు విహరించాడు. చెంతజేరి తట్టుపుణుగు నీతని మేనిపై పూయండి. ఇక అలమేలుమంగమ్మను శ్రీవేంకటేశ్వరుని ఎదపై నిలిపి ఆ స్వామికి ముడివేయండి. మనమంతా నమస్కరించెదము.

**విశేషము:** ఈకీర్తనలో ఆధ్యాత్మిక ఛాయలు పొడసూపుచున్నవి. ఇక్కడ అన్నమయ్య దశావతార వర్ణన గావించాడు. మత్స్యావతారము,

కూర్మావతారము, శ్రీకృష్ణావతారము, వామనావతారము, నృసింహావతారముల వరణన యిందున్నది. ఈ కీర్తన ఆధ్యాత్మిక కీర్తనల కోవలో ఉండదగినదని పరిష్కర్త శ్రీమాన్ గౌరిపెద్ది  రామసుబ్బ శర్మగారి సూచన తగియున్నది.

## 336

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ విరహానికి పొందుకు ఉన్న భేదాన్ని చమత్కారంగా స్వామికి విన్నవిస్తున్నది.

### ద్రావిళభైరవి

ప. ఎట్టు వలపించితివి యేమీ నెఱగని నన్ను
పట్టరాదు ప్రాయమిది పైపై నున్నదిరా ॥పల్లవి॥

1. వినుకలి విరహమే వేడుకలై తో చెగాని
కనుగొంటే దమకము కదుబెట్టురా
మనసున దలచుటే మంచిదయి వుండీగాని
తనువు గాగిలించితే తతిగొనీ మఱపు ॥ఎట్టు ॥

2. తెమ్మలై తొంటికూటమి దిష్టమై వుండీగాని
కమ్మి మీదటికోరిక గాసిబెట్టీరా
చిమ్ముచు నీకెదురుచూచినదే యింపాయ గాని
కమ్మర నంటితే గోరు కదువాడిరా ॥ఎట్టు ॥

3. మంచిదూతికలయెడ మాటలే చవాయఉగాని
కంచముపొత్తిచ్చితేనే కళదాకెరా
అంచల శ్రీ వేంకటేశ అలమేలుమంగ నేను
యెంచి కూడితివి యిన్ని నియ్యకోలే యికను ॥ఎట్టు ॥

**అర్థములు:** ప. ఎట్టు = ఏవిధముగా, వలపించు = ప్రేమించునట్లుచేయు, ఎరుగని = తెలియని, పట్టరాదు = పట్టుకొనుటకువీలుకాని, ప్రాయము = వయసు, పైపై = సులభముగ.

1.వినుకలి = వినుటకు, విరహము = వియోగము, వేడుక = కుతూహలం, తమకము = మోహము, కదుబెట్టు = అత్యంత అతిశయించినది, కాగిలించూ౼ కౌగలించు, తతిగొనూ౼ తగిన సమయము కనిపెట్టి.

2.తెమ్మలు = తేమ,తడి, తొంటికూటమి = వెనుకటి స్నేహము, దిష్టము = భాగ్యము, కమ్మి = మూసి,కప్పి, గాసి = శ్రమ, చిమ్ముచు = వెదజల్లుచు, ఇంపు = యిష్టము, కమ్మర = అగ్ని,వేడిమి, కదువాడి = మిక్కిలి తీక్షణమైనది.

3.దూతిక = వేచియున్నచెలికత్తె, చవి = రుచి, కంచముపొత్తు = కూడా విందారగించు, కళ = శోభ, అంచల = సమీపము, ఎంచి = లెక్కించి, ఇయ్యకోలు = అంగీకారము,సమ్మతము.

**భావము:** ఓ స్వామీ! ఏమీ తెలియని అమాయకురాలనైన నన్ను ఏవిధముగా ప్రేమలో పడేట్టు చేశావో తెలియకున్నది. ఈ యుక్తవయసు పట్టసాధ్యము కానిది, మాటవిననిది కదా!

వినడానికి ఈ విరహము తమాషాగా కుతూహలముతో కూడినదై ఉంటుంది కానీ, చూస్తే మోహావేశం చాలా అత్యధికమై ఉంటుంది. మనసులో మిమ్ములను సదా ధ్యానము చేస్తూ ఉంటే బాగుంటుంది కానీ, తగిన సమయములో విచ్చేసి నన్ను కౌగలించుకుంటే ఇంకా మధురముగా ఉంటుంది కదా స్వామీ!

స్వామీ! వెనుకటి మన స్నేహము ఆర్ద్రతతో కూడి కనిపిస్తూ ఉంటుంది కానీ, కోరికలు ముసురుకొని నన్నధిక శ్రమకు గురిచేస్తున్నవి. ఇలా నా మోహాతిశయాన్ని నీవైపు వెదజల్లుతూ ఎదురు చూపులు చూడడం ఇష్టమే కానీ, నన్ను వేడిమితో చేపడితే

నీ కొనగోళ్ళు వాడిమియై ఉంటాయి కదా!

స్వామీ! ఆ వేచియున్న చెలికత్తెల మాటలే నీకు రుచిస్తాయి కానీ, కలిసి నాతో విందుభోజన మారగిస్తే ఆ శోభలే వేరుగా నుండవా! సమీపమున చేరిన ఓ శ్రీవేంకటేశ్వరా! నేనయ్యా నీ అలమేలుమంగమ్మను, అన్నీ లెక్కించి నన్ను చేరుకున్నావు, ఇంకా ఏమిచేసినప్పటికి అన్ని నాకు సమ్మతమే సుమా!

## 337

**అవతారిక:** ఎవరో సవతి స్వామిని లోబరుచుకున్న సంగతి అమ్మకు చేరవేశారు. అమ్మ అన్యాపదేశంగా స్వామితో చమత్కారంగా మాట్లాడుతున్నది.

### ముఖారి

ప. అందుకేమి పదరాదా ఆనలేల సతివద్ద
కందువ మగవానికిఁ గలదే కాదా ॥పల్లవి॥

1. చెప్పకుండునా బుద్ధి చేరకుండా నెవ్వరిని
యెప్పుడూ నాకెవద్దికి నేగినవేళ
అప్పుడే యందుకు నిచ్చలాడక నీవుందువా
చప్పఁజేసి యవి నేను సాగనీఁగాక ॥అందుకేమి॥

2. చేయకుండునా ఆకె చెల్లినట్టెల్లా, నీవు
చేయూరఁ గాఁగిటిలోనఁ జిక్కినవేళ
యీయకుందువా బాస యిందరి విడుతునని
పోయినట్టెల్లా నిన్నుఁ బోనీఁగాక ॥అందుకేమి॥

3. అనకుండునా తానె ఆకె దొడ్డదానవని
వినకుందువా నీవు వేళావేళ
అనుగు శ్రీ వేంకటేశ అలమేలుమంగ నేను
తనీయ నే నిన్నుఁ గూడి దక్కఁగొంటిఁగాక ॥అందుకేమి॥

**అర్థములు:** ప. ఆనలు= ప్రమాణాలు, సతి= భార్య, కందువ= చమత్కారము.

1. ఆకె= ఆమె, ఏగిన= వెళ్ళిన, ఇచ్చలాడు= ఇష్టపూర్తియైన మాటలు, చప్పజేయు= రుచిలేనిపనులు.
2. ఆకె= ఆమె, చెల్లినట్లు= సరిపోవునట్లు, చేయూర= చేతులనిండుగా, చిక్కు= దక్కు, బాస= ప్రమాణము.
3. ఆకె= ఆమె, దొడ్డ= మంచిగుణము, వేళావేళ= అన్ని సమయములు, అనుగు= ముఖ్యమైన, తనియ= తృప్తినందు.

**భావము:** స్వామీ! మీ మగవారికి చమత్కారాలు, పరిహాసాలు, రకరకాల వేషాలు ఎల్లప్పుడూ ఉన్నవే గదా! చీటికి మాటికి భార్య వద్ద ప్రమాణాలు చేయడమెందుకు?

నీవు అన్యస్త్రీలను చేరకుండా నేను బుద్ధి చెప్పకుండా ఉండగలనా? ఎప్పుడూ నీవు ఆమె వద్దకు వెళ్ళడం సత్యమే కదా! ఆ సమయాలలో నీవు ఇష్టమైన ముఖప్రీతి మాటలు మాట్లాడకుండా వుంటావా చెప్పు? అవి సారమేమీ లేని సంభాషణలని తెలిసినప్పటికి నేను వాటిని సాగనీయకుండా వచ్చుగాక!

ఆమె సాగినట్టుగా తన ఇష్టానుసారం పంతం చెల్లించుకుంటూ ఉంటూ, నీవు ఆమెకు చేతుల నిండుగా కౌగిలిలో చిక్కిన వేళలలో, నీవు అందరిని వదిలేస్తాను నిన్నే ఏలుకుంటానని ఆమెకు మాట ఇవ్వకుండా ఉంటారని నేననుకుంటానా? నీవు తిరిగినట్టెల్లా తిరుగుతూ, ఆడినట్టెల్లా ఆడుతూనే ఉన్నావుగదా!

ఆమె అందరికంటే తాను అధికురాలనని మీతో అనకుండా ఉంటుందా? నీవా మాటలు పూట పూటా వినకుండా వుంటావా? ఓ శ్రీవేంకటేశ్వరా! నీకు ముఖ్యురాలనైన అలమేలుమంగమ్మను! నేను తృప్తిపరచి దక్కించుకొన్న దానన్న విషయం మరువకండి.

## 338

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామిపై ఎందుకో కినుక వహించి అలకాగృహంలో నిద్రిస్తున్నదని చెలులు స్వామివారికి విన్నవిస్తున్న దృశ్యం.

### ముఖారి

ప. వెలఁది నింక లేపవెఱతుము నేమైతే
చెలువుఁడవు నీవే విచ్చేయవయ్య లోనికి ॥పల్లవి॥

1. కాంత, నీవు రాగానే కన్నులుమూసుక యిట్టె
పంతమున నిద్దిరించీఁ బానుపు మీఁద
చెంతల నేము దగ్గరి చేముట్టి లేపి తేను
వింతలుగా విదిలించివేసీఁ గోపానను ॥వెలది॥

2. అండ నీరాక చెప్పితే నప్పటి నీపచ్చడము
నిండా ముసుఁగువెట్టి నిద్దిరించీని
వుండలేక పాదమువట్టూఁచి పేరఁబిలిచితే
దిండుకట్టఁ జెప్పరానితిట్లు తిట్టీని ॥వెలది॥

3. సతి యలమేల్మంగ సారెకు గురుకవెట్టీ
తతి నీవు పైఁబడఁగాఁ దా నీలిగీని
కతగా శ్రీ వేంకటేశ కాఁగిలించి కూడితివి
రతిలో మేల్కనెఁదాను రవ్వాయ మాపనులు ॥వెలది॥

**అర్థములు:** ప. వెలది= స్త్రీ, లేప= నిద్రలేపుటకు, వెరయు= ఆశ్చర్యము, నేమైతే= మేమైతే, చెలుడవు= ప్రియుడవు, విచ్చేయు= దయచేయు.

1 .పంతము= పట్టుదల, నిద్దరించీ= నిద్రపోవుచున్నది, చెంత= సమీపము, చేముట్టి= చేయితాకించి, వింత= ఆశ్చర్యము, విదిలించి= విసుగుతో దూరముపెట్టు, కోపాన= కోపముతో.

2. అండ= సమీపము, పచ్చడము= అంగవస్త్రము, పాదమువట్టూచి= కాలు పట్టుకొని ఊగిస్తూ, పేరబిలుచు= పేరుతో పిలుచు, దిండుకట్ట= అతిశయముతో, చెప్పరాని= నోటితో చెప్పలేని, తిట్లు తిట్టీనీ= తిడుతూ ఉన్నది.

3. సారెకు= మాటిమాటికి, గురుక= గురక, తతి= సమయము, నీలిగీని= ఒళ్ళువిరుచుకొని తిరస్కారభావము చూపు, కత= కథ, కాగిలించి= కౌగలించుకొని, కూడు= కలియు, రవ్వ= అల్లరి.

**భావము:** స్వామీ! అమ్మను ఇంక నిద్రలేపడం మా వల్ల అయే పనిగా కనబడడం లేదు. ఆమెకు ప్రియమైన వాడవు కనుక నీవే లోనకు దయచేసి ఆమె సంగతి కొంచెం చూడండి.

ఆ కాంత నీవు రాగానే కండ్లు మూసుకుని, పట్టుదలతో పానుపై పవళించి నిద్రపోతున్నది. మేము దగ్గరకు చేరి చేతితో తట్టి లేపడానికి ప్రయత్నిస్తూ ఉంటే మమ్మల్ను తిరస్కార భావంతో, కోపం వహించి విదిలించి కొడుతున్నది.

స్వామి వస్తున్నాడని చెప్పగానే నీ అంగవస్త్రము నిండా ముసుగువేసి కప్పుకొని నిద్రిస్తున్నది. మేము ఉండలేక మీ రాక

విన్నవిద్దామని ఆమె పాదము పట్టుకుని ఊపుతూ, పేరుబెట్టి అలమేలుమంగమ్మా అని పిలిచి లేపబోగా, మమ్ములను నోటితో చెప్పరాని తిట్ల దండకం అందుకుంటున్నది.

స్వామీ! ఆ అలమేలుమంగమ్మ మాటి మాటికి గురకలు పెట్టి నిద్రిస్తుండగా, రతిక్రీడకై నీవు మీద పడగా తాను ఒళ్ళు విరుచుకొని తిరస్కారభావం చూపిస్తున్నది. స్వామీ, ఆశ్చర్యంగా ఆమెను నీవు కౌగలించుకుని కలియగానే ఆ రతిక్రీడలోనే తాను మేలుకొనింది. యిక మమ్ము మా పనులను అల్లరి పాలు చేసినట్లే గదా!

## 339

**అవతారిక:** అలమేలు మంగమ్మ విరహబాధను అందంగా స్వామికి విన్నవిస్తూ త్వరగా విచ్చేయమని చెలులు ప్రార్థిస్తున్నారు.

### పాడి

ప. కొత్తసింగారాలు సేసెఁ గొమ్మ దన మేనిలోనె
చిత్తగించి రారాదా చెలిఁ జూతుగానీ ॥పల్లవి॥

1. కుప్పలుసేసె వలపు కుచములనె యిట్టె
చిప్పిలఁ గరఁగె మతి చెమటలను
కప్పుకొనెఁ జీకట్లు కదుజారిననెరుల
యిప్పుడే విచ్చేయరాదా యింతిఁ జూతుగానీ ॥కొత్త॥

2. నిండఁ జేసెఁ దమకము నిట్టూర్పుగములను
పండఁజేసె పులకలపైరులు మేన
యెండించెఁ గాఁకలచేత యింపుమోవి, తీపువుట్ట
అండకు విచ్చేయరాదా ఆకెఁ జాతుగానీ ॥కొత్త॥

3. వెదచల్లెఁ జూపులనె వేవేలు ఆసలెల్లా
నిదురవోయీ నీపై నివ్వెరగుల
అదె శ్రీవేంకటేశ నీ వలమేలుమంగఁ గూడి-
తిదె దినము రారాదా యిఁకనైనాఁ గానీ ॥కొత్త॥

**అర్థములు:** ప. సింగారాలు= అలంకారములు, కొమ్మ= స్త్రీ, చిత్తగించి= సావధానముగా విని, జూతు= చూతువు.

1. కుప్పలు= రాశులు, కుచములు= వక్షములు, చిప్పిల= పైకి ఉబుకు, మతి= మనసు, నెరులు= కేశములు, ఇంతి= స్త్రీ.
2. తమకము= మోహము, గములు= గుంపు, పులక= గగుర్పాటు, కాక= వేడిమి, ఇంపు= ఇష్టమైన, తీపు= మాధుర్యము, అండ= చెంత, ఆకె= ఆమె.
3. వెదజల్లు= వ్యాపింపజేయు, వేవేలు= వేలకువేలు, నివ్వెరగు= పారవశ్యము.

**భావము:**అమ్మ వివిధ అలంకారములతో అందముగా తయారై మీకొరకు ఎదురు చూపులు చూస్తున్నది. నీవు సావధాన చిత్తుడవై విని విచ్చేసి ఆ అమ్మను ఒక్కసారి చూడరాదా స్వామీ!

నీ మీదనున్న వలపు కుప్పలై తన అందమైన వక్షోజములతో ఉన్నది. ఆమె మనసు చెమటలవలె పారుతూ ఉన్నది. ఆమె కురులు కటిక చీకట్లవలె క్రమ్ముకొని ఉన్నవి. స్వామీ! తమరు ఇప్పుడే విచ్చేయవచ్చు గదా ఆయమను చూడవచ్చును.

ఆమెకు తమపై గల మోహమధికమై దీర్ఘ ఉచ్ఛ్వాస, నిస్స్వాసములను విడుచుచున్నది. ఆమె శరీరముప గగుర్పాటుతో గూడి నిండి ఫలించి ఉన్నది. ఆమె ముఖారవిందము కలుగుతున్న వేడిమిచేత తడియారి ఉన్నది. ఆమెకు మాధుర్యము కలిగించే విధంగా వద్దకు రారాదా స్వామీ! ఆమె అవస్తను మీరే కళ్ళారా చూడవచ్చును.

ఆమె చూపులనే ఆశలు వేవేలుగా వెదజల్లబడుతూ సర్వత్రా వ్యాపించి యున్నవి. నీపై పారవశ్యముతో కన్నులు మూసుకొని

యున్నది. శ్రీవేంకటేశ్వరా! నీవు ఈనాడు అలమేలుమంగతో కలిసినావు. ఈ విధంగానే ప్రతిదినమూ వచ్చి అమ్మకు ఆనందము కలుగజేయరాదా!

## 340

**అవతారిక:** అమ్మ అలమేలు మంగమ్మ తన అనుంగు చెలిని స్వామి వద్దకు రాయబారం పంపుతూ, స్వామిని గురించి పలు సందేహాలతో సతమతమవుతున్నది.

### ఆహిరి

ప. తనువిందుఁ దలఁపందు తమకము నడుమను
పెనగొనీఁ దాను పిలిపించఁడొకొ అతఁడు ॥పల్లవి॥

1. ఇంతక పతికడకు నేఁగునొకొ చెలియ
వంతుల నిందు మరలి వచ్చునొకొ
చింతదీర నామాట చెప్పెనొకొ ఆడను
ఇంతితో మారుమాటలు యేమనెనొ అతఁడు ॥తనువిందు॥

2. రమ్మని పిలుచునొకొ రమణి యాతనిని
నెమ్మది మనవాకిట నిలుచునొకొ
తమ్మిరేకు లేకలైనాఁ దలఁపించకుండునొకొ
సమ్మతిఁ గరుణ నాపైఁ జల్లఁడొకొ యతఁడు ॥తనువిందు॥

3. వీఁడె విచ్చేసెననఁగా విందునొకొ నేను
పోఁడిమిఁగాఁగిట వానిఁ బొందుదునొకొ
నేఁడె శ్రీవేంకటపతి నే నలమేల్మంగనని
వాఁడె వచ్చి నన్నుఁగూడె వద్దనున్నాఁడతఁడు ॥తనువిందు॥

**అర్థములు:** ప. తనువిందు= శరీరము ఇందు, తలపందు= ఆలోచననలో, తమకము= మోహము, నడుమ= మధ్యలో, పెనగొను= చుట్టుకొను, ఒకో= కాబోలు (సంశయార్థకం).

1. ఇంతక= ఇప్పుడు, వంతులు= పట్టుదలలు, చింత= విచారము, ఇంతి= స్త్రీ, మారుమాటలు= అన్యమైన సంభాషణలు.
2. నెమ్మది= నిదానంగా, తమ్మిరేకు= పద్మపుష్పపు రేకు, తలపించు= గుర్తుకువచ్చు, సమ్మతి= అంగీకారము, చల్లు= విరజిమ్ము.
3. వీడె= తానే, విచ్చేయు= వచ్చు, పోడిమి= సౌఖ్యము, కాగిట= కౌగిట, పొందు= ప్రాప్తి, వద్దనుండు= చెంతజేరు.

**భావము:** వివిధ ఆలోచనలతోను, శరీరానందముతోను, మోహాతిశయముల మధ్యలో నుండగా, ప్రయత్నించి ఆ స్వామి నన్ను తన చెంతకు ఎందుకు పిలిపించుకోవడము లేదు సుమా!

ఇప్పుడు భర్త చెంతకు వెళ్తున్న ఈ చెలియ వెళ్తుందా? ఒకవేళ వెళ్తే ఆమె మరలా తిరిగి వచ్చి నాకు ఆనందాన్నిస్తుందా ఇవ్వదా? అర్థం కాకుండా ఉన్నది. నా ఆలోచనలన్నీ ఆమె స్వామికి నివేదించి నా విచారాన్ని పోగొడుతుందా? ఆయన మరలా తిరిగి ఏమని జవాబిస్తాడో ఏమో! అంతా అయోమయంగా నున్నది సుమా!

ఈ వెళ్ళిన చెలి ఆతణ్ణి నా కొరకు రమ్మని ఆహ్వానం పలుకుతుందా? అతను వచ్చినా నా వాకిట నిలబడతాడా? పద్మపు రేకుల కన్నులతో నున్న నన్ను మనసులో తలచుకోకుండా ఉంటాడా? తన అంగీకారాన్ని, ప్రేమను, దయను నాపై వెదజల్లకుండా, చూపించకుండా ఉంటాడా?

తానే విచ్చేసినట్టైతే నేను ఆనందంతో విందులు చేయకుండా ఉంటానా? ఆతని బిగి కౌగిలి సౌఖ్యాన్ని ఆనందాన్ని అనుభవించకుండా ఉంటానా? ఆహా! ఈనాడు నేను అలమేలుమంగమ్మని ప్రీతిపాత్రమైన దానని, ఆ శ్రీవేంకటేశ్వరుడే స్వయంగా

విచ్చేసి చెంతజేరి చింత దీర్చి నన్ను పొందుకున్నాడు సుమా!

**విశేషము:** ఈ కీర్తనలో అన్నమయ్య ఆ అమ్మతో అన్నీ సందేహాలను వెలువరింపజేశాడు. సందేహం (అనిశ్చయజ్ఞానం) వలన ఏర్పడే అలంకారం సందేహాలంకారం. అలాగే భాగవతాన్ని సంపూర్ణంగా వంటబట్టించుకొన్న అన్నమయ్య భాగవతంలో "ఘనుడా భూసురుడేగెనో నడుమ మార్గశ్రాంతుడై చిక్కెనో, విని కృష్ణుండది తప్పుగా దలచెనో విచ్చేయునో ఈశ్వరుం, డనుకూలింప దలంచునో దలచడో ఆర్యా మహాదేవియున్, నను బాలింప నెరుంగునో నెరుగదో నా భాగ్యమెట్లున్నదో!" అని రుక్మిణీదేవి అనేక సందేహాలతో ఉన్నరీతిగా, అలమేలుమంగమ్మ కూడా స్వామి కూడికకై అనేక సందేహాలను వెలిబుచ్చడం ఈ కీర్తనలోని విశేషం.

## 341

**అవతారిక:** స్వామి ఆగమనానికై అమ్మ ఎదురు చూపులు చూసి, విచ్చేసి విందుభోజనం చేయమని అర్థిస్తున్నది.

### వరాళి

ప. ఇంతలోనె నీతో నే నేమందురా
పొంతనుండి నీవే నాకు బుద్ధిచెప్పఁ గదరా ॥పల్లవి॥

1. చెక్కుమీఁదటఁ జేయి చిత్తములోపల నూయి
ఇక్కువమాటలు నీతో నే మందురా
చక్కనే నీ నేరువులు చల్లీ నావూరువులు
అక్కడిసుద్దు లేమైనా నానతియ్యరా ॥ఇంతలోనె॥

2. వంచినది నాశిరసు వలపూఁ గడుబిరుసు
ఇంచుకా మొగమోడక యేమందురా
మంచిదే నీలోనిగుట్టు మాకే ఇన్నిటా అట్టు
కంచపుఁబొత్తుకు నీవే కై కొలుపఁగదరా ॥ఇంతలోనె॥

3. ముందుఁ దొక్కితి ముంగిలి మోవిమీఁదనె యెంగిలి
యిందరిలోపల నిన్ను నేమందురా
అంది శ్రీవేంకటపతి వలమేలుమంగ నేను
యిందె కూడితివి నన్ను నిఁక నానతియ్యరా ॥ఇంతలోనె॥

**అర్థములు:** ప. పొంత= సమీపమున, బుద్ధిచెప్పు= మంచిచెడు తెలియజెప్పు.

1. చెక్కు= చెక్కిలి, చిత్తము= మనసు, నూయి= బావి(లోతైనది), ఇక్కువ= సంకేతస్థలము, నేరుపు= నైపుణ్యము, చల్లీ= వ్యాపింపజేసి, ఊరువు= తొడ,ఒకానొక నఖక్షత స్థానము, సుద్దులు= మాటలు, ఆనతిచ్చు= చెప్పు.
2. శిరసు= తల, కడు= మిక్కిలి, బిరుసు= కఠినము, ఇంచుక= కొంచెము, గుట్టు= రహస్యము, రట్టు= అల్లరి, కంచపుబొత్తు= కలిసి విందు చేయు, కైకొలుపు= చేయిచ్చి సమ్మతించు.
3 .తొక్కితి= పాదములతో నడచు, ముంగిలి= ఇంటిముందుభాగము, ఎంగిలి= తినఉగా మిగిలిన పదార్థము,భుక్తశేషము, అంది= అనిచెప్పినది, ఇందె= ఇక్కడే, కూడు= కలయు, ఆనతి= సెలవు.

**భావము:** స్వామీ! ఇంతలోనే నేను నిన్ను ఏమనగలను. చెంత జేరి నీవే నాకు మంచి చెడులను తెలియజెప్పరాదా!

చెక్కులమీద చేయి ఉండగా, చిత్తము ఎక్కడో లోలోపలి అగాధమువలె లోతుగా నున్నది. ఇంక నీతో జాడతెలిపే ఏకాంతపు మాటలు ఏమి మాట్లాడగలను. బహు చక్కనైన నీ నైపుణ్యాలు నా ఉచ్ఛ్వాస నిస్స్వాసములై ఉన్నవి. అక్కడి మంచి మాటలనేమైనా చెప్పరాదా!

వంచిన నా తల, ప్రేమ బహు బాధను కలిగిస్తున్నవి. కొంచెమైనా ముఖారవిందము చూపించక ఏమంటాను? నీలోని

గుట్టంతా మంచిదే అయినప్పటికి మాకు అదంతా అల్లరిగా సంప్రాప్తిస్తున్నది. సహపంక్తి విందుభోజనానికై నీవే చొరవ తీసుకుని చేయినందించి సమ్మతించరాదా!

నీ ఇంటి ముంగలి ప్రాంతానికి నడచి వచ్చి భుక్తశేషం కోసం చూస్తూ ఉన్నదానను. ఇందరిలో నేను నిన్ను ఏమని అనగలను? అలమేలుమంగమ్మ గా నేను ఇక్కడే పొందుకోరి యున్నదానను. ఇకనైనా మనసు విప్పి సెలవీయరాదా!

## 342

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామి పట్ల విరహముతో, మోహావేశముతో నిలబడి, విభుని త్వరగా విచ్చేయమని చెలులతో రాయబారం పంపుతున్నది.

### ఆహిరి

ప. విచ్చేయు మనఁగదే విభునిఁ జెలికడకు
పచ్చిసిగ్గు నెన్నడుమ బట్టబయలాయను ॥పల్లవి॥

1. కోరికలు కొనసాగి కోమలికిఁ గొప్పుగూడె
మేరతోఁ గళలె ముంచె మించుఁబాయము
పేరడైనవలపెల్లాఁ బెదవులఁ జిగిరించె
ఆరయ నంగన నేఁటి కాఅడఁబెట్టీనె ॥విచ్చేయు॥

2. సతితమకములెల్లా చనుఁగొండలై పెరిగె
రతికాంక్ష పిఱుఁదున రాసెకెక్కెను
మతిలోనివిరహము మంచినిట్టూర్పుల రేఁగె
మతకమేఁటికిఁ జేసి మానినితోఁ దాను ॥విచ్చేయు॥

3. కూడేటిసంతసములు కొనగోళ్లవాండ్లెక్కె
పాడితోఁ గోమలికము పాదాల నిండె
యీడ నలమేలుమంగ నెనసె శ్రీవేంకటేశుఁ-
డాడినట్టే సేసె నింతి నట్టె దినదినము ॥విచ్చేయు॥

**అర్థములు:** ప. విచ్చేయు= రమ్మని ఆహ్వానించు, విభుడు= భర్త, కడకు= వద్దకు, పచ్చిసిగ్గు= మరుగులేని సిగ్గు, నెన్నడుమ= మధ్యలో, బట్టబయలు= బయటపడు.

1. కోమలి= స్త్రీ, కొప్పు కూడె= కొప్పులో చేరినవి, మేర= ఏర్పాటు, పాయము= వయసు, పేరడి= అధికమైన, చిగురించు= పల్లవించు, ఆరయ= విచారించగా, అంగన= స్త్రీ, ఆరడి= కష్టము.
2. తమకము= మోహము, చనుకొండలు= పెద్దవైన వక్షోజములు, రాసికెక్కు= అత్యధికమగు, విరహము= వియోగము, మతకము= మాయ, మానిని= మానాభిమానములుగల స్త్రీ.
3. కొంగోళ్ళ= సూదివంటి చేతి వేళ్ళ గోళ్ళు, వాళ్ళు= పదను, పాడి= పద్ధతి, కోమలికము= చక్కదనము, ఎనయు= సరిపోలు, ఆడినట్టే= చెప్పినవిధముగానే, ఇంతి= స్త్రీ, దినదినము= ప్రతిరోజు.

**భావము:** ఆ విభుణ్ణి చెలికడకు త్వరగా రమ్మని చెప్పవే! ఈ రమణి మరుగులేని సిగ్గులు మొగ్గలై ఇప్పుడు సంపూర్తిగా బహిర్గతమైనాయి.

కోరికలు తీగలు సాగి కొనసాగుతూ చెలికి కొప్పునకు చేరినవి. ఏర్పాటు కట్టడులతో శోభలు ముంచెత్తి వయసును మించి పరుగులెత్తుతున్నవి. అతిశయించిన ప్రేమ వల్ల ఆమె పెదవులు పల్లవిస్తున్నాయి. విచారించగా, ఈరోజుకీవిధంగా ఆమెకు బాధలన్నీ చేరి ఇబ్బందులకు గురిచేస్తున్నవి.

మోహావేశము పెరిగి పెరిగి ఆమె వక్షోజములు కొండలంత పరిమాణములైనవి. రతిక్రీడ ఆకాంక్ష ఆమె పృష్టభాగమునందు

కుప్పలై విహరిస్తున్నది. ఆమె మనసులోని విరహము దీర్ఘ ఉచ్ఛ్వాస నిస్వాసములై వ్యాపిస్తున్నవి. ఇంకా ఆ స్వామి ఈ మాయలు చేయడమెందుకు?

కూటమికి తహతహ లాడుతున్న ఆమె సంతోషాతిశయము కొనగోటి వేళ్ళవలె మంచి పదునెక్కి ఉన్నది. ఒక మంచి పద్ధతిలో ఆమె చక్కదనము పాదారవిందాలకు కూడా వ్యాపించినది. ఇక్కడ అలమేలుమంగ కూడా శ్రీవేంకటేశ్వరునికి సరిపోయిన విధంగా చేరుకున్నది. ఇక ప్రతి దినము స్వామి ఆడమన్నట్లే ఆడుతున్నది. మాట్లాడమన్నట్లే మాట్లాడుతున్నది.

## 343

**అవతారిక:** స్వామి ద్వాపరంలో శ్రీకృష్ణావతారంలో గొల్లెతలతో కోలాటమాడిన విషయం అన్నమయ్య ప్రస్తావిస్తున్నాడు.

### బౌళిరామక్రియ

ప. వాఁడే వాఁడే అల్లరివాఁ డదివో
నాఁడు నాఁడు యమునానదిలోన ॥పల్లవి॥

1. కాంతలు వలయపుకంకణరవములఁ
నంతంతఁ గోలాటమాడఁగను
చెంతల నడుమను శ్రీరమణుఁ డమరె
సంతతపుఁజుక్కలలో చంద్రునివలెను ॥వాడే॥

2. మగువలు ముఖపద్మములు దిరిగిరా-
నగపడి కోలాటమాడఁగను
నిగిడీ నడుమ నదె నీలవర్ణుఁడు
పగటుతోఁ గమలబంధునివలెను ॥వాడే॥

3. గోపిక లీరీతిఁ గోలాటమాడఁగ
యేపున శ్రీవేంకటేశ్వరుఁడు
వోపెలమేల్మంగ నురమున నిడుకొని
దీపించె మణులలో తేజమువలెను ॥వాడే॥

**అర్థములు:**ప. అల్లరివాడు= దుండగాలు చేసేవాడు, నాడు= ఇంతకు మునుపు కాలం.

1. వలయము= గుండ్రనైన, కంకణరవము= చేతి కడియముల శబ్దము, కోలాటమాడు= చేతులలో కోలలుంచుకొని ఆడెడి ఆట, చెంత= సమీపము, అమరు= పొందికపడు, సంతతము= ఎల్లప్పుడు, చుక్కలలో చంద్రుడు= ఆకాశములో నక్షత్రముల మధ్య మెరసెడి చంద్రుడు.
2. మగువలు= స్త్రీ, ముఖపద్మము= పద్మమువంటి ముఖము గలిగిన, అగపడి= కనిపించు, నిగిడు= దీర్ఘమైన, నీలవర్ణుడు= నీలమేఘ శ్యాముడైన శ్రీకృష్ణుడు, పగటు= ప్రకాశము, కమలబంధువు= తామరపుష్పాల చుట్టము.
3. ఈరీతి= ఈవిధమున, ఏపు= బాధ, ఓపు= భరించు, ఉరమున= వక్షస్థలమున, ఇదుకొను= ఉంచుకొను, దీపించు= ప్రకాశించు, మణులలో తేజము= నవరత్నాలలో ఉన్న కాంతి.

**భావము:** ఓ చెలులారా! అదుగో వాడే...వాడే సుమా! గొప్ప దుండగాలు చేసే అల్లరి కృష్ణుడు. మునుపు యమునా నదీ తీరములో తను చేసిన కొంటెపనులు అన్నీ ఇన్నీ కావు. చెబుతాను వినండి.

అక్కడి గొల్లెతల చేతి గుండ్రనైన కంకణముల అందమైన సవ్వడితో కోలాటమాడుతూ ఉండగా, ఈ శ్రీరమణుడు వారి మధ్యన చేరి సదా అక్కడే నిలబడి చుక్కలలో చంద్రునివలె ప్రకాశించినవాడు సుమా!

ఆ మగువలు సుందరమైన ముఖపద్మములతో వలయాకారముతో తిరుగుతూ కోలాటమాడుతూ ఉండగా పొడవైన దేహము

గల ఈ నీలమేఘశ్యాముడైన శ్రీకృష్ణుడు వారి మధ్యన నిలబడి మురళీరవము చేస్తూ , కమలబాంధవునివలె నిలబడినవాడితడే సుమా!

ఆ గొల్లెతలు ఈ విధముగా కోలాటమాడుతూ ఉండగా ద్వాపరములో ఉన్న ఆ స్వామే కలియుగమలో శ్రీవేంకటేశ్వరుడై నిలిచి అలమేలుమంగమ్మను భారమైనప్పటికిని, వక్షస్థలముపై ఉంచుకొని నవరత్నాలలో ఉన్న కాంతిపుంజము వలె దివ్య తేజోరాశివలె ప్రకాశిస్తున్నాడు సుమా!

## 344

**అవతారిక:** స్వామి తమపట్ల ఎందుకో నిరసన భావం చూపిస్తున్నాడని గ్రహించిన చెలులు, అలమేలుమంగమ్మతో కలిసి స్వామివారి ప్రసన్నం కోసం ప్రార్థిస్తున్నారు.

### శంకరాభరణం

ప. మొగమూ నోడితిమి మొన్ననే కూడితిమి
సగము జాణతనాలు చల్ల నింతవలెనా ॥పల్లవి॥

1. కానుక లిచ్చితిమి కన్నుల మెచ్చితిమి
పోనీరాదా యింకనైనాఁ బోయినపొద్దు
నానె నాకు వలపూ నవ్వులాయఁ దలఁపూ
మానరాదా యింకనైనా మామీఁదిఆనలు ॥మొగమూ॥

2. చేతుల మొక్కితిమీ చేఁతకుఁ జిక్కితిమీ
తోతో ఇంకానేల తొల్లిటివాని
రాతి రన్నీఁ గంటిమీ రచ్చలనే వింటిమీ
కాతర మింతేనేల కమ్మటి మాతోను ॥మొగమూ॥

3. దగ్గరి కూచుంటిమీ తప్పులు లేవంటిమీ
సిగ్గులు నీకిఁకనేల చెల్లు నన్నియు
నిగ్గుల శ్రీవేంకటేశ నే నలమేలుమంగను
అగ్గమై కూడితి మింకా నసురుసురేలా ॥మొగమూ॥

**అర్థములు:** ప. మొగమోడు= సంకోచించు, కూడు= కలియు, జాణతనము= నేర్పరితనము, చల్లు= వెదజల్లు, ఇంతవలెనా= ఈవిధముగానా?

1. పోయినపొద్దు= గడచిన కాలము, నాను= ఆలశ్యముచేయు, నవ్వులాయె= పరిహాసమగు, ఆన= ఒట్టు.

2. తోతో= వెంటబడు, తొల్లిటివాని= మునుపటి విషయాలు, రచ్చలు= అల్లరులు, కాతర= పిరికితనము, కమ్మటి= మరలా.

3. దగ్గరి= వద్ద, చెల్లు= సరిపోవు, నిగ్గు= కాంతి, అగ్గము= అధీనము, అసురుసురు= శ్రమమునందగు ధ్వన్యనుకరణము.

**భావము:** స్వామీ! మేమందరమూ సంకోచపడుతూ ఈమధ్యనే నిన్ను కలిశాము, ఇంకా ఎందుకు నీ నేర్పరితనాలు మాపై చూపించి ఇక్కట్ల పాలు చేస్తారు?

నీకు అనేక బహుమతులనిచ్చితిమి, కన్నులతోనే నీ కార్యాలన్నీ ప్రశంసించాము. గడచిన దోషాలనే పట్టుకుని సాధించడమెందుకు? వాటిని వదలి చేపట్టరాదా? నా పట్ల ఎంతో జాప్యము జరిగినది నా ప్రేమ నలుగురిలో నవ్వులపాలయినది. ఇకనైనా మీరు పట్టుదల వదలి, ఒట్లు పెట్టుకోవడం మానకూడదా?

నీకు చేతులెత్తి నమస్కరించి నీ చేతులలో చిక్కితిమి. ఇంకా పాత విషయాలను తలుచుకుంటూ మా వెంటబడడమెందుకు? నిన్న రాత్రి నీ అల్లరి చేష్టలన్నీ కళ్ళారా చూచితిమి. ఇంకా మా పట్ల పిరికితనమెందుకు ప్రదర్శిస్తున్నావు?

మీకు అత్యంత సమీపములో కూర్చొని మీ తప్పులేమీ లేవని ఒప్పుకొని యున్నవారము. ఇనా సిగ్గుపడడమెందుకు, మీ చేతలన్నీ చెల్లుబడి అవుతాయి కదా! ప్రకాశవంతమైన ఓ శ్రీవేంకటేశ్వరా! నేను అలమేలుమంగమ్మను నీకు సర్వథా అధీనమై కలిశాము, ఇంకా మీరు అసురుసురని విసుగును ప్రదర్శించడం న్యాయమా స్వామీ ! సెలవివ్వండి.

## 345

**అవతారిక:** శ్రీహరి అవతారాలను ఉటంకిస్తూ ఆయా అవతారాలలో జరిగిన సంఘటనలను చమత్కారంగా వివరిస్తున్నాడు అన్నమయ్య.

### పాడి

ప. అల్లవాఁడె భావించరె అంగన లిందరుఁ గూడి
వుల్లములో తనమాయ లుబ్బెనో శ్రీహరికి ॥పల్లవి॥

1. నేలా మిన్నుఁ గొలవఁగ మిన్నేటినురుగు
ఆలరి యీహరిమేన నంటుకొనెనో
పాలవెల్లి తచ్చఁబోఁగాఁ బైఁబడెనో తుంపురులు
మేలిమి కప్పురకాపు మెత్తిరో యీహరికి ॥అల్లవాడె॥

2. చిత్తగించి రేపల్లెఁ జీఁకటితప్పు సేయఁగా
అత్తల చీఁకటినలు పంటుకొనెనేమో
వొత్తి కరిఁ గావబోఁగా నొలికెనో పై మదము
మొత్తమిఁ బుళుగుకాపు ముంచిరో శ్రీహరికి ॥అల్లవాడె॥

3. అలమేలుమంగఁ దెచ్చి అఱుతఁ గట్టుకొనఁగా
పొలసి నవరసాలుఁ బొడచూపెనో
నెలవైన సొమ్ములెల్లా నిండుకొనె మేననెల్లా
అలరి శ్రీ వేంకటాద్రి నందమైనహరికి ॥అల్లవాడె॥

**అర్థములు:**ప. అల్లవాడు= అక్కడివాడు, అంగన= స్త్రీ, ఉల్లము= హృదయము, మాయ= ఇంద్రజాలము, ఉబ్బు= పొంగు.

1. నేలామిన్ను= భూమ్యాకశములు, కొలువగ= పూజింపగ, మిన్నేటి= ఆకాశగంగయొక్క నురుగు, అలరి= సంతోషపెట్టు, పాలవెల్లి= క్షీరాబ్ధి, తచ్చు= మథించు, తుంపురులు= బిందువులు, మెత్తు= అద్దు.
2. చీకటితప్పు= శృంగారకార్యము, అత్తల= అచ్చట, ఒలుకు= చిందు, పుళుగుకాపు= పునుగుపిల్లినుండి తీసెడి సుగంధ ద్రవ్యము.
3. అరుత= కంఠమందు, పొలయు= వ్యాపించు, పొడసూపు= కనిపించు, అలరి= సంతోషము.

**భావము:** చెలులారా! ఈ స్వామి అక్కడివాడన్న సంగతి గ్రహించారా!ఈ శ్రీహరి మనసులో ఎన్ని మాయలు దాచుకున్నాడో, మనసెలా ఉప్పొంగుచున్నదో గమనించారా?

ఈ సమస్థ భూమండలాన్ని, ఆకాశాన్ని కొలవడానికి వామనావతారుడై నిలబడ్డప్పుడు ఆ ఆకాశ గంగ యొక్క నురుగు ఈ శ్రీహరి ఒంటికి అంటుకున్నదేమో! పాలసముద్రాన్ని మథించిన సమయంలో చిందిన పాల బిందువులు ఈ హరి శరీరంపై బడినవేమో! ఆ సమయములో శ్రేష్టమైన కర్పూర పొడిని స్వామికి అద్దినారేమో కదా!

తెలిసి తెలిసి సావధానుడై రేపల్లెలో రాత్రులందు గొల్లచెలులతో శృంగార కార్యాలు చేస్తున్న సమయములో ఆ చీకటి నల్లని నలుపు ఈ హరి శరీరానికి అంటుకున్నదేమో! లేక గజేంద్రమోక్ష సమయములో ఏనుగును రక్షింప బూనినప్పుడు ఆ ఏనుగుయొక్క మదజలం స్వామి శరీరంపై చిందినదో ఏమో! పునుగుపిల్లి సుగంధ ద్రవ్యాన్ని స్వామికి కాపు పెట్టినారేమో కదా!

అలమేలుమంగమ్మ తెచ్చుకుని మెడలో ముడి వేసుకొనగా నవరసాలు వ్యాపించినట్లున్నవి. స్వామివారికి స్థావరంలో ఉన్న

నగలన్నీ శరీరంపై నిండుగా అలంకరింపబడ్డాయి. ఈ అందమైన శ్రీవేంకటాద్రిలో నున్న శ్రీహరి యొక్క అవతార కథలు చెప్ప సామాన్యులకు శక్యమా?

## 346

**అవతారిక:** శ్రీమహావిష్ణువు కీర్తి చంద్రికలను ప్రశంసిస్తూ చెలులు హారతి పడుతున్న దృశ్యం అన్నమయ్య వర్ణిస్తున్నాడు.

### లలిత

ప. అంగన లీరే యారతులు
అంగజగురునకు నారతులూ ॥పల్లవి॥

1. శ్రీదేవితోడుతఁ జెలఁగుచు నవ్వే-
ఆదిమపురుషుని కారతులూ
మేదినీరమణి మేలములాడేటి-
ఆదిత్యతేజున కారతులూ ॥అంగన॥

2. సురులకు నమృతము సొరది నొసంగిన-
హరి కిదివో పసిఁడారతులూ
తరమిది దుష్టుల దనుజుల నడఁచిన-
అరిభయంకరున కారతులూ ॥అంగన॥

3. నిచ్చలుఁ గల్యాణనిధియై యేఁగేటి-
అచ్చుతునకు నివె యారతులూ
చొచ్చి శ్రీ వేంకటేశుఁడు నలమేల్మంగ
యచ్చుగ నిలిచిరి యారతులూ ॥అంగన॥

**అర్థములు:**ప. అంగన= స్త్రీ, యారతి= హారతి, అంగజగురుడు= మన్మధుని తండ్రి.

1. తోడుత= కలసి, చెలగు= చుట్టుకొని, ఆదిమపురుషుడు= ఆదిపురుషుడు,మూలపురుషుడు, మేదినీ రమణి= భూదేవి, మేలములాడు= సరసములాడు, ఆదిత్యతేజుడు= సూర్యుని తేజస్సుగలవాడు.
2. సురలు= దేవతలు, సొరది= వరుస, పసిడి= బంగారు, తరమిడి= అత్యంత, దనుజులు= రాక్షసులు, అడచు= నసింపజేయు, అరిభయంకరుడు= శతృవులకు భీతిగొలుపువాడు.
3. నిచ్చలు= ఎల్లప్పుడు, కల్యాణనిధి= కల్యాణములాడు, ఏగు= నడచు, అచ్చుతునకు= అచ్యుతునికి, చొచ్చి= ప్రవేశించి, అచ్చుగ= ఒప్పుగ.

**భావము:** ఓ చెలులారా! మీరంతా వచ్చి స్వామికి హారతినివ్వండి. ఈ మన్మధునికి తండ్రైన శ్రీమహావిష్ణువునకు హారతులెత్తండి.

శ్రీదేవితో కలిసి చిరునవ్వులు చిందించే ఈ మూలపురుషునికి హారతులివ్వండి. భూదేవితో కలిసి సరస శృంగారాలతో తేలియాడే ఈ సూర్యతేజునికి హారతులివ్వండి.

దేవతలకు వరుసక్రమంలో అమృతాన్ని పంచి యిచ్చిన ఆ శ్రీహరికి ఇవిగో బంగారు పళ్ళెరములతో హారతులు సమర్పిస్తున్నాము. దుష్ట రాక్షసులను దునుమాడి నడచిన శతృభయంకరుడైన శ్రీమహావిష్ణువునకు ఇవే మా హారతులు.

నిత్య కల్యాణము పచ్చతోరణములతో తులతూగే అచ్యుతునకు ఇవే మా హారతులు. ఇచ్చుట వేంకటాద్రిపై ప్రవేశించి అలమేలుమంగమ్మతో కూడి యొప్పుగా వెలసిన శ్రీవేంకటేశ్వరునకివే మా హారతులు.

**విశేషము:** ఈ కీర్తనలో శృంగార ప్రసక్తి లేక ఆధ్యాత్మిక ఛాయలు గలిగి ఆధ్యాత్మిక కీర్తనగా భావించదగ్గ రచన.

## 347

**అవతారిక:** స్వామి బయటకు రాకుండా  గృహం లోలోన ఉండి ఏమి చేస్తున్నాడో అని అమ్మ చింతపడుతూ యోచిస్తున్నది.

### సామంతం

ప. ఎవ్వరు వద్ద నున్నారో యేమి సేసీనే
దవ్వుల నెదురురాక తా నేమి సేసీనే ॥పల్లవి॥

1. పచ్చనిచిగురువంటి పాదాల నడచివచ్చె-
నిచ్చకపుఁబతి లోన నేమి సేసీనే
నెచ్చలిమే నింతలోన నిండాఁ గడుఁజెమరించె
యెచ్చుటఁ బరాకైనాఁ డేమిసేసీనే ॥ఎవ్వరు॥

2. మంచిమాణికాలురాలేమాట లాడీఁ జెలి యీడ
ఇంచుకంతా నెఱఁగడు యేమి సేసీనే
మంచముపైఁ బవ్వళించె మగుళ యలసి వచ్చి
యెంచినయెన్నికలాయ నేమిసేసీనే ॥ఎవ్వరు॥

3. కలువరేకులవంటి కన్నులఁ జూచె చెలి-
నెలమిఁదాఁ దేరిచూచీ నేమీ సేసీనే
బలిమి శ్రీ వేంకటాద్రిపతి యింతి నిటు గూడె
యిలఁ దనభాగ్యమాయ నేమి సేసీనే ॥ఎవ్వరు॥

**అర్థములు:** ప. సేసీనీ= చేస్తున్నారో, దవ్వు= దగ్గర, ఎదురు= ముందుకువచ్చు.

1. పచ్చనిచిగురు= లేలేత ఆకులు, ఇచ్చకము= ముఖప్రీతి, నెచ్చెలి= స్నేహితురాలు, చెమరించె= స్వేదపూరితమగు, పరాకు= ఉదాశీనత.
2. మాణిక్యములు రాలేమాట= నవ్వితే నవరత్నాలు రాలు వంటి ఉపమానము, ఇంచుక= కొంచెము, ఎరుగడు= తెలియదు, మగుళ= మగు వ, ఎన్నిక= ఎంపిక, కలువరేకులవంటి కన్నులు= ఉత్పల పుష్ప రేకులవంటి కన్నులు, ఎలమి= వికాసము, భాగ్యము= అదృష్టము.

**భావము:** ఆ స్వామి వద్ద ఎవరున్నారో! ఏమి చేస్తున్నారో! ఏమీ తెలియరాడం లేదు. నాకు ఎదురువచ్చి ముందు నిలబడకుండా తానేమి చేస్తున్నాడో!

చెలి పచ్చని లేలేత పాదలతో నడచి వచ్చుచిఉన్నది గదా, ముఖప్రీతి మాటలతో అలరించే ఆ పతి ఇప్పుడు లోపల కూర్చొని ఏమి చేస్తున్నాడే?

మాట్లాడితే చాలు నవరత్నాలు దొర్లిపడే యువతి ఇక్కడనే ఉన్నది. కొద్దిగా కూడా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించడం లేదు. ఆ స్త్రీ బడలికతో పట్టెమంచంపై పవళించి యున్నది. ఆయన ఎంచుకొన్న ఎంపికలలో ఉత్తమమైనది  కదా! ఇంకా ఏమి చేస్తున్నాడే?

కలువపూల రేకులవంటి కన్నులుగల యాడుది స్నేహభావం ఉప్పొంగుతూ ఉండగా తేరి చూస్తూ ఉన్నది. ఆ స్వామి ఏమి చేస్తున్నాడే? తన ప్రతాపముతో శ్రీవేంకటేశ్వరుడు ఆ ఇంతిని నేడు కూడుకున్నాడు. ఇక ఇలలో ఆ యింతి అదృష్టాన్ని ఏమని ప్రశంసించగలమే!

## 348

**అవతారిక:** స్వామిమీద అధిక నమ్మకమున్న అమ్మ తనవాడేననీ, ఎక్కడికిపోగలడన్న ధీమా వ్యక్తం చేస్తున్నది.

## వరాళి

ప. ఏమన్నా హితవేకాక యెగ్గు నాకేలే
కామించి తనుఁ జూడఁగఁ గలిగితేఁ జాలు ॥పల్లవి॥

1. తలఁపులో నున్న వాఁడు తలఁచే నే నెప్పుడైనా
యెలమిఁదా నేడ నున్నా నేమాయనే
వలపు నాకే కద్దు వడి నేఁదన్ను విడువ
చెలఁగి యేపనులైనాఁజేయనీవే తాను ॥ఏమన్నా॥

2. పెదవి పై నున్నవాఁడు పిలిచే నే నెప్పుడైనా
పొదలి యాకెయింటికిఁ బోయిరానీవే
పదరక నాకుఁబోదు పయికొనేఁగాని నేను
అదనాయ తనతోడిఅలుకేల నాకు ॥ఏమన్నా॥

3. చేతికి లోనయినాఁడు చెనకే నే నెప్పుడైనా
రాతిరేమి పగలేమి రానియ్యరే
యీతల శ్రీ వేంకటేశుఁ డింతలో విచ్చేసి కూడె
కాతరాన వెనకటికడమేల యిఁకను ॥ఏమన్నా॥

**అర్థములు:** ప. హితవు= ప్రీతి, ఎగ్గు= దోషము, కామించు= మోహించు.

1. తలపు = ఆలోచన, తలచు= అనుకొను, ఎలమి= వికాసము, ఏడ= ఎక్కడ, వడి= వేగము, చెలగి= వ్యాపించు.
2. పెదవిపైనుండు= పిలిస్తే పలికేవాడు,సదా నామాన్ని పలవరించడము, పొదలి= సంతసించి, ఆకె= ఆమె, పదరు= ఆక్షేపించు, పైకొను= యత్నించు, అదను= సమయము, తోడి= తో.
3. చేతికి లోనగు= చెప్పినమాట బుద్ధిగా విను,చేతిలోని మనిషి, చెనకు= తాకు, ఈతల= ఇవతల, విచ్చేసి= వచ్చి, కాతరము= పిరికి,భయము, కడము= లోపము.

**భావము:** స్వామి ఏమిచేసినా ఏమన్నప్పటికి నాకు ప్రియముగానే ఉంటుంది. నేను వారిలో దోషాలెంచలేను. నన్ను మోహించి ప్రేమాభిమానాలతో చూస్తే అంతే చాలు.

స్వామి ఎల్లప్పుడూ నా ఆలోచనలలో నున్నవాడు కనుక నేను ఎప్పుడైనా స్వామివారిని తలుచుకోగలను. వికాసముతో ఆ స్వామి ఎక్కడుంటే నాకేమైంది చెప్పు? ఆయన వలపంతా నా మీదనే ఉన్నది కదా అంత త్వరగా స్వామిని విడుస్తానా చెప్పు? ఆ స్వామి విజృంభించి ఎక్కడైనా ఏ కార్యాలైనా చేయనీయమనవే!

స్వామి నా పెదవులమీదనే ఉండి పిలువగానే ఓ అంటూ వస్తాడు. అంత సంతోషంగా ఉంటే ఆమె ఇంటికి పోయిరమ్మని చెప్పవే! నేనేమీ ఆక్షేపణలు చెప్పను నాకు పోయేదేమీ లేదు. నేను యత్నిస్తే స్వామి రానంటాడా? సమయమయింది వెళ్ళాడు, తనమీద నాకు అలకలు అవీ ఎందుకే!

స్వామి నాచేతికి అందేంత దూరంలో ఉన్నవాడు. నేను ఎప్పుడు ఆయనను ముట్టుకోవాలనుకుంటే అప్పుడు ముట్టుకోగల దూరంలో ఉంటాడు. రాత్రేమిటి పగలేమిటి? ఆయనను ఎప్పుడయినా రానివ్వండి. ఇదుగో చూడండి! ఈకడ శ్రీవేంకటేశ్వరుడు ఇంతలోనే వచ్చేసి నన్ను కూడుకున్నాడు. నేనేదో భయపడినట్లు, వెనుకటి ఆయన లోపాలన్నీ ఎత్తి చూపడమెందుకే!

## 349

**అవతారిక:** అన్నమయ్య కోలాటమాడే స్త్రీల సౌందర్యాన్ని శృంగారంగా వర్ణిస్తున్నాడు.

## వసంతం

ప. వేడుక వసంతము వేళ నిదే
వాడల వాడల వెంట వనిత లాడేరు ॥పల్లవి॥

1. కేలుఁగేలుజుట్టిపట్టి కెందామర మోములెత్తి
కోలఁగోలఁ దాఁకఁజేసి గుంపువాయక
చాలుకొని యిద్దరేసి జంటలై సతులు గూడి
వోలి వేరొకతెకోల నొడ్డుతా నాడేరు ॥వేడుక॥

2. పాలిండ్లు గడలఁగ బరువైనతురుముల
చీలుచు సోలుచుఁ గొంతవెనకకును
మేలిమిపిఱుఁదులతో మెరయుచు మురియుచు
కోలలఁబెడమరలి కోలాటమాడేరు ॥వేడుక॥

3. కది శౌందురుమోములు కన్నులఁదేలించి చూచి
పదతాళగతులకు పడఁతులెల్లా
అదివో శ్రీ వేంకటేశుఁ డల మేలుమంగతోడ
ముదమంది చూడఁగాను ముందట నాడేదు ॥వేడుక॥

**అర్థములు:** ప. వేడుక= వినోదము, వాడలు= వీధులు.

1. కేలు= చేయి, కెందామర= ఎఱ్ఱతామర పుష్పము, మోము= ముఖము, కోల= కోలాటపు కఱ్ఱ, తాకజేయు= తగులునట్లు చేయు, వాయక= విడిచిపెట్టక, చాలుకొను= గుంపుగట్టు, వోలి= వరుస, ఒడ్డు= పందెమాడు.
2. పాలిండ్లు= రొమ్ములు, కడలు= అలలాగా ఊగు, తురుము= పూలకొప్పు, చీలు= విడిపోతూ, సోలుచు= వాలు, మేలిమి= స్వచ్ఛమైన, మెరయు= ప్రకాశించు, మురియు= సంతసించు, కోలలు= కోలాటపు కఱ్ఱలు, పెడమరలు= వెనక్కు తిరుగు.
3. కది= భయపడు, శౌందురు= పొడవైన, తేలించి= సంతసించు, పదగతులకు= లయకు అణుగుణంగా, పడతులు= స్త్రీలు, ముదము= సంతోషము, ముండట= ముందుభాగము.

**భావము:** వినోదించి వసంతాలాడుకునే వేళ ఇదుగో ఆసన్నమైనది. వీధులలో ఆ యువతులు ఎలా కోలాటాలాడుతూ క్రీడిస్తున్నారో చూడండి.

రెండు కోలాటపు కఱ్ఱలను ఎత్తి పట్టుకొని, వారి తామరపుష్పములవంటి ముఖారవిందాలను ఎత్తిపట్టుకొని, కఱ్ఱా కఱ్ఱా తాకిస్తూ గుంపులోనుండి బయటకు రాకుండా తిరుగుతూ, గుంపుగా యిద్దరిద్దరు జంటలుగా వారి వారి ప్రియురాళ్ళతో కలిసి, వరుసలలో నిలబడి పందెమొడ్డుతూ ఆడుతున్నారు చూడండి.

ఆ ఎగురుతున్న గెంతులకు వారి బలమైన రొమ్ములు కూడా అలలలాగా ఎగురుతూ ఉండగా బరువైన పూలకొప్పులు ధరించి ఒక్కోసారి ముందుకు మరోసారి వెనకకు వస్తూ, శ్రేష్ఠమైన వారి పిఱ్ఱలు ప్రకాశిస్తూ కనిపిస్తూ ఉండగా సంతోషంగా కఱ్ఱలను వెనుకా ముందూ త్రిప్పుతూ ఎలా కోలాటాలాడుతున్నారో గమనించండి.

కంగారు పడుతూ వారి దీర్ఘమైన ముఖారవిందాలతో కండ్లు తాదాత్మ్యతతో తేలవేస్తూ సంతోషంగా తాళం తప్పకుండా లయతో వెనుకకు వంగుతూ ఎలా కోలాటమాడుతున్నారో చూడండి. అదుగో అటు చూడండి శ్రీవేంకటేశ్వరుదు అలమేలుమంగమ్మతో కలిసి వినోదంతో వీక్షిస్తూ ఉంటే ఆ చెలులు వారి ముందు సుందరంగా కోలాటమాడుతున్నారు.

350

**అవతారిక:** స్వామి పొందుగోరే ఒక చెలి అసూయతో అలమేలుమంగమ్మను నిందిస్తున్నది.



డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య

## పాడి

ప. అప్పటి మానవు వెంగే లదేమే నీవు
కుప్పలైన వలపుల గురిగాఁ జూచేవు ॥పల్లవి॥

1. వద్దే నాతో నింకా వట్టిసటజంకెనలు
గద్దించి తీసిన లోనుగాక మానేవా
కద్దే నావంకఁ దప్పు కప్రవిడె మిచ్చినది

2. వొద్దిక మదనమెత్తి వొకటొక టాడేవు ॥అప్పటి॥
పోపో నాతోనేల పొద్దువోనియానలు
చూపుల నాయమంటితే చొక్కకుండేవా
కాపాడి గుబ్బలఁ గొంగుగప్పినది నేరమీ(మా?)
తీపులపెదవి వంచి తిట్టేవు లోలోనే ॥అప్పటి॥

3. రావే నాయెడనేలే రతిలో నీ గుట్లు
మోవి నిన్నుఁ జెనకితే మొక్కకుండేవా
యీవేళనే శ్రీ వేంకటేశుఁడ నేఁ గలసితి
తోవ నలమ్మేలంగవు తొక్కేవు పాదములు ॥అప్పటి॥

**అర్థములు:** ప. అప్పటి= మునుపటి, వెంగెము= పరిహాసము, కుప్పలు= అధికము,రాసులు, గురి= లక్ష్యము.

1. సట= కపటము, జంకెనలు= బెదిరింపులు, గద్దించు= అదరగొట్టు, లోనుగాక= లొంగక, కద్దు= కలదు, నావంక= నా వైపున, కప్రవిడెము= కర్పూరతాంబూలము.
2. ఒద్దిక= అనుకూలము, మదనమెత్తు= సమృద్ధి గా విలాసాలు ప్రదర్శించు, పొద్దుపోని యానలు= కాలక్షేపం కోసమాడే ప్రమాణాలు, ఆయము= జీవస్థానము, చొక్కు= మత్తుగొల్పు, నేరమీ= నేరమా.
3. ఎడ= స్థానము, గుట్లు= రహస్యాలు, మోవి= ముఖము, చెనకు= తాకు, తోవ= దారి.

**భావము:** అప్పటినుండీ నీ పరిహాసపు మాటలు మానవు కదా! నీవు ప్రేమాభిమానములే ముఖ్య లక్ష్యంగా చూస్తావా? ఇంకేమీ పట్టించుకోవా?

నాతో ఈ కపటపు బెదిరింపులు ఇక చాలించు, కాస్తా బెదిరిస్తే లొంగక మానుతావా? నా వంక తప్పున్నది. కర్పూరపు తాంబూలమిచ్చినది. అనుకూలముగా ఉంటూ సమృద్ధిగా శృంగార చేష్టలు ఒకటొకటి ఆడుతూ ఉంటావు.

పోపోవే నాతో నీ కాలక్షేపం కోసమాడే ప్రమాణాలు, ఒట్లు ఎందుకు? చూపులు జీవస్థానాలను తాకితే మత్తు కలగకుండా ఉంటుందా? నిన్ను రక్షించి నీ రొమ్ములు బయటపడకుండా కొంగు నీకు కప్పినదే తప్పంటావా? నీ అందమైన పెదవులను వంచి ఏవో తిట్లు లోలోపల తిట్టుకుంటూ ఉంటావు.

రావే! నా స్థానములో ఎందుకే నీ రతి రహస్యాలన్నీ ప్రదర్శిస్తావు. నీకా స్వామి ముఖం ఆనిస్తే నమస్కరించకుండా ఉండగలవా? ఈ రోజు నేను శ్రీవేంకటేశ్వరుని కలిసాను. దారిలో అలమేలుమంగమ్మవైన నీవు పాదములు త్రొక్కావు సుమా!

351

**అవతారిక:** ద్వాపర యుగంలో శ్రీకృష్ణుడై గొల్లెతలతో చేసిన చిలిపి పనులను వర్ణిస్తూ, ఆ గోవిందుడే ఈ వేంకటాద్రీశ్వరుడు సుమా అంటున్నాడు అన్నమయ్య.

## సామంతం

ప. గొల్లెతల నింతసేసీ గోవిందుఁడు
కొల్లకాఁడు రేపల్లె గోవిందుఁడు ॥పల్లవి॥

1. పలుకుల భ్రమయించె భావములఁ గరఁగించె
కొలనికరత నవ్వె గోవిందుఁడు
యెలయించి యప్పటి మాయింటిలోనే పవ్వళించె
కొలఁదిమీరినవాఁడు గోవిందుఁడు ॥గొల్లెతల॥

2. వూరక పువ్వుల వేసె నొకటొకటేసేసె
కూరిమిఁ దప్పకచూచె గోవిందుఁడు
చేరి మావారుండ వారు చెప్పరాదు తనదూరు
కోరి యశోద నీ బిడ్డ గోవిందుఁడు ॥గొల్లెతల॥

3. సమ్మతించఁ జేయివేసె చన్నులతోనే రాసె
కుమ్మరించె వలపులు గోవిందఁడు
దొమ్మిసేసి మమ్ముఁగూడె దొరవలె నదె వాఁడె
కొమ్మరో శ్రీ వేంకటాద్రి గోవిందుఁడు ॥గొల్లెతల॥

**అర్థములు:** ప. గొల్లెత= గొల్లభామ, కొల్లకాడు= దోపిడీచేసేవాడు.

1. భ్రమయించు= మత్తులోదింపు, కరగించు= పారునట్లుచేయు, కొలనికరత= కొలనులో ఉండి చేయు అకార్యములు, ఎలయించు= పురిగొల్పు, కొలదిమీరు= అపరిమితము.
2. ఒకటొకటి చేయు= ఒక్కొక్క పని చేయు, కూరిమి= స్నేహము, దూరు= నింద.
3. సమ్మతించు= అంగీకరించు, చన్నులతో= వక్షోజములను, కుమ్మరించు= ఒలకబోయు, దొమ్మి= అందరు కలిసి చేయు పని, దొర= ప్రభువు,నాయకుడు, కొమ్మ = వనిత.

**భావము:** ఈ గొల్లభామలనెంత ఆరడి పెడుతున్నాడో కదా ఈ గోవిందుడు. ఈ రేపల్లెలో గొప్ప దోపిడీగాడు ఈ గోవిందుడే సుమా!

మాటలతో మత్తు కలిగించి ఎన్నో ఆలోచనలను కలిగిస్తాడు. కొలనులో ఉండి అకార్యాలు చేస్తూ చిరునవ్వులు చిందిస్తూ ఉంటాడు. ఒకసారిఎవరో పురిగొల్పినట్లుగా మా ఇంటిలోనే పవళించాడు. కోరికలు అపరిమితములై ఉన్నవాడీ గోవిందుడు.

ఊరకే ఒక్కటొక్కటే పుష్పాలను విసురుతూ, చిలిపి చేష్టలు చేస్తూ ఉంటాడు. స్నేహం కోసం అర్రులు చాస్తూ ఉంటాడీ గోవిందుడు. ఇంటిలో మా వారందరూ ఉండగా ఈ గోవిందుడు చేసేపనులు, నిందలు చెప్పరానివై ఉన్నవి. కోరి కోరి యశోదమ్మకు ముద్దుబిడ్డడీ గోవిందుడు.

తనను అంగీకరింపమని సైగలు చేస్తూ రొమ్ములను సుతారంగా రాస్తూ ఉంటాడు. ఎన్నో ప్రేమలను ఒలకబోసి నిలబడతాడీ గోవిందుడు. గుంపుతో వచ్చి మా గొల్లెతలను ఒక నాయకుడు వలె వచ్చి కలుస్తూ ఉంటాడు. అమ్మలారా! గొల్లభామలారా! ఆ గోవిందుడే ఈ వేంకటాద్రిపై వెలసిన శ్రీవేంకటేశ్వరుడు సుమా!

## 352

**అవతారిక:** స్వామి ద్వాపరంలో శ్రీకృష్ణునిగా పదహారు వేలమంది గొల్లెతలతో విహరించిన విషయం వివరిస్తున్నాడు ఒక చెలి వివరిస్తున్నది.

### లలిత

ప. నిజము చెప్పఁబోతే నెలఁతలు నవ్వేరు
భజన నెందరికని బాస లిచ్చేవయ్యా ॥పల్లవి॥

1. చెప్పరాదు చెలులు పదారువేలు
నెప్పున నీవాడుకొంటే నిజమందురా
పిప్పిగట్ట నాసలేల పెదవు లెండీఁ జాలు
కప్పుర మిచ్చేఁగానీ కాఁగిలించవయ్యా ॥నిజము॥
2. నమ్మిరి గొల్లెతలు నీనయగారితనములు
కమ్మరాఁజేయఁగఁబోతే గై కొందురా
చిమ్మి చెక్కునొక్కనేల చేతులు నొచ్చీఁ జాలు
వుమ్మడి గుచాల నొత్తే నొద్దికి రావయ్యా ॥నిజము॥
3. కంటిమి నీనేరువులు కాగిటిలోనే నేడు
అంటి కూడితే భ్రమయక వుందురా
వొంటినే శ్రీవేంకటేశ వొడబరచి పొందితి-
వింటిలోఁ బానుపు మీది కిక రావయ్యా ॥నిజము॥

**అర్థములు:**ప. నెలతలు= స్త్రీలు, భజన= ధైర్యము, బాస= మాట.

1. నెప్పు= ఉపాయము, ఆడుకొను= విహరించు, పిప్పిగట్టు= రసవిహీనమగు, పెదవులెండి= పెదవులు తడియారు, కప్పురము= కర్పూరము, కాగలించు= కౌగలించు.
2. నయగారితనము= మృదువచనములు మాట్లాడే వాడు, కమ్మర= నప్పునట్లు, కైకొను= అందుకొను, చిమ్మి= విరజిమ్మి, చెక్కు= చెక్కిలి, నొచ్చు= నొప్పిపుట్టు, ఉమ్మడి= పొత్తు, కుచాలు= రొమ్ములు, ఒద్దికి= దగ్గరకు.
3. నేరుపు= నైపుణ్యము, కాగిటి= కౌగిటి, అంటి= తాకి, కూడు= కలియు, భ్రమయు= మత్తులో మునుగు, ఒంటినే= ఒంటరిగా, ఒడబరచి= ఒప్పించి, పొందితి= కూడితి, పానుపు= పట్టెమంచముపైనున్న పరుపు, మీద= పైకి.

**భావము:** స్వామీ! మీ విషయంలో నిజం చెప్పలంటే స్త్రీజనమంతా నవ్విపోతారు. ఇలా ధైర్యం చెప్పి ఎందరికి మాటలిచ్చి లోబరుచుకుంటావయ్యా!

చెలులు ఒకరా ఇద్దరా? పదహారు వేలమంది ఉన్నారు. ఉపాయముతో నీవు వారితో విహరిస్తే అదంతా వాస్తవమంటారా? వాళ్ళకు లేనిపోని ఆశలెందుకు కల్పిస్తావు. వారి పెదవులన్నీ ఆశలతో తడియారిపోయి ఉన్నాయి ఇక చాలు స్వామీ ఆపండి. నీకు కర్పూర తాంబూలం సమర్పించుకుంటాను కానీ ఇక నన్ను కౌగిలించుకోవయ్యా!

ఆ గొల్లెతలు మీ మృదువచనాలకు బానిసలై నిన్నే నమ్ముకొని ఉన్నారు. ఏదైనా నప్పే విధంగా జెయ్యడానికి ప్రయత్నిస్తే వాళ్ళను అలా అందుకొంటారా? నీ వలపులన్నీ విరజిమ్మి వాళ్ళ చెక్కిళ్ళు నొక్కడమెందుకు? తర్వాత చేతులు నొప్పి పుట్టేది మీకే కదా! పొత్తుతో రొమ్ములను ఒత్తుతాను నా వద్దకు రావయ్యా!

స్వామీ! నీ నైపుణ్యాలన్నీ నీకౌగిటిలో చేరి చూస్తూనే ఉన్నాము. నీవు ఒక్కసారి తాకితే చాలు మత్తులో మునగకుండా ఉంటారా? శ్రీవేంకటేశ్వరా! ఒంటరిగా నేను నిన్ను ఒప్పించి పొందుకున్నాను కదా ఇంటిలోనికి దయచేసి పట్టెమంచంపై ఉన్న పానుపునెక్కి నన్ను మీ ప్రేమాభిమానాలతో ముంచెత్తండి స్వామీ!

## 353

**అవతారిక:** స్వాధీనపతికయైన అలమేలుమంగమ్మ స్వామిని మనసా, వాచా, కర్మణ నమ్మి ఆరాధిస్తున్నది. స్వామి ఎప్పటికి తనవాడేనని చెలులతో ముచ్చటిస్తున్నది.

## సామంతం

ప. అతడు నాకుఁ గలఁడనేదే చాలు

| | | |
|---|---|---|
| | చతురుని దూరకురే సారెసారె నిఁకను | ॥పల్లవి॥ |
| 1. | మలసి వేరొకతెకు మనసిచ్చునా అతఁడు | |
| | అలరి మాఁటలాడితే నాడుఁగాక | |
| | తలఁపు నామీఁద నుండు తను వెక్కడ నుండినా | |
| | వలసినప్పుడు తానే వచ్చీ నాకడకు | ॥అతడు॥ |
| 2. | అటువలెఁ బరసతి కాసపడునా అతఁడు | |
| | నటనల నవ్వితేను నవ్వీఁగాక | |
| | యెట్టైనా నేనే యతఁడు యెవ్వ రేమిచెప్పినాను | |
| | తటుకనఁ దనమాఁట తప్పనివాఁ డతడు | ॥అతడు॥ |
| 3. | పక్కన నెవ్వరికైనా భ్రమసునా నేఁడతఁడు | |
| | చొక్కుఁగన్నులఁ జూచితేఁ జూచుఁగాక | |
| | యిక్కడ శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె | |
| | దక్కె నామతికే మతి తారుకాణ అతఁడు | ॥అతడు॥ |

**అర్థములు:**ప. కలడనేది= నాకు తోడై ఉన్నాడనే విషయం, చతురుడు= నేర్పరి, దూరకు= ఆ విషయంలో వేలు పెట్టవద్దు, సారె సారె= మాటిమాటికి.

1. మలసి= వీచు, అలరి= సంతోషపెట్టు, తలపు= ఆలోచన, తనువు= శరీరము, వలసినప్పుడు= అవసరమైనప్పుడు, తానే వచ్చీ= స్వామే స్వయంగా వస్తాడు.
2. పరసతి= అన్యుల భార్య, ఆసపడు= కోరుకొను, నటనలు= వేషాలు, తటుకన= తటాలున.
3. భ్రమయు= భ్రమించు,పరవశమగు, చొక్కుకన్నులు= మత్తుతో గూడిన కండ్లు, దక్కె= పొందె, మతికేమతి= ఆలోచనల్లోనే ఆలోచన, తారుకాణ= ఋజువు.

**భావము:** ఆ స్వామి నావైపునున్నాడనే విషయమే నాకు ఆనందాన్నిస్తుంది. ఆ స్వామి అసలే సామాన్యుడు కాదు బహు నేర్పరి సుమా! ఆ విషయంలో మీరెవ్వరూ మాటిమాటికీ జోక్యం చేసుకోవద్దు.

అతిశయించి వెళ్ళి ఇంకొక స్త్రీకి మనసిస్తాడా నా స్వామి? ఒకవేళ సంతోషంతో సంభాషణలు చేస్తే చేయవచ్చు. ఆయన శరీరం ఎక్కడ ఉన్నప్పటికి, ఆయన ఆలోచనలు మాత్రం నామీదనే ఉంటాయి. అవసరమైనప్పుడు స్వామి తప్పక నా ముందు నిలుస్తాడు సుమా!

అందరి వలె ఇతరుల భార్యలను ఆశపడేవాడు కాదు నా మగడు. ఏదో వేషాలు వేస్తూ పరస్త్రీలతో నవ్వులు నవ్వితే నవ్వ వచ్చు గాక! ఏవిధంగానైనా, ఎవరెన్ని చెప్పినప్పటికి స్వామి నా విభుడే! ఎప్పుడూ నా మాట తప్పి ఎరుగని వాడు సుమా!

ప్రక్కన ఎవరైనా ఉంటే పరవశమౌతాడానుకుంటున్నారా నా స్వామి? ఒకవేళ మత్తుకళ్ళతో చూస్తే చూడొచ్చుగాక. చూడండి ఇక్కడ ఇంతలోనే శ్రీవేంకటేశ్వరుడు విచ్చేసి నన్ను కూడినాడు. ఇప్పుడు ఋజువైనదా? నా ఆలోచనలలోనే స్వామి ఆలోచనలు సదా సమానమై నిలుస్తాయని మీకు అర్థమైనదా!

## 354

**అవతారిక:** స్వామి తొందరపడి ఏవో అకార్యాలు చేసినా, పశ్చాత్తాపంతో సిగ్గుపడి అమ్మ ఎదుటకు చేరి సిగ్గులు ఒలకబోస్తున్న సందర్భంలో అమ్మ చెలులతో చేసిన సంభాషణ.

### రామక్రియ

ప. సిగ్గున మునిఁగెను చింతలఁ బొరలెను

యెగ్గులెంతురా యిఁకనేలే ॥పల్లవి॥

1. శిరసును వంచెను సెలవుల నవ్వెను
మరిగెనుఁ బతి నీమాఁటలకే
నిరతితో నలసెను నిట్టూర్పులు నించెను
యెరపరికములఁ జల మిఁకనేలే ॥సిగ్గున॥

2. నిన్నిటు చూచెను నేలలు వ్రాసెను
సన్నల నీలో సణఁగులకే
యిన్నిటి కొడఁబడె నిటు చేయివేసెను
యెన్నిక కొసరులు యికఁనేలే ॥సిగ్గున॥

3. పంతము నించెను పానుపు చేరెను
కొంత గొంత నీకూటమికే
యింతట శ్రీవేంకటేశ్వరుఁ గలసితి–
వెంతని మెచ్చే వికఁనేలే ॥సిగ్గున॥

**అర్థములు:** ప. సిగ్గున మునుగు= సిగ్గుతో తలవంచుకొను, చింత= ఆలోచన, పొరలు= ప్రవర్తిల్లు, ఎగ్గు= దోషము, ఎంతురా= లెక్కిస్తారా.

1. శిరసు= తల, సెలవుల= పెదవి మూల, మరిగెను= అలవాటుపడు, నిరతి= అధికాసక్తి, ఎర పరికరము= రోత, చలము= వణకు.
2. నేలలు వ్రాయు= నేల చూపులు చూచు, సన్నలు= సైగలు, సణగు= వినిపించకుండా మాట్లాడు, ఒడబడు= ఒప్పుకొని యుండు, ఎన్నిక= ఎంపిక, కొసరు= కోరిక.
3. పంతము= పట్టుదల, నించెను= మించెను, కూటమి= సమూహము, ఎంతని= ఎంతగా, మెచ్చేవు= ప్రశంసించేవు.

**భావము:** స్వామి చేసిన అకార్యాలకు సిగ్గుతో తలవంచుకొని ఆలోచనలలో నిమగ్నమాయెను. ఇంకా దోషాలు లెక్కిస్తారా ఎవరైనా?

తలవంచుకొని పెదవి మూలగా నవ్వుతున్నాడు. నీ మాటలకు బాగా అలవాటు పడ్డాడు. అధికాసక్తితో అలసి సొలసి, ఊరకే నిట్టూర్పులు విడుస్తూ ఉన్నాడు. ఇంకా రోతమాటలు వణకడం ఎందుకే!

నిన్ను ఇలా చూస్తూనే నేల మీద చూస్తూ ఏవో పిచ్చిగీతలు కాలితో గీస్తున్నాడు. నీవు చేసే సైగలకు చిన్నగా సణుక్కోడానికి అన్నిటికి సిద్ధమై నీపై చేయి వేశాడు. ఇంకా ఎంపికలు, కోరికలు ఎందుకిక చెప్పవే!

పట్టుదల వదలి స్వామి నా పట్టుపానుపు మీద పడుకున్నాడు. కొంత కొంత కలయికకే యత్నిస్తున్నాడు. ఇంతలో శ్రీవేంకటేశ్వరుని కూడితిని. ఆ స్వామిని ఎంతగా ప్రశంసించవలెనే ఇక చెప్పవే!

## 355

**అవతారిక:** అలమేలుమంగమ్మకు స్వామిపై గల అనురాగాన్ని శ్రీనివాసునికి వర్ణిస్తూ, తమ ఆగమనానికి ఎదురు చూస్తున్నదని చెలులు ఆ స్వామికి విన్నవిస్తున్నారు.

### సాళంగం

ప. మెఱుఁగువంటిది యలమేలుమంగ
అఱిముఱి నవ్వీని అలమేలుమంగ ॥పల్లవి॥

1. పలచనియెలుఁగునఁ బాడీ నీమీఁదిపాట
మెలుపుఁగూరిమి నలమేలుమంగ

| | | |
|---|---|---|
| | చెలులతో నీసుద్ది చెప్పిచెప్పి కరఁగీని | |
| | అలయుచు సొలయుచు నలమేలుమంగ | ॥మెఱుగు॥ |
| 2. | యీడుగా నీరాకకు నెదురెదురు చూచీ | |
| | మేడమీఁద నుండి యలమేలుమంగ | |
| | వాడుమోముతో నీపై వలపు చల్లిచల్లి | |
| | ఆడీ నాట్యము సారె నలమేలుమంగ | ॥మెఱుగు॥ |
| 3. | పేరుకొని పిలిచీని ప్రియములు చెప్పిచెప్పి | |
| | మేరమీర నిన్ను నలమేలుమంగ | |
| | యీరీతి శ్రీ వేంకటేశ నిన్నుఁ గూడెఁ నేఁడు | |
| | ఆరితేరె నన్నిటాను అలమేలుమంగ | ॥మెఱుగు॥ |

**అర్థములు:**ప. మెరుగు= తళతళ మెరసేటి కాంతి, అరిమురి= శ్రీఘ్రము, నవ్వీనీ= నవ్వుచున్నది.

1. ఎలుగు= కంఠస్వరము, పాడీ= పాడినది, మెలుపు= నేర్పు, సుద్ది= వృత్తాంతము, కరగు= ప్రేమచే పరవశమగు, అలయు= శ్రమనొందు, సొలయు= నీరసపడు.
2. వాడు= ఎండిపోవు, చల్లి= విరజిమ్మి, ఆడీ= నృత్యముచేసి, సారె= మాటిమాటికి.
3. పేరుకొని= పేరుపెట్టి, ప్రియములు= వలపు మాటలు, మేరమీరు= హద్దులుదాటు, ఈరీతి= ఈ విధముగా, ఆరితేరు= సమర్ధవంతమగు

**భావము:** అలమేలుమంగమ్మ యొక్క ముఖారవిందము తళతళా మెరసిపోవు కాంతితో శ్రీఘ్రముగా నవ్వులు చిందిస్తున్నది.

సుతిమెత్తని సుస్వరమైన తన కంఠస్వరముతో నీమీద పాటలు పాడుతూ నేర్పుతో కూడిన స్నేహాతిశయముతో నున్నది. తోడి చెలులతో నీ వృత్తాంతము చెప్పి చెప్పి ప్రేమాతిశయముతో, శ్రమతో గూడిన నీరసముతో నున్నది.

ఈడూజోడుగా, మేడ మీద నుండి అదేపనిగా నీ ఆగమనానికై ఎదురు చూస్తూ, నీపై వలపును విరజిమ్ముతూ, మాటిమాటికి నృత్యము చేస్తూ ఆడి ఆడి, అలసి సొలసి వాడిపోయిన ముఖముతో ఎదురు చూపులు చూస్తున్నది.

స్వామీ! ఆమె అతిశయించి హద్దులు దాటి ప్రియముగా నీ పేరు బెట్టి పిలుస్తూ, ఎన్నో ప్రియవచనాలను చెబుతూ ఉన్నది. ఈవిధముగా ఓ శ్రీవేంకటేశ్వరా ఆమె నీ సమాగమాన్ని పొందినది. స్వామీ! ఈ అలమేలుమంగమ్మ సామాన్యురాలు కాదు సుమా ఆటపాటలలోను, ప్రియ వచనాలు చెప్పడంలోను అతి సమర్ధురాలైనది.

## 356

**అవతారిక:** అలమేలుమంగమ్మ మనస్థితి అర్థంగాని శ్రీనివాసుడు అగమ్యగోచరుడై నీ వింత చేష్టలకు అర్థం ఏమిటని ప్రశ్నిస్తున్నాడు.

## సామంతం

| | | |
|---|---|---|
| ప. | మూసి మంతనాలతోడి మోహమేలే | |
| | వేసరించనేలే మరి వేఁడుకొననేలే | ॥పల్లవి॥ |
| 1. | పిలిచినప్పుడు రాక బిగిసి వెనక నాతో | |
| | అలరి యెంతనవ్వినా నదియేలే | |
| | వలపుకాఁకలచేత వాడఁజేయనేలే మరి | |
| | చలువగాఁబన్నీరు చల్ల నేలే | ॥మూసి॥ |
| 2. | యింటికి వచ్చినపని యియ్యకోక మరి నా- | |
| | వెంటవెంటఁ దిరిగేటివేసాలేలే | |

తుంటతనమున నన్ను దూరనాడనేలే మరి
గెంటి యంతలోనేలే తాను కిందుపడనేలే ॥మూసి?

3. చెక్కునొక్కి యప్పుడే చిదుముడిపడి మరి
అక్కరతోఁగాఁగిలించే దదియేలే
తెక్కుల శ్రీవెంకటాద్రిదేవుఁ డిట్టె నన్నుఁగూడె
చక్కటిసిగ్గులవేలే చవిదాయనేలే ॥మూసి॥

**అర్థములు:** ప. మూసి= దాచి, మంతనాలు= ఆలోచనలు, మోహము= వలపు, వేసరించు = శ్రమపెట్టు, వేడుకొను= బ్రతిమాలు.

1. బిగిసి= బెట్టుచూపి, అలరి= సంతోషపడి, అదిఏలే= అదెందుకే, కాక= వేడిమి, వాడజేయు= నీరసింపజేయు, చలువ= చల్లగా.
2. ఇయ్యకొను= సమ్మతించు, తుంటతనము= తుంటరి,కొంటె పనులు, దూరనాడు= నిందించు, గెంటి= అవతలకు పంపి, కిందుపడు= భూశయనము.
3. చెక్కునొక్కు= చెక్కిలినొత్తు, చిదుముడి= తొట్రుపాటు, అక్కర= అవసరము, కాగిలించు= కౌగలించు, అదిఏలే= అదెందుకే, తెక్కు= పొంగిపోవు,అతిశయించు, చవి= రుచి.

**భావము:** మనసులో ఉన్న ప్రేమను కప్పిపుచ్చి ఈ ఆలోచనలుతో ఉన్న వలపులెందుకు? ఒకసారి శ్రమపెట్టి బాధిస్తావు, మరలా నువ్వే బ్రతిమాలు కుంటావు ఇదేమి మనస్తత్వమే?

నేను పిలిచినప్పుడు రాకుండా నీ బెట్టునంతా చూపిస్తూ, మళ్ళీ నా వెనుక జేరి నువ్వే నవ్వులు చిందిస్తున్నావెందుకు? ప్రేమను రగిలించి వేడి పుట్టించడమెందుకు? మరలా నీవే చల్లగా పన్నీరు చల్లడమెందుకు ఏమిటీ పనులు?

నీ ఇంటికి వచ్చినప్పుడు అనుకొన్న కార్యానికి పూనుకోకుండా నా వెంట వెంట తిరుగుతూ వేషాలు వేయడంలో నీ మనసులో ఉన్న మర్మమేమిటి చెప్పు? తుంటరితనముతో కొంటె మాటలు మాట్లాడడం నన్ను దూరంగా పెట్టడము, నన్ను బయటకు పంపి వేసిన తర్వాత తీరిగ్గా నేలమీద పడుకొని చింతించడమెందుకు?

నీ చెక్కిలి నొక్కినప్పుడు తొట్రుపాటుతో నెట్టివేసి మరలా నీవే అవసరపడి నన్ను కౌగిట్లోకి పొందుకోవడమెందుకు? అతిశయించి పొంగిపోతున్న మోహంతో శ్రీవేంకటేశ్వరుడు నన్ను చేరుకున్నాడు, ఈ చక్కని ఆహ్లాదకరమైన వేళలో సిగ్గుపడి నీ అధరామృతమందించి మధురమైన రుచులను దాచిపెట్టడం ఎందుకు?

**విశేషము:** కలహాంతరిత స్వాధీనపతిక అనే నాయికల లక్షణాలను కలగలిపిన అలమేలుమంగమ్మను అన్నమయ్య ఈ కీర్తనలో మనకు సాక్షాత్కారం చేస్తున్నాడు.

## 357

**అవతారిక:** అలమేలుమంగమ్మ స్వామిని అనుమానిస్తూ తనపై ప్రేమ చూపని కారణాలను అన్వేషిస్తున్నది.

### నాగవరాళి

ప. తలపోసి తలపోసి తనువెల్లాఁ గాఁకరేఁగె
వలపు దరించరాదు వాములాయ నిపుడు ॥పల్లవి॥

1. యిట్టె విచ్చేయఁడొకొ యింతలో మరచెనొకొ
అట్టె పతి నఁనై (నన్నై) నా రమ్మనఁడొకొ
గుట్టున నుందురునొకొ కొమ్మల నంపుదునొకొ
యెట్టు వేగించవచ్చు నింతవొద్దువోయను ॥తలపోసి॥

2. యింటిలో నున్నాఁడొకొ యెఱఁగలేనతినొకొ

నంటునఁ దా నింతసేసె నవ్వులకొకొ
అంటి చెలిచేతఁగానుకైనా నంపుదునొకొ
వొంటి నెట్టు దరియించే నోయమ్మ నేను ॥తలపోసి॥

3. మోము చూచి నవ్వఁడొక మొగి సన్నసేయఁడొకొ
కామించి తానే కాఁగిటఁ గలయఁడొకొ
యేమిరించి శ్రీ వేంకటేశుఁడు నన్నుఁ గలసె
నామన సొకటే యాయ నమ్మితిఁబో ఇపుడు ॥తలపోసి॥

**అర్థములు:** ప. తలపోసి= ఆలోచించి, కాక= వేడిమి, రేగె= వ్యాపించె, దరించు= పట్టుకొను, వాములు= పెద్ద పెద్ద గడ్డి వాములు.

1. విచ్చేయడు= రాడు, ఒకో= ఏమో,కాబోలు(ప్రశ్నార్థకము), గుట్టు= రహస్యము, కొమ్మలు= చెలులు, వేగించు= జాగారము చేయు.

2. ఎరగలేను= తెలియరాలేదు, అంటు= కలిసి, కానుక= బహుమతి, వొంటిని= శరీరమును, దరియించు= భరించు.

3. మొగి= పూని, సన్న= సైగ, కాగిట= కౌగిట, ఏమిరించు= పరధ్యానముతో, మాయ= ఇంద్రజాలము, నమ్మితి= విశ్వసించాను.

**భావము:** స్వామిని గురించిన ఆలోచనలతో నా దేహమంతా కాకరేగి వేడిమితో నిండిపోయినది. ఎప్పుడైనా ప్రేమలు పెంచుకుంటే భరించరానిది కదా! అందువల్లనే నా ప్రేమ పెరిగి పెరిగి కొండలంతైనది.

రమ్మన్నప్పుడల్లా వెంటనే రాడు, అంతలోనే మరచిపోతాడు. పోనీ నన్నైనా రమ్మంటాడా అదీ లేదు. ఏమీ మాట్లాడకుండా రహస్యంగా ఉంటాడు. కనీసం తోడి చెలులనైనా రాయబారంపంపించాలి. ఇంత జాము రాతిరయింది కదా ఎలా జాగారం చేయాలి ఈరేయి?

ఇంటిలోనే ఉన్నాడు కదా అది కూడా తెలియరాలేదు సుమా! తాను కావాలని ఇదంతా హాస్యానికి చేస్తున్నాడు. చేతికి బహుమతినిచ్చి చెలినైనా పంపుతాను. ఈ విరహభారాన్ని ఎలా మోయగలనమ్మా!

నా ముఖారవిందం చూసి చిరునవ్వులు నవ్వడు. పూని చొరవతీసుకుని ఏవైనా సైగలు చేస్తాడా అంటే అదీ లేదు. మోహాతిశయంతో నన్ను కౌగిట్లోకి తీసుకోడు. ఆ శ్రీవేంకటేశ్వరుడు చివరకు పరధ్యానముతోనైనా నన్ను కలిశాడు అదే చాలు. నా మనసెప్పుడూ స్వామిపై ఒకే మాదిరి ఉంటుంది. అయినా ఆయన చేసే మాయలను ఇంద్రజాలాన్ని నమ్ముకున్నాను కదా! ఇప్పుడు.

**విశేషము:** ఈ కీర్తనలో అన్నమయ్య ప్రశ్నార్థకమైన ఏమో, కాబోలు అనే అర్థం వచ్చేవిధంగా ప్రతి పంక్తిలోను "ఒకో" అని చాలా అందంగా ప్రయోగించాడు.

## 358

**అవతారిక:** అన్య కాంతను కూడి వచ్చిన స్వామిని అలమేలుమంగమ్మ వివరాలడిగితే, ఏవేవో చెప్పి అసలు విషయం దాటవేస్తూ చిరు నవ్వులు చిందిస్తూ ఉన్న స్వామి పరిస్థితిని వర్ణిస్తున్న దృశ్యం.

### సామంతం

ప. కంటిఁ గంటి నీ గుట్టు కానీలేరా
కంటగించీ నీ గుణాలు కానీలేరా ॥పల్లవి॥

1. అదరి నావద్ద నుండి యట్టె వుస్సురనేవు
కడ నేమిదలఁచితో కానీలేరా
అడియాలపుమచ్చము లంగమునఁ జూచితేను
కడుఁదేలించి చూచేవు కానీలేరా ॥కంటి॥

2. నెమ్మి నిన్ను వలపించేనెలఁతపే రడిగితే

కమ్మర నాతో నవ్వేవు కానీలేరా
రమ్మని యాకెయింటికి రతి నానవెట్టితేను
కమ్మి నానోరు మూసేవు కానీలేరా ॥కంటి॥

3. వక్కణించి నీమోవి వాడుదేరీ నేలంటే
గక్కనఁగాఁగిలించేవు కానీలేరా
యెక్కువ శ్రీ వేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
కక్కసించనోప నిఁక గానీలేరా ॥కంటి॥

**అర్థములు:**ప. కంటి గంటి= కళ్ళారా చూశాను, గుట్టు= రహస్యము, కంటగించు= అయిష్టము చూపు, గుణము= స్వభావము.

1. అదరి= వ్యాపించు, ఉస్సురను= నిట్టూర్పు విడుచు, కడ= చివరకు, అడియాలము= గుర్తు, మచ్చము= మచ్చ, అంగమున= దేహముమీద, తేలించు= తేలికభావముతో.
2. నెమ్మి= ప్రేమ, నెలత= స్త్రీ, కమ్మర= మరలా, ఆకె= ఆమె, ఆన= ప్రమాణము, కమ్మి= పైబడి.
3. వక్కణించు= వంచించు, వాడుదేరు= తీక్షణమగు, ఏలంటే= ఎందుకని అడిగితే, గక్కన= తటాలున, కాగలించు= కౌగలించు, కక్కసించు= బాధపెట్టు, ఓపనిక= ఓర్చుకోలేను.

**భావము:** ఓ స్వామీ! నీ గుట్టుమట్లన్నీ కళ్ళారా చూశాను. నీ స్వభావమంతా నాకు అయిష్టతనే చూపుతున్నది. కానీలే!

వ్యాపించి నా వద్ద నున్న సమయములలో ఉసురుసురని ఆపసోపాలు పడుతూ ఉంటావు. చివరకు మనసులో ఏముందో ఏమో కానీలే! ఏదో గుర్తుగా నీ శరీరంపై ఆ మచ్చ ఏమిటని అడిగితే, సమాధానమివ్వకుండా సులభంగా కొట్టిపారేస్తున్నావు కానీలే!

నీపై అంత ప్రేమలు కురిపించే స్త్రీ పేరు చెప్పమని అడిగితే, ఎందుకో ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ ఉంటావు. ఆమెను రమ్మని రతిక్రీడలో ఎక్కువ సమయం గడపి, పైగా నాపైబడి నా నోరే మూస్తావు. కానీలే!

వంచనలు చేస్తున్న నీ ముఖము అలా వాడిపోయి ఉన్నదేమని ప్రశ్నిస్తే తటాలున కౌగలించుకుంటావు తప్ప సమాధానమీయవు కానీలే! అధికమైన ప్రేమాతిశయముతో నన్ను కూడుకున్నావు. నన్నికా బాధపెడితే భరించే స్థితిలో లేను సుమా! కానీలే స్వామి.

**విశేషము:** ఈ కీర్తనలో అన్నమయ్య "కానీలేరా!" అన్న ప్రయోగాన్ని, 'ఏమి చేయగలను స్వామీ! యిలా కానివ్వండి' అనే అర్థం వచ్చేవిధంగా ప్రతి చరణంలోను రెండుమార్లు చాలా అందంగా ప్రయోగించాడు.

## 359

**అవతారిక:** శ్రీనివాసుడు అలమేలుమంగమ్మతో అన్ని విషయాలు సవ్యంగా అర్థమైన తర్వాత, యింకా చాటుమాటు వ్యవహారలెందుకు? వచ్చి కూడమని చెప్తున్నాడు.

### వసంతం

ప. వచ్చేవో రావో నీవు వాదు లేఁటికే
పచ్చిదేరె వలపులు పగటేలే ఇఁకను ॥పల్లవి॥

1. నగవు వెన్నెలగాసె నంటునఁ జన్నులు రాసె
యెగసక్కెములు నాతో నిఁకనేఁటికే
గుగురుగాఁ బులకించె కొప్పువిరు లటు చిందె
సొగసి బిగియ నీకుఁ జోటేదే యిఁకను ॥వచ్చేవో॥

2. మాటలఁ దేనెలు చిందె మనసులో నిండె
యీటు వెట్టి గుట్టుసేయ నిఁకనేఁటేకే
వూటురేఁగెఁ జెమటలు వుసురుసురులు రేఁగె

బూటకపుఁజల మింతే బొంకనేలే యిఁకను ॥వచ్చేవో॥

3. ఆయములు సరివచ్చె నాస లెల్లా గడు హెచ్చె
యేయెడఁ జూచినఁ బంతా లిఁకనేఁటికే
యీయెడ నే శ్రీ వేంకటేశుఁడఁ గూడితి నిన్ను
మాయదారితనముల మఱఁగేలే ఇఁకను ॥వచ్చేవో॥

**అర్థములు:** ప. వాదులు= జగడము, పచ్చిదేరు= మరుగులేకుండు, పగటు= ప్రకటన.

1. అంటున= స్పర్శ, చన్నులు= రొమ్ములు, ఎగసెక్కెము= పరిహాసము, గుగురు= నిండుగా, పులకించు= గగుర్పాటు, చిందె= అటూఇటూ పడు, సొగయు= పరవశత్వము, బిగియు= గట్టిగ, చోటేది= తావెక్కడ.
2. మాటలదేనెలు= తీయని మాటలు, చిందె= చిమ్మె, ఈటు= శూన్యము, వూటు= పొడసూపు, ఉసురుసురులు= నిట్టూర్పులు, బూటకము= మాయ, చలము= వణకు, బొంకు= అబద్ధము.
3. ఆయములు= జీవస్థానములు, సరివచ్చు= సరిపోవు, యేయేడ= యెక్కడెక్కడ, పంతము= పట్టుదల, ఈయెడ= ఈస్థానములో, మాయదారితనము= వంచనతోకూడిన మాటలు, మరుగు= చాటుమాటు.

**భావము:** నీవు వస్తావో రావో తెలియదు ఇంక ఈ జగడాలెందుకు? ప్రేమలన్నీ మరుగులేనివై బహిరంగమయ్యాయి. ఇంకా ప్రకటించి చెప్పడమెందుకు?

నవ్వుల వెన్నెలలు విరబూశాయి. రొమ్ముల స్పర్శ తగిలినది. ఇంకా ఈ పరిహాసపు మాటలెందుకు? దేహమంతా గుబురుగా పులకాంకితమైనది. కొప్పు వీడి కేశములు చిందరవందరై పడినవి. ఇంకా పరవశత్వంతో నీ బిగువు చూపించడానికి ఆస్కారమెక్కడున్నది.

మాటలతీయదనము చిక్కని తేనెవలె మనసంతా నిండిపోయినది. ఏమీ లేని దాన్ని చూపించి ఉన్నట్టు చెప్పడమింకా ఎందుకే! చెమటలు శరీరము నిండా పొడసూపుతూ ఉండగా ఉసురుసరని నిట్టూర్పులు విడుస్తూ ఉండగా ఇంకా కపట నాటకములెందుకు, ఈ అబద్ధాల మాటలెందుకు?

ఎక్కడ చూసినా మన ఆశలు అతిశయించి జీవస్థానములు సరివచ్చాయి కదా! ఇంకా పంతాలు పట్టింపులు అవసరమంటావా? ఈ స్థానములో ఇప్పుడు నేను శ్రీవేంకటేశ్వరుడైన నిన్ను కూడితిని. ఇంకా మాయదారి తనాలు, వంచన మాటలు, దాగుడుమూతలు అవసరమంటావా?

## 360

**అవతారిక:** అలమేలుమంగమ్మ స్వామి రాకకై వసంతకాలంలో ఎదురుచూస్తూ, ఆమని తనకు వ్యతిరేక పవనాలను వీస్తున్నదని బాధపడుతున్నది.

### పాడి

ప. మఱి తనుఁ బాసిన మము బోఁటికిఁ గా-
కెఱిఁగెఱిఁ గివి తను నెలయించీనా ॥పల్లవి॥

1. చిత్తజుగురుఁడట జిగిఁ బూబాణపు-
కత్తులు తను మరి కాఁడీనా
పొత్తులచంద్రుఁడు భువిఁదనమఱఁ దెట
వత్తిగఁదనపై వడ చల్లీనా ॥మఱి॥

2. వంచినకోవిల వాకట్టువాఁడట
ముంచి కోవిలలు మొఱసీనా
పెంచి గాలిదినుపెనుఁబాము పరపట

పంచలఁదను నవి భ్రమయించీనా ॥మతి॥

3. మతిఁ దా వసంతమాధవుఁడట మరి
తతి నామని తనుఁ దడవీనా
యితవుగ శ్రీ వేంకటేశుఁడు తాఁగూడె
రతి నిద్దరికిని రారాఁపయ్యీనా ॥మతి॥

**అర్థములు:** ప. పాసిన= వీడిన, ఎరిగెరిగి= బాగా విషయము గ్రహించు, ఎలయించు= పురికొల్పు, నెలయు= ఉండు.

1. చిత్తజగురుడు= మన్మథుడు, జిగి= కాంతి, పూబాణము= పుష్పబాణము, కాడు= నాటు, పొత్తుల చంద్రుడు= స్నేహముతో ఉన్న చంద్రుడు, భువిదనము= భూమితత్త్వము, అరదు= ఆశ్చర్యము, వత్తిగ= వట్టిగ,పూర్తిగ, వడ= తాపము, చల్లు= వ్యాపింపజేయు.
2. వంచిన కోవిల= తలవంచి రాగాలు తీసే కోయిలమ్మ, వాకట్టు= నోరు మూతపడు, ముంచి= అతిక్రమించి, మొరయు= ధ్వనించు, పెంచి= అధికముజేసి, గాలిదిను= వాయుబక్షణము, పెనుబాము= ఆదిశేషుడు, పరపట= పరుపుగా ఉ న్నవాడు, పంచల= వరండా, భ్రమయించు= మోహపరచు.
3. మతి= మనసున, వసంత మాధవుడు= మదనోత్సాహముగల శ్రీనివాసుడు, తతి= సమయము, ఆమని= వసంతకాలము, తడవు= స్పృశించు, ఇర్తవు= ఇష్టము, రారాపగు= అధికరాపిడి.

**భావము:** ఆ శ్రీనివాసుడు మము వీడిన విషయం తెలుసుకొని, గ్రహించి తాను తిరిగి ఇక్కడకు జేరుకుంటాడా?

మన్మధుడు కాంతివంతమైన కత్తులవంటి వాడిగల పుష్పబాణాలను నాటుతున్నాడా? ఎప్పుడూ స్నేహంగా కనపడే ఆ చంద్రబింబం భూమితనమును మరచి నాపై తాపాన్ని చల్లుతున్నాడా?

ఆ తలవంచుకొన్న కోయిల మాటలు మరచి మూగదయినదట. మరలా కోయిలలు అతిక్రమించి ధ్వనిస్తాయా? ఒకవైపు గాలిని భుజించే పెద్ద ఆదిశేషుడు పానుపుపై ఉన్నాడు. ఇవన్నీ నన్ను నా శరీరాన్ని మత్తులో ముంచుతున్నవి.

ఆలోచిస్తే ఆ స్వామి మదనోత్సాహము గల వసంతకాలపు శ్రీనివాసునివలె కనిపిస్తున్నాడు. సమయసమయాలు గ్రహించి ఈ వసంతకాలపు మలయమారుతం నన్ను తాకుతుందా? ఇంతలో నాకిష్టుడై శ్రీవేంకటేశ్వరుడు తానే వచ్చి నన్ను చేరుకున్నాడు. ఈ సమయములో జరిగే రతిక్రీడా విలాసము యిద్దరికీ అధికరాపిడిని కలిగిస్తుందా?

## 361

**అవతారిక:** అమ్మ శ్రీనివాసుని సన్నిధిలో ఉన్నప్పటి ప్రశాంతతను స్వామికి తనే స్వయంగా వివరిస్తున్నది.

### వరాళి

ప. ఇదివో నీ మహిమ నేనేమని పొగడుదును
కదిసి నీవుండఁగాను కపటాలూఁ బాసె ॥పల్లవి॥

1. వేడుకతో నీనవ్వు వెన్నెలలుగాయఁగాను
యీడనే చిత్తము చీఁకటంతాఁ బాసె
నీడవలె రమణుఁడ నీవు వెంట రాఁగాను
యేడలేని మేనికాఁక యెండలెల్లాఁబాసె ॥ఇదివో॥

2. కలసి నీపలుకుల కప్పురాలు చల్లఁగాను
తలపోఁత విరహపుదప్పులు వాసె
చలువై, నీకరుణారసపువాన గురియఁగా
కలిగిన నామనసు కళవెల్లాఁ బాసె ॥ఇదివో॥

3. కరకమలము నీవు కమ్మరఁ బై వేయఁగాను
మరునిబాణాలపగ మాలోఁ బాసె
ఇరవై శ్రీ వేంకటేశ ఇద్దరముఁ గూడఁగాను
శిరసులు వంచినట్టిసిగ్గులెల్లాఁ బాసె ॥ఇదివో॥

**అర్థములు:** ప. పొగడు= ప్రశంసించు, కదియు= దగ్గరగు, కపటాలు= మోసము, పాసె= వీడెను.

1. వేడుక= సంతోషము, చిత్తము= మనసు, పాసె= వీడె, మేని కాక= శరీరతాపము.
2. కప్పురాలు= కర్పూరము, తలపోత= మనసులోని ఆలోచనలు, విరహము= వియోగము, దప్పు= దాహము, చలువై= చల్లనై, కరవు= దుర్భిక్షము.
3. కరకమలము= కమలమువంటి నీ చేయి, కమ్మర= కమ్మి, పైవేయు= పైనవేయు, మరుని బాణాలు= మన్మథ బాణములు, పగ= శతృత్వము, ఇరవై= స్థానమై, శిరసులు= తలలు, పాసె= వీడెను.

**భావము:** ఓ శ్రీనివాసా! నీ గొప్పదనాలను ఏవిధంగా ప్రశంసించాలో తెలియరాకున్నది. నీవు దగ్గరై ఉన్నప్పుడు ఏ గొడవాలేదు. అన్ని సమస్యలు పారిపోతాయి.

సంతోషముతో నీవు నవ్వుతూ ఉంటే నవ్వుల వెన్నెలలు విరబూసి, మనసులోని చీకట్లన్నీ మటు మాయమైపోతాయి. ఓ స్వామీ! నా నీడ లాగా నీవు వెంట రాగా, నా శరీర తాపమంతా పారిపోతుంది.

స్వామీ! నీవు కలసినప్పుడు నీ మాటలనే కర్పూరము చల్లితే నా వియోగపు దాహమంతా మాయమై పోతుంది. నీ కరుణా రసపు వాన కురిసిందంటే చాలు నా మనసులోని కరువంతా వీడి హాయిని కలిగిస్తుంది.

నీ తామర పుష్పాల తూడు వంటి చేయి నామీద వేసి నన్ను దగ్గరకు తీసుకుంటే, పగ బూనిన మన్మథ బాణాలు సమసిపోతాయి. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈవిధముగా ఇక్కడ నెలవై యిద్దరము కూడగానే తలలు వంచిన సిగ్గు తరిమినట్లుగా పారిపోతుంది.

## 362

**అవతారిక:** స్వామిపై అమ్మ అలక వహించింది. చెలులు స్వామి వద్దకు రమ్మన్నా రాకుండా జరిగినది చాలు! నా భాగ్యమింతే అనుకొంటాను అని కోపంతో మాట్లాడుతున్నది.

### బౌళి

ప. ఏల నన్ను రమ్మనీవే ఇంతేచాలు
యేలినాఁడు తొల్లె నన్ను నింతే చాలు ॥పల్లవి॥

1. కూడి తనచేఁతలకు గోపగింతునో యేమో
యీడనుండి మొక్కితి నాకింతేచాలు
వోడక సారెకు రాఁగా నొగరౌనో తీపౌనో
యేడకేడ తననా కింతేచాలు ॥ఏల॥

2. కామిను లెందరు లేరు కాఁకలు చల్లఁ దనకు
యేమిగారణము నే మింతేచాలు
నేమము దప్పకుంటే నేరుపౌసో నేరమౌనో
యీమాటు వోయిరావే యింతేచాలు ॥ఏల॥

3. బెట్టి నవ్వ నీరుదియ్యఁబేనువచ్చు నిఁకనేల
యెట్టైనా వచ్చెఁ దా నీడ కింతే చాలు

వొట్టుక శ్రీ వేంకటేశుఁడొనగూడె నిప్పు డిట్టె
యెట్టుసేసీనాఁ జెల్లె నింతేచాలు ॥ఏల॥

**అర్థములు:** ప. ఏల= ఎందుకు, ఇంతే చాలు= ఇంతవరకే చాలు. ఏలు= పాలించు, తొల్లె= పూర్వము.

1. కూడి= కలసి, చేతలు= పనులు, ఈడనుండి= యిచ్చటనుండి, ఓడక= ఓడిపోకుండా, సారెకు= మాటికి, ఒగరు= వగరు రుచి, తీపౌనో= తీయదనమవునో, ఏడకేడ= ఎక్కడికి ఎక్కడ, తనకుంఇంతే చాలు= నాకింతే చాలు.
2. కామినులు= మోహించేవారు, కాకలు= వేడిమి, నేమము= నియమము, నేర్పు= నైపుణ్యము, నేరము= నేరము.
3. బెట్టినవ్వు= మరలించు, ఈరుదియ్య= పేనుగుడ్లు తీయబోగా, పేనువచ్చు= పేలు బయటపడ్డవిధము, నీడకు= అండకు, ఒట్టుక= ఒట్టుపెట్టుకొని, ఒనగూడు= సిద్ధించు.

**భావము:** ఓ చెలీ! ఎందుకు నన్ను రమ్మని పిలుస్తున్నావు? జరిగినది చాలు. ఆయన నన్ను పూర్వమే ఏలుకొన్నాడు గదా అది చాలు.

నేను వచ్చి కలసినట్లైతే తను చేసే అకార్యాలకు నాకు కోపం రావచ్చు. ఇక్కడ నుండే నమస్కరిస్తాను. నాకు అంతే చాలు! నెగ్గాలని అక్కడకు మాటి మాటికి వస్తే అది తీయనవుతుందో లేకపోతే కటువై ఒగరుగా తోస్తుందో తెలియదు. ఎక్కడికెక్కడ చెప్పు? నాకింతే చాలు!

ఆ స్వామికి శరీర వేడిమిని కలిగించడానికి తనను మోహించే వారెందరో ఉన్నారు కదా! ఇంకా నేనెందుకు? మాకింతే చాలు! నియమాలను తప్పకుండా నేను చరించడం నైపుణ్యమవుతుందో లేక దోషమవుతుందో తెలియదు. ఈ సారికి నీవు వెళ్ళిరావే నాకింతే చాలు!

ఆయన దారి మళ్ళించే విధంగా నేను నవ్వులు నవ్వితే, పేను గ్రుడ్లు (ఈరు) తీయడానికి వెళ్తే పేలు బయటపడ్డట్టు అవుతుందేమో! ఇంకా ఎందుకు చాలు. ప్రమాణము చేసిన ఆ శ్రీవేంకటేశ్వరుడు ఇప్పుడీవిధంగా నన్ను చేరుకున్నాడు. ఆ స్వామి ఏవిధంగా చేసినా, అవన్నీ ఆయనకే చెల్లుతాయి. నాకింతే భాగ్యమనుకుంటాను. నాకింతే చాలు!

## 363

**అవతారిక:** స్వామి అంగనామణులతో కూడి చేస్తున్న చేష్టలను గమనించి, స్వామి వారిని నిలదీసి నీవు చేసే పనులు నీకు సబబుగా ఉన్నాయా? అని ప్రశ్నిస్తున్నది.

## కాంబోది

ప. ఇందరముఁ గంటిమి నీ విదిగానవా
వొందిలి పానుపుమీఁద నున్నది గానవా ॥పల్లవి॥

1. బంగారుపావాలు మెట్టి పడఁతి యెవ్వతోకాని
ముంగిటఁ బొలసె నీ విమ్ములఁ గానవా
పొంగేటిజవ్వనముతో పొదరిల్లు దూరి నీతో
సంగవించి సన్నసేసె నదిగానవా ॥ఇందరము॥

2. వల్లెవాటుఁ బయ్యదతో వనితలపై నొరగి
యిల్లిలదె యేకతమాడీ నిది గానవా
కొల్లలుగా నాడనాడ కొప్పుపూవు లటు జార
చెల్లఁబో కులుకినవ్వేచేతఁ గానవా ॥ఇందరము॥

3. జవ్వాదివాసనలతో సతి నీవెనక నదె
యెవ్వరంటా నున్నవాఁడ విది గానవా

రవ్వగా శ్రీ వేంకటేశ రమణిఁ గూడితి విదె
యివ్వలనే బొంకేవు యిప్పుడైనాఁ గానవా ॥ఇందరము॥

**అర్థములు:**ప. ఇందరము= ఇంతమంది, కానవా= చూడలేవా, వొందిలి= దుఃఖము.

1. పావాలు= పావుకోళ్ళు, పడతి= స్త్రీ, ముంగిట= ఇంటిముందు, పొలయు= తిరుగు, ఇమ్ముల= పూర్తిగా, పొంగేటి= పొంగుకొని వస్తున్న, జవ్వనము= యౌవనము, పొదరిల్లు= ఇంటివలెనుండు పొద, దూరి= లోనకు వెళ్ళి, సంగవించి= ఆమెతో కూడి, సన్న= సైగ.
2. వల్లెవాటు= అంగవస్త్రమును ఒక చంక క్రిందనుండి తీసి ఎదుట భుజములపైకి లాగి కప్పు విధము, పయ్యెద= పైట, ఒరగి= వాలిపడి, ఇల్లిలదె= ఈవిధముగా, ఏకతము= ఆలోచనజేసి, కొల్లలు= త్రోపిడి,దొంగతనము, కొప్పుపూలు= కొప్పున పెట్టుకున్న పూలు, చెల్లబో= చెల్లువిధముగా(ప్రశంసార్థము) కులికి= నర్తించి, నవ్వేచేత= నవ్వుతున్న పని.
3. జవ్వాది= సుగంధద్రవ్యము, ఎవ్వరంటా= ఎవరని అడుగు, రవ్వ= అల్లరి, రమణి= అందమైన స్త్రీ, ఇవ్వల= ఈవైపు, బొంకు= అబద్ధమాడు.

**భావము:** ఓ స్వామీ! ఇంతమంది కళ్ళరా చూస్తున్న విషయము నీవెరుగవా? నీకు కనబడలేదా? దుఃఖముతో పానుపు మీద ఉన్న సంగతి నీవెరుగవా?

బంగారు పావుకోళ్ళు ధరించిన ఆ స్త్రీ ఎవరో తెలియదు గానీ ఇంటిముందు అటూయిటూ తిరుగుచున్నది కదా! నీవు ఆ విషయము యేమాత్రం గమనించవా? యౌవనం పొంగుకొస్తున్న మంచి వయసుగత్తె పొదరింట్లో దూరి నీతో హాయిగా సంగమించి సైగలు చేస్తున్న విషయం కూడా నీకు కనిపించదా?

వల్లెవాటు వస్త్రముతో నీవు ఆ స్త్రీలమీదకు వాలిపోయి ఈవిధమైన శృంగారపు ఆలోచనలు జేసినది కనబడదా! దొంగతనముగా స్త్రీల మీద పడి త్రోపిడి ఆటలు ఆడుతూ ఉండగా ఆమె కొప్పుమీది పూవులన్నీ జారి పడుతుండగా ఆ స్త్రీ నవ్వే నవ్వులు నీకు కనబడవా!

జవ్వాది వాసనలతో భార్య నీ వెనుకనే నిలబడగా ఎవ్వరని ప్రశ్నించే నైజమున్న వాడివైన నీకు ఇది కనబడదా? అల్లరిచేతలతో ఆ రమణిని కూడిన ఓ శ్రీవేంకటేశ్వరా! మరలా ఇంతలోనే ఇక్కడ అబద్ధాలాడడం ఇప్పుడైనా గమనించవా?

## 364

**అవతారిక:** స్వామికి ఎక్కువగా మాట్లాడితే కోపం వస్తుందన్న కారణంతో అలమేలుమంగమ్మ, అన్నిటికి మీ చిత్తం స్వామీ! అంటూ దరిచేసిన సంఘటన.

### రామక్రియ

ప. నిచ్చనిచ్చ వాదులేల నీచిత్తము
యెచ్చుకుందు లాడనేల యింకా నీచిత్తము ॥పల్లవి॥

1. మిక్కిలిదొరవు నీతో మేలమాడ వెఱతుము
నిక్కి నీవేమి సేసినా నీచి త్తము
యెక్కువతక్కువ నీతో నేమంటే నేమవునో
మొక్కితిమి నీకు నేము ముందర నీచిత్తము ॥నిచ్చ॥

2. కమ్మరఁ గమ్మర నీపైఁ గల్ల మోప నోపము
నిమ్మపండు గానుకిదే నీచిత్తము
సమ్మతిగా నీవలపు చల్లఁబోతే చవిగాదు
వుమ్మడి నుండే మింక నున్నది నీచిత్తము ॥నిచ్చ॥

3. చేవదేర నీయెడకు సిగ్గువడ నిఁకనేల
నీవే నేనైతి నిఁక నీచిత్తము
శ్రీ వేంకటేశ నన్నుఁ జేకొని కూడితి విట్టె
కైవశమైతి మిఁకఁ గలది నీచిత్తము ॥నిచ్చ॥

**అర్థములు:** ప. నిచ్చ= అనునిత్యం,ప్రతిరోజు, వాదులు= జగడాలు, చిత్తము= దయ, హెచ్చుకుందు= ఎక్కువతక్కువలు.

1. మిక్కిలి= ఎక్కువైన, మేలమాడు= పరిహాసములాడు, వెరతుము= భయపడు, నిక్కి= ఆసక్తిగా, నేము= మేము.
2. కమ్మర= మళ్ళీ, కల్ల= అబద్ధము, మోపు= వేయు, ఓపము= భరించలేము, సమ్మతి= అంగీకారము, చవి= రుచి, ఉమ్మడి= పొత్తున.
3. చేవదీర= సారముతో, ఎడ= దగ్గరకు, చేకొని= చేపట్టి, కైవశము= ఆధీనము, చిత్తము= ఇష్టము.

**భావము:** ఓ స్వామీ! ప్రతిరోజూ మీతో మాకీ వాదులాటలు, పోట్లాటలు ఎందుకు? మీ ఇష్టం వచ్చిన రీతిగానే కానివ్వండి. ఇంకా ఎక్కువ తక్కువ ఆటలాడమెందుకు? మీ ఇష్టం వచ్చినట్లే కానివ్వండి.

చాలా అధికమైన ఘనతగల వాడవు. నీతో పరిహాసాలాడడానికి మేము భయపడతాము. నీవు ఆసక్తిగా ఏమి చేసినప్పటికి ఇష్టమే సుమా! ఎక్కువ తక్కువగా నీతో మాట్లాడితే ఏమి గొడవవుతుందో తెలియదు. నీకు నమస్కరించి యున్నాము ఇంక నీ ఇష్టం స్వామీ!

మళ్ళీ మళ్ళీ నీమీద నిందలు మోపజాలము. ఇదుగో నీకు నిమ్మపండును బహుమతిగా ఇస్తున్నాం ఇక నీ ఇష్టం స్వామీ! అంగీకారంతో నీపై ప్రేమ కురిపించడానికి మాకు ఇష్టమవడంలేదు. ఇంక మాకు పొత్తుగా ఉండడమే మిగిలినది. ఆపై అంతా మీ చిత్తం మా దయ.

అన్నిటికి సిద్ధపడి సారవంతమై నీవద్దకు వచ్చి యున్నాము కదా! ఇంకా సిగ్గులు చిందిచడం ఎందుకు? నేనే నీవన్న అద్వైత భావంతో ఉన్నదానను కదా! ఇంక మీ చిత్తము. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈనాడు నన్ను చేపట్టి కూడినావు. నీకు ఆధీనమైయున్న దానను. ఇంక అంతా మీ చిత్తం ప్రకారమే కానివ్వండి స్వామీ!

## 365

**అవతారిక:** అలుమేలుమంగమ్మ శ్రీనివాసుల మధ్య ప్రేమ విషయంలో అతిగా ప్రవర్తిస్తున్న చెలులను అమ్మ కోపగించుకుని తగదని వారిస్తున్నది.

### సాళంగం

ప. ఆతనిపై నలిగేనా ఆతఁడు నాకలిగీనా
కాతరాన మీరేల కక్కసపెట్టేరే ॥పల్లవి॥

1. మాటలలోనా నతఁడేమనసులోనా నతఁడే
యేఁటికి విభుని దూరే రింకా మీరు
కూటమికిఁ దాఁ జిత్తము కొలఁదినే వచ్చీఁగాక
పాటించి యింతేసి యేల బలిమిసేసేరే ॥ఆతనిపై॥

2. కలలో విచ్చేసినాఁడు కరఁగించి కూడినాఁడు
యెలయించేల పిలిచే రింకా మీరు
తలఁపుఁదలపు నొక్కతారుకాణ లిద్దరికి
చెలఁ గెప్పుడు వచ్చినాఁ జింతించనేఁటికే ॥ఆతనిపై॥

3. మెట్టిననే లొక్కటే మీఁదఁ బారేగా లొక్కటే

యెట్టివారు గలిగితిరే యింకా మీరు
యిట్టె శ్రీ వేంకటేశుఁ డిచ్చగించి నన్నుఁ గూడె
గట్టిగా నితనిమతి కంటిరటే యిఁకను ॥ఆతనిపై॥

**అర్థములు:**ప. అలుగు= కోపం వహించు, కాతరము= పిరికితనము, కక్కసపెట్టు= సంకటపెట్టు.

1. ఏటికి= ఎందుకు, విభుడు= ప్రభువు,భర్త, దూరు= ప్రవేశించు, కూటమి= కూడిక, చిత్తము= ఇచ్చవచ్చిన రీతి, పాటించు= ప్రకటించి, బలిమి= వత్తిడి చేయు.
2. కరగించు= మనసులోచేరు,ద్రవించు, కూడు= కలయు, ఎలయించు= పురికొల్పి, తలపుదలపు= ఆలోచనలు, తారుకాణ= ఋజువు,సాక్ష్యము, చెలగి= ప్రకాశించి, చింతించు= బాధపడు.
3. మెట్టు= కాలిడు, పారు= ప్రాకు, ఎట్టివారు= ఎలాంటివారు, ఇచ్చగించి= ఇష్టపడి, మతి= ఆలోచనలు.

**భావము:** చెలులారా! ఆవేశపడకండి! సావధానంగా వినండి. ఒక్కోసారి నేను స్వామివారిపై కోపించి అలగవచ్చు. మరోసారి ఆయనకూడా నా మీద అలగవచ్చు. మీరెందుకు మధ్యలో దూరి నానా యాగీ చెయ్యడం, పిరికితనం చూపించి బాధపెట్టడం చేస్తారెందుకే!

చెలులారా! ఒకటి చెప్తాను వినండి. నా మాటలలోను, మనసులో కూడా స్వామే ఉంటాడు. ఇంకా ఎందుకు మీరు నా భర్త విషయంలో అనవసర జోక్యం చేసుకుంటారు. నాతో కలవడానికి ఆయన చిత్తం వచ్చినప్పుడు వస్తాడు గాక! మీరంతా ఇంత బహిరంగంగా ప్రకటించి స్వామివారిపై వత్తిడి చేయడం ఎందుకే!

ఆ స్వామి నా కలలో వచ్చి నా హృదయాన్ని కరగించి చేరువైనాడు. ఇంకా మీరు పురిగొల్పి ఆ విషయాలే మాటిమాటికి ఎందుకు పట్టుబట్టి ప్రశ్నిస్తారు? మా ఇరువురి ఆలోచనలు ఒక్కటి కావడమే దీనికి సాక్ష్యం కాదా! ఆయన ప్రకాశముతో ఎప్పుడు వచ్చినప్పటికి బాధపడడం ఎందుకు?

మా ఇరువురము కాలిడినది ఒక్క ప్రదేశమే, అలాగే ఆయన నా మీద వేసేటి కాలు కూడా ఒకటే! ఎలాంటి చెలులు దొరికారే నాకు మీరు. ఇప్పుడు శ్రీవేంకటేశ్వరుడు ఇష్టముతో వచ్చి నన్ను చేరుకున్నాడు. మీరంతా పూర్తిగా స్వామి మనసేమిటో అర్థంచేసుకుని చూశారు గదా! ఇక ఏమీ మాట్లాడకండి.

## 366

**అవతారిక:** అమ్మ స్వామిపై ఏవో కారణాల వల్ల చిరుకోపం వహించినంత మాత్రాన ఆయన మీద తనకు ప్రేమ లేదని భావించవద్దని చెలికి చెప్తున్న సన్నివేశం.

### కన్నడగౌళ

ప. ఇటువంటిదాన నా కేఁటియలుకే
కటకట తా రాఁగాఁ గాదనేనా నేను ॥పల్లవి॥

1. మాటలాడకుండుఁగాని, మనసులోపలనైతే
నాటినది తనమీఁద నాచిత్తము
కాటుకకన్నులఁ జూచి కసరుదుఁగాని నేను
వాఁటపువలపు మీఁద వంతుఁబో లోలోనే ॥ఇటువంటి॥

2. దగ్గరి రాకుందుఁగాని, తానన్ను నంటినప్పుడే
వెగ్గళించి సిగ్గులెల్లా వీడఁగలవే
యెగ్గువట్టివుందుఁగాని, యేపాటి నవ్వించినాను
అగ్గలపుసరసము లాడుదుఁబో నేను ॥ఇటువంటి॥

3. నివ్వెర గందితిఁ గాని, నేఁడు నన్నుఁ గూడఁగాను
పవ్వళించినపుడేపో పరవశము
యివ్వల శ్రీవేంకటేశుఁడేకతమాయ నాతోను
జవ్వనబారముచేత జడిసీఁబో తనువు ॥ఇటువంటి॥

**అర్థములు:** ప. నాకేటి= నాకెందుకు, అలుక= కోపము, కటకట= అయ్యయ్యో! తారాగా= ఆ స్వామి వచ్చినట్లైతే.

1. నాటినది= గట్టిగా ధృఢపడు, కసరు= కోపించు, వాటపు= అనుకూలమైన, వంతు= వరుస, లోలోనే= లోపలోపల.
2. అంటు= తాకు, వెగ్గళించు= అధికము, వీడు= వదలు, యెగ్గువట్టు= తప్పుగాభావించు, అగ్గలము= అధికమైన.
3. నివ్వెరగందు= మిక్కిలిభయముచెందు, పరవశము= ఒడలు తెలియని ఆనందము, ఇవ్వల= ఇవతల, ఏకతము= ఒంటరియై, జవ్వన భారము= యౌవనముచే వచ్చిన అవస్థ, జడియు= బెదురుపడు.

**భావము:** చెలీ! మంచి మనసుగలదానను కదా! నాకు అలుకలెందుకే! అయ్యయ్యో! ఆ స్వామి వచ్చినట్లైతే నేను కాదు కూడదంటానా చెప్పు?

నేను ఒకవేళ చిరుకోపంతో మాట్లాడకుండా ఉండవచ్చును కానీ, నా మనసు మాత్రము ఆ స్వామికే ఆధీనమై యున్నది. ఆయన కాటుక కన్నులను చూచినప్పుడు అనుమానంతో కొంచెం కోపిస్తే కోపించి ఉంటే యుండవచ్చు. ఆయన ప్రేమ విషయంలో మాత్రం లోలోపలే వంతులు దగ్గరై పోతూ ఉంటాను.

నేను త్వరపడి స్వామి దగ్గరగా పోయి ఉండక పోవచ్చు గాని, ఆ స్వామి నన్ను స్పృశించినప్పుడు అధికమైన నా సిగ్గులన్నీ వీడిపోతూ ఉంటాయి. ఆయనలో ఏవో కొన్ని తప్పులు పట్టి ఉండవచ్చునుగానీ, నేనా స్వామిని ఎంత సంతోషపెట్టి నవ్వించలేదు చెప్పు? స్వామితో అతిశయించిన సరసాలలో ఎల్లవేళలా ముందు నేనే ఉంటాను సుమా!

ఏదో కొన్ని సమయాలలో స్వామిని చూచి కొంచెం భయమందుతాను కాని, ఈనాడు నన్ను చేరి కూడిన సమయంలో పానుపుపై పరుండినప్పుడే నాకు ఒడలు తెలియని ఆనందం కలుగుతుంది. ఈ ప్రదేశములో శ్రీవేంకటేశ్వరుడు నాతో ఒంటరియై మమేకమై కలిసినాడు. నా తనువంతా యౌవన భారంతో బెదిరిపోతున్నది అంతే సుమా!

## 367

**అవతారిక:** అమ్మకు స్వామిపై అధికమై యున్న విరహవేదన తీరడానికి చెలులంతా శైత్యోపచారాలు గావిస్తున్నారు.

### ఆహిరి

ప. విరహంబు వేఁడాయ విరుల మొన వాఁడాయ
తరవాతి పనుల కిటు తడవేల ఇఁకను ॥పల్లవి॥

1. పిలువరే నాయకునిఁ బ్రేమంపుచెలిమీఁద-
నలఁదరే శ్రీగంధ మందాఁకాను
నిలువరే కొంతవడి నిందురొద లిటు మాని
కలికిమై చెమరించెఁ గంద మిఁకఁ బనులు ॥విరహంబు॥

2. చెరుగరే తురుములోఁ జెదరిజారిననెరులు
కరఁగెనే చెలినుదుటికస్తూరిబొట్టు
మరుపరే కప్పురము మగువదప్పులు దీర
నెరపుదము నేరుపులు నిమిషంబుమీఁద ॥విరహంబు॥

3. అంపరే యెదురుగా నతనికిఁ గానుకలు
చెంపలనుఁ బన్నీరు చిలుకఁగదరే

యింపులను శ్రీవేంకటేశుఁడిదె వచ్చి సతి
సొంపులను గూడె నిఁక సొలయ నేమిటికే ॥విరహంబు॥

**అర్థములు:** ప. విరహము= వియోగము, వేడి= కాక, విరులు= పూలు, మొనలు= చివరలు, వాడి= సూదివలె ఉండు, తడవు= విచారించు.

1. ప్రేమంపుచెలి= ఇష్ట సఖి, అలదు= పూయు, మందాకాను= దట్టముగా, వడి= సమయము, రొద= కలకలము, కలికము= శైత్యనివారణార్థము కంటికివేసే మందు, చెమరించు= చెమటపోయు, తురుము= తలకొప్పు.
2. చెరుగు= సరిచేయు, తురుము= తలకొప్పు, చెదరిన= చిందరవందరయైన, నెరులు= కేశములు, కరగు= కారిపోవు, మరుపు= పారవశ్యము, దప్పు= దాహము, నెరపు= నెరవేర్చు, నేరుపులు= నైపుణ్యాలు,చాతుర్యములు, నిమిషంబు= కొద్దిసమయము.
3. అంపు= పంపు, చిలుకు= చల్లు, ఇంపు= సంతోషము, సతి= భార్య, సొంపు= సౌందర్యము, సొలయు= విసుగు.

**భావము:** ఈ విరహము అమ్మకు కాకలు రేపుతున్నది. పుష్పాల మొనలు వాడియై సూదులవలె గ్రుచ్చుకొనుచున్నవి. ఇంక తరువాత జరుగవలసిన పనులన్నింటికి విచారించడమెందుకు?

ఆ స్వామిని పిలవండి. ఆ ఇష్టసఖి మీద శ్రీగంధాన్ని మందముగా అద్దండి. కాసేపు మీ కలకలమునాపి ఇలా నిలబడి చెప్పేది ఆలకించండి. ఈ గంధము కూడా నాకు కంటి చలువకై వేసే మందువలె స్వేదమును పుట్టిస్తున్నది.

కొప్పులో చిందరవందరైన కేశాలను సరిదిద్దండి. చెలి నుదిటి కస్తూరిబొట్టు ఆమెకు పట్టిన చెమటలకు కారిపోతున్నది. ఆమెకు దాహము తీరునట్లు కర్పూరము నద్దండి. ఇంక నైపుణ్యాలన్నీ నిముషాలమీద నెరవేర్చెదము.

ఆ స్వామికి ఎదురుగా బహుమతులు పట్టుకుని వెళ్ళండి. ఆమె చెంపలపై పన్నీరు చిలికించండి. ఆ శ్రీవేంకటేశ్వరుడు ఇష్టుడై ఇటకు వేంచేసి ఆ సతి సౌందర్యము యినుమడించే విధంగా కలసినాడు కదా! ఇంకా విచారము, విసుగులు ఎందుకు మానండి.

## 368

**అవతారిక:** అమ్మ స్వామిని తన అంద చందాలు చూపించి తన బందీగా చేసుకున్న తర్వాత ఇంకా ఏమీ తెలియనట్టు నాటకాలు ఆడడం ఎందుకని చెలులు అమ్మను ప్రశ్నిస్తున్నారు.

### నాట

ప. ఈఁతకు మిక్కిలి లోఁతా ఇంకా నేలే
చేఁతలెల్లాఁ జెల్లె నీకు చిరునవ్వుగాదా ॥పల్లవి॥

1. కాయ మతనిపై వేసి ఘనకుచముల రాసి
మాయలు సేతువుగాక మాతోనేలే
చాయలనే యెకపోసి సన్నల నింత సేసి
యేయెడకుఁ బోనీవు ఇంతకంటె నేమే ॥ఈతకు॥

2. మాటలనే కరఁగించి మంతనాలు మరిగించి
నాటక మక్కడఁ జేసి నాతో నీ కేలే
కాటుక కన్నులఁ జూచి కాఁకలఁ జేతులు చాఁచి
వాఁటమై వుండుదుగాక వాదు లీడనేలే ॥ఈతకు॥

3. కాఁగిట నాతనిఁగుచ్చి కమ్మి మాయింటికిఁదెచ్చి
ఆఁగితి నాకాఁగిటిలో నాయనాయనే
వీఁగక శ్రీవేంకటాద్రివిభుఁ డిట్టె నన్నుఁగూడె

పొఁగి యింతలోనే నన్నుఁ బంగించనేలే ॥ఈతకు॥

**అర్థములు:** ప. ఈతకు= ఈతకొట్టేవానికి, మిక్కిలి లోతా?= లోతైనది ఏమీ ఉండదు అన్న అర్థము. చేతలు= పనులు, చెల్లె= సరిపోయినవి.

1. కాయము= శరీరము, ఘనకుచములు= పెద్దవైన రొమ్ములు, మాయలు= తమాషాపనులు, చాయలు= కాంతి, ఏకపోయు= ఒకేవిధముగాచేసి, సన్నలు= సైగలు, ఏయెడ= ఎక్కడికి.
2. కరగించి= ద్రవింపజేసి, మంతనాలు= ఒప్పందము, మరగు= అలవాటుపడు, నాటకము= నర్తనము, కాకలు= వేడిమి, వాటము= అనుకూలము, వాదులు= పోట్లాటలు.
3. కాగిట= కౌగిట, గుచ్చి= బంధించి, కమ్మి= వ్యాపించు, ఆగితి= నిలిచి, వీగక= నిక్కుచూపించక, పాగి= దారిచూపి, పంగించు= వెనుక చేసిన పొరపాట్లనన్నింటిని ఎత్తిచూపి ఏడ్పించు.

**భావము:** ఈతలు కొట్టే ఈతగాడికి లోతు అన్నది ఉంటుందా? నీవనుకున్న పనులెల్లా చెల్లి, సరిపోవడం నీకు సంతోషమైన విషయమే కదా!

నీ సుందరదేహమతనిపై వేసి నీ పెద్దవైన రొమ్ములను అతనికి రాస్తూ ఎన్నో తమాషాలు, మాయలు చేస్తూ ఉంటావు ఇంకా మాతో కూడా ఎందుకు నీవిలా చేయడం? నీ అందచందాలు చూపించి అందరిమీదా చాడీలు చెప్తూ, సైగలన్నీ చేస్తూ ఎక్కడికి పోనీకుండా నిలువరిస్తూ ఉంటావు, ఇంతకంటే ఏమి చెయ్యాలి చెప్పు?

నీ మాటలతో కరిగించి ఏవేవో మంతనాలు జరుపుతూ వాటికి అలవాటు చేసి అక్కడ నాట్యాలు, నాటకాలు ఆడుతూ ఉండే నీతో నాకెందుకే! కాటుకకన్నులను చూసి మోహముతో చేతులు చాచి స్వామికి అనుకూలమై ఉంటావు ఇంకా ఈ వాదులాటలెందుకు?

ఆతని నీ బిగి కౌగిలిలో బంధించి, వ్యాపించిన అతిశయముతో అతడిని ఇంటిదాకా తీసుకొని వచ్చి ఆగితివి. నీకౌగిటిలో ఉన్న వాడు ఆయనే కదా! ఏమాత్రం గర్వము, నిక్కూ చూపించక ఆ వేంకటాద్రీశుడైన శ్రీవేంకటేశ్వరుడు ఈవిధముగా నన్ను కూడినాడు. మళ్ళీ దారిలో నేను వెనుక చేసిన పొరపాట్లనన్నింటిని ఎత్తిచూపి బాధించడం ఎందుకే!

## 369

**అవతారిక:** అమ్మ విరహంతో వేగిపోతూ చెలుల ద్వారా ఆ స్వామి పంపే సందేశం కోసం ఎదురుచూస్తుండగానే స్వామి విచ్చేశాడు. అలమేలు మంగమ్మ ఆనందం అర్ణవమైనది.

### తెలుఁగుఁగాంబోది

ప. చాలు నింతకోపాలు చలమని
పాలించఁ దనకేమి పంతమని ॥పల్లవి॥

1. అంటిరా మీరు ఆమాఁట పతితో
యింటికి విచ్చేయుఁ డిప్పుడని
నంటునా(న?) తాను నాఁటఁగఁ జూచినఁ
గంటివేదనలు ఘనమని ॥చాలు॥

2. అంపెనా మిమ్ము నాతఁడు నావద్ది-
కింపుల నామోహ మెక్కెనని
ముంపునఁ జేసిన మొన్నటిచేఁతలు
మంపునఁ నెన్నఁడు మఱవనని ॥చాలు॥

3. వచ్చెనా తాను వాకిటి కిప్పుడె
యిచ్చల నేఁపఁగ నేఁటికని

యిచ్చట శ్రీ వేంకటేశుఁడు గూడెను
నిచ్చలుఁ దానే నేనని ॥చాలు॥

**అర్థములు:** ప. కోపాలు= కోపము, చలము= వణకు,కంపము, పంతము= పట్టుదల.

1. అంటిరా= అన్నారా? పతి= భర్త,ప్రభువు, విచ్చేయు= వచ్చు, అంటు= తాకు,చేరు, కంటివేదన= కనులబాధ, ఘనము= గొప్పది.

2. అంపు= పంపించు, వద్దికి= వద్దకు, ఇంపుల= ఇష్టము, మోహము= ప్రేమ, ఎక్కు= సిద్ధించు, ముంపు= నింద, మొన్నటి= గతము, చేతలు= పనులు, మంపున= మత్తెక్కి.

3. ఇచ్చల= కోరిక, ఏపు= బాధించు, ఏటికి= ఎందులకు, నిచ్చలు= ఎల్లప్పుడు, తానే నేనను= అద్వైత భావము.

**భావము:** చెలులారా! ఈ కోపతాపాలు ఇంక చాలు. వణకు, కంపము గలిగే విధంగా ఏలుకోవడానికి స్వామి ఇంత పంతాలు పట్టింపులకు ఎందుకు వెళ్తున్నాడో అర్థం కావడం లేదు.

ఆ స్వామితో మీరు ఇప్పుడు ఇంటికి రమ్మని చెప్పారా? ఆయనకు ఆ మాటలు మనసునకంటి ఉంటాయా లేక ఏదో క్రీడగా భావిస్తున్నాడా? నేను పడ్డ బాధలన్నీ వర్ణనాతీతమని తెలియజేశారా?

ఆ స్వామి నా ప్రేమాతిశయం గురించి చెప్పి మిమ్ములను నా చెంతకు పంపాడా? ఆయన నిందుగా గతంలో చేసిన పనులన్నీ మత్తెక్కించి ఇంకా నా మదిలో మరచిపోకుండా చేశాయని చెప్పండి.

ఇంకా నన్ను కోరికలతో బాధించడం ఎందుకని ఆ స్వామి అప్పుడే వాకిట్లోకి వచ్చేశాడా? ఇక్కడ శ్రీవేంకటేశ్వరుడు కూడి యున్నాడు చూశారా? ఎల్లప్పుడూ తానే నేనని, నేనే తాననే అద్వైత భావంతో ఉన్నాడు.

## 370

**అవతారిక:** అమ్మకు స్వామిపట్ల గల శృంగార భావాలను అతిమనోహరంగా వర్ణిస్తున్నాడు అన్నమయ్య.

### వరాళి

ప. చిత్తజుని మోహపుశృంగారవనమో యీకె
పొత్తుల వసంతమాడే పురుషునితోడను ॥పల్లవి॥

1. పాయము మోసులువారెఁ బడఁతికుచములను
చాయవలపు కన్నుల జాజుకొనెను
చేయివాలెఁ గోరికలు చిగురులకొనగోళ్ళ
యీయెడ విభునివద్ద నింతిఁ జూడరమ్మా ॥చిత్తజుని॥

2. కొప్పునఁ గొనలుసాగెఁ గోమలితమకములో
కప్పురపుమాటలను గర్వము వూచె
పుప్పొడి రాలె సెలవిఁ బొలఁతికి సిగ్గులనె
చెప్పరాదు పానుపుపై చెలియభావములు ॥చిత్తజుని॥

3. భావరతి పంటవండె భామినిబింబపు మోవి
కైవశమై రాసికెక్కెఁగళలెల్లాను
యీవేళ శ్రీ వేంకటేశుఁ డింతియుఁ గూడఁగాను
దేవిదేవరవలె దిష్టమాయ నిదివో ॥చిత్తజుని॥

**అర్థములు:** ప. చిత్తజుడు= మన్మథుడు, మోహము= వలపు, శృంగారవనము= శృంగార ఆరామము, ఈకె= ఈమె, పొత్తు= జతకలియు, వసంతము= ఆమని.

1. పాయము= వయసు, మోసులు= వర్ధిల్లు, పడతి= స్త్రీ, కుచములు= రొమ్ములు, చాయ= కాంతి, జాజుకొను= ఎర్రనగు,దట్టమగు, చేయివాలు= మదిలో చేరు, ఈయెడ= ఈ తావిలో, విభుడు= భర్త, ఇంతి= స్త్రీ.
2. కొప్పు= సిగకొప్పు, కొనలు= చివరలు, సాగె= వ్యాపించె, కోమలి= స్త్రీ, తమకము= త్వరపడు, కప్పురపు మాటలు= సుగంధమైన వాక్కులు, పూచె= కదలించు, సెలవి= పెదిమల చివర, పొలతి= స్త్రీ, చెలియ భావము= చెలి మనసులోనున్న ఆలోచనలు.
3. భావరతి= రతిక్రీడా ఆలోచనలు, పంటపండె= దట్టమాయెను, భామిని= స్త్రీ, బింబపుమోవి= చంద్రబింబమువంటి ముఖము, కైవశము= అధీనము, రాసికెక్కు= అతిశయించు, కళలు= శోభలు, ఇంతి= స్త్రీ, దేవిదేవర= దేవి దేవత, దిష్టము= కనిపించు సమయము.

**భావము:** స్నేహముతో జతగూడే వసంత కాలపు వానివలె, ఈమె ఆ మన్మథుని వలపు శృంగార వనములాగా అగుపిస్తున్నది.

ఈ సమయములో తన భర్తవద్దనున్న ఆ స్త్రీని చూడండి చెలులారా! ఆమె వయసు పొంగులన్నీ ఆమె వక్షోజములలో దర్శనమిస్తూ ఆమె వలపు కాంతి కన్నులకు ఎరుపెక్కి కనిపిస్తున్నది. కోరికలు ఆ వనములో నున్న చిగుళ్ళ కొనగోళ్ళవలె మదిలో కనిపిస్తున్నవి.

సిగకొప్పు చివరలు సాగి సాగి ఉండగా, గొప్పగా త్వరపడుతున్నది. సుగంధభరితమైన కర్పూరపు మాటలు గర్వానికి ఊతమిచ్చి కదిలించి వేస్తున్నవి. ఆ రాలుతున్న పుప్పొడి రాలుతూ ఉండగా ఆ స్త్రీ పెదవి మూల సిగ్గులు చెప్పరాక, పానుపు పై ఉన్న రీతి భావనలో మునిగి యున్నది.

ఈమె ముఖ చంద్రబింబము రతిక్రీడా భావనల పంటలు పుష్కలముగా పండినవి. ఇవన్నీ స్వామికి అధీనమై ఆమె శోభలన్నీ గొప్ప అతిశయించి కనిపిస్తున్నవి. ఈవేళ శ్రీవేంకటేశ్వరుడు ఈ అలమేలుమంగమ్మా జతకలియగా దేవి దేవతల వలే గొప్ప శోభతో కనిపిస్తున్నారు.

## 371

**అవతారిక:** స్వామి ఎందుకు తన పట్ల ఇంత వింతగా ప్రవర్తిస్తున్నాడో అడగమని అలమేలుమంగమ్మ చెలులను అడుగుచున్నది.

## శంకరాభరణం

ప. పోవలె మాయింటికి పొద్దున మాకు
ఆవటించి వొక్కసారె అడుగరే మాట ॥పల్లవి॥

1. పిలిపించెనేఁటికి ప్రియము చెప్పఁగనేర
చెలువుఁడు నన్ను నేమి సేయుమనీనే
చల మొక్క టేకాని సాధించ నేనేర
అలరి యింకా నేమి అడుగరే మాట ॥పోవలె॥

2. తానె వచ్చెనేఁటికి తలపోఁత నే నెఱుఁగ
పూనిపట్టి నాకు నేమి బుద్ధిచెప్పీనే
మోన మొక్క టేకాని మొఱఁగులు నేనేర
ఆనవెట్టి మీరైనా అడుగరేమాఁట ॥పోవలె॥

3. కాఁగిలించీనేఁటికే కాఁకసేయ నేనేర
యేఁగివచ్చి నామన సేమి చూచీనే
రాఁగయై శ్రీ వేంకటాద్రిరాయఁ డిట్టె నన్నుఁ గూడె
ఆఁగినతనగుట్టేమో అడుగరేమాట ॥పోవలె॥

**అర్థములు:** ప. పోవలె= వెళ్ళవలెను, ఆవటించి= పొందుపరచి, ఒక్కసారె= ఒకసారి.

1. ప్రియము= మంచిమాట, చెలువుడు= స్నేహితుడు, చలము= వణకు,కంపము, సాధించు= బాధించు, నేర= తెలియకచేసినపని, అలరి= ప్రకాశించి.
2. తలపోత= ఆలోచన, పూనిపట్టి= ప్రయత్న పూర్వకముగా, బుద్ధి= మంచిచెడు చెప్పు, మోనము= మౌనము, మొరగులు= మోసము, ఆన= ప్రమాణము.
3. కాగిలించు= కౌగలించు, కాక= కోపము,వేడిమి, యేగివచ్చి= ఇచ్చటకు వచ్చి, రాగమై= అనురాగముతో, ఆగిన= తెలియకుండిన, గుట్టు= రహస్యము.

**భావము:** ఆ స్వామిని సావధానముగా కూర్చొండజేసి, మీరందరూచేరి నేను చెప్పే ఈ విషయాలన్నీ వివరంగా అడగండి.

నన్ను పిలిపించడం ఎందుకు? మీరందరూ మంచి మాటలు చెప్పడం నేనెరగను సుమా! ఆ స్వామి నన్నేమి చేయమంటున్నాడు? ఏదో ఒక విధంగా ఆయనకు భయపడడం తప్ప నేనేనాడూ ఆయనను సాధించి బాధించి ఎరుగను. ఆ విషయం మీరొక్కసారి ఆయనను అడగండి.

ఆ స్వామి ఇక్కడకు వస్తాడన్న విషయమే ఎరుగని దానను. నాకు ప్రయత్న పూర్వకంగా ఏవేవో సుద్ధులెందుకు చెప్తున్నాడు? నేను అన్నిటికి మౌనంగా ఉంటాను తప్ప మోసం నాకు తెలియదు సుమా! ప్రమాణ పూర్వకంగా అన్ని విషయాలు చెప్పమని మీరైనా స్వామిని అడగండి.

కౌగలించుకోవడమెందుకు? మరలా నాపై కోపించి రుసరుసలాడడం ఎందుకు? ఆయన వచ్చి చేరినప్పుడు నా మనసులో యేమున్నదో గ్రహించాలి కదా! అనురాగ మూర్తియై శ్రీవేంకటేశ్వరుడు ఇచ్చటకు వచ్చి నన్ను కూడినాడు. ఇకనైనా చెప్పకుండా దాచిన ఆ గుట్టుమట్లేమిటో ఆయననే అడగండి.

## 372

**అవతారిక:** స్వామి దివ్య సౌందర్యాన్ని చూసి అమ్మ అలమేలుమంగమ్మ నిశ్చేష్టతతో నిలబడి యున్నది.

### మంగళకౌశిక

ప. వలసినట్టాడవయ్య వన్నెలెల్లాఁ జూపవయ్య
నిలువెల్లా మెఱుఁగులే నీకు మొక్కఁజాలదు ॥పల్లవి॥

1. మగువ మాటాడఁబోతే మాణికేలు రాలీని
జగడాలు నీతోను సారె నోపదు
మొగమెత్తి చూడఁబోతే మొల్లలే మిక్కుటమయ్యీ
నగవు లంతేసి నీతో నవ్వఁగనోపదు ॥వలసి॥

2. అంగన నడవఁగానే అందెలెల్లా మొరసీని
వెంగలినీవినయాలు వినఁగూడదు
కుంగక కాఁగిటిలోన కుచములే పెరిగీని
చెంగటఁ జేయివట్టినాఁ జెలియ మొగియదు ॥వలసి॥

3. పొలఁతి నిన్నొరసితే పులకలు రాసివడీ
వొలిసియు నిందుకేపో వూరకున్నది
అలరి శ్రీవేంకటేశ అంగన నీవు గూడఁగా
నిలిచినపరవశాన నివ్వెరగుఁ బొందెను ॥వలసి॥

**అర్థములు:** ప. వలసినట్టు= కావలసిన విధముగా, వన్నెలు= నేపరితనము, నిలువెల్ల= నఖశిఖపర్యంతము,ఒడలెల్లా, మెరుగులు= కాంతి,ప్రకాశము, మొక్కజాలదు= నమస్కరించలేదు.

1. మాణికేలు= మాణిక్యములు, జగడాలు= తగాదాలు, సారె= మాటి మాటికి, మొగమెత్తి= తలను ఎత్తి, మొల్లలు= మల్లెజాతికి చెందిన కుందపుష్పాలు, మిక్కుటము= అధికము, అంతేసి= ఆవిధముగా, ఓపదు= చేయలేదు.
2. అంగన= స్త్రీ, అందెలు= కాలిగజ్జెలు, మొరయు= మ్రోగు, వెంగలి= నిరుపయోగము, వినయాలు= అణకువ, కుంగక= తగ్గక, కాగిటిలో= కౌగిటిలో, కుచములు= రొమ్ములు, పెరిగీని= వృద్ధియగు, చెంగట= చెంత, మొగియు= పూనుకొని.
3. పొలతి= స్త్రీ, ఒరయు= విచారించు, పులకలు= గగుర్పాటు, రాసివడు= కుప్పలగు, ఒలయు= వ్యాపించు, అలరి= సంతోషపెట్టు, అంగన= స్త్రీ, పరవశము= ఒడలెరుగకయుండు, నివ్వెరగు= నిశ్చేష్టత.

**భావము:** ఓ స్వామీ! కావలసిన విధంగా మాట్లాడవయ్యా! నీ నైపుణ్యాలు, చాతుర్యమును చూపించవయ్యా! నీ దేహకాంతి నిలువెల్లా వ్యాపించి యున్నందున నీకు నమస్కరించజాలక సంభ్రమాశ్చర్యాలతో యున్నదానను.

మగువ మాట్లాడాలని యత్నిస్తే మాణిక్యాలు రాలి పడతాయి. నీతో తగువులాడలేను. ముఖారవిందాన్ని చూద్దామని ప్రయత్నిస్తే మొల్లలు అధికంగా కనిపిస్తాయి. నీతో నేను నవ్వులు నవ్వి హాస్యమాడడం చేయలేక పోతున్నాను.

అంగన నడవగానే కాలి అందెలు ఘల్లున మ్రోగుతాయి. నిరుపయోగమైన నీ అణకువలు, వినయాలు వినలేకపోతున్నాను. నేను ఏ మాత్రం తగ్గకుండా నీ కౌగిటిలో ఉన్నప్పుడు రొమ్ములు వృద్ధిపొందుతున్నవి. చెంత జేరి చేయిపట్టుకున్నప్పటికి ఏమీ మాట్లాడవు.

ఆ పడతి నిన్ను విచారించి దరిజేరగా నీకు గగుర్పాటు కొండలై పెరిగిపోవుచున్నది. వ్యాపించి దరిచేరినా ఇందులకే మిన్నకుండిపోయినది. ఆమె నిల్చి ఒడలెరుగని పారవశ్యం పొందినప్పటికి నిశ్చేష్టతతో నిలబడిపోయి ఉన్నది.

## 373

**అవతారిక:** అమ్మ స్వామిపట్ల ఎందుకో ఉదాశీనతగా వ్యవహరిస్తున్నదని భావించిన చెలులు స్వామిని చేరమని చెప్తున్నారు.

### సాళంగం

ప. చెప్పితే నిష్టూరము చెలియ నీవారము
రెప్పల నీలోని చూపే రేసుదెచ్చుఁ జుమ్మీ ॥పల్లవి॥

1. కామించి యతఁడు గారవించి పిలువఁగ
యేమన్నా బలుకవు యేలే ఇంత
దీమస మెంత నీకుఁ దీర దెంతైనాఁ బరాకు
వాములైన వలపులు వడ్డివారుఁజుమ్మీ ॥చెప్పితే॥

2. అదన నీయింటికి నాతఁడే రాఁగా నీ-
వెదురయి మొక్కవు యేలే ఇంత
పెదవు లెత్తవు నీకు ప్రేమైనాఁ గైకోవు
కదలుఁగుచాలు నీకే కదువాండొఁ జుమ్మీ ॥చెప్పితే॥

3. చెంత నిట్టె కూడెను శ్రీ వేంకటేశుఁడు
యింతలో మేమఱచేవు యేలే యింత
చింతలెల్లాఁ దీరెను సేసకొప్పు జారెను
పంతములాడఁగఁబోతేపై వచ్చుఁ జుమ్మీ ॥చెప్పితే॥

**అర్థములు:** ప. నిష్టూరము= పరుషమైన మాట, రెప్పలు= కనురెప్పలు, రేసు= చులకన, సుమ్మీ= సుమా(నిశ్చయార్థకము).

1. కామించి= మోహించి, గారవించు= గౌరవించు, పలుకవు= మాట్లాడవు, దీమసము= నేర్పు, తీరదుంఎంతైనా= ఎంతైనా చెప్పానలవికాదు, పరాకు= ఉదాశీనత, వాములు= పెద్దవియైన, వడ్డివారు= అధికమగు.

2. అదన= సమయము జూచి, మొక్కవు= నమస్కరించవు, పెదవులెత్తు= మాటలాడు, గైకోవు= లక్ష్యపెట్టు, కదలుగు= యత్నించు, కడు= మిక్కిలి ఎక్కువ.
3. చెంత= సమీపమున, ఏమరచు= పరధ్యానం, చింత= తలపు, సేసకొప్పు= అక్షతలు వేసిన సిగకొప్పు, జారు= వీడు, పంతము= పట్టుదల, పైవచ్చు= మీదకు వచ్చు.

**భావము:** అమ్మా! ఏమన్నా అంటే నిష్టూరాలాడుతున్నారని అంటావు గానీ మేమంతా నీ హితవుకోరే వారమే కదా! నీ చూపులోనే మాపై చాలా తేలిక భావమున్నది సుమా!

ఆ స్వామి నిన్ను మోహించి, ఎంతో గౌరవముతో పిలవగా, ఏమీ మాట్లాడకుండా ఎందుకిలా చేస్తున్నావు? నీ నేర్పులు ఎంత చెప్పినా తీరనివి పైగా ఎల్ల వేళలా ఉదాశీనతతో ఉంటావు. స్వామి అతిశయించిన ప్రేమతో ఉన్నారు సుమా!

ఆ స్వామే తగిన సమయమని గ్రహించి ఇంటికి రాగా, నీవు కనీసము ఎదురుపడి నమస్కరించడం కూడా చేయలేదు. పెదవెత్తి మాటలాడి ఆయన ప్రేమను అందుకోవడానికి యత్నించవు. నీవు మొదట యత్నిస్తే గదా ఆ స్వామికి నీపై అధిక ప్రేమతో ఉన్నాడనే విషయం విదితమయేది.

ఇదుగో ఆ శ్రీవేంకటేశ్వరుడు నీ సమీపములో నిలబడి యున్నాడు. ఇంతలోనే అంత మైమరుపులేల ప్రదర్శిస్తున్నావు? నీ ఆలోచనలన్నీ దీరి నీ కొప్పు పైభాగము జారిపడినది. ఇంకా నీవు పట్టుదలలకు బోయినట్లైతే ఆయన నీ పైపైకే వచ్చేస్తాడు సుమా!

## 374

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ వింత, విపరీత ప్రవర్తనకు, పరధ్యానాన్ని అర్థంచేసుకోలేని చెలులు, విషయాలన్నీ స్వామికి నివేదిస్తున్నారు.

### ఆహిరి

ప. నీకే తెలుసునిఁక నే మేమీ నెఱఁగము
ఆకెకు నీకే తగును అదివో విన్నపము ॥పల్లవి॥

1. యెక్కడి పరాకో యెంత నేము విలిచిన
చెక్కు మీఁదిచేయికాని చిత్త గించదు
నిక్కి నీవు చూచితివి నిన్న మాపటంతనే
అక్కట నేఁడిట్లాయ నదివో విన్నపము ॥నీకే॥

2. మందో మంత్రమోకాని మరి బుద్ధిచెప్పినాను
చందము తనదేకాని చాయకురాదు
అంది విడె మిచ్చితివి అల్లపు డింతికి నీవే
అందువంక నిట్లాయ నదివో విన్నపము ॥నీకే॥

3. యెంతసంతోసమోకాని యెదిరిఁ దన్నెరఁగదు
కాంతలు కాను కిచ్చినాఁ గైకొనదు
వింతగా శ్రీవేంకటేశ వెలఁదిఁ గూడితి విట్టె
అంతలోనే చొక్కఁబోలు నదివో విన్నపము ॥నీకే॥

**అర్థములు:** ప. ఆకె= ఆమె, విన్నపము= ప్రార్థన, మనవి.

1. పరాకు= ఉదాశీనత, నేము= మేము, విలిచిన= పిలిచిన, చెక్కు= చెక్కిలి, చిత్తగించు= విను, నిక్కి= చక్కగా చూచు, నిన్న= ముందురోజు, మాపటి= సాయంత్రానికి.
2. మందో మంత్రమొ= మందుపెట్టెనో లేక మంత్రము వేసెనో తెలియదు, బుద్ధిచెప్పు= మంచిచెడు వివరించు, చందము=

పద్ధతి, చాయ= వద్దకు, విడెము= తాంబూలము, అల్లప్పుడు= వెనుకటి సమయములో, ఇంతి= స్త్రీ, అందువంక= అందువల్ల.

3. ఎదిరి= విరోధము, తన్నెరుగదు= తనకు తెలియకపోవుట, కానుక= బహుమతి, కైకొను= తీసుకొను, వింత= ఆశ్చర్యము, వెలది= స్త్రీ, చొక్కబోలు= పరవశత్వం కలుగు.

**భావము:** స్వామీ! విషయాలన్నీ మీరే ఎరుగుదురు. మేమేమీ తెలియని వారమే! ఈ వ్యవహారాలన్నీ ఆమెకు నీకే చెల్లినవి. మా ప్రార్థనలను మన్నించి వినండి.

ఆమెకు ఎంత పరధ్యానమో ఏమో అర్థమవడంలేదు, మేము పిలుస్తున్నా వినిపించుకోకుండా చెక్కిలి మీద చేయి వేసుకొని ఉంటుంది కానీ, మాట్లాడడంలేదు. నీవు నిన్న, ఈరోజూ నీవే ప్రత్యక్షంగా చూశావు కదా! అయ్యయ్యో! ఈవిధముగా ఎందుకుంటున్నది? స్వామీ! మా విన్నపాలను వినండి.

ఎవరో మందు పెట్టినట్లు, మంత్రం వేసినట్టు ఉన్నది. ఎంత విడమరచి బుద్ధి చెప్పినా యేమాత్రం వినడంలేదు. ఆమె ధోరణి ఆమెదే అన్న చందాన ఉన్నది. పూర్వము నీవే స్వయంగా ఆమెకు తాంబూలము నిచ్చావు కదా! అందువల్ల ఈ విధముగా ఉన్నదో ఏమో అసలు విషయము తెలియరాకున్నది. మా విన్నపము వినండి.

ఆమె లోలోన ఎంతో సంతోషపడుతున్నది కానీ తన్ను తాను తెలుసుకోలేక పోతున్నది. తోడి చెలులు బహుమతులిచ్చినా తీసుకోవడం లేదు. ఆశ్చర్యకరముగా ఓ శ్రీవేంకటేశ్వరా ! ఆమెను ఈవిధముగా కలుసుకొన్నావు. అంతలోనే పరవశత్వానికి లోనవుతుందో ఏమో! మా విన్నపాలను ఆలకించండి స్వామీ!

## 375

**అవతారిక:** శ్రీనివాసుని వక్షస్థలముపైనున్న అమ్మ వారిని వర్ణిస్తున్నాడు అన్నమయ్య.

### మాళవి

ప. అల్లదె జవ్వని హరియురమున నదె
మెల్లనె యిటు వుపమించరే మీరు ॥పల్లవి॥

1. ముత్తెపుజిప్పలో ముంచినకలువలో
వొత్తిలి కనుఁగవ లొకమాటాడరే
గుత్తపుఁగుండలో కొండలో కుచములో
హత్తి యేర్పడఁగ ననరే మీరు ॥అల్లదె॥

2. తామెరతూండ్లో తతియగు తీగెలో
భామచేతు లేర్పరచరే యిపుడు
దోమటిసింహమో తొడఁగినబయలో
ఆమాటాడరే అందులో నొకటి ॥అల్లదె॥

3. నీలపుమణిలో నిండిన మేఘమో
బాలకితురు మొకపలుకునఁ జెప్పరే
యీలీల శ్రీ వేంకటేశ్వరుఁగూడెను
మేలిమి మెఱుఁగో మెలుఁతో యనరే ॥అల్లదె॥

**అర్థములు:** ప. అల్లదె= అల్లదిగో, జవ్వని= యౌవనవతి, ఉరము= వక్షస్థలము, మెల్లనె= తిన్నగా, ఉపమించు= సరిపోల్చు.

1. ముంచిన కలువ= మునిగియున్న ఉత్పల పుష్పము, ఒత్తిలి= పట్టుగా, కనుగవ= కన్నుల జంట, గుత్తపు= బిగువైన, కుండ= పాత్ర, కుచము= రొమ్ము, హత్తి= కూడుకొను.

2. తామెర తూండ్లు= తామర కాడలు, తతి= సమూహము, భామ= స్త్రీ, దోమటి= విందు, బయలు= బహిఃప్రదేశము.

3. హితురు= మంచిమాట, లీల= విలాసము,క్రీడ, మేలిమి= శ్రేష్ఠమైన, మెరుగు= కాంతి, మెలుతు= మెలత,స్త్రీ.

**భావము:** అదుగో అక్కడ శ్రీహరి వక్షస్థలముపై ఉన్నది ఎవరో చూశారా! ఇక మెల్లగా ఆమె ఎవరో ఏమిటో సరిపోల్చుకోండి.

ముత్యపు చిప్పలో ఉన్న ముత్యమువలె, నీటిలో మునిగి తేలుతున్న మంచి ఉత్పల పుష్పము వలె పట్టుగా ఆ కన్నుల జంటతో కొంచెం మాట్లాడండి. బిగువైన గట్టి మట్టిపాత్రలవలె, కొండలుగా ఉన్న వక్షోజాలు కూడుకొని ఉండడం గమనించి మీరు ఆలకించి చెప్పండి ఎవరో మీకు తెలుస్తుంది.

ఆ చేతులు తామర కాడల్లాగా, తీగల సమూహములాగా ఉన్నవి కదా! వాటిని గమనించండి. మాయా సింహమో విశాలమైన బహిఃప్రదేశమో అన్నట్టు ఆమాటలు మాట్లాడి గమనించి ఆమె ఎవరో కనిపెట్టండి.

ఆమె శరీర శోభలు నీలపు మణులా లేక నిండైన నీలాకాశపు మేఘములా? గమనించి ఆ బాలకిపుడు హిత వచనాలను చెప్పండి. ఈ విధానములో విలాసముగా ఆ శ్రీవేంకటేశ్వరుడు కూడినాడు. ఈ శోభ మేలిమి కాంతులతో ఉన్న స్త్రీ ఎవరో చెప్పండి.

## 376

**అవతారిక:** స్వామికి పొరుగింటి పుల్లగూర రుచి యన్న చందాన పరస్త్రీల వ్యామోహమే మిన్నగా ఉన్నదని అమ్మ సున్నితంగా నిష్టూరాలాడుతున్నది.

### సామంతం

ప. ఎడసితే నొకగుణ మెదుట నొకగుణము
అడియాలాలెల్లఁ గంటి మౌలేరా మాఁటలు ॥పల్లవి॥

1. నిచ్చలు వద్దనుండేటినెలఁతలపొందుకంటే
వచ్చీరాని వనితల వలపు చవి
పెచ్చువెరిగే వౌలేరా పెళ్ళిచెట్టు మందుగాదు
యిచ్చకము సేయవచ్చే విఁకనేల మాటలు ॥ఎడసితే॥

2. భావించి నాలుకమీఁదిపంచదారకంటెను
ఆవలిచేఁదే తరితీపై యుండును
కావించి యరచేతిమాణికమైనా సరకు గాదు
యీవేళఁ గొసరేదా యిఁకనేల మాటలు ॥ఎడసితే॥

3. కాఁగిటఁ గూడినయట్టికమ్మనిరతులకంటె
మూఁగినభావరతుల మోహము బెట్టు
యేఁగివచ్చి శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
మాఁగినపండు చవౌను మరియేల మాఁటలు ॥ఎడసితే॥

**అర్థములు:** ప. ఎడ= దూరము, ఎదుట= దగ్గరగా, అడియాలము= ఆనవాళ్ళు,గుర్తులు, ఔ= అవును.

1. నిచ్చలు= ఎల్లకాలము, నెలత= స్త్రీ, వచ్చీరాని= ఎప్పుడో వచ్చే, చవి= రుచి, పెచ్చు పెరుగు= అధికమగు, పెళ్ళిచెట్టు మందుకాదు= పెరటిలో ఉన్న చెట్టు ఔషధ మొక్కైనప్పటికి మందుకు పనికిరాదు (తేలిక భావము), ఇచ్చకము= ముఖప్రీతి.
2. భావించు= తలచు, ఆవలి= అవతలనున్న చేదు= చేదైన రుచి, తరితీపు= ఆపేక్ష, కావించి= బాగ పరికిస్తే, సరకు= సొమ్ము,నగ, కొసరు= కోరుకొను.
3. కాగిట= కౌగిట, కమ్మని= మధురమైన, రతులు= రతిక్రీడా విలాసాలు, మూగిన= ముసిరిన, భావరతులు= రతిక్రీడా ఆలోచనలు, మోహము= ప్రేమ, బెట్టు= అతిశయము, ఏగివచ్చి= బయలుదేరి వచ్చి, మాగిన= బాగా పక్వమైన, చవి= రుచి.

**భావము :** స్వామీ! నీ విషయమేమిటో బోధపడకుండా యున్నది. దూరంగా ఉన్నప్పుడు ఒక రీతిగా, దగ్గరైనప్పుడు ఒక తీరుగా ప్రవర్తిస్తూ ఉంటావు. నీవు చేస్తున్న పనుల ఆనవాళ్ళన్నీ గమనించాను. అంతేలే! అలాగే ఉంటాయి సుమా! నీ మాటలన్నీ !

ఎల్లప్పుడూ నీ చెంతనే ఉండి సేవలు చేసుకునే మా బోటి స్త్రీలకంటే ఎప్పుడో వచ్చిపోతూ తళుక్కుమని మెరిసే స్త్రీల ప్రేమే రుచిగా ఉంటుంది. బాగా నీ వ్యవహారాలు మితిమీరినవి. అవునులే ఎప్పుడూ పెరటిలో ఉన్న చెట్టు మందు కాదనే మాట సామెత సత్యమే కదా! ఇప్పుడేల ముఖప్రీతి మాటలాడడానికి దయచేశావు? ఇంక నీతో మాటలేల స్వామీ!

మీకు నాలుక మీద తయారుగా ఉన్న పంచదార కంటే కూడా, దూరంగా ఉన్న చేదు రుచే సంతృప్తినిస్తూ అపేక్షతో కూడి యుంటుంది. పరికించి చూస్తే అరచేతిలో ఉన్న మాణిక్యము మీకు సొమ్ముకాక నిరుపయోగమై ఉంటుంది. కానీలే స్వామీ! ఇక ఈవేళ నాకు కోరుకునే కోరికలేమున్నవి. ఇక మీ మాయ మాటలు చాలించండి.

కౌగిటిలో సిద్ధమై యున్న మధురమైన అనుభూతులు, రతిక్రీడా విలాసాలకంటే కూడా మీ మనసులో కూడి యున్న రతిక్రీడా ఆలోచనా ధోరణే అతిశయమనిపిస్తున్నది. ఓ శ్రీవెంకటేశ్వరా ఈ విధముగా నాకొరకై బయలుదేరి వచ్చి నన్ను కూడితివి. పక్వమైన ఫలాలే ఎప్పుడూ రుచిగా ఉంటాయన్న విషయం గ్రహించండి. ఇక మాటలేల? కొనసాగించండి.

## 377

**అవతారిక:** స్వాధీనపతికయైన అమ్మ శ్రీనివాసుని ఉత్తమోత్తమ గుణాలను ప్రశంసిస్తూ అడగకుండానే అన్నీ సమకూరుతూ ఉండగా నాకిక కోరికలేముంటాయని చెప్పే దృశ్యం.

### దేవగాంధారి

ప. తెలిసిన పనులకు దెగ నిన్ను
సొలపుఁ జూపులనె చూచితి నిన్ను ॥పల్లవి॥

1. నామతిలో నున్నవి నీవాడఁగ
యేమని కొసరే నిఁక నిన్ను
మోము చూచితే మొగి నిటు నవ్వఁగ
కామించి యలుగఁగఁ గలనా నిన్ను ॥తెలిసిన॥

2. పిలువకతొల్లే ప్రియమున రాఁగా
వలెనా రమ్మన వడి నిన్ను
పలికినంతనే పంతము లియ్యఁగ
చలములు సాధించఁ జాలము నిన్ను ॥తెలిసిన॥

3. అంటకతొల్లే అంగము గరఁగఁగ
కంటకమేల యిక్కడ నిన్ను
యింటనే శ్రీ వేంకటేశ కూడితివి
వెంట వెంట నిఁక విడువను నిన్ను ॥తెలిసిన॥

**అర్థములు:** ప. తెగ= అధికముగా,నిశ్శేషముగా, సొలపు= పారవశ్యము.

1. మతి= మనసు, కొసరు= కోరు, మొగి= పూనిక.
2. తొల్లి= పూర్వము, వడి= వేగము, పంతము= పట్టుదల, చలము= కంపము.
3. అంటక= తాకక, తొల్లే= పూర్వమే, అంగము= శరీరము, కరుగు= ద్రవించు,ఆహ్లాదమగు, కంటకము= ముల్లు, వెంట వెంట= కూడా కూడా తిరుగు.

**భావము :** ఓ స్వామీ! అన్ని విషయాలు మీగురించి క్షుణ్ణంగా ఎరిగినదానను. నీపై సదా పారవశ్యపు చూపులే ప్రసరింపజేస్తుంటాను.

స్వామీ! నామదిలో నున్న విషయాలే నీవుకూడా చెప్తూ ఉండగా, ఇక నిన్ను కోరుకోవడానికి నా వద్ద కోరికలు ఏమి మిగిలి ఉంటాయి ? నీ ముఖపద్మం గమనించినంతనే పూని నీవు చిరునవ్వులు చిందిస్తూ ఉంటావు. నిన్ను మోహించినదానను నీపై అలుక బూనగలనా?

స్వామీ! నిన్ను పిలువక ముందే నీవు ప్రేమతో చేరి ఆదరిస్తూ ఉండగా ఇక నేను త్వరపడి నిన్ను రమ్మని చెప్పవలసిన అవసరమేమున్నది ? నేను ఏదన్నా పొరబాటున పట్టుదలకు పోతే వెంటనే నీవు ఆదరణ చూపుతూ ఉండగా ఇంకా నిన్ను సాధించడము అవీ ఇవీ ఎందుకు చెప్పండి?

స్వామీ! నిన్ను స్పృశించబోయేంతలోనే, నా శరీరం యావత్తూ ఆహ్లాదముతో ద్రవించిపోతూ ఉండగా, ఇంకా ముళ్ళవంటి మాటల గొడవలెందుకు? ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ గృహములోనే నన్ను కూడితివి. నిన్ను విడిచిపెట్టకుండా కూడా కూడా తిరగడమే నా విధిగా భావిస్తున్నాను.

## 378

**అవతారిక:** స్వామి వారిని చూసినప్పుడు ఒక స్త్రీకి కల్గిన మన్మథావస్తను అతి సుందరంగా వర్ణించే సన్నివేశం.

### సాళంగనాట

ప. నిన్ను దూరఁ బనిలేదు నీవు మేలే సేసితివి
కన్నెకుఁ గాఁకలు మించెఁ గర్మఫల మిట్టిది ॥పల్లవి॥

1. కాంతపై జల్లనిచూపు కడు నీవు చల్లఁగాను
యింతికిఁ జింతలత లిగిరించెను
కొంత నీకృపారసము కొలఁగులై ముంచఁగాను
వింతగాఁ గలువ లట్టె వికసించెను ॥నిన్ను॥

2. నెలఁతకుఁబలుకుఁదేనెలు నీవు చిందఁగాను
అలులు చిందరవందరై మూఁగెను
కలికిపై నీవూర్పుగాలి నేఁడు విసరఁగ
మలిమి జక్కవలకు పంజరము లూడెను ॥నిన్ను॥

3. పై పైఁ జెమటయేరు పడఁతిపై బరపఁగ
మోపులై ముత్తెపుసరులు మొలకలొత్తె
యేపున శ్రీ వేంకటేశ యీసతి నీవు గూడఁగ
నీపొందుల భ్రమసి నివ్వెరగై నిలిచె ॥నిన్ను॥

**అర్థములు:** ప. దూర= అనవలసిన, కాకలు= వేడిమి, మించె= అధికమయ్యెను, కర్మఫలము= పూర్వజన్మ సుకృతము.

1. చల్లు= వ్యాపింపజేయు, చింతలతలు= బాధయనెడి తీగ, ఇగిరించు= చిగురింపజేయు, కృపారసము= కరుణాధార, కొలగు= లోహపు బిందె వంటిది, కలువ= ఉత్పలము, వికసించు= విరబూయు.
2. నెలత= స్త్రీ, పలుకుతేనెలు= మాటలనెడి అమృత ధారలు, చిందు= చిమ్ము, అలులు= నీటిలోని అలలు, చిందరవందర= చెల్లచెదురు, కలికి= స్త్రీ, వూర్పుగాలి= ఊపిరినుండి వచ్చు గాలి, విసరగ= విడువగ, మలిమి= మాలిమి, జక్కవలు= చక్రవాక పక్షులు, పంజరములు= బందికానాలు, ఊడెను= విడివడెను.
3. చెమట ఏరు= ప్రవాహముగా కారెడి చెమట, పడతి= స్త్రీ, పరపు= కారగా, మోపులు= అధికము, ముత్తెపు సరులు= ముత్యపు హారములు, మొలకెత్తు= పుట్టు, ఏపున= బాధ, పొందు= కలయికలు, భ్రమయు= పరవశత్వము పొందు, నివ్వెరగు= భ్రాంతి.

**భావము :** ఓ స్వామీ! ఇందులో నిన్ను దూషించవలసిన పనిలేదు. నీవు మేలే చేసితివి. ఆ స్త్రీకి శరీరమున మోహతాప మధికమవడం కేవలము కర్మఫలమే సుమా!

ఆ స్త్రీపై నీవు చల్లని చూపును ప్రసరింపజేయగా, ఆమెకు బాధ అతిశయించి తీగలుగా సాగి చిగురించినది. ఆమె నీ కరుణాధారను బిందెలతో ముంచెత్తగా అక్కడున్న కలువ పుష్పాలన్నీ ఆశ్చర్యమయే విధంగా విరబూసినవి.

ఆ స్త్రీకి నీవు తేనెవంటి మధురమైన మాటలను మాట్లాడగా ఆ కొలనులోని అలలు ఆ శబ్దానికి చిందరవందరగా అయ్యాయి. ఆమె పై మరులు గొని నీవు విడిచిన ఊపిరి గాలికి అక్కడ విహరిస్తున్న చక్రవాక పక్షులకు పంజరములో నుండి విముక్తి కలిగిన విధముగా స్వేచ్ఛను పొందినవి.

నీ పైపైన కారుతున్న చెమట ఏరులై ప్రవహించి ఆ స్త్రీపైకి రాగా, అక్కడ ముత్యపు హారాలు పుట్టాయి. నీవు ఒక్కసారిగా ఆ స్త్రీని కలియగా నీ పొందువలన కలిగిన పరవశత్వం వలన భ్రాంతితో నిలబడిపోయినది సుమా!

## 379

**అవతారిక:** అమ్మ చిలిపిదనముతో ఏవో చిన్న చిన్న తప్పిదాలు చేసినా, స్వామి అవన్నీ లక్ష్యపెట్టకుండా అమ్మను దయాసముద్రుడై ఆదరించినందుకు, కృతజ్ఞురాలై స్వామిని "ఇది చాలదా స్వామీ నా భాగ్యానికి" అంటూ స్తుతిస్తున్నది.

### సామంతం

ప. చాలు జాలు నున్న వెల్లాఁ జాలదా యిది
జాలెలా నిందునే పాసెఁ జాలదా యిది ॥పల్లవి॥

1. గొరబుగా నవ్వితేనుకోపగించుకొనక
సరిగా నీవు నవ్వితి చాలదా ఇది
తరవై కొంగువట్టితేఁ దప్పించుకొనక
సరవి నూరకుండితి చాలదా ఇది ॥చాలు॥

2. కన్నుల నేఁ బిలిచితే కమ్మర జంకించక
సన్నలకే వచ్చితివి చాలదా ఇది
నిన్నుఁ దప్పకచూచితే నిలిచి వాదుక రాక
జన్నెవలపు చల్లితి చాలదా ఇది ॥చాలు॥

3. తమితో నిన్నుఁ గూడఁగా దప్పులనుఁ బొరలక
సమరతిఁజొక్కితివి చాలదా ఇది
అమర శ్రీ వేంకటేశ అనుమాన మెంచక
జమళిఁగూచుంటి విట్లె చాలదా యిది ॥చాలు॥

**అర్థములు:** ప. ఉన్నవెల్లా= ఇప్పటికే ఉన్నవి చాలు, జాలెలు= బొంగరమునకు కట్టు తాడు,ధనము, పాయు= తొలగు,వీడు.

1. గొరబు= వింత, తరవు= నిర్బంధము, సరవి= క్రమము.
2. కమ్ము= చుట్టుకొను, సన్నలు= సైగలు, వాదు= వివాదము, జన్నె వలపు= నియమబద్ధమైన వలపు, చల్లితి= వ్యాపింపజేసితి.
3. తమి= కుతూహలము, పొరలు= పొర్లు,దొర్లు, సమరతి= ఉపరతికి వ్యతిరేకమైనది,ఒక రతిభేదము, చొక్కు= మోహపడు, అమర= ఒప్పునట్లు, ఎంచు= లెక్కించు, జమిళి= జత.

**భావము :** ఓ స్వామీ! ఇప్పటికి ఉన్న విశేషములు చాలు. బొంగరానికి కట్టిన సూత్రములాగా నేను మిమ్ములను వీడడం మళ్ళీ చుట్టుకోవడం ఇది చాలదా!

స్వామీ! మీరు వింత వింతలుగా నవ్వుతూ ఉంటే, మీరు ఏమాత్రం విసుగు, కోపమూ చెందక, నా వంక చూసి చిరునవ్వులు

చిందించినది చాలదా! తప్పనిసరియై మీ కొంగుపట్టుకోగా మీరు తప్పించుకోవాలని చూడకుండా ఆ క్రమంలో ఊరక ఉండిపోవడం చాలదా స్వామీ!

నేను కన్నులతో మిమ్మల్ని ఆహ్వానం పలికితే చుట్టుకొని నన్ను జడిపించక, ఉత్తుత్తి సైగలకే వచ్చి చేరినారు ఇది చాలదా! మిమ్మల్ను అదే పనిగా చూస్తూ నిలబడితే, మీరు నాతో దానికి పోట్లాటలు, వాదోపవాదాలు పెట్టుకోకుండా నియమబద్ధమైన ప్రేమాభిమానాలను నాపై కురిపించారు ఇది చాలదా స్వామీ!

నేను విపరీతమైన కుతూహలము, అపేక్షలతో మిమ్ములను చుట్టుకొనగా, నాపై ఏమాత్రము తప్పులను లెక్కించక రతిక్రీడకు ఉపక్రమించి నన్ను మోహాతిశయంలో ముంచెత్తినారు ఇది చాలదా స్వామీ! ఓ వేంకటేశ్వరా! అన్నిటికి ఒప్పినట్లుగా ఏమాత్రం సందేహాలకు తావీయక నాతో జతకూడి కూర్చొన్నారు ఇది చాలదా స్వామీ!

## 380

**అవతారిక:** స్వామి విచ్చేస్తున్న సమయములో చెలులు అమ్మను సమాయత్తపరచి, ఏ భీతిలేకుండా మనసువిప్పి మాట్లాడమని ప్రోత్సాహం ఇస్తున్న సన్నివేశం.

### లలిత

ప. ఇదె వచ్చె రమణుఁడు యెంచిన యెన్నికలాయ
మదనమంత్రాలతోడ మాటాడవే ॥పల్లవి॥

1. చెక్కిటఁబెట్టినచేయి చిత్తములోనికి నూయి
తక్కినసిగ్గులకెల్లా దండదాయి
చక్కనినీవదనము చందురునిసదనము
మక్కువతోఁ జిన్నఁబోక మాటాడవే ॥ఇదె॥

2. ఆరీతి పయ్యదకొంగు యౌవ్వనపాయపురంగు
పోరచి కోరికలెల్లాఁ బొంగేటిపొంగు
సారపు నీకెమోవి చల్లగ్రపపుదీవి వే
మారు దడువక ఇట్టె మాటాడవే ॥ఇదె॥

3. సగమువీడినకొప్పు సరసమాడేవొప్పు
పగటుభావరతులు పట్టిచ్చేచొప్పు
తగు శ్రీ వేంకటపతి దగ్గరి నిన్నిటు గూడె
మగఁటిమెల్లా మెరసి మాఁటాడవే ॥ఇదె॥

**అర్థములు:** ప. రమణుడు= మనోజ్ఞుఉడు, ఎన్నిక= ఎంపిక, మదనమంత్రాలు= మన్మధుని కి సంబంధించిన శృంగర విషయములు.

1. చెక్కిట= చెక్కిలిపై, ఊయి= భావి, దండదాయి= ఆధారము, వదనను= మొహము, చందురునిసదనము= చందమామ నివాసము, మక్కువ= ఇష్టము, చిన్నబోవు= తలవంచుకొను.
2. యౌవనపాయము= యుక్తవయసు, రంగు= కాంతి, పోరచి= చేబదులు, ఈకె= ఈమె, ప్రపుదీవి= పుష్ప వికసితమైన ద్వీపము, వేమారు= వెయ్యిసార్లు, దడవక= భీతిచెందక.
3. ఒప్పు= తగినరీతి, పగటు= ప్రకటించు, భావరతులు= రతిక్రీడకు సంబంధించిన ఆలోచనలు, చొప్పు= విధము, మగటిమి= శౌర్యము, మెరయు= ప్రకాశించు.

**భావము :** ఇదిగో చూడండి అటు చూడు. ఆ మనోజ్ఞసుందరమైన స్వామి యిటే విచ్చేయుచున్నాడు. నీవు లెక్కించిన ఎంపిక సరిపోయినది కదా ఇక మన్మథ తంత్రాలతో శృంగార విషయాలన్నీ నివేదించవే!

నీవు చెక్కిలిపై పెట్టుకున్న చేయి మనసులో భావివలె లోతైనది. చక్కనైనటువంటి నీ ముఖారవిందము చంద్రుని గృహమువలెనున్నది. ఇక ప్రీతిదీరా ఏమాత్రం తగ్గకుండా స్వామితో మాట్లాడవే!

నీ పైటకొంగు నీ యుక్తవయసునకు పొంగుతున్న యౌవనానికి నూతన కాంతులిస్తున్నది. నీవు కోరుకున్న కోరికలన్నీ చేబదులు పుచ్చుకున్న రీతిగా పొంగేటి యౌవన ప్రాయపు పొంగులే సుమా! గొప్ప సారవంతమై ప్రకాశిస్తున్న ఈమె ముఖము చల్లనైన పుష్పాలతో కూడిన ద్వీపము వలె నున్నది. ఇంక వెయ్యి మార్లు ఏవేవో మాటలు మాట్లాడకుండా స్వామితో మాటలు కలుపవే!

సగము ఊడిపడి వ్రేలాడుతున్న నీ సిగకొప్పు సరసమాడేందుకు సిద్ధమై తగిన రీతిలో నున్నది. నీ రతిక్రీడా భావనలన్నీ పట్టించే విధానము స్పష్టంగా కనిపిస్తున్నది. తగిన రీతిగా శ్రీవేంకటేశ్వరుడు సమీపించి నిన్ను కూడిన అనంతరము, స్వామి శౌర్యమంతా ప్రకాశిస్తున్నది కదా ఇక ఆయనతో మాట్లాడ నారభించవే!

## 381

**అవతారిక:** స్వామి ఏమి చేసినా తనకు సంతోషమే అన్న ఆశయాన్ని అమ్మ అలమేలుమంగమ్మ వ్యక్తం చేస్తున్నది.

### కేదారగౌళ

ప. ఎట్టై(ట్ట?)యినా మేలే ఇన్నిటికిఁ దానె గురి
ముట్టినది నాకుఁ దనమోహమొకటే ॥పల్లవి॥

1. కోపగించి చూచేవి కూరిమి పైఁ జల్లేవి
కై పుగా నీతనిరెండుకన్నులే కదే
తీపు గడుఁబూసేవి తెగి చేఁదు నెరుపేవి
మాపు దాఁకా తనతోడిమాటలే కదే ॥ఎట్టైనా॥

2. అంగపుఁగాఁక రేఁచేవి ఆయములు గరఁచేవి
పొంగారి తాఁజేసేపొందులే కదే
ముంగిటఁగడు నవ్వించేవి మోము గడువంపించేవి
చెంగటఁదాఁ జేసినట్టిచేఁతలేకదే ॥ఎట్టైనా॥

3. మొక్కులు దా మొక్కేవి మొనగోరు మోపేవి
చిక్కనికాఁగిటి తనచేతులేకదే
యిక్కడ శ్రీ వేంకటేశుఁ డింతసేసి నన్నుఁగూడె
దక్కె మాకు నిద్దరికి తలపోఁతేకదే ॥ఎట్టైనా॥

**అర్థములు:** ప. ఎట్టైనా= ఏవిధముగానైనా, మేలు= శుభము, గురి= లక్ష్యం,మితి, ముట్టినది= తాకినది, మోహము= ప్రేమాతిశయము.

1. కూరిమి= స్నేహము, పైచల్లు= పైన ప్రసరించు, కైపు= మత్తు, తీపి= మధురము, చేదునెరపు= వెగటురుచి కలిగించేవి, మాపు= రాత్రి, తోడి= కూడిన.
2. అంగపు కాక= శరీర వేడిమి, ఆయములు= జీవస్థానములు, కరచు= పట్టుకొను, పొంగారి= అధికమయిన, పొందు= కూడిక, వంపించు= తలవంపులుచేయు, చెంగట= చెంత, చేతలు= పనులు, మొక్కులు= నమస్కారములు, మొనగోరుమోపు= నఖక్షతాలువేయు, కాగిటి= కౌగిటి, ఇంతసేసి= ఈవిధముగాచేసి, దక్కు= పొందు, తలపోత= దీర్ఘాలోచనలు.

**భావము :** ఆ స్వామి ఏవిధముగా చేసినా సరే నాకు శుభమే సుమా! నన్ను మాత్రము అతని ప్రేమాతిశయమే మాటి మాటికి తాకుచున్నది.

స్వామి కోపగించి చూచినా, లేక స్నేహ హస్తం చాస్తూ దరిచేరినా నాపైన ప్రసరించేవి ఆతని ఆ రెండు నేత్రాలే సుమా!

నాకు మధురానందాన్ని కలిగించినా లేక వెగటు పుట్టే చేదు రుచి కల్గించినా ఆయన నాతో మాట్లాడే మాటలే కదా!

ఈ శరీరాన్ని కాకపుట్టించే వేడిమిని కలిగించినా లేక జీవస్థానములు పట్టుకునే విధంగా చేసే తంత్రమైనా ఆయన విజృంభించి కూడే పొందికలే కదా! స్వామి నన్ను నట్టింట్లో నవ్వించినా లేక తలవంపులు కలుగ చేసినా చెంతనుండి చేసే పనులే కదా!

స్వామి నమస్కారాలు చేసినా లేక తన గోరు చివరలు తాకించి నఖక్షతాలువేసినా ఆయన చేతులే కదా! ఈ తావులో శ్రీవేంకటేశ్వరుడు ఇంత చేసి నన్ను కలసినాడు, మా ఇద్దరికి దక్కినది ఇంత కాలము మేము చేసిన దీర్ఘాలోచనలు కార్యరూపం దాల్చడమే కదా!

## 382

**అవతారిక:** అన్నమయ్య అలమేలుమంగమ్మను బహువిధములుగా వర్ణిస్తున్నాడు.

### సాళంగం

ప. కాముని బలములెల్లా కాంతమై(c బొత్తుగలసె
కామినులాల మనకుc గతలాయను ॥పల్లవి॥

1. పున్నమచంద్రుcడు యీపొలcతినెమ్మోమైతే
కన్నులే కలువలై కదిసీ నందే
వున్నతంపుcజిలుకలు వువిదపలుకులైతే
పన్నినకెమ్మోవి బింబఫలమాయను ॥కాముని॥

2. నెలcతనడపులివి నెమలిభావములై తే
మెలుపున నెరిcదురుము మేఘమాయను
అలరి ననుc దొడలె అరcటికంబములై తే
చెలరేcగి నెన్నడుము సింహమాయను ॥కాముని॥

3. మగువకంతము నేcడు మదనునిశంఖమైతే
జగడించుcజన్నులే చక్రవాకములాయ
తగు శ్రీ వేంకటపతి ధరియించి కూడcగాను
మిగుల నింతికి మేలుమీcద మేలే ఆయను ॥కాముని॥

**అర్థములు:** ప. కాముడు= మన్మధుడు, బలము= బలిమి, కాంతము= అయస్కాంతము, పొత్తు= కూడిక, కామినులు= మోహించిన స్త్రీలు, కతలు= కథలు.

1. పొలతి= ఆడుది, నెమ్మోవి= సుందరమైన మొహము, కలువలు= ఉత్పలములు, కదియు= దగ్గరకువచ్చు, ఉన్నతము= గొప్ప, ఉవిద= స్త్రీ, పన్ను= సిద్ధపడు, కెమ్మోవి= అధరము, బింబము= ప్రతిబింబము, ఫలము= పంట.
2. నెలత= స్త్రీ, నడపులు= గమనము, మెలపు= జాగరూకత, నెరిదురుము= కొప్పు, అలరు= వికసించు, కంబము= స్థంభము, చెలరేగి= విజృంభించి, నెన్నడుము= నడుముభాగము.
3. కంతము= గొంతుభాగము, మదనుని శంఖము= మన్మధుని శంఖము, జగడించు= పోట్లాడు, చన్నులు= రొమ్ములు, చక్రవాకములు= చక్రవాక పక్షులు, ధరియించి= గైకొని, ఇంతి= స్త్రీ, మేలుమీద మేలు= లాభము మీద లాభము,అత్యంత సుకృతము.

**భావము :** ఆ స్త్రీ బలమంతా అయస్కాంతమువలె ఆకర్షించి కూడికను నెరపినది. ఓ మోహించిన స్త్రీలారా ఇవన్నీ మనము కథలు కథలుగా చెప్పుకోవచ్చును.

ఆ పున్నమినాటి నిండు చంద్రుడు , ఈ స్త్రీ సుందరమైన ముఖారవిందమవగా, ఆమె కన్నులు కలువ పుష్పాలై సమీపించుచున్నవి.

ఆమె పలుకులు శ్రేష్ఠమైన చిలుకల పలుకుల వలె నుండగా, ఆమె అధరములు దొండపండ్లవలె నున్నవి.

ఆ స్త్రీ నడకలు మయూర గమనమైతే, ఆమె సిగకొప్పు మేఘముల నల్లని కాంతివలె నున్నది. ఇక ఆమె తొడలను చూచినట్లైతే అరటి స్థంభములవలె నడుము భాగము కొదమ సిగపు నడుమువలె సన్నగా సుకుమారమై యున్నది.

ఆ స్త్రీ కంఠస్వరం మన్మధుని శంఖమువలె నున్నది. ఉన్నతమై ఒకటినొకటి ఒరుసుకునే రొమ్ములు చక్రవాక పక్షులవలె నున్నవి. ఈవిధముగా శ్రీవేంకటేశ్వరుడు గైకొని కూడగా ఆ అలమేలుమంగమ్మకు అన్నీ శుభములే చేకూరెను.

## 383

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామి పట్ల తన ప్రవర్తనను తెలియజేస్తూ మనసులో ఉన్నదే మాట్లాడతానని, మాయలు మర్మాలు తనకు తెలియవని చెలులకు స్పష్టం చేస్తున్నది.

### పాడి

ప. నీరువట్టుక నేయి వోయనేరనే నేను
సారె నా వలపునీరు చల్లుటింతే కాని ॥పల్లవి॥

1. ఇట్టె నాలుకలోన బెల్లాలు యెదలోనఁ గత్తులు
నెట్టుకొని నీవలె నేరనే నేను
వట్టిమాటలిగిరించ వంచితేఁ దేనెలుగార
గట్టిగా నాపెదవులఁ గలదింతేకాని ॥నీరువట్టుక॥

2. కని యింటికాడ గానుగకాడా గసి
నినుఁజూచి నేరుచుకొనేరనే నేను
మనసు గరఁగించేది మర్మము భేదించేది
కనుచూపులు నాయందుఁగల దింతేకాని ॥నీరువట్టుక॥

3. అమ్మేది వొకటి అసిమలో దొకటి
నెమ్మది నీయంతేసి నేరనే నేను
కమ్మి శ్రీ వేంకటపతిఁ గలసితి వెలసితి
కమ్మరఁ గమ్మర నిదే కలదింతేకాని ॥నీరువట్టుక॥

**అర్థములు:** ప. నీరువట్టుక= నీరు తీసుకుని, వోయనేర= పోయలేనుకదా!, సారె= మాటిమాటికి, వలపునీరు= ప్రేమామృతము.

1. బెల్లాలు= తీపియైన రుచి, గత్తులు= దుర్గంధము, నెట్టుకొని= సర్దుకొను, నేరు= చరించు, వట్టిమాటలు= పసలేని కబుర్లు, ఇగిరించు= మొలకలెత్తు, కలదింతే= ఇంతే కలదు.
2. ఇంటి కాడ= ఇంటి వద్ద, గానుగ= చెరకు మొదలైనవి రసము దీయు స్థలము, గసి= అవక్షేపము,తెట్టు, నేరుచుకోనేర= నేర్చుకోలేను, మర్మము= రహస్యము, భేదించు= బయటబెట్టు.
3. అసిమ= రెండువైపులా తెర్పబడి యున్న సంచి,ఇరుముడి, వెలసితి= స్థిరపడ్డాను.

**భావము :** ఓ చెలులారా! నేను మాటి మాటికి నా ప్రేమామృతము చల్లడానికి యత్నిస్తానే తప్ప, నీటిని పట్టుకొని నేతిని పోస్తున్నానని చెప్పే మనస్తత్వము కాదు.

నాలుక మీద తీయనైన బెల్లపు రుచి, మదిలోనేమో దుర్గంధమైన రుచులు, వాసనలు పెట్టుకుని యుండజాలను. ఉత్తుత్తి కబుర్లు వినిపించి, మాటల్లో తేనెలొలికించే దానను కాదు సుమా! గట్టిగా నేను చెప్పదలుచుకున్నది నా పెదవులపై సత్యమై యున్నది మాత్రమే చెప్పగలను.

గమనించినట్లైతే ఇంటివద్దనే యుండి, లేని విధంగా గానుగ వద్ద నున్న అవక్షేపముగా నున్న తెట్టైన గసిని దెచ్చి చూపించే

విధమును నేను నిన్ను జూచి నేర్చుకోవడం లేదు. స్వామి మనసు కరగించినా, ఏవైనా రహస్యాలను బయటబెట్టినా నా కను చూపుల్లోనే ఉంటాయి తప్ప వేరొక విధంగా ప్రవర్తింపను సుమా!

అమ్మేది ఒక వస్తువైతే సంచులలో ఉన్నది మరొకటి అనే చందంగా నీ లాగా ఉండడం నేర్వలేదు సుమా! ఇక్కడ శ్రీవేంకటేశ్వరుని గలసి స్థిరపడిన దానను. నా విధానము ఎప్పుడైనా ఈవిధంగానే ఉంటుంది తప్ప వేరొకటి కాదు.

## 384

**అవతారిక:** ఏవేవో ఊహించుకొని అమ్మ అలమేలుమంగమ్మ వద్ద స్వామి లేనిపోని సిగ్గులు నటిస్తుండగా అమ్మ వలదని విన్నవిస్తున్నది.

### సాళంగం

ప. వాన గురియక తొల్లె వరదలేల
నానఁబెట్టి కొంతగొంత నంటునేయరాదా ॥పల్లవి॥

1. మనసులో నేమిగల్లా మాపటంతఁ జేతుగాక
చెనకి నవ్వు నవ్వితేఁ జెల్లదనేవా
అనువై పంతముగొనేయప్పుడే కొనేవుగాక
మనికిగా నందాఁకా మాటలాడరాదా ॥వాన॥

2. వేడుక నేమేనికాఁక వెనకఁ జెప్పేవుగాక
వీడె మందుకొన్నంతనే వెలితయ్యీనా
కూడినరతులవేళఁ గొసరే వింతేకాక
పాడితో మంచముమీఁదఁ బవ్వళించరాదా ॥వాన॥

3. తారుకాణించినప్పుడు తలవంచుకొందు గాని
చేరి నీవు కాఁగిలించితే దోసమా
మేరతో శ్రీ వేంకటేశ మెచ్చి నన్నుఁ గూడితివి
కారణములేని సిగ్గు కట్టిపెట్టరాదా ॥వాన॥

**అర్థములు:** ప. వరద= నీరు ప్రవాహమై పారు, నానబెట్టు= ఆలస్యముచేయు, అంటు= ముట్టుకొను.

1. గల్లా= ఉన్నప్పటికి, మాపటి= రాత్రికి, చెనకు= తాకు, చెల్లదు= సరిపోదు, అనువు= అనుకూలము, పంతముగొను= పట్టుదలపట్టు, మనికి= వాసస్థానము, అందాకా= అంతవరకు.
2. వేడుక= సంతోషము, వెనుక= ప్రక్కన, వీడెము= తాంబూలము, వెలితి= తక్కువ, కొసరు= కోరిక, వింత= ఆశ్చర్యము, పాడి= ధర్మము.
3. తారుకాణ= ఋజువు, కాగలించు= కౌగలించు, దోసము= తప్పు, మేర= మర్యాద, మెచ్చి= ప్రశంసించి, కారణము= అర్థములేని, కట్టిపెట్టు= మాను.

**భావము :** స్వామీ! వర్షమింకా రాక మునుపే వరదలొచ్చినట్లు భావించనేల? నిదానంగా ఆలోచించి చూసి నాతో కొంత కొంత సౌఖ్యముగా మెలగరాదా!

మనసులో ఉన్నది రాత్రికి నీవు సంపూర్ణముగా జేయవచ్చును. నేను నిన్ను తాకి నవ్విన సమయాల్లో సరిపోదని ఎందుకంటావు? ఒకవేళ పంతము పట్టే వేళల్లో పట్టడం తప్పు కాకపోవచ్చు కానీ అప్పటిదాకా ఈ వాసస్థలములో మనసువిప్పి మాట్లాడవచ్చు గదా!

స్వామీ! సంతోషముతో ఏవైనా చెప్పకుండా ఈ ప్రక్కన మాట్లాడడమెందుకు? నీదగ్గర తాంబూలం అందుకున్న మాత్రాన నేనంత కాని దాననయ్యానా? నీవు కూడిన సమయాలలో నీ కోరికలు మాత్రం బహు చిత్రంగా ఉంటాయి. కాస్తా నిదానించి ధర్మమెరిగి ఈ పట్టెమంచం మీద పవ్వళించరాదా?

ఋజువులతో నీ విషయం చెప్పినప్పుడు నేను తలవంచుకుంటే అర్థముంటుంది కానీ ఇక్కడ నన్ను చేరినప్పుడు కౌగలించుకుంటే తప్పొచ్చిందా? నా మర్యాదలను మెచ్చి ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను చేరుకున్నావు. ఇకనైనా అకారణంగా, అర్థం లేని సిగ్గులను విడిచిపుచ్చరాదా!

## 385

**అవతారిక:** స్వామిని ఇబ్బంది పెట్టకుండా తన ఇష్టానుసారం వదలి, చిత్తం వచ్చినప్పుడే రానివ్వండి అని అమ్మ చెలులను కోరుతున్నది.

## సింధురామక్రియ

ప. ఎచ్చుకుందు లాడకురే యేమీననకురే
కచ్చుపెట్టి యాతనికిఁ గడు నే వలతును ॥పల్లవి॥

1. చేసినంతఁ జేయనీరే చెప్పకురే యాసుద్ది
ఆసయిచ్చాతఁడొక మాటాడితేఁ జాలు
వాసికిఁబెనఁగఁబోతే వడిఁబడుఁ జేసునిఁక
నాసరివారెల్లాఁ జూడ నవ్వినంతే చాలును ॥ఎచ్చుకుందు॥

2. కూడినట్టె కూడనీరే కోపించకురే యాతని-
నీడ కాతడు విచ్చేసే యెమ్మెలే చాలు
పాడి పంతా లాడబోతే పదను దప్పునో యేమో
మేడెపు సరస వేళ మెచ్చినంతే చాలును ॥ఎచ్చుకుందు॥

3. వుండినట్టె వుండనీరే వొరయకురే యాతని-
నండఁ దా నిక్కి చూచిన నదియే చాలు
నిండా శ్రీవేంకటాద్రి నిలయుఁడు నన్నుఁ గూడె
కొందుక మేనఁజేసిన గురుతే చాలును ॥ఎచ్చుకుందు॥

**అర్థములు:** ప. హెచ్చు= ఎక్కువ, కుందు= తక్కువ, కచ్చుపెట్టు= పట్టుదల వహించు.

1. సుద్ధి= మంచిమాట, ఆశ= కోరిక, వాసి= ఆధిక్యము, వడి= కోపము, సరివారు= సరిసమానమైన వారు.
2. కూడినట్టు= కలసినట్టు, ఎమ్మె= విలాసము, పంతాలు= పట్టుదల, పదను= సమయము, మేడెపు= జగడము.
3. ఒరయు= రాచు,పరీక్షించు, అండ= చెంత, నిక్కి= నిశితముగా పైకి చూచు, కొందుక= కొంచెము, మేన= శరీరముపై, గురుతు= గుర్తు.

**భావము :** ఓ చెలులారా! స్వామితో మీరేమీ ఎక్కువ తక్కువలు మాట్లాడకండి. వారు పట్టుదల వహించినప్పటికి నేను వారినే మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను.

స్వామి ఇష్టం వచ్చిన రీతిగా చేసినంత చేయనివ్వండి. మీరేమీ ఆయనకు మంచి చెడూ అంటూ బుద్ధులు చెప్పకండి. ఆ స్వామి కోరికతో నాతో ఒక చిన్న మాట మాట్లాడినా నాకదే చాలు. నేను లేనిపోని పట్టుదలలు వహిస్తే తర్వాత ఆయన కోపం వహిస్తే నేను భరించలేను. నాకు సమానమయినవారు నవ్వినా యేమీ కినుక వహించవలసిన పనిలేదు.

ఆ స్వామి వచ్చి తనయిష్టపూర్తిగా కలిసినట్టుగానే కలవనివ్వండి అందుకు మీరేమీ కోపపడకండి. ఇక్కడకు ఆ స్వామి విచ్చేసి చూపించే విలాసాలే నాకు సంతోషాన్నిస్తాయి. మనమిప్పుడు ఏవేవో పాటలు పాడి పంతాలకు పోయినట్లైతే అసలు వ్యవహారమే చెడి గాడి తప్పవచ్చు. జగడాల సరసమైనా సరే ఆయన నన్ను చేరుకుని ప్రశంసిస్తే అంతే చాలు.

స్వామిని ఉన్న విధంగానే ఉండనివ్వండి. మీరేమీ సలహాలనిచ్చి ఆయనను ఇబ్బంది పెట్టి రాపాడవద్దు. అతను నా చెంత చేరి నా వైపు చూసినా చాలు నాకదే చాలు సుమా! చూశారా! ఆ వేంకటాద్రి రాయుడైన శ్రీవేంకటేశ్వరుడు నన్ను చేరుకున్నాడు. ఆయన

నా శరీరముపై చేసిన దంత నఖక్షతపు గుర్తులే నాకు చాలును.

## 386

**అవతారిక:** స్వామి వారితో చీటికిమాటికి పోట్లాడడం నచ్చని చెలులు అమ్మకు హితవు చెప్తున్నారు.

### శంకరాభరణం

ప. కక్కస మిపుడే కావలెనా
వొక్కించుక వడి వుండఁగరాదా ॥పల్లవి॥

1. నేరుపు మాటలు నీకే యమరును
కూరిమి గొసరఁగ గుఱి లేదు
తేరినయప్పుడె తెలిసేఁ (పే?) గానీ
పోరక లోనికిఁ బోరాదా ॥కక్కస॥

2. సెలవుల నవ్వుల చెల్లును నీకే
తలపెట్టఁ జలము తతిగాదు
వలసినయప్పుడె వచ్చేఁ గానీ
పలుమరుఁ బిలువక పదరాదా ॥కక్కస॥

3. తమకించి కలయఁ దగవవు నీకే
జమళి నలుక లిఁకఁ జవిగావు
చెమరించె మేను శ్రీవేంకటేశ్వర
సమముగఁ గూడితి చనవీరాదా ॥కక్కస॥

**అర్థములు:** ప. కక్కసము= బాధ, వొక్కించు= తగ్గి.

1. నేరుపు= నైపుణ్యము, అమరును= సరిపోవును, కూరిమి= స్నేహము, కొసరు= కోరు, గురి= లక్ష్యము, తేరిన= ప్రసన్నతపొందు, పోరు= పోట్లాడక.

2. సెలవుల= పెదవి చివరి, చెల్లును= సరిపోవును, చలము= వణకు, తతి= సమయము, పలుమరు= ఎక్కువసార్లు, పదరాదా= వెళ్ళరాదా

3. తమకము= మోహము, దగవవు= సరిపోవు, జమళి= జంట, చవి= రుచి, చెమరించు= చెమటలుపోయు, మేను= శరీరము, సమము= సరిగ్గా సరిపోవునట్లు, చనవు= ప్రేమ.

**భావము :** ఓ అలమేలు మంగా! స్వామిని బాధించడమిపుడు అవసరమా? కొంచెం తగ్గి ఉంటే వచ్చిన నష్టమేమున్నది చెప్పు?

మంచి నైపుణ్యమైన మాటలు మాట్లాడ్డం నీకే వచ్చు గానీ, స్నేహముతో కోరికలు కోరడమనే విషయంపై అసలు లక్ష్యం లేదు. ఆయన విషయమంతా ప్రసన్నత పొందిన పిమ్మటే వివరిస్తాడు కానీ పోట్లాటలు పెట్టకుండా లోనకు దయచేయవమ్మా!

పెదవి మూలగా నవ్వే నేర్పు నీకే ఉన్నది తల్లీ! ఇలా చెయ్యాలనుకోవడం, ఆయనను భయపెట్టి సాధించాలనుకోవడానికి ఇది సమయము కాదు. కావలసినప్పుడే ఆయన లోనకు వస్తాడు కానీ నీవింక లోనకు నడవరాదా!

మోహముతో ఈస్థితిలో స్వామిని కలియడం అనేది జగడానికే దారి తీస్తుంది సుమా! మీ యిద్దరి అలకలు ఇక రుచిపుట్టించవు. నీ శరీరమంత చెమటలతో తడసిపోయి ఉన్నది. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ అమ్మను కూడి సరిపోయేవిధంగా ప్రేమను పంచి యివ్వరాదా!

## 387

**అవతారిక:** అలమేలుమంగమ్మ స్వామికై తాపము చెంది నిరీక్షిస్తున్న విధానాన్ని అన్నమయ్య వర్ణిస్తున్నాడు.

## నాదరామక్రియ

ప. వాడిక నీ మతికిని వలపు వేఁగా
వీడెమిచ్చి యాతనితో వేసరుకోనేలే ॥పల్లవి॥

1. కలికి కన్నులకును కాఁకల చూపులు వేఁగా
ఒలసీ నొల్లక యాల వూరకుండేవే
పలు వన్నె నీ మోవికి పచ్చి మాటలు వేఁగా
మలసి పతితోనేల మాఁటాడవే ॥వాడిక॥

2. చేతిమీఁది చెక్కులకు సెలవినవ్వులు వేఁగా
యీతలఁ జింతఁ బొరలనేలే నీకు
కాతరపు మేనికిని కమ్మఁబులకలు వేఁగా
ఘాతలఁ బయ్యద నేల కుప్పేవే నీవు ॥వాడిక॥

3. కొండలకుచములకు గోరిచందురులు వేఁగా
బెండుగాఁ జెలవునితోఁ బెనఁగనేలే
అండనె శ్రీవెంకటేశుఁడాతఁడె నిన్నుఁ గూడెను
నిండుఁ గళలతో నీకు నివ్వెరగులేలే ॥వాడిక॥

**అర్థములు:** ప. వాడిక= అలవాటు, మతి= మనసు, వేగా= తపించదా? వీడెము= తాంబూలము, వేసరుకొను= నొచ్చుకొను.

1. కలికి= స్త్రీ, కాకలు= వేడిమి, ఒలయు= వ్యాపించు, ఒల్లక= సమ్మతించక, వన్నె= విధము, పచ్చిమాటలు= మరుగులేని మాటలు, మలయు= పూనుకొని.

2. చెక్కులు= చెక్కిలి, సెలవినవ్వు= పెదవి మూల నవ్వు, ఈతల= ఇవతల, చింత= ఆలోచన,బాధ, పొరలు= ప్రవర్తిల్లు, కాతరము= పిరికి, మేను= శరీరము, కమ్మపులకలు= గగుర్పాటు చెందు, ఘాత= నిందించు, కుప్పు= బిగించికట్టు.

3. కొండకుచములు= ఉన్నతమైన రొమ్ములు, గోరిచందురులు= నఖక్షతములు, బెండు= డీలాపడు, చెలువుడు= స్నేహితుడు, పెనగు= చుట్టుకొను,పోట్లాడు, అండ= సమీపము, కళలు= శోభలు, నివ్వెరగు= పారవశ్యము.

**భావము :** అలవాటైన నీ ఆలోచనలు ప్రేమకై తపించవా? తాంబూలమిచ్చి స్వామివారితో నొచ్చుకుని ప్రవర్తించడం న్యాయమా?

అందమైన స్త్రీ చూపులకు వేడిమిని కలిగించే విధంగా చూసే చూపులు తపించేట్టు చేయవా? వ్యాపించి నీవు సమ్మతించక ఎలా ఉన్నావు? అనేక విధాలైన నీ ముఖారవిందానికి మరుగులేని ఆ మాటలు తాపాన్ని పుట్టించవా? ఇకనైనా మనసు విప్పి నీవే పూనుకొని ఆ స్వామితో మాట్లాడవే!

నీ చెక్కిలిపై ఉంచుకొన్న చేతులు, పెదవిమూల నవ్వులు తపించేవిధంగా చేయడంలేదంటావా చెప్పు? ఈవిధంగా ఇక్కడ అనేక ఆలోచనలతో సతమతమవడం ఎందుకు? పిరికితనంతో ఉన్న నీ శరీరానికి ఈ గగుర్పాటు చెందడం తపించినట్టు కాదా? దాన్ని కప్పిపుచ్చుకోవడానికి సాకుగా నీ పయ్యెదను కప్పుకోవడం సరైన పద్ధతేనా?

కొండలంత ఆకారములో ఉన్న నీ రొమ్ములపై పడిన అర్ధచంద్రాకారపు గోటి గుర్తులు (నఖక్షతములు) తపించినందుకు గుర్తులు కాదా? ఈవిధంగా డీలాపడి అలసి సొలసిపోతే స్వామిని చుట్టుకొని పోట్లాడగలవా? సమీపముననే శ్రీవేంకటేశ్వరుడు తానే వచ్చి నిన్ను కలసినాడు. ఇంకా ఇంత నిండు శోభనములతో ఉన్న నీకు పారవశ్యమెందులకే!

## 388

**అవతారిక:** స్వామిని చేరుకున్నాక అమ్మకు కలిగే మన్మధావస్థను సుందరంగా అందిస్తున్నాడు అన్నమయ్య.

## సౌరాష్ట్రం

ప. గక్కన నిద్దరుఁ గలయుటివి
మక్కువ మా యెడమాఁట లిఁకేలా ॥పల్లవి॥

1. పాదపువాఁ(వ్రా)తలు భావపుటీఁతలు
ఆదెసఁ జెలికిని యాసలఁబో
మోదపుఁ బలుకులు ముంచినపులకలు
యీదెస నీకును యిక్కడఁ గలిగె ॥గక్కన॥

2. కన్నులకెంపులు కాఁకలసొంపులు
వన్నెలసతికిని వలపునఁబో
సన్నపుఁజెమరులు సరసపుతిమురులు
నిన్న నేఁటనే నీకును గలిగె ॥గక్కన॥

3. పైపైనుసురులు పయ్యదవిసరులు
నీపొందు చెలికి నిలువఁగఁబో
యేపున శ్రీ వేంకటేశ్వర నీకును
యాపడఁతికూట మింతలోఁ గలిగె ॥గక్కన॥

**అర్థములు:** ప. గక్కన= శీఘ్రముగా, కలయు= కూడు, ఇవి= విధము, మక్కువ= ప్రీతి, ఎడ= యందు, ఇకేలా= ఇంకా ఎందులకు.

1. పాదపు వ్రాతలు= కాలితో నేలమీద బొటనవ్రేలితో గీయు, భావపుటీతలు= ఆలోచనలతో నీదుట, దెస= దిక్కు, ఆశలు= కోరికలు, మోదము= సంతోషము, పులకలు= గగుర్పాటు.
2. కన్నుల కెంపులు= పద్మమణిరాగము వంటి కనులు, కాకలు= తాపము, వన్నెలు= సౌందర్యము, సన్నపు= చిన్నవైన, తిమురులు= త్వరపడు, నిన్న నేడు= నిన్ననూ ఈరొజు.
3. పైపై ఉసురులు= పైపైకి తొంగిచూస్తున్న నిట్టూర్పులు, పయ్యెద విసురులు= పైటకొంగు విసుర్లు, పొందు= కూడిక, ఏపు= విజృంభించు, పడతి= స్త్రీ, కూటమి= కూడిక.

**భావము :** శీఘ్రముగా యిద్దరూ ఈవిధముగా కూడుకున్నారు. ఇంక ఇష్టప్రీతిగా మాట్లాడేందుకు మాతో మాటలేమి ఉంటాయి?

పాదాలను అలా నేలమీద వ్రాయడమనేది శృంగారపు ఆలోచనలకు సంకేతాలు. ఆ దిక్కుగా చెలికి కలిగిన కోరికలనుకో! సంతోషపు మాటలు మంచి గగుర్పాటుకు లోనైన పద్ధతులు. ఈ దిక్కులో నీకునూ ఇక్కడ కలిగినవి గదా!

పద్మ రాగమణి వంటి ఎర్రనైన కనులు నీ తాపమునకు చిహ్నాలు. సౌందర్యవంతమైన స్త్రీకి ప్రేమకు గుర్తులు. సన్నగా కమ్ముకొస్తున్న చెమటలు త్వరపడే సరస శృంగారాలకు సంకేతాలు. నిన్నా నేడూ నీకు కలిగినవి అవే కదా!

ఊరక పైకి నిట్టూర్పులు విసరడం మాటి మాటికి పైటకొంగు విదలింపులు చెలికి నీపొందుతో యింకా నిలువలేవులే! విజృంభించిన, ఓ శ్రీవేంకటేశ్వరా నీకు కూడా ఆ స్త్రీ కలయిక ఇంతలోనే కలిగినది.

### 389

**అవతారిక:** అమ్మ మదనతాపముతో బాధపడుతూ ఉన్న విశేషాన్ని అన్నమయ్య మనోహరంగా వర్ణిస్తున్నాడు.

## తెలుఁగుఁగాంబోది

ప. చెలఁగి నావిభుఁ డింతసేయుమనెనా
చలమరి కోరికలు సాదించీఁ గాక ॥పల్లవి॥

1. మాయదారిమరునేటు మనసులో గుఱి యింతే
కాయముమీఁదికినేల కాఁకరేఁగీనే
పాయపుమోహము లివి బయలీఁదేపను లింతే
ఆయపునిట్టూర్పులేల అలయించీనే ॥చెలఁగి॥

2. చందురునివెన్నెలలు జగమెఱిఁగిన వింతే
పందె మాడి నన్నునేల భ్రమయించీనే
కుందనికోవిలకూఁత కుత్తికలో పస యింతే
సందడి నాగుండె యేల జాలిరేఁచీనే ॥చెలఁగి॥

3. పంతపుటీచల్లగాలి పాణముతోలంకె యింతే
వింతలుగా నన్నునేల వేసరించీనే
యింతలోన శ్రీ వేంకటేశుఁడు గలయఁగాను
చింతలెల్లా బాపెఁగాక సిగ్గులేల ముంచీనే ॥చెలఁగి॥

**అర్థములు:** ప. చెలగి= పూనుకొని, విభుడు= భర్త,ప్రభువు, చలమరి= మాత్సర్యముతోనున్నవాడు, సాధించు= నిందించు.

1. మాయదారి= వంచనాపరత్వము, మరుడు= మన్మథుడు, ఏటు= బాణముదెబ్బ, గురి= లక్ష్యము, కాయము= శరీరము, కాక= తాపము, పాయము= వయసు, మోహము= వలపు, బయలీదేపను= బహిర్గతమగు, ఆయము= జీవస్థానము, అలయించు= అలసట పెట్టు.
2. జగము= ప్రపంచము, భ్రమయించు= మత్తులో ఉంచు, కుందు= తగ్గని, కుత్తిక= గొంతు, సందడి= జనుల కలకలము.
3. వింత= ఆశ్చర్యము, వేసరించు= శ్రమపెట్టు, చింత= బాధ, బాపు= పోగొట్టు.

**భావము :** నా ప్రాణనాధుడు పూని ఇంత చేయమని కోరెనా? మాత్సర్యముతో నున్నవారు ఈ విధంగానే నిందిస్తూ సాధిస్తూ ఉంటారు కదా!

ఆ వంచనా పరుడైన మన్మధుని బాణపు దెబ్బ మనసులో ఉన్న లక్ష్యానికి గుర్తు కదా! ఈ శరీరంపై తాపమేల ఉబికుబికి వస్తున్నది, యౌవనమువలన వచ్చిన వలపులు ఇలానే బయటపడతాయి కదా! జీవస్థానముల నిట్టూర్పులు నన్నేక విధములుగా శ్రమకు గురిచేస్తున్నాయి కదా!

చంద్రుడు వెన్నెలలనివ్వడం ప్రపంచమెరిగిన విషయమే కదా! మరి పందెమాడినట్లు నన్ను ఏల మత్తులో ముంచెత్తుతున్నాడు. ఒక వైపు ఏమాత్రం తగ్గని కోయిలమ్మ గొంతులోని మధుర కంఠధ్వని నా గుండెను ఏల ద్రవింపజేసి హృదయములో జాలిని రేకెత్తించుచున్నది.

ఈ చల్లని పిల్ల గాలులు వీచి వీచి నా ప్రాణములతో చెలగాటమాడుచున్నవి. ఇంత ఆశ్చర్యముగా నన్ను అధిక శ్రమకు గురిచేస్తున్నాయి. ఇంతలోనే శ్రీవేంకటేశ్వరుడు నన్ను కూడినాడు. నా ఈ బాధలన్నీ దూరం చేసి సిగ్గులలో ముంచెత్తినాడు.

## 390

**అవతారిక:** అమ్మ అలమేలు మంగమ్మ ప్రవర్తన స్వామికి తెలియరాకున్నది. ఇష్టాయిష్టతలను రెండింటినీ ఒకేసారి ప్రదర్శిస్తూ స్వామిని వ్యాకులతకు గురిచేయడం గురించి స్వామి ఆమెను ప్రశ్నిస్తున్నాడు.

### మేఁచబౌళి

ప. నటనలు రెండూ నడపేవే
కుటిలపు నవ్వులుఁ గోపముఁ గలదా ॥పల్లవి॥

1. వదనకమల మిటు వంచేవేమే

చదురులమాఁటలు చల్లుచును
పెదవులు గదలగఁ బిలిచి గొణఁగేవే
చెదరనిపొందిటు సేయుచును ။నటనలు॥

2. చెక్కుచేతితో చింతయిదేమే
వొక్కమంచమున నుండుచును
మొక్కులలోనే మునిగేవేమే
చొక్కులచూపులఁ జూచుచును ။నటనలు॥

3. రతివేళనె యీరాజసమేమే
అతిబాసలు నన్నడుగుచును
యితవుగ శ్రీ వేంకటేశుఁడఁ గూడితి
మతకములేలే మైమఱచుచును ။నటనలు॥

**అర్థములు:** ప. నటన= లేనిది చూపించు, నడపు= చూపించు, కుటిలము= వంచన.

1. వదన కమలము= తామరపుష్పమువంటి ముఖము, వంచు= తలవంచుకొను, చదురులు= నేర్పైన మాటలు, చల్లుచు= విరజిమ్ము, గొణగు= వినబడకుండా చిన్నగా మాట్లాడు, చెదరని= కలతలేని, పొందు= కలయిక, చెక్కు= చెక్కిలి, చింత= బాధ, మొక్కులు= ప్రార్థనలు, ములుగు= నిమగ్నమగు, చొక్కు= మత్తు.
3. రతివేళ= శృంగార క్రీడ సాగించే సమయము, రాజసము= ఠీవిచూపు, అతిబాసలు= అధికమైన ప్రమాణములు, (హి)ఇతవు= ఇష్టము, మతకము= మాయ, మైమరచు= వళ్ళు తెలియని పరవశము.

**భావము :** ఏమే! అలమేలు మంగమ్మా ఈవిధమైన వింత ప్రవర్తనతో నున్నావు. ఇటు ఇష్టము అటు అయిష్టత రెండు విధాలుగా ప్రవర్తించడం న్యాయమా? వంచనతో కూడిన ముసి ముసి నవ్వులు నవ్వులంటూ ఉండడంలో ఆంతర్యమేమిటి? ఏదైనా మనసులో కోపం పెట్టుకున్నావా? సరిగా చెప్పవచ్చుగదా!

నీ తామరపుష్పము వంటి నీ ముఖారవిందాన్ని వంచుకొని, ఏవో నేర్పుగల మాటలు మాట్లాడుతూ ఉంటావు. పెదవులు కదిలిస్తూ లోలోపలే ఏవో మాటలు వినబడకుండా గొణుక్కుంటూ ఉంటావు. ఒక వంక కలతలేని విడిపోని కలయికలు చేస్తూనే ఇలా ఉండడంలో నీ ఆంతర్యం అర్థం కావడంలేదు సుమా!

చెక్కిలి చేతులలో నుంచుకొని ఆలోచిస్తూ బాధను వ్యక్తం చేస్తూ ఉంటావు. ఒకే మంచముపై పరుండి కూడా ఇంకా ఏవో ప్రార్థనలు చేస్తూ అదే లోకంగా ఉంటావు. ఒకవైపు మత్తుగొలిపే విధంగా చూపులు చూస్తూనే ఉంటావు.

రతిక్రీడలో ఆనందించవలసిన ఈ సమయములో ఈ విధమైన ఠీవిని ప్రదర్శిస్తున్నావు. ఏవేవో ఒట్లు, ప్రమాణాల గురించి నాతో మాట్లాడుతూ ఉంటావు. నేను శ్రీవేంకటేశ్వరుడను నిన్ను కూడుకున్నాను. ఇంకా ఈ వళ్ళు తెలియనటువంటి మాయలు మర్మాలు ప్రదర్శించడం నీకు తగునా!

## 391

**అవతారిక:** స్వామిపట్ల ఏదో తెలియక చేసిన అపరాధములకు క్షమించి దరిజేర్చుకోలేడా అని అమ్మ చెలులతో వాపోతున్నది.

### భైరవి

ప. ఏల దూరీ నేల పోరీ నితఁడే తాను
వేళతో బుద్ధిచెప్పఁగా విననైతినా ။పల్లవి॥

1. అత్తి నే నలిగితిఁబో అప్పుడే రమణుఁడు
పొత్తుకు రమ్మనఁగా నేఁ బోనైతినా

మత్తుఁడై యాపొద్దుకట్టె మఱచెబో ఇప్పుడైనా
వత్తునని చెప్పెంపఁగా వద్దంటినా ॥ఏల॥

2. వుంటిఁబో నాచలముతో నోరుపుగలవాఁడై తే
నంటుగాఁ దా నవ్వఁగా నే నవ్వనైతినా
కంటకాన నొకతప్పు గలిగెఁబో ఇఁకనైనా
జంటన నన్నుఁ జెనకఁగా సమ్మతించకుంటినా ॥ఏల॥

3. తతితో సిగ్గున నే తలవంచుకుండితిఁబో
రతులఁ గరఁచఁ గరఁగఁగనైతినా
ఇతవై శ్రీ వేంకటేశుఁ డింతసేసి నన్నుఁ గూడె
కతగా, ఇదె తొల్లి కాదంటినా ॥ఏల॥

**అర్థములు:** ప. దూరు= జోక్యముజేసుకొను, పోరు= పోట్లాడు, వేళతో= సమయముచూసుకొని, విననైతినా= వినకపోయితినా.

1. అత్తి= కోరిక, రమణుదు= అందమైనవాడు, పొత్తు= కలయిక, మత్తుడు= మదించినవాడు, మరచెబో= మర్చిపోయినాననుకో, చెప్పెంపగా= చెప్పి పంపగా.

2. అంటుగా= కలసిఉండు, చలము= వణకు,భయము, కంటకాన= విరుద్ధముగా, చెనకు= తాకు, సమ్మతించు= అంగీకరించు.

3. తతి= సమయము, కరచ= ముట్టుకొను, కరగు= ద్రవించు,ఇష్టపడు, (హి)ఇతవై= ఇష్టపూర్తిగా, కత= కథ, తొల్లి= పూర్వము.

**భావము:** ఓ చెలులారా! ఈ స్వామి విషయమేమిటో అర్థం కావడంలేదు. తగిన సమయము చూసి నాకు వివరంగా చెప్పినట్లైతే వినకుండా ఉంటానా? దీనికోసమై తాను నాతో పోట్లాటలు ఎందుకు? అన్నివిషయాలలో జోక్యము చేసుకోవడం ఎందుకు చెప్పండి?

ఒకవేళ నేను కోరికతో స్వామిపై అలిగానే అనుకో, అప్పుడు పిలిచి పొత్తుకూడ రమ్మంటే రానంటానా చెప్పు? ఏదో విషయములో కోపం వహించి వాడై కాస్తా పెడ బుద్ధి చూపిఉంటే మాత్రం ఏమైంది? ఆ రోజుకారోజే మరచిపోతాను కదా! ఇప్పుడైనా వస్తానని కబురంపితే నేనేమైనా వద్దంటానా?

నేను అప్పటికి భయంతోనే ఉంటాను కానీ ఆయన ఓర్పు ఉన్నవాడైనట్లైతే నాతో కలసి తాను నవ్వితే నేను కూడా నవ్వనా? ఏదో పొరబాటుగా విరుద్ధంగా తప్పు జరిగితే ఇంక అంతేనా? జంట కూడి నన్ను స్పృశిస్తే కాదు కూడదనంటానా?

నేను ఏవో కొన్ని సమయాలలో సిగ్గుతో తలవంచుకొని ఉండిపోయాననుకో, రతిక్రీడలతో నన్ను ఆనందింపజేస్తే నేను ద్రవించి స్వామికి ప్రేమాభిమానాలతో దగ్గరవనా? ఇదుగో స్వామి నాపట్ల ప్రీతిగా ఇష్టుడై ఇంతచేసినప్పటికి నన్ను చేరుకున్నాడు. అంతా విచిత్రంగా ఉంది ఈ కార్యమే ముందు చేసిఉంటే కాదని అంటానా? ఎంత సంతసించేదానిని చెప్పండి.

## 392

**అవతారిక:** స్వామిని కూడమని చెలులు అలమేలుమంగమ్మకు చెప్తున్నప్పటికి ఆమె శరీరం ఆమె స్వాధీనంలో లేదు. ఏవో అడ్డంకులు కలుగుతూనే ఉన్నాయి. చివరకు కథ సుఖాంతం అయినది.

## పళవంజరం

ప. ఒకటి కొకటి గూడ దువిదకడకు నిట్టె
వెకలి విభునిఁ జేర విచ్చేయుమనవే ॥పల్లవి॥

1. పతియింటికేఁగేటిపదఁతి వేగిరానకు
సతిపిరిఁదిభారము సంగరమాయ
మతిలో నాతనిఁ బొందేమచ్చికకోరికలకు

మితిలేనివలపులే మీఁదమీఁదఁ దొడును ॥ఒకటి॥

2. సొలసి యాతనిఁ జూచేచూపులవాండ్లకు
చెలియానందజలాలు చిట్టంట్లాయ
మలసి యాతనితోడ మాటలాడేయందుకు
నిలుపునివ్వెరగులు నేరములై నిలిచె ॥ఒకటి॥

3. కమ్మర నాతని రతి కాఁగిలించేయందుకు
కొమ్మకంకణరవాలే కొండెములాయ
ఇమ్ముల శ్రీ వేంకటేశుఁ డింతలో విచ్చేసి కూడె
నెమ్మది నున్నారు నేఁడు నిన్ననే యింతాయను ॥ఒకటి॥

**అర్థములు:** ప. ఒకటికొకటి= ఒకదానివెంట మరొకటి, ఉవిద= స్త్రీ, వెకలి= ఆసక్తి, విభుడు= భర్త,ప్రభువు.

1. ఏగు= వెళ్ళు, వేగిరము= వేగముగ, పిరిదులు = పిఱ్ఱలు, సంగరము= యుద్ధము, మతిలో= మనసులో, మచ్చిక= అలవాటు, మితి= పరిమితి, ఒడును= పడును.
2. సొలసి= వెనుదీయు, వాండ్లకు= వాడియైన చూపులకు, చిట్టంట్లు (చిట్టింఅంటు) నఖ, దంత క్షతములు, మలయు= పెనగు, నివ్వెరగు= పారవశ్యము, నేరము= తప్పు.
3. కమ్మర= మరల, కాగిలించు= కౌగలించు, కంకణ రవములు= చేతి కంకణముల సవ్వడి, కొండెము= నేరము, ఇమ్ములు= పొందులు, నెమ్మది= నిదానముగా.

**భావము:** ఆ అమ్మను ఆసక్తితో స్వామి వద్దకు రమ్మనవే! ఒకదాని వెంట మరొకటి ఏవో అడ్డంకులు అవరోధాలు అనుమానాలు వస్తూనే ఉంటాయి.

భర్త ఇంటికి శీఘ్రముగా వెళ్ళడానికి ఆమెకు పిఱ్ఱల భారమధికమై ఆ రెండు పిరుదులు పోట్లాట పెట్టుకున్నట్లు ఒరుసుకుంటున్నాయి. ఒక వంక మనసులో స్వామిని కూడే ఆనందాతిశయముతో కోరికలతో ఒక పరిమితిలేని ప్రేమ ఆమె మీద మీద పడుతూ ఉన్నది.

ఆ అమ్మ వెనుదీయక అలసి సొలసి చూచే చూపుల వాడికి చెలికి ఆనంద రసము ఉట్టిపడి ఒడలిపై ఒలికి నఖ, దంత క్షతములు పడుతున్నట్లు అనిపిస్తున్నది. పెనగి ఆనందముగా చుట్టుకునేందుకు ఆమె చెందే భావ పారవశ్యమే తప్పులుగాను, దోషములుగాను తోస్తున్నవి.

స్వామిని మరల మరల కౌగలించుకునేందుకు ఆమె చేతి కంకణాల శబ్ధాలే నేరమై తోస్తున్నవి. ఇష్టమైన శ్రీవేంకటపతి ఇంతలోనే వచ్చి ఆమెను కూడినాడు. వారిద్దరూ ఇప్పుడు నిదానముగ స్థిమితముగా నున్నారు. నిన్ననే ఇదంతా జరిగింది సుమా!

## 393

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మకు, స్వామి విషయంలో చెలుల అనవసరపు జోక్యం చికాకు కలిగిస్తూ ఉండగా, వారిని జోక్యం చేసుకోవద్దని బుద్ధి చెప్తున్నది.

### లలిత

ప. తనిసితి నుండనీవే తన వలసినయట్టు
చినుకులేని చిత్తడి సిగ్గులేలే ఇఁకను ॥పల్లవి॥

1. ఆడినదే మాటా ఆతఁడే యెరుఁగును
యేడలేనిబుద్దులు మీ రేమి చెప్పేరే
గోడలేనిచిత్తరువు కొలచీ నందే కొలపు
తాడు లేని కట్టు వట్టి తగులేలే యిఁకను ॥తనిసితి॥

2. తుద నేమనీనె దూరులెల్లా వచ్చె
పదమనవే యింకఁ బనిలేదు
యెదురులేనిమాట కదురువలెనే వుండు
పెదవి పై తేనెల ప్రియమేలే యిఁకను ॥తనిసితి॥

3. యింటికిఁ దా వచ్చినదే యిన్నిటికీ గురియాయ
జంటలయెడమాటలు చాలుఁజాలునే
అంటిముట్టి శ్రీ వేంకటాద్రీశుఁ డిదె కూడి
వెంట వెంటఁ దిరిగీని వెర పేలే యిఁకను ॥తనిసితి॥

**అర్థములు:** ప. తనయు= తృప్తిచెందు, వలసినయట్టు= నచ్చినవిధంగా, చిత్తడి= తడసిన.

1. గొడలేని చిత్తరువు= గోడలేకుండా చిత్ర పటము తగిలించిన రీతి, కొలచు= ఉపాసించు, కొలపు= చెల్లు, తగులు= చిక్కు.
2. తుద= చివరకు, దూరులు= నిందలు, కదురు= అతిశయించు.
3. గురి= లక్ష్యము, ఎడమాటలు= దూరము పెంచు సంభాషణ, అంటిముట్టి= సంబంధములేని విధము, వెరపు= భయము.

**భావము:** చెలీ..నేను సంపూర్తిగా స్వామివారి విషయంలో తృప్తి చెంది యున్నాను కదా! తన చిత్తం వచ్చినట్టు ఉండనీయవే! చినుకు లేకుండా నేలతడిసిన రీతిగా ఇంకా సిగ్గులు పడడం ఎందుకు?

స్వామి ఆడినదెల్లా మాటే! వాస్తవము అతనికే తెలియును కదా! మీరెందుకు స్వామికి అవీ ఇవీ బుద్ధుల పేరుతో ఎక్కడా లేని మాటలు చెప్తారు? ఎక్కడైనా పటం గోడలేకుండా వ్రేలాడదీయడం కుదురుతుందా? అలాగే తాడు లేకుండా కట్టిన కట్టు వట్టిదే అవుతుంది కానీ నిలబడుతుందా చెప్పు?

చివరకు నేనేమంటానే! అన్నీ నామీదనే నిందలు వస్తున్నాయి. ఇంక దయచేయమనవే ఇంక పనేమీ లేదు కదా! ఎప్పుడైనా ఎదురులేని మాట అతిశయముతో నూలువడికే కదురు లాగే ఉంటుందన్నమాట సత్యమే కదా! ఇంకా పెదవిపై తీయని మాటలు మాట్లాడడం ఎందులకు?

స్వామి ఇంటికి విచ్చేసినాడు. నాకదే చాలు. అన్నిటికి లక్ష్యము ఇదే కదా! ఇకనైనా జంటలను దూరము పెట్టే పెడసరపు మాటలు చాలించండి. ఇదుగో శ్రీవేంకటేశ్వరుడు నన్ను తామరాకు మీద నీటి బొట్టువలె అంటీ ముట్టక తిరుగుతూ ఉన్నాడు. ఇంకా నాకు భయమేల అన్నీ అవే సర్దుకొంటాయికదా మీరు నిశ్చింతగా ఉండండి.

**విశేషము:** ఈ కీర్తనలో అన్నమయ్య గోడలేని చిత్తరువు, తాడులేని కట్టు, ఎదురులేని మాట కదురు వంటిది, పెదవిపై తేనె, అంటిముట్టి వంటి అనేక ప్రయోగాలతో స్వామివారికి అమ్మకు ఉన్న సాన్నిహిత్యాన్ని తెలియజేయడం స్పష్టమవుతున్నది.

## 394

**అవతారిక:** స్వామి అన్యమనస్కంగా వచ్చి అమ్మను చేరడం సరసాలాడడం పట్ల అమ్మ అసంతృప్తిని వ్యక్తంచేస్తూ స్వామి వారు చెప్పేదొకటి చేసేదొకటి అంటూ ఇక్కట్ల పాలు చేస్తున్న స్వామిని ప్రశ్నిస్తున్నది.

### మంగళకౌశిక

ప. ఏల సేసే వడియాస లిందాఁకాను
ఆలకించి వున్నదాన నందాఁకాను ॥పల్లవి॥

1. వచ్చి వచ్చి వేగిరాలు వలవనిజాగరాలు
యిచ్చల నడపితిగా యిందాఁకాను
వెచ్చనిపూరుపులును వీరిడినేరుపులును
అచ్చుపడె నాకైతే నందాఁకాను ॥ఏల॥

2. మాటలలో తీపులును మాయదారి చూపులను
యేఁటవెట్టి నడపితి విందాఁకాను
వాఁటమైన కాఁకలును వట్టికొమరాఁకలును
ఆఁటదాన నేఁ బడితి నందాఁకాను ॥ఏల॥

3. సెలవులనగవులు చే చాఁచి తగవులు
యెలమిఁ జేసితివిగా యిందాఁకాను
చెలఁగి శ్రీ వేంకటేశ చెక్కు నొక్కి కూడితి నే-
నలవోకతోడ నుంటి నందాఁకాను ॥ఏల॥

**అర్థములు:** ప. అడియాస= తీరని కోర్కెలు, ఇందాకా= ఇప్పటివరకు, ఆలకించి= అన్నీ విని, అందాకా= అప్పటివరకు.

1. వేగిరము= వేగము, వలవని జాగరాలు= నిద్రలేని స్థితి, ఇచ్చలు= కోరికలు, నడపు= చేయు, ఊరుపు= శ్వాస, వీరిడి= అవివేకి, అచ్చుపడు= సార్థకమగు.
2. తీపు= మధురము, మాయదారి చూపులు= వంచనతో కూడిన చూపులు, యేటవెట్టి= ఎక్కడ ఉంచి, కాకలు= తాపము, వట్టి కొమరాకలు= తీరని కట్టుబాట్లు, ఆటదాని= ఆడదాని, పడితి= అగచాట్లు పడు.
3. సెలవుల నగవులు= పెదవి మూల నవ్వులు, చేచాచి= చేతలలో, ఎలమి= ప్రకాశించి, చెలగి= విజృంభించి, చెక్కు= చెక్కిలి, అలవోక= స్వేచ్ఛ, ఆసక్తిలేని.

**భావము:** స్వామి నా కోర్కెలన్నీ తీరని అడియాసలై ఉన్నవి. నీ మాటలనే వింటూ సావధానురాలనై ఉన్నాను.

నీవు వచ్చి వచ్చి వేగిరపడతావు. కానీ నాకు రాత్రులన్నీ నీకోసం నిద్రించక జాగారాలు నెరపడమే సరిపోతూ యింతదాకా కూడా ఈవిధంగానే గడుపుతున్నావు. వెచ్చని శ్వాసలు, అవివేకత్వంతో కూడిన నైపుణ్యాలు, ఇవే ఇప్పటిదాకా నాకు లభించినది.

మాటలు మాత్రం బహు మధురమై ఉంటాయి, చూపులు మాత్రం వంకర చూపులు, ఎక్కడ ఉన్నావు స్వామీ ఇప్పటిదాకా నీవు? తాపం మాత్రం బహు హెచ్చుగా ఉంటుంది తీరా చూస్తే అవన్నీ తీరని కట్టుబాట్లవలె ఉంటాయి. ఆడదానిని కదా ఎందాకా పడమంటారీ అగచాట్లు చెప్పండి స్వామీ!

పెదవులపై చిరునవ్వులు చిందిస్తారు తీరా చేయి జాచి చేకొంటే ఏవో జగడాల గురించి ముచ్చటిస్తారు. ఇప్పటివరకూ నాపై ఇదే రకమైన వికాసాలు విన్యాసాలు నెరపుతూ ఉన్నారు స్వామీ! నీవు విజృంభించి నా చెక్కిలి నొక్కి నన్ను కూడినావు ఇప్పటివరకూ ఆసక్తి లేని విధంగా ఉన్నాను. ఇకపై అంతా మీ ఇష్టమే స్వామీ.

## 395

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మకు స్వామికి ఏవో ప్రణయ కలహాలు వచ్చాయి. స్వామి చొరవతీసుకుని అన్నీ స్వతంత్రించి చెయ్యడం తనకు ఇష్టంలేదని అమ్మ చెలులతో చెప్తున్నది.

### ముఖారి

ప. తగిలి నేఁ దడవితేఁ దడవఁగవలెఁ గాక
మిగుల వాసికానికి మేరమీరఁ జెల్లునా ॥పల్లవి॥

1. చూడకుండఁగానే తాను చూచీ తప్పక నన్ను
యేడాను జగడగాని కింతగలదా
ఆడకుండఁగానే మాటలాడించీ నూరకైన
జాడతో మాసటీనికి చంచలము చెల్లునా ॥తగిలి॥

2. ఇంటికిఁ బోఁకుండఁగ మాఇంటికి వచ్చీఁ దాను

అంటి చలపాదిగాని కది దగునా
అంటుకోకుండఁగ తానే అంటుకొనీ నామేను
దంటపంతగానికి దైన్యమింత చెల్లునా ॥తగిలి॥

3. కాఁగిలించకుండఁగానే కాఁగిలించీ నిదె నన్ను
యేఁగేటియెమ్మెకానికి నిది దగునా
కాఁగిననన్ను శ్రీ వేంకటపతి యిదె కూడె
చేఁగదేరేదొరలకు చేఁత లింత చెల్లునా ॥తగిలి॥

**అర్థములు:** ప. తడవు= నిమురు, వాసి= పేరుపొందు, మేరమీరు= అతిక్రమించు.

1. ఏడా= ఎక్కడా, జగడగాడు= తగవులమారి, ఊరక= ఊరకనే, జాడ= గుర్తు, మాసటీడు= శ్రేష్ఠుడు, చంచలము= అస్థిరము.
2. అంటి= తాకి, చలపాది= పట్టుదలగలవాడు, మేను= శరీరము, పంతగాడు= పట్టుదలగలవాడు, దైన్యము= దీనత.
3. కాగిలించు= కౌగలించు, ఎమ్మెకాడు= విలాసవంతుడు, కాగిన= తాపముతోనున్న, చేగదేరు= సారవంతమగు, దొర= ప్రభువు, చెల్లునా= తగునా

**భావము:** చెలులారా! నేను స్వామిని స్పృశించినట్లైతే దానికి యొప్పి యుండవలెను కదా! కానీ ఇలా మాటిమాటికి అతిక్రమించడం ధర్మమా చెప్పండి.

నేను చూడకుండానే ఆ స్వామి నన్ను తదేకంగా చూస్తూ ఉంటాడు. ఆ జగడాలమారివానికింత తగునా? నేను మాట్లాడకుండా ఉన్నప్పటికి మాట్లాడించేందుకు ఎంత శ్రేష్ఠుడైనా ఈ అస్థిరత్వం తగునా!

ఇంటికి వెళ్ళకుండా మా ఇంటికి వేంచేసి నన్ను తాకడం అనేది ఆ పట్టుదలగలవానికి తగునా! నేను తాకకుండానే నా శరీరాన్ని తాకడం అంత పట్టుదలలు గలవానికి చెల్లునా?

నేను కౌగలించుకోకమునుపే కౌగలించుకొని వెళ్ళిపోయే విలాసవంతునికిది తగునా? ఇదుగో శ్రీవేంకటపతి నన్ను కౌగిట్లో కూడుకొన్నాడు సారవంతమైన ప్రభువులకు ఇది సరిపోవునా చెప్పండి.

## 396

**అవతారిక:** స్వామి అన్యమనస్కుడై ఏవో చిలిపి చేతలు పనులు చేస్తూ ఉండగా అలా చేయడం తగునా అని అమ్మ ప్రశ్నిస్తున్నది.

### శంకరాభరణం

ప. ననుపున నూరకె నవ్వకురా ! నీ
మనసు రానె నే మాటాడేరా ॥పల్లవి॥

1. మొదలిమాఁట నిను మోచివచ్చితే
వదనకమల మింక వంచకురా
కొదలు మాని నాకొంగు వట్టితే
పదివేలు దెలిపేఁ బదగదరా ॥ననుపున॥

2. సారెకు నీచేఁత సరిగాఁ జూపిన
బీరముతోఁ గోపించకురా
తారుకాణలకు దగ్గరి వచ్చిన
తేరకొనఁగ నిటు తెలిపేరా ॥ననుపున॥

3. అలమి కాఁగిటను ఆయము లంటిన
మలసి సొలసి మైమఱవకురా

యెలమిని శ్రీ వేంకటేశ కూడితివి
నెలవయి యురమున నిలిచితిరా ॥ననుపున॥

**అర్థములు:** ప. ననుపు= అనురాగము, రానె నే= వచ్చువిధముగా నేనే, మాటాడేరా= మాట్లాడుతున్నాను.

1 మొదలిమాట= మొదటమాట్లాడే మాట, మోచి= తాకు, వదన కమలము= కమలమువంటి మొహము, వంచు= వంచుకొను, కొదలు= తక్కువగు, పదగదరా= ఇక నడువరా!

2. సారె= మాటిమాటికి, బీరము= పరాక్రమము, తారుకాణ= ఋజువు,సాక్ష్యము, తేరుకొను= ప్రసన్నమగు.

3. అలమి= క్రమ్మి, కాగిట= కౌగిట, ఆయము= జీవస్థానము, మలయు= పెనగు, సొలయు= పారవశ్యము, మైమరచు= ఒడలు తెలియని స్థితి, ఎలమి= ప్రకాశము, నెలవు= స్థానము, ఉరము= వక్షస్థలము, నిలుచు= చేరియుండు.

**భావము:** అనురాగముతో ఊరకే అలా నవ్వవద్దు సుమా! నీ మనసుకు ఇష్టమైన రీతిలో నేను మాట్లాడుతున్నాను గదా స్వామీ! ఆలకించండి.

మొదటగా మాట్లాడి నిన్ను తాకడానికి వస్తే నీ ముఖారవిందాన్ని ఎందుకు వంచుకుంటున్నావు? ఎక్కువ తక్కువలు మాని నా కొంగు పట్టుకున్నప్పుడు నాకదే పదివేలని నేను చెప్తున్నాను కదా! ఇకనైనా ఆవిధముగా ఉండండి స్వామీ!

మాటి మాటికి నీ చేతలు సరిచేసుకోమని చెప్పినప్పుడు కోపించడం తగునా? ఏదైనా ఋజువులతో నీ వద్దకు వచ్చిన సమయంలో కూడా ప్రసన్నమై మాట్లాడుతున్నాను కదా!

స్వామీ! నన్ను నీ కౌగిట గట్టిగా బంధించి, జీవస్థానాలను తాకినట్లైతే పారవశ్యం పొంది మైమరచిపోవద్దు సుమా! శ్రీవేంకటేశ్వరా! ప్రకాశించి నన్ను కూడుకున్నందున నేను నీ నీ వక్షస్థలమున స్థిరనివాసినై యున్నాను.

## 397

**అవతారిక:** దాసుని తప్పులు దండముతో సరి అన్న చందాన అమ్మ తనవల్ల తెలియక ఏవైనా పొరబాట్లు జరిగి ఉన్నట్లైతే మనస్ఫూర్తిగా చేస్తున్న నమస్కారాలను గ్రహించి క్షమించవలసినదిగా ప్రార్థిస్తున్నది.

## సామంతం

ప. నీ వేమి సేసినాను నిన్ను నేర మెంచరాదు
మూవంక నా నిజానికే మొక్కేc జుమ్మీ ॥పల్లవి॥

1. కన్నుల నీమర్మములు కాcడిపారcజూచితి
వున్నతి నాతప్పు నీవే వోరుచుకొమ్మీ
వెన్నెల నవ్వులు నవ్వి వేcడిసిగ్గు రేcచితి
మున్నుమున్నే యిందుకు మొక్కితిcజుమ్మీ ॥నీవేమి॥

2. మాటలనే నీ మనసు మా యింటికిc గొంటc(చు? బోతి
యేcటికైనా నన్ను నెగ్గు లెంచకుమీ
వాcటపువినయముల వలపు లీcదించితి
మూcటగా వేవేలకు మొక్కేcజుమ్మీ ॥నీవేమి॥

3. కూడుతానే కాcగిటిలో కొనగోరు సోcకించితి
వేడుక నన్ను వెనకవేసుకొమ్మీ
యీడనే శ్రీ వేంకటేశ ఇన్నియు నేc జేసితి
మోడిసేసి ఇందుకేకా మొక్కేcజుమ్మీ ॥నీవేమి॥

**అర్థములు:** ప. నేరము= దోషము, మూవంక= మొహము వైపు, నిజము= స్వభావము,శాశ్వతము, మొక్కు= నమస్కరించు.

1. మర్మము= రహస్యము,గుట్టు, ఆడి= నర్తించి, పొరజూచు= తదేకముగా చూచు, ఉన్నతి= అతిశయము, ఓరుచుకొను= భరించు, వేడిసిగ్గు= కాక,తాపముతో గూడిన సిగ్గులు, రేచు= రేపు, మున్ను మున్నే= ముందు ముందు.
2. గొంచు= తీసుకొని, ఏటికైనా= ఎందులకైనా, ఎగ్గు= దోషము, వాటపు= అనుకూలమైన, ఈదించు= కష్టపడి చేరుకొను, మూటగా= మొత్తముగా.
3. కొనగోరు= గోరు చివర, సోకించు= తాకు, వేడుక= వినోదము, వెనకవేసుకొను= చేపట్టు, ఈడ= ఇక్కడ, మోడిసేయు= మకురుపట్టు పట్టు.

**భావము:** ఓ స్వామీ! నీవేమి చేసినప్పటికి నేరములెంచకూడదు. నీ ముఖారవిందాన్ని గమనిస్తూనే వంక చూస్తూ నా స్వభావ చిత్తముగా నీకు నమస్కరిస్తూనే ఉంటాను సుమా!

నా కన్నులతోనే నీ గుట్టుమట్టులనీ తెలుసుకున్నప్పటికి ఆడిపాడి నీ వంక తదేకముగా చూస్తూనే ఉన్నాను. ఇందులో ఏవైనా దోషాలుంటే నీవే భరించలవలసి యున్నది. నీ పండు వెన్నెలలోని నవ్వులు నాలో కాకను రేపుచున్నవి. అందువల్ల ముందుగానే నీకు నమస్కరిస్తున్నాను సుమా!

నీ మాటలు అనబడే మనస్సును నా వెంట తీసుకుని వెళ్ళడానికి యత్నిస్తున్నాను. దీనిలో కూడా నువ్వు దోషాలను ఎంచవద్దు. అనుకూలమైన వినమ్రతతో వస్తున్న ప్రేమను కష్టపడి జయించగలిగాను. దీనికై నీకు కుప్పలు కుప్పలుగా వేలకు వేలు అసంఖ్యాకంగా నమస్కారాలు చేస్తున్నాను.

నన్ను నీవు చేరుకుంటూనే నా కొనగోరు నీకు తాకించి నఖక్షతాలను చేయసాహసించాను. దీన్ని నువ్వు వినోదంగా భావించి నన్ను క్షమించి నీ వెనుకవేసుకొన వలసినదిగా కోరుతున్నాను. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ ప్రదేశములోనే నే నన్నియూ కొంటె, తుంటరి పనులను చేసియున్నాను. ఏదో పంతం పట్టినట్టు మకురుపట్టు పట్టి నీపట్ల చేసిన అపరాధాలకు అనేక సార్లు నమస్కరించడం ఇందుకే! నన్ను మనస్ఫూర్తిగా క్షమించి చేపట్టవలెను స్వామీ!

## 398

**అవతారిక:** ఒక వంక అమ్మ విచారగ్రస్తురాలై ఉండగా స్వామి విలాసముతో ఉండడం అనే విషయం ఆశ్చర్యాన్ని కలుగజేయగా ఆ వివరాలను చెలులు స్వామిని అడుగుతున్నారు.

### దేవగాంధారి

ప. నెలఁతకుఁ జీఁకటి నీకే వెన్నెల
చలువయు వేఁడియు సంగడిఁ గలిగె ॥పల్లవి॥

1. వాడినమోమును వంచినశిరసును
యేడఁ గలిగెనో యీచెలికి
వీడెపుమోవియు వేడుకనవ్వులు-
నీడనే రమణుఁడ నీకే కలిగె ॥నెలఁతకుఁ॥

2. చెక్కుమీఁదిచేయి చెదరిననెరులును
యెక్కడఁ గలిగెనో యీచెలికి
తక్కినకళలును తనువుచెమటలును
నిక్కపుదొరవగునీ కే కలిగె ॥నెలఁతకుఁ॥

3. తొట్టినతమకము తొడుసగువెరగులు

యెట్టు గలిగెనో యీచెలికి
యిట్టె శ్రీ వేంకటేశ కూడితివి
నెట్టన సతిరతి నీకే కలిగె ॥నెలఁతకుఁ॥

**అర్థములు:** ప. నెలత= స్త్రీ, చలువ= చల్లన, సంగడి= రెండు జతయై ఉండుట.

1. మోము= ముఖారవిందము, శిరసు= తల, ఏడ= ఎక్కడ, వీడెము= తాంబూలము, వేడుక= వినోదము, ఈడ= ఇక్కడ, రమణుడు= సుందరుడు.

2. చెక్కులు= చెక్కిళ్ళు, చెదరిన నెరులు= అస్తవ్యస్తమైన వెంట్రుకలు, కళలు= శోభ, నిక్కము= నిజమైన, దొర= ప్రభువు.

3. తొట్టిన= వ్యాపించిన, తమకము= మోహము, తొడుసు= సంబంధము, వెరగు= ఆశ్చర్యము, నెట్టన= అనివార్యముగ, సతిరతి= భార్యతో కూడిన రతిక్రీడా కార్యము.

**భావము:** స్వామీ! ఇక్కడ ఈవంక చెలికేమో చీకటి క్రమ్మగా, నీకు మరోవంక వెన్నెల వెలుగులు వ్యాపించి యున్నవి. ఇక్కడ వేడిమి మరియూ చల్లదనము జతయై గుమికూడి యున్నవి.

చెలి ఈవంక వాడినమోహముతో తల వంచుకొని యున్న చందమే విధముగా కలిగినదో తెలియరాకున్నది. మరో వంక తాంబూల చర్వణముతో కూడిన పండిన మోముతో వినోదముతో చిరునవ్వులు చిందిస్తూ ప్రక్కనే నీడగా నీవు యున్నావు.

చెలి ఈ వంక చెక్కిలిపై చేయివేసుకొని చెదరిన కేశసంపదతో దిగులుగా ఎందువల్ల ఉన్నదో తెలియదు. మరో వంక నీవు శోభలను ప్రదర్శిస్తూ, తనువుపై స్వేదముతో అసలైన దొరగా ఉండడం నీకే చెల్లినది.

చెలికి ఈవంక వ్యాపించిన మోహ సంబంధమైన ఆశ్చర్యము ఎలా కలిగినదో తెలియకుండా ఉన్నది. ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు ఈ విధముగా అమ్మను చేరుకొన్నావు. ఈ అనివార్యమైన స్థితి మరియూ భార్యతో కూడిన రతిక్రీడా విలాసము నీకే చెల్లును స్వామీ!

## 399

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామితో తన్ను సరిపోల్చుకుంటూ, అన్నింటా ఆధిక్యత ప్రదర్శిస్తాడని చెబుతూ సాగే కీర్తన.

## సామంతం

ప. చెప్పకు నీ సుద్ది సరిచేసుకోకు నిన్ను నన్ను
వుప్పు గప్పురమువలె నుండితేనే ఆయనా ॥పల్లవి॥

1. కన్నులే తెల్లనగానీ కాయమెల్లా నలుపే
యన్నిటా నన్ను నేరా లెంచవచ్చేవా
చన్నులే ఘనముగాక సరి నానడుము చిన్న
వన్నెల నేనూ నీవంటిదాననా ॥చెప్పకు॥

2. చేతులే నాలుగుగానీ చెలులు పదారువేలు
పోతరించి నీవు నాకు బుద్ధిచెప్పేవా
ఆతల మాఁటలే వాఁడి యధరము మెత్తన
యీతల నీతో నన్ను నీడువెట్టేవా ॥చెప్పకు॥

3. చూడ బాలుఁడవుగానీ సోఁకేది మేను మిన్నంత
కూడేటి నావలపులు గోరసేసేవా
యీడనే శ్రీ వేంకటేశ యిట్టె నీతో నేకమైతి
మేడెపురతుల నన్ను మెచ్చకుండేవా ॥చెప్పకు॥

**అర్థములు:** ప. చెప్పకు= చెప్పవద్దు, సుద్ధి= మంచిమాట, ఆయనా= సరిపోతుందా.

1. కాయము= శరీరము, నేరాలు= దోషములు, ఘనము= పెద్దయైన, వన్నెలు= విలాసములు.
2. పోతరించి= పొగరెక్కి, ఆతల= అవతల, వాడి= పదును, అధరము= పెదవి, మెత్తన= మృదువు, ఈతల= ఇవతల, ఈడువెట్టు= సరిపెట్టు.
3. సోకు= తాకు, మేను= శరీరము, మిన్న= అధికము, కోరసేయు= కోరుకొనునట్లు చేయు, ఏకము= ఒకటి, మేడెపు= యుద్ధము, మెచ్చు= పొగడు.

**భావము:** ఓ స్వామీ! నాకు బుద్ధులు, మంచిమాటలంటూ అవీ ఇవీ చెప్తూ నిన్ను నీవు సరిచేసుకునే ప్రయత్నం చేయవద్దు. ఉప్పు కర్పూరములాగా ఉంటే సరిపోతుందా?

స్వామీ! మీ కన్నులే తెల్లన కానీ శరీరమంతా నలుపే కదా! అన్నింటిలోను నా తప్పులెంచడంలో ముందుంటారు. నా రొమ్ములే ఘనమై పెద్దవిగా ఉంటాయి కానీ నా నడుము మాత్రం సన్నమే కదా! విలాసాలకు పోవడంలో నేను నీ వంటి దాననా?

స్వామీ! మీ చేతులే నాలుగు కానీ మీకు చెలులు పదహారువేలమంది. మీరు నాకు ఇంకా బుద్ధులు చెప్తారా? నీ మాటలు వాడిగా ఉంటాయికానీ, నీ అధరాలు మాత్ర సుతిమెత్తగా ఉంటాయి. నీకు నాకు ఈ విధంగా సరిపెట్టడం ధర్మమేనా?

చూడడానికి చిన్ని బాలాకుమారునివలె ఉంటావు కానీ, చేతలలో చాలా అధికంగా ఉంటావు. కల్సినప్పుడు నా ప్రేమనంతా కోరుకొంటూ ఉంటావు. శ్రీవేంకటేశ్వరా! ఇక్కడ ఈవిధముగా నన్ను కూడితివి. యుద్ధరీతిలో నువ్వా నేనా అన్నట్టు సాగించే మన రతిక్రీడలో నన్ను నీవు ప్రశంసించకుండా ఉండగలవా?

## 400

**అవతారిక:** అన్యమనస్కుడై ఉన్నాడన్న సత్యం గ్రహించిన అమ్మ, పరులకోసమైనా అందరిలో సవ్యంగా ప్రవర్తించమని స్వామిని ప్రార్థిస్తున్నది.

### మలహరి

ప. కందుఁగుందు నింత గావలెనా
అందరిలోపల నవుననరాదా ॥పల్లవి॥

1. చేరి నాపొందులు చిత్తము రాకున్న
నారుకొనఁ గొంత నవ్వరాదా
మారుమాటాఁడగ మనసు రాకున్న
వూరకైనఁ గొంత వూఁకొనరాదా ॥కందు॥

2. పైకొని నారాక పరాకై యుండిన
చౌకగాఁ బైఁ జేయి చాఁచరాదా
యేకడో నీచిత్త మెరవై యుండిన
ఆకుమడి చిచ్చే నందుకొనరాదా ॥కందు॥

3. కాఁగిట నీమేను కడుమఱచిన
వేఁగి నాపై మేనువేయరాదా
చేఁగవలపుల శ్రీవేంకటేశ్వర
పాఁగినరతులఁబంత మీరాదా ॥కందు॥

**అర్థములు:** ప. కందు= తాపము, కుందు= తగ్గు, ఇంత= ఈవిధముగా.

1. పొందులు = కలయికలు, చిత్తము= మనసు, నారుకొను= లోపలనే స్వల్పరూపున నిలిచిపోవు, మారు= తిరిగి, ఊకొను=

సరేనను.

2. పైకొని= చేకొని, పరాకు= పరధ్యానము, చౌక= తగ్గి, ఏకడో= ఎక్కడో, ఎరవు= వేరొకచోట, ఆకుమడిచిచ్చు= తాంబూలమిచ్చు.

3. కాగిట= కౌగిట, మేను= శరీరము, వేగు= తపించు, చేగవలపు= దోరవలపు, పాగు= విధానము, పంతము= పట్టుదల.

**భావము:** స్వామీ! క్రిందా మీదా పడుతూ ఈవిధంగా ఉండవలసిన అవసరమున్నదా! అందరిలో ఉన్నప్పుడు సరేనని పలుకుతూ సమ్మతి తెలియజేయవలెనుకదా! నన్ను నవ్వుల పాలు కాకుండా కాచుకొనవలసిన అగత్యమున్నది కదా!

నీవు పూనుకొని నా కలయికకు నీ మనసు రాకున్నట్లైతే లోలోపలే చిరునవ్వులు చిందించవలెను కదా! మాట్లాడడానికి మనసు రాకుండినట్లైతే ఊరకనే ఉండి ఊకొట్టవచ్చును కదా!

నా రాక మీకు పరధ్యానము కలిగించినట్లైతే కొంచెమైనా తగ్గి చేయి అందించరాదా! నీ మనసు ఎక్కడో ముడివడి యున్నప్పుడు నేనిచ్చే తాంబూలమైనా అందుకొనరాదా!

నీ కౌగిట్లో నేను మైమరచి యుండగా తాపముతో కనీసము నీ చేయి నా శరీరంపై వేయవచ్చు కదా! దోరవలపులతో సారవంతమైన ఓ శ్రీవేంకటేశ్వరా! రతిక్రీడలలో తేలియాడునట్లు చేసే విధంగా పట్టుదల చూపరాదా!

# 401

**అవతారిక:** ఎల్లవేళలా స్వామి తోడునీడై యుండగా అమ్మ అలమేలుమంగమ్మ ఇంకా స్వామిని కోరుకోవలసిన కోరికలు ఏమి ఉంటాయి. అదే విషయాన్ని అమ్మ స్వయంగా స్వామికి విన్నవిస్తున్నది.

## గుజ్జరి

ప. కడదాఁకా నీమేలే కాణాచై వున్నది
అడియాలమిఁక వేరే అరయఁ జోటేదిరా ॥పల్లవి॥

1. నించిన కూరిమి నాపై నిజముగ నున్నది
మంచినీగుణాలు నామనసులో నున్నవి
అంచెల నీసరసము లంగముపై నున్నవి
కొంచి కొంచి నిన్నింకఁ గొసరఁ జోటేదిరా ॥కడదాకా॥

2. చెప్పిపంపిన నీరాక చెవులనే వున్నది
రెప్పలెదుట నీరూపు రేపుమాపు నున్నది
చిప్పిలునీమోవితేనె సెలవుల నున్నది
వుప్పతించి నిన్ను నిఁక నొరయఁ జోటేదిరా ॥కడదాకా॥

3. కందువ నీమర్మమెల్లా కాఁగిటిలో నున్నది
అంది నీముద్దుటుంగర మదె నావేల నున్నది
ఇందుకే శ్రీవేంకటేశ ఇటు నన్నుఁ గూడితివి
చిందేటిసిగ్గులు నీపై జిమ్మఁగఁ జోటేదిరా ॥కడదాకా॥

**అర్థములు:** ప. కడ = చివరి, మేలు = ఉపకారం,ఔన్నత్యం, కాణాచి = చిరకాలవాసస్థానము, అడియాలము = గుర్తు, అరయ = చూడగా, చోటేది = తావు.

1. నించు = నిండైన, కూరిమి = స్నేహము, అంచె = వరుస, కొంచి = సంశయించు, కొసరు = కోరు.

2. చెవులనే = ఇంకా వినబడుతూనే, రేపుమాపు = ఈరోజు రేపు, చిప్పిలు = ఉబుకు, మోవితేనె = అధరామృతము, సెలవు = పెదవిమూల, ఉప్పతించు = పుట్టు, ఒరయు = పరీక్షించు.

3. కందువ = జాడ, కాగిటి = కౌగిటి, ముద్దుటుంగరము = అక్షరములు చెక్కిన ఉంగరము, వేల = వ్రేలికి, కూడితి = కలిసితి, చిందు = చిమ్ము, జిమ్ము = చల్లు.

**భావము:** ఓ స్వామీ! చివరిదాకా నీ ఔన్నత్యముతో గూడిన యుపకారమే మాకు చిరకాల నివాసవాసముగా యున్నది. దీని తార్కాణములనేకములై యుండగా చూచుటకు యిక వేరే తావేమున్నది చెప్పండి.

నీ నిండైన ప్రేమాభిమానములు నా మీద అపారమై యున్నవి. నీ ఉన్నతోన్నత స్వభావము నా చిత్తములో సదా నెలవై యున్నది. నీవు చేసే వరుస సరస సల్లాప క్రీడలన్నీ నా శరీరముపై గుర్తులై శోభిస్తున్నవి. ఇంకా నీపట్ల సంశయము చూపడానికి గానీ, కోరికలు గోరుటకు గానీ తావే లేని విధముగా నన్ను చేపట్టి యున్నావు.

నీవు చెప్పి పంపి నన్ను చేరబిలిచిన ఆహ్వాన సందేశమింకా నా చెవులలో ప్రతిధ్వనిస్తున్నది. నా కన్నులెదుట నీ రూపు నాడు నేడు రేపు ఎన్నడూ నిలిచే ఉంటుంది. ఉబికి వస్తున్న నీ అధరామృతము పెదవి చివరలనే యున్నది. ఇంకా నిన్ను పరీక్షించి ప్రత్యేకమైన కోరికలను కోరనేమున్నవి స్వామీ!

జాడ తెలిసిన నీ రహస్యములన్నీ నా కౌగిట్లోనే ఉన్నది. నీవిచ్చిన ముద్దుటుంగరము ఇదిగో నా వ్రేలికే యున్నది. అందువల్లనే ఓ శ్రీవేంకటేశ్వరా! ఈవిధముగా నన్ను కూడితివి. ఉబికి ఉబికి చిమ్ముతున్న సిగ్గులను నీ పై ప్రదర్శించ వలసిన అవసరమేమున్నది స్వామీ!

## 402

అవతారిక: శ్రీనివాసుని సంపూర్ణంగా వశం చేసుకున్న భాగ్యవంతురాలైన అమ్మ అలమేలుమంగమ్మ వైభవాన్ని చెలులు పొగడే దృశ్యం.

### శ్రీరాగం

ప. చింతవంత లిఁకనేల చెలుల దూరఁగనేల
దొంతుల రతులే నీకు దోడాయఁగా ॥పల్లవి॥

1. తలఁచఁగానే వచ్చె తనుఁదానే రమణుఁడు
మలసి నీకిఁక మొక్క మనసాయఁగా
అలుక లిన్నియుఁ బాసె నతఁడె నీతో నవ్వె
పలుకుఁ బంతము నొక్కపాటాయఁగా ॥చింత॥

2. అనుమానించఁగనే యతఁడు నీచేయి వట్టె
యెనయు నీకోరికెల్లా నీడెరెఁగా
చనవల్లా నీకుఁ జెల్లె సరసుఁడు నిను మెచ్చె
కొనకెక్కినవలపు గురుతాయఁగా ॥చింత॥

3. మొక్కఁగా నాతఁడు నీకు ముందర వరము లిచ్చె
చక్కనై న సకినాలు సరిదాఁకెఁగా
చెక్కులెల్లాఁ జెమరించె శ్రీవేంకటేశుఁడు గూడె
యెక్కువ నీసంతసము లిరవాయఁగా ॥చింత॥

**అర్థములు:** ప. చింత = విచారము, వంత = బాధ, దూరు = జోక్యము చేసుకొను, దొంతులు = ఒకదానిమీద మరొకటి, తోడు = సహాయము.

1. రమణుడు = సుందరమైన వాడు, మలయు = పెనగు, అలుక = కోపము, పాసె = వీడెను, పంతము = పట్టు, పాటు = దారి.

2. ఎనయు = పొందు, ఈడేరు = తీరు, చనవు = ప్రేమాభిమానములు, చల్లె = కురిపించు, సరసుడు = శృంగారచేష్టలవాడు, కొనకెక్కు = చివరకుచేరు, గురుతు = చిహ్నము.
3. సకినాలు = శకునములు, సరిదాకు = అనుభవములోనికి వచ్చు, చెక్కు = చెక్కిళ్ళు, చెమరించు = చెమటపోయు, ఇరవు = స్థిరము.

**భావము:** నీకింకా బాధ, విచారములెందుకు? చెలుల విషయములన్నింటిలోను జోక్యం చేసుకోవడమెందుకు? వరుసైన శృంగార క్రీడా సౌఖ్యం నిరంతరం చేరువవుతూనే ఉన్నది కదా!

తలచగానే ఆ సుందరాంగుడు నీదరికి విచ్చేస్తాడు. చుట్టుకొని ఆ స్వామికి నమస్కరించడమే నీ విధి! మీ అలుకలన్నీ తీరిపోగా ఆ స్వామి నిన్నే చూస్తూ చిరునవ్వులు చిందిస్తున్నాడు. నీ పలుకు పంతమూ ఇంక అన్నీ ఒక్క దారయినవి కదా!

కాస్తా అనుమానించగానే ఆ స్వామి నిన్ను చేరి నీ చేయిని పట్టుకున్నాడు. పొందుతో కూడిన నీ కోరికలెల్ల సిద్ధించినవి కదా! స్వామి ప్రేమాభిమానాలన్నీ నీకే సరిపోగా నిన్ను మెచ్చి నిలబడ్డాడు. చివరిదాకా వచ్చి ప్రాకిన ప్రేమయే దానికి ఋజువు సుమా!

ఆ స్వామి నీకు అనేక వరాలు కానుకలు ఇచ్చాడు. చక్కనైన శకునాలు నీకు కనిపిస్తున్నాయి. నీ చెక్కిళ్ళు చెమటతో ముద్దయై, ఎరుపెక్కగానే శ్రీవేంకటేశ్వరుడు నిన్ను చేరుకున్నాడు. నీ అధికమైన ఆనందానికి నిలయమై ఉండగా అన్ని దిగుళ్ళు సమసిపోయినవి.

## 403

**అవతారిక:** శ్రీకృష్ణుడు రేపల్లెలో ఉన్న ఒక గొల్ల గుబ్బెతతో రాచక్రీడలాడేందుకు తరచూ వస్తూ ఉండగా వలదని వారించే సన్నివేశం.

### సామంతం

ప. మానరా నవ్వు మానవా వద్దు మానవా మాతో మానరా
యేల మానరా నీవు
మానకుంటే నన్ను నిందరు వినఁగా
మాటలఁ దిద్దక మానరా ॥పల్లవి॥

1. వారి వీరితోడ వావులు చెప్పెంపే వట్టిదోసమేల కట్టేవురా
తేరకొన నన్నుఁజూచి వట్టి యాసదేర నుస్సుర నేఁటికి రా
పోరి పోరి నీవే నిజమరి నంటా బొంకుచు నన్నేల ముట్టేవురా
కోరి వూరకున్నవారి కింతేసికొడిమె లేఁటికి వచ్చీరా ॥మానరా॥

2. చక్కనివారికి నీయెదుట నేఁడు సారె నిలువ రాదటరా
వొక్కమాఁటలోనే నీవింత గరఁగి వొళ్లు చెమరించనేఁటికిరా
చిక్కనిచన్నులు నాకుఁ గలిగితే చింతఁ బొరలఁగ నీకేరా
మొక్కలాన నీవుసేసే రోఁతలకు మొదలనే నాకు సిగ్గవురా ॥మానరా॥

3. కారణములేక వూరివారితోడ కాలుదొక్క నేలవచ్చేవురా
నీరువంక తుంగవంటీవాఁడ వింతే నీతోడిపొందుకు నేనోపరా
కూరిమితోడుత శ్రీవేంకటేశ్వర కూడితివి నిన్ను నేమందురా
కోరినకోరికలెల్లాఁ దలకూడె గోరనన్ను నూఁదనేఁటికిరా ॥మానరా॥

**అర్థములు:** ప. మానరా = విరమించుకొనరా, మానకుంటే = విరమించకుండా ఉన్నట్లైతే, దిద్దు = తప్పు సరిచేయు.

1. వావులు = చుట్టరికములు, చెప్పెంపే = చెప్పి పంపే, దోసము = తప్పు, తేరకొను = తేటపడు,రెప్పవేయకుండా, యాసదేర = కోరికదీరునట్లు, ఉస్సురను = మిక్కిలి శ్రమతో కూడిన నిట్టూర్పు, ఏటికి = ఎందుకు, పోరి = పోట్లాడి, నిజమరి =

సత్యవంతుడు, అంటా = అని చెప్పుకుంటూ, బొంకు = అబద్ధమాడు, ముట్టోవురా = తాకుచున్నావు రా, కొడిమె = అపవాదు.

2. సారె = మరలా, కరగి = ద్రవించి, చెమరించు = చెమటలు పట్టు, చిక్కని = బిగి, చింత = విచారము, పొరలు = ప్రవర్తిల్లు, మొక్కలాన = శౌర్యము,ఉత్సాహము, రోతలు = చెడ్డపనులు.

3. కాలుద్రొక్కు = కలియుటకు, నీరువంక = నీటిపైనున్న, తుంగ = గడ్డివంటి వృక్ష విశేషము, ఓపను = ఓర్చుకోలేను, కూరిమి = స్నేహము,ప్రేమ, తలకూడె = సిద్ధించెను, గోర = కొనగోట, ఊదు = వత్తు.

**భావము:** ఈ మాయదారి వేషములన్నీ మానుకోరా! మానవా! వద్దు మానుకో! మాతో ఇలాంటి ప్రవర్తనలెందుకు? మానుకోరా! నీవు. ఇలాంటిపనులను విరమించుకోనట్లైతే, నిన్నందరూ తప్పులు దిద్దేందుకు ప్రయత్నిస్తారు.

వాళ్లతో వీళ్లతో ఏవేవో చుట్టరికాలు చెప్పి పంపుతూ తప్పులెందుకు చేస్తావు? నన్ను రెప్పవేయకుండా అదోమాదిరిగా చూస్తూ కోరికతీరనట్లుగా ఉస్సురుస్సని ఉండడం ఎందుకు? ప్రయత్నించి ప్రయత్నించి నీవు పెద్ద సత్యవంతుడిలా ప్రవర్తిస్తూ చేసేపనులన్నీ తప్పుపనులు చేస్తూ నన్ను ముట్టుకోవడానికి యత్నిస్తూ ఉంటావు. కోరి కోరి వూరకే యున్నవారిపై ఇలాంటి అపవాదులు వేయడం తగునా?

చక్కనైన వారెవరైనా నీ ఎదుట నేడు మళ్ళీ మళ్ళీ నిలబడ్డమే తప్పై పోతున్నది కదరా! ఒక్క మాట మాట్లాడితేనే నీవింతగా మైమరచిపోతూ వొడలంతా చెమరింపు తెచ్చుకోవడమేమన్నా బాగున్నదా? బిగువైన రొమ్ములు నాకుంటే నీవు అంతగా బాధపడి తన్మయము పొందడమెందుకో అర్థం కావడంలేదు. ధైర్య శౌర్యాలతో నీవు చేస్తున్న ఈ అకార్యాలన్నీ నాకు మిక్కిలి బాధను అసహ్యాన్ని కలిగిస్తూ నాకు అంతులేని సిగ్గును కలిగిస్తూ ఉన్నాయిరా!

అకారణంగా ఇక్కడ యున్న యువతులను కలవడానికి ఈ ఊరిమీదకు రావడం న్యాయమా? నీవు నీటిలో నున్న తుంగ గడ్డివంటి వాడివి. ఎంత వరద వచ్చినా తుంగగ డ్డి ఎక్కడికి పోని విధంగా నీవు ఇక్కడే తారట్లాడుతున్నావు . నీతో పొందుకు నేను ఓర్చుకోలేనురా! స్నేహముతో, ప్రేమతో వచ్చిన ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను ఇక్కడ కూడితివి ఇంక నిన్ను ఏమనగలను? కోరిన కోరికలెల్లా సిద్ధించినవి ఇంకను నన్ను గోరుతో వత్తి నొక్కి నఖక్షతములు చేయడం తగునా?

## 404

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామివారికి చేస్తున్న అనేక సేవలను గమనించి మైమరచిపోతూ చెలులు ఆమెను ప్రశంసిస్తున్నారు.

## నాదరామక్రియ

ప. ఇటువంటి వేడుక లెవ్వరికిఁ గలవమ్మ
తటుకన మఱచేరు తమలోనే మేనులు ॥పల్లవి॥

1. కలికి రమణునికిఁ గస్తూరినామముపెట్టి
చెలరేఁగి తాఁజూపెఁ జెక్కుటద్దాలు
ములువాఁడి కొనగొళ్లు ముంచి కొప్పు దువ్విదువ్వి
తొలసితో మొల్లలట్టే తురిమీఁ జూపులను ॥ఇటువంటి॥

2. పడఁతి విభునిమీఁద బన్నీరు చిలికించి
తడియొత్తీఁ గుచముల తగుపొట్లాల
చిదుముడి సొమ్ములతో సింగారములు సేసి
ఆదరి నివాళించీ నంగపుఁ గాంతులను ॥ఇటువంటి॥

3. సోవగాఁ బీతాంబరము చుంగులువారఁ గట్టి
మోవి యాని తమ్ముల మిమ్ములఁ బెట్టెను
ఆవేళ శ్రీవేంకటేశు నట్టె మోహించి చూచి

తావి మంచానకుఁ దీసి తమకించి కూడెను ॥ఇటువంటి॥

**అర్థములు:** ప. వేడుక = వినోదము, తటుకున = తటాలున, మేనులు = శరీరాలు.

1. కలికి = మనోజ్ఞమైన స్త్రీ, రమణుడు = అందమైన వాడు, చెలరేగి = విజృంభించి, చెక్కుటద్దాలు = అద్దలవంటి చెక్కిళ్ళు, తొలసి = కాంతితో, మొల్లలు = మల్లెజాతిపువ్వు, తురిమి = సిగలోపెట్టి.
2. తడియొత్తు = పొడిగుడ్డతో తడిని వత్తి తీయుట, పొట్లాలు = పెద్దసంచి, చిదుముడి = తొందర, సొమ్ములు = నగలు, అదరి = వ్యాపింపజేసి, నివాళించు = హారతిపట్టు, అంగపు కాంతులు = శరీర శోభలు.
3. సోవ = పొడవు, పీతాంబరము = పట్టు వస్త్రము, చుంగులు = వస్త్రపు కొనగా వేలాడే కుచ్చె, తమ్ముల = తాంబూలము, మోహించి = ప్రేమించి, తావి = పరిమళము, తమకించు = త్వరపడు.

**భావము:** చెలులారా! అటు చూడండి. ఈవిధమైన వినోదాలు, విశేషాలు ఎవరికి ఉన్నాయమ్మా! ఇవన్నీ చూస్తూ ఉంటే తటాలున మేనుమరచి మైమరచిపోతూ ఉండడం ఎవరికైనా సహజమే కదా!

ఆ స్త్రీ ఆ స్వామికి కస్తూరీ తిలకము బెట్టి, విజృంభిస్తూ తన అద్దాలవంటి చెక్కిళ్ళను చూపుచున్నది. తన కొనగోళ్ళతో స్వామి కొప్పు దువ్వి, గొప్పకాంతితో కూడిన మల్లెలను కొప్పులో తురిమి చూస్తున్నది గమనించారా?

ఆ స్త్రీ భర్తపై పన్నీరు చిలికించి, వక్షస్థలముపైనున్న చెమటతడిని గుడ్డతో వత్తి ఆరునట్లుచేసి, సంచులలో దాచి ఉన్న అనేక నగలతో అలంకరించి, ఆ స్వామి దేహకాంతిని మోహంతో చూస్తూ హారతిపట్టినది చూశారా?

స్వామికి పొడవైన పట్టు వస్త్రమును ధరింపజేసిన వైనమూ మరియూ అందమైన ఆ వ్రేలాడే చెంగులను ఎలా గట్టిందో గమనించారా! స్వామికి తన మోమును ఆనించి తాంబూలమును ఎంత ప్రీతితో ఇస్తున్నదో చూశారా! ఆరోజు స్వామి శ్రీవేంకటేశ్వరుని అలాంటి మోహపు చూపులతో చూస్తూ పరిమళభరితమైన యున్న ఆ పట్టెమంచము పైకి తీసుకుని వెళ్ళి మోహంతో అల్లుకుంటుంటూ కలియుచున్నది.

**విశేషము:** స్వాధీనపతికయైన అమ్మ తానే స్వయంగా కస్తూరీ తిలకము దిద్దడం, పట్టుపీతాంబరాలు గట్టడం,పన్నీరు చిలికిచడం వంటి సేవలు అన్నీ అన్నమయ్య అద్భుతంగా వర్ణిస్తున్నాడు.

## 405

**అవతారిక:** యౌవన భారంతోను, మోహంతోను ఉన్న అలమేలుమంగమ్మ స్వామిని నీ చిత్తం వచ్చినట్టు నన్ను ఏలుకొనమని ప్రార్థిస్తున్నది.

### ఆహిరి

ప. ఏమి నెఱుఁగను నేను ఇఁక నీచిత్తమురా
దోమటి వయసు నాపైఁ దోసినట్టె తోయరా ॥పల్లవి॥

1. తలఁపెల్లా నీది తమకమే నాది
చెలగి యేమిసేసినాఁ జేయరా నీవు
పలుకు నీతోనే పంతమే నాలోను
చలివలపులు నాపైఁ జల్లినట్టు చల్లరా ॥ఏమి॥

2. వాలుఁ జూపులు నాపై వడియుఁ జెమట నాపై
కేల నాచన్నులు పిసికినట్టే పిసుకరా

ఆలకింపు నీకొరకు అలయిక నాకొరకు
నాలిసేసి నీవు నాతో నవ్వినట్టే నవ్వరా ॥ఏమి॥

3. కాగిలిదె నీకు కళదాఁకేది నాకు
యేఁగక నీమోవి నాకు నిచ్చినంతా వియ్యరా
పాఁగినశ్రీవేంకటేశ పైకొని కూడితినదె
ఆఁగె నిద్దరిమనసు లంటినట్టె యంటరా ॥ఏమి॥

**అర్థములు:** ప. చిత్తము = దయ, దోమటి = మాయ, తోసినట్టె = పైబడినట్లే, తోయరా = కానివ్వరా.

1. తలపు = ఆలోచన, తమకము = మోహము, చెలగి = చెలరేగి, పంతము = పట్టుదల, చలివలపు = సిగ్గుతో కూడిన ప్రేమ, చల్లినట్లు = ప్రసరింపజేసినట్టు.
2. వాలు చూపులు = ప్రక్క చూపులు, చన్నులు = రొమ్ములు, ఆలకించు = చెవినబెట్టు, అలయిక = శ్రమ, ఆలిసేయు = ఎగతాళిచేయు.
3. కాగిలి = కౌగిలి, కళదాకు = శోభలనంటు, ఏగు = వెళ్ళు, పాగు = చక్కెరపాకము, పైకొని = చేకొని, ఆగె = ఆగినది, అంటినట్టు = అతుకుకొను.

**భావము:** నాకు ఏమీ తెలియదు. ఇకపై అన్నీ నీ ఇష్టము ప్రకారమే కానిమ్ము! ఈ మాయదారి వయసు నాపై పడినట్లే నీవు కానివ్వరా!

నీ ఆలోచనలన్నీ సదా నీపైనే ఉంటాయని ఎరుగుదును. మోహము మాత్రము నాకు నీపైనే ఉన్నది. నా మాటలన్నీ నీతోనే ఉంటాయి. పంతమే నాలో యున్నది. సిగ్గుతో నిండిన ప్రేమను నాపై ప్రసరింపజేసినట్టే కానివ్వరా!

నీపై వాలు చూపులన్నీ నావే! నీపై పట్టిన చెమట నాపైకేల పారింపజేస్తావు? నా రొమ్ములను పిసికినట్టే పిసుకరా! చెవినబెట్టేవన్నీ నీ మాటలే కానీ శ్రమ మాత్రం నాకొరకే గదా! పరిహాసాలాడినట్టే నాతో నవ్వి నవ్వించరాదా!

కౌగిలి శోభలన్నీ దాకేది నీకూ నాకే గదా! ఇంక వీడక ఎక్కడికి వెళ్ళకుండా నీ అధరామృతాన్ని నాకు ఇచ్చినంత ఇవ్వరాదా! చక్కెరపాకమంటి మధురమైన ఓ శ్రీవేంకటేశ్వరా! నిన్ను చేయిపట్టి కూడితిని. ఇద్దరి మనసులు ఒకటే విధముగా నున్నవి, ఇప్పుడు నన్ను స్పృశినట్లే స్పృశించి ఆనందాన్ని కలుగజేయరా!

## 406

**అవతారిక:** అన్యమనస్కంగా ఉన్న స్వామి తనను పట్ల ప్రేమాభిమానాలు చూపడంలేదని వాపోతూ, స్వామికి తను చేస్తున్న సేవలు సరైనవేనా కాదా అని అమ్మ చెలులను ప్రశ్నిస్తున్నది.

### సాళంగం

ప. కానవచ్చె నందులోనె కాదా మఱి
ఆనవెట్టి అడిగీని అట్టెకాదా మఱి ॥పల్లవి॥

1. వున్నతి నేమీఁజేయక వుండఁగానేఁ దన్నుఁ జూచి
కన్నుల నవ్వితినట కాదామణి
చిన్నిచెక్కులమీఁదటి చిఱుఁజెమటలు చూచి
మిన్నక మొక్కితినట మేలుగాదా మఱి ॥కానవచ్చె॥

2. వుమ్మడి నీతని వేలివుంగర మెక్కడిదంటా
కమ్మఱఁ జూచితినట కాదామణి
కమ్మినట్టి తనమేని కస్తూరివాసనలకు
సమ్మతించనైతినట సటగాదా మఱి ॥కానవచ్చె॥

3. తీపులైనతన మోవి తెగువ చూపతినట
కాఁపురము లెస్సాయ కాదామఱి
పైపై శ్రీవేంకటాద్రిపతి నన్ను నిటు గూడె
చేపట్టి తనకిన్నీఁ జెల్లె గాదామఱి ॥కానవచ్చె॥

**అర్థములు:**ప. కానవచ్చె = కనబడెను, ఆన = ప్రమాణము, అడిగేని = అడుగుచున్నాను, కాదామరి = నిజమౌనా కాదా?

1. ఉన్నతి = గొప్పగా, కన్నుల నవ్వు = కన్నులతో పలకరించి నవ్వుట, చెక్కులు = చెక్కిళ్ళు, చిరుచెమటలు = సన్ననైన చెమటపొర, మిన్నక = మాట్లాడకుండా, మేలు = శుభము.
2. ఉమ్మడి = ఇద్దరికిచెందిన, కమ్మర = మరలా, కమ్మినట్టి = మీదచేరి చుట్టుకొను, మేని = శరీరపు, కస్తూరి = సుగంధ ద్రవ్యము, సమ్మతించు = ఒప్పుకొను, సట = మోసము.
3. తీపులు = సలుపు, తెగువ = ధైర్యము, లెస్సాయె = యోగ్యమాయె, పైపై = తేలికైన, చెల్లు = సరిపోవు.

**భావము:** అందులోనే అన్నీ తెలిసిపోతూ కనిపిస్తూనే ఉన్నవి కదా మరి చెప్పండి. ఒట్టేసి చెప్పమని అడిగితిని అట్టే కదా మరి అడగవలసిన విధానము.

గొప్పగా తను ఏమీ జేయకపోయినప్పటికి, నేను కన్నులతోనే పలుకరించి నవ్వులు చిందించాను కదా! స్వామి చెక్కిళ్ళమీద అప్పుడే పోస్తున్న చెమటలను చూసి ఏమీ మాట్లాడకుండా నమస్కారాలు చేశాను శుభమే కదా మరి.

ఈతని చేతి వేలి ఉంగరం ఎక్కడిది? మరలా పరీక్షించి చూశాను కాదా మరి! తన మేనిపై ఉన్న కస్తూరి వాసనలనునేను అంగీకరించలేదట! ఇదేమిటి? మోసముగాదా మరి?

భారమై సలుపుతున్న శరీరము మరియూ మోవిని గాంచి నేను ధైర్యము చేసిన మాట నిజము కాదా మరి! ఇద్దరి కాపురము యోగ్యమాయెను కాదా మరి! పైపైన ఆ వేంకటాద్రీశుడు నన్ను ఈవిధముగా కూడినాడు. నన్ను చేపట్టడం ద్వారా స్వామికి అన్నీ సరిపోయిన మాట వాస్తవము కాదా మరి?

## 407

**అవతారిక:** స్వామి వ్యవహారం అమ్మకేమీ పాలుపోవడంలేదు. అన్నీ గొప్పలు ప్రదర్శిస్తూ, అందీ అందనట్లు, ముట్టీ ముట్టనట్లు ఉన్నాడని చెలులతో చెప్పి వాపోతున్నది.

### కేదారగౌళ

ప. ఓయమ్మ యేడకేడే వోయమ్మా
యీయెడ మీసాలతేనె యీవలపు ॥పల్లవి॥

1. రమ్మని పిలువరాదు రాకుండితేఁ దిట్టరాదు
యెమ్మెలఁ గొండంతదొరే యీవిభుఁడు
బిమ్మిటి మెడవట్టదు పెట్టరాదు ముక్కునాకు
గుమ్మడికాయంతముత్తెమే యీకూటమి ॥ఓయమ్మ॥

2. పూని వేఁగిరించరాదు బొంకితే నలుగరాదు
యీనెలఁత లెందరై నీతనికి
తానూఁ జేతికి నీఁడు దగ్గరి తీసుకోరాదు
యేనుగ చేతి చెఱకే యీమోహము ॥ఓయమ్మ॥

3. ముంచి చేయి చాఁచరాదు మొనగోరు మోపరాదు
మించిన శ్రీవేంకటాద్రి మేఁటి యీతఁడు

కంచపుమో విచ్చి కూడె కడుఁదమకాలు రేఁచె
యెంచఁగఁ జుక్కలలెక్కే యీమరులు ॥ఓయమ్మ॥

**అర్థములు:** ప. ఏడకేడో = ఎక్కడికి ఎక్కడ, ఈయెడ = ఈతావు, మీసాలతేనె = పైపై గొప్పలు అనే అర్థంలో.

1. రాకుండితే = రాకున్నట్లైతే, ఎమ్మె = మనోహరత్వం, కొండంత దొర = ఉన్నతుడు, పిమ్మిటి = శక్తితగ్గ, ముత్తెము = ముత్యము.
2. పూని = ప్రయత్నించి, వేగించు = బాధించు, బొంకు = అబద్ధము, అలుగు = కోపించు, నెలత = స్త్రీ, ఎందరై = లెక్కలేనంత మంది.
3. ముంచి = హద్దుమీరి, మొంగోరుమోపు = గోళ్ళను తాకించు, మించిన = ఎక్కువగా, మేటి = గొప్పవాడు, మోవు = ముఖము, కడుతమకాలు = ఎక్కువైన మోహములు, రేచు = వ్యాపించు, ఎంచగ = లెక్కించి చూస్తే, చుక్కల లెక్క = ఆకాశములో ఉన్న నక్షత్రములవలె అనంతము, మరులు = మోహము.

**భావము:** ఓ అమ్మా! ఎక్కడికి ఎక్కడమ్మా! ఇక్కడి ఈతని ప్రేమలు మోహాలు మీసాలపై తేనియల వలె పై పై గొప్పలు మాత్రమే ప్రదర్శిస్తున్నాడు.

స్వామి నన్ను రా రమ్మని పిలువకూడదు. ఒకవేళ రాకుండా ఉన్నట్లైతే కోపించి తిట్టకూడదు. విలాసాల విషయంలో ఈ దొర వ్యవహారాలన్నీ కొండంతలుగా ఉంటాయి సుమా! శక్తి తగ్గి మెడ పెట్టడానికి కుదరదని తావులలో నా ముక్కు పెట్టకూడదు కదా! అన్నీ నిబంధనలే ఈ తావులో. మా స్నేహాభిమానాలు ప్రేమలు చూడబోతే, చూసేవాళ్ళకు గుమ్మడికాయంత పెద్ద ముత్యంలా కనిపిస్తుంది.

ప్రయత్నించి ఏమీ బాధ పెట్టకూడదు. ఒకవేళ ఆ స్వామి ఏమైనా అబద్ధాలు చెప్తున్నప్పటికి తెలిసినా అలుగకూడదు. ఎంత మంది స్త్రీజనం ఉన్నప్పటికి తాను చేతిని అందివ్వడు అలాగని మనం చొరవజేసి దగ్గరికి తీసుకోకూడదు. ఎలా ఉంటుందంటే ఏనుగు తొండానికి ఉన్న చెరకు సామెతగా అందీ అందనట్లుగా నీ ప్రేమ వ్యవహారం ఉంటుంది సుమా!

మనం హద్దుమీరి చేయి చాచకూడదు, మొనగోరు తాకించకూడదు. ఈతను సామాన్యుడు కాదు సుమా చాలా గొప్పవాడు, అన్నింటా అధికుడైన శ్రీవేంకటేశ్వరుడు. ఈ తావులో విందులిచ్చి తాను నన్ను కూడి, ఎంత మోహాన్ని రేకెత్తిస్తున్నాడో కదా! చూడ్డానికి చుక్కలను లెక్కపెట్టినట్లే అందకుండా ఉంటుంది ఈ మోహము, ప్రేమాభిమానములు. స్వామిని అంత తేలికగా అంచనా వేయడం కుదరదు సుమా!

## 408

**అవతారిక:** స్వామికి అమ్మవారికి మధ్య ఏదో భేదాభిప్రాయం ఏర్పడింది. అమ్మ అన్యాపదేశం స్వామికి హితోక్తులు చెబుతూ ఆవేదనతో నున్న సన్నివేశం.

## దేసాళం

ప. ఇద్దరి చలముఁ జెల్లె నిదే మేలు
వద్దువద్దు నాతోడి వట్టినవ్వు లేఁటికి ॥పల్లవి॥

1. వేడుకలేనిపనికి వేసరివుండుటే మేలు
కూడనిమాఁటకు వట్టిగుట్టేమేలు
యీడుజాడకాఁపురాన కేడనుండినా మేలు
తాడుపడె వలపులు తలవయ్య నీవు ॥ఇద్దరి॥

2. చనవులేనిచోటికి చాయపాట్లే మేలు
పెనఁగినా రాకుంటే బిగువే మేలు

మనసురాని యందుకు మఱి మఱచుటే మేలు
వెనకఁ జెప్పేఁగాని విడవయ్య కొంగు ॥ఇద్దరి॥

3. వొలసీనొల్లనిపొందు వూరకైనపాటె మేలు
కలసిన రతులకుఁ గలంతే మేలు
అలయించి శ్రీవేంకటాధిప కూడితి నన్ను
వులివచ్చికాఁగిలేల వుండవయ్య యీడనే ॥ఇద్దరి॥

**అర్థములు:** ప. చలము = కంపము,భీతి, చెల్లె = సరిపోయినవి, ఏటికి = ఎందుకు

1. వేడుక = సంతోషము, వేసరి = బాధపడి, కూడని మాట = అనకూడని మాటలు, గుట్టు = దాపరికము, ఈడుజాడకాపురము = ఒకరిని మించిన ఒకరి అతిశయము, తాడుపడు = అడ్డుపడు, తలవయ్య = పూనికచేయవయ్యా.
2. చనవు = ప్రేమాభిమానములు, చాయపాటు = అన్యాపదేశము, పెనగు = చుట్టుకొను, బిగువు = గంభీరము, వెనుక = తర్వాత, విడవయ్య = విడిచిపెట్టవయ్యా.
3. ఒలయు = కూర్చు, ఒల్లని = కూడని, వూరకైనపాటు = ఊరక యుండు పద్ధతి, కలంతే = కలిగినంతమేరకే, అలయించి = శ్రమపెట్టు, ఉలివచ్చి = కొంచెం పచ్చి పచ్చిగా ఉన్న.

**భావము:** స్వామీ! ఇద్దరి కంపములు సరిగా సరిపోయినవి కదా ఇదే మేలు. నాతో ఉత్తుత్తి నవ్వులు నవ్వడం ఎందుకు స్వామీ!

వికాసముతో చేయని పనులకు బాధపడి ఉండడమే మేలు. మాట్లాడకూడని మాటలను విన్నప్పుడు ఊరక ఉండడమే మేలు. ఒకరిని మించిన అతిశయము మరొకరికి ఉన్నప్పుడు ఎక్కడ ఉండినా మేలే కదా! అడ్డుపడే బంధాన్ని గూర్చి తలుచవలదా స్వామీ!

ప్రేమాభిమానాలు లేని తావుల్లో అన్యాపదేశంగా మాట్లాడుకోవడమే మేలు. చుట్టుకొన్నప్పటికి రాకుండినట్లైతే గంభీరంగా ఉండిపోవడమే మేలు. మనసులేని వారిని గురించి మరచిపోవడమే శుభము. విషయాలన్నీ తర్వాత వివరిస్తాను కానీ కొంగు విడవవయ్యా.

కూడీ కూడని పొందులు కలయికలు ఉన్నతావుల్లో ఊరక ఉండడమే మేలనిపిస్తున్నది. కలిసినప్పటి రతిక్రీడా అనుభవాలు పొందినంతే చాలు. ఈవిధంగావిధంగా శ్రమపెట్టి నన్ను చేరినా ఓ శ్రీవేంకటేశ్వరా! పచ్చి పచ్చిగా ఉన్న ఈ వింత కౌగిలెందుకు? కాస్తా నిదానించి ఇక్కడే ఉండవచ్చును కదా!

**విశేషము:** చాలా పంకుల్లో అన్నమయ్య "మేలు" అనే అంత్య ప్రాస వాడి కీర్తనకు వన్నె తెచ్చాడు.

## 409

**అవతారిక:** ఎక్కడో అకార్యాలు చేసి వచ్చి తప్పించుకుని తిరుగుతున్న స్వామి గురించి చెలులు అమ్మకు చాడీలు చెప్పగా, వారిని ఊరకే అల్లరి చేయవద్దని, తానే స్వయంగా అన్ని వివరాలను రాబడతానని అమ్మ వారికి చెప్తున్నది.

### రామక్రియ

ప. చేతికిఁ గొంత చేరనీవే
ఘాతలఁ దన మేను కరఁగించేఁ గాని ॥పల్లవి॥

1. రానీవే వాని రవ్వసేయక
ఆనిపట్టి నేనే అడిగేను
పూని తొలుతనంటే బొంకినీ
నానినకాఁగిట న్వవించేఁగాని ॥చేతికి॥

2. తిరుగనీవే వానిఁ దెగనాడక
మరిగించే నేనే మాఁటలను

తరవాత నేమనినాఁ దలవంచీని
మరుతంత్రములన్నీ మరి నేసేఁగాని ॥చేతికి॥

3. వుండనీవే వానినొకటాడక
అండనే రతికేలి నలయించేను
దండి శ్రీవేంకటదైవ మీతఁడే
నిండి వురముమీఁదనే మొక్కేగాని ॥చేతికి॥

**అర్థములు:** ప. చేరనీవే = పట్టుదొరకనివ్వు, ఘాతలు = చిన్న దెబ్బ, మేను = శరీరము,మనసు, కరగించు = ద్రవింపజేయు.

1. రవ్వ = అల్లరి, ఆనిపట్టు = ఊనిపట్టు, పూని = కల్పించుకొని, తొలుత = మొదట్లో, బొంకినీ = అబద్ధమాడినాడు, నానిన = ఆలస్యమగు, కాగిట = కౌగిటిలో,
2. తెగనాడు = దూషణచేయు, మరగించు = మోహింపజేయు, మరుతంత్రములు = మన్మథ ప్రయత్నములు.
3. ఒకటాడక = ఏమీ అనకుండా, అండ = చెంత, రతికేళి = రతిక్రీడ, అలయించు = శ్రమపెట్టు, దండి = అధికమైన, నిండి = వ్యాపించి, ఉరము = వక్షస్థలము, మొక్కేగాని = నమస్కరించెదను గాక.

**భావము:** ఓ చెలీ! నాకు గొంత పట్టు దొరికి స్వామిని నా చేతికి చిక్కనివ్వవే! ఊరకే తొందరపడవద్దు. చిక్కాక నేను చిన్న చిన్న శృంగారపరమైన దెబ్బలచే ఆ స్వామి మనసును ద్రవింపజేసి అసలు విషయం రాబడతాను.

నువ్వు ఊరకే అల్లరి చేయవద్దు. ఆ స్వామిని గట్టి పట్టుపట్టి నేనే అన్ని విషయాలను అడుగుతాను. ఆయన మొదట్లో అబద్ధాలాడవచ్చు కానీ తర్వాత తీరిగ్గా నా కౌగిట్లో నిదానంగా మంచి సరస సంభాషణలతో సంతోషపెడతాను.

స్వామి ఇష్టానుసారం అలా తిరుగనివ్వవే! మాటలతో ఆయన్ను మోహింపజేసాక ఆ తర్వాత స్వామి పూర్తిగా నా వశమౌతాడు. ఆ సమయములో నేనేమన్నప్పటికి ఆయన నాకు తలవంచుతాడు. పిమ్మట మన్మథ తంత్రాలన్నీ నేనే స్వామి వారి మీద ప్రయోగించి దారికి తెచ్చుకుంటాను.

స్వామిని కుదురుగుండా ఒకచోటనే ఉండనీయవే! ఆ చెంత జేరి నేను రతికేళీ విలాసాలన్నీ ప్రయోగించి శ్రమకు గురిచేస్తాను. చూశావా చెలీ! శ్రేష్టుడైన శ్రీవేంకటేశ్వర స్వామి దైవమీతడే సుమా! నేను పూర్తిగా వ్యాపించి వక్షస్థలముపైనుండే స్వామికి నమస్కరిస్తాను.

## 410

**అవతారిక:** స్వామి అమ్మ అలమేలుమంగల సఖ్యత విషయంలో విపరీతంగా జోక్యం చేసుకుంటున్న చెలులకు అమ్మ బుద్ధి చెప్పే సన్నివేశం.

### ముఖారి

ప. సారె సారె మీరేల సందడిఁ బెట్టేరే
మారుని మాయలు నేఁడు మందులఁ బొయ్యీనా ॥పల్లవి॥

1. వలపు వెంచఁగఁబోతే వంతులకుఁ జవులవునా
అలవాని పొందు మానుమని యేల చెప్పేరే
తలఁ పాతని మీఁదటఁ దనువు యీాడనే యింతే
యెలిమి మీరేమన్నా నిఁక మానఁబొయ్యేనా ॥సారె॥

2. మనసునఁ బాలు దాగ మఱి కడుపు నిండునా
పొనిగేల యెడమాటఁ బొద్దువుచ్చేరే
కనుచూ పాతనిమీఁద కాఁక లివె నామీఁద

వెనక మీరెమన్నా వినcబొయ్యేనా ॥సారె॥

3. మాటలు విసుకcబోతే మాపుదాcకా మెత్తనౌనా
పూcట వూcట నాకేల బుద్ధిచెప్పేరే
యీటులేని శ్రీవేంకటేశుc డిట్టె నన్నుc గూడె
మేటుల నేcడిcకనేల మీరే నేcగానా ॥సారె॥

**అర్థములు:** ప. సారె సారె = మాటి మాటికి, సందడి = హడావుడి, మారుడు = మన్మథుడు, మాయలు = తంత్రము, మందుల = మందు, మాకూ వంటివి.

1. వెంచగబోవు = లెక్కింపబూను, వంతులు = పోటీలు, చవులు = రుచులు, అలవాని = అక్కడివాని, తలపు = ఆలోచన, తనువు = శరీరము, ఎలిమి = వికాసము.
2. మనసున = మనసులో, పొనిగి = కాంతిలేని, ఎడమాట = దూరము చేసే మాట, పొద్దుపుచ్చు = కాలక్షేపము చేయు, కనుచూపు = కంటి చూపు, కాక = తాపము, వెనక = తర్వాత.
3. విసుకు = చికాకు, మాపు = రేయి, మెత్తనగు = కోపము తగ్గి మాట్లాడు, బుద్ధి = మంచి మాటలు, ఈటు = పరిమితి, మేటి = గొప్ప, మీరు = అతిక్రమించు, గానా = చూడనా.

**భావము:** ఓ చెలులారా! మాటి మాటికి మీ హడావిడి ఏమిటో నాకు అర్థం కావడంలేదు. మన్మథ తంత్రం అనేది మందులు మాకులు బెట్టి పొందేది కాదు సుమా!

ప్రేమ అనే సున్నితమైన విషయంలో పోటీలు బెట్టుకుని కూర్చుంటే జరుగుతుందా? రుచిపుట్టిస్తుందా! అక్కడ నున్న స్వామితో పొందు మానమని ఎందుకు చెప్తున్నారు. నా ఆలోచనలన్నీ ఆ స్వామి మీదనే ఉన్నవి. నా శరీరం మాత్రమే ఇక్కడ మీ వద్ద నున్నది. మీరేమి చెప్పనా నేనాతని పొందుకోరక మానను సుమా!

చెలులారా! మనసులో పాలు తాగినట్లు ఊహించుకుంటే నిజంగా పాలు తాగినట్లవుతుందా? మీరిలా పూనుకుని నన్ను స్వామికి దూరం చేసే మాటలు మాట్లాడడం, కాలక్షేపం చేయడం తగునా? నా కనుచూపు ఎల్లవేళలా స్వామి మీదనే ఉంటుంది నా తాపమంతా స్వామికొరకే ఉంటుంది. వ్యవహారం పూర్తిగా చెడితే, తర్వాత మీరేమయినా విని నాకు సాయం చెయ్యగలరా?

మాటలు మాట్లాడితే స్వామి ఏదో చికాకులో ఉండి కాస్తా విసుగు చూపించినట్లైతే రాత్రి వేళకు మెత్తబడదా? కోపం తగ్గి మాట్లాడదా? ప్రతిరోజు పూట పూట నాకెందుకు మీరు నీతులు బుద్ధులు చెప్తున్నారు? అపరిమితమైన ప్రేమాభిమానాలున్న ఆ శ్రీవేంకటేశ్వరుడు నన్ను కూడినాడు. గొప్పలకు బోయే మీరు ఇంక పరిమితులు దాటి ప్రవర్తించవద్దు. అన్నిటికి నేనే గదా సిద్ధమై ఉన్నాను.

## 411

**అవతారిక:** అలమేలుమంగా శ్రీనివాసుల సమాగమన్ని, సంభాషణలను, సాంగత్యాన్ని, అన్నమయ్య ఒక పెండ్లి తంతుగా భావించి వర్ణించే దృశ్యం.

### పాడి

ప. రమ్మనవే చెలువుని రవ్వ మమ్ముc జేయనేల
తమ్మిపువ్వుల వాట్లు దాcకుదాcకానా ॥పల్లవి॥

1. గక్కనc జూచినంతనే కన్నులనే పెండ్లాయ
వెక్కసపు తలcబాలు వేగినంతానా
పక్కన నవ్వినంతనే పాలకూళ్లు నెలవాయ
మక్కువతో బువ్వములు మాపుదాcకానా ॥రమ్మనవే॥

2. తొలుతటిసిగ్గులె దొడ్డ తెరమఱఁగాయ
వలిపెపు తెరమాటు వడి వింకానా
సొలపులమాటలవే సోబాన పాటలాయ
చలివాసె పేరటాండ్ల సంద డింకానా ॥రమ్మనవే॥

3. పైనొరగినప్పుడే పరవని పరపాయ
నానఁబెట్టి నాగవల్లి నాఁటిదాఁకానా
ఆనుక శ్రీవేంకటేశుఁ డంతలోనె నన్నుఁ గూడె
మేనిలోని సంతసాలు మెచ్చుదాఁకాఁనా ॥రమ్మనవే॥

**అర్థములు:** ప. చెలువుడు = ప్రియుడు, రవ్వ = అల్లరి, వాటు = దెబ్బ, తాకు దాకానా = తాకేవరకా.

1. గక్కన = శీఘ్రముగ, వెక్కసము = అధికము, తలబాలు = తలబ్రాలు, వేగు = తపించు, ఆరాటపడు, పాలకూళ్ళు = విందులు, నెలవు = చోటు, మక్కువ = ఇష్టము, బువ్వములు = పెండ్లివారి సహభోజనము, మాపు = రాత్రి.

2. తొలుత = మొదట, దొడ్డ = గొప్ప, తెరమరగు = మాయమగు, వలిపము = తెరగుడ్డ, తెరమాటు = అదృశ్యము, వడివి = శూరత్వము, సొలపు = పారవశ్యము, సోబాన = (శోభన) పెండ్లిపాట, చలివాయు = బుజ్జగించు.

3. పైనొరగు = పైనబడు, పరవని పరపు = వేయని పరపు, నానబెట్టి = జాప్యముజేసి, నాగవల్లి = పెండ్లిలో నాలవనాడు జరుగు శుభకార్యము, ఆనుక = తర్వాత, మేని = శరీరము, సంతసాలు = సంతోషములు, మెచ్చు = పొగడు.

**భావము:** ఓ చెలీ! ఆ సుందరాంగుడైన స్వామిని ఇక్కడకు విచ్చేయమనవే! ఇలా మమ్మ అల్లరిపాలు జెయ్యడం ఎందుకు? ఇంకా తామరపువ్వుల సున్నితమైన దెబ్బలు యిలా మేనిపై దాకేవరకూనా?

శీఘ్రముగా అలా చూడగానే కన్నులలోనే వివాహము జరిగిపోయినది. అధికమైన తలంబ్రాలు ఆరాటపడి, తపించేంతవరకా? పక్కుమని నవ్వగానే విందుభోజనాలన్నీ సిద్ధమయ్యాయి. ఇంక ఇష్టంతో పెట్టే పెండ్లివారి సహభోజనాలు రాత్రిదాకానా?

ముందు ఉన్న అధికమైన సిగ్గులన్నీ అదృశ్యమయాయి, ఇంకా వస్త్రం అడ్డుపెట్టి తెరచాటు చేసి శూరత్వం ఇంకా చూపిస్తున్నారా? పారవశ్యంతో పాడే పాటలే పెండ్లిపాటలైనవి. బుజ్జగించే పేరంటాళ్ళ హడావిడి ఇంకానా?

ఆ స్వామి నాపై ఒరగినపుడే అదే నాకు వేయని పట్టుపరపైనది. ఇంకా నాల్గవనాటి నాగవల్లి వరకూ జాప్యం చేయడమెందుకు? తరువాత స్వామి శ్రీవెంకటేశ్వరుడంతలోనే నన్ను కూడినాడు. ఇంకా ఈ శరీరంలో సంతోషాలు ప్రశంసించే దాకానా?

## 412

**అవతారిక:** శ్రీనివాసుడు అమ్మ అలమేలుమంగమ్మతో పరిహాసాలాడుతూ అమెను రకరకాలుగా వర్ణిస్తూ దరి చేరుకుంటున్నాడు.

### వరాళి

ప. నేరుపరి వొదువే నీడకు రావే ? నాకుఁ
దారుకాణలాయ నిఁక తప్పులేలే ॥పల్లవి॥

1. కిన్నెరమీట్లలోని గిలిగింతలూ నీ-
సన్నలచాయలలోని చలివేండ్లు
వన్నెలకాఁకలమేనివసివాడుల నే-
మిన్నిటికి లోనైతి మిఁకనేలే పనులు ॥నేరుపరి॥

2. జంకెనచూపులలోని సరిబేసులూ నీ-
తెంకులమాటలలోని తెల్లనల్లలు
కంకినగవులలోని కాయపండ్లు

మంకు లిన్నిటాఁ బడితి మరియేలే కతలు ।నేరుపరి॥

3. అచ్చపు సిగ్గులలోని అంగభంగాల నీ-
అచ్చుపడ్డకాఁగిటిలో నరమఱలూ
తచ్చి శ్రీ వేంకటపతిఁ దగిలి నేఁగూడితిని
యెచ్చుకుందులెల్లాఁ గంటి నిపుడేలే బొంకులూ ।నేరుపరి॥

**అర్థములు:** ప. నేరుపరి = నైపుణ్యముగల, నీడకు = కాంతిగల తావునకు, తారుకాణ = ఋజువు,సాక్ష్యం, తప్పులేల = తప్పులెంచడం ఎందుకు?

1. కిన్నెర = తీగలతో చేసిన ఒక వాద్యవిశేషము, గిలిగింత = చక్కలిగింతలు, సన్నలు = సైగలు, ఛాయలు = కాంతులు, చలివేంద్లు = ఎండాకాలము బాటసారులకు, మంచినీళ్లు యిచ్చుటకు, మార్గ మధ్యమున నిర్మించిన పూరిపందిలి, వన్నెలు = కళలు, కాక = వేడిమి, లోనైతి = పాలబడు.
2. జంకెన = సంకోచపు చూపులు, సరిబేసులు = ఒక ఆట, తెంకు = భయము, తెల్లనల్లలు = మంచిచెడులు, కంకి = కఠినమైన, మంకు = మొండి, కతలు = కట్టు కథలు.
3. అచ్చపు = స్వచ్ఛము, అంగభంగాలు = తిమ్మిరి,ఒడలు విరుచుకోవడం, అచ్చుపడు = తగియుండు, కాగిటి = కౌగిలి, అరమరలు = సందేహము, తచ్చు = తగ్గుదల, తగిలి = స్పృశించి, హెచ్చుకుందులు = ఎక్కువతక్కువలు, బొంకులు = అబద్ధాలు.

**భావము:** మంచి నైపుణ్యాలున్నదానివేలే! ఇలా ప్రక్కకు వచ్చి నీడలో నిలబడవే! నాకు అన్ని ఋజువులు సాక్ష్యాలు తెలిసిపోయాయి కదా ఇంకా దోషాలెందుకే!

కిన్నెర మీటేటప్పుడు కలిగే ఒక లాంటి చక్కలిగింతలు, నీ సైగలు, కాంతులులలో ఉన్న చలివేంద్రములా కనిపిస్తున్నాయి. ఛాయలు కళలు కాకలూ నేనన్నింటికీ లోనైయున్నాను ఇంకా ఈ కార్యాలెందుకే!

బెదరిన లేడివంటి నీ సంకోచపు చూపులలో సరిబేసులాటలా తోస్తున్నది. నీ భయముతో కూడిన మాటలలో మంచి చెడులు, కోపంతో చూస్తూ నవ్వే నవ్వులలో కాయలు పండ్లు వలెనున్నవి. నీ మొండితనం మొత్తం చూసాను ఇంకేలే ఇంకా ఈవిధంగా కట్టుకథలు చెప్పడంయింకానేలే?

నీ స్వచ్ఛమైన సిగ్గులతో వొడలు విరుచుకోవడం లాంటి విన్యాసాలు, సందేహాలు కౌగిటిలో చేరగానే పటాపంచలై పోయాయి. శ్రీవేంకటేశ్వరుడునైన నేను నీకొరకై కొంచెం తగ్గిన వాడనై కలిసితిని. ఇంకా ఈ ఎక్కువతక్కువలన్నీ సంపూర్ణంగా చూశాను. ఇంకా ఈ సమయములో కూడా ఏవో అబద్ధాలు చెప్పడం అవసరమా?

## 413

**అవతారిక:** స్వామి అమ్మపై ప్రేమానురాగాలతో చేరవచ్చి ఏవో చిలిపి పనులు చేస్తున్నాడని పరిహాసమాడుతున్నది.

## సామంతం

ప. పంతము పాడియు నీభావములోనే కంటి
యెంత ప్రియముచెప్పినా నిది మెచ్చుగాదురా ॥పల్లవి॥

1. చిత్తములో తమకము చిఱుఁజెమటలఁ గంటి
కొత్తకొత్తనీపొందులు కొప్పుపువ్వులనే కంటి
తత్తరపునీగుణాలు తనుపులకలఁ గంటి
రుత్తమాట లేమన్నా రుచిగావు మానరా ॥పంతము॥

2. కాఁకల నీవసివాడు కనుచూపులనే కంటి

వేఁకపునీయలపెల్లా వెడనిట్టూర్పులఁ గంటి
సోఁకుల నీవేడుకలు సొంపుఁ గళలనే కంటి
వూఁకొనేఁగాని నీసుద్దు లొడఁబాటు గావురా ॥పంతము॥

3. నాటకపునీవిద్దె నగవులలోఁ గంటి
గాఁటపు నీవలపెల్లా కాఁగిటిలోన కంటి
పాటించి శ్రీ వేంకటేశ పై కొని నన్నుఁ గూడితి-
విటు రాఁదొల్లిటివలె నిందులోఁ జెల్లదురా ॥పంతము॥

**అర్థములు:** ప. పంతము = పట్టుదల, పాడి = స్వభాము, భావము = తలపు, మెచ్చు = పొగడ్త.

1. తమకము = తాపము, చిరు = కొంచెము, పొందు = సంగమం, కొప్పు పువ్వులు = సిగలోని పూలు, తత్తరము = తొందర, తనుపులకలు = శరీర గగుర్పాటు, ఉత్తమాట = విషయములేని మాట.
2. కాకలు = వేడిమి, అసివాడు = విహారము, వేకము = తిరుగుచున్న, అలపు = శ్రమ, వెడ = వ్యర్థము, సోకులు = సింగారము, సొంపు కళలు = సౌందర్య శోభ, ఊకొను = సమ్మతించు, సుద్దులు = బుద్ధినిచెప్పే మాటలు, ఒడబాటు = చెల్లుబాటు.
3. విద్దె = విద్య, నగవు = నవ్వు, గాటము = అధికము, కాగిటి = కౌగిటి, పాటించి = ఆచరించి, తొల్లిటి = పూర్వము, చెల్లదు = సరిపోదు.

**భావము:** నీ పంతాలు, పట్టుదలలు నీ స్వభావములోనే స్పష్టంగా కనిపిస్తున్నాయి. నీవెంత ఇష్టమైన కబుర్లు చెప్పినప్పటికి, దీనిని నేను మెచ్చజాలను సుమా!

నీ మనసులో ఉన్న తమకము తహతహలు నీ శరీరంపై పడుతున్న సన్నని చెమటలో గమనించాను. క్రొత్త క్రొంగ్రొత్త రకాలుగా నీవు చేస్తున్న ఈ పొందులు నీకోప్పులోని పూవులలో దర్శిస్తున్నాను. ఊరకూరకే తొందరపడే నీ స్వభావము దానివలన కలిగే గగుర్పాటు చూస్తున్నాను. ఉత్తిత్తి మాటలు ఎన్ని చెప్పినా రుచిస్తాయా చెప్పండి?

నీకు కలిగే కాక నీలో విహరించే కను చూపులలోనే కనిపెట్టాను. చుట్టూ తిరుగుతున్న నీ అలుపు సొలపు నీ నిట్టూర్పులలో స్పష్టమౌతున్నది. సౌందర్యవంతమైన నీమోములోని సంతోషాలనే శోభలను కనిపెట్టి చూసాను. సమ్మతిస్తాను కానీ, నీ బుద్దులు చెప్పే సుద్దులు ఇక్కడ చెల్లుబాటు కావుసుమా!

నీవు వేస్తున్న వేషాలన్నీ నీ నవ్వులలోనే కనిపిస్తున్నాయి. ఓ శ్రీవేంకటేశ్వరా! ఇవన్నీ ఆచరించి నన్ను చేపట్టి కూడినావు. ఇటురావయ్యా స్వామీ! ఇంతకు ముందు మాదిరిగా అన్నీ ఇక చెల్లుబాటు కావు సుమా!

## 414

అవతారిక: అమ్మ మేడమీదనుండి సైగలు చేయగానే వచ్చి చేరిన వేంకటపతి ఏవో చిలిపి పనులు చేస్తున్నాడు. అమ్మకు మహదానందమైనది. చూడండి.

### బౌళి

ప. నేనే యందుకు రానటరా
పోనీపోనీ యింతసేసి వట్టిపొందులనే నిందవేసితి
అట్టే కానీకానీ శ్రీవేంకటరాయా ॥పల్లవి॥

1. చెలులతో నిన్నమాపే చెప్పిపంపనా నీకు
యెలమి మాయింటికి నేలవచ్చితి కానుక లిచ్చితి
వేగిరించితి శ్రీవేంకటరాయా ॥నేనే॥

2. నెప్పున మేడపై నీకు నిక్కి సన్న సేయనా

యిప్పుడే చన్నుపట్టేవు యేమిరా నీవే
నేమురా బలిమేలరా శ్రీవేంకటరాయా ॥నేనే॥

3. నిచ్చలు మాచన వొలినిలయా నేఁ గోరఁగానే
మెచ్చుగా నన్నుఁ గూడి మేలమాడితి
మేలుమేలురా శ్రీవేంకటరాయా ॥నేనే॥

**అర్థములు:** ప. పోనీ పోనీ = అలాగే కానిమ్ము, నింద = అపవాదు, అట్టే కానీ కానీ = అలాగే కానిమ్ము.

1. ఎలమి = వికాసము, కానుక = బహుమతి, వేగిరించు = త్వరపడు.
2. నెప్పున = ఉపాయము, నిక్కి = బాగా తలెత్తి చూచు, సన్న = సైగ, చన్ను = రొమ్ము, బలిమి = బలవంతము.
3. నిచ్చలు = ఎల్లప్పుడు, మాచన = మాపట్ల, ఒలినిలయుడు = దోపిడీచేయువాడు, మెచ్చు = పొగడు, మేలమాడు = పరిహాసమాడు, మేలు మేలు = శుభము శుభము.

**భావము:** ఓ స్వామీ! నీవు పిలిచినట్లైతే నేనే వచ్చే దాననుకదా! పోనీలే స్వామీ! ఇంతటి అకార్యాలు చేసి, వట్టి పొందులతో నా మీదనే అపవాదు వేస్తున్నావు. అలాగే కానిమ్ము శ్రీవేంకటపతీ... అయితే నా మాట కొంచెం ఆలకించండి.

చెలికత్తెలతో నిన్నటికి నిన్న రాత్రివేళ చెప్పి పంపి యున్నాను కాదా! మరి మా ఇంటికి వచ్చి ఏవో బహుమతులను కూడా ఇచ్చి త్వరపడ్డ విషయము నీకు గుర్తున్నదా స్వామీ శ్రీవెంకట రాయా!

నేను మేడపై నీలబడి దీర్ఘంగా తదేక ధ్యానంతో నిన్నే చూస్తూ సైగలు చేస్తే వెంటనే త్వరపడి వచ్చి నా రొమ్ములు పట్టుకున్నావు ఇదేమి పని స్వామీ! మమ్ములను ఇలా బలవంతం చేయడం న్యాయమంటావా శ్రీవేంకటరాయా!

సదా మాపై ప్రేమానురాగాలతో ఉన్న దోపిడీ కారుడైన ఓ వేంకటరాయా! నేను కోరగానే వచ్చి నన్ను చేపట్టి ఎన్నో తమాషా పరిహాసాలు చేశావు. నన్ను మెచ్చుకున్నావు. శుభము! శుభము! శ్రీ వేంకటరాయా! నా జన్మకిదే సంతోషదాయకము.

## 415

**అవతారిక:** స్వామి చేసే పనులకు ఓపలేను అంటూ విన్నవిస్తున్నది అమ్మ అలమేలుమంగమ్మ.

### ఆహిరి

ప. కోపగించుకొన నోప గొరబూ నోప
తీపుల మీఁదటి యెత్తు తెలిసేఁ గాని ॥పల్లవి॥

1. చెలుల దూరగనోప చిల్లరవాదుల కోప
చలపట్టి పతితోడ జంకించనోప
అలిగి పానుపుమీఁద నవ్వలిమోమై యుండఁగఁ
గలిగినపాటే మేలు కనుకొనేఁగాని ॥కోప॥

2. దైవము దూరఁగ నోప తమకించి పడనోప
మోవనాడేవెంగెములు మొదల నోప
చేవదేరేచింతతోడ చెక్కుచేత నుండఁగాను
కావలసినపనులు కనుకొనేఁగాని ॥కోప॥

3. పంతము లియ్యఁగ నోప బచ్చెనమాటల కోప
వంతువాసులకు నోప వరుస లోప
ఇంతటి శ్రీ వేంకటేశుఁడిట్టు నన్నుఁగూడె నేఁడు
కాంతుఁడితనితలఁపు కనుకొనేఁగాని ॥కోప॥

**అర్థములు:** ప. ఓపు = ఓర్చు, గోరబూన = గోటితో గాయముచేయ, తీపులు = సలుపు,నొప్పి, ఎత్తు = ఉపాయము.

1. దూరగ = జోక్యముచేసుకొను, చిల్లరవాదులు = అల్పమైన వాదాలు, చలపట్టు = మచ్చరించు, జంకించు = అదరవేయు, అవ్వలిమోము = పెడమొహము పెట్టు, పాటు = పద్ధతి.
2. దూరు = జోక్యముచేయు, తమకించు = మోహపడు, మోవనాడే = మొహముపై కనిపించు, వెంగెములు = పరిహాసములు, చేవదేరు = సారమగు, చింత = బాధ, చెక్కు = చెక్కిలి.
3. పంతము = పట్టుదల, బచ్చెన మాటలు = మోసపు మాటలు, వంతులు వాసులు = వాసికి వన్నెకు, వరుస = వంతు, కాంతుడు = మగడు, తలపు = ఆలోచన, కనుగొను = కనిపెట్టు.

**భావము:**స్వామీ! మీరు నన్ను కోపగించుకోవడానికి గానీ, గోరనొత్తుటకుకానీ ఓపలేను. నీ సంగతులు, నీ ఉపాయాలు అన్నీ మాకు తెలిసినవి.

చెలులవిషయంలో మధ్యలో జోక్యం చేసుకోవడానికి సహించలేను. మచ్చరించి పట్టుదలలు పెట్టుకొని కోపంపూని భర్తను అదరగొట్టడం కూడా ఓపలేను. ఒకవేళ స్వామి అలిగి పానుపు మీద పెడమొహం పెట్టుకొని పండుకొని యున్నట్లైతే నేను బాధ పెట్టకుండా అన్నిటికి ఒప్పుకునే దానను.

ఇందులో దైవానుగ్రహం అని చెప్ప సహించజాలను. అలాగే మోహావేశంలోనూ పడనోపలేను. మొహముపై కనుపించే పరిహాసాలకు అసలే ఓర్వలేను. చెక్కిలిపై చేయిబెట్టుకొని చింతతో ఆలోచనలతో నుండగా కావలసిన పనులన్నీ కనుగొనేను కదా!

పంతాలు పట్టింపులకు పోవగా నోర్వగా లేను. అలాగే మోసపు మాటలను ఓర్వలేను. ఇంతలోనే శ్రీవేంకటేశ్వరుడు ఈవిధంగా నన్ను నేడు కూడినాను. ఈ మగని ఆలోచనలన్నీ నేను కనిపెట్టగలను కదా!

## 416

**అవతారిక:** స్వామి చెలులతో కలిసి సరస సల్లాపాలు సాగిస్తున్నాడని, చతుర్లు ఆడుతున్నాడని భావించిన అమ్మ స్వామి వైనం కనుక్కొని రమ్మని ఒక చెలిని పంపగా ఆమె స్వామితో ఈవిధంగా ముచ్చటిస్తున్నది.

### సాళంగం

ప. వద్దువద్దు దోసమూ వావిగాదు నీకు నాకు
అద్దో తొలఁగుబావ వంటుకోకువయ్యా ॥పల్లవి॥

1. యేమి సేసేవోయంటా నిటు నన్నుఁ జూడనంపె
దీమసపు నీతలఁపు తెలియ నంపె
వాములై న నీలోనివలపులు రేఁచఁగ నంపె
కామించి నీవేల నన్నుఁ గాఁగిలించేవయ్యా ॥వద్దు॥

2. ఇందుకే విచ్చేసేవంటా నెదురుగా నన్నంపె
కందువ నీనేరుపెల్లాఁ గనుకో నంపె
చందమామ గుటుకలు చవులచూడఁగ నంపె
యిందులోనే నీవు నాతో నేల నవ్వేవయ్యా ॥వద్దు॥

3. చేరువకు వచ్చి నిన్నుఁ జెలి యచ్చరించ నంపె
బీరాన నాచేత నిన్నుఁ బిలువ నంపె
యీరీతి శ్రీ వేంకటేశ యీడ నన్నుఁ గూడి యాకెఁ
గూరిమిఁ గూడితి విట్టె కొత్త యేఁటిదయ్యా ॥వద్దు॥

**అర్థములు:** ప. దోసము = తప్పు, వావి = వరస, అద్దో = అదుగో, తొలగు = అడ్డు తప్పుకో, అంటుకొను = తాకు.

1. చూడనంపె = చూచుటకు పంపు, దీమసము = నేర్పు, తలపు = ఆలోచన, వాములు = పెద్ద(గడ్డివాము వంటి), రేచు = వ్యాపించు, కామించు = మోహించు, కాగలించు = కౌగలించు.
2. విచ్చేయు = వచ్చి చేరు, నన్నంపె = నన్ను పంపెను, కందువ = జాడ, నేరుపు = నైపుణ్యం, కనుగో = కనుగొనుటకు, చందమామ గుటుకలు = అలభ్యమైనదానికి అర్రులు చాచడం, చవి = రుచి, నవ్వేవయ్యా = ఎందుకు నవ్వుతావు.
3. చేరువ = దగ్గర, ఎచ్చరించు = పలకరించు, బీరాన = పరాక్రమం, పిలువనంపె = పిలవడానికి పంపించు, ఆకె = ఆమె, కూరిమి = స్నేహము, కూడితి = కలిసితి, ఏటిదయ్యా = ఎక్కడిదయ్యా

**భావము:** వద్దు వద్దు తప్పయ్యా! నీకు నాకు వావి వరసాలేదు సుమా! ఇలా అడ్డు నిలవవద్దు బావా! తప్పుకో! దగ్గరకు రావద్దు నన్ను అంటుకోవద్దు.

నీవు ఏమిచేస్తావో ఏమో అనుకొని చూడడానికి నన్ను పంపించారు. గొప్ప నైపుణ్యంగల వాడివికదా అందువల్ల నీ ఆలోచనలు తెలుసుకోవడానికి నన్ను పంపించారు. వాములంత ఉన్న నీలో వలపులను రేకెత్తించడానికి పంపారు. నన్ను మోహించి ఎందుకీవిధంగా కౌగలించుకొంటావు?

నీవెందుకు ఇక్కడకు వచ్చావో తెలుసు కాబట్టి ఎదురుగా నన్ను పంపారు. నీ జాడలు నేర్పరితనాలు అన్నీ కనుక్కొని రమ్మని నన్ను పంపారు. అలభ్యమైన వాటికన్నింటికీ ఎలా అర్రులు చాస్తావో రుచులు కోరుకుంటావో గమనించడానికే నన్ను పంపారు సుమా! ఇప్పుడు నాతో అనవసరంగా పరిహాసాలాడుతూ నవ్వడమెందుకయ్యా?

నీ వద్దకు చేరి పలకరించమని నీ సంగతేమో తెలుసుకొని రమ్మని చెలి పరాక్రమించి నన్ను యిచ్చుటకు పంపింది. ఈ విధముగా శ్రీవేంకటేశ్వరా నన్ను కలసి ఆమెను కూడా మంచి ప్రేమ పూర్వకంగా కూడితివి కనుక ఇంక క్రొత్తా పాతా ఏమున్నది సర్వం విదితమైనదే కదా!

## 417

**అవతారిక:** స్వామి అమ్మవారికి ఎంత సమీపములో నున్నా ఇంకా ఏవో శంకలతో అనుమానిస్తున్నదని విచారం వ్యక్తం చేస్తూ స్వామి వారు అమ్మతో పలికే పలుకులు.

### భైరవి

ప. ఎంత నమ్మనిదానవు యేమే నీవు
చింతతోఁ బగచాటేవు చెల్లఁబో నీవు ॥పల్లవి॥

1. జమళిమోహాలు మనసరుసనే వుండఁగాను
తమకించి మాటలాడఁ దగవా నీవు
చెమటకాఁగిలి మనచేతులలో నుండఁగాను
అమరనివెంగెమాడే వౌనే నీవు ॥ఎంత॥

2. నూఁటినమోవులు మననోళ్ళలో నుండఁగాను
యేఁటిఁకిఁ గొసరఁ జొచ్చే వేమే నీవు
కూటములు చెక్కులపై గుఱుతులై వుండఁగాను
పాటించి యేడవోయంటా భ్రమసేవే నీవు ॥ఎంత॥

3. బచ్చనరతులు మనపానుపుపై నుండఁగాను
ఇచ్చగించి మఱచేవు యేమే నీవు
పచ్చిగా శ్రీ వేంకటాద్రినతి నేఁగూడితి నిన్ను
మెచ్చితి మొకరొకరి మేలే నీవు ॥ఎంత॥

**అర్థములు:** ప. నమ్మనిదానవు = నమ్మకము లేని దానివి, చింత = విచారము, పగ = శతృత్వము, చెల్లబో = ఆక్షేపణీయ ప్రయోగం.

1. జమళి = జంట, సరుస = ప్రక్కన, తమకించు = మోహించు,త్వరపడు, చెమటకాగిలి = చెమతోనిండిన శరీరముతో కౌగిలి, అమరని వెంగెము = సరిపోలని పరిహాసము.
2. నూటు = గ్రుచ్చు, కొసరు = కోరుకొను, కూటములు = కలయికలు, చెక్కులు = చెక్కిళ్ళు, గురుతులు = గుర్తులు, పాటించు = ఆచరించు, ఏడవో = ఎక్కడివో, భ్రమయు = భ్రాంతి.
3. బచ్చన = పైపైమెరుగులు, ఇచ్చగించు = ఇష్టపడు, పచ్చి = మరగులేని, మెచ్చు = పొగడు, ఒకరొకరి = ఒకరినిమరొకరు.

**భావము:** నాపై ఇంత నమ్మకము లేనిదానవైనావేమే నీవు. విచారముతో నాపై పగబూనియున్నావు. ఇది సరియైన విధానమేనా?

జంట ముఖములై మనము ప్రక్క ప్రక్కనే ఉండగా, ఇలా మోహముతో త్వరపడి మాట్లాడడం తగునా! చెమటతో కూడిన దేహముల కౌగిళ్ళు మనకు లభిస్తుండగా సరిపోని పరిహాసాలాడడం ఎందుకు?

గ్రుచ్చుకొనున్నట్లు దగ్గరగా యున్న మన ముఖములు మన నోళ్ళకు దగ్గరై యుండగా ఇంకా ఏమిటో కోరికలు అడుగుతూ ఉంటావు. మనకలయికలకు మన చెక్కిళ్ళపై గుర్తులుగా కనిపిస్తూనే యుండగా, ఇంకా ఎక్కడివో ఏమిటో కావాలని భ్రాంతి పడడమెందుకు?

పైపై రతులు మన పట్టుపానుపుపై యుండగా, ఇష్టపడి మరీ ఆ సంగతులన్నీ మరచేవు ఎందుకే నీవు? మరుగులేని విధంగా నీ శ్రీవేంకటాద్రి పతినైన నేను నిన్ను కూడితిని. ఒకరినొకరు ప్రశంసించుకొన్నాము కదా ఇంక అన్నీ శుభములే లే!

## 418

**అవతారిక:** చెంచులక్ష్మి, నరహరియైన విష్ణుమూర్తికి మధ్యన జరిగిన సరస సరదా సంవాదము

### పాడి

ప. ఊరకుండేవో లేదో వోసి చెంచెతా ? వోరి
కోరి నిన్ను నెంచుకొంటి గొల్లఁడవు గదరా ॥పల్లవి॥

1. జమళిపీకిలిదండ సరి నీకేలే
నెమలిచుంగులపాగా నీకేలేరా
అమరెనే సంకుఁగడె ముందుకుఁ దోడు
భ్రమసి నీవేల గుల్ల పట్టుకున్నాఁడవురా ॥ఊర॥

2. పలుమెకాలవెంటను పారేవేలే! నీవు
యెలమిఁ బులుగునేల యెక్కితివిరా
పలచని పారెటాకు పయ్యదేఁటికే
అల మట్టేకుపానుపు అది నీకు నేలరా ॥ఊర॥

3. కాకిపైఁడిబొట్టు నీకుఁ గడుప్రియమా
ఆకుఁ దొలసిదండ నీకది బాఁతొ
కైకొంటి శ్రీ వేంకటాద్రిఘనుఁడ నిన్ను-
నేకమైతిఁ గదరా నీయిందిరాదేవిని ॥ఊర॥

**అర్థములు:** ప. ఊరకుండు = మాట్లాడకయుండు, చెంచెత = శబర కాంత, గొల్లడవు = గొల్లవాడివి.

1. జమళి = జంట, పీకిలిదండ = పికిలిపిట్ట విశేషమైన మాల, చుంగులు = చెంగులు, పాగా = తలగుడ్డ, అమరు = సరిపోవు, సంకుగడగడె = శంఖువుతో నున్న గొలుసు, గుల్ల = బోలుగానున్న శంఖము.
2. పలు = రకరకాల, పారేవు = పరిగెత్తేవు, ఎలమి = వికాసము, పులుగు = పక్షి, పారెటాకు = వస్త్రంలా కట్టుకునే ఆకు,

పయ్యెద = పైట, మత్తేకు పానుపు = మఱ్ఱియాకు పానుపు.

3. కాకిపైడిబొట్టు = పీతాభ్రకంతో పెట్టుకున్న బొట్టు, తొలసిదండ = తులసిదండ, కైకొంటి = చేపట్టితి, ఏకమైతి = ఇద్దరూ ఒకటై కలసిపోవు, ఇందిరాదేవి = లక్ష్మీదేవి.

**భావము:** ప.నరహరి: ఒసే! కాస్తా ఊరకుంటావా లేదా శబరకాంతా!

చెంచులక్ష్మి: గొల్లవాడవు కదా! కోరి కోరి నిన్ను ఎంచుకున్నానురా!

1.నర: ఆ జంటగా ఉన్న పికిలిపిట్టల దండ నీకెందుకే చెంచెతా!

చెంచు: ఆ నెమలి అంచు ఉన్న ఆ తలపాగా నీకెందుకురా?

నర: నీకు ఆ శంఖువులున్న గొలుసు చక్కగా సరిపోయినదిలే

చెంచు: భ్రాంతితో నీవే ఆ శంఖువు చేతిలో ధరించావుగదా!

2.నర: అలా అన్ని రకాల జంతువుల వెంట పరుగులెందుకు తీస్తావే నీవు?

చెంచు: వికాసముతో నీవు నీలముగా ఉన్న గరుడపక్షిని ఎందుకు ఎక్కావో చెప్పు?

నర: అంత పలుచని ఆకును పయ్యెదగా కప్పుకున్నావెందుకే?

చెంచు : నువ్వు అలనాడు మఱ్ఱాకును పానుపు చేసుకోలేదా చెప్పు?

3.చెంచు: పీతాభ్రకంతో పెట్టుకున్న ఆ బొట్టు నీకు అంత ఇష్టమా?

నర: తులసి ఆకుల దండ నీకు అంత ప్రీతికరమా?

చెంచు: ఓ శ్రీవేంకటేశ్వరా! గొప్పవాడవైన నిన్ను ఈవిధముగా వేంకటాద్రిపై చేపట్టితిని, నీతో కలిసి ఒకటైతిని కదరా నేను మరెవరో కాదు నీ లక్ష్మీదేవినే సుమా!

**విశేషము:** అహోబిల తెగకు చెందిన శిఖనాయకుడు తనకొక కుమార్తెను ప్రసాదించమని విష్ణుమూర్తిని ప్రార్థించాడు. అలా వరమిచ్చిన విష్ణువు ఆమెను తానే పెండ్లాడుతానని చెప్పాడు. అలా కొండజాతి నాయకునికి పుట్టిన బిడ్డ "చెంచులక్ష్మి". సాహసవతిగా పెరిగి పెద్దయ్యింది. విష్ణుమూర్తి నరహరి రూపంలో భూలోకానికి వచ్చి ఆ లక్ష్మితో ప్రేమలో పడ్డాడు. నరహరి అసలు రూపం తెలియని శిఖనాయకుడు అనేక పరీక్షలు పెట్టి ఆపై తన కుమార్తెను నరహరికిచ్చి పెళ్ళి చేశాడు. చెంచులక్ష్మికి నరహరికి జరిగిన సరస శృంగార సంభాషణ అన్నమయ్య మనకు వినిపించాడు.

## 419

**అవతారిక:** స్వామి అక్కడా ఇక్కడా విహరించినప్పటికి అమ్మ వద్దకు వచ్చి చేరినందుకు, చెలులతో అమ్మ సంతోషం వ్యక్తం చేస్తున్నది.

### నాగవరాళి

ప. ఆడా నీడా నదివో రమణుఁడు
వేడుకలు రేఁచీ వింటి నేననవే ॥పల్లవి॥

1. కానీకానీ కసుగాటుమాఁటలు
నానఁబెట్టీని నాతోను
రానీపోనీ రాజస మెఁ(మెం?) తైనా
మానఁడెంతయినా మఱవకుమనవే ॥ఆడా॥

2. మేలుమేలు మేనరికమే నాకుఁ
జాలాఁ గట్టెను సరసానకు
మూలమూలా ముసిముసినవ్వులు

చాలుకొనెనట సరిదాఁకెననవే ॥ఆడా॥

3. నవ్వి నవ్వి నను శ్రీ వేంకటపతి
జవ్వనము రేఁచి సరిఁగూడెను
దవ్వులటు మాని దగ్గరి నా వద్దఁ
బవ్వళించెను పదరకుమనవే ॥ఆడా॥

**అర్థములు:** ప. ఆడా నీడా = అక్కడా యిక్కడా, రమణుడు = సుందరుడు, వేడుక = వినోదము, రేచి = రేకెత్తించి, వింటి = విన్నాను.

1. కానీ కానీ = సరేలే కానీ, కసుగాటు = కఠినమైన, నానబెట్టు = ఆలశ్యముచేయు, రానీ పోనీ = రానిమ్ము పోనిమ్ము,రాజసము = రాజసంబంధమైన గర్వము, మానడు = విడిచిపెట్టడు, మరవకు = మరచిపోవద్దు.
2. మేలు = శుభము, మేనరికము = తోడ బుట్టినదానియొక్కయు తండ్రితోడ బుట్టినదానియొక్కయు తల్లితోడఁ బుట్టినదానియొక్కయు దేహసంబంధభావము, మూలా మూలా = లోతుగా, చాలుకొను = నెలకొను,శ్రేణికట్టు, సరిదాకు = సమానముగా నగు.
3. జవ్వనను = యౌవనము, రేచి = రేకెత్తి, దవ్వు = దూరము, పవ్వళించు = పరుండు, పదరు = త్వరపడు.

**భావము:** సుందరుడైన ఆ స్వామి అక్కడా ఇక్కడా యున్నాడు. మంచి వినోదములు విరబూచినవనే విషయాన్ని విన్నాను అనవే!

కానీ కానీవే అన్నీ కఠినమైన మాటలు ఆలసించి నాతో మాట్లాడుతున్నావు. స్వామి యొక్క రాజసత్వము ఎంతైనా సరే ఏమాత్రం విడిచిపెట్టడు కదా!

నాకు ఈ మేనరికమైన సంబంధమే శుభము. చాలా సరసపు మాటలతో నన్ను ఆకట్టుకొన్నాడు. మూలల మూలల ముసి ముసి చిరునవ్వులు చిందిస్తూ నాతో సరి సమానముగా యున్నాడనవే!

నవ్వులనేకము నవ్వి నవ్వీ ఆ శ్రీవేంకటేశ్వరుడు యౌవన బలంతో నన్ను రేకెత్తించి సరిగా జతయై కూడినాడు. దూరం విడచిపెట్టి దగ్గరగా చేరి నా వద్దనే పవళించి నిదురించాడు త్వరపడవే!

## 420

**అవతారిక:** శ్రీనివాసుని శ్రీవిట్ఠలేశ్వరునిగా భావిస్తూ, అమ్మ అలమేలుమంగమ్మతో చేస్తున్న చిలిపి పనులను వర్ణిస్తున్నాడు.

### లలిత

ప. వీడెపుఁ బెదవితోడి విట్ఠలేశుఁడు
వేడుకలే పచరించీ విట్ఠలేశుఁడు ॥పల్లవి॥

1. నిలుచున్నాఁ డలవాఁడు నిక్కి నామోము చూచి
వెలుపల సన్న సేసె విట్ఠలేశుఁడు
సెలవుల నవ్వి చెలితోడ మాటలాడి
వెలుగొందీ సొమ్ములతో విట్ఠలేశుఁడు ॥వీడెపు॥

2. కన్నులచే మెచ్చుమెచ్చి కందువకుఁజేయిచాఁచి
విన్నపము లడిగీని విట్ఠలేశుఁడు
తన్నుఁ దానె విఱ్ఱవీఁగీ తన మీఁద నానవెట్టీ
వెన్నతిన్ననోరితోడి విట్ఠలేశుడు ॥వీడెపు॥

3. బడిబడినే వచ్చి పై కొని నన్నుఁగూడి
విడువఁడు నాచెఱఁగు విట్ఠలేశుఁడు
కడుఁగడుఁ దమకించీ కప్పురమే చేతికిచ్చి
వెడఁగు శ్రీ వేంకటాద్రి విట్ఠలేశుఁడు ॥వీడెపు॥

**అర్థములు:** ప. వీడెపు పెదవి = తాంబూలము వేసుకున్న నోటితోనున్న, వేడుక = సంతోషము, పచరించు = వ్యవహరించు.

1. అల = అక్కడ, నిక్కి = పైకి చూచి, సన్న = సైగ, సెలవుల నవ్వు = పెదవిమూల నవ్వు, వెలుగొందు = ప్రకాశించు.
2. కందువ = జాడ, విన్నపము = వినతి. విఱ్ఱవీగు = మిడిసిపడు, ఆన = ఒట్టు.
3. బడిబడి = వేగముగా, పైకొని = చేపట్టి, చెరగు = కొంగు, కడుగడు = మీదుమిక్కిలి, తమకించు = మోహముచెందు, వెడగు = అధికాసక్తి,అవివేకము.

**భావము:** చూశారా! ఆ విఠలేశ్వరుని వైభవము. తాంబూల చర్వణముతో ఎఱ్ఱగా పండిన పెదవులతో ఎంత సంతోషముతో వ్యవహరిస్తున్నాడో చూడండి.

అదుగో అక్కడ నిలబడి ఉన్నాడు. తలను బాగా ఎత్తి నా మొహం చూస్తూ బయట ఏవో సైగలు చేస్తున్నాడీ విఠలుడు. మధ్య మధ్యలో పెదవి మూలగా నవ్వుతూ చెలితో మాట్లాడుతూ అనేక ఆభరణాలను ధరించి ఎంత ప్రకాశముతో వెలిగిపోతున్నాడో ఆ విఠలేశుడు.

తను కన్నులతో తదేకంగా చూస్తూ జాడతెలుపుతూ చేతులు జాచి ఏవో వినతులడుగుతున్నాడు. తనకు దానే మిడిసిపడుతూ ఏవో ప్రమాణాలు చేస్తూ వెన్న తిన్న నోటితో నున్నాడు ఆ విట్ఠలేశుడు.

చాలా వేగంగా నడుస్తూ నన్నుచేరి పైనబడి చేపట్టి నా పైటకొంగు వదలడంలేదు ఆ విట్ఠలేశుడు. ఎక్కువైన మోహావేశంతో మంచి కర్పూరము చేతికిచ్చి అధికాసక్తి కనబరుస్తున్నాడీ శ్రీవేంకటాద్రిలో వెలసిన శ్రీవేంకటాద్రి విఠలేశుడు.

**విశేషము:** శ్రీ మహావిష్ణువు మరో పేరే పాండురంగ విఠలుడు. విఠలుడి మందిరాలు మన ప్రాంతంలో తక్కువైనా, మహారాష్ట్రలో ఈ స్వామి మందిరాలు, భక్తులు ఎక్కువ. వీటిలో ముఖ్యమైనది పండరీపురంలోని పాండురంగడి మందిరం. ఆ విఠలేశ్వరుడినే అన్నమయ్య శ్రీవేంకటాద్రి విట్ఠలేశుడు అంటున్నాడు.

## 421

**అవతారిక:** రత్యనంతర నాయికావర్ణనను అన్నమయ్య అద్భుతంగా వర్ణించాడు. చెలులకు అసలు విషయం చెప్పలేక చింతిస్తున్న నాయికా వర్ణన.

### వసంతవరాళి

ప. చెప్పితే నారచికత చెప్పకుండితే వెత
దప్పికి నీరే మందు తలపోయఁ గదరే ॥పల్లవి॥

1. చిగురులోపలిచేఁగ చెప్పరే మీరు
నిగురులోపలి నిప్పు నిలుపరాదె
పగలు చీఁకటి గమ్మి పాయ దెంతైనా
తెగరానిచోట తరితీపులమందేదే ॥చెప్పితే॥

2. ఆకాశపంచాంగము అందుకుఁ బేరేదే (?)
రాకపోకజగడము రాఁజీనదే
వాకునిష్ఠూరాలు వచ్చీ వసముగా దెంతయినా
యేకచిత్తమైన మందు యెన్నఁ డిచ్చేరే ॥చెప్పితే॥

3. వాన లేని చిత్తడికి వైపు లిఁకఁ జూచుకోరే
కానరాని గుఱుతులు కాఁడిపారెనే
ఆనుక శ్రీ వేంకటేశుఁ డంతలో విచ్చేసి కూడె
వీనుల వినేమందు వేధించె దేహము ॥చెప్పితే॥

**అర్థములు:** ప. రచికత = రసికత, వెత = బాధ, దప్పి = దాహము, తలపోయు = ఆలోచించు.

1. చిగురులోపలి చేగ = చిగురులో ఉన్నట్టి సారవంతమైన, నిగురు = నిప్పుపైనున్న భస్మము, పాయు = వీడు, తెగరాని చోట = ఎంతకు తీరని, తరితీపు = అపేక్ష.
2. ఆకాశపంచాంగము = అర్థంలేని వ్యవహారం, జగడము = తగవు, రాజీ = తగవులు మాని కలియుట, వాకునిష్ఠూరాలు = మాట్లాడే కఠినమైన మాట, వసము = వశము, ఏకచిత్తము = ఒకే మనసు, ఎన్నడు = ఎప్పుడు.
3. చిత్తడి = బురద, కాడిపారు = వ్యాపించు, ఆనుక = ఆతర్వాత, వీనులు = చెవులు, వేధించు = బాధపెట్టు, దేహము = శరీరము.

**భావము:** చెలులారా! చెప్పినట్లైతే నా రసికత బయటపడిపోతుంది. చెప్పకుండా ఉన్నట్లైతే బాధను కలిగిస్తుంది. ఏమి చెయ్యాలి. ఈ దాహానికి మీరే ఏదో ఒక మందు పోయండి.

చిగురులో దాగి చేవదీరి సారవంతమై యున్న విధముగా మీరు చెప్పండి. నివురుగప్పిన నిప్పును ఉంచ తగనిది కదా! పట్టపగలు చీకట్లు కమ్మి ఎంతకూ వీడకుండా ఉన్నది. ఎంతకూ తీరని తావుల్లో అపేక్షలకు మందు ఏది? ఎక్కడ దొరుకుతుందో చెప్పండి.

ఆకాశపంచాంగమువలె అర్థం పర్థంలేని వ్యవహారానికి ఒక పేరనేది ఉంటుందటే! రాక పోక మరియూ పోట్లాటలు రాజీలు ఇవన్నీ అవే కదా! మాట్లాడే కఠినమైన మాటలు మనకు చెప్పడానికి ఎంతైనా వశముకాదు కదా! ఇద్దరికీ ఒకే చిత్తముగా ఉండే విధంగా ఉన్నటువంటి మందు ఎప్పుడిస్తారో చెప్పండే!

వర్షములేకుండా వచ్చే బురద వంటి చిత్తడి వైపు ఒక సారి చూడండి చూడరాని గుర్తులు వ్యాపిస్తూ కనిపిస్తున్నవి కదా! ఆ తర్వాత శ్రీవెంకటేశ్వరుడు ఇంతలోనే విచ్చేసి నన్ను కలిశాడు. చెవులతో వినే మందు వేధించే దేహము పట్టరానిది సుమా!

**విశేషము:**

1. "లలనామణిరో! యీ భావము దెలుపరె లలితముగా నిప్పుడు" అని క్షేత్రయ్య చెప్పగా, అన్నమాచార్యులు ఈ కీర్తనలో "చెప్పితే నా రచికత చెప్పకుండితే వెత" అన్నాడు. ఇది రత్యనంతర నాయికావర్ణన. ఇద్దరు వాగ్గేయకారులు మనోహరంగా వర్ణించడం జరిగింది. అయితే క్షేత్రయ్య నాయిక కేళికా మందిరం వెడలినట్లు వర్ణిస్తే అన్నమాచార్యులు, నాయిక పవళించినట్లు చిత్రించాడు. అన్నమాచార్యుల పదమే క్షేత్రయ్యకు మూలమైనట్లు తోచుచున్నది.
2. శ్రీమాన్ గౌరిపెద్దివారు రచికత అనే పదాన్ని "చెప్పితే నా రచికత" అనే మాటను "ఆరచికత" అనే పదముగా భావించి రహస్యపు కతయా? అన్న సందేహాన్ని వెలిబుచ్చారు. రసికత అనుకున్నా లేక రహస్యపు కథ అనుకున్నప్పటికి మొత్తం మీద వచ్చే భావంలో పెద్ద మార్పున్నట్లు కనబడదు.

## 422

**అవతారిక:** స్వామి ఎంతో అమాయకంగా నటిస్తూ అలమేలుమంగమ్మతో చేసే సరస శృంగార సంభాషణ.

### ఆహిరి

ప. చేసేనా వినయములు చేకొంట గాక
ఆసలే కాఁక రేఁచితే అందుకేమి సేతమే ॥పల్లవి॥

1. చెక్కు నొక్కఁబోఁగాను చేతిగోరు దాఁకె నింతే
వెక్కసాన విదిలించి వేసేవేమే
పక్కన విందువెట్టి పలురుచులు సేయఁగా
నక్కడాఁ గరఁగదు అందుకేమి సేతమే ॥చేసేనా॥

2. సరసమాడఁబోఁగా చన్నులు బయటఁబడె

యిరవై యిందుకేల యీసడించేవే
గరిమ సొమ్ములు నీకుఁ గడుఁగడుఁ బెట్టఁగాను
అరగొరవైతయితే నందుకేమి సేతమే ॥చేసేనా॥

3. పొంది కొంగువట్టఁ బోఁగా పోఁకముడి వీడె నింతే
చిందువందై ఇందుకేల సిగ్గువడేవే
కందువ శ్రీ వేంకటాద్రి ఘనుఁడ నేఁ గలసితి
అందపుటాయాలు సోఁకె నందుకేమి సేతమే ॥చేసేనా॥

**అర్థములు:** ప. చేసేనా (చేసేనుంఅ) = చేస్తున్నటువంటి, వినయములు = వినమ్రత, చేకొంట = చేయడం, కాక = వేడిమి, రేచు = రేకెత్తించు, సేతమే = చేస్తామే!

1. చెక్కు = చెక్కిలి, నొక్కు = వత్తు, తాకె = సోకు, వెక్కసము = అధికము, విదిలించు = తొలగించుకొను, కరగదు = ద్రవింపదు.
2. సరసము = శృంగారము, చన్నులు = రొమ్ములు, ఇరవు = స్థానము, ఈసడించు = కోపముతో నిందించు, గరిమ = ఘనము, సొమ్ములు = నగలు, కడు కడు = ఎక్కువ, అరకొర = అసంపూర్ణము.
3. పొంది = కలిసి, పోకముడి = స్త్రీల కట్టుకోక ముడి, చిందువందు = చెదరిన, కందువ = జాడ, ఘనుడు = గొప్పవాడు, అందపుటాయలు = అందమైన శరీర అవయవములు.

**భావము:** రకరకాల వినయాలు చూపించడమే కాకుండా తాపాలు కూడా రేకెత్తిస్తుంటే అందుకేమి చేస్తాము చెప్పవే!

చెక్కిలి నొక్కడానికి యత్నించగా చేతిగోళ్ళు వత్తుకున్నాయి ఇంతే దానికే అంత అధికముగా విదిలించి తొలగించుకొని పోవడం చేస్తావెందుకే! అన్ని రకాల రుచులతో ఉన్న విందుభోజనాలు వడ్డించగా అక్కడ కూడా ఆమె హృదయం కరగడంలేదు అందుకేమి చేస్తామే!

సరసమాడడానికి యత్నిస్తుంటే రొమ్ములు బయటబడ్డాయి అందుకే ఇంత కోపముతో నన్ను నిందించడం తగునా? ఘనముగా అన్ని రకాల ఆభరణాలు నీకు అన్ని ఎక్కువగా పెడితే అవన్నీ అసంపూర్ణం అనిచెప్పి అన్నిరకాలు లేవంటూ గొడవ చేస్తే అందుకేమి చేస్తామే!

నిన్ను కలిసి కొంగుపట్టుకోవడానికి యత్నిస్తుంటే నీ చీర కట్టుముడి వూడింది అంతే కదా! దానికే ఇంతగా ఏదో జరిగిపోయినట్లు గొడవచేస్తావెందుకే! జాడ తెలిసి శ్రీవేంకటాద్రి ఘనుడైన నేను నిన్ను వచ్చి కలిసినాను. నీ అందమైన మర్మస్థానాలు తాకితే అందుకేమి చేస్తామే!

## 423

**అవతారిక:** కలహాంతరిత నాయికయైన అమ్మ మొదట కోపగించి తర్వాత స్వామివారిపట్ల తన ప్రవర్తన తప్పుని గ్రహించి, చెలుల దగ్గర ఆవేదన వ్యక్తం చేస్తున్నది.

## దేసాళం

ప. ఊరకే గడించుకోనీ నొకటొకటే తాను
రారమ్మని పిలువఁగ రానైతినా ॥పల్లవి॥

1. పట్టినచలముతోడఁ బదరవద్దంటిఁ గాక
యిట్టె మోవి యడిగితే నియ్యనంటినా
దిట్టతనానఁ బయ్యద తియ్యకుమనంటిఁ గాక
నట్టుకొట్టి తనతో నవ్వనంటినా ॥ఊరకే॥

2. పల్లదపుమాటలకుఁ బగచాటితిఁగాక
చెల్లఁబోఁతాఁ జెప్పినట్టు సేయనైతినా
వొల్లకొల్లకుండఁగానే వొడఁబడనైతిఁ గాక
తొల్లింటివలెనే అఇతే తుదకెక్కనా ॥ఊరకే॥

3. పయ్యదకొంగు దియ్యఁగా బలిమిచూపితిఁ గాక
వొయ్యనే రతులకు నోపనంటినా
యియ్యెడ శ్రీ వేంకటేశుఁడింతసేసి కూడెఁగాక
నెయ్యమున నపుడే నేఁ దనుఁ బిలువనా ॥ఊరకే॥

**అర్థములు:** ప. ఊరకే = అప్రయత్నముగా, గడించుకొను = లెక్కవేసుకొను.

1. చలము = వణకు, పదరు = కోపించు, దిట్టతనము = ధైర్యము, తియ్యకుమనంటి = తీయవద్దు అన్నాను, నట్టుకొట్టు = ఆలస్యముచేయు.
2. పల్లదపుమాటలు = గర్వముతో గూడిన మాటలు, పగ చాటు = కోపము వహించు, చెల్లబోవు = తగినట్లు, వొల్లకుండు = ఊరకుండు, ఒడబడు = వశమగు, తొల్లింటి = పూర్వపు, తుద = చివరకు.
3. బలిమి = బలము, ఒయ్యను = మెల్లని, ఓపు = ఓర్చు, ఇయ్యెడ = ఇక్కడ, నెయ్యము = స్నేహము, తను = తనను.

**భావము:** స్వామి అకారణంగా అన్నీ లెక్కవేసుకుంటూ ఉంటే ఉండనీవే, తాను రా రమ్మంటే రాకుండా ఉండగలనా లేక రానని అన్నానా చెప్పు?

ఏదో భయంకొద్దీ కోపించవద్దు అన్నాను కానీ, నా అధరామృతం అడిగితే కాదన్నానా? ఏదో భీతితో, ధైర్యంగా పైట తీయవద్దు అన్నంత మాత్రాన కాస్తా నిదానంగానైనా ఆతనితో నవ్వనని చెప్పానా?

తాను గర్వంగా మాట్లాడుతూ ఉంటే కొంచెం కోపపడ్డాను కానీ తాను చెప్పినట్లు చెల్లించుకోని తగినట్లు ఉండనని అన్నానా? ఆయన ఊరక వూరకుండా ఉంటేనే వశమైనదానిని కదా పూర్వంవలె ప్రవర్తించానా?

కొంగులాగి అల్లరి చేస్తూ ఉంటే కాస్తా నా బలిమితో అడ్డుకున్నాను కానీ, మెల్లని రతిక్రీడకు అంగీకరించనని చెప్పానా? ఈ ప్రదేశంలో శ్రీవేంకటేశ్వరుడు ఈ విధముగా ఇంతింతలు చేసి నన్ను కూడినాడు కదా! స్నేహపూర్వకంగా ప్రేమతో స్వామిని నేను పిలిచి ఆదరించి గౌరవించనా!

**విశేషము:** మూడవ చరణం చివరి పంక్తిలో "అఇతే" అనే ప్రయోగంలో 'యాడాగమమూ, సంధీ కలుగలేదు. ఈవిధమైన ప్రయోగము రాగిరేకులు లిఖించిన రాయసగాండ్ల తప్పిదమో లేక అప్పటి వ్యవహారికమో తెలియరావడంలేదు.

## 424

**అవతారిక:** స్వామి చేసే అల్లరి పనులను చెలులకు వివరిస్తోంది అమ్మ అలమేలుమంగమ్మ.

### సౌరాష్ట్రం

ప. తనజాడ లేలమాను తానే తాను
ననిచియున్నాఁడే నాకు నాటకీఁడే తాను ॥పల్లవి॥

1. రాతిరెల్లా వద్దనుండె రవ్వగా నవ్వుచునుండె
ఆతల నప్పుడే మాటలాడీనే తాను
చేతికిలోనాయనంటా సేస నాపైఁ బెట్టెనంటా
కాఁతరించి వుండఁగాను కాఁకచల్లీఁదాను ॥తనజాడ॥

2. కొప్పు కొనగోర దువ్వె కూరిమితో బుజ్జగించె-

అప్పుడే పరాకయ్యీ నదేమే తాను
కప్పుర మిచ్చినందుకు కాంతలు చెప్పినందుకు
నెప్పున నేఁ జెనకఁగ నిద్దిరించీఁ దాను ॥తనజాడ॥

3. కాఁగిట నిట్టె కూడె కడునలయుచు వాడె
మూఁగినమోహన నాకు మొక్కీనే తాను
కాఁగి భూపతిచెరువుకాడ శ్రీ వేంకటేశుఁడు
వీఁగకుండ రతి నిన్ను వెలయించెఁ దాను ॥తనజాడ॥

**అర్థములు:** ప. జాడ = విధము, మాను = విడుచు, అనిచి = అతిశయించు, నాటకీడు = వేషములు వేసేవాడు.

1. రవ్వ = అల్లరి, చేతికిలోనగు = చేతిలో చిక్కు, సేస = తలంబ్రాలు, కాతరించి = ఉత్సాహించు, కాక = తాపము,వేడి.
2. కొప్పు = సిగ, కూరిమి = స్నేహము, బుజ్జగించు = బ్రతిమాలు, పరాకు = తత్పరత, కప్పుర = కర్పూరము, నెప్పున = ఉపాయము, చెనకు = తాకు, నిద్దిరించి = నిద్రించు.
3. కాగిట = కౌగిట, కడు అలయు = ఎక్కువగా శ్రమించు, మూగిన = నెలకొన్న, మోహన = సుందరమైన, భూపతి చెరువు = కల్యాణ భూపతి నిర్మించిన చెరువు, వీగక = చలించక.

**భావము:** స్వామి తన పద్ధతులు, విధానాలు ఏవిధంగా మానగలడు. అతిశయించి వేషాలెన్నో వేసే వాడు.

రాత్రంతా ప్రక్కనే ఉండి అల్లరి అల్లరి చేస్తూ నవ్వులు నవ్వుతూ ఉంటాడు. ఆవలజేరి మాట్లాడుతూ ఉంటాడు. నా చేతిలో చిక్కి నాపై తలంబ్రాలు పోసి ఉత్సాహించి ఉండగా తాపాలను రేకెత్తిస్తూ ఉంటాడు.

నా సిగకొప్పు కొనగోటితో దువ్వి, స్నేహము చేసి బాగా బుజ్జగించి బ్రతిమాలాడి గొప్ప తత్పరతకు లోనుచేస్తాడు. కర్పూరమిచ్చినందుకు, చెలులు స్వామిని గురించి చెప్పినందులకు, నేను స్వామిని స్పృశించగానే హాయిగా నిద్రించినాడు.

నా కౌగిట్లో ఇట్టే కలిసి మిక్కిలి అలసటనందుచు, నెలకొన్న అందమైన ముఖారవిందముతో నాకు నమస్కరించాడు. ఈ విధముగా కల్యాణ భూపతి చెరువు దగ్గర శ్రీవేంకటేశ్వరుడు చలించక నన్ను రతిక్రీడలలో తేలించి ఆనందింపజేసినాడు.

**విశేషము:** తెలంగాణ రాష్ట్రం, నారాయణపేట జిల్లా, మద్దూరు మండలంలోని నాగిరెడ్డిపల్లి గ్రామంలో కల్యాణభూపతి బిరుదాంకితుడైన వెలమ నాయకుడైన అనపోతానాయకుడు భూపతి చెరువును నిర్మించాడు. బమ్మెర పోతన కూడా అదే కాలంలో జీవించాడు. ఇక్కడ శ్రీ స్వయంభూ లక్ష్మీ వెంకటేశ్వర స్వామి ఆలయం ఉన్నది. అన్నమయ్య ఈ కీర్తనలో ఆ భూపతి చెరువును గురించి ప్రస్తావించినట్లు తోస్తున్నది. ఈ పేరుగల గ్రామం ఆనాడు రాయలసీమ ప్రాంతంలో వుండివుండవచ్చు.

## 425

**అవతారిక:** అలమేలుమంగా శ్రీనివాసుల ప్రణయ శృంగార కార్యాలను అమ్మకు వినిపిస్తున్న చెలులు ఇవన్నీ నీకే చెల్లినవమ్మా అంటూ వినోదిస్తున్నారు.

### గుండక్రియ

ప. సిగ్గులు సింగారాలు చెల్లునే నీకు
నిగ్గులు నీడలు మాతో నెరపఁగఁ జెల్లునే ॥పల్లవి॥

1. వుక్కున నీరమణుఁడు వొత్తిన రేకలు దాఁచ
చెక్కుమీఁదాచేయి నీకు చెల్లునే నేఁడు
పెక్కుటధర పానవు పెదవి చొప్పులు మాప
ముక్కుమీఁది వేలు నేఁడు మోప నీకుఁ జెల్లునే ॥సిగ్గులు॥

2. పొంది నీమేనిమీఁది పులకలన్నియు దాఁచ

చెందినపయ్యెద కప్పు చెల్లునే నీకు
కందువ నీసమరతి కళలు మొరఁగుటకు
చిందేముసిముసినవ్వు చెల్లునే నీకు ॥సిగ్గులు॥

3. అంగపు కాఁగిటిలోఅలపు లన్నియు దాఁచ
సింగారపు తోఁట కేఁగఁజెల్లునే నీకు
రంగగు శ్రీ వేంకటాద్రిరాయఁడు నిన్నుఁగూడె
ముంగురులు జారినవి ముడువఁగఁజెల్లునే ॥సిగ్గులు॥

**అర్థములు:** ప. సింగారాలు = అలంకారాలు, చెల్లు = సరిపోవు, నిగ్గులు = వన్నెలు, నెరపు = నెరవేర్చు.

1. ఉక్కున = స్థైర్యము, రమణుడు = అందమైనవాడు, రేకలు = ఉత్తరములు, చెక్కు = చెక్కిలి, పెక్కు = ఎక్కువ, అధరపానము = అధరామృతము త్రావు, చొప్పులు = విధము, మాపు = పోగొట్టు, మోప = ఆనించుటకు.
2. పులకలు = గగుర్పాటు, చెందిన = చెదరిన, పయ్యెద = పైటకొంగు, కందువ = జాడ, సమరతి = ఉపరతికి వ్యతిరిక్తమైనది(రతిభేదము), కళ = శోభ, మొరగు = దాచు, చిందు = చిమ్ము.
3. అంగపు = శరీరపు, కాగిటి = కౌగిలి, అలపు = శ్రమ, రంగగు = కాంతి, ముంగురులు = నొసటిపై గునిసి యాడెడు ఉంగరపు వెండ్రుకలు, జారినవి = వేలాడుతున్నవి, ముడువగ = సరిజేసుకొన.

**భావము:** అమ్మా! సిగ్గుపడడమూ అలంకారాలు చేసుకోవడమే నీకే సరిపోయిందమ్మా! ఆ వన్నె చిన్నెలు మా మీద గూడా చూపించడం తగునా!

ధైర్య స్థైర్యాలతో నీ ప్రియుడు వ్రాసిన ప్రేమలేఖలన్నీ దాచడానికి చెక్కిలిపై చేయివేసుకొని ఉండడానికి నీకు సరిపోయిందమ్మా! అనేకమార్లు అధరామృతం త్రావిన పెదవుల సొగసులు దాచడానికి ముక్కుమీద వేలు ఆనించుకొని కూర్చోవడం నీకే చెల్లిందమ్మా!

నీ శరీరంపై దాగిన గగుర్పాటును కప్పిపుచ్చడానికి, చెదరిన నీ పయ్యెద కప్పు చూస్తేనే అర్థమౌతోంది. నీవు పొందిన రతిభేదపు కళలన్నీ దాచడానికి నీ మొహంపై చిందే ముసి ముసి నవ్వులే నీకు చెల్లుతాయమ్మా!

స్వామివారి కౌగిట్లో బంధింపబడిన తర్వాత కలిగిన శ్రమంతా నీవు ఆ అలంకారాల ఉద్యానవనానికి వెళ్ళడంతోనే సరిపోయిందమ్మా! కాంతివంతమైన శోభతో ఆ శ్రీవేంకటేశ్వరుడు నిన్ను కూడినాడన్న సంతోషముతో నీ పాలభాగాన అందంగా జారిన కేశములు కాస్తా ముడిస్తే సరిపోతుందమ్మా!

**విశేషము:** చరణాల చివర “చెల్లునే!” అనే ప్రయోగం శోభించినది.

## 426

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ చెలులతో స్వామి చేసే కార్యాలు కడు విచిత్రం సుమా అంటున్నది.

### ముఖారి

ప. కానీకానీ ఇప్పుడేల కడుఁ బంతాలు
తాను నేనుఁ గూడితేఁగా తలపోతలు ॥పల్లవి॥

1. చెక్కుచెక్కుఁ గదియించి చేయిఁజేయి బిగియించి
అక్కడగా నీతో నామాటలు
పుక్కిటితమ్ముల మిడి బుజాన గడ్డమానించి
చిక్కించుకొన్నపుడు గా సేసేచేఁతలు ॥కానీకానీ॥

2. పాదము పాదానఁదొక్కి పానుపు పైఁ బవ్వళించి
పాదుకొన్నప్పుడుగా నాబలిమెల్లాను

పోదిగాఁ జన్నులు మోపి పులకలు మేన రేఁచి
ఆదెస నింతేకా నెయ్యపు నవ్వులు ॥కానీకానీ॥

3. కాయముఁ గాయము మోపి కమ్మరనే మోవిఇచ్చి
యీయెడ నింతేకా నా ఇంపుసొంపులు
పాయపు శ్రీ వేంకటాద్రిపతి నన్ను నిదె కూడె
చాయల నీమీఁదఁగా నాసరసములు ॥కానీకానీ॥7

**అర్థములు:** ప. కానీ = కానిమ్ము, కడు = మిక్కిలి, పంతాలు = పట్టుదలలు,
తాను = స్వామి, కూడు = కలయు, తలపోత = ఆలోచన,విచారము.

1. చెక్కు = చెక్కిలి, గదియించి = బిగబట్టి, బిగియించి = బిగించి పట్టుకొని, పుక్కిటి = నోటి, తమ్ములమిడి = తాంబూలమువేసుకొని, చిక్కించుకొన్నప్పుడు = దొరకినప్పుడు, చేతలు = పనులు.'
2. పాదుకొను = నెలకొను, బలిమి = బలము, పోది = బాగా, పులకలు = గగుర్పాటు, మేన = శరీరముపై, రేచి = రేకెత్తు, ఆదెశ = ఆ దిక్కు, నెయ్యపు నవ్వులు = స్నేహముతో కూడిన నవ్వులు.
3. కాయము = శరీరము, మోపి = ఆనించి, క్రమ్మర = మరల, మోవి = మొహము, ఇంపుసొంపులు = మిక్కిలి శోభించు, పాయపు = యుక్త వయసు, చాయలు = కాంతి, సరసము = శృంగారచేష్ట.

**భావము:** కానిమ్ము...కానిమ్ము...ఇప్పుడు పంతాలు పట్టింపులకు పోవడమెందుకు? స్వామి నేను కలిసినప్పుడే కదా ఆ విషయాలన్నీ ఆలోచించవలసినది.

చెక్కిలి బిగించి, చేతిలో చేయి బిగించి, అక్కడేగా నీతో నా సంభాషణ. పుక్కిటిలో తాంబూలము బిగించి, భుజం మీద గద్దమానించుకొని, నన్ను చిక్కించుకుని స్వామిచేసే పనులెల్లా చిత్రంగా ఉంటాయి సుమా!

స్వామి పాదముతో నా పాదాన్ని తొక్కి పట్టుపానుపుపై పండుకొని, నెలకొన్నప్పుడేగా నా బలిమిని ప్రదర్శనము జరిగేది. నేను బాగా రొమ్ములను ఆనించి స్వామి శరీరంలో గగుర్పాటు కలిగించి, ఆ వంకగా స్నేహపు నవ్వులు నవ్వినప్పుడే కదా ఆనందం.

స్వామి శరీరానికి నా మేను ఆనించి మరల మరలా నా అందమైన ముఖారవిందాన్ని ఆనించి అధరామృతాన్ని అందించి, నా శోభలన్నీ ప్రదర్శించి నప్పుడే కదా! ఇదుగో వయసులో నున్న శ్రీవేంకటేశ్వరుడు నన్ను కలసినాడు. కాంతులు శోభలు మీరే విధంగా నా సరస శృంగార స్వామివారి మీదనే కదా ప్రదర్శించేది.

## 427

**అవతారిక:** ఎన్ని సార్లు చెప్పినా స్వామి అకార్యాలు మానడంలేదని కోపించిన అమ్మ అనేక సామెతలు ఉపయోగించి అన్యాపదేశంగా స్వామిని నిందిస్తున్నది.

### సామంతం

ప. చెయ్యి ముంచినవానికి చెప్పితే రోఁత
తియ్యని నోరఁ జేఁదు తెగి నంజేనా ॥పల్లవి॥

1. కూర వండి కస వేరఁగూడదు నాకు నయితే
యేరా నిన్నుఁ గూడి యింకా నెగ్గుపట్టేనా
నీరువంక తుంగవంటి నీమనసెందుండినాను
ఆరయఁగ నేనింక నడ్డపెట్టేనా ॥చెయ్యి॥

2. గోడఁబూసిన సున్నము కూడపెట్ట నేరనోప
ఆడుకోలు మాటదప్పెనని యెంచేనా

జీడివంటిగింజ వంటి చెంగియుండె నీగుణము
కోడెమారునికత్తికి గురిసేసేనా ॥చెయ్యి॥

3. వెన్నచేతఁబట్టి నేయి వెదక నేఁజాలఁగాక
నన్ను నీవు గూడుండఁగ నవ్వకుండేనా
ఇన్నిటాను శ్రీ వేంకటేశ నీకు నాకు నొక్క-
పన్నుగడ దైవ మిచ్చె పచ్చిసేసేనా ॥చెయ్యి॥

**అర్థములు:** ప. చేముంచు = అధీనము తప్పు, రోత = వెగటు, నంజు = అనిష్టముగా తిను.

1. కసవు = గడ్డిగాదము, ఎగ్గు = దోషము, తుంగ = జమ్మిగడ్డి, ఆరయ = విచారించు, అడ్డుపెట్టు = వలదని చెప్పు.
2. గోడబూసిన సున్నము = గోడకు పూసినట్టి సున్నము, ఆడుకోలు = మాట్లాడే మాటలు, తప్పు = అతిక్రమించు, చెంగు = దూకు, కోడె మారుడు = వయసులోనున్న వాడు, కత్తికిగురిచేయు = చంపుటకు యత్నించు.
3. జాల = చేయలేను, కూడి = కలసి, ఒక్క = ఒకటి, పన్నుగడ = ప్రణాలిక, పచ్చి శేయు = మరుగులేకుండా చేయు.

**భావము:** అధీనము తప్పిన వానికి ఎన్ని చెప్పినా వృధాగాను, వెగటుగాను ఉంటాయి కదా! తీయని పదార్థము తింటున్న నోటితో ఎవరైనా చేదు నంజుకుంటారా?

కూరవండి దానిలో గడ్డిగాదము ఉన్నాయా అని పరిశీలించడం తగిన పనేనా? నిన్ను కలసిన తర్వాత కూడా ఇంకా నీలో తప్పులు, దోషాలు వెదకడం సమంజసంగా ఉంటుందా? నీటిప్రవాహములో ఉండే తుంగ గడ్డివలె నీ మనసు ఎక్కడున్నా, నేను విచారించి అడ్డుపెట్టడం తగునా?

ఒకసారి గోడకు బూసిన సున్నము మళ్ళీ తీసి కూడబెట్టజాలను. ఆడుకున్న మాటలన్నీ తప్పి చరించే వారికి ఏమని జెప్పగలము. నీ గుణము జీడిపప్పు గింజ వంటి దూకుడు కలిగినది సుమా! మంచి యుక్తవయసులోనున్న కోడె దూడను కత్తికి బలిస్తామా?

వెన్న చేతిలో పట్టుకుని నేయి వెదకడం నాకు చేతగాని పని. నన్ను కలసి యున్నప్పుడు నవ్వమంటే నేను నవ్వకుండాఉ ంటానా? ఇన్నింటిలోను ఓ శ్రీవేంకటేశ్వరా! నీకూ నాకు దేవుడు ఒక్క ప్రణాలికను ఇచ్చి ఈ విధముగా మరుగులేకుండా చేశాడా?

**విశేషాంశాలు:** అన్నమయ్య ఈ కీర్తనలో అనేక పలుకుబళ్ళను/సామెతలను వాడి యున్నాడు. చెయ్యిముంచినవానికి, తియ్యని నోర చేదు తెగి నంజు, కూరవండి కసరు ఏరు, నీరువంక తుంగ, గోడకు బూసిన సున్నము, జీడిగింజవంటి గుణము, వెన్నచేతబట్టి నెయ్యి వెదకడం వంటి అనేకం మనకు ఈ కీర్తనలో కనిపిస్తాయి.

## 428

**అవతారిక:** స్వామి అలమేలుమంగమ్మ వద్దకు చేరి ఏవో కబుర్లతో కాలక్షేపము చేస్తున్నాడు తప్ప, పొందుకు సిద్ధపడడం లేదని వాపోతూ స్వామితో సంభాషణలాడుతున్నది.

### బౌళి

ప. అప్పుడు గాని కానరా దాయములుఁ బాయములు
రెప్పలెత్తి చూడఁగానే రేసు లింకా నేలరా ॥పల్లవి॥

1. వచ్చివచ్చి మామీఁద వలపే చల్లేవుగాని
చొచ్చి నారతిఁ జెనకి చూడలేలరా
మచ్చికల నాలోనిమనసే చూచేవుగాని
ముచ్చట నీతేనేగారేమోవి ఇయ్యవేలరా ॥అప్పుడు॥

2. మాటకు మునుపనే మందులు నూరేవుగాని

గాఁటపుగుబ్బలకు దగ్గరవేలరా
చీటికి మాటికి నాతో సిగ్గులే పడేవుగాని
నాటని సెలవులను నవ్వ వింక నేలరా ॥అప్పుడు॥

3. చల్లని కాఁగిటిలోన చవులే చెప్పేవుగాని
అల్లిబిల్లై తగుఁదగదన వేలరా
యెల్లగా శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నిట్టె
బల్లిదుడు నిమిషముఁ బాయ విఁక నేలరా ॥అప్పుడు॥

**అర్థములు:** ప. కానరా = చూడరా, దాయములు = పాచికలు గవ్వలు మొదలైన వానితో వేసే పందెము, ప్రాయములు = వయసులు, రెప్పలెత్తి = కన్నులెత్తి, రేసు = చులకన.

1. చల్లు = చిమ్ము,వ్యాపింపజేయు, చొచ్చి = చొరబడి, చెనకు = తాకు, మచ్చిక = అలవాటు, ముచ్చట = సంతోషము, తేనెగారే మోవి = అధరామృతపానానికై నీ ముఖము.
2. మునుపు = ముందు, మందులునూరు = పదనుబెట్టు, గాటపు = అధికము, గుబ్బలు = రొమ్ములు, దగ్గరగు = సమీపించు, చీటికి మాటికి = మాట మాటకు, సెలవులనవ్వు = పెదవి మూల నవ్వు.
3. కాగిటి = కౌగిటి, చవులు = రుచిపుట్టే మాటలు, అల్లిబిల్లి = ప్రియమైన, తగుదగదను = సమ్మతించు, ఎల్ల = సరిహద్దు, బల్లిదుడు = మిక్కిలిబలము గలవాఁడు, పాయు = వీడు.

**భావము:** ఆ సమయములో తప్ప మీకు వయసు చేసే అల్లరులు కనబడవా? కన్నులెత్తి చూడగానే అంత చులకన భావమా?

మమ్ము సమీపించి చక్కటి ప్రేమలను వ్యాపింపజేస్తావు. అలాగే చొరబడి స్వతంత్రంగా వ్యవహరించి నా రతిక్రీడల విషయమును గమనించిచూడవలెను కదా! అలవాటైన సహవాసంతో నాలోని మనసును చూస్తున్నావే గానీ సంతోషంతో నీ తేనెలూరే పెదవులను అందించి అధరామృతము గ్రోలే భాగ్యాన్ని ప్రసాదించవేమిరా!

మాటకు ముందే రోషముతో మందు నూరిన విధంగా మాటలు రువ్వుతావేకానీ, నా దట్టమైన రొమ్ములకు దగ్గరవవేమిరా! మాటి మాటికి నాతో కల్సి ఉన్నప్పుడు సిగ్గులు చిందిస్తావే కానీ, పెదవి మూల నవ్వులు నవ్వి దగ్గరవాలని ప్రయత్నించవేమిరా!

నా చల్లని కౌగిటిలో చేరి మంచి మంచి రుచిగల కబుర్లు చెప్తూ ఉంటావు కానీ, ప్రియమైనవాడవని ఋజువు చేసుకుంటూ సమ్మతించవేలరా! ఓ శ్రీవేంకటేశ్వరా! హద్దులెరిగి నన్ను ఈవిధముగా ఏలుకొన్నావు. ఓ ధృఢమైన కాయము గలవాడా! ఒక్క నిముషమైనా నన్ను వదలిపెట్టవేమిరా!

## 429

**అవతారిక:** స్వామి ఎవ్వతెనో మోహించి కలసినా అమ్మ అలమేలుమంగమ్మ ఏమాత్రం అసూయాద్వేషాలు చూపకుండా, ఆ శృంగార చేష్టలన్నీ తనతో చేసినట్లే భావిస్తానని స్వామికి విన్నవిస్తున్నది.

### సామంతం

ప. ఇంత నీకు వెఱపేల ఇద్దరిఁ గన్నులఁ గంటి
యెంతైనా నీ హితవే ఇటు నా హితవురా ॥పల్లవి॥

1. యెవ్వతెకు నీవు మోహించి వుండినాను
నివ్వటిల్ల నాకె నాకు నీమాదే
జవ్వనియెవ్వతెతోడ సారె నీవు నవ్వినాను
నవ్వుగాదు అది నీవు నాతో నవ్వుతరా ॥ఇంత॥

2. ఇద్దరు మీ రేకతాన నేమి మాటలాడుకొన్నా

ముద్దుల నవి నాతోడి ముచ్చటలురా
గద్దించి యెవ్వతె నిన్నుఁ గాగిలించుకొన్నాను
కొద్దిమీరినట్టివే నాకూటములురా ॥ఇంత॥

3. చెక్కునొక్కి యెవ్వతైనాఁ జేఁత నిన్నుఁజేసినాను
అక్కరతో నాచేఁత లవియెల్లారా
ఇక్కువతో శ్రీ వేంకటేశ నన్నుఁ గూడితివి
నిక్కముగ వారెల్లా నే నొకతెనేరా ॥ఇంత॥

**అర్థములు:** ప. వెరపు = భీతి, హితవు = మంచి.

1. మోహించి = ప్రేమించి, నివ్వటిల్లు = నెరవేరు, ఆకె = ఆమె, మాదే = మాదిరి, జవ్వని = యుక్తవయసు స్త్రీ, సారె = మాటికి, నవ్వుత = నవ్వుట.
2. ఏకతాన = అన్యచింతన లేకుండా, ముచ్చటలు = కబుర్లు, గద్దించి = అదరవేయు, కాగిలించు = కౌగలించు, కొద్దిమీరు = సమృద్ధము, కూటమి = కూడిక.
3. చెక్కునొక్కు = చెక్కిలినొత్తు, చేత = పని, అక్కర = అవసరము, అవి ఎల్లా = అవన్నీ, ఇక్కువ = జాడ, కూడు = కలియు, నిక్కము = నిజము, ఒకతెను = ఒక్కదానినే.

**భావము:** ఇంత భయము ఎందులకు స్వామీ! ఇద్దరినీ గమనిస్తూనే ఉన్నాను. ఏది ఏమైనా నీకు ఏది శుభము, మంచి అవుతుందో అవేనాకు ఇష్టమైనవని గ్రహించలేరా స్వామీ!

నీవు ఏ కాంతను ప్రేమించినా సరే అది నేరవేరినట్లైతే, ఆ కాంతను కూడా నాతో సమానంగా భావిస్తాను. యౌవన స్త్రీని ఎవ్వరినైనా నీవు మాటి మాటికి నవ్వినా సరే అది నాతో నవ్వినట్లే భావిస్తాను స్వామీ!

మీ ఇద్దరూ కలిసి అనన్య చిత్తముతో కబుర్లాడుకొన్నా, అవన్నీ నాతో చేసే ముద్దు ముచ్చట్లుగా భావిస్తాను. నిన్ను కొంచెం అదరగొట్టి ఏ కాంతైనా కౌగలించుకొన్నట్లైతే అది సమృద్ధిగా నాతో కలిసిన కూడికగానే భావిస్తాను.

ఎవ్వతైనా నీ చెక్కిలి నొక్కి నీతో సరసమాడినట్లైతే, అవి నాతో అవసరం కొద్దీ చేసినట్లు భావిస్తాను. జాడ తెలిసి నన్ను కూడిన ఓ శ్రీవేంకటేశ్వరా! నిజానికి నిన్ను ప్రేమించి మోహించినవారూ నేనూ ఒకటిగానే భావించు.

## 430

**అవతారిక:** అలమేలు మంగా శ్రీనివాసుల ప్రేమాతిశయ వర్ణన.

### శంకరాభరణం

ప. సరిమోహా లిద్దరికి సాటికిఁ బెనఁగఁ జొచ్చె
వరుసతో జవ్వనము వావెరుఁగునా ॥పల్లవి॥

1. పొంచి నీతో నవ్వఁబోతే పోఁకముడి నాకు జారీ
నించి యంతలోఁ జెమట నీకుఁ గారీని
పంచలఁ జెలులివి చూచి పకపక నవ్వేరు
చించుకొని వలపులు సెగ్గెరుఁగునా ॥సరి॥

2. మాట నీతో నాడఁబోతే మర్మములు గరఁగె నాకు
గాఁటమై నీకంతలోనే గరుపారెను

తేటతెల్లమాయనంటా తెఱవ లాడుకొనేరు
వాఁటమైన మనసిది వాసెఱుఁగునా ॥సరి॥

3. కాఁగిట నిన్నుఁ గూడఁగా కళదాఁకె నాకు నేఁడు
మూఁగిన పరవశాలు ముంచె నీకును
చేఁగదేరఁ గూడితిమి శ్రీ వేంకటేశ మనము
దాఁగరాని రతులివి తతెఱుఁగునా ॥సరి॥

**అర్థములు:** ప. సరిమోహాలు = ఇద్దరికి సరిపోయిన ప్రేమలు, సాటి = సమానము, పెనగు = చుట్టుకొను, వరుస = క్రమము, జవ్వనము = యౌవనము, వావి = బంధుత్వము.

1. పొంచి = దాగి, పోకముడు = చీరకట్టు, నించి = నుండి, కారీని = కారుచున్నది, పంచలు = బాధించు, చించుకొను = ఎక్కువగా చేయు, సెగ్గు = నింద.

2. మర్మములు = రహస్యాంగములు, గాటము = అధికము, గరుపారు = గగుర్పొడుపు, తేటతెల్లము = మిక్కిలి స్పష్టము, తెరవ = స్త్రీ, వాటము = అనుకూలము, వాసి = తారతమ్యాలు.

3. కాగిట = కౌగిట, కళదాకు = శోభించు, మూగిన = ముసురు, ముంచె = నిండె, చేగదేర = సారవంతమగు, దాగరాని = దాచలేని, తతి = సమయము.

**భావము:** ఇద్దరికీ సరిపోయి సమానమైన మోహావేశాలు కలిగి ఒకరికొకరు చుట్టుకుంటున్నారు. క్రమముగా ఉన్న ఈ ప్రేమలు వావి వరుసా బంధుత్వమనేవి గమనిస్తాయా?

దాగి యుండి నీతో నవ్వడానికి యత్నిస్తే నాకు చీరె కట్టుముడి వీడినది. అక్కడనుండి చూస్తే నీకు చెమటలు కారిపోవుచున్నవి. మనలను ఇబ్బందిపెట్టి ఆనందించే చెలులు ఈ దృశ్యాన్ని చూసి పక పకా నవ్వుకుంటున్నారు.

నీతో మాట్లాడడానికి ప్రయత్నిస్తూ ఉంటేనే నాకు మర్మాంగాలన్నీ ద్రవించిపోవుచున్నవి. అవన్నీ అనుకూలమై అంతలోనే నీకు గగుర్పాటు కలిగినది. ఇవన్నీ స్పష్టంగా చూస్తున్న చెలులంతా దీనిని గురించి మాట్లాడుకుంటున్నారు. అనుకూలమై అలవాటుపడ్డ మనసులు తారతమ్యాలు భేదాలు గమనిస్తాయా?

నీ కౌగిట్లో చేరగానే నాకు శోభలన్నీ అతిశయిస్తున్నవి. ముసిరిన పరవశత్వం మోహం నీకు నిండిపోయినది. ఓ శ్రీవేంకటేశ్వరా! సారవంతమై మనము ఈ తావున కలిసితిమి. ఈ రతిక్రీడా విశేషాలు దాచినా దాగనివై సమయాసమయాలను కూడా గ్రహించనివై యున్నాయి.

## 431

**అవతారిక:** స్వామి ప్రవర్తన గురించి అమ్మ అలమేలుమంగమ్మ ముచ్చటిస్తూ చెలులతో ఆయనకు బుద్దులు చెప్పండి అంటున్నది.

## సామంతం

ప. కైకొనఁగవచ్చుఁ గాని కడమవెట్టఁగ రాదు
దీకొని యిన్నియుఁ దానే తెలుసుకొమ్మనవే ॥పల్లవి॥

1. పొందుసేయఁగవచ్చుఁగాని పురివిచ్చి పాయరాదు
అందునుండే యెడమాట లాడుటేచాలు
అంది నవ్వవచ్చుఁ గాని ఆఁపరాదు తమకము
చందమామగుటుకలే చాలుఁజాలుననవే ॥కైకొన॥

2. కన్నులఁజూడఁగవచ్చు కాఁకలఁ బొరలరాదు
విన్నవినుకులలోనివేడుకే చాలు

మన్ననఁ బొందఁగవచ్చు మరితీలుపడరాదు
సన్నలచాయలనుంటే జాణతనమనవే ॥కైకొన॥

3. చిత్త మియ్యఁగవచ్చుఁగాని సిగ్గునఁబడఁగరాదు
పొత్తులవలపు తోడిభోగమే చాలు
యిత్తల శ్రీ వేంకటేశుఁడింతలోనె నన్నుఁ గూడె
కొత్తలాయ నిన్నియును గుఱుతాయననవే ॥కైకొన॥

**అర్థములు:** ప. కైకొను = పూనుకొను, కడమవెట్టు = కొరతబెట్టు, దీకొను = ఎదిరించు.

1 .పొందుసేయు = కలయు, పురివిచ్చు = వేరుపడు, పాయు = వీడు, ఎడమాట = సంధిమాటలు, తమకము = మోహము, చందమామగుటుకలు = దొరకనిదానికై ఆరాటపడు.

2. కాకలు = తాపము, పొరలు = అధికమగు, వినుకుల = శబ్దము, వేడుక = వినోదము, మన్నన = గౌరవము, తీలు = అణగిపోవు, సన్నలు = సైగలు, చాయలు = శోభలు, జాణతనము = నేర్పరితనము.

3. చిత్తము = మనసు, పొత్తులవలపు = సఖ్యతతో ఉన్న ప్రేమ, భోగము = భాగ్యము, ఇత్తల = ఇవతల, కొత్తలాయ = నూతనమగు, గురుతు = చిహ్నము.

**భావము:** స్త్రీని చేపట్టవచ్చును గానీ కొరతపెట్టరాదు. సిద్ధపడి అన్నివిషయాలు తననే తెలుసుకొనమనవే.

కలయవచ్చును గానీ వేరుపడి వీడునట్లు ప్రవర్తింపరాదు. వీలైతే సంధికి మార్గం ఆలోచించాలి. అందుకొని నవ్వవచ్చును కానీ మోహావేశాలు ఆపుకోగూడదు. దొరకని దానికి అర్రులు చాచడం ఇక ఆపమని చెప్పవే!

కన్నులతో దర్శించవచ్చును కానీ అధికమైన తాపముతో వర్తించకూడదు. విన్న శబ్దములోను వినోదమే చాలు. మర్యాద మన్ననలు పొందవచ్చును కానీ అణగి యుండరాదు. సైగలు శోభలు చూపించే శోభలే నేర్పరితనమని చెప్పవే!

మనసియ్యవచ్చును గానీ మరీ అంత సిగ్గులతో నుండరాదు. సఖ్యతతో కూడిన ప్రేమే సౌభాగ్యము కదా! ఈదరి శ్రీవేంకటేశ్వరుడు ఇంతలోనే నన్ను కూడినాడు. ఈ గుర్తులన్నీ వింతలుగాను నూతనముగానూ అనిపిస్తున్నయని చెప్పవే!

## 432

అవతారిక: ఒక వనిత శ్రీనివాసుని వెదుకుతూ వచ్చినదని ఒక నాయిక పరిహాసంగా స్వామికి విన్నవిస్తూ ఆమె ఎక్కడ ఉన్నదో వెదకి పట్టుకోమని పరిహాసాలాడుతున్నది.

### భైరవి

ప. నీవూఁ బోయి వెదకరా నిలుచుండనేల యీడ
తేవల నామాట గల్లైతే మఱి రారా ॥పల్లవి॥

1. చెప్పేరా నీకొకసుద్ది చెవులపండుగఁగాను
ఇప్పుడొకతె వెదకె నిందాఁకా నిన్ను
వొప్పగు దోమతెరలో నున్నదో కాక నీ-
చప్పరమాళిగెలోన సరి నొంటి నున్నదో ॥నీవూ॥

2. ఇచ్చెరా నీకొక మేలు ఇదివో వొకతె వచ్చి
గచ్చుల నీపేరఁ గమ్మ గట్టిపోయను
మెచ్చులనీమాణికాల మేడపై నెక్కున్నదో
ముచ్చటసింగారవనములోన నున్నదో ॥నీవూ॥

3. అంటెరా పాదములు ఆకె నీవురముమీఁద

సొంటులు సోదించ వచ్చి చొచ్చేనంటాను
నంటు సేసి యప్పటిని నన్నుఁ గూడితివి నేఁడు
దంటవు శ్రీ వేంకటేశ తా నిన్ను నేమన్నదో ॥నీవూ॥

**అర్థములు:** ప. వెదకు = గాలించు, తేవ = ఉత్సవము, కల్ల = అబద్ధము, రారా = రమ్ము.

1. సుద్ధి = మంచిమాట, చెవులపండుగ = వీనులవిందుగా, ఒప్పు = తగు,అందమైన, చప్పరమాళిగె = ఇంటిలో మూలనున్న చీకటి గది, సరినొంటి = ఒంటరిగా.
2. మేలు = శుభము, గచ్చులు = దుడుకుమాటలు, కమ్మగట్టు = పనికట్టుకొని ఒకరిని వెటకారముచేయుట, మెచ్చుల = గొప్పదైన, మాణికాలమేడ = నవరత్నాలంకృతమైన మేడ, ముచ్చట = ప్రేమ, సింగారవనము = శృంగార ఉద్యానవనము.
3. అంటు = తాకు, ఆకె = ఆమె, ఉరము = వక్షస్థలము, సొంటు = దోషము, సోదించు = వెదకు, చొచ్చు = ప్రవేశించు, అంటు = స్పృశించి, అప్పటిని = ఆ సమయంలో, దంట = నేర్పరి.

**భావము:** ఓ స్వామీ! నువ్వుకూడా వెళ్ళి గాలించు! ఇక్కడ నిలబడడమెందులకు? నేను నమ్మకంగా చెప్పే ఈ మాట అబద్ధమైతే మరి తిరిగి రండి స్వామీ!

నీకో మంచి మాట వీనుల విందుగా చెప్తాను విను. ఇప్పుడు ఒకతె నిన్ను వెదుకుతూ ఇక్కడకు వచ్చింది. అందమైన దోమతెరలో ఉన్నదో లేక నీఇంటిలో మూలనున్న చీకటి గదిలో ఒంటరిగా నీకోసం నిరీక్షిస్తున్నదో చూడండి స్వామీ!

ఒక వనిత ఇక్కడకు చేరి నీకు ఒక శుభవార్తను తెచ్చింది. దుడుకు మాటలతో పనికట్టుకొని వెటకారముచేస్తూ తిరుగుతూ ఉన్నది. గొప్పదైన నీ నవరత్నాలంకృతమైన మేడపైన ఉన్నదో లేక నీ శృంగార ఉద్యానవనములో విహరిస్తున్నదో ఒక్కసారి వెళ్ళి చూడండి స్వామీ!

ఆమె పాదములు నీ వక్షస్థలముపై తాకి యున్నవి. ఏవో దోషాలు చెప్పుకుంటూ వచ్చి అక్కడ తిష్ట వేసింది. అయినా నన్ను తాకుతూ వచ్చి కలిసావు. ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు గొప్ప నేర్పరివి సుమా! ఆమె నిన్ను ఏమన్నదో ఏమో తెలియదు.

## 433

**అవతారిక:** నాయికా నాయకుల సరసశృంగార సంభాషణ.

### పాడి

ప. ఒకటొకటికి మాట వొనగూడెనే
వొకటి కినుమడౌరా వుప్పొలికితేను ॥పల్లవి॥

1. మఱచితినే మేను మంచినీమాటలకే
మఱవక బోయపగా మముబోఁటికి
కరఁగెనే నామనసు కాయము నిన్నుసోఁకితే
కరఁగఁ గరఁగ వన్నె కనకమౌఁ గదరా ॥ఒకటొకటికి॥

2. విడువఁజమ్మీ నీవేడుకపొందు
విడువ ముడువ నేమి విసమా ఇది
కడిగినట్టు చెమట గారె నామేను
కడుగఁగడుగ రొంపి కడచోట నీకు ॥ఒకటొకటికి॥

3. చిగిరించెఁ బులకలు చెక్కుల నాకు
చిగురుఁగొమ్ము చేఁగె చెప్పితే నిన్ను
తగిలితి శ్రీ వేంకటోత్తముఁడ నిన్ను

తగులువిరికూటములు తార్కాణ నాకు ॥ఒకటొకటికి॥

**అర్థములు:** ప. ఒకటొకటి = ఒకదాని వెంబడి వొకటి, ఒనగూడు = సమకూరు, ఇనుమడి = అధికము, ఉప్పొలుకు = ఉప్పొంగు,విజృంభించు.

1. మేను = శరీరము, పోయ = వెళ్ళెను, మముబోటికి = మాలాంటి వారికి, కరగెను = ద్రవించెను, కాయము = శరీరము, సోకు = తాకు.
2. విడువజుమ్మీ = విడువజాలను, వేడుక = వినోదము, పొందు = కూడిక, ముడువ = ముడిపెట్టు, విసము = విషము, కడిగినచెట్టు చెమట = నీటితో కడిగిన చెట్టు, రొంపి = బురద, కడచోట = సమీప స్థానము.
3. చిగిరించె = పల్లవించు, పులకలు = గగుర్పు, చెక్కులు = చెక్కిళ్ళు, చిగురుకొమ్మ = చివుళ్ళు వచ్చిన కొమ్మ, చేగె = చేవ, తగిలితి = కలుసుకొను, విరికూటములు = పూలసమూహపు కలయిక, తార్కాణ = ఋజువు.

నాయికా నాయికల సంభాషణ:

ప. ఆమె: ఒకదాని వెంబడి ఒక మాట సమకూరుతుందిగదా! విజృంభించినట్లైతే ఒకటికంటే ఎక్కువగా అధికమౌను కదా!

1. అతడు: నీవు మాట్లాడే మంచి మంచి మాటలకే నేను నా మేను మరచిపోయాను సుమా! మమ్మలనెప్పుడూ మరచిపోకుండా మాలాంటి వారిని గుర్తుపెట్టుకో!

ఆమె: నా శరీరం నిన్ను స్పృశించితే నామనసంతా ద్రవించిపోతున్నది. ఇలా కరగగా కరగగా నా శోభలన్నీ బంగారమవుతాయేమో సుమా!

2. అతడు: నీ పొందు బహుపసందైనది నేను నిన్ను ఏవిధముగా విడువగలను? విడవడానికి యిదేమైనా విషమా చెప్పు?

ఆమె: చెట్టును కడిగినట్లుగా చెమటలు నా మేనిపై కారిపోవుచున్నవి. ఇలా కదుగుతూ ఉంటే బురద నీకు సంప్రాప్తమవుతుందేమో సుమా!

3. అతడు: నిన్ను చూస్తుంటేనే నాకు చెక్కిళ్ళపై గగుర్పాటు కలుగుచున్నది. చివుళ్ళున్న కొమ్మ సారవంతమైనట్లున్నది.

ఆమె: ఓ శ్రీవేంకటేశ్వారా! నిన్నీవిధముగా కలుసుకొన్నాను. ఈవిధములైన కలయికలే నాకు ఋజువులు, సాక్ష్యాలు అయినవి.

**విశేషము:** ఈ కీర్తనంతా నాయికా నాయకుల మధ్య సంభాషణా పూర్వకముగా (వాకోవాక్యము) నడచినది. వారి సరస సంభాషణలను అద్భుతమైన ఉపమలతో అన్నమయ్య రచనచేశాడు.

## 434

**అవతారిక:** అలమేలుమంగమ్మ అన్యమనస్కంగా కోపంగా ఉన్నదని గ్రహించి, తనను పట్టించుకోవడంలేదని శ్రీనివాసుడు అమ్మతో చేసే సంభాషణ.

### శంకరాభరణం

ప. మించి యెప్పుడును నేము మీవారమే
కంచపుపొత్తు గలసి కసిగాటులేఁటికే ॥పల్లవి॥

1. చిక్కని వెన్నెలతేట చిందీ నెలవులను
చెక్కుమీఁది చేయేల చెలియ నీకు
మొక్కళపుఁ దమ్మిదలు మూఁగీఁ గన్నులతుద
ముక్కునఁ గోపములేలే ముట్టినంతలోననే ॥మించి॥

2. పూఁపలుఁ బిందెలు నట్టెపొడమెఁ బయ్యదలోన
కై పుసేసీ నీనడుమఁ గరసేఁటికే
పైపైఁ బదారువన్నెపసిఁడిపొడి రాలీని

కోపపుగుంపెనలేలే కొంగు వట్టితేను ॥మించి॥

3. నిలువు నూరుఁ బండీని నిచ్చలు నీసింగారాలు
తలకొన సిగ్గులలో దాఁగేవేలే
యెలమితో శ్రీ వేంకటేశుఁడ కూడితి నిన్ను-
నలివేణి మఱుపేలే ఆయ మంటితేను ॥మించి॥

**అర్థములు:** ప. మించు = అతిశయించు, నేము = మేము, కంచపుపొత్తు = కలసి భోజనము చేయు సహవాసము, కసిగాటు = అల్పమైనలక్షణములు.

1. తేట = ప్రసన్నత, చిందు = వ్యాపించు, నెలవు = స్థానము, చెక్కు = చెక్కిలి, మొక్కళము = ఉత్సాహము, తమ్మిద = తుమ్మెద, మూగి = వ్రాలు, తుద = చివరకు, ముక్కున కోపము = త్వరగా కోపగించుకొను, ముట్టు = తాకు.

2. పూపలు = పువ్వుల పిందెలు, పిందె = కాయముందు స్థితి, పొదము = పుట్టు, పయ్యెద = పైట, కైపు = మత్తు, నడుమ = మధ్యన, కరసు = దురుసు, పదారు వన్నెలు = పదహారు కళలు, పసిడిపొడి = బంగారపు రజను, గుంపెనలు = విజృంభణలు.

3. నిలువునూరు = నిండా వందలు వందలుగా, నిచ్చలు = ఎల్లప్పుడు, సింగారాలు = అలంకార విశేషాలు, తలకొన = యత్నించ, దాగు = లోపలనుండు, ఎలమి = వికాసము, అలివేణి = తుమ్మెదవంటి వెంట్రుకలుకలయింతి, ఆయము = జీవస్థానము, అంటు = తాకు.

**భావము**: మేము ఎల్లప్పుడూ అతిశయినట్టి నీ వారమే సుమా! కలసి భోజనము చేయు సహవాసముఉన్నప్పటికీ ఈ అల్పమైనలక్షణములు నీకేల?

స్వచ్ఛమైన వెన్నెలలు ప్రసన్నత నీ పెదవి మూల నవ్వులలో కానవచ్చుచున్నవి. నీకు చెక్కిలిపై చేయి ఎందుకు వేసుకొంటున్నావు. ఉత్సాహించిన తుమ్మెదలు వాలిన కన్నులవలె ఉన్నవి. ఇంకా తాకగానే నీకు ముక్కుమీద కోపమెందుకు తెచ్చుకుంటావు చెప్పు?

పూవులు పిందెలు అన్నీ నీ పైటచెంగులో పుడుతున్నాయి. మధ్యలో మత్తు కలిగించి ద్రవించవేల? పైన పైనగా పదాహారు కళల బంగారపు పొడి రాలుతున్నది. కొంగు పట్టుకుంటేనే అంత కోపంగా విజృంభించడమెందులకు?

నిట్టనిలువుగా వందలు వందలుగా నీ అలంకారాలు ఎల్లప్పుడూ కలుగుతూనే ఉన్నాయి కదా! ఇంకా సిగ్గులు మొగ్గలై నీ మోమును దాచుకోనేల? వికాసముతో శ్రీవేంకటేశ్వరుడుగా నేను నిన్ను కలసినపుడు తుమ్మెదవంటి వెంట్రుకలుకల ఓ అలమేలుమంగా, నీ మర్మస్థానాల నంటుకుంటే ఇంకా నీవు విస్మరించడమేల?

## 435

**అవతారిక:** స్వామి అన్యకాంతలతో విహరించడం గమనించిన అమ్మ, వారంతా ఉండగా మేమెందుకు నీకు పెరటిచెట్టు మందుకు పనికిరాదని సామెత చెబుతూ నిష్టూరాలాడుతూ ఉన్నది.

### లలిత

ప. పెళ్ళిచెట్టు మందుగాదు పెద్దకొండ లెక్కి తెచ్చే-
నెల్లిచెట్టు చవిగాక నేమేల నీకు ॥పల్లవి॥

1. చెచ్చెరఁ బోరువెట్టిన సితకమ్మ వుండఁగాను
నిచ్చలుఁబ్రియముచెప్పేనేమేల నీకు
చొచ్చి వలచివచ్చిన సుప్పనాతి వుండఁగాను
నెచ్చలినై పాయకుండేనేమేల నీకు ॥పెళ్ళిచెట్టు॥

2. పట్టితెచ్చినచెరలు పదారువే లుండఁగాను

నిట్టిపిడి మేనదాన నేనేల నీకు
గుట్టున వెలవెట్టనిగోపసతు లుండఁగాను
నెట్టన వుంకువగొన్న నేమేల నీకు ॥పెళ్ళిచెట్టు॥

3. బూతుమాటలకుఁ జిక్కి పురసతు లుండఁగాను
నీతితో బుద్ధులుచెప్పనేమేలు నీకు
యీతల శ్రీ వేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
నీతోఁ గాదనఁబోతే నేమేల నీకు ॥పెళ్ళిచెట్టు॥

**అర్థములు:** ప. పెళ్ళిచెట్టు = పెరటిలోనున్న చెట్టు, నెల్లిచెట్టు = ఉసిరిక చెట్టు, చవి = రుచి, మేలు = శుభము.
1.చెచ్చెర = తొందరగా, పోరు = కలహము, సితకమ్మ = తెల్లనిమేనికల ఇంపైన స్త్రీలు, నిచ్చలు = ఎల్లవేళల, చొచ్చి = ప్రవేశించు, సుప్పనాతి = ఓర్వలేనిది, నెచ్చెలి = స్నేహితురాలు, పాయకుండు = వీడకుండు.
2. చెరలు = చెలులు అయినుండనోపు, ఇట్టి = ఈవిధమైన, పిడిమేన = వితండవాదము, ఆడుజంతువు, వెలవట్టని = విలువకట్టలేని, గోపసతులు = గోపస్త్రీలు, నెట్టన = అనివార్యము, ఉంకువ = దృఢత్వము.
3.బూతుమాట = నలుగురిలో మాట్లాడకూడని మాట, పురసతులు = ఊరిలోని స్త్రీలు, నీతి = న్యాయము, బుద్ధి = మంచి, ఈతల = ఇవతల, కాదను = వలదను.

**భావము:** పెరడులో నాటి ఉన్న చెట్టు వైద్యానికి పనికిరాదు. కష్టపడి పెద్ద పెద్ద కొండలనెక్కి తెచ్చి యిచ్చే ఉసిరిక చెట్టు కాయలు నీకు రుచియౌగాక! మేమేల నీకు? మేము నీకు సరి గాము.

నీకు ఇష్టమైన తెల్లనితెల్లని శరీరంపై ఉన్న యింపైన స్త్రీలు నీ చెంత, తొందరపడుతూ ఉండగా ఎల్లప్పుడూ మంచి మాటలు చెప్పే మేమేల నీకు? బలవంతముగా లోనకు ప్రవేశించి వచ్చిన ఓర్వలేని స్త్రీలు నీ వద్ద నుండగా స్నేహాభిమానాలతో ప్రేమను పంచియిచ్చి నిన్ను సదా వీడకుండా మేమెందుకు మీకు?

నీవు పట్టి తెచ్చిన పదహారువేల భామలు నీ చెంత నుండగా ఉత్త పిడివాదనలు చేసే నాబోటి వారు మీకేల? రహస్యముగా విలువకట్టలేని గోపస్త్రీలు నీ చెంత ఉండగా అనివార్యమై ధృడత్వము చూపే మేము మీకెందులకు?

నీ బూతుమాటలతో ఆనందించే ఈ ఊరిలోని స్త్రీలు అనేకమంది ఉండగా నీకు మంచి చెడూ చెప్పే మాలాటి వారెందుకు? ఓ శ్రీవేంకటేశ్వరా! ఇవతల ఈవిధముగా నన్ను కలిసినావు. నీతో కాదు కూడదు అనబోయే మేమేల మీకు?

**విశేషము:** పెరడు అనే పదానికి దొడ్డి, పెడలు, పెళ్ళు, పిలగంటి ఇత్యాది పదాలు ఉండగా అన్నమయ్య పెళ్ళి అనడంలోని మర్మం బోధపడదు. పెళ్ళి అనే పదం వాడినా ప్రాస భంగం కాదు. అలాగే పట్టితెచ్చిన చెలులు అనకుండా చెరలు అనడం, పిడిమేని దాన అనడం ఆ కాలంలో వాడుకలో ఉన్న పదాలయి ఉండవచ్చుననిపిస్తున్నది. అలాగే శితకమ్మ లేక సితకమ్మ అనే పదం ఏ గ్రంధంలోనూ కానరాకున్నది. సిత అంటే తెల్లనైన అనీ, కమ్మ అంటే ఇంపైన అనే అర్ధంలో ఇంపైన తెల్లని మేని కలవారని అర్ధంలో వాడి ఉండవచ్చు. కొన్ని పదాలు రాగిరేకులపై లిఖించిన వ్రాయసగాండ్ర దోషములు కూడా ఉండి ఉండవచ్చుననిపిస్తున్నది.

## 436

**అవతారిక:** అలమేలుమంగమ్మ స్వామితో అన్యమనస్కంగాను, సిగ్గుతోను ఉన్నదని స్వామి ఆమెను ఇది తగునా అని అనునయిస్తున్నాడు.

### పళవంజరం

ప. ఏలే నిష్ఠూరము లింత యేమిగట్టుకొంటి విందు
గాలిఁబోయే వాసనలు గంటుగట్టె నందురా ॥పల్లవి॥

1. అన్నువ నీమోము చూపి అంతలోనే దాఁచేవేమే
పున్నమ చందురుఁడైనా పోడొకరాత్రి

తిన్నని గుబ్బలకు నాదిష్టి దాఁకెనంటాఁ గప్పి
యెన్నఁగ దిక్కులఁ గొండ కెండదాఁకీ నందురా ॥ఏలే॥

2. నవ్వునవ్వి కొంతగొంత నాతో దాఁచే విదియేమే
పువ్వువంటివెన్నెలైనాఁ బోదొకవేళ
జవ్వనముపైరు విత్తి చాఁచి చేయిదీసేవేమే
మువ్వానఁ బారిననీరు మగుడించే నందురా ॥ఏలే॥

3. కోరి నాతో వచ్చేనని కొంకి ఇట్టేబొంకితివి
ఆరునెల్లు గోయిల కూఁతైన నిజము
వేరులేక శ్రీవేంకటవిభుఁడ నేఁ గూడితిని
నారువోసి వలపులు నాటుకొనె నందురా ॥ఏలే॥

**అర్థములు:** ప. ఏలే = ఎందుకే, నిష్ఠూరము = నింద, ఏమిగట్టుకొంటివి = పొందితివి,సాధించితివి, గాలిబోయే వాసనలు = బయటగాలిలో ఉన్న అనేక దుర్వాయువులు, గంటు = గాయము.

1. అన్నువ = అల్పము, దాచు = కప్పిపుచ్చు, గుబ్బలు = రొమ్ములు, దిష్టి = దృష్టిదోషము, కప్పు = దాచు, ఎన్నగ = లెక్కించగ.
2. జవ్వనము = యౌవనము, విత్తి = నాటి, మువ్వాన = మొలలోతు, మగుడించు = మళ్ళించు.
3. కొంకు = భయపడి, బొంకు = అబద్ధము, ఆరునెల్లు = ఆరు మాసముల కాలము, వేరులేక = అన్యమార్గము లేక, నారుపోసి = నాటుటకు విత్తనములు ఒత్తుగా చల్లు, నాటుకొను = పాదుకొను.

**భావము:** ఓ అలమేలుమంగమ్మా! అన్నిటికీ ఈ నిందలు, నిష్ఠూరాలు ఎందుకు? దీనివల్ల నీవు సాధించేది ఏమున్నది? గాలిలో ఏవో చెడు వాసనలున్నంత మాత్రాన అవి శరీరాలకు గాయాన్ని చేస్తాయా?

కొంచెంగా నీ ముఖారవిందాన్ని చూపించి అంతలోనే దాచుకొంటావు. ఈ పున్నమినాటి చంద్రుడైనా మొహం దాయకుండా రాత్రంతా అలాగే ఉంటాడు కదా! నీ దట్టమైన రొమ్ములను చూసి దిష్టి తగులుతుందని కప్పిపెట్టుకుంటూ ఉంటావు. ఎక్కడైనా దిక్కులలో ఉన్న కొండలకు ఎండ తాకింది అనే మాట అనడం ఉంటుందా?

నాతో కొద్ది కొద్దిగా అరనవ్వులు నవ్వుతూ కొంత దాచుకుంటూ ఉంటావు యిదేమే! పువ్వు వంటి పండువెన్నెలైనా రాత్రంతా వీడిపోదు కదా! యౌవనము అనే పైరు నాటి చేయిజాచి మరలా వెనక్కు తీసుకోవడమెందుకు? మోకాళ్ళ లోతుగా పారుతున్న ప్రవాహాన్ని ఆపడం సాధ్యమవుతుందా?

కోరి నాతో వచ్చితివని భీతితో అబద్ధాలు చెప్పావు. ఆరుమాసాల పాటు కోయిల కూయడమైనా వాస్తవము. వేరే మార్గం లేక శ్రీవేంకటేశ్వరుడైన నేను నిన్ను కూడితిని. ఎవరైనా చేతులారా నారుపోసి మొక్కలు వచ్చాయని అంటారా?

## 437

**అవతారిక:** స్వాధీనపతికయైన అమ్మ అలమేలుమంగమ్మ చెలులతో స్వామివారిపై లేనిపోని చాడీలు చెప్పవద్దని, తమ అన్యోన్య దాంపత్యంలో తగదాలుండవని చెప్తున్నది.

### లలిత

ప. చేతికి లోనైన పతిఁ జేకొందుఁ గాక
ఆతలివారి మాటల కానవెట్ట నేలే ॥పల్లవి॥

1. అంది మాటాడకతొల్లె అవుఁగాములు చెల్లుఁగాక
అందముగాఁగూడి విడనాడఁగనేలే
పందెములాడకతొల్లే బలుములు చెల్లుఁగాక

నిందమోపి యాతనినే నేరమెంచనేలే ॥చేతికి॥

2. చేయిమోపకతొలుతే సిగ్గువడc జెల్లుcగాక
కాయము లంటినమీcదc గడమలేలే
రాయడి దవ్వులనుండే రాజసాలు చెల్లుcగాక
యీయెడ మోమోము చూచి యెడమాcటలేలే ॥చేతికి॥

3. కొత్తవలపుల కెల్ల గురుతులు చెల్లుcగాక
హత్తి ననుపైనమీcద నాసుద్దులేలే
యెత్తుక శ్రీ వేంకటేశుc డింతచేసి నిన్నుc గూడె
పొత్తుగూడినమీcదట బొరపొచ్చమేలే ॥చేతికి॥

**అర్థములు:** ప. చేతికి లొనగు = చెప్పినట్లు విను, చేకొను = చేపట్టు, ఆతలి = అవతలి, ఆన = ప్రమాణము.

1. అంది = అందిపుచ్చుకొని, తొల్లె = పూర్వము, అవుగాములు = అవును కాదను, చెల్లు = సరిపోవు, విడనాడు = విడిచిపెట్టు, బలుములు = బలిమి, నింద = దోషము, నేరమెంచు = తప్పు పట్టు.
2. చేయిమోపు = పైన చేయి వేయు, తొలుతే = ముందే, కాయము = శరీరము, కడమ = కొరత, రాయడు = శ్రీవేంకట రాయుడు, దవ్వు = దూరము, రాజసము = దర్పము, ఎడ = దిక్కు, మోమోము = మొహము మొహము దగ్గరగా, ఎడమాటలు = దూరం పెట్టుమాటలు.
3. కొత్తవలపు = నూతనముగా కలిసిన పిమ్మట కలిగే ప్రేమ, గురుతులు = గుర్తులు, హత్తి = కౌగలించి, ననుపు = అనురాగము, సుద్దులు = బుద్ధులు చెప్పు, ఎత్తుక = గ్రహించి, పొత్తు = కూడిక, కలయిక, పొరపొచ్చెము = కపట కల్మషము.

**భావము:** చెప్పినట్లు వినే భర్త దొరికినప్పుడు చేపట్టి యున్నాను గాక అవతలి వారు అనే మాటలను పట్టించుకోవడం, ఒట్లు పెట్టుకోవడం ఎందుకు?

నేను అందిపుచ్చుకుని మాట్లాడక పూర్వమే మాలో అవును కాదు అనే వాదనలేమీ ఉండవు. ఇంత శోభలతో స్వామివారిని కూడి నేను వారిని విడవగలనా? మేమేదైనా పందెములు పంతాలు పట్టింపులు చేసుకోక మునుపే మా బలిమి సమానమై సరిగా సరిపోతుంది. ఆతనిపై నిందలు, దోషాలు మోపి పట్టించుకోవడం తగునటే!

స్వామిపై చేయి వేయక మునుపే సిగ్గులు పడితే అది సరిపోవచ్చు కానీ, ఒకసారి ఒకరి శరీరము మరొకరితో పెనవేసుకున్నప్పుడు దూరాలు పెట్టడం చెల్లుతుందా? ఆ వేంకటాద్రి రాయుడి దర్పాలు మొదలైనవి దూరంగా ఉన్నప్పుడు చెల్లుతుందేమో కానీ, ఆయన ముఖము నా ముఖము కలిసి ఉన్నప్పుడు దూరంపెట్టే మాటలు చెల్లుతాయటే!

నూతనంగా కలిసినప్పుడు ఆ గుర్తులు, పద్ధతి వేరే విధంగా ఉండి చెల్లుతుందేమో కానీ, నన్ను హత్తుకొని క్రింద మీద పడుతున్నప్పుడు ఇంకా వారికి నేను బుద్ధులు చెప్పడం తగునటే! ఇదంతా గ్రహించిన శ్రీవేంకటేశ్వరుడు నన్ను అనుగ్రహించి దరి చేరినాడు. ఇంత అతిశయించి కలయికలు కలిగినమీదట ఇంకా కపటము కల్మషము ఎందులకే!

## 438

**అవతారిక:** శ్రీనివాసుడు స్త్రీలను కలుసుకొనే విధానాన్ని రమ్యంగా వర్ణిస్తున్నాడు అన్నమయ్య.

### కన్నడగౌళ

ప. ఇంకనేల మారుమాట లింతితోను
లంకె చేసుకొనె చెలి లావులకే పెనcగి ॥పల్లవి॥

1. మాటల తేనెలతీపు మరిగి నిన్నుc

గాటుక కన్నులఁ జూచీ కలికి
పాటించి నీనవ్వులకే భ్రమసి అట్టె
నాటించె గుబ్బల నిన్ను ననుపుతోఁగదిసి ॥ఇంకనేల॥

2. తత్తరాన నీమన్నన దలఁచి
హత్తి చేతులెత్తి మొక్కీ నతివ
వొత్తిన నీ కొనగోరి కులికి
గుత్తపు నీకొంగువట్టె కొంత గొంత కరఁగి ॥ఇంకనేల॥

3. తెల్లమి నీరతులెల్లాఁ దెలిసి
వుల్లము నీకొప్పగించె నువిద
కొల్లగా శ్రీవేంకటేశ కూడితివి యీకె
పల్లదాన నిన్నుఁగూడె బాసగొనెఁ గొసరి ॥ఇంకనేల॥

**అర్థములు:** ప. మారుమాట = వేరే మాట, ఇంతి = స్త్రీ, లంకె = కలయిక, పెనగి = చుట్టుకొను.

1. మరిగి = అలవాటుపడి, కలికి = స్త్రీ, భ్రమసి = భ్రాంతి, నాటించు = గ్రుచ్చు, గుబ్బలు = రొమ్ములు, ననుపు = అనురాగము, గదియు = దగ్గరకు వచ్చు.
2. తత్తరాన = సంభ్రమము, మన్నన = గౌరవము, హత్తి = హత్తుకొని, అతివ = స్త్రీ, వత్తిన = నొక్కిన, కొనగోరు = గోటి చివర, కులుకు = నర్తించు, గుత్తపు = బిగువైన.
3. తెల్లమి = స్పష్టముగా తెలియు, ఉల్లము = హృదయము, ఒప్పగించు = అప్పగించు, ఉవిద = స్త్రీ, కొల్లగా = దోపిడిగా, ఈకె = ఈమె, పల్లదము = పారుష్యము, బాసగొను = మాట యిచ్చు, కొసరు = కోరు.

**భావము:** ఇంకా ఈ స్త్రీతో వేరేమాటలు మాట్లాడడం ఎందులకు? ఈ చెలి బలిమితో కలిసి చుట్టుకొని యున్నది.

మాటలలోని మాధుర్యానికి అలవాటుపడి, నిన్ను ఈ స్త్రీ తన అందమైన కాటుక కన్నులతో చూచి, నీ సుందరమైన నవ్వులకే భ్రాంతిలో మునిగిపోయి అలాగే తన రొమ్ములను నీకు అనురాగముతో గ్రుచ్చుకొనునట్లు చేసి నిలబడినది.

సంభ్రమముతో నీపై మర్యాద మన్ననలను ప్రదర్శిస్తూ హత్తుకొని చేతులెత్తి నిలబడి నమస్కరించినది. స్వామి కొనగోరుతో చేసిన నఖక్షతములకు ఆనందముతో నర్తించగా, స్వామి బిగువైన నీ కొంగు పట్టుకొని కొంత కొంత ద్రవించి నీ హృదయము చూరగొన్నాడు.

స్వామీ! నీ రతిక్రీడా విశేషాలెల్లా తేటతెల్లమిగా తెలిసిపోయినవి. ఆ స్త్రీ తన తనువును హృదయాన్ని నీ కప్పగించి యున్నది. దోపిడీదారుని లాగా రహస్యంగా వచ్చి ఆమెను కలుసుకొన్నావు. ఈ స్త్రీ పారుష్యముతో నిన్ను చేరి కోరి కోరి ప్రమాణములు చేయించుకొన్నది.

## 439

**అవతారిక:** స్వామిని మదిలో తలుచుకుంటూ ఆనంద పరవశురాలవుతున్న అమ్మ అలమేలుమంగమ్మ అనుభూతులను వర్ణిస్తున్నాడు అన్నమయ్య.

## సామంతం

ప. తనకే సంతోసమైతే దప్పితో నేనుండరాదా
పొనిఁగి యెట్టుంటిమేమి పొమ్మనరాదా ॥పల్లవి॥

1. రాకుంటేఁ దా మానెఁగాక రతిరాజుయేట్లకు
చేకొని ములుగరాదా సిగ్గులో నేము

ఆకెకే మోహించుఁగాక ఆపసోపపుఁ దాపాన
చీకాకుపడి నాలోఁజిన్నఁబోరాదా ॥తనకే॥

2. పవ్వళించుఁగాక తాను పంచలనే కాచుకుండి
అవ్వల నాలో నుస్సురనఁగరాదా
దవ్వులైతే నాయఁగాక తలఁపులో తన్నుఁజూచి
పువ్వువంటి కోరికతో పొద్దుగడపరాదా ॥తనకే॥

3. పరాకైతే నాయుఁగాక పట్టి తనకాఁగిటిలో
సరాగానఁ గూరిములు చల్లఁగరాదా
విరాళిఁ గూడెను శ్రీవేంకటేశుఁడిటు నన్ను
సురాళమైనరతిఁజొక్కి వుండరాదా ॥తనకే॥

**అర్థములు:** ప. దప్పి = దాహార్తి, పొనిగి = కాంతిమాసి.

1. రతిరాజుయేట్లు = రతిచేసేవాని దెబ్బలు, చేకొని = చేపట్టి, ములుగు = మూలుగుట, నేము = మేము, ఆకె = ఆమె, మోహించు = వలచు, ఆపసోపములు = అల్పశ్రమకు కూడ పొడచూపు అలసట చిహ్నములు, తాపము = బాధ, చీకాకు = శ్రమవలన కలిగే అలసట బాధలు, చిన్నబోవు = ఉత్సాహములేకపోవు.
2. పంచ = చూరు, కాచుకుండి = వేచియుండి, అవ్వల = అవతలివైపు, ఉస్సురుస్సురు = తాపము దుఃఖము మున్నగువానియందు విడుచు నిశ్వాసముల ధ్వనికి అనుకరణము, దవ్వు = దూరము, తలపు = చింత, పొద్దుగడపు = కాలక్షేపము జేయు.
3. పరాకు = అన్యచిత్తము, కాగిటి = కౌగిలి, సరాగము = ఒద్దికతో గూడిన అనురాగము, కూరిమి = స్నేహము, చల్లు = వ్యాపింపజేయు, విరాళి = వలపు, సురాళము = ఆవేశము, రతిచొక్కు = రతిక్రీడలోని పారవశ్యము.

**భావము:** స్వామికి ఆనందం కలిగినట్లైతే ఆ దాహార్తితో నేనుండరాదా! కాంతివిహీనమై ఉన్నట్లైతే వెళ్ళమని చెప్పవచ్చును కదా!

ఆ స్వామి రాకపోతే రాకపోవచ్చును గాక. రతిరాజైన ఆ స్వామి చేసే రతి ఘాతములకు చేపట్టి సిగ్గుతో మూలుగవచ్చును కదా! ఆమెనే వలచి ఉండవచ్చును కానీ, ఆ అలసటలకు కలిగే తాపముతో కలిగే బాధతో ఉత్సాహములేకుండా నా వద్దనే ఉండిపోవచ్చు గదా!

ఆ స్వామి పవళించితే పవళించవచ్చు గాక, చూరు క్రిందనే దాగి యుండి ఆ తరువాత నాలో రేగే తాప నిశ్వాసములకు తాను ప్రత్యుత్తరములిచ్చి ఉండవచ్చు కదా! దూరమైతే కావచ్చు కానీ, మనసులో తలచుకొని తనను జూచి పువ్వు వంటి సుతి మెత్తనైన కోరికలతో కాలక్షేపము చేయవచ్చుకదా!

స్వామి పరాకుగా ఉన్నట్లైతే ఉండవచ్చు గాక! తన కౌగిటిలో చేరి ఒద్దికతోగూడిన అనురాగాలతో స్నేహన్ని చూపించవచ్చుగదా! వలపులు కూడగా శ్రీవేంకటేశ్వరుడీవిధముగా నన్ను ఆవేశముతో గూడి రతిక్రీడలతో పరవశించి ఉండరాదా!

## 440

అవతారిక: స్వామి స్వభావం చిత్ర విచిత్రంగా ఉంటుందన్న విషయం అమ్మ చెలులకు అనేక దృష్టాంతలతో వివరిస్తున్నది.

## సామంతం

ప. మిక్కిలి పంతాలు నేఁడు మీతోనేలే
పక్కనఁ బైఁడమ్ములిడఁ బారవేయవలెనా ॥పల్లవి॥

1. ఆయలేరే యెడమాటలఁ (లం?)దరికిఁ జెప్పనోప
చేయిముం చాతనిఁ గంటేఁ జెప్పేలేరే
వేయకురే వొల నాపై వెన్నెలగలప్పుడే

ఆయెడ నల్లునేరేళ్ళనుట యెఱఁగరా ॥మిక్కిలి॥

2. వింటిలేరే మీమాట వీనులు చొరవు నాకు
అంటిముట్టి పతిఁ గంటే నడిగేఁబోరే
కంటకము లాడకురే గాలిగలయప్పుడే
తొంటిబాస వెళ్ళనాడి తూరుపెత్తే నిఁకను ॥మిక్కిలి॥

3. వచ్చీఁ బిలువకురే వడి నిట్టే విచ్చేసితేఁ
గొచ్చి శ్రీవేంకటపతిఁగూడే నేను
విచ్చనవిడినే యేళ్ళవెనకవే చాళ్ళవుత
తచ్చితచ్చి కాఁగిటిలోఁదారుకాణ లాయను ॥మిక్కిలి॥

**అర్థములు:** ప. పంతాలు = పట్టుదలలు, పైడమ్ము = బంగారు బాణములు, నఖక్షతములు, పారవేయు = వదలు.

1. ఆయలే = అనాదరముచూపు, ఎడమాట = దూరమునుంచు మాట, చెప్పనోప = చెప్పజాలను, చేయిముంచి = చేయిదాటిపోవు, గంటు = గాయము, వొల = వల, ఆయెడ = అవతలివైపు, నల్లునేరేళ్ళు = నల్లనైన నేరేడు.
2. వింటిలేరే = విన్ననులే, వీనులు = చెవులు, చొరవు = లోనకు వెళ్ళవు, అంటిముట్టి = సంబంధము లేనట్లు, అడిగే బోరే = ఎవరూ అడగరా, కంటకము = ముళ్ళు, తొంటిబాస = ఉత్తుత్తి ప్రమాణము, తూరుపెత్తు = గాలివాటముగా ఎత్తి విడుచు.
3. వడి = వేగము, విచ్చేయు = చేరు, కొచ్చి = గ్రుచ్చి, విచ్చనవిడి = విచ్చలవిడి,స్వేచ్ఛ, యేళ్ళవెనుక = వేళ్ళ తర్వాత, చాళ్ళు = గుంటక(ఒక సేద్యపరికరము), తచ్చు = తగ్గు, తారుకాణ = ఋజువు.

**భావము:** మీతో పంతాలు పట్టింపులు నాకెందుకే! ప్రక్కనచేరి నాపై స్వామి నఖక్షతములేయడం న్యాయమా చెప్పండి?

అనాదరము చూపి దూరంపెట్టే ఈ మాటలందరికి చెప్పజాలను, చేయిదాటిపోయే ఆతని పరిస్థితి గమనిస్తే మీరే న్యాయం చెప్పగలరు. మంచి పండువెన్నెల ఉన్నప్పుడే నాపై ఈ మోహపు వలలు ఎందుకు వేస్తారు? ఆవంక దూరంగా నల్లనేరేడు పండ్లు ఉన్నాయన్న రీతిగా చీకటి పెనగి యుండడం గమనించరా!

మీ మాటలన్నీ విన్నాను లేవే! అవన్నీ నా చెవుల దాకా సోకవు. ఏమీ సంబంధము లేనట్లుగా అంటీముట్టినట్టుగా ఉన్న స్వామిని గమనిస్తే మీకే విషయం తెలియదా! గాలిగా ఉన్నప్పుడే ముళ్ళతో ఆడిన రీతిగా, బాధలో ఉన్నప్పుడే ఇంకా ఏవో మాటలు గ్రుచ్చి గ్రుచ్చి బాధింపవద్దు. చేసే ప్రమాణాలన్నీ ఉత్తుత్తవి అని తెలిపోయాక ఇంక గాలివాటముగానే ఉంటాడు.

స్వామి విచ్చేసినప్పుడు శీఘ్రముగా హడావిడి పెట్టి పిలువవద్దు. పట్టి పట్టి చూసే ఆ శ్రీవెంకటేశ్వరుని నేను కూడినాను. స్వేచ్ఛగా విహరించే ఆ స్వామి వెనుకనే గుంటక పరికరములాగా మొత్తం లాగే స్వభావమున్నవాడు సుమా! నేను అప్పటికి తగ్గి తగ్గి ఉండి ఆయన కౌగిట్లో చేరినదే ఋజువు కదా మీకు.

## 441

**అవతారిక:** శ్రీనివాసుడు చెలులతో సరసాలాడుతున్న సమయంలో చేసే శృంగార చేష్టలన్నీ అమ్మవద్దనే చేసి ఆమెను సంతోషపెట్టమని కోరుతున్నారు.

### ఆహిరి

ప. శిరసుండ మోకాల శేస యేఁటికి
సరసము లాకెపైనే చల్లరాదా నీవు ॥పల్లవి॥

1. ఆకెతో మారుత్తరము లాడరాదా విచ్చేసి
పైకొని మమ్మేవొడఁబరచే వీడ
యీకడ మాకుఁ బ్రియము లేలచెప్పే వింతేసి

తూకొని మొక్కఁగరాదా తొయ్యలికే నీవు ॥శిరసుండ॥

2. అంగనతో వచ్చేనంటా నానవెట్టుక రారాదా
వుంగిటి మాతో వట్టివాట్లేఁటికి
సంగతి గాని మాతోడి జాణతనా లేమిటికి
కంగువాయఁ జెలితోనే కడునవ్వరాదా ॥శిరసుండ॥

3. వొక్కమారే ఆకెమీఁద నొరగుకొనఁగరాదా
వెక్కసాన మాపైఁ జేయివేయ నేఁటికి
ఇక్కువ శ్రీవేంకటేశ ఇంతి నేఁడు గూడితివి
పక్కన నెన్నఁడు నింకఁబాయకుండరాదా ॥శిరసుండ॥

**అర్థములు:** ప. శిరసు = తల, మోకాలు = తొడక్రింది భాగము, శే(సే)స = అక్షింతలు, ఆకె = ఆమె, చల్లు = వ్యాపింపజేయు.

1. ఆకె = ఆమె, మారుత్తరము = సంభాషణ, పైకొని = చేపట్టి, ఒడబరచు = వశముచేసుకొను, ప్రియములు = ఇష్టమైన కబుర్లు, తూకొను = సంకల్పించి, తొయ్యలి = స్త్రీ.
2. అంగన = స్త్రీ, ఆనవెట్టి = ప్రమాణముచేసి, ఉంగిటి = కపటము, ఒట్టివట్లు = ఫలించని ప్రమాణములు, జాణతనము = నైపుణ్యము, కంగువాయు = కన్నులతో స్పృశించు.
3. ఆకె = ఆమె, ఒరగు = వాలు, వెక్కసము = అధికము, ఇక్కువ = జాడ, ఇంతి = స్త్రీ, పాయకుండు = వీడకుండు.

**భావము:** అక్షింతలు వేయడానికి తల ఉండగా ఎవరైనా మోకాలిపై వేస్తారా? ఈ సరసశృంగారాలన్నీ ఆమె మీదనే చూపించవచ్చును కదా!

ఆమెతో చేరి సంభాషణలను చేయవచ్చు కదా! కానీ ఇక్కడకు వచ్చి మమ్ములను ఒప్పింపడానికి ప్రయత్నించడమెందుకు? ఇక్కడ మాకు ప్రియమైన మాటలను ఎన్నో చెప్తున్నావు. సంకల్పించి ఆ వనితకే నమస్కరించరాదా!

ఇక్కడకు సదా వస్తుంటావు కదా! ఆమెకు ప్రమాణము చేసి రావచ్చుగదా! కపటముతో మాతో ఉత్తుత్తి ప్రమాణాలన్నీ చేస్తూ ఉంటావు. విషయాలన్నీ మాతోడనే ఉంటాయి కదా! ఈ నేర్పరి తనాలకు అర్థమేమిటి స్వామీ! కన్నులతో ఆమెను దర్శించి ఆమెతోనే అతిశయించి నవ్వులు నవ్వవచ్చును కదా!

ఒక్కసారి ఆమె మీద ఒరగి వాలి సంతోషపెట్టవచ్చును కదా! అధికమైన చేష్టలతో మాపైన చేతులు వేయడమెందులకు? జాడతెలిసి శ్రీవేంకటేశ్వరుడైన నీవు ఆయమను కూడినావు. ఆమె ప్రక్కనే ఉండి ఎప్పటికి ఆమెను వీడకుండా ఉండరాదా స్వామీ!

## 442

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామి తనను చేపట్టినందుకు ప్రశంసిస్తూ తన సిగ్గు బిడియాలను దూరం చేసినవాడవు నీవే స్వామీ! అంటున్నది.

## శ్రీరాగం

ప. నాకుఁ జేసినది యెల్లా నడుమ నీదే కాదా
దాకొని యిన్నియును నేఁడు తారుకాణలాయఁగా ॥పల్లవి॥

1. కందువ నీవిరహగ్నిఁ గాఁగినట్టినా మేను
యిందు నీకాఁగిటికి నెక్కెఁగా నేఁడు
అంది కడువేఁడిగాఁగా నలిగి చూచినచూపు
సందడి నీకూటములో చల్లువెదలాయఁగా ॥నాకుఁ॥

2. తెగి నీతో వాదడచి తిట్టుకొన్నయీనోరే

నగి నీతో మాటలాడ ననుపాయఁగా
చిగురుచింతలచేఁ జెక్కుచేరిచిన చేయి
పగటున నేఁడు చెట్టపట్టఁగఁబాలాయఁగా ॥నాకుఁ॥

3. వడి నీవు పిలువఁగ వంచినట్టియీ శిరసు
అదరుమోవితేనియ లంది ఇచ్చెఁగా
యెడలేక శ్రీ వేంకటేశ నన్నుఁగూడితివి
విడువనిసిగ్గులెల్లా విడిపించితివిగా ॥నాకుఁ॥

**అర్థములు:** ప. నడుమ = మధ్య, దాకొని = దాగియుండి, తారుకాణ = ఋజువు,సాక్ష్యము.

1. కందువ = జాడ, విరహాగ్ని = ఎడబాటుజ్వాల, కాగిన = తపించు, మేను = శరీరము, కాగిటి = కౌగిటి, కడువేడి = మిక్కిలితాపము, సందడి = జనసమూహపుధ్వని, కూటమి = కలయిక, చల్లు = వ్యాపించు, వెద = బాధ.
2. వాదడచు = వాదముచేయు, నగి = నవ్వి, అనుపు = అనుకూలము, చిగురుచింత = పుడుతున్నబాధ, చెక్కు = చెక్కిలి, పగటు = ప్రకాశము, చెట్టపట్ట = చేతిలో చేయివేసుకొను,పెండ్లియాడు.
3. వడి = వేగము, శిరసు = తల, అదరు = అతిశయించి, మోవితేనె = అధరమృతము, ఎడ = దూరము, విడువని సిగ్గులు = ఎంతకూ వీడని సిగ్గు బిడియములు, విడిపించితివి = పోగొట్టినావు.

**భావము:** స్వామీ! చేసిన ఉపచారముల మధ్యన నీ ఉపకారమే కదా! దాగియున్నట్టి విషయాలన్నీ నేడు సాక్షీభూతమై నిలుచుచున్నవి.

జాడ తెలిసినట్టి నీ ఎడబాటు జ్వాలలలో తపించిన నేను ఈనాడు నీ కౌగిటికెక్కి యున్నాను. కానీ, అందు మిక్కిలి వేడిమితో నుండగా నీవు అలకతో చూసిన చూపు సంతలవంటి జనసమూహములలో వెదజల్లబడిన బాధగా నున్నది స్వామీ!

నీతో వాగ్వాదములు పెట్టుకున్న ఈ నోరే నీతో నేడు నవ్వుతూ మాట్లాడుతున్నది. పుడుతున్న బాధలతో చెక్కిలిపై చేయి వేసుకొని యుండగా, ప్రకాశించి నీదయ వలన చేతిలో చేయివేసుకొని పెండ్లాడితిని.

శీఘ్రముగా రమ్మని నీవు పిలువగనే నిన్ను చేరి సిగ్గుతోతల వంచి కోరిన రీతిగా అధరామృతమును అందించితిని. నన్ను ఎల్లవేళలా ఎడబాటు లేక కూడిన ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను చుట్టుముట్టిన ఈ సిగ్గుబిడియాలన్నీ నీ చిలిపి చేతలతో దూరం చేసినావు.

## 443

**అవతారిక:** స్వామి అకారణంగా తనపై కోపం వహిస్తున్నాడని వాపోతున్న అలమేలుమంగమ్మ బాధను అన్నమయ్య వర్ణిస్తున్నాడు.

### లలిత

ప. ఏల రేఁచీ నన్ను నింత యేమనినా వెగటౌను
గాలి మూటగట్టఁబోతే కడు నవ్వుఁబాట్లు ॥పల్లవి॥

1. మారుమాట లాడఁబోతే మనసునొచ్చీఁదనకు
కేరికేరి నవ్వఁబోతే కేరడమౌను
తారుకాణించఁగఁబోతే తనకుఁ గొరఁతవచ్చు
నేరనైతి నాఁడే నాఁడే నిజము నిష్ఠూరము ॥ఏల॥

2. కనుఁగవ నవ్వఁబోతే కడువెంగెమౌఁదనకు
కొనగోర నంటఁబోతే కోపమునౌను
చనవునఁ దిట్టఁబోతే జగడాలు ముదురును
వినకున్నాఁజెప్పఁబోతే విందువెట్టీఁ బగలు ॥ఏల॥

3. కదిసి మోవడిగితే గంట్లు తనకు రాఁగు
పదరి కాఁగిలించితే పచ్చిదేరును
అదన శ్రీవేంకటేశుఁ డంగవించి నన్నుఁగూడె
అద నెరిఁగినయడు గడుగే నిక్షేపము ॥ఏల॥

**అర్థములు:** ప. రేచు = రెచ్చగొట్టు, వెగటు = అనిష్టము, నవ్వుబాట్లు = నగుబాటు.

1. నొచ్చు = బాధపడు, కేరు = ఉత్సాహించు, కేరడము = తిరస్కారము, తారుకాణించు = ఉదాహరించు, కొరత = వెలితి, నేరనైతి = తెలుసుకోలేకపోతిని, నిష్ఠూరము = పరుషవచనము.
2. కనుగవ = కన్నుల జంట, వెంగెము = పరిహాసము, కొనగోర = గోరుచివర, అంటు = తాకు, చనవు = ప్రేమ, జగడాలు = తగవులు ముదురును = ఎక్కువౌను, విందువెట్టీ పగలు = కోపము ఆతిథ్యమిచ్చును.
3. కదిసి = దగ్గరకుచేరు, గంట్లు = గాయములు, రాగు = కోపముతో మందిపడు, పదరి = తొందరపెట్టి, కాగలించు = కౌగలించు, పచ్చిదేరు = మరుగులేని, అంగవించు = సాహసించు, అదను = సమయము, అదుగడుగు = ప్రతి అడుగు, నిక్షేపము = పెన్నిధి.

**భావము:** స్వామి ఎందుకింతగా రెచ్చిపోతున్నాడో తెలియదు. నీతో ఏమన్నా దోషము, అనిష్టము అవుతున్నాయి. గాలిమూటగట్టడానికి యత్నిస్తే నగుబాటు గాదా!

ఏమన్నా మాట్లాడదామంటే మనసు నొచ్చుకొని బాధ పడతాడు. పోనీ ఉత్సాహించి నవ్వుదామంటే తిరస్కార భావంతో చూస్తాడు. ఏమైనా దృష్టాంతాలు, ఋజువులు చూపిద్దామంటే మళ్ళీ స్వామికి వెలితి అవుతుందేమో! నిజం మాట్లాడితే నిష్టూరమనే విషయము తెలియని దాననైనాను సుమా!

కన్నులతో స్వామిని పలకరించి నవ్వబోతే పరిహాసముగా భావిస్తున్నాడు. కొనగోర తాకాలంటే కోపం పెట్టుకుంటున్నాడు. ఏదో ప్రేమతో ఇదేమి పద్ధతియని అడుగుదామంటే తగవులు అవుతున్నాయి. పట్టించుకోని విననప్పటికి ఏమైనా చెప్పాలంటే ఆయన కోపం దర్శనమిస్తున్నదన్న భయం.

దగ్గరగా చేరి తన మోవి చూపి అధరామృతాన్ని ఇవ్వమని అడుగుదామంటే గాయములు చేస్తాడన్న భయం. పోనీ తొందరపెట్టి గబగబా కౌగలించుకుందామంటే మరుగులేని ప్రవర్తన చూపిస్తాడు. తగిన సమయము గ్రహించి ఆ శ్రీవేంకటేశ్వరుడే నన్ను సాహసించి కలసినాడు. ఇలాంటి సమయములో ప్రతి అడుగు ఆచితూచి వేయడమే నాకు పెన్నిధి కదా!

## 444

**అవతారిక:** స్వామి చిన్న చిన్న విషయాలకు కూడా కలహిస్తున్నప్పటికీ, తాను మాత్రం అన్నిటికి సర్దుకుని పోతూ ఆరాధిస్తున్నానని చెలులతో అమ్మ చెప్తున్నది.

### రామక్రియ

ప. చాయల సన్నలఁ దన్ను సాదించనేలే
పోయినదే పొల్లుగాక పురివిచ్చ నేఁటికే ॥పల్లవి॥

1. కాయమిది తనసొమ్ము కాఁకలే నాసొమ్ము
ఆయాలు మోవఁదన్ను నాడనేఁటికే
సేయరానిచేఁత చేసె చెక్కుచేయి నాకు వచ్చె
దాయగాఁడు తనతోడిదంటతన మేఁటికే ॥చాయల॥

2. మనసెల్లాఁ దనసొమ్ము మచ్చికలే నాసొమ్ము
చెనకి తన్నంత రట్టుసేయ నేఁటికే

తనకే నిదుర యెచ్చె తగె నాకు జాగరాలు
ఘనుఁడు తన్నింక నే గద్దించఁగలనా ॥చాయల॥

3. కాఁగిలిదె తనసొమ్ము కళదాఁకేది నాసొమ్ము
తోఁగి చూచి తనతోడి దొమ్ము లేఁటికే
వీఁగక శ్రీవేంకటాద్రివిభుఁడిట్టె నన్నుఁగూడె
పాఁగితి నే నన్నిటాను పంతమాడ నేఁటికే ॥చాయల॥

**అర్థములు:** ప. చాయల = వన్నెల, సన్నల = సైగల, సాదించు = కఠినమైన మాటలతో బాధించు, పొల్లు = సారములేని, పురివిచ్చు = వీడిపోవు.

1. కాక = తాపము, ఆయాలు = మర్మస్థానాలు, మోవదన్ను = మనసుకు తగిలేట్టు, చెక్కు = చెక్కిలి, దాయగాడు = శత్రువు, దంటతనము = శత్రుస్వభావము.
2. మచ్చిక = స్నేహము, చెనకు = తాకు, రట్టు = అల్లరి, యెచ్చె = అధికమగు, జాగరాలు = జాగారము, గద్దించు = బెదరించు.
3. కాగిలి = కౌగిలి, కళ = శోభ, తోగు = ముంచు, దొమ్ము = కలహము, వీగు = తగ్గు, పాగు = కలసిపోవు, పంతము = పట్టుదల.

**భావము:** స్వామి నన్ను వన్నెలా చిన్నలా, సైగలా బాధించడమెందుకు? అయిపోయినదేదో అయిపోయినదని భావించకుండా ఈ విధంగా వీడిపోయే మాటలాడాడం న్యాయమా?

ఈ శరీరము తన సొత్తు, నాకు మాత్రం తాపమే మిగిలినది. జీవస్థానాలు తగిలేవిధంగా, మనసు బాధించేవిధంగా మాటాలాడడం ఎందుకే! స్వామి చేసిన అకార్యాలకు నేను చెక్కిలిపై చేయివేసుకొని ఆలోచనలలో పడ్డాను. విరోధిలాగా ప్రవర్తిస్తూ ఈ దిట్టతనాలెందుకు ప్రదర్శిస్తున్నాడే!

నా మనసంతా ఆయన సొత్తు, స్నేహము అనురాగమే నా వంతు. కావాలని తాకి తాకి అంతలా అల్లరిపాలు చేయడమెందుకు? ఆయన మాత్రం హాయిగా నిద్రిస్తాడు. నాకు మాత్రం నిత్య జాగారమే! గొప్పవాడైన ఆ స్వామిని నేను బెదిరించగలనా?

కౌగిలిలోకి తీసుకోవడమే ఆయన పని, శోభలను అంటుకునేది నా వంతు. ముంచే చూపులతో నా తోడి ఈ కలహాలెందులకే? తగ్గని ఆ శ్రీవేంకటేశ్వరుడు ఈ విధముగా నన్ను కూడినాడు. అనవసరమైన పంతాలు, పట్టింపులకు పోకుండా, సమ్మతించి అన్నిటికి తలనూపుతూ ఉండిపోయాను.

## 445

**అవతారిక:** అమ్మ విషయంలో ఏమీ పట్టించుకోకుండా ముభావంగా ఉన్న స్వామితో చెలికత్తెలు మాట్లాడుతున్న దృశ్యం.

### తెలుఁగుకాంబోది

ప. ఏల వట్టిజోలి సేసే వేమిగట్టుకొంటి విందు
కాలమందె యామేలు గట్టుకొనరాదా ॥పల్లవి॥

1. వండవండనట్లాయ వలచినతరితీపు
యెండమావులాయ నీపై నెచ్చిన యాస
వుండ దీయాసలఁ జెలి వొగి నే వచ్చినదాఁకా

2. అండనే ఇంకొకమాట ఆనతియ్యరాదా ॥ఏల॥
పుచ్చుఁబుచ్చు పున్నమాయ పూఁచినసీసరసాలు
వచ్చీరానిపాటలాయ వట్టిప్రియాలు

ఇచ్చుల నే వచ్చేనంటా నిందుకే కాచుకున్నది
అచ్చముగ నన్ను నాడ కంపివిడరాదా ॥ఏల॥

3. పూరపూర నూటలాయ వొప్పగు నీమోవితేనె
చేరఁజేరఁజేరువాయ చెలికాఁగిలి
యీరీతి శ్రీవేంకటేశ ఇద్దరుఁ గూడితి రీడ
సారెకు నీపొందు లిట్టే జరపఁగరాదా ॥ఏల॥

**అర్థములు:** ప. వట్టిజోలి = సంబంధములేకుండు, కాలమందు = తగిన సమయమునందు, మేలు = శుభము, కట్టుకొను = కార్యము నిర్వర్తించు.

1. తరితీపు = అపేక్ష, ఎండమావులు = లేనిది ఉన్నట్లు భ్రమ కలిగించు, ఎచ్చిన = అధికమైన, ఉండదు = కొనసాగదు, ఒగి = సిద్ధపడి.
2. అండ = చెంత, ఆనతి = శెలవు, పూచిన = ఫలించిన, వట్టి ప్రియాలు = శుష్కవచనాలు, ఇచ్చులు = కోరికలు, అంపి = పంపి, విడరాదా = వెళ్ళిపోరాదా.
3. ఊట = తేరిన పదార్థము, ఒప్పు = తగినట్లు, మోవితేనె = అధరామృతము, చేరువ = దగ్గర, కాగిలి = కౌగిలి, ఈడ = ఇక్కడ, సారెకు = మాటికి, జరుపు = నిర్వర్తించు.

**భావము:** ఏమిటిది? స్వామీ! ఇలా సంబంధమే లేనట్టు అంటీముట్టనట్టుగా ఉండడం వలన నీవు సాధించేదేమున్నది చెప్పవయ్యా! సమయమును గ్రహించి ఆ శుభమైన కార్యమును జరుపరాదా!

వండగా వండగా అపేక్ష ఆ విధముగా నయినదేమో అనిపిస్తున్నది. నీపై పెట్టుకున్న ఆశలన్నీ ఎండమావులయినవి. ఆశ కోరికలతో ఉన్న నెచ్చెలినైన నేను వచ్చినదాకా ఉండదేమో అనిపిస్తున్నది. చెంతజేరి మరొక్క మాట సెలవియ్యరాదా!

ఫలించిన నీ సరసశృంగారాలన్నీ పున్నమి వెన్నెలవలె అగుపించుచున్నవి. వచ్చీ రాని గీతములవలె ఆమె పై నీ వలపున్నది. ఇక్కడకు నేను ఇష్టపడి వచ్చినదందుకే గదా! ఇలా నీకొరకు వేచి ఉన్నది కూడా అందులకే! నన్ను మొదట అక్కడకు పంపి విడువరాదా!

ఊరేకొద్దీ తయారైన ఊటలాగా నీ అధరామృతము తగిన రుచిగా ఉన్నది. చేరినకొద్దీ చెలి కౌగిలి చేరువే కదా! ఈ విధముగా ఓ శ్రీవేంకటేశ్వరా! యిద్దరునూ ఇక్కడ నెలవై కలసినారు. ప్రతిసారీ నీ పొందులన్నీ ఈవిధంగానే నిర్వర్తించవచ్చును కదా!

## 446

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామిపట్ల నేను నువ్వు అనే భేదం లేకుండా అద్వైతభావాన్ని ప్రదర్శిస్తున్నది.

### ఆహిరి

ప. ఇటు చేసిన దేవర నేమని మెత్తు నే నిఁక
కటకటా నే నిందుకే కరఁగుదురా ॥పల్లవి॥

1. తనువులే వేరులై తలఁపొక్కటైనమీఁద
ననిచి నిన్నేమనినా నన్ను నంటేపో
వెనుకొని నీవు రానివేళ గోపించఁబోతే
జునిగి నాగుండె నాకే చుఱుకనురా ॥ఇటు॥

2. వయసులు సమములై వావులు గూడినమీఁద
నయమై నీ మేలెల్లా నామేలే పో
ప్రియము చెప్పేవేళ పెనఁగఁగఁబోయి నేనే

దయదలఁచి నీమీఁదఁ దమకింతురా ॥ఇటు॥

3. కాఁకల నిందాఁకాఁ బొంది కాఁగిటఁ గూడినమీఁద
యేఁకట నీ కెంతగల్లా నిది నాదేపో
సోఁకుల శ్రీవేంకటేశ చొక్కించితివి నన్ను
వేఁకపు గుబ్బలముద్ర వేసితి నీపైరా ॥ఇటు॥

**అర్థములు:** ప. దేవర = దేవుడు, కటకటా = అయ్యయ్యో, కరగుదు = ద్రవించు.

1. తలపు = ఆలోచన, ననిచి = చిగిర్చి, అంటు = తాకు, వెనుకొను = వెంబడించు, చునుగు = వెనుదీయు, చురకను = చురుక్కుమను,బాధించు.

2. వావి = బంధుత్వము, నయము = లాభము, మేలు = శుభము,మంచి, ప్రియము = మంచి, పెనగు = చుట్టుకొను, తమకించు = మోహపడు.

3. కాకలు = తాపము, కాగిట = కౌగిట, ఏకట = అపేక్ష, గల్లా = ఉన్నా, సోకులు = అలంకారాలు, చొక్కించు = మత్తుకులోనగు, వేకము = బరువైన, గుబ్బలముద్ర = రొమ్ములపై గురుతులు, నీపై = నీ మీద.

**భావము:** ఈవిధముగా చేస్తున్న దేవుణ్ణి యికనేమని ప్రశంసించగలను. అయ్యయ్యో నేనిందుకే ద్రవించి ప్రేమను గుమ్మరించితినా?

శరీరాలు వేరైనప్పటికి ఆలోచనలన్నీ ఒక్కటైన తర్వాత, చిగురించి నిన్నేమైనా అన్నట్లైతే అది నన్ను అన్నట్లే సుమా! ఏదైనా కార్యంలో నిమగ్నమై నీవు రానట్లైతే నేను కోపించడానికి ప్రయత్నిస్తే నా గుండె నాకే చురుక్కని అనినట్లవును సుమా!

ఈడూ జోడూ సరిపోయిన మీదట, బంధుత్వం కుదిరిన పిమ్మట, నీకు లాభించి శుభమైనదెల్లా నాకూ శుభమే అవుతుంది కదా! ఏదైనా మంచి కబుర్లు చెప్పే ఘడియలలో నేను చుట్టుకొని నీ మీద దయతో నీమీద మోహావేశాలు చూపిస్తాను సుమా!

తాపమింతవరకూ పొంది కౌగిటిలోకి చేరిన తర్వాత నా మీద నీకెంత అపేక్ష ఉంటుందో నాకూ అదే మాదిరి సుమా! అలకారప్రియుడైన ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను మత్తులో దింపగా, బరువైన నా రొమ్ముల ముద్రలు నీపైన వేసితిని సుమా!

## 447

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామిపట్ల మోహానురాగాలతో తన కోరికలకు అంతు లేదని విన్నవిస్తున్నది.

### మాళవశ్రీ

ప. నీవేమి సేతువయ్య నేరమి నాదే కాక
కావిరి నా యాసలకుఁ గడమ లేదు ॥పల్లవి॥

1. కొంతవడి నీరాక గోరుదు నీవు వచ్చితే
అంతమీఁద నీతో మాటలాడఁగోరుదు
చెంత మాటలఁ దనిసి చేయివేయఁ గోరుదు
దొంతుల నాయాసలకు తుద యెందు లేదు ॥నీవేమి॥

2. ముచ్చట నొకవేళ నీమోము చూడవలె నందు
వచ్చి యామీఁద నీమోవి వలె నందును
కచ్చు పెట్టి రాఁగా రాఁగా గాఁగిలించవలెనందు
అచ్చపు నాయాసలకు నరకువే లేదు ॥నీవేమి॥

3. మేనులంటినట్టిచోట మేలములే కొసరుదు
కోనల నప్పటి రతి గొసరుదును
కానీలే శ్రీవేంకటేశ కై కొని కూడితి నన్ను

మేనిలోనియాసలకు మితి మేర లేదు ॥నీవేమి॥

**అర్థములు:** ప. సేతువు = చేసెదవు, నేరమి = దోషము, కావిరి = పొగ లేకయే పొగవలె ముంచుకొనేటిది, కడమ = చివర,అంతు.
1.వడి = సమయము, చెంత = దగ్గర, తనయు = తృప్తిపడు, దొంతులు = ఒకదానిమీద మరొకటి, తుద = చివర.
2.ముచ్చట = ఇష్టము, వలె = కావలెను, కచ్చు = పట్టుదలవహించు, కాగిలించు = కౌగలించు, అరకువ = లోపము.
3.మేను = శరీరము, అంటు = తాకు, మేలము = హాస్యము, కొసరు = కోరు, కోనలు = మరుగుప్రదేశము, కొసరు = కోరు, కైకొని = చేపట్టి, మితిమేర = అంతూ పొంతూ, చివర.

**భావము:** స్వామీ! నీవేమి చేస్తావు? దోషమంతా నాదే కదా! పొగలాంటి నల్లనైన నా ఆశలకు అంతే లేకుండా ఉన్నది.

కొంతసేపు నీ రాక కోరుకుంటాను. నీవు వచ్చాక మాట్లాడాలని అనుకుంటాను. మాటల మధ్యలో ఆనందించి నీపై చేయి వెయ్యాలనుకుంటాను. దొంతరలా ఒకదానిమీద వచ్చిపడే నా ఆశలకు అంతులేదు కదా!

ఒకవేళ నీ ముఖారవిందాన్ని చూడాలనుకుంటాననుకోండి, చూశాక మీ మోవి నాకు ఇష్టమై అధరామృతాన్ని అడుగుతాను. ఇంకా పట్టుదలలతో నిన్ను కౌగిట్లోకి తీసుకోవాలనుకుంటాను. నా ఈ ఆశలకు కడమెక్కడ స్వామీ!

ఒకవేళ యిద్దరి శరీరాలు ఒకటై పెనవేసుకునాయనుకోండి, హాస్యమాడాలని అనిపిస్తుంది. తర్వాత మరుగైన ప్రదేశంలో రతిక్రీడాలాడాలనిపిస్తుంది. కానీలే ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను చేపట్టి కూడినావు నా శరీరంలో కలిగే ఆశలకు మితి మేరలు లేనట్లు ఉన్నవి.

## 448

**అవతారిక:** స్వామికి, తనకు మధ్యన చెలులు ఏవో గొడవలు సృష్టిస్తున్నారని భావించిన అమ్మ తగదని హితవు పల్కుచున్నది.

### లలిత

ప. ఇచ్చకమాడితే మీకు నేమి దోసమాయ నేఁడు
అచ్చమైన మీకు మాతో నంత చలమేలే ॥పల్లవి॥

1. చెప్పకురే చెలులార చెలువుని మానుమని
అప్పుడే వీనులకు వెట్టయి తోఁచీని
తిప్పకురే నామనసు తెమ్మలుగా వలచితి
నెప్పున నేఁ బాయ వట్టినిష్టూరమేలే ॥ఇచ్చక॥

2. తీయకురే చేయివట్టి తెగి వానింటికిఁబోఁగా
కాయమెల్ల నిందువంకఁ గాఁకరేఁగీని
పాయ మాతని కిచ్చితి పంతానకు దక్కితిని
యీయెడ వట్టికయ్యానకేల పెనఁగేరే ॥ఇచ్చక॥

3. వుప్పతించకురే వానివద్ద నేఁ గూచుండఁగాను
రెప్పలఁ గోపము మీపై రేసులెక్కీని
వొప్పుగ శ్రీవేంకటేశుఁ దూరడించి నన్నుఁ గూడె
కప్పుర మియ్యరే మీలోఁ గడమ లింకేలే ॥ఇచ్చక॥

**అర్థములు:** ప. ఇచ్చకము = ముఖప్రీతిమాటలు, దోస(ష)ము = తప్పు, అచ్చమైన = అసలైన, చలము = కంపము.

1. చెలువుడు = స్నేహితుడు, మానుమని = వలదని, వీనులు = చెవులు, వెట్ట = వేడిమి, తెమ్మలు = తేమ,తడి, నెప్పు = స్థానము, పాయ = విడువ, నిష్టూరము = పరుషవచనము.
2. తెగి = సిద్ధపడి, కాయము = శరీరము, కాక = తాపము, పాయము = యుక్తవయసు, పంతము = పట్టుదల, దక్కు =

లభించు, ఎడ = స్థానము, కయ్యము = తగవు, పెనగు = చుట్టుకొను.

3. ఉప్పతించు = ఓర్వక ఆడిపోసుకొను, రెప్పలకోపము = కన్నులమీది కోపము, రేసులెక్కు = విజృంభించు, ఒప్పుగ = తగిన రీతి, ఊరడించు = సముదాయించు, కప్పురము = కర్పూరము, కడమ = కొరత.

**భావము :** నేను స్వామితో ప్రీతితో యేవో ముఖస్తుతి మాటలు మాట్లాడుతూ ఉంటే మీకేమి సమస్య వచ్చిపడిందే! స్వచ్ఛమైన మా ప్రేమ వ్యవహారాల మధ్యలో మీరు జోక్యము చేసుకుని లేనిపోని కంపములకు దారితీస్తారెందుకు?

ఓ చెలులరా! ఆ స్వామికి వద్దని చెప్పకండి, ఆ మాటలు నా చెవులకు అమిత వేడిమిని రగిలిస్తాయి. ఆయనను మనసు ద్రవించి ప్రాణప్రదంగా ప్రేమించినదానను నా మనసు వేరొక వైపుకు త్రిప్పాలని చూడకండి. నా స్థానం నేను వీడితే మధ్యలో మీరు పరుష వచనాలెందుకు మాట్లాడుతున్నారు?

నన్ను స్వామి ఇంటికి వెళ్తున్నప్పుడు చేయిపట్టి వెనుకకు తీసుకొని రావద్దు. నా శరీరమంతా ఆ స్వామికై తపించి పోతున్నది. నా యౌవనమంతా ఆయనకు సమర్పించి పట్టుదలతో ఆయనను దక్కాలని ఉన్నదానను. ఇటువంటి సమయంలో తగవులకు దారితీసి చుట్టుకుంటారెందుకు? వదలండి.

స్వామి వద్ద నేను కూర్చొన్నప్పుడు మీరేల ఓర్వలేక ఏవేవో ఆడిపోసుకుంటూ ఉంటారు. నా కనురెప్పలపై ఉన్న కోపం తారాస్థాయికెక్కినది. ఇదుగో చూడండి, తగినరీతిలో నా స్వామి శ్రీవేంకటేశ్వరుడు నన్ను సముదాయించి నన్ను చేరినాడు. ఇంకా ఏదో కొరత ఉన్నట్లుగా భావించక ఆయనకు మంచి కర్పూరమిచ్చి స్వాగతించండి.

## 449

**అవతారిక:** స్వామికొరకు ఎదురు చూపులు చూస్తున్న అలమేలుమంగమ్మ మనోభావాలను అన్నమయ్య వర్ణిస్తున్నాడు.

### రామక్రియ

ప. పొన్నలలో వేగెఁ బొద్దు పోనీవే యిఁక
కన్నదే కంటి గురుమ కానీవే యింక ॥పల్లవి॥

1. పంచించి యెందు వోయినా వచ్చీఁగానీ తా నీడకు
పొంచి యానలువెట్టక పోనీవే యింక
యెంచరాదు పంచరాదు యివే మింటిపై చుక్కలు
కంచు పెంచుమాటలాడీ కానీవే ఇంక ॥పొన్నలలో॥

2. యీరీతి మాయింటిగుఱు తెఱఁగఁడా తానేమి
పోరి సారెఁ బిలువక పోనీవే యింక
నీరులేదు మేరులేదు నిండినయెండమావులు
కారపువలపు చల్లీఁ గానీవే యింక ॥పొన్నలలో॥

3. యెందుండి వచ్చినారానీ యేమనినా నియ్యకొనే
పొందులెల్ల నొనగుడె పోనివే యిఁ(యిం?)క
విందువలె శ్రీ వెంకటవిభుఁడు నన్నుఁ గలసె
కందుకుందులెల్లాఁ బాసె కానీవే ఇంక ॥పొన్నలలో॥

**అర్థములు:** ప. పొన్నలు = పున్నాగచెట్లు, వేగు = బాధనొందు, పొద్దు = రోజు, కన్నది = చూసినది, గురుమ = మహిమ.

1. పంచించు = నేర్పు, ఈడకు = ఇక్కడకు, పొంచి = దాగి, ఆన = ఒట్టు, ఎంచు = లెక్కించు, మింటిపై = ఆకాశముపై, కంచు = ఒక లోహము,గట్టిదనము,

2. గురుతు = ఆనవాలు, పోరి = పోట్లాడి, సారె = మాటికి, మేరు = ఒక కొండ, ఎండమావి = నీరున్నట్లు భ్రమకలిగించునది,

కారపు వలపు = ఘాటైన ప్రేమ, చల్లీ = వ్యాపింపజేసి, ఇయ్యకొను = సమ్మతించు, ఒనగూడు = సమకూరు, కందుకుందులు = తపించే క్రుంగుబాటు, పాసె = వీడెను.

**భావము :** నాకు దినమంతా స్వామి కొరకు పున్నాగ తోటలోనే వేచి చూడడమే సరిపోయినది. నేను యిక కన్నులతో చూచినదే మహిమగా భావించవలసి యున్నది.

నాకేదో మాయమాటలు చెప్పి ఎక్కడికి వెళ్ళినా ఆ స్వామి చివరకు ఇక్కడికే చేరుకుంటాడు. మీరు అనవసరముగా దాగియుండి ఏవేవో ప్రమాణాలు ఒట్లు పెట్టకుండా యిక కానివ్వండి. మనము ఆకాశంలో ఉన్న నక్షత్రాలను లెక్కించగలమా? కంచువంటి కఠినమైన మాటలు మాట్లాడాడు కానీవే!

ఆ స్వామికి మా యింటి గుర్తులు తెలియదా ఏమిటి? ఇంక పోట్లాటలతో పిలువక కానీవే ఇకను. ఇక్కడ నీరు లేని ఎండమావివలె నుండి, వంటిపై కారం చల్లిన రీతిగా ఈ ప్రేమ నన్ను దహిస్తున్నది. కానీవే ఇకను.

ఎక్కడనుండి వచ్చినా ఆ స్వామిని రానివ్వు. ఏమని మాట్లాడినా బదులు చెప్పకుండా అన్నిటికి అంగీకారం తెలుపండి. పొందులన్నీ సమకూరాయి కదా! ఇకనైనా మీ మాటలు మానడి. విందుభోజనము రీతిగా శ్రీవేంకటేశ్వరుడు తనకై తానే వచ్చి కలిసినాడు. హెచ్చుతగ్గులు, తపించే క్రుంగుబాట్లు అన్నీ దూరమయ్యాయి. ఇక కానీవే!

## 450

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామి బహిరంగంగా చేస్తున్న పనులను వలదని మౌనంగా తనను చేరమని స్వామిని ప్రార్థిస్తున్నది.

### కాంబోది

ప. పట్టకురా ముట్టకురా పసలేని పనులకు
యెట్టువలసినా వచ్చు నిదివో చేసన్నలు ॥పల్లవి॥

1. అంతనవ్వు నవ్వకురా అలవాటయ్యీ నీకు
బంతినే రాఁగా రాఁగా భావము లౌను
రంతులు సేయకురా రచ్చకెక్కీఁ బనులెల్లా
ఇంతటిమీఁదటి పను లిపుడే చెప్పేను ॥పట్టకురా॥

2. నన్ను నంతమెచ్చుకురా నాటకమే నిజమౌను
నిన్ను నన్ను నెంచుకొంటే నిక్కము లౌను
మిన్నక దగ్గరకురా మితిమీరుఁ దమకము
కన్నసుద్ది చెప్పకున్న కడుఁగడుదోసము ॥పట్టకురా॥

3. వోరగండ్లఁ జూడకురా వుపమే నెపమౌను
సారెకు రతులమీఁద చలమెక్కును
యేరా శ్రీవేంకటేశ యింతలో నన్నుఁగూడితి
కోరిన కోరికలెల్లా గొఅంత లేదిఁకను ॥పట్టకురా॥

**అర్థములు:** ప. ముట్టు = తాకు, పస = సారము, చేసన్నలు = చేతిసైగలు.

1. బంతి = వరుస, భావము = ప్రేమ, రంతులు = సవ్వడి, రచ్చకెక్కు = వీధికెక్కు, ఇంతటిమీదట = ఇకమీద.
2. నాటకము = వేషధారణ, నిక్కము = నిజము, మిన్నక = మాట్లాడక, మితిమీరు = హద్దుమీరు, తమకము = దాహము, కన్నసుద్ది = చూసిన విషయము, దోస(ష)ము = తప్పు.
3. వోరకండ్లు = ప్రక్కచూపు, ఉపము = నేర్పరితనము, నెపము = తప్పు, సారె = మాటికి, చలము = కంపము, కొరత = లేమి.

**భావము :** ఓ స్వామీ! ఈ పసలేని పనులకు నన్ను పట్టుకోవడము తాకడము ఎందుకు చేస్తావు? ఏవిధంగా కావలసి వచ్చినా నేను వస్తాను కదా! ఇవిగో చేతి సైగలు కనిపిస్తున్నవి కదా!

స్వామీ! అంత పెద్ద పెద్ద నవ్వులు నవ్వవద్దు. మీకు ఈ నవ్వులు బాగా అలవాటై యున్నవి. నీ ప్రక్కకు చేరి నిలబడగానే ప్రేమలు పుడతాయి. ఎక్కువగా సవ్వడి చేసినట్లైతే ఈ వ్యవహారాలన్నీ వీధికెక్కుతాయి కదా! ఇక మీద యేది యెలా చేయాలో నేనే యిపుడు తమకు విన్నవిస్తాను.

స్వామీ! నన్ను అంతగా మెచ్చుకోతగదు. నీవు వేస్తున్న వేషము, నాటకము నిజమై బట్టబయలవుతుంది. నిన్ను నన్ను జనం లెక్కించారంటే నిజం బయటకు వస్తుంది. నీవు ఏమీ మాట్లాడకుండా నా దరి చేరినట్లైతే మన తమకము హద్దుమీరి సాగుతుంది. నేను చూసిన విషయాలను చెప్పకుండా దాచినట్లైతే అది నేరము కదా స్వామీ!

స్వామీ! అలా వాలు చూపులు, ప్రక్క చూపులు చూడకండి. నీ నేర్పరి తనమే ఒక్కోసారి తప్పుగా భావించే ప్రమాదమున్నది. మాటి మాటికి మీకు రతిక్రీడా విన్యాసాలపై కంపము తహతహలు ఎక్కువగుచున్నవి. హయ్యో! శ్రీవేంకటేశ్వరా! ఇంత చెబుతున్నా సరే అంతలోనే వచ్చి నన్ను కలసినావు. మనము కోరుకున్న కోరికలకు యిక కొరతగానీ లేమి గానీ లేదు సుమా!

## 451

**అవతారిక:** స్వామి చీటికి మాటికి కోపించి ఎల్లవేళలా తనలో దోషాలే వెదకుతున్నాడని గ్రహించిన అమ్మ అలమేలుమంగమ్మ అలా చేయడం తగదని విన్నపాలు చేసుకుంటున్నది.

### ఆహిరి

ప. ఇదివో నావంకఁ దప్పు ఇంతే మరేమీ లేదు
యెదురుగాఁ బైకొన్న దిది నేరమాయను ॥పల్లవి॥

1. వొంటిఁ దనతో వెంగె మొకమాటు నాడక
కంటగించి తా ముట్టితేఁ గసురుకొనక
దంటతనానఁ జెలులఁ దారుకాణ సేయక
ఇంటిలో నే నూరకున్న దిది నేరమాయనే ॥ఇదివో॥

2. యెందువోయినా వెంట నింతుల నే నంపక
కందువ మైకాఁకలకుఁ గాఁతాళించి పడక
సందడించి వేగుదాఁకా జాగుల నే పెట్టక
ఇందు రమ్మని పిలుచు టిది నేరమాయనే ॥ఇదివో॥

3. అట్టేకాఁగిలించరాఁగా నవ్వవిమోము గాక
వెట్టగా రతులఁ దన్ను వెస నలయించక
గట్టిగా శ్రీ వేంకటేశఁ గలసితి నీవేళ
ఇట్టె పైఁ గాలుమోఁచీ నిది నేరమాయను ॥ఇదివో॥

**అర్థములు:** ప. వనక = దిశ, మరేమీ = వేరే యేమీ, పైకొను = యత్నించు, నేరము = తప్పు.

1. వొంటి = ఒంటరియైన, వెంగెమొకమాటు = ఒకసారి పరిహాసము, కంటగించు = ద్వేషించు, కసురుకొను = కోపముతో మందలించు, దంటతనము = నేర్పరితనము, తారుకాణ = ఋజువు, ఊరకుండు = ఏమీ మాట్లాడకుండు.
2. ఎందువోయినా = ఎక్కడకు వెళ్ళినా, కందువ = జాడ, మైకాక = శరీర తాపము, కాతాళించు = కోపించు, సందడించు = అతిశయించు, వేగు = తెల్లవారు, జాగులు = ఆలస్యము.
3. కాగిలించు = కౌగలించు, విమోము = పెడమొహము, వెస = శీఘ్రముగా, అలయించు = శ్రమపెట్టు, కాలుమోచు =

కాలువేయు.

**భావము :** స్వామీ! ఇదుగో మీరు గమనించండి. నా దిశ అసలు దోషమేమియునూ లేదు. నిన్ను ఎదురుగా పట్టుకొన యత్నించితిని. ఈ తప్పు తప్ప మరేదియునూ లేదు. ఇది కూడా నీకు తప్పుగా తోచుచున్నది.

స్వామీ! నీతో ఒక్కసారి కూడా పరిహాసాలాడకుండా, ఒకవేళ మీరు కోపముతో ముట్టుకున్నప్పటికి యేమాత్రం మందలించక, నీవు చెలులతో చేసే నేర్పరితనాలకు సాక్ష్యాలు చూపించి యిబ్బంది పెట్టక, ఇంటిలోనే అలా ఉండిపోవడమే నేరమంటారా?

నీవు ఎక్కడికి వెళ్ళినా వెంట చెలులను పంపడానికి అంగీకరింపక, శరీర తాపముతో ఉన్నప్పుడు కోపించక, అతిశయించి చేస్తున్న పనులను తెల్లవారురుఝామువరకూ వేగిరపెట్టక ఒప్పినదాననై, ఇలా రమ్మని పిలవడమే నేరమౌతుందంటారా?

నిన్ను బిగియార కౌగలించుకోవడానికి నేను రాగా, నీవు విముఖతతో చూడగా, కాకతో రతిక్రీడలలో తేలియాడినప్పటికి యేమాత్రం శ్రమ పెట్టక, ఓ శ్రీవేంకటేశ్వరా! తీవ్రమైన మోహావేశంతో నన్ను ఈ వేళ కలసితివి, ఆ సమయములో చనువుగా నీపై కాలు వేయడమే దోషమవుతుందంటారా చెప్పండి?

## 452

**అవతారిక:** విరహవేదన భరించలేని అమ్మ అలమేలుమంగమ్మ చెలులతో స్వామిని గురించి శీఘ్రం విచారించండి అంటున్నది.

### ఆహిరి

ప. అడుగరే చెలులాల ఆతనినే యీ మాట
యెడసిన విరహము యెవ్వరిదో కాని ॥పల్లవి॥

1. చూపుల లోపలి యాస చూచుదాఁకా వేగిరము
యేపునఁ దనకు నాపై నెట్లోకాని
ఆపైఁ జన్నులయాస అంటుదాఁకా వేగిరము
వోపిక దనకుండునో వుండదోకాని ॥అడుగరే॥

2. మనసు లోపలి యాస మాటాడుదాఁ కా వేగిర-
మెనలేనితనకిఁక నెట్లోకాని
తనువుమీఁదటి యాస దగ్గరుదాఁకా వేగిర-
మనుగు తనకు సమ్మతౌనో కాదో ॥అడుగరే॥

3. కాఁగిటి యాస రెంటెము గప్పుదాఁకా వేగిరము
యేఁగివచ్చెఁ దనకైతే నెట్లోకాని
వీఁగక శ్రీ వేంకటాద్రి విభుఁడు నన్ను మన్నించె
చేఁగదేరె వలపులు సిగ్గులేవో కాని ॥అడుగరే॥

**అర్థములు:** ప. అడుగరే = అడగండి, ఎడయు = తొలగు, విరహము = ఎడబాటు.

1. వేగిరము = వేగము,త్వరపెట్టు, ఏపు = బాధ, చన్నుల ఆశ = రొమ్ములనుపట్టుకొను కోరిక, ఓపిక = సహనము.
2. ఎనలేని = సాటిలేని, మునుగు = కలయిక,లయము, సమ్మతి = అంగీకారము.
3. కాగిట = కౌగిట, రెంటెము = జంటయైన నేతవస్త్రము, ఏగివచ్చు = విచ్చేయు, వీగక = తగ్గక, మన్నించు = మన్నన చేయు, చేగదేరు = సారవంతమగు, వలపు = ప్రేమ.

**భావము :** ఓ చెలులారా! ఆ స్వామినే ఈమాట అడగండి. ఈ తొలగిన ఎడబాటు ఎవరిదో కాస్తా అడిగి తెలుసుకోండి.

చూచే చూపులలో ఉండే కోరికలు చూచేదాకా తొందరపెడుతూనే ఉంటాయి. ఆ బాధ, కోరిక నామీద ఎలా ఉన్నదో తెలుసుకోండి. ఆపైన నా రొమ్ములనుపట్టుకోవాలనే కోరిక త్వరితమై ఆ స్వామికి సహనం ఉంటుందో ఉండదో తెలియదు.

మనసులో దాగియున్న కోరిక మాట్లాడేదాకా త్వరపెడుతుంది. సాటిలేని తనకేవిధంగా ఉంటుందో తెలుసుకోండి. శరీరం మీద ఆశ దగ్గరయ్యేదాక త్వరపెడుతుంది. ఆ స్వామికి కలయిక సమ్మతమో కాదో కాస్తా విచారించండి.

కౌగలించుకోవాలనే కోరిక జంట వస్త్రము కప్పేవరకూ త్వరపెడుతుంది. ఆ స్వామి విచ్చేశాడు తన మనసు ఏవిధంగా నున్నదో తెలియదు. శ్రీవేంకటేశ్వరుడు ఏమాత్రం తగ్గక నన్ను మన్ననచేసి చేరినాడు. సిగ్గుల సంగతి ఎలా ఉన్నప్పటికి, ఈ ప్రేమలన్నీ ఫలించి సారవంతమైనాయి.

## 453

**అవతారిక:** అయినదానికి కానిదానికి లేనిపోని హడావుడి చేస్తున్న చెలులను అమ్మ మందలిస్తున్నది.

### శంకరాభరణం

ప. సరికి బేసికి మీరు చలము లింకానేలే
సరసములు విరసములు చౌకగదే ఇపుడు ॥పల్లవి॥

1. మనసులోపలిగుట్టు మాటలలోపలిరట్టు
చనవుగలపతితోడ జరపఁదగునా
కొనచూపులో కొసరు గొణఁగులో నసురుసురు
మునుపనే పతికి పతి ముంచెఁగదె అతఁడు ॥సరికి॥

2. సెలవిలోపలి నగవు చేసన్నలో బిగువు
పిలువఁగా బతితోడ పెంచఁదగునా
నిలువులో నివ్వెరగు నిండుఁజెమటకరఁగు
చలివాయ నీమీఁదఁ జల్లెఁగదె అతఁడు ॥సరికి॥

3. పచ్చిదేరేటి యాస పదరి అడిగెడిబాస
ముచ్చట శ్రీవేంకటేశు ముంచఁదగునా
పెచ్చువెరిగేటి ప్రియము బిగువుఁ గాఁగిటినయము
నిచ్చలును నీమీఁద నెరపుఁగదె అతఁడు ॥సరికి॥

**అర్థములు:** ప. సరికి బేసికి = అయినదానికి కాని దానికీ, చలము = కంపము, విరసము = రసములేనిది,దోషము, చౌక = విరివిగా ఒక వస్తువు లభించటం.

1. గుట్టు = రహస్యము, రట్టు = నింద, చనవు = ప్రేమ,అభిమానము, కొనచూపు = ప్రక్కచూపు, కొసరు = కోరిక, గోణుగు = చిన్నగా మాట్లాడు, అసురుసురు = శ్రమవలన కలిగే నిట్టూర్పు, మునుపు = ముందు, పతికి ప్రతి = భర్తకు సమానము, ముంచెగదె = అతిక్రమించు.

2. సెలవినవ్వు = పెదవిమూల నవ్వు, చేసన్న = చేతితో చేయు సైగలు, బిగువు = పటుత్వము, నిలువు = ఆకృతి, నివ్వెరగు = పారవశ్యము, చలివాయు = బుజ్జగించు, చల్లు = చిమ్ము.

3 .పచ్చిదేరు = మరుగులేని, పదరు = త్వరపడి, ముంచు = దాటిపోవు, పెచ్చుపెరుగు = అధికమగు, కాగిటి = కౌగిటి, నిచ్చలు = ఎల్లవేళలా, నెరపు = నెరవేర్చు.

**భావము :** ఓ చెలులారా! అయినదానికి కానిదానికి ఈ విధంగా మీరు హడావుడి చేయదగునా! సరసమైనా, విరసమైనా యిప్పుడు అన్నీ విరివిగానే దొరుకుతున్నవి కదా!

మనసులో రహస్యంగా పెట్టుకున్న ఆలోచనలు, మాటలలోని నిందలాపాలు, ప్రేమతో ఉన్నటువంటి భర్తతో మాట్లాడడం న్యాయమేనా? వాలుచూపులలో ఉన్న కోరికలు, చిన్న చిన్నగా మాట్లాడే మాటలలో ఉన్న నిట్టూర్పులు ఇవన్నీ కూడా ముందే భర్తకు

సమానమైనాయి గదే!

పెదవిలోపలి నవ్వు చేతిసైగలలోని పటుత్వము, పతి చెంతకు పిలిచినప్పుడు ప్రదర్శించదగునా? నిండు ఆకృతిని గాంచిన పారవశ్యము, బుజ్జగింపులు నీమీద ఆ స్వామి విరజిమ్ముతున్నాడు గదే!

మరుగులేని కోరికలు త్వరపడి చేసుకునే ప్రమాణాలు గాంచినట్టి ఓ శ్రీవేంకటేశ్వరా! ఈవిధముగా విపరీతముగా ప్రవర్తింపతగునా? అధికమై అతిశయిస్తున్న ఈ ప్రేమలు, ప్రియమైన సంభాషణలు బిగువు కౌగిటిలో మాయమై, ఎల్లప్పుడూ ఆ స్వామి నీమీద ప్రేమలు కురిపిస్తాడు గదే!

## 454

**అవతారిక:** స్వామి అన్యకాంతతో పవళింపుసేవలో ఉన్నాడని గ్రహించిన అమ్మ అలమేలుమంగమ్మ ఆయనతో పరిహాసమాడుతున్నది.

### మాళవిగౌళ

ప. అంపవయ్యా నేఁబోయే నట్టేని వావాత
తెంపున నాయంతనైతే తెగరాదు పనులు ॥పల్లవి॥

1. కోపము గాదుగదా గొబ్బున నే వచ్చినది
ఆపెతో నీ వేకతము లాడేవేళ
చేపట్టి నేఁదొలఁగితే సిగ్గువుచ్చినట్టయ్యీ
యీపొద్దు నీవద్దనుంటే నేమౌనో నీయాస ॥అంపవయ్యా॥

2. యెగ్గు లెంచవుగదా ఇట్టె ముసుఁగు దీసితే
వొగ్గి ఆకెతోడిరతి నున్నవేళను
కగ్గి కమ్మరఁ గప్పితే కల్ల మోపినట్టయ్యీ
నిగ్గుల నే నూరకున్న నీ కెంతవెఱపో ॥అంపవయ్యా॥

3. నేరమి గాదుగదా నే నిన్నుఁ గాఁగిలించితి
నేరపున నాకెఁ గూడి నిద్రించేవేళ
యేరా శ్రీవేంకటేశ యెఱఁగనట్టె నన్ను
యీరీతిఁ గూడితివి వీక(క్క?)డి మోమగుచు ॥అంపవయ్యా॥

**అర్థములు:** ప. అంపవయ్యా = పంపించవయ్యా, వావాత = నోరార, తెంపు = తెగువ, నాయంత = నా మాదిరి, తెగు = ఛిన్నమగు.

1. గొబ్బున = శీఘ్రముగా, ఆపె = ఆమె, ఏకతము = సమాలోచన, తొలగు = వీడు, సిగ్గువుచ్చు = సిగ్గుపడు, ఆశ = కోరిక.
2. ఎగ్గు = కీడు, ఎంచు = లెక్కించు, ముసుగు = పైకప్పు వస్త్రము, ఒగ్గు = పూనుకొను, ఆకె = ఆమె, కగ్గు = వివర్ణమగు, క్రమ్మర = మరల, కల్ల = అబద్ధము, మోపినట్టు = ఆపాదించినరీతి, నిగ్గు = ఉత్కృష్టకాంతి, వెరపు = పరితాపము.
3. నేరమి = దోషము, కాగలించు = కౌగలించు, నేరపు = నేర్పు, ఆకె = ఆమె, కూడి = కలసి, ఎరగనట్టు = తెలియనట్టు, నీవిక్కడి = నీవు ఈతావున, మోమగుచు = పరిచితమైనవాడివలె.

**భావము :** పంపించవయ్యా! నేను త్వరగా వెళ్ళవలసి యున్నది. నోరారా తెగువ చేసి నాలాగున ఉన్నట్లైతే పనులు తొందరగా తెమలవు.

ఆమెతో తమరు ఏకాంత సమావేశంలో నుండగా నేను త్వరపడి వచ్చి ఇక్కడకు చేరినందుకు కోపగించుకోవడంలేదు కదా! నేను నీ చేయిపట్టుకుని వెళ్ళినట్లైతే సిగ్గుపడుతుందేమో! ఇలా నీవద్ద ఉండిపోతే నీ కోరికలు ఏమౌతాయో తెలియకున్నది స్వామీ!

ఆ కాంతతో రతిక్రీడలో నున్నవేళలో నేను నీ ముసుగు తీసి చూసినట్లైతే తప్పులెంచవు కదా! ఇలా తగ్గి మరలా ఆ ముసుగు కప్పినట్లైతే నీపై అబద్ధము ఆపాదించినట్లవుతుందేమో కదా! పోనీ అతిశయించి నేనూరకుందామంటే నీకు పరితాపము మితిమీరుతుంది

కదా!

నైపుణ్యంతో ఆమెతో కలసి నీవు నిద్రించే వేళలో నేను తటాలున వచ్చి నిన్ను కౌగలించితే తప్పేమీ అవదు కదా! ఏమిది శ్రీవేంకటేశ్వరా! ఏమీ తెలియని అమాయకుడివలె, పరిచితమైన ముఖారవిందముతో ఈ తీరుగా నన్ను కలసినావు.

## 455

**అవతారిక:** స్వామి అమ్మనుపట్టించుకోకుండా చెలికత్తెలతో కాలక్షేపం చేస్తున్నాడని కోపగించిన తనను బయటకు వెళ్ళేందుకు స్వామి అనుజ్ఞ కోరుతున్నది.

### పాడి

ప. దూతికలకు నీతోఁ బొద్దులు వుచ్చఁదగునా
నీతిగాదు యీడనుంటే నింద వచ్చుఁ జుమ్మీ ॥పల్లవి॥

1. యేమని చెప్పుదు నేను యింతితో మారుమాటలు
నేమాన నన్ను నంపవు నీవును రావు
కోమలినే రమ్మందునో కొంత వోరుచుమందునో
జామువోయె నంపరాదా చాలుఁజాలు తడవు ॥దూతికలకు॥

2. నేను వచ్చినపనికి నెలఁత కుత్తర మేది
పూని నాచేయి విడువవు పొందు గానము
నీనవ్వులు నెరపేవో నిజమును నిట్లనో
కానీలే మమ్మంపరాదా కడుబలి మేఁటికి ॥దూతికలకు॥

3. అంతేకదా ఆపెతోడి ఆడుకోలుమాట నీకు
ఇంతివాకిట నిలిచే వేమో నవ్వేవు
పంతాన శ్రీవేంకటేశ పడఁతిఁ గూడితి విట్టె
పొంతనే మమ్మంపరాదా పొసఁగె మాపనులు ॥దూతికలకు॥

**అర్థములు:** ప. దూతిక = చెలికత్తె, పొద్దులువుచ్చ = కాలక్షేపము చేయుట, నీతి = ధర్మము, నింద = అపవాదు, సుమ్మీ = సుమా.

1. ఇంతి = స్త్రీ, మారుమాట = వేరొకవిధమైన, నేమము = నియమము, కోమలి = స్త్రీ, ఓరుచుకొను = ఓర్పు వహించు, జామువోవు = పొద్దుపోవు, తడవు = నిమురుట.
2. నెలత = స్త్రీ, ఉత్తరము = జవాబు, పూని = యత్నించి, పొందు = కలయిక, కానము = చూడము, నెరపు = చేయు, మమ్మంపరాదా = మమ్మలను పంపింపరాదా, కడుబలిమి = ఎక్కువ బలవంతము, ఏటికి = ఎందులకు.
3. ఆపె = ఆమె, ఆడుకోలు = మాట్లాడే, ఇంతి = స్త్రీ, పంతము = పట్టుదల, పడతి = స్త్రీ, పొంతన = సమీపమున, పొసగు = అనుకూలించు.

**భావము :** స్వామీ! ఈ చెలికత్తెలకు మీతో కాలక్షేపం చేయడం అవసరమా? ఇది ధర్మం కాదు ఇక్కడ ఉన్నట్లైతే లేని పోని అపవాదులు రావా?

నేను వేరొకవిధంగా మీ గురించి మాటలు ఈ స్త్రీలతో ఏమని చెప్పగలను. నీవేమో నియమాన్ని అనుసరించి నన్ను పంపవు, నీవు కూడా రావు. ఆ అమ్మాయినే రమ్మందునా? లేక కొంత సేపు వేచి యుండవలెనా? జాము రాత్రి అయినా అర్థం కాకుండా ఉన్నది. ఇప్పటికైనా తడుముకోకుండా నన్ను పంపరాదా స్వామీ!

నేనిచ్చటికి వచ్చినందువల్ల నెలత జవాబులేని మూగదైనది. పోనీ పట్టుకున్న నా చేయి విడుస్తావా విడవవు, పొందూ ఉండదు. నీవేమో చిరునవ్వులు చిందిస్తూ ఉంటావు. నిజమేదో తెలియదు. కానీలే స్వామీ మమ్మైనా పంపించవచ్చుకదా ఇంత

ఎక్కువ బలవంతము చేయ తగునా?

నీవంతే స్వామీ! ఆమెతోడి ఎక్కడాలేని విధంగా మాటలు కలుపుతూ ఉంటావు. వాకిటిలో నిలిచి పట్టుదలతో నవ్వుతూ నిలబడతావు. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ తీరున పడతిని పొందు కలిసావు. సమీపములో నిలబడ్డ మమ్ము బయటకు వెళ్ళమని చెప్పవచ్చును కదా! మాకు చక్కబెట్టుకునే కార్యాలు అనేకం ఉన్నవి స్వామీ!

## 456

**అవతారిక:** స్వామి అమ్మ వంటరిగా నున్నప్పుడు చేసే చిలిపి చేష్టలకు అంతులేకున్నది. అది ఏవిధంగా అర్థం చేసుకోవాలో తెలియరాకున్నదని స్వామికి నివేదిస్తున్నది.

### సాళంగనాట

ప. నీ వెఱఁగవా యింత నిండుదొరవు
చేవలే చిగురులౌను సిగ్గుననుంటేను ॥పల్లవి॥

1. అంటి విడె మిచ్చేవు అందుకొనకుండరాదు
వెంటనే పెండ్లికో వీడుకోలుకో
వొంటి నున్నదాన నేను వొకరు సాకిరి లేరు
ఇంటివా రేమందురో నే నియ్యకొంటేఁగనక ॥నీ వెఱఁగవా॥

2. చెక్కు గోర నదిమేవు చేయివట్టి తోయరాదు
పక్కనఁ గూరిమికో పగసేసేవో
చిక్కితి నీపాల నేను చెప్పిచూప నెడలేదు
వొక్కట గురుతుపడి వూరకుండితేను ॥నీ వెఱఁగవా॥

3. కాఁగిలించవచ్చేవు కాదని తొలఁగరాదు
ఆఁగినజెట్టిసామో అంగరతియో
మూఁగుచు శ్రీవేంకటేశ ముంచి నన్నుఁ గూడితివి
కాఁగి ఇఁకనేమన్నా కైతప్పులౌను ॥నీ వెఱఁగవా॥

**అర్థములు:** ప. ఎరుగవా = తెలియదా, నిండు దొర = గంభీరుడు, చేవలు = సారము, చిగుర్లు = లేతవి.

1. అంటి = ముట్టుకొని, విడెము = తాంబూలము, వీడుకోలు = పోవుటకు అనుజ్ఞ, సాకిరి = సాక్షి, ఇయ్యకొను = ఒప్పుకొను.
2. చెక్కు = చెక్కిలి, గోరనదుము = గోటితోనొత్తు, కూరిమి = స్నేహము, పగచేయు = కోపమువహించు, పాల = చేత, ఎడ = దూరము, గురుతు = గుర్తు.
3. కాగలించు = కౌగలించు, తొలుగు = వీడు, జెట్టిసాము = మల్లయుద్ధము, అంగరతి = శరీరముతో చేయు రతిక్రీడ, మూగు = వాలు, ముంచి = అతిక్రమించి, కాగు = తపించు, కైతప్పు = పొరబాటు.

**భావము :** స్వామీ! తమకు తెలియదా! గంభీరుడైన దేవతామూర్తివి, నాకు సిగ్గులు సారవంతమై చివుళ్ళు తొడిగినవి.

వెంటనే వివాహానికో లేక వెళ్ళుటకు అనుమతి కోరుటకో తెలియరాకున్నది కానీ, నన్ను ముట్టుకొని తాంబూలమిస్తావు. నేను అందుకోకుండా వుండలేను. నేనిచ్చిట ఒంటరియై ఉన్నావు, వేరొకరు నాకు తోడు గానీ సాక్ష్యము కానీ లేరు. నేను సమ్మతము తెలిపినట్లైతే ఇంటిలో ఉన్నవారేమంటారో తెలియరావడంలేదు.

నా చెక్కిలిపై నీ కొనగోటితో వత్తుతుంటావు, నేను కాదు కూడదని చేయిపట్టి త్రోయలేను కదా! ఇలా నా ప్రక్కన చేరడం స్నేహానికి ఉన్నావో లేక కోపము వహించి ఉన్నావో తెలియదు సుమా! నేనీనాడు నీ చేత చిక్కి యున్నాను, ఏమి చెప్పినప్పటికి దూరంలేదు. ఒంటరిగా ఒక్కతెనై నీకీవిధముగా చిక్కి ఊరకుండిపోయాను.

నన్ను కౌగలించుకోవడానికి వస్తావు. కాదని దూరం పెట్టలేను. ఇది మల్లయుద్ధమో రతిక్రీడనో తెలియరాకున్నది. ఓ శ్రీవేంకటేశ్వరా! నాపై వాలి నన్నీవిధముగా కలసినావు. నేనిప్పుడు తాపముతో ఏమి చేసినప్పటికి అది పొరబాటు కార్యమే అవుతుంది కదా!

## 457

**అవతారిక:** అమ్మ పద్మావతీదేవి యొక్క ప్రవర్తనను, స్వామివారిని విడువక అంటిపెట్టుకుని యుండే స్వభావాన్ని చెలికత్తెలు అహోబిల తిరుమలనాధునికి వివరిస్తున్నారు.

### సాళంగం

ప. అళగరి చక్కనళగరి వో యళగరి
తలఁచుకోర నా మాట తారుకాణ సుమ్మీ ॥పల్లవి॥

1. అలిగితేఁ బోనీదు ఆకెకు లోనైనమీఁద
వలపు రేఁపుచు నిన్ను వంచుఁగాని
పలుకక పోనీదు పక్కున నవ్వినమీఁద
సళువుఁజూపులు నీపైఁ జాఁచుఁగాని ॥అళగరి॥

2. చవులు చూపుకపోదు సరసమాడినమీఁద
చివురుఁగెమ్మోవి గంటిచేసుఁగాని
అవల మాటాడనీదు అతివఁ జేకొన్నమీఁద
తివిరి నీవెంటవెంటఁ దిరుగాడుఁగాని ॥అళగరి॥

3. నిన్ను మెచ్చించకపోదు నలఁతఁ గూడినమీఁద
కన్నులు దేలగిలంగఁ గరఁచుఁగాని
అన్నిటా శ్రీవేంకటాద్రి నళగుఁదిరుమలను
వన్నె నీవుర ము మీఁదఁ గాఁపురమౌఁగాని ॥అళగరి॥

**అర్థములు:** ప. అళగరి = అందమైన కొండ, చక్కని అళగరి = చక్కనైఅన అహోబలస్వామి, ఓ అళగరి = ఓ అహోబల నారసింహా!

1. అలిగితే = కోపించితే, పోనీదు = వెళ్ళనివ్వదు, ఆకె = ఆమె, లోనగు = లోబడు, రేపుచు = అధికముచేయు, వంచు = లోబరచు, పక్కున = నవ్వుధ్వని, సళువచూపులు = భారమైన.
2. చవులు = రుచులు, సరసము = శృంగార చేష్ట, చివురు కెమ్మోవి = చిగురుటధరము, గంటి = గాటు, ఆవల = తర్వాత, అతివ = స్త్రీ, చేకొను = చేపట్టు, తివిరి = ప్రయత్నపూర్వకముగా.
3. అలత = బాధ, తేలగిలంగ = ఆయాసముతో కళ్ళు తేలవేయు, కరచు = కరగింపజేయు, అళగుతిరుమల = అహోబిలము వంటి తిరుమల కొండ, వన్నె = కాంతి, ఉరము = వక్షస్థలము, కాపురము = నివాసము.

**భావము :** ఓ చక్కనైన అహోబిలము మీద నివాసమున్న ఓ అహోబల నారనారసింహా! నా మాటలు నిదర్శనములు సుమా! సావధానముగా ఆలకించవయ్యా!

నీవు కోపగించినట్లైతే, నీవు ఆమెకు లోబడిన మీదట నిన్ను వెళ్ళనివ్వదు. ప్రేమలు కురిపిస్తూ నిన్ను లోబరుచుకోవడానికే యత్నిస్తుంటూ ఉంటుంది. పక్కుమని నవ్వులు నవ్వినమీదట నిన్ను ఆమె ఎక్కడికి కదలనివ్వక భారమైన వలపు చూపులు చూస్తూనే ఉంటుంది.

నీవు శృంగారంలో మునిగి సరసములాడిన పిమ్మట అనేకరకములైన రుచులనామె అందించకబోదు. పైగా నీ అధరముపై

గాయము చేయవచ్చు. నువ్వు ఒక్కసారి చేపట్టిన తర్వాత నిన్ను యేమాటా మాట్లాడనివ్వదు. ప్రయత్నినిచి నీ చుట్టూరా తిరుగూతునే ఉంటుంది.

ఒకసారి ఆమెతో కలిసిన పిమ్మట నీవు పొగడే విధంగా ప్రవర్తిస్తూ నీవు కన్నులు తేలవేసేటంత పరవశానికి గురిచేస్తుంది. అన్నిటికి శ్రీవేంకటేశ్వరా! ఈ అహోబిలమే తిరుమల కొండయౌను. ఇక ఆ కాంత నీ వక్షస్థలముపై స్థిర నివాసమేర్పరుచుకొంటుంది.

**విశేషము:** అన్నమయ్య అహోబిలానికి తిరుమలకు అభేదం సృష్టిస్తూ అళగు తిరుమల అని ప్రస్తుతిస్తున్నాడు.

## 458

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామి వారిని చూసిన మోహావేశంలో ఒక కార్యానికి పూనుకుంటే మరొక కార్యానికి దారితీస్తున్నదని స్వామికి విన్నవించే సన్నివేశం.

### ఆహిరి

ప. నే నొకటి సేయఁబోతే నేరుపు వేరొకటాయ
నానెను వలపులెల్లా నాఁడెనాఁడే అయ్యా ॥పల్లవి॥

1. మొక్కఁబోఁగానేపో ముంచినపయ్యద జారె
గక్కన నీతోనవ్వఁగాఁ గారెఁ జెమట
వెక్కసాన మాటాడఁగా వేఁడినిట్టూర్పులు రేఁగె
యెక్కడిగొడవ మాఇంట నుండేనయ్యా ॥నే నొకటి॥

2. దగ్గరి రాఁగాఁబో తనువెల్లాఁ బులకించె
సిగ్గువడఁగానేపో చింతరేఁగెను
వొగ్గి విడె మియ్యఁగాఁబో వొడలెల్లాఁ గాఁక పుట్టె
యెగ్గుతప్పులకు నోప ఇంటనుండేనయ్యా ॥నే నొకటి॥

3. కాఁగిలించఁగానేపో కళదాఁకె మేనెల్లా
రాఁగుఁదమకానేపో రచ్చకెక్కెను
పాఁగిన శ్రీవేంకటేశ పైపైఁ గూడితి నిన్ను
యేఁగుఁబెండ్లితో మాయింట నుండేనయ్యా ॥నే నొకటి॥

**అర్థములు:** ప. నేరుపు = నైపుణ్యము, వేరొకటి = మరొకటి, నాను = పరిపక్వమగు, నాడు = అంతము మునుపు.

1. మొక్కు = నమస్కరించు, ముంచిన = కప్పబడు, పయ్యద = పైటకొంగు, గక్కన = శీఘ్రముగ, కారె = స్రవించు, వెక్కసము = అధికము, రేగె = వ్యాపించె, గొడవ = తంటా.
2. తనువు = శరీరము, పులకించు = గగుర్పు కలుగు, చింత = బాధ, ఒగ్గి = పూనుకొని, విడెమిచ్చు = తాంబూలమిచ్చు, ఒడలు = శరీరము, కాక = తాపము, ఎగ్గు = దోషము, ఓప = ఓర్వలేను.
3. కాగలించు = కౌగలించు, కళ = శోభ, మేను = శరీరము, రాగు = అనురాగము, తమకము = తాపము, రచ్చకెక్కు = అల్లరిపాలగు, పాగు = పాకము, పైపై = పైపైన, కూడితి = కలిసితి, యేగు = ఉత్సవములలో తిరుగు.

**భావము :** స్వామీ అదేమి చిత్రమో తెలియదు. నేను ఒక కార్యము చెయ్యబోతే మరొకటిగా రూపుదిద్దుకొనుచున్నది. మన ప్రేమలన్నీ ముందే అతిశయించి పరిపక్వమైనవి.

నేను నమస్కరించబోగా నా పైటకొంగు జారిపడినది. నేను నీతో కలసి వెంటనే నవ్వబోగా నా శరీరముపై చెమట కారినది. కొంచెం అధికముగా మాట్లాడబోతే నాలో వేడి నిట్టూర్పులు వ్యాపించినవి. ఇదెక్కడి తంటా స్వామీ! మా యింటిలోనున్న స్వామీ!

నీ దగ్గరికి రావాలంటే నా శరీరమంతా పులకించిపోయి గగుర్పాటుకు గురవుతున్నది. సిగ్గుపడబోగా యేవో చింతలు

చుట్టుముట్టు చున్నవి. యత్నించి నీకు తాంబూలమియ్యబోవగా శరీరమంతా తాపముతో నుండిపోవుచున్నది. ఇలాంటి దోషములకు తప్పులకు నేను భరించలేకున్నానయ్యా! ఇదెక్కడి తంటా స్వామీ! మా యింటిలోనున్న స్వామీ!

నేను కౌగలించుకుందామంటే శోభలన్నీ నా శరీరముపై వ్యాపిస్తున్నవి. అనురాగమనే ఈ తహతహ వలన అల్లరిపాలై రచ్చకెక్కుతున్నాను. బాగా పరిపక్వమై నిలిచిన ఓ శ్రీవేంకటేశ్వరా! నీ పైపైన కలిసితిని. పెండ్లి ఉత్సవములో వెళ్ళే తీరుగా మా యింటిలోనున్న స్వామీ! ఇదేమి వైపరీత్యము స్వామీ!

## 459

**అవతారిక:** స్వామి చేసే దుందుడుకు పనులకు అమ్మ నిలువలేక పోతున్నది. ఎక్కడ పరిహాసాలకు గురి అవుతామోనన్న భీతితో స్వామిని వెళ్ళిపొమ్మని చెప్పండి అంటూ చెలులతో చెప్తున్నది.

### లలిత

ప. ఆడకే నే వచ్చినప్పు డయ్యీఁ గాని
బూడిద వసంతమాడఁ బొమ్మనవే వానిని ॥పల్లవి॥

1. వలపు జాతెఱఁగదు వాసి నీతి యెఱఁగదు
కలిమి ముందువెనక గాననియ్యదు
తెలిసితేఁ బసలేదు దిష్టమాయ మాకిన్ని
పొలసి కొసరనేల పొమ్మనవే వానిని ॥ఆడకే॥

2. కోపము దయయెఱఁగదు కూటమి సిగ్గెఱఁగదు
తీపులమోవి దప్పితీరనియ్యదు
రాఁపునేయఁ బనిలేదు రచ్చకెక్కఁ బనులెల్లా
పోపో అదేడసుద్ది పొమ్మనవే వానిని ॥ఆడకే॥

3. పాయము భీతెఱఁగదు పంతము తన్నెఱఁగదు
చాయలసన్నలముద్దు చవెఱఁగదు
యీయెడ శ్రీవేంకటేశుఁ డిపు డిట్టె నన్నుఁ గూడె
పోయి ఇట్టేవచ్చీఁగాని పొమ్మనవే వానిని ॥ఆడకే॥

**అర్థములు:** ప. ఆడకు = అచ్చటకు, అయ్యీ = అయేను,సమకూరేను, బూడిద వసంతమాడు = బూడిదతో స్నానము చేయు.

1. జాతి = పుట్టుక, వాసి = ఆధిక్యము, నీతి = ధర్మము, కలిమి = సంపద, కాననియ్యదు = చూడనివ్వదు, పస = సారము, దిష్టము = భాగ్యము, పొలయు = సంతోషపెట్టు, కొసరు = కోరు.
2. దయ = కనికరము, కూటమి = కలయిక, తీపులమోవి = తీయనైన అధరామృతాన్నిచ్చే ముఖము, దప్పి = దాహము, రాపు సేయు = నిప్పు అంటుకొను రగులు, రచ్చకెక్కు = అల్లరిపాలగు, పోపో = వెళ్ళవయ్యా, సుద్ది = మంచి.
3. పాయము = వయసు, భీతి = భయము, పంతము = పట్టుదల, తన్నెరుగు = తననుతాను తెలుసుకొను, చాయలు సన్నలు = శోభలు, సైగలు, చవి = రుచి, ఎడ = స్థానము.

**భావము :** చెలులారా! నేను అక్కడకు వచ్చినప్పుడే అన్నీ సమకూరుతవి కానీ, బూడిద వసంతమాడమని చెప్పి పొమ్మనవే వానిని.

ఈ ప్రేమనేది పుట్టుకను చూడదు, ఆధిక్యతలు ధర్మాన్ని పాటించవు. సంపద ముందువెనుకలనేమీ గమనించదు. ఈ విషయాలన్నీ తెలిస్తే పర్వాలేదు. ఇవన్నీ భాగ్యాలుగానే గోచరిస్తున్నాయి ఒకవైపు సంతోషం వ్యక్తం చేస్తూ మరోవైపు కోరికలు కోరడం న్యాయమా? పొమ్మని చెప్పవే వానిని.

కోపమనే గుణము కనికరము చూపదు. కలయికలు సిగ్గును తెలుసుకోలేవు. అధరామృతపానం చెయ్యడానికి అందించే

మోవి నుండి ఎంతగా అనుభవించినా తృప్తి తీరదు. నిప్పంటుకొన్న తీరుగా రగిలిపోతూ అల్లరిచేయడం ఎందుకు? పోపో పొమ్మనవే అదేమి మంచి కార్యమో ఎరగనైతిని. పొమ్మనవే!

ఈ యుక్త వయసు భయభక్తులనెరుగదు. ఈ పంతాలు పట్టింపులు అనేవి తనేమిటో, యేమి చేస్తున్నామో ఎటికకు రాకుండా చేస్తుంది. శోభలు సైగలతో దరిచేరే ముద్దులు రుచి అన్నవే ఎరుగవు సుమా! ఈ స్థానములో శ్రీవేంకటేశ్వరుడు నన్ను ఈ విధంగా నన్ను చేరి కలసినాడు. తాను వెళ్ళి మరలా ఇట్టే వచ్చేస్తాడు కానీ పొమ్మనవే స్వామిని.

## 460

**అవతారిక:** స్వామి అనురాగం తనపై ఉండీ ఉండనట్లున్నదని అమ్మ అలమేలుమంగమ్మ చింతిస్తున్నది

### రామక్రియ

ప. పాపమంటాఁ బాలిచ్చితేఁ బైపై నోకిలింతలాయ
కోపము శాంతముతోడఁ గూడెఁగా నీ చనవు ॥పల్లవి॥

1. నిండినది నామనసు నీమేఁద నేపొద్దు
పండెను నాకెమ్మోవి పంటలుగాను
వండ వండనట్లాయ వలపులు నీకైతే
యెండలు నీడలు నాయ నిదివో నీకరుణ ॥పాపమంటా॥

2. ననిచెను నీచూపు నంటిననీమేనిమీఁద
మొనసెను నానవ్వు ముంచి నీతోను
పొనిఁగి పుచ్చఁగఁబుచ్చ వున్నమాయఁ బొద్దునీకు
ఇనుము బంగారమాయ నిదివో నీమాటలు ॥పాపమంటా॥

3. తతివచ్చె నాకు నీకు దగ్గరి కాఁగిటిలోన
ప్రతివచ్చె నిద్దరికిఁ బాయములివి
ఇతవైన శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
కతకుఁ గాళ్లువచ్చెఁ గలిగె నీమన్నన ॥పాపమంటా॥

**అర్థములు:** ప. పాపమంటా = పాపమని, నోకిలింత = ఏవగింపు, చనవు = ప్రేమ

1. నీ మేద = నీ మీద, పొద్దు = పూట, కెమ్మోవి = అధరము, వండ వండనట్లాయ = వండినను వండని విధముగా, కరుణ = దయ.
2. ననుపు = అనురాగము, అంటు = తాకు, మేను = శరీరము, మొనయు = కలుగు, ముంచు = నిండు, పొనిగి = కాంతిమాయు, ఇనుము బంగారమగు = వెలలేనిది ప్రియమైనదగు.
3. తతి = సమయము, కాగిటి = కౌగిటి, ప్రతి = సమానము, పా(ప్రా)యము = వయసు, (హి)ఇతవైన = ఇష్టమైన, కత = కథ, కాళ్ళువచ్చు = వెళ్ళిపోవు, మన్నన = మర్యాద.

**భావము :** అయ్యో! పోనీలే పాపం అని పాలిస్తే పైన యేవగింపుతో డోకులు చేసుకున్నట్లున్నది, ఒకవైపు కోపము మరొకవైపు శాంతముతో నీ ప్రేమ కూడిఉన్నది సుమా!

నీ మీద నా మనసు ఏ దినమైనా తగ్గని విధముగా నున్నది. నా పెదవి పంటలు పండి, అధారామృతపానం కొరకు నీకై ఎదురు చూచుచున్నది. వంట వండినా వండని విధముగా నీ వలపులున్నవి సుమా! విచిత్రమైన ప్రేమ. ఎండలు నీడలు ఒకేసారి కలిగినట్లున్నది, యిదంతా నామీద నీ దయే కదా స్వామీ!

నా అనురాగము నీపై నిశ్చలముగా నీ మేనిపై నిలిచి యున్నది. నా నవ్వు నీపైననే నిండి ఉన్నది. ఈ పొద్దు గడపగా గడపగా

మాయగా గోచరిస్తున్నది. ఇప్పుడు వెలలేని ఇనుమే ప్రియమైనట్లగుచున్నది సుమా!

స్వామీ! నాకు నీ కౌగిటిలోకి చేరే సమయమాసన్నమైనది. ఇద్దరికి వయసు సమానమై ఈడు జోడు కుదిరినది. నాకు ప్రీతికరమైన ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను కలిసినావు. నీ మన్నన మర్యాద నాపై చూపడంతో కథకు కాళ్ళు వచ్చినరీతిగా, అన్ని బాధలు సమసిపోయినవి సుమా!

**విశేషము:** అన్నమయ్య ఆనాడు వాడికలో ఉన్న లోకోక్తులను, సామెతలను ఈ కీర్తనలో ప్రయోగించి వాటిని ఈతరం వారికి కూడా అందుబాటులోకి తెచ్చాడు. పాపమంటా పొలిచ్చితే, వండ వండనట్లాయె, ఇనుము బంగారమాయె, కథకు కాళ్ళు వచ్చె అనేవి ఈరీతిలో నున్నవి. అలాగే రెండు వైవిధ్య భరితమైన పదాలైన కోపము-శాంతము, ఎండలు-నీడలు వంటి ప్రయోగాలు సైతం గమనించదగ్గవి.

## 461

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామిపై కినుక వహించి దూరముగా యుండగా చెలులు అనుభవించవలెనని, స్వామిని చేరమని బుద్ధులు చెప్పే సన్నివేశం.

### సామంతం

ప. నీవెఱఁగని బుద్దులు నేము చెప్పమా
భావమే యెరుఁగుఁ గాన పచ్చి సేయఁగలమా ॥పల్లవి॥

1. పూవువంటిది వయసు భోగించవలెఁగాక
చేవదేరే యీసిగ్గు చెల్లఁబోయెలే
మీవంటివారికా మీరరానివొట్లివి
దైవము దూరుతగాక తగదనఁగలమా ॥నీవెఱఁగని॥

2. కప్పురమువంటి దిట్టె కలిగె నీమోహము
నిప్పువంటి విరహము నీకేలే
యిప్పుడిది వేళా ఇద్దరి యెగ్గులకును
చెప్పరాని చేఁత మీచేఁ జేయించఁగలమా ॥నీవెఱఁగని॥

3. పండువంటిది మోవి పదరి చేకొంటగాక
కొండవంటిదికోపము చేకొన నీకేలే
అండనే శ్రీవేంకటేశు నలమి కూడితి విట్టె
మెండుననుండేటిమిమ్ము మొచ్చనైనఁగలమా ॥నీవెఱఁగని॥

**అర్థములు:** ప. నీవెఱగని = నీకుతెలియని, బుద్ధులు = మంచి మాటలు, నేము = మేము, భావము = అంతరాలోచన, పచ్చిసేయు = మరుగులేకుండా చేయు.

1. భోగించు = అనుభవించు, చేవదేరు = సారవంతమగు, చెల్లబోవు = చెల్లనేరదు, మీరరాని = అతిక్రమించలేని, ఒట్లు = ప్రమాణాలు, దూరుత = నిందించుట, తగదు = కూడదు.
2. కప్పురము = కర్పూరము, విరహము = ఎడబాటు, ఎగ్గులు = అపరాధములు, చెప్పరానిచేత = చెప్పగూడని పనులు.
3. మోవి = ముఖము, పదరు = త్వరపడు, చేగొంట = అందుకొను, కొండవంటిది కోపము = అధికమైన కోపము, చేకొన = అందిపుచ్చుకొన, అండ = చెంత, అలమి = క్రమ్మి, మెండు = అతిశయించు, మెచ్చు = ప్రశసించు.

**భావము :** నీకు తెలియని సూక్తులు ఉంటాయా? అవి మేము నీకు చెప్పగలమా? అంతరాలోచనలు మాకు తెలిస్తే తెలియును కానీ అవన్నీ బహిరంగంగా చెప్పగలమా?

ఈ వయసనేది ఒక పుష్పం వంటిది త్వరగా వాడిపోతుంది కాబట్టి త్వరగా అనుభవించవలెను సుమా! సారవంతమైన ఈ సిగ్గులన్నీ ఇక చెల్లనేరవు. మీ లాంటి వారికివి అతిక్రమించలేని ప్రమాణాల్లాగా తోచును. దైవము నిందించినప్పటికి కాదని త్రోసిరాజనగలమా!

నీ మోహము అనేది కర్పూరము వలె కరిగిపోయే స్వభావము గలది. అగ్నిజ్వాల వంటి మోహము, తాపము నీకెందులకు? ఇప్పుడు ఒకరికొకరు తప్పులు, దోషములు ఎంచుకునే సమయమా యిది చెప్పు? చెప్పరాని పనులు మీచే చేయించగల శక్తియుక్తులు మాకున్నవా?

నీ ఫలము వంటి ముఖారవిందము త్వరపడి చేపట్టు గాక! నీ కాసమయములో కొండవంటి పెను కోపము నీకెందులకు? చెంతనే శ్రీవేంకటేశ్వరుని క్రమ్మి కూడుకున్నావు. ఇంత అతిశయించి యున్న మిమ్ములను ప్రశంసించడమనే మా వలన జరిగే కార్యమా చెప్పు

## 462

**అవతారిక:** స్వామి పట్ల సంకోచంతో అమ్మ అలమేలుమంగమ్మ ఏమి  కానుకలు పంపితే  యేమని భావిస్తాడోనని సతమతమవుతున్నది.

బౌళి

ప. ఏమని తా భావించునో యెఱఁగ నేను
చీమక (ల?) దొంతరమేలు చిమ్మి రేఁగెననవే ॥పల్లవి॥

1. అప్పుడే వచ్చేనంటి నటు నావిభునితోడ
అప్పస మెవ్వతుండునో యని మానితి
కప్పుర మంపేనంటిఁ గదియ నీ విరహాన
వుప్పతిల్లుఁ దాపమంటా నూరకుంటివి ॥ఏమని॥

2. వీడెమిచ్చి యంపేనంటి వెలఁదిచేతఁ దనకు
ఆడ వేళదెలియక అంపనైతిని
వేడుక విరులబంతి వేసేనంటా నుంటి
ఆడ నవి మరునమ్ము లవునని మానితి ॥ఏమని॥

3. కాఁగిటఁ గూడినవేళఁ గళలు రేఁచేనంటి
మాఁగినరతుల నేనే మఱచితిని
చేఁగదేర నన్నుఁ గూడె శ్రీవేంకటేశుఁడు వచ్చి
దాఁగనినవ్వులు నేనే తనమీఁదఁ జల్లితి ॥ఏమని॥

**అర్థములు:** ప. తా = తాను, యెరగ = తెలియదు, చీమకల = చీమలబారు (నూగారుకు ఉపమానము), దొంతర = పరంపర, చిమ్ము = చల్లు, రేగు = విజృంభించు.

1. విభుడు = భర్త, అప్పస = సతతము, మానితి = మానివేసితిని, కదియ = దగ్గరకువచ్చు, విరహము = ఎడబాటు, ఉప్పతిల్లు = పుట్టు, తాపము = తమకము.
2. వీడెము = తాంబూలము, వెలది = స్త్రీ, అంపనైతి = పంపలేకపోతిని, వేడుక = సంతోషము, విరులబంతి = పూలచెండు, మరునమ్ము = మన్మధుని బాణము.
3. కాగిట = కౌగిట, కళలు = శోభలు, రేచు = వ్యాపించు, మాగిన = పక్వమైన, చేగదేర = చేవదీర, దాగని = కప్పిపుచ్చలేని, చల్లితి = విసరితి.

**భావము :** స్వామి ఏమని అనుకుంటాడో నాకు తెలియదు సుమా! చీమలబారువంటి నూగారు పరంపర చల్లినట్లుగా విజృంభించెననవే!

నా విభుని తో కలసి అప్పుడే వద్దామని అనుకున్నాను కానీ ఎల్లవేళలా అక్కడ ఏ స్త్రీ ఉంటుందోనని రావడం మానుకొన్నాను. కర్పూరము పంపిద్దామని అనుకున్నాను, కానీ యెడబాటు భరించలేక ఊరకనే యున్నాను. పుట్టే కోరికలు తహతహల వలన యేమీ చేయలేక ఊరక యున్నాను.

స్వామికి తాంబూలమిచ్చి ఆ కాంత చేత పంపిద్దామనుకున్నాను, అక్కడ వేళ తెలియక పంపలేక పోయాను. సంతోషముతో పూలబంతులు విసురుదామనుకున్నాను, అవి మరలా తిరిగి మన్మథ బాణాలవుతాయేమోనని మానుకున్నాను.

కౌగిట చేరిన వేళ శోభలు అతిశయించగా పక్వమైన రతులతో కూడి మరచిపోయాను. సారవంతమై శ్రీవేంకటేశ్వరుడు నన్ను చేపట్టినాడు. దాచినా కప్పిపుచ్చుకోలేని నవ్వులను ఆ స్వామి మీద విసిరాను సుమా!

## 463

**అవతారిక:** కోరికలతో కాగిపోతున్న స్వామిని గమనించి "ఇక నీతో పని కాదు సుమా!" అంటూ అమ్మ సున్నితంగా మందలిస్తున్నది.

### శంకరాభరణం

ప. ఒక్కటే విన్నపమిది వున్నవెల్లా నేమిటికి
పక్కన విచ్చేయు మా కాపని గాదుసుమ్మీ ॥పల్లవి॥

1. తమకించినది చెలి తడవాయ నే వచ్చి
నిమిషము రాకున్న నీకే తెలుసు
చెమటలవెల్లి వారె చింతాజలధి నిండె
భ్రమసితి మిఁక మాకుఁ బనిగాదుసుమ్మీ ॥ఒక్కటే॥

2. చూపుల నున్నది యాస సుదతిమనసు లేఁత
యేపాటి గలఁగినా నిఁక నేమౌనో
మోపులాయఁ గోరికలు ముక్కున నూర్పులు రేఁగె
పాపము పుణ్యము మా కాపని గాదుసుమ్మీ ॥ఒక్కటే॥

3. దోమతెర మీకు మాటు తొయ్యలికి వినవచ్చు
యేమాటయిన నాడు ఇఁక మమ్మంపు
సామాన శ్రీవేంకటేశ సంధించి కూడితి విట్టె
భామ మెచ్చె నిఁక మా కాపని గాదుసుమ్మీ ॥ఒక్కటే॥

**అర్థములు:** ప. విన్నపము = వినతి, ఏమిటికి = ఎందుకు, విచ్చేయు = వచ్చు, కాదు = కుదరదు, సుమ్మీ = సుమా (నిశ్చయార్థకము).

1. తమకించు = తహతహలాడు, చెలి = స్త్రీ, తడవాయ = ఒకమారాయ, వెల్లివారు = ప్రవహించు, చింతాజలధి = శోక సముద్రము, భ్రమయు = భ్రాంతికి లోనగు, పనికాదు = ఆ పని మా వల్లకాదు.

2. చూపుల = చూచుటకు, ఆశ = కోరిక, సుదతి = స్త్రీ, లేత = తరుణ వయస్సు, ఏపాటి = ఎంతమాత్రము, మోపులు = కట్టలు, ఊర్పులు = శ్వాస, రేగె = చిమ్మెను.

3. తొయ్యలి = స్త్రీ, మమ్మంపు = మమ్ములను పంపించు, సామాన = పరిక్రమించి, సంధించు = కలిగించు, భామ = పడతి.

**భావము :** అయ్యా! స్వామీ! నాది నా వినతి ఒక్కటే మీకు, ఇంక మిగిలిన వినతులెల్లా ఎందులకు? మీ ప్రక్కనే కూర్చోవడానికి ఇక నాకు నీతో నీతో కుదరదు. పని కాదు సుమా!

ఆ చెలి మీకోసం తహతహలాడుతున్నది. నేను ఇక్కడకు విచ్చేసి ఒక మారయినది. నిముషం రాకపోతే ఆవిషయం నా కంటె మీకే ఎక్కువ అర్థమవుతుంది. చెమటలతో శరీరము ముద్దముద్దై మునిగిపోతారు. ఏదో మత్తులో మునిగాను కానీ ఇక నీతో పని కాదు సుమా!

నీ కోరికలు మొత్తం నీ కళ్ళలోనే కనబడుతున్నవి. ఆ కాంత మనసు మరీ లేలేతదై కనిపిస్తున్నది. ఎంతమాత్రం సాహసించినా యిక ఏమౌతుందో మీకే తెలియాలి సుమా! కోరికలు ఒకవైపు కట్టలైనవి. ముక్కున వేడి వేడి నిట్టూర్పులు వచ్చుచున్నవి. పాపము పుణ్యం చెప్పడానికి మాపని కాదు పైగా మాకు చెప్ప వల్లకాదు సుమా!

వేసుకున్న దోమతెర మీకు దాగడానికి బాగా అనువై యున్నది. ఆ స్త్రీకి మీ మాటలు హాయిగా వినుటకు వీలవుతుంది. ఏమాటైనా సరే చెప్పి మమ్మ ఇక్కడనుండి బయటకు పంపండి. పరిక్రమించిన రీతిగా ఓ శ్రీవేంకటేశ్వరా! ప్రేమానురాగాలు కలిగించేవిధంగా కూడినావు. ఆ భామ సైతం మీ కార్యాలకు ముగ్ధురాలై యున్నది. యిక మా పని ఏమీకాదు సుమా!

## 464

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ విరహవేదన వర్ణనాతీతమై ఉన్న సన్నివేశం.

## సామంతం

ప. నిండెను కళలు సతి నిలువెల్లను
పండిన జవ్వన మేరుపరచేటిదెట్లో ॥పల్లవి॥

1. చిత్తము చీఁకటివడె చెలి నిన్నుఁ బాయఁగాను
పొత్తులఁ జుక్కలుగాసెఁ బులకలను
బిత్తరపుమోనానఁ బికములు గూండ్లెక్కె
వుత్తలాన కాంత కొఁక నుదయమౌ టెపుడో ॥నిండెను ॥

2. మెలుఁతకు కొప్పు వీడి మేఘములు ముంచుకొనె
జలజలఁ జెమటలజడి వట్టెను
కలువకన్నులు మంచికారుమెఱుఁగులు మించె
కలికికి వెలుతురు గనియేది యెపుడో ॥నిండెను ॥

3. పడఁతికి నీరాక పచ్చిగాలియై వీచె
చిదుముడిఁ గోరికలె చిగురించెను
యెదయక శ్రీవేంకటేశ ఇంతిఁ గూడితివి
కడఁగె వసంతవేళ కందువ యిఁకేదో ॥నిండెను ॥

**అర్థములు:** ప. కళ = శోభ, సతి = భార్య, నిలువెల్లా = శరీరం మొత్తం, జవ్వనము = యుక్తవయసు, ఏరుపరచు = వింగడించు,కేటాయించు.

1. చిత్తము = మనసు, చీకటివడె = అంధకారమాయెను, పాయు = వీడు, పొత్తులు = స్నేహము,కలయిక, చుక్కలుగాసె = అందకుండాపోయినవి, పులక = గగుర్పాటు, బిత్తరపు = దిగ్భ్రమచెందు, పికములు = కోయిలలు, గూండ్లెక్కె = గూటికి చేరెను, ఉత్తలము = పరితాపము.
2. మెలత = స్త్రీ, మేఘములు = నల్లనైన, ముంచుకొను = వ్యాపించు, చెమటలజడి = చెమటలు జాలువారు, కలువకన్నులు = తామరపూవు, కారుమెరుగులు = నల్లనైన మెరుపులు, కలికి = స్త్రీ, గని = సంపద.
3. పడతి = స్త్రీ, పచ్చిగాలి = లేలేత పిల్లవాయువులు, చిదుముడి = వ్యాకులత, కడగు = యత్నించు, వసంతవేళ = మదనోత్సాహమున్న ఆమని కాలము.

**భావము :** కాంత నిలువెల్లా శోభలు అతిశయించినవి. ఈ యవ్వనముతో నిండినటువంటి తహతహలను తగ్గించే విధానమేదో ఎరుకరాకున్నది.

చెలి నిన్ను వీడగానే మనసంతా అంధకార బంధురమయింది. స్నేహాలు కలయికలు అందనివైనవి, శరీరము గగుర్పాటుతో

నిండి తత్తరపాటుతో దిగ్భ్రమతో నిండినది. కోయిలలు గూళ్ళకు చేరినవి. పరితాముతో కాకతో ఉన్న ఈ కాంతకు ఉదయమెట్లగునో!

చెలికి కొప్పు ముడి వీడి ఆ నల్లని కురులు మేఘసదృశమైనవి. శరీరమంతా చెమటలు ధారల్లా జలజలా కారిపోవుచున్నవి. ఆమె తామరపూలవంటి కన్నులు నల్లని మెరుపులను మించినవి. ఇక ఆ కాంతకు చీకటి వీడి కాంతులు వెల్లివిరిసేదెపుడో!

ఆ స్త్రీకి తన భర్త రాక లేలేత పిల్లవాయువులు వీచినట్లైనది. వ్యాకులతో ఉన్న కోరికలన్నీ ఒక్కసారి చిగురించి విజృంభించినవి. ఓ శ్రీవేంకటేశ్వరా! వీడకుండా ఆ నెలతను కలిసితివి. ఇంతకంటే మదనోత్సాహియైన ఆమని కాలము వేరొకటి గలదా!

## 465

**అవతారిక:** స్వామి అన్యకాంతలతో కూడి వచ్చిన విషయము ససాక్ష్యాలతో కనిపెట్టిన అమ్మ స్వామిని నిలదీసి రోజూ ఈ గొడవలేమిటి స్వామీ! అని ప్రశ్నిస్తున్నది.

### పాడి

ప. నిచ్చా జగడమేల నీ వెఱఁగవా
యిచ్చట నీమేన నవే యియ్యకోరాదా ॥పల్లవి॥

1. తప్పనిబొంకనిమాఁట తలఁపు లోపలితీఁట
నెప్పున నే నాడనేల నీ వెఱఁగవా
కప్పురవిడెముకాఁక కమ్మఁబులకలమూఁక
చొప్పునవట్టిచ్చీ నద్దము చూచుకోరాదా ॥నిచ్చా॥

2. చుక్కలు నిండిమోవి సొలపుఁగన్నులకావి
నిక్కమౌత కల్లవుత నీవెఱఁగవా
ముక్కున నీబుసకొట్టు ముసిముసినవ్వులగుట్టు
దిక్కులవారి నడిగి తెలుసుకోరాదా ॥నిచ్చా॥

3. వుబ్బునఁజేసినచేఁత వొడలిపై గోరివాఁ (వ్రా?)త
నిబ్బరపు రతివేళ నీవెఱఁగవా
గొబ్బున శ్రీవెంకటేశ కూడితివి నన్ను నిట్టె
తబ్బిబ్బు తడఁబాట్లు దాఁచుకోరాదా ॥నిచ్చా॥

**అర్థములు:** ప. నిచ్చా = నిత్యము, జగడము = గొడవ, మేన = శరీరమున, ఇయ్యకొను = సమ్మతించు.

1. బొంకు = అబద్ధము, తలపు = ఆలోచన, తీట = దురద, నెప్పున = స్థానము, ఆడనేల = చెప్పనేల, కప్పురవిడెము = కర్పూరపు తాంబూలము, క్రమ్ము = వ్యాపించు, పులకలమూక = గగుర్పాటుల సమూహము, చొప్పున = పద్ధతిలో, వట్టిచ్చీ = పట్టిచ్చెను.
2. సొలపు = పారవశ్యము, కన్నులకావి = ఎర్రనైన కన్నులు, నిక్కము = నిజము, కల్ల = అబద్ధము, బుసకొట్టు = నిట్టూర్చు, ముసిముసినవ్వులు = చిరునవ్వు, గుట్టు = రహస్యము, దిక్కువారి = రక్షకులు.
3. ఉబ్బున = పొంగిన, చేత = కార్యము, ఒడలు = శరీరము, గోరివాత = గోటి గుర్తు, నిబ్బరము = నిశ్చలము, గొబ్బున = శీఘ్రముగా, తబ్బిబ్బు = ఒకటిచేయబోయి ఒకటిచేయుట, తడబాటు = వేగిరపడు.

**భావము :** స్వామీ! ప్రతిరోజూ ఈ గొడవలేమిటి? నీకేమీ తెలియదా? నీ శరీరముపై ఈవిధముగానున్న గుర్తులను చూసైనా సమ్మతించరాదా!

ఆడితప్పే నీమాట మనసులోని ఆలోచనలకు దురద అని తెలియదా? ఈ స్థానములో ఉండి నేను చెప్పవలెనా నీవెరుగనిదా? కర్పూరపు తాంబూలము కాకుండా నీ మేన గగుర్పాటు గుములై అతిశయించి ఉన్నది. పద్ధతి గమనించైనా అద్దములో చూచుకుంటే

నీకు తెలియదా?

నీమోవిపై చుక్కలు నిండినట్లు, అమితానందముగా నున్నది. నీ కన్నులలోని ఎర్రజీరలు చూసినట్లైతే నీవు చెప్పేది నిజమా? అబద్ధమా అని నీకు తెలియదా? నీ ముక్కు నుండి వచ్చే దీర్ఘ నిట్టూర్పులు, నీ చిరునవ్వుల రహస్యం ఆ చుట్టూ ఉన్న వారినైనా అడిగి తెలుసుకోరాదా?

ప్రేమ పొంగి చేసిన పనుల తీరు నీ వొంటిపై గోటి గుర్తులు నిశ్చలంగా చేసిన రతిక్రీడ సమయములోనివని నీకు తెలియదా? ఓ శ్రీ వేంకటేశ్వరా! శీఘ్రముగా వచ్చి నన్ను కూడితివి, ఇకనైనా ఆ వేగిరపాటు, ఒక పని చేయబోయే ఇంకొకటి చేసే నీ తబ్బిబ్బులు అన్నీ దాచుకోవచ్చును కదా!

## 466

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ ఏదో చెప్పరాని బాధను అనుభవిస్తుండగా చెలులు వశమైన భర్త నీ వద్ద నుండగా ఈ చింత యేలయని సమాధానపరుస్తున్నారు.

### గౌళ

ప. అసురుసురుల నీకు నలపేఁటికే
వసమై యతఁడు నీవద్ద నుండీఁగాక ॥పల్లవి॥

1. యెలజవ్వనివి నీవు యేల చిన్నఁబోతివే
వలచినపతి నేఁడే వచ్చిఁగాక
నిలువునఁ దలవంచి నేలవాఁ(వాఁ?)త లేఁటికే
చెలువపునీచనవే చెల్లించీఁగాక ॥అసురు॥

2. చెక్కుచేతితోడ వట్టి చింతఁ బొరల నేఁటికే
వొక్కటై పతిఁగూడి నీ వుండేవు గాక
ముక్కున వేలుమోపి మోనపువెర గేఁటికే
మిక్కిలి విభుఁడు నిన్నే మెప్పించీఁగాక ॥అసురు॥

3. పచ్చికస్తూరి నుదుటఁ బట్టువెట్ట నేఁటికే
మచ్చిక నీరమణుఁడే మన్నించీఁ గాక
అచ్చపు శ్రీవేంకటేశుఁ డాతఁడే నిన్నుఁ గూడె
యిచ్చట నొడఁబాటేనే యీడ నుండీఁగాక ॥అసురు॥

**అర్థములు:** ప. అసురుసురు = బాధతో ఉండు, అలపు = బడలిక, వసమై = వశమై.

1. ఎలజవ్వని = యౌవనముతోనున్న స్త్రీ, చిన్నబోవు = తలవంచుకొను, వలచినపతి = ప్రేమించిన భర్త, నేలవాత = కాలిపైనేలమీద వ్రాయు, చెలువపు = అందమైన, చనవు = ప్రేమ, చెల్లించు = యిచ్చు.
2. చెక్కు = చెక్కిలి, చింత = బాధ, పొరలు = దొర్లు, ఒక్కటై = ఒక్కదానివై, ముక్కున వేలు మోపు = ముక్కుమీద వేలు వేసుకొని ఆలోచించు, మోనవెరగు = మౌనముతో కూడిన ఆశ్చర్యము, మిక్కిలి = అధికముగా, విభుడు = భర్త, మెప్పించు = ప్రశంసలకు గురిచేయు.
3. పచ్చికస్తూరి = క్రొత్తదైన కస్తూరి, బట్టు = బొట్టు, మచ్చిక = అలవాటైన, ఒడబాటు = సమ్మతము, ఈడనుండి = ఈ సమయము నుండి.

**భావము :** ఈబాధేమిటి? నీకు ఈ బడలికలు ఇవన్నీ ఎందులకు? ఆ స్వామి నీకే వశమై, నీ వద్దనే ఉన్నాడు కదా!

నీవు నిండు యౌవనముతో నున్న స్త్రీవి నువ్వు తలవంచుకొని చిన్నబోయినట్లుండడమెందులకు? నిన్ను ప్రేమించిన భర్త ఈ

రోజు విచ్చేస్తాడు కదా! నిలువుగా తలవంచుకొని నేల చూపులు చూస్తూ నేలపై కాలి బొటనవ్రేలితో రాయడం ఎందుకే! ప్రేమతో కూడిన నీ అనురాగమే స్వామికి పంచి యివ్వు!

చెక్కిలిపై చేయి వేసుకొని బాధతో అటూ ఇటూ పొర్లడం ఎందుకు? నీవు పతి ఒక్కటై కూడి ఉంటారు కదా! ఆ ముక్కున వేలు వేసుకుని ఆ ఆలోచనలతో మౌనంగా ఆ ఆశ్చర్యపు చూపులెందులకు? ఆ అధికుడైన నీ భర్త నువ్వు మెచ్చేట్టు ప్రవర్తిస్తాడు కదా!

క్రొత్తదైన కస్తూరి బొట్టు నుదుటన ధరించమెందుకు? అలవాటైన నీ విభుడు నిన్ను చేరదీసి మర్యాదలు చూపుతాడు కదా! అసలు సిసలైన ఆ శ్రీవేంకటేశ్వరుడే వచ్చి నిన్ను కలసినాడు. ఆ స్వామే నీ దరిచేరినపుడు, ఇంకా సమ్మతాలు అవీ ఇవీ అని చింతించడమెందులకు?

## 467

**అవతారిక:** అమ్మ స్వామిచేసే అకార్యాలకు విసికిపోయి నా భాగ్యమింతే! నీ కొలువులోని సేవ చేసుకునే అదృష్టమే చాలు చాలు అంటున్నది.

### ముఖారి

ప. కప్పురము దిననేల కదుఁ జలిఁ బడనేల
అప్పటికి నాభాగ్య మంతి నంతె చాలును ॥పల్లవి॥

1. వద్దువద్దు అంతలేసి వట్టి చనవులు మాకు
పెద్దరికముతో నుండేబిగువే చాలు
తిద్దనేల నీగుణాలు తిట్టించుకొననేల
అద్దో యీడ నుండఁగా నైనపాటే చాలును ॥కప్పురము

2. ఆయ నాయ జాణతనా లంతేసి కోప నేను
చేయి చెక్కిటితో నుండేసిగ్గే చాలు
ఆయము లంటఁగనేల అద్దలింపించుకోనేల
చాయల సన్నలలోని సంతసమే చాలు ॥కప్పురము ॥

3. పట్టకు పట్టకు నీతో పంతము నెరపఁగనేర
గుట్టుతో నీసముకపుఁ గొలువే చాలు
యిట్టె శ్రీవేంకటేశ యిడె నన్నుఁ గూడితివి
జట్టిగొన్న నీ మోవిచవులే చాలును ॥కప్పురము ॥

**అర్థములు:** ప. కప్పురము = కర్పూరము, కడు జలి = ఎక్కువ భయము, అప్పటికి = ఆసమయానికి, భాగ్యము = అదృష్టము, చాలును = సరిపోయినది.

1. చనవులు = ప్రేమలు, పెద్దరికము = గౌరవము, బిగువు = బింకము, తిద్ద = దిద్ద, గుణాలు = స్వభావాలు, అద్దో = అదిగో, ఐనపాటు = జరిగిన శ్రమ.
2. ఆయనాయ = జరిగినదేదో జరిగినది జాణతనము = నేర్పరి తనము, ఓప = ఓర్వ, చెక్కిటి = చెక్కిలిపై, సిగ్గు = సంకోచము, ఆయము = మర్మస్థానములు, అద్దలించు = అదలించు, చాయలు = శోభలు,సన్నలు = సైగలు, సంతసము = సంతోషము.
3. పట్టకు = పంతము పట్టవద్దు, పంతము = పట్టుదల, నెరగపనేర = నేర్పేర్చుకోలేను, గుట్టు = రహస్యము, సముఖము = సన్నిధి, కొలువు = సేవ, ఇట్టె = అతి త్వరితముగా, కూడు = కలియు, జట్టిగొను = వెలకుకొను, మోవిచవులు = అధరామృతము.

**భావము :** స్వామీ! అసలు కర్పూరము నోటబెట్టి తినడమెందుకు? తర్వాత భయపడడమెందులకు? అదంతా ఆసమయములోనున్న

నా అదృష్టముగా భావించాలి. నాకు అంతే చాలును.

స్వామీ! అంత ప్రేమాభిమానాలు అనురాగాలు వద్దు వద్దు! నీవు గౌరవముతో బిగువుగా ఉండడమే చాలు. నీ స్వభాము దిద్దడానికి యత్నించడమెందుకు. నీచేత చీవాట్లు తినడమెందుకు? అదిగో ఇక్కడ ఉండగా జరిగిన విషయమింక చాలు సుమా!

స్వామీ! నీ నేర్పరి తనాలు ఇంతగా చూపించడం నేను ఓర్చుకోలేకపోతున్నాను. నాకు చెక్కిలిపై చేయివేసుకొని సిగ్గుపడే సిగ్గు చాలు. జీవస్థానము లంటుకోవడమెందుకు? నీతో గద్దింపులు పడడమెందుకు? శోభల సైగలలో ఉన్న సంతోషమే నాకు చాలు సుమా!

స్వామీ! నాతో పంతాలు పట్టింపులకు పోవద్దు. నీతో నేను గెలువజాలను. రహస్యముగా నీ కొలువులో సేవలు చేసుకోవడము చాలు. ఓ శ్రీవేంకటేశ్వరా! సత్వరమే నన్ను కూడితివి. వెలకట్టలేని నీ అధరామృతమే నాకు చాలు

## 468

**అవతారిక:** స్వామిపట్ల ఉదాశీనంగా వ్యవహరిస్తున్న అమ్మ అలమేలుమంగమ్మతో చెలులు అతణ్ణి కలిసి అన్నీ మాట్లాడమని చెప్తున్నారు.

### రామక్రియ

ప. ఆతనిఁ గూడినప్పుడే అన్నియు సాదించవమ్మా
రాతిరాయ నిఁకనైనా రమ్మనవమ్మా ॥పల్లవి॥

1. అంపినమాట కుత్తర మానతియ్యవమ్మా
వంపుమోముతో నలుక వలదమ్మా
పంపుడుచెలుల మింతే పలుక విదేమమ్మ
చెంప జారినతురుము చెరుగుకోవమ్మా ॥ఆతని॥

2. తమకించే పతితో నీతలఁపు లేమందుమమ్మ
కొమరుఁ జూపులలోన కోపమేలమ్మా
జమళి నిద్దరి కూడిగములవారమమ్మ
చెమరించే మేనెల్లాఁ జిన్నఁ బోకువమ్మా ॥ఆతని॥

3. యెదురుగా వచ్చు నాతఁ డిట్టె మమ్మంపవమ్మ
కదిసితి విఁత నీకుఁ గడుమేలమ్మా
యెదుట శ్రీవేంకటేశుఁ డేఁగివచ్చి నిన్నుఁ గూడె
వదలఁడు దిన మిట్టె వచ్చీ నోయమ్మా ॥ఆతని॥

**అర్థములు:** ప. కూడినప్పుడు = కలసియున్నప్పుడు, సాదించు = నిందించు, రాతిరాయ = రాత్రి అయినది, ఇకనైనా = ఇప్పటికైనా.

1. అంపినమాట = పంపించిన మాట, ఉత్తరము = బదులు, ఆంతిచ్చు = సెలవు, వంపుమోము = వంచిన తల, అలుక = కోపము, పంపుడు చెలులు = పంపించిన చెలికత్తెలు, పలుక = మాట్లాడ, ఇదేమమ్మా = ఇదేమిటమ్మా, చెంపజారిన తురుము = చెంపల వరకూ జారిన వెంట్రుకల సమూహము, చేరుగుకో = సరిచేసుకో.
2. తమకించు = మోహపడు, తలపు = ఆలోచన, ఏమందు = ఏమని చెప్పుదును, కొమరు = మనోజ్ఞమైన, జమళి = జత, కూడిగముల = కలిపేటి, చెమరించు = చెమటలుపోయు, మేను = శరీరము, చిన్నబోవు = ఉత్సాహం లేకపోవటం.
3. ఇట్టె = త్వరగా, అంపు = పంపు, కదియు = దగ్గరగు, కడుమేలు = ఎక్కువ శుభము, ఏగి = ప్రయాణించి, కూడె = కలసె, దినమిట్టె = ఈదినమంతయు, ఇట్టె = వెంటనే, వచ్చీ = వచ్చెను.

**భావము :** ఓ అలమేలుమంగమ్మా! ఆ స్వామివారిని కలసినప్పుడే అన్నియు వివరించి సాధించి మాట్లాడవమ్మా! ఇంత రాత్రయినది

ఇకనైనా రమ్మని చెప్పవమ్మా!

నీవు స్వామి చెప్పి పంపిన మాటకు జవాబివ్వవమ్మా! వంచుకొన్న మోముతో కోపము బూనవద్దు. ఎప్పుడైనా స్వామి వద్దకు పంపించే మా చెలుల స్వభావమిలాగే ఉంటుంది కదా! మాట్లాడవేమమ్మా! నీ చెంపలవరకూ జారిన వెంట్రుకల కొప్పును సరిచేసుకోవమ్మా!

మోహపడే భర్తతో నీ మనసులో ఏమి ఆలోచనలు చేస్తున్నావు? ఆ మనోజ్ఞమైన చూపులలో కోపమెందుకు ప్రదర్శిస్తావు? మీ యిద్దరి జంటను కలిపేందుకే మేమిక్కడ ఉన్నవారమమ్మా! నీ శరీరమంత ఇలా చెమటతో తడసి ముద్దయినది గదా! మీరీవిధముగా ఉత్సాహం లేకుండా ఉండడమెందులకు?

అదుగో స్వామి ఎదురుగుండా వచ్చుచున్నాడు, త్వరగా నీ కోపం మాని ఆయనను మన్నించు. ఇద్దరూ దగ్గరైనారు కదా! ఇంకా దిగులెందుకమ్మా! శ్రీవేంకటేశ్వరుడు ఎదురుగా విచ్చేసి నిన్ను కలసినాడు. ఇంక నిన్ను ఈ రోజంతా వదలడు, త్వరగా రావమ్మా!

## 469

**అవతారిక:** స్వామి అమ్మ కోసం వెదకుతూ ఎక్కడనున్నదని చెలులను ప్రశ్నిస్తూ, ఆమె ఇప్పుడు ప్రణయకోపంతో ఉన్నప్పటికి, ఆమె తలపులన్నీ నా మీదనే ఉంటాయని చమత్కరిస్తున్నాడు.

### పాడి

ప. గక్కున నింట లేనిది గానుగకాడ నున్నదా
నక్కువడ నిందుకే పో నవ్వితి నే ననరే ॥పల్లవి॥

1. తా నేడనుండిన నేమి తలఁ పొక్కటైనఁ జాలు
ఆనలు సత్యాలఁ జెప్పి యంపవలెనా
దానికే మెదురుమాట తనతో నే నాడేనా
మోనాన నిట్టె తనకు మొక్కితి నే ననరే ॥గక్కున॥

2. యేదిక్కు చూచిననేమి యీడకు విచ్చేసెఁ జాలు
యీదెస నొడఁబరచ నింతవలెనా
కాదని తనచేఁతలు ఖండించఁజెల్లునా
వాదు లడువక తలవంచితి నే ననరే ॥గక్కున॥

3. అసురుసు రై తేనేమి అట్టె నన్నుఁ గూడెఁ జాలు
వసమై నాకిఁక వెరవఁగవలెనా
యెసఁగి శ్రీవేంకటేశుఁ డిన్నిటా నన్ను మన్నించె
రసికుఁడు తాను నారపమాయ ననరే ॥గక్కున॥

**అర్థములు:** ప. గక్కున = త్వరగా, గానుగ = నూనె మొదలైనవి తీసే స్థలము, నక్కువడు = ఒదిగియుండు.

1. తలపు = ఆలోచన, ఆనలు = జాడలు, సత్యాలు = నిజములు, మెదురుమాట = మెదడుతో చెప్పు మాట (నెల్లూరు మాండలికం), మోనము = మౌనము, మొక్కు = నమస్కరించు.
2. ఏ దిక్కు = ఏవైపు, విచ్చేయు = వచ్చి చేరు, దెస = దిక్కు, ఒడబరచు = వశమగు, చేతలు = పనులు, ఖండిచు = వ్యతిరేకించు, వాదులాడు = వాదులు = పంతము, అడువ = లోకువ.
3. అసురుసురు = బాధతో మాట్లడు, వసము = ఆధీనము, వెరపు = భయము, ఎసగు = విజృంభించు, రసికుడు = శృంగారపురుషుడు, ఆరపము = తీర్చుట.

**భావము :** ఇంటలేని ఆమె, త్వరత్వరగా వెళ్ళి ఆ గానుగ వద్ద నున్నదా! ఒదిగియున్న నేను నవ్వినది అందుకే ననరే చెలులారా!

ఆమె ఎక్కడా ఉన్నా పర్వాలేదు కానీ ఆమె ఆలోచనలన్నీ ఒక్కటిగా ఉంటే చాలు. కోరికలు, నిజాలు చెప్పి పంపించవలసిన అవసరమున్నదా? అందులకే మనసులో ఉన్న మాట నేను తనతో చెప్పితినా? మౌనంగా ఉండి నేను తనకు నమస్కరించినది ఇందుకే సుమా!

ఏ వైపు వెళ్ళినా ఎక్కడ నున్నా తను ఇక్కడకు వస్తే అంతే చాలు. ఈ విధంగా నేను వశమవడానికి ఇంత చేయవలసిన అవసరమున్నదా? కాదు కూడదని ఆమె వ్యతిరేకించి యేవిధమైన కార్యాలన్నింటిని చేస్తే సరిపోతుందా?

బాధతో మాట్లాడినప్పటికి ఆమె నన్ను వెంటనే చేరినది అంతే చాలు. ఆధీనమైనట్టి నాకు ఇంకా భయమెందులకు, ఆ శ్రీవేంకటేశ్వరుడు విజృంభించి నన్ను చేరి మన్నించినాడు. ఆ స్వామి గొప్ప శృంగారపురుషుడు, అతని చేష్టలన్నీ మాయలని అనరే చెలులారా!

## 470

**అవతారిక:**అమ్మ స్వామి ఎడబాటును భరించలేక మన్మథావస్థలో ఉన్న తీరును చెలులు వర్ణిస్తున్నారు.

### ముఖారి

ప. దగ్గరి కూడుటకంటె దవ్వులపొందే మేలు
సిగ్గుతో నున్నది చెలి చిత్త మింక ననవే ॥పల్లవి॥

1. చిత్తమును నీరుచేసె చిగిరింపించెఁ గోరిక
వుత్తలపు విరహగ్ని వొప్పదా యేమి
హత్తి తనపొఁ (పొం?)దైతే నంగనమర్మము గాఁడి
వత్తివలె వాడించె (చి?)వడచల్లీ నిదివో ॥దగ్గరి॥

2. తలఁపించెఁ దనరూపు తమకము పెడరేఁచె
వొలసి చెక్కిటిచేయి వొప్పదా యేమి
బలిమిఁ దనకాఁగిలి పడఁతిని భ్రమయించి
నిలువెల్లా మఱపించె నేర మిందుఁ గలిగె ॥దగ్గరి॥

3. తఱవు రతికి రేఁచె తనువెల్లా నెచ్చరించె
వొఱపైనకొనగోరు వొప్పదా యేమి
గుఱి శ్రీవేంకటేశుఁడు కూడినకూటములయితే
మఱవనీక సతికి మరులాయ ననవే ॥దగ్గరి॥

**అర్థములు:** ప. దవ్వు = దూరము, పొందు = కలయిక, చిత్తము = మనసు.

1. నీరు చేసె = ద్రవించు, చిగిరింపించె = మొలకెత్తునట్లు, ఉత్తలము = కలత, విరహాగ్ని = ఎడబాటు వలన కలుగు సెగలు, ఒప్పు = సరిపోవు, హత్తి = ఆలింగనము చేసుకొని, పొందు = కలయిక, అంగన = స్త్రీ, మర్మము = రహస్యము, గాడివత్తి = పొడవైన దీపపు వత్తి, వాడించు = పదను కలిగి యుండు, వడచల్లు = సెగ,వేడిమి వ్యాపించు.

2. తలపించు = మదిలో తెలియజేయు, తన రూపు = తన బింబము, తమకము = తహతహ,మోహము, పెడరేచు = అధికముగా విరజిమ్ము, ఒలయు = కలుగు, చెక్కిట చేయి = చెక్కిలిపై చేయి, ఒప్పు = సరిపోలు, బలిమి = ధృడము, పడతి = స్త్రీ, భ్రమ = మత్తు, నిలువెల్లా = శరీరం యావత్తు, మరపించు = మైమరపు కలిగించు, నేరము = దోషము.

3. తఱవు = నిర్బంధము, రేచె = పురిగొల్పు, తనువు = శరీరము, ఎచ్చరించు = ప్రోత్సహించు, ఒరపు = ఉపాయము, ఒప్పు = సరిపోలు, గురి = లక్ష్యము, కూటమి = సమూహము, మరులాయె = మన్మథబాణములగు.

**భావము :** చెలులారా! ఈ సమయములో దగ్గరగా ఉన్న కలయికలు సంగమం కంటే దూరముగా ఉన్న పొందులే మంచివి. చెలి సిగ్గుతో ఉన్నది, ఆమె ఇచ్చువచ్చినట్లు చేయమని చెప్పవే!

చిత్తము ద్రవించి, కోరికలు చిగుళ్ళు వేసినట్లయినది. ఈకలత, బాధతో కూడిన ఎడబాటు ఆమెకు సరిపోతుందా? ఆ స్వామి తనను గాఢముగా హత్తుకొని బిగి కౌగిలిలో బంధించినట్లైతే ఆమె మర్మాలన్నీ దీర్ఘమైన వత్తివలె వాడి కలిగి ప్రకాశిస్తుంది. ఇదిగో గమనించి చూడండి, ఆమెకు పై తహతహల సెగ యిప్పటికే వ్యాపించి యున్నది.

ఆ స్వామిని రూపాన్ని మనసులో ధ్యానిస్తుండగా, ఆమెకు మోహావేశ మధికమగుచున్నది. ఆమెకు ఈ సమయములో చెక్కిలిపై చేయి వేసుకొని ఉండడం తగియున్న భంగిమే కదా! దృఢంగా ఉన్న స్వామి కౌగిలి నేర్పు మత్తుకు గురిచేసి ఆమెను నిలువెల్లా మైమరపునకు గురిచేస్తున్నది. దీన్ని కూడా దోషమంటారా చెప్పండి?

ఆమె స్వామితో నిర్బంధమైన కౌగిలికి శరీరమంతా ప్రోత్సహించుచున్నది. ఈ సమయములు కొనగోరు తగిలిస్తే తప్పా ఏమిటి? తనలక్ష్యము శ్రీవేంకటేశ్వరుని కలయికే అయినట్లైతే ఈమెకు మరపు రానీయక మన్మథ బాణాలవలె ఉన్నవని చెప్పవే!

## 471

**అవతారిక:** స్వామి అకారణంగా వచ్చి తనను చేరడం, చిలిపి పనులు చేయడం గురించి అమ్మ చెలులతో చెప్తున్నది.

## దేసాళం

ప. కానమే నే మింత తాను కదిరికాఁడౌత
మోనాన నే నూరుకున్న మోముచూచీఁ దాను ॥పల్లవి॥

1. నగుతా నేనొకమాట నాలో గొణఁగుకుంటే
తగిలి సూడకుఁ బాడు తానిదేమే
మొగి నాపుక్కిటితమ్మ ముందర నే నుమిసితే
జగడానకే వచ్చీ జాణఁడౌనే తాను ॥కానమే॥

2. వీదిఁబోతా చమ్మాళిగె వెస నేఁ దాటించితేను
ఆదిగొని కొపగించీ నదేమే తాను
సేదదేరి బొమ్మలను చెలుల నే జింకించితే
పొదితో వహించుకుని పోరీనే తాను ॥కానమే॥

3. కివిసి మాగోడండఁ గేకరించుకొంటేను
చెనకి నాకొంగువట్టీ చెల్లఁబో తాను
యెనసి శ్రీవేంకటేశుడఁ డేమీ ననకుండితేను
తనివితో ననుఁగూడె తలఁగఁడే తాను ॥కానమే॥

**అర్థములు:** ప. కానము = చూడము, కదిరికాడు = సమీపించువాడు, మోనాన = మౌనముగా, మోము = ముఖము.

1. నగు = నవ్వు, గోణగు = అస్పష్టముగ లోలోన మాట్లాడు, తగులు = చిక్కు, పాడు = మంచిదిగాని, తానుంఇదేమే = తాను ఈవిధంగా చేయుట ఎందుకు?, మొగి = పూని, పుక్కిటితమ్మ = పుక్కిటనున్న తాంబూలము, ఉమియు = ఉమ్ము.
2. జగడము = తగాదా, జాణ = నేర్పరి, వీదిబోతా = వీధిలో వెళ్తూ, చమ్మళిగె = పాదుకలు, వెస = శీఘ్రముగ, దాటించు = కొట్టు, ఆదిగొను = ఎదుర్కొను, సేదదీరు = ఊరటపడు, బొమ్మలను = కనుబొమలను, జంకించు = అదరవేయు, పొది = భారము, వహించుకొను = మోయు, పోరు = పోట్లాడు.
3. కివియు = కోపించు, గోడండ = గోడప్రక్కన, కేకరించు = గొంతుక సరిచేసికొనునట్లు ధ్వనిచేయుట, చెనకు = తాకు, తనివి = తృప్తి, తలగడ = దిండు.

**భావము :** చెలులాలా!ఆ స్వామి ఎలాంటి చిలిపిచేష్టలతో ఉన్నాడో గమనించారా! సమీపించి అంటుకుంటాడు, నేను మౌనంగా ఊరకున్నప్పటికి వచ్చి మొహములో మొహము పెట్టి చూస్తాడు.

నేనేదో నాపాటికి నేను చిన్నగా మాట్లాడుకుంటూ ఉంటే, పట్టుకొవడానికి శత్రువులాగా మెల్లగా వస్తాడు ఆ స్వామి చేసేది ఏమి పనులే! నేనేదో నా పుక్కిట ఉన్న తాంబూలము ఊసినప్పుడు, గొప్ప నేర్పరి లాగా తగాదాలు పడడానికి వస్తాడేమిటే!

నాపాటికి నేను వీధిలో పాదుకలు శీఘ్రముగా కొట్టుకుంటూ శబ్దము చేసుకుంటూ నడుస్తూ వెళ్తూ ఉంటే, అది చూసి దానికి కూడా కోపం వహిస్తాడేమిటే! నేనేదో శ్రమనుండి అలసట తీర్చుకుంటూ కనుబొమ్మలను అదరవేస్తే, అది చూసి పనిబడా వచ్చి పోట్లాటలు పెట్టుకుంటాడెందుకే!

నేనేదో కోపంతో గోడ ప్రక్కన చేరి గొంతుక సరిచేసికొనే పనిలో ధ్వనిచేస్తుంటే, వచ్చి నా కొంగు పట్టుకొని సరిపోలునట్లు ప్రవర్తించడమెందుకే! అలాంటి పొందుకోరే శ్రీవేంకటేశ్వరుడు నన్నేమీ అనకుండా ఉంటే తృప్తితో నన్ను కలసి కూడినాడు. నాకు ఉపధానమువలె మంచిగా ఉన్నాడే తాను.

## 472

**అవతారిక:** ఎన్నివిధాల చెప్పినప్పటికి స్వభావములో మార్పు రావడంలేదని గ్రహించిన అమ్మ స్వామి చేస్తున్న శృంగార చేష్టలను వివరిస్తూ పరిహాసమాడుతున్నది.

### వరాళి

ప. ఎంత చెప్పినా మాన విందాఁకా నేము
అంతలోఁ బెద్దరికములాయనా నేఁడు ॥పల్లవి॥

1. చెక్కునొక్కె సేసవెట్టె చెలియ నీకాలు దొక్కె
తెక్కుల నీజగడాలు దీరెనా నేఁడు
చుక్కలు మోవిపై నాఁటె చొక్కపుగుబ్బలు మోపె
వక్కణించి నీపంతము వచ్చెనా నేఁడు ॥ఎంత॥

2. కన్నువేసే మాటలాడె కమ్మనినవ్వులు నవ్వె
చిన్ననాఁడే, నీచలము చెల్లెనా నేఁడు
మున్ను నీకుఁ జేత మొక్కె ముచ్చటలన్నియుఁ జెప్పె
పన్నిననీలోనిచింత పాసెనా నేఁడు ॥ఎంత॥

3. చేయివేసె చెట్టవట్టె సిగ్గు నీ కొప్పగించె
చాయల నీ కిదిమైనా సమ్మతా నేఁడు
యీయెడ శ్రీవేంకటేశ ఇంతి దానే నిన్నుఁ గూడె
మాయపునీమేనికాఁక మానెనా నేఁడు ॥ఎంత॥

**అర్థములు:** ప. మానవు = వదలిపెట్టవు, నేము = మేము, పెద్దరికము = గౌరవము, నేడు = ఈరోజు.

1. చెక్కునొక్కు = చెక్కిలినొత్తు, సేస = అక్షింతలు, తెక్కు = టెక్కు, జగడాలు = తగాదాలు, నాటు = వేయు, చొక్కపు గుబ్బలు = మనోహరమైన పాలిండ్లు, మోపు = ఆనించు, వక్కణించు = చెప్పు, పంతము = పట్టుదల.
2. కన్నువేయు = గమనించు, చలము = భయము, చెల్లు = పోవుట, మున్ను = ముందు, చేతమొక్కు = చేతులతో నమస్కరించు, ముచ్చట = కబురు, పన్ను = కలుగు, చింత = బాధ, పాయు = తీరు.
3. చెట్టవట్టు = పెండ్లియాడు, ఒప్పగించు = అప్పజెప్పు, చాయలు = శోభలు, సమ్మతి = అంగీకారము, ఎడ = స్థానము, ఇంతి = స్త్రీ, మాయపు = మభ్యపెట్టు, మేనికాక = శరీర వేడిమి, మాను = తీరు.

**భావము :** స్వామీ! మేము ఎన్నివిధాల చెప్పినప్పటికి నీ స్వభావములో మార్పు రావడంలేదు. అంతలోనే ఇంత గౌరవముతో కూడిన పెద్దరికమును సంతరించుకొన్నావు.

చెక్కు నొక్కి, అక్షింతలు వేసితివి. ఆ చెలియ నీ కాలు ద్రొక్కినది, నీ గర్వపుచేష్టలు, నీ తగాదాలు ఇక తీరినట్టేనా? ఆమె దంతక్షతాలను నీ ముఖంపై వేసినది, నీ మేనిపై తన మనోహరమైన పాలిండ్లు తాకునట్లు ఆనించినది. ఇంక చెప్పుకోవడానికి పంతాలు పట్టింపులు ఈరోజుకు యింకా ఏమి మిగిలినవి చెప్పండి స్వామీ!

ఆమె చిన్ననాడే మీపై కన్నులు అప్పగించి గమనించి చూసి మాటలాడినది. మనోహరమైన నవ్వులను రువ్వినది. ఈనాడు నీ కంపము తగ్గినదా! పూర్వమే నీకు చేతులతో నమస్కరించి ఎన్నో కబుర్లు చెప్పినది. ఈనాడు నీకు చింతలన్నీ దూరమయినట్లేనా స్వామీ!

పైన చేయి వేసి పెండ్లాడి సిగ్గులన్నీ నీకే చెల్లునట్లు అప్పగించినది కదా! ఈనాడు ఆ శోభలన్నీ నీకు అంగీకారమే కదా! ఈ స్థానములో ఓ శ్రీవేంకటేశ్వరా! ఆ రమణి నిన్ను కలసినది కదా! మఖ్యపెట్టే నీ శరీర తాపము నేటికైనా తగ్గినదా చెప్పండి స్వామీ!

## 473

**అవతారిక:** ఒక సవతి స్వామితో అతిగా ప్రవర్తిస్తూ అమ్మ ఆగ్రహానికి గురైనది. అమ్మ ఆవిడతో కోపంగా పలికే పలుకులివి.

### రామక్రియ

ప. ఆతనికి నీకే తగు నందుకే పోవే
యీతల నే మిందుకెల్లా నిట్టే తలవంతుమే ||పల్లవి||

1. సటలివి మాకైతే సగియించ వింకాను
నటన నాతనితోనే నవ్వవే పోయి
యిటువలెఁ జేసి మాయింటికి వచ్చే వప్పటి
కటకటా నేమైతే కడుసిగ్గు విడమే ||ఆతనికి||

2. చెంగలు నీమాట వింటే చిమ్మిరేఁగీ మేనెల్లా
అంగడి నాతనితోడ నాడవే పోయి
వెంగలితనాన నాకే విడెమియ్య వచ్చేవు
యింగితాన నేమైతే నింతరొచ్చు కోపమే ||ఆతనికి||

3. నిలువెల్లాఁ గాఁకరేఁగీ నిన్నుఁజూచితే నాకు
వొలిసి నీపతివద్ద నుండవే పోయి
యెలమి శ్రీవేంకటేశుఁ డిప్పు డిట్టె నన్నుఁ గూడె
వలచి నే మిందుకెల్లా వాసిదెచ్చుకొందుమే ||ఆతనికి||

**అర్థములు:** ప. ఆతనికి = ఆ స్వామికి, తగు = సరిపోతుంది, ఈతల = ఇవతల, ఇందుకెల్లా = ఈవిషయమునందు, తలవంతుము = అంగీకరిస్తాము.

1. సటలు = కపటము, సగియించు = ఓర్చుకొను, ఇటువలె = ఈవిధముగా, కటకటా = అయ్యో! , కడు సిగ్గు = అధికమైన లజ్జ.

2. చెంగలు = దగ్గరగా, చిమ్మిరేగు = వెదజల్లేవిధంగా వ్యాపించు, అంగడి = కొలువు, వెంగలితనము = అవివేకము, విడెము = తాంబూలము, ఇంగితము = యుక్తాయుక్త విచక్షణ, రొచ్చు = మలినము.

3. నిలువెల్లా = శరీరం మొత్తం, కాక = తాపము, ఒలయు = ప్రవేసించి, ఎలమి = వికాసము, వాసి = ఆధిక్యము.

**భావము :** ఓ చెలీ! ఈ చేతలన్నీ ఆ స్వామికి నీకే సరిపోయినది. ఇవతల మేము నీవు చెప్పినవాటికెల్లా మేము తలవంచగలమా?

ఈ కపటమైన విషయాలింకా మాకైతే భరించే ఓర్పు లేదు. ఆ స్వామి వద్దకే వెళ్ళి నీ నటనా చాతుర్యం చూపించి హాయిగా నవ్వుకోవే! ఈవిధంగా జేసి మా యింటికి రావడం చేసేటప్పటికి, మాకైతే అయ్యో! కడు సిగ్గుగా ఉంది విడిచిపుచ్చలేమమ్మా!

సమీపంలో నీ మాటలు వింటుంటే శరీరమంతా చెమటతో తడి తడిగా అవుతున్నది. కొలువులో ఆతనితోనే పోయి ఆడి పాడవమ్మా! నీ అవివేకంతో నాకే తాంబూలమియ్యడానికి సిద్ధమయ్యావు. మంచి చెడు విచక్షణ తెలిసినదానవై ఇంత మలినమైన పనులను చేస్తావా?

నాకు నిన్ను చూస్తుంటేనే మంటలు రేగి శరీరం మొత్తం ఉడికిపోతున్నది. వెళ్ళి ఆ స్వామి దగ్గరే ఉండవే! కానీ ఆ శ్రీవేంకటేశ్వర స్వామి వికాసముతో, ప్రకాశంతో ఇప్పుడే నన్ను ఈ విధంగా అనుగ్రహించి వచ్చి కూడినాడు. ఆ స్వామిని ప్రాణప్రదంగా ప్రేమించినందులకు అందరికంటే మేము ఇందులకే ఆ ఆధిక్యతను పొందామన్న విషయం తెలుసుకోవే!

## 474

**అవతారిక:** భామలెవరో తుంటరి పనులతో స్వామిని వశపరుచుకోగా, స్వామి ఇంటికి చేరినా సిగ్గులతో తలమునకలవుతుండగా అమ్మ గమనించి ఏమిటిది యని ప్రశ్నిస్తున్నది.

### భైరవి

ప. నీకేల ఇంత వెరపు నేనుండఁగా
చేకొన నీకిచ్చకాలు సేయవద్దా నాకును ॥పల్లవి॥

1. పూని మా యింటికి రాను పొంచి సిగ్గువడేవు
దానికేమి యేమైనానుఁ దప్పుసేసితో
పోనీలే బలిమి నిన్నుఁ బొలఁతు లేమిసేసినాను
కానఁ బడ నొకతప్పు గానవద్దా నాకును ॥నీకే॥

2. మోముచూడ వెఱచేవు మెదలనే తలవంచి
యేమైనా మావారు నేరాలెంచెరా నిన్ను
భామ లెవ్వరైనా నిన్ను బతిమి చెరిచినాను
వేమారు నిన్ను వెనకవేసుకొక పోవునా ॥నీకే॥

3. మాఁటలాఁడఁ గొంకేవు మచ్చిక నిన్నిటు గూడి
తూఁటమోని గంటైతే దోసమా యేమి
నేఁటనే శ్రీ వేంకటేశ నీవే నన్నుఁ గూడితివి
నాఁటకీఁడవైన నిన్ను నమ్మవద్దా ఇపుడు ॥నీకే॥

**అర్థములు:** ప. వెరపు = భయము, చేకొని = చేపట్టి, ఇచ్చకాలు = సరసాలు.

1. పూని = యత్నించి, పొంచి = దాగి, బలిమి = ఆధిక్యము, పొలతులు = అతివలు, కానబడ = చూడడానికీ, కానవద్దా = కనిపించవద్దా.
2. వెరపు = భీతి, మొదలనే = ముందే, నేరము = తప్పు, బతిమి = బ్రతిమాలి, చెరచు = పాడుచేయు, వేమారు = వెయ్యిమార్లు, వెనకవేసుకొను = సమర్థించు.
3. గొంకు = వెనకడుగువేయు, మచ్చిక = అలవాటు, తూట = తుంటరి, గంటు = గాయము, దోసము = తప్పు, నేటనే = ఈనాడే, నాటకీడు = వేషాలు వేసే వాడు.

**భావము :** ఓ స్వామీ! నేను ఇచ్చట ఉండగా నీకెందుకింత బిడియము, భయము? అర్థంగాకుండా ఉన్నది. నన్ను చేపట్టి సరసాలు చేయడం, ముఖప్రీతి మాటలు మాట్లాడడం చేయవలెను గదా!

ఎంతో యత్నించి కష్టపడి తీరా మా ఇంటికి చేరి లేనిపోని సిగ్గులొలకబోస్తావు. ఏమైనదిప్పుడు? ఏమైనా తప్పు జరిగితే కదా భయపడవలసినది. పోనీలే స్వామి బలవంతంగా ఈ వనితలు నిన్నేమైనా చేసినట్లైతే కనీసం అలాంటి తప్పు ఒకటైనా నాకు కనిపించవద్దా!

తలవంచుకొని, మొహము చూడ్డానికే భీతి, సిగ్గు కనబరుస్తున్నావు. మావాళ్ళేమైనా నీ రాకను తప్పు పట్టి యున్నారా? ఈ భామలు కడు ఘటికులు సుమా! వారేమైనా నిన్ను బలవంతపెట్టి కానిపనులు నీతో చేసియున్నారా? అయినప్పటికి వేయిసార్లు నేను నిన్ను సమర్థిస్తూనే ఉంటాను కదా!

అయ్యో! మాటలాడడానికే సంకోచిస్తావు. నన్ను కూడి నీవు తుంటరి చేతలతో ముఖముపై దంతక్షతాలతో గాయాలు చేసినట్లైతే తప్పా ఏమిటి చెప్పండి. ఈరోజు శ్రీవేంకటేశ్వరా !కృపతో నీవే నన్ను చేరినావు. ఎంత వేషాలమారివైనా నిన్ను నమ్మక తప్పేదేమున్నది స్వామీ...కానివ్వండి.

## 475

**అవతారిక:** స్వామి ఎందులకో అమ్మ అలమేలుమంగమ్మను చేరుకోడానికి బిడియం చూపుతుండగా అమ్మ విరహం తట్టుకోలేక రమ్మని ఆహ్వానిస్తున్నది.

### సౌరాష్ట్రం

ప. మమ్ము నింకఁ దడవక మానేవయ్యా
నెమ్మి వేవేలు దండాలు నీకుఁ బెట్టేమయ్యా ॥పల్లవి॥

1. చెప్పరానినాచింత చేతిమీఁదికి వచ్చె
తప్పక నన్నేమి చూచి తడవేవయ్యా
నెప్పున వలచినట్టినేరమి నావొళ్ళఁ గద్దు
వొప్పులుఁ దప్పులు నీవే వోరుచుకోవయ్యా ॥మమ్ము॥

2. కన్నులలోపలికాంక్ష కడుఁ బయ్యద దడిసె
నన్నుఁజూచి ఇఁకనేమి నవ్వేవయ్యా
పన్ని నీతో నలిగినఫలమెల్లా నేఁ గంటి
ఇన్నిటికి నీకుఁ బంత మిచ్చేము కోవయ్యా ॥మమ్ము॥

3. తలకెక్కె వలపులు తనుఁదానె దిగజారె
మలసి మాతో నేఁటిమాటలయ్యా
యెలమి శ్రీ వేంకటేశ ఇట్టె నన్నుఁ గూడితివి
చెలఁగి మాచనవుల చెల్లించవయ్యా ॥మమ్ము॥

**అర్థములు:** ప. దడవక = భయపడక, మాను = విడిచిపుచ్చు, నెమ్మి = ప్రేమ, దండాలు = నమస్కారాలు.

1. చెప్పరాని = ఎవరికి చెప్పుకోలేని, చింత = బాధ, చేతిమీదకు = చేతికొచ్చినది, తడవు = వెదకు, నెప్పున = పొదుకొను, నేరమి = తప్పు, వొళ్ళ = వల్ల, గద్దు = కలదు, ఒప్పులు తప్పులు = సరైనది, దోషము, వోరుచుకొను = ఓర్చుకొను = భరించు.
2. కాంక్ష = కోరిక, కడు = మిక్కిలి, పయ్యెద = పైట, పన్ని = పూనుకొని, నలిగినట్టి = కలిసి బాధపడు, ఫలము = ఫలితము, కంటి = చూసితిని, పంతము = పట్టుదల.
3. తలకెక్కె = బాగుగా లోపల నాటుకొను, దిగజారు = బాగాతగ్గి తగ్గిపోవు, మలయు = పెనగు, ఎలమి = వికాసము, చెలగి = ప్రకాశించు, చనవులు = ప్రేమాభిమానములు, చెల్లించు = తీర్చు.

**భావము :** ఓ స్వామీ! మమ్ములను ఇంకా భయపడకుండా చేబట్టడం మానకండి. ప్రేమతో నీకు వేయి నమస్కారాలు చేసుకుంటాము

స్వామీ!

ఎవరికి చెప్పుకోలేని బాధ నాకు కలిగినది. నన్ను ఎల్లప్పుడూ చూస్తూ కూడా ఇంకా ఏదో వెదకులాట దేనికి? నిన్ను పాదుకొని ప్రేమించిన తప్పైతే నా వద్ద ఉన్నది. నా తప్పులు ఒప్పులు అన్నీ నీవే భరించవలెను స్వామీ!

నీ కళ్ళలో కనిపించే కోరికల వలన నా పయ్యద మొత్తం చెమటతో తడిసి ముద్దైనది. నన్ను చూచి ఇంకా నవ్వడమెందులకు? పూనుకొని నీతో కలిసి క్రిందా మీదా పడినట్టి ఫలితము నేడు చూశాను స్వామీ! ఇప్పటికీ పంతాలు పట్టింపులు ఎందులకు స్వామీ! దయచేయవయ్యా!

ఒకవైపు ప్రేమాతిశయము బాగా లోపల నాటుకొన్నది. ఇంకా బాగాతగ్గి తగ్గిపోయిన ప్రవర్తన బాహాటముగా కనిపిస్తున్నది. చుట్టుకొని కూడా మాతో ఇంకా మాట్లాడవేమిటి స్వామీ! వికాసముతోనున్న శ్రీవేంకటేశ్వరా నన్ను కూడినావు. నీవు ప్రకాశముతో విజృంభించి మా ప్రేమాభిమానాన్ని చూరగొనవయ్యా! మా కోరికలన్నింటినీ తీర్చవయ్యా!

## 476

**అవతారిక:** దక్షిణ నాయకుడైన స్వామి అన్య కాంతలతో కూడి వచ్చాడని గ్రహించిన అమ్మ అలమేలుమంగమ్మ గుర్తులను గమనించి స్వామిని ప్రశ్నల వర్షంతో ఉక్కిరిబిక్కిరి చేస్తున్నది.

### కాంబోది

ప. కటకటా మీఁదటెత్తు కానదాయ నెవ్వతెరా
కుటిలపుఁ బులకలు కుప్పవడీ మేనను ॥పల్లవి॥

1. కడు నీమోవిచిగురు గంటిసేసె నెవ్వతెరా
వడిసీఁ దేనెలు అందువంక నింతాను
పొడమించె చెమటలు పొలిఁతి యెవ్వతెరా
కడలేనినీమనసు కరఁగు నందునను ॥కటకటా॥

2. రేసుల నిట్టూరుపులు రేఁచిన దెవ్వతెరా
గాసిగా నీవలపులు గాలిఁబోయీని
తోసి నీకన్నుల నిద్ర తొట్టించిన దెవ్వతెరా
వోసరిలి తమకము లుమ్మగిలీ నందు (న?)ను ॥కటకటా॥

3. గందపు గుబ్బలముద్ర కడునొత్తె నెవ్వతెరా
అందువల్ల సిగ్గు నీకు నచ్చుపడెను
కందువ శ్రీ వేంకటేశ కలసితి విటు నన్ను
నిందవాసె నిందువంక నేఁ డెందున్నదిరా ॥కటకటా॥

**అర్థములు:** ప. కటకటా = అయ్యయ్యో! మీదటెత్తు = తరువాయి ఉపాయము, కానదాయ = కనిపించక ఉన్నది, కుటిలము = మోసము, పులకలు = గగుర్పు, కుప్పవడీ = కుప్పలైపడినవి, మేనను = శరీరముపైన.

1. చిగురు = లేత, గంటి = గాటు, వడిసీ = కారీ, అందువంక = అన్ దేటి వంక, పొడమించు = పుట్టించు, పొలితి = స్త్రీ, కడలేని = అంతులేని, కరగు = ద్రవించు.
2. రేసులు = ఈర్ష్య, రేచు = వ్యాపించు, గాసి = శ్రమ, గాలిబోవు = తేలికగు, తొట్టించు = స్రవింపజేయు, ఓసరి = తగ్గు, తమకము = తపన, ఉమ్మగిలు = ఆవిరి.
3. గందపు = గంధపు, గుబ్బలముద్ర = రొమ్ములగుర్తు, కడునొత్తె = ఎక్కువగా తగులజేయు, అచ్చుపడు = స్పష్టమగు, కందువ = జాడ, నిందవాయు = అపవాదుపడు, ఇందువంక = ఈ దిశ.

**భావము :** అయ్యయ్యో! స్వామీ! మీ తరువాతి ప్రయత్నాలు, ప్రణాలికలు అసలు ఏమీ అర్థమవకుండా నున్నవి. ఆమె ఎవ్వతె స్వామీ! మీ మోసపు గగుర్పాటంతా శరీరంపై కుప్పలై కనిపించుచున్నది.

నీ లేత మోవిపై గాటుపడేవిధంగా చేసినదెవ్వతె? అక్కడ తేనెలు చాలా అధికముగా కారుతున్నాయి. నీకు చెమటలు పుట్టించిన యువతి ఎవ్వతె స్వామీ! నీ అంతులేని మనసంతా అందులో కరగి ద్రవించినది కదా! ఈర్ష్య కలిగించే నిట్టూర్పులు నీకు కలుగ జేసినదెవ్వతె? శ్రమతో బాధపడే నీ ప్రేమలన్నీ తేలికయి ఒట్టిబోయినవి. నీ కన్నులపై నిద్రమత్తు కలిగించినదెవ్వతె? ఆహా! తహతహలు తగ్గి ఆవిరులై వీచుచున్నది కదా!

గంధపు రొమ్ముల ముద్రలు అంత అధికంగా నీపై పడేటట్లు చేసినదెవతె? అందువల్లే నీకు సిగ్గు స్పష్టముగా కనిపించుచున్నది. జాడ తెలిసి ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను కలిసితివి. అపవాదులన్నీ పూర్తిగా సమసిపోయినవి. నేడు ఆ ఇంతి ఇంకా ఎక్కడున్నది స్వామీ సెలవివ్వండి.

## 477

**అవతారిక:** స్వామి ప్రభువైన తర్వాత తనను దూరం పెట్టాడని భావించిన అమ్మ అలమేలుమంగమ్మ పాత విషయాలన్నీ గుర్తుచేస్తూ యధావిధిగా తనను చేరి ఏలుకోమని ఒక చెలితో రాయబారం పంపుతున్నది.

### పళవంజరం

ప. సారె నాటి సుద్ది నేఁడు చవులనవే
కోరి నేఁడు రాజైతే కూరిమి వోదనవే ॥పల్లవి॥

1. మంచముపై నన్నమాట మఱవకుమనవే
లంచపు నామోవి తలఁచుకొమ్మనవే
అంచల నాకొప్పు దువ్వె నది నీవడుగవే
యెంచ నేఁడు తా దొరైతే నేమిదోస మనవే ॥సారె॥

2. దాకొన్నమోవిగంటి తానే చూచుకొమ్మనవే
లేకలు ముంజూరు నిండె లెక్కించుకొమ్మనవే
ఆకు మడి చిచ్చినది ఆనవాలాయననవే
యీకడఁ బెద్దరికాన కేమిదప్పె ననవే ॥సారె॥

3. నాలత్తుకరేక చిన్నినామమాయ ననవే
చాలుఁజాలు నిఁకనేల సటలనవే
యేలెను శ్రీ వేంకటేశుఁ డిదె నన్నుఁగాఁగిటను
పోలించి తా దేవుఁడైతే పొందు మానదనవే ॥సారె॥

**అర్థములు:** ప. సారె = మాటిమాటికి, నాటి = అప్పటి, సుద్ది = మంచి మాట, చవులు = రుచి, కోరి = ఇష్టపడి, కూరిమి = స్నేహము, ఓదను = సమ్మతించు.

1. లంచము = బహుమతి, మోవి = ముఖము, తలచుకొను = గుర్తుచేసుకొను, అంచల = దగ్గర, కొప్పు = సిగ, ఎంచ = లెక్కించగా, దొర = ప్రభువు, దోసము = తప్పు.
2. దాకొన్న = దాగియున్న, మోవిగంటి = ముఖముపై పంటి గాటు, లేకలు = ప్రేమ ఉత్తరాలు, ముంజూరు = ఇంటిముందు భాగము, ఆకుమడచు = తమలపాకులిచ్చు, ఆనవాలు = గుర్తు, పెద్దరికము = గౌరవము, తప్పె = పోయినది.
3. లత్తుక = లక్కతో చేసిన లాక్షారసము, చిన్ని నామము = చిన్నదైన బొట్టు, సటలు = కపటము, ఏలు = పాలించు, కాగిట = కౌగిట, పోలించు = ఈడుపడు, దేవుడు = దైవము, పొందు = కలయిక, మానదు = వదలిపెట్టు.


డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య

**భావము :** పాత పాత విషయాలే మాటి మాటికి రుచిపుట్టిస్తాయని చెప్పవే! ఆ స్వామి ఈనాడు ప్రభువైతే కావచ్చు, పాత స్నేహము మానకూడదని చెప్పి సమ్మతించమనవే!

ఆనాడు మంచముపై ఉన్నప్పుడు చెప్పిన మాటలు మరువవద్దని చెప్పవే! రహస్యముగా బహుమతిగా ఇచ్చిన నా అధరామృతము గుర్తుచేసుకొనమనవే! దగ్గర చేరి ప్రేమగా కొప్పు దువ్వి సిగ సరిచేసినది నీవడుగవే! ఈనాడు ఆ స్వామి ప్రభువైతే కావచ్చు గానీ నాతో ప్రేమాతిశయముగా ఉంటే తప్పేమిటని అడగవే!

నా ముఖముపై దాగి యున్న దంతక్షతములను తానే వచ్చి చూచుకొమ్మని చెప్పవే! ఆ స్వామి వ్రాసిన ప్రేమ లేఖలు కట్టలు కట్టలై ఇంటి వరండా ముందుభాగం మొత్తం నిండిపోయాయి కదా! అవసరమైతే వచ్చి లెక్కబెట్టుకోమనవే! ఆ స్వామి ఆకుమడచి తాంబూలమిచ్చిన విషయము గుర్తులు చూపించవే! ఈ తావున ఆయన పెద్దరికానికి మర్యాదకు వచ్చిన నష్టమేమిటో అడగవే!

నేను పెట్టుకొన్న లక్కతో చేసిన లాక్షారసము చిన్నబోయినదని చెప్పవే! ఇంక నటనలు కపటపు మాటలు చాలు చాలని చెప్పవే! ఇదుగో ఆ శ్రీవేంకటేశ్వరుడు నన్ను కౌగిట చేర్చి ఏలుకొన్నాడు. ఈడుపడినాడు కదా! ఆయన ఎంత ప్రభువైనా సరే! నా పొందు యిక మానవద్దని చెప్పవే!

## 478

**అవతారిక:** స్వామి పరిహాసాలాడి , కోపించినా, ప్రేమాతిశయంతో నమస్కరిస్తుందే తప్ప యేమీ బదులు పలుక లేకపోతున్నానని చెప్తున్న దృశ్యం.

### బౌళి

| | | |
|---|---|---|
| ప. | ఎంత వలపించితివో యేమి మాయ సేసితివో | |
| | పంతములాడుదుఁగాని పాయలేనురా | ॥పల్లవి॥ |
| 1. | కోపగించేనంటా వచ్చి గొబ్బున నీమోము చూచి | |
| | దాపుగా నే మొగమోడి తలవంతురా | |
| | పోపొమ్మని యలిగి నేఁ బోయేనంటాఁబోయి | |
| | తీపునీమోవి దలఁచి తిరుగుదురా | ॥ఎంత॥ |
| 2. | వెంగెమాడేనంటాఁ జూచి వినయాల నినుఁ గని | |
| | కుంగుచు నానిట్టూర్పు గక్కుకొందురా | |
| | వుంగిటినీమాట నీకే వొప్పగించేనంటా వచ్చి | |
| | నింగి మోవఁ జేతులెత్తి నేనే మొక్కుదురా | ॥ఎంత॥ |
| 3. | మిక్కిలి వింతరేకులు మేననెల్లా సోదించి | |
| | గక్కుననే నుండరేక కాఁగిలింతురా | |
| | పక్కన శ్రీ వేంకటేశ బాసగొనేనంటా వచ్చి | |
| | యెక్కువతో నిన్నుఁ గూడి ఇన్ని మఱచితిరా | ॥ఎంత॥ |

**అర్థములు:** ప. వలపించు = ప్రేమలో ముంచు, మాయ = భ్రమ, పంతము = పట్టుదల, పాయలేను = వీడలేను.

1. గొబ్బున = శీఘ్రముగ, దాపు = దగ్గర, మొగమోడి = మొహమును ఉంచి, తీపు మోవి = మధురమైన ముఖము, తిరుగుదు = మరలా తిరిగి వచ్చు.
2. వెంగెము = పరిహాసము, వినయము = వినమ్రత, కుంగు = తగ్గు, గక్కుకొను = వెళ్ళబుచ్చు, ఉంగిటి = కపటము, ఒప్పగించు = మరలా వారికే తిరిగి చెప్పు, నింగి = ఆకాశము, మొక్కు = నమస్కరించు.
3. వింత = అబ్బురము, రేకులు = పాలచాయ, మేన = శరీరము, సోదించు = వెదకు, గక్కున = శీఘ్రముగ, కాగలించు =

కౌగలించు, బాసగొనేనంటా = చెప్పిన మాట విను, ఎక్కువ = అధికము, మరచు = జ్ఞాపకశక్తి లోపం.

**భావము :** స్వామీ! ఎంతగా నన్ను ప్రేమలో ముంచినావో ఏమేమి మాయలు చేసి భ్రమలలో ముంచావో చెప్పలేను. నీతో పట్టుదలలకైతే సిద్ధమే కానీ నిన్ను మాత్రము విడువజాలను.

ఒకవేళ నీవు కోపగించినట్లైతే త్వరగా దగ్గరకు వస్తాను, కానీ, నీ ముఖారవిందం చూడగానే తలవంచుకుంటాను. కోపం అధికమైనప్పుడు పోపొమ్మని అలిగి కూర్చుంటాను కానీ, నీ మధురమైన ముఖమును చూచి అధరామృతం కోసంమాత్రం సదా అర్రులు చాస్తుంటాను.

ఏదైనా పరిహాసమాడితే నీ వినయాలకు కోపించి తగ్గి ఒక మూల కూర్చొని దీర్ఘ నిట్టూర్పులను విడుస్తూ ఉంటాను. నీ కపటపు మాటల గురించి నీకే చెప్పాలని వచ్చినదానను, చిత్రంగా నీకు చేతులెత్తి నమస్కరిస్తూ అలా ఉండిపోతాను.

అధికమైన వింత అనుభవాలు నా శరీరమంతా సోకుచుండగా, ఉండలేక త్వరపడి నిన్ను కౌగలించుకొంటాను. శ్రీవేంకటేశ్వరుడు నా మాట వినినట్టుగా విచ్చేసి అధికమైన ప్రేమాతిశయం చూపి నన్ను కలవగానే అన్నీ మరచిపోతాను స్వామీ!

## 479

**అవతారిక:** స్వామి అన్ని విషయాలకు తబ్బిబ్బౌతూ, తత్తరపడుతూ భ్రమలలో మునుగుతూ ఉండగా అమ్మ యిదేమిటని చెలులను ప్రశ్నిస్తున్నది.

### వరాళి

ప. అలిగిన యలుకెల్లా నరచేత నున్న దిదె
తలపోసి చూచుకొంటే తనకేమి బాఁతే ॥పల్లవి॥

1. కుప్పవడ్డయలకలు కుమ్మరింపుఁ జెమటలు
చిప్పిలు మోవితేనెలు సేనాసేన
రెప్పలతుద కెంపు రేసువడ్డచల్లజంపు
దప్పిదేరీ నీవియెల్లా తనకేమి బాఁతే ॥అలిగిన॥

2. మాసినట్టి పై చెఱఁగు మంతనములో కరఁగు
పోసపు బాస పోఁకకుఁ బుట్టెడేసి
వేసర నీకుంటెనలు వేవేలు వెంటెనలు
తాన వేసి చూచితే తనకేమి బాఁతే ॥అలిగిన॥

3. కాఁగిటకలయికలు కందువ అలయికలు
చేఁగ (గ?)లవాని చెట్టునఁ జేటఁడేసి
ఆఁగి కూడెను శ్రీ వేంకటాదిపుఁడు నను నిట్టె
దాఁగరానిసరసాలు తనకేమి బాఁతే ॥అలిగిన॥

**అర్థములు:** ప. అలిగిన = కోపించిన, అలుకెల్ల = అలుకంతయు, అరచేత = ఉపరిభాగంలో, తలపోసి = ఆలోచించి, బాతి = భ్రాంతి, తబ్బిబ్బు.

1. కుప్పపడు = రాశిగాయగు, కుమ్మరింపు = కుండతో కుమ్మరించిన విధముగా, చిప్పిలు = పుడుతున్న, మోవితేనె = అధరామృతము, సేనాసేన = చాలా చాలా ఎక్కువ, రెప్పలతుద = రెప్పల చివరి, కెంపు = ఎర్రటి పద్మరాగమణి, చల్లజంపు = చల్లగా చంపు, దప్పిదేరు = దాహమణుగు.
2. మంతనము = ఏకాంతము, పోసపు = మదించు, పోక = వక్క, వేసర = శ్రమపడు, కుంటెనలు = ఒకవిధమైన నగ, వెంటెన = తోడు, తాన = దగ్గర.

3. కాగిట = కౌగిట, కందువ = జాడ, అలయిక = శ్రమ, చేవగల = బలముగల, చేటడేసి = ఎక్కువగా, ఆగి = నిలిచి, దాగరాని = దాచిపెట్టలేని.

**భావము :** అలిగిన అలుకలన్నీ కూడా ఇంకా అలాగే ఉన్నవి. ఆలోచించి చూసుకుంటే తనకేమి తబ్బిబ్బే!

రాశిగా ఉన్న అలకలన్నీ చెమటలు కుమ్మరించినట్లుగా యున్నవి. పుట్టి స్రవిస్తున్న అధరామృతము చాలా ఎక్కువగా యున్నది. రెప్పల చివరల ఉన్న పద్మరాగ మణులు చులకనైన చల్లని చేతలతో చంపెడి విధముగా యున్నది. ఇవన్నీ దాహమణగి యున్నవి అయినా తనకెందుకు ఈ భ్రమలూ...తబ్బిబ్బు?

పైన కప్పుకున్న పైట చెరగు ఏకాంతంలో రహస్యంగా కలిసినప్పుడు వీడిపోయేదే సుమా! మదించిన మాటల బుట్టెడు పోక చెక్కలై ఎక్కువగా యున్నవి. శ్రమతో కూడిన నగలు నఱా సంఖ్యలలో వేల వేలై తోడుగా నున్నవి. ఆ నగలన్నీ నేను తక్కెడలో వేసి తూచుకుంటే తనకెందుకు ఈ భ్రమలూ...తబ్బిబ్బులూ?

కౌగిట్లో బంధించి యున్నప్పటి కలయిక జాడ తెలిసి శ్రమను పోగొట్టేవి. బాగా పెరిగి సారవంతమై యున్న వావింట చెట్టు ఉన్నవారికి చేటలతో ఆ పత్రములు కోసుకో వచ్చును కదా! ఈవిధముగా ఆ శ్రీవేంకటేశ్వరుడు నిలిచి నన్ను త్వరగా చేపట్టినాడు. దాచలేని సరసాలాడుతూ ఉండగా తనకెందుకీ తబ్బిబ్బు యెందులకో తెలియరాకున్నది.

**విశేషము:**

1. ఇందులో ప్రతి చరణము చివరా "బాతే!" అను పదం పునరుక్తి యైనది. ఇది భ్రాతికి (భ్రాంతి) మరోరూపమై ఉండవచ్చు. ఇట్లు "క్రా" లో క్రావడి బ్రయోగములయందు అనేక చోట్ల గనబడుచున్నది గాని దానికి సరియైన ప్రమాణము చిక్కినదికాదు. దానికి నిఘంటువులలో ప్రేమ, శ్రద్ధ, జాగరూకత, తబ్బిబ్బు, దుర్లభము వంటి అనేక అర్థములున్నవి.
2. ఈ కీర్తనలో అన్నమయ్య అనేక ఉపమానములను లోకోక్తులను ఉపయోగించడం విశేషం. ఉదా: పోసపు బాస పోకకు బుట్టెడేసి, "చేగల వావి చెట్టున చేటడేసి" లాంటి సామెతలు, చల్లజంపు (తెలియకుండా ప్రాణము తీయు) వంటి పలుకుబళ్ళు ఉన్నవి.

## 480

**అవతారిక:**స్వామి చేసే అల్లరి పనులకు ఎంత ఓర్చుకుని ఉన్నప్పటికి చీటికి మాటికి తగాదాలకు దారితీసేవిధంగా ప్రవర్తిస్తున్నాడని భావించిన అమ్మ స్వామితో నేను ఓర్వజాల స్వామీ! అంటున్నది.

## సామంతం

ప. ఓపనోప నింతేసికి వోయయ్య నేను
కోపగించకున్నాను కొడిమె లెంచేవు ॥పల్లవి॥

1. నగితిఁబో అందుకేమి నాలోనే వొకవేళ
నీమీఁద నెట్టైనా వొచ్చె మంటినా
చిగురుఁబెదవి గొంత చిమ్మి కదిలించితిఁబో
జగడించ నీకేల సారెకు దిట్టితినా ॥ఓపనోప॥

2. వుసురంటిఁబో నే నొడలియలపుతోడ
కసరి నిన్నేమైనాఁ గాదంటినా
అసుదై వూరకుంటిఁబో అంతలోనే నీవు నన్ను
వెస నిట్టే జరసేవు వేగిరపడితినా ॥ఓపనోప॥

3. కాఁగిలించితిబో నిన్ను కాఁకలు మేన నిండఁగా
రాఁగిననీ మేనికాఁక రవ్వపెట్టేనా

వీఁగక శ్రీ వేంకటేశ వేడుక నన్నుఁ గూడితి
దాఁగనేల నీమాట దాఁటఁగలనా ॥ఓపనోప॥

**అర్థములు:** ప. ఓపనోప = అసలు ఓర్చుకోలేను, ఇంతేసి = ఇంత ఎక్కువ, ఓయయ్య = ఓ అయ్యా!, కొడిమెలు = తప్పులు, ఎంచు = లెక్కించు.

1. నగితి = నవ్వితిని, ఒకవేళ = చేదర్థక వాక్యములో పక్షార్థమును తెలుపు పదము, నెట్టు = త్రోయు, చిగురు = లేత, చిమ్మి = విజృంభించి, కదిలించితి = గాటుపెట్టితి, జగడించు = పోట్లాటకు దిగు, సారెకు = మాటిమాటికి.
2. ఉసురంటి = విసుగుకొను, ఒడలి యలుపు = శరీరము శ్రమపడు, కసరి = గద్దించి, అసు = అనాదరార్థంలో క్రియల కనుబంధంగా చేరే పదం, వెస = వేగముగా, జరయు = నిందించు, వేగిరపడు = తొందరపడు.
3. కాగలించు = కౌగలించు, కాకలు = తాపము, రాగిన = అనురాగమైన, రవ్వ = అల్లరి, వీగక = తగ్గక, వేడుక = సంతోషము, దాగు = పొంచి యుండు, దాటు = మీరు.

**భావము :** అయ్యా! ఓ అయ్యా! స్వామీ! వినండి! నేను ఇంత అధికమైన పనులకు ఓర్చుకోలేక భరించలేక యున్నాను. నేను అసలు నీపై కోపం చూపించకపోయినప్పటికి తప్పులు లెక్కించడం మొదలు పెట్టావు.

ఒకవేళ నాలో నేను ఏదో నవ్వుకున్నాననుకో దానివల్ల ఏమైనది? నిన్నేమైనా ఎలాగైనా వచ్చేయవయ్యా! అన్నానా? లేలేత పెదవి కాస్తా విజృంభించి కదిలించి గంటు పెట్టాననుకో! దానికే ఇంతగా పోట్లాటలు పెట్టుకోనేల? మాటి మాటికి నేనేమైన తిడుతూ ఉన్నదాననా?

నాకేమో ఒడలు బడలికగా నొప్పులు గా ఉండి ఉసురుసురని విసుగు కలిగినప్పటికి, నేను గద్దించి కోపంతో కాదు కూడదు అని నీతో అన్నానా? నీవు అనాదరించినా, ప్రాణం బాగోలేక అలా ఊరకున్నాను కానీ అంతలోనే నీవు అంత వేగముగా విచ్చేసి నిందిస్తున్నావు కానీ నేనేమైనా నీలా తొందరపడ్డదాననా?

ఒకవేళ నిన్ను కౌగిలిలో గాఢంగా, శరీరమంతా తాకేవిధంగా కౌగలించుకున్నాననుకోండి, అనురాగముతో నీ శరీర తాపము అల్లరి పెడుచున్నదా? ఏమాత్రం తగ్గని ఓ శ్రీవేంకటేశ్వరా! సంతోషముతో వచ్చి నన్ను చేరుకుని కలిశావు. ఇంక ఇలా దాగుడుమూతలాడడం ఎందులకు? నేనేమైనా మీ మాట మీరే దానవా?

## 481

**అవతారిక:** ద్వాపర యుగంలోని శ్రీకృష్ణుని బాల చేష్టలను రేపల్లెలోని గొల్లెతలు యశోదమ్మకు గోరంతలు కొండంతలుగా వివరించే దృశ్యం.

### కాంబోది

ప. ఏమమ్మ యశోద మీయింటికి నేము వచ్చితే
గాముపంటి బిడ్డ నిచ్చి కలుపడఁ జేసితి ॥పల్లవి॥

1. పాలు గారీ నెలవులఁ బక్కునఁ జెక్కుమీఁటితే
వేలువెట్టితే లోకాలు వెల్లివిరిసీ
వీలి నేము వుగ్గువెట్ట వెరతుము మీవాఁడు
బాలుఁడా దయ్యముగాక పట్టవమ్మా ॥ఏమమ్మ॥

2. నెమ్మిఁదొడమీఁద నుండి నిలువు నూరు వండీని
పమ్మి నాల్గుమోముల పాపఁడు లోన నున్నాఁడు

నెమ్మదిఁ బాలు వోయఁగ నే వెరతు మీవాఁడు
ఇమ్ముల వీఁడు మానిశా యెవ్వఁడో కాక ॥ఏమమ్మ॥

3. పక్కన నీరార్చితిఁ బయ్యదలో నిడుకొంటి
మక్కువ నాకే తాను మగఁడైనాఁడు
చిక్కిన పను లింకేమీఁ జెప్పఁగ నేవెరతును
యెక్కువ శ్రీ వేంకటుశుఁడితఁడేపో యమ్మా ॥ఏమమ్మ॥

**అర్థములు:** ప. నేము = మేము, గాము = రాక్షసుడు,అసమాన్యుడు, కలుపడు = నివ్వెరపడు,ఆశ్చర్యమునకులోనగు.

1. నెలవులు = స్థానము, బక్కున = తటాలున, చెక్కు = చెక్కిలి, లోకాలు = ప్రపంచం మొత్తం, వెల్లివిరియు = ప్రకటితమగు, వీలి = వీనికి, నేము = మేము, ఉగ్గువెట్టు = బిడ్డలకుఉ గలసిపోసెడి చనుఉబాలాముదము, వెరతుము = భయపడుతున్నాము, పట్టవమ్మా = తీసుకోవమ్మా!
2. నెమ్మి = ప్రేమ, నిలువునీరు = నివ్వెరపోవు, పమ్మి = అతిశయించి, నాల్గుమోముల వాడు = బ్రహ్మ, వెరచు = భయపడు, ఇమ్ముల = కుదురుగా, మానిశా = మనిషా, ఎవ్వడో = ఎవరో తెలియదు.
3. నీరార్చు = స్నానము చేయించు, బయ్యెద = పైటకొంగు, ఇదుకొను = ఉంచుకొను, మక్కువ = ప్రేమ, మగడు = భర్త, చిక్కిన = మిగిలిన, వెరతును = భయపడు, ఎక్కువ = అధికుడు.

**భావము :** ఓ యశోదమ్మా! మీ ఇంటికి ఏదో చూడ్డానికి వస్తే ఒక అసమాన్యమైన రాక్షసుని వంటి పిల్లవాడిని మాచేతికిచ్చి మామ్ములను ఈవిధంగా నివ్వెరపడేట్టు చేయడం సబబుగా ఉన్నదా?

పాలు గారే బిడ్డడు కదా అనుకొని తటాలున చెక్కిలి నొక్కాలనుకొని బుగ్గను అలా పట్టుకోగానే, నీ బిడ్డ నోరు తెరచుకొనగానే మాకు పదునాలుగు భువన భాండాలన్నీ కనిపించాయి. వీనికి మేము ఉగ్గు పెట్టడం అసాధ్యమమ్మా! మాకు భయముగా నున్నది. మీవాడు బాలుడా లేక దయ్యమా? ఏమీ అర్థం అవడం లేదు సుమా!

ప్రేమ మీర తొడమీదకు తీసుకోగానే నివ్వెర పోయి చూస్తున్నాము, ఎందుకంటే నోటిలోపల అతిశయించిన నాలుగు తలల బ్రహ్మ కనిపించాడు. మీ బిడ్డకు పాలు పోయడం మా వల్ల కాదు తల్లీ భయమేస్తున్నది. వీడు కుదురుగుండా ఉండే మనిషా? లేక మరెవరో అర్థం కాకున్నది.

స్నానం చేయించి కూర్చుండజేసి పాలు ఇద్దామని పైటకొంగులో అతని తలను పెట్టుకోగానే అంతను మాకే భర్తలా ప్రవర్తిస్తున్నాడు. ఇక మిగిలిన పనులేమి ఉన్నా సరే దయచేసి మాకు చెప్పకమ్మా యశోదమ్మ తల్లీ! మాకు భయంగా ఉన్నది. అసలు అధికుడైన తిరుమలగిరి శ్రీవేంకటేశ్వరుడితడేనమ్మా!

## 482

**అవతారిక:** స్వామి అన్యస్త్రీలను చూడగానే అమ్మ అలమేలుమంగమ్మను తనను మరచిపోయి ప్రవర్తిస్తున్నాడని పరిహాసమాడుతోంది.

### బౌళి

ప. ఎట్టు నమ్మవచ్చు నిన్ను నిటువంటివానిని
నెట్టన నేఁడిదె నిన్ను మఱచితివి ॥పల్లవి॥

1. కాటుకకన్నుల నాకె గక్కన నిన్నుఁ జూచితే
మాటలు నాతో నాడేది మఱచితిగా
చీటికిమాటికి నట్టే చిరునవ్వు నవ్వెనంటా
నాటిన మనసుతోడ నన్ను మఱచితివి ॥ఎట్టు॥

2. పెద్దబెట్టుమాట లాడి పిలిచెనంటానే

వొద్దనున్న నన్ను మఱ చుస్సురంటివి
ముద్దు చూపి దవ్వులనే మెఱఁగులు చల్లితేనే
పొద్దుగూఁకు పొడపు లిప్పుడే మఱచితివి ॥ఎట్టు॥

3. చిగురుఁజేతుల నాకె చేసన్న సేసితేనే
తగవు మఱచితిగా దగ్గర నుండే
మిగులా శ్రీ వేంకటేశ మించునా కాఁగిటఁ గూడి
అగపడి రతిఁ జిక్కి అన్నీ మఱచితివి ॥ఎట్టు॥

**అర్థములు:** ప. నెట్టన = అనివార్యముగ, నేడు = ఈరోజు, మరచితి = మరచిపోయితిని.

1. ఆకె = ఆమె, గక్కన = శీఘ్రముగ, ఆడేది = మాట్లాడేది, చీటికిమాటికి = ప్రతిదానికి, నాటిన = నెలకొన్న.
2. బెట్టు = అతిశయము, వద్ద = దగ్గర, ఉస్సురను = సేదదీరు, దవ్వు = దూరము, మెరగులు = కాంతి, చల్లు = విరజిమ్ము, పొద్దుగూకు = సాయంత్రమగు, పొడుపు = ఉదయము.
3. చిగురుచేతులు = లేలేత చేతులు, ఆకె = ఆమె, చేసన్న = చేతిసైగ, తగవు = గొడవ, మిగుల = మిక్కిలి, మించు = మీరు, కాగిట = కౌగిట, అగపడి = కనుపించి, రతిజిక్కు = రతిక్రీడకు లోబడి.

**భావము :** స్వామీ! నీ వంటి వాడిని ఎలా నమ్మగలము? అనివార్యముగా, గమనిస్తే ఈనాడు నిన్ను నీవే మైమరచిపోయావు కదా!

చక్కని కాటుక కన్నులతో నున్న ఆమె నిన్ను చూసి వెంటనే నవ్వులు చిందిస్తే నాతో మాట్లాడడం సైతం మరచిపోయావు కదా! ఆమె మాటి మాటికి చిరునవ్వులు చిందిస్తుండగా, ఆ నవ్వులే నీ మనసులో బలంగా నాటుకొని నన్ను కాస్తా మరచిపోయావు.

ఆమె అతిశయించి బెట్టు చేసి మాట్లాడగానే ఆమెను దగ్గరకు పిలిచి ఆ సంతోషంతో ప్రక్కన ఉన్న నన్ను సైతంమరచిపోయావు.. ఆమె ముద్దులను సైగలతో చూపి దూరాన నిలబడి కాంతులను విరజిమ్మగానే అసలు రాత్రా పగలా అన్న విషయము సైతం మరచిపోయావు.

లేలేత చేతులతో ఆమె నీకు ఏవో సైగలు చేయగా, మునుపటి జగడాలన్నీ పూర్తిగా మరచిపోయి దగ్గరకు చేరుకున్నావు. అధికమైన ఓ శ్రీవేంకటేశ్వరా! ఈవిధముగా నా కౌగిలిలో మితిమీరి ప్రవర్తిస్తూ, కనిపించి రతిక్రీడలో సర్వమూ మరచిపోయి నాతో సుఖించావు.

## 483

**అవతారిక:**అమ్మ అలమేలుమంగమ్మ సవతిపోరును ఏమాత్రం భరించలేక యుండగా, గొడవలెందుకు తెచ్చిపెట్టుకుంటావని చెలులు స్వామికి విన్నవిస్తున్నారు.

### రామక్రియ

ప. ఇరవై మన్నించవయ్య ఇంతి గుణ మిదివో
తరుణివారము గాన తగుఁల జెప్పితిమి ॥పల్లవి॥

1. కొమ్మ నీతో పొందుచేసి కొరి పిన్నానాఁడాడే
బొమ్మలఁ దేనియ్యదు నీ పొందు దగిలీనంటా
ఇమ్ముల సవతి పోరు కిసుమంత కోప దీకె
యెమ్మె కెవ్వతెఁ దెచ్చినా నెట్టవునో పనులు ॥ఇరవై॥

2. నీవూఁ దాను గూచుండఁగా నిలువుటద్దములోన
సోవగాఁ బతిరూపులు చూడనోపరు
తావులఁ దననీడకు తా నలిగీని చెలి

ఆవలి ఇంతిఁ దెచ్చితే నప్పు డేమేమౌనో ॥ఇరవై॥

3. తనరూపు వ్రాసి వేరేతరుణి యయ్యానంటా
యెనలేని తనసంది నిడుకొనెను
ఘనుఁడు శ్రీ వేంకటేశ కైకొంటివి ఇంతిని
ననుపు చెల్లులపొందు నవ్వుఁబాటు సుమ్మీ ॥ఇరవై॥

**అర్థములు:** ప. ఇరవు = నెలవు, ఇంతి = స్త్రీ, తరుణివారు = కొలువులోనున్న యౌవన స్త్రీజనము, తగుల = మిగుల.

1. కొమ్మ = స్త్రీ, పొందు = కలయిక, పిన్ననాడు = చిన్ననాడు, దేనియ్యదు = తేనివ్వదు, తగిలెను = తాకినది, ఇమ్ముల = వసించు,ఇసుమంత = కొంచెమైనా, ఓపదు = ఓర్చుకోలేదు, ఈకె = ఈమె, యెమ్మె = విలాసము, ఎట్టవునో = ఏవిధంగా అవుతుందో.
2. సోవ = అందమైన, పతిరూపు = భర్త రూపము, చూడనోపరు = చూచుటకు ఇష్టపడరు, తావుల = స్థానములో, నలిగీని = బాధపడుచున్నది, ఆవలి = తరువాత, ఇంతి = స్త్రీ, ఏమవునో = ఏవిధంగా అవుతుందో.
3. రూపు = చిత్రము, తరుణి = స్త్రీ, ఎనలేని = సాటిరాని, సంది = దండచేయి, ఇడుకొను = ఉంచుకొను, ఘనుడు = గొప్పవాడు, కైకొను = చేపట్టు, ఇంతి = స్త్రీ, ననుపు = అనురాగము, చెల్లులపొందు = సరిపోయే కలయిక, నవ్వుబాటు = నవ్వులపాలు, సుమ్మీ = నిశ్చితార్థము,అవును.

**భావము :** స్వామీ! ఇక్కడ కొలువై నిలిచియుండి ఇంతి గుణములను తెలుసుకొని మన్నించవయ్యా! మేము కొలువులోనున్న యౌవన స్త్రీజనముగా నీతో విన్నవించుకుంటున్నాము.

ఈ అమ్మ నీతో చిన్ననాటినుండి కలిసి మెలసి తిరుగుచున్నది. నీ పొందు కోరే ఈమె ఏవిధమైన స్త్రీలను, ఇంటికి చాయలకు కూడా రానీయదు. ఇక్కడ ఆమెకు సవతిపోరుకు ససేమిరా గిట్టదు, ఒప్పుకోదు సుమా! నీవు సరదాగా, విలాసముతో ఎవతెనైనా దెచ్చినట్లైతే పరిస్థితి ఎలా ఉంటుందో ఊహింపజాలము.

నీవూ ఆమె కూర్చుండి నిలువుటద్దాలలో రూపులు చూస్తూ ఉండగా ఇంకెవరినీ నీ బింబము చూడడానికి కూడా ఒప్పుకోదు. వాస్తవానికి తన నీడను చూసి తానే భయపడే స్వభావమ గల అమ్మ, నీవు ఇంకెవరినైనా ఇంటికి తీసుకొని వస్తే ఇంక అప్పుడేమౌతుందోనని మాకు చాలా భయముగా ఉన్నది.

తన మాదిరిగానే వేరే తరుణి తయారవగా, ఈ అమ్మ ఆమెను ఎక్కడికీ వెళ్ళనీక తన దండచేయి క్రింద ఉంచుకొన్నది. అధికుడైన ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ ఇంతిని చేపట్టితివి, మీకు అంతే చాలు. అనురాగముతో వేరే చెలులను చేపడితే నవ్వులపాలు అవడం కచ్చితం సుమా!

## 484

**అవతారిక:** శ్రీనివాసుడు, అలమేలుమంగమ్మలు భావనలు ఒకటై ప్రేమలు ముడివేసుకున్నవని త్వరగా వచ్చి చేరమని చెలులు అమ్మను పిలుస్తున్నారు.

### ముఖారి

ప. ఇద్దరు నేకములైన యెదురు మీకిఁక లేదు
చద్దివేఁడి వలపులకు సటలు మరిలేవు ॥పల్లవి॥

1. తనువు లేకములైన తప్పులునొప్పులు లేవు
మనసు లేకములైన మరఁగులే లేవు
చనవు లేకములైన సాదింపు మరి లేదు
వనిత విచ్చేయఁగదే వరుసఁ బతికడకు ॥ఇద్దరు॥

2. పలుకు లేకములైనఁ బైకొసరు మరి లేదు
తెలువు లేకములైన తెగువలే లేవు
చెలిమి సరిదాఁకితే చింతలే మరి లేవు
వెలఁది విచ్చేయఁగదే వెనకకతలేల ॥ఇద్దరు॥

3. వయసు లేకములైన వంతులువాసులు లేవు
ప్రియము లేకములైన బిగువులే లేవు
దయను శ్రీ వేంకటోత్తముఁడు నినుఁగూడె నిదె
ప్రియురాలి విచ్చేయి పిలిపించుకొనక ॥ఇద్దరు॥

**అర్థములు:** ప. ఏకము = ఒకటిగా, ఎదురు = సాటి, చద్దివేడి = వేడి,చలిమి కలసియున్న, సటలు = చిక్కులు.

1. తప్పులునొప్పులు = సరియైనది మరియూ దోషము, మరగు = రహస్యము, చనవు = ప్రేమ, సాదింపు = బాధపెట్టడం, వరుస = క్రమము,పద్ధతి.
2. పైకొసరు = అన్యకోరికలు, తెలువు = వికాసము, తెగువ = ధైర్యము, చెలిమి = స్నేహము, సరిదాకు = సరిపోవు, చింత = బాధ, వెలది = స్త్రీ, వెనక కతలు = వెంకటి సంగతులు.
3. వంతులు = పోటీలు, వాసులు = తారతమ్యాలు, బిగువు = బింకము.

**భావము :** స్వామీ! అమ్మ అలమేలుమంగమ్మ తమరూ ఏకమై ఒకటైతే ఎదురేమున్నది? ఉష్ణము,వేడి కలగలసిన ప్రేమలకు చిక్కులేమీ ఉండవు సుమా!

ఇద్దరి శరీరాలు ఒకటైతే తప్పు ఒప్పు అనేవి ఏమీ కనబడవు. మనసులు కలిస్తే రహస్యాలు ఏముంటాయి. అనీ బహిరంగమే కదా! ప్రేమలు ఏకమైతే ఇక బాధలేమీ ఉండనే ఉండవు. ఓ అమ్మ! ఇక పతి కడకు రావమ్మా!

ఇద్దరి మాటలు ఒకటైతే ఇంకా పైన కోరికలు ఏమి మిగిలి ఉంటాయి?ఇద్దరి వికాసములు ఒకటయినట్లైతే ఇంకా ధైర్యాధైర్యాలతో పని ఏమున్నది? స్నేహము ఇద్దరిని ఒకటి చేస్తే బాధలేముంటాయి గనక? ఓ అమ్మా! ఇలా రావమ్మా! అన్నీ మరచిపోయి రావమ్మా! ఇంకా ముందు సంగతులెందుకు గుర్తుతెచ్చుకుంటావు.

ఇద్దరి వయసులు ఒకటైతే మీ ఇద్దరి మధ్యా పోటీలు తారతమ్యాలు ఉండనే ఉండవు. ఇద్దరి ఇష్టాలు ఒకటే అయినపుడు ఇంకా బింకాలెందులకు? ఆ స్వామి శ్రీవేంకటేశ్వరుడు కరుణతో ఇక్కడి విచ్చేసి నిను గూడినాడు. అమ్మా! ఇంకా స్వామి వారితో పిలిపించుకొని బెట్టు చేయకుండా త్వరగా విచ్చేయవమ్మా!

## 485

**అవతారిక:**స్వామి అమ్మ చెంత జేరి మాట్లాడనందున కలిగే సమస్యలు చెలులు స్వామివారికే వివరిస్తున్నారు.

### లలిత

ప. మంకు విడిచిన నిదె మంచి బుద్ధి
సుంకుల మీలోనే మీరు చూచుకొనరాదా ॥పల్లవి॥

1. నీడలెల్ల నెండలాయ నెలఁత నీవు రాకున్న
వేడుకెల్లా వేసటాయ వెచ్చఁదనాన
వాడిక నడుమ వేరే, వయసు రిత్తవోయీని
కూడిన కూటాలమేలు కొల్లలాడరాదా ॥మంకు॥

2. కప్పురమే కారమాయ కదిసేమాటలు లేక
దప్పులెల్లాఁ దనివాయ దగ్గరి రాఁగా

రెప్పవే సేయంతలోనే రేసులెక్కు నీ మనసు
తెప్పలఁ దేలఁగరాదా దిష్టపుమీరతుల ॥మంకు॥

3. దవ్వులెల్లఁ జేరువాయఁ దరుణి నీవియ్యకోఁగా
పువ్వులెల్లఁ బిందెలాయఁ బూఁటపూఁటకు
యివ్వల శ్రీ వేంకటేశ యింతి నీవు గూడఁగాను
నవ్వులాయ మాకెల్ల నమ్మికియ్యరాదా ॥మంకు॥

**అర్థములు:** ప. మంకు = మొండితనము, మంచిబుద్ధి = ఉత్తమమైన గుణము, సుంకుల = బాధ.

1. నెలత = స్త్రీ, వేడుక = సంతోషము, వేసట = శ్రమ, వాడిక = అలవాటు, రిత్తవోవు = వ్యర్థమగు, కూటమి = సమూహము, కొల్లలు = అపహరించు.
2. కప్పురము = కర్పూరము, కదియు = దగ్గరగు, దప్పి = దాహము, తనివాయ = తృప్తినొందు, రెప్పవేసేంతలో = క్షణకాలములో, రెసులెక్కు = ఈర్ష్యకలిగించు, తెప్పలతేలు = ఊగాడు, దిష్టపురతులు = కనబడే రతిక్రీడ.
3. దవ్వు = దూరము, చేరువ = దగ్గర, తరుణి = స్త్రీ, ఇయ్యకొను = సమ్మతించు, పూట = రోజులో కొంత సమయము, ఇవ్వల = ఇక్కడ, ఇంతి = స్త్రీ, నమ్మిక = విశ్వాసము.

**భావము :** మొండితనము విడిచిపెడితే అదే ఉత్తమమైన గుణముగా భావించదగును. బాధలను మీలో మీరే చూసుకోవచ్చును కదా!

ఆ స్త్రీ రానందున నీడ ప్రదేశము కూడా ఎండలో ఉన్నట్లైనది. ఆ వేడిమి వలన సంతోషమంతా శ్రమగా, కష్టముగా మారినది. అలవాటైన విషయాలలో ఎలాగూ వేరేగా ఉండనే ఉన్నది కానీ ఈ యౌవన సమయమంతా వ్యర్థమయినది కదా! కూడుకున్న ఈ సమూహాలలో యౌవనాన్ని కొల్లగొట్టరాదా!

దగ్గరజేరి మాట్లాడకపోవడం వలన మంచి సుగంధమైన కర్పూరము కూడా కారపు రుచిగా తోచినది. దగ్గర జేరడం ద్వారా దాహార్తి చల్లారి తృప్తిని పొంది హాయినిచ్చినది. మీ బహిరంగ రతిక్రీడలతో తెప్పలపై ఊగరాదా స్వామీ!

తరుణిని నీవు సమ్మతించి చేరగానే దూరమంతా దగ్గరైనది. పూట పూటకు సిగ్గులు మొగ్గలైన చందాన పుష్పములన్నీ పిందెలైనవి. ఓ శ్రీవేంకటేశ్వరా! ఇవతల నీవు అమ్మ అలమేలుమంగమ్మను దరిచేరి కలియగానే మాకు చాలా సంతోషమైనది. ఈవిధమైన విశ్వాసమునే ఎల్లవేళలా కలిగించరాదా స్వామీ!

## 486

**అవతారిక:** అలుమేలుమంగమ్మ విరహముతో తాళలేక, స్వామిని త్వరగా పంపమని చెలులను వేగిరపెడుతున్నది.

## సామంతం

ప. అడియలాలెల్ల నిండె నంపరాదా ? నీ-
నడిగినట్లెల్లానాయ నంపరాదా ॥పల్లవి॥

1. కన్నుల నిద్దుర దేరెఁ గందువలు చెమరించె
అన్నివనులును నాయ నంపరాదా
వన్నె మోవి కదురాఁగె వసివాడె మైఁదీగె
అన్నిటా జాణఁడవౌదు వంపరాదా ॥అడియలాలెల్ల॥

2. కాయమెల్లా మఱపాయఁ గరఁగె నామనసెల్ల
ఆయములు సరిదాఁకె నంపరాదా
పాయములు ఫలమందె పంతము లొక్కట్లాయ

ఆయెడకే వత్తుఁగాని అంపరాదా ॥అడియలాలెల్ల॥

3. మచ్చికలే తనివొందె మంతనాలే చవులాయ
అచ్చుపడెఁ గూటములు అంపరాదా
ఇచ్చకుఁడ శ్రీ వేంకటేశ నన్నుఁ గూడితి–
నచ్చికములెల్లఁ బాసె నంపరాదా ॥అడియలాలెల్ల॥

**అర్థములు:** ప. అడియాలు = గుర్తులు, నిండె = వ్యాపించెను, అంపరాదా = పంపించరాదా, అడిగినట్టెల్లా = అడిగినవిధంగా, ఆయ = అయినది.

1. తేరె = కలిగినది, కందువలు = ఏకాంతము, చెమరించె = స్వేదమయినది, వన్నె = కాంతి, మోవి = ముఖము, కడురాగె = మిక్కిలి అనురాగమైనది, పసివాడె = లేతగా ఉన్నది, మైదీగె = తీగవంటి సుకుమారమైన శరీరము, జాణడు = నేర్పరియైన వాడు.
2. కాయము = శరీరము, మరపు = మైమరపు, కరగు = ద్రవించు, ఆయములు = మర్మస్థానములు, సరిదాకె = సరిగ్గా సమానమై తాకుచున్నవి, పాయము = వయసు, ఫలమందె = ఫలించినవి, పంతము = పట్టుదలమాటలు, ఆయెడకు = అక్కడికి.
3. మచ్చిక = స్నేహము, తనివొందు = తృపినొందు, మంతనాలు = ఒప్పందపు మాటలు, చవులు = రుచి, అచ్చుపడు = సార్థకమగు, కూటములు = కలయికలు, ఇచ్చకుండు = ఇష్టమైనవాడు, నచ్చికము = లోపములు, పాసె = వీడినవి.

**భావము :** చెలులారా! గుర్తులు, సంకేతములు అన్నీ సర్వత్రా వ్యాపించినవి. అన్నీ నీవడిగినట్లే ఆయెను ఇంక స్వామిని నావద్దకు పంపరాదా!

నాకన్నులలో నిద్దుర ముంచుకొస్తున్నది. ఏకాంతములో శరీరము స్వేదమునకు గురియైనది. అన్నిపనులు అయ్యాయికదా ఇకనైన పంపరాదా! లేత తీగ వంటి శరీరముతో కాంతిగల మొహము మరింత అనురాగవంతమై యున్నది. స్వామి అన్నిటా సమర్థుడే కదా ఇకనైనా పంపరాదా!

నా మనసంతా ద్రవించినది. శరీరము మైమరపునకు గురవుతున్నది. జీవస్థానములు సరిగ్గా సమానమై తాకుచున్నవి. ఇకనైనా పంపరాదా! మా ఇద్దరి పంతాలు పట్టింపులు ఒకేవిధమైనవి. నేను అక్కడికే వస్తాను కానీ స్వామిని పంపించరాదా!

అలవాటైన స్నేహాలు తృప్తినిస్తున్నవి. ఒప్పందపు మాటలన్నీ రుచిపుట్టించి వేగిరపెడుతున్నవి. స్నేహపు కలయికలు సార్థకమైనవి. ఇక స్వామిని పంపించరాదా! ఆహా! నేనంటే ఎంతో ప్రీతిగల శ్రీవేంకటేశ్వరుడు నన్ను చేరినాడు ఇంక లోపములన్నీ సమసిపోయినవి.

## 487

**అవతారిక:** స్వామి అన్య కాంతలతో కూడినప్పుడు చేసిన చిలిపి పనులను వర్ణిస్తూ, విషయాన్నీ తనకు వివరంగా చెప్పకపోతే కుదరదు సుమా! అని అమ్మ గడుసుగా స్వామితో అంటున్నది.

## సావేరి

ప. వెఱతుమయ్యా నీకు వింత లింకానేమైనా
మఱి నిన్ను నెప్పుడుఁ గమ్మరా విడువరా ॥పల్లవి॥

1. పిలువ వచ్చినసతి పెదవులెల్లాఁ బొక్కె
వెలయ నీపే రెంతవేఁడోకాని
చలువకు మందులేక సాదించ నే వచ్చితిరా
పలుకకుండితే మోవి పతిపొక్కింపింతురా ॥వెఱతు॥

2. చూడవచ్చినట్టి ఇంతి చూపులెల్లాఁ గెంపువారె
జాడ నీరూ పెంతటిబాసటమో కాని

వేడుక నిది మానుప వేఁడుకో నే వచ్చితిరా
తోడనే నీ వూరకున్న తుదమీరఁ జేతురా ॥వెఱతు॥

3. ఆకుమడిచిచ్చే సతియంగ మెల్లాఁ జెమరించె
చేకొని నీవేమిచేఁత సేసితోకాని
దాకొని శ్రీ వేంకటేశ దగ్గరి నేఁ గూడుండఁగా
నాకన్నీఁ జెప్పకుండితే నవ్వు నవ్వింపింతురా ॥వెఱతు॥

**అర్థములు:** ప. వెరచు = భయపడు, వింత = ఆశ్చర్యము, క్రమ్ము = చుట్టుకొను, విడుచు = విడిచిపెట్టు.

1. పిలువ వచ్చిన = పిలవడానికి వచ్చిన, బొక్కు = తిను, వెలయ = ప్రకటించు, వేడి = తాపము, చలువ = చల్లగా చేయు, సాదించు = ఇబ్బందిపెట్టు, మోవి = మొహము, ప్రతి = సమానంగా, పొక్కు = బొబ్బలులేచు.
2. ఇంతి = స్త్రీ, కెంపువారు = ఎరుపెక్కు, జాడ = గుర్తు, బాసటము = సహాయము, వేడుక = సంతోషము, మానుప = మాన్పించుటకు, వేడుకో = ప్రార్థించుటకు, ఊరకుండు = ఏమీ మాట్లాడకుండా ఉండు, తుదమీర = అడ్డూఆపు లేకుండా.
3. ఆకుమడిచిచ్చు = తాంబూలమిచ్చు, అంగము = శరీరము, చెమరించు = చెమటపట్టు, చేకొని = చేపట్టి, చేత = పని, దాకొని = దాగి ఉండి, కూడి = చేరి, జెప్పకుండితే = చెప్పకుండా ఉన్నట్లైతే, నవ్వింపింతు = నవ్వించేటట్టు చేయు.

**భావము :** స్వామీ! నీవుచేసే పనులవలన నాకు భయం వేస్తున్నది. ఇంతేనా ఇంకా ఏమైనా నీ చేతలు లీలలు యింకా మిగిలి ఉన్నాయా? అసలు వనితలు నిన్ను ఎప్పుడూ చుట్టుకోరా వదలిపెట్టరా?

ఆ పిలవడానికి వచ్చిన రమణి చూశారా! ఆమె నీ పెదవులన్నీ గంట్లు పడే విధంగా చేసినది. అసలు నీ నామం పలికితేనే చాలు వాళ్ళకు ప్రేమావేశం తన్నుకొస్తుంది. నీ తాపాన్ని చల్లార్చడానికి ఏ మందూ లేక ఊరక ఇబ్బందులపాలు చేయడానికే నేను విచ్చేశాను. ఏమీ మాట్లాడకుండా ఉన్నావంటే నీ పెదవులు అదే విధంగా దంతక్షతాలతో బొబ్బలెక్కేవిధంగా చేస్తాను సుమా!

చూడ్డానికి వచ్చిన ఆ కాంత చూపులన్నీ ఎర్రని కెంపులై మారినవి. అసలు నీ రూపు ఎంతటి సహాయకారో తెలియదు కానీ దీనిని మానమని చెప్పడానికి ప్రార్థింపవచ్చితిని. నీవు ఇంకా ఉపేక్ష చేసి ఈ కార్యాలన్నీ కొనసాగించినట్లైతే నేను కూడా హద్దుమీరి ప్రవర్తింపవలసి ఉంటుంది సుమా!'

నీవామెను చేపట్టి ఎలాంటి చిలిపి పనులు చేసితివో తెలియదు కానీ, తాంబూలము చేతికిచ్చిన ఆ రమణి శరీరమంతా చెమటతో తడసి ముద్దయైనది. దాగుకొని ఉన్న ఓ శ్రీవేంకటేశ్వరా! సమీపించి నేను కలిసియున్నప్పుడు నాకు అన్నీ వివరంగా చెప్పనట్లైతే నిన్ను అనేక విధములైన నవ్వులు నవ్వించేట్టు చేయగలను సుమా!

## 488

**అవతారిక:** స్వామి స్త్రీజనంతో అతిగా ప్రవర్తిస్తూ ఉండగా అమ్మ నీతో నువ్వే యిలా ఆటలాడుకోవడం సబబా అని ప్రశ్నిస్తున్నది.

### వేళావళి

ప. నీకు నీకే యాడుకోకు నియ్యాన
కైకొని నేనే నీపై గడియించేఁ గాని ॥పల్లవి॥

1. అంతవాఁడ వవుదువు అంగనల వలపించి
వంతులకు నీవే నవ్వనోపుదువు
పంతమాడఁ బనిలేదు పలుమారు మాకెల్లా
కాంతుఁడు నిన్నెప్పుడుఁ బొగడవలెఁగాని ॥నీకు॥

2. మంచివాఁడ వవుదువు మచ్చికలే పచరించి
వంచి సవతులఁ జూపి వాసిరేఁచును

కొంచ నిఁకఁ బనిలేదు కోడెతనానకు నీవే
చంచులకు రాజవంటాఁ జాటవలెఁగాని ॥నీకు॥

3. రసికుఁడ వౌదువు రతులఁ గాఁగిటఁ గూడి
మిసిమిమమ్మెల్లా నీవు మెప్పించను
యెసగి శ్రీ వేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
పసగాని మన సిఁకఁ బట్టవలెఁగాని ॥నీకు॥

**అర్థములు:** ప. ఆడుకోకు = ఆటలాడవద్దు, నీంయాన = నీమీద ఒట్టు, కైకొని = చేపట్టి, గడియించు = లెక్కించు.

1. అంగన = స్త్రీ, వలపించి = ప్రేమించబడునట్లు చేసి, వంతు = పోటీ, పంతము = పట్టుదల, పలుమారు = అనేకసార్లు, కాంతుడు = మగడు.
2. మచ్చిక = స్నేహము,మాలిమి, పచరించు = కంబరచు, వాసిరేచు = ఖ్యాతికెక్కు, కొంచు = భీతిపడు, కోడెతనము = వయసులోనున్న, చంచులకు = కోయజాతివారు, చాటు = ప్రకటించు.
3. రసికుడు = శృంగార పురుషుడు, కాగిట = కౌగిట, మిసిమి = మెరుగులు, ఒసగి = ఇచ్చి, పస = చాతుర్యము, పట్టవలెను = చేజిక్కించుకొను.

**భావము :** నీ మీద ఒట్టు స్వామీ! ఈవిధంగా నీతో నువ్వే ఆటలాడుకుంటే ఎలా? చేపట్టి ఇక నేనే నీ విషయాలన్నీ చక్కబెట్టి లెక్కిస్తాను సుమా!

ఇక్కడ ఉన్న స్త్రీజనాన్ని ఈ విధంగా ప్రేమలో ముంచి పైగా పోటీగా నవ్వులు చిందిస్తావు. పలుమార్లు ఈ పంతాలు పట్టింపులు ఏమీ అవసరంలేదు, ఓ స్వామీ నిన్నెప్పుడూ ప్రశంసిస్తూ ఉండాలి.

నీవు అందరితో స్నేహాలు ప్రదర్శించి మాలిమి చేసుకొని మంచివాడవని పేరు గడించావు. సవతులందరిని చూసి లోబరుచుకొని ఖ్యాతి కెక్కావు. నీ యౌవన బలముతో ఉన్నందున ఏమాత్రం భీతి పడవలసిన అవసరమే లేదు. చెంచు జాతివారికి అల్లుడవై వారి రాజైనావని ప్రకటించవలెను కదా!

మంచి కాంతులతో అతిశయించి మమ్ము మెప్పించుటకు, స్త్రీల నందరిని కౌగిట కరగించే మంచి శృంగార పురుషడవు! ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ విధముగా అన్నింటిని మాకు ప్రసాదించి ఈవిధముగా నన్ను కలిసినావు. చాతుర్యవంతుడవై సారము కాని మనసులనిక చిక్కబట్టవలెను కదా!

## 489

**అవతారిక:** స్వామి పద్ధతులేమీ అమ్మకు ఇష్టం కలిగించడంలేదు. స్వామి పనులకు కోపించిన అమ్మ యిక చాలు మీ నటనలని మాట్లాడుతున్నది.

### వరాళి

ప. ఏమి బాఁతి నిజములు యీకాలము
జాముజాము కొకతైన సటలే చాలు ॥పల్లవి॥

1. గక్కన మాఁటాడఁబోతేఁ గలది గలట్టె
మొక్కలాన నూరకుండు మోనమే చాలు
చక్కఁ జూడఁబోతేను సందేహాలే యప్పటిని
వక్కణించరానితలవంపులే చాలు ॥ఏమి॥

2. పచ్చిగా నవ్వఁబోతే పనులెల్లాఁ గానఁబడీ
కొచ్చి మమ్ముఁ దడవకు కోపమే చాలు

అచ్చపుటేకతమైతే అయములు రేఁగీని
యిచ్చటఁ జెలులసందడిదియే చాలు ॥ఏమి॥

3. పానుపు మీఁదికిఁ బోతేఁ బంతమెల్లా బయలయ్యీ
నానఁబెట్టి యీయెదుటినటనే చాలు
మానక శ్రీ వేంకటేశ మరి నన్నుఁ గూడితివి
కానఁబడ్డ ఇందుకంటే కతలే చాలు ॥ఏమి॥

**అర్థములు:** ప. బాతి = భ్రాంతి, నిజములు = వాస్తవము, సటలు = కపటము.

1. గక్కన = శీఘ్రముగ, మొక్కలాన = ధైర్యము, మోనము = మౌనము, సందేహము = సంశయము, వక్కణించరాని = చెప్పరాని, తలవంపు = అవమానము.
2. పచ్చిగా = బహిరంగముగా, కొచ్చి = వదలు, దడవక = భయ పడక, ఏకతము = ఆలోచన, ఆయములు = జీవస్థానములు, సందడి = హడావుడి.
3. పంతము = పట్టుదల, నానబెట్టి = ఆలశ్యముజేసి, మానక = ఆపక, కానబడ్డ = కనిపిచు, కతలు = కల్పితమైన విషయాలు.

**భావము :** ఏమి భ్రాంతి? పూర్తిగా వాస్తవమీ సమయము. పొద్దు పొద్దుకూ ఒకటే విధముగా సాగుతున్న ఈ కపటము నాటకములిక చాలు స్వామీ! భరించలేకున్నాను.

ఏదైనా తొందరపడి ధైర్యముచేసి ఏమైనా మాట్లాడబోతే మౌనమే! నేను ఉన్నది ఉన్నట్టే లెక్క! పట్టించుకోని వేళలలో మౌనముగా ఉండడమే శుభమనిపిస్తున్నది. చూడబోతే అన్నీ అనుమానాలే! అన్నీ సందేహాలే అనిపిస్తున్నవి. చెప్పడానికి వీలులేనట్టివి. చెబితే తలవంపులు కూడా

ఒకవేళ బహిరంగంగా నవ్వడానికి యత్నిస్తే మీ చేతలెల్లా కనిపిస్తున్నాయి. మమ్ములను భయపెట్టకుండా వదలిపెట్టడమే మేలని అనిపిస్తున్నది. స్వచ్ఛముగా కలిసి ఆలోచనలు ఒకటైతే జీవస్థానములలో కోరికలు చెలరేగుచున్నవి. ఇక్కడే హడావుడిగా సందడిచేసే చెలులతో ఉండిపోవడమే చాలనిపిస్తున్నది.

పట్టుపానుపు మీద పవళించ వచ్చినప్పుడు పంతాలన్నీ బహిరంగమవుతాయి. ఆలసించీ, ఆలసించీ చేసే పనులకంటే ఎదుట నటించడమే మేలనిపిస్తున్నది. వీడక ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను జతకూడినావు. కనబడినందులకు కాదు కానీ మీరుచెప్పే కట్టుకథలే వినసొంపైనవి. ఇక చాలు సుమా!

## 490

**అవతారిక:** స్వామి అన్యమనస్కంగా మాట్లాడకుండా ఉన్నప్పుడు అనవసరంగా జోక్యం చేసుకోవడం తగదని అమ్మ చెలులకు ఉద్బోధిస్తున్నది.

### సాళంగం

ప. మఱచినపని రేఁచ మాకేలే
తఱవాతి పను లిట్టే తమకించనేలే ॥పల్లవి॥

1. పెనఁగి మాయింటికిఁ బిలువఁగ నిలువఁగ
మనసు వచ్చునో రాదో మాకేలే
తమయంతలేనిది తడవ నేమిటి కెంత-
పనిగలిగున్నాఁడో పలికించనేలే ॥మఱచిన॥

2. తెరయెత్తి నేఁజూచి తిరిగితే జరిగితే

మరుతంత్ర మేమౌను మాకేలే
సరసాలే విరసాలు చవిగానిపనులకు
పరిణామ మడిగి నేఁ బచరించనేలే ॥మఱచిన॥

3. ఆరసి యప్పటిసుద్ద లడుగఁగ నొడుగఁగ
మారాక కూరకుండఁగా మాకేలే
చేరువఁ గడపలోన శ్రీ వేంకటేశ్వరుఁడు
గారవాన నన్నుఁ గూడెఁ గాదననేలే ॥మఱచిన॥

**అర్థములు:** ప. రేచ = మరలా రేకెత్తించు, తమకించు = త్వరపడు,మోహపడు.

1. పెనగి = చుట్టుకొని, తడవ = ఆలశ్యముచేయు, పనిగలిగుండు = ఏదో కార్యములో నిమగ్నమై యుండు, పలికించనేల = పలకరించనేల.

2 .తెరయెత్తి = దోమతెరయెత్తి, మరుతంత్రము = మన్మధ కార్యము, సరసాలు = శృంగార సంభాషణలు, చవి = రుచి, పరిణామము = పర్యవసానము, పచరించు = కనబరచు.

3. ఆరసి = విచారించి, సుద్దులు = మంచిమాటలు, ఓడుగు = తొలగు, మాకేలే = మాకెందులకే! చేరువ = సమీపములో, గడప = ద్వారబంధము, గారవము = గౌరవము, కూడె = కలిసె.

**భావము :** చెలులాలా! మరచిపోయిన విషయాలన్నీ మరల మరలా రేకెత్తించి మాట్లాడడం మన కెందులకు? ఆ తరువాత మరలా త్వరపడి మోహములో మునగడమెందులకు?

మేము శ్రమపడి మా ఇంటికి బిలిచినట్లైతే ఆ స్వామికి నిలుచుటకు మనసు వస్తుందో రాదో తెలియదు కదా అయినా మాకెందులకే! ఆయనకై ఆయనకు మనసు రావాలి తప్ప, మనకై మనము చొరవతీసుకోవడమెందులకు? అయినా ఆ స్వామి ఏ కార్యాలలో నిమగ్నమై యున్నాడో తెలియదు కదా!అలాంటప్పుడు పలకరించడం ధర్మం కాదు.

నేను ఆ స్వామి మంచంపై యున్న దోమతెరనెత్తి చూడడం జరిగితే ఆ మన్మధ ప్రతాపం ఎలా ఉంటుందో తెలియదు కదా! రుచి గాని కార్యాలకు దిగితే సరసాలన్నీ విరసాలవుతాయి కదా! ఆ తరువాత జరిగే పర్యవసానాలకు బాధ్యత వహించడం కష్టం కదా!

ఆ స్వామి కూర్చొని యున్నప్పుడు విచారించి మంచి చెడ్డా మాట్లాడితే ఆయన జవాబివ్వకుండా మౌనంగా ఉన్నప్పుడు మాకెందుకే ఈ అగచాట్లన్నీ! అదుగో స్వామి శ్రీవేంకటేశ్వరుడు సమీపించి మా గడపలో నిలబడి గౌరావాదరములతో నన్ను చేరి కలిసిన సమయములో నేను కాదనగలనా చెప్పండి.

## 491

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ విరహము శృతిమించినది. చెలులు ఆ మన్మధావస్తను స్వామికి వర్ణిస్తున్నారు.

### తెలుఁగుకాంబోది

ప. చెప్పరాదు చూపరాదు చెలియభావము నేఁడు
వుప్పతిల్లుఁ జెమటతో నుస్సురనీనమ్మా ॥పల్లవి॥

1. చక్కఁదన మొకవంక జవ్వన మిదొకవంక
మొక్కలపుపతి మీఁది మోహ మొకవంక
వొక్కటొక్కటికిఁగా కువిద నివ్వెరగుతో
ముక్కుమీఁదివేలితోడ మోము వంచెనమ్మా ॥చెప్పరాదు॥

2. చిత్తపు కోరికలతో సిగ్గరిభావముతోడ

పొత్తుల చెలులు చెప్పే బుద్దులతోడ
యెత్తిన తమకమున నెదురు మాఁటాడలేక
తత్తరానఁ దనలోన తానే నవ్వీనమ్మా ॥చెప్పరాదు॥

3. కన్నులఁ గావులు దేరె కళలు మోమునఁ దేరె
తిన్నని కెమ్మోవినెల్లా తేనేలు గారె
వెన్నెలవంటివలపు వేడుకఁ దలకెక్కఁగా
యిన్నిటా నిట్టె శ్రీ వేంకటేశుఁడు గూడెనమ్మా ॥చెప్పరాదు॥

**అర్థములు:** ప. చెప్పరాదు= చెప్పుటకు వీలులేదు, భావము= అభిప్రాయము,అంతరంగము, ఉప్పతిల్లు= పైకి ఉబికి వచ్చు, ఉస్సురను= శ్రమతో నిట్టూర్పు విడుచు.

1. జవ్వనము= యౌవనము, మొక్కలము= శౌర్యము, మోహము= ప్రేమ, ఉవిద= స్త్రీ, నివ్వెరగు= పారవశ్యము, మోము= తల.
2. చిత్తము = మనసు, సిగ్గరి= సిగ్గుపడు ఆడుది, భావము= మనసు, పొత్తులు= కలయికలు, బుద్ధులు= మంచి మాటలు, తమకము = తాపము, తత్తరము= తొందర.
3. కావులు= కాషాయవర్ణము, కళ= శోభ, మోము= ముఖము, తిన్నని= మనోజ్ఞమైన, కెమ్మోవి= అధరము, వేడుక= సంతోషము, తలకెక్కు= ఆవరించు, ఇన్నిటా= ఇన్ని విషయములందు, కూడెను= కలియు.

**భావము :** చెలులారా! ఈ అమ్మ అలమేలుమంగమ్మ మనోభావములు ఈనాడు చెప్పరానివి పట్టలేనివిగా యున్నవి. పైకి ఉబికుబికి వస్తున్న చెమటలతో తడసి ముద్దై శ్రమతో నిట్టూర్పులు విడుస్తున్నది.

ఆమె అందాలన్నీ ఒక వైపు, ఆమె యౌవనమొకవైపు అయితే శౌర్యవంతుడైన ఆమె భర్త మీది మోహము అన్నిటిని మించి మరో వంక యున్నది. ఈ విషయాలకు ఒక్కొక్క దానికి ఆమె పారవశ్యముతో ఉక్కిరిబిక్కిరి అవుతూ ముక్కుమీద వేలు వేసుకొని తలవంచి కూర్చున్నది.

మనసులో ఉన్న కోరికలతోను, సిగ్గులు మొగ్గలై విరబూయడంతోను, ప్రక్కన చేరి చెలులు చెప్పే నీతివాక్యాలైన మంచి మాటలతోను, శరీర తాపము అధికమై, ఏమీ మాట్లాడలేక తొందరపాటు తడబాటులతో తనలో తానే నవ్వులు నవ్వుకొనుచున్నది.

అమ్మ కన్నులు కాషాయవర్ణమై గొప్ప శోభతో కూడి యున్నది. ఆమె సుందరమైన పెదవులనుండి అధరామృతము తెనెవలె కారుచున్నది. సంతోషముతో పండు వెన్నెల వంటి ప్రేమానురాగాలు దరిచేరగా అన్ని విషయాలు తెలిసిన శ్రీవేంకటేశ్వరుడు త్వరగా వచ్చి ఆమెను కలిసినాడు.

## 492

**అవతారిక:** ఇది అలమేలుమంగా శ్రీనివాసుల సంవాదము. మాటలాడడంలో ఒకరినొకరు మించిపోతున్నారు. చూడండి.

### శంకరాభరణం

ప. ఔలేరా జాణతనాలాడేవు నీవు
లేలే నే నీవలె లెక్కలు వెట్టేనా ॥పల్లవి॥

1. కప్పకురా నీగుణాలు కందువ పొద్దాయ, నేఁ-
గప్పినట్టే నీకుచాలు గప్పేవు గాక
ముప్పిరిఁ గరఁగకురా ముదితలఁ జూచి, నీవే
కప్పురము నోరిలోనే కరఁచేవుగాక ॥ఔలేరా॥

2. కన్నుల గీఁటకురా కాంతలకు నేనా నీవే
కిన్నెరతంత్రుల గోర గీఁటేవు గాక

యెన్నిక చెమట చింద నేలరా చెక్కులవెంట,
చిన్ని మోవిఁ దేనె నీవే చిందేవే యిపుడు ॥ఔలేరా॥

3. జాఱనీకురా సిగ్గు సంగడిరతుల, నీకే
జాఱెఁగదీ మునిగొంగు సంతసాలతో
మీఱి శ్రీ వేంకటేశ్వర మేలుతోఁ గూడితివి
ఆఱడికూటములెల్లా నబ్బెఁగదే నీకు ॥ఔలేరా॥

**అర్థములు:** ప. ఔలేరా= అవును లేరా!, జాణతనము= నేర్పరితనము, లేలే= లేదు లేదు, లెక్కలు= అన్నీ లెక్కించు.

1 .కప్పకు= దాచవద్దు, కందువ= ఏకాంతము, పొద్దయ= సమయమైనది, ముప్పిరి= మూడువిధముల, కరగకు= ద్రవించకు, ముదితలు= స్త్రీజనము, కప్పురము= కర్పూరము, నోరిలో= నోటిలో, కరచు= పట్టుకొను.

2. కన్ను గీటు= కన్ను కొట్టు, కాంతలు = స్త్రీలు, కిన్నెర తంత్రులు= కిన్నెరలోని తీగలు, గోరగీటు= గోటితో మీటు, చెక్కులు= చెక్కిలి, చిందు= చిమ్ము.

3. జారనీకు= వీడిపోనీవద్దు, సంగడిరతులు= జతకలసిన రతిక్రీడలు, మునిగొంగు= చీర కొంగు, సంతసాలు= సంతోషములు, మీరి= అతిక్రమించి, మేలు= శుభము, ఆరడి= నింద, కూటము= సమూహము, అబ్బు= ప్రాప్తించు.

**భావము :** ఆమె: అవున్లేరా! ఎక్కడలేని నేర్పరితనాలన్నీ నా దగ్గర ప్రదర్శిస్తున్నావు నీవు.

అతడు: లేదు..లేదు...నేను నీ మాదిరి లెక్కలు పెట్టేవాణ్ణి అసలే కాదు.

ఆమె: నీ గుణాలు స్వభావాలు నాకు తెలియనివా స్వామీ! కప్పిపుచ్చడానికి ప్రయత్నించకండి అసలే పొద్దెక్కి నది.

అతడు: నేను కప్పినట్లే నీ రొమ్ములు కూడా పైట కొంగుతో కప్పిపుచ్చేవు గాక!

ఆమె: నీవు అందరు స్త్రీలను చూసి ఇంతలా ముప్పేటలా కరిగి ద్రవించడమెందుకురా!

అతడు: నేను కాదు నీవే కర్పూరము నోటబెట్టి కరచిపట్టుకున్నావు చూడు.

ఆమె: నీవు రమణులెవ్వరు కనిపించినా కన్ను గీటవద్దు సుమా!

అతడు: నేనా నువ్వే ఆ కిన్నెర వాయిద్యపు తీగలను గోట మీటుతున్నావు.

ఆమె: నీ చెక్కిళ్ళపై చెమటలు వర్షమై ధారవలె కారుతున్నాయి.

అతడు: నీ అందమైన అధరామృతము తేనెవలే నీవే చిందిస్తున్నావు.

ఆమె: నీ సిగ్గులు జత కలసిన సంతోషములో వీడిపోనివ్వకురా!

అతడు: నీ సంతోషాలతో కొంగు ముడి వీడి జారిపోయినదికదే!

ఆమె: ఓహో! అతిక్రమించి శుభము గూర్చే విధంగా నన్ను చేరి కలుసుకున్నావు స్వామీ!

అతడు: ఆహా! నిందలు వేసే నీ చెలులసమూహపు బుద్ధి బాగా అబ్బినట్లున్నది నీకు. కానివ్వవే!

## 493

**అవతారిక:** అలమేలుమంగా శ్రీనివాసులు ఏవో కొన్ని విషయాలలో గొడవలు, జగడాలు పడి, ఒకరి తప్పులు మరొకరు చెప్పుకున్నారు. చివరకు అన్నీ మరచి ఒకటైనారు.

## పాడి

ప. నిక్కి యెండ దాఁకనేల నీడకుఁ బోనేల నాకు
చక్కని నీ కెమ్మోవి చవిగొంటే చాలును ॥పల్లవి॥

1. కందువ నీ మాటలకుఁ గల్లపరచఁగనేల
అందుకొని అవి నిడమననేల

నిందలాడేవారు నీవు నెఱిఁ దగవాడు కోఁగా
విందువలెఁ జెవులార వింటేనాకుఁ జాలును ॥నిక్కి॥

2. గుట్టున నీచేఁతలకుఁ గోపగించుకొననేల
వెట్టఁబడి కమ్మటిని వేఁడుకోనేల
తిట్టులాడి నీవు వారుఁ దీదీపులాడఁగాను
నట్టనడుమ నే వచ్చి నవ్వుటే చాలును ॥నిక్కి॥

3. చేసన్నచేసి నిన్నుఁ జేరఁ బిలువఁగ నేల
దోసాలు నీపై నించి తోయనేల
సేసవెట్టి కడపలో శ్రీ వేంకటేశ నన్ను
వాసిమీరఁ గూడితివి వద్దనుంటేఁ జాలును ॥నిక్కి॥

**అర్థములు:** ప. నిక్కు= గర్వించు, తాకు= అంటుకొను, కెమ్మోవి= అధరము, చవి= రుచి.

1. కందువ= జాడ, కల్ల= అబద్ధము,దోషము, ఇడమను= ఇవ్వమను, నింద= అపవాదు, నెరి= విధము, తగవాడు= జగడములాడు.
2. గట్టున= బయట, చేతలు= పనులు, వెట్టబడి= వేడిమిలో నుండు, క్రమ్మటి= మరల, వేడుకొను= ప్రార్థించు, తిట్టులాడు= దూషణ చేయు, తీతీపులు= మిక్కిలి బాధ, నట్టనడుమ= మధ్యలో.
3. చేసన్న= చేతి సైగలు, దోసాలు= తప్పులు, తోయు= నెట్టు, సేస= అక్షింతలు, కడప= ద్వారబంధము, వాసి= ఆధిక్యము.

**భావము :** గర్వముతో ఎండను అంటుకొవడమెందులకు? ఆ తర్వాత బాధతో ప్రక్కన నున్న నీడలోకి వెళ్ళడమెందులకు? మనోహరమైన నీ అధరామృతము రుచి చూస్తేనే చాలు సుమా!

జాడతెలిసి నీవు మాట్లాడే మాటలను అబద్ధమని నిరూపించ యత్నించడమెందులకు? వాటిని విని అబద్ధమని అనడమెందులకు? ఇలా అపవాదులు వేసేవారు ఈవిధముగా జగడాలే వాడని అనడమెందులకు? విందు మాదిరి చెవులారా ఇవన్నీ వింటేనే నాకు చాలును.

గట్టున నిలబడి నీవు చేసే పనులకు కోపం ప్రదర్శించడమెందులకు? తాపముతో మరల మరల పశ్చాత్తాపము చెంది ప్రార్థించడమెందులకు? ఈవిధముగా ఒకరికొకరు తిట్టుకొని దూషణలు చేసుకొని మిక్కిలి బాధనందడమెందులకు?

చేతితో సైగలు చేసి నిన్ను పిలవగానే తప్పులన్నీ నీపై నెట్టడమెందులకు? ఓ శ్రీవెంకటేశ్వరా! అక్షింతలు వేసి ఇంటి ముందున్న కడపలో నన్ను ఆధిక్యముతో నన్ను చేరుకున్నావు. ఇక నా వద్దనుంటే అంతే చాలు సుమా!

## 494

**అవతారిక:** అమ్మకు స్వామిపట్ల మోహావేశం అధికమైనా, సిగ్గుతో అలా ఉండిపోవడం తగదని చెలులు ఉద్బోధిస్తున్నారు.

## సామంతం

ప. చిగురో చేఁగ చూపఁ జెల్లదే నీకు
అగపడె నీ రమణుఁ డదిగో నీకు ॥పల్లవి॥

1. వలపులే కడుఁబెంచి వాలుకరెప్పలు వంచి
సెలవినవ్వులనేల చిందేవే సిగ్గు
నిలువునఁ దమిరేఁచి నెయ్యపుటాసలు పూఁచి
మలసి యంతలోనే మాననేలే నీకు ॥చిగురో॥

2. మాటలతేనెలు చూపి మదనముద్రలు మోపి
యీటునఁ దలుపుమాటు కేల పొయ్యేవే

గీcటుcచుc గన్నుల నవ్వి కిందటిమోహాలు దవ్వి
మాటికిమాటికి మేనమఱుపేలే నీకు ॥చిగురో॥

3. కాcగిటిరతికిc జొచ్చి కమ్మటి నీకెమ్మోవి ఇచ్చి
కాcగినగుబ్బలనేల ఘాతసేసేవే
వీcగుచుc గూడితివి శ్రీ వేంకటేశుని విcట్టె
మూcగినపులకల యీమో పేలే నీకు ॥చిగురో॥

**అర్థములు:** ప. చిగురు= లేత, చేగ= సారవంతము, చెల్లదు= కాదని చెప్పు, అగపడు= కనిపించు, రమణుడు= అందమైనవాడు.

1. వలపు= ప్రేమ, వాలుకరెప్పలు= వాలుకన్నుల కను రెప్పలు, సెలవి నవ్వులు= పెదవి మూల నవ్వులు, చిందు= విరజిమ్ము, తమి= అపేక్ష, నెయ్యము= స్నేహము, పూచి= కలిగి, మలయు= వ్యాపించు.
2. మాటలతేనెలు= తీయనైన మాటలు, మదనముద్రలు= మన్మధ గుర్తులు, మోపి= ఆపాదించి, ఈటున= వ్యర్ధముగ, తలుపు మాటు= తలుపు చాటుకు, గీటుచు కన్నుల= కన్ను కొట్టు, కిందటి= మునుపటి, మోహాలు= ప్రేమలు, తవ్వి= వెలికిదీసి, మేన= శరీరపు, మరుపు= మరచిపోవు.
3. కాగిటి= కౌగిటి, చొచ్చి= ప్రవేసించి, ఘాతసేయు= చిన్న శృంగారపరమైన దెబ్బలు కొట్టు, వీగు= ఉత్సాహించు, మూగిన= క్రమ్ముకొన్న, పులకలు= గగుర్పాటు, మోపు= భారము.

**భావము :** లేతగా ఉన్నదో లేక సారవంతమై ముదిరినదో చెప్పడానికి నీకు వీలవదు. అదుగో నీ అందమైన స్వామి అగపడుతున్నాడు చూడు.

నీవు ప్రేమానురాగాలు అధికమై నీ వాలుకన్నులు అల్లారుస్తూ పెదవి మూల నవ్వులు నవ్వడమెందుల? సిగ్గులు చిందించనేల. నిలువెల్ల ఆపేక్ష ప్రేమ మోహము విజృంభించి, స్నేహం చెయ్యాలనే కోరికలు కలిగి వ్యాపించి మరలా అంతలోనే ఆగిపోయి వెనక్కు తగ్గడమెందులకు?

తేనె వంటి తీయనైన మాటలు మాట్లాడి మన్మధ భంగిమలను ప్రదర్శిస్తూ, వ్యర్ధంగా ఊరక అలా తలుపు చాటున నిలబడిపోతున్నావెందుకని? కన్ను కొట్టి నవ్వుతూ, వెనకటి ప్రేమలు మరలా వెలికిదీసి, మాటి మాటికి మైమరచిపోవడమెందులకు?

కౌగిటిలోకి చేరి కమ్మని రతిక్రీడలకు ఆసక్తి చూపిస్తూ నీ అధరామృతాన్ని స్వామికి అందిస్తూ, అదుపుచేయలేని వేడిమితో ఎగసిపడే రొమ్ములతో స్వామిని గ్రుద్దులు గుద్దుతూ ఉంటావెందులకు? ఉత్సాహించి శ్రీవేంకటేశ్వరుని ఈవిధముగా కలిసితివి కదా ఇంకా నీవు ఈ గగుర్పాటులెందుకు కలుగుతున్నాయి. వాటినెందుకు భారంగా మోస్తున్నావో అర్థం కావడంలేదు.

## 495

**అవతారిక:** అన్నమయ్య రామాయణ గాథనంతా ఒక్క కీర్తనలో పొందుపరచి వినిపిస్తున్నాడు.

### సాళంగనాట

ప. అరుదు రామునిచేcత లదిగో పుష్పకమును
సొరిది మన బాలులే సోద్యము గదమ్మా ॥పల్లవి॥

1. హరునివిల్లు విరిచె అట్టె సీతc బెండ్లాదె
పరశురాముని బాహుబలము గొనె
సురలకు మునులకు సొరిది నభయమిచ్చె
వరుస నయోధ్య యేలవచ్చె నటవమ్మా ॥అరుదు॥

2. వాలిc గొటి సుగ్రీవువరరాజ్య మిచ్చెనట
చాలుగాc గొండలనే జలధిగట్టె

తీలుగా రావణుఁ జంపి చెగి లంక సాదించి
వాలినసేనలఁ గూడి వచ్చెనటవమ్మా ॥అరుదు॥

3. కాంతయైనసీతఁ గూడి కలుషములెల్లఁ బాపి
పంతముతో విభీషణుఁ బట్టముగట్టి
ఇంతటా శ్రీ వేంకటాద్రి నిరవున వేఁటలాడి
వంతులకు రాజ్య మేలవచ్చెనటవమ్మా ॥అరుదు॥

**అర్థములు:** ప. అరుదు= అపూర్వము, పుష్పకము= పుష్పక విమానము, సొరిది= వరుస, సోద్యము= ఆశ్చర్యము.

1. హరుని విల్లు= శివుని బాణము, బాహుబలము= శరీర బలము, సురలు= దేవతలు, అభయము= భరోసా, ఏలవచ్చు= పరిపాలించగా వచ్చు.
2. వాలి గొటి= వాలిని చంపి, చాలు= వరుస, జలధి= వారధి, తీలు= తగ్గక, వాలిన= కూడిన.
3. కలుషము= దోషము, బాపి= పోగొట్టి, పంతము= పట్టుబట్టి, ఇరవు= స్థానము, వంతు= తన భాగముగా.

**భావము :** అదుగో శ్రీరామ చంద్రుని చేతిలో అపూర్వమైన పుష్పక విమానము.వికాసముతో గమనించినట్లైతే మన బాలురైన శ్రీరామ, లక్ష్మణులే ఆశ్చర్యము కలిగించే కార్యములు చేసినవారు కదమ్మా!

శివుని విల్లు విరిచి సీతను పెండ్లాడినాడు. విర్రవీగిన పరశురాముని గర్వాన్ని అణిచివేసినాడు. మునులకు దేవతలకు భయం వలదని అభయము, భరోసాను తెలియజేశాడు. అయోధ్యను పరిపాలించడానికి తండ్రి అనుజ్ఞతో ముందుకొచ్చాడమ్మా!

వాలిని సంహరించి సుగ్రీవుడికి రాజ్యాన్ని ప్రసాదించాడు. ఆ తరువాత సముద్రముపై కొండలయొక్క బండలతో వారధి కట్టాడు. ఏమాత్రం తగ్గకుండా రావణబ్రహ్మ తలలు త్రెంచి లంకను జయించి, వాలి తదితర సేనలతో పుష్పక విమానంపై తరలి వచ్చాడు.

చక్కని అమ్మ సీతపై ఉన్న దోషాలను అగ్ని పరీక్ష ద్వారా పోగొట్టి, పట్టుబట్టి విభీషణునకు లంకకు అధిపతినిచేసి తిరిగి వచ్చాడు. ఇంతా చేసి శ్రీవేంకటాద్రి స్థానమై వేటలాడి తన భాగమై ఉన్న రాజ్యమునేలడానికి విచ్చేశాడు సుమా!

**విశేషము:** ఈ కీర్తన ఆధ్యాత్మిక కీర్తనలలో ఉండదగినదని పరిష్కర్త శ్రీమాన్ గౌరిపెద్ది రామసుబ్బ శర్మ భావించారు.

## 496

**అవతారిక:** మహాసాధ్వి సీతమ్మ తల్లి లంకలో నున్నప్పటి మనోభావాలను హనుమంతునిచే శ్రీరామచంద్రునికి జెప్పించి వివరించే చక్కని సంకీర్తన.

### వేళావళి

ప. అన్నియు నందె యున్నవి అదిగో మాట
యెన్నుకొనె దినములు ఇదిగో మాట ॥పల్లవి॥

1. సీత నీకుఁ జెప్పి పంపి శిరోమణి నీకిచ్చె-
నాతల నే మెఱఁగము అదేమాట
చేతినీవుంగరమును శిరసున నెత్తుకొనె
యేతలఁపు లెట్లౌనో ఇదిగో మాట ॥అన్నియు॥

2. తాడుపడ్డనేనితోడ తలఁపు నీకొప్పగించి

యేడవుతా నెఱఁగదు ఇదివో మాట
పాడిదప్ప దించుకంతా పదిల మాకెగుణము
అడ నేమీఁ జోటులేదు అదిగో మాట ॥అన్నియు॥

3. తెఱవ నీకు బాసిచ్చె దేవతలమాట విను
యెఱుఁగినదే ఇందరు ఇదిగో మాట
గుఱుతై శ్రీ వేంకటాద్రిఁ గూడితి రిద్దరు మీరు
అఱిముఱి రామచంద్ర అదిగో మాట ॥అన్నియు॥

**అర్థములు:** ప. అన్నియు= అన్ని విషయములు, ఎన్నుకొను= లెక్కించు.

1. శిరోమణి= చూడామణి, శిరసు= తల, తలపు= ఆలోచన, ఎట్లౌనో= ఏవిధముగా అవుతాయో.
2. తాడుపడు= లగ్నమగు, తలపు= భావము, ఒప్పగించి= స్వాధీనముచేసి, ఏడవుత= ఎక్కడయేమయేది, పాడి= న్యాయము, ఇంచుకంత= కొద్దిగానైనా, పదిలము= శాశ్వతము, ఆకె= ఆమె, గుణము= స్వభావము, చోటు= స్థలము.
3. తెరవ= స్త్రీ, బాస= మాట, ఎరుగు= తెలియు, గురుతు= చిహ్నము, అరిమురి= మిక్కిలి.

**భావము :** అన్నివిషయములు ఆ సీతమ్మవారికి చేరినవి. అదే మాట. ఆమె నీ రాకకై రోజులు లెక్కించుకొనుచున్నది.

సీతమ్మ వారు నీకు అన్నీ చెప్పి హనుమంతుణ్ణి పంపుతూ తన శిరోమణిని నీకివ్వ పంపినది. అవతల జరిగే విషయాలు మాకు తెలియదు.అదే మాట. నీవు పంపిన నీ చేతి ఉంగరము పూజ్య భావమున తలపై పెట్టుకొన్నది. ఆమె మిక్కిలి బాధతో గూడిన భావములెట్లున్నవో నున్నది. చివరకు ఏమౌనో యని చింతించు చున్నది.

మనసు నీపై లగ్నము చేసి భావము నీకొప్పగించి, ఏమవుతుందో తెలియక వ్యాకులపడుతున్నది. న్యాయము తప్పకుండా ఉంటూ ఆమె స్వభావము శాశ్వతముగా ఒకే రీతిగా నున్నది. నీవు మాట్లాడడానికి యిక వేరే మాటలేదు. అదిగో మాట.

ఆ సీతమ్మ వారు నీకు మాట యిచ్చినది. అదే దేవతల మాటగా భావించవలెను. ఈ విషయమునందరూ ఎరిగినదే! ఇంత కాలానికి గుర్తుగా మీ యిద్దరూ జంటగా ఈ శ్రీవేంకటాద్రిపై కూడితిరి. మిక్కిలి బాధతో ఉన్న శ్రీరామచంద్రా! అదిగో మాట.

**విశేషము:** ఈ కీర్తన ఆధ్యాత్మిక కీర్తనలలో ఉండదగినదని పరిష్కర్త శ్రీమాన్ గౌరిపెద్ది రామసుబ్బ శర్మ భావించారు.

## 497

**అవతారిక:** అన్య కాంతల పట్ల స్వామికి గల వ్యామోహానికి అమ్మ అలమేలుమంగమ్మ ఓ నాయకుడా! అని సంభోదిస్తూ ఆశ్చర్యము ప్రకటిస్తున్నది.

### నాదరామక్రియ

ప. కంటిమిగా నీ గుట్లు కాలమందునే
అంటితేనే లోనైతి వయ్యో నాయకుఁడా ॥పల్లవి॥

1. కన్నులనే మాటలాడి కప్పురపుసిగ్గు చల్లి
కిన్నెరమీంట్ల నాకె గిలిగించెను
నిన్నుఁ జూడవలె నింక నిలువెల్లాఁ జెమరించి
అన్నిటా మెయిమఱచితి వయ్యో నాయకుఁడా ॥కంటిమిగా॥

2. వయ్యద బయలుచేసి పగడవా తెర చూపి
తియ్యనివలపులనే తేలించేను
నియ్యిచ్చ దెలి సిదెపో నివ్వెరగు నాకు నిండె

అయ్యెడ నుండి పాయపు అయ్యా నాయకుఁడా ॥కంటిమిగా॥

3. కాఁగిటనే వలవేసి కందువ రతికిఁదీసి
తీఁగెసరసాల నాకె తెరవేసెను
వీఁగక శ్రీ వేంకటేశ వేగిరమే ఆకెఁ గూడి
ఆఁగి నన్నుఁ గూడితివి అయ్యా నాయకుఁడా ॥కంటిమిగా॥

**అర్థములు:** ప. కంటిమి= గమనించి చూశాము, గుట్లు= రహస్యాలు, కాలమందున= కాలానుగుణంగా, అంటు= తాకు, లోనగు= వశమగు, నాయకుడు= ఓ ప్రభూ!.

1. కప్పురపు సిగ్గు చల్లు= త్వరగా ఆవిరయే విధముగా ప్రదర్శించు, కిన్నెరమీంట్లు= కిన్నెర అనే సంగీత వాయిద్యము గోట మీటే విధము, ఆకె= ఆమె, కలిగించెను= చేసెను, నిలువెల్లా= శరీరం యావత్తూ, చెమరించు= చెమటలుపోయు, మెయిమరచు= ఒడలు మరచు, నాయకుడా= ఓ ప్రభూ!

2. పయ్యద= పైటకొంగు, బయలు జేయు= బహిరంగము చేయు, పగడవాతెర= ఎర్రని పగడము వంటి పెదవి, తియ్యని వలపులు= మధురమైన ప్రేమలు, తేలించి= ఓలలాడించి, నియ్యిచ్చ= నీకు ప్రీతియైన, నివ్వెరగు= పారవశ్యము, అయ్యెడ= ఆతావు, పాయపు= వయసులోనున్న.

3. కాగిట= కౌగిట, వలవేయు= పట్టుకొను, కందువ= ఏకాంతము, రతికిదీసి= రతిక్రీడకు దారితీసి, తీగె= తీగెవంటి సన్నగా ఉన్న, ఆకె= ఆమె, తెరవేసెను= దోమతెర వేసినది, వీగక= ఏమాత్రం తగ్గక, వేగిరము= వెంటనే, ఆకె= ఆమె, ఆగి= నిలిచి, కూడితివి= కలిసినావు, అయ్యా నాయకుడా= స్వామీ! ఓ ప్రభువా!

**భావము :** ఓ స్వామీ! ఓ నా ప్రభువా! నీ రహస్యాలన్నీ కాలానుగుణంగా పూర్తిగా పసిగట్టి యున్నాము. అలా తాకగానే వశమైపోతివి.

కండ్లతోనే మాటలాడి కర్పూరము వంటి త్వరగా ఆవిరయ్యే సిగ్గులను వ్యాపింపజేసి, కిన్నెర మీటుతూ ఆమె గిలిగింతలుపెట్ట గానే, అన్నిటికి మైమరచిపోయేవయ్యా! ఓ నా ప్రభువా!

ఆ యింతి పైటకొంగు వదులు చేసి అంగాంగాలను బహిరంగపరుస్తూ, ఎఱ్ఱటి పగడము మరియూ దొండపండువంటి పెదవులను చూపి, నిన్నుమధురోహల్లోను, ప్రేమలలోను ఓలలాడించెను. నీ యిష్టాలు, కోరికలు అన్నీ తెలిసిపోయి నీ పారవశ్యము బట్టబయలయినది. ఆమె వద్దనే కదలక మెదలక కూర్చుండిపోయిన ఓ నాప్రభువా!

కౌగిలిలో వలవేసి గట్టిగా బంధించి ఏకాంతములో రతిక్రీడలను జేసి, ఆ తీగె వంటి శరీరముగల స్త్రీ నీకు దోమతెరవేసి లోగొన్నది. ఓ శ్రీవేంకటేశ్వరుడా! నీవు ఏమాత్రం తగ్గక, విడువకుండా త్వరగా ఆమెను చేపట్టితివి. మధ్యలో నన్ను చూసి నిలిచి చేపట్టితివి. అయ్యో ఓ ప్రభువా! ఏమని చెప్పగలము నీ వింత చేతలు?

## 498

**అవతారిక:**అమ్మ స్వామికై ఎదురుచూపులు చూస్తూ ఉండగా ఆ స్వామి విచ్చేసి కూడా ఏమీ పట్టనట్టు, చిలిపి పనులు కొనసాగిస్తూ ఉన్న తరుణంలో చెలులు స్వామితో చేసే విన్నపం.

### హిజ్జిజి

ప. ఎదురుచూచీఁ జెలి యేమయ్యా
నిదుర కన్నులఁ దేరీ నీకేలయ్యా ॥పల్లవి॥

1. చెక్కిటఁబెట్టినచెయ్యి చిత్తములోపలినుయ్యి
యెక్కడికిఁ గాదు యేమయ్యా
పక్కున నవ్వేవు కొప్పు పైపై గోర దువ్వేవు
నెక్కొని వట్టిదోసాలు నీకేలయ్యా ॥ఎదురు॥

2. పాదపు నేలలవ్రాత బలిసె నూరుపుమోఁత

యీదెస చెలియకేల యేమయ్యా
మోదమున నొరగేవు మొక్కలానఁ దిరిగేవు
నీదయ నేఁడు దాఁచఁగ నీకేలయ్యా ॥ఎదురు॥

3. మూపుపై జారిన కొప్పు ముంచిన చెమటల చొప్పు
యేపొద్దు జెలికిఁ బాయ దేమయ్యా
దాపై శ్రీవేంకటేశ తరుణిఁ గూడితి విట్టె
నీపరవశాలు చూప నీకేలయ్యా ॥ఎదురు॥

**అర్థములు:** ప. ఎదురుచూచు= స్వామికొరకై చూచు, చెలి= స్త్రీ, నిదురకన్నులు= నిద్రనుండి లేచిన కన్నులు, తేరు= పరికించి చూచు, నీకేలయ్యా= నీవెందులకు ఈ విధముగా చేస్తున్నావు?

1. చెక్కిట= చెక్కిలిపై, చిత్తము= మనసు, నుయ్యి= భావి, ఎక్కడికి కాదు= ఏమయేను, పక్కున నవ్వు= పగలబడి నవ్వు, కొప్పు= తలయొక్క సిగ, పైపై= పైపైన, గోరదువ్వు= గోటితో సరిచేయు, నెక్కొను= పాదుకొని, వట్టిదోసాలు= ఉత్త తప్పులు, నీకేలయ్యా= నీకెందుకయ్యా!
2. పాదపు నేలల వ్రాత= బొటనవేలితో నేలమీద గీయు, బలిసె= అధికమగు, ఊరుపు మోత= ఉచ్ఛ్వాస నిశ్వాసముల శబ్దము, దెస= మాదిరి, మోదము= సంతోషము, ఒరగు= మీద వాలు, మొక్కలాన= శౌర్యము, దాచగ= కప్పిపుచ్చుటకు.
3. మూపు= భుజము చివర, కొప్పు= సిగలోని వెంట్రుకలు, ముంచిన= నిండిన, చెమట చొప్పు= చెమటల తీరు, పాయదు= వీడదు, తాపై= ఆమీదట, తరుణి= స్త్రీ, ఇట్టె= ఈవిధముగా, పరవశాలు= ఒడలెరుగని స్థితి.

**భావము :** స్వామీ! నీకై అమ్మ అక్కడ నిద్దురలేచి పరికించి చూస్తూ ఎదురుచూపులు చూస్తున్నది. నీకీ తాత్సారము ఎందులకయ్యా!

చెక్కిలిపై చేయిబెట్టుకొని మనసులో భావివంటి లోతైన ఆలోచనలతో నున్న ఆమె స్థితి, ఆ చెలి యొక్క పరిస్థితి ఏమవుతుందోనని భావించాలి కదా స్వామీ! ఊరకే ఫక్కుమని పగలబడి నవ్వి పరిహాసం చేస్తావు. ఆమె కొప్పు కొనగోళ్ళతో దువ్వి సరిచేస్తావు. పాదుకొని ఇలాంటి తప్పులు చేయడం నీకెందుకయ్యా! సబబేనా? చెప్పండి స్వామీ!

ఆ అమ్మ పాదపు వేళ్ళతో నేలమీద ఏవో రాతలు వ్రాస్తూ, నిట్టూర్పుల సవ్వడి అధికమై, ఈ తీరుగా నిలబడ్డ ఆమెను గురించి ఆలోచించవలెను కదా స్వామీ! సంతోషముతో మీదకు ఒరుగుతావు. శౌర్యంతో ప్రవర్తిస్తావు. నీ దయారసం అమ్మ మీద ప్రసరించకుండా ఈవిధముగా దాగుడుమూతలాడడం సబబేనా స్వామీ!

ఆ అమ్మ భుజం వరకూ జారిపోయిన కొప్పుతో, అతిశయించిన స్వేదముతో పొద్దు గడవకుండా నిలుచుండిపోయినది. కాస్తా గమనించాలి కదా స్వామీ! ఓ శ్రీవేంకటేశ్వరా! ఆ మీదట ఆవలంబమై ఆ అమ్మను వెంటనే కూడితివి. ఈవిధమైన ఒడలెరుగని పరవశాన్ని ప్రదర్శించడమెందులకయ్యా!

## 499

**అవతారిక:** స్వామి అన్యకాంతలను కూడి సాక్ష్యాలతో పట్టుబడగా అమ్మ అలమేలుమంగమ్మ స్వామిని నిలదీస్తున్నది.

### వరాళి

ప. ఎవ్వరి నడుగనేల యేడ లేని యానలేల
దివ్వె చేతఁ బట్టుకొని తెరువు దప్పకురా ॥పల్లవి॥

1. పంతమాడ నోపఁగాని భావము నీదిట్టిదని
పొంతనే నేఁడక్కుననుఁ బోసి చూపేరా
యెంత దాఁచిననుఁ బోదు యేల నాతో బొంక నీవు
అంతా నీకే కానవచ్చీ నద్దము చూచుకోరా ॥ఎవ్వరి॥

2. నిన్నుఁ గల్ల సేయఁ గాని నీకుఁ గల మోహమెల్లా

వన్నెగాఁ బూవుల చేరువలె నెత్తేరా
కన్ను గిరిపితేఁ గాదు కాంతలెల్లా నెరిఁగిరి
మొన్నటి నిన్నటివి నీమోముపై నున్నవిరా ॥ఎవ్వరి॥

3. వాదడువఁ జాలఁగాని వక్కణించి నీగుట్టెల్లా
సాదించి నీరుకంటెఁ బలచన సేసేరా
పోదిగా శ్రీవేంకటేశ పొంచి నన్నుఁ గూడితివి
వేదేల నీవుంగరము వేల నీకున్నదిరా ॥ఎవ్వరి॥

**అర్థములు:** ప. ఏడలేని= ఎక్కడా లేనటువంటి, ఆనలు= అనుజ్ఞలు, దివ్వె= దీపము, తెరువు= దారి, తప్పకు= తప్పవద్దు.

1. పంతమాడు= పట్టుదలలకు పోవు, ఓప= ఓర్చుకొన, భావము= అభిప్రాయము, ఇట్టిదని= ఈవిధమైనదని, పొంత= సమీపము, అక్కున= వక్షము, బోసి= ఏమీలేనిది, దాచినను= దాచిపెట్టినను, బొంక= అబద్ధమాడ.
2. కల్ల= అబద్ధము, మోహము= ప్రేమ, వన్నె= రంగు, పూవుల చేరు= పువ్వుల పొందు, గిరుపు= బెరుకు చూపు, కంతలు= స్త్రీలు, ఎరిగిరి= తెలుసుకొన్నారు, మోము= మొహము.
3. వాదడువ= మాటలకు భయపడు, వక్కణించు= చెప్పు, గుట్టు= బండారం, సాదించి= నిష్ఠురపు మాటలతో నొప్పించు, పోది= వైభవం, పొంచి= దాగి, వేదేల= వెగటుమాటలు, వేల= వ్రేలికి.

**భావము :** స్వామీ! ఎవరినైనా వేరే అడగడవలసిన అవసరం ఏమిటి? ఎక్కడా లేని ఈ ఒట్లు, సాక్ష్యాలు ఎందుకు? దీపం చేతితో పట్టుకొని దారితప్పేవారు ఎవరైనా ఉంటారా?

నీ అభిప్రాయమిది యని తెలిసిన తర్వాత పట్టుదలలకు పోవడం ఎందులకు. ఎవరైనా కౌగలించుకొని రొమ్మున యేమీ లేదని బోసిగా ఉన్నదని చెప్తారా? అబద్ధాలు ఎంత దాచిపెట్టి మూసిపెట్టినా దాగుతాయా? ఇంకా నాతో బొంకడం ఎందులకు స్వామీ! ఒక్కసారి అద్దంలో నీకు నీవు చూసుకున్నట్లైతే అంతా నీకే స్పష్టంగా తెలుస్తుంది.

నీకు అబద్ధాలను అంటగట్టలేను కానీ, నీకున్న ప్రేమాతిశయమంతా రంగులతో అందంగా పూవుల పొందులెత్తినట్లున్నది. నీవు కన్నులతో కాస్తా బెరుకు చూపులు చూడగానే ఆవిషయాన్ని చెలులంతా గమనిస్తున్నారు. మొన్నటి మరియు నిన్నటి నీ చేతలకు సాక్ష్యమైన గుర్తులన్నీ నీ మొహంపై స్పష్టంగా కనిపిస్తున్నవి.

మాటలతో నిన్ను భయపెట్టాలని కాదుగానీ, నీ బండారం మొత్తమంతా చెప్పబడిన విషయమే కదా! నిష్ఠురపు మాటలతో బాధపెట్టడం కాదుకానీ, నీ మాటలు నీళ్ళకంటే పలుచగా కనుపట్టుచున్నవి. వైభవంతో ఓ శ్రీవేంకటేశ్వరా! దాగి నన్ను కూడుకున్నావు. వేరే వెగటు మాటలు మాట్లాడి మిమ్ములను బాధించడమెందులకు? నా వేలి ఉంగరము నీ చేతి వేలికి ఉన్నది కదా!

**విశేషము:** ఈ కీర్తనలో అన్నమయ్య 'దివ్వెపట్టుకుని తెరవు తప్పకురా!', 'అక్కునను బోసి చూపు ', 'పూవులచేరువలే, 'నీరుకంటె పలచనా అనేక అద్భుత పదప్రయోగాలను చేయడం గమనించవచ్చు.

## 500

**అవతారిక:** అమ్మ తన విరహబాధను స్వామివారికే స్వయంగా వినిపిస్తున్నది.

### శంకరాభరణం

ప. నీకుఁ దెలయదుగాక నీ మంచిగుణాలే కావా
పైకొని మమ్మింత చేసి భ్రమయించేవి ॥పల్లవి॥

1. వంచీ నీరెప్పల లోని వాలుక చూపులు గావా
మంచితనమున నామెయి మఱపించేవి
ఇంచుకంత సెలవుల యీనవ్వులే కావా
తుంచి తుంచి ఆయములు తూరిపారేవి ॥నీకు॥

2. కొంత కొంత గొణఁగుల కొనమాటలే కావా
చింతతో నా చెక్కిటికిఁ జేయి దెచ్చేవి
పంతపుటలుకలతో పచ్చి వొట్లే కావా
అంతలోనే నన్ను సురనిపించేవి ॥నీకు॥

3. కూరిమి నీ వేకతానఁ గూడినరతులే కావా
తారుకాణలై సారెఁ దలఁపించేవి
యీరీతి శ్రీ వేంకటేశ యిద్దరము నున్నారము
సారె నీపొందులేకావా చవులయినవి ॥నీకు॥

**అర్థములు:** ప. తెలయదు= తెలియదు, పైకొని= చేపట్టి, భ్రమయించు= మత్తులో ముంచెత్తు.

1. వాలుక చూపులు= వాలు చూపులు, మెయి= శరీరము, ఇంచుకంత= కొంచెమైన, సెలవుల= మూల, తుంచి తుంచి= ముక్కలు ముక్కలు, ఆయములు= జీవస్థానములు, తూరిపారేవి= ప్రతిసారి సాగేవి.
2. గొణగు= సన్నగా మాట్లాడు, కొనమాటలు= చివరిమాటలు, చింత= బాధ, పంతపుటలుకలు= పట్టుదలతో కూడిన కోపావేశము, పచ్చి ఒట్లు= మరుగులేని ఆనలు, ఉసురనిపించి= కలతచెందు.
3. కూరిమి= స్నేహము, ఏకతాన= అనన్యచిత్తము, తారుకాణ= ఋజువు, సారె= మాటిమాటికి, తలపించు= గుర్తుకు వచ్చు, ఈరీతి= ఈ ప్రకారము, సారె= మాటికి, పొందు= కలయిక, చవి= రుచి.

**భావము :** స్వామీ! ఒకవేళ నీకు తెలియక పోవచ్చును కానీ, నీ ఉత్తమమైన గుణములే మమ్మింతగా భ్రమలో ముంచి మైమరపించి మత్తెక్కిస్తున్నది.

వంచిన నీ కనురెప్పలలోని వాలు చూపులే కదా, మంచితనముతో నా ఒడలు మైమరపింపజేసినది. నీవు నవ్వే చిన్న చిన్న పెదవిమూల నవ్వులే కదా నా జీవస్థానములను ఇంతగా ముక్కలు ముక్కలుగా చేస్తున్నవి.

నీవు వినబడీ వినబడకుండా మాట్లాడే నోటిచివరి పచ్చి మాటలే విరహబాధతో నా చెక్కిట చేయిచేర్చి నిలబడేట్టు చేస్తున్నవి. పట్టుదలతో వచ్చిన కోపావేశమువల్ల పెట్టిన మరుగులేని ఆనలే కదా! అంతలోనే నన్ను కలతచెంది నీ ఆలోచనలను రేకెత్తించేవి.

స్వామీ! నీవు కూడినప్పుడు అనన్య చిత్తముతో చేసిన రతిక్రీడలే కదా ఋజువులై నన్ను మాటి మాటికి గుర్తుకు వచ్చేట్టుచేసి మనసు నిలువకుండా చేస్తున్నది. ఈ తీరుగా ఓ శ్రీవేంకటేశ్వరా! యిద్దరమూ ఈతావున కూడి యున్నాము. మాటి మాటికి జరుగుతున్న నీ కలయికలే కదా మధురమైన రుచులను ఆస్వాదింపజేస్తున్నది.

## 501

**అవతారిక:** అమ్మకు స్వామిపట్ల గల పారవశ్యాన్ని, అతన్ని తలుచుకొని పొందే సిగ్గులను అందంగా వర్ణిస్తున్నాడు అన్నమయ్య.

### శంకరాభరణం

ప. మొదల నేమి నెఱఁగదాయ ముంచిన దెంత పరవశంబో
కదిసినప్పటి చేఁతలు విభునిఁ గనుచు విభుని దూరెను ॥పల్లవి॥

1. ఇంతి మోము గడుగఁ బోయి యెలమి దోసిట నీరు నించి
అంతట మోవి కెంపుల నీడ యందుఁ చూచి నవ్వెను
రంతు సేసి ముంజేతి చిలుక రతి పలుకులప్పుడు నుడుగ
అంతలోనే పంజరమున నదిమి శిరసు వంచెను ॥మొదల॥

2. నెలంత సొమ్ములు వెట్టఁగఁబోయి నిలువుటద్దములోన మదన-
కళలు చెదరుఁగురులు చూచి గక్కున సిగ్గున మునిఁగెను
చెలులమీఁదఁ జేయివేసి చేతనున్న విభునివేలి-
అలరుముద్దుటుంగరంబు అపుడు చూచి భ్రమసెను ॥మొదల॥

3. పానుపుమీఁదఁ బవ్వళించ పడఁతి యేగి యుందుమీఁద
తానకమైనవిభునిఁ జూచి దగ్గరి కాఁగిలించెను
అనిన శ్రీ వేంకటేశుఁ డంతటిజాణ గనక కలసి
మోనముతోడఁ జొక్కిచొక్కి మున్నిటివెల్ల వడిగెను ॥మొదల॥

**అర్థములు:** ప. మొదల = పూర్వము, ముంచిన = మునుగు, పరవశము = మత్తు, కదియు = దగ్గరగు, చేతలు = పనులు, విభుడు = భర్త.

1. ఇంతి = స్త్రీ, మోము = ముఖము, ఎలమి = వికాసము, దోసిట = రెండు చేతులలో, మోవికెంపు = ఎర్రనైన ముఖబింబము, రంతు = రతి, ముంజేతి = చేతిపై యున్న, ఉడుగు = కృశించు, అదిమి = మూసివేసి, శిరసు = తల.
2. నెలత = స్త్రీ, వెట్టగ = పెట్టుకొనుటకు, మదనకళలు = మన్మధుని శోభలు, చెదరు = విడివడ్డ, కురులు = వెంట్రుకలు, గక్కున = వెంటనే, మునిగెను = ముంచెత్తెను, అలరు = ప్రకాశించు, ముద్దుటుంగరము = అక్షరములు చెక్కిన ఉంగరము, భ్రమసెను = పారవశ్యము చెందెను.
3. పవ్వళించ = పడుకోగా, పడతి = స్త్రీ, యేగి = వెళ్ళి, తానకము = స్థానము, కాగలించు = కౌగలించు, జాణ = నేర్పరి, మోనము = మౌనము, చొక్కి = పారవశ్యము, మున్నిటివి = ముందు జరిగినవి, ఎల్లా = సమస్తము.

**భావము:** అమ్మ అలమేలుమంగమ్మకు పూర్వపు సంగతులేమీ గుర్తులేనంత పారవశ్యములో మునిగిపోయి స్వామికి దగ్గరయి ఆయననే తిలకిస్తూ కౌగిలిలోకి దూరినది.

అమ్మ తన ముఖము కడుగుకొనకబోవడానికి వెళ్ళి దోసిట్లో నీళ్ళు పట్టుకుని, ఆ నీటిలో తన ఎర్రనైన పద్మరాగమణి వంటి ముఖారవిందాన్ని చూచుకొని ముసి ముసి నవ్వులు నవ్వుచున్నది. అంతలో అప్పటివరకూ రతిక్రీడలో మునిగియున్న రామచిలుక యొకటి ఆ రతిక్రీడకు సంబంధించిన మాటలను మాట్లాడగా, అమ్మ కంగారుగా ఆ చిలుకను పంజరములో మూతపెట్టి, సిగ్గుతో భారమై తలను వంచుకొన్నది.

అమ్మ నగలు పెట్టుకోవాలని నిలువుటద్దములో తన మోము చూసుకుంటూ మన్మధ తంత్రముతో కురులన్నియూ చిందరవందర కాగా వెంటనే సిగ్గులో మునిగిపోయెను. చెలుల మీద చేతులు వేసి తన చేతివేలికి పతిపేరు అక్షరములుగా చెక్కిన ఉంగరమును చూసి మత్తులో మునిగిపోయినది.

అమ్మ పట్టు పానుపు మీద పవళించియున్న స్వామి వద్దకేగి అక్కడ యున్న స్వామిని చూసి తమకముతో దగ్గరకు సమీపించి గాఢముగా కౌగిలిలో బంధించెను. ఆవిధముగా ఆమె తనపై ఒరగగా నేర్పరియైన ఆ శ్రీవేంకటేశ్వరుడు ఆ అమ్మను కలిసి పారవశ్యములో తామునిగి అమ్మను ముంచెత్తి మునుపటి విశేషాలన్నీ ఒక్కొక్కటి అడగసాగెను.

## 502

**అవతారిక:** అమ్మ స్వామి వారిముందు తన అబలత్వాన్ని ప్రదర్శిస్తూ, చిన్న చిన్న విషయాలకు చీటికి మాటికి గొడవలు చేయవద్దని కోరుతున్నది.

### పాడి

ప. ఇంచుకంత చాలదా యీడవారికి
పెంచిపెంచి నీవె రచ్చఁబెట్టుకోవయ్యా ॥పల్లవి॥

1. చిటుకంటేఁ జాలదా సిగ్గుగలదానికి
తటుకన నీవద్దఁ దలవంచను
కటకట నవ్వఁబోయి కన్నవారిచేతనెల్ల
దిటముగా నీవలెఁ దిట్టించుకోవలెనా ॥ఇంచుకంత॥

2. గొణఁగితేఁ జాలదా గుటుతోడిదానికి
వొణఁకె(కు?) తోఁ గన్నుల నీ రొలికించను
అణఁగక కన్నవారి ఆయాలకుఁ జేచాఁచి
సణఁగుల నీవలె జంకెఁబడవలెనా ॥ఇంచుకంత॥

3. దగరితేఁ జాలదా తమకించేదానికి
వొగ్గినరతులలో నోలలాడను
నిగ్గుల శ్రీ వేంకటేశ నీవు నన్నుఁ గూడితివి
బగ్గన నీవలె వేరేపంత మియ్యవలెనా ॥ఇంచుకంత॥

**అర్థములు:** ప. ఇంచుక = చాలా కొంచెము, ఈడవారికి = ఇక్కడివారికి, పెంచి పెంచి = చిన్నవిషయము పెద్దది చేయు, రచ్చబెట్టు = అల్లరిపాలు చేయు.

1. చిటుకు = చిన్నగా, చాలదా = సరిపోదా, సిగ్గుగలదానికి = సిగ్గుగల ఆడుదానికి, తటుకున = తటాలున, కటకట = అయ్యో, కన్నవారిచేత = పుట్టింటి వారిచేత, దిటము = ధైర్యము, తిట్టుంచుకోవలెనా = తిట్లు తినవలెనా?

2. గొణగు = చిన్నగా వినబడీ వినబడనట్లు మాట్లాడు, గుట్టుతోడి = పరువుతో, ఒణకు = భయపడి, నీరొలికించను = నీళు ్ళ కారడానికి, అణగక = తగ్గక, ఆయాలకు = ప్రాణాలకు, చేజాచి = అందుకుని, సణగులు = విడువకుండ జెప్పు, జంకె = సకోచముతో కూడిన భయము.

3. దగరు = బలిమి, తమకించు = తత్తరపడు, ఒగ్గిన = ఒప్పుకొన్న, ఓలలాడు = మునిగితేలు, నిగ్గు = కాంతి, బగ్గన = మండుటకు ధ్వన్యమకరణము, పంతము = పట్టుదల.

**భావము:** పరువుగల ఆడువారు చాల కొంచెం గొడవైనా భరించలేరు. చిన్న చిన్న విషయాలను పెంచి పెంచి పెద్దవిచేసుకుని అల్లరిపాలు గావడం సబబేనా స్వామీ!

తటాలున సిగ్గుతో తలవంచుకోవడానికి, సిగ్గుగల ఆడుదానికి చిన్నగా ఒక్క మాటన్నా చాలదా! పదిమాటలనవలెనా? చెప్పండి. అయ్యో! స్వామీ! కష్టముతో నవ్వులపాలయి, పుట్టింటివారిచేత కూడా ఈమాదిరి తిట్టించుకోమంటారా?

పరువుతో ఉన్న స్త్రీకి ఏమాత్రం కొద్దిగానైనా అనకూడని మాటలు చిన్నగా వినబడీ వినబడనట్లు మాట్లాడినా చాలు, వినగానే భయంతో వణికిపోతూ కళ్ళలో నీరొలికిపోవడం సహజమే కదా! అలా ఉండకుండా కన్నవారి ప్రేమాభిమానాలకు కట్టుబడి యున్నవారికి నీ మాదిరి విడవకుండా చెప్పినదే చెప్పి దెప్పుతూ ఉంటే సంకోచముతో కూర్చుండిపోవాలంటారా స్వామీ!

ఎల్లవేళలా మాలాంటి తత్తరపడే వారికి, పూనుకొన్న రతిక్రీడలలో తేలియాడడానికి, కొంచెం బలిమి చూపించి మాట్లాడితే చాలదా! అతిశయించిన కాంతులతో ఉన్న ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు నన్ను కలిసి కూడినావు. నీ మాదిరి భగ్గున మండిపడేవిధమైన వేరే పంతాలు పట్టుదలలు మాకేల? మేము నీ దాసానుదాసులము.

## 503

**అవతారిక:** సమయాసమయాలు గ్రహించకుండా స్వామి నాయిక దరిచేరి పరిహాసాలు చేస్తున్నందుకు, కినుక వహించి మాట్లాడే దృశ్యం.

### రామక్రియ

ప. ఎవ్వరుంటా నెఱఁగవు యేరా నీవు
యివ్వల దగ్గరిననా కిది వెద్దలా ॥పల్లవి॥

1. మానరా నీవు నాతోడిమందెమేళాలు
నానఁబెట్టి యేడనైనా నవ్వవచ్చేవు
నేనూ నీ పొరుగైతే నేరమాయనా
పూని మావా రిదిగంటే పోరులు రావా ॥ఎవ్వరుంటా॥

2. గుట్టుతోడ నుండరా కొంతైనా నీవు
చిట్టకానకుఁ నా మీఁదఁ జేయి వేసేవు
ఇట్టె నీమోము చూచితే నియ్యకొంటినా
గట్టిగా మగనాలనుఁ గానా నేను ॥ఎవ్వరుంటా॥

3. ఆయరా నేఁడింతలోనే అన్నిపనులు
ఆయములు సోఁక నన్ను నానవెట్టేవు
యీయెడ శ్రీ వేంకటేశ యెనసితివి! నన్ను
చాయల సన్నల నిదె సతమాయఁగా ॥ఎవ్వరుంటా॥

**అర్థములు:** ప.ఎవ్వరుంటా = ఎవరున్నది లేనిదీ, ఇవ్వల = ఇవతల, దగ్గరిననా = దగ్గర ఉన్నదాననా?, వెద్ద = పరిహాసము.

1. నాతోడి = నాతో, మందెమేళము = అతిచనవు, నానబెట్టి = ఆలశ్యము చేసి, ఏడైనైనా = ఎక్కడైనా, పొరుగు = సమీపము, నేరము = తప్పు, పూని = ప్రయత్నించి, మావారు = మాకు సంబంధించినవారు, కంటే = చూసినట్లైతే, పోరులు = పోట్లాటలు.
2. గుట్టు = రహస్యము, తోడ = తోటి, కొంతైన = కొంచెమైనా, చిట్టకాన = శృంగారచేష్ట, ఇయ్యకొను = ఒప్పుకొను, మగనాలు = మగఉడుగల ఆఉడుది.
3. ఆయరా = అయ్యోను, నేడు = ఈరోజు, ఆయములు = జీవస్థానములు, నానవెట్టు = ఆలస్యము చేయు, ఎడ = స్థానము, ఎనయు = సరిపోలు, చాయల = శోభల, సన్నలు = సైగలు, సతము = శాస్వతము.

**భావము:** చుట్టుప్రక్కల ఎవరున్నారనే విషయం గమనించవు. అయ్యో ఏమిటిరా ఈ వైపరీత్యము? నేను నీకు దగ్గరిదాననే కదా ఈ పరిహాసాలన్నీ చేయడం స్వామీ!

నీవు నాతో అతిచనవులు, ఎగతాళి మాటలు మానుకోలేవా? ఆలసించి, ఆలసించీ ఎక్కడబడితే అక్కడ నవ్వులు నవ్వుతుంటావు. నేను నీ సమీపములో నివాసముండడమే తప్పైనదా? మా ఇంటో యిది చూసినట్లైత్లే మాకు పోట్లాటలు రావా స్వామీ!

స్వామీ! నీకు కొంతైనా గుట్టూ మట్టూ అవసరము కదా! శృంగార చేష్టలు చేస్తూ నామీద చేతులు వేస్తావు. నీ ముఖారవిందం చూసి సమ్మతించానా? నేను కూడా ఒక మగడుగల ఆడుదానిని కాదా చెప్పండి?

ఇంతలో ఇక్కడ అన్ని పనులునూ అయినవి. మర్మస్థానాలు తాకే విధంగా నన్ను ఆలసించి చేరినావు. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ స్థానములో అత్యంత ప్రేమాభిమానాలతో కూడినావు. నన్ను శోభలతోను సైగలతోను దరిచేరగా యిదే నాకు శాశ్వతమైన ఆనందమాయెను స్వామీ!

## 504

**అవతారిక:** ఇద్దరు కాంతలను ఒకేసారి చేపట్టిన శ్రీనివాసుని అమ్మ అలమేలుమంగమ్మ పరిహాసంగా మాట్లాడుతున్నది.

### పాడి

ప. ఈవల కాంతల గుణా లేకమే కావా

పూవులవాటు కోపవు పూఁపవాటు కోపేవా ॥పల్లవి॥

1. కప్పురపు వీడెముతో కలికి మాటలాడఁగ
దప్పిదేరే వేఁటికోయి దగ్గరివుండి
చెప్పరానికారాలే చిందీ మాకన్నులను
యిప్పుడే నన్నుఁ జెనకే విందు కోపేనా ॥ఈవల॥

2. చిగురుచేతుల నిన్నుఁ జెలియ విలువఁగానే
వొగరుఁజెమటలతో నుస్సురనేవు
మిగులవాఁడి మొనలు మెరిచీ మాచన్నులను
యెగువ నన్నుఁ బిలిచే విందు కోపేవా ॥ఈవల॥

3. అద్దపు మెఱుఁగుఁజెక్కులాకె నిన్ను వలపించి
ముద్దుచూపితే భ్రమసి మోమువంచేవు
పొద్దుపొడపు గోళ్ళపొలఁతి నన్నుఁ గూడితి–
విద్దరికి శ్రీ వేంకటేశ వోపేవా ॥ఈవల॥

**అర్థములు:** ప. ఈవల = ఈప్రక్కన, గుణములు = స్వభావాలు, ఏకము = ఒకటి, పూవులవాటు = పువ్వులు సుతారముగా విసురుట, ఓపవు = ఓర్చుకోలేవు, పూపవాటు = లేత పిందెల దెబ్బ, ఓపేవా = ఓర్చుకోగలవా!.

1. కప్పురపు వీడెము = కర్పూరముతో గూడిన తాంబూలము, కలికి = స్త్రీ, దప్పిదేరు = దాహము తగ్గు, ఏటికోయి = ఎందుకోయి, కారాలు = బాధలు, చిందు = విరజిమ్ము.

2. చిగురుచేతులు = లేత చేతులు, చెలియ = చెలి, విలువగానే = పిలువగానే, ఒగరు = వగర్పుతో, ఉస్సురను = శ్రమతో నిట్టూర్చు, మిగులవాడి = ఎక్కువ సూదియైన, మొనలు = కొసలు, మెరిచీ = ప్రకాశించెను, చన్నులను = రొమ్ములపై, ఎగువ = పైన, ఓపేవా = ఓర్చుకునేవా?.

3. అద్దపు మెరుగులు = అద్దమువలె మెరయు, చెక్కులాకె = చెక్కిలిగల ఆమె, వలపించి = ప్రేమించునటుల చేసి, భ్రమసి = మత్తులో మునిగి, మోము వంచు = సమ్మతించి తలవంచు, పొద్దుపొడపు = సూర్యోదయము, గోళ్ళపొలతి = వాడియైన గోళ్ళు గల యువతి, కూడితివి = కలసితివి, ఓపేవా = సహించి కలిసేవా.

**భావము:** ఈ ప్రక్కన ఉన్న కాంతల స్వభావాలు లక్షణాలు అన్నీ ఒకటే కదా! పువ్వుల దెబ్బలకు ఓర్వలేని వాడవు లేత పూపిందెల దెబ్బలకు ఓర్చుకోగలవా?

మంచి సుగంధ కర్పూర భరితమైన తాంబూలము తీసుకొని వచ్చి ఆ స్త్రీ మాట్లాడగా, దగ్గరే ఉండి దాహార్తి చల్లారినట్లు ప్రవర్తించడమెందుకు? ఆ కారణంగా మా కన్నుల వెంట నీరు కారి, కారం చిందిన విధంగా బాధ పడ్డాము కదా! మరి ఇప్పుడే నన్ను స్పృశించి విందు ఆరగించడానికి సమ్మతించేవా?

లేలేత చేతులతో ఆ చెలి నిన్ను పిలువగానే, ఒగర్పుతో, చెమటలతో తడిసి ముద్దై ఉస్సురుస్సురని నిట్టూర్పులు విడిచేవు. మా వాడియైన రొమ్ముల మొనలు ప్రకాశించుచుండగా, పైన మేడపై నన్ను పిలిచి విందు భోజనం ఆరగించడానికి సమ్మతించి సహించేవా?

అద్దము వంటి చెక్కిళ్ళతో అందంగా ప్రకాశించి మెరసిపోతున్న ఆ యువతి తనను ప్రేమించే విధంగా నిన్ను తనవైపు తిప్పుకొని, ముద్దాడగా వచ్చినప్పుడు మత్తులో మునిగి తలవంచుతావు. ప్రాతఃకాలాన ఆ పొడవైన గోళ్ళతో ఉన్న యువతిని, నన్ను కూడా ఒకేసారి పొందుకున్నావు. ఓ శ్రీవేంకటేశ్వరా! మా ఇద్దరిని ఒకేసారి చేపట్టి ఓర్చి సహించగలవా? చెప్పండి స్వామీ!

## 505

**అవతారిక:** స్వామి ఒకానొక గొల్లభామతో సరసాలు, పరిహాసాలు ఆడే రసవత్తర దృశ్యం.

## తోండి

ప. కానీవే గొల్లెతా కమ్మటి నవ్వకువే
నాననీవే రేపటికి నయమవును దాఁచవే ॥పల్లవి॥

1. తీపుచేసి వలపులు తీర నాపైఁ జల్లకువే
పోపో నీగొల్లచల్ల పుల్లనేకాదా
మాపటంత వచ్చేఁగాని మగుడి చూడకువే
చేపట్టి చూడఁజూడఁగ చీఁకటిండ్లే వెలుఁగు ॥కానీవే॥

2. మాటలనే నా మీఁద మందులు నూరకువే
మూటగట్టితే గొల్లముంజులేకావా
చీటికిమాటికి నాపై చేతులు చాఁచకువే
వాఁటమైతే నీరు వారు వచ్చే నే నాడకు ॥కానీవే॥

3. చేయివట్టి తియ్యకువే చేరి నన్ను లోనికి
పాయపు గొల్లెతలకు బలువేకదా
వేయిటికిఁ గూడితి శ్రీ వేంకటేశుఁడను నేను
యీయెడ జాతొకటాయ నింటికి వచ్చేనే ॥కానీవే॥

**అర్థములు:** ప. కానీవే = సరేలే, గొల్లెత = గొల్లభామ, కమ్మటి = మరల మరలా, నాననీవే = నిదానంగానే కానీ, నయమగు = ఉపశమించు, దాచవే = దాచిపెట్టవే.

1. తీపుజేసి = మధురమైన, వలపులు = ప్రేమ, చల్లకు = విరజిమ్మకు, పోపో = వెళ్ళు..వెళ్ళు, గొల్ల చల్ల = గొల్లెత చేసిన మజ్జిగ, పుల్లన = పుల్లని రుచి, మాపటి = రాత్రికి, మగుడి = వెనుకకు మరలు, చేపట్టి = చేకొని, చూడజూడగ = చూడగా చూడగా, వెలుగు = ప్రకాశము.
2. నూరకు = పిండి చేయు, గొల్లముంజులు = గొల్లల తలలోని మురికి యొక్క మడ్డి, వాటము = అనుకూలము, పారివచ్చు = ప్రవహించి చేరు, ఆడకు = అక్కడకు.
3. చేయివట్టి = చేయిపట్టుకొని, పాయపు = ప్రాయము, వయసు, బలువు = అధికము, వేయిటికి = వెయ్యిమార్లు, ఈ ఎడ = ఈ స్థానములో, జాతొకటాయ = కులము ఒకటాయెను, ఇంటికి వచ్చేనే = సరాసరి ఇంటికే వస్తాను.

**భావము:** ఓ గొల్లెతా! సరేలే కానివ్వు. మాటి మాటికి నవ్వులు నవ్వవద్దు. ఇలాగే నిదానంగా కానీ! నీ నవ్వుల ఫలితం రేపటికి తేలుతుందిలే కానీ కొంచెం దాచుకోవే!

అంతగా మధురంగా నీ ప్రేమలన్నీ విరజిమ్మి నన్ను బాధించకే! వెళ్ళవే గొల్లెతా అవతలకు వెళ్ళు! ఎప్పుడూ గొల్లవారి చల్ల పుల్లగానే ఉంటుంది. రాత్రికి నేను వస్తాను కానీ వెనకకు తగ్గడం చేయవద్దు సుమా! కాంతను చేపట్టిన వాడికి చీకటి గృహములే వెలుగై సంతోషాన్నిస్తాయి కదా!

నా మీద నీ మాటలనే మందులను ఊరకే నూరవద్దే గొల్లెతా! అవన్నీ మూట గట్టినట్లైతే అవి గొల్లల తలలోని మురికి యొక్క మడ్డి కాదా! మాటి మాటికి నాపైన చేతులు వేయవద్దు. వాటమైనట్లైతే నీరులాగా ప్రవహించి నేనక్కడకు చేరుకుంటాను కదా!

చేయిపట్టుకుని నన్ను లోపలికి లాగవద్దు. ఈ యుక్త వయసులో నున్న గొల్లెతలకు గొప్ప బలిమే ఉన్నది సుమా! ఓ శ్రీవేంకటేశ్వరా! వేయిమార్లు నీతో కలిశాను. ఈస్థానములో మనిద్దరి వావి వరస కులము అన్నియు ఒకటేగా యున్నవి కనుక ఇంటికి విచ్చేయండి స్వామీ!


506

**అవతారిక:** అమ్మ అలమేలు మంగమ్మ స్వభావము ఒక్కొక్కసారి ఒక్కో తీరుగా నున్నదని చెలులు వాపోతూ ఆవిషయం అమ్మనే అడుగుతున్నారు.

## మాళవి

ప. ఎట్టు నమ్మవచ్చునే ఇంతి నీ మనసు నేఁడు
వొట్టి యొకవేళ బుద్ధి యొకవేళ వచ్చునా ॥పల్లవి॥

1. వెన్నెలబయట నుండి వేఁడిఁబడి యిందాఁకా
సన్నల నీపతిఁ గూడి చల్లనైతివి
వున్నతపుఁజందురుఁడొక్కఁడే వెన్నెలొక్కటే
కన్నెభావాలు రెండుగతులాయ నివిగో ॥ఎట్టు॥

2. కోయిలకూఁతలకే గుండె బెదరి యిందాఁకా
యీయెడ నీపతిఁగూడి యిచ్చగించేవు
ఆయెడాఁ బలుకొక్కటే అప్పటి నీవు నీవే
రాయడి నీగుణములే రందు దెఱఁగులాయ ॥ఎట్టు॥

3. వేడుక చల్లగాలికి విసిగితి విందాఁకా
కూడి శ్రీవేంకటేశుతో కోరే వదియే
ఆడనే నీయాలవట్ట మదియును నొకటే
యీడా నాడాఁ దలపోఁత లివియే వేరు ॥ఎట్టు॥

**అర్థములు:**ప. ఎట్టు = ఏవిధముగా, ఇంతి = స్త్రీ, మనసు = స్వభావం, ఒట్టి = ఏమీలేని, ఒకవేళ = చేదర్థక వాక్యములో పక్షార్థమును తెలుపు పదము, వచ్చునా = వస్తుందా?.

1. వెన్నెల = చల్లదనము, వేడిబడి = ఉష్ణములో, సన్నలు = సైగలు, చల్లనైతివి = చల్లబడితివి, ఉన్నతపు = శ్రేష్టమైన, చందురుడు = చంద్రుడు, కన్నెభావాలు = పెండ్లికాని యువతి మనసులోని ఆలోచనలు, గతి = దారి.
2. గుండె బెదరు = భయము చెందు, ఎడ = స్థానము, ఇచ్చగించు = సమ్మతించు, రాయడి = బాధ, తెరగులు = పద్ధతులు.
3. వేడుక = సంతోషము, విసుగు = చీకాకు పడు, కోరేవు అదియే = దానినే కోరు, ఆడనే = అక్కడే, ఆలవట్టము = విసనకర్ర, ఈడా నాడా = ఇక్కడా అక్కడా, తలపోత = ఆలోచన, ఇవియే = ఇవే.

భావము: అమ్మా! నిన్ను ఏవిధంగా నమ్మాలి అనేది అర్థం కాకుండా ఉన్నది. ఏమీ లేకుండా ఉంటే బుద్ధి వస్తుందా?

ఇప్పటివరకు వెన్నెల బయట నిలబడి కాకతో వేచియుండి సైగలతో నీ పతిని చేరి చల్లబడ్డావు. ఘనుడైన చంద్రుడొకడే! వెన్నెల కూడా ఒకటే కదా! ఇదుగో చూడండి! పెండ్లికాని యువతి మనసులోని ఆలోచనలు రెండు తీరులుగా ఉన్నవి.

ఇప్పటి వరకూ కూయని కోయిలమ్మ కూసినందుకే బెదరిపోయి గుండెలవిసినవి. ఈ స్థానములో నీవు భర్తతో కలిసి సమ్మతించి చేరినావు. ఆ స్థానములోనూ మాటలొకటే! అప్పటికి నీకు నువ్వే బాధతో గూడిన నీ మనసు రెండు విధములుగా నున్నది.

సంతోషముతో చల్లగాలికి కూడా విసుగుచెంది యున్నావు. నీ కోరిక శ్రీవేంకటేశ్వరుని పొందు కూడడమే కదా! అక్కడ నున్న నీ విసనకర్ర కూడా ఒకటే! ఇక్కడ అక్కడా నీ ఆలోచనలు కూడా ఒక్కటే అయి ఉన్నవి.

## 507

**అవతారిక:** తను ఏమి మంచిపనులు చేసినప్పటికీ, ఏవో తప్పులు పడుతూ సాధిస్తున్నాడని, అమ్మ చెలులతో చెప్పి వాపోవుచున్నది.

## లలిత

ప. ఊరకే గడించుకొనీ నోయమ్మా ? తన-
నోరే ఘనము చేసీనో చూడరమ్మా ॥పల్లవి॥

1. తనివార నొకమాఁటు తప్పక చూచితి నింతే
వెనక తనచేఁతకు వెంగెమా యిది
ననుపైన దానఁగాన నవ్వితే నింతే కాక
చెనకేతనతో గేలిచేసితినా ॥ఊరకే॥

2. వుబ్బసపోక నేనే వుస్సురంటి నొకమాఁటు
గొబ్బుననుఁ దనమీఁది కోపమా యిది
నిబ్బరానఁ దనమాఁటే నిజమంటిఁగాక నేను
దబ్బరలు చేసినట్టి తలఁపా యిది ॥ఊరకే॥

3. కడుఁదమకానఁ దన్నుఁ గాఁగిట నించితిఁగాక
సుడిగొన్న తనకాఁక చూచుటా యిది
యొడయక శ్రీవేంకటేశుఁడు గాఁగాఁ, దన్ను
బడివాయఁగాక యిది పైయద్దికములా ॥ఊరకే॥

**అర్థములు:** ప. ఊరకే = పనిలేకుడ, గడించుకొను = సంపాదించుకొను, ఘనము = గొప్పగా, చేసీనో = చేయుచున్నాడు.

1. తనివార = తృప్తిగా, చేత = పని, వెంగెము = పరిహాసము, ననుపైన = అనురాగము, చెనకు = తాకు, గేలి = ఎగతాళి.
2. ఉబ్బసపోవు = ఏమీ తోచక, ఉస్సురను = శ్రమతో నిట్టూర్చు, గొబ్బున = త్వరగా, నిబ్బరము = ధైర్యము, దబ్బరలు = మోసముతో, తలపు = ఆలోచన.
3. కడు = మిక్కిలి, తమకము = మోహము, కాగిట = కౌగిట, నించితి = ఉంచుకొను, సుడిగొను = చుట్టుకొను, కాక = తాపము, ఎడయక = వదలక, బడివాయు = వదలిపెట్టు, అద్దికము = కావలి,రక్షణ.

**భావము:** ఊరకే చీటికి మాటికి తప్పొప్పులు లెక్కపెట్టుకోనీ వమ్మా! తనకే పెద్ద నోరు ఉన్నదని మాట్లాడుతూ ఉంటాడు కానీలే! చూడవే!

ఏదో తృప్తి మీర ఒక సారి స్వామిని అలా చూస్తూ ఉన్నాననుకో, ఇది వెనుక తను చేసిన తప్పులకు నేను చేసే పరిహాసమునుకుంటే ఎలా చెప్పు? అనురాగం ఉన్నదాన్ని కాబట్టి నవ్వానని అర్థం చేసుకోకుండా ఎప్పుడూ నన్ను తాకాలనే ప్రయత్నించే స్వామితో ఏమైనా ఎగతాళిగా మాట్లాడానా చెప్పు?

ఏదో ఉబుసుపోకనో, ఏమీ తోచకనో నేను ఒక్కోసారి శ్రమతో ఉస్సురని నిట్టూర్పులు విడుస్తూ ఉంటే ఏమైందట? యిదంతా ఆయన మీద కోపంతో అనుకుంటే ఎలాగే! ధైర్యంతో నిబ్బరముతో ఆ స్వామి మాటలే నిజమని అంటున్నాను కదా! ఇదంతా మోసంతో చేసే ఆలోచనలనుకుంటే ఎలానే?

అధికమైన తమకముతో స్వామిని కౌగిటిలోకి తీసుకున్నాననుకో, చుట్టుకొంటే ఆయన తాపాన్ని పరీక్షించడానికి చేసిన పనుకుంటే ఎలానే? ఆ శ్రీవేంకటేశ్వరుడు వీడకుండా నన్ను వదలి పెట్టకుండా ఉండడం కూడా రక్షణ, కావలి అని అనుకుంటే ఎలానే?

## 508

**అవతారిక:**స్వామి తనపై అలుకబూనడంపై అమ్మ శృంగారపరమైన కోపం ప్రదర్శిస్తున్నది.

## భైరవి

ప. తరవాతి పనులెల్లఁ దా నెఱఁగఁడా
బిరుదే నెరపుఁ గాక పిలిపించనేఁటికే ॥పల్లవి॥

1. గోరుకొన సోఁకకతొలుతే కోపగించేవాఁడు తాను
యీరీతి నుంగరము నా కేఁటి కంపెనే
వీరివారిమాటలకు వెఱ పింతగలవాఁడు
దారకుఁడై వుండుఁగాక దగ్గరి రానేఁటికే ॥తరవాతి॥

2. వీసము సేయనందుకే విడనాడేవాఁడు దాను
ఆసమాటలేల చెప్పియంపెనే నాఁడు
వాసిమెరమెచ్చులకు బయలీఁదించేటివాఁడు
వేసాన నే నున్నచోటు వెదకఁగనేఁటికే ॥తరవాతి॥

3. అండకు రాకమునుపే యంతా మఱచేవాఁడు
నిండినమోహము నాపై నించనేఁటికే
మెండగు శ్రీవేంకటాద్రిమేటి ఇట్టె నన్నుఁ గూడె
వుండినట్టేవుండి నన్ను వూరడించనేఁటికే ॥తరవాతి॥

**అర్థములు:** ప. తరువాతి పనులు = తర్వాత జరగబోయే పరిణామాలు, ఎర్గదు = తెలుసుకోలేదు, బిరుదు = సమర్ధత, నెరపు = నెరవేర్చు, ఏటికే = ఎందుకే.

1. గోరుకొన = గోరుచివరి భాగము, సోకు = తాకు, తొలుత = ముందు, రీతి = విధముగా, నాకుంఏటికి = నాకెందుకు, అంపెను = పంపించినాడు, వీరి వారి = వాళ్ళు వీళ్ళు, వెరపు = బెరుకు,వశము, దారకుడు = బాలుడు, రానేటికి = రావడమెందుకు.
2. వీసము = చాలా చిన్న భాగము (రూపయలో 16వ భాగము), విడనాడు = వదలిపెట్టు, ఆసమాటలు = కోరికలు పుట్టించే మాటలు, వాసి = ఆధిక్యము, మెరమెచ్చులు = పొగడ్తలు, బయలీదించు = వృధా ఆశలు కలిగించు, వేసాన = ఏవో వేషములతో, నేనుంఉన్నచోట = నేనున్న స్థలములలో.
3. అండ = సమీపము, మోహము = ప్రేమ, నాపైంఇంచ = నాపై ఉంచుట, మెండు = సమృద్ధి, మేటి = సాటిలేని, ఉ ఒడినట్టే ఉండు = అక్కడే ఏమీ తెలియనట్టు ఉండు, ఊరడించు = ఓదార్చు.

**భావము:** స్వామి ఎంత సమర్ధుడైతే మాత్రం, తరువాత జరుగబోయే పరిణామాలు పర్యవసానాలు ఏమీ గమనించకుండా, తెలుసుకోకుండా నన్నిక్కడికి పిలిపించడం ఎందుకే!

అసలు చిన్నగా గోరు కొన తగిలితేనే కోపపడే వాడు, ఈ మాదిరి నాకు ఉంగరము పంపడం ఎందుకే? ఊళ్ళో వాళ్ళు వీళ్ళూ చెప్పే మాటలకు తహతహలాడినా, మళ్ళీ ఏదో బెరుకుతో ఉండిపోయేవాడు, బాలుడు మాదిరి ఉండిపోవాలి కానీ, ఈ మాదిరి దగ్గరకు చేరడం ఎందులకే?

ఏదో చిన్న పని చేయడం ఆలస్యమైతేనే నాపై కినుక వహించి వెళ్ళిపోయేవాడు, ఇలా కోరికలు చెప్పి పంపడం ఎందుకే? ఆధికంగా పొగడ్తలతో వృధా ఆశలు కలిగించే వాడు, మళ్ళీ వేషాలు వేస్తూ నేనెక్కడున్నానా అని వెదుక్కుంటూ రావడమెందుకే?

దగ్గరకు రాక ముందే చెప్పిన మాటలు చేసిన బాసలు అన్నీ మరచిపోయేవాడు, ఏదో నాపై ప్రేమాతిశయం చూపించడమెందులకే? అతిశయించి, శ్రీవేంకటాద్రిలో ఉన్న ఆ శ్రీనివాసుడు ఈవిధముగా నన్ను చేరినాడు. ఉన్నవాడు ఉన్నట్టు ఉండకుండా నన్ను ఏదో తప్పు జరిగిందని క్షమించమని ఓదార్పులు చేయడమెందుకే!



డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య

## 509

**అవతారిక:** స్వామి అన్య కాంతలతో కూడి వచ్చిన విషయం గమనించిన అమ్మ స్వామితో వ్యంగ్యంగా పరిహాసాలాడుతున్నది.

### పాడి

ప. గుట్టున నుండుటచాలు కూడినదాఁకా
అట్టె ఆమీఁది పను లప్పుడే చెప్పేను ॥పల్లవి॥

1. చూడకురా అద్దము సొంపగు నీ నుదుటను
యేడో లత్తుక చూచి యెంత సిగ్గవునో
ఆడకురా మాఁటలు ఆయపునీమోవిమీఁది-
నీడ కెంపులు రాఁగితే నీ కెంత నొచ్చునో ॥గుట్టున॥

2. వెలి వెళ్ళకురా నీవేఁడిచెమట గారితే
చెలుల మెదుట నెంత చింత వుట్టునో
కులికి నవ్వకురా కొప్పుసేస రాలితే
యెలమి నీబాసలు నిన్నేమనునో ॥గుట్టున॥

3. కాఁగిటఁ బెనఁగకురా కమ్మఁగస్తూరిబేంట్లు
చేఁగలై రాలితే నీచిత్త మెట్టవునో
తూఁగుబడి నన్ను నీవు తోడుతనే కూడితివి
పాఁగిన శ్రీవేంకటేశ పచ్చి యెంత దోఁచునో ॥గుట్టున॥

**అర్థములు:** ప. గుట్టున = రహస్యముగ, కూడు = కలియు, ఆమీద = ఆతర్వాత.

1. సొంపు = అందము, నుదుట = పాలభాగము, ఏడో = ఎక్కడో, లత్తుక = లాక్షారసము, ఆయపు = జీవస్థానము, మోవి = మోహము, కెంపు = ఎర్రనైన పుష్యరాగము, రాగు = అనురాగము, నొచ్చు = బాధించు.
2. వెలి = బయటకు, చింత = బాధ, కులికి = నర్తించి, కొప్పు సేస = శిగపైనున్న అక్షింతలు, ఎలమి = వికాసము, బాస = ఇచ్చినమాట.
3. కాగిట = కౌగిట, పెనగు = చుట్టుకొను, కమ్మ = కమ్మని సువాసన గల, కస్తూరి బేంట్లు = కస్తూరితో చేసిన చుట్లు, చేగ = సారవంతమై, చిత్తము = మనసు, తూగుబడి = తూలిపోవు, కూడు = కలియు, పాగిన = మాగిన, పచ్చి = మరుగులేని, తోచునది = మనసున ఏర్పడు భావము.

భావము: స్వామీ! నేను మిమ్ములను కలిసేంతవరకూ, బయట యిలా ఉండడమే ఉత్తమము. ఆ తర్వాత కలిసినతర్వాత జరగ వలసిన కార్యక్రమమంతా నేనే ఆ సమయంలోనే చెప్తాను.

స్వామీ! అద్దములో నీ ముఖారవిందాన్ని చూసుకోవద్దు. నీ మోహంపై ఎక్కడో అంటుకున్న లత్తుకను చూసి నీకు సిగ్గవుతుంది కదా! ఏమీ మాట్లాడవద్దు ఎందుకంటే నీ మోహంపై ఉన్న పుష్యరాగ మణులు రాలిపడితే నీకెంత బాధను కలిగిస్తుందో!

స్వామీ! దయచేసి బయటకు వెళ్ళకండి. నీ వేడి వేడి చెమటలు కారినట్లైతే చెలుల ఎదుట నీకు మరలా లేని పోని ఆలోచనలు కలుగుతాయి కదా! కులుకుతూ నర్తిస్తూ అలా నడవవద్దు. అలా నడిస్తే నీ కొప్పు మీద ఉన్న అక్షతలు రాలిపడినట్లైతే వికాసముతో నీవు చేసిన బాసలు ఇచ్చిన మాటలు నీకు గుర్తుకు వచ్చి నిన్నేమని ప్రశ్నిస్తాదేమో తెలియదు.

నా కౌగిట్లో చుట్టుకొని గాఢముగా కౌగలించుకోవద్దు. నీవు పూసుకున్న కస్తూరి పట్టీల పూతలచుట్లు రాలి పడితే నీకు మనస్తాపం కలుగుతుంది. ప్రేమ దాహముతో ఆర్తితో తూలుతూ నన్ను చేరుకుని కలిశావు. కోరికలన్నీ కమ్మగా మాగిన ఓ శ్రీవేంకటేశ్వరా! నీ ప్రేమ మరుగులేని ఏవిధంగా భాసిల్లుచున్నదో గమనించారు కదా!

## 510

**అవతారిక:** అన్నివిషయాలలోను చెలులు త్వరపెడుతున్నారని భావించిన అమ్మ వారితో ఏమిటీ దుందుడుకు చర్యలని అడుగుతున్నది.

### ఆహిరి

ప. చిక్కితి మీ పాలన చేయరె యీ వేళనూ
ఇక్కడనే వేగిరించే రేమందు నేనూ ॥పల్లవి॥

1. చెక్కిటిమీఁదికి చెయ్యి చిత్తములోనిది నుయ్యి
యెక్కడిబుద్దులు నాకు నేమిచెప్పేరే
ముక్కుమీఁదటిది వేలు మోహములు వేవేలు
ఇక్కువ లెఱఁగలేరు యేమందు నేను ॥చిక్కితి॥

2. నిలువెల్లా నివ్వెరగు నిద్దుర రెప్పమరఁగు
కలిగినమీఁదటెత్తు కనుఁగొనరే
సెలవులనే నగవు చెప్పఁబోతేనే బిగువు
యెలమి మీరు మొక్కఁగ నే నేమందునే ॥చిక్కితి॥

3. చెదరిన నీ (యీ?) కురులు సేసకొప్పున విరులు
తుదమొద లెఱఁగరు తొలఁగరే
యెదుట శ్రీవేంకటేశుఁ డిదే వచ్చి, నన్నుఁ గూడె-
నిదెవో మీతో నింక నేమందు నేను ॥చిక్కితి॥

**అర్థములు:** ప. చిక్కితి = దొరికిపోయాను, మీపాలను = మీచేతిలో, వేగిరించు = త్వరపడు.

1. చెక్కిటిమీద చేయి = చెక్కిలిమీద చేయివేసుకొను, చిత్తము = మనసు, నుయ్యి = భావి, బుద్ధులు = మాటలు, ముక్కుమీదటివేలు = ముక్కుమీద వేలువేసుకొని ఆలోచించు, మోహము = ప్రేమ, ఇక్కువ = జాడ.
2. నివ్వెరగు = భీతి, రెప్పమరగు = రెప్పక్రింది నిద్ర, సెలవులనే నగవు = పెదవి మూల నవ్వు, బిగువు = బింకము, ఎలమి = వికాసము, మొక్కు = నమస్కరించు.
3. చెదరిన = అస్తవ్యస్థమైన, సేసకొప్పు = అక్షింతలు వేసిన కొప్పు, తుదమొదలు = మొదలు చివరా, తొలగు = అడ్డుతొలగు, ఇదెవో = ఇదిగో.

భావము: ఓ చెలులారా! ఈనాడు మీ చేతికి చిక్కిపోయాను. అన్నింటికి నన్ను ఇక్కడచేరి త్వరపెడుతున్నారు కదే! నేనేమని అనలగలను?

చెక్కిలిమీద చేయివేసుకొని ఉన్నప్పటికి నా మనసు భావివలె అగాధమై లోతుగా నున్నది. ఇవెక్కడి బుద్ధులే! నాకు ఏమి చెప్తున్నారు? ముక్కుమీద వేలైతే ఉన్నది కానీ ప్రేమాతిశయము వేలు వేలుగా నున్నది. ఏ మాత్రం జాడ తెలుసుకోలేని మిమ్మల్ని నేనేమని అనలగలను?

శరీరం మొత్తం భీతితో నున్నది. నిద్దుర రెప్పలమాటున దాగి యున్నది. ఈవిధముగా కలుగుటకు కారణమేమిటే? పెదవిమూల నవ్వులు చెప్పవలనంటే బిగువుగా నున్నది. వికాసముతో మీరు నమస్కరించగా ఏమంటానే?

చెదిరిపోయి అస్తవ్యస్థమైన ఈ వెంట్రుకలు అక్షతలు వేసుకునే కొప్పుపై పువ్వులుగా ఉన్నవి. మొదలు చివరలు గమనించరు మీరు ప్రక్కకు తొలగండే! అదుగో ఎదురుగా శ్రీవేంకటేశ్వరుడు వచ్చి యున్నాడు. ఆ స్వామి నన్ను గూడినాడు యిదుగో ఇంక నేను మీతో ఏమి మాట్లాడగలను?

## 511

**అవతారిక:** స్వామివద్ద కాస్తొ బిగువు, బెట్టు నటించమని సలహా యిస్తున్న చెలులకు, తను స్వామిని చూడగానే కరగిపోతున్నానని చెబుతూ అమ్మ తన బలహీనతను తెలియజేస్తున్నది.

### శ్రీరాగం

ప. ఇచ్చకమే మదిఁ దోఁచీ నేమందునే
వచ్చినది పదివేలు వాని నేమందునే ॥పల్లవి॥

1. కన్నులఁ జూచినప్పుడే కాఁకలెల్లాఁబెడఁబాసె
యెన్నికల కేడలేదు యేమందునే
మున్నిటి సుద్దు లెంచితే మోహములు చవిదప్పీ
విన్నదే విందవుత మేలు విభుని నేమందునే ॥ఇచ్చకమే॥

2. సెలవి నవ్వినప్పుడే చిక్కులెల్లాఁ బెడఁబాసె
యెలయించఁ దరిగాదు యేమందునే
పలికితే సంతోషబావములు చవిదప్పీ
పిలుపే కోటానఁగోటి ప్రియుని నేమందునే ॥ఇచ్చకమే॥

3. కాఁగిట నించినప్పుడే కడమలు వాసె నిట్టె
యేఁగకున్నఁ జవిదప్పీ నేమందునే
పాఁగిన శ్రీవేంకటాదిపతి యిన్నిటా నాతో
రాఁగిన మోవితేనెలరసికు నేమందునే ॥ఇచ్చకమే॥

**అర్థములు:** ప. ఇచ్చకము = ముఖప్రీతి, దోచు = కొల్లగొట్టు, వచ్చినది పదివేలు = రావడమే మహా భాగ్యము, ఏమందునే = ఏమనగలను.

1. కాకలు = తాపము, పెడబాయు = ఎడఉబాయు కు మరొక రూపము, ఎన్నికలు = ఎంచుకొనుటకు, మున్నిటి = ముందటి, సుద్దులు = సుభాషితాలు, మోహము = ప్రేమ, చవిదప్పు = రుచిని కోల్పోవు, విందవుత = విందు యగుట, మేలు = మంచిది, విభుడు = భర్త.
2. సెలవి నవ్వు = పెదవి మూల నవ్వు, చిక్కులు = సమస్యలు, పాసి = వీడి, ఎలయించు = పురికొల్పు, దరికాదు = దగ్గరవదు, చవిదప్పు = అరుచి కలిగించు, పిలుపు = స్వామి ఆహ్వానము, కోటానుకోటి = అసంఖ్యాకమైన, ప్రియుని = ప్రేమించిన వానిని.
3. కాగిట = కౌగిట, నించు = ఉంచు, కడమలు = కొరత, వాసె = స్పృశించె, ఏగకున్న = వెళ్ళనట్లైతే, చవిదప్పు = రుచిని కోల్పోవు, పాగిన = పక్వమై సాగిన, రాగు = అనురాగము, మోవితేనెల రసికుడు = అధ్రామృతపానాన్ని ఇష్టపడే శృంగార ప్రియుడు.

**భావము:** చెలులారా! ముఖప్రీతి మాటలే పదివేలుగా తోచుచున్నవి. ఇక ఏమని అంటాను? స్వామి ఇక్కడకు విచ్చేయడమే పదివేలుగా తలుస్తున్నాను. ఆయనను ఏమని అంటానే?

స్వామిని కండ్లతో చూచీ చూడగానే తహతహల తాపమంతా వీడిపోయినవి. ఇంకా ఎంచుకోవడానికేమున్నది. ముందటి తప్పులు లెక్కించి ఏమైనా అంటే ప్రేమలు దూరమవవా చెప్పు? ఆ స్వామి గురించి విన్న మాటలే నాకు విందుభోజనమై తోచుచున్నవి. ఇంకా ఏమంటానే?

స్వామి పెదవి మూలగా నవ్వులు చిందించగనే నాకు సమస్యలన్నీ వీడిపోయినది. ఇంకా పురిగొల్పుట సబబు కాదు కదా!

ఏమన్నా అధికముగా అటూ ఇటూ మాట్లాడితే సంతోష సమయాలు భావాలు రుచి దప్పడమే కదా అవుతుంది. ఆ స్వామి ఆహ్వానమే నాకు అసంఖ్యాకమైన ఆనందాలుగా తోచును. ఇంక నేను ఆ ప్రియుడిని ఏమనగలనే?

ఆ స్వామి నన్ను కౌగిటిలోకి తీసుకున్నప్పుడే నా కొరతలన్నీ తీరి సంతృప్తి అయినది. ఇంక నేను స్వామి కడకు వెళ్ళకపోయినట్లైతే రుచి దప్పి వ్యవహారమంతా రసాభాస అవదా? తీగపాకమువలె సాగి, పక్వమైన ఆ శ్రీవేంకటాధిపుడు ఇన్నిటా నాతోనే ఉండి, అనురాగముతో అధరామృతపానాన్ని ఇష్టపడే శృంగార ప్రియుడు కదా నా స్వామి!అశక్తురాలను ఆయనను నేను ఏమనగలనే?

## 512

**అవతారిక:** అమ్మ ఒక వంక స్వామివారిని పొగుడుతూనే చేస్తున్న అకార్యాలకు స్తుతి-నింద చేస్తున్న దృశ్యం.

### నాగవరాళి

ప. నీవు మంచివాఁడవే నీ చేఁతలే నన్ను
చేవ ముంటి (ముట్టి?) పోటులై చిమ్మి రేఁచీఁగాని ॥పల్లవి॥

1. కన్నులు నీవి మంచివి కడలఁ గెంపులు నిండి
యెన్నఁగఁ గోపమురేఁచె నిదే కానిది
అన్నిటా నీమాట లెస్స అందులోనే దగదొట్టి
విన్నని నీయలపులే వెతరేఁచీఁ గాని ॥నీవు॥

2. ముంగిటినవ్వు మంచిది మోవిని పొక్కులు నాకు
చెంగటఁ జిగురుచేఁదులే చేసీఁగాని
అంగడిఁ జక్కనివాఁడ వౌదువు నీమేనిమీఁది-
వుంగిటివింతవాసన లుడికించీఁగాని ॥నీవు॥

3. అతిరతినీయధరామృతము తియ్యనే
సతులెల్లాఁ జవిగొంటేఁ జప్పన గాని
ఇతవుగా శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
కతలుగావా నిన్నుఁ గై కొంటిఁ గాని ॥నీవు॥

**అర్థములు:** ప. చేతలు = పనులు, చేవముట్టి = లోపల తాకి, పోటులు = దెబ్బలు, చిమ్మిరేచు = విరజిమ్ముచుండు.

1. కడ = వెలుపల, కెంపు = ఎఱ్ఱని వర్ణము, ఎన్నగ = లెక్కింపగ, కోపమురేచు = కోపకారణమగు, లెస్స = బాగు, తగదు = కూడదు, అలపు = శ్రమ, వెతరేచు = బాధ కలిగించు.
2. ముగిటినవ్వు = ముందరి నవ్వు, పొక్కులు = దుఃఖము, చెంగట = చెంతన, చిగురుచేదు = లేతనై ఉన్న చేదు రుచి, అంగడి = వీధి, మేని = శరీరము, ఉంగిటి = ఊపిరాడని, వింతవాసన = వినూత్నమైన వాసన, ఉడికించు = నొప్పించు.
3. అతిరతి = అధికమైన శృంగార కార్యము, అధరామృతము = లాలాజలము, చవి = రుచి, చప్పన = రుచిలేకుండు, (హి)ఇతవు = ఇష్టము, కతలు = కట్టుకథలు, కైకొంటి = చేపట్టి.

**భావము:** స్వామీ! నీవు చాలా ఉత్తమగుణములు గలవాడవే! కానీ నీ అకార్యములే నన్ను శరీరము యావత్తూ బాధిస్తూ, ఘాతములై తగులుతూ విరజిమ్ముచున్నవి.

స్వామీ! నీ నేత్రములు బహుసుందరమైనవి. కానీ కోపించినపుడు ఎఱ్ఱనైన నీ కనులు పుష్యరాగములవలె మరింత ఎఱ్ఱనై కోపాన్ని ప్రదర్శిస్తున్నవి. నీ పలుకు మాట అన్నింటా బాగు బాగు యనిపిస్తూ ఉంటుంది కానీ నీ పరుషమైన మాటలు నాకు శ్రమనే కలిగిస్తున్నవి.

స్వామీ! నా ముందర నీవు నవ్వే నవ్వులు చాలా శోభలనిస్తూ ఉంటాయి. కానీ, నాకు ఒక్కోసారి దుఃఖకారణమై చెంత లేలేత

చేదు తిన్నంత బాధగా తోస్తున్నది. కొలువుకూటములో నీవు చాలా చక్కగా ప్రవర్తిస్తూ ఉంటావు, కానీ ఆ తర్వాత నీ శరీరముపై ఊపిరాడని వింత ప్రవర్తనల వాసనలు నన్ను నొప్పిస్తూ ఉక్కిరి బిక్కిరి చేస్తుంటాయి.

స్వామీ! నీ అధికమైన శృంగార కార్యములన్నీ మధురాతి మధురమైన రుచినే కలిగిస్తాయి. కానీ అవే రుచులు నా తోడి సవతులు గ్రహిస్తేనే నాకు చప్పనివి అనిపిస్తాయి. ఓ శ్రీవేంకటేశ్వరా! ఎంతో ఇష్టప్రీతితో నన్ను కూడి చేపట్టినావు. నిన్ను నేను చేపట్టాను కానీ ఇవన్నీ కట్టుకథలు కావా? చెప్పండి? నాకు అనుమానముగా నున్నది.

## 513

**అవతారిక:** అమ్మ తన తప్పులేమీ లేవని స్వామి వారే గిల్లికజ్జాలు పెట్టుకుంటున్నాడని చెలులతో చెప్పి వాపోతున్నది.

### ఆందోళి

ప. ఇంతులాల నావంక నిదే తప్పు
కొంతైనాఁ బిలువనంటాఁ గొసరీ మనసు ॥పల్లవి॥

1. మాటకు మాటాడను మరి కల్లలెంచెను
నాఁటుకొన్న చూపులతో నవ్వితి నేను
గీఁటెఁ గొనగొరఁ దానే కిందుపడ నొక్కెఁ దానే
కూటమికి రానంటాఁ గోపగించీఁ దాను ॥ఇంతులాల॥

2. పతికిఁ బతి సేయను పను లేమి నడుగను
అతికాఁకఁ దనమేనే అంటితి నేను
కతలు చెప్పీఁ దానే ఘాతలుసేసీఁ దానే
తతితో దగ్గరనంటా దమకించీఁ దాను ॥ఇంతులాల॥

3. కాదుగూడ దనను కఱకరి సేయను
యీదెసఁ దనకుఁ బంతమిచ్చితి నేను
సేదదేర నన్నుఁ గూడె శ్రీ వేంకటేశుఁడు దానె
పోదితో మెచ్చితినంటాఁ బొదిగీఁ దాను ॥ఇంతులాల॥

**అర్థములు:** ప. ఇంతులాలా = చెలులారా!, వంక = దిశ, కొసరు = కోరుకొను.

1. మాటకు = ప్రతిమాటకు, మాటాడను = మాటకు మాట చెప్పను, కల్లలు = అబద్ధాలు, ఎంచచు = లెక్కించను, నాటుకొన్న = మనసులో నిలబడిన, గీటె = తాకించె, కొనగోర = గోరు చివర, కిందుపడ = క్రిందపడ్డ, నొక్కె = వత్తెను, కూటమికి = కలయికకు, రానంటా = రానని మొండికేసి.
2. పతికి పతి = చేసిన పనులకు మారుగా చేయు, మేను = శరీరము, అంటు = తాకు, కతలు = కల్పితపు మాటలు, ఘాతలు = చిన్న చిన్న శృంగారపు దెబ్బలు, తతి = సమయము, తమకించు = తహతహలాడు.
3. కాదు కూడదనను = చెప్పినదానికెల్లా నిరాకరించను, కరకరి = ద్వేష స్వభావము, దెస = దిక్కు, పంతము = పట్టుదల, సేదదీరు = అలసట తీర్చుకొను, పోది = గొప్పగా, మెచ్చు = ప్రశంసించు, పొదుగు = క్రమ్ముకొను.

**భావము:** ఓ చెలులారా! నాదేమైనా తప్పుదంటే అది ఒకటే తప్పు. స్వామిని పిలువడానికి మనసు ఎల్లప్పుడూ వువ్విళ్ళూరడమే! అదే నా తప్పు సుమా!

నేను స్వామివారితో మాటకు మాట బదులు చెప్పడము, అబద్ధాలు చెప్పడం అసలు తెలియనే తెలియదు. స్వామిపైనే నిలబడిపోయిన చూపులతో మందహాసముతో నిలబడ్డాను. కొనగోరుతో నొక్కడం, కిందపడేట్టు నొక్కడం, తానే కలయికకు నిరాకరిస్తూ కోపగించి మొండికేయడము ఇవన్నీ స్వామివారే చేశారు తప్ప నేనేమీ ఎరుగను.

చేసిన ప్రతిదానికి స్వామి నాపై కక్షగట్టి ఉంటే ప్రతిగా నేనేమీ చేయను చెప్పండి? అలాగని ఆయనను యేవేవో కార్యాలు చేసిపెట్టమని కోరను. కాకపోతే శరీర తాపము తహతహలు భరించలేక ఆయనను స్పృశిస్తూ ఉంటాను. ఆయనే కట్టుకథలు చెప్పి, సుతారంగా చిన్న చిన్న గుద్దులు శృంగారంగా గుద్దడము చేస్తూ ఉంటాడు. నేను సమయము చూసి స్వామిని తాకితే మరలా తహతహలాడుతూ ఉంటాడు.

స్వామి చెప్పిన దానికి కాదు కుదరదనే మాటలే అనను. ద్వేష స్వభావమెన్నడూ చూపను. ఈరీతిగానే స్వామితో ఎల్లవేళలా ప్రవర్తిస్తున్న దానిని. స్వామి శ్రీవేంకటేశ్వరుడు అలసట తీరి నా వద్దకు చేరి నన్ను కూడినాడు. అందులకే స్వామి గొప్పతనాన్ని బహుధా ప్రశంసిస్తూ ఉండగా తాను నన్ను క్రమ్ముకొని శృంగారకేళిలో ముంచితేల్చినాడు.

## 514

**అవతారిక:** ద్వాపరంలో గొల్లభామ, గొల్లవాడైన శ్రీ కృష్ణుల మధ్య సరస శృంగార నర్మగర్భ సంవాదము.

### లలిత

ప. నవ్వితినే గొల్లెతా నాయ మవుర గొల్లఁడా
యెవ్వ రేమనిరే నిన్ను నియ్యకొంటిఁ బదరా ॥పల్లవి॥

1. కానీవే గొల్లెతా కద్దులేరా గొల్లఁడా
ఔనా మఱవకువే అట్టే కానీరా
నే నేమంటిని నిన్ను నీకే తెలుసురా
మానితినే ఆమాట మంచిదాయఁ బదరా ॥నవ్వితినే॥

2. అదియేమే గొల్లెతా అందుకేరా గొల్లఁడా
కదిసెఁ గడుపనులు కల్లగాదురా
ఇది నిక్కిమటవే ఇంతకంటె నటరా
పదరకువే నీవు పలుమారు నేలరా ॥నవ్వితినే॥

3. మెచ్చితినే గొల్లెతా మేలు లేరా గొల్లఁడా
కుచ్చితిఁ గాఁగిట నిన్నేఁ గూడుకొంటిరా
యిచ్చకుఁడ శ్రీ వేంకటేశుఁడను నేనే
యెచ్చరించవలెనా, యెఱుఁగుదుఁ బదరా ॥నవ్వితినే॥

**అర్థములు:** ప. నవ్వితి = నవ్వాను, గొల్లెతా = గొల్లభామా, నాయమవుర = ఇదే పద్ధతిలేరా, గొల్లడా = గొల్లవాడా, ఎవ్వరేమనిరేని = ఎవరేమనుకొన్నప్పటికి, ఇయ్యకొంటి = సమ్మతించు.

1. కానీవే = అలాగే కానీ, కద్దు = కలదు, మరువకు = మరచిపోవద్దు, అట్టే = అలాగే, నేనేమంటిని = నేను ఏమన్నాను, నిన్ను నీకే = నీపనులు నీకే, మాను = వదలిపెట్టు, పదరా = నడవరా.
2. కదిసె = దగ్గరచేరు, కడుపనులు = ఎక్కువైన కార్యాలు, కల్ల = అబద్ధము, నిక్కము = నిజము, పదరకు = త్వరపడు, పలుమారు = అనేకసార్లు.
3. మెచ్చితి = ప్రశంసించితి, మేలు = శుభము, కుచ్చు = గుచ్చు, కాగిట = కౌగిట, కూడుకొను = కలసికొను, ఇచ్చకుడు = మాటకారివాడు, ఎచ్చరించు = గుర్తుచేయు, ఎరుగుదు = తెలుసును.

**భావము:** ఇది గొల్లభామ శ్రీకృష్ణుల సంవాదము.

శ్రీకృష్ణుడు: నీ పద్ధతి కంగారూ చూస్తుంటే నాకు నవ్వు ముంచుకొస్తున్నది... గొల్లెతా!

గొల్లభామ: అది న్యాయమా? గొల్లవాడా! ఎవరేమనుకున్నా, నేను నిన్ను సమ్మతించాను. ఇక వదలిపెట్టను.

శ్రీకృ: అలాగే కానీలేవే గొల్లెతా!

గొ.భా: గొప్ప విషయముందిలే గొల్లవాడా! మరచిపోవద్దు. అలాగే కానీరా....నేనేమన్నది నీ మనసుకు అర్థమైనదని గ్రహించానులే! నేను ఆ మిగిలిన మాటలన్నీ వదలిపెట్టేశాను ఎప్పుడో! ఇప్పటికి ఇదే మంచిదనిపిస్తున్నది గొల్లడా! ఇక నడువు వెళ్దాం.

శ్రీకృ: అదేమిటే గొల్లెతా అలాగంటావు? ఎక్కడికే?

గొ.భా: అందుకే.... గొల్లడా! దగ్గరకుచేరి నీవు చేసే ఈ చిలిపి పనులన్నీ అబద్ధమంటావా గొల్లడా?

శ్రీకృ: ఇది నిజమా గొల్లెతా!

గొ.భా: ఇంతకంటే భాగ్యమటరా!

శ్రీకృ: నీవు అన్నిటికి తొందర పడకు గొల్లెతా! కొంచెం నిదానించు.

గొ.భా: ఇన్నిసార్లు చెప్పడమెందుకురా! కానివ్వరా!

శ్రీకృ: ఆహా! నిన్ను మెచ్చుకొన్నానులే గొల్లెతా!

గొ.భా: మంచిదిరా గొల్లడా! కానీ! నిన్ను గట్టిగా గుచ్చి గుచ్చి కౌగిట్లోకి తీసుకొని కలిశానురా.

శ్రీకృ: ఓ గొల్లెతా నేను ఎవరో తెలుసా? నీకు ఇష్టమైన శ్రీవేంకటేశ్వరుడను నేనేనే!

గొ.భా: ఆ విషయం గుర్తుచేసి మళ్ళీ చెప్పాలా గొల్లవాడా! నేను ఎరుగననుకొంటివా? పదరా!

## 515

**అవతారిక:** స్వామి అన్యకాంతలను కలిసి రావడమే కాకుండా వారి సుగుణాలన్నీ ఏకరువు పెట్టడం నచ్చని అమ్మ కోపించి మాట్లాడుతున్నది.

### తోండి

ప.మరిగిన నీకే కాక మాకేలరా
తెరమఱఁ గింతే నీవు తీసివేయనేలరా ॥పల్లవి॥

1. ఆడకురా నాముందర ఆకెగుణములు సారె
గోడ గడుక నసలే కుప్పవడీని
వోడక నీ కితవైతే వుట్టి గట్టు కుందు గాని
సూడుబంటుతో బలాలు చూపి చెప్పనేలరా ॥మరిగిన॥

2. యెంచకురా ఆకెపొందు యెక్కుడుగా నాయెదుట
యెంచఁబోతే మంచముకిందింతా నుయ్యే
కంచముపొత్తు గలితే కలవెల్లా నితవుగా-
నించుకాఁ జలిలేకున్న నెండగాయ నేలరా ॥మరిగిన॥

3. కప్పకురా ఆకెచీర గట్టుకొంటి వదె నీవు
వుప్పొలికి యినుమడౌ నొద్దికైతేను
యిప్పుడె శ్రీ వేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
దప్పికి నీరేకాక తగ నీ నెయ్యలరా ॥మరిగిన॥

**అర్థములు:**ప. మరిగిన = అలవాటుపడ్డ, నీకే కాక = నీకు కాకుండా, మాఏలరా = మాకెందుకయ్యా! తెరమరగు = తెరగట్టుకొని లోపల ఉన్న, తీసివేయనేల = తీసి అవతలవేయడమెందులకు?

1. ఆడకురా = నాటకాలు ఆడవద్దు, ఆకె = ఆమె, గుణములు = స్వభావములు, సారె = మాటి మాటికి, కుప్పవడీని = కుప్పకూలిపోతుంది, ఓడక = వీగక, హితవైన = ఇష్టమైన, ఉట్టిగట్టుకొను = అంటిపెట్టుకొని యుండు, సూడుబంటు =

పగబట్టినవాడు, బలాలు = ఆధిక్యము, చెప్పనేల = చెప్పడం ఎందులకు?

2. ఎంచచ్చు = లెక్కించకు, ఆకె = ఆమె, ఎక్కుడు = ఎక్కువ, ఎంచబోతే = చూడబోతే, నుయ్యి = భావి,అగాధము, కంచంపుపొత్తు = కలసి భోంచేసే, గలితే = కలిగితే, కలవి = ఉన్నవి, హితవు = ఇష్టము.

3. కప్పకు = మీద కప్పవద్దు, ఆకె = ఆమె, ఉప్పొలుకు = ఉప్పు దొర్లు, ఇనుమడి = రెట్టింపు, ఒద్దిక = దగ్గరగు, దప్పికి = దాహనికి, నీరేగాక = నీళ్ళు కాకుండా, నెయ్యేలరా = నెయ్యి ఇవ్వడం ఎందుకురా!

**భావము:** అలవాటుపడిన నీకు కాకుండా మాకెందుకీ ఈ విషయాలన్నీ స్వామీ! నేను కోపించి తెరమరుగులో నున్న సమయములో తెరను తీసివేయడం తగదు సుమా!

స్వామీ! ఆమె సుగుణాలన్నీ నా ముందు మాటి మాటికీ ఏకరువుపెట్టి కులకవద్దు. గోడను నీటితో కడిగితే మొత్తం కుప్పకూలుతుందన్న విషయం తెలియదా? నీవు తగ్గకుండా ఇష్టం చూపిస్తున్నట్లైతే మీ యిద్దరూ ఉట్టిగట్టుకొని ఎక్కడైనా ఊరేగండి. నా కభ్యంతరమేమీ లేదు సుమా! పగబట్టినవాని ముందు బలప్రదర్శన చేసిన రీతిగానే ఉన్నది.

స్వామీ! ఆమె పొందులగురించి యిష్టాఇష్టాల గురించి నా ముందు ఎక్కువగా లెక్కించవద్దు. ఆలా చేసినట్లైతే మంచము క్రిందంతా పెద్ద లోతైన భావిలా అగాధంలా ఉంటుంది. నీతో విందులు చేసుకునే పొందు ఉంటే మొత్తం ఇష్టమైనట్లే గదా! కొద్దిగా కూడా చలి లేకుండా ఎండగాసిన తీరుగా నున్నవి నీ కార్యములు.

స్వామీ! ఉప్పు ఒలికిన విధంగా రెట్టింపు ప్రేమాభిమానాలతో ఇద్దరూ ఒద్దికగా దగ్గరై జత కలసినట్లుగా ఆమె కట్టిన చీరె నీవు కప్పుకొని వొంటిపై ధరించావు. ఆహా ఓ శ్రీవేంకటేశ్వరా! ఈవిధముగా నన్ను గూడితివి, దాహము వేసినపుడు నీళ్ళిచ్చి కాపాడవలెను కానీ ఈవిధముగా నెయ్యిని త్రాగమని ఇవ్వడం తగునా?

**విశేషాంశాలు:** అన్నమయ్య ఈ కీర్తనలో, గోడ కడుగ నసలే కుప్పవడీని, ఉట్టిగట్టుకుని ఊరేగు, చలిలేకున్న ఎండగాయనేల, ఉప్పొలికి ఇనుమడవడం, వంటి రకరకా లోకోక్తులు/ సామెతలు వాడి కీర్తనకు అందం చేకూర్చాడు.

## 516

**అవతారిక:** స్వామి అన్య కాంతలతో గూడి, వారు తనను తాత్సారం చేస్తున్నా,తనుమాత్రం వారినే కోరుకుంటూనే ఉంటానని, కోపంతో స్వామి చేష్టలను ఆయనకే వివరిస్తున్న దృశ్యం.

### లలిత

ప ఎంతటఁ గాని మెచ్చవు ఇంకా నిది
పంతానకు నీవే పైకొనవద్దా యిది ॥పల్లవి॥

1. పక్కుఁన నలిగినట్టిపడఁతి ఇవ్వలిమోమై
చక్కఁగా నిన్నుఁజూచెఁ జాలదా యిది
గుక్కక కానిమాటలు గొణఁగిననోటనే
గక్కునిన్నుఁ బిలిచెఁ గాదా యిది ॥ఎంతట॥

2. వలవంత గోపగించి వంచినట్టిరెప్పలనే
మెలపున నిన్నుఁ జూచె మేలుగా యిది
చలయిలే యిందాఁకా సాదించినట్టీనీ –
చెలి నీతో నవ్వె చెల్లదా యిది ॥ఎంతట॥

3. వేడుక నీవు వట్టితే విదిలించుకొన్నచేత
వీడెమిచ్చి వూరకుండె వెలితా యిది
వీడుపడ్డచోనే శ్రీ వేంకటేశ కూడెఁ జెలి

యీడఁ దనివి దీరదా ఇంకా నిది ॥ఎంతటు॥

**అర్థములు:** ప. ఎంతగాని = ఎన్నివిధములుగా ఉన్న, మెచ్చవు = పొగడవు, పంతము = పట్టుదలకు, పైకొను = యత్నించు.

1. పక్కన = పక్కపై, నల్గినట్టి = శృంగారములో మునిగితేలు, పడతి = ఆడుది, ఇవ్వలి = ఈవలి, గుక్కు = పలుకక, కానిమాటలు = అనవసరమైన మాటలు, గొణుగు = చిన్నగా మాట్లాడు, గక్కు = శీఘ్రముగా.
2. వంచిన రెప్పలు = వాల్చిన కన్నులు, మెలపు = జాగ్రత్త, మేలు = శుభము, చలము = వణకు, ఇందాకా = ఇప్పటివరకు, సాదించు = మాటిమాటికి నిష్ఠురపు మాటలతో నొప్పించు, చెల్లదా = సరిపోదా.
3. వేడుక = సంతోషము, వట్టితే = పట్టుకున్నట్లైతే, విదిలించుకొను = విడిపించుకొను, వీడెము = తాంబూలము, ఊరకుండు = ఏమీ మాట్లాడకుండు, వెలితి = కొరత, వీడుపడు = తడబడు, ఈడ = ఇక్కడ, తనివితీరు = తృప్తిచెందు.

**భావము:** ఇదేమి చిత్రం స్వామీ! ఎన్ని విధాలుగా సేవలు చేసినా ఏమాత్రం మెచ్చుకోవు. పట్టుదలతోనైనా యత్నించి మెచ్చవలదా చెప్పండి?

పడకమీద పక్కన శృంగారకేళిలో తేలియాడినట్టి ఆ పడతి ఈవలి మోముతో నిన్ను చూస్తున్నది. ఇది చాలదా స్వామీ! ఆవిడగారు పలికీ పలకకుండా చిన్నగా గోణుగుతూ ఉండిన నోటితోనే శీఘ్రముగా నిన్ను పిలిచెను గదా !

స్వామీ!ఇంతవరకూ భయపడే విధంగా మాటిమాటికి నిష్ఠురపు మాటలతో నొప్పించుచున్న ఆమె తీరు నీకు సరిపోదా స్వామీ! స్వామీ! తన ప్రేమనంతా రంగరించి కొంచెం చిరుకోపంతో వాలిన కనురెప్పలతో జాగ్రత్తగా నిన్నే గమనిస్తున్నది. వణికించే విధంగా ఇంతవరకూ మాటిమాటికి నిష్ఠురపు మాటలతో నొప్పిస్తున్నా, నీతో నవ్వే నవ్వే సరిపోదా స్వామీ!

స్వామీ! సంతోషముతో నీవు పట్టుకుంటే బలవంతముగా వదలించుకొను వేళలో ఆమె నీకు తాంబూలమిచ్చి ఊరకుంటే ఏమైనా కొరతా? లేక ఏమైనా తక్కువైనదా ఇది స్వామీ! ఓ శ్రీవేంకటేశ్వరా! తడబడ్డ తావులోనే ఆ చెలి నిన్ను కూడినది కదా! ఇంకా ఎందుకు? ఇవన్నీ చాలవా? తనివి తీరదా స్వామీ! చెప్పండి?

## 517

**అవతారిక:**చల్లలమ్మబోయే ఒక గొల్లెతను ఆపుతున్న శ్రీకృష్ణుణ్ణి ఇది సమయము కాదని చెప్తున్నది.

### హిందోళం

ప. నీడా యండా నొక్కటే నినుబోఁటికి
ఆడకురా మారుమాట లాయనాయఁ బదరా ॥పల్లవి॥

1. తెల్లని వెల్లాఁ బాలే తెలిసితి వవులేరా
గొల్ల దేమటాయ నాఁడుగుల మెల్లాను
చల్లలమ్మఁ బోనీరా సారె నన్నుఁ బట్టకురా
చల్లువలపులు పైపైఁ జప్పనాయఁ బదరా ॥నీడా॥

2. కన్నదే కంటి గురుమ కంటివి నీవవులేరా
అన్నిటా నీ కాఁడుఁబోడి అగ్గువా యను
నన్ను నింటి కేఁగనీరా నవ్వులెల్లఁ జాలుఁజాలు
వెన్న నున్నగా నూరితే వేసటాయఁ బదరా ॥నీడా॥

3. పట్టినదే పంతమాయఁ బై కొంటి వవులేరా
కట్టినకంకణమాయఁ గొంతలెల్లాను
ఇట్టె శ్రీ వేంకటేశ ఇరవై కూడితి నన్ను
దట్టమైనతమకమే తగులాయఁ బదరా ॥నీడా॥

**అర్థములు:** ప. నీడా ఎండా = ఎండలు, నీడలు, నినుబోటికి = నీబోటి వారికి, ఆడకు = మాట్లాడవద్దు, మారుమాట = వేరేమాట, ఆయనాయ = జరిగిందేదో జరిగింది.

1. అవులేరా = అవునులే స్వామీ! దోమటి = విందుభోజనం, ఆడుకులము = ఆడువారి సమూహము, చల్ల = మజ్జిగ, సారె = మాటిమాటికి, పట్టకు = పట్టుకోవద్దు, చల్లువలపు = విరజిమ్మే ప్రేమలు, చప్పనాయ = రుచిలేనిదయ్యెను, పదరా = ఇంక నడవండి.
2. కన్నదే = చూసినదే, గురుమ = మహిమ, అవులేరా = అవును స్వామీ!, ఆడుబోడి = పూబోడి, అగ్గువ = వెలతక్కువ, ఏగు = వెళ్ళు, చాలు = ఇంక వద్దు, నున్నగా = మెత్తగా, వేసట = శ్రమ.
3. పంతము = పట్టు, పైకొను = యత్నించు, కంకణము = చేతికి తొడుగుకొను లోహపు గాజు, కాంత = స్త్రీ, ఇరవు = నిలయము, దట్టతనము = బిగువైన, తమకము = మోహము, తగులాయ = సంబంధము గల. పదరా = ఇంక నడవండి.

**భావము:** నీలాంటి వారికి ఎండా నీడా ఒకటేవిధముగా ఉంటుంది. ఇంక వేరే వేరే మాటలు మాటలేమీ వద్దు. అయినదేదో అయినది ఇంక నడవరాదా స్వామీ!

తెల్లనివల్లా పాలేనని తెలుసుకున్నాను. అవునులే స్వామీ! మా సర్వ ఆడుజాతి వారికి గొల్లల విందులాగున్నది. నేను చల్లను అమ్మవలసి యున్నది. నన్ను వెళ్ళనీ స్వామీ! నన్ను మాటి మాటికి పట్టుకోవద్దు. నీవు చల్లే ప్రేమలు పైపైన చప్పగా రుచిలేకుండా ఉన్నవి ఇంక పదండి స్వామీ!

అవునులేరా! నీవు చూసినదే కంటికి మహిమలా ఉంటుంది. అన్నిటా నీకు పూవుబోడి లాంటి వారే లోకువయ్యారు. నన్ను ఇంటికి వెళ్ళనివ్వరా! నీ నవ్వులు చాలు...చాలు...వెన్నను మెత్తగా నూరినట్లైతే శ్రమ అవుతున్నది.ఇంక పదండి స్వామీ!

నీవు పట్టినదే పంతమనుకొని యత్నించరా! అవునులేరా! ఈ కాంతలంతా కట్టిన కంకణములాగా ఉన్నవి. ఈతీరుగా శ్రీవేంకటేశ్వరా! ఇక్కడ నెలవై నన్ను కలిసితివి. బిగువైన మోహమువలె సంబంధముగా నున్నది.

## 518

**అవతారిక:**స్వామి అరవు తెచ్చుకున్న కోపం నటిస్తున్నాడని చెలి చెప్తున్నది.

### శంకరాభరణం

ప. ఎరవుల కోపఁ బిఁ (పంబిఁ?) కనేల
తెరమఱఁగున నిఁకఁ దిరుగఁగ వలదే ॥పల్లవి॥

1. చెలియ నీనగవు సెలవుల నుండఁగ
యెలమి మారుమొగ మిఁకఁ దగదే
కలిగినయాసలు కన్నుల నుండఁగ
చలముల బొమ్మల జంకెన దగదే ॥ఎరవుల॥

2. ననుపులమాఁటలు నాలుక నుండఁగ
పెనఁగేటి బిగువులు పెంచకువే
చెనకేటి తమకము చేతుల నుండఁగ
యెనలేనిజగడ మిఁకఁ బేర్చకువే ॥ఎరవుల॥

3. కరఁగిన భావము కాఁగిట నుండఁగ
పరగేటి మోనము పనిలేదే
యిరవుగ శ్రీ వేంకటేశుఁడఁ గూడితి

సరి వెనకటి వెంచఁగఁ బనిలేదే ॥ఎరవుల॥

**అర్థములు:** ప. ఎరవుల = అరువు తెచ్చుకున్న, కోపంబుంఇకనేల = ఇక కోపమెందుకు, తెరమరుగు = తెరచాటు, తిరుగగ = తిరుగుట, వలదే = వద్దు సుమా!

1. నగవు = నవ్వు, సెలవుల = పెదవిమూల, ఎలమి = వికాసము, మారుమొగ = ప్రతిధ్వనించు, చలము = వణకు, బొమ్మల జంకెన = కనుబొమ్మలు ఎవరవేయడం.
2. ననుపు = అనురాగం, నాలుకనుండగ = నాలుక మీద ఉండగా, పెనగేటి = చుట్టుకొను, బిగువులు = బింకము, చెనకు = తాకు, తమకము = మోహము, ఎనలేని = సాటిలేని, జగడము = తగవు, పేర్చు = అతిశయించు.
3. కరగిన = ద్రవించిన, భావము = తలపు, కాగిట = కౌగిట, పరగు = ప్రవర్తిల్లు, మోనము = మౌనము, పనిలేదే = అవసరము లేదే! ఇరవు = స్థానము, సరి = సరిపోసేవిధముగా, వెనకటి = ముందుజరిగిన, ఎంచగ = లెక్కించగ, పనిలేదే = అవసరములేదే!

**భావము:** అరువుతెచ్చుకున్న కోపం ఇంకా ఎందులకు? తెరచాటున ఉంది యిక తిరుగవలసినదే కదా!

ఓ చెలీ! నీ నవ్వులన్నీ పెదవి మూలగా నుండగానే, వికసించే నీ మొహము ఇంకా ఈ విధంగా ఉండడం ఏమాత్రం తగదు సుమా! నీలో పుట్టే ఆశలన్నీ నీ కన్నులమీదనే ఉండగా ఇంకా వణకుతో కనుబొమ్మలను అలా జంకించడమెందుకు?

అనురాగముతో కూడిన మాటలు నీ నాలుకపై నుండగా ఇంకా నీ బింకము, బిగువు చూపిస్తూ అలా ఉండడం తగదు. నీ చేతులు స్పృశించాలనే పట్టుదలతో నుండగా ఎక్కడా లేను తగవులు అతిశయించి ఎందుకు పెట్టుకుంటావు?

ద్రవించిన నీ తలపులన్నీ కౌగిటికి చేరగా, ఇంకా ఈ ప్రవర్తిల్లే మౌనము అవసరమా? ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ ఈ స్థానములో కూడినావు కదా! ఇంకా ఏవో పాత పాత విషయాలన్నీ త్రవ్వి తీసి వెదకడమెందులకు?

## 519

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ మదనతాపాన్ని చెలులు వర్ణిస్తున్నారు.

### శ్రీరాగం

ప. నిన్నుఁ బాసి రమణికి నిమిషమెందును నేఁడే
మన్నించితి రమణుఁడ మా చెలిని నేఁడే ॥పల్లవి॥

1. చిత్తమెల్లా నీరాయ చెమట లేరులు వారె
యెత్తిన వానకాల మింతా నేఁడే
మొత్తమిఁ జెలితురుము మొయిలి విరిసె నిదె
హత్తి వెలుతురుఁగాల మది నేఁడే ॥నిన్ను॥

2. చలిసిగ్గులెల్ల ముంచె పులకలమంచు ముంచె
చలిమంచికాలాలు సతికి నేఁడే
తలఁపెల్లాఁ జిగిరించె తమకపుటెండ గాసె
వెలయు వసంతము వేసవియు నేఁడే ॥నిన్ను॥

3. పగడపు మోవివంటి పచ్చి వెచ్చికొండ నిండె
మొగి యామనికాలము మొదల నేఁడే
నిగిడి శ్రీ వేంకటేశ నీవే యింతిఁ గూడితివి
బగివాయ నిద్దరికిఁ బండుగలు నేఁడే ॥నిన్ను॥

**అర్థములు:** ప. పాసి = వీడి, రమణి = సుందరి, నిమిషమెందున్-ఏడే = నిమిషమైనా ఎందున్నాడు, రమణుడు = అందమైనవాడు.

1. చిత్తము = మనసు, నీరాయ = ద్రవించినది, చెమటలుంఏరులు = చెమటలు జలాశయములగు, ఎత్తిన = తగనిదైన, మొత్తమి = మొత్తము, చెలితురుము = చెలి సిగకొప్పు, మెయిలి = గాలివాన, హత్తి = కూడుకొని, వెలుతురు కాలము = ప్రకాశమైన సమయము, నేడే = ఈరోజే.
2. చలిసిగ్గులు = వణికించెడి సిగ్గు, పులకలు = గగుర్పాటు, ముంచు = మునుగజేయు, మంచికాలము = శుభఘడియలు, సతి = భార్య, చిగిరించు = పల్లవించు, తమకముటెండ = మోహముతో కూడిన ఎండ, వెలయు = ప్రకాశించు, వసంతము = ఆమని, మొదల = ప్రారంభము, వేసవి = ఎండాకాలము.
3. పగడపు మోవి = తెల్లనైన ముఖారవిందము, పచ్చి = బహిరంగము, వెచ్చు = తపించు, మొగి = పూని, ఆమని = వసంతము, నిగిడి = వ్యాపించి, ఇంతి = స్త్రీ, బగివాయు = దూరమగు, పండుగలు = శుభప్రదమైన రోజు.

**భావము:** నిన్ను వీడిన ఆ స్వామికి నిముషము కూడా గడవడంలేదు. మా అమ్మ అలమేలుమంగమ్మను ఈనాడు మన్నించినావు.

స్వామీ! ఆమె పరిస్థితి చెబుదామంటే మనసంతా ద్రవించి, చెమటలు యేరులై ప్రవహిస్తున్నవి. వానాకాలం మొత్తం ఇప్పుడే సంప్రాప్తమైనట్లు తోచుచున్నది. మొత్తం మీద ఆ అమ్మ కొప్పు సిగ నల్లని గాలివాన ముందున్న మేఘమువలె నల్లనైనది. ఈ సమయము కూడుకొన్న ప్రకాశవంతమైన సమయము వలె కనిపిస్తున్నది.

చలిసిగ్గులు నిండా ముసురుకొవడం వల్ల శరీరం మొత్తం పూర్తిగా గగుర్పాటుకు గురియైనది. భావాలన్నీ చిగురించి పల్లవించి అధిక మోహమనే ఎండలు కాసినవి. ఈ పరిస్థితి ఒక ప్రక్క ఎండాకాలము, వసంతకాలము నేడే సంభవించినట్లైనది.

ఆ పగడపు వంటి తెల్లని ముఖారవిందము బహిరంగమై, తపించే కొండవలెనున్నది. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈనాడు నీవు వ్యాపించి ప్రకాశముతో ఆ అమ్మను కూడినావు. ఎడబాటుతో ఉన్న మీ యిద్దరికీ నేడు ఉత్సవసమయమువలె ఆనందములు నిండిపోయినవి.

## 520

**అవతారిక:** అన్నమయ్య లక్ష్మీదేవిని అనేక విధాలుగా స్తుతిస్తున్న ఆధ్యాత్మిక కీర్తన.

### లలిత

ప. జయలక్ష్మి వరలక్ష్మి సంగ్రామవీరలక్ష్మి
ప్రియురాలవై హరికిఁ బెరసితివమ్మా ॥పల్లవి॥

1. పాలజలనిధిలోని పసనైన మీఁగడ
మేలిమి తామరలోని మించువాసన
నీలవర్ణునురముపై నిండిననిధానమవై
యేలేవు లోకములు మమ్మేలవమ్మా ॥జయలక్ష్మి॥

2. చందురుతోడఁ బుట్టిన సంపదల మెఱుఁగవో
కందువ బ్రహ్మలఁ గాచే కల్పవల్లి
అందిన గోవిందునికి అండనే తోడునీడవై
వుందానవు మా ఇంటనే వుండవమ్మా ॥జయలక్ష్మి॥

3. పదియారువన్నెలతో బంగారుపతిమ
చెదరని వేదముల చిగురుఁబోడి
యెదుట శ్రీ వేంకటేశు నిల్లాలవై నీవు
నిదుల నిలిచేతల్లి నీవారమమ్మా ॥జయలక్ష్మి॥

**అర్థములు:** ప. జయలక్ష్మి = విజయమునిచ్చే లక్ష్మి, వరలక్ష్మి = వరములనిచ్చే తల్లి, సంగ్రామ వీర లక్ష్మి = యుద్ధములందు

విజయాన్నిచ్చే తల్లి, ప్రియురాలు = ఇష్ట సఖి, హరి = విష్ణుమూర్తి, బెరయు = వ్యాపించు.

1. పాలజలనిధి = పాలసముద్రము, పసనైన = పచ్చని వర్ణముతో నున్న, మేలిమి = తప్త కాంచనము, మించు = అధిగమించి, నీలవర్ణుడు = శ్రీమహావిష్ణువు, ఉరము = వక్షస్థలము, నిధానము = నిక్షేపము, ఏలేవు = పరిపాలించేవు.
2. చందురుతోడ = చంద్రునితో కూడా, సంపదలు = సిరిసంపదలు, మెరుగు = కాంతివంతమైన, కందువ = జాడ, కల్పవల్లి = కల్పతరువు (కోరికలను తీర్చునది), గోవిందుడు = శ్రీమహావిష్ణువు, అండ = సమీపము, తోడునీడ = విడువక వెన్నంటి తిరుగు వ్యక్తి, ఉందానవు = ఉన్నదానవు.
3. పదియారు వన్నెలు = పదహారు, వన్నెలు = అలంకారములు, పతిమ = విగ్రహము, చెదరని = వీడని, చిగురుబోడి = చిగురువలె లేతనైన మనోజ్ఞురాలగు ఆడుది, ఇల్లాలు = భార్య, నిదుల = నవ నిధులు, నిలిచే = నిలిచి యుండు, నీవారము = నిన్ను నమ్ముకొన్న వాళ్ళము.

**భావము:** అమ్మా! జయాలనిచ్చే తల్లీ! అనేక వరాలను ప్రసాదించే తల్లీ! యుద్ధాలలో విజయాన్నిచ్చే వీరలక్ష్మీ! ఆ మహావిష్ణువుకు ప్రీతిపాత్రమైన యిల్లాలివై, ఇష్టసఖివై ఈ అండపిండ బ్రహ్మాండాలలో వ్యాపించి ఉన్నావమ్మా!

పాల సముద్రంలో ఉన్న పచ్చని మీగడ వర్ణముతోను, మంచి సుగంధమైన తామరపుష్పములో నున్న వాసనలతోను, ఆ నీలవర్ణుడైన శ్రీమహావిష్ణువు వక్షస్థలముపై నిధి నిక్షేపమువలె శాశ్వతముగా కొలువై యున్నావమ్మా! ఈ లోకములనన్నింటినీ ఏలుచున్నట్టుగానే మమ్ములను కూడా ఏలుకొని కాపాడవమ్మా తల్లీ! పాలసముద్రములో చంద్రునికి తోడ బుట్టినదానవై, మహాసంపదలకు నెలవై ప్రకాశిస్తున్నావమ్మా! జాడనెరిగి ఆ బ్రహ్మను గాచుచున్న అమ్మవు. దేవలోకములోని కల్పవృక్షమువలె నిన్ను నమ్మిన భక్తుల కోర్కెలు తీర్చే తల్లివి. ఆ గోవిందుడైన విష్ణువుకు చెంతనే మెలగుతూ ఆయనను విడువక వెన్నంటి ఉన్న తల్లివి. మా యింటకూడా వసించి మాకు సకల సంపదలను కలుగజేయవమ్మా!

పదహారు వన్నెలతో అలంకారములతో అపరంజి ప్రతిమవలె ఉన్నావమ్మా! ఎప్పటికి చెక్కు చెదరని వేదములకు నిలయమై నీవు చిగురువలె లేతనైన మనోజ్ఞురాలైన అమ్మగా నున్నావు. ఆహా! ఎదురుగా శ్రీవేంకటేశ్వరునికి ఇల్లాలివై అలమేలుమంగమ్మవై యున్న నీవు నవనిధులకు స్థావరమై యున్న ఓ తల్లీ! మేమంతా నీవారమే నమ్మా! నిన్ను భక్తితో నమ్ముకొని యున్న వారమమ్మా! మమ్ము కాపాడే భారము నీదేనమ్మా తల్లీ! నమస్కారము.

**విశేషము:** 1. ఇది ఆధ్యాత్మిక కీర్తనలో నుండతగినదని పరిష్కర్త శ్రీమాన్ గౌరిపెద్దివారి అభిప్రాయము.

2. ఇందులో అన్నమయ్య లక్ష్మీ దేవి రూపలైన జయలక్ష్మి, వరలక్ష్మి, ధైర్యలక్ష్మి అని పిలవబడే వీరలక్ష్మిని స్తుతించాడు. పాలసముద్రములో లక్ష్మీదేవితో పుట్టిన చంద్రుణ్ణి, కల్పవృక్షాన్ని స్తుతించాడు. అలాగే “నిధుల నిలిచే తల్లి” అంటూ నవనిధుల ప్రస్తావన చేశాడు. నవనిధులనగా “మహాపద్మశ్చ పద్మశ్చ శంఖో మకరకచ్ఛపౌ, ముకుందకుందనీలాశ్చ ఖర్వశ్చ నిధయో నవ” అనగా కాళము, మహాకాళము, పాండుకము, మాణవకము, నైసర్పము, సర్వరత్నము, శంఖము, పద్మము, పింగళము మొదలైనవి. ఇంకా పదహారు వన్నెలు అని లక్ష్మీ దేవిని స్తుతించాడు. సాధారణంగా లోకంలో బంగారము యొక్క స్వచ్ఛత పదహారు వన్నెలు (క్యారెట్లు) అని చెబుతూ ఉంటారు. అంత మంచి వర్ణము కలిగిన అమ్మ లక్ష్మీదేవి అని అర్థం.

## 521

**అవతారిక:** స్వామి కొలువులో పరిస్థితిగమనించకుండా, సరస శృంగార భావనలతో ఉండడం నచ్చని చెలులు, స్వామితో సంభాషిస్తున్నారు.

### ముఖారి

ప. చెలువుఁడ యెంతైనాఁ జెల్లదా నీకు
సెలవు వెట్టితి మాకు చెల్లదా నీకు ॥పల్లవి॥

1. వొరసి నేమిద్దరము నూరకే వాదు లడువఁగ
శిరసు వంచుకుండఁగఁ జెల్లదా నీకు
పరగ మాలో నేమే పగలు చాటుకోఁగా
సిరులతో నవ్వేవు చెల్లదా నీకు ॥చెలువుడ॥

2. ముప్పిరి నీకుఁగా మొకాలు చూడకుండఁగ
చెప్పవచ్చేవు సాకిరి చెల్లదా నీకు
రెప్పలతుదల మాకు రేసులు వుంటుండఁగాను
చిప్పిలి మోముకళలు చెల్లదా నీకు ॥చెలువుడ॥

3. యిక్కడనే దగ్గరితి మిందరినడుమా వచ్చి
చెక్కుల నొక్కేవు యింతచెల్లదా నీకు
మక్కువ శ్రీ వేంకటేశ మమ్ముఁగూడితి విద్దరి
చిక్కితిమి నీపాలఁజెల్లదా నీకు ॥చెలువుడ॥

**అర్థములు:** ప. చెలువుడు = చెలికాడు,స్నేహితుడు, చెల్లు = సరిపోవు, సెలవు = ఆజ్ఞ.

1. ఒరసి = విచారించు, ఊరకే = ఏ కార్యము లేకుండ, వాదు = మాటకుమాట, శిరసు = తల, పరగ = ఒప్పుగా, పగలు = శతృత్వము, చాటుకొను = ప్రకటించుకొను, సిరులు = సంపద,లక్ష్మీదేవి.
2. ముప్పిరి = మూడువిధముల, మోకాలు చూడకుండా = అన్నీ వివరంగా తెలుసుకోకుండా, సాకిరి = సాక్షి, రెప్పతుద = కండ్ల చివర, రేసులు = చులకన, చిప్పిలి = పొంగివచ్చు, మోము కళలు = ముఖారవింద శోభలు.
3. దగ్గరితి = దగ్గరైతిమి, చెక్కులు = చెక్కిలి, మక్కువ = ప్రీతి, కూడితివి = కలిసితివి, చిక్కితిమి = నీకు దొరికిపోయాము, నీపాల = నీకులోబడి.

**భావము:** ఓ స్నేహితుడా! ఏది ఏమైనప్పటికి నీకు ఈ కార్యాలన్నీ చేయడము సరిపోతుందా? అన్నిటికి ఆజ్ఞలు, ఆంక్షలు విధించావు ఇంకా సరిపోదా నీకు?

స్వామీ! ఏదో విషయమై చెలులము యిద్దరము వాదులాడుకొని పోట్లాడుకున్నాము. నీవు జోక్యము చేసుకోకుండా అలా తలవంచుకొని ఉండిపోవడము సరిపోతుందనుకున్నారా? ఒప్పుగా మాలో మేము ఏవో పగలు, కక్షలు పెంచుకొని మాటలనుకొంటూ ఉండగా అమ్మతో వచ్చి మమ్ము చూసి ఈవిధంగా నవ్వుతున్నావు. ఇది నీకు సరిపోతుందా?

అన్నివిధములుగా ముప్పేటలా జరిగిందేమిటో తెలుసుకోకుండా వచ్చి సాక్ష్యం చెప్పడానికి నిలబడ్డావు. నీకిది సరిపోతుందా? మేము నిద్రతో రెప్పలచివర తూగు వచ్చి నిలబడి ఉండగా, నీ ముఖములో మాత్రం శోభలు వెల్లివిరియగా ఉండడం సరిపోతుందా?

స్వామీ! ఈ ప్రదేశములోనే సమీపించి, ఇందరు చెలుల మధ్యలో వచ్చి మా చెక్కిలి నొక్కడం అనేది ఇంతగా చెల్లేవిషయమా మీకు? ఓ శ్రీవేంకటేశ్వరా! అధిక ప్రీతితో ప్రేమతో మమ్ము దరిచేరి ఇద్దరిని ఇలా కలుసుకొన్నావు. నీకు లోబడి నీ చేతికి చిక్కిపోయాము, ఇదైనా నీకు సరిపోతుందా?

## 522

**అవతారిక:** స్వామి అమ్మవారి అందాలను బహుధా వర్ణిస్తూనే పరిహాసంగా కూడా మాట్లాడుతూ ఆమెను శృంగారంగా కవ్విస్తున్నాడు.

### హిజ్జిజి

ప. ఒకటిపై నొకటేల వొద్దే యింత

చికురము వీడెఁ జాలు సిగ్గులు నీకేలే ॥పల్లవి॥

1. తియ్యనిపెదవినోటఁ దెగి వెంగెమాడఁబోతే
వొయ్యనే కారములయ్యీ వొద్దే యింత
పయ్యదలోని జక్కవపక్షు లడిచేయట్టి-
కయ్యము చాలదా నాతో కయ్యము నీకేలే ॥ఒకటిపై॥

2. తెల్లని కన్నుల నీవు దిష్టించి చూడఁబోతే
వుల్లసపు చేఁగదేరీ వొద్దే యింత
చెల్లఁబో నడపుకరి సింహము నడుము నీమై
పెల్లున బెనఁగీ నాతోఁ బెనఁగ నీకేలే ॥ఒకటిపై॥

3. మెత్తని తామెరచేత మీఱి నన్ను దొబ్బఁబోతె
వొత్తి మరునమ్ములయ్యీ వొద్దే యింత
యెత్తి నిన్ను శ్రీవేంకటేశుఁడ నేఁగలసితి
పొత్తులరతులు చెల్లె పూఁపనవ్వు లేలే ॥ఒకటిపై॥

**అర్థములు:** ప. ఒకటిపై ఒకటి = ఒకదాని మీద మరొకటి, చికురము = వెంట్రుకలు, వీడె = కొప్పు జారినది, నీకుంఏలే? = నీకెందులకు.

1. తెగి = సిద్ధపడి, వెంగెము = పరిహాసము, ఒయ్యను = తిన్నగా, కారములయ్యీ = కారమనిపించు, వొద్దే = వలదే!, పయ్యద = పైటకొంగు, జక్కువపక్షులు = చక్రవాక పక్షులంత గుండ్రమైన, అడి = అధికమైనట్టి, కయ్యము = తగాదా.
2. దిష్టించు = దృష్టిపెట్టు, ఉల్లసము = ఉత్సాహము, చేగదీరు = సారవంతమగు, చెల్లబో = అయ్యో! నడపు = గమనము, కరి సింహము = ఏనుగు,సింహము, నడుము = నడుము భాగము, నీము = నియమము, పెల్లున = తటాలున, బెనగు = చుట్టుకొను.
3. తామెర = తామరపూవు, మీరి = అతిక్రమించి, దొబ్బు = చిన్న దెబ్బవేయు, మరునమ్ములు = మన్మధ బాణములు, కలసితి = కలుసుకొన్నాను, పొత్తుల రతులు = సఖ్యతతో కూడిన శృంగార కార్యము, చెల్లె = సరిపోయినవి, పూపనవ్వు = పూపిందె.

**భావము:** ఒకదానిపై మరొకటి ఈవిధమైన వాదనలు ఇంక వలదు చాలించు. నీ కొప్పు వీడి వెంట్రుకలన్నియు చిందరవందరైనది. ఇంకా సిగ్గులు పడడం ఎందులకు?

నీ తియ్యని పెదవులతో, పెదవి కలిపి ఏదో కాస్తా పరిహాసమాడదామంటే తిన్నగా కారపు రుచితో నోరు మండినట్లైనది. ఇంక వలదు. నీ పైట కొంగులో దాగి యున్న చక్రవాక పక్షులవంటి వక్షోజములు బిగువై లోపల చేసే అల్లరి సందడి చాలదా? ఇంకా నాతో కూడా ఈవిధమైన కయ్యానికి కాలుదువ్వడమెందులకు?

నీ తెల్లనైన కన్నులతో అలా దృష్టిపెట్టి చూడడానికి యత్నిస్తే ఉత్సాహము చేవదీరి సారవంతమై యున్నది. ఇక వలదు. అహా! నీ నడకలను చూసినట్లైతే సింహపు నడుమువలే శోభిస్తూ, నీ నడక ఒక మత్త గజేంద్రముతో పోరాడినట్లున్నది. ఇంకా నాతో రస శృంగార పోట్లాట చేయడానికి ఇంకా సంకోచిస్తావెందులకు?

మెత్తని తామర కాడతో నన్ను సుతారంగా శృంగారాపు దెబ్బలు వేయబోతే, అవన్నీ నన్ను తాకి వత్తుకొని మన్మధ బాణములైనవి. ఇక వలదు. ఎత్తి పట్టుకుని శ్రీవేంకటేశ్వరుడనైన నేను నిన్ను కలసితిని. మన యిద్దరి సఖ్యతో కూడిన శృంగారకేళి రసవత్తరమైన విధముగా చెల్లిపోవుచుండగా ఇంకా నీకు పూపిందెలవంటి లేత లేత చిరునవ్వులెందుకే!

**అవతారిక:** అమ్మ అందచందాలను వర్ణిస్తూ అవన్నీ శత్రువులుగా, మరుని చేతికి అస్త్రాలుగా, తయారయ్యాయని అన్నమయ్య చమత్కరిస్తున్నాడు.

## శంకరాభరణం

ప. ఎట్టు గడించుకొంటివే ఇవి చక్కఁదనమంటా
చుట్టములు గావే అవే సూడిబంట్లు ॥పల్లవి॥

1. తామెరలవంటివేమో తరుణి నీకన్నులు ఆ-
తామెరలే మరునికి తగ బాణాలు
సోముని వంటిదే నీసొంఁపై (సొంపై?) న మొగము ఆ-
సోముఁ డాతనిఁ గలసి జోడౌతెఱంగవా ॥ఎట్టు॥

2. జక్కవల బోలినవి సతి నీకుచములు ఆ-
జక్కవలే మరునికిఁ జనవరులు
మిక్కిలితేంట్లఁ బోలె మేలిమి నీకురులు
పక్కన నాతని కవి బంట్లౌతెఱగవా ॥ఎట్టు॥

3. చిగురుఁ బోలినదె చెలియ నీమేను ఆ-
చిగురేపో మరునికిఁ జేకత్తులు
నగుతా శ్రీవేంకటాద్రినాయకునిఁ గూడితివే
తగ నీతఁడే యాతనితండ్రౌ తెఱఁగవా ॥ఎట్టు॥

**అర్థములు:** ప. ఎట్టు = ఏవిధముగా, గడించుకొను = సంపాదించుకొను, చక్కదనము = అందచందాలు, కావే = కాదు కాదు, సూడిబంట్లు = పగదీర్చుకునే శతృవులు.

1. తరుణి = స్త్రీ, మరునికి = మన్మథునికి, సోముడు = చంద్రుడు, సొంపైన = సొగసైన, జోడు = జత, ఎరగవా = తెలియదా.
2. జక్కవలు = చక్రవాక పక్షులు, సతి = భార్య, కుచములు = రొమ్ములు, చనవరులు = స్నేహితులు, తేంట్లు = తేనెటీగలు, పోలె = సరితూగు, కురులు = వెంట్రుకలు, బంట్లు = సేవకులు.
3. చిగురు = లేతగా ఉన్న, మేను = శరీరము, చేకత్తులు = చేతిలోని శరములు, నగు = నవ్వు, తగు = సరిపోవు, ఆతని తండ్రి = మన్మథుని తండ్రి విష్ణుమూర్తి అన్న అర్థములో.

**భావము:** అమ్మా! అలమేలుమంగమ్మా! ఏ విధంగా సంపాదించావు? ఈ అందాలన్నీ! ఆ చక్కదనాలన్నీ నీకు పగదీర్చుకునే శతృవులని తెలియదా తల్లీ!

నీ నేత్రములు తామర పూలవంటివి కానీ ఆ తామరలే మన్మథునికి అమ్ములై ఉన్నవి. చంద్రునివంటి అందమైన మొహము నీకున్నది కానీ, ఆ చంద్రుడు కూడా మన్మథునితో చేతులు కలిపి జతగూడి నీపై పగతీర్చుకుంటున్నాడన్న విషయం నీకు తెలియదా తల్లీ!

చక్రవాక పక్షులవలె నీ చనుదోయి గుండ్రమై ఉండగా, ఆ చక్రవాకములే మన్మథుడికి స్నేహితులు. తేనెటీగల వంటి తూనీగల వంటి నీ కురులు నల్లగా నున్నవి కానీ ఆ తూనీగలే మన్మథునికి సేవకులన్న విషయం నీవెరుగవా తల్లీ!

నీ శరీరము లేత చిగురువంటిది కదా! కానీ ఆ చిగురే కదా మన్మథుని చేతిలో కత్తులై ఉన్నవి. నీవు నవ్వుతూ ఆ వేంకటాద్రి నివాసుడైన శ్రీవేంకటేశ్వరుని కలిసినావు. కానీ ఆ శ్రీనివాసుడే మన్మథునికి తండ్రి యన్న విషయము నీకెరుకలేదా తల్లీ!

**అవతారిక:** స్వామివారు అన్యకాంతలను కూడి వచ్చారని తెలిసి అడిగితే బాధపడి యేమంటారోయని తెలిసికూడా విషయం చెప్పమని అడుగుతున్న సన్నివేశం.

## రామక్రియ

ప. నీకే తెలుసుఁగాక నీ వొళ్ళి పనులు
కైకొని యెఱుఁగుదుమా కడమ నున్నవారము ॥పల్లవి॥

1. ఔరా నీమాట నిజమందునో కల్లందునొ
దూరి దూరి యేమన్నా దోసమయ్యీని
యేరా నీమోవి యిది యెంగిలో పావనమో
యేరుపరచ వెఱతు మెఱఁగ మితేఁ (మింతే?)సి ॥నీకే॥

2. యేచిననీ కన్నులవి యెఱ్ఱనో తెల్లనో
సూచించితే నిజము నిష్ఠూరమయ్యీని
తాచి నీగుణము మంచితనమో కపటమో
చేచేత నడుగరా చెప్పేరు వీధిని ॥నీకే॥

3. నీవుగా సించినచీర నీదో నొరులదో
భావించి యేమన్నాఁ బచ్చిదోఁచీని
శ్రీవేంకటేశ నేఁడు చేరి నన్నుఁ గూడితివి
నీవే నే ననుకొంటి నిందుకుఁడు (కుండు?) మికను ॥నీకే॥

**అర్థములు:** ప. తెలుసు గాక = నీకే తెలియాలి, వొళ్ళి = ఒడలు, కైకొను = పూనుకొను, కడమ = చివర.

1. ఔరా = ఆశ్చర్యమును తెలుపు మాట, కల్ల = అబద్ధము, దూరి దూరి = అనవసరముగా జోక్యము చేసుకొను, దోసము = తప్పు, మోవి = ముఖము, పావనము = పవిత్రము, ఏరుపరచు = విడివిడిగా చేయు, వెరపు = యుక్తము, ఇంతేసి = ఇన్ని విధములుగా.
2. ఏచు = బాధించు, సూచించు = తెలియజేయు, నిష్ఠూరము = పరుష వచనము, తాచి = దెబ్బతీయు, కపటము = మోసము, చేచేత = స్వయముగా.
3. సించిన = చించిన, ఒరులదో = వేరేవారిదో, భావించి = తలచి, పచ్చిదోచు = బహిరంగతప్పుగా తలచు, నిందుకుండు = మెదలక యుండు, ఇకను = ఇంక మీదట.

**భావము:** స్వామీ! నువ్వు మేనితో చేసే అకార్యాలన్నీ నీకే తెలియాలి. పూనుకొని అడగగలమా చెప్పండి? అసలే దూరముగా ఉన్నవారము కదా!

ఆహా..నీ మాటలన్నీ నిజమా లేక అబద్ధమా? అని నేను అనవసరముగా జోక్యము చేసుకొని అడిగినట్లైతే తప్పుగా లెక్కించవచ్చు. స్వామీ! మీ నోరు ఎంగిలిదా? లేక పవిత్రమైనదా? విడివిడిగా చూసి గ్రహించడం యుక్తమేనా? మేము ఎన్నడూ ఎరగమయ్యా ఇవన్నీ స్వామీ!

నీ బాధించే కళ్ళు ఎర్రగా ఉన్నాయా? లేక తెల్లగా ఉన్నాయా? చెప్పాలంటే నిజం చెబితే నిష్ఠూరమని పరుషవచనాలాడుతున్ననని అంటారు. వీధిలో వాళ్ళను స్వయంగా నువ్వే అడిగితే అన్ని వివరాలు బయటకొస్తాయి స్వామీ!

నీకై నువ్వు పూనుకొని చించిన చీర నీదా లేక వేరే వారిదా? ఇలా అడిగినట్లైతే బహిరంగంగా నా గుట్టు బట్టబయలు చేస్తావా? అంటారేమో స్వామీ! శ్రీవేంకటేశ్వరుడు ఈనాడు నన్ను చేరి కలసినాడు. స్వామీ! నీవే నేనని నేనే నీవని అద్వైత భావనతో ఉన్నదానను. ఇక మీరేమీ మాట్లాడవద్దు. కదలక మెదలక ఉండండి చాలు.

## 525

**అవతారిక:** స్వామివారు అమ్మపై తన రాజసాన్ని, బిగువును ప్రదర్శిస్తుండగా అమ్మ యిది తగునా అని ప్రశ్నిస్తున్నది.

### శుద్ధవసంతం

ప. ఇందరిలో బిగి సేవు యిప్పుడేలా
నిందలమాట లన్నియు నీపై నున్నవిరా ॥పల్లవి॥

1. పంతగాఁడ వవుదువు పలుకరా
యింతచాలదా కోప మిఁక నేలరా
దొంతినున్నది వలపు తొలఁగకురా
అంతచలము రతులయందునే చూపరా ॥ఇందరిలో॥

2. చెల్లె నీకు రాజసము శిరసెత్తరా
తొల్లి నీకు మొక్కితి దూరులేలరా
వెల్లవిరాయఁ బనులు వెంటనే రారా! నీ-
పల్లద మేమిగల్లాను పానుపుపైఁ జూపరా ॥ఇందరిలో॥

3. కడుజాణ వౌదువు కాఁగిలించరా
వడఁబడ నిఁకనేల వద్దువద్దురా
కడఁగి శ్రీవేంకటేశ కలసితిరా! నీ-
అడియాల మింతయు నాయంగముపై నించరా ॥ఇందరిలో॥

**అర్థములు:** ప. ఇందరిలో = ఇంతమందిలో, బిగిసేవు = బిగువు చూపిస్తున్నావు, ఇప్పుడేలా = ఈసమయములో ఎందుకు, నిందలు = అపవాదులు.

1. పంతగాడు = పట్టుదలతోనున్నవాడు, పలుకు = మాట్లాడు, దొంతి = ఒకదానిమీద మరొకటి, తొలగకు = వీడిపోవద్దు, చలము = పట్టుదల, రతులయందు = శృంగారక్రీడయందు.
2. చెల్లె = సరిపోవు, రాజసము = రాజదర్పము, శిరసు = తల, తొల్లి = పూర్వము, దూరు = ప్రవేశించు, వెల్లవిరి = స్పష్టమగు, పల్లద = పౌరుషము.
3. కడు జాణ = మిక్కిలి నేర్పరి, కాగలించు = కౌగలించు, వడబడు = సంబంధపడు, కడగి = పురికొల్పు, అడియాలము = గుర్తులు, అంగము = శరీరము.

**భావము:** స్వామీ! ఇంతమందిలో బిగువు చూపడం న్యాయమా? అయినా యిప్పుడేమైనది? అపవాదులన్నీ నీపైననే ఉన్నవి సుమా!

నీవు పట్టుదల ఉన్నవాడవే కానీ కొంచెం మాట్లాడరాదా! జరిగిన ఇంత చాలదా? ఇంకా కోపమెందులకు? ప్రేమలన్నీ ఒకదానిపై ఒకటి పేర్చిన వరుసవలె పక్వమై యున్నవి. అంతటి పట్టుదల ఉన్నట్లైతే దానిని నీ శృంగారక్రీడయందు చూపిస్తే సరిపోతుంది కదా.

నీ రాజసమును కాదను వారు లేరు. నీకు సరిపోయినది. కానీ ఒక్క సారి తలనెత్తి పరికించండి. మొదటే నీకు నమస్కరించి యున్నాను కదా ఇంకా ఈ నిందలెందుకు వేస్తున్నారు? నీ చేతలన్నీ బట్టబయలై తేటతెల్లమైనవి. కానీ ఇక రారా స్వామీ! నీ పౌరుషమేమైనా ఉన్నట్లైతే దానిని పట్టుమంచముపై పరుండినప్పుడు చూపించండి స్వామీ!

నీవు సందేహములేని నేర్పరి కాడవే కానీ నన్ను కౌగిలిలోకి గైకొనుము. ఈవిధముగా సంబంధముతోనే దూరముండడమేల? వద్దు వద్దు స్వామీ! పూనుకొని ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను చేరితివి. నీ గుర్తులన్నీ పడకలో నా శరీరముపై వేసి నన్నాదింపజేయండి స్వామీ!



డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య

## 526

**అవతారిక:**అమ్మ స్వామీ! ఈ అరువుతెచ్చుకున్న ప్రేమలు, ఎవరో చెప్పినప్పుడు దరి చేరడము కాకుండా అసలైన ప్రేమ చూపించమని ప్రార్థిస్తున్నది.

### దేసాళం

ప. ఎరవులు సతమౌనా యెందాఁకనే ? కానీ
తరువాత నయ్యీఁగాక తరవెందాఁకనే ॥పల్లవి॥

1. తతిఁ దనయంతటనే తనకు లేనిమోహ-
మితరులు యెచ్చరించే దెందాఁకనే
పతిఁ బిలువకతొల్లే పైకొని వచ్చేరాక
సతుల నంపఁగ వచ్చె సట లెందాఁకనే ॥ఎరవులు॥

2. మక్కువతోఁ దనంతనే మాటాడించనిమాట
యెక్కించి మీ రాడించే దెందాఁకనే
ఇక్కువ గరఁగి తానే యెదురుకొని కాఁగిలి
చిక్కినేఁ గొసరఁగాను చేరే దెందాకనే ॥ఎరవులు॥

3. సంతతము నిదేపనై జంటవాయకుండేపొందు
ఇంత దలఁపించి కూడే దెందాఁకనే
చింతదీర మన్నించె శ్రీవేంకటేశుఁడు నన్ను
దొంతులాయఁ బులకలు దూరులెందాఁకానే ॥ఎరవులు॥

**అర్థములు:** ప. ఎరవులు = అరువు తెచ్చుకొన్నవి, సతము = శాశ్వతము, ఎందాకా = ఎప్పటివరకు, అయ్యీ గాక = అవును గాక, తరవు = నిర్బంధము.

1. తతి = సమయము, మోహము = ప్రేమ, ఎచ్చరించు = గుర్తుచేయు, పతి = మగడు, తొల్లే = ముందే, పైకొని = యత్నించి, సతులు = చెలులు, అంపంగ = పంపించగా, సటలు = కపటము.
2. మక్కువ = ఇష్టము, తనంతనే = తనకు తాను, ఎక్కించి = ఇతరులు చెప్పి, ఆడించు = చెప్పిచేయించు, ఎందాకా = ఎప్పటిదాకా, ఇక్కువ = జాడ, కరగి = ద్రవించి, ఎదురుకొని = ఎదురుగావెళ్ళి, కాగిలి చిక్కు = కౌగిలిలో బంధింపబడు, కొసరు = కోరు, చేరేదింఎందాకానే = వచ్చి కలిసేది ఎక్కడివరకే.
3. సతతము = ఎల్లవేళలా, జంటవాయకుండే పొందు = వీడకుండా జతకలిసే పొందు, తలపించి = ఆలోచనజేసి, చింత = బాధ, దొంతులు = పేర్చినవి, పులకలు = గగుర్పాటు, దూరులు = నిందలు.

**భావము:** ఈ అరువుతెచ్చుకున్న ప్రేమలు, ఎవరో చెప్పినప్పుడు దరి చేరడమూ ఇంకా ఎంతకాలము? కానీలే! తర్వాత అన్నీ జరుగుతాయి. ఈ నిర్బంధాలు బిడియాలు ఇంకా ఎంతకాలము?

సమయము గ్రహించి, తనంతట తనకు లేని ప్రేమలు చెలులు, ఇతరులు గుర్తుచేస్తే వచ్చేది ఎప్పటిదాకానే? భర్త పిలవకముందే రావాలి కానీ చెలికత్తెలను రాయబారం పంపితే రావడం ఇంకా ఎంతకాలము చెప్పవే!

ప్రేమగా దరిచేరి తనంతట తాను మాట్లాడాలి కానీ, చెలులు మాట్లాడు మాట్లాడు అని పురెక్కించి ప్రోత్సహిస్తే మాట్లాడే మాటలు ఇంకా ఎంత కాలమే? జాడ తెలిసి మనసు ద్రవించి పతికి ఎదురేగి తనకు తానుగా కౌగలించుకోవాలి కానీ, నేను వచ్చి కోరిన మీదట దరిచేరడమెందాకా చెప్పవే?

ఎల్లవేళలా ఇదేపనిగా జంటగూడి వీడకుండా ఉండే కలయికలు కావాలి కానీ, ఇంత ఆలోచించి ఆలోచించి చేరడము ఇంకా

ఎందాకానే? ఆ శ్రీవేంకటేశ్వరుడు మదిలోని బాధ తీరేవిధంగా మన్నించి దరిచేరగా, ప్రేమలు ఒకదనిపై మరొకటి పేర్చిన మాదిరి పులకలు మరీ మరీ వస్తున్నాయి కదా! ఇంకా ఈ నిందలు ఎప్పటివరకు చెప్పవే చెలీ!

## 527

**అవతారిక:** స్వామి అమ్మను దరిచేరకుండా ఏవో కాలక్షేపం కబుర్లు చెప్తున్నాడని భావించి తగదని చెప్తున్న సన్నివేశం.

### నాదరామక్రియ

ప. ఏమైనానయ్యీఁ గాక యెందాఁకనే
ఆమని పచ్చులమీఁది ఆసలెందాఁకనే ॥పల్లవి॥

1. తానే వచ్చీఁగాక తగిలి పిలువనేల
యేనుగఁ గఁబానఁ(గంబా?)దీసే దెందాఁకనే
కానీలేవే వానిచేఁత కాదుగూడదననోప
మానని గుణములకు మందు లెందాఁకనే ॥ఏమైనా॥

2. తీఱీ నలుకలు దానే దీమస మెడలనేల
యేఱులు వంకలు దిద్దే దెందాఁకనే
ఆఱడి సేయఁగనేల అంది పొంది పాయనోప
నూఱేటివెన్నలకు నును పెందాఁకనే ॥ఏమైనా॥

3. అండనే శ్రీవేంకటేశుఁడాదరించి నన్నుఁగూడె
యెండమావులదప్పు లెందాఁకనే
నిండుదొర వీనిమీఁద నేరమెంచ నే నోప
వండ వండనట్లయిన వాసు లెందాఁకానే ॥ఏమైనా॥

**అర్థములు:** ప. ఏమైనానయ్యీ = ఏది ఏమైనా అవనీ, ఎందాకనే = ఎప్పటిదాకానే, ఆమని = వసంతకాలము, పచ్చులు = పచ్చదనము, ఆస = కోరిక.

1. వచ్చీగాక = వస్తాడు గానీ, తగిలి = మోహింపజేసి, ఏనుగ = ఏనుగు, గబాన = త్వరగా, అననోప = అంటే భరించలేను, మానని = నయముకాని,వదలిపెట్టని, గుణములు = స్వభావములు.

2. తీరు = అణగు, అలకలు = కోపతాపములు, దీమసము = ధైర్యము, ఎడలనేల = పోగొట్టుకొననేల, ఏరులువంకలు = ప్రవహించీ జలపాతాలను, దిద్దు = సరిచేయు,మార్గము మార్చు, ఆరడి = నిందలు, పాయనోప = వీడుటనోర్చలేను, నునుపు = మెత్తదనము.

3. అండ = చెంత, ఆదరించి = గౌరవించి, ఎండమావుల దప్పు = ఎండమావులతో దాహము, నిండు దొర = ఘనమైన ప్రభువు, నేరమెంచ = తప్పులు ఎంచుటకు, వండ వండనట్లయిన = వండినా వండని విధమైన, వాసులు = తారతమ్యములు.

**భావము:** ఏమైనా అవనీ గాక! ఎప్పటిదాకా చెప్పు? ఎప్పుడో వసంతకాలము వస్తుంది పచ్చదనం వెల్లివిరిస్తుంది అనే కోరిక పెట్టుకోవడం ఎప్పటివరకు?

ఆ స్వామే స్వయంగా వచ్చి పిలువడమెందులకు? ఏనుగను త్వరపడి బయటకు దీసి కట్టివేయడం సాధ్యమయే పనేనా? కానీలే ఆ స్వామి చేత కాదు కూడదు అనిపించుకుంటే నేను ఓర్చుకోగలనా? మానని స్వభావాలకు మందులు వేస్తే నయమవుతుందా?

అలకలన్నీ తీరిపోయి తానే ధైర్యంగా ఉండడమెందులకు? ఈ ప్రవాహాలను ఆపి అడ్డుకట్టలు కట్టడం, సరిదిద్దడం ఎందాకానే? అల్లరి చేసి నిందల పాలు చేయ్యడం నాకు ఇష్టం లేదు. నేను సహించలేను. వెన్నకు ఇంకా నునుపు రావడం కోసం నూరడం అనే ప్రక్రియ ఎలా ఉంటుందో చెప్పవే?

చెంతకు చేరి శ్రీవేంకటేశ్వరుడు నన్నాదరించి కూడినాడు. ఈ ఎండమావుల్లో దాహం తీర్చుకోవడమనేది ఎందాకా? ఆ స్వామి ఘనమైన నా ప్రభువు, అలాంటి వాని మీద నేను నేరములు మోపి అనవసర కార్యాలకు పూనుకోలేను. అన్నం వండినా వండనట్లే అన్న చందాన ఈ తారతమ్యాలు ఎప్పటిదాకానే? అర్థం కాకుండా ఉన్నది సుమా!

## 528

**అవతారిక:** అమ్మను వదలి స్వామి ఎక్కడకో వెళ్ళి రాచకార్యాలు చేస్తున్నాడని భావించి ప్రశ్నిస్తున్న దృశ్యం.

## శంకరాభరణం

ప. ఇందాఁకా నెందు వోతివి యీపాటివాఁడవు
సందడిఁ బెండ్లి నేఁడు చక్కఁబెట్టరాదుగా ॥పల్లవి॥

1. నాటఁగ దొరవు నాతో నవ్వితివంటా నవ్వు
బూటకాన నే గాదెఁ బోయరాదుగా
గీఁటుచు వలపు చల్లి గిరిపేవు కన్ను లిట్టె
మూటగట్టి అవి నే మూలఁబెట్టరాదుగా ॥ఇందాఁకా॥

2. సాగిన సబలలోన సరసమాడితివంటా
చేగలనది వాఁటము నేయరాదుగా
తీగెల మాటలాడి తేనెలు పూసితివంటా
వేగిరించి తమకము వెళ్లఁబోయరాదుగా ॥ఇందాఁకా॥

3. కరఁగి నీ విట్టె నన్నుఁ గాఁగిలించితివంటా
మరునమ్ము వాఁడిచెడ మందు లేదుగా
ఇరవై శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
వొరసి నిన్నిట్లాడకుండరాదుగా ॥ఇందాఁకా॥

**అర్థములు:** ప. ఇందాకా = ఇప్పటిదాకా, ఎందుపోతివి = ఎక్కడకు వెళ్ళినావుం, ఈపాటి = ఈ మాదిరి, సందడి పెండ్లి = అతిశయించిన వ్యవహారము, చక్కబెట్టు = సరిచేయు.

1. నాటు = పాదుకొను, దొర = ప్రభువు, బూటకము = మాయ, గీటుచు = కన్ను గొట్టు, పోయరాదు = విడువరాదు, చల్లి = వ్యాపింపజేసి, గిరుపు = బెరుకుచూపు, మూలబెట్టు = ప్రక్కన బెట్టు.
2. సాగు = నెరపు, సబ = కొలువు, చేగలనది = చెయ్యగలిగినది, వాటము = అనుకూలము, సేయరాదు = చెయ్యకూడదు, తీగల మాటలు = వంకర మాటలు, వేగరించు = సమాచారము తెలిపి, తమకము = మోహము, వెళ్ళబోయు = తెలియజేయు.
3. కాగలించు = కౌగలించు, మరునమ్ము = మన్మథబాణము, వాడి చెడు = పదను తగ్గు, ఇరవు = స్థానము, ఒరయు = పరీక్షించు, నన్నుంఇట్లుంఆడకుండ = నాన్నీవిధముగా మాట్లాడకుండ.

**భావము:** ఇప్పటిదాకా ఎక్కడికి వెళ్ళినావు, ఈవిధమైన స్వభావము గలవడవు. వివాహపు సందడిలో చక్కబెట్టడం సబబు కాదు గదా!

స్వామీ! ఎంతో పాదుకొన్నట్టి ప్రభువువు. మాయా మర్మాలతో నేను ఒక్కచోట జేర్చడం చేయకూడదు కదా! నాతో కన్ను గీటి మరలా బెరుకు చూపులు చూస్తూ ఉండిపోతావు. ఈ వ్యవహారాలన్నిటినీ నేను మూటగట్టి కడగా బెట్టకూడదు కదా!

కొలువుకూటములు ఒకవైపు జరుగుచుండగా, నాతో సరసాలాడుతుంటావు. అక్కడ చేయగలిగినవన్నీ చేయడం ధర్మమా? వంకర మాటలు మాట్లాడుతూ తేనెలు పూస్తూ ఉంటావు. వేగులద్వారా సమాచారం తెలిపి నేను నా మోహాన్ని ప్రకటించడం

ధర్మమా?

నీవు ఈవిధముగా ద్రవించి నన్ను కౌగలించితివి. మన్మథుని బాణము పదును తగ్గితే దానికి వాడగల ఔషధముంటుందా? ఓ శ్రీవేంకటేశ్వరా! ఇక్క ఈ స్థానములో నన్ను చేరి యేలుకొన్నావు. నిన్నీవిధముగా పరీక్షించి, విచారించి నేను ఈ విధముగా మాట్లాడడం పనికిరాదు కదా!

## 529

**అవతారిక:** అమ్మ స్వామిని ఇష్టములేని ప్రేమలు నటించడం అవసరము లేదని, సత్యం చెప్పమని అడిగే సన్నివేశం.

### ముఖారి

ప. నిజమాడరా నాతో నీకు నీవే
బజనచెడ్డవలపు పనిలేదురా ॥పల్లవి॥

1. అరయ నామీఁదితలఁ పంతనీ కున్నదా
వరుస వంతుకు నేనేవచ్చేఁగాక
సరసమాడేయందు చవిగద్దా నామీఁద
వొరసిన నాచేతివొత్తులుగాక ॥నిజమాడరా॥

2. వసమా నాకు నీవు వద్ద నుండి వూరకైనా
అసముదించనిమాట లాడేఁగాక
సుసరమా నీపొందు సుదతు లిందరిలోన
కసుగాటు నీవలపు కైకొనేఁగాక ॥నిజమాడరా॥

3. ఆరీతి నాపై తమక మంత నీకుఁ గలదా
గోరపెట్టి నిన్ను నేనే కూడేఁగాక
నేరిచి యానవెట్టేవు నీవు నాపై మోహమంటా
యేరా శ్రీ వేంకటేశ యియ్యకొంటిలేరా ॥నిజమాడరా॥

**అర్థములు:** ప. నిజమాడరా = సత్యము చెప్పండి, బజనచెడ్డ వలపు = ఇష్టములేని ప్రేమ, పనిలేదు = అవసరములేదు.

1. అరయ = తరచి చూడగా, తలపు = ఆలోచన, నీకున్నదా = నీకు గలదా?, వరుసవంతుకు = ప్రతిదానికి పోటీకి, వచ్చేగాక = వస్తాననుకోండి, చవి = ఇష్టము, ఒరయు = వత్తిడి కలిగించు, చేతివత్తులు = చేతితో పాదములనొత్తుట.
2. వసము = స్వాధీనము, అసముదించని = విజృంభించని, సుసరము = సులభము, సుదతులు = స్త్రీలు, కసుగాటు = అనుభవములేని వారి దంతక్షతము, కైకొను = పూనుకొను.
3. ఆరీతి = ఆవిధముగా, తమకము = మోహము, గోరబెట్టు = నఖక్షతము, కూడు = కలియు, నేరిచి = తెలుసుకొను, ఆన = ఒట్టు, మోహము = ప్రేమ, ఇయ్యకొను = సమ్మతించు.

**భావము:** ఓ స్వామీ! సత్యము మాట్లాడండి. నీకు నీవే ఇలా ఇష్టములేని ప్రేమలు నటించడం అవసరము లేదు.

స్వామీ! అసలు విచారించి తరచి తరచి చూచినట్లైతే నామీద నీకు ఆలోచన ప్రేమలు ఉన్నవా? ఒకవేళ నేను వరుసకు వంతుకు వచ్చేనని అనుకోండి, మీకు నాతో సరసాలాడేందుకు ఇష్టమున్నదా? వత్తిడి కలిగించి మీపాదములు వత్తిన చేతి నొప్పులే నాకు మిగిలేను గాక!

నాకు సాధ్యమా? నీవద్దనుండి ఊరక విజృంభణములేని మాటలే వచ్చేను గాక! ఈ స్త్రీలందరిలోను నీ పొందు అంత సులభమా? లేలేత కసుగాటువంటి అనుభవములేని వారి దంతక్షతములకే పూనుకొనేరు గాక.

ఆవిధమైన మోహము నాపై నీకు అంత గలదా స్వామీ! గోటితో నఖక్షతములు వేస్తూ నిన్ను నేను కూడే గాక! నీవు అన్నీ

తెలిసి నాపై మోహము చూపుతూ ఏమీ తెలియదని ఒట్లు పెడుతూ ఉంటావు. ఓ శ్రీవేంకటేశ్వరా! నేను అన్నిటికి సమ్మతించితిని స్వామీ! చిత్తగించండి.

## 530

**అవతారిక:** స్వామికి దగ్గరైన ఒక వనిత చేస్తున్న వలపు వ్యవహారాలను పసిగట్టిన అమ్మ మాట్లాడుతున్నది.

### సాళంగం

ప. ఆయనాయ నూరకుండు మంతే చాలు
చాయలు సన్నలు నైతేఁ జప్పనయ్యీ నిఁకను ॥పల్లవి॥

1. కన్నులు దెరచి చెలి గక్కున రెప్పలు వంచె
వెన్నెలో అది నీకు వేసఁగో కాని
మున్నిటి మీ మోహముల ముచ్చటల కొలఁదింతే
పన్ని నేము చెప్పఁబోతే పచ్చిదోఁచు నిఁకను ॥ఆయనాయ॥

2. పెదవులు గదలించి పేరుకొన కూరకుండె-
నది నీకుఁ జిగురో చేగాయనో కాని
యెదుట మీలోలోనే యెనసినకొలఁ దింతే
పొదిగి యేమన్నాను పొరయెత్తీ నిఁకను ॥ఆయనాయ॥

3. చేరి నీయెదుట నుండి చిఱునవ్వు నవ్వె నింతె
పేరడి నీ కవి పాలో పెరుగోకాని
కూరిమి శ్రీవేంకటేశ కూడితి రిద్దరు నిట్టె
మేరతో నెవ్వ రేమన్నా మితిమీరీ నిఁకను ॥ఆయనాయ॥

**అర్థములు:** ప. ఆయనాయ = అయినదేదో అయినది, ఊరకుండు = మాట్లాడకుండు, చాయలు = శోభలు, సన్నలు = సైగలు, చప్పనయ్యీ = చప్పనగు.

1. గక్కున = వెంటనే, వంచె = మూసుకొను, వేసగో = వేసవి కాలమో, మున్నిటి = ముందరి, మోహము = ప్రేమ, కొలది = పరిమితి, పన్ని = పథకమువేసి, నేము = మేము, పచ్చిదోచు = పక్వముకానిదగు.
2. పేరుకొను = పిలుచు, చిగురు = లేత, చేగ = సారవంతము,పక్వము, ఎనయు = పొందు, పొదిగి = క్రమ్ము, పొరయెత్తు = కపటమునెత్తి చూపు.
3. చేరి = విచ్చేసి, పేరడి = ఆధిక్యము, కూరిమి = స్నేహము, మేర = హద్దు,ఎల్ల, మితిమీరు = అతిక్రమించు.

**భావము:** అయినదేదో అయినది. మీరు ఊరకున్నట్లైతే అంతే చాలు. ఇంక మీదట శోభలు సైగలు ఇవన్నీ చప్పనౌతాయి కదా!

ఆ చెలి కన్నులు తెరచి చూసి మరలా వెంటనే రెప్పలు మూసుకున్నది. అది నీకు వెన్నెలో లేక వేసవో కానీ, ముందటి మీ ప్రేమలు ముచ్చట కొద్దీ ఇంతే కదా! ఇంక మీదట, ఏదైనా పూనుకొని మేము చెప్పడానికి ప్రయత్నిస్తే మీకు అది పక్వముగాని పండువలె పచ్చి దోస్తుంది కదా!

ఆమె పెదవులు కదిలించి కూడా పేరుబెట్టి పిలవకుండా ఊరుకొన్నది. అది నీకు చిగురో లేక సారవంతమై పక్వమైన ఫలమో కానీ, ఎదురుగా మీలోని పొందులింతే సుమా! ఇంక మేము క్రమ్ముకొని ఏమన్నా అనాలంటే కపటముతో మాట్లాడుతున్నట్టు భావిస్తారు.

నీ ఎదుట చేరి చిరునవ్వులు నవ్వెను ఇంతే! ఆధిక్యతను చూపే నీకవి పాలో పెరుగో కానీ, ఓ శ్రీవేంకటేశ్వరా! స్నేహముతో ఇట్టే యిద్దరూ కలిసితిరి, హద్దుమీరి ఎవ్వరేమన్నా అతిక్రమించినట్లగును కదా!

## 531

**అవతారిక:** అమ్మ చేసే శృంగార పనులన్నీ స్వామికి షోడశోపచారములు గాను, ఇతర సేవలగాను వర్ణిస్తున్నాడు అన్నమయ్య.

### సామంతం

ప. చెలి పలుసోఁకులే నీ సింగారము
అలరె నీకిన్నియును అవధారు నేఁడు ॥పల్లవి॥

1. అంగన నిన్నుఁగూడఁగ నటు నీపై వడిసేటి-
అంగపుఁ జెమట నీకు నభిషేకము
వుంగిటిఁ గొప్పువిరులు వుపరిసురతవేళ
సంగతి రాలేటిచల్లు వేదపూజ ॥చెలి॥

2. నించిన కాఁగిటిలోని నెలతఁ నిట్టూర్పుగాలి
అంచులు మోప విసరేయాలవట్టాలు
అంచెల మర్మముసోఁక నాడుకొనేమాటలే
కాంచనపు గిన్నెలతో కప్పురబాగాలు ॥చెలి॥

3. వనిత విడెముతోడ వంచినమోవితేనె
ననుపై నీకు మహనైవేద్యము
యెనసి శ్రీవేంకటేశ యిన్నియుఁ గలిగె నీకు
మొనగోరిమాచేతి మొక్కు లిందవయ్యా ॥చెలి॥

**అర్థములు:** ప. పలుకులు = మాటలు, పలుసోకులు = రకరకములైన అలంకారములు, సింగారము = అందమైన శృంగారము, అలరు = వికసించు, అవధారు = చిత్తగించండి.

1. వడియు = కారు, ఉంగిటి = కపటము, కొప్పు విరులు = సిగలోని పువ్వులు, ఉపరిసురత వేళ = పైపైన నైపుణ్యముతో నున్న సమయము, సంగతి = సాంగత్యము, రాలేటి = రాలిపడుతున్న, వేదపూజ = వేదమంత్రాలతో కూడిన పూజలు.
2. కాగిట = కౌగిట, నెలత = స్త్రీ, విసరే ఆలవట్టము = విసిరే వింజామరలు, మర్మము = జీవస్థానము, ఆడుకొనే = మాట్లాడుకునే, కాంచనము = బంగారము, కప్పురము = కర్పూరము, బాగాలు = పలుకులు.
3. వనిత = మహిళ, విడెము = తాంబూలము, మోవితేనె = అధరామృతము, ననుపు = అనురాగము, మహానైవేద్యము = దైవానికి నివేదింపఉదగిన వస్తువు, ఎనసి = పొందు, మొనగోరు = వేలి చివరి గోళ్ళు, మొక్కులు = నమస్కారములు, ఇందవయ్యా = ఇదుగో స్వామీ!

**భావము:** స్వామీ! అమ్మ అలమేలుమంగమ్మ మాట్లాడే ప్రీతికరమైన మాటలే నీకు అందమైన అలంకారాలుగా భాసిల్లుతున్నాయి. ఇవన్నీ వికసించి నీకు చిత్తగిస్తున్నది. సావధానముగా విని అమ్మను కరుణించండి.

ఆ అమ్మ నిన్ను చేరిన పిమ్మట శరీరంపై ధారలుగా కురిసే చెమటలే నీకు అభిషేకములై శోభిల్లుతున్నవి. ఆమె కొప్పులోని పుష్పాలన్నీ పైపైన నైపుణ్యముతో నున్న సమయములో రాలిపడేవి నీకు వేదపూజగా నిలుస్తున్నది.

అమ్మ నీ కౌగిటిలో చేరి విడిచే వేడి వేడి నిట్టూర్పుల గాలి నీకు బాగా తగిలి విసురుచున్న వింజామరలైనవి. మీ యిద్దరి జీవస్థానములు తగిలేట్టు మాట్లాడుకునే శృంగారపు మాటలే బంగారపు గిన్నెలో పోసి ఉంచిన పచ్చ కర్పూరపు తునకలుగా నున్నవి.

ఆ అమ్మ తాంబూలమిచ్చి వంచిన ఆమె ముఖము అధరామృతము నీకు అనురాగముతో కూడిన మహానైవేద్యమైనది. ఓ శ్రీవేంకటేశ్వరా! ఆ యమ నీ పొందు కోరగా అన్నియును నీకు ఈవిధముగా ప్రాప్తించినవి. మా చేతిచివరిగోళ్ళ నమస్కారములు నీ ఇవిగో అందుకోండి స్వామీ!

డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య

## 532

అవతారిక: తనను లక్ష్యపెట్టడంలేదని గ్రహించిన అమ్మ, తలుచుకుంటే స్వామిని తనవెంట తిప్పుకోవడం అంత కష్టం కాదని చెప్తున్నది.

### రామక్రియ

ప. ఏరా నీవప్పుడే నన్ను నెంతగాఁ జూచితివి
మేరమీరి నీచేతనే మెప్పించుకో నోపనా ॥పల్లవి॥

1. ఇట్టె నామోహము నీవే యెఱిఁగే వనుంటిఁ గాక
నెట్టన నిన్ను రప్పించనేరనా నేను
చిట్టకానకకు నన్నింత సేయవని వుంటిఁగాక
గట్టిగా నా చేయి మీఁదుగా నడవ (ప?) నేరనా ॥ఏరా॥

2. తెమలించి నీవే మాట తీసేవని వుంటిఁగాక
తమిరేఁచి నిన్ను నాఁగ తడవా నాకు
సముఁడవై నవ్వే వింతే సటలని వుంటిఁగాక
రమణులతో నవ్వితే రచ్చవేయలేనా ॥ఏరా॥

3. ఆసాసల నీమాటకు నడ్డమాడనై తిఁ గాక
వాసి దెచ్చుకుని నిన్ను వంచుకోలేనా
బాసిచ్చి శ్రీ వేంకటేశ పైకొని కూడితిగాక
వేసరినదాఁకా నిన్ను వెంటఁ దిప్పకుందునా ॥ఏరా॥

**అర్థములు:** ప. ఎంతగా = ఎంత అన్యాయముగా, మేరమీరు = అతిక్రమించు, ఓపనా = ఓర్చుకోలేనా?

1. మోహము = ప్రేమ, ఎరిగేంవనింఉంటి = తెలిసికొని ఉన్నావని ఉన్నాను, నెట్టన = అనివార్యముగ, రప్పించనేరనా = రప్పించుకోవడం తెలియని దాననా, చిట్టకాన = శృంగార చేష్ట, ఉంటిగాక = ఉన్నాను గాక, చేయిమీద = చెప్పిన మాట మీద.
2. తెమలించు = కదిలించు, తమి = కుతూహలము, తడవు = వెదకు, సముడు = సమానుడు, సటలు = బాధలు, రమణులు = అందమైన స్త్రీలు, రచ్చ = అల్లరి.
3. అసాసాలు = ప్రోగుచేసిన, అడ్డమైతి = అడ్డుగా వచ్చు, వాసి = ఆధిక్యత, వంచుకొను = వశముచేసుకొను, బాసిచ్చి = మాట ఇచ్చి, పైకొను = యత్నించు, కూడితి = కలసితి, వేసరి = బాధపడు, వెంటదిప్పు = చెప్పినట్లు చేసేవిధముగా చేయు.

**భావము:** ఏరా! నా ప్రియుడా! నీవప్పుడే ఇంత అన్యాయముగా మాట్లాడుతున్నావు. నేను హద్దులనతిక్రమించి నీ చేతనే ప్రశంసలు పొందలేననుకున్నావా?

నీవు నా ప్రేమను బాగా అర్థం చేసుకున్నావని అనుకొన్నాను కానీ, ఇదేమిటి? నిన్ను నేను తప్పించుకోలేని విధముగా నా వద్దకు రప్పించుకోవడం తెలియదనుకుంటున్నావా? ఏదో శృంగార చేష్టలతో నన్నితగా చూడవనుకున్నాను కానీ, నేను గట్టిగా తలుచుకుంటే నా చేయిమీద చేయివేసి చెప్పినమాట మీరకుండా చేయడం చేతగాని దానినా?

ఏదో హృదయం కదిలించి నా మాట నీవే నా మాట తీసివేయవని ఉన్నాను కానీ, కుతూహలంతో నిన్ను ఆపడం తెలియని దాననా? నాతో సమానముగా నవ్వుతున్నావని బాధలెందుకని ఇలా ఉన్నాను కానీ, నీవు కొలువులోని అన్య స్త్రీలతో కూడి నవ్వితే నేను నినూ అల్లరిపాలు చేయలేని దాననా?

కూడబెట్టుకొన్న నీ మాటలన్నింటికి అడ్డం చెప్తున్నానని అనుకోవచ్చు కాని, ఆధిక్యతతో నిన్ను వశం చేసుకోవడం ఎరుగని దాననా? ఓ శ్రీవేంకటేశ్వరా! నీకు మాట ఇచ్చి కలిసితిని గానీ, నువ్వు బాధపడేదాకా నిన్ను నా వెంట వెంట తిప్పుకోవడం నాకు తెలియదనుకొంటివా?

## 533

**అవతారిక:** శ్రీనివాసుడే ద్వాపరయుగంలోని శ్రీకృష్ణుడని, నరకాసురునికి తండ్రియని, శిశుపాలుని మరిది యని, దుష్ట శిక్షణ, శిష్ట రక్షణకై జన్మించాడని, అనేక ఆధ్యాత్మిక విషయాలను ప్రభోదించే కీర్తన.

### శుద్ధవసంతం

ప. ఇన్నేసి వావులతో నిందరిపాలఁ గలిగె
పిన్నపెద్దై మేలుసేసీ పెంచరే యీబాలుని ॥పల్లవి॥

1. నరకాసురునితండ్రి నడురేయి జనియించె
అరుదుగఁ గంసుని కల్లుఁడాయను
నిరతి శిశుపాలుని నెయ్యపు మఱఁది పుట్టె
పెరుగఁగా మేలుసేసీ పెంచరే యీబాలుని ॥ఇన్నేసి॥

2. వొద్దిక పాండవులకు నుదయించె మేనబావ
బుద్దితో వసుదేవునిపుత్రుఁడాయను
వుద్దండపు గొల్లెతల కొగి మగఁడు గలిగె
పెద్దవాఁడై మేలు సేసీ పెంచరే యీబాలుని ॥ఇన్నేసి॥

3. నేరనిదుష్టులకెల్లా నిండుచిచ్చరపిడుగు
నేరిచినశిష్టులకు నిధానము
యీరీతి శ్రీ వేంకటేశుఁ డితడె బాలకృష్ణుఁడు
పేరడిగా మేలు సేసీ పెంచరే యీబాలుని ॥ఇన్నేసి॥

**అర్థములు:** ప. ఇన్నేసి = ఇంత ఎక్కువైన, వావి = బంధుత్వము, పిన్న పెద్దై = చిన్నవారు పెద్దవారూ అందరూ కలసి.

1. నడురేయి = అర్ధరాత్రి, జనియించె = పుట్టెను, నిరతి = మిక్కిలి ఆసక్తి, నెయ్యపు = స్నేహితుడు.
2. ఉదయించె = పుట్టె, ఉద్దండము = ఎక్కువైన, గొల్లెతలు = గొల్లభామలు, ఒగి = క్రమముగా.
3. నేరని = మంచిచెడ్డలు తెలియని, చిచ్చరపిడుగు = అగ్నిని కక్కు పిడుగు, నేరిచిన = తెలుసుకొన్న, శిష్టులు = సద్బుద్ధిగలవారు, నిధానము = నిక్షేపము,పాతర, పేరడి = ఆధిక్యత.

**భావము:** ఇంతమందితో బంధుత్వము గల్గినవాడు పిన్నలు పెద్దలు అందరు శుభమని పలికి ఈతనికి పెంచండి.

ఈతడెవరో కాదు నరకాసురుని తండ్రి సుమా! అర్ధరాత్రి జన్మించాడు. కంసునికి మేనల్లుడయ్యాడు. శిశుపాలునికి స్నేహితుడైన మరిదిగా కూడా ఉన్నాడు. బాగా వృద్ధిలోకి వచ్చే విధంగా పెంచండి సుమా!

పాండవులందరికి మేనబావగా ఈతడు జన్మించాడు. వసుదేవునికి పుత్రుడైనాడు. అతిశయించి చెలరేగే గొల్లెతలకు క్రమముగా మగడై కూర్చున్నాడు. ఈతడు పెద్దవాడైతే మనకందరికి శుభములను చేకూరుస్తాడు సుమా! శ్రద్ధగా ఈ బాలుని పెంచి పెద్ద చేయండి.

మంచిచెడ్డలు గ్రహించని దుష్టులకు అగ్నిని కక్కే పిడుగై చక్రాయుధంతో మట్టి గరిపిస్తాడు. ఆయన మహత్తు తెలిసిన మంచి వారికి సాధువులకు, గోబ్రాహ్మణులకు నిధి నిక్షేపమై శుభాలనందిస్తాడు. ఈ రీతిగా ఈ బాలకృష్ణుడెవరో కాదు శ్రీవేంకటేశ్వరుడే సుమా! ఆధిక్యతతో ఈ బాలుని పెంచి పెద్ద చేయండి.



డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య

**విశేషాంశములు:**

1. ఇది ఆధ్యాత్మిక కీర్తనలలో నుండదగినదని శ్రీమాన్ గౌరిపెద్ది రామసుబ్బ శర్మగారి అభిప్రాయము.
2. నరకాసురుడు వరాహస్వామి, దేవేరి భూదేవికి కలిగిన సంతానము. కామాఖ్యలోని అమ్మవారిని తల్లిలాగ భావిస్తు చక్కగా పూజచేసెవాడు. తన రాజ్యములోని ప్రజలందరిని ఎంతో చక్కగ పరిపాలించేవాడు. ఈ విధముగా కొన్ని యుగాలు గడిసిపోయాయి. తర్వాత ద్వాపరయుగములో, అతనికి శోణితపురరాజైన బాణాసురునితో స్నేహము ఎర్పడుతుంది. బాణాసురుడు స్త్రీలను తల్లిలాగ భావించడమును నిరసించేవాడు. అతని దృష్టిలో స్త్రీ ఒక భోగవస్తువు. అతని ప్రభావము చేత నరకాసురుడు మెల్లగా అమ్మవారి పూజ ఆపివేసినాడు. దేవపుత్రుడే అయినా, బాణాసురిని ఫలింతంగా నరకాసురుడిలో రాక్షసత్వం నిండిపోతుంది.
3. కంసుడు ఉగ్రసేనుడు అనే యాదవ రాజుకు కుమారుడు. మధురాపురమునకు రాజు. ఇతడు పూర్వజన్మమునందు కాలనేమి అను రాక్షసుడు. కనుక ఈ జన్మమందును ఆవాసన తప్పక దేవతలకు విరోధియై అనేక రాక్షసులను తోడుచేసికొని సాధువులను బాధించేవాడు. తన చెల్లెలు అగు దేవకీదేవిని వసుదేవునకు ఇచ్చి వివాహముచేసి, వారికి కలిగిన శ్రీకృష్ణునికి మేనమామ అయ్యాడు. శ్రీకృష్ణుడు సత్యభామ సహాయంతో నరకాసురుని వధించిన అనంతరం జరుపుకునే దీపావళి కథ మనకు తెలిసినదే!
4. శిశుపాలుడు దమఘోషుడు, సాత్వతిదంపతులకు జన్మించాడు. పుట్టుకతోనే నాలుగు భుజాలతో, నొసటి మీద కంటితో, గార్ధభ స్వరంతో పుట్టాడు. తల్లితండ్రులు ఆ బాలుని చూసి కలత చెందారు. అప్పుడు అశరీరవాణి " ఈ బాలుడిని ఎవరు ఎత్తుకున్నప్పుడు మామూలు రూపం పొందుతాడో అతనిచేతిలోనే ఇతడు హతుడు కాగలడు " అని పలికింది. ఒకరోజు బలరామ కృష్ణులు ఆ బాలుని చూడటానికి వచ్చినపుడు, శ్రీకృష్ణుడు ఎత్తుకోగానే ఆ బాలునికి మామూలు రూపం వచ్చింది. అప్పుడు శ్రీకృష్ణుని చేతిలో అతని మరణం తథ్యమని భావించిన సాత్వతి శ్రీకృష్ణుని చూసి "కృష్ణా! నీ మరిది అయిన శిశు పాలుని రక్షించు" అని కోరింది. కృష్ణుడు నూరు తప్పులు చేసేవరకూ సహిస్తాను అవి పూర్తికాగానే నా చేతిలో హతుతుడౌతాడు " అని చెప్పాడు శ్రీకృష్ణుడు. ఆవిధంగా శిశుపాలుడు మరిది వరస అయ్యాడు. పాండవుల రాజసూయాగ పరిసమాప్తి సమయములో శ్రీకృష్ణుని చేతిలో మరణం పొందాడు.

## 534

**అవతారిక:** శ్రీ కృష్ణుడు బాల్యంలో ఉట్లుకొట్టిన విశేషాలు వివరిస్తున్నాడు అన్నమయ్య.

### లలిత

ప. గుటిగా శ్రీ కృష్ణుఁడు మనకు దొర దూరువాఁడు
వెఱవక చేతికొద్ది వెఱఁజరో మీరు ॥పల్లవి॥

1. పెట్టిరి గొల్లెతలెల్ల పెరుగు నెయ్యి వుట్ల
కొట్టరో కొట్టరో మీరు కోలలవారు
తిట్టేరు వారిల్లదివో తెగి దగ్గరకతొల్లె
పట్టరో వారలు మీరు పైఁగారేపాలు ॥గుటిగా॥

2. యెంచి పెట్టిరి దొంతుల నేడలేనిచక్కిలాలు
దించరో కుండలతోనే దిగువకును
పెంచులయినదాఁకా పెనఁగేరు మనతోడ
తుంచి నోరవేసుకొని తొలఁగరో మీరు ॥గుటిగా॥

3. తక్కక యదుకులెల్లా దాఁచిరి తమసొమ్మంటా
చిక్కెఁ జిక్కెఁ దీసుకోరో సేన వున్నవి

యెక్కెను శ్రీ వేంకటాద్రి ఇదివో మనకృష్ణుఁడు
చక్కనాయఁ బనులెల్లాఁ జాలించి రారో ॥గుఱిగా॥

**అర్థములు:** ప. గురి = లక్ష్యము, దొర = ప్రభువు, దూరువాడు = చొచ్చు,ప్రవేశించు, వెరచు = భయపడు, వెరజు = కొట్టు.

1. గొల్లెతలు = గొల్లభామలు, ఉట్టి = పిడతలు లోనగునవి యుంచుటకై దారములతోనల్లి వ్రేలఉగట్టెడి యంత్ర విశేషము, కోలలు = కర్ర, తొల్లె = పూర్వము, పట్టరో = పట్టిబంధించు.
2. ఎంచి = లెక్కించి, దొంతులు = వరుస, చక్కిలాలు = బక్ష్య విశేషము, దిగువ = క్రింద, పెంచు = అధికము, పెనగు = చుట్టుకొను, తుంచి = ముక్కలు చేసి, నోర = నోటిలో, తొలగు = వెళ్ళిపోవు.
3. తక్కక = తగ్గక, అదుకులు = అటుకులు, దాచిరి = ప్రక్కన బెట్టు, సొమ్ము = ఆస్తి, చిక్కె = దొరికెను, సేన = ఎక్కువ, చక్కనాయ = సుందరమయ్యెను, చాలించి = ముగించి.

**భావము:** ఈ శ్రీకృష్ణుడే మన లక్ష్యము. ఈయనే మన ప్రభువు. లోనకు ప్రవేశించి అల్లరి చేసేవాడు. ఏమాత్రం భయపడకుండా, వెనుదీయకుండా కొట్టండి.

గొల్లభామలు పెరుగు నెయ్యి మొదలైనవి ఉట్ల మీద పెట్టారు. ఎక్కడ వచ్చి దొంగిలిస్తాడో ఈ బాల కృష్ణుడు. మీరు కర్రల సాయంతో కొట్టండి. వారంతా ఇది భరించలేక మునుపు నానా తిట్లు తిట్టి యున్నారు. మీరు ఆ పాలుగారే చిన్ని కృష్ణుణ్ణి పట్టుకోండి.

పైన ఉట్లలో చక్కిలాలు మొదలైన తినుబండారాలన్నీ పెట్టి యున్నారు. ఆ కుండలను క్రిందకు దించండి. ఎక్కువగా ఉన్నాయంటే మనను చుట్టుకుని పోట్లాటలు పెట్టుకుంటారు. వాటిని తుంచి నోటిలో వేసుకొని వెళ్ళిపోండి.

తగ్గక అటుకులన్నీ ఏదో ఆస్తి లాగా దాచుకున్నారు. ఇప్పుడు మన చేతికి దొరికాయి. చాలా అటుకులే ఉన్నాయి. అందరూ తీసుకోండి. ఇదుగో ఆ కృష్ణుడే వేంకటాద్రి గిరి ఎక్కి శ్రీవేంకటేశ్వరుడయ్యాడు. పనులన్నీ పూర్తిగా చక్కబెట్టాడు. ఇక చాలించి రండి వెళ్ళిపోదాము.

**విశేషాంశములు:** ఇది ఆధ్యాత్మిక కీర్తనలలో నుండదగినదని శ్రీమాన్ గౌరిపెద్ది రామసుబ్బ శర్మగారి అభిప్రాయము.

## 535

**అవతారిక:** అన్యమనస్కంగా ఉంటూ సదా స్వామి ధ్యాసలో జరిగేవేవీ గమనించకుండా ఉన్న ఒక చెలిని తోడి స్త్రీలు పరిహాసమాడుతూ, కారణమేమిటో చెప్పమని ప్రశ్నిస్తున్నారు.

### శంకరాభరణం

ప. ఎవ్వనికి వలతువే చెలియా
యెవ్వలఁ బిలిచిన నెఱఁగవే చెలియా ॥పల్లవి॥

1. చక్కఁగఁ బయ్యదజారిన దెఱఁగవు
యెక్కడ చూచేవే యిటు చెలియా
చెక్కులవెంటఁ జెమటలు వడియఁగ
ముక్కున నూర్పులు ముంచేవే చెలియా ॥ఎవ్వనికి॥

2. జాఱినకొప్పునుఁ జక్కఁగఁ బెట్టవు
మీఱేవు పరాకున నేమే చెలియ
మాఱుమాటలును మాతో నాడవు
తీఱక లోవెలిఁ దిరిగేవే చెలియా ॥ఎవ్వనికి॥

3. వెలయ హారములు వెనకకు వేసితి
తలఁ పెందున్నదె తగఁ జెలియ

కలసెను శ్రీ వేంకటపతి నఁను నిటు

కులికి యితనిఁ బేర్కోనవే చెలియా ॥ఎవ్వనికి॥

**అర్థములు:**ప. ఎవ్వనికి = ఎవరిని, వలతువు = ప్రేమిస్తావు, ఎవ్వల = ఎక్కడ, ఎరుగవే = తెలుసుకొనవే.

1. పయ్యద = పవిటకొంగు, ఎరుగవు = తెలుసుకోలేవు, చెక్కులు = చెక్కిళ్ళు, వడియు = కారు, ఊర్పులు = నిట్టూర్పులు, ముంచు = అధికమైనవి.
2. జారిన కొప్పు = వీడిన సిగ కొప్పు, మీరు = అతిక్రమించు, పరాకు = పరధ్యానము, మారుమాటలు = మాటకు మాట, తీరక = సమయము లభించక, లోవెలి = లోపలభాగములో.
3. వెలయు = ప్రకాశించు, హారములు = మెడలోని దండలు, తలపు = ఆలోచన, ఎందున్నది = ఎక్కడున్నది, కులికి = నర్తించి, పేర్కొను = పేరుపెట్టి పిలుచుటకు రూపాంతరము.

భావము: ఎవరిని ప్రేమించావే చెలీ చెప్పరాదా? ఎవరు ఎక్కడనుండి పిలిచినా ఉలకవు పలకవు. ఇదేమిటే?

చెలీ! నీ పైటకొంగు జారిపోయినది గమనించడంలేదు. ఎక్కడెక్కడో తత్తర చూపులు చూస్తున్నావు. నీ చెక్కిళ్ళనుండి చెమట ధారలుగా కారుచున్నది. ముక్కునుండి వేడి వేడి నిట్టూర్పులు వస్తున్నాయి.

చెలీ! నీ కోప్పు జారిపోయిందన్న విషయం కూడా తెలుసుకోలేక యున్నావు. నీ పరధ్యానములో పనులన్నీ అన్నీ మితిమీరి చేస్తున్నావు. ఏమైనా అడిగితే కూడా జవాబివ్వవు. ఏదో పనులతో సతమతమవుతున్నట్టు లోపల లోపలే తిరుగాడుతున్నావు.

చెలీ! మెడలో ఉన్న నీ దండలన్నీ వెనుకకు వేసుకుని ఉన్నావు. నీ ఆలోచనలన్నీ ఎక్కడున్నాయో తెలియరావడం లేదు. ఈ విధంగా ఇక్కడ శ్రీవేంకటేశ్వరుని కలిసితిని. కాస్త నృత్యమాడి ఈ స్వామిని పేరుపెట్టి పిలవవే!

## 536

**అవతారిక:** స్వామికి సేవలు చేద్దామని వెళ్ళిన అమ్మ అలమేలుమంగమ్మకు స్వామి చేస్తున్న శృంగార చేష్టలుమితిమీరుతున్నాయని భావించి కొంచెమైనా ఓర్వమని, కాస్త నిదానించమని అడుగుతున్నది.

### ముఖారి

ప. ఎఱఁగ విన్నవించేను యిప్పుడే నేను

తఱవాతఁ దలఁచుకో తప్పదు మా చేఁతలు ॥పల్లవి॥

1. కొప్పు ముడవఁగఁబోతే కుచములు నాఁటు జేసు-

నప్పు దోరువఁగలవా ఆయముచోటు

చిప్పిల నేఁ జూచితేనే చెమరించె నీమేను

చెప్పి మాచేత సేవలు సేయించుకోఁగలవా ॥ఎఱగ॥

2. కుంకుమ పూయఁగఁబోతే గోరికొన దాఁకుఁ జెసు

కొంకక సమ్మతించేవా గుండె దాఁకును

అంకెల మాటాడఁగా నీకట్టే మదనమెత్తె

ఇంక మావూడిగము సేయించుకోనోపేవా ॥ఎఱగ॥

3. హారములు గట్టఁబోతే నదె కాఁగిలాఁజేసు

యీరీతి మారుకొన నిఁక వచ్చునా

యేరా శ్రీ వేంకటేశ ఇంతలో నే కూడితివి

చేరి మాచేతిపనులు చిత్తమువచ్చీనా ॥ఎఱగ॥

**అర్థములు:** ప. తలుచుకో = మనసులోనికి తెచ్చుకో, చేతలు = పనులు,కార్యములు.

1. ముడుచు = సరిచేసుకొను, కుచములు = వక్షోజములు, నాటు = శరీరంపై ఒత్తుకొను, ఓరువగలనా = ఓర్చుకోగలనా, ఆయము = జీవస్థానము, చిప్పిలు = పైకి ఉబుకు, చెమరించు = చెమటలు పుట్టు.
2. ఊయగ = పూయగా, గోరికొన = కొనగోళ్ళు, జెసు = ఉపేక్షించు, సమ్మతించు = అంగీకరించు, అంకెలు = వశము, మదనమెత్తు = మన్మథుడు ఆవహించు, ఊడిగము = సేవ, ఓపేవా = ఓర్వగలవా.
3. హారములు = మెడలోని దండలు, కౌగిలోవ్జేసు = కౌగిలిలోకి దారితీయు, మారుకొను = ఎదుర్కొను, చేతిపనులు = చేతులతో చేసే శృంగార చేష్టలు, చిత్తము వచ్చు = ఇష్టమగు.

**భావము:** స్వామీ! నీకు తెలిసేవిధంగా యిప్పుడే నేను అన్నీ వివరించి చెప్తాను. తరువాత మరలా అన్నీ మనసులోనికి తెచ్చుకొని ప్రవర్తించాలి లేదంటే మా పనులు మేము చేయవలసి ఉంటుంది సుమా!

స్వామీ! వీడిన నీ కొప్పు ముడిచి సరిచేద్దామంటే నా వక్షోజాలు నీ శరీరంపై దిగబడి వత్తుకుంటాయి. అలా చేసేటప్పుడు నీవు ఓర్చుకోగలవా? నేను ప్రేమ పొంగి నీ వైపు చూసినట్లైతే నీకు వొళ్ళంతా చెమటలు పుడతాయి కదా! ఇలా చెప్పి మా చేత సేవలు చేయించుకోగలవా?

నీకు కుంకుమ పూయాలంటే ఎక్కడ మా కొనగోళ్ళు నీ మేనిపై గీరుకుంటాయోనన్న భయం ఉన్నది. దానికి వెరవక అంగీకరిస్తావా? కళ్ళలో కళ్ళు పెట్టి చూసి మాట్లాడదామంటే నీకు ఎక్కడ మన్మథుడు ఆవహిస్తాడోనన్న భీతి యున్నది. ఇంక మేము సేవలు ఎలా చేయగలము? నీవెలా చేయించుకుని ఓర్చుకోగలవు?

నీ హారములను సరిచేద్దామని ముందుకు వంగితే కౌగిలిలోకి వెళ్ళిపోతున్నాము. ఈ తీరుగా జేయడం ఎదుర్కోవడం న్యాయమేనా చెప్పండి స్వామీ! ఆహా! నా స్వామీ! శ్రీవేంకటేశ్వరా! ఇంతలోని నన్ను కలసితివి. మేము మా చేతులతో చేసే శృంగార చేష్టలు నీకు అంత ప్రీతికరమైనదా?

## 537

**అవతారిక:** స్వామి అమ్మను చేరడంలేదని బాధతో చెలులు అమ్మ మదన తాపాలను స్వామికి వర్ణిస్తున్నారు.

### శంకరాభరణం

ప. వలపు వేఁచి కొరుకవద్దే నేఁడు
చెలి నింత సేయఁగాను సెలవేమే తనకు ॥పల్లవి॥

1. చిగురుఁ బోడికి నేఁడు చింత దగునా
వెగటు మాని యతని విచ్చేయుమనవే
తగదు యీపె అలపు తనది గాదా
మగవాఁడే ఇంతైతే మానుపరాదనరే ॥వలపు॥

2. కమలగంధికి నేఁడు కాఁక లింత దగునా
తమకానఁ జేకొని దయఁజూడుమనవే
అమరదు యీదోస మంతేసి మేలా
తమబోఁటు లిట్లైతేఁ దప్పించరాదనరే ॥వలపు॥

3. వెసఁ గోమలికిని విరహము దగునా
యెసఁగి శ్రీ వేంకటేశుఁ నీపెఁ గావుమనమే
అసము దించక నేఁ డంతలో విచ్చేసి కూడె
రసికులచేఁతలెల్లా రతికెక్కెననరే ॥వలపు॥

**అర్థములు:** ప. వలపు వేచి = ప్రేమకై వేచియుండి, కొరుకవద్దు = కోరుకోవద్దు, సెలవు = ఆజ్ఞ.

1. చిగురబోడి = చిగురువలె మనోజ్ఞురాలగు ఆడుది, చింత = విచారము, వెగటు = అయిష్టత, విచ్చేయు = రమ్మని, ఈపె = ఈమె, అలపు = శ్రమ, ఇంతైతే = ఈవిధముగానున్నట్లైతే, మానుపరాదు = తగ్గించు.
2. కమలగంధి = కమలమువంటి సువాసనగల స్త్రీ, కాక = తాపము, తమకము = మోహము, చేకొని = చేపట్టి, దయచూచు = కరుణతో చూడు, అమరదు = కుదరదు, దోసము = తప్పు, మేలు = శుభము, తమబోటు = తమలాంటి, ఇట్లైతే = ఈవిధముగానుంటే, తప్పించు = తొలగించు.
3. వెస = శీఘ్రముగ, కోమలి = సుందరాంగి, విరహము = ఎడబాటు, ఎసగి = కలిగి, ఈపె = ఈమె, కావుము = కాపాడుము, అసము = చనువు, దించక = తగ్గిపోకుండా, విచ్చేసి = వచ్చి, రసికులు = శృంగారప్రియులు, రతికెక్కు = రతిక్రీడకుదారితీయు.

**భావము:** ఓ లలనా! ప్రేమలను వేచియుండి కోరుకొనడం నేడు తగదు. ఆ చెలిని ఇలా చేయడం అనేవిషయంలో ఆజ్ఞలు అనుజ్ఞలు ఎందులకు?

ఆ చిగురువలె మనోజ్ఞురాలగు ఆడుదానికి ఈనాడు ఇంత ఆలోచనలు అవసరమా? అయిష్టాలను విడిచిపుచ్చి ఆ స్వామిని రమ్మని చెప్పవే! ఇవన్నీ తగదు. ఈ స్త్రీని శ్రమపెట్టడం తనను తాను శ్రమపడినట్లు అవదా? మగవాడు ఈవిధంగా ప్రవర్తిస్తే దాన్ని తగ్గిచడానికి యత్నించవలెను కదా!

ఆ కమలమువంటి సువాసనగల స్త్రీని ఇంతటి తాపముతో బాధపెట్టడం తగునా? స్వామిని ప్రేమతో మోహముతో చేపట్టమని చెప్పవే! ఈ తప్పు అసలు కుదరదు గాక కుదరదు. ఇదేమైనా శుభాన్నిచ్చేదా చెప్పు? తమలాంటి మహానుభావులే ఇలాంటి కార్యాలకు పూనుకుంటే, తొలగిపొమ్మని చెప్పరాదటే!

ఈ కోమలాంగికి ఇంత ఎడబాటు కలిగించడం తగునా? నీవు కలిసి ఆ శ్రీవేంకటేశ్వరుని ఈమెను కాపాడి రక్షించి చేరదీయమనవే! ఆహా! చనువు, ప్రేమాభిమానాలను ఏమాత్రం తగ్గించక, మరువక శ్రీవేంకటేశ్వరుడు నేను అంతలోనే విచ్చేసి కలిసినాడు. ఇక ఈ శృంగార ప్రియులు చేసే రతిక్రీడా విశేషములకు హద్దు ఆపు ఉంటుందా?

## 538

అవతారిక: స్వామిపై ఏవో పితూరీలు చెప్పడానికి సిద్ధమైన చెలులకు అమ్మ మీరు మా మధ్యలో దూరవద్దని హితవు చెబుతున్నది.

### పాడి

ప. ఇంత కింతే చాలదా యేఁటికమ్మా
దొంతులాయ వలపులు తొలరో వోయమ్మా ॥పల్లవి॥

1. ఆయనాయ వానిసుద్దు లందుకేమి నే మీకుఁ
జేయఁగల పనులకుఁ జెప్పరమ్మా
పోయినపనులకుఁ పోనీ పొద్దువోదా మీ కేమి
చాయలు సన్నలు నింక చవుల గావమ్మా ॥ఇంత॥

2. యేడ నుండెనేమి వాఁడు యేమిగారణము మీకు
యీడకేడ వచ్చినపని యేదమ్మా
యేడకేడ తలపోఁత లింకా మరవరా
నీడలకు యెండలకుఁ గూడునా వోయమ్మా ॥ఇంత॥

3. పుక్కట వీనికిఁగాను పూనుక రావద్దు గాని
తక్కక వేరోకమాట తలఁచరమ్మా
గుక్కక శ్రీ వేంకటేశుఁ గూడి మీమాట వింటి

యెక్కె మీచలము నేఁడు యెన్నికాయనమ్మా ॥ఇంత॥

**అర్థములు:** ప. ఇంతకింత = దీనికి సరిపోయేవిధంగా, ఏటికమ్మా = ఎందుకమ్మా, దొంతులు = ఒకదానిపై మరొకటి, వలపు = ప్రేమ, తోలరో = నడిపించరో, ఓయమ్మా = ఓ వనితలారా.

1. ఆయనాయ = అయినదేదో అయినది, సుద్దులు = మంచి మాటలు, పొద్దువోదా = కాలక్షేమవదా, చాయలు = శోభలు, సన్నలు = సైగలు, చవులు = రుచులు.
2. కారణము = హేతువు, ఏడకేడ = ఎక్కడికి ఎక్కడ, తలపోత = ఆలోచన, మరవరా = మరచిపోరా, నీడలకు ఎండలకు = అయిన దానికి కాని దానికి,అనుకూల ప్రతికూలములకు, కూడునా = వచ్చి కలియునా
3. పుక్కట = ఉచితముగా, పూనుక = ప్రయత్నించి, తక్కక = తప్పక, వేరొకమాట = ఇంకో మాట, గుక్కక = మాట్లాడకుండా, వింటి = విన్నాను, చలము = వణకు, ఎన్నికాయను = లెక్కించబడెను.

**భావము:** ఓ అమ్మలారా! ఇంతకింత సరిపోలేదా చెప్పండి? ఎందుకమ్మా! ప్రేమలన్నీ ఒకదానిమీద మరొకటి రీతిలో దొంతులయ్యాయి కదా! ఇక నడిపించరమ్మా!

అయినదేదో అయింది. ఆ స్వామి మాటలతో, సూక్తులతో మీకు పనేమున్నది? ఏమైనా చేయగల పని ఉంటే అది చెప్పండి. పోయిన పనులను పోనివ్వండి అవే తలుచుకుంటూ ఉండకపోతే మీకు ఏమీ తోచదా చెప్పండి? యిక శోభలు, సైగలు ఇంక ఏ మాత్రం రుచికాదు పని చేయవు కూడా!

ఆ స్వామి ఎక్కడ ఉంటే మీకేమైనది? అన్నీ కారణాలను అడుగుతున్నారెందులకు? మీరు ఇక్కడకు వచ్చిన పనేమిటో ముందు చెప్పండి నాకు. ఎప్పుడో జరిగినవి మరచిపోకుండా అవే ఆలోచిస్తూ కూర్చుంటారెందులకే! ఆ స్వామి అయిన దానికి కాని దానికి, అనుకూలానికి ప్రతికూలానికి నన్ను వచ్చి కలియునా చెప్పండి?

మీరు ఊరకే పూనుకోని ఏవో చెప్పాలని ఇక్కడకు రాకండి. నా స్వామిని గురించి కాకుండా వేరేదైనా మాటలు చెప్పండి బాగుంటుంది. నేను మౌనంగా ఆ శ్రీవేంకటేశ్వరునితో కలిసి మీ మాటలు విన్నాను. మీ వణకులు, భయపెట్టడాలు పోయాయి. ఇక అన్ని మంచి విషయాలను లెక్కించడమే మీ పని.

## 539

**అవతారిక:** స్వామి చేసే పనులను ఏమాత్రం ఓర్వలేనని చెబుతూ, స్వామివద్దకు మీరు వెళ్ళిరండని అమ్మ చెలులను పంపుచున్నది.

### ఆహిరి

ప. ఓపనోప తియ్యకురే వొడివట్టి రమ్మంటా
యీ పొద్దు కాతని వద్దికేఁగరే మీరు ॥పల్లవి॥

1. ఔలేవే తనసుద్ద లందరుఁ దెలిసేరా
తేలింపుసటలు నాకే తెలుఁసుఁగాక
వోలి సూదుబంటౌట వొండెఁ జుట్ట మవుట గాక
మైల గొంత అందులో మణుఁగూఁ గొంతా ॥ఓపనోప॥

2. వింటిలేవే వానికిఁగా వేఁడుకొనే మీ మాఁట
రెంటికిఁ గలఁడు తనరీ తెరుఁగుదు
ఇంట నుండవలె నొండె యీడకే రావలె నొండె
కుంటెనలు గొంత మరి కూటములు గొంతా ॥ఓపనోప॥

3. అట్టేకాదా మీకుఁ దెల్లనైనవెల్లాఁ బాలవును
గట్టిగఁ దనగుణాలు కన్నవే నేను
యెట్టకేలకు శ్రీ వేంకటేశుఁ డిట్టె నన్నుఁ గూడె

 

తిట్టు గొంతా ఇందాఁక దీవె నిఁకఁ గొంతా ॥ఓపనోప॥

**అర్థములు:** ప. ఓపనోప = అసలు ఓర్చుకోలేక యున్నాను, వొడిపట్టి = నడుమును పట్టుకుని, పొద్దు = రోజు, వద్దికింఏగరే = వద్దకు వెళ్ళరే.

1. ఔలేవే = అవును లేవే, సుద్దలు = మంచి మాటలు, తెలిసేరా = తెలుసుకుంటారా, తేలింపు = సంతోషపెట్టే, సటలు = బాధ, ఓలి = వరుస, సూడుబంటు = పగతీర్చుకునే సేవకుడు, ఒందు = అనుకూలించు, చుట్టమవుట = బంధువవడం, మైల = అశుభ్రము, మణుగు = శుచిత్వము.
2. వేడుకొను = ప్రార్థించు, తనరు = అతిశయించు, ఒండె = క్రమము, ఈడకే = ఇక్కడికే, కుంటెనలు = తార్చేవారు, కూటమి = స్నేహపు కలయిక.
3. కన్నవి = చూసినవి, ఎట్టకేలకు = తుదకు, తిట్టు = నింద, దీవెన = ఆశీర్వచనము.

**భావము:** ఇంక నేను అసలు భరించనూ లేను ఓర్చుకోనూ లేను. స్వామి అస్తమానమూ నన్ను ఒడిపట్టి రమ్మని పిలుస్తూ ఉంటాడు. ఈ రోజు మీరే ఆతని వద్దకు వెళ్ళండి.

అవునులేవే! ఆతని అకార్యాలన్నీ అందరికి తెలిసినవే కదా! ఆయనను యెల్లవేళలా సంతోషంతో పెట్టే బాధలు నా ఒక్క దానికే అర్థమవుతాయి. స్వామి బంధువయినప్పటికి, నాకు మాత్రం ఒక పగతీర్చుకునే సేవకునిలా అనిపిస్తున్నాడు. స్వామి విషయంలో అశుభ్రత కొంత శుచిత్వం కొంతా మేళవించి ఉన్నవి.

తనతో మీరు వేడుకొనే మీ మాటలను నేను విన్నానులే! ఆయన రెండిటికి సిద్ధపడ్డ తీరు అతిశయము నాకు పూర్తిగా తెలుసు. ఇంటనుండవలెను లేదా ఇక్కడకు రావలెను అంతే గానీ, తార్చే పద్ధతి కొంతా కలిసే పద్ధతి కొంతా ఉండకూడదు కదా!

అంతే కదా! మీరు తెల్లనైనవన్నీ పాలనే అనుకుంటారు. కానీ ఆ స్వామి స్వభావము నేను పూర్తిగా ఎరిగిన దానను సుమా! చిట్టచివరకు ఆ శ్రీవేంకటేశ్వరుడు నన్నీ విధముగా కలసినాడు. దీనిలోను తిట్లు కొంతా, దీవెనలు కొంతా ఉన్నవి సుమా!

**విశేషములు:** ఈ కీర్తనలో పరస్పర విరుద్ధమైన విషయాలను రెండిటిని ప్రతి చరణం చివరలోను వ్రాసి కీర్తనకు వన్నె తెచ్చాడు. అవి మైలకొంతా మణుగు కొంతా, కుంటెనలు కొంతా కూటములు కొంతా, తిట్టు కొంతా దీవెనలు కొంతా అని అమ్మతో చెలులకు చెప్పించే సన్నివేశమిది.

## 540

**అవతారిక:** స్వామిని ఇంతగా ప్రాణప్రదంగా ప్రేమించి కోరుకోవడం వల్లనే కదా! తను విరహబాధలను అనుభవిస్తున్నానని అమ్మ వాపోతున్నది.

### శంకరాభరణం

ప. ఊరకున్న వారి కూరోపదన్నట్లు
నేరనైతి నే నింక నిన్నేల కొసర ॥పల్లవి॥

1. మగిడి చూడఁగఁదా మనసు నీపైఁ దగిలె
తగులు గలుగఁగదా దైవారె వలపు
నగుతానే ఇంతాయ నావంకనే నేఁడు
ఇగిరించెఁ గోర్కి నీవేమి సేతువురా ॥ఊరకున్న॥

2. మాటలాడఁగఁగదా మర్మములు గడునాటె
నాటుఁదమకము గదా నను బాయనీదు
తేటతెల్లమి సేసె తెగనినాయాసలే
వాటపుఁదప్పు నీవల్ల నిఁకనేదీ ॥ఊరకున్న॥

3. మెకమోటమునఁగదా మొలచె నివ్వెర గొకటి
వొకటి కొకటికి లంకె లమరె మన కిపుడు
వెకలినై కూడితిని వింతగా నిను నేను
అకట శ్రీవేంకటేశ అనఁగఁ జోటేది ॥ఊరకున్న॥

**అర్థములు:** ప. ఊరకుండు = ఏపని చేయక యుండు, ఊరోపదు = ఊరు భరించలేదు, నేరనైతి = తెలుసుకోలేక పోతిని, కొసరు = ప్రార్థించు.

1. మగిడి = పాములవాఉడు ఊఉదెడు వాద్యవిశేషము, తగులు = చిక్కుకొను, దైవారు = ప్రకాశించు, నగు = నవ్వు, వంక = వైపు, ఇగిరించె = పుట్టు, కోర్కి = కోరిక.
2. మర్మములు = రహస్యాలు, కడు = మిక్కిలి, నాటె = హృదయములోని చేరు, తమకము = మోహము, పాయు = వీడు, తేటతెల్లమి = బట్టబయలు, తెగని = తుదలేని, వాటము = అనుకూలము, దప్పు = దాహము, ఇకనేది = ఎక్కడున్నది.
3. మొహమాటము = సంశయము, మొలచు = మొలకెత్తు, నివ్వెరగు = మిక్కిలి భీతి, లంకె = గొళ్ళెము, అమరు = కలుగు, వెకలి = ఆసక్తి, అకట = అయ్యో..ఆహా.., చోటేది = తావెక్కడ?

**భావము:** ఊరక ఉన్నవారిని ఊరు సైతం భరించలేదన్న చందాన నాకు తెలియరాలేదు ఇంక నిన్నేమి కోరగలను?

పాములవాడు ఊదే వాయిద్యాయినికి పాములు తలాడించిన రీతిగా నా మనసు నీపై మరులుకొన్నది. ఇలా అవడం వలన కదా ప్రేమ ప్రకాశించినది. నావంక చూస్తూ నవ్వుతూ ఉండడం వల్లనే కదా ఇదంతా జరిగినది. నాలో కోర్కెలు పుట్టి వికసిస్తున్నాయి ఇందుకు నీవేమి చేస్తావు?

నీతో మాట్లాడడం వలన కదా రహస్యాలన్నీ తెలిసినది. ఈ గట్టి మోహమే కదా నన్ను వీడనీక బంధించినది. నా కోరికలే దీనిని బట్టబయలు చేసినవి. అనుకూలమైన దాహము నీ వల్ల నాకు ఇక నెక్కడున్నది?

నేను మరీ అంత మొహమాటముతోను సంశయముతోనూ ఉండడం వలన కదా నాలో మిక్కిలి భీతి ఆవరించినది. ఇవన్నీ ఒకటికి మరొకటి మనకిపుడు సంకెలలై లంకెలై నిలబడ్డవి. నేను మాత్రం మిక్కిలి ఆసక్తితో, కోరికతో నీవద్దకు చేరి యున్నాను. అయ్యో! ఓ శ్రీవేంకటేశ్వరా! ఇక నిన్ను ఏమన్నా తూలనాడడానికి దూషించడానికి ఏమాత్రం ఆస్కారం లేదు స్వామీ! తప్పులన్నియూ నావే స్వామీ!

## 541

**అవతారిక:**అమ్మ మన్మాథావస్తలో నున్నదని త్వరగా విచ్చేయమని చెలులు స్వామికి నివేదిస్తున్నారు.

### వరాళి

ప. విచ్చేయవయ్యా వెలఁదిఁ జూతువు గాని
ఇచ్చకములాడేము యెట్టయినాఁ గాని ॥పల్లవి॥

1. మరుఁడు పువ్వుల నేసె మగువ నేలలు వ్రాసె
ఇరవగునీవలపు లింతగాఁ జేసే
తెరమరఁ గిది నీవు దీసినఁగాని పోదు
యెరవు సేయక నే మేమన్నా వాదు ॥విచ్చేయ॥

2. చందురుఁడు జామెక్కె సతి చింతలోఁజిక్కె
అందపు నీచలములే అన్నియు దక్కె
నింద లిన్నయు నిట్టె నీమీఁద గురియాయ
అందిపొంది నేఁడు మాకు నాడఁదరియాయ ॥విచ్చేయ॥



డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య

3. చల్లగాలి కడుహెచ్చె సతి గరcగcగ జొచ్చె
ఇల్లిదే నీమాటపటులిప్పుడే వచ్చె
చెల్లుcబడిc గూడితివి శ్రీ వేంకటేశ యీచెలి
బల్లిదురాలాయ నేము పైతరవు సేయ ॥విచ్చేయ॥

**అర్థములు:**ప. విచ్చేయువయ్యా = రావయ్యా, వెలది = స్త్రీ, ఇచ్చకము = ముఖప్రీతి, ఎట్టయినా = ఎలాగైనా గానీ.

1. మరుడు = మన్మథుడు, మగువ = స్త్రీలు, ఇరవు = స్థానము, తెరమరుగు = తెరచాటు వ్యవహారము, ఎరవు = భేధము,తేడా, వాదు = పోట్లాట.
2. జామెక్కు = పొద్దెక్కు, సతి = భార్య,స్త్రీ, చింత = బాధ,ఆలోచన, నింద = అపవాదు, గురి = లక్ష్యము, అందిపొందు = అందివచ్చు, దరి = దగ్గర.
3. కడు = మిక్కిలి, హెచ్చు = అధికము, సతి = భార్య,స్త్రీ, కరుగు = ద్రవించు, ఇల్లిదే = ఇదే, మాటపటులు = తెలివిగా మాట్లాడు, చెల్లుబడి = సరిపోలు, బల్లిదురాలు = మిక్కిలిబలము గలస్త్రీ, నేము = మేము, పైతరవు = నిర్బంధము.

**భావము:** ఓ స్వామీ! వేంచేయవయ్యా! వచ్చి ఆ స్త్రీని పరికించండి. ఎలాగైనా ముఖప్రీతి మాట్లాడు మాట్లాడెదములే స్వామీ! రండి!

స్వామీ! చూశారా! మన్మథుడు ఒక వైపు నుండి పువ్వులను కురిపిస్తున్నాడు. ఇదంతా నీ ప్రేమ ప్రభావం వలననే స్వామీ! ఇది తెరలోపల కూర్చున్న తీరుగా నున్నది. దాన్ని తొలగిస్తే కానీ కుదరదు. తేడా చూపించి మేమేమన్నా అందామంటే మరలా అది తగాదాలకు దారి తీస్తుంది.

స్వామీ! ఒకవంక చంద్రుడు జాము పొద్దెక్కి అంబరములో ప్రకాశిస్తున్నాడు. ఈమె ఆలోచనలతో కూడిన బాధలలో చిక్కి యున్నది. నీ అందచందాల ప్రభావమే స్వామీ ఈ అవస్థకంతా కారణము. ఈ అపవాదులన్నింటికి కారణము కూడా నువ్వే స్వామీ! అందీ అందనట్లుగా నీవు మాకు అక్కడ సమీపములో నిలబడ్డావు.

స్వామీ! ఈ చల్లగాలిని గమనించారా! బాగా ఎక్కువైనది. దానివల్ల ఆ అమ్మ మనసు ద్రవించి నీకోసం పలవరిస్తున్నది. ఇదుగో స్వామీ! నీ తెలివితేటలతో కూడిన మాటలు కూడా ఇప్పుడే వస్తున్నాయి. ఓ శ్రీవేంకటేశ్వరా! సరిపోయేవిధంగా అమ్మ అలమేలుమంగమ్మను కూడినావు. ఆమెను నిర్బంధము చేసి నీ కడకు చేర్చడానికి ఆమె గొప్ప బలవంతురాలు. మేము అశక్తులై ఉన్నాము. నీవే కరుణించి దగ్గరకు తీసుకో స్వామీ!

## 542

**అవతారిక:** స్వామి ఎంత చెప్పిన వినకుండా చెంతకు జేరి విసిగిస్తున్నాడని అలమేలుమంగమ్మ చెలులతో చెప్పే సన్నివేశం.

### సామంతం

ప. తానేడ నేనేడ దగ్గరీ వీcడు
పూని కన్నులcc దిట్టినా పోcడే వీcడు ॥పల్లవి॥

1. సారెకుc దప్పక చూచి జాణతనాలాడీని
పోరి పోరి వద్దన్నాc బోcడే వీcడే
పేరుకొని పిలిచీని పెదవుల గొణcగీని
వూరకున్నా నవ్వుతాను వొరసీనే వీcడు ॥తానేడ॥

2. పానుపుపైc బవళించీc బనులుచెప్పc బిలిచీ
మోనాన నే నుండినాను మొక్కీనే వీcడు
మానములు సోcక నవ్వీ మంతనాలే వెదకీని
వీనులు చొరcగనీడు విన్నపాలు వినcడు ॥తానేడ॥

3. పట్టినచలమే పెంచీఁ బైఁ జేయివేసీని
గుట్టున నుండఁడు నాతోఁ గొంతైనా వీఁడు
యిట్టె శ్రీ వేంకటేశుఁ డెలయించి నన్నుఁ గూడె
అట్టు కెక్కించెను నన్నాఱడిసేసి వీఁడు ?తానేడ?

**అర్థములు:** ప. తానేడ = తానెక్కడ?, నేనేడ = నేనెక్కడ, దగ్గరీ = దగ్గరయ్యేను, పూని = ప్రయత్నినించి, కన్నులదిట్టు = కన్నులతో బెదిరించి అదిలించు.

1. సారె = మాటిమాటికి, జాణతనము = నేర్పరితనము, పోరి = పోట్లాడి, పేరుకొని = పేరుబెట్టి పిలుచు, గొణుగు = చిన్నగా మాట్లాడు, ఊరకుండు = మాట్లాడకయుండు, ఒరయు = పరీక్షించు.
2. పానుపు = పడక, పవళించి = పండుకొని, మోనాన = మౌనంగా, మొక్కు = నమస్కరించు, మానము = దాచిన అవయవములు, సోక = తాకునట్లు, మంతనాలు = రహస్య సమాలోచన, వీనులు = చెవులు, చొరగనీడు = విననివ్వడు, విన్నపాలు = మనవి.
3. చలము = పట్టుదల, పైచేయివేసీని = పైన చేతులు వేస్తాడు, గుట్టు = దాపరికము, కొంతైనా = కొంచమైనా, ఎలయించు = పురికొల్పు, రట్టు = అల్లరిపాలు, ఆరడి = నింద.

**భావము:** ఆ స్వామి ఎక్కడ? నేనెక్కడ? దగ్గయేందుకు సదా ప్రయత్నిస్తున్నాడు. కోపముతో పూనుకొను కన్నులతో బెదిరించి అదిలించినా వెళ్ళడేమిటే! ఇదెక్కడి గొడవే చెలులారా!

మాటిమాటికి కళ్ళలో కళ్ళుబెట్టి చూస్తాడు. ఎంతో నేర్పరి తనం నటిస్తాడు. పోట్లాడి వెళ్ళమన్నా వెళ్ళడేమిటే వీడు? పేరుబెట్టి పిలుస్తాడు, ఏదో చిన్నగా గొణుగుతాడు.

పానుపుపై పండుకొని ఏదో బదులు చెప్పడానికి ప్రయత్నిస్తూ, నేను మౌనంగా ఉన్నా సరే ఏవో నమస్కారాలు అవీ ఇవీ చేస్తూ ఉంటాడు. నా అవయములు తాకుతూ పకపకా నవ్వుతూ ఉంటాడు. ఏదో రహస్య సమాలోచనలు చెయ్యాలని ప్రయత్నిస్తాడు. ఏమి చెప్పినట్టికి చెవిన బెట్టడు, చేసే విన్నపాలు అసలు పట్టించుకోడు.

ఏదో పట్టుదలల మనసులో పెట్టుకుని పైన చేతులు వేస్తాడు. నేను చెప్పేది కొంచెమైనా వినకుండా రహస్యంగా గుట్టుగా ఉండనే ఉండడు. ఈవిధముగా శ్రీవేంకటేశ్వరుడు పురికొల్పి ప్రయత్నించి నన్ను కలసినాడు. నన్ను అల్లరిపాలు చేసి నిందలపాలు చేస్తున్నాడమ్మా !

## 543

**అవతారిక:** అలమేలుమంగమ్మ, శ్రీనివాసుల రతిక్రీడావినోదానంతరం తర్వాత, అమ్మ పడే యవస్తలను చెలులు ప్రశ్నిస్తున్నారు.

### శ్రీరాగం

ప. చెప్పఁగ సిగ్గులువడే విదే చేఁతలు నేమే కంటిమి
ఇప్పుడు గా మా కోరిక లిటు ఫలియించినది ॥పల్లవి॥

1. చెక్కుల జారినచెమటలు చిందరవందరకురులను
గక్కన నవిరిబాగులు కంటిమి నీకిపుడు
మొక్కలమగుకన్నెవు నీమొలక కుచంబుల మీఁదట
ఇక్కువలంటినచందురు లెక్కడివే నీకు ॥చెప్పఁగ॥

2. మోమునఁ దేరేటికళలును ముంచిన కన్నుల తేటలే
కామించిన భాగ్యంబులు గలిగెనే నీకిపుడు
నేమే చెప్పిన నొల్లవు నీయంతనే నీ కిప్పుడు

యీ మోహపుటసురుసురులు యెక్కడివే నీకు ॥చెప్పఁగ॥

3. సదమదమగురతియలపులు సారెకు సారెకు వెరగులు
నిదురలు మిక్కిలి మించెను నేఁడే నీ కిపుడు
కదియుచు శ్రీ వేంకటపతికాఁగిటఁ గూడఁగఁ గలిగెను
ఇదివో ఇంతకముందర యెక్కడివే నీకు ॥చెప్పఁగ॥

**అర్థములు:** ప. సిగ్గులు వడు = సిగ్గుపడు, చేతలు = పనులు, నేమే = మేమే, ఫలియించినది = నెరవేరినది.

1. చెక్కులు = చెక్కిళ్ళు, చిందరవందర = అస్తవ్యస్తమైన, కురులు = జుట్టు, గక్కన = శీఘ్రముగ, అరవిరిబాగులు = సగమువిరిసిన మొగ్గల సౌందర్యము, కంటిమి = చూచితిమి, మొక్కలము = శౌర్యము, మొలక కుచంబులు = అప్పుడే అంకురించిన వక్షోజములు, ఇక్కువ = జాడ, చందురులు = అందములు, ఎక్కడివి = ఎక్కడనుండి సంపాదించుకొంటివి.
2. మోమున = మొహమున, తేరు = కనిపించు, కళలు = శోభలు, ముంచిన = మునగజేయు, కన్నుల తేటలు = కన్నులలోని కాంతులు, కామించిన = మోహించిన, భాగ్యంబులు = అదృష్టములు, నేమే = మేమే, ఒల్లవు = వదలిపట్టవు, మోహపు ఉసురుసులు = తాపముతో వచ్చే నిట్టూర్పులు.
3. సదమదము = ఆయాసపడు, రతియలపులు = రతిక్రీడలోని శ్రమ, సారెకు సారెకు = మాటిమాటికి, వెరగు = ఆశ్చర్యము, నిదురలు = నిద్ర, మించెను = అధికమాయెను, కదియు = దగ్గరగు, కాగిట = కౌగిట, ఇంతకముందర = ఇంతకు ముందు, ఎక్కడివే నీకు? = నీకు ఎక్కడ ఉన్నవి? లేవుకదా అని భావము.

**భావము:** చెప్పడానికి సిగ్గుపడే పనులు మేము చూస్తున్నాము. ఈ సమయములోనే మా కోరికలు నేరవేరినవి.

చెక్కిలిపై జారిన చిరు చెమటలతో, చిందవందరయిన కేశాలతో శీఘ్రముగా సగము విరిసిన మొగ్గల సౌందర్యాన్ని ఇప్పుడే చూస్తున్నాము. శౌర్యము సాహసముతో కూడుకొన్న కన్యవు కదా! నీ ఈమధ్యనే అంకురించిన వక్షోజములపై జాడలు తెలిసే విధంగా పడిన గుర్తులు ఎక్కడనుండి వచ్చినవే?

నీ ముఖారవిందముపై శోభిస్తున్న ఆ కళలు, నీ కన్నులలోని అతిశయించిన కాంతులు, స్వామిని మోహించిన కారణంగా నీకు లభించిన అదృష్టములు నీకిపుడు కలిగినవి కదా! మేము ఏమి చెప్పినా వినని దానవు,నే ఈ ప్రేమ వలన వచ్చే ఉసురుసురులనే నిట్టూర్పులు నీకు ఎక్కడనుండి వచ్చినవే!

నీ ఆయాసపడే రతిక్రీడలోని అలుపు మాటిమాటికి ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నాయి. నీవు ఇపుడు అతిగా పానుపుపై శయినించి నిద్రపోతున్నావు. మాకర్థమైనదిలేవే! ఇవన్నియు నీకిపుడు శ్రీవేంకటేశ్వరుని కౌగిట కూడినందువల్ల కలిగినవి కదా! ఈ అవస్థలన్నీ నీకు ముందు లేవు కదా? ఇప్పుడెలా వచ్చాయి చెప్పవే!

## 544

**అవతారిక:** స్వామి అకార్యాలు చేసి వచ్చినా సరే! తనకు ప్రియమేనని స్వాధీన పతికగా అమ్మ మాట్లాడుతున్నది.

### ముఖారి

ప. అందరి మెప్పించుదాఁకా నణఁగేఁగాక ? నే-
నిందులోనే పాలు నీరు నేరుపరచలేనా ॥పల్లవి॥

1. ఇంకాఁ దానే యెరిఁగీని ఇప్పుడేలంటాఁగాక
అంకెలం బదరనైతి నయ్యా నేను
వంకలొత్తి నేఁ దనవంటిదాననై తేఁ గన
లంకెలమీతోఁ దనలాగులెల్లఁ జెప్పనా ॥అందరి॥

2. ఇప్పటి కోపము మీఁద నిట్టే వుండదని కాక

కప్పుడు నాచేఁతలెల్లఁ గంటే నేను
తప్పని నాగుణములు తనగుణములఁ బోలితే
బొప్పుతో నక్కునఁబోసి చూపనా మీకు ॥అందరి॥

3. పోరానిచుట్టరికపు పొందు దనదని కాక
చేరి నోరు మూసుకొంటి చెల్లఁబో నేను
ఆరీతి శ్రీ వేంకటేశుఁ డంతలోనె నన్నుఁ గూడె
తారుకాణ లిఁక నేల తానే నేను ॥అందరి॥

**అర్థములు:** ప. మెప్పించు = ప్రశంసపొందు, అణగు = తగ్గియుండు, పాలుంనీరునుంఏరుపరచలేనా = పాలను నీళ్ళను వేరుచేయలేనా.

1. ఎరిగినీ = తెలుసుకొన్నాడు, ఇప్పుడేల = ఇప్పుడెందులకు, అంకెల = వశము, పదరు = త్వరపడు, వంకలొత్తు = తప్పులెన్ను, లంకెలు = కట్టివేయు, లాగు = విధము.
2. ఇట్టే = ఈవిధంగానే, చేతలు = పనులు, గుణము = స్వభావము, ఒప్పు = సరిపోయేవిధము, అక్కున = గుండెలకు.
3. పోరాని చుట్టరికి = దూరపు బంధుత్వము, చెల్లబో = ఆహా! అవునుకదా!, తారుకాణ = ఋజువు.

**భావము:** అందరి ప్రశంసలను అందుకునే వరకూ ఇలాగే నేను అణిగి మణగి ఉండేదానను గాక! అయినా నాకు పాలు నీరు వేరుపరచే విధంగా మంచి చెడ్డలను గ్రహించలేననుకున్నారా?

అన్నివిషయాలు తనకు పూర్తిగా తెలుసు ఇంకా ఎప్పుడెందుకీ గొడవ? అయ్యో! త్వరపడి వశమవడానికి నేను ప్రయత్నించడంలేదు. నేను అందరిలాగా, తనలాగా తప్పులు పట్టేదాననైతే, నేను కూడా అందరిలానే, తనలాగే అలాగే చేసేదాన్ని కదా!

ఇప్పుడున్న కోపం ఎప్పటికి ఉండిపోదుకదా! ఆ తర్వాత నేను చేసే పనులను గమనిస్తే నేనే తప్పని తన గుణములు నా గుణములతో పోల్చిచూసినట్లైతే పట్టుదలగా ఈవిధంగానే అక్కున చేర్చుకొని మీకు చూపించనా చెప్పండి?

దూరపు బంధుత్వము, అంత దగ్గరి సంబంధము తనతో లేదని నోరు మూసుకుని ఉన్నాను కానీ, ఆహా అవును కదా! ఆ విధముగా శ్రీవేంకటేశ్వరుడు అంతలోనే నన్ను చేరి దగ్గరైనాడు. ఇంకా నా స్వచ్ఛమైన ప్రేమకు ఋజువులు సాక్ష్యాలు అవసరమా చెప్పండి?

## 545

అవతారిక: అమ్మ ప్రక్కనే ఉన్నప్పటికి స్వామి సమీపంలోని వనితలపై వలపు బాణాలు విసురుతున్నారని గ్రహించి స్వామితో తను అన్నీ గమనిస్తున్నాని చెప్తున్నది.

### దేశి

ప. అటుగనక నినుఁ దలఁచు కంతట నుండుట మేలు
అటుమటము లెందాఁక నంపరా నీవు ॥పల్లవి॥

1. చెంతల వేరొకతెపై చిత్తము నీకుండఁగా నే
యెంతప్రియము చెప్పిన నేమి నెలవు
ఇంతట గుట్టున నుండ నెరిఁగేవు గాక నీవే
కాంతుఁడ నిద్రించువారికాళ్లు గడుగవశమా ॥అటు॥

2. అవ్వల నెవ్వతెపసకో అసురుసుకు గాఁగ నిను
నవ్వించఁబోవు టిస్సీ నగుఁబాట్లు
దవ్వులపొందువులే చవులు దగిలేవు నీవు నను

నెవ్వగ నీరువట్టుకును నేయి మందగునా ॥అటు॥

3. వేరే యేసతినో తలఁచి వేడుకలు చెలఁగఁగ
కూరిమి నేఁ బైకొనుట కూళతనము
చేరువనే కూడితికి శ్రీ వేంకటేశ్వరుఁడ
తేరిపోయినపనికి తిరుగ మాఁటేలా ॥అటు॥

**అర్థములు:** ప. అటుగనక = అటూఇటూ చూడకుండా, తలచు = మనసులోనికి దెచ్చుకొని, అంతట = అటుప్రక్క, మేలు = శుభము, మంచిది, అటుమటము = కపటము, అంపు = పంపు.

1. చెంతల = ప్రక్కన, వేరొకతె = ఇంకొక స్త్రీ, చిత్తము = మనసు, ప్రియము = ఇష్టము, నెలవు = స్థానము, గుట్టు = రహస్యము, కాంతుడు = మగడు, వశము = సాధ్యము.
2. అవ్వల = అవతల, ఎవ్వతె పసకో = ఏ స్త్రీ సామర్థ్యమునకో, అసురుసురుకు = నిట్టూర్పులకు, కాగ = తపించగా, ఇస్సీ = జుగుప్సా నిందాద్యర్థకం, నగుబాట్లు = నవ్వులపాలు, దవ్వు = దగ్గర, పొందువులు = కూడికలు, చవులు = రుచి, నెవ్వు = విచారము, మందగునా = ఔషధమవుతుందా?
3. వేరే = ఇంకొక, సతి = భార్య, వేడుకలు = సంతోషము, చెలగు = వ్యాపించు, కూరిమి = స్నేహము, పైకొను = యత్నించు, కూళతనము = తులువతనం, చేరువ = దగ్గర, కూడితి = కలిసితి, తేరిపోవు = తేరిపారజూచు, తిరుగ = మరల, మాటేల = మాటలెందులకు.

**భావము:** ఓ స్వామీ! అటూఇటూ చూడకుండా, మిమ్మల్నే మనసులోనికి దెచ్చుకొని, తలచుకుంటూ ఉండడమే శుభము. ఈ కపటాలు అవీ ఇవీ లేకుండా ఆమెను అవతలకు పంపించరా నీవు.

ప్రక్కన వేరొకతెపై నీ మనసుండగా నేనెంత చెప్పినప్పటికి, ఏమి చెప్పినటికి ఉపయోగం ఏముంటుంది? నా మాటలకు స్థానం ఎక్కడుంటుంది? ఇంతట గుట్టుగా రహస్యంగా ఉండడం నీకు తెలుసును కానీ ఓ మగడా! నిద్రపోయేవారికి కాళ్ళుకడగడం సాధ్యమవుతుందా?

ఆవల ఎవ్వరో ఒక వనిత తన శృంగార సామర్థ్యం చూపిస్తూ నిట్టూర్పులు విడుస్తూ ఉండడమే కాక, అహో ఎంత జాణ తను? నిన్ను నవ్వించడానికి కూడా పూనుకోవడం న్యాయమేనా? నలుగురిలో నగుబాటని తెలుసుకోలేరా? దగ్గర ఉన్నవారి పొందులే నీకు రుచిని కలిగిస్తాయా? విచారముతో నీటిని బట్టుకొని ప్రార్థిస్తే నేయి మందుగా మారడం జరుగుతుందా?

మనసులో ఎవరో వేరే స్త్రీని తలంచుకొని సంతోషాలు అతిశయిస్తూ ఉండగా నేను స్నేహముతో దరి చేరి యత్నించడం తులువతనమవదా? ఓ స్వామీ! శ్రీవేంకటేశ్వరా! పూర్తిగా నిర్ణయమైపోయిన పనులపై మళ్ళీ తిరిగి మాట్లాడుకోవడం ఎందుకు?

## 546

**అవతారిక:** అమ్మ స్వామితో నీవెవరితోనైనా కలిస్తే అభ్యంతరం లేదని, కానీ, వాళ్ళను తీసుకొని మా యింటికి రావడం తనకు మాత్రం నచ్చదని చెప్తున్న సన్నివేశం.

### దేసాళం

ప. పోయిన పనులకేల పోనీవయ్యా
చాయ సేసుకొంటినా సమ్మతైతిఁ గాక ॥పల్లవి॥

1. వలవవద్దంటినా వడి నీ వెవ్వరికైనా
అల మాయింటికి రాకుమంటిఁ గాక
పిలువవద్దంటినా పేరుకొ నెవ్వతెనైనా
వలవనిమాట మాతో వద్దంటిఁగాక ॥పోయిన॥

2. చూడcగవద్దంటినా సుదతులవంక నిన్ను
ఆడా నీడా మమ్మంటకు మంటిc గాక
వేదుకకాcడవై నీవు వీది నుండవద్దంటినా
యేడలేనిప్రియాలు నా కేటికంటిcగాక ॥పోయిన॥

3. నగcగా వద్దంటినా ననుపుసతులతోడ
యిగురుమో వడుగకు మిట్టంటిcగాక
అగపడి శ్రీ వేంకటాధిప కూడితి నిన్ను
మొగమోడకుండితినా మొక్కనైతిc గాక ॥పోయిన॥

**అర్థములు:** ప. పోయిన పనులు = జరిగిపోయిన కార్యములు, ఏల = విచారమెందులకు, పోనీవయ్యా = కానివ్వండి, ఛాయ = శోభ,లెక్కించు, సమ్మతైతి = అంగీకరించాను.

1. వలవద్దు = అక్కరలేదు, అల = అక్కడ, రాకుమంటి = రావద్దని అన్నాను, పేరుకొని = పేరుపెట్టి పిలుచు, వలవని = అవసరంలేని, వద్దంటి = కూడదు అన్నాను.
2. సుదతులు = స్త్రీలు, ఆడా నీడా = అక్కడా ఇక్కడా, మమ్మంటకు = మమ్ము తాకవద్దు, వేదుకకాడు = వికాసముతోనున్నవాడు, ఏడలేని = ఎక్కడాలేనటువంటి, ప్రియాలు = ప్రేమలు, నాకేటి = నాకెందులకు, కంటి = చూచితి.
3. నగు = నవ్వు, ననుపు = అనురాగము, సతులు = స్త్రీజనము, ఇగురుమోవింఅడుగకు = లేక మోవి అడుగవద్దు, ఇట్టంటి = ఈవిధముగా అన్నాను, అగపడి = కనిపించి, కూడితి = కలిసితిని, మొగమోడు = సంకోచించు, మొక్క = లేత మొలక.

**భావము:** స్వామీ! జరిగిపోయిన విషయాలకు విచారమెందులకు? పోనివ్వండి. నేనేమైనా ఆ విషయాలను తర్కించి గొడవలు చేశానా? అంగీకరించి మెదలకుండా ఉన్నాను కదా?

స్వామీ! నీవెవరితోనైనా కలిస్తే అక్కరలేదని అడ్డుపడ్డానా? వాళ్ళను తీసుకొని మా యింటికి రావద్దు స్వామీ అని చెప్పానే తప్ప. ఏ స్త్రీనైనా పేరుపెట్టి పిలవవద్దు అని ఆంక్షలు విధించానా? అనవసరమైన ఆ విషయాలన్నీ మాతో చెప్పవద్దని చెప్పాను తప్ప.

స్వామీ! అసలు స్త్రీజనం వైపే చూడవద్దని అన్నానా? అక్కడ నుండి విచ్చేసిన వెంటనే నన్ను ముట్టుకోవద్దు అన్నాను కానీ, సంతోషంతో వికసించి వీధులలో విహరించవద్దని అన్నానా? ఎక్కడా లేని ప్రేమలు నాపై ఒలకబోయవద్దని అన్నాను తప్ప.

స్వామీ! నీవు సంతోషంగా, అనురాగం చూపిస్తూ చెలులతో నవ్వుతూ ఉంటే వద్దు అన్నానా? వాళ్ళ అధరామృతమును అడగవద్దు అన్నాను అంతే కదా! ఈవిధముగా దర్శనమీయగా ఓ శ్రీవేంకటేశ్వరా! నిన్ను కూడినాను. ఏమైనా సంకోచాలు, మొహమాటాలు మీ ఎడ చూపించానా? లేత చిగురుబోడినై నిలబడ్డాను తప్ప.

## 547

**అవతారిక:** అమ్మకు స్వామి అధీనమై వచ్చి చేరుతున్న వేళ నిందలు తిరస్కారాలు తగవని చెలులు అమ్మకు విన్నవిస్తున్న సన్నివేశం.

### పాడి

ప. వాcడిగో దగ్గరి వచ్చె వద్దే యింత
ఆcడుదాన వెదురేcగి యందము గైకొనవే ॥పల్లవి॥

1. యీతcడు విచ్చేయుటేడ ఇంతేసి మాట లేడ
రాతిరెల్లా నీవు నిద్రవోతివో పోవో
చేతికి లోనైనవేళc జేతురా యింత యగడు
యేతవ లెత్తాడc బతి నిల్లాలికిc జెల్లునా ॥వాడిగో॥

2. నిన్నతcడు చూచుటెంత నీవు తలవంచు టెంత

కన్నెకోప మెంత మూఁట గట్టుకొంటివో
మన్నించ వచ్చినవేళ మగవానిఁ బరతురా
తిన్నని పంతాలు చూప దేవులకుఁ జెల్లునా ॥వాడిగో॥

3. మగఁ డాడ వుండనేల మంచాన నీ వుండనేల
బిగువే నీకు వెన్నెతోఁ బెట్టిరో యేమో
నగుతా శ్రీ వేంకటాద్రి నాథుడు గూడెఁ గమ్మటి
జగడాలు రాణివాసములకుఁ జెల్లునా ॥వాడిగో॥

**అర్థములు:** ప. వాడిగో = పదునెక్కి, ఎఉదురేగి = ఎదురుపడి, గైకొను = గ్రహించు.

1. విచ్చేయు = వచ్చు, ఇంతేసి = ఇంత ఎక్కువ, రాతిరెల్లా = రాత్రంతా, చేతికిలోనగు = చేతికి చిక్కు, అగడు = నింద, ఏతవ = కారణము, ఎత్తియాడు = చూపించి మాట్లాడు, పతి = మొగడు, ఇల్లాలు = పెళ్ళాము, చెల్లునా = సరిపోతుందా.
2. కన్నెకోపము = పెండ్లికాని ఆడుదాని కోపము, మూటగట్టుకొను = పోగుజేసుకొను, పరతు = కోపించు, తిన్నని = నేరుగా, పంతాలు = పట్టుదలలు, దేవులకు = దైవము అయిన వారికి.
3. మగడాడ = మగడు అక్కడ, బిగువు = బెట్టు, వెన్నెతో = వెన్నతో, నగు = నవ్వు, క్రమ్మటి = క్రమ్ముకొను, జగడాలు = తగవులు, రాణివాసము = అంతఃపురపు స్త్రీలు.

**భావము:** అదుగో! చూడు! ఆ స్వామి నిన్ను సమీపిస్తున్నాడు. ఇంత పట్టుదల నీకెందులకు? నీవు ఆడుదానివి కదా! నీవే ఆ స్వామికి ఎదురేగి హారతిచ్చి అందాన్నంతా గ్రహించు.

స్వామి వస్తున్నాడంటంటూ చెపుతూ ఉంటే ఇంత పెద్ద పెద్ద మాటలు మాట్లాడావెందులకు? రాత్రంతా నీవు నిద్ర పోయావో లేదో అనుమానంగా ఉన్నది. స్వామి నీకు అధీనమై వచ్చి చేరుతున్న వేళ ఇంత నిందలు తిరస్కారాలు తగునా? ఏవో కారణాలు చూపించి నిందలు, అపవాదులు వేయడం ఇల్లాలివైన నీకు తగునా చెప్పు.

స్వామి నిన్ను చూచేవేళల్లో నీవు అలా తలవంచుకొని కూర్చోవడం ధర్మమేనా? నీ కన్నెకోపాలు ఎంతగా పోగుచేసుకొని మూటలు కట్టి పెట్టుకున్నావో తెలియడంలేదు. క్షమించి దరిచేరుతున్న మగడిని ఈవిధముగా కోపంతో దూరం చేసుకుంటారా? ఇలాంటి పంతాలు పట్టింపులు దేవేరివైన నీకు తగునా?

మగడు అక్కడ ఉండడమేమిటి? నీవు మంచముపై వేరుగా నిద్రించడం ఏమిటి? ఇలాంటి బెట్టుసరి తనాలు నీకు వెన్నతో పెట్టిన విద్యలాగా ఉన్నది. నవ్వుతూ ఆ శ్రీవేంకటేశ్వరుడు నిన్ను కూడినాడు. ఇలాంటి వ్యవహారాలు చెయ్యడం అంతఃపురపు స్త్రీలకు చెల్లుతుందా చెప్పు?

## 548

**అవతారిక:** అన్య స్త్రీ స్వామిని చిరుత నవ్వులు నవ్వి లొంగదీసుకున్నదన్న కోపంతో స్వామిని అమ్మ ఆ యువతి అచూకీ అడుగుతున్నది.

### బౌళి

ప. నిన్నింత సేసినందుకు నేనేమి సేతు దాని
అన్నిటా నెక్కెనుఁ గోప మప్పటినుండీరా ॥పల్లవి॥

1. నగవులు వెదచల్లి నయములు మాటలాడి
జిగురువలె నిన్నది చిక్కించెఁగా
పగటులు పచరించి పడఁతి కనుచూపుల

సగమే జళిపంచి జట్టిగొనెఁగా ॥నిన్నింత॥

2. నటనలనే నడచి నంటు వినయాలు సేసి
యిటువలె నది బటలీఁదించెఁగా
సటలసిగ్గులు చూపి చాయలు సన్నలు సేసి
కటకటా నిను నింత కరఁగించెఁగా ॥నిన్నింత॥

3. కొప్పు దువ్వి నీచెక్కు కొనగోర నంటించి
ముప్పరిఁ జెమటలలో మునిఁగించెఁగా
ఇప్పుడె శ్రీ వేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
అప్పు డాకె నిన్నుఁ గూడి అలయించెఁగా ॥నిన్నింత॥

**అర్థములు:** ప. నిన్నింత = నిన్నీవిధముగా, సేసినందుకు = చేసినందుకు, అన్నిటా = అన్నివిషయాలలోను, ఎక్కెను = వచ్చెను, కోపముంఅప్పటినుండీరా = ఆ సమయమునుండి కోపమధికమై యున్నాను.

1. నగవులు = నవ్వులు, వెదచల్లి = విరజిమ్మి, నయములు = మృదువు, జిగురు = తుమ్మబంక, చిక్కెంచె = వశపరచుకొన్నది, పగటు = ప్రకాశము, పచరించు = కనబరచు, జళిపంచి = భయపెట్టి, జట్టిగొను = మొత్తముగా వశపఱచుకొను.

2. అంటు వినయాలు = దగ్గరైన విధేయత, బటలుంఈదించు = మోసముతో లోంగదీయుట, సటలు = బాధలు, ఛాయలు = శోభలు, సన్నలు = సైగలు, కటకటా = అయ్యయ్యో, కరగించు = హృదయము ద్రవింపజేయు.

3. కొప్పు = సిగ, చెక్కు = చెక్కిలి, కొనగోర = వాడియైన గోరు చివర, అంటించి = తాకించి గీటుపడేట్టు చేసి, ముప్పిరి = అన్ని విధములుగా, మునిగించు = మునుగునట్లు చేయు, ఆకె = ఆమె, అలయించు = ఆయాసపెట్టు.

**భావము:** నిన్నీవిధంగా చేసినదానికి నేనేమి చేయగలను చెప్పు? ఆ సమయమునుండి అమితమైన కోపము వహించి యున్నది.

ఆ స్త్రీ నవ్వులు నవ్వి మృదువుగా మాట్లాడి, తుమ్మ బంకవలె నిన్ను ఆమె అంటుకొని యున్నది కదా! ప్రకాశం కనబరచి, ఆమె కను చూపులు సగం సగం చూపిస్తూ మభ్యపెట్టి నిన్ను వశము చేసుకొన్నది కదా!

ఆ స్త్రీ ఏవేవో నటనలు చేసి వేషాలు వేసి నిన్ను దరిచేరే వినయము ప్రకటించి ఈ మాదిరి నిన్ను మోసము కపటములతో లొంగదీసుకున్నది. ఏవే బాధలు ప్రేమ నటించి శోభలను చూపి, సైగలు చేసి అయ్యయ్యో నిన్నిత ప్రేమలోనికి దింపిందేమిటి స్వామీ!

ఆ స్త్రీ నీ కొప్పు చక్కగా దువ్వి, నీ చెక్కిలిని తగ కొనగోటితో గాటు పడేట్టు చేసి నిన్ను ఇంతగా ముచ్చెమటలతో నింపినది కదా! ఇప్పుడే ఓ శ్రీవేంకటేశ్వరా! ఈవిధముగా నన్ను కలిసితివి. అదేసమయములో ఆమె కూడా నిన్ను కలసి ఆయాసపెట్టినది కదా!

## 549

**అవతారిక:** అమ్మ అన్యమనస్కంగా ఉంటూ పరాకుతో చూస్తుండగా స్వామి తీయని కబుర్లు చెప్పి వశం చేసుకోవడానికి యత్నిస్తున్న దృశ్యం.

### గుజ్జరి

ప. బాపు బాపు మెచ్చితిని పదవే నీవు
తీపులోనఁ జేఁదేల తెగకువే నీవు ॥పల్లవి॥

1. సెలవి నే నవ్వటేడ చేరి నీ గొణగు లేడ
మెలఁకువ లెస్సాయ మేలే నీవు
అలిగినదే లేదు అంతక తొల్లే మనము
పిలిచితే బిగిసేది పెద్దరికమటవే ॥బాపు॥

2. పోందినేఁ జేయివేయుటెంత బొమ్మల నీజంకె నెంత
అందు కందుకు లెస్సాయ నౌనే నీవు
కందువై నమనలోనఁ గపట మించుక లేదు
యిందరుఁ జూడఁగఁ గోప మేడనుండి వచ్చెనే ॥బాపు॥

3. కాఁగిట నేఁ గూడుటెట్టు కరఁగే వింతలో నెట్టు
రాఁగె నిదివో వలపు రావే నీవు
చేఁగదేరఁ గూడితిని శ్రీ వేంకటేశుఁడ నేను
ఆగినరతుల నింత అలయఁగఁదగునా ॥బాపు॥

**అర్థములు:** ప. బాపు = భళీ, మెచ్చితిని = ప్రశంసించాను, తీపు = తీయని రుచి, చేదేల = చేదుగాఉన్న రుచి ఎందులకు, తెగవకు = వీడకు.

1. సెలవి నవ్వు = పెదవిమూల నవ్వు, గొణగు = చిన్నగా మాట్లాడు, మెలకువ = జాగ్రాదావస్త, లెస్స = ఎక్కువ, మేలు = శుభము, అల్గినది = కోపించినది, తొల్లి = ముందు, బిగియు = బెట్టు చూపించు, పెద్దరికము = గౌరవము.
2. పొంది = కూడి, చేయివేయు = స్నేహభావము చూపు, బొమ్మల జంకు = కనుబొమ్మల అదరవేయు, లెస్స = ఎక్కువ, ఔనే = అవును, కందువ = జాడ, కపటము = మోసము, ఇంచుక = కొంచెము, కోపమేడ = అలకాగృహము.
3. కాగిట = కౌగిట, కూడుటంఎట్టు = కలుసుకోవడం ఎలా, కరగే వింత = జరుగుతునా విషయము, రాగు = అనురాగము, వలపు = ప్రేమ, చేగదీర = సారవంతమై, ఆగిన రతులు = ఆగిపోయిన రతిక్రీడ, అలయు = శ్రమపడు.

**భావము:** బాగు బాగు భేష్! భళీ! అంటూ ప్రశంసించుతాను నిన్ను. ఇంక పదవే! తీపును రుచి చూస్తూ చేదని అనడం ఎంతవరకూ సత్యం? వీడక చెప్పవే!

పెదవి మూలగా నవ్వడం ఎక్కడ? నీవు చిన్నగా మాట్లాడి గొణగడం ఎందుకు? నీ జాగ్రదావస్తే శుభము. నీవు కోపించినదీ లేదు. అంతకు మునుపు పిలిచినప్పుడు బెట్టు చూపించినది గౌరవ సూచకమా?

నేను నిన్ను పొందుకూడగా నీపై చేతులువేయగా, నీవు కనుబొమ్మలు జంకిస్తూ చూడడమెందుకు? అందుకు నీవు ఎక్కువే చేశావు. జాడ తెలిసి మనలోన కపటము అనేది లేనేలేదు. కానీ ఇందరు చూస్తూ ఉండగా నీవు కోపగృహము నుండి రావడం ఏమైనా బాగుందా?

నీవు ఇంతలోనే అలా ద్రవించిపోవడమెందుకు? ఇంక నేను నీ కౌగిలిలో కూడడం ఎలా? ఓ శ్రీవేంకటేశ్వరా! సారవంతమై నిన్ను కూడితిని. ఆగిన రతుల నింతగా శ్రమపెట్టడం తగునా!

## 550

**అవతారిక:** అన్య స్త్రీ స్వామి పడక గదిలో చేరి సరస శృంగారాలు గావిస్తున్న దృశ్యం గమనించిన అమ్మ స్వామిని ప్రశ్నిస్తున్నది.

### ఆహిరి

ప. అండఁ గూచుండెను చెలి యంత చాలదా
నిండు నీతో జూజమాడ నేఁడే నేరుచునా ॥పల్లవి॥

1. పగడవాతెర యెత్తి పలికెను చాలదా!నీవు
మగువను మంతనాన మాటాడియ్యఁగా
తగినకన్యక ఇంతేఁ తమకించనేల
ఇగిరించె సిగ్గులు నేఁ డీప్పుడే తేరునా ॥అండ॥

2. తలుపుమాటున నుండి తమిఁ జూచెఁ జాలదా నీవు

పిలిచి చేయివట్టి పెనఁగఁగను
చలివాయ నిప్పు డిట్టె సరసము లేల
వొలసి రట్టడితన మొక్కమాఁటే వచ్చునా ॥అండ॥

3. కాఁగిలించఁగా నీతోఁ గరఁగెను చాలదా నీవు
మాఁగినమోవి ఇచ్చి మచ్చు చల్లఁగా
పాఁగిన శ్రీ వేంకటేశ పడఁతిఁ గూడితివి
ఆఁగి నీతో రతిసేయ కప్పుడే పోనిచ్చునా ॥అండ॥

**అర్థములు:** ప. అండ = సమీపము, నిండు = పరిపూర్ణమైన, జూజము = పాచికలాట, నేరుతునా = నేర్చుకొన్నదా?

1. పగవాతెర = పగడపు తెర, మంతనము = ఏకాంతము, కన్యక = పెండ్లికాని స్త్రీ, తమకించు = త్వరపడు, ఇగిరించు = తగ్గిపోవు, నేడుంఇప్పుడే = ఈరోజు ఈ సమయములోనే, తేరునా = పూర్తియగునా.
2. తమి = అపేక్ష, పెనగు = చుట్టుకొను, చలివాయు = బుజ్జగించు, ఒలయు = కూర్చు, రట్టడి తనము = నిందారోపణము, ఒక్కమాటు = ఒక్కసారి.
3. కాగలించు = కౌగలించు, కరగు = ద్రవించు, మాగినమోవి = పక్వమైన ముఖము, మచ్చు = ఉదాహరణ, పాగు = తీగపాకము వంటి, పడతి = స్త్రీ, ఆగి = విశ్రమించి, రతిసేయకంఅప్పుడే = రతిక్రీడ చేయకుండా వెంటనే, పోనిచ్చునా = వెళ్ళడానికి అనుమతించునా.

**భావము:** స్వామీ! ఆ రమణి నీ ప్రక్కనే కూర్చొని యున్నది చాలదా? ఆమెనీతో పాచికల ఆట ఆడడం ఇవాళే నేర్చుకొన్నదా ఏమిటీ!

పగడపు తెర ఎత్తి మాట్లాడినది అది చాలదా? నీవు ఆమెతో కలసి ఏకాంతములో సంభాషణలు జరుపుతూ ఉంటే ఆమె నీకు తగిన యువతే ననిపించింది. ఇంకా తొందరపడడం ఎందుకు? ఆమె సిగ్గులన్నీ ఇప్పుడిప్పుడే తగ్గిపోతున్నాయి ఈరోజుకింక యిప్పుడే మీ వ్యవహారాలు తెల్లవారుతాయా? కానివ్వండి.

ఆమె తలుపుచాటునుండి మిమ్ములను అపేక్షతో మోహముతో గమనిస్తూ ఉన్నది అది చాలదా? నీవామెను చేయిపట్టుకొని చుట్టుకోవడానికి? నీవామెను బుజ్జగించడం వంటి సరసములెందుకు చేయడం? ఇలా నిందారోపణ చేయడం ఒక్కసారే వచ్చేస్తుందా?

కౌగలించుకోగానే నీతో కలసి ద్రవించిపోయి నిన్నలరించినది గదా ఇది చాలదా? నీవు మరలా పక్వమైన అధరామృతమునిచ్చి ఆమెకు మాదిరిగానే మచ్చుకు రుచి చూపించి ప్రేమను విరజిమ్మినావు. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈవిధముగా మధురమైన తీగపాకమువంటి రుచిగల స్త్రీని కలసినావు. ఆగి ఆగి నీతో రతిక్రీడ చేయకుండా అప్పుడే నీవు వెళ్ళడానికి తను అనుమతినిస్తుందంటారా?

## 551

**అవతారిక:** అలమేలుమంగా శ్రీనివాసుల సరస శృంగారాలను తిలకిస్తున్న చెలులు మాట్లాడుకొంటున్న సన్నివేశం.

### గౌళ

ప. ఏమని చెప్పుదమే ఇద్దరి భావములును
ప్రేమము లీరూపములై పెనఁగఁగఁ జొచ్చినవి ॥పల్లవి॥

1. కోపగించుకొని రాఁగా కొంగువట్టీ రమణుఁడు
వోపనంటేఁ బెనఁగీనే వొయ్యనే చెలి
పైపై కాఁగిటఁబట్టి బలిమి సేయఁగఁబోఁగా
తీపుల పెదవి వంచి తిట్టీ నతనిని ॥ఏమని॥

2. పెదవి గొణఁగుకోఁగా ప్రియుఁ డాకెచెక్కు నొక్కె
చెదర నాదుత (చు?) లోనై చిక్కీఁ జెలి

మొదలఁ గోలుముందుగ మోవి గంటిసేసే నాడ
అదివో చురుముఁ (కు?)జూపు లాకె చల్లీ మీఁదను ॥ఏమని॥

3. పక్కన నానవెట్టఁగ పానుపుపైఁ బడవేసీ
చొక్కుచుఁ గరఁగి తానే సొలసీఁ జెలి
యిక్కువైన శ్రీ వేంకటేశుఁడు గూడె నిట్టె
ముక్కుమీఁది వేలితోన మోనమున నున్నది ॥ఏమని॥

**అర్థములు:** ప. ఏమని = ఏవిధముగా, చెప్పెదము = చెప్పగలము, భావములు = తలంపులు, ప్రేమము = వలపులు, రూపము = తీరు, పెనగు = చుట్టుకొను, చొచ్చు = ప్రవేశించు.

1. కోపగించుకొని = అలకబూని, రమణుడు = అందమైన స్వామి, ఓపను = ఒప్పుకోను, పెనగు = చుట్టుకొను, ఒయ్యన = తిన్నగా, కాగిట = కౌగిట, బలిమి = బలవంతము, తీపులపెదవి = సలుపుకలిగించు, తిట్టీ = తిట్టుచున్నది.
2. గొణుగు = వినబడీ వినబడనట్లు మాట్లాడు, ఆకె = ఆమె, చెక్కు = చెక్కిలి, చెదరు = ఎగిరిపడు, ఆడుత = స్త్రీత్వం,ముద్దులాడు, లోనై = వశమై.
3. నానబెట్టు = నిదానముగా, పడవేసి = పడునట్లు త్రోసి, చొక్కు = మత్తు, కరగి = ద్రవించి, సొలయు = వ్యాపించు, ఇక్కువ = ఉనికి, ముక్కుమీద వేలు = ఆలోచనాపరమై ఉండుట, మోనము = మౌనము.

**భావము:** ఏవిధముగా చెప్పగలము వారిద్దరి తలంపులను, వలపులీ తీరుగా చుట్టుకొని వారిని ప్రేమలో బంధించినవి.

ఆ అమ్మ కోపముతో లోనకు రాగా స్వామి ఆమె కొంగుపట్టుకుని, ఒప్పుకోను ఓర్చుకోలేను అన్నా విడవకుండా చుట్టుకుని ఉక్కిరిబిక్కిరి చేశాడు. అమ్మను కౌగిటిలో గాఢముగా బంధించి బలవంతము చేయబోగా ఆమె తన మధురమైన పెదవులతో తలవంచుకొని దూషించినది.

అమ్మ లోలోన ఏవో మాటలు వినబడీ వినబడనట్లు మాట్లాడుకొంటూ ఉండగా తటాలున స్వామి ఆమె చెక్కిలి నొక్కినాడు. ఆమె ఒక్కసారి ఎగిరిపడి స్త్రీత్వము పెల్లుబికి రాగా, నర్తిస్తూ వశమైనది. స్వామి అంతటితో ఊరుకున్నాడా అంటే ఆమె ముఖముపై దంతక్షతములు వేసినాడు. అంతట ఆ అమ్మ చురుకైన కన్నులతో చూస్తూ ఆ స్వామి మీద వలపులను చల్లినది.

ప్రక్కనే ఆలసించి, ఆలసించి, స్వామి అమ్మను పానుపుపై పడవేసి మత్తులో మునుగగా తానుకూడా అలసి సొలసిపోయినది. ఉనికి తెలిసి ఆ శ్రీవేంకటేశ్వరుడు కూడగా అమ్మ సాలోచనగా ముక్కుమీద వేలు వేసుకొని మౌనముగా ఉండిపోయినది.

## 552

**అవతారిక:** అమ్మ స్వామికోసం మదన తాపంతో ఉన్న విషయం గమనించిన చెలులు స్వామిని రమ్మని స్వాగతిస్తున్నారు.

### ఆహిరి

ప. అల్లదె మేడమీఁద నతివ
వెల్లవిరయ్యా నిట్టె విచ్చేయవయ్యా ॥పల్లవి॥

1. వాలుకచూపులు నీపై వంచీ
బేలుఁబులకలు మేనఁ బెంచీ
తాలిమెందు దాఁచెనో తాను నీకే
మేలుసేసి వున్న దిదె మిక్కిలి మాపిన్నది ॥అల్లదె॥

2. మనసు నీపైఁ గడుమరిగీ
వొనరుఁజెలులమీఁద నొరగీ
తనివిదీర దెంతైనా తాను నీకె

అనయము దలఁచితి నన్నది మాపిన్నది ॥అల్లదె॥

3. తమకపుఁ జెమటలఁ దడసీ
జమళి కోరికలచే జడిసీ
నెమకి శ్రీవేంకటేశ నిన్నుఁ గూడి
గములై ననీగుణాలు కన్నది మాపిన్నది ॥అల్లదె॥

**అర్థములు:** ప. అల్లదె = అదే, అతివ = స్త్రీ, వెల్లవిరి = తేటతెల్లము, విచ్చేయవయ్యా = రావయ్యా.

1. వాలుకన్నులు = సోగకన్నులు, వంచీ = సారించి, బేలుపులకలు = వంచనతో కూడిన గగుర్పాటు, మేన = శరీరంపై, పెంచీ = వృద్ధిచేసెను, తాలిమి = ధైర్యము, దాచెను = రహస్యముగా పెట్టు, మేలు = శుభము, పిన్నది = చిన్న వయస్కురాలు.
2. కదు మరిగి = ఎక్కువగా అలవాటై, ఒనరు = ఒప్పువిధముగా, ఒరగి = వాలి, తనివి = తృప్తి, ఈకె = ఈమె, అనయము = మరిమరి, పిన్నది = చిన్న వయస్కురాలు.
3. తమకము = త్వరపడు, తడసీ = నీరునిండు, జమళి = జత, జడిసి = భీతి, నెమకు = వెదకు, గములు = గుంపులు, గుణాలు = స్వభావము, కన్నది = చూసినది, పిన్నది = చిన్న వయస్కురాలు.

**భావము:** అదుగో ఆమేడ మీద చిన్నది చూస్తున్నది. అందరికి బట్టబయలైపోయినది కానీ నీవు ఇంక వెంటనే రావయ్యా!

ఆమె తన దీర్ఘమైన కన్నులను నీపై సారించి వంచనతో గూడిన శరీరపు గగుర్పాటు అధికముగా పొందగా, ధైర్యాన్నంతా ఎక్కడ దాచిపెట్టిందో తెలియదు. ఈ బాలాకుమారి నీకే అధిక శుభములను చేకూర్చే విధంగా నిలబడి ఉన్నది.

మనసంతా నీమీదనే ఉంచుకొని అలవాటైన విధంగా తాను ఒప్పిదముగా చెలులపైన వాలి తృప్తి దీరకుండా నీకై ఎదురు చూపులు చూస్తున్నది. నీకై మరి మరి ఎదురుచూపులు చూస్తూ ఈ చిన్నది తలుచుకుంటూ ఉన్నది.

నీపై దాహార్తితో శరీరము నిండా చెమటలతో తడిసి ముద్దై జంట కూడాలనే కోరికలధికమై ఒకవిధమైన భీతితో, జంకుతో నిన్నే కన్నులతో వెదుకుతూ శ్రీవేంకటేశ్వరా నిన్ను కలసినది, గుంపులైన నీ సుగుణాలను కన్నది మరియూ విన్నది మా బాలామణి స్వామీ!

## 553

**అవతారిక:** అలమేలుమంగా శ్రీనివాసుల సరస శృంగారాలను తిలకిస్తున్న చెలులు మాట్లాడుకొంటున్న సన్నివేశం.

### నాదరామక్రియ

ప. అంది తెలియఁగరాదా అంగన నేరుపులెల్లా
కందువ తారుకాణలు గలిగె మీకిప్పుడు ॥పల్లవి॥

1. నిద్దపు నొసలిమీఁద నిలువుఁగస్తూరిబొట్టు
అద్దము చూచి గోర నటుదిద్దఁగా
వొద్దిక వెనకవంకననుండిననీనీడ గని
ముద్దుచూపి సన్న సేసీ మొరఁగులేలయ్యా ॥అంది॥

2. గుబ్బలపై మాణికాలఁ గుచ్చినహరములు
అబ్బురానఁ దలవంచి యమరించఁగా
నిబ్బరాన నీవెదుట నిలిచితే నీనీడ
గబ్బితనమునఁ గని గాఁగిలించె నదివో ॥అంది॥

3. మించుబంగారుపావాలు మెట్టఁగ శ్రీవేంకటేశ

చంచల నీవును దనసరి నుండఁగా
నించి గోరిమెఱుఁగులో నీరూపు వొడగని
అంచెల నిన్నుఁ గలసినది మెచ్చరాదా ॥అంది॥

**అర్థములు:** ప. అంది = చెప్పినది, అంగన = స్త్రీ, నేరుపు = నైపుణ్యము, కందువ = జాడ, తారుకాణ = ఋజువు.

1. నిద్దపు = చక్కనైన,నునుపైన, నొసలు = నుదురు, కస్తూరి బొట్టు = కస్తూరితో పెట్టు నిలువు బొట్టు, గోర = గోరుతో, దిదగా = దిద్దుకొనగా, ఒద్దిక = అనుకూలము, వెనకవంక = వెనుకవైపు, ముద్దుచూపు = ఇష్టము చూపు, సన్న = సైగ, మొరగు = దాగుకొను.
2. గుబ్బలు = రొమ్ములు, మాణికాలు = మాణిక్యాలు, గుచ్చిన హారములు = కూర్చబడిన దండలు, అబ్బురము = ఆశ్చర్యము, అమరించు = సమ్మతించు, నిబ్బరము = ధైర్యము, గబ్బితనము = కొంటెతనము, కాగలించె = కౌగలించెను.
3. మించు = గొప్పయైన, పావాలు = పావుకోళ్ళు, మెట్టగ = పెట్టగ, చంచులు = నేర్పరివారు, తనసరి = తనతో సమానముగా, నించు = నిండజేయు, గోరిమెరగులు = గోటి మెరుపులు, రూపు = ఆకారము, ఒడ = ఛాయ, అంచెల = వరుస, మెచ్చరాదా = ప్రశంసించరాదా!

**భావము:** అదుగో చూడండి. ఆ అమ్మ నేర్పరితనమంతా తెలియడంలేదా? ఆ త్రోవలో మీకిప్పుడు ఋజువులు తెలుస్తున్నాయి గమనించండి.

ఆమె అందమైన నుదుటిమీద నిలువైన కస్తూరి బొట్టును అద్దము చూసి దిద్దుకొను చూచుకుంటూ, గోరుతో సరిదిద్దుకుంటూ ఉండగా, స్వామీ! మీరు అనుకూలముగా వెనుకనిలబడి నీ నీడ గమనించి ఇష్టము చూపుతూ సైగలు చేస్తూ ఉండగా ఇంకా దాగుకొని నిలబడడమెందుకు బయటకు రావయ్యా!

ఆమె చనుగుబ్బలపై మాణులు మాణిక్యాలు గ్రుచ్చిన హారాలు ధరిస్తూ ఆశ్చర్యముతో తనను తాను చూచుకుంటూ ఉండగా ధైర్యముగా నీవెదురు నిలబడగా నీ నీడ గమనించి ఆ అమ్మ కొంటెతనముతో కౌగలించుకున్నది అదిగో!

అధికమైన కాంతులతో మెరిసే బంగారు పావుకోళ్ళతో అడుగు పెట్టగా ఓ శ్రీవేంకటేశ్వరా! నేర్పరి తనముతో నీవును తనకు సరియై ఉండగా, ఆమె గోటి రంగు మెరగులో నిన్ను గమనించి నిన్ను జతకలసినది. ఇంకనైనా తనను ప్రశంసించవచ్చు గదా!

## 554

**అవతారిక:** స్వామి దరిచేరడంలేదని మదన తాపంతో ఉన్న అమ్మ స్వామిని రమ్మని ఆహ్వానిస్తున్నది.

### పాడి

ప. బిగిసే వింకా నీవు పిలిచిన రావు
చిగురువలెనే వుండు చేఁగ సుమ్మీ వలపు ॥పల్లవి॥

1. చిత్తజునియమ్ములనుఁ జెలియచూపులు లోలోఁ
బొత్తుల నున్నవి పాలువో దెన్నఁడు
హత్తినజక్కవలును నంగనచన్నులు నొళ-
జొత్తుసుమ్మీ మీఁదటెత్తు చూచుకొందుగాని ॥బిగిసే॥

2. తుమ్మిదలపవుఁజులు తొయ్యలినెరిఁగురులు
వుమ్మడి నున్నవి పాయ కొకటొకటి
చిమ్ములపలుకులును చిలుకలుఁ దమలోన
దొమ్మిచుట్టరిక మింకఁ దోఁచినది దెరువు ॥బిగిసే॥

3. చందురునివెన్నెలలు సకియలేఁతనవ్వులు

ముందువెనకలు వాసి మొద లొక్కటే
ఇందునె శ్రీవేంకటేశ ఇంత సేసి కూడితివి
పొందినసతికి నీకుఁ బోదుసుమ్మీ యెప్పుడు ॥బిగిసే॥

**అర్థములు:** ప. బిగియు = బెట్టుజూపు, చిగురు = లేత, చేగ = సారవంతము, సుమ్మీ = నిశ్చయార్థకము.

1. చిత్తజుడు = మన్మథుడు, అమ్ములు = బాణములు, లోలో = లోపలగా, పొత్తులు = స్నేహకలయిక, పాలుబోదు = తోచదు, హత్తిన = దగ్గరై,హత్తుకొని, జక్కవలు = చక్రవాక పక్షులు, అంగన = స్త్రీ, చన్నులు = వక్షోజములు, ఒళ = రహస్యము, జొత్తు = జట్టు, మీదటెత్తు = తర్వాత వేసే పైయెత్తు.
2. తుమ్మిదలు = తుమ్మెదలు, పవుజులు = దండు, తొయ్యలి = ఆడుది, నెరికురులు = వక్రతగలిగిన కేశములు, ఉమ్మడి = పొత్తు, పాయ = చీలిక, ఒకటొకటి = ఒకదానికొకటి, చిమ్ముల పలుకులు = విరజిమ్మబడే మాటలు, దొమ్మి = అందరు కలసి, తోచినది = అర్థమయినది.
3. సకియ = చెలి, లేత నవ్వులు = తరుణప్రాయపు నవ్వులు, వాసి = తారతమ్యము, మొదలు = ఆరంభము, ఇంతసేసి = ఇంతగా కార్యములు చేసినవాడై, పొందిన = కూడిన, సతి = భార్య, పోదు = ఏమీ పోగొట్టుకొనవు.

**భావము:** ఇంకా ఎందుకు నీవు బిగువు, బెట్టులు చూపిస్తున్నావు. పిలిచినప్పటికీ రాక అక్కడక్కడే తిరుగాడు చున్నావు ఈ ప్రేమ చూడడానికి చిగురువలె లేతదైనను వాస్తవానికి సారవంతమైనది సుమీ!

ఈ చెలి చూసే చూపులు మన్మథుని బాణాలే సుమా! స్నేహబాంధవ్యాలన్నీ లోపల లోపలే దాగి దాగి ఉన్నవి. ఏమీ దిక్కు తోచడంలేదు సుమా! ఆ హత్తుకొని కూర్చున్న చక్రవాక పక్షులు స్త్రీ చన్నులుగా భావించినట్లైతే రహస్యముగా ఒకదానినొకటి వత్తుకొని ఎత్తుకు పైఎత్తు వేసే విధంగా భాసిల్లుతున్నది సుమా!

ఆ చెలి కేశములు తుమ్మెదల బారువలె నున్నవి. పాయలు తీసినప్పటికి కలసి మెలసి యున్నవి. ఆమె మాట్లాడే మాటలు చిలుకలు తమలో తాము అందరూ కలిసి చేసే బంధుత్వమై తోచినది సుమా!

ఆ చెలి నవ్వులు చందురుని వెన్నెలను మించి యున్నవి. ముందు వెనుకలు వేరు వేరు అయినప్పటికి మొదలు మాత్రం ఒకటే సుమా! ఇక్కడే ఓ శ్రీవేంకటేశ్వరా! ఇంత వింతైన కార్యములు చేసి నన్ను కలసినావు. నీవు పొందిన ఆ అలమేలుమంగమ్మకు, నీకు పోగొట్టుకునేది ఏమీ ఉండదు సుమా!

## 555

**అవతారిక:** స్వామి శరీరంపై ఉన్నటువంటి గోరుగీట్లు, దంతక్షతాలు గమనించిన అమ్మ స్వామిని నిలదీసే సన్నివేశం.

### లలిత

ప. చేసినట్టెల్లా నీవు సేయవయ్యా
వోసరించి నవ్వుతా నే నూరకుండే నిఁకను ॥పల్లవి॥

1. మల్లడిమీగుణములు మానుమన మాకేల
చెల్లుబడిగలవారే చెప్పేరు గాక
ముల్లు ముంటనేకాక ముసలాన వచ్చునా
వొల్ల వొల్ల నీవద్ద నూరకుండే నిఁకను ॥చేసినట్టెల్లా॥

2. కొత్తసుద్దులెల్ల నేము కోరి నీతో నాడనేల
చిత్తమువచ్చినవారే చెప్పేరుగాక
మెత్తనైన చోటికే మించినగుద్దలి వాఁడి
వొత్తనేల వింతవార మూరకుండే మిఁకను ॥చేసినట్టెల్లా॥

3. అంగపు నీ రేకలు అవి చూప మాకేల
చెంగట సలిగెవారే చెప్పేరుగాక
అంగవించి శ్రీవేంకటాధిప నన్నుఁ గూడితి–
వుంగిటిరతులతోడ నూరకుండే మిఁకను ॥చేసినట్టెల్లా॥

**అర్థములు:** ప. చేసినట్టు = నేను చేసినవిధము,చెప్పిన పద్ధతి, ఓసరించు = వదలిపెట్టు, ఊరకుండు = మాట్లాడకయుండు.

1. మల్లడి = మల్లయుద్ధ వీరుని, గుణము = స్వభావము, మానుమన = వదలిపెట్టమని చెప్పుట, చెల్లుబడి = సరిపోయినవారు, ముంట = ముల్లుతో, ముసలము = రోకలిబండ, ఒల్ల = ఓపలేను.
2. సుద్దులు = బుద్ధులు, నేము = మేము, చిత్తము = మనసు, గుద్దలి = గొద్దలి, ఒత్తనేల = బాధించు, వింత = అబ్బురము.
3. అంగపు = శరీరపు, రేకలు = గీట్లు, చెంగట = సమీపము, సలుగు = పట్టు, అంగవించు = యత్నించు, ఉంగిటిరతులు = కపటపు రతిక్రీడలు.

**భావము:** స్వామీ! నేను చేసినవిధంగా, చెప్పిన రీతిలో కార్యములు చేయవయ్యా! నీవలా వీడి వీడి మాట్లాడుతూ ఉంటే నవ్వుతూ ఉంటే నేను మాట్లాడలేక యూరక ఉండిపోవలసినదే కదా!

మల్లయుద్ధ వీరుని లాగా ఉండే నీ ప్రవర్తన మానుకోమని చెప్పడానికి మేమెవరిమి? నీతో సరిపోలిన వారే చెప్తారు గాక! శరీరంలో దిగిన ముల్లు ముల్లుతో కాక రోకటి బండతో తీసే ప్రయత్నం చేస్తే వస్తుందా? నేనిక ఓర్చుకోలేను స్వామీ! నీ వద్ద మాట్లాడక ఉండి పోవడమే శుభము.

క్రొత్త క్రొత్త బుద్ధులన్నీ మేము ఆశపడి కోరి కోరి నీతో మాట్లాడడం ఎందులకు? నీకు మనసుకు నచ్చినవారే చెప్తారు గాక! బాగా మెత్తగా ఉన్న తావుల్లో ఎవరైనా గొద్దలిని ఉపయోగిస్తారా? నిన్నికా మరీ మరీ బాధించడమెందూలకు? నీ వద్ద మాట్లాడక ఉండి పోవడమే శుభము.

స్వామీ! నీ శరీరంపై ఉన్నటువంటి గోరుగీట్లు, దంతక్షతాలు మాకు చూపించడం ఎందులకు? నీ చెంత జేరి నీతో నలిగినవారే చెప్తారు గాక! యత్నించి ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను కలసినావు. మేమిక నీ కపటపు మోసపు రతిక్రీడలనే భరించి మాట్లాడక ఉండి పోవడమే శుభము.

**విశేషము:** ఈ కీర్తనలో "ముల్లును ముల్లుతో తీయకుండా రోకలిబండతో తీస్తే వస్తుందా!" అని, "మెత్తనైన తావుల్లో గొద్దలి ఉపయోగించవలసిన అవసరం లేదు" అని మంచి లోకోక్తులను ఉపయోగించాడు.

## 556

**అవతారిక:** అమ్మ ఎందుకో స్వామిపై కినుక వహించగా చెలులు సర్ది చెప్పి స్వామిని చేరమని చెప్తున్నారు.

### శంకరాభరణం

ప. ఇద్దర నేకములైతే నేమాయనే
చద్దివేఁడి వలపులు జాగుసేయఁ జెల్లునా ॥పల్లవి॥

1. తుమ్మిదవంటివాఁడు తొలుతనే మగవాఁడు
యెమ్మెలకు నేడనున్నా నేమాయనే
తమ్మి పువ్వువంటి దింతే తగిలినయాఁటదెల్లా
సమ్మతించవలెఁగాక సడిఁబెట్టఁజెల్లునా ॥ఇద్దర॥

2. వెన్నెలవంటి దింతే వెస మగవానినవ్వు
యెన్నిచోట్లఁ గాసిన నేమాయనే

యెన్నఁ జకోరాలవంటి వింతులకనుఁగొనలు
అన్నిటాఁ బొందౌటగాక అలుఁగఁగఁజెల్లునా ॥ఇద్దరు॥

3. సిరులగాలివంటిది శ్రీవేంకటేశుమనసు
ఇరవై యెందువారినా నేమాయనే
విరులతావివంటివెలఁదివి నిన్నుఁగూడె
నరసుఁడాతని నింక జరయంగఁ జెల్లునా ॥ఇద్దరు॥

**అర్థములు:** ప. ఏకము = ఒకటి, చద్దివేడి = చల్లని మరియు వేడి, జాగుసేయు = ఆలస్యముచేయు, చెల్లునా = సరిపోవునా.

1. తొలుత = మొదట, ఎమ్మె = విలాసత్వము, ఏడనున్నా = ఎక్కడున్నప్పటికి, తమ్మిపూవు = పద్మము, ఆటది = ఆడుది, సమ్మతించు = అంగీకరించు, సడి = శబ్దము.
2. వెస = వేగము, కాసిన = వెన్నెల కాసిన, ఎన్న = లెక్కింప, చకోరములు = వెన్నెలను తిని బ్రతికెడు పక్షులు, ఇంతులు = స్త్రీలు కనుకొనలు = కడగంటి చూపులు, పొందౌట = పొందడము, అలుగగ = కోపించ.
3. సిరులగాలి = ఐశ్వర్యముహొరు, ఇరవు = స్థానము, పారు = ప్రవహించు, విరులతావి = పువ్వుల సువాసన, వెలది = స్త్రీ, అరసు = ప్రభువు, జరయు = నిందించు.

**భావము:** మీ యిద్దరూ ఒకటైతే ఏమయినది? చలి వేడి రెండూ ఒకేసారి కలసిన ప్రేమలవలె ఉంటుంది కదా? ఇంకా ఆలస్యము చేయడం సరిపోతుందా?

అసలు మొదటనే మగవాడు తుమ్మెద వంటి వాడు. మకరందమును గ్రోలడమే వారిపని. అతను మనోహరముగా విలాసత్వముతో ఎక్కడున్నా ఏమైనది? స్వామికి తగిలిన ఆడుది పద్మమువంటిది. సమ్మతించవలెను కానీ గొడవచేయుట తగునా?

మొగవాని నవ్వు శీఘ్రగతి వెన్నెల వంటిది కదా! ఎన్నిచోట్ల వెన్నెల కాసినట్లు ఆ స్వామి విహరించనేమి? చూడడానికి చకోరపక్షులవంటివి ఈ ఇంతుల కను కొనలు. అన్నిటినీ అనుభవించడం అలవాటు చేసుకోవాలి కానీ ఇలా అలుగడం సరిపోవునా?

శ్రీవేంకటేశ్వరుని మనసు ఐశ్వర్యపు హొరు గాలి వంటిది. స్థానమై ఎక్కడ నున్నప్పటికి ఏమైనది? మంచి సుగంధ పుష్పముల తావి వంటి నిన్ను గూడినాడు. సరసుడైన ఆ స్వామిని ఈ విధముగా నిందించ దగునా?

## 557

**అవతారిక:** స్వామి కోపముగా వెళ్ళిపోయాడన్న బాధతో అమ్మ కలహాంతరితవలె ప్రవర్తిస్తూ స్వామి పొందు కోరుకొంటున్నది.

## సామంతం

ప. అందుకే చింతయ్యాని అప్పటనుండియు నాకు
కందువ నెదుగఁబోయి కమ్మరఁ దేవుగా ॥పల్లవి॥

1. పదఁతి వాని నొడఁబరచి తోడుకరావే
కడు నీనేరుపు లిందే కనుఁగొనేఁగా
వడిఁ బరాకైతినంటా వాఁడే యలగిపోయె
బడి నేఁగి నామారు పై కొని మొక్కవుగా ॥అందుకే॥

2. యెంతరానన్నా వాని నీపొద్దే తోడుకరావే
యిఁతి (యింతి?) నీవు సేసేమేలు ఇందుఁజూచేఁగా
పంత మేమోఅంటినంటా పట్టఁగా నలిగిపోయె
ఇంతలో నామారు వాని ఇంటికి నేఁగవుగా ?అందుకే?

3. శ్రీ వేంకటేశుని నన్నుఁ జేకొని కూడించితివే

యీ వేళ నిన్ను మెచ్చే దిందువంకఁగా
పూవుల వేసితినంటాఁ బొదిగి నన్నిదె పట్టె
ఆవల నామారు నీవు అతని వేయవుగా ?అందుకే?

**అర్థములు:** ప. అందుకే = అందువలననే, చింతయ్యాని = బాధవుతున్నది, కందువ = జాడ, నెదుకబోయి = వెదుకబోయి, క్రమ్మ = ఉబికివచ్చు, దేవుగా = దేవుడివలె.

1. ఒడబరచి = ఒప్పించి, తోడుక = తీసుకుని, నేరుపులు = నైపుణ్యములు, కనుగొను = కనిపెట్టు, వడి = వేగము, పరాకు = పరధ్యానము, అలగి = కోపించి, పది = క్రమము, ఏగి = వెళ్ళి, నా మారు = నాకు బదులుగా.
2. ఎంత రానన్నా = ఎన్నిమార్లు రాను అన్నప్పటికి, ఈపొద్దే = ఈ పూటనే, తోడుక = తీసుకుని, సేసే = చేయునట్టి, మేలు = శుభము, ఇందు = ఇందులో, చూచేగా = చూస్తాను కదా!, పంతము = పట్టుదలలు, అంటి = తాకు, నలిగిపోయె = తగ్గిపోవు, నామారు = నా బదులు, ఏగు = వెళ్ళు.
3. చేకొని = చేపట్టి, కూడించి = కలిసితివి, మెచ్చు = ప్రశంసించు, ఇందువంక = ఈ పనిగా, పొదిగి = చుట్టుకొను, పట్టె = చేకొను, ఆవల = అవతలవైపు, నామారు = నాకు బదులుగా, వేయవుగా = పువ్వులను వేయవు గదా!

**భావము**: చెలీ! అందువలననే నాకు విచారము బాధ కలుగుచున్నది. జాడ వెదుకబోయి పైకుబికివచ్చు రీతిగా నున్నది.

ఆ స్వామినొప్పించి ఇక్కడకు తీసుకుని రావే! చెలీ! నీ నైపుణ్యమేమిటో ఇప్పుడే తెలుస్తుంది. ఆ స్వామి పరధ్యానముతో కోపముగా వెంటనే వెళ్ళిపోయాడు. నాకు బదులుగా నీవు హద్దు మీరి నమస్కరించవు గదా!

స్వామి ఒకవేళ ఎంత రానన్నప్పటికి వదలకుండా ఈ పూటే తీసుకుని రావే! ఓ ఇంతీ! నీవు నాకు చేసే మేలేమిటో ఇందులోనే తెలుస్తుంది నాకు. ఆ స్వామికి అంతం పంతం పట్టుదల ఎందుకో తెలియదు. నన్ను అంటుకొని పట్టుకోగానే నేను తగ్గి యుంటిని. ఇంతలో సమయం గ్రహించి నా బదులు నీవు ఆ స్వామి యింటికి వెళ్ళవు కదా!

ఆహా! చెలీ! ఆ శ్రీవేంకటేశ్వరుని తీసుకొని వచ్చి నన్ను కలిపితివి. ఈ రోజు నిన్ను ఈ సానుకూల కార్యానికి ఎక్కువగా ప్రశంసిస్తున్నాను. నేను పువ్వులు తనపై వేశానని నన్ను చుట్టుకొని పట్టుకున్నాడు. తర్వాత మరలా నా బదులు నీవు పువ్వులు ఆ స్వామి మీద వేస్తావని సందేహముగా నున్నది. అలా చేయవుగదా చెలీ.. నిజం చెప్పు.

## 558

**అవతారిక:** ఆడువారిని చూడగానే వారికి ఇంతగా లొంగిపోతావెందుకయ్యా! అని స్వామిని ప్రశ్నిస్తూ అవతార విశేషాలను సైతం అమ్మ ప్రస్తావనకు తెస్తున్నది.

### వరాళి

ప. ఆడువారి కింతలోఁగే వదేమిరా
నేఁడు నాఁడు నొక్కఁడవు నీవే కదరా ॥పల్లవి॥

1. నవ్వుతా గోర నిటంటే నాఁటెనంటాఁ గోపించేవు
ఇవ్వల రాకాసికయ్యా లెట్టుసేసితో
పువ్వుల వేయఁబూఁచితేఁ బొరిఁ దప్పించుకొనేవు
రవ్వైననీబిరుదెల్లా రతికెక్కెరా ॥ఆడువారి॥

2. వెలయఁ గొంగు పట్టితే విడుమంటాఁ బెనఁగేవు
యెలమి రోలఁగట్టితే నెట్టుంటివో
చిలికిన పన్నీటి జిగి నుడ్డుకుడిచేవు
పలు జలధుల నెట్టు పవ్వళించితివిరా ॥ఆడువారి॥

3. సరి నన్నొకతెఁ గూడి సదమదమైతి విట్టె
యిరవై పదారువేల నెట్టు గూడితో
అరయ శ్రీవేంకటేశ అన్నిటా నన్నేలితివి
పరగ నాతోనే నీకు బలిమి చెల్లదురా ॥ఆడువారి॥

**అర్థములు:** ప. ఆడువారికి = స్త్రీజనానికి, లోఁగేవుంఅదేమి = అంత లొంగిపోతావెందుకు? ఒక్కడవు = ఒక్కడివి.

1. గోర = గోరుతో, ఇటంటే = ఇలా అనగానే, నాటెనని = దిగబడినదని, కోపించేవు = అలుగుతావు, ఇవ్వ = ఈవలి వైపు, రాకాసి కయ్యాలు = రాక్షసులవంటి తగాదాలు, ఎట్టు = ఏవిధముగా, సేసితో = చేశావో చెప్పు?, పూచు = యత్నించు, పొరి = మాటికి, రవ్వైన = అల్లరి,రచ్చయైన, బిరుదు = సామర్థ్యము, రతికెక్కు = రతిక్రీడకు దారి తీయు.

2. వెలయ = ప్రకాశించి, విడుమంటా = విడిచిపెట్టమని, పెనగేవు = చుట్టుకుంటావు, ఎలమి = సంతోషము, రోలగట్టితే = రోటికి కట్టివేసినపుడు, ఎట్టుంటివో = ఎలా ఉన్నావో, చిలికిన = చల్లబడిన, జిగి = మెరుపు, ఉద్దుకుడుచు = ఊపిరి ఆడక బాధపడు, పలు = అనేక, జలధులు = సముద్రములలో, పవ్వళించు = నిద్రించు.

3. సరి = సరిపోలుగా, సదమదమైతి = మిక్కిలి ఆయాసపడు, ఇరవై = నెలవై, పదారువేలు = పదహారు వేలు, అరయ = గమనించి చూసినట్లైతే, పరగ = ఒప్పుగా, బలిమి = బలప్రదర్శన, చెల్లదు = సరిపోదు.

**భావము:** స్వామీ! ఆడువారిని చూడగానే వారికి ఇంతగా లొంగిపోతావెందులకు? పూర్వం కానీ నేడు కానీ అన్నిటికి నీవొక్కడవే కదా!

నేనేదో హాస్యామాడుతూ నా గోరు తగిలిస్తే గ్రుచ్చుకున్నదని అలుగుతావు. ఈవలివైపు ఉన్న రాకాసులతో ఎలా వేగుతున్నావో అర్థం కాదు. సుతారంగా పువ్వులను నీపై విసురుదామంటే మాటి మాటికి తప్పించుకుంటావు. అల్లరివాడవైనావు సుమా! నీ సామర్థ్యమంతా రతిక్రీడలకే దారి తీయుచున్నది.

ఏదో సంతోషంగా నీ కొంగు పట్టుకుందాము అనుకుంటే, విడిచిపెట్టమని గోల చేస్తూ పెనుగులాడుతావు. ఆనాడు ద్వాపరంలో మీ అమ్మ యశోదమ్మ నీ అల్లరి భరించలేక రోటికి కట్టివేసినప్పుడు ఎలా ఉన్నావో తెలియదు. చిక్కగా చిలికిన పన్నీటిని చల్లితే ఆ దెబ్బకు ఊపిరాడలేదని నిందిస్తావు. కానీ స్వామీ! నువ్వు పాలసముద్రంలో ఎలా పవళించావు? ఇంకా అనేక నీటి మడుగుల్లో మత్స్య, కూర్మావతారాల్లో ఎలా ఉన్నావో అర్థం కావడం లేదు. చాలా ఆశ్చర్యమేస్తున్నది స్వామీ!

సరేలే! ఒక్క రమణినైన నన్నే కలిసి ఈవిధముగ ఆయాసపడుతూ శ్రమను ప్రదర్శిస్తున్నావు. మరి ద్వాపరంలో పదహారువేల మంది గోపికలను ఎలా భరించావయ్యా స్వామీ! నీ లీలలు మాకెన్నటికి అర్థం కానేరవు. ఓ శ్రీవేంకటేశ్వరా! ప్రకాశించి ఒప్పుగా నన్ను ఏలుకొన్నావు. నాతో బలప్రదర్శన చేయడం నీకు ఏమాత్రం చెల్లనేరదు సుమా!

## 559

అవతారిక: అమ్మ అందచందాలు లావణ్యాలు చెప్పనలవి కానివని చెలులు ప్రశంసిస్తున్నారు.

### ఆహిరి

ప. చెప్పఁ గొలఁదులు గావు చెలియ సింగారమిది
చొప్పుగా నిందరికి సూచనై నిలిచె ॥పల్లవి॥

1. వెలఁది కుచముల మీఁద వెలి పెంపుపయ్య దిదె
యెలమి బోలింపరే యెట్లున్నది
కులికి పతిఁ గలియచోఁ గురియుఁ జెమటలజడికి
మెలఁగి కొండల మొయిలు మేసినట్లాయ ॥చెప్ప॥

2. సుదతి నెన్నుదుటిపై జూడఁ గుంకుమ బొట్టు
యెదుటఁ బొలింపరే యెట్లున్నది

కదిసి తన నాయకునిఁ గలసినప్పటి వేళ
మదనరాగం బిపుడె మలసినట్లాయ ॥చెప్పు॥

3. సతితురుములో విరులు జారి పైరాలె నిదె
యితరులకు బోలించ నెట్లున్నది
యితవుగా శ్రీవేంకటేశు గూడిన ఇపుడు
చతురతలఁ బై సేస చల్లినట్లాయ ॥చెప్పు॥

**అర్థములు:** ప. కొలది = కొరత, సింగారము = అందచందాలు,సొగసులు, చొప్పు = వంతున, సూచన = ఆనవాలు, నిలిచె = నిలబడినది.

1. వెలది = ఆడుది, కుచములు = వక్షోజములు, వెలి = బయటపడే, పెంపు = క్రమాతిశయము, ఎలమి = వికాసము, పోలింపు = పోల్చి చూడగా, కులుకు = నర్తించు, చమటలజడి = అధికమైన చెమటల వాన, మొయిలు = మేఘము, మేసినట్టు = తినినట్టు.

2. సుదతి = స్త్రీ, నెన్నుదురు = నుదుటిభాగము, బొలింపు = పోల్చి చూచు, కదిసి = దగ్గరగు, నాయకుడు = స్వామి, మదనరాగము = మన్మథ రాగము, మలయు = వ్యాపించు.

3. తురుము = కొప్పు, విరులు = పువ్వులు, పైరాలె = పైన బడినవి, హితవు = ఇష్టము, చతురత = చమత్కారం,కౌశలము, సేస = అక్షతలు, చల్లినట్లాయ = చల్లినట్లున్నది.

**భావము:** ఈ చెలియ సింగారాలు చెప్పడానికి కొరతే లేదు స్వామీ! ఆమె క్రమముగా అందరికి ఆనవాలుగాను జాడగాను నిలిచినది.

ఆ స్త్రీ వక్షోజముల మీద బయటపడి పెంపొందే పైట కొంగు ఇదే! వికాసముతో పోల్చి చూడగా యిదే సుమా! ఆమె నృత్యం చేస్తూ కలియగానే కురిసే చెమటల వాన, మేఘములు కమ్మి వర్షించినట్లాయెను.

ఆ చెలి నుదుటనున్న బొట్టు చూడగా ఆ కుంకుమ బొట్టు యెదుట చూస్తే దేనిని పోలి యున్నది. నాయకునిని సమీపించి కలసినప్పటి సమయములో మన్మథ రాగం ఆలాపించగా వ్యాపించినట్లున్నది.

ఆ సతి కొప్పులో ఉన్న పుష్పములు జారిపడి పైన శరీరమంతటా రాలిపడుతున్నాయి. ఇతరులతో పోల్చి చూసినట్లైతే యిది ఎలాగున్నది? ఇష్టప్రీతితో శ్రీవేంకటేశ్వరుడు యిప్పుడు కూడినాడు. ఆ స్వామి చతురత్వం కౌశలముతో అక్షతలు చల్లినట్లాయెను.

## 560

**అవతారిక:** అమ్మపై స్వామి కురిపిస్తున్న ప్రేమాభిమానాలకు ఉబ్బి తబ్బిబ్బై మాట్లాడుతున్నది.

### ముఖారి

ప. ఎఱగఁ జుమ్మీ యపు డేమీ నేను
మొఱఁగు లన్నిటికిని మొక్కే నేనిపుడు ॥పల్లవి॥

1. నిక్కమును దొరవంటా నిన్నుఁ జూడవచ్చితేను
చిక్కనివలపు నామైఁ జిమ్మి రేఁచితి
నెక్కొని నేఁ గళదాఁకి నీమీఁద నొరగితి
తక్కక నాకాలు చేయి దాఁకదు గదా ॥ఎఱగ॥

2. వొంటి నీవున్నాడవంటా వూరికే నే వచ్చితేను
యింటివా రెఱగకుండా నింత సేసితి
జంటనై కాదనలేక సరిగా నేఁగూచుంటి
అంటితిని మందె మేళా లాయనోకదా ॥ఎఱగ॥

3. మంచివాఁడవని నీతో మాటలాడ వచ్చితేను
యెంచకే యింతి సేసితి వేరా నీవు
కొంచక శ్రీవేంకటేశ కూడితి మిద్దరమును
ఆంచల నారతుల నీవలసితివో కదా ॥ఎఱగ॥

**అర్థములు:** ప. ఎరగ = తెలియదు, సుమ్మీ = సుమా (నిశ్చయార్థకము), మొరగు = దాగిన వాటికి, మ్రొక్కు = నమస్కరించు.

1. నిక్కము = నిజము, దొర = ప్రభువు, చిక్కని వలపు = అచ్చమైన ప్రేమ, చిమ్మి రేచితి = విరజిమ్మి ఉసికొల్పిఉఇ, నెక్కొను = పాదుకొను, కళదాకు = శోభించు, ఒరగు = వాలు, తక్కక = విడువక, తాకదు = ముట్టుకోదు.
2. ఒంటి = ఒక్కడివే, ఊరికే = ఏమీ పనిలేకుండా, ఇంటివారు = ఇంటిలోనున్న వారు, ఎరుగకుండా = తెలియకుండా, సేసితి = చేశాను, జంటనై = జతకలిసి, అంటు = తాకు, మందెమేళము = ఉపేక్ష.
3. ఎంచక = లెక్కబెట్టకుండా, కొంచక = భయపడక, ఆంచల = సమీపము, ఆరతి = హారతి, అలసితివి = శ్రమ నొందితివి.

**భావము:** నాకు అప్పుడేమీ తెలియదు సుమా! స్వామివారిలో దాగిన కళలన్నింటికి ఇప్పుడు నేను చేతులెత్తి నమస్కరిస్తున్నాను.

నీవు ప్రభువైనందున నేను చూడడానికి విచ్చేశాను సుమా! ఇది నిజము. అచ్చమైన ప్రేమను నాపై క్రుమ్మరించావు. నేను పాదుకొని శోభలతో నేను నీ భుజమ్మీద వాలితిని తప్ప నా కాలు చేయి నీకు తగులుతుందా స్వామీ!

నీవు ఒంటరిగా ఉన్నావని ఊరక నీ వద్దకు వచ్చి యుండగా ఆ ఇంటి వారికి ఏమీ తెలియకుండా యింతపని చేశావు. నేను కూడా కాదనలేక జంటగా నీతో కూర్చున్నాను. నేనీ విషయంలో ఉపేక్ష చేసినదేమున్నది స్వామీ!

ఏదో మంచి వాడివి కదా అని నీతో సంభాషణలు జరుపుదామని నేను రాగా అది లెక్కపెట్టకుండా యింత పని చేసితివేల స్వామీ! ఏమాత్రం జంకక కొంకక ఓ శ్రీవేంకటేశ్వరా! యిద్దరము కలిసితివి.

## 561

**అవతారిక:** అమ్మ మన్మథావస్తను వివరిస్తూ ఎడబాటుతో రగిలిపోతున్నదని, ఈ విపరీతపు ప్రవర్తనలేమిటని చెలులు స్వామిని ప్రశ్నిస్తున్నారు.

### మాళవి

ప. ఇంత సేయ జెల్లునా యీరమణిఁ బెడఁబాసి
యెంత కెంత విన్నవించే నింక నీచిత్తమురా ॥పల్లవి॥

1. విరులు ముడువఁ బోతే వెలది యేమో కాని
మరుని బాణములంటా మచ్చరించీ ని
నిరతిఁ గొప్పుదువ్వితే నిండుఁదుమ్మిదలగుంపు
వరుస రేఁచేరంటా వద్దనీఁ జెలి ॥ఇంత॥

2. పయ్యద వెట్టఁగఁబోతే బలుజక్కవలతోడ
కయ్య మందించేనంటాఁ గసరీని
పుయ్యఁగ గందము చూచి పొరిఁ గాలకూటమంటా
నెయ్యపుఁజెలులఁ జూచి నేరమెంచీని ॥ఇంత॥

3. అరుదైనమాణికాలహరము లియ్యఁగఁబోతే
విరహగ్ని శిఖలంటా వెఱచీని
గరిమ శ్రీవెంకటేశ కలసితి వింతలోనే

యిరవై యలమేల్మంగ యిటు మెచ్చీని ॥ఇంత॥

**అర్థములు:** ప. ఇంతసేయ = ఇలా అతిశయించి చేయుట, చెల్లునా = సరిపోవునా, రమణి = స్త్రీ, బెడబాసి = ఎడఉబాయునకు మొదటిరూపము, విన్నవించు = మనవిచేయు, చిత్తము = దయ.

1. విరులు = కేశములు, వెలది = స్త్రీ, మరుడు = మన్మథుడు, మచ్చరించు = ద్వేషించు, నిరతి = మిక్కిలి ఆసక్తి, కొప్పుదువ్వు = సిగను ముడిచి దువ్వు, తుమ్మిదలగుంపు = తుమ్మెదల సమూహము, రేచు = వ్యాపించు.
2. పయ్యద = పైట, వెట్టగబోతే = వేయ యత్నించు, కయ్యము = గొడవ, కసరు = కోపించి గద్దించు, పుయ్యగ = పూయగా, పొరి = పొలి యొక్క రూపాంతరము, అత్యంతము, కాలకూటము = భయంకరమైన విషము, నెయ్యపు చెలులు = స్నేహముతోనున్న చెలికత్తెలు, నేరమెంచు = తప్పు పట్టు.
3. అరుదు = అద్భుతము, మాణికాల హారము = మాణిక్యములతో చేసిన దండ, విరహగ్ని = ఎడబాటనే అగ్నిజ్వాల, వెరచు = భయపడు, గరిమ = ఘనము, ఇరవు = స్థానము, మెచ్చీని = ప్రశంసించుచున్నది.

**భావము:** స్వామీ! ఈవిధముగా చేయడం నీకు ఏమైనా బాగున్నదా? ఈ రమణిని ఎడబాసి యున్నావు. నీకు ఎంత అధికముగా వివరించి మనవి చేసితిమి. ఇక అంతా నీ చిత్తము దయగా భావించెదము.

ఆ అమ్మ తన కురులు ముడుచుకుంటూ ఉండగా నీవు అవి మన్మథ బాణములవలె ఉన్నవని ద్వేష భావం చూపిస్తున్నావు. మిక్కిలి ఆసక్తితో నీ కొప్పు దువ్వి సరిచేయాలని యత్నిస్తుంటే తుమ్మెదలగుంపు నిన్ను వ్యాపించి చేరిందంటూ తిరస్కరిస్తున్నావు.

పైటకొంగు బిగించబోతే చక్రవాక పక్షులు తగాదా లాడుతున్నవని కోపగించి ఆమెను తూలనాడుతున్నావు. పోనీ గంధమైనా పూద్దామని దరిచేరితే ఆ గంధము కాలకూట విషములా ఉన్నదని చుట్టుప్రక్కన ఉన్న చెలులకు జెప్పి భయపడుతున్నావు.

అపూర్వమైన, అద్భుతమైన మణులు మాణిక్యాలు ఉన్న దండలను నీకు వేయబోతే అవి ఎడబాటుకు గురిచేసే అగ్నిలా ఉన్నాయని భయం చెందుతున్నావు. ఓ శ్రీవేంకటేశ్వరా! ఘనమైన ఆ అలమేలుమంగమ్మతో ఇంతలోనే కలసి ఈ స్థానములో ఆ అమ్మ ప్రశంసలకు పాత్రుడవయ్యావు.

## 562

**అవతారిక:** అమ్మతో కలసి అడుగులు వేయకుండా స్వామి త్వరపడడం నచ్చని చెలులు స్వామికి అమ్మను జాగ్రత్తగా చూడమని చెప్తున్న దృశ్యం.

ఆహిరి

ప. అడుగువెట్టితే నీకు ఆకె పాదమాన సుమ్మీ
నిడు(డుc?)జంగ నడపేల నిలవయ్య పోక ॥పల్లవి॥

1. సారె జాఱె మొలనూలు జడిసె ముత్తేలుపేరు
భారపుసొమ్ముతో నిన్నుc బట్టరాcగాను
వూరకే యలిగిపోయే వువిదదిక్కు చూడక
నేరుచుకొంటివి నేcడే నిలవయ్య పోక ॥అడుగు॥

2. కురులు చెమటcదోcగె కుచయుగ మిటురానె
బెరసి నీచేయివట్టి పెనcగcగాను
శిరసు వంచుకొంటివి చెలియకు మొకమోడి
నెరవేరెc బనులెల్లా నిలవయ్య పోక ॥అడుగు॥

3. పులకలు మేన నిండె భోగపుcగళలు మించె-
నలమేలమంగ నిన్ను నలమcగాను

యెలిమి శ్రీ వేంకటేశు యియ్యకొని కూడితివి
నెలవుల నిట్లానె నిలవయ్య పొక ॥అడుగు॥

**అర్థములు:** ప. అడుగువెట్టు = అడుగువేయు, ఆకె = ఆమె, పాదమాను = పాదములు పడుటకు, నిడుజంగ = కాలు కొలఉది వేసిన అడుగు కొలత, నడపు = నడక, నిలవయ్య = కాస్తా నిదానించి నడవవయ్యా!

1. సారె = మాటికి, జారె = జారిపోవుచున్నది, మొలనూలు = కట్టుకున్న చీరె, జడిసె = భయమునందె, ముత్తేలపేరు = ముత్యముల సరము, భారపు = బరువైన, సొమ్ము = నగలు, పట్ట = పట్టుకొనుటకు, అలగిపోవు = కోపించు, ఉవిద = స్త్రీ, దిక్కు చూడక = వంక చూడకుండా,నివలవయ్య = కాస్తా ఆగు, పోక = వెళ్ళిపోకుండా
2. కురులు = వెంట్రుకలు, చెమతదోగు = చెమటతో తడసిపోవు, కుచయుగము = రొమ్ములు, బెరసి = వ్యాపించి, చేయివట్టి = చేతితో పట్టుకొను, పెనగు = చుట్టుకొను, శిరసు = తల, మొకమోడు = ముఖము చూపుటకు భయమంది, నెరవేరు = తీరిపోవు.
3. పులకలు = గగుర్పాటు, మేన = శరీరమున, నిండె = పూర్తిగా నిండు, భోగపు కళలు = అనుభవించు శోభలు, మించె = అతిశయించె, అలము = ఆక్రమించు, ఎలమి = వికాసము, ఇయ్యకొను = ఇష్టపడు, కూడు = కలియు, నెలవు = స్థానము, ఇట్లానె = ఈవిధముగా, నిలవయ్య = నిలువుము, పోక = వెళ్ళిపోకుండా.

**భావము:** స్వామీ! నీవు త్వరపడి అడుగులు వేసినట్లైతే ఆ అమ్మ అలమేలుమంగమ్మ పాదములు త్వరగా పడవు. ఆవిధమైన పెద్ద పెద్ద అంగలు కాలు కొలది వేయడం ఎందులకు? ఆగవయ్యా స్వామీ ఆవిధముగా నడవవద్దు.

అలా నడవడం వల్ల మాటిమాటికి చీరెముడి విడిపోవుచున్నది. ఆమె ముత్యాలపేరు జడిసి భయపడుతున్నది. ఆమె భారమైన తన నగ, నట్రాతో నిన్ను చేరడానికి ప్రయాసపడుతున్నది. అమ్మ వంక చూడనైనా చూడకుండా ఊరకే అలిగిపోతూ ఉంటావు. ఇలా అలవాటు చేసుకొన్నావేమి స్వామీ! కాస్తా నిదానించవవయ్యా!

ఆమె కేశ సంపద నిండా తడసి ముద్దైనది. ఆమె ఘన వక్షస్థల సంపద అటూ ఇటూ రాచుకోగా, ఆమె అతిశయించి నీ చేయిని అనుకోగా ఆమెకు ముఖం చూపించకుండా వంచుకొన్నావు. నీ పనులెల్లా తీరిపోయాయి కానీ స్వామీ! కాస్తా నిదానించవవయ్యా! పరుగులు పెట్టవద్దు.

ఓ శ్రీవేంకటేశ్వరా! ఈవిధముగా అమ్మ అలమేలుమంగమ్మ నిన్ను చేరి ఆక్రమించగానే నీకు గగుర్పాటుతో పాటూ అనుభవించవలెననెడి కోరికలు మితిమీరి ఆమెను కలిసితివి. ఈ స్థానమందు ఇలానే ఉండిపోవయ్యా! వెళ్ళిపోవద్దు స్వామీ!

## 563

అవతారిక: స్వామిపై ఎందుకో అమ్మ కినుక వహించింది. ఇంటికి వచ్చిన పతికి సరైన మర్యాదలివ్వడంలేదని చెలులు మందలిస్తున్నారు.

## దేవగాంధారి

ప. ఇంటికి విచ్చేసె నాతఁడేమే నీవు
కంటకములాడేది కాదే నీవు ॥పల్లవి॥

1. ఆగడుఁజెమటతోడ నలసివచ్చినపతి
యెగసక్కెలే యాడే వేమే నీవు
మగవాని మోహ మింత మదివిచ్చి చూడఁబోతే
యిగురువంటి దింతే యేల నీవు ॥ఇంటికి॥

2. చెంతల నిన్ను నవ్వించి సిగ్గులెల్లాఁ బాపినాఁడు
యెంతైనా మెచ్చువైతి వేమే నీవు
పంతపు దొరలపొందు పచ్చిగాఁ బిసుకఁబోతే

యింతలోఁ బసురువేసు నిదియాలే నీవు ॥ఇంటికి॥

3.నెయ్యాన గడ్డమువట్టి నిన్నతఁడు వేఁడుకొనీ
యియ్యకొనవే పనకి యేమే నీవు
తియ్యఁగా శ్రీవేంకటాద్రిదేవునిఁ గూడితి వెట్టె
అయ్యెడ నలమేల్మంగ వునవునే నీవు ॥ఇంటికి॥

**అర్థములు:** ప. విచ్చేసె = వచ్చెను, కంటకము = ముల్లులాంటి మాటలు.

1. అగడు = వేడి, అలయు = శ్రమపడు, ఎగసక్కేలు = పరిహాసపు మాటలు, మోహము = ప్రేమ, మదివిచ్చి = మనసు తెరచి, ఇగురు = లేత.
2. చెంత = సమీపము, బాపు = పోగొట్టు, మెచ్చవైతి = ప్రశంసించనిదానవైతివి, పంతము = పట్టుదల, దొర = ప్రభువు, పచ్చి = బహిరంగంగా, పిసుకు = ఒత్తు, పసురు = బాధ, ఇదియాలే = ఇది ఎందుకు.
3. నెయ్యము = స్నేహము, గడ్డమువట్టి = గడ్డము పట్టుకొని, వేడుకొను = బ్రతిమలాడు, ఇయ్యకొను = సమ్మతించు, తియ్యగా = మధురముగా, కూడితి = కలిసితివి, అయ్యెడ = ఆస్థానమున, అవునవును = అవును నిజము.

**భావము:** ఆ స్వామి ఇంటికి వచ్చాడు కదా! ఏమే అలమేలుమంగా నీవు స్వామిని ముల్లువంటి మాటలతో బాధిస్తున్నావు కాదటే!

స్వామి శరీరము నిండా వేడి చెమటలతో శ్రమనొంది అలసిపోయి వచ్చిన పతితో పరిహాసపు మాటలు మాట్లాడతావేమిటే! మగవారి ప్రేమను మనసు తెరచి చూసినట్లైతే ఇంత లేత లేతగా ఉంటుంది కదా! ఎందుకే మరి నీవిలా చేస్తున్నావు?

స్వామి నిన్ను సమీపించి, నీ సిగ్గులెల్లా పోగొట్టినాడు కదా! నిన్ను ఎంత బాగ చూసుకున్నప్పటికి ఆయనను ప్రశంసలకు గురిచేయవేమే నీవు? పట్టుదలతో ఉన్న ఆ స్వామి, నీ ప్రభువు బహిరంగంగా నిన్ను హత్తుకొని ఒత్తడానికి యత్నిస్తూ ఉంటే ఇంతలోనే బాధించే మాటలన్నీ మాట్లాడడమెందులకు? ఏమే యిది? ఈవిధముగా చేయడం ఎందుకే నీవు?

స్వామి స్నేహము చూపిస్తూ గడ్డం పట్టుకొని బ్రతిమాలుతూ ఉండగా సమ్మతించి అన్నిటికి సరేనని చెప్పవేమిటే? ఇంత మధురంగా శ్రీవేంకటేశ్వరుడు ఈ తీరులో నిన్ను కూడినాడు కదా! ఆస్థానములో నున్న అలమేలుమంగవైన నువ్వు అవునవునని నిజమని అనవెందులకు? చెప్పవే!

## 564

**అవతారిక:** స్వామి శృంగార భావనలతో, అమ్మకు సేవలు చేసి పొందుకోరుతున్న సన్నివేశం.

## సింధురామక్రియ

ప. ఔరా రాజసము అంతేసి తగదా
గారవాన నీవాకెకుఁ గలకాలము ॥పల్లవి॥

1. నిలుచుండి పిలిచేటినీతో నంగన నేఁడు
మలగుపై నొరగుండే మాటలాడీని
వెలినుండి వేఁడుకోఁగా వెసఁ దలుపుమాఁటుగ
సెలవుల నవ్వీ నిన్నుఁ జెల్లురా యీసతికి ॥ఔరా॥

2. అంగవించి సరసము లాడేటి నీతోను
ముంగిటఁ దప్పక చూచీ మోనానఁజెలి
చెంగటఁ బ్రియము చెప్పె చెక్కునొక్కఁగా నీవు
యెంగిలిమోవి గదల నించుకంత గొణఁగె ॥ఔరా॥

3. పూనిపట్టి కొప్పు దువ్వి బుజ్జగించె నియ్యెడకు

మేనెల్ల మఱచె నల మేలు మంగ
అని పట్టి శ్రీవేంకటాధిప కూడితి విట్టె
తానైతే నీవురమెక్కి తానకమై నిలిచె ॥ఔరా॥

**అర్థములు:** ప. ఔరా = ఆశ్చర్యమును తెలుపు పదము, రాజసము = రాజ సంబంధమైన ఐహిక గుణోత్పన్నమైన విషయము, అంతేశి = అంత అధికము, తగు = సరిపోవు, గారవము = గౌరవము, ఆకె = ఆమె, కాలము = సమయము.

1. నిలుచుండి = నిలబడి, పిలిచేటి = పిలువబడే, అంగన = స్త్రీ, మలగు = నిద్రతో, ఒరగు = మీద వాలు, వెలి = బయట, వేడుకొను = విన్నవించు, వెస = శీఘ్రము, తలుపు మాటు = తలుపు వెనుకగా, సెలవుల = పెదవి మూల, చెల్లు = సరిపోవు.
2. అంగవించు = తెగబడి దగ్గరగు, ముంగిట = ఇంటి ముందు, మోనాన = మౌనముగా, చెంగట = ప్రక్కన, ప్రియము = ఇష్టము, చెక్కు = చెక్కిలి, నొక్కు = వత్తు, ఎంగిలిమోవి = అధరామృతము, కదల = తగులునట్లు, ఇంచుక = చిన్నగా, గొణగె = వినబడీ వినబడనట్లు మాట్లాడు.
3. పూనిపట్టి = ప్రయత్న పూర్వకముగా, కొప్పు దువ్వి = సిగ దువ్వి, బుజ్జగించు = బ్రతిమాలుకొని, ఇయ్యెడ = ఈతావుకు, మేనుంఎల్ల = శరీరమంతా, మరచె = మరచిపోయినది, అనిపట్టు = యుద్ధములో పట్టు, ఉరమెక్కు = వక్షస్థలముపై కూర్చొను, తానకము = స్థానము.

**భావము:** ఆహా! స్వామీ! నీ రాజసంబంధమైన ఉత్సాహము అంత అధికమై యున్నది కదా! నీవామెకు తగిన గౌరవ ప్రదమైన స్థానమిచ్చిన కారణమిదే కదా!

నిలబడి నిన్ను పిలిచే ఆ స్త్రీ ఈనాడు నిద్రతో జోగుతూ నీ పై వాలి మాట్లాడుతున్నది. బయటనుండి శీఘ్రముగా వేడుకోగా, ఆమె తలుపు వెనక దాగియుండి పెదవి మూల నవ్వగా నీకు ఈ లలనామణి అన్నివిధములా సరిపోయి ఉన్నది కదా!

స్వామి తెగబడి దగ్గరై నీతో సరసల్లాపాలు సాగిస్తూ ఉండగా, ఇంటి ముంగిట నిన్ను చూసి మౌనము వహించి, చెంతజేరి ప్రియ సంభాషణములాడగా, నీవు చెక్కిలి నొత్తగా, ఆమె ఎంగిలి మూతి కదులునట్లు ఏదో చిన్నగా గొణగినది.

నీవు ఆమె కొప్పు పట్టుకుని బాగా దువ్వి బ్రతిమాలుకొనగా, ఆ అలమేలుమంగ తన మేను మరచిపోయినది. శ్రీవేంకటేశ్వరుడు మల్ల యుద్ధ పట్టువలె నిన్ను పట్టుకొని కలసినాడు, ఇక ఆమె నీ వక్షస్థలమెక్కి ఆ స్థానములోనే ఉండిపోయినది.

## 565

**అవతారిక:** అలమేలుమంగా శ్రీనివాసులు ఏకాంతములో నున్నారని సద్దుచేయవలదని వారు పిలిచినప్పుడే వెళ్ళెదమని తోడి చెలులు మాట్లాడుకొంటున్న దృశ్యం.

### మాళవి

ప. ఊడిగపు సతులాల వుండరే మీరు
ఆడరే మెల్లనిమాట లంతంత మీరు ॥పల్లవి॥

1. మాటలాడే రిద్దరును మాణికపుటింటిలోన
తేటలుగ దేవుఁడును దేవులు నిదె
యేటికి దగ్గరిపోయే రిదివేళగాదు మీకు
బోఁటులాల పిలిచితే పోదముగాని ॥ఊడిగపు॥

2. తూఁగుటుయ్యాల లూగేరు తొలఁకు మోహము తోడ
యేఁగివచ్చిలోని కేఁగి రింతకముందు
తోఁగిచూడకురే మీరు తొదరి తమంతనే

పొంగి పిలిచినప్పుడే పలుకుదము ॥ఊడిగపు॥

3. యేకతాన శ్రీ వేంకటేశుఁడలమేల్మంగయుఁ
బై కొని కూడున్నవారు పానుపుమీఁద
పోకురే చనవుచేసి పొలఁతు లిపుడే వారు
ఆకుమడుపఁబిలిచే రప్పుడే పోదము ॥ఊడిగపు॥

**అర్థములు:** ప. ఊడిగము = సేవ, సతులు = భార్యలు, ఆడరే = చెప్పండి, మెల్లనిమాట = చిన్నగా ఉండే మాట.

1. మాణికపుటిల్లు = మణులు, మాణిక్యములతో పొదిగిన గృహము, తేటలు = తేరిన, దేవుడు, దేవులు = స్వామి, దేవేరి, ఏటికి = ఎందులకు, వేళ = సమయము, బోటులాల = స్త్రీలారా.
2. తూగుటుయ్యాల = ఊగెడి ఉయ్యాల, తొలకు = అతిశయించు, మోహము = ప్రేమ, లోనకేగు = లోపలకు వెళ్ళు, తోగి = తడియు, తొడరి = తిరస్కరించు, పాగు = పాకము.
3. ఏకతాన = ఒకే భావమున, పైకొను = యత్నించు, కూడు = కలియు, పోకురే = వెళ్ళకండి, చనవు = ప్రేమాతిశయము, పొలతులు = స్త్రీలు, ఆకుమడువ = తాంబూలము చుట్టు.

**భావము:** ఓ సేవలు చేసి తరించే భార్యలారా! మీరు మెల్లిగా మాట్లాడండి. సద్దు చేయవద్దు. స్వామికి అమ్మకు ఆటంకములు కలిగించవద్దు.

ఇపుడే మణి మాణిక్యములతో పొదగబడిన గృహములోనికి స్వామియు, అమ్మయు వెళ్ళి యున్నారు. మీరెందుకు దగ్గరకు వెళ్ళెదరు? యిది ఏకాంత సమయము, వేళ్ళే సమయము కాదు. వారు పిలిచినప్పుడు వెళ్ళ వచ్చు.

ఇద్దరూ అతిశయించిన ముఖారవిందాలతో తూగుటుయ్యాల నూగుచున్నారు. వారింతకుముందే లోనకు వెళ్ళి యున్నారు. మీరు వారిని తొంగి తొంగి చూడకండి. తమంత తామే వారు పిలిచినప్పుడు మనము జవాబిచ్చెదము.

అనన్య చిత్తముతో శ్రీవేంకటేశ్వరుడు, అలమేలుమంగమ్మ కలసి యత్నించి కలసి పట్టెమంచముపైగల పానుపుమీద కూర్చొని యున్నారు. మీరు ప్రేమాతిశయము చూపిస్తూ లోనకు వెళ్ళవద్దు. తమలపాకులు చుట్టి యివ్వవలసిన సమయాసన్నమైనపుడు వారు మనలను తప్పక పిలిచెదరు. మనము అప్పుడే వెళ్ళ వచ్చును.

## 566

**అవతారిక:** స్వామి పరాకుగా ఉన్నప్పటికి , అమ్మ శృంగార చేష్టలను, స్థితిగతులను స్వామికి విన్నవిస్తున్నారు.

### ముఖారి

ప. అప్పటి నెత్తము జూజమాడేవు పరాకున
యిప్పుడు నీవద్ద నున్న దిదివో చెలి ॥పల్లవి॥

1. ముంచిముంటి నవ్వునవ్వీ మొగలి రేకుల కొప్పు
యించుకించుక గదల నిదివో చెలి
తుంచితుంచి నిన్ను వేసి తోరుపుఁబువ్వులదండ
ఇంచువిలుతునివలె నిదివో చెలి ॥అప్పటి॥

2. చిత్తగించి మాఁటలాడీ చెక్కులమెరుఁగు మించ
యెత్తినవదనముతో నిదివో చెలి
త త్తరించి వీఁపునఁ దనుపేరు వ్రాసీని
యిత్తల నేమీ నెఱఁగ దిదివో చెలి ॥అప్పటి॥

3. తొడమీఁదఁ దొడవేసీఁ దోరపుకుచము లానీ-

నెడనెడ నొత్తుతాను యిదివో చెలి
పడఁతి శ్రీ వేంకటేశ పరాకుమాని నిన్ను-
నెడయక గాఁగిలించె నిదివో చెలి ॥అప్పటి॥

**అర్థములు:**ప. నెత్తము = పాచికలాట,పందెము, జూజము = జూదము, పరాకు = పరధ్యానము, ఇదివో = ఇదిగో.

1. మొగలిరేకుల కొప్పు = మొగలిరేకులతో అలంకరించిన సిగ, ఇంచుకించుక = కొంచెము కొంచెము, కదలు = ఊగు, తోరము = వ్రత దారము, పువ్వులదండ = పుష్పముల మాల, ఇంచు = కొంచెము, విలుతుడు = కదలియాడు.
2. చిత్తగించు = మనసుపెట్టి, చెక్కులమెరగు = చెక్కిలి సొగసు, వదనము = మొహము, తత్తరించు = సంభ్రమము, ఇత్తల = ఇవతల, ఎరుగ = తెలియ.
3. దోరపు కుచములు = ఎఱ్ఱనైన వక్షోజము, ఎడనెడ = అక్కడక్కడా, పడతి = స్త్రీ, పరాకు = పరధ్యానము, ఎడయక = వదలిపెట్టక, కాగలించి = కౌగలించు.

**భావము:** స్వామీ! నీవు పరాకుగా అప్పటి విధంగానే పాచికల జూదమాడేవు. ఇప్పుడు నీ వద్దనే అమ్మ ఉన్నది గమనించండి.

నిండు నవ్వులతో ఆమె పెట్టుకున్న మొగలిరేకుల కొప్పు కొంచెం కొంచెం కదలియాడే విధముగా యున్నదిగో చూడండి. దారముతో కట్టిన పూదండ కొంచెం కొంచెం త్రుంచి నీమీద పువ్వులను కొంచెం కదులుతూ అటూ ఇటూ ఊగుతూ ఆ చెలి వేస్తున్నది.

ఆమె చెక్కిలి అందము అధిగమించే విధంగా మనసును నీపై ఉంచి తలను కొద్దిగా ఎత్తి మాట్లాడుతూ ఉన్నది. సంభ్రమముతో నీ వీపున తన పేరును వ్రాసి ఇవతల యేమీ తెలియనట్లు కూర్చున్నదిదివో చెలి.

నీతొడమీద తొడ ఆనించి తన ఎఱ్ఱనైన వక్షోజములను నీకు ఆనునట్లు చేసి, నీకు వాటిని శరీరంపై అక్కడక్కడా ఒత్తుతూ ఉన్నది చెలి చూడండి. ఓ శ్రీవేంకటేశ్వరా! ఆ స్త్రీ నిన్ను వదలిపెట్టకుండా కౌగలించుకొనుచున్నది మీరు పరధ్యానము మాని గమనించండి స్వామీ!

## 567

**అవతారిక:** స్వామి అనవసరంగా గొడవలు పెట్టుకుని తగదాలాడుతున్నాడని అమ్మ తన బాధను వ్యక్తం చేస్తున్నది.

### సామంతం

ప. వలెనా నీకింత దూరు వనితలతో నేఁడు
యెలమి నామాట విని యింటికి రావయ్యా ॥పల్లవి॥

1. ఆగడాలు నీవే నేసి యలగేవు రానంటా నీ -
లాగులు చూచినవారు లండఁడందురు
వేగుదాఁకా విరహాన వేసరి మా వంటివారు
యేగతి మన్నించఁడు వీఁడెంత కూళందురు ॥వలెనా॥

2. వలచి చెయివట్టితే వాఁటముగా నవ్వేవు
తెలిసినవారు నిన్ను దిమ్మ రందురు
తలపోసి నీకుఁగా దప్పిఁబడ్డయాఁడువారు
చలమరి వీఁడేడ జాణఁడందురు ॥వలెనా॥

3. ముంచిన ప్రియముతోడ మొక్కినాఁగై కొనకున్న
చంచలించినట్టివారు జడుఁడందురు
యెంచి చూచి శ్రీవేంకటేశ నన్నుఁగూడితివి

వంచ నింత లేకుండితే వడి గర్వి యందురు ॥వలెనా॥

**అర్థములు:** ప. వలెనా = అవసరమా, దూరు = నిందలువేయడం, ఎలమి = ప్రకాశించి.

1. ఆగడాలు = గొడవలు, అలగేవు = కోపించేవు, లాగులు = మల్లవిద్యాప్రదర్శన, లండ = మొండివాడు, వేగు = వేకువఝాము, విరహము = ఎడబాటు, వేసరి = భాద, కూళ = క్రూరుడు.
2. వాటము = అనుకూలము, దిమ్మరి = తిరుగుబోతు, తలపోసి = ఆలోచిన్ చి, దప్పిబడ్డయాడువారు = తమకమనే దాహముతో దరిచేరిన స్త్రీజనము, చలమరి = పట్టుదలగల, జాణ = నేర్పరితనము గల.
3. ప్రియము = ప్రేమ, మొక్కి = నమస్కరించి, గైకొను = చేపట్టు, చంచలించు = చలించువారు, జడుడు = తెలివితక్కువ వాడు, ఎంచి = లెక్కించి, వంచ్న = మోసము, గర్వి = గర్వము గలవాడు.

**భావము:** స్వామీ! ఈ స్త్రీజనంతో నీకీవిధముగా ప్రవర్తించి నిందలు వేయడం తగునా! ఇది అవసరమా! చెప్పండి.

తగదాలు, గొడవలు నీవే పెట్టుకొని అలిగి ఇంటికి రాను అంటావు. నీ పద్ధతి చూసినవారెవరైనా కానీ నిన్ను మొండివాడనక మానేరా? బాధలను భరించి, వేకువఝాము వరకూ వేచి యుండి యెడబాటును భరించారు. అసలు మంచిగా మన్నన చూపదేమిటి? వీడు క్రూరుడు అనరా స్వామీ!

ఆమె ప్రేమతో నీ చేయిపట్టి లాగితే అనుకూలముగా నవ్వులు చిందిస్తావు. తెలిసినవారు నిన్ను తిరుగుబోతు అని అనకుండా ఉండగలరా చెప్పు? నీమీద తదేక ధ్యానముతో నుండి నీకై తమకమనే దాహార్తితో నున్న ఆడువారు నిన్ను పట్టుదలలకు పోయే వాడే తప్ప నేర్పరితనము లేనివాడు సుమా! అనరా స్వామీ!

నీమీద నిండా గాఢమైన ప్రేమతో నీకు నమస్కారాలు చేస్తున్నా గమనించకుండా చేపట్టకుండా ఉన్నట్లైతే నిన్ను తెలివితక్కువ వాడు అనరా స్వామీ! లెక్కించి చూడగా ఆ శ్రీవేంకటేశ్వరుడవైన నీవు నన్ను చేరితివి. ఇలాంటి మోసపు లక్షణాలున్నట్లైతే నిన్ను గర్విష్టి యని పిలువరా స్వామీ!

## 568

**అవతారిక:** శ్రీవేంకటేశ్వర స్వామి, శ్రీదేవి, భూదేవి, ఇద్దరు దేవేరులను ఒకేసారి వివాహమాడినప్పటి కమనీయ సన్నివేశం.

### ఆహిరి

ప. జమళిఁ గల్యాణము సరసుఁడాడె నేఁడు
చెమట లేఁటికి వచ్చెఁ జెప్పరే ॥పల్లవి॥

1. తూఁగు మంచముమీఁదఁ దొయ్యలు లిద్దరిఁ
గాఁగిలించుకొంటాఁ గరఁగీని
యేఁగుబెండ్లికొడు కెవ్వరిపై మోహము
చేఁగదేర నిది సరిఁ జెప్పలే ॥జమళి॥

2. ఇదె పెండ్లి పీఁట యిద్దరి కొకమాఁటే
కదసి పచ్చడము గప్పీని
యెదుగ దోసిట నించి యెవ్వరిపైఁ దలఁబాలు
చెదరకుండాఁ బోసెఁ జెప్పరే ॥జమళి॥

3. పొలఁతులిద్దరితోడ బువ్వానఁ గూచుండి
చలివాయఁ గళ్ళిచ్చీ సరిగాను
యెలమి శ్రీ వేంకటేశుఁ డెనసె నీవేళ నే-
చెలులకుఁ జనవిచ్చెఁ జెప్పరే ॥జమళి॥

**అర్థములు:** ప. జమళి = రెండు, సరసుడు = శృంగారపురుషుడు, ఏటికి = ఎందుకు.

1. తూగు మంచము = వుయ్యాల మంచము, తొయ్యలి = ఆడుది, కాగలించుకొని = కౌగలించుకొని, కరగు = ద్రవించు, ఏగు = వెళ్ళు, మోహము = ప్రేమ, చేగదేర = సారవంతమైన, సరి = అర్థమయేవిధంగా.
2. ఒకమాటు = ఒకేసారి, కదసి = సమానమైన, పచ్చడం = పై అంగ వస్త్రము, కప్పీనీ = కప్పెను, తలబాలు = తలంబ్రాలు, చెదరకుండా = క్రింద పడిపోకుండా, పోసె = పోసెను.
3. పొలతులు = స్త్రీలు, బువ్వాన = భోజనమునకు, చలివాయు = బుజ్జగించు, కళ్ళిచ్చి = కళ్ళతో చూసి, ఎలమి = వికాసము, ఎనసి = సరిపోలు, చనవిచ్చె = ప్రేమ,అపేక్షను చూపించెను.

**భావము:** చెలులారా! శ్రీవేంకటేశ్వర స్వామి, శ్రీదేవి, భూదేవి, ఇద్దరు దేవేరులను ఒకేసారి వివాహమాడినాడు. ఇంకా ఈ రోజు స్వామికి చెమటలెందుకు వస్తున్నాయో చెప్పండి?

తూగుటుయ్యాల మంచంపై ఇద్దరిని కౌగలించుకొంటూ ఆయన పరవశించిపోతున్నాడు. ఉత్సవంలో తిరిగే పెండ్లికొడుకుకు ఇద్దరు దేవేరులలో ఎవరిమీద ఎక్కువ ప్రేమ ఉన్నదో సారవంతమై ఉన్న ఆ స్వామి కూడా చెప్పలేక పోతున్నాడు.

ఇదిగో పెండ్లిపీటల మీద యిద్దరు దేవేరులకు ఒకేసారి తన అంగ వస్త్రమును కప్పుచున్నాడు. స్వామి తన దోసిలి నిండా తలంబ్రాలు పట్టుకొని ఉన్నాడు కదా! ఎవరి మీద తను క్రిందపడకుండా పోసి ఆనంద పరచగలడో చెప్పగలరా?

ఇద్దరు రాణులతో విందు భోజనానిని కూర్చుని బుజ్జగింపు కళ్ళతో యిద్దరిని గమనిస్తూ, ప్రకాశముతో స్వామిశ్రీవేంకటేశ్వరుని ప్రభ ఈరోజు శోభించుచున్నది. ఆ స్వామి యిద్దరు భార్యలకు సమానమైన గౌరవమిస్తూ ప్రేమాతిశయాన్ని ప్రదర్శిస్తున్నాడని చెప్పరే!

## 569

**అవతారిక:** అమ్మ స్వామివారికి చేసే ఉపచారాలను వర్ణిస్తున్నాడు అన్నమయ్య.

### లలిత

ప. దీపించఁ జక్కఁదనము దేవునికిని
పైపైఁ జల్లేరు నేఁడు పన్నీరుకాపు ॥పల్లవి॥

1. వుడివోనికల్పభూజ మొద్దికఁ గొమ్మలతోనే
పొడవెల్లా దెల్లనై పూచెనోకాక
యెడలేక తిరుమేన నింతటా మెత్తిరిదివో
కడలేనిహరికిని కప్పురకాపు ॥దీపించ॥

2. తిరమై యాకాసమందు తెల్లనిచంద్రునిమీఁద
వరుస నీల మేఘము వాలెనోకాక
సరసనే శశివర్ణ మైనందు
పురిగొన నించిరిదే పుళుగుకాపు ॥దీపించ॥

3. పొంచి నీలగిరి మీఁద బొసఁగి బంగారు కొండ
అంచెలఁ గీలించినట్టి యందమో కాక
మించి శ్రీ వేంకటపతి మెడ నలమేలుమంగఁ
జంచులఁ బెట్టి పూసిరి చందనకాపు ॥దీపించ॥

**అర్థములు:** ప. దీపించు = ప్రకాశించు, చక్కదనము = అందము, పైపై = పైభాగమున, పన్నీరుకాపు = పన్నీరు ద్రవము.

1. ఉడివోని = నశించని, కల్పభూజము = కల్పవృక్షము, ఒద్దిక = సఖ్యత, కొమ్మలు = స్త్రీలు, పొడవెల్లా = నిలువెల్లా, ఎడలేని = అంతరాయములేకుండా, తిరుమేన = పవిత్రమైన శరీరముపై, మెత్తిరి = చిక్కగా పూసిరి, కడలేని =

అంతములేని, కప్పురకాపు = కర్పూరపు పొడి.

2. తిరము = శాశ్వతము, సరస = ప్రక్కనే, శశివర్ణము = తెల్లని రంగు, పురిగొన = పురివిప్పు, పుళుగుకాపు = పునుగుపిల్లి సుగంధ ద్రవ్యము.

3. పొంచి = దాగి, నీలగిరి = నీలమైన కొండ, పొసగి = అనుకూలించు, అంచల = వరుస, కీలించు = తగిలించు, మించు = అధికమై, జంచులు = అందముగా, చందనకాపు = సుగంధమైన చందనపు మైపూత.

**భావము:** ఆహా! ఆ సుందరమైన స్వామికి ప్రకాశవంతముగా పైన చల్లుచున్న ఆ పన్నీరు ద్రవాన్ని చూడండి.

ఎన్నటికి వాడని, నశించని కల్పవృక్షపు కొమ్మలపైన పూసిన పారిజాత పుష్పములు తెల్లని కాంతితో మెరిసిపోతూ కనిపిస్తూ అవి దట్టముగా ప్రకాశిస్తూ పూచినవో యన్నట్లుగా అంతరాయము లేక పవిత్రమైన స్వామి శరీరము నిండా కర్పూరపు పొడి పూసియున్నారిదివో గమనించండి.

శాశ్వతమై ఆకాశము మీద తెల్లని చంద్రునిపై నీల మేఘాలు క్రమ్ముకున్నాయన్న రీతిగా శరీరమునందు తెల్లని దేహము మీద పురివిచ్చిన రీతి పునుగు కాపు వేసినారు చూడండి.

దాగి నీలమైన పర్వతమునందు అనుకూలించి ప్రకాశిస్తున్న బంగారుకొండ ప్రకాశించిన విధముగా అధికమైన శ్రీవేంకటేశ్వరునికి ఆ అలమేలుమంగమ్మ అందముగా సుగంధమైన చందనపు మైపూత పూసెనిదివో గమనించండి.

## 570

**అవతారిక:** అమ్మ ఎక్కడో కనిపించక స్వామి వెదుకుతున్నాడు. చూడండి.

### లలిత

ప. ఇందుకే నీవు వచ్చితి వీడనే నే నున్నవాఁడ
విందువంటి నీ గుణాలు వేవేలు గదవే ॥పల్లవి॥

1. మట్టెలు గల్లురనఁగ మగువ యెందు వోయేవే
యిట్టెనీ కెదురుచూచి యీడ నున్నాఁడ
కట్టిన నీదవ్వఁ(ప్పు?టము గజభజించఁగ నీ-
దిట్టమాట లివి మాకు దెలియవు గదవే ॥ఇందుకే॥

2. వెదచల్లువాసనతో వెదకే వెవ్వరినే
యిదె నీవు రమ్మనగా నీడ నున్నాఁడ
కదిసి నీముంజేతికంకాణాలరవళికి
చదల నీవిన్నపాలు సందడినే వున్నవే ॥ఇందుకే॥

3. కలకలనవ్వులతో కమ్మటి నేమిచూచేవే
యెలిమి నిన్నుఁగాచుక యీడ నున్నాడ
చెలఁగి కూడితి నిదె శ్రీవేంకటేశుఁడ నిన్ను
పలుకుఁబంతము నింతబలువాయఁగదవే ॥ఇందుకే॥

**అర్థములు:**ప. ఈడనే = ఇక్కడనే, విందు = కమ్మని భోజనము, గుణములు = స్వభావము, వేవేలు = వేలకు వేలు.

1. మట్టెలు = స్త్రీలు కాలి రెండవవేలికి పెట్టుకొను వెండి తొడుగు, గల్లురనగ = ఘల్లుమని మ్రోగునట్లు, మగువ = భార్య, ఈడ = ఇక్కడ, నీదింటంపటము = నీదైన ఆ వస్త్రము, గజభజించు = కలవరపడు, దిట్టమాటలు = సామర్థ్యముతో కూడిన మాటలు.

2. వెదజల్లు = విరజిమ్ము, కదిసి = సమీపించు, ముంజేతి కంకణల రవళి = ముంజేతికి వేసుకున్న కంకణముల శబ్దము,

చదల = మించు, విన్నపాలు = వినతులు, సందడి = ప్రక్కన.

3. క్రమ్మటి = మరల మరల, ఎలిమి = ప్రకాశము, కాచుక = కనిపెట్టుకొని, ఈడ = ఇక్కడ, ఉన్నాడ = ఉన్నాను, చెలగి = ఉత్సాహించి, పలుకుబంతము = మాటపట్టింపు, ఇంత = ఇంతగా, పలువాయు = గొప్పవైనవి.

**భావము:** చెలీ! ఇందుకొరకే యిచ్చటకు వచ్చి ఇక్కడనే ఉన్నాను సుమా! చక్కని విందుభోజనముతో సమానమైన నీ స్వభావము, సుగుణాలు వేలకు వేలై లెక్కకు మించి యున్నవి గదా!

నీ కాలి మట్టెలు ఘల్లు ఘల్లుమని మ్రోగేవిధముగా ఎక్కడకు పోయి ఉన్నావు? నీకొరకు ఎదురు చూపులు చూస్తూ నిలబడి యున్నాను. నీవు కట్టిన నీదైన ఆ వస్త్రము కలవరపడే విధంగా నీ సామర్థ్యముతో కూడిన మాటలు మాకు తెలియవు కదా చెలీ!

విరజిమ్మే చక్కని సుగంధముతో నున్నదానా! ఎవరిని ఈ ప్రదేశమంతా వెదకుతున్నావు? ఇదుగో నీవు రమ్మంటే వచ్చి ఇక్కడ ఉన్నాడను. సమీపములోనే యున్న నీ ముంజేతి కంకణముల సవ్వడి మించిపోయినవి. నీ విన్నపాలు వినడానికి ప్రక్కనే ఉన్నాను సుమా!

చెలీ! అంత అందమైన గలగల నవ్వులతో ప్రక్కనే ఉండి మాటి మాటికి చూడడమెందులకు? ప్రకాశముతో నిన్ను రక్షించి కావడానికి నేను చెంతనే ఉన్నాను. ఉత్సాహించి నిన్ను కలసిన శ్రీవేంకటేశ్వరుడను నేనే! నీకు ఇంకా మాటపట్టింపులేల? ఈవిధమైన ఉన్నత గుణములు ప్రదర్శించరాదా!

## 571

**అవతారిక:** అమ్మ ఎందులకో స్వామిపై పరాకుగా ఉన్న సమయములో స్వామి దరిజేరి ఆమెను బుజ్జగిస్తున్న దృశ్యం.

### శంకరాభరణం

ప. ఆయలేరా మాతోనే అంత యేఁటికి
చాయలకు సన్నలకు చవులువుట్టీనా ॥పల్లవి॥

1. బలిమిఁ బట్టకురా పనిగల దీవేళ
బలిమెల్లా నాఁడువారిపైనేయటరా
చలమింతేఁటికిరా సమ్మతి రేపయ్యీఁగాక
వలపు లింతటిలోనే వడ్డికిఁ బారీనా ॥ఆయలేరా॥

2. కొనగోర నొత్తకురా కుమ్మోవోయీ ముఁ(ముం?)జేయి
కొనఁబెట్టి(ట్ట?) మోహాలు కొనసాగీనా
వెనక వచ్చేరా వీరిడిఁ జేయకు నన్ను
ననిచినమన సిట్టేనాని మెత్తనాయనా ॥ఆయలేరా॥

3. పయిఁ జేయివేయకురా పట్టరాదు మేనికాఁక
ప్రియములు పెంచఁ బెంచఁ బెంటలయ్యీనా
దయతో శ్రీవెంకటేశ తగిలి కూడితి నన్ను
క్రియ వచ్చె నిఁక నిన్నుఁ గేరడమాడేనా ॥ఆయలేరా॥

**అర్థములు:** ప. ఆయ = అయ్యెను, ఏటికి = ఎందులకు, చాయ = శోభలు, సన్నలు = సైగలు, చవులు = రుచి, ఉట్టీనా = పుడుతుందా.

1.బలిమి = ధృడత్వము, పట్టకు = పట్టుకోవలదు, ఈవేళ = ఈసమయమున, చలము = భీతి, సమ్మతి = అంగీకారము, రేపయ్యీ = రేపటిరోజున అయేను, పారీనా = పరుగెత్తునా.

2.కొనగోర = గోరుచివర, ఒత్తకు = గీటుచేయకు, కుమ్మ = పొదుచు, కొనబెట్టు = సన్నగిల్లు, కొనసాగీనా = సాగుతాయా?

వీరిడి = వెర్రితనము, ననిచి = చిగురించు, మనసిట్టే = మనసీవిధముగా, మెత్త = మెత్తబడు.

3. పయి = వంటిమీద, పట్టరాదు = పట్టుకొనుటకు వీలుకాదు, మేని కాక = శరీరపు తహతహ, ప్రియము = ప్రేమ, పెంటలు = కుప్పలు, క్రియ = చేయదగిన పని, కేరడమాడు = తిరస్కారము.

భావము: అయినదేదో ఆయెను కదా స్వామీ! మాతో అంత పంతాలు పట్టింపులు ఎందులకు? శోభలకు సైగలకు రుచిపుదుతుందా చెప్పండి స్వామీ!

నీవు బలమున్నదని నన్ను పట్టుకోవద్దు. నాకు ఈ సమయములో అనేక పనులు చేయవలసి ఉన్నవి. నీ బలప్రదర్శన ఆడువారిమీద తగునా? అంతలోనే దిగాలుపడడమెందులకు? నా అంగీకారము రేపటికి అని చెప్పాను కదా? ప్రేమలింతలోనే వడ్డీకి ఇచ్చిన ధనము వలె అధికమై ప్రవహించేనా స్వామీ?

స్వామీ! మీ కొనగోళ్ళతో గీట్లు (నఖక్షతములు) పడేట్టు చేయకండి. ముంజేతితో మాటి మాటికి పొడవకండి. సన్నగిల్లే ప్రేమలు కలకాలం కొనసాగుతాయా? నీ వెనకే వెంటనే వస్తాను కానీ వెర్రితనముతో ప్రవర్తించవద్దు స్వామీ! చిగురించిన మనసు ఈవిధముగా నాని నాని మెత్తబడినదా?

నా పైన మాటి మాటికి చేయి వేయవద్దు సుమా! నా శరీరపు తహ తహలు పట్టనలవి గానివి సుమా! ఈ ఇష్టాలు ప్రేమలు పెరిగిన కొలదీ కుప్పకుప్పలై భరించలేకుండా తయారవుతాయి. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈనాడు అనుగ్రహించి నన్ను కూడినావు. ప్రేమాతిశయంతో చేయవలసిన పనులన్నీ ముందున్నవి సుమా! ఈవిధమైన తిరస్కార భావం చూపకండి స్వామీ!

## 572

**అవతారిక:** అమ్మ స్వామికొరకై వెదుకులాడుతున్నదని చెలులు స్వామికి విన్నవించే సన్నివేశం.

### ధన్నాసి

ప. విచ్చేయవయ్యా వేగమే అక్కడికి
అచ్చమైన కోరికతో నలసీఁ జెలి ॥పల్లవి॥

1. వుప్పరిగెలోన నీవు వున్నాఁడవంటా వచ్చి
అప్పుడే రావైతివంటా నడిగీఁ జెలి
తొప్పఁ దోఁగేచెమటతో తూగుమంచముపైఁబండి
ముప్పిరి మోహములోన మునిఁగీఁ జెలి ॥విచ్చేయ॥

2. వేడుకతో నీకు నిట్టే వీడెమిచ్చేనంటా వచ్చి
వీడుపడి యందు నిందు వెదకీఁ జెలి
వాడుచు మలగుమీఁద వడి నొరగుండి తాను
పాడించుకొనీ నీపై పాటలిన్నీఁ జెలి ॥విచ్చేయ॥

3. వుట్టిపడి నీవు కొలువున్నాఁడవంటా విని
అట్టె నిన్ను రమ్మని చెప్పెంపీఁ జెలి
గుట్టున శ్రీ వేంకటేశ కూడి యలమేలుమంగ
నట్టనడుమ నిందుకే నవ్వీఁజెలి ॥విచ్చేయ॥

**అర్థములు:** ప. విచ్చేయు = వచ్చు, అచ్చమైన = స్వచ్ఛమైన, అలయు = శ్రమపడు.

1. ఉప్పరిగె = మేడపైభాగము, రావైతివి = రాకున్నాడవు, తొప్పతోగు = ఎక్కువగా మునుగు, తూగుమంచము = ఊగే మంచము, ముప్పిరి = మూడువిధములు, మోహము = ప్రేమ.

2. వేడుక = సంతోషము, వీడెమిచ్చు = తాంబూలమిచ్చు, వీడుపడు = తడబడు, మలగు = తిరుగుచు, ఒరగి = వాలి,

పాడించుకోని = పాటలు పాడించుకొను.

3. ఉట్టిపడు = అతిశయించు, కొలువు = నెలవైయుండు, చెప్పంపీ = చెప్పి పంపించెను, గుట్టు = రహస్యము, నట్టనడుమ = మధ్యలో, నవ్వీ = నవ్వెను.

**భావము:** స్వామీ! అమ్మ ఉన్న ప్రదేశమైన అక్కడికి వెంటనే దయచేయండి. ఆ అమ్మ స్వచ్ఛమైన కోరికలతో అలసి సొలసి యున్నది. మేడ పై భాగములో నువ్వున్నావని వచ్చినది, కానీ వెంటనే ఏల రావని చెలి అడుగుచున్నది. శరీరము నిండా చెమట తడసి ముద్దై తూగుమంచముపై ఊగుతూ పరుండి చెలి రెట్టించిన ప్రేమతో ఎదురు చూపులు చూస్తున్నది.

సంతోషముగా నీకు తాంబూలమిస్తానంటూ వచ్చి, తడబడుతూ నీకోసం అక్కడా ఇక్కడా వెదకుచున్నది. అటూ ఇటూ తిరుగుతూ నీవు మంచముపై పరుండి ఆమె చేత పాటలన్నీ పాడించుకోవచ్చును కదా!

చెలి నీవు అతిశయించి నెలవై యున్నావని విని నిన్ను అలాగే ఇక్కడకు రమ్మని చెప్పి పంపినది. రహస్యముగా అలమేలుమంగమ్మను కూడిన ఓ శ్రీవేంకటేశ్వరా! మధ్య మధ్యలో అందుకే చెలి నీవైపు చూసి చిరునవ్వులు చిందిస్తున్నది.

## 573

**అవతారిక:** అమ్మ స్వామివారు ఎవరితోనో కలిసి ఉన్న సమయములో గమనించి చింతిస్తున్నది.

### హిందోళం

ప. ఎంత మోహమో మీకు నిట్టే బతుకరయ్య
సంతసపువేళ మీకు చవి చెరిచితిఁగా ॥పల్లవి॥

1. యిద్దరు నొక్కపచ్చడ మిటు గట్టుక మీరు
అద్దరిపాటు నే రాఁగా అట్టేలోఁగేరు
వొద్దు వొద్దు మీకునేల వూరకే వట్టిభయము
గద్దరి నేం(నే?)బుద్ది మీకు కంటైతిఁగా ॥ఎంత॥

2. చూపుల మీ రిద్దరూను సొరిదిఁ గరఁగుకొంటా
యేపున నుండఁగఁ నే నేలవస్తినో
రాపుల నాకుఁగా మీరు రహిఁ దియ్య నింతయేల
తీపుల మీగుండెలకు దిగులైతిఁగా ॥ఎంత॥

3. ముంచి యిద్దరునుఁ గూడి ముచ్చటలే యాడుకోఁగా
యెంచక పొడచూపితి నిట్టేనేను
అంచెల శ్రీ వేంకటేశ అలమేలుమంగను నే
మంచమెక్కి కూడుటకు మనసైతిఁగా ॥ఎంత॥

**అర్థములు:** ప. మోహము = ప్రేమ, ఇట్టే = ఈవిధముగా, బతుకరయ్య = జీవించండి, చవి = రుచి, చెరిచితి = చెడగొట్టితిరి.

1. పచ్చడము = అంగవస్త్రము, అద్దరిపాటు = అదిరిపాటు, లోగేరు = వెనుదీయు, ఊరకే = ఏమీ లేకుండా, వట్టి = ఉత్త, గద్దరి = గడుసైన, బుద్ధి = తెలివి, కంటైతి = చూచితిని.

2. సొరిది = వరుస, కరగు = ద్రవించు, ఏపు = బాధ, వస్తినో = వాచ్చానో, రాపు = రాపిడి, రహి = ఆనందము, తీపులు = సలుపు, దిగులైతి = దిగులుచెందితిని.

3. ముచ్చటలు = కబుర్లు, ఎంచక = లెక్కించగా, పొడసూపితి = రూపము చూపు, అంచల = ప్రక్కల, కూడుటకు = కలియుటకు, మనసైతిగా = మనసు పెట్టుకొంటి గదా.

**భావము:** ఆహా! ఎంత ప్రేమాతిశయము స్వామీ! ఇద్దరూ ఇలాగే జీవించండి. ఈ సంతోషవేళలో మీకు అరుచిని కలిగించితిని కదా!

ఇద్దరూ ఒకే అంగవస్త్రము కట్టుకొని ఉండగా నేను ప్రవేశించగానే అదిరిపడి అలాగే వెనుదీసి లోకువైనారు కదా! వద్దు వద్దు స్వామీ! మీకేల ఉత్త భయము. గడుసుదాననై నేను బుద్ధితో మీకు కనిపిస్తిని కదా!

మీ యిద్దరు చూపులతో వరుసగా ఒకరిపై హృదయము ద్రవించి బాధతో నుండగా నేను ఏల ఇక్కడకు వచ్చినానో కదా! రాపిడితో నాకుగా నేను ఆనందముతో ఉండగా ఇంతగా ఎందుకు చేస్తున్నారు? మీ గుండెల సలుపులకు కారణమై దిగులు కలిగించితిని కదా!

మీరు అతిశయించి యిద్దరూ కూడి కబుర్లాడుకొనుచుండగా, నేను లెక్కించక రూపు చూపితిని. ప్రక్కనే ఉన్న ఓ శ్రీవేంకటేశ్వరా! నేను అలమేలుమంగమ్మను. నేను మంచమెక్కి నిన్ను కలియుటకు మనసులోపెట్టుకొంటిని కదా!

## 574

**అవతారిక:** అమ్మ స్వామివారికి అరువు తెచ్చుకున్న ప్రేమలు ఎప్పుడూ శాశ్వతములు కావని చెప్తున్న సన్నివేశం.

### వరాళి

ప. ఎరవు సతమవునా యెప్పుదు నేము నేమే
మురిపెపు టాకెఁ గని మొగమోడితివి ॥పల్లవి॥

1. మగువ కప్రము నోట మాటలాడీ వినవయ్య
వెగటైననేమేమన్నా వినవైతివి
బిగి ఉంగరపువేలఁ బిలిచీఁ బోవయ్యా
జిగి నేము యెంత విలిచినా రావైతివి ॥ఎరవు॥

2. మొనగోరిచేత నాకె మొక్కీఁ జేకొనవయ్య
పనివడి మాతోనే పరాకైతివి
ననుపున నాకె నీతో నవ్వె నీవు నవ్వవయ్య
చనవున మానవ్వు చవిగాదు నీకు ॥ఎరవు॥

3. గందము వూసినమేనఁ గాఁగిలించీ మెచ్చవయ్య
ఇందుకుఁగా మాతోడ నింత సేసితివి
అందపు శ్రీ వేంకటేశ అలమేలమంగ నిన్నుఁ
బొందఁగాఁ జొక్కితివి మాబుద్దులు చవాయఁగా ॥ఎరవు॥

**అర్థములు:** ప. ఎరవు = అరువు, సతము = శాశ్వతము, నేము = మేము, నేమే = మేమే కదా!, మురిపెము = సరసత, ఆకె = ఆమె, మొగమోడు = దాక్షిణ్యపడు.

1. కప్రము = కర్పూరము, వెగటు = వైరస్యము, వినవైతివి = వినకున్నావు, బిగి = ధృఢమైన, ఉంగరపువేల = ఉంగరము పెట్టుకున్న వేలితో, జిగి = చల్లనికాంతి, విలిచినా = పిలిచినప్పటికి, రావైతివి = రాకున్నావు.
2. మొనగోరు = వాడియైన గోరు, ఆకె = ఆమె, మొక్కీ = నమస్కరించెను, చేకొను = చేపట్టు, పనివడి = పనిమీద, పరాకు = పరధ్యానము, ననుపు = అనురాగము, ఆకె = ఆమె, చనవు = ప్రేమ, చవి = రుచి.
3. గందము = గంధము, మేన = శరీరముపై, కాగిలించి = కౌగలించి, మెచ్చు = ప్రశంసించు, సేసితివి = చేసినావు, పొందు = దక్కు, చొక్కు = మత్తులోమునుగు, చవింఆయెగా = రుచిపుట్టించినవి.

**భావము:** స్వామీ! అరువు తెచ్చుకున్నవి ఎప్పుడూ శాశ్వతములు కావు. మేము ఎల్లప్పుడూ మేమే! మా ప్రత్యేకత ఎవ్వరికిని రాదు కదా! ఆ సరసపు రమణిని చూసి ఆమెకు దాసోహమంటూ ఉన్నావు.

ఇల్లాలు కర్పూరపు తాంబూలము నోట బెట్టుకుని మాట్లాడుచున్నది. కాస్తా వినవయ్యా! వైరస్యముతో మేమేమి మాట్లాడినా

వినకుండా యున్నావు. ధృఢమైన ఉంగరపు వేలితో ఆమె నిన్ను పిలుస్తున్నది వెళ్ళవయ్యా! చల్లని పిలుపులతో మేమెంత పిలిచినా రాకుండా యున్నావు.

వాడియైన గోళ్ళతో ఆమె నీకు నమస్కరించుచున్నది గమనించవచ్చును కదా! పనిపడినట్లు మాతో పరధ్యానముగా యున్నావు. అనురాగముతో ఆమె నీతో నవ్వుచున్నది కదా! నీవు కూడా ఆమెతో కలసి నవ్వవయ్యా! ప్రేమతో కూడిన మా నవ్వులు నీకు రుచి పుట్టించవేల?

ఆమె మంచి గంధము పూసుకొని యున్నది. ఆమెను బిగియార కౌగలించుకొని ప్రశంసించరాదా! ఇందులకుగాను మాతో ఇంతటి పనులు చేసితివి. ఓ దివ్య సుందరుడవైన శ్రీవేంకటేశ్వరా! ఆ అలమేలుమంగమ్మ మిమ్ములను కలియగా మోహమనే మత్తులో పారవశ్యం చెందితివి. ఈ సమయములో మా గుణగణాలు స్వభావాలు నీకు రుచి పుట్టించినవా?

## 575

**అవతారిక:** స్వామి కొరకు ఎదురు చూపులు చూస్తున్న అమ్మకు స్వామి రానే వచ్చా డని కలవమని చెలులు ఉద్బోధిస్తున్న దృశ్యం.

### ముఖారి

ప. ఎదురు చూచీ నీవు యెప్పుడు వత్తువో యంటా
పదఁ గదవే నీతో పాలుపడ్డాఁ డతఁడు ॥పల్లవి॥

1. కొంకక కూడినదాఁకా కొండవంటిది వలపు
అంకెకు వచ్చినదాఁకా నాయమువంటిది చింత
సంకెదేరినందాఁకా చలివంటిది సిగ్గు
యింకా నేఁటికి రానే యీడనున్నాఁ డతఁడు ॥ఎదురు॥

2. మనసు గలయదాఁకా మరులువంటిది తమి
యెనయఁ బిలుచుదాఁకా యేరువంటిది కోరికె
కని మాటాడుదాఁకా చీఁకటివంటిది మోనము
కినియకువే నీవాకిటనున్నాఁ డతఁడు ॥ఎదురు॥

3. సరిఁగాగిలించుదాఁకా జాలివంటిది వయసు
ధరఁ దలయెత్తుదాఁకా తలుపువంటిది చూపు
ఇరవై శ్రీ వేంకటేశుఁడీడకే విచ్చేసి కూడె
వరు సదుగక రావే వద్దనున్నాఁ డతఁడు ॥ఎదురు॥

**అర్థములు:** ప. వత్తువో = వచ్చెదవో, అంటా = అనుకుంటూ, పాలుపడు = స్వాధీనమగు.

1. కొంకక = భయమొందక, అంకె = వశము, నాయము = న్యాయయుక్తము, చింత = ఆలోచన, సంకె = అనుమానము, ఏటికి = ఎందుకు.
2. మరులు = మోహము, తమి = కుతూహలము, ఎనయు = సరిపోలు, కని = చూసి, మోనము = మౌనము, కినియు = కోపించు, వాకిట = ఇంటిముందు.
3. సరి = సరియైన విధంగా, గాగలించు = కౌగలించు, జాలి = దయ, ధర = భూమి, ఇరవై = స్థానమై, విచ్చేసి = వచ్చి, వరుస = చుట్టరికము, వద్ద = చెంత.

**భావము:** ఎదురుచూపులు చూసి చూసి ఎప్పుడు వస్తాడా స్వామి అనుకుంటూ యున్నావు. ఇంక పదవే! ఆయన నీకు స్వాధీనమయ్యాడు

భయపడకుండా కలిసేదాకా ఈ ప్రేమ అనేది ఒక పెద్ద కొండలా కనిపించి భయపెడుతుంది సుమా! వశమయేంతవరకూ న్యాయయుక్తమా అనే ఆలోచనను రేకెత్తిస్తుంది. అనుమానము పూర్తిగా తీరేంతవరకూ చలివలె ఈ సిగ్గు వణికిస్తుంది. ఇక్కడనే

ఉన్నాడు అతడు, ఇంకా ఎందుకు నువ్వు రావడంలేదు.

మనసులు రెండూ కలిసే వరకూ మోహము కుతూహలము ఆసక్తిని కలిగిస్తూనే ఉంటుంది. సరిపోలుతో పిలిచి చేరేంతవరకూ కోరికలు, వ్యామోహము యేరువలె ప్రవహిస్తూనే ఉంటుంది. చూసి మనసుదీరా మాట్లాడేంత వరకూ మనసంతా అంధకారము ఆవహిస్తూనే ఉంటుంది. ఆయన నీ వాకిట్లోనే ఉన్నాడు. కోపించక వచ్చి చేరవే!

సరిగా కౌగలిలో చేరేంతవరకూ వయసు ఎల్లవేళలా దయతోను భీతితోనూ ఉండడం సహజమేలేవే! నేలమీద ఆ ప్రేమ దరిచేరేంతవరకూ తలుపులాగా ఎదురుచూపులు చూస్తూనే ఉంటుంది సుమా! ఈస్థానములోనే శ్రీవేంకటేశ్వరుడు వచ్చి కూడినాడు కదా! ఇంకా చుట్టరికాలు, వరుసలు అడగకుండా వచ్చి కలియవే! నీ వద్దకే వచ్చి చేరినాడాతడు.

## 576

**అవతారిక:** స్వామి పరాకుగా ఉండి తనపై నిందలు వేస్తున్నాడని విచారం వ్యక్తం చేస్తున్నది.

### వరాళి

ప. ఏమోయని వుంటి మిందాఁకా
యీ మాటలే కా యిఁక నేలరా ॥పల్లవి॥

1. అందరిఁబొమ్మని యంకెకుఁబిలిచేవు
యిందుకా వోరీ యిందాఁకా
అందుకు మావారి నడిగి వచ్చేఁగాని
పొందుగా దీవేళ పోపోరా ॥ఏమో॥

2. జఱయచుఁ బిలిపించి సరసములాడేవు
యెఱఁగనైతిదా యిందాఁకా
మఱి జంకించకు కడమా నేఁ జెప్పఁగాని
తఱిగాదు యీవేళ తడవకురా ॥ఏమో॥

3. చెక్కునొక్కి ననుఁజేకొని కూడితి
యెక్కెరా నీచల మిందాఁకా
చిక్కనినవ్వుల శ్రీ వేంకటేశుఁడ
దక్కితి నిఁక నెందూ దలఁగకురా ॥ఏమో॥

**అర్థములు:** ప. ఏమో = ఏకారణం వల్లనో, ఇందాకా = ఇప్పటివరకు, ఈ మాటలే కా = ఇటువంటి మాటలే కదా, ఇకనేలరా = ఇంకా ఎందుకు చెప్పు.

1. బొమ్మ = స్త్రీ, అంకె = వశము, పొందు = కలయిక, ఈవేళ = ఈసమయమున, పోపోరా = వెళ్ళిపోరా!

2. జరయు = నిందించు, సరసము = శ్రంగారము, ఎరగనైతి = తెలియక ఉంటిని, జంకించు = అదరవేయు, కడమ = చివర, తరి = మధించు, తడయు = ఆలస్యముచేయు.

3. చెక్కు = చెక్కిలి, చేకొని = చేపట్టి, ఎక్కె = అతిశయించు, చలము = కంపము, చిక్కని నవ్వులు = స్వచ్ఛమైన నవ్వులు, దక్కితి = నీకు వశమైతి, ఎందూ = ఎక్కడా, తలగకు = తొలగిపోవలదు.

**భావము:** ఏకారణం వల్లనో ఏమో అని సంకోచముతో ఇప్పటివరకూ ఉండిపోయాను సుమా! అన్నీ ఇటువంటి మాటలే కదా! ఇంకా ఎందుకు చెప్పు?

అందరి బొమ్మననే ఉద్దేశంతో వశమవమని పిలుస్తావు. ఇందులకా ఇంతదాకా ఈవిధముగా ప్రవర్తించినది. అలాగైతే మా వాళ్ళను అడిగి వస్తానులే, ఈ సమయములో ఏ మాత్రము కలయికకు వీలు కాదు నీవు వెళ్ళిపోరా!

ఏవో నిందలు వేస్తూ పనిబడా పిలిపించి సరసాలాడుతావు. నాకీ విషయము ఇప్పటిదాకా తెలియరాలేదు సుమా! మరి ఇంక ఈ భయపెట్టడాలు నిందలు వలదు సుమా! నేనన్నీ వివరంగా తర్వాత చెప్తాను గదా! ఈ వేళ నాకు వచ్చుటకు ఎంత మథించినప్పటికి వీలుగాదు ఆలశ్యము చేయకుండా వెళ్ళిపోరా!

నా చెక్కిలి నొక్కి నన్ను చేపట్టి కూడినావు. నీవు బాగా అతిశయించిన మోహముతో చలిస్తున్నావు. ఓ చక్కని చిక్కని స్వచ్ఛమైన నవ్వులు చిందించే శ్రీవేంకటేశ్వరుడా! నీకు వశమైనాను కదా! ఇంక ఎక్కడికి తొలగిపోవలసిన అవసరము లేదురా! నన్ను ఆనందింపజేయరా!

## 577

**అవతారిక:** అమ్మ స్వామిని గాఢంగా ప్రేమించి మేను మరచి వ్యవహరిస్తున్నదని చెలులు పరిహాసమాడుతున్నారు.

### శంకరాభరణం

ప. ఎక్కడౌతా నెఱఁగదు యెంత వలచెనో కాని
చిక్కువద్దవేళ బుద్ది చెప్పరె చెలులు ॥పల్లవి॥

1 .కోరి మాఁటలాడీఁ గాని కొప్పు వీడు టెఱఁగదు
ఆరయ విభునితోడ నయ్యా చెలి
పారితెంచీఁ జనుఁగొంగు బయలౌతా నెఱఁగదు
గారవించిమీరైనాఁ గప్పరే చెలులు ॥ఎక్కడౌతా॥

2. తప్పక చూచీఁగాని తన్నుఁదానె యెఱఁగదు
అప్పుడే మోహము నాఁటీ నయ్యో చెలి
చిప్పిలఁ బైనొరగీని చెమరించు టెఱఁగదు
దప్పిదేర విసరరే దగ్గరైనఁ జెఁ (నచె?)లులు ॥ఎక్కడౌతా॥

3. కాఁగిలించకొనీఁగాని కళదాఁకు టెఱఁగదు
ఆగి తనివిదీరక అయ్యో చెలి
వీఁగక కడపలోన శ్రీ వేంకటేశుఁగూడి చెలి
చేఁగదేర నవ్వీ సన్న సేయరే చెలులు ॥ఎక్కడౌతా॥

**అర్థములు:** ప. ఎక్కడౌతా = ఎక్కడో తనకు, చిక్కువద్దవేళ = చిక్కుకున్న సమయములో, బుద్ధి = మంచి.

1. కొప్పు వీడు = సిగవీడిపోవుట, ఎరుగదు = తెలియరాదు, ఆరయ = విచారించి, విభుడు = భర్త, పారితెంచు = పారచూచి, చనుకొంగు = చన్నులపై కప్పుకున్న కొంగు, బయలౌత = బయటపడడం, గారవించి = గౌరవించి, కప్పరే = కప్పండి.
2. తన్ను తాను = తనను తాను, మోహము = వలపు, నాటీ = దిగబడినది, చిప్పిల = పైకి ఉబుకు, పైనొరగీని = మీద వాలుచున్నది, చెమరించుటెరుగదు = చెమటలు పట్టడం తెలియదు, దప్పిదేర = దాహం తీరేవిధంగా, విసరరే = వింజామరతో విసరండి, దగ్గరైన = సమీపములోనున్న.
3. కాగలించుకొనీ = కౌగలించుకొన్నది, కళదాకు = శోభించి దగ్గరవడం, తనివి దీరక = తృప్తిచెందక, అయ్యో = అయ్యయ్యో..పాపము, వీగక = తగ్గక, కడప = గృహద్వారము, చేగదీర = సామర్థ్యముతో, సన్న = సైగ, చెలులు = చెలికత్తెలు.

**భావము:** ఎంతగా స్వామిని ప్రేమించినదో తెలియదు కానీ, తానెక్కడ ఉన్నది కూడా మరచిపోతున్నది. ఇలా చిక్కుకున్న సమయములో

చెలులు కనీసం నాలుగు మంచి మాటలు చెప్పి దారిలో పెట్టండి.

తను కోరి కోరి మాట్లాడుతూ ఉంటుంది కానీ తన కొప్పు వీడిపోయిందన్న ధ్యాసకూడా తనకు లేదు సుమా! అలాగే భర్తతో ఉన్నప్పుడు అయ్యో పాపం, స్వామినే తేరిపార చూసి తన్మయురాలవుతూ ఉండగా పైట కొంగు జారిపడి వక్షోజాలు బయటపడుతున్నాయన్న ధ్యాస కూడా లేదాయె! చెలులారా మీరైన కాస్త అమ్మను గౌరవించి పైటను కప్పండి.

స్వామిని వీక్షించే సమయములో తన్ను తాను మరచిపోవుచున్నది. అయ్యో పాపం అలా చూస్తూ చూస్తూ మోహానికి లోనైపోతున్నది. ఉబికుబికి వస్తున్న ప్రేమ మైకములో స్వామి మీదకు వాలిపోతున్నది కానీ ఒడలంతా చెమటలమయమైన సంగతి గమనించదు. ఆమెకు ఆ తాపం తీరేవరకూ విసనకర్రలు వింజామరలు ఉపయోగించి విసరండి చెలులారా!

ఆమె స్వామిని కౌగలించుకొంటున్నదే కానీ మించి శోభలను ప్రదర్శించడం ఎరుగకున్నది. అయ్యో..పాపం ఆ అమ్మకు తనివి దీరడంలేదు. అయినా ఏమాత్రం తగ్గకుండా కడపలో శ్రీవేంకటేశ్వరుని కూడినది ఇంక చెలులారా! సారవంతమైన నవ్వులు నవ్వి, సంతోషముతో కూడిన సైగలు చేయండి.

## 578

**అవతారిక:** ఇద్దరు దేవేరులతో కొలువు తీరియున్న గోవిందరాజ స్వామి వైభవాన్ని వర్ణిస్తున్నాడు అన్నమయ్య.

## సామంతం

ప. కొలువున్నాఁ డదివో గోవిందరాజు
కొలఁదిలేని సొమ్ముల గోవిందరాజు ॥పల్లవి॥

1. గారవానఁ బాదములు కాంతలపైఁ బారఁజాచి
కూరిములు వెదచల్లీ గోవిందరాజు
దీరత సంకుఁజక్రాలతెల్లని కన్నులతోడ
కోరినవరము లిచ్చీ గోవిందరాజు ॥కొలువు॥

2. దట్టపుంగరాలవేళ్ల దాపలిచెయు వారఁజాఁచి
గుట్టుతో నూరకున్నాఁడు గోవిందరాజు
వొట్టుకొనె వలకేలు వున్నతిశిరసుకింద
కొట్టఁగొన నవ్వులతో గోవిందరాజు ॥కొలువు॥

3. చిప్పిలుతా నొత్తగిలె శేషునిపడగెనీడ
గొప్పకిరీటముతోడ గోవిందరాజు
అప్పుడే బొడ్డునఁ గనె నజుని శ్రీ వేంకటాద్రి-
కుప్పెకటారముతోడ గోవిందరాజు ॥కొలువు॥

**అర్థములు:** ప. కొలువు = సభ, అదివో = అదుగదుగో, కొలదిలేని = కొరతలేనటువంటి, సొమ్ముల = ధనమున్న.

1. గారవాన = గౌరవముగా, పాదములు = కాళ్ళు, బారజాచి = చాచిపెట్టుకొని, కూరిమి = స్నేహములు, వెదజల్లీ = వ్యాపింపజేసి, దీరత = ధైర్యము, సంకుజక్రాల = శంఖువు మరియు చక్రములు, వరము = దేవతాదులవలన పొందఁ బడు కోరిక.

2. దట్టపు = అధికముగా, ఉంగరాల వేళ్ళు = ఉంగరాలు పెట్టుకున్న వేళ్ళు, దాపలి = అటూనిటూ, వారజాచి = ప్రక్కన పెట్టుకొని, గుట్టు = దాపరికము, ఒట్టుకొను = పెట్టుకొను, వలకెలు = కుడిచేయి, ఉన్నతి = ఎత్తైన, శిరసుక్రింద = తలక్రిందుగా, కొట్టకొన = అన్నిటికి చివరనున్న.

3. చిప్పిలు = పైకి ఉబికి వస్తున్న, ఒత్తగిలె = ప్రక్కకు తిరిగి, శేషుని పడగనీడ = శేషపానుపు యొక్క పడగనీడ, గొప్ప =

ఘనమైన, బొద్దున = బొద్దులో, కనె = చూసెను, అజుని = బ్రహ్మదేవుని, కుప్పె కటారము = శిరోభూషావిశేషము మరియు కత్తి.

**భావము:** అదుగో అటు చూడండి. గోవిందరాజు కొలువుదీరి యున్నాడు. స్వామి కొరతలేని ధనరాసులతో తులతూగుతున్నాడు.

ఎంతో మర్యాదతో తన రెండు కాళ్ళను భార్యామణులపై బారజాపి ఎంతో స్నేహ హృదయముతో చూస్తున్నాడు గోవిందరాజు. ఎంతో ధైర్య శౌర్యాలతో శంఖు చక్రాదులను ధరించి, తెల్లనైన కన్నులతో మనకు కోరినన్ని వరములనిచ్చి నిలిచి యున్నాడు గోవిందరాజు.

వేళ్ళకు దట్టముగా ఉంగరాలను పెట్టుకొని ఆ ఎడమ చేతిని బారజాచి రహస్యముగా నున్నాడు ఆ గోవిందరాజు. తన కుడి చేతిని ఎత్తుగా తలక్రింద పెట్టుకొని పండుకొని, పెదవి చివర నవ్వులతో ఉన్నాడు ఆ గోవిందరాజు.

తాను ప్రక్కకు తిరిగి శేషతల్పపు పడగనీడ క్రింద, ఘనమైన కిరీటముతో ఆ గోవిందరాజున్నాడు. అప్పుడే తన బొద్దులోనుండి పైకి వచ్చిన పద్మములో బ్రహ్మదేవుని చూశాడు. శ్రీవేంకటాద్రిపై గోవిందరాజు శిరోభూషణములతోను ఖడ్గముతోను గోవిందరాజు కొలువై యున్నాడు.

## 579

**అవతారిక:** స్వామి అన్య స్త్రీలతో ఇచ్చకాలాడుతూ ఉండగా అమ్మకు శరీరమంతా కాక రేగి, కన్ను లెర్రబడి కోపిస్తున్నదని చెలులు స్వామికి చెప్తున్న దృశ్యం.

### కేదారగౌళ

ప. వద్దు సుమ్మీ ఇది నీవు వలచిన నీ రమణి
వొద్దనుండఁగానే యింత వుమ్మలఁ బెట్టేవు ॥పల్లవి॥

1. చెక్కులెల్లాఁ జెమరించెఁ జెలియకు విభుఁడ నీ-
వక్కడనెందో పరాకై వుండఁగా
ముక్కునఁ గోపము నిండె ముందరనుండినయీపె
తక్కించి నీవు పరులఁ దప్పకచూడఁగను ॥వద్దు॥

2. తనువెల్లాఁ గాఁకరేఁగె తరుణి చూడఁగ నీవు
మనసిచ్చి సతులతో మాటలాడఁగా
కనుఁగొన లెఱ్ఱనాయ కలికి నవ్వఁగ నీవు
యెనలేని తలపోఁత లెక్కడో పెంచఁగను ॥వద్దు॥

3. ముచ్చికలే దైవారె మగువవిన్నపము నీ-
విచ్చగించి ఇన్నిటికి నియ్యకొనఁగా
పచ్చిగా శ్రీ వేంకటేశ పైకొని కూడితి చెలి-
నచ్చలములెల్లాఁ దీరె నంతేసి సేయఁగను ॥వద్దు॥

**అర్థములు:** ప. సుమ్మీ = నిశ్చయార్థకము, వలచిన = ప్రేమించిన, ఉమ్మలబెట్టు = బాధపెట్టు.

1. చెక్కులు = చెక్కిళ్ళు, చెమరించె = చెమటతో తడయు, విభుడు = భర్త, నీవుంఅక్కడంనెందో = నీవు అక్కడడెక్కడో, పరాకు = తత్పరత, ముక్కునకోపము = తొందరగా కోపించు, ముందర = ఎదురు, ఈపె = ఈమె, తక్కించి = కాకుండా, పరుల = ఇతర స్త్రీలను.

2. తనువు = శరీరము, కాక = తాపము, తరుణి = స్త్రీ, మనసిచ్చు = ప్రేమించు, సతులు = స్త్రీలు, కనుకొన = కండ్ల

చివరలు, ఎర్రనాయె = కోపముతో ఎర్రబడు, కలికి = స్త్రీ, ఎనలేని = లెక్కలేని, తలపోత = ఆలోచన, పెంచు = అధికముజేయు.

3. ముచ్చికలు = మూగిన కోరికలు, దైవారు = ప్రకాశించు, విన్నపము = వినతి, ఇచ్చగించి = ఇష్టపడు, ఇయ్యకొను = సమ్మతించు, పచ్చిగా = మరుగులేని, పైకొని = చేపట్టి, అచ్చలము = ఉత్సాహము, తీరె = సంతృప్తినిచ్చు, అంతేసి = అంత ఎక్కువగా.

**భావము:** స్వామీ! అలాంటి పనులు చేయకండి! ఈమె ఎవరో కాదు నిన్ను వలచి, వలపించుకొన్న స్త్రీ. ఆమె వద్ద నుండగానే ఇంతగా బాధించడం తగునా! చెప్పండి?

నీవు అక్కడ ఏ విషయములోనో పరధ్యానముతో నుండగా, ఇక్కడ ఈ చెలికి చెక్కిళ్ళు చెమటలతో తడసి ముద్దైనవి. నీవు చుట్టుప్రక్కల స్త్రీలను పరిశీలనగా చూస్తూ ఉండగా, నీ ఎదురుగా ఉండిన ఈమె ముక్కుమీద కోపం అధికమైనది.

నీవు మనసిచ్చి ఇతర స్త్రీలతో ఇచ్చకాలాడుతూ ఉండగా ఇక్కడ ఈమెకు శరీరమంతా కాక రేగి, కన్ను చివరలు ఎర్రబడి కోపిస్తున్నది. ఆమె చిరునవ్వులు చిందిస్తుండగా నీవు మాత్రము నీ ధ్యాస ఎక్కడో ఉంటున్నది సుమా!

అన్నింటికి ఇష్టపడి,సమ్మతించి ఆమెను కైకొనగా, ఆమె శరీరము నిండా మూగిన కోరికలన్నీ ప్రకాశించాయి. ఓ శ్రీవేంకటేశ్వరా! ఏమాత్రం మరుగులేకుండా ఆమెను చేపట్టి కూడినావు. నీవు ఇంత అధికముగా చేయగా, ఆ అమ్మ ఉత్సాహమంతా నేటికి పూర్తిగా తీరి సంతృప్తి కలిగినది

## 580

**అవతారిక:** వేగులవలె ప్రవర్తిస్తూ స్వామివారిపై లేని పోని చాడీలు చెప్తున్నారని భావించిన అమ్మ చెలులను మందలిస్తున్న దృశ్యం.

### ఆహిరి

ప. వేగిరించకురే వెలఁదులాల
బాగుగా నా రమణుఁడు పాడెఱఁగఁడా ॥పల్లవి॥

1. దగ్గరి వచ్చినవాఁడు తనే మాటాడఁడా
యెగ్గువట్టీ నుండరే యిదేమనక
బగ్గన రమ్మన్నవాఁడు పైకొనక మానునా
సిగ్గువడీ మానరే చేరి విన్నవించక ॥వేగిరించ॥

2. నన్ను మన్నించినవాఁడు నవ్వక మానీనా
సన్నలు సేయకురే జడిసీఁ దాను
అన్నిటా వలచినాఁడు ఆదరించకుండునా
యిన్నేసి దూరకురే యేమనీనో అతఁడు ॥వేగిరించ॥

3. ఇయ్యకొనొనట్టివాఁడు ఇటమీఁదెఱఁగఁడా
కొయ్యతనాలాడకురే కోపగించీని
ఇయ్యెడనే శ్రీ వేంకటేశుఁడిట్టె నన్నుఁ గూడె
నెయ్యములె నెరపరే నిందుదొర ఇతఁడు ॥వేగిరించ॥

**అర్థములు:** ప. వేగరించు = సమాచారము తెలుపు, వెలది = స్త్రీ, రమణుడు = అందమైన వాడు, పాడింఎరుగడా = ఎదురు రావడం తెలియని వాడా

1. ఎగ్గువట్టు = అపకీర్తి మాటలు, ఇదేమనక = అదీ ఇదీ మాట్లాడకుండా, బగ్గన = తొందరగా, పైకొనక = చేపట్టక, మానరే = చేయకండి, విన్నవించక = వినతులు చేయకుండా.

2. మన్నించు = మన్నన మర్యాద చూపు, మానీనా = మానుతాడా, సన్నలు = సైగలు, జడియు = భయముచెందు, ఆదరించు = ప్రేమతో దాగ్గరకు తీయు, ఇన్నేసి = ఇన్నివిధములుగా, దూరకురే = అన్నినిటిలో వేలుపెట్టకండి, ఏమనీనో = ఏమంటాడో ఏమో.
3. ఇయ్యకొను = సమ్మతించు, ఇటమీదెరుగు = ఇక తర్వాత చేయవలసిన కార్యము, కొయ్యతనము = తెలివిలేని స్వభావము, కోపగించీ = కోపము దెచ్చుకుంటాడు, ఇయ్యెడ = ఈప్రదేశమునందే, నెయ్యము = స్నేహము, నెరపరే = కుదర్చండి, నిండు దొర = మంచి దొడ్డ ప్రభువు.

**భావము:** ఓ చెలులారా! మీరు వచ్చి ఏవేవో సమాచారములని నాకు వినిపించి వేగులవలె ప్రవర్తించవద్దు. నా స్వామి బాగుగా ఆడి పాడి నన్ను ఆదరించడం తెలియని వాడా?

స్వామి నా దగ్గరకు వచ్చినవాడు నాతో మాట్లాడకుండా ఉంటాడనుకొన్నారా? మీరు అవీ ఇవీ మాట్లాడకుండా కాస్తా ఓపికతో ఉండండి. స్వామి త్వరగా రమ్మన్నవాడు నన్ను చేపట్టక విడిచిపెడతాడా?

మీరెందుకు అనవసరమైన సైగలు చేసి ఆయన్ను జడిపిస్తారు. నన్ను అన్నివిధములుగా ప్రేమించి నాతో ఇంత సఖ్యత నెరపుతున్న స్వామి ఆదరించకుండా ఉంటాడా? ఇంత ఎక్కువగా ఈ విషయాలలో తలదూర్చకండి. స్వామి ఏమనుకుంటాడో ఏమో మరి!

సమ్మతించి దరిచేరినవాడు ఇక మీదట తర్వాత చేయవలసిన కార్యము చేయడం తెలియనివాడనుకొన్నారా? దయచేసి మీ తెలివిలేని స్వభావాలు బయటపెట్టకండి. స్వామి కోపం వహించవచ్చు. ఇదుగో ఈ తావునే ఆ శ్రీవేంకటేశ్వరుడు ఈవిధముగా నన్ను కూడినాడు. ఇక మీకు స్నేహ స్వభావాలు చూపించి మా ఇద్దరిని కలిపేందుకు యత్నించండి. ఆ స్వామి మంచి దొడ్డ ప్రభువు కదా! నన్ను తప్పక ఆనందింపజేసేను సుమా!

## 581

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామిని లోబరుచుకుని స్వాధీనపతిగా పేరు తెచ్చుకున్నదని చెలులు ప్రశంసల వర్షం కురిపిస్తున్నారు.

### శ్రీరాగం

ప. చిన్నదానవైనాను చేఁతలివి మేలమ్మ
నిన్నుఁ జూచిన సతులెల్లా నేఁడు మెచ్చేరమ్మా ॥పల్లవి॥

1. చెక్కునఁబెట్టినచేయి సెలవినవ్వినవ్వు
తక్కక వోచెలి నీకే తగునమ్మా
పక్కన నిట్టూర్పులును పతితోడిమాటలు
నెక్కొని యింతేసి యాడ నేరిచితివమ్మా ॥చిన్నదాన॥

2. తేలగింపుఁజూపులును తియ్యనివినయములు
కాలమందే నీయందే కంటిమమ్మా
తాలిమి నివ్వెరగులు తమకపుఁగరఁగులు
వేళతో విభునిమీఁద వేసితివమ్మా ॥చిన్నదాన॥

3. వసివాడునటనలు వలపులఘటనలు
యెసరెత్తివి నేఁడే యేమమ్మా
కొసరి శ్రీ వేంకటేశుఁ గూడితి వింతటిలోనే
రసికతనము నీకు రతికెక్కెనమ్మా ॥చిన్నదాన॥



డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య

**అర్థములు:** ప. చిన్నదానవు = పసి వయసులో నున్న స్త్రీవి, చేతలు = పనులు, మేలు = శుభము.

1. చెక్కున = చెక్కిట, సెలవి నవ్వు = పెదవి మూల నవ్వు, తక్కక = తప్పక, తగును = సరిపోవును, నిట్టూర్పు = దీర్ఘమైన ఉచ్ఛ్వాస నిస్శ్వాసనములు, తోడి = కలసి, నెక్కొను = పాదుకొను, యాడ = ఎక్కడ, నేరిచితివి = నేర్చుకొన్నావు.
2. తేలగింపు = ఈదులాడే కన్నులు (మాటిమాటికి మూసి తెరిచే కన్నులు), తియ్యని = మధురమైన, వినయములు = భక్తిప్రపత్తులు,కాలమందే = ఈ సమయములోనే, కంటిమి = చూశాము, తాలిమి = ధైర్యము, నివ్వెరగు = మిక్కిలి భీతి, తమకపు గరగులు = తాపముతో తహతహలాడుతున్నట్లు ద్రవించిపోవడం, వేళతో = సమయము కనిపెట్టి, విభుడు = భర్త, వేసితివి = విసిరినావు.
3. వసివాడు = పసిబారని లేలేత నటనలు, వలపుల ఘటనలు = ప్రేమతో కూడిన సంఘటనలు, ఎసరెత్తు = అతిశయించి చేయు, కొసరి = కోరి, రసికతనము = శృంగార చేష్టలు, రతికెక్కు = రతిక్రీడకు దారితీయు.

**భావము:** అమ్మా! అలమేలుమంగమ్మా! చాలా పసి వయసులో నున్న స్త్రీవైనా నీ చేతలు ఎల్లవేళలా శుభాలను కలిగించేవే తల్లీ! నిన్ను జూసిన ఇతర సతులంతా బాగా ప్రశంసిస్తున్నారమ్మా!

నీవు చెక్కిలిపై ఉంచిన చేయి, నీ పెదవిమూల నవ్వులు ఇవన్నీ తప్పక నీకే చెల్లునమ్మా! ఒక ప్రక్కన దీర్ఘమైన ఉచ్ఛ్వాస నిస్శ్వాసనములు విడుస్తూనే భర్తతో మాట్లాడుతూ శృంగార పరంగా రెచ్చగొడుతూ ఉంటావు. పాదుకొన్న ఈ కళలన్నీ ఎక్కడ నేర్చుకొన్నావమ్మా!

మాటిమాటికి మూసి తెరిచి తేలవేసి చూసే ఆ కళ్ళు, నీ మధురమైన భక్తిప్రపత్తులు ఇప్పుడే చూస్తున్నాం తల్లీ! మునుపెప్పుడూ ఎరగము. ధైర్యముతో ఉన్నా సరే నీవు మిక్కిలి భీతిని నటించడం, తాపముతో తహతహలాడుతున్నట్లు ఉండడమనేవి నీ భర్త మీద విసిరి లోబరుచుకొన్నావు తల్లీ!

నీ పసిబారని లేలేత నటనలు, ప్రేమతో కూడిన సంఘటనలు అతిశయించి చేస్తున్న శృంగారచేష్టలు తారాస్థాయికి చేరుకున్నవి. కోరి కోరి ఇంతలోనే శ్రీవేంకటేశ్వరుని చేరుకున్నావు. ఈ శృంగారకార్యముల పర్యమంతా రతిక్రీడకు దారితీసిందన్న విషయం మేమెరుగమా తల్లీ!

## 582

**అవతారిక:** అమ్మ అలమేలుమంగమ్మ స్వామిని తనకొరకై తపించేట్లు చేస్తానని చెప్పి, తీరా తనే స్వామి కొరకు తపించి పోతున్నదని చెలులు పరిహాసం చేస్తున్నారు.

### నాదరామక్రియ

ప. అతని నేఁపేనంటా నట్టే నీవు వేఁగేవు
యీతలఁ బోయే పొద్దు లెవ్వరికి సెలవే ॥పల్లవి॥

1. తడఁబాటు పతితోడ తలుపుమాఁటున వుండి
యెదమాట లాడించే వేమే నీవు
జడిసి యాతనితోడి చలానకు నీవు నట్టె
వుడికేయ వుస (సు?)రాఁకల వోరువఁగఁగలవా॥అతని॥

2. ఆడనుండే తెరలోన అక్కరైనపతికిని
వీడెమిచ్చి పంపే వేమే వెలఁది నీవు
వేడుక నాతని నీవు విరహనఁ బెట్టేనంటా
తోడ నీవు విరహనఁ దొలఁకేవు గదవే ॥అతని॥

3. మాటలాడేపతితోడ మంచముమీఁదనే వుండి

కాటుకకన్నులఁ జూచి కరఁగేవేలే
యీటున శ్రీ వేంకటేశుఁ డింతలో నిన్నుఁ గలసె
వాటమై నీవూఁ గలసి వసమైతి గదవే ॥అతని॥

**అర్థములు:** ప. వేపు = తపించు, వేగేవు = తపించేవు, ఈతల = ఇవతల, పోయే = వెళ్ళు, సెలవు = ఉపయోగము.

1. తడబాటు = తొట్రుబాటు, తలుపుమాటున = తలుపు చాటున, ఎడమాట = స్థానము ,సంధి, జడిసి = భయపడి, చలాన = వణకు,భీతి, ఉడికేయు = బాధపడునట్లు చేయు, ఉసురాకల = దీర్ఘ నిట్టూర్పులు, ఓరువ = ఓర్చు.
2. తెరలోన = తెరగట్టినలోపలిభాగము, అక్కరైన = అవసరమైన, వీడెమిచ్చి = తాంబూలమిచ్చి, వెలది = స్త్రీ, వేడుక = సంతసము, విరహాన = ఎడబాటు, తోడ = కూడా, తొలకు = అతిశయించు.
3. పతి = భర్త, కరగు = ద్రవించు, ఈటున = మరుగుతో, వాటమై = అనుకూలమై, వసమైతి = స్వాధీనమైతివి,లొంగిపోతివి.

**భావము:** ఏమే! చెలీ! అలమేలుమంగమ్మా! అతణ్ణి తపించేట్టు చేస్తాను చూడండి అని చెప్పి నీవే స్వామి కొరకు తపించి పోతున్నావు. ఇక్కడ ఉబుసుబోక గమనించే మాలాంటివారికి ఉపయోగమేమిటే?

అసలో తొట్రుబాటు, కంగారులతో నున్న భర్తను తలుపు చాటున దాగి సంధి మాటలు మాట్లాడడమేమిటే! అంతలోనే భయముతో నువ్వు అదేమాదిరిగా బాధపడి వచ్చే ఉసురుసురను దీర్ఘ నిట్టూర్పులను ఓర్చుకోగలవా?

అక్కడే ఉండి తెరలోనున్న పతికి అవసరమని చెబుతూ తాంబూలము పంపించేవేమే! సంతోషముతో నీవు స్వామిని ఎడబాటుకు గురిచేస్తానని చెప్పి, నీవే విరహములో మునిగిపోవడమేమిటే!

నీతో సంభాసిస్తూ పట్టె మంచంపై పరుండి ఉన్న పతిని నీ కాటుక కన్నులతో చూసి కరగి ద్రవించి పోయేవేమే! మరుగుతో ఆ శ్రీవేంకటేశ్వరుడు ఇంతలోనే నిన్ను కూడినాడు. అనుకూలముగా వ్యవహరించి స్వామిని జేరి ఆయనకు పూర్తిగా వశమైనావు గదే!

## 583

**అవతారిక:** అమ్మ పరాకుగా పలువిధాలుగా ప్రవర్తిస్తున్నదని చెలులు వాపోతున్న సన్నివేశం.

### సామంతం

ప. రెంటికి వచ్చుఁ గదే నీరీతులు చెలి
ఇంటనుండి మమ్ము నేఁప నింతేలే నీకు ॥పల్లవి॥

1. సిగ్గుతోఁ బెట్టినయట్టి చెలి నీచెక్కిటిచేయి
వెగ్గళపుఁ జింతలంటా వెరచితిమే
బగ్గన నీవుయ్యాలపై నూఁగేపయ్యదజారు
నిగ్గుల విరహమంటా నివ్వెర గందితిమే ॥రెంటికి॥

2. ముసిముసినవ్వులతో మోనాన నీవున్నకీలు
పసురుఁగోపములంటా భ్రమసితిమే
అసురుసులతోడి యలవోక నిద్దురలు
కొసరునలుకలంటాఁ గొంకితిమే నేము ॥రెంటికి॥

3. శ్రీ వేంకటేశుతో నీచేముట్టినసరసాలు
తావుల మీవాదులంటాఁ దలఁకితిమే
వోవరిలో మీరిద్దరు నొనగూడి వుండఁగాను
చేవదేరెఁ బనులంటాఁజెలఁగితిమే ॥రెంటికి॥

**అర్థములు:** ప. రెంటికి = రెండు విధములుగా, రీతులు = తీరులు, మమ్ముంఏప = మమ్ము బాధించుటకు.

1. చెక్కిట = చెక్కిలి మీద, వెగ్గళము = అధికము, చింతలు = యోచనలు, వెరచు = భయపడు, బగ్గన = ఎక్కువగా, పయ్యదజారు = పవిట జారిపోవుచున్నది, నిగ్గులు = కాంతి, విరహము = ఎడబాటు, నివ్వెర = మిక్కిలిభయము, అందితిమి = పొందితిమి.
2. ముసిముసి నవ్వులు = చిన్నగా నవ్వుకొను, మోనాన = మౌనముగా, కీలు = మర్మము, పసురు = బాధ, భ్రమయు = భ్రాంతిపడు, అసురుసురులు = భారమైన నిట్టూర్పులు, అలవోక = సులభము, కొసరు = కోరికలు, అలుకలు = కోపము, కొంకు = వెనుదీయు, నేము = మేము.
3. చేముట్టు = చేతితో తాకు, సరసాలు = శృంగార చేష్టలు, తావు = స్థానము, వాదులు = కలహము, తలకు = భయపడు, ఓవరి = లోపలి గది, ఒనగూడు = నెరవేరు, చేవదేరె = సారమగు, చెలగు = ఉత్సాహించు.

**భావము:** అమ్మా! అలమేలుమంగమ్మా! నీ తీరు రెండు విధములుగాను చెప్పనలవి గాకున్నది. ఇంటిలో తీరిగ్గా కూర్చొని మమ్ము ఈ విధంగా బాధించదగునా?

నీవు సిగ్గుతో చెక్కిలిమీద చేయి వేసుకొని యుండగా, మేము దానిని అధికమైన ఆలోచనలతో ఉన్నావనుకుని భీతితో ఉన్నాము. నీవు అధికముగా ఉయ్యాలలూగుతూ నీ పవిట చెంగు జారిపోగా, అతిశయించిన ఎడబాటని మిక్కిలి భీతి చెందాము.

నీలో నువ్వే చిన్న చిన్నగా నవ్వుకొంటూ, మాట్లాడకుండా ఉండడం వల్ల ఏదో రహస్యము ఉందేమో! లేక బాధతో వచ్చిన కోపం వల్లనేమో అని భ్రమపడ్డాము. నీవు అసురుసురంటూ పెద్దగా నిట్టూర్పులు విడుస్తూ సులభంగా నిద్రలోకి జారుకుంటూ ఉంటే, నీకేవో కోరికలు ఉన్నాయనుకొని వెనుదీసి యున్నామే చెలీ!

శ్రీవేంకటేశ్వరునితో చేతితో తాకుతూ చేస్తున్న సరస శృంగారచేష్టలు, అవేవో మీ కలహాలనుకుని భయపడ్డాము తల్లీ. మీరిద్దరూ లోపలి పడకగదిలో మీ కోర్కెలు నెరవేరే దిశగా నుండగా, మీ పనులన్నీ సామాన్యమైనవి కాదు సారవంతమైనవి, ధృఢమైనవని ఉత్సాహముతో నర్తించాము.

**గమనిక:** శ్రీమాన్ గౌరిపెద్ద రామసుబ్బ శర్మగారు మొదటి చరణములోని మొదటి పంక్తి "చెలి సిగ్గుతో బెట్టినయట్టి నీచెక్కిటివేయి" అని ఉండడం సహజము, యుక్తము అని సూచన చేసి యున్నారు. అన్నమయ్య ఈ కీర్తనలో 8వ లేక 9వ అక్షరమును యతిగా గైకొన్నాడు కావున సూచన ప్రకారము మార్పును గ్రహించినచో కీర్తన పాడుతున్నప్పుడు సరియైన విరుపు ఉండకపోవచ్చునని, "చెలి" అని కాకుండా "చెలీ" అని గానం చేసినట్లైతే సరిపోతుందని నా అభిప్రాయం.

## 584

**అవతారిక:** అమ్మకు పలుమార్లు స్వామిని చేరమని చెప్పినా చెవిన బెట్టడంలేదని మాటిమాటికి బుద్ధులు చెప్పవలసి వస్తున్నందుకు చెలులు విచారం వ్యక్తం చేస్తున్నారు.

### పళవంజరం

ప. చెప్ప వెఱతుము నీకు చేరి సారెసారెకును
యిప్పు డిట్టె రారాదా యిది యేమే నీవు ॥పల్లవి॥

1. వంచిన శిరసుతోడ వలఁపు చింతల నీడ-
నంచల నీపతి వున్నాఁడదె కదవే
మించినచెమట గార మీఁటుకొనీ గొనగోర-
నించుకంతా దయసేయ విదియేమే నీవు ॥చెప్ప॥

2. నిట్టూరుపు మోఁతలును నేలపై వాఁ (వ్రా?)తలును
వొట్టుక నీపతి లోన నున్నాఁడదె

అట్టె కఁ(కం)బాన నొరగె ఆయములు లోఁ గరఁగె
యెట్టని మాఁటాడవైతి విది యేమే నీవు ॥చెప్పు॥

3. నిండినకోరిక వెంచి నెరిఁ బులకలు ముంచి
అండకే శ్రీ వేంకటేశుఁ డదె నీపతి
పండినకెమ్మోవితోడ పైకొని నిన్నిటు గూడె
యెండ నీడ కన్నెఱఁగ విది యేమే నీవు ॥చెప్పు॥

**అర్థములు:** ప. వెరతుము = భయపడెదము, సారె సారెకును = మాటి మాటికిని, రారాదా = రావచ్చును గదా, ఏమే = ఏమయిందే.

1. శిరసు = తల, వలపు = ప్రేమ, చింతలు = ఆలోచనలు, నీడ = ఛాయ, అంచల = దగ్గర, పతి = భర్త, మించిన = అధికమైన, మీటుకొను = గీరు, కొనగోర = గోరు చివరిభాగము, ఇంచుక = కొంచెము, దయచేయు = కరుణించు.
2. నిట్టూరుపు = దీర్ఘ నిస్వాస, మోత = శబ్దము, వాతలు = గీతలు, ఒట్టుక = చేపట్టిన, కబాన = స్థంబము మీద, ఒరగు = వాలు, అయాములు = జీవ స్థానములు, కరగె = ద్రవించు, ఎట్టని = ఏవిధముగానని, మాటాడవైతి = మాట్లాడక యున్నావు.
3. నిండిన = అధికమైన, ఎంచి = లెక్కించి, నెరి = వక్రత, పులకలు = గగుర్పు, అండ = సమీపము, పండిన = పక్వమైన, కెమ్మోవి = అదరము, పైకొని = చేపట్టి, ఎడ = స్థానము, నీడ కన్నెరగవు = నీడను చూడవు.

**భావము:** అమ్మా! నీకు మాటి మాటికి చెప్పాలంటే మాకు బాధ, భయం వేస్తున్నవి. ఈ సమయములో ఇలాగే రావచ్చునుగదా! ఏమిటేమిటో మాట్లాడడం ఎందులకు?

నీవు శిరసు వంచి ప్రేమ కోరికలనే ఛాయ క్రింద ఉన్నావు. నీ ప్రక్కనే నీ పతి ఉన్న సంగతి కొంచెమైనా గమనించవేమే! అంత దట్టమైన చెమటలను గోళ్ళతో గీరుకుంటూ కొంచెమైనా కరుణ చూపవదేమే నీవు?

నీ నిట్టూర్పుల శబ్దాలు, నేలపై కాలితో వ్రాసే గీతలు కనబడి, వినవస్తున్నాయి. ఒద్దికైన నీ పతి దగ్గరై లోన ఉన్నాడు కొంచెం గమనించవే! నీవు ఆ స్థంభంపై వాలి నీ జీవస్థానములు ద్రవించే విధంగా ఏవిధముగాను నోరు మెదపకుండా ఉన్నావిదేమే!

నీ నిండిన కోరికలతో వక్రమైన గగుర్పాటుతో అతిశయించి యున్నావు గానీ నీ సమీపముననే నీపతి శ్రీవేంకటేశ్వరుడున్నాడు కదా! నీ అధరామృతాన్ని గైకొనడానికి నిన్ను కూడినాడు. ఏమిటే నీవు? నీవు యెండా నీడా తేడా కనుగొనలేకపోతున్నావిదేదేమిటే?

## 585

**అవతారిక:** స్వామి అమ్మతో సరస శృంగారాలు సాగించాలని వచ్చిన సమయములో అమ్మ పరాకుగా ఉండడంభరించలేకపోయే సన్నివేశం.

## రామక్రియ

ప. వద్దే యింతేసి మాతో వట్టిసణఁగు
గద్దరివై యీపంతమే కడకూ నడపేవా ॥పల్లవి॥

1. కప్పుర మియ్యఁగఁబోతే కాఁతాళించి చూచేవు
వొప్పదా నీకిది నేఁడు వూరకే రాఁగా
కొప్పు గోరదువ్వితేనే గొణఁగేవు సారెసారె
అప్పుడే నే నంటితేనే ఆయములు దాఁకెనా ॥వద్దే॥

2. పొంచి చేయివేసితేనే బొమ్మముడివెట్టేవు
నించి చన్నుఁగొండలానేనీ కిది వేఁగా

మంచముపైకిఁ దీసితే మరిఁ దలవంచేవు
యెంచఁగలపనులాయ నిఁకనేలే కొంకు ॥వద్దే॥

3. అంది కాఁగిలించుకొంటే నసురుసు రయ్యేవు
కందువరతులు నేఁడే ఘనమాయనా
విందువలెఁ గూడితి శ్రీ వేంకటేశుఁడను నేను
ముందువెనక వాసింతే మొక్కలములేలే ॥వద్దే॥

**అర్థములు:** ప. వద్దే = వలదు, ఇంతేసి = ఇంత ఎక్కువగా, సణగు = విడువకుండ జెప్పు, గద్దరి = దిట్టతనముగల, పంతము = పట్టుదల, కడకు = చివరివరకూ, నడపు = నెరపు.

1. కప్పురము = కర్పూరము, కాతాళించి = కోపించు, ఒప్పు = సరిపోవు, ఊరకే = పనిలేకుండ, గోరదువ్వ = గోరుతో దువ్వుకొను, గొణగు = చిన్నగా వినీ వినబడనట్లు మాట్లాడు, సారె సార్ = మాటిమాటికి, అంటు = తాకు, ఆయములు సోకు = జీవస్థానములు తాకు.
2. పొంచి = దాగి, బొమ్మముడి = కనుబొమ్మలు ముడివేయు, చన్నుగొండలు = కొండలవంటి పెద్దవైన వక్షోజములు, ఆనేనీ = అనుచున్నవి, వేగ = త్వర, తీసితే = చోటిచ్చిన, ఎంచగల = లెక్కించగల, కొంకు = సంకోచము.
3. అంది = దొరికి, కాగలించు = కౌగలించు, అసురుసురు = శ్రమమునందగు ధ్వన్యనుకరణము, కందువ = జాడనెరిగిన, రతులు = రతిక్రీడలు, ఘనము = గొప్ప, విందు = మంచి కమ్మని భోజనము, ముందువెనుక = పూర్వాపరములు, వాసి = తారతమ్యము, మొక్కలము = శౌర్యము.

**భావము:** మాతో ఇంత ఎక్కువగా ఒకేమాట అనేకసార్లు విడవకుండా జెప్పడము మరియూ నీ సణుగుడు గొణుగుడు ఇంక వలదు. దిట్టతనముతో నీ పంతాలు పట్టింపులు ఇలాగే చివరి వరకూ నడిపిస్తూనే ఉంటావా?

నేను కర్పూరము ఇద్దామని వస్తే కోపముతో చూస్తుంటావు. ఈరోజు సరదాగా వస్తే, నీకిది నచ్చలేదా చెప్పు? కొప్పు చెదరిపోయిందని గోరుతో దువ్వడానికి ప్రయత్నిస్తే చిన్న చిన్నగా మాటిమాటికీ ఏవేవో గొణుగుతూ ఉంటావు. నేను తాకగానే నీకేమైనా జీవస్థానములు స్పృశించినట్లయినదా?

సరదాగా దాగి యుండి నీ మీద చేయివేయగానే కనుబొమ్మలు ముడివేసి కోపంగా చూస్తావు. కొండలవలె నున్న నీ వక్షోజములు వేగముగా తాకినట్లనిపించినదా? మంచముపై పండుకొన జేసితే నీవు తలవంచుకొని కూర్చుంటావు. అన్నీ లెక్కించగల, సరియైన పనులే కదా మరి నీ కెందులకీ భయము?

దొరకపుచ్చుకుని కౌగలించుకుంటే ఏదో శ్రమ పడిపోయినట్లు నిట్టూర్పులు వదులుతావు. జాడ తెలిసి చేసే ఈ రతిక్రీడలు ఈరోజే ఎక్కువయినవా? నేను శ్రీవేంకటేశ్వరుడను. నీకు ప్రియమైన వాడనై, మంచి కమ్మటి విందుభోజనమువలె కలిశాను. నీవు అన్నింటికి పూర్వాపరముల తారతమ్యముల గురించి ఆలోచించి నీ ధైర్య శౌర్యాలు ఇక్కడ ప్రదర్శించడం తగునా?

## 586

**అవతారిక:** స్వామి ఘనత తెలియని దానవా? అంటూ చెలులు స్వామికి సేవలు చేసి దరి చేరమని అమ్మకు చెప్తున్న సన్నివేశం.

### లలిత

ప. ఎంతటివాఁడవౌ (డౌ?) తా నెఱఁగ వీతని నీవు
ఇంతట నీ పతియైతే నిటు సేయఁ జెల్లునా ॥పల్లవి॥

1. పుప్పొడి చల్లఁగదమ్మ పూఁచి నీవెంట రాఁగాను
చిప్పిల నీపతిమేను చెమరించెను

కప్పుర మియ్యఁగదమ్మ కడు నీతో మాటాడఁగా
దప్పిదేరీఁ గెమ్మోవి తగఁ జూడరాదా ॥ఎంతటి॥

2. పచ్చడము గప్పవమ్మ బడి నీపై నొరగఁగా
పచ్చిదోఁచి గరుపారెఁ బతిమేనెల్లా
మెచ్చి కొప్పువెట్టవమ్మ మేరమీరీ నీపనులు
ఇచ్చకానకుఁ జేయఁగ నిదె వీడెఁ దురము ॥ఎంతటి॥

3. తూఁగుమంచ మూఁచవయ్య తుద శ్రీ వేంకటేశుఁడు
కాఁగిట నిన్నుఁ గూడి కడు నలసె
ఆఁగి ముచ్చటాడవమ్మ అట్టె నీవద్ద నుండఁగా
మూఁగినరతుల మేనుమఱచియున్నాఁడు ॥ఎంతటి॥

**అర్థములు:** ప. ఎంతడివాడడౌ = ఎంతటి గొప్పవాడో, తా = తాను(స్వామి) ఎరగవీతని = ఆతని గురించి తెలియదు, పతి = భర్త, చెల్లునా = సరిపోతుందా.

1. పుప్పొడి = పుష్పములయందలి ధూళి, చల్లగదమ్మ = చల్లవలెను కదా!, పూచి = బాధ్యతతో, చిప్పిల = పైకి ఉబికి, మేను = శరీరము, చెమరించెను = చెమటలు పోయు, కప్పురము = కర్పూరము, దప్పిదేరీ = దాహము తీరేవిధముగా, కెమ్మోవి = అధరము, తగ = యుక్తముగ, చూడరాదా = చూడవచ్చును కదా
2. పచ్చడము = అంగవస్త్రము, ఒరగగా = వాలునట్లుగా, పచ్చిదోచి = మరుగులేనివిధమై, కరుపారె = గగుర్పాటు, పతిమేను = భర్త శరీరము, కొప్పువెట్టు = శిగకొప్పు దీయు, మేరమీరు = హద్దు దాటు, ఇచ్చకాన = ముఖప్రీతిమాటలు, వీడె దురము = సిగ వీడిపోయినది.
3. తూగుమంచము = తూగుటుయ్యల ఉన్న మంచము, ఊచవయ్య = ఊపవయా, తుద = చివరకు, కాగిట = కౌగిట, కడు = మిక్కిలి, అలసె = శ్రమించె, ఆగి = కాస్త విరామమిచ్చి, ముచ్చటాడవమ్మా = కబుర్లు చెప్పవమ్మా, మూగిన రతులు = వ్యాపించి అతిశయించిన రతిక్రీడలు, మేనుమరచి = ఒళ్ళు మరచి.

**భావము:** ఓ అలమేలుమంగమ్మా! స్వామి ఎంతటి ఘనమైన వాడో నీకు తెలియని దానవా? ఎంత నీ భర్త అయితే మాత్రం ఈ విధంగా నిర్లక్ష్యం చేయడం తగునా?

నీ భర్త మేను చెమటలతో నిండిపోయినది కదా! ఆ స్వామి నీ వెంట వెంట వస్తున్నప్పుడు ఉపశమించే విధంగా సువాసనలు విరజిమ్మే విధంగా పుష్పములయందలి ధూళి చల్లరాదా! ఆ స్వామి నీతో మాట్లాడే విధంగా, కర్పూరతాంబూలమివ్వ వచ్చును కదా. దాహము తీరిపోతుందిగదా! ఆ స్వామి అధరాన్ని చూడరాదా!

ఆస్వామి నీపై బడి మేను వాలే విధంగా, అంగవస్త్రము కప్పరాదా! అప్పుడు నీ పతికీ మరుగులేని గగుర్పాటు కలగదా! నీపనులు మరీ హద్దుమీరినవి సుమా! ప్రశంసించి స్వామికి కొప్పు పెట్టరాదా! అలాగే ముఖప్రీతిగా మాట్లాడుతూ వీడిన తన సిగ కొప్పును సరిచేయవచ్చునుకదా!

తూగుటుయ్యాలతో నున్న మంచమును నీవు కాస్త ఊపరాదా! తుదకు ఆ శ్రీవేంకటేశ్వరుడు నిన్ను కూడి కౌగిట బంధించగా మిక్కిలి శ్రమనొందితివి. కాస్త విరామమిచ్చి నీవద్ద యున్న ఆ స్వామికి మధురమైన కబుర్లు చెప్పవమ్మా! ఆ స్వామి అతిశయించి యున్న రతిక్రీడలతో తన మేను మరచి యున్నాడు.

## 587

**అవతారిక:**స్వామి లీలలు అందరికి తెలిసినవేనని, ఎప్పుడూ చెప్పే మాటలు కాకుండా, ఏవైన క్రొత్త సమాచారం చెప్పమని అమ్మ చమత్కరించే సన్నివేశం.

## బౌళి

ప. ఇన్నీఁ గన్నవే నేము ఇంకాఁ గొన్నేలరా
పన్నిన నీ సటలేల పదరా ఇంటికిని ॥పల్లవి॥

1. పంతపు నడుములను బయలీఁదే వారము
ఇంతేనిమాటల బయలీఁదించేవా
బంతిఁ దొల్లె జవ్వనపు భారముల వారము
రంతుల నీమోహపుభారము గొంత గట్టేవా ॥ఇన్నీ॥

2. గొబ్బునఁ బెరిగేచనుఁగొండలలో వారము
వుబ్బించి కొండ లెక్కించే వూరకే నీవు
దొబ్బరాని చీఁకటి తురముల వారము
తబ్బిబ్బుఁగాఁగలజీకు తవ్వించేనా నీవు ॥ఇన్నీ॥

3. బచ్చనల సిగ్గుల చప్పరములో వారము
యిచ్చఁ జప్పరానకు నన్నిటు దీసేవా
మెచ్చి శ్రీ వేంకటేశుఁడ మిమ్ముఁ గూడిన వారము
నిచ్చలుఁ బైకొని నన్ను నీవూఁ గూడేవా ॥ఇన్నీ॥

**అర్థములు:** ప. ఇన్నీ = ఇవన్నియునూ, కన్నవే = చూసినవే, నేము = మేము, కొన్నేలరా = ఇంకా కొన్ని చెప్పడమెందులకు.
పన్ను = చేయు, సటలు = కపటములు, పదరా = నడువరా.

1 .పంతపు = పట్టుదల, నడుముల = మధ్యలో, బయలీదు = వట్టి యాస కలిగించుట, ఇంతేని = ఇంత ఎక్కువగా, మాటల = మాటలతో, బయలీదించేవా = లేనిపోని ఆశలు కలిగిస్తావా, బంతి = చనుబంతులు, దొల్లె = ఎగసిపడే, జవ్వనపు భారము = యౌవన భారము, రంతులు = రతులు, మోహపు భారము = ప్రేమాతిశయము, కట్టేవా = బంధించేవా.

2. గొబ్బున = శీఘ్రముగ, పెరిగే = వృద్ధియగు, చనుగొండలు = పెద్దవైన వక్షోజములు, ఉబ్బించి = పొగడి, దొబ్బరాని = త్రోయరాని, చీకటితురుములు = నల్లని కేశములు, తబ్బిబ్బు = తడబాటు, జీకు = అంధత్వము, తవ్వించేనా = దారితీసేనా.

3. బచ్చన = మోసము, చప్పరము = పందిరి, ఇచ్చ = ఇష్టము, తీసేవా = తీసుకొని వచ్చేవా? మెచ్చి = ప్రశంసించి, నిచ్చలు = ఎల్లవేళలా, పైకొని = చేపట్టి, కూడేవా = కలిసేవా?

**భావము:** స్వామీ! నీ లీలలన్నీ మేము విన్నవే కన్నవే! ఇంకా క్రొత్తగా కొన్ని చెప్పడానికి ఏవేవో ప్రయత్నాలు చెయ్యకండి. ఈ విధంగా కపటపు మాటలెందుకు గానీ, అయ్యా! మీరు ఇంటికి దయచేయండి. శ్రీ

మేము అసలే పంతాలు పట్టింపుల నడుమ ఆశలు కలిగించేవారము కదా! నీవు కూడా ఈవిధమైన మాటలతో మాకు ఆశలు కలిగించడానికి నిశ్చయించుకొన్నావా? మేము బంతివంటి ఎగసి దొర్లిపడే చనులతో యౌవన భారంతో నున్నవారము. నువ్వు ఈ రతిక్రీడల పేరుతో ఇంకా భారం మాకు అంటగట్టాలనుకుంటున్నావా?

మేము శీఘ్రముగా కొండలమాదిరి పెరుగుతున్న చనులున్నవారము కదా! మమ్మి ఇంకా ఉబ్బించి ఊరించి పొగడి పొగడి కొండలెక్కించేవా స్వామీ! మేము త్రోయలేని చీకటివలె నల్లని వెంట్రుకలతో కొప్పులున్న వారము కదా! నీవు మమ్ములను తడబాటుకు గురిచేసి ఇంకా అంధత్వమును కల్గించే విధంగా ప్రవర్తించి కవ్వించేవా స్వామీ!

అసలే మోసపు పందిరిలో నిలిచి ఉన్న వారము. నీవు మాపై ఇంకా ఇష్టం చూపించి, చూపించి, మమ్ములను నీ శిబిరంలోకి లాగేవా? ఓ శ్రీవేంకటేశ్వరా! నిన్ను ప్రశంసించి ఇక్కడ చేరినవారము. శాశ్వతంగా చేపట్టి నన్ను నీవు కలిసి సుఖించేవా?